# నిరుక్తము

యాస్కముని కృతము

"కళాప్రపూర్ణ"

పండిత గోపదేవ్

ప్రకాశకులు:
అంబారామార్య సత్యార్థప్రకాశట్రస్టు
సికిందరాబాదు.
1994

891.21
యాస్క-నిరు
66,981

# నిరుక్తము

## యాస్కముని కృతము

సంక్షిప్త దుర్గాచార్య భాష్య సంస్కృత టీకాకర్తలు :

మహామహోపాధ్యాయ శ్రీ భజ్జా రామశాస్త్రి విద్యాసాగరః

విద్యావాగీశ పండిత దేవశర్మశాస్త్రీ




అనువాదకుడు :

'కళాప్రపూర్ణ' పండిత గోపదేవ్

ప్రకాశకులు :

అంబా రావార్య సత్యార్థప్రకాశ ట్రస్టు - సికిందరాబాద్

1994

కాపీరైట్ ]

[ మూల్యము : రు. 140-00

ప్రథమ ముద్రణము

కాపీలు ౧౦౦౦

క్రుష్ణు రెండవ గ్రంథము

దయానందాబ్దము ౧౫౦

శకాబ్దము ౧౮౯౬

క్రీ. శ. ౧౯౭౪

విక్రమాబ్దము ౨౦౩౧

సృష్టిసంవత్సరము ౧౯౬, ౦౮, ౫౩౦, ౭౫

భావ - చైత్రము - ఏప్రిల్ ౧౯౭౪

C-9922

మూల్యము : రు. 140-00



ప్రాప్తిస్థానములు :

ఆర్యసమాజము, కూచిపూడి - 522 313

సత్యార్థప్రకాశట్రస్టు కార్యాలయము, 3-3-738
కంచరబజారు - సికిందరాబాదు - 500 003

ముద్రణము : న్యూ విజయ ఆర్టుప్రెస్ - తెనాలి. ఫోన్ : 6356



శ్రీ మద్దయానంద సరస్వతి

# విషయానుక్రమణిక


## ప్రథమాధ్యాయము

పేజి

నైఘంటుకసమాఖ్యాధికరణమ్ 2
పదచతుష్టయోద్దేశ కథనము 4
నామాఖ్యాతాధికరణము 4
భావవాచక ప్రవర్తనము 6
సత్త్వోపదేశనిరూపణము 7
భావోపదేశము 8
శబ్దానిత్యత్వవాదము 8
శబ్దానిత్యత్వఖండనము 10
వ్యవహారార్థంశబ్ద ప్రయోగ
ఆవశ్యకము 10
కర్మణి వేదమంత్రస్యావశ్యకత 11
భావవికార నిరూపణము 12
ఉపసర్గనిరూపణము 16
ఉపసర్గవిషయే శాకటాయన
మతము 16
ఉపసర్గ విషయే గార్గ్యమతము 17
నిపాతలక్షణము 21
క) ఉపమార్థములు 25
ఖ) అర్థోపసంగ్రహార్థములు 26
గ) పదపూరణములు 30
'త్వ' విషయే ఆచార్యాణాం
మతభేదములు 38
నామ్నామాఖ్యాతజత్వే 51
శాకటాయనుడు, నైరుక్తులు 51
న సర్వాణీతి గార్గ్యుడు పేజి 51
నామ్నామాఖ్యాతజత్వే
యాస్కుడు 53
నిరుక్తప్రయోజనము 65
మంత్రాణామానర్థక్యే కౌత్సుడు 66
మంత్రానర్థకత్వ ఖండనము 70
నిరుక్తమంత్రాపదవిభాగే
నోపపద్యతే 78
సంహితాలక్షణము 80
జ్ఞానప్రశంస 84
నైఘంటుక-నైగమ-దైవత
రూపేణకాండత్రయాత్మకత 91

## ద్వితీయాధ్యాయము

నిర్వచనము 97
వర్జ్యశిష్య నిరూపణము 115
గ్రాహ్యశిష్య నిరూపణము 115
నైఘంటుకకాండము 118
గౌః 119
శాకపూణేః సంకల్పః ఉభయ
లింగాదేవతా 131
హిరణ్యనామములు 133
అంతరిక్షనామములు 134
సముద్రః 135
దేవాపి-శంతన్వోరితిహాసము 136
దివశ్చాదిత్యస్యసాధారణములు 141

రశ్మినామములు పేజి 150
దిఙ్నామములు 150
వృత్రః 154
రాత్రినామములు 158
ఉషాః 159
అహః 163
మేఘః 165
వాక్ 169
ఉదకము 171
నదీ 171
నదీ నిర్వచనే ఇతిహాసః విశ్వామిత్రస్య నదీనాంచ సంవాదః 175
అశ్వాః 178
ఆదిష్టోపయోజనములు 182


## తృతీయాధ్యాయము


కర్మ 184
అపత్యము 184
అపత్యము క్షేత్రసంబంధమా ? బీజ సంబంధమా ? 185
దుహితదాయాదియా ? కాదా ? 188
మనుష్యాః 201
బాహూ 205
అంగులయః 206
కాంత్యర్థాః 208
అన్నము 208
అత్తికర్మాణః 209
బలము 209
ధనము 209
గౌః 210
క్రుధ్యత్యర్థములు పేజి 210
క్రోధము 210
గత్యర్థములు 210
క్షిప్రార్థములు 210
అంతికము 211
సంగ్రామము 211
వ్యాప్త్యర్థములు 215
వధార్థములు 216
వజ్రనామములు 218
ఐశ్వర్యకర్మలు 219
ఈశ్వరుడు 219
బహునామములు 222
హ్రస్వనామములు 222
మహన్నామములు 223
గృహనామములు 223
పరిచరణార్థములు 224
సుఖము 224
రూపము 225
ప్రశస్యనామములు 225
ప్రజ్ఞ 225
సత్యము 225
పశ్యత్యర్థములు 226
సర్వపదసమామ్నానము 226
ఉపమలు 226
లుప్తోపమలు 238
అర్చత్యర్థములు 242
మేధావులు 242
స్తోతుః 242
యజ్ఞనామములు 243
ఋత్విక్కులు 243

యాజ్ఞార్థములు పేజి 244
దానార్థములు 244
అధ్యేషణకర్మలు 244
స్వపితికర్మలు 244
కూపనామములు 245
స్తేనుడు 245
నిర్ణీతాన్తర్హితనామములు 246
దూరనామములు 246
పురాణనామములు 246
నవనామములు 247
ద్విశోత్తరనామములు 26 247
ద్యావాపృథువులు 258

## చతుర్థాధ్యాయము

నైగమకాండము 260
సంవత్సరము 321

## పంచమాధ్యాయము

సోముడు – ఆకీలు 334
వృకుడు 384

## షష్ఠాధ్యాయము

ఉపలప్రక్షిణీ 425
అస్మే 430
విజామాతుః 439
సదాన్వే 504

## సప్తమాధ్యాయము

దైవతకాండము 521
దేవతోపపరీక్ష 521
ఋచాంత్రైవిధ్యము 522
ఉచ్చావచైః అభిప్రాయైః ఋషీణాం మంత్రద్రష్టలు పేజి 532
అనాదిష్టదేవతేషు మంత్రేషు దేవతోపరీక్షా 532
అదేవతాః దేవతావత్ స్తూతాః 535
అథాప్యష్టౌ ద్వంద్వములు 536
దేవతాయాః మహాభాగ్యము 536
తిస్ర ఏవ దేవతాః 540
దేవతల బహునామత్వమున హేతువులు 541
దేవతల భక్తిసాహచర్యము 552
ఛందస్సులు 561
అగ్ని 569
జాతవేదులు 578
వైశ్వానరుడు 582
వైశ్వానరుడెవరు ? 584
అగ్నిర్వైశ్వానరః ఇతిశాకపూణి 589

## అష్టమాధ్యాయము

ద్రవిణోదాః ఇంద్రుడని క్రౌష్టుకి 614
అగ్నియని శాకపూణి 629
అథాత ఆప్రియః 626
ఇధ్మవిషయములో కాత్థక్య శాకపూణుల మతభేదము 629
వనస్పతి విషయములో కాత్థక్య శాకపూణులు 651
దేవత లెవరో ప్రయాజాను యాజాలు 657

## నవమాధ్యాయము

పృథివ్యాస్థ స్తుతిభాక్కులు సత్త్వములు 663

యుద్ధోపకరణములు పేజి 679
అష్టద్వంద్వములు 710

దశమాధ్యాయము

మధ్యస్థానదేవతలు 721
వాయువు 721
వరుణుడు 724
రుద్రుడు 728
ఇంద్రుడు 733
పర్జన్యుడు 738
బృహస్పతి 740
బ్రహ్మణస్పతి 741
క్షేత్రస్యపతి 742
మన్యువు 771
దధిక్రలు 773
సవిత 774
త్వష్ట 777
వాతము 779
అగ్నిర్వైశ్వానరుడు 780
వేనుడు 781
అసునీతి 783
ఋతుడు 785
ఇంద్రుడు 787
ప్రజాపతి 790
అహిః 791
అహిర్బుధ్న్యుడు 792
సుపర్ణుడు 792
పురూరవులు 794

ఏకాదశాధ్యాయము

శ్యేనుడు పేజి 797
సోముడు 798
చంద్రమాః 805
మృత్యువు 808
విశ్వానరుడు 810
ధాత 812
విధాత 813

మధ్యస్థాన దేవగణములు

మరుతః 816
రుద్రులు 818
ఋభవులు 819
అంగిరసుడు 822
పితరులు 823
అథర్వాణుడు 825
భృగులు 825
అప్త్యులు 827

మధ్యస్థాన స్త్రీలు

అదితి 829
సరమ 834
సరస్వతి 836
వాక్కు 838
అనుమతి 841
రాకా 842
సినీవాలి 844
కుహూ 846
యమీ 847
ఉర్వశి 848

పృథివీ పేజి 850
ఇంద్రాణీ 851
గౌరీ 854
గౌః 856
ధేనువు 857
అఘ్న్యా 859
పథ్యా - స్వస్తి 862
ఉషాః 863
ఇళా 865
రోదసి 867

ద్వాదశాధ్యాయము

ద్యుస్థాన దేవతలు
అశ్వినౌ 869
ఉషాః 876
సూర్యా 878
వృషాకపాయీ 880
సరణ్యూః 882
త్వష్టా 885
సవితా 886
భగః 890
సూర్యః 892
పూషా 894
విష్ణుః 895
విశ్వానరః 898
వరుణః 899
కేశీ 903
కేశినః 905
వృషాకపిః 906
యమః 907
అజఏకపాత్ 909
పృథివీ 912
సముద్రః 913
దధ్యఙ్ 916
అథర్వా పేజి 916
మనుః 916

ద్యుస్థానాః దేవగణాః
ఆదిత్యాః 918
సప్తర్షయః 919
దేవాః 924
విశ్వేదేవాః 925
సాధ్యాః 928
వసవః 930
వాజినః 933
దేవపత్న్యః 930

త్రయోదశాధ్యాయము

అతిస్తుతయః
అగ్నిః, వరుణః 939
ఇన్ద్రః 940
ఆదిత్యాః 941
ఆదిత్యరశ్మయః 943
అశ్వినౌ 944
యజ్ఞం 947
వాక్ 950
అక్షరః 955

చతుర్దశాధ్యాయము

ఊర్ధ్వమార్గగతి 965
ఆత్మనో మహతో నామాని 980

నిఘంటుకోశము

ప్రథమాధ్యాయము 1
ద్వితీయాధ్యాయము 5
తృతీయాధ్యాయము 8
చతుర్థాధ్యాయము 12
పంచమాధ్యాయము 13
యమయమీ సూక్తము 1 to 20

ఓమ్

# సంపాదకీయము

లోకములో సంస్కృతభాషలోనున్న లౌకికభాషాశబ్దములకర్థము గ్రహించినట్లు వేదశబ్దార్థముల గ్రహించుట సులభముకాదు. వైదికభాషా శబ్దముల నవగతముచేసికొనుటకు వేదాంగములు, ఉపాంగములు నుపక రించును. అట్టివానిలో యాస్కాచార్యకృతమైనది నిరుక్తము. ఈ నిరుక్తము ద్వారా వేదములలోని శబ్దార్థముల బాగుగదెలిసికొని తద్ద్వారా విషయముల గ్రహించిన యత్యద్భుతానందము పొందుట కవకాశమున్నది.

అట్టి నిరుక్తమును తెలుగుభాషాభిజ్ఞుల కందించుటకై తొంబది యైదేండ్ల వయస్సుమీఱి చూపులోపముకలిగి సహకరింపకున్నను భూతద్దపు సాహయ్యముతో రాత్రింబవళ్లు ఆఱునెలలు పరిశ్రమించి ఎట్టకేలకు పూర్తి చేసిన 'కళాప్రపూర్ణ' పండిత గోపదేవ్‌గారి కృషి యెట్టిదో వ్రాతప్రతుల పరిశీలనచేసిన శ్రీ వంకం సుబ్బన్న నేను మాత్రమే యెఱుంగుదుము. ముద్రితప్రతిని, వ్రాతప్రతిని పరిశీలించి చూచుటకే మాకిద్దఱకు నెంతయో శ్రమయనిపించినది. భూతద్దసాయమున చూచుచు, శ్రమించివ్రాసిన పండితగోపదేవ్‌శాస్త్రిగారి కృషి యసామాన్యము, వర్ణనాతీతము.

శ్రీ పండిత గోపదేవ్‌గారు వ్రాసిన వ్రాతప్రతిని, నాగరలిపిలో ముద్రింప బడిన మూలప్రతిని సరిచూడవలసినబాధ్యత నాయందుండుటచే సరిచూచు నప్పుడు కనబడుభేదములకు కారణమేమాయని పరికింపగా వారికున్నదృష్టి లోపమున భూతద్దము నుపయోగించుటచే మూలములో నొకపంక్తిలోనున్న పదముచూచి వ్రాతప్రతిలో వ్రాసి తిరిగి ఒరిజనల్ చూచుటకురాగా నదే పదము తరువాతి 3 లేక 4 పంక్తిలో కనబడిన మధ్యలోని 2, 3 పంక్తుల విడిచి యక్కడనుండియే ప్రారంభించి వ్రాయుట పలుచోట్ల కలదు. అట్టి

వానిని కనిపెట్టి సరిచేయుట నాకు తలకుమించిన భారమైనది. వృద్ధావస్థ ములో, ఈ ప్రకాశించుస్థితిలో వెయ్యిపుటల గ్రంథమును రచించుటలో గల వారి శక్తిసామర్థ్యములు, పట్టుదల యెంతయు స్తుత్యము, ఆశ్చర్య కరము. మఱియు నీ గ్రంథము ప్రచురణకు కావలసిన ధనాదుల అంబారామార్య సత్యార్థప్రకాశట్రస్టు, సికిందరాబాద్‌వారు సమీకరించినను, ముద్రణాలయమున శ్రీ పండిత గోపదేవ్‌గారి వ్రాతలిపి కంపోజ్ చేయు టకు నెవ్వరును ముందుకు రాకపోయిరి. ఎట్టకేలకు సత్యా సాంబశివరావు అను కంపోజిటర్ అంగీకరించి కొంత పూర్తిచేసి, మధ్యలో కాదిక్రింద పడవేయుటకు సిద్ధపడగా మన కిద్దఱకు శ్రమ, బాధ్యత తప్పదని సామా ద్యుపాయముల నుపయోగించి యెట్లో యొప్పించి యెట్టకేలకు నేటికి నిరుక్తమును ప్రచురింపగలిగితిమి. అడుగడున దిద్దుకొన్న ప్రతిని కష్ట నష్టములకోర్చి కంపోజ్ చేసి సహకరించిన సత్యా సాంబశివరావుకు సహ కార్యకర్తగా కృతజ్ఞత తెలియజేయుచున్నాను. కొన్ని కారణాంతరములచే ముద్రణాదోషములు చోటుచేసికొన్నవి. వానిని మరిముద్రణమున సవరింతుము.

శతవృద్ధులైన 'కళాప్రపూర్ణ' పండిత గోపదేవ్‌గారు, తొంబదియవపడిలో బడిన నేను, కంపోజిటరై కష్టపడి తెలుగు వెలుగులోనికి తెచ్చిన వేదాంగ ములలో నొకటియగు నిరుక్తము తెలుగువారి మన్ననలకు పాత్రమై విరాజిల్లు నట్లు పరమేశ్వరుని కృపాదృష్టి ప్రసరించుగాక !

తెనాలి<br>
ఏప్రిల్ 1994

భవదీయుడు,<br>
**వెంకయ్యార్య**



# తొలి పలుకులు

## 'కళాప్రపూర్ణ' పండిత గోపదేవ్

పాఠకమహాశయులకొక విజ్ఞప్తి. భారతావనిలో తెలుగుగడ్డ నాజన్మ భూమి. స్వల్పముగా తెలుగుభాష నభ్యసించి ఇరువదియైదేండ్ల ప్రాయమున సంస్కృతభాష నభ్యసింప ప్రారంభించి కావ్యనాటకాదులందొకింత జ్ఞానము సంపాదించితిని. పెద్దలచెంతజేరిన అనంతరమున శాస్త్రవిజ్ఞానము సంపాదింప నభిలషించి యుత్తరభారతమునజేరి ఆర్యసామాజికులగు ప్రసిద్ధవిద్వాంసుల యంతేవాసినై వేదాంగములలో నన్యతమమగు వ్యాకరణమున సిద్ధాంతకౌముది, అష్టాధ్యాయి, కాశిక మున్నగు గ్రంథముల యధ్యయనము చేసితిని. అనంతరము వేదోపాంగములైన షడ్దర్శనములను ఆజన్మబ్రహ్మచారి, నిఖిలశాస్త్ర నిష్ణాతుడును, పండిత శ్రీ ముక్తిరామోపాధ్యాయుల (ఆచార్యుల గురుకుల్ పోఠోహా) చెంత న్యాయవైశేషికాది దర్శనముల నధ్యయనముచేసితిని. పిదప కాశీచేరి యట పండిత శ్రీ చిన్నస్వామిశాస్త్రి (హిందూవిశ్వవిద్యాలయమున మీమాంసశాఖాధ్యక్షులు)గారి అనుగ్రహముతో పూర్వమీమాంసాశాస్త్రము నభ్యసించితిని. ఉత్తరమీమాంస వేదాంతదర్శనము పండిత శ్రీ ముక్తి రామోపాధ్యాయుల దగ్గఱ చదివి యుండియు, (క్రీ. శ. 1935) వారణాసికి అరుదెంచిన భగవత్పాదులు శ్రీ కాంచికామకోటి పీఠాధిపతులైన శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతిస్వామివారి యనుగ్రహము భాగ్యవశమున లభింప వారియంతేవాసినై వేదాంతదర్శనమును మరల చదివితిని. ఈ కాలముననే మహర్షి దయానందసరస్వతి

(ఆర్యసమాజ సంస్థాపకులు) స్వామివారిచే ప్రతిపాదింపబడిన వేదసిద్ధాంత
ములను తెలిసికొనునవకాశము కలిగినది.

క్రీ. శ. 1946 నుండి విద్యాభ్యాసమునకు స్వస్తిచెప్పి తిరిగి తెలుగు
గడ్డకుచేరి నానేర్చినవిధమున ఋషిఋణము తీర్చుకొనదలంచి మహర్షి
దయానంద దృష్టికోణముతో వైదికసిద్ధాంతములను తెలుగుగడ్డమీద
ప్రచారముచేయుట నా జీవితవ్యాసంగమయ్యెను. ఆ దృష్టితోనే శ్రీ మద్దయా
నంద మహర్షి కృతసత్యార్థప్రకాశము, ఋగ్వేదాది భాష్యభూమిక,
సంస్కారవిధి, మున్నగు గ్రంథములన్నియు వ్రాసి ముద్రింపజేసి తెలుగు
భాషామతల్లికి కానుకగా నర్పించితిని. తెలుగు విద్వాంసులలో నేయొక్కరు
చేయని పదునొకండు ప్రాచీనఉపనిషత్తుల కన్నింటికి టీకాతాత్పర్యములు
సమాలోచన పూర్వకముగ వ్రాసితిని. ఇంతేకాక న్యాయ, వైశేషిక, సాంఖ్య,
యోగ, వేదాంతదర్శనములకన్నింటికి ఆంధ్రవ్యాఖ్యానముపేరుతో వ్యాఖ్యా
నములువ్రాసి తెలుగుతల్లి కర్పించితిని. మఱియు ఆస్తికవాదము, అర్థధర్మ
మీమాంస మున్నగు అపూర్వగ్రంథములను అనువదించి ముద్రింపజేసి
పాఠకులకందజేసితిని. ముఖ్యముగా ఇటీవల ఋగ్వేదమునకు మహర్షి
కృతభాష్యమును తెలుగు ననువదించుటయే కాక, శ్రీ సాయణాచార్య
భాష్య గతదోష సమాలోచనతోపాటు ఇరువదియైదు సూక్తములను
తెలుగున వ్రాసి ప్రచురించియున్నాడ - తెలుగుసాహిత్యమున నా రచనలు
సరికొత్తయనకతప్పదు. ఆంధ్రపాఠకులు నా పరిశ్రమ నెంతగా గుర్తించిరో
వారికే యెఱుక! 'తెలుగు సాహిత్యఅకాడమీ' నిర్వాహకులు విశ్వవిద్యా
లయాలు నా రచనలు చూచి వాని గుణదోషములను పరిశీలించి ప్రఖ్యాము
కట్టుకొన్నవారున్నారో లేరో నాకు తెలియదు. నేను విద్వాంసుల కడకు
వెళ్లి వారికి నా పరిశ్రమ నెఱిగించు స్వభావము లేనివాడనగుట నాదుర
దృష్టము. ఐదుదశాబ్దములు వేదసిద్ధాంత ప్రచారముతోపాటు ఈ రచనా
వ్యాసంగము నడిచినది. నాకిప్పుడు తొంబదియైదేండ్లవయస్సు నేత్రదృష్టి

తగ్గిపోయినది. భూతద్దసహాయమున ముద్రితగ్రంథములు నతికష్టముమీద బహుసమయము వెచ్చించి చదువవలసివచ్చినది.

అయినను నా దురాశ నన్ను విడువకున్నది.-"కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతగ్ం సమాః" అను వేదసూక్తి ననుసరించి బ్రతికినంతకాలము కర్తవ్యము విడువరాదనియెంచి. ఈ సంవత్సరము (1990 ఆగస్టు) నిరుక్తమును తెలుగున ననువదింపబూని రాత్రింబవళ్లు ప్రయత్నించి ఆఱుమాసములలో నీకార్యమును ముగించి యీపంక్తులు వ్రాయుచున్నాను. ఈనిరుక్తము పాఠకలోకమునకు కొలదికాలములో నందింపగలనని ఆశించు చున్నాను.

## (వేదార్థప్రతిపాదక నిరుక్తము యాస్కమహర్షి కృతము)

భూమండలమునగల సాహిత్యములలో వేదసాహిత్యము అతిప్రాచీన మనుట నిర్వివాదవిషయము. ప్రపంచభాషాభిజ్ఞులెల్ల రంగీకరించిన విషయు మని యెల్లరంగీకరించిన విషయమే. "బ్రాహ్మణేన నిష్కారణం షడంగో వేదోఽధ్యేయః జ్ఞేయశ్చ". బ్రాహ్మణుడు తప్పక శిక్షావ్యాకరణాది షడంగ సహితముగా వేదము అధ్యయనము చేయదగినది. తెలియదగినది యని పతంజలి వ్యాకరణభాష్యకర్త నుడివియున్నాడు.

"వేదోఽఖిలో ధర్మమూలమ్"

వేదము సర్వధర్మములకు మూలము - ప్రమాణము - అని నుడివి యున్నారు. "వేదము సర్వవిద్యల పుస్తకము. దానిని చదువుట చదివించుట ఆర్యులకు పరమకర్తవ్యము అని మహర్షి శ్రీమద్దయానందసరస్వతీ స్వామిపాదులు వాకొనియున్నారు. "సర్వవిద్యోపబృంహితస్య ప్రదీపవత్ సర్వార్థావద్యోతకస్య సర్వజ్ఞకల్పస్య ఋగ్వేదాదేః మహతః శాస్త్రస్య యోనిః కారణం బ్రహ్మ".

సమస్తవిద్యలతోగూడి ప్రదీపమువలె సర్వపదార్థావద్యోతకమై సర్వజ్ఞ కల్పమైన ఋగ్వేదాది శాస్త్రమునకు యోనిః, కారణము కర్తయని -

"శాస్త్రయోనిత్వాత్" అను బ్రహ్మసూత్ర శారీరకభాష్యమున శ్రీ శంకర స్వామిపాదులు భాషించియున్నారు. ఇట్టి యపౌరుషేయ వేదమాహాత్మ్య మును వర్ణింప నేనెంతవాఁడను ?

"ఋచో అక్షరే పరమే వ్యోమన్ యస్మిన్ దేవా అధివిశ్వే నిషేదుః యస్తన్న వేద కిమృచా కరిష్యతి? య ఇత్తద్విదుస్తత ఇమే సమాసతే" నాశరహితుఁడై యంతట వ్యాపించియుండు నే పరమమహేశ్వరునందు సమస్త ఋగాదివేదములు విశ్వేదేవతలు నధివసించియున్నవో యా పరమ పురుషునెఱుంగకున్న ఋగ్వేదాదుల యధ్యయనప్రయోజనమేమున్నది? ఆ పరతత్త్వము నెఱిగినవాఁడు అతనియందుండి మోక్షానందము నెఱుఁగు నని వేదాధ్యయనప్రయోజనమును వేదమే చెప్పుచున్నది.

ఇట్టి వేదార్థముల నెఱుఁగుటకు తోడ్పడు శాస్త్రములలో నిరుక్తము అత్యంతోపకారకమని వేదవిదు లెఱుఁగనిదికాదు.

ప్రాచీన బ్రహ్మాదిమహర్షులు ఒకరినుండి మఱియొకరు శ్రవణము చేసి మంత్రములనభ్యసించి తపస్వులై యోగనిష్ఠాగరిష్ఠులై సమాధ్యవస్థ యందు పరమేశ్వరుని సాక్షాత్కారముచేసికొని శబ్దార్థములను వాని సంబంధ మును నెఱిగి మంత్రార్థములనుగ్రహించి శిష్యులకు బోధించెడివారు. అట్టి మహర్షులే అస్మదాదులైన మందబుద్ధులు వేదార్థముల నెఱుంగుట కను వుగా దయాబుద్ధితో శిక్షా, వ్యాకరణ, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిషము, కల్పము నను వేదాంగములను న్యాయవైశేషిక సాంఖ్యయోగ-పూర్వోత్తర మీమాంస లను వేదోపాంగములను రచియించిరి. నేటివారు వీనిని నేర్వ కున్న వేదమంత్రార్థముల నెఱుఁగఁగలరు.

వానిలో నిరుక్తము యాస్కమహర్షి కృతము. వేదనిఘంటువు నందలి పదములను నిర్వచించి వానిమూలమున వేదమంత్రముల యర్థము నెఱుఁగుట కనువగునట్లు నిరుక్తమును వ్రాసియున్నారు.

ఈ నిరుక్తశాస్త్రము సంస్కృతమునయున్నది. భారతీయభాషలలో హిందీలో కొందఱు విద్వాంసులు అనువదించియున్నారు. దక్షిణభారతపు

భాషలలో నే భాషయందును నిరుక్తశాస్త్రము నాయాభాషాభిజ్ఞులు తెలిసి కొనుటకు వీలుగా వ్యాఖ్యానము చేయబడినట్లుగాని అనువదింపబడి యున్నట్లుగాని నాకు తెలియదు.

కావున నే నీ నిరుక్తమును ఆంధ్రభాషాభిజ్ఞులు చదివి దీనివలన లాభమునొందగలరనునాశతో తెలుగున ననువదింప నాశక్తికొలది ప్రయత్నించి ఆఱుమాసములు అహర్నిశలు శ్రమించి వ్రాసి పూర్తిచేయగలిగితిని.

మహామహోపాధ్యాయ బిరుదాంకితులు విద్యాసాగరోపాధిభూతులు నగు శ్రీ ఛజ్జూ రామశాస్త్రిచేతను అట్లే విద్యావాగీశ ఉపాధ్యలంకృత శ్రీ దేవశర్మ - శాస్త్రిగారిచేతను సంకేపిత దుర్గాచార్యకృత సంస్కృతటీకాలంకృత ముద్రిత పుస్తకము నాకులభించినది. దానిని తెనుగున ననువదించి తెలుగు పాఠకులకందజేయుచున్నాడ. ఉపర్యుక్తవ్యాఖ్యాతలకు నేను సదా కృతజ్ఞుడను.

దృష్టిమాంద్యమువలన నేను వ్రాసిన వ్రాతప్రతిలోని దొసగులను సరిచేసి యెంతయో కష్టమునకోర్చి ముద్రణదోషముల సరిచేసి గ్రంథమును ముద్రింపజేసిన శ్రీ పండిత వెంకయ్యార్యగారికి నా కృతజ్ఞతలు.

నా వ్రాతప్రతిని చదువుటకు శ్రీ వెంకయ్యార్యకు తోడ్పడిన శ్రీపండిత వంకం సుబ్బన్నగారికికూడ నా కృతజ్ఞతను తెలుపకుండ నుండజాలను. ద్రవ్యమునొసంగి యీ గ్రంథప్రచురణకు తోడ్పడిన ద్రవ్యదాతలకు నా కృతజ్ఞతలు. ప్రచురణకర్తలైన ట్రస్టుబోర్డువారికి నా యభినందనలు. అట్లే శ్రమపడి పుస్తకమును ముద్రింపజేసిన ముద్రాపకులకు నా శుభాకాంక్షలు.

ఏప్రిల్ - 1994

ఓ౩మ్

# యాస్క ప్రణీత నిరుక్తము

## ప్రథమ అధ్యాయము

### ప్రథమ పాదము

### "సమామ్నాయః సమామ్నాతః స వ్యాఖ్యాతవ్యః"

అర్థము :— సమామ్నాయః = గోవు పదము మొదలు దేవపత్ని అను పదమువఱకుంగల శబ్దసముదాయము సమామ్నాతః = మంత్రార్థములు బాగుగ తెలియుటకొఱకు ఋషులచే గ్రంథరూపమున చేయబడినది.

"స వ్యాఖ్యాతవ్యః" సః = ఆగోవు మున్నగు శబ్దసముదాయము వ్యాఖ్యాతవ్యః = ఇవి నామములు, ఇవి ఆఖ్యాతములు, ఇవి ఉపసర్గలు, ఇవి నిపాతములు, అని విభజించి నిర్వచింపదగినదై యున్నది.

సమామ్నాయము — గౌః =గోవు అనుపదము మొదలు 'దేవపత్ని'= అనుపదమువఱకుగల నిఘంటువులోని వైదికపదముల సముదాయము — వైదికశబ్దకోశము (నిఘంటువు) అను నొకగ్రంథమున నొకచోట సమకూర్పబడినది. ఆశబ్దసముదాయమునకు విశేషవ్యాఖ్యానము చేయదగియున్నది. అనగా నాశబ్దసముదాయమునందు ఇవి నామములు, ఇవి ఆఖ్యాతములు, ఇవి ఉపసర్గలు, ఇవి నిపాతములు, ఇది సామాన్యలక్షణము, ఇది విశేష లక్షణము, ఇవి ఏకార్థకములు, ఇవి అనేకార్థకములు అని విడివిడిగ నిర్వచింపవలసియున్నది.

**"తమిమం సమామ్నాయం నిఘంటవ ఇత్యాచక్షతే"**

అర్థము :— తమ్ ఇమమ్ సమామ్నాయమ్ = ఆయీ వైదికశబ్దకోశమును, నిఘంటవః ఇతి = నిఘంటువులు అనునామముతో, ఆచక్షతే = చెప్పుదురు. గవాదిశబ్దములుమొదలు దేవపత్ని అనుపదముపఱకుగల శబ్ద సముదాయమును 'నిఘంటువు' అనుపేరుతో వ్యవహరింతురని భావము.

("అన్యేప్యాచార్యా ఇతి శేషః") ఇతరాచార్యులును ఇట్లే చెప్పుదురని భావము.

"నిఘంటుసమాఖ్యాధికరణము"

**"నిఘంటవః కస్మాత్? నిగమా ఇమే భవన్తి"**

నిఘంటుశబ్దస్య కా వ్యుత్పత్తిరిత్యర్థః. ఉత్తరయతి నిశ్చయేన నిగమార్థాః సన్తో మంత్రార్థాన్ గమయన్తి-జ్ఞాపయన్తి ఇమే".

అర్థము :— నిఘంటవః కస్మాత్ = నిఘంటువులు అని యీవైదిక శబ్దము లేలచెప్పబడుచున్నవి ? నిగమా ఇమే భవన్తి = ఇవి నిగమము లగుచున్నవి. ని = నిశ్చయముగా, గమాః = మంత్రార్థములను బోధించుచున్నవి. అనగా గౌః మున్నగు వైదికశబ్దములు మంత్రార్థములను నిశ్చయముగా తెలుపునని భావము. అందువలననే యీశబ్దములకు నిఘంటువు లని నామమేర్పడినది.

**"ఛందోభ్యః సమాహృత్య సమాహృత్య సమామ్నాతాః"**

'ఏతే గవాదయః శబ్దాః ఛందోభ్యః - మంత్రేభ్యః సమాహృత్య సమాహృత్య సమామ్నాతాః గ్రంథీకృతా ఇత్యర్థః ॥

అర్థము :— ఏతే = గవాది శబ్దములు, మంత్రేభ్యః = మంత్రముల నుండి, సమాహృత్య సమాహృత్య=ఏరియేరి తీసికొని, సమామ్నాతాః = ఒకచోచేర్చి గ్రంథముగా చేయబడినవి. అందువలననే యివి నిశ్చయముగా మంత్రార్థములను బోధింప సామర్థ్యము కలిగియున్నవి.

**'తే నిగంతవ ఏవ సన్తో నిగమనాన్నిఘంటవ**
**ఉచ్యన్త ఇత్యౌపమన్యవః"**

తే సమామ్నాతా గవాదయో మంత్రార్థనిగమనాత్ హేతోః 'నిఘంటవః' ఉచ్యన్తే. గకారస్థానే ఘకారం కృత్వా తకారస్థానే చ టకారం కృత్వా, ఉక్తఞ్చ — వర్ణాగమో వర్ణవిపర్యయశ్చ ద్వౌ చాపరౌ వర్ణవికార నాశౌ ధాతో స్తదర్థాతిశయేన యోగ స్తదుచ్యతే పంచవిధం నిరుక్తమ్"

ఆయాశబ్దములు: నిగమనాత్ = నిశ్చయపూర్వకముగ మంత్రార్థము లను బోధించుటవలన 'నిగంతువులే' యగుచు నిఘంటువులనబడుచున్నవి' అని ఉపమన్యునిపుత్రుడైనఔపమన్యవునిమతము. 'నిగంతు'లోని గస్థానమున 'ఘ' తస్థానమున 'ట' చేర్చుటచే నిఘంటువైనది. అనగా ని=నిశ్చయముగ 'గన్తు' మంత్రార్థమును బోధించునది యనియర్థము.

"అపి వాఽఽహననాదేవ స్యుః సమాహతా భవన్తి"

అపి వాయమన్యః ప్రకారో నిఘంటుశబ్దనిర్వచనే, కస్మాత్? ఆహననాత్. న తు నిగమనాదిత్యభిప్రాయః, పాఠార్థే వర్తమానస్య హన్తేః అనేకార్థత్వా ద్ధాతూనాం వర్ణవ్యాపత్త్యా హకారస్థానే ఘకారః తస్య టకారః, 'బ్రాహ్మణే ఇదమాహతమ్, సూత్రే ఇదమాహతమ్. అత్ర పాఠార్థే హన్తేః ప్రయోగః.

అర్థము :— అపి వా లేక ఈశబ్దములు సమాహతాః=సమాహతములు, భవన్తి = అగుచున్నవి. సమ్ = బాగుగ, ఆహతాః = పంచాధ్యాయియందు మర్యాదాపూర్వకముగ క్రమముగ పఠింపబడినవి. అతః = అందువలన, ఆహననాత్ ఏవ స్యుః = ఆహననక్రియా యోగము వలననే, 'సమాహన్తు' సమాహంతములగుచు, ఉపసర్గవ్యత్యయము, ఉపసర్గాధ్యాహారము వర్ణవిపర్యయము మున్నగునవి చేసినమీదట నిఘంటువులనబడుచున్నవి. అనగా 'సమాహన్తు'లోని 'సమ్' స్థానమున 'ని'చేర్చి 'ఆ'కారమునుతొలగించి 'హ' స్థానమున 'ఘ', 'త' స్థానమున 'ట' చేర్చుటవలన, 'సమాహన్తు' స్థానమున 'నిఘంటు' పదము సిద్ధమగుచున్నది. అనగా నిగమన కారణ మున నిఘంటుకాక ఆహననము పంచాధ్యాయిలోపఠించుటవలన నిఘంటు పద మేర్పడినదని తాత్పర్యము.

"యద్వా సమాహృతా భవన్తి"

యద్వా ఏతే సమాహరణక్రియా యోగాత్ సమాహృతా భవన్తి ఛన్దోభ్యః తతః సమాహర్తవః సన్తే నిఘంటవః ఇత్యుచ్యన్తే. ఏవం ఏష నిఘంటుశబ్దో గమేర్దైవోపసర్గాత్, హన్తి హరతిభ్యాం వా నిరుక్తః, ఇతి నిఘంటుపద నిర్వచనమ్".

యత్ వా = లేక ఈ వైదికశబ్దములు మంత్రములనుండి, సమాహృతాః భవన్తి = ఒకచో చేర్పబడి నందువలన, సమాహరణ క్రియా యోగమువలన సమాహర్తనామము కలిగి, ఉపసర్గవ్యత్యయాదులుచేసి నిఘంటువులని పిలువబడసాగెను. కావున గవాదిశబ్దములు నిగమనము వలనగాని, సమాహననమువలనగాని నిఘంటువులనబడక సమాహరణము వలన నిఘంటువులనబడుచున్నవని యెంచవలయును.

## పదచతుష్టయోద్దేశ కథనము

"తద్ యాన్యేతాని చత్వారి పదజాతాని, నామాఖ్యాతే చోపసర్గనిపాతాశ్చ తానీమాని భవన్తి"

తతః యాన్యేతాని - లోకే వేదే చ ప్రసిద్ధాని, చత్వారి - చతుః సంఖ్యాకాని, పదజాతాని పదగణాః। నామ ఆఖ్యాతముపసర్గా నిపాతాశ్చ తానీమాని - నిఘంటు సంజ్ఞాని భవన్తి.

అర్థము :— తత్ = ఆ నిఘంటుసంజ్ఞకలవి యెవ్వియన - తాని ఇమాని=ఇవియా,పదజాతాని=లోక, వేదభాషలందుగలపదసముదాయములు ఆపదములలోగల భేదములెయ్యవి యన నామములు, ఆఖ్యాతలు, ఉపసర్గలు, నిపాతములు అని నాలుగు విధములు. వీనికే నిఘంటువులనిపేరు. సమస్తశబ్దసముదాయములును ఈ నాలుగు విధములైన శబ్దములలోనే చేరును. ఇట్టి శబ్దసమూహమునకే నిఘంటువని పేరు.

## నామాఖ్యాత లక్షణాధికరణము

"తత్రైతన్నామాఖ్యాతయోర్ లక్షణం ప్రదిశంతి, భావప్రధానమాఖ్యాతమ్, సత్త్వప్రధానాని నామాని"

తత్ర- తస్మిన్ లోకవేదప్రసిద్ధే పదచతుష్టయే యే తావన్నామాఖ్యాతే తయోస్తావ దేతద్వక్ష్యమాణం లక్షణం ప్రదిశన్తి - ఉపదిశన్తి ఆచార్యా ఇతి వాక్యశేషః. తథాచోక్తమ్ :—

"ఋషయోఽప్యుపదేశస్య నాన్తం యాన్తి పృథక్త్వశః, లక్షణేన తు సిద్ధానా మన్తం యాన్తి విపశ్చితః॥"

భావః = పాకరాగత్యాగాఖ్యః స యత్ర ప్రధానం గుణభూతా క్రియా తదిదం "భావప్రధానమ్" ఆఖ్యాతమ్. ఆఖ్యాతజత్వాన్నామ్నాం పశ్చా న్నామ లక్షణ ముచ్యతే. లింగసంఖ్యయో ర్యత్ర సద్భావ ఇతి సత్త్వమ్. తద్ద్రవ్యమ ప్రధానం గుణభూతా క్రియా, నామాన్యేవ తాని.

అర్థము :- తత్ర = ఇంతకు ముందు నిఘంటు నామముతో పేర్కొన్న నాలుగువిధములైన శబ్దసమూహములందు, నామాఖ్యాతయోః = నామములు, ఆఖ్యాతములు అను వానియొక్క ఏతల్లక్షణమ్ =ఈలక్షణము ప్రదిశన్తి = చెప్పుచున్నారు. భావప్రధానమ్ = భావము క్రియ యేనియందు ముఖ్యమో యది ఆఖ్యాతము. సత్త్వప్రధానాని = సత్త్వము, ద్రవ్యము యేనియందు ముఖ్యమో యాశబ్దములు, నామాని = నామములనబడును. అనగా క్రియప్రధానముగనుండి కారకాదులు గౌణముగా (అప్రధానము) నున్నది ఆఖ్యాతము. అట్లే లింగము, సంఖ్య, వచనాదులుగల ద్రవ్యము ప్రధానముగానుండి క్రియ గౌణముగా నున్నచో నామమనబడును. ఉదాహరణములు - పచతి = వండుచున్నాడు. భుఙ్క్తే = తినుచున్నాడు. ఇవి ఆఖ్యాతములు. రామః = రాముడు, రమా = లక్ష్మి, ధనమ్ = ధనము, ఇవి నామములు.

## "తద్ యత్రోభే భావప్రధానే భవతః"

అథ ప్రసఙ్గాత్తే ఉభే భవతో వాక్యే తత్రాఖ్యాతం ప్రధానంగుణ భూతం నామ. ఏవం తావదాఖ్యాతం వాక్యే ప్రధానమితి ఫలితమ్.

అర్థము :- తద్ యత్ర ఉభే భవతః = ముక్కలయు నెక్కడ — ఏ వాక్యమునందు నామము ఆఖ్యాతము రెండునుండునో, ఉదా :- దేవదత్తః పచతి =దేవదత్తుడు వండుచున్నాడు. అక్కడ - ఆవాక్యమునందు భావః=

క్రియ, ప్రధానమ్ = ప్రధానమగును. వాక్యమునందు క్రియయే ప్రధాన మగును. నామము ఆక్రియకు అంగమై యాక్రియను సంపాదించునదగును కావున నామము అప్రధానము క్రియ చేయబడును. కావున నదియే ముఖ్యమగును.

## భావవాచక ప్రదర్శనము

"పూర్వాపరీభూతం భావమాఖ్యాతేనాచష్టే
వ్రజతి పచతీత్యుపక్రమప్రభృత్యపవర్గ పర్యంతమ్"

పూర్వాపరీభూతం – పూర్వాపరమివ పౌర్వాపర్యేణావస్థితమేకమనేకాను క్రియాను ఆశ్రితమ్. ఉపక్రమప్రభృతీతి - ఉపక్రమః ప్రారంభ స్తావదారభ్యాపవర్గపర్యన్తం యావదన్త్యక్రియేత్యర్థః.

అర్థము :– ఉపక్రమ ప్రభృతి = కొంటెక క్రియ ప్రారంభించినది మొదలు, అపవర్గపర్యంతమ్ = అది సమాప్తమగువఱకు, పూర్వాపరీభూతమ్ = పౌర్వాపర్యముతో ఒకదాని తరువాత మఱియొకటి అను క్రమముతో నున్న, భావమ్ = సంపూర్ణ క్రియను, వ్రజతి,పచతి=వెళ్లుచున్నాడు. వండుచున్నాడు. అను క్రియను, ఆఖ్యాతేన = ఆఖ్యాతము అను నామముతో చెప్పుదురు. అనగా ఎట్లు చెప్పుదురన-దేవదత్తో లవపురం వ్రజతి= దేవదత్తుడు లవపురము వెళ్లుచున్నాడు. అనునీవాక్యమునందలి వ్రజతి = వెళ్లుచున్నాడు. అనుక్రియలో, దేవదత్తుడు చెప్పులు తొడుగుకొనుట బయలుదేరుట, దారిలో భోజనముచేయుట కూర్చుండుట లేచుట మున్నగు క్రియలనేకములు ఒకదానితరువాత మఱియొకటి చేరియుండును. ఈ క్రియలనెనర్చుచు దేవదత్తుడు వెళ్లుచున్నాడు. ఈ వెళ్ళుచున్నాడను ఒక్క క్రియయే ముఖ్యక్రియగా చెప్పబడును. ఇట్లే యనేకక్రియలనొనర్చుచు చేయుముఖ్యక్రియలే భావ-ఆఖ్యాతపదముచే చెప్పబడును. అట్లే చెప్పబడినది కూడ.

"క్రియాను బహ్వీష్వభిసంశ్రితో యః పూర్వాపరీభూత ఇహైక ఏవ. క్రియాభినిర్వృత్తివశేన సిద్ధ ఆఖ్యాతశబ్దేన తదర్థమాహుః"

## మూర్తం సత్త్వభూతం సత్త్వనామభిర్ వ్రజ్యా పక్తిరితి.

మూర్తసత్త్వభూతం - సత్త్వరూపిణం లిఙ్గసంఖ్యాయుక్తైః సత్త్వనామభిరాచష్టే. కథమ్? వ్రజ్యా పక్తిరితి. వ్రజ్యా = వ్రజనమ్. పక్తిః = పచనమ్.

అర్థము :— అప్పుడప్పుడు ఆ'భావ' మూర్తమ్ = భావము మూర్తము రూపాంతరమును బొంది, సత్త్వభూతమ్ సత్త్వప్రకారమును బొందుచు, సత్త్వనామభిః = సత్త్వ — ద్రవ్యనామములతో అనగా లింగసంఖ్యావచనములతో కూడిన శబ్దములతో వ్యవహరింపబడును. ఎట్లన :— వ్రజ్యా — పక్తిః, వ్రజ్యా = నడుచుట, పక్తిః = వండుట. ఈ రెండుపదములు క్రియావాచకములే- భావములే. అందువలననే యిది ఆఖ్యాతశబ్దముతో వ్యవహరించుటయే యుచితము, అయినను కృదంతప్రత్యయముతో చెప్పబడు భావములు ద్రవ్యములవలె నామములవలె అగపడును. కావున వెళ్ళుట వండుట అనునిరెండును ఆఖ్యాతనామమును వదలి నామముల శ్రేణిలోచేరి నామములనబడును. ఆఖ్యాతలక్షణమున కిది యపవాదమన వచ్చును.

## సత్త్వోపదేశ నిరూపణము

### "అద ఇతి సత్త్వానాముపదేశః"

సత్త్వానాం - ప్రాణినామ్ - ఉపదేశః సామాన్యోపదేశ ఇత్యర్థః

అర్థము :— సత్త్వానాం = సత్త్వద్రవ్యములయొక్క, ఉపదేశః = కథనము - చెప్పుట, అదః = ఇది అను సామాన్యశబ్దముతో చెప్పబడును.

లోకములో కొంతవస్తువును గూర్చి దానిలింగవచనాదులను విచారింపకయే కిమదః? ఇదియేమి యని ఎల్లరు ప్రశ్నింతురు.

### "గౌరశ్వః పురుషో హస్తీతి"

అయం గవాది సత్త్వానాం విశేషోపదేశ ఇత్యర్థః.

అర్థము :— గౌః = గోవు, అశ్వః = గుఱ్ఱము, పురుషః = పురుషుడు, హస్తీ = ఏనుగు అనునవి ద్రవ్యముల విశేషనామములు.

## భావోపదేశ నిరూపణము

### "భవతీతి భావస్య"

క్రియామాత్రస్య సామాన్యోపదేశ ఇత్యర్థః.

అర్థము :— భవతి ఇతి-భవతి = ఉన్నది - జరుగుచున్నది.అనునిది సమస్తక్రియలకు సామాన్యలక్షణము. ఒకడేదని చేయుచున్న మనము సామాన్యముగ కింభవతి? ఏమగుచున్నది ? ఏమి జరుగుచున్నది ? అని ప్రశ్నింతుము. ఈ ప్రశ్నమునకు 'భవతి' అగుచున్నది. జరుగుచున్నది అని చెప్పుదుము. ఈ సమాధానము సమస్తక్రియలకు సామాన్యలక్షణము.

### ఆస్తే, శేతే, వ్రజతి. తిష్ఠతీతి,

తత్తత్క్రియాణాం విశేషోపదేశ ఇత్యర్థః. ఇతి ప్రథమ ఖండః.

అర్థము :— ఆస్తే = ఉన్నాడు. శేతే = నిద్రించుచున్నాడు. వ్రజతి= వెళ్లుచున్నాడు. తిష్ఠతి = నిలుచున్నాడు, ఉన్నాడు. అనునివి క్రియలకు విశేషలక్షణములు. ఇది ప్రథమ ఖండము.

శబ్దానిత్యత్వవాదిన ఆక్షేపః

శబ్దము అనిత్యమనువాని ఆక్షేపణ

### ఇంద్రియనిత్యం వచన మౌదుంబరాయణః
### తత్ర చతుష్ట్వం నోపపద్యతే.

ఇంద్ర ఆత్మా స యేన ఈయతే - లిఙ్గ్యతే - అనుమీయతే తదింద్రియమ్. తస్మిన్నింద్రియే యావత్తిష్ఠతి తావన్నిత్యం వచనమితి ఔదుంబరాయణ ఆచార్యో మన్యత ఇతి శేషః.

అర్థము :— తత్ర = తస్మిన్వాక్యే పదచతుష్ట్వ ముక్త మేతన్నోపపద్యతే. యావదేవ వక్తుర్వాగింద్రియే వచనం తావదేవ తదస్తీతి శక్యతే వక్తుమ్. తస్మాద్వచనానిత్యత్వాత్ - పదచతుష్టయానుపపత్తిరితి.

అర్థము :— వచనమ్=నామము, ఆఖ్యాతము, ఉపసర్గము, నిపాతము అను శబ్దసమూహమంతయు, ఇంద్రియనిత్యమ్ = వాక్కు అనెడి యింద్రియమున నియతము. అది యుచ్చారణము తదుపరి నశించును. అతః

తత్ర చతుష్ట్వం నోపపద్యతే = అందువలన శబ్దములలో నాలుగుభేదము లున్నవనుట తగదు. అని ఔదుంబరాయణు ఆచార్యుని మతము.

ఉచ్చారణము, శ్రవణము తరువాత వెంటనే వర్ణములు నశించును. ఈ సిద్ధాంతము ననుసరించి ఉచ్చరించువాని ముఖమున వర్ణములు వాని వాగింద్రియమున నుండును. ఉచ్చారణ ముగియగానే యది నశించును, అట్లు నశించిన వర్ణములతో తదుపరి ఉత్పన్నము కాబోవు నామము, ఆఖ్యాతము మున్నగు పలువిధములైన పదము లెట్లేర్పడును ? ఏర్పడ జాలవు. నశించిన వానికి ఉత్పన్నము కాబోవు వానితో మేళనము కలుగ జాలదుకదా !

## అయుగపదుత్పన్నానాం వా శబ్దానామితరేతరోపదేశః.

ఏతేషా మయుగపదుత్పన్నానాం శబ్దానాం వాక్యావయవభూతానాం యోఽయ మితరేతరోపదేశః. ఇతరేతరగుణ ప్రధానభావో నామ్న ఆఖ్యాతం ప్రతి గుణభావేనోపదేశః. ఆఖ్యాతస్య చ నామ ప్రతి ప్రధానభావేనోపదేశః అయం చ నోపపద్యతే ఇత్యనువర్తతే.

మఱియు వాక్యమునకు అవయవభూతములైనట్టియు ఒకేసారి ఉత్పన్నములు కానట్టియు శబ్దములకు పరస్పరము ప్రధానాప్రధానభావ ముండును. అదికూడ ఉపపన్నము కాజాలదు. అనగా నామమునకు ఆఖ్యాతమును గూర్చి గౌణత్వము, ఆఖ్యాతమునకు నామమును గూర్చి ముఖ్యత్వము కలుగజాలదు. ఎందువలన ననగా ఉచ్చారణానంతరము వినష్టమైన నామము ఆఖ్యాతమును గూర్చి గుణభావమును ఎట్లు పొంద గలుగును. వినష్టము మఱియు అవినష్టములకు పరస్పరము ప్రధానా ప్రధానభావము అసంగతమై యున్నది.

## "శాస్త్రకృతో యోగశ్చ"

యశ్చాయం శాస్త్రకృతో యోగః - శబ్దస్య శబ్దాన్తరేణ యోగః, తద్యథా ఉపసర్గస్య ధాతునా, ధాతోః ప్రత్యయేన, ప్రత్యయస్య లోపాగమవర్ణ వికారైః అయం వచనానిత్యత్వా న్నోపపద్యతే. వినష్టావినష్టయోః పరస్పరం యోగాభావాత్.

అర్థము :- చ = మఱియు, శాస్త్రకృతః యోగః = శాస్త్రమునందు బూడబడు ఒకశబ్దముతో మఱియొక శబ్దమునకుంగల సంబంధము కూడ ఏర్పడజాలదు. ఉదాహరణమునకు :- ఉపసర్గకు ధాతువుతోను, ధాతువునకు ప్రత్యయముతోను సంబంధమెట్లేర్పడును? నశించినదానికి నశింపని దానితో సంబంధమశక్యము కదా!

శబ్దనిత్యత్వవాదినః సమాధానగ్రంథః
(శబ్దము నిత్యమనువాని సమాధానము)

"వ్యాప్తిమత్వాత్ తు శబ్దస్య"

వ్యాపనం వ్యాప్తిః సా యస్మిన్నస్తి స వ్యాప్తిమాన్ తద్భావో వ్యాప్తిమత్త్వమ్ నిత్యత్వమ్, తస్మాత్. వ్యాప్తిమత్త్వా చ్ఛబ్దస్య పదచతుష్ట్వాది సర్వముపపద్యత ఏవ. వ్యాప్తి మత్త్వాదిత్యనే నైవేతరేతరోపదేశః ప్రత్యుక్తః. శాస్త్రకృతో యోగశ్చ.

అర్థము :- తు = ఈపదము పూర్వపక్షనిరసనార్థకము. శబ్దస్య వ్యాప్తిమత్త్వాత్ = శబ్దము వ్యాప్తికలదియగుటవలన శబ్దము వ్యాప్తిమంతము వ్యాప్తికలది - నిత్యమగుటవలన పూర్వోక్తదోషములన్నియు నుండవు. అనగా వాస్తవమున శబ్దము ఉచ్చారణక్రియవలన నది ప్రకటమగును. అంతేకాని శబ్దమునకు ఉత్పత్తివినాశములు లేవు. దానిని ప్రకటింపజేయు ఉచ్చారణక్రియమాత్రమే ఉత్పన్నమై నశించును. కావున శబ్దమనిత్యమని చూపిన పూర్వదోషము లన్నియు నిరాధారములని తాత్పర్యము.

శబ్దప్రయోగస్యైవ వ్యవహారార్థ మావశ్యకతా నిరూపణమ్. వ్యవహారార్థము శబ్దప్రయోగమునకేగల ఆవశ్యకతను నిరూపించుచున్నాడు.

"అణీయస్త్వాచ్చ శబ్దేన సంజ్ఞాకరణమ్ వ్యవహారార్థం లోకే"

వ్యాప్తిమన్తః, పాణివిహారాక్షినికోచాదయః తైరేవ కార్యసిద్ధి రస్త్వితి. సత్యమ్. అభినయా అపి వ్యాప్తిమన్తః, నత్వణీయాంసః తే మహతాయత్నేన వ్యాప్నువన్తి. న చ నిఃసన్దిగ్ధం కార్యం కుర్వన్తి. తస్మాదణీయస్త్వాదితి విశేష హేతూపాదానాత్ శబ్దేనైవ సంజ్ఞాసంకేత స్తత్కరణం వ్యవహారార్థం లోకే లాఘవాత్ సతి లాఘవే గౌరవం కేనాద్రియతే.

అర్థము :- అణీయస్త్వాత్ చ = మఱియు మిక్కిలి తేలికయగుట వలన - కొద్దిలో ఎక్కువపని సాధించుటవలన - శబ్దేన = శబ్దముతో, సంజ్ఞాకరణమ్ = సంకేతముచేయుట, లోకే = లోకమునందు, వ్యవహారార్థమ్ = వ్యవహారము కొఱకు.

పై వాక్యముల సారాంశమేమన మనము హస్తచలనము, అక్షినిమీలనము మున్నగు సంకేతములతోనే సర్వవ్యవహారములు సిద్ధించుచుండ పెద్దశబ్దసముదాయములయు శాస్త్రాధ్యయనముయొక్కయు ఆవశ్యకత యేమున్నదని యెవరేని శంకించిన దానికి సమాధానమియ్యబడియే - శబ్దముయొక్క నిశ్చితార్థము, మఱియు మిక్కిలి యల్పము నగుటవలన నేజ్ఞానము శబ్దము మూలమున సులభముగా కలుగునో యాజ్ఞానము దురూహము, సందిగ్ధమునగు సంకేతములతో కలుగజాలదు.

"తేషాం మనుష్యవద్దేవతాభిధానమ్"

యథైవ హి మనుష్యాః ప్రయోజనేషు నామాఖ్యాతోపసర్గనిపాతైర్ యథార్థమభివ్యవహరన్తి. ఏవమేవ దేవా అపి. అధికం సప్తమాధ్యాయే ద్రష్టవ్యమ్.

అర్థము :- తేషామ్ = నామాఖ్యాతోపసర్గనిపాత పదముల శక్తి, మనుష్యవత్ = మనుష్యులవలె, దేవతాభిధానమ్ = దేవతలను గూడ చెప్పగలదు. అనగా నామాఖ్యాతాదులు మనుష్యులకు అర్థబోధకలిగించునట్లు దేవతలకు — విద్వాంసులకును అర్థబోధకలిగించుశక్తి కలిగియున్నవని భావము. లౌకికభాషలోని శబ్దములవంటివే వైదిక శబ్దములు కావు.

"కర్మణి వేదమన్త్రస్యావశ్యకతా నిరూపణమ్"

(యజ్ఞాదికర్మము నందు వేదమంత్రముల యావశ్యకత నిరూపణ)

"పురుషవిద్యాఽనిత్యత్వాత్ కర్మసంపత్తిర్ మన్త్రో వేదే"

పురుషేషు = మనుష్యేషు, విద్యాయాః = విజ్ఞానస్య అనిత్యత్వాత్, విస్మరణేన కర్మసంపత్తిః న స్యాత్. అవిగుణకర్మఫలసంపత్తిః భవేత్. ఇత్యేవ మర్థం వేదే మన్త్రాః సమామ్నాతాః, ఇతి వాక్యశేషః.

అర్థము :– లౌకికశబ్దములు వైదికశబ్దములు సమానముగ నర్థమును బోధించుశక్తి కలిగియున్నవని చెప్పబడినది. అట్టియెడ లౌకికశబ్దములతోనే సర్వకార్యనిర్వహణము జరుగుచుండ వేదమంత్రములందు నామ, ఆఖ్యాతాది పదములేల పఠింపబడినవి ? వాని కొఱకు వేదములనధ్యయనము చేయనేల యన సమాధానము.

పురుషవిద్యాఽనిత్యత్వాత్ = మనుష్యులయందలి విద్య - విజ్ఞానము అనిత్యముగుట వలనను, మనుష్యులజ్ఞానము అల్పముగుటవలనను,యాగాది క్రియలు దోషరహితముగా నిర్వర్తింపబడజాలవు. అతః కర్మసంపత్తిః = యజ్ఞాదికర్మానుష్ఠానము ఫలసంపన్నము అగుటకుగాను - యజ్ఞాదులు దోషరహితముగా సిద్ధమగుటకు, వేదే = వేదమునందు మంత్రములు పఠింపబడినవి. అని భావము.

మనుష్యుడు స్వభావముతో నల్పజ్ఞుడు. విస్మరణశీలుడు. కావున నతనిచే సరిగా ప్రయోగింపబడని శబ్దములు యథార్థబోధను కలిగింపజాలవు అందువలన యజ్ఞాదికర్మలు సరిగా నిర్వహింపబడజాలవు. దేవతలు – విద్వాంసులు అల్పదోషమునుసహింపరు. దోషరహితముగా యజ్ఞానుష్ఠానము జరుగుటకు వేదమునందు మంత్రములు పఠింపబడినవి అని భావము.

భావవికార నిరూపణమ్.

(భావ క్రియావికార నిరూపణము)

**"షడ్భావవికారా భవన్తీతి వార్ష్యాయణిః – జాయతే, అస్తి, విపరిణమతే, వర్ధతే, అపక్షీయతే, వినశ్యతీతి.**

షడ్భావవికారా భవన్తీతి వార్ష్యాయణిః - ఆచార్యః మన్యతే ఇతి వాక్యశేషః.

అర్థము :– ఏదేని వస్తువు ఉన్నచో దానికి ఆఱు క్రియావికారములు కలుగునని వార్ష్యాయణి ఆచార్యుడంగీకరించు చున్నాడు. ఆ వికారము లెయ్యవియన జాయతే = పుట్టుచున్నది, అస్తి = ఉన్నది, విపరిణమతే = మార్పుచెందుచున్నది, వర్ధతే = వృద్ధి పొందుచున్నది, అపక్షీయతే = క్షీణించుచున్నది, వినశ్యతి = నశించుచున్నది, పుట్టుట, ఉండుట

పెరుగుట, తఱుగుట, మార్పుచెందుట, నశించుట అను నియాఱును భావ వికారములనబడును.

**జాయతే ఇతి పూర్వభావస్యాదిమాచష్టే. నాపరభావమాచష్టే, న ప్రతిషేధతి.**

జనిః పూర్వోభావః, తం బ్రూతే నేతి ప్రతిషేధే, న పరోభావః, అపర భావః తం న బ్రూతే. న ప్రతిషేధతి. అస్తిత్వస్య న ప్రతిషేధం కరోతీత్యర్థః.

అర్థము :— జాయతే ఇతి జాయతే = ఉత్పన్నమగుచున్నది. అను నీ క్రియ, పూర్వభావస్య = పూర్వపు క్రియ యొక్క, ఆదిమ్ = ప్రారంభ మును మాత్రము, ఆచష్టే = చెప్పుచున్నది, అపరభావమ్ = తరువాతి. అస్తి=ఉన్నది అను రెండవక్రియను, న నిషేధతి= నిషేధింపదు-కాదనదు, ఉత్పన్నమగు వస్తువు పుట్టుచున్నపుడు దాని సత్తా - ఉనికి లేనే లేదు అని చెప్పజాలము. దాని యునికియే లేనపుడు అది (జాయతే) ఉత్పన్నమగు చున్నది. అని యెట్లు చెప్పగలము? జాయతే = పుట్టుచున్నది అనినపుడు యస్తిత్వమును — ఉనికిని అంగీకరింతుమేని యుదియు తగదు. అది యున్నది అనిన నది పుట్టుచున్నదనుటలో నర్థమేమి? అందువలన జాయతే =పుట్టుచున్నదనిన వస్తువుయొక్క క్రియయొక్క ఆరంభమునుమాత్రము తెలుపుచున్నదని చెప్పవలసివచ్చినది. అట్టియెడ అస్తిత్వమును నిషేధించు టగాని స్వీకరించుటగాని లేదనిభావము.

**"అస్తీత్యుత్పన్నస్య సత్త్వస్యావధారణమ్"**

అస్తీతి జాతస్య సత్త్వస్యావధారణమాత్రం బ్రవీతి. న విపరిణామ మాచష్టే- అపూర్వత్వాత్. న ప్రతిషేధత్యుపస్థితత్వాత్.

అర్థము :— అస్తి = ఉన్నది, అనునీశబ్దము లేక క్రియ, ఉత్పన్నస్య సత్త్వస్య = పుట్టినద్రవ్యముయొక్క నిశ్చయాత్మకస్థితిని తెలుపును. అస్తి= ఉన్నది అనునిక్రియ ముందుకలుగు, విపరిణమతే = మార్పుచెందు చున్నది. అనుక్రియను చెప్పదు, నిషేధింపదు - కాదనదు.

**"విపరిణమత ఇత్యప్రచ్యవమానస్య తత్త్వాద్వికారమ్"**

విపరిణమత ఇత్యేష శబ్దోఽప్రచ్యవమానస్య తత్త్వాదప్రభ్రశ్యమానస్య వికారం విక్రియామాత్రం బ్రవీతి. న వృద్ధేరర్థమాచష్టే. న ప్రతిషేధతి.

అర్థము :— విపరిణమతే = మార్పు చెందును. ఈశబ్దము తత్త్వాద్ అప్రచ్యవమానస్య = తన తాత్త్వికస్థితినుండి పతనముకాని వస్తువుయొక్క వికారమ్ = వికారమును మాత్రము, బ్రవీతి = తెలుపును. అనగా వస్తువు తన యునికిని పోగొట్టుకొనదు. కాని, తనపూర్వస్థితిలో నుండదు. దానిలో కొంతమార్పు కలుగును. ఈభేదమే విపరిణామ మనబడును. ఈ విపరిణామమనుక్రియ ముందుకలుగువృద్ధినితెలుపదు దానిని నిరాకరింపదు

"వర్ధత ఇతి స్వాంగాభ్యుచ్చయం సాంయౌగికానాం వార్థానాం వర్ధతే విజయేనేతి వా వర్ధతే శరీరేణేతి వా"

వర్ధత ఇత్యేషశబ్దః స్వేషామంగానాం శిరోగ్రీవాబాహూదరాదీనాం సాంయౌగికానాం వా హిరణ్యధాన్యాదీనాం అభ్యుచ్చయ మాహ వర్ధతే విజయేనేతి సాంయౌగికేషు ఉదాహరణమ్. వర్ధతే శరీరేణేతి స్వాంగాభ్యుచ్చయే.

అర్థము :— వర్ధతే ఇతి = పెరుగుచున్నది, ఈ శబ్దము స్వాంగాభ్యుదయమ్ = తనయంగములైన శిరస్సు, కంఠము, ఉదరము మున్నగు నవయవముల పెంపును తెలుపును. లేక, సాంయౌగికానామ్ అర్థానామ్ = తనకు సంబంధించిన ధనము, ధాన్యము, హిరణ్యము మున్నగుపదార్థముల యభివృద్ధిని తెలుపును. ఉదాహరణము- వర్ధతే విజయేన = విజయముతో వర్ధిల్లు చున్నాడు. ఇది సాంయౌగికవృద్ధికి ఉదాహరణము. శరీరముతో వృద్ధిపొందుచున్నాడు. వర్ధతే = ఈవృద్ధి యనెడిక్రియ ముందుకలుగబోవు అపక్షయమును తెలుపదు. నిషేధింపదు - కాదనదు కూడ.

"అపక్షీయతే ఇత్యేతేనైవ వ్యాఖ్యాతః ప్రతిలోమమ్"

యథైవ హి స్వాంగైః సాంయౌగికైర్వా ద్రవ్యై రుపచీయతే, తథైవాపక్షీయతే.

అర్థము :— అపక్షీయతే = తగ్గిపోవును, ఏతేనైవ ప్రతిలోమమ్ = ఈ వర్ధతే = వృద్ధి పొందును. అను పదముతోనే. అపక్షయము = తగ్గిపోవుటను

విపరీతముగా వ్యాఖ్యానముచేయబడినదని యెంచవలెను. కొండొకవస్తువు తనయంగములతోను తనకు సంబంధించిన పదార్థములతోను వృద్ధి పొందునని చెప్పబడినట్లు దానికి విపరీతముగ నొకవస్తువు స్వాంగములతోను క్షీణించునని తెలియదగునని భావము.

**"వినశ్యతీత్యపరభావస్యాది మాచష్టే న పూర్వభావ మాచష్టే న ప్రతిషేధతి"**

వినాశ ఏవాపరభావః తస్యాది మాచష్టే.

అర్థము :— వినశ్యతి = నశించుచున్నది, అపర భావస్య = అంతిమ క్రియయొక్క, ఆదిమ్ = ప్రారంభమును, ఆచష్టే = చెప్పును. న పూర్వ భావమాచష్టే= పూర్వభావమును చెప్పదు. న ప్రతిషేధతి = నిషేధింపదు. లేదనదు,

**"అతోఽన్యేభావవికారా ఏతేషామేవ వికారా భవన్తీతి హ స్మాహ"**

అతో భావవికారషట్కాత్ యేఽన్యేత్వేవ భావవికారా లక్ష్యన్తే, న తే పృథక్ సన్తి. కింతర్హి? ఏతేషామేవ వికారా భవన్తి. తద్యథా — జనిశబ్ద వాచ్యో నిష్పద్యతే. అభివ్యజ్యతే. అస్తి శబ్దవాచ్యో అస్తి- విద్యతే భవతీత్యేవ మాదిః. విపరిణమతి శబ్దవాచ్యో విపరిణమతే, జీర్యతి. వర్ధతి శబ్దవాచ్యో వర్ధతే, పుష్యతి, ఉపచీయతే, అపక్షీయతి శబ్దవాచ్యో ధ్వస్యతి భ్రశ్యతీత్యేవ మాదిః. వినశ్యతిశబ్దవాచ్యో వినశ్యతి, మ్రియతే, విలీయతఇత్యేవమాదిః. ఇతి హ స్మాహ—వార్ష్యాయణి రిత్యనువర్తతే ఇత్యాహస్మ ఆపేనదిత్యర్థః.

అర్థము :— అన్యే = ఇతర, భావవికారాః = భావవికారములు, ఏతేషామేవ = పైన చెప్పిన ఆరు విధములగు భావవికారములందే అవాంతర భేదములని వార్ష్యాయణి ఆచార్యుడు చెప్పెను, ఉదా :— జాయతే = పుట్టుచున్నది, నిష్పన్నమగుచున్నది, అభివ్యక్తమగుచున్నది. అస్తి=భవతి, విద్యతే = ఉన్నది, విద్యమానమగుచున్నది. విపరిణమతి, విపరిణమతే జీర్యతే = మారుచున్నది. జీర్ణమగుచున్నది. వర్ధతే - ఉపచీయతే=పెరుగు చున్నది, ఉపచయించుచున్నది. అపక్షీయతే = ధ్వస్యతి, భ్రశ్యతి = క్షీణించు చున్నది, ధ్వంసమగుచున్నది, భ్రష్టమగుచున్నది. వినశ్యతి =

ధ్రియతే = విలీయతే = నశించుచున్నది - చచ్చుచున్నది, విలీనమగు చున్నది.

## "తే యథావచన మభ్యూహితవ్యాః"

తే - జన్యాది శబ్దవాచ్యా వికారాః యథావచన మవస్థితాః సన్తః ప్రకరణోపపత్తిభ్యా మభ్యూహితవ్యాః జ్ఞాతవ్యా ఇత్యర్థః.

అర్థము :— తే = ఆయవాంతర క్రియాభేదములు, యథావచనమ్= వచనముల ననుసరించి, అభ్యూహితవ్యాః = తర్కించి ఊహించి - తెలిసి కొనవలెను. జాయతే = అభివ్యజ్యతే — నిష్పద్యతే = పుట్టుచున్నది, అభి వ్యక్తమగుచున్నది, నిష్పన్నమగుచున్నది. ఇట్లే ఇతరక్రియా వికారభేద-ములను పైనజూపినట్లు ఊహింపవలెనని భావము.

ఇతి ద్వితీయ ఖండః
రెండవ ఖండము సమాప్తము

## ఉపసర్గ నిరూపణము

### న నిర్బద్ధా ఉపసర్గా అర్థాన్నిరాహురితి శాకటాయనః.

ఉపసర్గా ప్రపరాదయః నిర్బద్ధా నిష్కృష్య - నామాఖ్యాతమధ్యాత్ బద్ధాః పదవాక్యరూపేణ విరచితాః సన్తే నార్థాన్నిరాహురితి శాకటాయన ఆచార్యో మన్యతే ఇతి శేషః. నిర్బద్ధాః నిష్కృష్య నామాఖ్యాతమధ్యాత బద్ధాః పదవాక్యరూపేణ విరచితాః సన్తః.

అర్థము :— ఉపసర్గాః = ప్రపరా, సమ్ మున్నగు ఉపసర్గములు నామాఖ్యాతములనుండి వేఱై స్వతంత్రముగా అర్థములను న నిరాహుః = చెప్పవు. అని శాకటాయన ఆచార్యుడు చెప్పుచున్నాడు — అనగా - ధనము అను శబ్దమునగల ధ, న, ము, అను వర్ణములు ఆపదమునుండి వేఱై విడిగా నెట్టియర్థమును బోధింపజాలనట్లు ఉపసర్గలు ప్ర, పరా, సమ్ = అనునవి. నామములతోను, ఆఖ్యాతములతోను చేరక విడిగా ప్రయోగింప బడి అర్థమును బోధింపజాలవని భావము.

**నామాఖ్యాతయోస్తు కర్మోపసంయోగద్యోతకా భవన్తి.**

నామాఖ్యాతయోరర్థ ఉపసర్గసంయోగే సతి వ్యజ్యతే. నామాఖ్యాత వియోగే తేషామర్థాభిధాన శక్తిర్ నాస్తీతిభావః. అయముపసర్గాణాం ద్యోతకత్వపక్షః.

అర్థము :- తు = నిశ్చయముగ, నామాఖ్యాతయోః = నామము, ఆఖ్యాతమునను నిరెంటి యొక్క, కర్మోపసంయోగద్యోతకాః కర్మణః = అర్థముతో, ఉపసంయుజ్యద్యోతకాః= కలిసియే ఉపసర్గలు నామాఖ్యాతముల విశేషార్థమును తెలుపును. ఉపసర్గలకు స్వతంత్రార్థమేదియు నుండదని భావము.

**''ఉచ్చావచాః పదార్థా భవన్తీతి గార్గ్యః''**

ఉచ్చావచాః — బహుప్రకారాః పదానామర్థాః పదార్థా భవన్తి. వియుక్తానామపి నామాఖ్యాతాభ్యామితి గార్గ్య ఆచార్యో మన్యత ఇతి శేషః.

అర్థము :- పదార్థాః = ఈ ఉపసర్గల అర్థములు, ఉచ్చావచా భవన్తి =అనేక ప్రకారములుగా నుండును, అని గార్గ్య ఆచార్యుడు చెప్పుచున్నాడు ఉపసర్గలు స్వతంత్రముగా సార్థకములే కాని నిరర్థకములు కావు. కావున ఉపసర్గలు నిరర్థకములను శాకటాయన ఆచార్యునిమతము సరికాదు.

**“తద్ య ఏషు పదార్థః ప్రాహు రిమే**
**తం నామాఖ్యాతయో రర్థవికరణమ్''**

య ఏషూపసర్గేషు స్వోఽనేకప్రకారోఽర్థః ప్రాహురేవ తమిమే ఉపసర్గాః పృథగపి సన్తః — నామాఖ్యాతయో రర్థవికరణమ్ అర్థవిక్రియా మిత్యర్థః తస్మాదర్థవన్త ఉపసర్గా ఇతి వాచకత్వ పక్షః.

అర్థము :- తత్ = అందువలన, ఏషు = ఈ ఉపసర్గలందు, యః పదార్థః=ఏస్వంత అర్థమున్నదో, ఇమే = ఈ యుపసర్గలు, తమ్=ఆస్వంత అర్థమును, ప్రాహుః=చెప్పును. అస్వతంత్ర అర్థమొద్దియున నామాఖ్యాతయో రర్థ వికరణమ్= నామాఖ్యాతములందుగల అర్థ వికారము ఉపసర్గలవలన నామాఖ్యాతములకుగల అర్థభేదము ఉపస్థితమగును. అదియే ఉపసర్గలకు గల స్వంత అర్థము. కావున ఉపసర్గలు సార్థకములేకాని, నిరర్థకములు

కావు. దీనింబట్టికాకటాయనుడు 'ఉపసర్గలు నిరర్థకములని' చెప్పిన సిద్ధాంతము సరికాదని భావము.

ఇప్పుడు ఉపసర్గలకుగల స్వతంత్ర అర్థమును చెప్పుచున్నాడు.

**"ఆ ఇత్యర్వాగర్థే" తద్యథా ఆ పర్వతాదితి.**

అర్థము :- ఆ=అర్వాక్= ఇటు ఇటు వైపు అను అర్థము. ఆ పర్వతాత్= పర్వతమున కిటువైపు= పర్వతమునకివతల అనిఅర్థము.

**"ప్రపరేత్యేతస్య ప్రాతిలోమ్యమ్".**

ప్రపరా ఇత్యేతావుపసర్గా వేతస్యైవా ఙ్గో౽ర్థస్య ప్రాతిలోమ్య మాహతుః. ప్రగతః, పరాగతః.

అర్థము :- ప్ర--పరా= ఈరెండు ఉపసర్గలు, ఏతస్య= ఈ'ఆ' అను ఉపసర్గకు, ప్రాతిలోమ్యమ్= విపరీతార్థమును చెప్పును, ఎట్లన, ప్రగతః పరాగతః=దూరము వెళ్ళెను.

**"అభీత్యాభిముఖ్యమ్" అభిగతః**

అర్థము :- 'అభి' ఉపసర్గము, అభిముఖ్యమ్ = సంముఖతను దెలుపును, అభిగతః త్వామ్=నీకు ఎదురుగా వచ్చెను.

**'ప్రతీత్యేతస్య ప్రాతిలోమ్యమ్**

ఏతస్య=అభేః ప్రాతిలోమ్యమ్ ఆహ ప్రతిగత ఇతి.

అర్థము :- ప్రతి ఉపసర్గ ఏతస్య='అభి' ఉపసర్గ అర్థమునకు, ప్రాతిలోమ్యమ్=విరుద్ధార్థమును తెలుపును, ప్రతిగతః=తిరిగి వెళ్ళెను.

**"అతి,సు ఇత్యభిపూజితార్థే"**

అతి, సు ఇత్యేతా వభిపూజితార్థే వర్తేతే

అతిధనః, సుబ్రాహ్మణః ఇతి.

అర్థము :- అతి, సు, ఈరెండు ఉపసర్గలు, అభిపూజి తార్థే=సత్కారము, పూజ అను నర్థము లందు వర్తించును -- అతిధనః = మిక్కిలి ధనవంతుడు, సుబ్రాహ్మణః= ఉత్తమ బ్రాహ్మణుడు.

**"నిర్, దురిత్యేతయోః ప్రాతిలోమ్యమ్"**

నిర్ధనః, దుర్బ్రాహ్మణః ఇతి.

అర్థము :- నిర్, దుర్= ఈ ఉపసర్గలు ప్రాతిలోమ్యమ్=విరుద్ధార్థము తెలుపును, నిర్ధనుడు = ధనము లేనివాడు, దుర్బ్రాహ్మణుడు = చెడ్డ బ్రాహ్మణుడు.

"న్యవేతి వినిగ్రహార్థీయౌ"

నిగృహ్ణాతి — అవగృహ్ణాతి ఇతి నియంత్రయతీత్యర్థః

అర్థము :- ని, అవ, అనునీరెండు ఉపసర్గలు నియంత్రణము, అణచుట, అనునర్థమును బోధించును. నిగృహ్ణాతి అవగృహ్ణాతి=నియమించును, అణచును.

"ఉధిత్యేతయోః ప్రాతిలోమ్యమ్"

అర్థము :- ఉత్ ఉపసర్గ, ఏతయోః=ని, అవలను రెండు ఉపసర్గల యర్థమునకు విపరీతార్థమును దెలుపును. ఉద్గృహ్ణాతి= పైకి లేపును.

"సమిత్యేకీ భావమ్"

సంగృహ్ణాతీతి సంగ్రహం కరోతీత్యర్థః

అర్థము :- 'సమ్' ఉపసర్గ, ఏకీ భావమ్=ఒకచోచేర్చుట అను నర్థమును తెల్పును. సంగృహ్ణాతి=ఒకచో చేర్చుచున్నాడు.

"వ్యపేత్యేతస్య ప్రాతిలోమ్యమ్"

విగృహ్ణాతి, అపగృహ్ణాతీతి=పృథక్కరోతీత్యర్థః.

అర్థము :- వి, అప, అను ఉపసర్గలు రెండును 'సమ్' ఉపసర్గార్థమునకు విపరీతార్థమును తెలుపును. ఉదా :- విగృహ్ణాతి, అప గృహ్ణాతి= విడదీయును - వేఱుచేయును.

"అన్వితి సాదృశ్యాపర భావమ్"

అనురూపమ స్యేదమితి సాదృశ్యమ్.

అనుగచ్ఛతీ త్యపరభావః.

అర్థము :- 'అను' ఉపసర్గ, సాదృశ్యాపరభావమ్ = సాదృశ్య = సమానత, అపరభావమ్= అనుగమనమును తెలుపును, ఉదా :- అనురూపమిదమస్య=ఇది దీనికి సమానము, అను గచ్ఛతి=వెనుక నడచును.

'అపీతి సంసర్గమ్"

సర్పిషోఽపి స్యాత్.మధునోఽపి స్యాత్ సంబంధ సామాన్యే షష్ఠీ.బిన్దు రిత్యాది.

అర్థము :- 'అపి' ఉపసర్గ సంసర్గము - సంబంధమును దెలుపును, ఉదా -మధునోఽపి బిందుః=తేనెచుక్కైనను, సర్పిషోఽపి=నేతిచుక్కైనను. లేక- దేవదత్తమపి ఆనయ = దేవదత్తు నైనను తీసికొని రమ్ము. ఇట అన్య సంసర్గమును కూడ సూచించునని భావము.

"ఉపేత్యుపజనమ్"

ఉపజాయతే=ఉపజన మాధిక్యమ్ అధికం భవతీత్యర్థః.

అర్థము :- 'ఉప' అను నీ ఉపసర్గ అధిక్యమును దెలుపును. ఉదా- ఉపజాయతే అధిక మగును. ఉపపరార్థే హరేర్గుణాః = హరిగుణములు పరార్థసంఖ్య కంటె నెక్కువ.

"పరీతి సర్వతో భావమ్.

పరిధావతీతి=సర్వతో ధావతీత్యర్థః

అర్థము :- 'పరి' ఉపసర్గ సర్వతో భావమ్ = అన్నివైపులు అనునర్థ మును తెలుపును. ఉదా :- పరిధావతి=అన్నివైపుల పరుగెత్తును.

"అధీత్యు పరిభావమైశ్వర్యం వా"

అధితిష్ఠతి లోకమ్ అధిపతిరితి=అధ్యక్ష ఇత్యర్థః.

అర్థము :- 'అధి' ఉపసర్గ. ఉపరిభావమ్ = పైనఉండుట అనునర్థ మునుతెలుపును. వా=లేక ఈశ్వరుడను నర్థమును దెలుపును. ఉదా :- అధితిష్ఠతిలోకమ్=లోకముపైనసుండును, అధిపతిః=ఈశ్వరుడు.

"ఏవముచ్చావచాన్ అర్థాన్ ప్రాహుస్త ఉపేక్షితవ్యాః.

ఉచ్చావచాన్= అనేకవిధాన్ తే, ఉపసర్గాః ఉపేక్షితవ్యాః=జ్ఞాతవ్యాః

అర్థము :- ఏవమ్ = ఈవిధముగా ఉచ్చావచాన్ అర్థాన్=అనేక విధ ములగు నర్థములను, ప్రాహుః= ఉపసర్గలు తెలుపును. తే ఉపేక్షితవ్యాః= ఆయర్థములను బాగుగ పరీక్షించి తెలిసికొనవలెను.

ఇతి ప్రథమః పాదః - ప్రథమ పాదము సమాప్తము.

# అథ ద్వితీయః పాదః (రెండవపాదము)

నిపాత లక్షణ నిరూపణము

"అథనిపాతాః"

అధికారార్థోఽయ మథశబ్దః, అథ శబ్దాను శాసన మిత్యవత్.

అర్థము :- ఇంతకు పూర్వము ఉపసర్గల సామాన్య విశేష లక్షణములు చెప్పబడినవి. ఇప్పుడు, నిపాతాః=నిపాతములు వర్ణింపబడుచున్నవి. నిపాతములని వీనినెందుకు చెప్పుదురు ?.

"ఉచ్చావచే ష్వర్థేషు నిపతన్తి

అర్థము :- ఉచ్చావచేషు అర్థేషు = అనేకవిధములగు నర్థములందు నిపతన్తి = పడుచున్నవి- వాడబడుచున్నవని భావము. వీనికి అనేక అర్థములున్నవి, కావున నిపాతములనబడుచున్నవి.

"అప్యుపమార్థేఽపి, కర్మోపసంగ్రహార్థేఽపి పద పూరణాః"

అప్యుపమార్థే, కర్మోపసంగ్రహార్థే, అర్థోపసంగ్రహార్థే ఇత్యర్థః. కర్మశబ్దోహి అర్థ పర్యాయ వచనమితస్మిన్ శాస్త్రే. పదమేవ పూరయితవ్యం యేషామర్థః తే పదపూరణాః తదేతత్ త్రిధాత్వ మర్థభేద కృతం నిపాతానాం సమాసేన.

అర్థము :- అపి ఉపమార్థే = ఈనిపాతములలోకొన్ని ఉపమార్థమున ప్రయోగింపబడుచుండును. అపి కర్మోపసంగ్రహార్థే = కొన్ని అర్థోపసంగ్రహము నందును, మఱికొన్ని అపి పదపూరణాః=పదపూర్తి కొఱకు ప్రయుక్తములగును.

"తేషా మేతే చత్వార ఉపమార్థే భవన్తి"

తేషాం - సర్వేషాం మధ్యే ఏతే ఏవ చత్వారః-ఇవ, న, చిత్, ను, చ, ఉపమార్థే భవన్తి -ప్రయుజ్యన్తే.

అర్థము :- తేషాం = ఆనిపాతములలో ఏతే చత్వారః = ఈనాలుగు మాత్రమే ఉపమార్థే ఉపమానార్థమున ప్రయోగింపబడును. ఇవ,న,చిత్,ను

"ఇవేతి భాషాయాం చ" ఉపమార్థీయః లోకే,

అర్థము :- ఆనాలుగు నిపాతములలో 'ఇవ' అనునిపాతము లౌకిక సంస్కృతమునందును ప్రయుక్త మగును.

"అన్వధ్యాయం చ అగ్నిరివేంద్ర ఇవేతి"


66,981

ఛన్దసి చేత్యర్థః- ఉదాహరతి - అగ్నిరివేన్ద్ర ఇవేతి. తపసః ఛన్త్రో మన్యుర్నామ, తస్యేద మార్షమ్.

"అగ్నిరివ మన్యో త్విషితః సహస్వ" హేమన్యో! అగ్నిరివ త్విషితో దీప్తస్త్వం తేజసా సహస్వ, అభిభ వాస్మచ్ఛత్రూన్-భాషాయామ్ అగ్నిరివ తీక్ష్ణః, ఇంద్ర ఇవ విక్రాన్తః.

అర్థము :- అన్వధ్యాయం చ=వేదము నందును. 'ఇవ' ఉపమార్థము నందు వచ్చును. కొన్నినిపాతములు వేదమునందే వచ్చును. మఱికొన్ని లోకభాషయందు వేదభాషయందు రెండింటియందును, ప్రయుక్తములగును. అందువలన నిట 'ఇవ' అను నిపాతము భాషాయాం అన్వధ్యాయం చ లోకవేదములందు అని వేఱుగాచెప్పబడినది.

లోకభాషఉదా :- అగ్నిఃఇవ=అగ్నివలె, ఇంద్రః ఇవ=ఇంద్రునివలె,

ఛందసి=వేదమునందు, ఉదా:- "అగ్నిరివ మన్యోత్విషితః సహస్వ" మన్యో! ఓమన్యూ, అగ్నిరివ త్విషితః=అగ్నివలె ప్రజ్వలించిన నీవు, సహస్వ =మాశత్రువులను సహింపుము.

"నేతి ప్రతిషేధార్థీయో, భాషాయామ్"

ప్రతిషేధః అర్థః ప్రయోజనం యస్య స ప్రతిషేధార్థః ప్రతిషేధార్థ ఏవ ప్రతిషేధార్థీయః ఏవం విచికిత్సార్థీయ ఇత్యాద్యపి అథవా. ప్రతిషేధస్యాపవర్గశ్చ ప్రతిషేధార్థః తస్యాయం ప్రతిషేధార్థీయః ఏవమన్యత్రాపి.

అర్థము :- 'న' అను ఈనిపాతము ప్రతిషేధార్థీయః నిషేధార్థమును లోకభాషయందు తెలుపును.

'ఉభయ మన్వధ్యాయమ్"

అన్వధ్యాయమ్=ఛందసి 'న' ఇతిప్రతిషేధార్థీయః ఉపమార్థే చ.

అర్థము :- 'న' ఈనిపాతము, అన్వధ్యాయమ్ వేదమునందు ఉభయమ్=రెండర్థములతో-నిషేధార్థమునందు, ఉపమార్థమునందును వచ్చును ఎట్లన-

నేంద్రం దేవ మమంసత ఇతిప్రతిషేధా
"ర్థీయః పురస్తాదుపచార స్తస్య యత్ ప్రతిషేధతి"

నేంద్రం దేవ మాత్మనో దీపయితారమమన్యంతాదిత్యరశ్మయ ఇతి శేషః. అత్ర న ప్రతిషేధే.

అర్థము :- ఇంద్రం దేవం న అమంసత=ఆదిత్యకిరణములు, దేవం= ఇంద్రుని, న అమంసత = తమ్ము ప్రకాశింపజేయుదేవుని, న అమంసత = అంగీకరింపలేదు. ఇట ప్రతిషేధార్థమున 'న' ప్రయోగింపబడినది. యత్ ప్రతిషేధతి=దేనిని నిషేధించునో తస్య-దానికి ఆపదమునకు- పురస్తాత్ = ముందు, ఉపచారః నిషేధార్థక 'న' ప్రయోగింపబడును. అనగా ప్రతిషే ధార్థక 'న' నిపాతము గుర్తించుటెట్లనగా, 'న' నిపాతము ప్రతిషిధ్యమాన వస్తువునకు వస్తుబోధక పదమునకు ముందు ప్రయోగింపబడును.

ఉదా :- "ఇంద్రం దేవం న అమంసత"

**"దుర్మదాసో న సురాయామ్" ఇత్యుప మార్థీయః ఉపరిష్టాదు పచార స్తస్య యేనోపమిమీతే" దుర్మదాసో న సురాయామితి'**

(ఋక్. ౫.౭.౧౯.౨)

యథా కుత్సితమదాః కేచిత్ పురుషాః సురాయాం పీతాయాం సత్యాం యుధ్యేరన్, ఏవమ్ పురస్తాదగ్రే, ఉపరిష్టాత్ పశ్చాత్.

అర్థము :- సురాయాం ... సత్యామ్ - సురత్రాగిసమీపట దుర్మ దాసః న=కుత్సిత మదముగల పురుషులవలె, యుధ్యేరన్ = పోరాడసాగిరి. ఇతి ఉపమార్థీయః. ఇట 'న' నిపాతము ఉపమార్థమున వచ్చినది దేనితో ఉపమింపబడునో, తస్య ఉపరిష్టాత్=దానికి తదుపరి, ఉపచారః=ఉపమా నార్థక 'న' నిపాతము ప్రయోగింపబడు చుండును.

ఉదా:- 'దుర్మదాసో న...'అనుమంత్రము

**"చిదిత్యే షోఽనేకకర్మా"**

చిదిత్యేషోఽనేకార్థోపి సన్నుపమార్థీయః ప్రసంగాదత్రోదాహృతః

అర్థము :- 'చిత్' ఈనిపాతము, ఏషః అనేకకర్మా = అనేక అర్థ ములు కలది. ఈశాస్త్రమున అన్నిచోటల కర్మశబ్దమునకు అర్థము అర్థమని గ్రహింపవలయును.

**"ఆచార్యశ్చిదిదం బ్రూయాత్ ఇతిపూజాయామ్ ఆచార్యః**

కస్మాత్?ఆచార్యః ఆచారంగ్రాహయతి, ఆచినోతిఅర్థాన్ ఆచినోతి బుద్ధిమితి వా॰

ఆచార్య ఏవం బ్రూయాత్, కోఽన్యః ఏవం వక్ష్యతీతి ఆచారం - సదాచారం గ్రాహయతి- శిక్షయతి.

అర్థము :- ఆచార్యః చిత్-ఆచార్య ఇదం బ్రూయాత్ = ఆచార్యుడు దీనిని చెప్పగలుగును. ఇతి పూజాయామ్ = ఈవాక్యమున "చిత్" పూజార్థమున వాడబడినది. అనగా ఈదురూహ - అర్థమును ఆచార్యుడు తప్ప ఇతరుడు చెప్పజాలడని భావము. 'చిత్' పదమిట ఆచార్యుని మహత్త్వమును సూచించును. ప్రసంగవశమున ఆచార్యశబ్దమునకు నిరుక్తి చెప్పుచున్నారు.

ఆచార్యః కస్మాత్ ? ఆచార్యుడు అనునామమెందులకు కలిగినది ? అని ప్రశ్నించి ఆచారం గ్రాహయతి = ఆచారమును గ్రహింపజేయును. విద్యార్థికి ఆచారము - నడతను నేర్పును, ఆచినోతి అర్థాన్ = పదార్థముల సంచయ మొనర్చును - విద్యార్థికి సూక్ష్మాతి సూక్ష్మ పదార్థముల జ్ఞానము కలిగించునుఆచినోతి బుద్ధిమ్ ఇతి వా= లేక విద్యార్థియొక్క బుద్ధిని వృద్ధి చేయును. కావున ఆచార్యుడనబడునని భావము.

"దధిచిదిత్యుపమార్థే"

అత్ర చిదుపమాయాం దధిరూప ఓదన ఇతి భావః.

అర్థము :- దధిచిత్ ఇతి - ఇట చిత్ ఉపమా అర్థమున వచ్చును. దధిచిత్ -దధివలె .

"కుల్మాషాంశ్చిదాహరే త్యవకుత్సితే,కుల్మాషాః కులేషు సీదన్తి

కుల్మాషా నపి నింద్యానితి శేషః

తావదాహరేతి కిం వాన్యదాహరిష్యసి ఇతి నిందాయామ్ చిత్.

అర్థము :- 'చిత్' ఈనిపాతము, అవకుత్సితే = అధికనిందయందు కూడ వచ్చును. ఉదా : కుల్మాషాన్ చిత్ ఆహర= కుల్మాషలను తీసికొని రమ్ము.కుల్మాషలు అనగా సగము పక్వమైన గోధుమలు, శనగలు మున్నగునవి. కుల్మాషాః కులేషు సీదన్తి= కుల్మాషలు ధాన్యములతో నీచములుగా నెంచబడును. కావున కుల్మాషలనబడును.

"ను' ఇత్యేషోఽనేక కర్మా" అనేకార్థః

అర్థము : 'ను' నిపాతము అనేకార్థములు తెలుపును

"ఇదం ను కరిష్యతీతి హేత్వపదేశే"

హేతుర్ నిమిత్తమిత్యర్థః తత్కథనే నుః

అర్థము :— 'ను' నిపాతము హేతువును తెలుపును.

ఉదా :- ఇదం ను కరిష్యతి = ఈ కారణముచే నిది చేయును.

"కథం ను కరిష్యతీత్యనుపృష్టే - నన్వేతదకార్షీదితి చ."

నన్వయమకార్షీదేతత్ కథం అసంభావ్యత్వాదితి భావః. అత్ర ను ననుప్రశ్నే.

అర్థము :— అనుపృష్టే = అను ప్రశ్నమునను 'ను' నిపాతము వచ్చును. ఉదా :- కథం ను కరిష్యతి అరే=అతడు కార్యమును చేయుదునని చెప్పుచున్నాడుగదా! కాని కథం ను కరిష్యతి! ఎట్లు చేయును? ఇదియే అనుప్రశ్న. ఈయనుప్రశ్నముననే 'నను' అను నిపాతముకూడ వచ్చును. ఉదా :- నను ఏతదకార్షీత్ ఇతి. అరే! ఇతడుకార్యము నింతకు ముందు చేసినాడు. ఇతడెట్లు చేయునని నీవెట్లు చెప్పుచున్నావు? ఇతడింతకుముందును చేసియేయున్నాడు.

"అథాప్యుపమార్థే భవతి"

అథాపి అయం నుః ఉపమార్థే భవతి తద్యథా.

అర్థము :— అథ అపి = మఱియు 'ను' నిపాతము ఉపమార్థమునను వచ్చును. ఎట్లన!

వృక్షస్య ను తే పురుహూతవయాః.

వృక్షస్యేవ తే పురుహూతశాఖాః. వయాః శాఖాః.

వేతేర్ వాతాయనా భవన్తి. శాఖాః ఖశయాః శక్నోతేర్వా.

హే పురుహూత! ఇంద్ర! అస్మద్యజ్ఞాగమనమార్గా వృక్షస్య తవ వయాః శాఖా ఇవ శిలీభూతా - నష్టాః తవాత్రాగమనాత్ - వాతాయనాః - వాతాధారాః, ఖశయాః - ఖమాకాశమ్.

అర్థము: – పురుహూత హేఇంద్ర! వృక్షస్య వయాః సువృక్షశాఖలవలె, తే = నీయొక్క, ఊతయః = రక్షణలు నలుదిశల వ్యాపించియున్నవి. ఈవాక్యమున 'సు' ఉపమానార్థమున నున్నది. వయాః = శాఖలు, వేతేః వయ'వీ'ధాతువువలన వయ సిద్ధించును. వాతాయనా భవన్తి వాతః అయనం యేషాం తే వాతాయనాః వేనిక - వాతము అయనమో స్థానమో యగువి వాతాయనములు. అనగా వాయువుచే చలించునవి - కావున వయాః = శాఖలు అని యర్థము. వాయువునందు శయనించునవి-ఉండునవి కావున శాఖలు అనబడును. శక్నోతేర్ వా = లేక 'శక్' ధాతువుచే సిద్ధించును కావున శాఖలు అనబడును. ఈశాఖలు మూలములనుండి తమ పోషణమును సంపాదించుసామర్థ్యముకలవి యగుటచే శాఖలనబడునని భావము.

## అర్థోపసంగ్రహనిపాతములు

"అథ యస్యాగమాదర్థపృథక్త్వమహవిజ్ఞాయతే
న త్వౌద్దేశికమివ విగ్రహేణ పృథక్త్వాత్
స కర్మోపసంగ్రహః.

స కర్మోపసంగ్రహః భవతి ఇతి శేషః. కర్మపదేన అర్థగ్రహణమ్. యస్యాగమాదధ్యాహరాత్ అశ్రూయమాణస్యైవ నిపాతస్య పృథక్త్వమహ - పృథగ్భావ ఏవ విజ్ఞాయతే. తద్యథా-దేవదత్తయజ్ఞదత్తౌ దేవదత్తశ్చ యజ్ఞదత్తశ్చేతి.

అర్థము :— యస్యాగమాదశ్రూయమాణస్యైవ యస్య నిపాతస్యాధ్యాహరాత్ = అశ్రూయమాణమగు నే నిపాతముయొక్క అధ్యాహరము వలన అర్థపృథక్త్వమే, విజ్ఞాయతే = తెలియబడునో, న తు ఔద్దేశికమివ = కాని యది దేవదత్తుడు, యజ్ఞదత్తుడు మున్నగు ఉద్దిష్టపదార్థములవలె స్వతంత్రముగ ఉండదో, విగ్రహేణ పృథక్త్వాత్ = 'దేవదత్తయజ్ఞదత్తౌ' మున్నగుతావులందు విగ్రహమువలన నె పృథక్త్వమేర్పడునో, స కర్మోపసంగ్రహః = అది కర్మోపసంగ్రహము - అర్థోపసంగ్రహము అనబడును.

"దేవదత్తయజ్ఞదత్తౌ పచేతే" అను నీ వాక్యమునందు క్రియారూప అర్థమునందు ఉపసంగ్రహము చేయునట్టిది వాక్యమున అశ్రూయ

మాణము. అందువలననే అధ్యాహ్రియమాణము, అధ్యాహారము చేయ బడుచున్న 'చ' అనునిపాతమే యైయున్నదని తాత్పర్యము.

ఈ 'చ' నిపాతమువలననే దేవదత్తుడు యజ్ఞదత్తుడు అను పార్థక్యము తెలియుచున్నది. మఱియు నాపార్థక్యముయొక్క ఉపసంగ్రహ-కలయిక కూడ 'పచేతే' ఇరువురు వండుచున్నారు అను క్రియయందును ఈ 'చ' నిపాతమే కలుగజేయుచున్నది. అనగా నిట 'చ' నిపాతము నుంచకున్నచో దేవదత్తయజ్ఞదత్తుల పార్థక్యము తెలియదు, ఉపసంగ్రహమును కాజాలదు. ఉపసంగ్రహము, పృథక్త్వమునను నీరెంటిని ఈ 'చ' నిపాతమే చేయించు చున్నది. కాని, ఈయధ్యాహ్రియమాణ 'చ' నిపాతము 'గావఃపురుషాః' గోవులు, పురుషులు, అనువానివలె ఔద్దేశికము - ఉద్దిష్ట - వస్తువు కాదు. ఇదియొక స్వతంత్రవస్తువును కాదు. కారణమేమన పృథక్త్వమట విగ్రహమువలననె కలుగును.

"చ ఇతి సముచ్చయార్థఉభాభ్యాం సంప్రయుజ్యతే - 'అహం చ త్వం చ వృత్రహన్" ఇతి.

హేవృత్రహన్ - ఇన్ద్ర! అహం చ త్వం చ సంయుజ్యావ ఇతి శేషః.

అర్థము :— ఆ యుక్తోపసంగ్రహనిపాత మెట్లన్నదియన :— సమా ధానము - ఆయుక్తోపసంగ్రహనిపాతము 'చ' ఇయ్యది సముచ్చయార్థమున వచ్చును. సముచ్చయమనగా రాశీకరణము - ఏకత్రీకరణము - ఒకచో నన్వయించుట, ఆ 'చ' నిపాతము ఉభాభ్యాం సంప్రయుజ్యతే - రెండు పదములతోను సంయుక్తమగును.

ఉదా :— అహం చ త్వం చ వృత్రహన్, నేనును నీవును అను నీ వాక్యమున నిపాతమునను అహమ్‌తోను త్వమ్‌తోను - నేను నీవు అను రెండుపదములతోను సంబంధమున్నది.

"ఏతస్మిన్నేవాథ-దేవేభ్యశ్చ పితృభ్య ఆ ఇత్యాకారః"

అథాప్యాకారః - ఏతస్మిన్నేవార్థే సముచ్చయార్థే దేవేభ్యశ్చ పితృభ్య ఆ ఇతి.

అర్థము :— ఏతస్మిన్నేవ అర్థే = ఈయర్థమునందే ఈసముచ్చయార్థమునందె దేవేభ్యశ్చ పితృభ్య ఆ 'ఇతి ఆకారః' అనునీమంత్రమునందు 'ఆ' అనునిపాతము వచ్చును. అనగా 'చ' నిపాతమువలె 'ఆ'నిపాతముకూడ సముచ్చయార్థమున వచ్చునని భావము.

**"వేతి విచారణార్థే–హన్తాహం పృథివీమిమాం**
**నిదధానీహ హ వేహ ఇతి"**

హన్త ఇదానీ మేవ అహమిమాం పృథివీమ్ ఇహ ద్యులోకే. అథవా ఇహ చకిమేస్మిన్నంధే. ఇహ వా సర్వే నిదధాని అవస్థాపయామి-అతః స్థానాదుద్ధృత్య, ఇన్ద్రోలవః తస్యాయమార్షమ్.

ఇతి చతుర్థః ఖండః

అర్థము :- 'వా' ఇతి నిపాతము విచారణార్థే విచారించుట అను నర్థమున వచ్చును. ఎట్లన—

'అహమ్ ఇమామ్...వా ఇతి' మంత్రమున ఈపృథివిని, ఈయంతరిక్షమున నుంతునా లేక ద్యులోకమున నుంతునా అని విచారించుచున్నాను. ఇట్లు ఈమంత్రమున 'వా' విచార-ఆలోచనార్థమున ప్రయోగింపబడినది.

చతుర్థఖండము సమాప్తము

**అథాపి సముచ్చయార్థే భవతి, వాయుర్వా**
**త్వా మనుర్వాత్వా ఇతి.**

వేతి అత్ర మంత్రే సముచ్చయార్థే భవతి. వాయుర్వా త్వాం మనుర్వా త్వా గంధర్వాః సప్తవింశతిః.

యు. సం. ౯. ౭ హేఅశ్వ ! వాయుశ్చ త్వాం మనుశ్చ త్వాం గంధర్వా ఏతే సప్తవింశతి ర్యుంజన్తి త్వామస్మిన్ రథే.

అర్థము :- అథాపి = మఱియు, 'వా' నిపాతము సముచ్చయార్థే భవతి = సముచ్చయార్థమునను వచ్చును. ఉదా :— హేఅశ్వ ! వాయుర్వాత్వా మనుర్వాత్వా = ఓయశ్వమా నిన్ను వాయువు మనువు రథమున జోడింతురు 'వా' ఇతి సముచ్చయార్థమున ప్రయుక్తమైనది 'చ' వలె.

**అహ ఇతి చ హ ఇతి చ వినిగ్రహార్థీయౌ పూర్వేణ సంప్రయుజ్యేతే - అయమహేదం కరోత్వయ మిదమిదం హ కరిష్యతి, ఇదం న కరిష్యతి ఇతి.**

ద్వావప్యేతౌ వినిగ్రహార్థీయౌ. వినిగ్రహః-పృథగ్భావః. అయ మహ యజ్ఞదత్తో గాః పాలయతు. అయం దేవదత్తో భుఙ్క్తామ్ ఇతి. యజ్ఞదత్త ఇదం హ కరిష్యతి. ఇదం న కరిష్యతీతి.

అర్థము :- అహ ఇతి చ 'అహ' అను నిపాతము హ ఇతి చ 'హ' అను నిపాతము రెండును, వినిగ్రహార్థీయౌ = వినిగ్రహ - వేఱుగుట యను నర్థమున వచ్చును. పూర్వేణ సంప్రయుజ్యేతే = పూర్వవాక్యగతమగు నర్థముతో కలిసియుండును. ఉదా:— అయమహేదం కరోతు అయమ్ అహ దేవదత్తో గాః పయః పాయయతు. ఈదేవదత్తుడు గోవులకు నీరు త్రాపును గాక! అయమిదమ్ అయం యజ్ఞదత్తో భుంక్తామ్ - ఈయజ్ఞదత్తుడు భుజించునుగాక! ఇదం హ కరిష్యతి - దేవదత్తుడిది చేయును. ఇదం న కరిష్యతి-ఇది చేయడు. అహ 'హ' అను నీరెండును వాక్యములను వేఱు చేయును. దేవదత్తుడు గోవులకు నీరుత్రాపును యజ్ఞదత్తుడు భుజించును, ఈరెండుకార్యములు భిన్నములు-భేదమును కలిగించునది 'అహ' నిపాతమే. ఇట్లే 'హ' నిపాతముకూడ దేవదత్తుడిది చేయును, ఇదిచేయడు అను రెండువాక్యములను వేఱుచేసి వానిలోగల భేదమును తెలుపును.

**అథాప్యుకార ఏతస్మిన్నేవార్థే ఉత్తరేణ - మృషేమే వదన్తి సత్య ము తే వదన్తి.**

వినిగ్రహార్థే ప్రయుజ్యతే తద్యథా. మృషేమే వృషలాః వదన్తి. సత్య ము తే బ్రాహ్మణాః వదన్తి ఇతి.

అర్థము :- అథాపి = మఱియు, ఉకారః = 'ఉ' నిపాతముకూడ, ఏతస్మిన్ ఏవ అర్థే = ఈయర్థము - వినిగ్రహార్థమునందే వచ్చును. ఉత్తరేణ = మఱియు పైరెండువాక్యములలోని రెండవవాక్యముతో కలసియుండును. ఉదా :- మృషా ఇమే వదన్తి - ఈవృషలురు అసత్యము చెప్పుచున్నారు. సత్య ము తే వదన్తి = ఆబ్రాహ్మణులు సత్యము చెప్పు

చున్నారు. ఈరెండువాక్యములలోను భేదమున్నది. దానినే 'ఉ' నిపాతము తెలుపుచున్నది.

"అథాపి పదపూరణః" ఇద ము తదు.

అథాపి ఉకారః పదపూరణో భవతి. ఇదం తత్ జ్యోతిః యు తే జనాః కథయన్తి అత్రోకారః పదపూరణః.

అర్థము :— మఱియు నీ 'ఉ'కారము పదపూర్త్యర్థమునందును వచ్చును. ఉదా :- ఇద ము, తదు ఈపదములలోని 'ఉ' అనుదాని కర్థము లేదు. ఇదమ్ = ఇది, తత్ = అది ఈయర్థమే ఇదము తదు అనుపదములకర్థము - ఈపదములలోని 'ఉ' పదపూర్తికొఱకు వచ్చినదని భావము.

'హీత్యేషోఽనేకకర్మా ?

'హి' ఇతి ఏష నిపాతోఽనేకార్థః.

అర్థము :- 'హి'అను నిపాతము అనేకార్థములు కలది.

ఇదం హి కరిష్యతీతి హేత్వపదేశే. కథం హి కరిష్యతీత్యను పృష్టే. కథం హి వ్యాకరిష్యతీత్యసూయాయామ్.

హేతోరపదేశః ఛద్మ హేత్వపదేశః. అనుపృష్టమనుప్రశ్నః. పరపరి వాదోఽసూయే త్యుచ్యతే.

అర్థము :- 'హి' నిపాతము హేతువును చెప్పును. ఉదా :— దేవ దత్తుడు, ఇదమ్ = ఈకార్యమును, హి = ఈకారణముచే, కరిష్యతి = చేయును, అనుపృష్టే = అనుప్రశ్నమునందును వచ్చును - ఉదా :- దేవదత్తుడు ఇదమ్ — ఈకార్యమును కథం హి కరిష్యతి=ఎట్లుచేయును ? అసూయాయామ్ = అసూయా=నిందయందును 'హి' నిపాతమువచ్చును. ఉదా :— కథం హి వ్యాకరిష్యతి ? ఇతడెట్లు వ్యాఖ్యానముచేయగలడు ? ఇతడెక్కడచదివినవాడుకూడ కాదుకదా ! అనిభావము.

"కిలేతి విద్యాప్రకర్షే" ఏవంకిలేతి.

విజ్ఞానాతిశయఇత్యర్థః ఏవం కిల ఏతదాసీదుద్యద్ధమితి.

అర్థము :- 'కిల' అను నిపాతము, విద్యాప్రకర్షే=విద్యోన్నతియందు ప్రయుక్తమగును.

ఉదా :- ఏవం కిల - ఎక్కడినుండియో విని దానిని మనస్సులో బాగుగనిలుపుకొని ఇతరునితో 'ఏవం కిల ఆసీత్ యుద్ధం తత్ ఇతి = ఆయుద్ధమావిధముగా జరిగెను' అని చెప్పును.

**అథాపి న నను ఇత్యేతాభ్యాం సంప్రయుజ్యతే అనుపృష్టే న కిలైవమ్ నను కిలైవమ్.**

అథాపి స నను ఇత్యేతాభ్యాం సంయుక్తః కిలేత్యయం ప్రయుజ్యతే అనుపృష్టే అర్థే. న కిలైవమ్ నను కిలైవమ్ - ఇతి.

అర్థము :- మఱియు 'కిల' నిపాతము అనుపృష్టే అనుప్రశ్నార్థమున న, నను ఇత్యేతాభ్యామ్ 'న, నను', అను రెండింటితో సంప్రయుజ్యతే= కలిసివచ్చును. ఉదా :- న కిలైవమ్ ? ఇట్లుకాదా ? నను కిలైవమ్ = ఇట్లేనా ?

**"మేతి ప్రతిషేధే" మాకార్షీర్మా హార్షీ రితి చ.**

మేతి అయం నిపాతః ప్రతిషేధే. తద్యథా మా కార్షీ ర్మా హార్షీరితి అకార్యం ధనం చ.

అర్థము :- 'మా' అనునిపాతము, ప్రతిషేధే నిషేధార్థమున వచ్చును. ఉదా :- మాకార్షీః = చేయవద్దు, మాహార్షీః = హరింపవద్దు.

**ఖల్వితి చ - ఖలు కృత్వా, ఖలు కృతమ్.**

ఖల్వితి చ ప్రతిషేధే అర్థే - తద్యథా - ఖలుకృత్వా. అకృత్వేత్యర్థః-లోకేఽపి ఖలూక్త్వా 'ఖలు వాచిక'మితి మాషే - స వాచ్యమిత్యర్థః.

అర్థము :- ఖలు ఇతి చ = మఱియు 'ఖలు' అను నిపాతముకూడ నిషేధార్థకమే యగును.

ఉదా :- ఖలు కృత్వా = అకృత్వా = చేయక, ఖలుకృతమ్ = చేయబడలేదు.

**"అథాపి పదపూరణః" – ఏవం ఖలు తద్ బభూవ ఇతి.**

అథాపి - ఖల్విత్యయం నిపాతః పదపూరణో భవతి - తద్యథా ఏవం ఖలు తద్ బభూవ ఇతి.

అర్థము :- అథాపి = మఱియు 'ఖలు' అనునిపాతము పదపూర్తి కొఱకు వచ్చును. ఉదా :— ఏవం ఖలు తద్ బభూవ = అదియిట్లాయెనది.

**శశ్వదితి విచికిత్సార్థీయో భాషాయామ్ – శశ్వదేవమిత్యను పృష్టే. ఏవం శశ్వదిత్యస్వయంపృష్టే.**

ఛన్దసి పునరస్యేష్వప్యర్థేషు భవతి - శశ్వః విచికిత్సార్థీయః సంశయార్థః.

అర్థము :- శశ్వత్ ఇతి - 'శశ్వత్' అను నీనిపాతము భాషాయామ్ = లోకమునందు, విచికిత్సార్థీయః = సంశయార్థమందే ప్రయుక్తమగును. కాని కొండొకచో రెండవసారి ప్రశ్నించినపుడు అనుప్రశ్నమున శశ్వత్ మొదటి ప్రయోగింపబడునని వివేకము. ఉదా :— శశ్వత్ ఏవమ్ = ఇది యిట్లైనా? మఱియు అస్వయంపృష్టే - రెండవదాని ప్రశ్నయందు, ఏవంశశ్వత్ = అవును ఇట్లే ఉన్నది. అనగా ముందుప్రశ్నలో 'శశ్వత్ ఏవమ్' అస్వయంప్రశ్నయందు 'ఏవం శశ్వత్' ఈరెండువాక్యములలో మొదటివాక్యమున 'శశ్వత్' పదము ముందు, రెండవదానియందు శశ్వత్ పదము తరువాత ప్రయోగింపబడినట్లు గుర్తించునది.

**"నూనమితి విచికిత్సార్థీయో భాషాయామ్. ఉభయమన్వ ధ్యాయం విచికిత్సార్థీయశ్చ పదపూరణశ్చ."**

విచికిత్సానామవివేకపూర్వకోఽవధారణాభిప్రాయః. అన్వధ్యాయం-ఛందసి పునరయమర్థద్వయే భవతి. విచికిత్సార్థీయశ్చ పదపూరణశ్చ.

అర్థము :- 'నూనమ్' అను నీనిపాతము, భాషాయామ్ = లోకమునందు, విచికిత్సార్థీయః = సందేహార్థకము. అన్వధ్యాయమ్=వేదమునందు ఉభయమ్ = రెండర్థములందును వచ్చును=పాదపూరణమునందు, సందేహార్థమునను రెండర్థములందు వచ్చును.

ఉదా :– ముందు నూనమను నిపాతమును ప్రతిపాదించుమంత్రమును ఉదాహరణముగా నిచ్చి, తదుపరి ఉదాహరణము నిచ్చుచున్నాము.

"అగస్త్య ఇంద్రాయ హవిర్ నిరూప్య మరుద్భ్యః సంప్రదిత్సాం చకార. స ఇంద్ర ఏత్య పరిదేవయాం చక్రే."

సంప్రదిత్సాం చకార = సంప్రదాతు మైచ్ఛదిత్యర్థః, స ఇన్ద్రః ఏత్య పరిదేవయాంచక్రే - పరిదేవనా - మన్యుపూర్వకో విలాపః.

అర్థము :- అగస్త్యుడు ఇంద్రునకు హవిని సిద్ధముచేసి మరుత్తుల కిచ్చెను. ఇంద్రుడువచ్చి మన్యుపూర్వకముగ విలపించెను. ఆవిలాపమును తెలుపు నీక్రిందిమంత్రమునందే 'నను' నిపాతము సందేహార్థమున ప్రయోగింపబడినది - మంత్రః—

"న నూనమస్తి నో శ్వః కస్తద్ వేద యదద్భుతమ్ అన్యస్య చిత్తమభిసంచరేణ్య ముతాధీతం వినశ్యతి."

న నూన మస్త్యద్యతనమ్. నో ఏవ శ్వస్తనమ్. అద్య అస్మిన్ ద్యవి. ద్యురిత్యహ్నో నామధేయమ్, ద్యోతత ఇతి సతః. శ్వ ఉపాశంసనీయః కాలః. హ్యో హీనః కాలః. కస్తద్వేద యదద్భుతమ్. కస్తద్ వేద యదభూతమ్, ఇదమపీతరత్ అద్భుత మభూతమివ. అన్యస్య చిత్తమభిసంచరేణ్యమ్ అభి సంచారి, అన్యో నానేయః. చిత్తం చేతతేః. ఉతాధీతం వినశ్యతి ఇతి. అప్యాధ్యాతం వినశ్యతి ఆధ్యాత మభిప్రేతమ్.

'న నూన' మస్తి (ఋ. సం. ౨-౪-౧౦-౧) అద్యతనం హవిర్ మమ నాస్తీతి. నోశ్వః-శ్వస్తనే కా ప్రత్యాశా కో హి నామ తద్వేద జానాతి యదద్భుత మనుత్పన్నమ్. యస్మాత్ అన్యస్య చిత్తమభిసంచరేణ్యమ్ సంచరణశీల మన వస్థిత మిత్యభిప్రాయః. అధీతమ్ - ఆధ్యాతమభిప్రేతం వినశ్యతి. శ్వ ఉపాశంసనీయః కాలః ఉపగమ్యః. హ్యో హీనః కాలః అతిక్రాన్తో హి స భవతి. అద్భుతమ్ అభూతమ్. శౌనకవర్షాది అభూతమివ కాదాచిత్కత్వాత్.

అర్థము - 'న నూనము అస్తి' దీనియందు భాష్యకారుడు 'అద్యతనమ్' అనుపదమును అధ్యాహారము చేసెను. 'న' అను ప్రతిషేధమునకు ప్రతిషేధ్యము కావలసియుండెను. అందులకు 'అద్యతనమ్'ను అధ్యాహారముచేసి యుల్లర్థము చెప్పెను. 'న నూనమస్తి అద్యతనమ్ నేడు ఈహవి లభింపలేదు. ఏది నేడు లభింపలేదో 'నో ఏవ శ్వస్తనమ్' అది రేపునాడ లభింపదు. లేనది లభించునని యెట్లాశింపగలము ? కస్తత్ వేద ? దాని నెవడెఱుగును ? యద్ అద్భుతమ్ అది భవిష్యత్తునకు సంబంధించినది కదా! అన్యస్య - అస్థిరచిత్తుని, చిత్తమ్ - మనసు అభిసంచరేణ్యమ్ = చంచలమగును, ఉత అధీతం వినశ్యతి - మఱియు నేను కోరినహవి నేడు నష్టమైనది రేపు ఆశింపగలిగినదగునా ? అద్య అస్మిన్ ద్యవి అద్య అనగా అస్మిన్ ద్యవి - నేటిపగలని అర్థము. ద్యుః అనగా అహ్నఃనామధేయమ్ - దినమునకుపేరు. ద్యోతతే ఇతి సతః ప్రకాశించునది కావున ద్యుః=పగలు, శ్వః ఉపాశంసనీయః కాలః = ఆశింపదగినకాలము - మఱుదినము. హ్యః హీనః కాలః = గతించినకాలము - నిన్న - అనబడును.

కః తద్ వేద ? దానినెవడెఱుగును ? తత్ అద్భుతమ్ - అనగా అభూతమివస్థితములేనిదానివలె తోచునది. ఇంతవఱకు నెన్నడు లేనిదివలె తోచునది. అద్భుతము విలక్షణవాచకము అద్భుతము - అభూతసదృశము, శోణితవృష్టి = రక్తవృష్టి ఎప్పుడు నెఱుగునదికాదు. అన్యస్య చిత్తమ్ అభిసంచరేణ్యమ్ = అభిసంచారి - చంచలము - అన్యఃనానేయః = అన్యుడనగా నానేయుడు - నానాయాః అపత్యమ్ — నానావిచారములుగలవాడు అస్థిరబుద్ధుడు. లేక - న ఆనేయః నానేయః = తీసికొనిరాదగినవాడుకాడు, నీచుడు - చిత్తం చేతతేః దేనివలన పదార్థములజ్ఞానము పొందునో యది చిత్తము (చేతతి అనేన పదార్థాన్ చిత్తమ్) ఉతాధీతం వినశ్యతి = ఉత, అపి, అథ, ఇవి యన్నియువేదమున సమానార్థకములు ఉత = మఱియు ఆధీతమ్ - అధ్యాతమ్ అభీష్టము - అభిప్రేతము వినశ్యతి = నష్టమైనది.

ఇతి ద్వితీయఃపాదః

ద్వితీయ పాదము సమాప్తము

## అథ తృతీయః పాదః

మూడవ పాదము ప్రారంభము

"నూనం సా తే ప్రతివరం జరిత్రే దుహీయదింద్ర దక్షిణా మఘోనీ శిక్షా స్తోతృభ్యో మాతి ధగ్భగో నో బృహద్ వదేమ విదథే సువీరాః."

సా తే ప్రతిదుగ్ధాం వరం జరిత్రే, వరో వరయితవ్యో భవతి. జరితా గరితా. 'దక్షిణా మఘోనీ' మఘవతీ, మఘమితి ధననామధేయమ్. మంహతేర్ దానకర్మణః. దక్షిణా దక్షతేః సమర్ధయతి కర్మణో వ్యృద్ధం సమర్ధయతి. ఇతి. అపి వా ప్రదక్షిణా గమనాత్. దిశ మభిప్రేత్య దిగ్ఘస్తప్రకృతిః దక్షిణో హస్తో దక్షతే రుత్సాహకర్మణః.

దాశతేర్వా స్యాద్ దానకర్మణః. హస్తో హన్తేః ప్రాశుర్హననే. దేహి స్తోతృభ్యః కామాన్. మాస్మా నతిదంక్షీ ర్మాస్మా నతిహాయ దాః. భగో నో అస్తు. బృహద్ వదేమ స్వే వేదనే. భగో భజతేః బృహదితి మహతో నామధేయమ్ పరివృఢం భవతి. వీరవన్తః కల్యాణవీరా వా. వీరో వీరయ త్యమిత్రాన్. వేతే ర్వా స్యాద్ గతికర్మణః వీరయతేర్వా.

సా - దక్షిణా జరిత్రే స్తువతే - యజమానాయ. మఘోని - మఘవతీ, హిరణ్యధాన్యాదిధనసంయుక్తా దుహ్యత ఇత్యర్థః. కిం చ శిక్ష దేహి కస్మై? స్తోతృభ్యః ఋత్విగ్భ్యోఽనుకామాన్. మాతిధక్ మాస్మా నతిహాయాతిత్యో న్యేభ్యో దేహీత్యర్థః. అస్మభ్యం తావత్ పూర్వం దేహి తతోఽన్యేభ్యోఽపీ త్యభిప్రాయః. భగో నః. ధనం నోఽస్తు యేన కిం కుర్యామ? బృహద్ వదేమ-దీయతాం భుజ్యతామితి క్వ? విదథే యజ్ఞే. అథవా స్వగృహే. కిం చ యుష్మదనుగ్రహాచ్చ సువీరాః వీరవన్తో భవేమ. పుత్రవన్తో యథా స్యా పుత్రాః. ఏవమయం మత్వర్థీయః నుః. అథ పుత్రవన్త ఏవ కల్యాణవీరా ఇతి సమస్తార్థః - జరితా. గరితా గిరతేః స్తుత్యర్థస్య. ప్రాయః శబ్దః ఇత్యర్థః వీరయత్యమిత్రాన్ - నానాప్రకారం మారయతీత్యర్థః.

అర్థము :- మంత్రార్థః - ఇన్ద్ర! హేఇన్ద్ర! తే = నీయొక్క, సా = ఆ, మఘోనీ దక్షిణా = ధనసంబంధి ధనవతీ దక్షిణా - దానబద్ధి త్రే = స్తుతికర్తయగు యజమానునికొఱకు, వరమ్ = వరమును - కల్యాణమును-సుఖమును, ప్రతిదుహీయత్ = ఇయ్యవలెను, స్తోతృభ్యః = స్తుతించు ఋత్విజులకు వారికోరికలననుసరించి, శిక్ష = ఫలమును ఇయ్యండి. మా అతిధక్ = మమ్ములనువిడిచి యన్యులకిండు. అనగా మాకు ముం దిచ్చి ఇతరులకు నిచ్చునది యనిభావము. నః = మాదగ్గఱ, భగఃఅస్తు = ఐశ్వర్యముండునుగాక, దానితో మేము విదథే - యజ్ఞమునందో లేక గృహమునందో, బృహద్ వదేమ = ఇత్తురుగాక, భుజింతురుగాక అని మేము పెద్దగా చెప్పుదుము. సువీరాః = ఉత్తమ సంతానవంతులమగుదుముగాక!

ప్రతిదుహీయత్ = ప్రతిదుగ్ధామ్, పితికి యిత్తురని యర్థము, వరః = వర యితవ్యో భవతి = వరింపదగినవాడు - స్వీకరింపదగినవాడు, మఘోనీ మఘవతి - ధనవతి, మఘమ్ ఇతి ధననామ = ధనము మఘమనబడును, దానకర్మణః మంహతేః = దానార్థకమగు, మంహిధాతువుతో సిద్ధమగును, దక్షిణాశబ్దము సమర్ధయతి = సమృద్ధముచేయును, అపి వా - లేక దక్షిణా శబ్దముయొక్క వ్యుత్పత్తి, దక్షిణాప్రదక్షిణాగమనాత్ = ప్రదక్షిణచేయుట వలన, దిశమభిప్రేత్య దక్షిణదిశయొక్క యభిప్రాయము గ్రహించి ఈ దక్షిణదిశ చెప్పబడుచున్నది - అనగా యజ్ఞానంతరము దక్షిణనిచ్చునపుడు యజమానుడు యజ్ఞవేదికకు ప్రదక్షిణచేసి, వేదిక కుడిదిశయందు ఋత్విజులను కూర్చుండబెట్టి దక్షిణల నొసంగునని భావము. ఈదక్షిణదిశను బట్టియే 'దక్షిణ' అనిపేరు కలిగినది. దక్షిణహస్తః దక్షతే ఉత్సాహ కర్మణః = కుడిచేతికి దక్షిణహస్తమనుపేరుకూడ ఏర్పడుటకు కారణము ఉత్సాహార్థకమగు దక్షధాతువుతో దక్షిణశబ్దమేర్పడుటయే. ప్రతికార్యము నందు దక్షిణహస్తమే ముందు ప్రవర్తించును - ఉత్సాహము చెలువును. దానకర్మణః దాశతేః వా స్యాత్ = లేక, దానార్థకమగు దాశధాతువువలన దక్షిణశబ్దము సిద్ధించును. అందువలననే దానము దక్షిణహస్తము కుడిచేతితో నియ్యబడును. హస్తః హస్తే=హస్త శబ్దముహనధాతువుతో సిద్ధించును. ప్రాశుః హననే = ప్రహరముచేయుట-కొట్టుటలో దక్షిణహస్తము శీఘ్రముముగా ప్రవర్తించును. కాళ్లు మున్నగునంగములలో దక్షిణహస్తము శీఘ్రగతి కలిగి

యుండును. దేహి స్తోతృభ్యః కామాన్ = స్తోతలకామములను ఏర్పుము, మాస్మా నతిపంహిః - మాస్మా నతిహాయదాః = మమ్ము విడిచి యితరుల కియ్యవలదు. ముందే మాకిమ్ము. భగః భజతేః - భజధాతువువలన 'భగ' శబ్దము సిద్ధించును. బృహత్ ఇతి మహతో నామధేయమ్ భవతి = గొప్ప వానికి 'మహత్' అని పేరు కారణమేమన అది 'పరివృఢం భవతి' అన్ని వైపులనుండి దృఢమగును. వీరవంతః సువీరాః = సువీరులన వీరవంతు లని యర్థము. వీరవన్తః = అనగా కల్యాణవీరాః - ఉత్తమవీరులు లేక ఉత్తమవీరసంతానముగలవారు, వీరః వీరయతి అమిత్రాన్ - అమిత్రాన్ = శత్రువులను వివిధవిధముల కంపింపజేయుటచే వీరుడనబడును. వేతేః వా స్యాత్ గతికర్మణః = వీ ధాతువువలన వీరశబ్దమేర్పడును. వీరుడు శత్రువుల కభిముఖుడై నడచును. వీరయతేః వా = విక్రాంతి అర్థముగల వీరధాతువువలన వీరశబ్దమేర్పడును. వీరుడు పరాక్రమించువాడని యర్థము.

> "సీమితి పరిగ్రహార్థీయో వా పదపూరణో వా"
> ప్రసీమాదిత్యోఽసృజత్ (ఋ. ౨. ౨౮. ౪)
> ప్రాసృజత్ సూర్యో రశ్మీన్.

అర్థము :- 'సీమ' ఈనిపాతము పరిగ్రహార్థీయః - పరిగ్రహ - పరితో గ్రహణ - సర్వతః = అన్నివైపులనుండి అనునర్థమున వచ్చును. పాద పూరణో వా లేక పదపూర్తి అర్థమునవచ్చును. రెండర్థములలో నొకే ఉదా హరణము.

> "ప్రసీమాదిత్యోఽసృజత్ - ప్రాసృజత్ ఇతి వా
> ప్రాసృజత్. సర్వత ఇతి వా."

అర్థము :- ప్రసీమాదిత్యోఽసృజత్ = సూర్యుడు సీమ్ = అన్ని వైపుల, ప్రాసృజత్ = తనకిరణముల ప్రసరింపజేసెను. ఇందు సీమ్ నిపాతము 'సర్వతః' అన్నివైపుల అనునర్థమున ప్రయుక్తము-ఈమంత్రము నకే 'ఆదిత్యుడు కిరణములను ప్రసరింపజేసెను' అను రెండవయర్థమున 'సీమ్' నిపాతమున, కర్థములేదు. పదపూర్తియే యిట ప్రయోజనము.

ఉదా :— మఱియొక ఉదా—

**'విసీమతః సురుచో వేన ఆవః' ఇతి చ. వ్యవృణోత్ సర్వత ఆదిత్యః - సురుచ ఆదిత్యరశ్మయః సురోచనాత్. అపి వా సీమేత్యేతదనర్థకముపబంధమాదదీత. పంచమీకర్మాణమ్ - సీమ్నః సీమతః సీమాతో మర్యాదాతః. సీమామర్యాదా-విషీవ్యతి దేశావితి.**

విసీమతః సురుచోవేన ఆవరితి చ. ఇదం ద్వితీయముదాహరణమ్ వి ఆవః వ్యవృణోత్ - వివృతా నకరోత్. సురుచః ప్రశస్తరోచనాన్ రశ్మీన్ సీమతః సర్వతః. విసీవ్యతి దేశావితి. విగతసంబంధౌ దేశౌ కరోతీతి బ్రహ్మ జజ్ఞానం ప్రథమం పురస్తాత్ విసీమతః సురుచో వేన ఆవః.

అర్థము :- పురస్తాత్ = ముందు, ప్రాచీదిశయందు, జజ్ఞానం = పుట్టుచున్న - ఉదయించుచున్న ఆదిత్యరూపబ్రహ్మము, సీమతః = అన్ని వైపుల, సురుచః=కిరణములను, వి ఆవః-వ్యవృణోత్=వ్యాపింపజేసెను.

ఈమంత్రమున 'సీమ్ + అతః' సీమ్ నిపాతమున 'అతః' నిరర్థకముగా చేర్చి సీమతః = అన్నివైపుల అని యర్థము చెప్పబడినది. సూర్య కిరణములను 'సురుచః' అందురు. బాగుగ ప్రకాశించుటవలన 'సురుచః' అనబడును. 'రుచ్‌దీప్తౌ' అను ధాతువువలన 'సురుచః' పదమేర్పడును. 'సీమతః' ఇందు 'సీమ్'తో నిరర్థక 'అ' (సీమ్ + అ) చేర్చి 'పంచమ్యాః తసిల్' పంచమ్యర్థమున 'తసిల్' చేర్చి సీమఅతః = సీమతః అను శబ్దము సిద్ధముచేయబడినట్లు మంత్రార్థము చెప్పునప్పుడు గుర్తింపవలెను. అపి వా = లేక, సీమః మర్యాదార్థక 'సీమన్' శబ్దమునకు 'తసిల్' ప్రత్యయము చేర్చిన 'సీమతః' సిద్ధమగును. సీమాశబ్దమునకు మర్యాదా (హద్దు) అర్థము సీమావిషీవ్యతి దేశౌ సీమ-హద్దు . రెండుదేశములను విడదీయును. సీమ రెండుదేశములమధ్య హద్దు నేర్పఱచును.

"త్వ ఇతి వినిగ్రహార్థీయం సర్వనామానుదాత్తమ్"

అర్థస్యేతన్నామేత్యేవమేకే ఆచార్యా మన్యన్తే. వక్ష్యతి చ - త్వో నేమ ఇత్యర్ధస్య. యథాత్ర సర్వనామ - తథేయ మృగుదాహ్రియతే.

అర్థము :- 'త్వః' అనునిది వినిగ్రహార్థీయమ్. పృథక్కరణార్థక సర్వనామము అనుదాత్తము 'త్వ' అనునిది నిపాతము కాదు. నిపాతప్రకరణమున నున్నందున నిపాతమని తలంపరాదు.

"అర్ధనామేత్యేకే"

అర్థము :- ఏకే = కొందఱు ఆచార్యులు 'త్వ' అను సర్వనామము, అర్ధస్య = సగమునకు పేరు అందురు. 'త్వ' కొన్నియెడల సర్వనామము, మఱికొన్నితావులందు సగమునకు వాచకము. ప్రకరణము ఉపపదముల సహాయముతో నిది సర్వనామమో యెక్కడ సగము (అర్ధ)నకు వాచకమో గుర్తింపవలయును.

"ఋచాం త్వః పోషమాస్తే పుపుష్వాన్ గాయత్రం త్వో గాయతి శక్వరీషు బ్రహ్మా త్వో వదతి జాతవిద్యాం యజ్ఞస్య మాత్రాం విమిమీత ఏకః ఇతి ఋత్విక్ కర్మణాం వినియోగమాచష్టే-ఋచా మేకః పోష మాస్తే పుపుష్వాన్ హోతర్గర్చనీ గాయత్ర మేకో గాయతి శక్వరీషూద్గాతా. గాయత్రం గాయతేః స్తుతికర్మణః. శక్వర్యః ఋచః శక్నోతేః తద్ యద్ ఆభిః వృత్రమశకద్ హన్తుం తచ్ఛక్వరీణాం శక్వరీత్వమ్ ఇతి విజ్ఞాయతే. బ్రహ్మైకో జాతే జాతే విద్యాం వదతి. బ్రహ్మా సర్వ విద్యః సర్వం వేదితు మర్హతి. బ్రహ్మా పరివృఢః శ్రుతతో బ్రహ్మా పరివృఢం సర్వతః. యజ్ఞస్య మాత్రాం విమిమీత ఏకోఽధ్వర్యుః. అధ్వర్యురధ్వరయు రధ్వరం యునక్తి అధ్వరస్య నేతా అధ్వరం కామయత ఇతి వా. అపి వా అధీయానే యురుపబంధః అధ్వర ఇతి యజ్ఞనామ. ధ్వరతిర్ హింసాకర్మా - తత్ప్రతిషేధః.

ఋత్విక్కర్మణాం వినియోగమాచష్టే. ఋచాం త్వః పోషమితి. త్వ ఏక ఇత్యర్థః. ఋచాం పోషం - పుష్టిం పుపుష్వాన్ ఋచోఽధీయమాన ఆస్తే హోతా. గాయత్ర మేకో గాయతి శక్వరీషు ఋక్షు ఉద్గాతా. త్వః

బ్రహ్మనామ ఏక ఋత్విక్ జాతే ప్రాయశ్చిత్తే విద్యాం - విజ్ఞానం వదతి త
రేభ్యః ఋత్విగ్భ్యః ఇదమత్ర కురు నేతి. బ్రహ్మ పరివృఢః శ్రుతతః -
సహి శ్రుత్యా విద్యాం వేద. అధ్వర్యుః - అధ్వర్యు రధ్వరం యునక్త్యధ్వ
రస్య నేతా ప్రాపయిత్యేర్థః. అథవా అధీయానేయుః-ఉపబంధః నామకరణః.
అధ్వరమధీతే యః సోఽధ్వర్యుః. ధ్వరతిర్ హింసాకర్మా. ధ్వరతి ధూర్వ
తీతి హింసార్థేషు పఠితా తత్ ప్రతిషేధః అహింస్ర ఇత్యర్థః.

అర్థము :- ఈఋక్కునందు ఋత్విజుల కార్యవిభాగము చేయ
బడినది. 'త్వః' ఆఋత్విజులలో నొకడగు హోత నామముగలవాడు
ఋచాం పోషం పుపుష్వాన్ ఆస్తే=యజ్ఞమున హోత ఋక్కులను=బాగుగ
పఠించుచుండును. త్వః మఱియొక ఉద్గాతనామకఋత్విక్కు, శక్వరేను
ఋక్కులందు, గాయత్రం గాయతి=గాయత్రిఛందస్సుగల సామమంత్రము
లను గానము చేయును. ఉద్గాత సామ గానము చేయును. త్వః - బ్రహ్మ
నామక ఋత్విక్కు, జాతవిద్యామ్ = యజ్ఞమున నేర్పడుదోషములను
తెలుపును. వాని ప్రాయశ్చిత్తమును తెలుపుచుండునని భావము. త్వః =
నాల్గవఋత్విక్కు అధ్వర్యువు 'యజ్ఞస్య మాత్రాం విమిమీతే = మిగిలిన
ఇతికర్తవ్యతలను సంపాదించును. ఆహుతులు సమిధలు మున్నగు నానా
విధములగు కార్యములు బాగుగజరుగునట్లు జూచును. ఇతి ఋత్విక్క
ర్మణాం వినియోగ మాచష్టే. ఇట్లు యజ్ఞమునగూర్చున్న వేదజ్ఞులగు
ఋత్విక్కుల కార్యభాగము ఋక్కు బోధించుచున్నది.

ఋక్ - అర్చనీఋక్ - దానియర్థము అర్చనీ = అర్చ్యతే అనయా
సా అర్చనీ - స్తుతి యొక్క సాధనము. దీనితో స్తుతిచేయబడును. మంత్ర
మును బాగుగ నుచ్చరించి స్తుతిచేయును హోత ఉద్గాత - గాయత్రి
ఛందస్సుతోగూడిన సామఋక్కులను గానముచేయును గాయత్రం గాయతేః
స్తుతికర్మణః స్తుత్యర్థక గైధాతువుతో గాయత్ర శబ్దమేర్పడును. శక్వర్యః
ఋచః శక్నోతేః శక్వరీ = ఋక్కు, ఇది 'శక' ధాతువుతో నేర్పడును.
ఇంద్రుడీ శక్వరీ - ఋక్కులతో వృత్రుని చంపగలిగెను. ఇట్లు చంప
గలుగుటయే శక్వరీలలోనున్న శక్వరీత్వము, సర్వవిద్యః = సర్వజ్ఞుడైన
బ్రహ్మ యజ్ఞమునందేర్పడు దోషములను దెలిపి వానికి ప్రాయశ్చిత్తమును
చేయించును. బ్రహ్మ పరివృఢః శ్రుతతః ? సర్వశాస్త్రముల శ్రవణ -

అధ్యయనమువలన 'పరివృఢః' సర్వవిధజ్ఞానముకలవాడు, సర్వజ్ఞుడగు
నని యర్థము. అధ్వర్యువు = నాల్గవఋత్విక్కు, యజ్ఞస్య మాత్రాం విమి
మీతే = అధ్వర్యువు యజ్ఞసంబద్ధ నానావిధములగు నితర ఇతికర్తవ్యము
లను సంపాదించును. అధ్వర్యుః అధ్వరయుః=అధ్వర్యుడు అధ్వరయువు
అనురెండు నేర్పడును. వీని వ్యుత్పత్తి - అధ్వరం యునక్తి - యజ్ఞమును
జోడించును. ఆవశ్యకమగు సర్వపదార్థములను చేకూర్చు ననిభావము.
ఇతడు అధ్వరస్య నేత - యజ్ఞనాయకుడనబడును లేక, అధ్వరం కామ
యతే వా అధ్వర్యుః - అధ్వర్యువః - యజ్ఞమును కామించువాడు-వా=లేక,
అధ్వరమధీయానః = యజ్ఞమును చదువువాడు అనియు చెప్పనగును.
'అధ్వర' మనగా యజ్ఞము. 'ధ్వరతిః హింసాకర్మ అనుధాతువుతో అధ్వర
శబ్దమేర్పడును. అధ్వరము - హింసారహితకర్మ.

"నిపాత ఇత్యేకే"

నిపాతః అయమ్ - ఇత్యేకే ఆచార్యా మన్యన్తే.

అర్థము :— కొందఱు ఆచార్యులు 'త్వ' పదమును నిపాతః = నిపా
తము అని యెంచుచున్నారు.

**"తత్ కథమ్ అనుదాత్త ప్రకృతి నామస్యాత్? దృష్ట
వ్యయం తు భవతి. ఉత త్వం సఖ్యే స్థిరపీతమాహుః" ఇతి
ద్వితీయాయామ్. 'ఉతో త్వస్మై తన్వం విసస్రే' ఇతి
చతుర్థ్యామ్.**

ఏవమ్ ఏకీయపక్షే స్థిత్వా పరపక్ష మాక్షిపన్నాహ - తత్ కథ మను
దాత్త ప్రకృతినామ స్యాత్? దృష్టవ్యయం తు భవతి. దృష్టాను విధయ
శ్ఛన్దసి ఇతి దృష్టవ్యయత్వాత్. తస్మాత్ కృతాపవాదత్వాత్ దృష్టవ్యయ
త్వాచ్చ నామైవైత దిత్యుపపన్నమ్.

అర్థము: :— తత్ కథమ్? అప్పుడెట్లు 'త్వ' అనుదాత్తస్వభావము
గల నామ మెట్లగును? 'త్వ' నిపు ఆను సర్వనామ మెట్లగునని చెప్పెదవు?
సర్వనామము ప్రాతిపదిక మగును. నిపాతము కాజాలదుకదా! సర్వనామ
ములన్నియు ఫిషోఽన్త ఉదాత్తః అను నియమము ననుసరించి అంతో

దాత్తములగును. ఈ 'త్వ' అనుదాత్తము. కావున 'త్వ' నిపాతమేకాని సర్వనామము కాదు-అను నీయాక్షేపమునకు సర్వనామవాది సమాధానము- నీవు చెప్పునది నిజమే. ప్రాతిపదికలు అన్తోదాత్తములే. కాని అపవాదములు కూడ నున్నవి. ఆయపవాదములలో 'త్వ' నిపాతముకూడ నున్నది. నిపాతములు అవ్యయములు. కాని యీ 'త్వ' సర్వనామముగ "దృష్టవ్యయ - చూడబడుచున్నది. కావున దీనిని నీవు నిపాతమెట్లనగలవు? మఱియు "నిపాతాః ఆద్యుదాత్తాః" నిపాతములాద్యుదాత్తములను నీనియమము ననుసరించి ఆద్యుదాత్తములగుచున్నవికదా! ఇది అనుదాత్తము. కావున నిది నామము. 'త్వ' నిపాతము అనుదాత్తమని యెట్లంగీకరించుచున్నావు? కావున 'త్వ' సర్వనామము అనుదాత్తమని అపవాదముగా దోషములేదు. నామమనుటకు ఉదాహరణము - 'ఉత త్వం సంఖ్యే' అను నీమంత్రమున త్వం ద్వితీయావిభక్తిలోను, 'ఉతో త్వస్మై' అను స్థలమున చతుర్థీవిభక్తిలో 'త్వ' పదము చూడబడుచున్నది. అందువలన కొందఱాచార్యులు 'త్వ' నిపాతమును సర్వనామముగా నంగీకరించుటలో దోషము లేదని భావము.

"అథాపి ప్రథమాబహువచనే"

త్వయా దృష్ట ఇత్యధ్యాహారః.

ఇప్పుడు ప్రథమాబహువచనమునకు ఉదాహరణము నిచ్చుచున్నాడు.

"అక్షణ్వన్తః కర్ణవన్తః సఖాయో మనోజవేష్వసమాః బభూవుః
ఆదఘ్నాస ఉపకక్షాస ఉ త్వే హ్రదా ఇవ స్నాత్వా
ఉ త్వే దదృశ్రే"

అర్థము :— ఈమంత్రమున త్వే ప్రథమాబహువచనాంతమున ప్రయుక్తమైనది. మంత్రార్థము :- అక్షణ్వన్తః = ఉత్తమనేత్రములుకలవారు, కర్ణవన్తః=ఉత్తమకర్ణములుగలవారు, అనగా బాగుగచూడ, వినదగిన వారు. ఇక ఒకే గురువుదగ్గఱ చదువు విద్యార్థులు మనోజవేషు = మనోవేగమునందు, అసమాః = అసమానులు, బభూవుః = అగుదురు, సఖాయః సమానాఖ్యానాః=ఒకే శాస్త్రమున శ్రమచేసినవారైనను, యా సమానాఖ్యానాః - మనుష్యత్వేన = మనుష్యత్వముతో సమానజ్ఞానముకలవారు - సమాను

లైనప్పటికి వారిలో వైషమ్యము చూడబడును. అనగా వారిలో కొందఱు గొప్పవిద్వాంసులగుదురు. మఱికొందఱు మధ్యమశ్రేణిలో నుందురు. వారిలో 'త్వే' కొందఱు ఆదఘ్నాసః హ్రదా ఇవ = ప్రజ్ఞతోముఖమువఱకు నిండినహ్రదములు - మడుగులవలె, దదృశ్రే = కనిపింతురు. ఇట ఆదఘ్నపదము ఛాందసప్రయోగము - ఇందు ఆస్యపదములోని స్య లోపించి 'ఆదఘ్నాస' ఐనది.

ఆస్య + దఘ్న హ్రదాః, ఆస్యలోని 'స్య' లోపించి ఆదఘ్న ఐనది - ఆస్యమన ముఖము - ఆస్యదఘ్న = ముఖమువఱకు నిండిన హ్రదమువలె అని యర్థము. పైటంచులవఱకు నిండినహ్రదమువలె కొందఱు పూర్ణప్రజ్ఞతోనిండినవారగుదురని భావము. ఇంక కొందఱు ఉప కక్షాసః = అల్పజ్ఞులగుదురు, కక్ష = చంక, ఉపకక్షాసః - చంకలవఱకు నిండిన జ్ఞానముకలవారు - అల్పజ్ఞులు, త్వే=ఇంకకొందఱు, 'స్నాత్వాః' = అగాధజలముతోనిండిన హ్రదా ఇవ హ్రదములవలె అగాధజ్ఞానముకల వారగుదురు. శిష్యులు నేత్రాది ఇంద్రియములు కలిగియుండుటలో సమానులైనను బుద్ధిభేదముచే ఉత్కృష్టులు మధ్యములు, నికృష్టులు నగుచున్నారని భావము - పీడు అగాధము = సగమునిండిన కొలదిగా నిండిన హ్రదములతో పోల్చబడినారు.

> "అక్షిమంతః కర్ణవంతః, సఖాయః. అక్షి చష్టేః, అనక్తే రితి ఆగ్రాయణః. తస్మాదేతే వ్యక్తతరే ఇవ భవత ఇతి హ విజ్ఞాయతే. కర్ణః కృన్తతే ర్నికృత్తద్వారో భవతి ఋచ్ఛతే రిత్యాగ్రాయణః ఋచ్ఛన్తీవ ఖే ఉదగన్తామితి హ విజ్ఞాయతే. మనసాం ప్రజవేషు అసమా బభూవుః. ఆస్యదఘ్నా అపరే. ఉపకక్షదఘ్నా అపరే - ఆస్యమన్యతేః అన్యన్నత ఏతదన్నమితి వా, దఘ్నం దఘ్యతేః స్రవతి కర్మణః. దస్యతే ర్వా స్యాద్విద స్తతరం భవతి. ప్రస్నేయా హ్రదా ఇవైకే ప్రస్నేయా దదృశిరే స్నానార్హాః. హ్రదో హ్రాదతేః శబ్దకర్మణః హ్రాదతేర్వా స్యాచ్ఛీతీభావకర్మణః."

అక్షణ్వన్తః కర్ణవన్తః (ఋ. సం. ౧౦. ౭౧. ౭) ఇత్యేతస్యామృచి విద్యాసూక్తమ్. అక్షణ్వన్తః అక్షిసంయుక్తాః సఖాయః సమాన పృష్ఠోదర పాణిపాదాః అథవా సమానేషు శాస్త్రేషు కృతశ్రమాః. మనోజవేషు - మనోగమ్యేష్వర్థేషు అసమా న తుల్యా భవన్తి తద్యథా - ఏకే హ్రదేషు స్నాత్వా ఆదఘ్నాస్త ఆస్యమాత్ర యుక్తపరిమాణాః. అపరే ఉపకక్షాసః- కక్షమాత్రజలా దదృశ్రే - దదృశిరే - దృశ్యన్తే ఇత్యర్థః - అక్షి చష్టేః పశ్య త్యర్థస్య దృశ్యతే హ్యనేన అనక్తేః వ్యక్త్యర్థస్య ఇత్యాగ్రాయణో మన్యతే.

బ్రాహ్మణమపి చైతస్మిన్నిర్వచనే భవతి. తస్మాదేతే వ్యక్తతరే ఇవ భవత ఇతి. వ్యక్తతరే - స్పష్టతరే మార్జారాదిచక్షుషాం ప్రకాశాత్-బ్రాహ్మణ మపి చైతస్మిన్నిర్వచనే భవతి. "ఋచ్ఛన్తీవ ఖే ఉదగంతా మితి హ విజ్ఞాయతే ఋచ్ఛన్తీవ గచ్ఛన్తీవ అస్యమస్యతేః క్షేపార్థస్య. దఘ్నం దఘ్యతేః స్రవత్యర్థస్య. ప్రస్నేయాః - స్నానార్హాః - హ్రదో హ్రదతేః శబ్దార్థస్య హ్లాద తేర్వా స్యాత్ శీతీభావార్థస్య - గ్రీష్మేఽపి హ్యసౌ శీతల ఏవ భవతి.

అర్థము :- అక్షిమన్తః = ప్రశస్తములగు కన్నులుకలవారు, కర్ణ వన్తః = శ్రేష్ఠమైన చెవులుగలవారు, సఖాయః = సమానజ్ఞానముకలవారు లేక యొకేశాస్త్రమున సమానపరిశ్రమచేసినవారు, అక్షి చష్టేః = దర్శనార్థక మగు చక్షిఙ్ ధాతువువలన అక్షిపదము సిద్ధమగును. అక్షి - కన్నుతో చూతురు. అనక్తేః ఇతి ఆగ్రాయణః. ఆగ్రాయణాచార్యుడు అక్షిశబ్దము 'అఞ్జూ వ్యక్తిమ్రక్షణకాంతిగతిషు' ధాతువుతో సిద్ధమగునని అంగీకరించు చున్నాడు. అక్షి ఇతరాంగములకంటె వ్యక్తతరము - అధికవ్యక్తము. "తస్మాదేతే వ్యక్తతరే ఇవ భవత ఇతి హ విజ్ఞాయతే" - ఇది బ్రాహ్మణ వచనము. కావున ఈకన్నులు ఇతరాంగములకంటె వ్యక్తతరములు - ప్రకాశయుక్తము లనుఅర్థము తెలియుచున్నది.

కర్ణః కృన్తతేః - 'కృతీఛేదనే' ధాతువుచే కర్ణశబ్దము సిద్ధించును. నికృత్తద్వారో భవతి. కర్ణద్వారము ఖండింపబడియుండును. ఋచ్ఛతే రిత్యాగ్రాయణః=గత్యర్థకమగు 'ఋచ్ఛ' ధాతువువలన కర్ణశబ్దమేర్పడునని ఆగ్రాయణాచార్యుని మతము. ఇందులకు 'ఋచ్ఛన్తీవ ఖే ఉదగన్తామ్' ఇతి హ విజ్ఞాయతే - ఖే = ఆకాశమునందు, అభివ్యక్తశబ్దములు కర్ణము = చెవులందు, ఋచ్ఛన్తి = ప్రాప్తములగును - చేరును. మఱియు నీకర్ణము

లాశబ్దములను గ్రహించుటకేమో యున్నట్లు 'ఉదగన్తామ్' పైకిపోయి యున్నవి. కావున కర్ణశబ్దము ఋచ్ఛధాతువుతో నుత్పన్నమైనది. మనసాం ప్రజవేషు = మనోవేగములందు, లేక 'మనోగమ్యేషు' = మనోగమ్యార్థము లందు, 'అసమాః బభూవుః' అసమానములై యుండును.

అస్యదఘ్నాః అపరే = కొందఱు ముఖమువఱకు నీరుగల హ్రదములు - మడుగులవంటివారు, ఉపకక్షదఘ్నాః అపరే = కొందఱు చంకల వఱకు నీరుగల హ్రదములవంటివారు, మంత్రమున 'అదఘ్నాసః' అను పదమున్నది. 'ఆస్యదఘ్న' అను పదమునందలి 'స్య' పృషోదరాదిత్వాత్ లేక ఛాందసత్వాత్ - పృషోదరాదులలో చేరుటవలననో, లేక ఛాందసమగుటవలననో లోపించినది - 'అస్య మస్యతేః' ఆస్యశబ్దము క్షేపణార్థక 'అసు' ధాతువుతో నేర్పడును. ఆస్యమనగా ముఖము. దానియందు అన్నము వేయబడును - ఉంచబడును. 'ఆస్యన్దత ఏతదన్నమితి వా లేక, ముఖము తనయందు విసిరివేయబడిన - ఉంచబడిన శుష్కపదార్థమును లాలాబలముతో ఆర్ద్రము చేయును - తడుపును. కావున 'ఆఙ్' పూర్వక 'స్యన్దూ' ప్రస్రవణే ధాతువుతో ఆస్యశబ్దము సిద్ధమగును. దఘ్నం - దఘ్యతేః స్రవతి కర్మణః - దఘ్నశబ్దము స్రవత్యర్థక 'దఘ' ధాతువుతో నేర్పడును. ఏలయన ఉత్తరపరిమాణముకంటె అప్రసుతము తక్కువగా నుండును - దస్యతేర్వా స్యాత్ - విదస్తతరం భవతి లేక ఉపక్షయార్థక 'దసు' ధాతువుతో దఘ్నపదమేర్పడును. ప్రస్నేయా హ్రదా ఇవ ఏకే - ప్రస్నేయా దదృశిరే స్నానార్హాః. వానియందు బాగుగా ఈదుచు స్నానము చేయగలరు. ఇట్టి హ్రదములవలె కొందఱు శిష్యులు అగాధపాండిత్యము గలవారుగ కనిపింతురు. హ్రదో హ్రదతేః శబ్దకర్మణః. శబ్దార్థక 'హ్రాద' ధాతువువలన 'హ్రద' శబ్దము సిద్ధించును. హ్రదతేర్వా స్యాత్ శీతీభావకర్మణః; లేక శైత్యార్థక 'హ్రద' ధాతువువలన హ్రదశబ్దమేర్పడును.

**"అథాపి సముచ్చయార్థే భవతి - పర్యాయా ఇవ త్వదాశ్వినమ్. అశ్వినం చ పర్యాయాశ్చేతి."**

సముచ్చయార్థే స్యాత్ ఇతి కిముదాహరణమ్ పర్యాయా ఇతి.

అర్థము :- అథాపి = అనునదియొక నిపాతము, సముచ్చయార్థే = సముచ్చయార్థమునను, భవతి = వచ్చును, అదియెట్లనగా - 'అపి' ఇది సముచ్చయార్థమున వచ్చును. ఉదా :- 'పర్యాయా ఇవ త్వదాశ్వినమ్' ఆశ్వినం చ పర్యాయాశ్చేతి. ఇట 'అపి' సముచ్చయార్థమున వచ్చెను. కావుననే 'చ' పదముతో దానియర్థము స్పష్టముచేయబడును. 'ఇవ' అను నిపాతముకూడ నిట సముచ్చయార్థకమే.

"అథ యే ప్రవృత్తే ఽర్థేఽమితాక్షరేషు గ్రంథేషు వాక్య పూరణా ఆగచ్ఛన్తి పదపూరణాస్తే మితాక్షరేషు అనర్థకాః 'కమీమిదు' ఇతి.

"నిష్టృక్ త్రాసశ్చిదిన్నరో భూరితోకా వృకాదివ. బిభ్యస్యన్తో వవాశిరే శిశిరం జీవనాయ కమ్."

శిశిరం జీవనాయ శిశిరం శృణాతేః శమ్నాతేర్వా.

అథ యే ప్రవృత్తే - తాన్ వినైవ పరిసమాప్తే అర్థే అమితాక్షరేషు - గద్యగ్రంథేషు హి ఖలు - ప్రభృతయో వాక్యపూరణా ఆగచ్ఛన్తి. పద పూరణార్థాః పాదాక్షరసంఖ్యాపూరకాస్త ఏవ మితాక్షరేషు పద్యగ్రంథేషు భవన్తి. ఉభయత్రాపి తే అనర్థకాః, ఉక్తం చ - క్రియావాచక మాఖ్యాత ముపసర్గో విశేషవత్. సత్త్వాభిధాయకం నామ నిపాతః పాదపూరణః.

కమీమిద్వితి - కమ్ + ఈమ్ + ఇత్ + ఉ ఇతి.

అర్థము :- అథ యే = ఏనిపాతములు, ప్రవృత్తే అర్థే = అర్థము పూర్తియైన మీదట, అమితాక్షరేషు గ్రంథేషు - గద్యగ్రంథములందు, వాక్యపూరణాః = వాక్యపూరకములగును, తే = అవియే, మితాక్షరేషు = పద్యగ్రంథములందు, పదపూరణాః=అనర్థకములగుచున్నవి. అవి యెవ్వి యన - కమ్ - ఈమ్ - ఇత్ - ఉ - ఉదా :- 'కమిత్యస్యోదాహరణమ్ - నిష్టృక్త్రేతి' ఇహ కమితి పూరకః.

నిష్టృక్త్రాసః = నిర్వసనా ఇత్యర్థః. అపి చ భూరితోకాః - బహ్వ పత్యా ఇత్యర్థః. కే పునస్తే? దరిద్రాః కేచిన్నరో మనుష్యాః వృకాత్ ఇవ బిభ్యస్యన్తః = హిమాత్ బిభ్యతః వవాశిరే. హేమన్తే శబ్దాయన్తే. కిమ్?

శిశిరం జీవనాయ — అల్పతరశీతం హి శిశిరం సుఖం తత్ర జీవిష్యామ ఇత్యభిప్రాయః. శిశిరశబ్దస్య నిర్వచనమ్ శిశిరం శృణాతేః - హింసార్థస్య శమ్నాతేర్వా హింసార్థస్యైవ, హినస్తి శిశిరఋతుః శీతాదికమ్.

మంత్రార్థః - నిష్టుక్త్రాసః = వస్త్రరహితులు, ఘూర్ణితోకాః = అధిక సంతాపముకలవారు, చిదిన్నరః=కేచిన్నరః - కొందరు, వృకాదివ=తోడేలు వలె హేమంత- ఋతువువలన, బిభ్యస్యన్తః = భయపడుచు, జీవనాయ= జీవనముకొఱకు, వవాశిరే = శిశిర-ఋతువుకొఱకు కేకలు వేయసాగిరి. మంత్రమున 'కమ్' నిపాతమునకు విశేషార్థమేమియు లేదు. ఇది కేవలము పాదపూర్తికొఱకు ప్రయుక్తమైనది.

శిశిరఋతువు జీవనవృద్ధికొఱకు తోడ్పడును. శిశిరం శృణాతేః శమ్నా తేర్ వా - శిశిరశబ్దము హింసార్థకమగు 'శౄ' 'శము' ధాతువులతో సిద్ధమగును. శిశిరమునందు వనస్పతి మున్నగువృక్షములు నశింపించును. చెట్లు ఎండిపోవునపుడు అరణ్యములో నప్పుడప్పుడు దావాగ్నిరగుల్కొని చెట్లు నశించును. మాఘఫాల్గుణములు శిశిరఋతువు.

‘‘ఏమేన సృజతాసుతే ఆ సృజతైనం సుతే.’’

ఈమిత్యస్యోదాహరణమ్. ఆ ఈమేనం సృజతా సుతే. ఈమ్ ఇతి పద పూరణ ఏవ. హే అధ్వర్యవః యో౽యమింద్రస్య సుతే-అభిషుతే సోమే స్వాంశః ఏనమాసృజత - దత్త.

అర్థము :- ఏమేనమ్ ఆ ఈమ్ ఏనమ్ ఇది ఛేదము. ఇందు ‘ఈమ్’ అర్థరహితము పదపూరకమే. సుతే = అభిషుతసోమమునందు తన అంశ మైన, ఏనమ్ = దీనిని, అసృజత = అభిముఖ్యముగా ఉత్పన్నము చేయుము.

‘‘తమిద్ వర్ధన్తు నో గిరః తం వర్ధయన్తు నో గిరః స్తుతయః గిరో గృణాతేః’’

ఇదిత్యస్యోదాహరణమ్ - తమ్ సోమమ్. ఇత్ - ఇతి పదపూరణః. వర్ధయన్త్వేవ జాతపత్యం కుర్వన్తు దేవతృప్తయే న ఏతా గిరః స్తుతయః.

అర్థము :- నః గిరః = మనస్తుతులు, తం = ఆసోమమును, వర్థయన్తు = వృద్ధిచేయును, ఇందు 'ఇత్' పాదపూరణమ్. 'గృణాతి'తో గిర పదము ఏర్పడును.

**'అయ ము తే సమతసి' అయం తే సమతసి.**

ఉకారస్యోదాహరణమ్ - అయం తే తవ యుష్మదర్థః సోమః యం ప్రతి నిత్యకాలమేవ సమతసి - సంపతసి త్వం హే ఇంద్ర ! కపోత ఇవ నీడమ్.

అర్థము :- ఇందు 'ఉ' పదపూరకము. అయమ్ = ఇది, తే = నీ యొక్క సోమము, దానికొఱకు నీవు, సమతసి సతతమ్ అతసి గచ్ఛసి = ఎల్లప్పుడు వెళ్లుచున్నావు.

**"ఇవోఽపి దృశ్యతే - 'సువిదురివ' సువిజ్ఞాయేతే ఇవ"**

కదాచిత్ అనర్థకః ఇతి శేషః కిముదాహరణమ్ ? సువిదురివ సువిజ్ఞాయేతే ఇవ ఇత్యేతే ఉదాహరణే.

అర్థము :- 'ఇవ' కూడ అప్పుడప్పుడు పదపూరకమగును. ఉదా :— సువిదుః ఇవ బ్రాహ్మణులు యజ్ఞమును బాగుగ నెఱుగుదురు. ఈవాక్యమునందలి 'ఇవ'కు అర్థములేదు. ఇట్లే - సువిజ్ఞాయేతే ఇవ విప్రైరితి శేషః - విప్రులచే యజ్ఞము నక్షత్రము రెండును బాగుగ తెలియబడుచున్నవి. ఈవాక్యమునందలి 'ఇవ' పదము పదపూరకమే. కావున అర్థరహితము.

అథ నిపాత సమాహార నిరూపణము

**"అథాపి నేత్యేష ఇదిత్యేతేన సంప్రయుజ్యతే పరిభయే."**

**హవిర్భి రేకే స్వరితః సచ న్తే సున్వంత ఏకే సవనేషు సోమాన్.**

**శచీర్ మదన్త ఉత దక్షిణాభిర్ నేజ్జిహ్మాయన్త్యో నరకం పతామ.**

నరకమ్ = న్యరకం, నీచైర్గమనమ్. నాస్మిన్ రమణం స్థానమల్పమప్యస్తీతి వా. అథాయమేవ ఇదితి కేవలః ప్రయుజ్యమానః పదపూరణో భవతి. అపి చాయమేవ న ఇత్యేతేన సంయుక్తః పరిభయే అర్థే ప్రయుజ్యతే. కథం ప్రయోగః? నేజ్జిహ్మాయన్త్యో నరకం పతామేతి. హే నారద! ఏకే ఇతో లోకాత్ హవిర్భిః పురోడాశాదిభిర్నిమిత్తభూతైః స్వః సచన్తే = స్వర్గలోకం ప్రాప్నువన్తిస్మ, ఏకే సవనేషు = యజ్ఞేషు సోమాన్ సున్వన్తః అభిషుణ్వన్తః తేన కర్మణేత్యర్థః. శచీర్మదన్తః - శచ్యా వాచా స్తుతిభిః ఏకే దేవాన్ మాదయన్తః = సంతర్పయన్త ఇత్యర్థః. అపరే దక్షిణాభిః దక్షిణాద్వారా స్వః సచన్తే - స్వపతిభ్యో జిహ్మయన్త్యో జిహ్మమాచరన్త్యో వయ మనువ్రతేభ్యో నరకం పతామ. యతో నహ్యన్యో భర్తృపరిచర్యాతః స్త్రియాః కశ్చన ధర్మోఽస్తీత్యభిప్రాయః.

అర్థము :- 'అథ' ఇతి అధికారార్థము - ఇక్కడనుండి నిపాతసమాహారము ప్రారంభము. అథాపి కించ న ఇతి ఏషః 'న' ఈ 'న' ఇది ఇత్ ఇతి ఏతేన 'ఇత్'తో కలిసి పరిభయే సర్వతోభయ అర్థమున సంప్రయుజ్యతే = ప్రయోగింపబడును. పదపూరణముగానున్న ఇత్ 'న'తో కలిసి పరిభయ - అర్థమున ప్రయుక్తమగును. ఈ 'న'తో కలిసి అది సార్థకమైనదగునని భావము.

మంత్రార్థము :- ఏకే = కొందఱు, ఇతః = ఈభూలోకమునుండి, హవిర్భిః=యజ్ఞములందు హవిస్సునువేసి హోమముచేసి, స్వః సచన్తే = స్వర్గమును చేరుదురు. మఱికొందఱు సవనేషు = యజ్ఞములందు, సోమాన్ సున్వన్తః = సోమరసము పిండుచు - సోమయాగముచేసి స్వర్గమును కేగెదరు, ఇంకకొందఱు శచీః = స్తుతులతో దేవతలను సంతర్పయన్తః = మదన్తః=సంతోషింపజేయుచు - తృప్తిపఱచుచు స్వర్గమునకు పోవుదురు. ఇంకను కొందఱు దక్షిణాభిః = దానములొసఁగి స్వర్గమును గమింతురు. న ఇత్ జిహ్మయన్త్యః - మేము భర్తలను మోసగించి, నరకం పతామ = నరకమునబడుచున్నాము.

నరకశబ్దవ్యుత్పత్తి - నరకం న్యరకం - నీచైర్గమనమ్ - ని - నీచైః అర్యతే - గమ్యతే యస్మిన్ తత్ న్యరకం - నరకమ్. దీనియందు అధోగతి

కలుగునో యది నరకము. ఇందు సుఖస్థానము కొంచమైనను లేదు. కావున నరకమనబడును.

"అథాపి న చేత్యేష ఇదిత్యేతేన సంప్రయుజ్యతేఽనుపృష్టే - న చేత్ సురాం పిబన్తి ఇతి. సురా సునోతేః."

అథాప్యయమపరో నిపాతసమాహారో న చేత్యేష ఇదిత్యేతేనైవ సంప్రయుక్తః ప్రయుజ్యతే. స చేత్ సురాం పిబన్తి యది సురాం న పిబన్తీత్యర్థః. సురా సునోతేః సాహ్యభిషూయతే పిష్టాదిభిః తస్యా అనేకే భేదాః,

అర్థము :- అథాపి = మఱియు, 'నచ' ఇతి ఏషః 'నచ అను నిపాత సమూహము, ఇత్ ఇతి ఏతేన - ఇత్ అనుదానితో, సంప్రయుజ్యతే=కలిసి ప్రయోగింపబడును, అనుపృష్టే = అనుప్రశ్నము అను నర్థమునందు - రెండవమాఱు ప్రశ్నించుటయందు - అనగా నక్కడ వృషలులున్నారా? అని యొకడు ప్రథమమున మఱియొకనిని ప్రశ్నించిన ఉన్నారు అని చెప్పను. అప్పుడు మొదటిప్రశ్నకర్తయే మరల నతనిని ప్రశ్నించును. "యది తిష్ఠన్తి కిమర్థం నాగచ్ఛన్తి - ఉన్నచో ఏలరారు అని" అప్పుడు ఉత్తరదాత 'నచేత్ సురాం పిబన్తి' సురత్రాగకున్నచో వచ్చెదరు. అని సమాధానము చెప్పెను. ఈరెండవసారి అడిగినప్రశ్న అనుప్రశ్న యనబడును. ఈయనుప్రశ్నకు చెప్పిన సమాధానమునందు 'నచ' నిపాతసమాహారము 'ఇత్'తోకలిసి యర్థమును ప్రకటించునని భావము.

'సురా సునోతేః' 'సురా' పదము 'షుఞ్' అభిషవే అనుధాతువుతో నేర్పడును. 'అభిషూయతే అనేకైర్ ద్రవ్యైరితి - 'సురా' - మద్యము అనేక ద్రవ్యములు కలిపి సిద్ధముచేయుబడును.

"ఏవ ముచ్చావచేష్వర్థేషు నిపతన్తి త ఉపేక్షితవ్యాః."

ఉచ్చావచేష్వర్థేషు = బహుప్రకారేషు ప్రయుజ్యమానాస్తే నిపాతా ఈక్షితవ్యాః కః కస్మిన్నర్థే వర్తతే? ఇత్యేవం ద్రష్టవ్యాః పరీక్ష్యా ఇత్యర్థః.

అర్థము :- ఏవమ్ = ఇట్లు, ఉచ్చావచేష్వర్థేషు = అనేకవిధములగు నర్థములందు, యే నిపతన్తి = పడుచున్నవో ప్రయుక్తములగుచున్నవో

యవి, ఉపేక్షితవ్యాః = పరీక్షింపదగియుండును. ఏనిపాత మే యర్థము నందు ప్రయోగింపబడినదో విచారింపవలయునని భావము.

"ఇతీమాని చత్వారి పదజాతాని అనుక్రాన్తాని. నామాఖ్యాతే చోపసర్గనిపాతాశ్చ."

ఇతిమాని చత్వారి చతుః సంఖ్యాకాని పదజాతాని వ్యాఖ్యాయ అనుక్రాన్తాని ఆనుపూర్వ్యేణ వర్ణితాని. నామాఖ్యాతే ఉపసర్గనిపాతాశ్చేతి.

అర్థము :- ఈవిధముగ నామాఖ్యాతములు, ఉపసర్గనిపాతములు అను నాలుగుసంఖ్యగల పదములు క్రమముగా వర్ణింపబడినవి.

ఇతి తృతీయః పాదః

తృతీయ పాదము సమాప్తము

## చతుర్థ పాదము

"తత్ర నామాని ఆఖ్యాతజాని ఇతి శాకటాయనో నైరుక్త సమయశ్చ."

తత్ర తస్మిన్నేవ పదచతుష్టయే యాని నామాని తాని సర్వాణ్యేవా విశేషేణాఖ్యాతజాతానీత్యేవం శాకటాయన ఆచార్యో బ్రవీతీతి శేషః. నైరుక్తానాం చైవ సమయః సిద్ధాన్తః గార్గ్యవర్జమ్.

అర్థము :- తత్ర = ఆపదచతుష్టయమునందు, నామాని = నామములు, ఆఖ్యాతజాని = ధాతువులనుండి యేర్పడినవి. అని శాకటాయన ఆచార్యుని మతము, నైరుక్తసమయశ్చ = నిరుక్తకారుల సిద్ధాంతముకూడ.

"న సర్వాణీతి గార్గ్యో వైయాకరణానాం చైకే."

న సర్వాణీతి గార్గ్యః బ్రవీతి. వ్యాకరణమధీయతే యే వైయాకరణాః తేషాంచైకే బ్రువత ఇతి శేషః. వ్యాక్రియన్తే శబ్దా అనేన, అస్మిన్నేతి కరణేఽధికరణే వా ల్యుట్.

అర్థము :- సర్వాణి న=నామములన్నియు క్రియాజన్యములు కావు, అని గార్గ్య ఆచార్యుని మతము. వైయాకరణానాం చైకే = కొందఱు వైయాకరణులు కూడ ఇట్లే అంగీకరించుచున్నారు.


66,981

"తద్యత్ర స్వరసంస్కారౌ సమర్థౌ ప్రాదేశికేన గుణేనాన్వితౌ స్యాతామ్ సంవిజ్ఞాతాని తాని. యథా గౌరశ్వః పురుషో హస్తీతి.

తదేతత్ ప్రపంచ్యతే గార్గ్యపక్షేణ. యత్ర యేష్విత్యర్థః నామసు స్వరసంస్కారౌ స్వరశ్చోదాత్తాదిః సంస్కారశ్చ ప్రకృతిప్రత్యయాదిః సమర్థౌ ప్రాదేశికేన ధాతురూపేణాన్వితౌ వసుగతౌ స్యాతామ్ - భవేతామ్. సంవిజ్ఞాతాని ఐకమత్యేన జ్ఞాతాని తాని. తేషు తావదవిప్రతిపత్తిరేవాస్మాక మాఖ్యాతజాని నామానీతి. తద్యథా - కర్తా కారకః పక్తా పాచకః ఇతి. తస్మాన్న సర్వాణ్యాఖ్యాతజాని నామానీతి.

అర్థము :- యత్ర = ఏనామములందు, సర్వసంస్కారౌ = ఉదాత్తాది స్వరములు, ప్రకృతి ప్రయత్యయము మున్నగుసంస్కారములు సమర్థౌ = సుసంగతములో - ఉత్పన్నములో, ప్రాదేశికేన గుణేన=ప్రాదేశిక గుణముతో (ఏ క్రియను తీసికొని ఆనామము పెట్టబడినదో యది ప్రాదేశిక గుణమనబడును). ప్రదేశ మనగా క్రియ అన్వితౌ స్యాతామ్ యుక్తము లగునో అనగా ఏనామములందు ఉదాత్తాదిస్వరములు, ప్రకృతి ప్రత్యయము మున్నగు సమస్తప్రక్రియతో కూడిన నామములు నిస్సందేహముగ ఆఖ్యాతజములు - ధాతుజములు. ఉదా :- కర్త, హర్త, కారకము మున్నగునవి. కాని వేనియందు స్వరసంఖ్యాదులుండవో, తాని నామాని= ఆనామములు, సంవిజ్ఞాతాని = రూఢినామములు - ఆఖ్యాతజములు కావు. ఉదా :- గౌః, అశ్వః, పురుషః = గోవు, అశ్వము, పురుషుడు మున్నగునవి. కావున నామములన్నియు ఆఖ్యాతజములు కావు. ప్రాతిపదికలన్నియు వ్యుత్పన్నములు కావు. అవ్యుత్పన్నములు నున్నవనుట ధృవము. మా మతము సోపపత్తికమే - హేతుబద్ధమే.

వాస్తవమున నామవ్యవస్థ ముప్విధములనవచ్చును. కొన్ని నామములు ప్రత్యక్షక్రియలు గలవి - ఉదా :- కర్తాకారకః, హర్తాహరకః మున్నగునవి. వీనిలో క్రియ, ప్రకృతి, ప్రత్యయము స్పష్టముగా బోధపడును. ఇట్టివి ప్రత్యక్షక్రియగలవి యనవచ్చును. 'కర్త' పదమునందు కృఞ్ ధాతువు తృచ్ప్రత్యయము స్పష్టమగుచున్నవి.

2) కొన్నినామములు ప్రకల్ప్యక్రియలు - ఉదా :— గౌః పురుషః - హస్తి. వీనిలో క్రియ, ప్రకృతి, ప్రత్యయములు ఆలోచించి కల్పింప బడును.

3) ఇక మూడవవిధనామములు - డిత్థః, కపిత్థః అనునవి. వీనిలో క్రియకాని, ప్రకృతిప్రత్యయములు కాని కనిపింపవు. అందువలన నివ్యవస్థననుసరించియే నామములన్నియు ఆఖ్యాతజములని సిద్ధాంతము చేయుచున్నాము.

**"అథ చేత్ సర్వాణి ఆఖ్యాతజాని నామాని స్యుః, యః కశ్చ తత్ కర్మ కుర్యాత్ సర్వం తత్ సత్త్వం తథాఽఽచక్షీరన్ యః కశ్చ అధ్వాన మశ్నువీత, అశ్వః స వచనీయః స్యాత్. యత్ కించిత్ తృన్ద్యాత్, తృణం తత్."**

యః కశ్చ పుమాన్ తత్ కర్మ కుర్యాత్, తం ప్రాణినం తేనైవకే న నామ్నా ఆచక్షీరన్ అశ్వః స వచనీయః స్యాత్. అశ్నువన్నశ్వ ఇత్యుచ్యతే అన్యే అశ్నువన్నపి నోచ్యతే? ఏవమేవ యత్ కించిత్ తృన్ద్యాత్ అవిశేషేణ తత్ సర్వం తర్దనక్రియాయోగాత్ తృణమిత్యేవ ముచ్యతే. తస్మాత్ న సర్వాణ్యాఖ్యాతజాని నామానీతి.

అర్థము :- అథ చేత్ - మఱియు యది సర్వాణి నామాని=నామము లన్నియు, ఆఖ్యాతజాని యది స్యుః = క్రియాజన్యములేయగునెడల యః కః చ = ఎవడేని యొకడు, తత్ కర్మ కుర్యాత్ - ఆపనిచేయునో క్రియ చేసినవాని కాక్రియాజన్యనామము కలుగును కావున ఆధాతుజనామ మతనికి కలుగునెడల, తత్ సర్వం సత్త్వం = ఆక్రియనొనర్చిన అన్ని ప్రాణులు ఆధాతుజనామముతో చెప్పబడవలయును. ఉదాహరణమునకు యః కశ్చ అధ్వాన మశ్నువీత = ఎవడు మార్గమును తినునో-వ్యాపించునో, సః అశ్వః వచనీయః = అతడు అశ్వమని చెప్పబడవలయును. కాని లోకమున గుఱ్ఱమునందే అశ్వమని ధాతుజనామ మేర్పడుచున్నది. కాని మార్గమును తినివేసిన - దాటిన ప్రతిప్రాణిని అశ్వనామముతో పిలువరు. కావుననే నామములన్నియు ధాతుజములను సిద్ధాంతము నంగీకరింపము. యత్ కించిత్ తృన్ద్యాత్ తత్ తృణమ్ = కాలికి గ్రుచ్చుకొనుదానికి తృణ

మని ధాతుజనామము. కాని కాలికి గ్రుచ్చుకొను ప్రతిపదార్థము లోకమున తృణమని పిలువబడదు. కావున నామములన్నియు ధాతుజములనుట సిద్ధాంతము కాదు.

**"అథాపి చేత్సర్వాణి ఆఖ్యాతజాని నామాని స్యుర్ యావద్భిర్ భావైః సంప్రయుజ్యేత తావద్భ్యో నామధేయ ప్రతిలంభః స్యాత్ - తత్రైవం స్థూణా దరశయా వా సంజనీ చ స్యాత్."**

యావద్భిర్ భావైః క్రియాభిః సంప్రయుజ్యేత క్రియాహేతుకే హి నామధేయప్రతిలంభేసతి యావతీభిః క్రియాభిరేకం ద్రవ్యం సంయుజ్యేత తావద్భ్యో భావేభ్యః - క్రియాభ్యో క్రియానామధేయప్రతిలంభః స్యాత్. తత్రైవం సతి స్థూణా ఏకైవ సతీ దరే శేతే ఇతి దరశయా ఇత్యుచ్యేత. న చోచ్యతే సజ్జతేఽస్యాం వంశ ఇతి సంజనీత్యుచ్యేత న చోచ్యతే. ఏవ మనేకాని సత్వాని ఏకక్రియాయోగా దేకనామాని స్యుః. తస్మాన్న సర్వాణి ఆఖ్యాతజాని నామాని.

అర్థము :— అథాపి చేత్ కించ యది సర్వాను నామాని ఆఖ్యాతజాని స్యుః = సర్వనామములు ఆఖ్యాతజములగుచో యావద్భిః భావైః సంప్రయుజ్యేత = ఏవస్తు వెన్ని క్రియలతో యుక్తమగునో, తావద్భ్యః = అన్ని క్రియలతోనే, నామధేయప్రతిలంభః స్యాత్ = ఆవస్తువున కన్ని నామములు కలుగవలయును. తత్ర ఏవం సతి = అట్లు జరిగినపుడు, స్థూణా = స్తంభము, దరశయా సంజనీచ స్యాత్ = దరశయా, సంజని అనునామముతో పిలువబడవలయును. స్థూణా = స్తంభము (దరే శేతే ఇతి దరశయా) గుంటత్రవ్వి నిలబెట్టబడును. కావున అది దరశయ యని అనబడవలయును. అస్తే (సజ్యతే అస్యాం వంశః)=ఆ స్తంభముపై కప్పునకు సంబంధించిన బొంగులు ఉంచబడును. అందువలన స్తంభము 'సంజని' యనియు పిలుపబడవలయును. కాని లోకమున స్తంభమును దరశయ, సంజని యని యెవరును వ్యవహరింపరు. అందువలన నామములన్నియు ఆఖ్యాతజ - ధాతుజము లనుట తగదు.

**"అథాపి య ఏషాం న్యాయవాన్ కార్మనామికః సంస్కారో యథాచాపి ప్రతీతార్థాని స్యు స్తథైనాన్యాచక్షీరన్. పురుషం పురిశయ ఇత్యాచక్షీరన్ అష్టేత్యశ్వమ్. తర్దనమితి తృణమ్.**

"య ఏషాం పురుషాశ్వాదినామ్నాం న్యాయవాన్ - లక్షణ - న్యాయేన యుక్తః. కర్మకృతం నామ కర్మనామ, పాచక లావకాది తస్మిన్ భవః కార్మనామికః సంస్కారః. ప్రతీతార్థాని ప్రతీతక్రియాణి. తథైవైనాన్యాచక్షీరన్ జనాః కథం? పురుషం తావత్ పురిశయ ఇత్యాచక్షీరన్ అష్టేత్యశ్వమ్ ఆచక్షీరన్. తర్దనమితి తృణమాచక్షీరన్. న చైవ మాచక్షతే - తస్మాన్న సర్వాణ్యాఖ్యాతజాని నామానీతి.

అర్థము :- అథాపి - మఱియు నామము లన్నియు ఆఖ్యాతజములే యగు నెడల ఏషామ్ = ఈయశ్వము, పురుషుడు, మున్నగునామములకు సంబంధించిన న్యాయవాన్ = న్యాయయుక్తలక్షణములందు, కార్మనామికః సంస్కారః = క్రియలవలనగలుగు నేసంస్కారముగలదో యది వీని యందుండవలయును. యథాచాపి = మఱియు నెట్లు ప్రతీతార్థాని స్యుః= స్పష్టార్థములుకలవియగునట్లు గూడ అశ్వము పురుషుడు మున్నగు నామము లను తథా ఆచక్షీరన్ = అట్లే పలుకవలయును. ఉదాహరణమునకు - పురుషం = పురుషుని పురిశయుడని, అశ్వమ్ = అశ్వమును అష్టాయని, తృణమ్ = గడ్డిపరకను తర్దనమనియు పిలువవలయును. ఎవ్వరును పిలువరు - పలుకరు. కావున నామములన్నియు ఆఖ్యాతములు కావు.

**అథాపి నిష్పన్నే ఽభివ్యాహారే ఽభివిచారయన్తి - ప్రథనాత్ పృథివీత్యాహుః. క ఏనా మప్రథయిష్యత్? కిమాధారశ్చ? ఇతి.**

ప్రథనాత్-పృథివీత్యాహుః శాకటాయనాదయః. తత్ర వయం పృచ్ఛామః. క ఏనా మపృథ్వీం సతీ మప్రథయిష్యత్? కోఽస్యాః ప్రథనమకరిష్యదిత్యభిప్రాయః. కిమాధారశ్చ. సర్వస్య హి ప్రాణిజాతస్య ఇయమే వాధారః. తస్మా న్న సర్వాణ్యాఖ్యాతజాని నామాని ఇతి.

అర్థము :- అథాపి కించ అభివ్యాహారే నిష్పన్నే = ముందు నామములు ప్రయోగింపబడిన పిదప ఉంచబడినపిదప మరల శాకటాయనాది వైయాకరణులు అభివిచారయన్తి = ఈశబ్దము ఏధాతువువలన నేర్పడినదని ఆలోచించుచున్నారు. వాస్తవమున నామములన్నియు ఆఖ్యాతజములగునెడల వాని నిర్వచనములుకూడ ముందేచేయబడియుండవలసియుండెను. కాని వస్తుస్థితియేమన నామము లెప్పటినుండియో ముందుగానె వ్యవహరింపబడుచు వచ్చుచున్నవి. కాని వారు ఈనామ మేధాతువునుండి యేర్పడగలదు? అని తదుపరి విచారింపదొడగిరి. ఎట్లన పృథివి శబ్దము మొదటినుండియే ప్రయోగింపబడుచు వచ్చుచున్నది. ఇప్పుడు వారు శాకటాయనాదులు ప్రథనాత్ పృథివీత్యాహుః=విస్తరించియుండుట వలన పృథివియనుచున్నారని వ్యుత్పత్తిని చేయుచున్నారు. 'ప్రథవిస్తారే' అనుధాతువువలన పృథివిశబ్దమేర్పడుచున్నది. ఏలయన పృథివివిస్తృతమై యున్నది. కావున నీధాతువువలన దీనికి నిష్పత్తికలిగినది. కాని, విస్తృతమై యుండుటవలన పృథివి యని వ్యుత్పత్తిచేయువారిని ఎవరు దీనిని అప్రథయిష్యత్? విస్తరింపజేసిరి? అని మేము ఆఖ్యాతజవాదులను అడుగుచున్నాము. అట్లే 'కిమాధారశ్చ' దీనికాధారమెయ్యది యనియు అడుగుదుము. అనగా దేనిపై యీపృథివి విస్తరింపజేయబడినదో యది యెయ్యది? అని ప్రశ్నాభిప్రాయము. వాస్తవమున పృథివియే యున్ని ప్రాణులకు నాధారము. దానినెవరు విస్తరింపజేయ గలుగుదురు? దేనిమీద నది విస్తరింపజేయబడగలదు? ఇట్లు పృథివి నెవ్వరు విస్తరింపజేయజాలనపుడు పృథివియను నామకరణముచేయుట అయుక్తము. ఐనను దీనిని పృథివియని వ్యవహరించుచు వచ్చుచున్నారు. అంతమాత్రమున నామములన్నియు నాఖ్యాతజములనుట తగదు.

"అథా నన్వితేఽర్థే అప్రాదేశికే వికారే పదేభ్యః పదేతరార్ధాన్ సంచస్కార శాకటాయనః. ఏతేః కారితం చ యకారాదిం చ అంతకరణమస్తేః శుద్ధం చ సకారాదిం చ."

అనన్వితే అననుగతే శబ్దేనార్థే. అప్రాదేశికే వికారే చ. పదేభ్యః పదేతరార్ధాన్ సంచస్కార శాకటాయనః. తద్యథా - ఏతేః కారితంచ యకారాదిం

చ అంతకరణమస్తేః శుద్ధం చ సకారాదిం చ. ఏతేః ఇత్యస్య కారితం ణ్యంతం రూపం కృత్వా తతో యకారాంతం కృత్వా సత్యశబ్దస్యాంత మర్థం సంచస్కార. అస్తేః శుద్ధం చ. అస్ భువి ఇత్యేతస్య శుద్ధమేవ రూపం కృత్వా తకారాంత మిత్యర్థః. తతః సకారాది శబ్దరూపం గృహీత్వా సత్ ఇత్యేతత్ సత్యమ్. ద్వయోర్ధాత్వోః సంచస్కార, అథ కో౽ర్థః సంతమర్థ మాయయతి ప్రత్యాయయతి గమయతీతి సత్యమ్. తదేతదకృతపూర్వ మన్యైః వ్యుత్పత్తిః శాకటాయనో౽తిపాండిత్యాభిమానాత్ అకరోత్. తస్మా దతిప్రసంగదోషాపత్త్యా - నానేక ధాతుజాని నామాని.

అర్థము :— నామములన్నియు ధాతుజములని సిద్ధపఱచుటకు శాకటాయనుడు మఱియొకపని చేసినాడు, అర్థే అనన్వితే = శబ్దమున సర్థమనుగతము కానప్పుడు, అప్రాదేశికే వికారే = ధాతుసంబద్ధవికారము లేనప్పుడును అనగా ఏశబ్దమున శబ్దమునను సరించు అర్థము లభింపనప్పుడు - కొందొకధాతు వాశబ్దమున కనుబడునప్పుడును తనసిద్ధాంతమును నిలబెట్టుకొనుటకు వారు (శాకటాయనులు) పదేభ్యః = పదములవలన, పదార్థాన్= పదార్థములను పదముల యర్థభాగమును గ్రహించి సంచస్కార = పదసిద్ధిచేసియున్నారు. ఎట్లనః- సత్యశబ్దమును సిద్ధముచేయుటకు ఏతేఃకారితమ్-'ఇణ్ గతౌ' ధాతువుయొక్క ణ్యంతరూపమును తీసికొని, యకారాదిం చ = మఱియు మొదల ఆణ్యంత 'ఆయక' శబ్దముయొక్క ఆది - అనగా యకారమును అంతకరణమ్=సత్యశబ్దాంతమునసుంచిరి, తదుపరి 'అస్తేః శుద్ధమ్' అస్ధాతువుయొక్క శుద్ధరూపము అస్నుండి చివరిసకారము గ్రహించి సకారాది చ - 'సత్య' పదమున ఆదియందుంచిరి. ఇట్లు తికమకలుచేసి సత్యశబ్దమును సిద్ధమొనర్చిరి. ఈసిద్ధిననుసరించి సత్ + ఆయక = సత్యము, సత్ = వస్తుతత్త్వమును, ఆయక = ప్రాప్తింపజేయునది అని యర్థమగుచున్నది.

"అథాపి సత్త్వపూర్వో భావ ఇత్యాహుః. అపరస్మాత్ భావాత్ పూర్వస్య ప్రదేశో నోపపద్యతే ఇతి."

అథాపి అయ మపరో దోషః ప్రసజ్యేత. ఇత్యాహుః అభియుక్తాః - అపరస్మాత్ భావాత్ అపరకాలీనేన భావేన - క్రియయా పూర్వస్య పూర్వే

త్పన్నస్య సంజ్ఞాప్రతిలంభో నోపపద్యతే. తస్మాత్సర్వాణి ఆఖ్యాతజాని నామానీతి శాకటాయనమతం సర్వథా నోపపద్యతే. పరిసమాప్తో గార్గ్యపక్షః,

అర్థము :- అథాపి మఱియు నొకయనుపపత్తి సత్త్వపూర్వకః = క్రియద్రవ్యపూర్వకముగ నుండును, ఇతి ఆహుః = అని పూర్వులందురు. ఇట్టిస్థితిలో అపరస్మాత్ భావాత్ = ఉత్తరకాలీన క్రియవలన, పూర్వస్య = పూర్వకాలీనద్రవ్యమునకు, ప్రదేశః = నామకరణము, న ఉపపద్యతే = ఉచితముకాదు.

అశ్వము = శీఘ్రముగా పరువిడిన తదుపరి దానినామము అశ్వమని పెట్టినచో నామములన్నియు ధాతుజములను మీకథనము ఉచితమగును. కాని, వాస్తవమున అశ్వము ముందు, తరువాత దానిశీఘ్రగమనము ఏర్పడు చున్నది. కావున నామములన్నియు ఆఖ్యాతజములు కావని స్పష్టమగు చున్నది.

"తదేత న్నోపపద్యతే,"

శాకటాయన - పక్షేఽ ఇమానీ మేతాన్ దోషాన్ ప్రతిసమాధాతు మాహ - తదేతద్ గార్గ్యమతం నోపపద్యతే - న సమ్యక్.

అర్థము :- తత్ = ఆయీగార్గ్యమతము, న ఉపపద్యతే = ఉపపన్న ముకాదు - హేతుబద్ధము కాదు. అది యెట్లో చూడుడు.

"యథో హి ను వా ఏతత్ తద్ యత్ర స్వరసంస్కారౌ సమర్థౌ ప్రాదేశికేన గుణేనాన్వితౌ స్యాతామ్. సర్వం ప్రాదేశికమితి ఏతం సత్యనుపాలంభ ఏవ భవతి."

యథా = యేనప్రకారేణ, ఉకారోఽవధారణార్థః, హి ఇత్యసూయా యామ్. ను ఇత్యేష హేత్వపదేశే. వై పూర్వపక్షపదేశార్థః. యేనైవ ప్రకా రేణాసమర్థా హేతవ ఉక్తాః తేనైవ ప్రకారేణ ప్రత్యనుభాష్య సమీక రిష్యామః. ప్రాదేశికం సర్వమేవ క్రియాజం నామ. అనుపాలంభః - ఉపా లంభాభావః.

అర్థము :- యథా ఉ హి ను వా ఏతత్ తత్ యథా - ఎట్లు ఉ = నిశ్చయముగా, హి = అసూయా, ను=హేతుకథనము, వా=ఇది యదోక్త

పూర్వపక్షము యొక్క ఉపదేశముకొఱకు సున్నదో, ఏతత్ తద్ = అది యేది చెప్పబడినదో అనగా ఏవిధముగ గార్గ్యుడు మున్నగువారు అసమర్థ హేతువులు చెప్పినారో మేమావిధముగనె వానియొక్క సుసంగతిని చూపెదము. వానిని మేము సద్యుక్తులతోను ప్రమాణములతోను సరియైన సమాధానమిచ్చి స్వమతములను స్థాపింతుము.

యత్ర స్వరసంస్కారౌ సమర్థౌ ప్రాదేశికేన గుణేనాన్వితౌ స్యాతామ్. ఏనామమున స్వరసంస్కారములు సుసంపన్నములో, ప్రాదేశికగుణముతో యుక్తములో ఆనామములే ధాతుజములు; అన్యములు కావని చెప్పబడినదో దానికి సమాధానము మేమిట్లుచెప్పుచున్నాము.

సర్వం ప్రాదేశికమ్. నామములన్నియు ప్రాదేశికములనియే మేము చెప్పుచున్నాము. వ్యాకరణప్రక్రియతో సంగతములు - కూడియున్నవి - అన్నియు వ్యుత్పన్నములే ఏదియు నవ్యుత్పన్నముకాదు. ఏవం సతి = ఇట్టి స్థితిలో అనుపాలంభ ఏష భవతి=ఉపాలంభమునకు - ఆక్షేపమునకు తావే లేదు. మాయిరువురి సిద్ధాంతములలో అంతరము - భేదము లేనేలేదు. ఆగార్గ్యాదులు అన్నియు ప్రాదేశికములు వ్యాకరణసిద్ధములగు నామములే ధాతుజములని యెట్లంగీకరించుచున్నారో యట్లే మేము సంగీకరించుచున్నాము. మాసిద్ధాంతము అదియే లోకమున వ్యాకరసిద్ధముకాని యే శబ్దమును మేమంగీకరింపము. అందువలన నన్నియు వ్యుత్పన్నములే.

మేము పూర్ణరూపమున వ్యాకరణము చదువక, కొన్నిశబ్దములను సిద్ధము చేయజాలనికారణమువలన అవ్యుత్పన్నములని చెప్పినచో అది మాయజ్ఞానాపరాధముగును. శబ్దములన్నియు సిద్ధము కాగలవు. అందులకు జ్ఞానము ప్రయత్నము కావలయును.

> "యథో ఏతద్యః కశ్చ తత్కర్మ కుర్యాత్ సర్వమ్ తత్ సత్యమ్. తథా చక్షీరన్ ఇతి. పశ్యామః సమాన కర్మణామ్ నామధేయప్రతిలంభ మేకేషామ్ నైకేషామ్. యథా తక్షా పరివ్రాజకో జీవనో భూమిజ ఇతి."

యదో ఏతత్ - యత్ పునరేతదుక్తమ్. యోఽపి కశ్చన తత్కర్మ కుర్యా త్తత్సర్వం తథా చక్షీరన్నితి నైష నియమః. పశ్యామః సమాన

కర్మణామ్ - తుల్యకర్మణామపి సతాం కర్మకృతాం నామధేయప్రతిలంభ మేకేషాం నైకేషాం యథా తక్షన్ కశ్చిత్ తక్షేత్యుచ్యతే. అన్యః తక్షన్నపి స తక్షేత్యుచ్యతే. ఏవం జీవన ఇక్షురసః శాకజాతిర్వా. భూమిజో అంగారకః వృక్షో వా.

అర్థము :- యథా ఉ ఏతత్ = మఱియు యః కశ్చ తత్కర్మ కుర్యాత్ = ఎవడేని యొక కర్మచేసిన, సర్వం తత్ సత్త్వం తథా ఆచ క్షీరన్=ఆకర్మనుచేసిన ప్రాణులన్నియు నానామముతోనే పిలువబడవలయు నని యేదిచెప్పబడినదో ఆవిషయమును మేము చూచుచున్నదేమన సమాన కర్మణాం నామధేయప్రతిలంభమ్ ఏకేషాం న ఏకేషామ్ = సమానకర్మ నొనర్చు వారిలో కొందఱిని వారుచేసిన కర్మనామముతో పిలుచుచున్నారు. మఱికొందఱిని ఆనామముతో వ్యవహరించుటలేదు. కాబట్టి ప్రాణి యేయే కర్మచేయుచు పోవునో యతని కాయా కర్మనామము చెప్పడవలయుననను నియమము లేదని స్పష్టమగుచున్నది. ఒకేకర్మ చేసినవ్యక్తికి ఆకర్మకు సంబంధించిన నామమేర్పడుటయు ఏర్పడకుండుటయు మనము లోక మున జూచుచున్నాము. ఎట్లన - తక్షా పరివ్రాజకః జీవనః, భూమిజః - తక్షా యన వడ్రంగి, పరివ్రాజకః=సంన్యాసి, భూమిజః=వృక్షము, జీవనః= ఇక్షురసము. కొయ్యను చీల్చును కావున వడ్రంగి తక్షకుడందురు. క్రియవలన నతడు తక్షకనామకుడయ్యెను. వడ్రంగికాక లోకములో మఱియొకడు కొయ్యచీల్చడా ? ఆవ్యక్తిని 'తక్షా' నామముతో పిలుతుమా ? తిరుగుట = భ్రమణము కారణముగ సంన్యాసికి పరివ్రాజకుడని నామమేర్పడెను. సంన్యాసులు కానివారు తిరుగరా - భ్రమణము చేయరా ? ఇట్లే జీవనము నొసంగునది ఇక్షురసమేనా ? భూమిజము = వృక్షము - భూమినుండి వృక్షమొక్కటియే పుట్టునా ? మఱియొండేమియు పుట్టదా ? నామము లన్నియు ఆఖ్యాతములనినంతమాత్రమున వివిధకర్మల నొనర్చువారి కా కర్మలనామములన్నియు నేర్పడవలయుననను నియమమొకండును లేదు.

"ఏతేనైవోత్తరః ప్రత్యుక్తః."

కతమః ? యావద్భిర్ భావైః సంప్రయుజ్యేత తావద్భ్యో నామధేయ-ప్రతిలంభః స్యాదిత్యేషః. తత్ర యదుక్తమ్.

అర్థము :- ఈ రెండవదోషముయొక్క పరిహారమువలన ఉత్తరః ప్రత్యుక్తః = తరువాతి మూడవదోషముకూడ చెప్పినట్లెంచవలెను. అనగా నామములన్నియు ధాతుజములే యని యంగీకరించు పక్షమున అనేక కర్మలు చేయువారికి ఆయాకర్మలు చేయుటవలన నొక్కొక్కనికి అనేకా నేకనామము లేర్పడియుండవలసివచ్చును అను మూడవయాక్షేపము చేయ బడినదో యదియును పరిహరింపబడినట్లే.

> "యథో ఏతత్ యథా చాపి ప్రతీతార్థాని స్యు స్తథైనాన్యా చక్షీరన్ ఇతి. సన్త్యల్పప్రయోగాః కృతోఽప్యైకపదికాః. యథా - వ్రతతిర్దమూనా జాట్య ఆట్ణారో జాగరూకో దర్వి హోమీతి.

యథో ఏతత్ - యత్ పునరేతదుక్తమ్. యథా ప్రతీతార్థాని స్యుః తథైనాన్యాచక్షీర న్నితి నైష నియమః అల్పప్రయోగాః - ప్రతీతార్థక్రియాః. కృతః కృత్ప్రత్యయాన్తాః ఏకపదికాః - ఏకపదప్రకరణాన్తర్వర్తినో స సన్తి. తత్ యథా - వ్రతతి ర్వృణోతే ర్వల్లీ. దమూనా దమమనా అగ్ని రతిథిర్వా. జాట్యః జటావాన్. ఆట్ణారో అటనశీలః-జాగరూకో జాగరణశీలః దర్విహోమీతి దర్వ్యా జుహోతీత్యేవం ప్రతీతార్థాన్యపి.

అర్థము :- యథో ఏతత్ = మఱియు నేయాపత్తి చూపబడినదో యథా చ అపి = ఏవిధముగ, ప్రతీతార్థాని స్యుః = ఈనామములన్నియు స్పష్టార్థకములగునో, తథా అట్లే, ఏతాని ఆచక్షీరన్ = వీనిని చెప్పవలెను. కావున మేము దీనికి చెప్పుసమాధానము ఇది. సన్తి = ఉన్నవి, అల్ప ప్రయోగాః = కొలది ప్రయోగములు కలవి, కృతః అపి=కృదంతశబ్దములు కూడ, ఏకపదికాః = ఒకపదము ధర్మముగాగలది-ఒకపదము ప్రకరణము నకు అంతర్గతము - అనగా గార్గ్యనిమతమున కృదంత - పదములు స్పష్టా ర్థకములుగా నంగీకరింపబడినవి. కాని, వానిలోను ప్రతీతార్థక్రియలుగలవి యగుచు ఏకపదికములు = ఒక్కపదము ప్రకరణమున నంతర్గతమగు నట్టి ప్రయోగములును ఉన్నవి. వానిలో నొక్కొక్కపదము గ్రహించి నిర్వ చనము చేయబడినది. మఱియు నవి ఈవిధముగ స్పష్టార్థకములుగ చేయ బడినవి. ఎట్లన:— వ్రతతిః వృణోతేర్ వ్రతతిః - వృఞ్ ఆచ్ఛాదనే

ఆచ్ఛాదనే ఆచ్ఛాదనార్థక 'వృఞ్' ధాతువుతో ప్రతతి శబ్దము సిద్ధము చేయ బడినది. ప్రతతి లతావాచకము (తీగ) దమనాత్ దమూనా = దమనము చేయుటవలన 'దమూనా' ఏర్పడును. యో దమమనా వా దమూనా - ఎవని మనస్సు దమయుక్తమో యతనిని 'దమూనా' అగ్ని లేక అతిథి యందురు. జాట్యః జటావాన్ - జడలుగలవాడు. ఈశబ్దము జ్యా లేక జని ధాతువుచే సిద్ధము చేయబడును. ఆట్ణారః = అటనశీలుడు, జాగరూకః = జాగరణ శీలుడు, దర్విహోమీ - దర్వ్యా జుహోతీతి దర్విహోమి = గరిటెతో హోమముచేయువాడు.

"యథో ఏతన్నిష్పన్నేఽభివ్యాహారేఽభివిచారయన్తీతి భవతి హి నిష్పన్నేఽభివ్యాహారే యోగపరీష్టిః - ప్రథనాత్ పృథివీత్యాహుః, క ఏనా మప్రథయిష్యత్ కి మాధారశ్చేతి. అథ వై దర్శనేన పృథురప్రథితా చేదప్యన్యైః.

యదో ఏతత్ యత్ పునరేతదుక్తమ్ - నిష్పన్నేఽభివ్యాహారేఽభి విచారయన్తీతి. అత్ర బ్రూమః=యుక్తం తే కుర్వన్తి-భవతి హి నిష్పన్నేఽభి వ్యాహారే యోగపరీష్టిః యోగస్య పరీక్షణమ్. అథ వై దర్శనేన పృథుర ప్రథితా చేదప్యన్యైః దృశ్యమానా హీయం పృథివీ. తస్మాత్ యద్యప్యప్రథితా కైశ్చిదన్యైః తథాపీయం పృథుదర్శనయోగాత్ పృథివ్యేవ. అన్యథా హి ధాత్వర్థో నోపపద్యతే.

అర్థము :- యదో ఏతత్=మఱియు నిది, అభివ్యాహారే = నామము నిష్పన్నమైనపుడు, అభిచారయన్తి = ఆశబ్దమును లక్ష్యమున నుంచుకొని దీనియందుగల ప్రకృతిప్రత్యయము లెయ్యవి ? అని విచారింతురు. ఇట మా సమాధానమేమన - అభివ్యాహారే = నామనిష్పత్తి కలిగినమీదటనే యోగపరీష్టిః భవతి = యోగపరీక్ష - అవయవార్థముల పరీక్ష జరుగును. కొండొకవస్తువునకు నామమేర్పడనంతవఱకు దాని యవయవార్థముల పరీక్ష యెట్లుచేయబడగలదు ? నామమేలేకున్న దేనినిర్వచనము చేయగలము ? ప్రథనాత్ పృథివీత్యాహుః క ఏనా మప్రథయిష్యత్ ? కిమాధారశ్చేతి = విస్తరించుటచే పృథివినామమేర్పడినచో దీని నెవరు విస్తరింపజేసిరి ? దీని కాధారమేమి ? యని యుట్టంకించియున్నారు. దానికి మా సమాధాన

మేమన అది యెవరిచేతను విస్తరింపజేయబడలేదనుకొనుడు. కాని దర్శన ముచే (దర్శనేన పృథుః) పృథివి విస్తృతమైయున్నట్లు కనబడుచున్నది కదా! దర్శనముతోనే మేము దానివ్యుత్పత్తిచేసితిమి? ఎవరు దానిని విస్తృతపఱచిరి? ఆధారమేమి అనుప్రశ్నలతో ప్రయోజనమేమి? అని భావము.

"అథాప్యేవం సర్వ ఏవ దృష్టప్రవాదా ఉపాలభ్యన్తే."

సర్వ ఏవ దృష్టప్రవాదా ఉపాలభ్యన్తే న కేవలం మయైవ పృథు దర్శనాత్ పృథివీత్యుచ్యతే.

అర్థము :- అథాపి = మఱియు, యిది ఏవమ్ = ఈవిధముగనే పృథివియందు కనబడు ప్రత్యక్షప్రథనము = విస్తారమునుకూడ నీవు అపవాదముగా నంగీకరింపదొడగుదువేని, సర్వే ఏవ దృష్టప్రవాదాః=సమస్త ప్రత్యక్షవచనముల యుపలాపము జరుగును. అప్పుడు కొండొకడు ఒక వస్తువును ప్రత్యక్షముచేసికొని ఏమిచెప్పినను మేము దానినికూడ నంగీక రింపము.

"యథో ఏతత్ పదేభ్యః పదేతరార్ధాన్ సంచస్కారేతి. యోఽ నన్వితేఽర్థే సంచస్కార న తేన గర్హ్యః. సైషా పురుషగర్హా న శాస్త్రగర్హా ఇతి."

యథో ఏతత్ - యత్ పునరేతదుక్తమ్. యోఽనన్వితే అర్థే అననుగత మసంబద్ధం సంచస్కార స తేన సంస్కారేణ గర్హ్యః గర్హణీయః. సైషా తదభి ప్రాయా పరిజ్ఞానాత్ పురుషగర్హా పురుషదోషో న శాస్త్రదోషః. అనుగత ఏవార్థే సంచస్కార శాకటాయనః యథా సంతమేవ హ్యర్థ మాయయతి గమయతీతి సత్యమ్.

అర్థము :- యథో ఏతత్ = మఱియు, పదేభ్యః = పదములనుండి పదేతరార్థాన్ = ఇతరపదములయొక్క అర్థ అర్థభాగములను సంచస్కార చేసెను. అనగా సత్యము మున్నగుపదములను సిద్ధముచేయుటకొఱకు ఇతరపదములనుండి సగముసగము గ్రహించెను. అని శాకటాయనాదులు చెప్పినదానికి మా సమాధానమేమన - యః అనన్వితే అర్థే సంచస్కార =

ఎవడు అసంబద్ధమగు నర్థమున శబ్దసిద్ధిఁజేసినాడో ఆతడు గర్హ్యః = నిందింపదగినవాడు. గార్గ్యుడట్టివాని నిందింపవలెను. సా ఏషా పురుషగర్హా = ఇది యొక వ్యక్తినింద - ఇది యొక యజ్ఞానియైన వ్యక్తియొక్క దోషము. ఇది శాస్త్రగర్హ యుకాదు. ఇందు శాస్త్రదోషమొండును లేదు.

**"యథో ఏతద్ అపరస్మాద్ భావాత్ పూర్వస్య ప్రదేశో నోపపద్యతే ఇతి. పశ్యామః పూర్వోత్పన్నానాం సత్త్వానామపరస్మాత్ భావాత్ నామధేయప్రతిలంభమేకేషాం నైకేషామ్. యథా - బిల్వాదో లంబచూడక ఇతి. బిల్వం భరణాద్ వా భేదనాద్వా."**

యథో, ఏతత్-యత్ పునరేతదుక్తమ్. అపరస్మాత్ భావాత్ పూర్వస్య ప్రదేశో నోపపద్యత ఇతి. అత్ర బ్రూమః-పశ్యామః పూర్వోత్పన్నానాం సత్త్వానామ్ నామధేయప్రతిలంభమ్. తస్మాదెన్నాచ్చారణమ్. అపరస్మాదపరకాలీనాదపి సతోభావాదేకేషాం నైకేషాం యథా బిల్వాదో లంబచూడక ఇతి. పశ్చాత్కాలీనయాపి చూడాలంబనక్రియయా బిల్వాదనక్రియయా చ పూర్వోత్పన్నస్య సత్వస్య నామధేయప్రతిలంభ ఉపపద్యమానో దృష్టః. బిల్వం భరణాత్ - పాలనాత్ దుర్భిక్షాదౌ భేదనాద్వా భక్షణాయేతి. ఇతి సప్తమః ఖండః ప్రథమాధ్యాయస్య చతుర్థః పాదశ్చ సమాప్తః.

అర్థము :- యథో ఏతత్ = మఱియు ఉత్తరకాలీన క్రియవలన పూర్వకాలీన ద్రవ్యమునకు నామమేర్పడజాలదని చెప్పినదానికి మా సమాధానము - పశ్యామః=మేము చూచుచున్నాము - ఏమి చూచుచున్నామన - ఏకేషామ్=కొన్ని పూర్వోత్పన్నానాం సత్త్వానామ్ = పూర్వోత్పన్న పదార్థములకు, అపరస్మాద్ భావాత్=అపరకాలీన క్రియనాధారము చేసికొని నామధేయప్రతిలంభమ్ = నామప్రాప్తి కలుగకుండుటయు చూచుచున్నాము. కావున ద్రవ్యములకు నామముల నేర్పఱచుటలో ముందువెనుకలకు సంబంధించిన ప్రశ్నయే యుదయించదని భావము. ఎట్లన :- బిల్వాదః = బిల్వాదుడు - మారేడుపండును తినుటకు సంబంధించిన అపరకాలీన క్రియను ఆధారముచేసికొని మొదటినుండియు=జన్మారంభమునుండియు

బిల్వాదుడు అనునామము పెట్టబడును. అల్లే లంబచూడకుడు = పొడవైన శిఖకలవాడు - శిఖ పొడవుగా పెరుగకముందే బాలునకు లంబచూడుడు నామముపెట్టబడును. బిల్వం భరణాత్ - డుభృఞ్ధాతువుతో బిల్వనామ మేర్పడును. బిల్వము తినువానినది భరణపోషణచేయును. లేక భేదనాత్- 'భిదిర్' ధాతువుచే నేర్పడును. దానిని ఛేదించి - పగలకొట్టి తిందురు.

చతుర్థకాండము సమాప్తము

## పంచమ పాదము

**అథాపీదమంతరేణ మంత్రేష్వర్థప్రత్యయో న విద్యతే. అర్థమ ప్రతియతో నాత్యన్తం స్వరసంస్కారోద్దేశః. తదిదం విద్యా స్థానం వ్యాకరణస్య కార్త్స్న్యం స్వార్థసాధకం చ.**

అపీతి సంభావనే. మంత్రేష్విదం శాస్త్రమంతరేణ పదార్థప్రత్యయో నాస్తి. అర్థమప్రతియతో అర్థమజానతో అనవధృతార్థస్యేత్యర్థః. నాత్యన్తమ్- నైకాన్తికేన అనిశ్చయ ఇత్యర్థః. స్వరసంస్కారా వపతిష్ఠేతే. తదిదమేవం కృత్వా నిరుక్తశాస్త్రం విద్యాస్థానమ్. ఏతదధీనత్వాదర్థ ప్రతిష్ఠానస్య. వ్యాకరణస్య కార్త్స్న్యం కృత్స్నభావం కరోతి. తస్మాదపరిసమాప్తమేవ తావద్ వ్యాకరణమ్ యావత్ నిరుక్తం - నాధిగతమితి. నను వ్యాకరణస్య కార్త్స్న్య మేతత్కరోతీత్యుక్తే తచ్ఛేషమేవైతత్ ఉణాదివత్, తతశ్చ విద్యా స్థానత్వ మస్య విరుధ్యత ఇతి నేత్యుచ్యతే స్వార్థసాధకం చ. స్వతంత్ర మేవేదం విద్యాస్థాన మర్థనిర్వచనమ్. వ్యాకరణంతు లక్షణప్రధానమితి విశేషః.

అర్థము :— అథాపి 'అథ' ఇది అధికారార్థము. 'అపి' సంభావ నార్థమున నున్నది. ఇదమ్ అన్తరేణ=ఈనిరుక్తశాస్త్రములేక మంత్రేషు = మంత్రములయొక్క, అర్థప్రత్యయః నవిద్యతే = అర్థజ్ఞానము కలుగదు, అర్థమెఱుగని మనుష్యునకు న అత్యన్తం స్వరసంస్కారోద్దేశః = సరియైన స్వరసంస్కారము - వ్యాకరణ ప్రక్రియయొక్క నిశ్చయజ్ఞానము కలుగ నేరదు, తత్ = అందువలన, ఇదమ్ = ఈనిరుక్తశాస్త్రము, వ్యాకరణస్య విద్యాస్థానమ్ = వ్యాకరణజ్ఞానము కలిగించునట్టి, కార్త్స్న్యమ్ - సంపూర్ణ

శాస్త్రము, స్వార్థసాధకం చ=స్వప్రయోజనము-వేదార్థజ్ఞానమును కలిగించు నదియును.

"యది మంత్రార్థప్రత్యయాయ అనర్థకం భవతీతి కౌత్సః. అనర్థకా హి మంత్రాః."

యది మంత్రార్థప్రత్యయాయ ఏత దారభ్యతే నిరుక్తమ్ అనర్థక మేవ భవతీతి. కిమ్ కారణమ్-అనర్థకా హి మంత్రాః. తస్మాన్నారబ్ధవ్యమిత్యేవం కౌత్సః మన్యతే.

అర్థము :- యది మంత్రార్థప్రత్యయాయ = ఈనిరుక్తశాస్త్రము మంత్రార్థముల జ్ఞానముకొఱకే యగుచో అనర్థకం భవతి = వ్యర్థమగును, హి = కారణమేమన, మంత్రాః అనర్థకాః=మంత్రములు అర్థరహితములు, ఇతి కౌత్సః = అని కౌత్సునిమతము.

"తదేతే నోపేక్షితవ్యమ్."

కిమసౌ సత్యమాహ ఉతాహో మృషేతి వా పరీక్ష్యమ్.

అర్థము :- తత్ = పైనచెప్పిన మనమతము, ఏతేన = ముందు చెప్పబోవు కారణసముదాయముతో, ఉపేక్షితవ్యమ్ = బాగుగ పరీక్షింపదగి యున్నది.

"నియతవాచో యుక్తయో నియతానుపూర్వ్యా భవన్తి."

కయా పునరుపపత్త్యా కౌత్సో మంత్రాణా మానర్థక్యమాహేతి ఉచ్యతే. నియతవాచో యుక్తయః నియతవాచో యుక్తయః - అభిధాననియతా హి మంత్రాః భవన్తి. అగ్న ఆయాహి వీతయే (సామ.వే.సం. ౧-౧-౧-౧) నియతానుపూర్వ్యాః తద్యథా — అగ్న ఆయాహి - ఇతి న పునర్భవతి. ఆయాహ్యగ్న ఇతి. లోకే అర్థవతాం శబ్దానాం పౌర్వాపర్యం దృష్టమ్. ఆహర పాత్రమ్ పాత్రమాహర ఇతి. న చ తథా మంత్రేషు, తతో అర్థవైపరీత్యాత్ పశ్యామో అనర్థకా మంత్రా ఇతి.

అర్థము :- మంత్రములు నిరర్థకములని యెందులకనుచున్నామో వినుడు. నియతవాచో యుక్తయః = ఈమంత్రములు నిశ్చితశబ్దముల రచన గలవియై నియతక్రమముగలవి, భవన్తి = అగుచున్నవి. అనగా లౌకిక

శబ్దములలోవలె మంత్రశబ్దముల నెట్టిమార్పు చేయజాలము. ఆశబ్దముల స్థానములో పర్యాయపదములనుగూడ ప్రయోగింపజాలము. ఉదా :- అగ్న ఆయాహి అను నీపదముల స్థానమున-'విభావసో ఆగచ్ఛ' అని పర్యాయపదములను ప్రయోగింపవీలులేదు. మఱియు 'వీతయ ఆయాహి అగ్నే' అని మంత్రపదములలో క్రమమును మార్పజాలము. కాని లౌకిక భాషలో ఆహర పాత్రమ్ = పాత్రమాహర అని మార్చుటకు స్వాతంత్ర్య మున్నది. కావుననే మాకు మంత్రములు నిరర్థకములని తోచుచున్నది. మంత్రములలో పైనచూపినట్లు రెండువిధములగు మార్పులను జేసినచో మంత్రములు శ్రేయఃసాధకములుగా నంగీకరింపబడవు.

"అథాపి బ్రాహ్మణేన రూపసంపన్నా విధీయన్తే. ఉరుప్రథ స్వేతి ప్రథయతి. ప్రోహాణీతి ప్రోహతి."

అథాప్యయ మపరో హేతురానర్థక్యే మంత్రాణామ్. కతమః ? బ్రాహ్మణేన తే రూపసంపన్నాః విధీయన్తే. నహ్యర్థవన్తః సంతో వాసవద్ బ్రాహ్మణేన విధీయేరన్ విహితాశ్చ. తస్మాదనర్థకా మంత్రాః.

అర్థము :- అథాపి - మఱియు రెండవదోషము. రూపసంపన్నాః = రూపేణ లింగేన సంపన్నాః - సంయుక్తాః అపి ప్రకటలింగ=తమలింగము లతో సంయుక్తములయ్యు నీమంత్రములు, బ్రాహ్మణేన విధీయన్తే = తమ నియతలింగమును లెక్కచేయక నియతలింగమును వివక్షింపక బ్రాహ్మణము మూలమున వీని వినియోగము జరుగుచుండును. మంత్రములు సార్థకములే యగునెడల తమలింగముతోనే తమ వినియోగము చేయించు కొనెడివి. ఎట్లన :- 'ఉరు ప్రథస్వోరు తే యజ్ఞపతిః ప్రథతామ్. ఇట్టి మంత్రములు ప్రథనక్రియకొఱకు ప్రయుక్తములు. ఈమంత్రముయొక్క స్వరూపముతోనే ప్రథనక్రియ విధితముగుచున్నది. ఐనను 'ఇతి ప్రథయతి' అని విస్తరింపజేయును. అని బ్రాహ్మణవాక్యముచే ప్రథనక్రియయందు వినియోగముచేయబడును. ఇట్లే ప్రోహణకర్మకొఱకు ఏమంత్రము పఠింప బడునో 'ఇతి ప్రోహతి' అను బ్రాహ్మణవాక్యముతో మంత్రము ప్రోహణ క్రియయందు వినియోగింపబడుచున్నది. దీనినిబట్టి మంత్రములకు స్వీయ ముగా బలములేదనియు బ్రాహ్మణములపై ఆధారపడి సార్థకములగు చున్నవని స్పష్టమగుచున్నది. ఇందువలన నీమంత్రములు నిరర్థకములు.

**"అథాపి అనుపపన్నార్థా భవన్తి - 'ఓషధే త్రాయస్వైనమ్' 'స్వధితే మైనగ్ం హిగ్ంసీః' ఇత్యాహ హింసన్."**

అథాపి అయముపరో హేతు రనర్థకత్వే మంత్రాణామ్ - కతమః? అనుపపన్నార్థా హి ఏతే భవన్తి - తద్యథా - ఓషధే త్రాయస్వ ఏనమ్. న చౌషధి రాత్మానమపి త్రాతుం సమర్థా కిం పునర్ వృక్షమ్. తథా స్వధితే మైనగౌం హిగ్ంసీః ఇత్యాహ ఆత్మనైవ హింసన్.

అర్థము :- మంత్రము లనుపపన్నార్థకములనుటకు మఱియొక హేతువు. మంత్రము లసంగతార్థములనుటకు ఉదా :- ఓషధే త్రాయ స్వైనమ్ - ఓషధీ ఈవృక్షమును త్రాయస్వ రక్షింపుము. ఓషధి - జడ పదార్థము. కావున నది తననే రక్షించుకొనజాలదు. అట్టి దానిని 'వృక్ష మును రక్షింపుము' అని యనుట అసంగతము కాదా! ఇట్లే 'స్వధితే మైనగ్ం హిగ్ంసీః' ఓఖడ్గమా ఇతనిని హింసింపకు అని కోరుట ఎట్లు సంగతమగును? యజ్ఞపశువును ఖడ్గముతో చంపుచు, ఓఖడ్గమా నీవీపశు వును హింసింపకు. అనుటహాస్యాస్పదము అనుపపన్నము కాదా? మంత్రము హింసింపవలదని చెప్పుచుండ హింసాత్మకక్రియ చేయబడుచున్నది.

**"అథాపి విప్రతిషిద్ధార్థాః భవన్తి" ఏక ఏవ రుద్రోఽవతస్థే న ద్వితీయః. అసంఖ్యాతాః సహస్రాణి యే రుద్రా అధిభూమ్యామ్. అశత్రురింద్ర జజ్ఞిషే శతం సేనా అజయత్ సాకమింద్రః ఇతి.**

అథాపి అయ ముపరో హేతురానర్థక్యే మంత్రాణామ్. కతమః? విప్ర తిషిద్ధార్థా భవన్తి ఇతి. ఇతరేతరవ్యాఘాత ఇత్యర్థః. తద్యథా - ఏక ఏవ రుద్రోఽవతస్థే న ద్వితీయః అసంఖ్యాతాః సహస్రాణి యే రుద్రా అధి భూమ్యామ్ (య. వా. సం. ౧౬-౫౪) అశత్రురింద్ర జజ్ఞిషే (ఋ. సం. ౮-౭-౨౧-౨) శతం సేనా అజయత్ సాక మింద్రః (ఋ.సం. ౮-౫-౨౨-౧). ఏతాన్యుదాహరణాని.

అర్థము :- అథాపి-మఱియు మంత్రములు విప్రతిషిద్ధార్థా భవంతి. పరస్పరము విరుద్ధార్థములు కలిగియున్నవి. ఎట్లన ఒకచో ఏక ఏవ రుద్రః

అపత్స్వే = ఈ ప్రపంచమున నొకే రుద్రుడున్నాడు. న ద్వితీయః=రెండవ వాడు లేడు అని చెప్పబడినది. దీనికి విపరీతముగ మఱియొకచో అధి భూమ్యామ్ = భూమిపై, అసంఖ్యాతాః సహస్రాణి = అసంఖ్య వేలకొలది సంఖ్యలో రుద్రాః = రుద్రులు ఉన్నారని చెప్పబడినది. ఇట్లే- హేఇంద్ర! అశత్రుః జజ్ఞిషే = ఓ యింద్ర నీవు అజాతశత్రువై జన్మించితివి. దీనికి విరుద్ధముగా మఱియొకచోట ఇంద్రుడు, సాకమ్ = ఒకేసారి శతంసేనా అజయత్ = నూరుసేనలను జయించినాడు అనియు చెప్పబడినది.

**"అథాపి జానన్తం సంప్రేష్యతి - అగ్నయే సమిధ్యమానాయ అనుబ్రూహీతి."**

అయ మపరో హేతు ర్మంత్రాణా మానర్థక్యే. కతమః? జానన్తం సంప్రేష్యతి అధ్వర్యుర్హోతారమ్. అగ్నయే సమిధ్యమానాయ హోతారమ్ అనుబ్రూహీతి (శ. బ్రా. ౧-౩-౭-౩).

అర్థము :- అథాపి = మఱియు, మంత్రముల యనర్థకతను తెలుపు బడవహేతువు-జానంతమ్ = ఎఱుగుచున్న వేదజ్ఞుని సంప్రేష్యతి ప్రదీప్త మానాయ = జ్వలించుచున్న అగ్నయే = అగ్నికై, అనుబ్రూహి = మంత్ర ముల నుచ్చరింపుము - అనగా అగ్ని బాగుగ దీప్తమైయున్నపుడు మంత్ర ముల నుచ్చరించి అగ్నియందు ఆహుతినిమ్ము ఇది వేదాజ్ఞ యనిచెప్పాము. భళీ! అగ్ని ప్రజ్వలించుచున్నప్పుడు మంత్రోచ్చారణ పూర్వకముగ ఆహుతి నియ్యవలయునని యే యాజ్ఞికునకు తెలియదు? ఇట్లు తెలిసిన సామాన్య విషయములను గూర్చి వేదము విధించుచున్నది. దీనినిబట్టి వేదము నిరర్థకముకాక మఱియేమగును?

**"అథా ప్యాహ - అదితిః సర్వమ్ ఇతి. అదితిర్ ద్యౌరదితి రన్తరిక్షమ్ ఇతి. తదుపరిష్టాద్ వ్యాఖ్యాస్యామః."**

అయమపరో హేతుః మంత్రాణామానర్థక్యే - అదితిః సర్వమితి. కిముదాహరణమ్? అదితిర్ ద్యౌరదితిరంతరిక్షమ్ ఇతి. కథం సైవ ద్యౌః సా అంతరిక్షమ్? సైవ మాతా స ఏవ పుత్రః స ఏవ పితేత్యేవమాది.

అర్థము :- అథాపి - మంత్రముల యొక్క అనర్థక్యవిషయమున మఱి యొక హేతువు, ఒకస్థానమున అదితిః = అదితి, సర్వమ్ = అంతయు. అదితియే, అదితిః ద్యౌః అదితిరంతరిక్షమ్=అదితి ద్యులోకము అదితియే అంతరిక్షము అదితియే సర్వము అని మంత్రము చెప్పుచున్నది. మంత్రార్థము తదుపరి చెప్పెదము. ఆహా! ఒకేవస్తువు అన్నియు నెట్లుకాగలుగును? అదితియే మాత అదియే తండ్రి అదియే పుత్రుడు అని చెప్పబడినది. మాతయే పితాపుత్రులు ఎట్లు కాగలుగును? ఆలోచింపవలసిన విషయము కాదా?

**అథాపి అవిస్పష్టార్థా భవన్తి - అమ్యక్ యాదృశ్మిన్ జార యాయి కాణుకా ఇతి."**

అయ మపరో హేతురానర్థక్యే మంత్రాణామ్. కతమః? అవిస్పష్టార్థా అపి హి కేచిత్ భవన్తి మంత్రాః. తద్యథా - అమ్యగ్ యాదృశ్మిన్ జార యాయి కాణుకా ఇత్యేవమాదయః, న హ్యేషాం విస్పష్టార్థతా. తస్మాత్ సర్వ ఏవానర్థకా మంత్రాః ఇతి పూర్వపక్షః ఇతి అష్టమః ఖండః.

-అర్థము :- అథాపి = మఱియు మంత్రముల యనర్థకతయందు అంతిమము నెడవదియగు నొకహేతువు. ఈమంత్రములు అవిస్పష్టార్థా భవన్తి - స్పష్టముకాని అర్థములుకలవి యగుచున్నవి. ఎట్లన - అమ్యగ్ ఆది. స్పష్టార్థకములైన పక్షమున 'అమ్యగ్' మున్నగు పదముల జ్ఞానము సులభముగా నుండెడిది. పైనజూపిన సప్తహేతువులతో కౌత్సుడు ఆర్భాట ముగా మంత్రములన్నియు, వేదము - మిక్కిలి అనర్థకములని సిద్ధము చేయుటకు యత్నించెను.

**"అర్థవంతః శబ్దసామాన్యాత్"**

ఇప్పుడు వీనికి సమాధానము :- అర్థవన్తో మంత్రా ఇతి ప్రతిజ్ఞా. శబ్దసామాన్యాదితి హేతుః, సమాన ఏవ హి శబ్దో లోకేషు మంత్రేషు చ. తత్రైవం సతి స ఏవార్థవాన్ లోకే చానర్థకో మంత్రేషు ఇతి విశేషహేతు ర్నాస్తి కించాస్యత్—

అర్థము :— అర్థవన్తః = వేదమంత్రములన్నియు సార్థకములు. శబ్దసామాన్యాత్ = శబ్దములు సమానము లగుటవలన లోకమున నే శబ్దములు సార్థకములుగా జూడబడుచున్నవో ఆశబ్దములే వేదమున నున్నవి. లోకమున నవి సార్థకములు - తమ యభిధేయములను చెప్పుచున్నప్పుడు వేదమున నాశబ్దములే నిరర్థకములు - అర్థబోధకములు కావని యెవరు చెప్పగలరు? ఈవిషయముననే బ్రాహ్మణమును ప్రమాణముగా నిచ్చు చున్నాము.

> "ఏతద్ వై యజ్ఞస్య సమృద్ధం యద్రూపసమృద్ధం యత్ కర్మ క్రియమాణమ్ ఋగ్యజుర్వాభివదతీతి చ బ్రాహ్మణమ్."

ఏతదేవ హి యజ్ఞస్య కర్మణః సమృద్ధం సమృద్ధిః, యద్రూపసమృద్ధమ్. యత్ కర్మ క్రియమాణ మృగ్యజుర్వాభివదతీతి చ బ్రాహ్మణమ్ ఇతి. బ్రాహ్మణమపి చ మంత్రాణా మర్థవత్త్వమేవ సమర్థయతి.

అర్థము :- ఏతత్ = ఇదియే, వై = నిశ్చయముగ, యజ్ఞస్య సమృద్ధమ్ = యజ్ఞముయొక్క పూర్ణతయైయున్నది, యత్ = ఏది, రూపసమృద్ధమ్ = తన రూపమునపూర్ణము, మఱియు యత్ క్రియమాణం కర్మ = ఆచేయబడుచున్న యజ్ఞకర్మమును, ఋక్ యజుర్వా అభివదతి= ఋగ్వేదము యజుర్వేదముకూడ చెప్పుచున్నవి. దానినే సమర్థించుచున్నవి.

బ్రాహ్మణముకూడ వేదమంత్రములు సార్థకములని యెంచియే భిన్నభిన్నకర్మలలో నామంత్రము వినియోగము చెప్పుచున్నది. బ్రాహ్మణము దృష్టిలో మంత్రములు నిరర్థకములైన పక్షమున వానిని భిన్నభిన్న కర్మములందేల వినియోగించును? వినియోగింపదని భావము. ఈ బ్రాహ్మణవచనమున మంత్రము కర్మను చెప్పుచున్నదని మిక్కిలి స్పష్టముగా చెప్పబడినది. మంత్రములు కర్మనుబోధించుట సార్థకతయగునా లేక నిరర్థకతయా? ఇంతేకాక యజ్ఞసమృద్ధియు మంత్రముల యభివాదనపై నాధారపడియున్నట్లును చెప్పబడినది. అనగా యజ్ఞసార్థకత మంత్రోచ్చారణమీదనే యాధారపడియున్నది. కేవలము అగ్నిలో నాహుతు లొసంగుటమీద కాదు.

"క్రీడన్తౌ పుత్రైః ర్నప్తృభిః" ఇతి.

సమృద్ధరూపత్వే మంత్రాణా ముదాహరణమ్? "ఇహైవస్తం మా వియౌష్టమ్ విశ్వమాయు ర్వ్యశ్నుతమ్. క్రీడన్తౌ పుత్రై ర్నప్తృభి ర్మోదమానౌ స్వే గృహే" (ఋ.సం. ౧౦-౩-౨౧-౫) సూర్యాయా ఆర్షమ్ - వివాహే విని యుక్తా. అనుష్టుప్ ఇహైవ స్తం భవతం యువాం పతిపత్న్యౌ స్వే గృహే మోదమానౌ హర్షేణ తిష్ఠన్తౌ మా వియౌష్టమ్. మా చ కదాపీతి యుజ్యే యాథామ్. విశ్వమ్ సర్వమ్ - ఆయుః వ్యశ్నుతమ్ ప్రాప్నుతమ్ క్రీడంతౌ పుత్రైః నప్తృభిః పౌత్రైశ్చ సహేత్యాశీః.

అర్థము :- మంత్రముల సార్థకతయందు మఱియొక హేతువు లేక ప్రమాణము నిచ్చుచున్నారు.

"ఇహైవ స్తం మా వియౌష్టం విశ్వమాయు ర్వ్యశ్నుతమ్. క్రీడన్తౌ పుత్రైన్ నప్తృభిర్ మోదమానౌ స్వే గృహే."

దీనికర్థము :- ఓదంపతి 'ఇహైవ స్తం' మీరిరువురు ఇటనే యుండుడు, మా వియౌష్టమ్ = పరస్పరము విడిపోవలదు, విశ్వమాయుః= సంపూర్ణఆయువును, వ్యశ్నుతమ్=అనుభవింపుడు, స్వేగృహే=స్వగృహము నందు, పుత్రైః = పుత్రులతో, నప్తృభిః=దౌహిత్రులతోను, మోదమానౌ = సంతుష్టులగుచు, క్రీడన్తౌ = ఆడుకొనుచు ఆనందముతో నుండుడని యర్థము, వివాహసంస్కారమున నీమంత్రము వినియోగింపబడును. ఇది యెంత సుందరమైన ఆశీర్వాదభరితము. మంత్రము :- దీని వినియోగము వివాహమువంటి యుత్తమకర్మమునందు చేయబడినది. ఎంతటి యుత్కృష్ట భావ మిందుకలదో యెల్లరకు తెలియును. ఇట్టి ఉదాత్తభావపూరిత మంత్రములను నిరర్థకములనగలమా!

ఇట్లు సామాన్యముగ మంత్రసార్థకతను నిరూపించి, యిపుడు కౌత్సుని ఆక్షేపములను ఖండించుచున్నాడు.

> "యథో ఏతన్నియతవాచో యుక్తయో నియతానుపూర్వ్యా భవన్తీతి లౌకికేష్వప్యేతత్ యథా ఇంద్రాగ్నీ, పితా పుత్రావితి."

యథో ఏతత్ - యత్ పునరేతదుక్తమ్ నియతవాచో యుక్తయః నియతానుపూర్వ్యా భవన్తి మంత్రాః ఇతి. అత్ర బ్రూమః లౌకికేష్వప్యర్థవత్సు శబ్దేషు నియతవాచో యుక్తిత్వం నియతానుపూర్వ్యత్వం చ దృష్టమేవ తద్యథా - ఇంద్రాగ్నీ పితాపుత్రా ఏతి చ. యదుక్తమ్ - ప్రయోగనియమాదనర్థకా మంత్రా ఇత్యనైకాన్తికో హేతుః, తస్మాదర్థవన్త ఏవేతి.

అర్థము :- యదో ఏతత్ నియతవాచో యుక్తయో = మంత్రములు నిశ్చితశబ్దరచనగలవి, నియతానుపూర్వ్యా భవన్తి=నిశ్చితక్రమముగలవియు నగునని కౌత్సుడు చెప్పినదోషమునకు సమాధానమేమన - లౌకికేష్వపి = లౌకికశబ్దములందును నిశ్చితశబ్దరచన నిశ్చితక్రమము ఉండును. ఎట్లన - ఇంద్రాగ్నీ - పితాపుత్రౌ = ఇంద్రాగ్నులు, పితాపుత్రులు అను లౌకిక ప్రయోగములందును నిశ్చితశబ్దప్రయోగము నిశ్చితక్రమము ఉండును. అప్పుడే యాశబ్దములు సార్థకములు. అట్టియెడ వేదమునందు నిశ్చితశబ్ద ప్రయోగము - నిశ్చితశబ్దక్రమము అనర్థకమెట్లగును? కావున వేదానర్థకత విషయమున నిచ్చిన హేతువు నిరాధారము.

"యథో ఏతత్ బ్రాహ్మణేన రూపసంపన్నా విధీయన్త ఇతి ఉదితానువాదః స భవతి."

యదో ఏతత్ - యత్పునరేతదుక్తమ్. బ్రాహ్మణేన రూపసంపన్నా విధీయన్తే మంత్రా ఇతి. అత్ర బ్రూమః - ఉదితానువాదః స భవతి. ఉక్తానువాద ఇత్యర్థః. సిద్ధస్య కథన మనువాదః. తస్మాదుభయ మర్థవత్. మంత్రాశ్చ బ్రాహ్మణం చేతి.

అర్థము :- యదో ఏతత్=మంత్రములు తమరూపమున సంపన్నము లయ్యు, బ్రాహ్మణేన = బ్రాహ్మణముద్వారమున విహితములు - విని యుక్తములగుచున్నవి. కావున మంత్రములు నిరర్థకములని రెండవ యాక్షేపము - దానికి సమాధానమేమన - ఉదితానువాదః స భవతి = అది ఉక్తానువాదము లేక విహితానువాదము - చెప్పినదాని ననుసరించుట మాత్రమే, అది అపూర్వవిధానము కాదు. అనువాదమువలన వేదము నిరర్థకము కాదు.

"యథో ఏతదనుపపన్నార్థా భవన్తీత్యామ్నాయ వచనా దహింసా ప్రతీయేత."

యదో ఏతత్ - యత్ పునరేత దుక్తమ్. ఓషధే త్రాయస్వైనమ్, స్వధితే మైనం హింసీః ఇత్యాదయో మన్త్రా అనుపపన్నార్థా భవన్తి. అత్ర బ్రూమః ఓషధిపదేన ఓషధ్యధిదేవతోచ్యతే. తదుక్తం వేదాన్తేఽపి - అభిమానివ్యపదేశస్తు యదపి చోక్తమ్-'స్వధితే మైనం హింసీ రిత్యాహ హింసన్నితి తత్ర బ్రూమః-ఆమ్నాయవచనా దహింసా ఏషా ప్రతీయతే. ఇయమహింసా ఇయమ్హింసా, ఇత్యాగమాదేతత్ ప్రతీయతే. యదుక్తమ్ - యా వేద విహితా హింసా న సా హింసా ప్రకీర్తితా.'

అర్థము :- యదో ఏతత్ - మఱియు మంత్రములు అనుపపన్నార్థా భవన్తి=అసంగతార్థములు కలవి యని చెప్పబడినది దానికి సమాధానము- ఆమ్నాయవచనాత్=వేదప్రామాణ్యమువలన నట హింస లేదు. అహింసయే తెలియవలయును. ధర్మాధర్మ, కర్తవ్యాకర్తవ్య విషయమున ప్రత్యక్షాది ప్రమాణములకంటె వేదమే అధికప్రమాణము - హింస యననేమి అహింస యననేమి నిర్ణయించుటలో వేదముకంటె మించినప్రమాణము మఱియొకటి లేదు.

"యథో ఏతత్ విప్రతిషిద్ధార్థా భవన్తీతి - లౌకికేష్వప్యే తత్ - యథా అసపత్నోఽయం బ్రాహ్మణోఽనమిత్రో రాజేతి.

యదో ఏతత్ యత్. పునరేతదుక్తమ్-విప్రతిషిద్ధార్థా మన్త్రా భవన్తితి. అత్ర బ్రూమః - నైష విప్రతిషిద్ధోఽర్థః. ఏక ఏవ రుద్రోఽవతస్థే, అసంఖ్యాతాః సహస్రాణి. దేవతా హి మహాభాగ్యయోగా దేకాపి స త్యనేకధా భవతి, అనేకాపి చైకధా. యత్ పున రేతదుక్తమ్ - అశత్రురింద్ర జజ్ఞిషే శతం సేనా అజయత్ సాకమింద్రః అత్ర బ్రూమః - లౌకికేష్వపి అర్థవత్సు శబ్దేషు ఏతద్ దృష్టమ్ తద్ యథా - అసపత్నోఽయం బ్రాహ్మణః అన మిత్రో రాజా ఇతి. న హి కశ్చిత్ అసపత్నోఽస్తి లోకే అనమిత్రశ్చ ఉక్తం హి—

"మునేరపి వనస్థస్య స్వాని కర్మాణి కుర్వతః
ఉత్పద్యన్తే త్రయః పక్షా మిత్రోదాసీన శత్రవ ఇతి."

తథాపి స్వల్పసపత్నం దృష్ట్వా కేచిదేవం వక్తారో భవన్తి. అసపత్నోఽయం బ్రాహ్మణః ఇతి. ఏవమేవ పాఠితే మేఘే అన్యేషామసారతా మభిప్రేత్యేద ముక్తం స్యాత్. 'అశత్రురింద్ర జజ్ఞిషే' ఇతి. కథం తర్హి ? 'శతం సేనా అజయత్ ఇత్యేతదుక్తమ్ ? ఉచ్యతే - రూపకల్పనయైవైషా యుద్ధ ప్రవాదా స్తుతిః.

అర్థము :- యుదో ఏతత్-మంత్రములు పరస్పరము విరోధముకలది యగుటచే నవి నిరర్థకములనుటయు సరికాదు. ఏలయన లౌకికవాక్యము లందును నట్టిపరస్పరవిరోధము చూడబడుచున్నది. కాని యది ఆక్షేప యోగ్యముగా నెంచబడదు. అట్లే వేదమంత్రముల విషయమునను ఎంచ వలయును. లోకమునందువలెనే వేదమునందును సార్థకత గుర్తింపవలెనని భావము. 'ఏక ఏవ రుద్రః' అనుదానికి సమాధానము - దేవతలు మహా మహిమ గలవియగుటచే ఒక్కదేవత యనేకదేవతలగుటకు సామర్థ్యము కలిగియుండును. కావున నిందు పరస్పరవిరోధ మొండును లేదు. ముందు దేవతాకాండమున 'మహాభాగ్యాద్దేవతాయాః'ఆది దేవతలకు అద్భుతసామర్థ్య మున్నట్లు ముందు స్వీకరింపబడును. ఇక, ఇంద్రుడు అజాతశత్రువని చెప్పబడినది-మఱియొకయెడ వేలకొలదిశత్రువులను జయించినట్లున్నది. ఇందులకు సమాధానము - లోకమున నట్టివి చూడబడుచున్నవి. ఎట్లనః— అసపత్నోఽయం బ్రాహ్మణః = ఈబ్రాహ్మణుడు శత్రురహితుడు అజాత శత్రువనబడును. కాని లోకమున శత్రురహితుడొక్కడైన నున్నాడా ? కావున 'అసపత్నః' అజాతశత్రువు - అనగా తక్కువ శత్రువులుకలవాడని యర్థము గ్రహింపనగును—

"మునేరపి వనస్థస్య స్వాని కర్మాణి కుర్వతః ఉత్పద్యన్తే త్రయః పక్షాః మిత్రోదాసీన శత్రవః."

అరణ్యమునసుండి తనకార్యములను నిర్వహించుబ్రాహ్మణునకు గూడ మిత్రులు ఉదాసీనులు శత్రువులు అను మూడుపక్షము లుండు నని శ్లోకాభిప్రాయము.

**యథో ఏత జ్జానంతం సంప్రేష్యతీతి. జానన్త మభివాదయతే జానతే మధుపర్కం ప్రాహేతి.**

యథో ఏతత్ - యత్ పునరేతదుక్తమ్. జానన్తం ప్రేష్యతీతి. అత్ర బ్రూమః - లౌకికేష్వప్యర్థవత్సు శబ్దేషు ఏతదేవ స్వాభావ్యం దృష్టమ్. జానంతం గురుమ్ అభివాదయతే స్వగోత్రమభివదన్ తథా. జానతే మధుపర్కం ప్రాహ - త్రిర్మధుపర్కో మధుపర్క ఇతి.

అర్థము = మఱియు, ఎఱుగుచున్న వేదజ్ఞపండితునకు 'ఈకార్యమెనర్పుము' అని యాజ్ఞనొసంగుటయు దోషముగా నాక్షేపింపబడినది. ఇట్టిది లోకమునందును జరుగును. ఎట్లన - జానన్తమ్ = ఎఱుగుచున్న నిత్యము తనకు జదువుచెప్పు గురువునకు ప్రణామిల్లునపుడు తననామము నుచ్చరింపవలయునని విధానమున్నది. ఇట్లే ఎఱుగుచున్న అతిథికి 'మధుపర్కో మధుపర్కో మధుపర్కః ప్రతిగృహ్యతామ్' మధుపర్కము గ్రహింతురుగాక అని చెప్పి మధుపర్కమీయబడును. అందువలన లోకమున జరిగినట్లు ఇట వేదమునందును జరుగుట స్వభావముగా గ్రహింపవలెను.

**యథో ఏతదదితిః సర్వమితి. లౌకికేష్వప్యేతత్-యథా-సర్వరసా అనుప్రాప్తాః పానీయ మితి.**

యథో ఏతత్ యత్ పున రేతదుక్తమ్ - అదితిః సర్వమితి. అదితిర్ దేవమాతా, అత్ర బ్రూమః — స ఏష భక్తివాదః - యథా - త్వమేవ మే మాతా, త్వం మే పితా - లౌకికేష్వపి శబ్దేషు ఏతద్ దృష్టమ్. యథా సర్వరసా అనుప్రాప్తాః పానీయమితి.

అర్థము :- మఱియు నింకొక యాక్షేపము చేయబడినది - ఏమన :— వేదమునందు ఒకేవస్తువైన అదితి సర్వముగా చెప్పబడినది. సమాధానము- ఇట్టిది లౌకికవచనములందును జరుగును. ఎట్లన - సర్వరసాః సమస్తరసములు, జలమ్=జలమునందు కలిసియున్నవి. అనగా సమస్తరసములు జలముచే నుత్పన్నములగునని భావము. లోకమున జలము లభించిన

అన్నిరసములు లభించినట్లే యని గౌణవృత్తితో చెప్పబడును. ఇది దోషము కాదు.

> "యథో ఏతదవిస్పష్టార్థా భవన్తీతి. నైష స్థాణో రపరాధః యదేనమంధో న పశ్యతి. పురుషాపరాధః స భవతి. యథా జానపదీషు విద్యాతః పురుషవిశేషో భవతి. పారోవర్యవిత్సు తు ఖలు వేదితృషు భూయోవిద్యః ప్రశస్యో భవతి.

యదో ఏతత్ - యత్ పునరేతదుక్తమ్ - అవిస్పష్టార్థా మంత్రా భవన్తీతి. అత్ర బ్రూమః - 'నైష స్థాణో రపరాధః' ఇతి న హ్యత్ర స్థాణు రపరాధ్యతి యదేనం స్థాణుం అంధో న పశ్యతి. కిం తర్హి? పురుషాపరాధః స భవతి. పురుషఏవాపరాధీ తత్ర యదసౌ న పశ్యతీతి. ఏవమిహాపి నైవ మంత్రాణామపరాధో యదశిక్షితేన భవతా న విజ్ఞాయన్తే యథా - జానపదీషు ప్రవృత్తిషు కౌశలశిక్షాకృతః విద్యాతః పురుషాణాం విశేషః. కేచిత్పురుషా అవిస్పష్టార్థానపి శక్నువన్తి విస్పష్టీకర్తుమ్. కేచిద్విస్పష్టార్థానపి న జానన్తి. తత్రైవం సతి వేదితృషు భూయోవిద్యః ప్రశస్యో భవతి; నేతరో మందబుద్ధి రశిక్షితః.

అర్థము :- యదో ఏతత్ - మఱియు మంత్రములు అవిస్పష్టార్థకము లగును - 'అమ్యక్ అది' అమ్యక్ మొదలైనవి - అని చెప్పబడినది. దానికి సమాధానము 'స్థాణో రపరాధః న' ఇది స్థాణువు - నిలబెట్టబడియున్న కొయ్య - అపరాధము కాదు - ఎదురుగా నిలబడియున్న ఒకకొయ్యను చూడకుండుట దానిని చూడజాలకుండుట యంధుని దోషమగును కాని మొద్దుదోషము కాదుకదా! అది పురుషాపరాధః కొయ్యను చూడజాలని మనుష్యుని దోషమగును కాని స్థాణువుదోషము కానేరదు. అట్లే వేదాంగాదుల నధ్యయనముచేయక యజ్ఞుడై వేదమంత్రములను జదివి తెలిసికొనలేకపోవుటఅశిక్షితుని దోషమగును కాని మంత్రముల దోషముకాదు. కావున మంత్రము లవిస్పష్టార్థకములనుట యుక్తము కాదు. ఎట్లన జానపదీషు జనపదేభవాః జానపద్యః తాసు - జానపదీషు. చిత్రకర్మ మున్నగుకళలందు, విద్యాతఃపురుషవిశేషో భవతి. విద్యవలన హస్తనైపుణ్యము సాధించుటలో ఒకడు శ్రేష్ఠుడగును. కొండొక కార్యమునందు పరిశ్రమచేసినవాడు అందు

శ్రేష్ఠుడగును. అపనియందతనికే ప్రతిష్ఠ కలుగును. అతడే అందు ప్రామాణికుడగును. అట్టి మంత్రార్థమును తెలిసికొనుటలో కుశలతసంపాదించిన వానికే మంత్రార్థము విస్పష్టమగును. కొందరి విద్వాంసుడు అస్పష్టార్థక మంత్రములనుకూడ విద్యాబలముచే తెలిసికొని దానియర్థములను తెలుపగలుగును. పారోవర్యవిత్సు పారోవర్యేణ విదన్తి=ఆచార్యపరంపరను ననుసరించి శ్రవణమొనర్చిన వేదితృషు = విద్వాంసులలో భూయోవిద్యః = అధికవిద్వాంసుడు ప్రశస్యుడగును. శ్రేష్ఠుడుగా నెంచబడును. అట్టి విద్వాంసుడు అస్పష్టార్థకమంత్రములనుగూడ సులభముగా నర్థమును ప్రదర్శింపగలడు. అవిద్వాంసుడు కించిజ్ఞుడు వేదమంత్రముల నర్థముచేసికొనుటలో నసమర్థుడు, వంచితుడు నగును. చక్షుష్మంతుడు మెట్టపల్లములుకలిగి విషమములైన మార్గములనుగూడ సులభముగ తరింపగలడు-అంధుడు ఎదురుదెబ్బలుతిని పడిపోవును.

పంచమ పాదము సమాప్తము

## షష్ఠ పాదము

"అథాపీద మన్తరేణ పదవిభాగో న విద్యతే."

ఇదమన్తరేణ - నిరుక్తం వినా పదవిభాగః ఏవం పదాని వక్తవ్యాని ఇతి ఏతస్ విభాగ - పరిజ్ఞానం నాస్తీత్యర్థః. అర్థ-వశేన హి పదాన్యపతిష్ఠన్తే. స చేద మన్తరేణార్థ - పరిజ్ఞాన మస్తి.

అర్థము :- అథాపి కించ ఇద మంతరేణ=ఈనిరుక్తశాస్త్రము లేకున్న పదవిభాగః న విద్యతే = పదవిభాగము కాజాలదు. మంత్రములలోని పదముల విభాగము చేయజాలము. పదవిభాగము కానంతవఱకు పదార్థ పరిజ్ఞానము కుందేలు కొమ్మువంటిదగును. కావున నిరుక్తము తప్పక చదువవలయును. పద విభాగమునకు ఉదాహరణము.

"అవసాయ పద్వతే రుద్ర మృడ ఇతి - పద్వదవనం గావః పథ్యదనమ్ అవతే ర్గత్యర్థస్యాసౌ నామకరణః. తస్మాన్నావగృహ్ణన్తి 'అవసాయాశ్వాన్' ఇతి స్యతిరుపసృష్టో విమోచనే తస్మాదవగృహ్ణన్తి."

పదవిభాగవిశేషం దర్శయతి - అవసాయపద్వతే రుద్ర మృడేతి. పద్వత్ పాదవత్ పాదసంయుక్తమ్. అవసం - పథ్యదనమ్; నామకరణః - ప్రత్యయః. నావగృహ్ణన్తి పదకారా ఇతి శేషః. హేరుద్ర! పద్వతే - పాద యుక్తాయ మృడ సుఖీ భవ. మైనాః హింసీ స్త్వమసౌ మీశ్వర ఇత్యభి ప్రాయః. అవసాయాశ్వానితి. ఇద మపరముదాహరణమ్. స్యతిర్ధాతుః విమోచనే అర్థే వర్తతే. స పునః ఉపసృష్టః ఉపసర్గేణానేన సంయుక్త ఇత్యర్థః అవసాయ - వియోజ్య. రశ్మిభ్యో అశ్వాన్ నిషీద.

అర్థము:- ఈరెండుమంత్రములందును సమానరూపమున అవసాయ పదము వచ్చును. అందు మొదటి 'అవసాయ' ఇది చతుర్థ్యన్తము. అందు వలన దీని పదవిభాగమేర్పడదు. కాని రెండవదానియందు అవపూర్వక 'షోఽన్తకర్మణి' ధాతువువలన 'క్త్వా' ప్రత్యయస్థానమున 'ల్యప్' ప్రత్య యము చేయబడినది. అందువలన అవ సాయ అని రెండుపదములుగ పదకారులు విభజింతురు. మొదటిదానికర్థము - అవసాయ = పాథేయము నకు సాధనమైన, పద్వతే = గోవుకొఱకు, మృడ = కల్యాణమొనర్పుము, పద్వతః = గోవులు, అవసః = పాథేయము - పథి అదనమ్ = మార్గమున తినదగినది పాథేయమనబడును. అవసశబ్దః గత్యర్థక అవతేః అసౌ నామ కరణః. అస - ఇది ప్రత్యయము అనగా గత్యర్థక - అవధాతువునకు 'అసు' ప్రత్యయముచేసిన అవసపదము సిద్ధమగును. దాని చతుర్థ్యన్త రూపమె 'అవసాయ' ఇది అసమస్తపదము - వ్యస్తపదము. కావున పద కారులీపదమును విభజింపరు. (తస్మాన్నావగృహ్ణన్తి) పదచ్ఛేదము చేయరు. కాని 'అవసాయాశ్వాన్' అనుదానిలో స్యతిరుపసృష్టః స్యతిః - 'షోఽన్త కర్మణి' ఉపసృష్టః - ఉపసర్గకలదై విమోచనార్థమున నున్నది. కావున నిక్కడ అవగృహ్ణన్తి విగ్రహము చేయుచున్నారు - పదచ్ఛేదము చేయు చున్నారు.

> **"దూతో నిర్ఋత్యా ఇదమాజగామ ఇతి పంచమ్యర్థ - ప్రేక్షా వా షష్ఠ్యర్థప్రేక్షావా ఆఃకారాన్తమ్ 'పరో నిర్ఋత్యా ఆచక్ష్వ' ఇతి, చతుర్థ్యర్థప్రేక్షైకారాన్తమ్"**

అస్మిన్ పదే నిరుచ్యమానే పంచమ్యర్థో దృశ్యతే. షష్ఠ్యర్థ ప్రేక్షా షష్ఠ్యర్థో వా. అథవా ఆఃకారాన్తం పదమ్ నిర్‌ఋత్యా ఇతి. దూతో నిర్‌ఋత్యా ఇదమాజగామ (ఋ. ౧౦-౧౬౫-౧) త్రిష్టుప్ వేషా. ఇద మస్మద్గృహ మా జగామ. నిర్‌ఋతిసకాశాద్వా నిర్‌ఋత్యాః కస్యాశ్చిద్దూతో వా నిర్‌ఋత్యా వాహ. పరః పరాగత్య యస్యా నిర్‌ఋత్యాః త్వం దూతః తస్యై నిర్‌ఋత్యై ఆచక్ష్వ కథయ.

అర్థము:- ఓదేవతలార ! దూతః=ఈకపోతము దూతయై, నిర్‌ఋత్యాః= నిర్‌ఋతిసమీపమునుండి, ఇదమ్ = ఇక్కడికి - మాయింటికి, ఆజగామ = వచ్చినది; ఇతి=అని, ఋమంత్రమున పంచమ్యర్థ ప్రేక్షా వా - లేక పంచమి యొక్క యర్థమున నిర్‌ఋతిదూత = నిర్‌ఋతియొక్కదూత, ఆఃకారాన్తాత్= ఆఃకారము అంతమందుగల పదవిభాగము చేయబడినది. అనగా నిట పంచమీ, షష్ఠీ రెండువిభక్తుల యర్థము చెప్పవచ్చును. రెండర్థములలోను పదము ఆఃకారాన్తముగానె యుండును (నిర్‌ఋత్యాః అని) కాని 'పరో నిర్‌ఋత్యా ఆచక్ష్వ' పరః = దూరముచెల్లి, నిర్‌ఋత్యై=నిర్‌ఋతికొఱకు కుత్సిత విచారముకొఱకు - లేక కుత్సితభావనకొఱకు, ఆచక్ష్వ = మా సందేశమును జెప్పుము. ఇతి చతుర్థ్యర్థ ప్రేక్షా = చతుర్థీవిభక్తి యొక్క అర్థమున్నది - అందువలననే నిర్‌ఋత్యై - ఐకారాంతమ్ = ఐకారాంతపదవిభాగము చేయ బడినది. తాత్పర్యమేమన రెండుమంత్రములందును సమానరూపమున నిర్‌ఋత్యా అనుపదము వచ్చును. కాని నిరుక్తశాస్త్రజ్ఞాతమాత్రము దీనిలో అర్థానుసారము పదచ్ఛేదముచేసి సరియైన యర్థమును తెలిసికొనును. నిరుక్తము చదువనివాని కిట్టి స్థలములందు పదవిభాగముచేయుట యశక్యము. అందువలన సరియైన పదవిభాగముచేయుటకు అర్థము నెఱుంగుటకును నిరుక్తము తప్పక అధ్యయన మొనర్పవలయునని స్పష్ట మగుచున్నది.

పదవిభాగ ప్రసంగమున సంహితా లక్షణమును చెప్పుచున్నాడు.

**"పరః సన్నికర్షః సంహితా, 'పద - ప్రకృతిః సంహితా' పదప్రకృతీని సర్వచరణానాం పార్షదాని."**

సంహితాలక్షణమాహ - పరః సన్నికర్షః సంహితా (పా. ౧-౪-౧౦౯) పరఃప్రకృష్టః యః సన్నికర్షః సంశ్లేషః స్వరాణాం వ్యంజనానాం సా

సంహితేత్యుచ్యతే. సా పున రియం పద - ప్రకృతిః సంహితా శౌనక (ఋ. ప్రాతి. ౨౧) అత్ర ద్విధా వర్ణయన్తి. పదానాం యా ప్రకృతిః సేయం పద - ప్రకృతిః. సంహితైవ ప్రకృతిః వికారః పదానీత్యేవ మేకే మన్యన్తే అపరే పునః పదాని ప్రకృతిర్యస్యాః సేయం పదప్రకృతిరితి. పదాన్యేవ హి సంహన్యమానాని సంహితా భవతి. తస్మాత్ పదాన్యేవ ప్రకృతిర్వికారః సంహితేతి. సర్వచరణానాం సర్వశాఖాన్తరాణా మిత్యర్థః. పార్షదాని=ప్రాతిశాఖ్యాని, పద - నిష్ఠ - కార్యతా - నిరూపిత - సంహితా నిష్ఠ - కారణతాని ఏవం చ —

సంహితాయాః ప్రకృతిత్వం పదానాం చ వికృతిత్వం సాధీయః యతో యజ్ఞకర్మణి సంహితయైవ వినియుజ్యన్తే మన్త్రా న పదైః.

అర్థము:- "పరః సన్నికర్షః సంహితా" ఇది పాణినీయసూత్రము. దీనియర్థము. పరః సన్నికర్షః = వర్ణముల యత్యంతసమీపత 'సంహితా' అనబడుచున్నది. వర్ణముల అతిశయిత సన్నిధినామము సంహిత. 'పద ప్రకృతిః సంహితా' అనువిషయమున రెండువిధములగు విచార-ఆలోచన మున్నది. పదము వికృతి, సంహిత ప్రకృతియని కొందఱంగీకరింతురు. మఱికొందఱు పదముప్రకృతి, సంహితవికృతి యనియు సంగీకరింతురు. అనగా కొందఱు 'పదానాం ప్రకృతిః' = పదములయొక్క ప్రకృతియని సమాసముచేసి సంహితను పదములకు ప్రకృతి - కారణమని యందురు. సంహితనుండియే పదములు తీయబడినవని వీరియభిప్రాయము. అందువలన పదములు వికారము. ప్రకృతికాదు ప్రకృతి సంహితయే. రెండవ పక్షమువారు అది సరికాదు. 'పదాని ప్రకృతిః యస్యాః సా పదప్రకృతిః సంహితా' అని విగ్రహముచేయుట యుచితమందురు. పదములవలనను సంహిత యేర్పడుచున్నది. మొదట పదములు తదుపరి సంహిత. కావున సంహితవికారము - పదములు ప్రకృతి కారణమని వీరిమతము. సర్వ చరణానాం - సర్వేషాం చరణానాం శాఖాంతరాణామ్ = అన్నియు ఇతర శాఖలయొక్క పార్షదాని = ప్రాతిశాఖ్యలు పదప్రకృతీని - పదాని ప్రకృతి ర్యస్యాః సా పదప్రకృతిః సంహితా అను విగ్రహము సంగీకరించినారు. అనగా ఇతరసర్వశాఖలకు సంబంధించిన ప్రాతిశాఖ్యలు పదములనే

సంహితకు కారణముగా నంగీకరించినవి. మఱియు సంహితయే వికృతి - కార్యమని యంగీకరించినవి.

ఇట్లు రెండువిధములగు సిద్ధాంతములు తెలిసినమీదట నేసిద్ధాంతము గ్రహింపదగియున్నది? అను సందేహము కలుగును. దుర్గాచార్యుని మతముమాత్ర మిది :— ఇతరశాఖలవారు ఏసిద్ధాంతముల సంగీకరించినను దుర్గాచార్యుడు మాత్రము సంహితయే ప్రకృతి, పదములు దానివికారములు. ఏలయన యజ్ఞకర్మలందు సంహితాపాఠమే వినియోగింపబడుచున్నది. పదపాఠము కాదు. పదములు ముఖ్యమగునెడల యజ్ఞకర్మలలో పదపాఠము వినియోగింపబడెడివి - వేదపాఠకులు తమ సంతానమునకు శిష్యులకును సంహితాపాఠమే చెప్పుచున్నారు. సంహితాపాఠము తదుపరి పదపాఠము చెప్పుచుండుట చూచుచున్నాము. కావున సంహితయే ముఖ్యము. అదియే ప్రకృతి - కారణము. పదములే వికృతియని స్పష్టమగుచున్నది.

> "అథాపి యాజ్ఞే దైవతేన బహవః ప్రదేశా భవన్తి. తదేతేనోపేక్షితవ్యమ్. తే చేద్ బ్రూయు ర్లింగజ్ఞా అత్ర స్మ ఇతి. 'ఇంద్రం న త్వా శవసా దేవతా వాయుం పృణంతి' ఇతి. వాయులింగం చేంద్రలింగం చాగ్నేయే మంత్రే, అగ్నిరివ మన్యో త్విషితః సహస్వ' ఇతి తథాఽగ్నిర్మాన్యవే మంత్రే. త్విషితో జ్వలితః. త్విషిరిత్యప్యస్య దీప్తినామ భవతి.

అథేద మపర మారంభప్రయోజన మస్య శాస్త్రస్య. కిమిత్యుచ్యతే యజ్ఞేకర్మణి ప్రవర్తమానే దైవతేన లింగేన బహవో విధిప్రదేశా భవన్తి.

తత్రైవం సతి - తే చేద్ బ్రూయు ర్లింగజ్ఞా అత్ర స్మ ఇతి. లింగతో వయ మత్ర యా యస్మిన్ దేవతా తాం తత్ర విజానీమః. విజ్ఞాయ చ తద్దైవత ఏవ కర్మణి వినియుంజామహే తం మంత్రమ్. ఏవం చ న నో నిరుక్తశాస్త్రేణ ప్రయోజనమస్తీతి కేచిత్ వక్ష్యన్తి. త ఏవం వక్తవ్యాః — యది యూయం లింగతో మంత్రదేవతాం విజానీధ్వే తర్హి "ఇంద్రం నత్వా శవసా దేవతా వాయుం పృణన్తి (ఋ. సం. ४-౫-౬-౭) ఇత్యేతస్మిన్

మంత్రే కా దేవతా? ఇతి. వాయులింగం చేంద్రలింగం చాగ్నేయమంత్రే.
అయ మాగ్నేయో మంత్రః. అథ చ తావదేతస్మిన్ మంత్రే. ఇంద్రవాయూ
అపి ప్రూయేతే, తదేతద్ దుష్పరిజ్ఞానం లింగమాత్రేణ. తస్మాత్ పరిజ్ఞేయం.
నిరుక్తమ్. భరద్వాజస్యార్షమ్. హేఅగ్నే! త్వామేవైకం దేవతాః సర్వా
ఇంద్రం న - ఇంద్రమివ వాయుమివ చ శవసా - బలేన బలయుక్తాభిః
స్తుతిభిః వృణన్తి - పూరయన్తి అగ్నిరివ మన్యో త్విషితః సహస్వ (ఋ.సం.
౮-౩-౧౯-౨) యథా పూర్వస్మిన్నాగ్నేయే మంత్రే వాయులింగ మింద్ర
లింగం చ తథా ఏతస్మిన్నపి మాన్యవే మంత్రే అగ్నిలింగమ్. ఏవ మనేక
దేవతా - లింగ - సంకరేషు దురవధారం దేవతా - తత్త్వ మనైరుక్తేన.

అర్థము :- అథాపి - మఱియు నిరుక్తాధ్యయనమునకు మఱియొక
ప్రయోజనమేమన యాజ్ఞే = యజ్ఞకర్మమునందు, దేవతేన = దేవతానామ
ముతో, బహవః ప్రదేశాఃభవన్తి = బహువిధులు నిర్దేశింపబడియున్నవి,
తద్ = ఆనిర్దేశములన్నియు, ఏతేన=ఈనిరుక్తశాస్త్రముతో, ఉపేక్షితవ్యమ్ =
తెలియబడగలవు, లేక నిరుక్తజ్ఞుడు ఏతేన = ఈనిరుక్తముతోనే తెలిసికొన
వలయును. యజ్ఞములందనేకస్థలములలో, ఈస్థానమున ప్రాజాపత్యాహుతి
నీయవలెను. ఈస్థానమున ఆగ్నేయాహుతి నీయవలయునని నిర్దేశింపబడినది.
ఇట్టి నిర్దేశములు నిరుక్తములు చదువనివానికి తెలియవు. అందులకీ
శాస్త్రము చదువవలెనని తాత్పర్యము. నిరుక్తము చదువకున్న దేవతా
జ్ఞానము కలుగదు. అందువలన యజ్ఞాదులను సుచారురూపమున నిర్వ
ర్తించుటకు నిరుక్తాధ్యయనము తప్పక చేయవలయును. యది చేత్ తే
ప్రూయుః తే = ఆయుత్విజులు వేదజ్ఞులు అత్ర 'లింగజ్ఞాః స్మః' = మేమిట
దేవతాలింగజ్ఞానము కలవారము ఉన్నాము కదా! వేదమంత్రములందే
లింగజ్ఞానము కలదు గదా! నిరుక్తాది శాస్త్రప్రయోజనమేమున్నది? అని
యందురేని వారిముందు మంత్రములనుంచి యందలి దేవతలనుగూర్చి
చెప్పుడని ప్రశ్నింపవలెను.

మంత్రార్థము :— దేవతాః = సర్వదేవతలు, త్వా=నిన్ను, ఇంద్రం
ఇవ = ఇంద్రునివలె, వాయుం న = వాయువువలె, శవసా = బలముతో -
బలపూర్వకమైన పెద్దగా స్తుతులతో, వృణన్తి = పూజింతురు, ఇతి =
అని, ఆగ్నేయే మంత్రే అగ్నిదేవతగాగల మంత్రమున, వాయులింగం చ =

వాయుదేవతా చిహ్నములు, ఇంద్రలింగం చ = ఇంద్రదేవతాలింగములు సున్నవి. కావున కేవలలింగజ్ఞానమువలన మంత్రమున ముఖ్యదేవత యెవరో నిర్ణయించుట మిక్కిలికష్టము. రెండవమంత్రమున కర్థము. మన్యో = హే మన్యుస్వరూపరాజా !, అగ్నిరివ = అగ్నివలె, త్విషితః=దీప్తి వలన నిజతేజస్సుతో, సహస్వ = శత్రువులను పరాస్తమొనర్పుము అను ని మాన్యవే మంత్రే = మన్యుదేవతకు సంబంధించిన మంత్రమునందు అగ్ని దేవతకు సంబంధించిన చిహ్నముకూడ కనిపించుచున్నది, త్విషితః = జ్వలితః త్విషితపదమున కర్థము జ్వలితము - మండినది అని - త్విషి అని దీప్తికిపేరు. త్విషి, దీప్తి సమానార్థకములు.

**అథాపి జ్ఞానప్రశంసా భవతి. అజ్ఞాననిందా చ.**

అథాపి ఇదమపరమారంభ-ప్రయోజన మస్య. కిమ్ ? జ్ఞానం చ ప్రశస్యతే అజ్ఞానం చ నింద్యతే. తత్రైవంసతి వయమనింద్యాః స్యామప్రశస్యా శ్చేతి జ్ఞేయం నిరుక్తమ్.

**స్థాణురయం భారహారః కిలాభూదధీత్య, వేదం న విజానాతి యోఽర్థమ్ యోఽర్థజ్ఞ ఇత్ సకలం భద్రమశ్నుతే నాకమేతి జ్ఞానవిధూతపాప్మా"**

**"యద్గృహీత మవిజ్ఞాతం నిగదేనైవ శబ్ద్యతే, అనగ్నావివ శుష్కైధో న తజ్జ్వలతి కర్హిచిత్. స్థాణుస్తిష్ఠతేః-అర్థోఽర్తే రరణస్థో వా."**

లోకే యః కశ్చిద్ విద్వాన్ భవతి స పూజ్యతే. తదేతద్ - ప్రత్యక్షత ఏవ దృష్టమ్. శాస్త్రేఽపి స్థాణురయం భారహారః ఇత్యాది. స్థాణుర్ వృక్షః స యథా పత్రపుష్పఫలానామాత్మీయానాం భారమాత్రేణైవ సంబధ్యతే. న తజ్జైర్గంధ - రసరూపస్పర్శోపభోగసుఖైః. ఏవం య ఏవార్థజ్ఞో భవతి న గ్రంథమాత్రాధ్యేతా స ఏవ సకల మఖండితం భద్రమ్ అశ్నుతే ప్రాప్నోతి అంతకాలే నాకం స్వర్గమేతి జ్ఞానవిధూతపాప్మా. ఉక్తం చ గీతాయామ్-న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే ఇతి. అథైతస్మిన్ అజ్ఞానం నింద్యతే యత్ గృహీతం గురుముఖాత్ అవిజ్ఞాతం చార్థతః నిగద

మాత్రేణైవ నిత్యకాలం కథ్యతే - ఉచ్చార్యతే న పునరర్థతో విచార్యతే కిం తస్య? ఉచ్యతే అనగ్నావివ శుష్కైధో న తజ్జ్వలతి కర్హిచిత్. యథా శుష్కకాష్ఠ మనగ్నౌ ప్రదేశే న జ్వలతి. ఏవం యో వేదాధ్యయనమాత్రం కరోతి స న తదీయం ఫలం లభతే. పరిజ్ఞానం తు శ్రేయసా చాభ్యుదయేన యునక్తి ఇతి. తస్మాదేతత్ పరిజ్ఞానాయ అవశ్యం నిరుక్తశాస్త్ర మారబ్ధవ్య మితి. అర్థోఽర్తేః అర్యతే వ్యాసావర్థిభిః అరణస్థో వా యదాస్య స్వామీ అరతి గచ్ఛతి ఇతో లోకా దముం లోకం తదాయ మిహైవ తిష్ఠతి.

అర్థము :- అథాపి కించ మఱియు నిరుక్తశాస్త్రమును బదువుటవలన కలుగు నాల్గవప్రయోజనము - జ్ఞానప్రశంసా భవతి. నిరుక్తమును బదివి నిరుక్తశాస్త్రజ్ఞాత యగును. లోకమున కెప్పుడు జ్ఞానమున ప్రశంసకలుగును. అజ్ఞానమునకు నింద కలుగును.

మంత్రార్థము :- యః వేద మధీత్య = ఎవడు వేదము జదివి, అర్థం న విజానాతి = దానియర్థము నెఱుగడో, అయం భారహారః = ఇతడు బరువుమోయు, స్థాణుః అభూవ పత్రపుష్పాదులభారమును మోయు వృక్షముమొదలువంటివా డగునుకదా! వృక్షము పత్రపుష్పాదుల బరువును మోయునేగాని గంధాదులను గ్రహింపజాలదు. ఫలరసము ననుభవింప జాలదు. వేదము నభ్యసించి యర్థము నెఱుగనివా డాస్థాణువువంటివాడే యనిభావము. యం ఇతి అర్థజ్ఞః = అర్థము నెఱిగిన మనుజుడు — వేదార్థ సంపన్నుడు సకలం భద్రమశ్నుతే = అతడు సంపూర్ణభద్రమును - సకల శుభములను బొందును. నాకమేతి = చనిపోయిన పిమ్మట స్వర్గమునకు బోవును - సుఖముననుభవించును, జ్ఞానవిధూతపాప్మా = వేదార్థజ్ఞానముచే సర్వవిధపాపములను దూరుడై - జ్ఞానముచే కొట్టివేయబడిన పాపములు గలవాడై స్వర్గమును గమించును. స్థాణుః = గాడిద-లేక బరువులుమోయు గాడిదవంటి వాడగునని భావము - గాడిద చందనపుఖండములను మోయునుకాని వానిగంధజ్ఞానము దానికి కలుగదు - సుఖింపదు. అట్లే అర్థము తెలియక కేవలము పుస్తకము చదువుమనుష్యునిశ్రమ వ్యర్థము.

యదద్ అవిజ్ఞాతమ్ = వేదము దానియర్థము తెలియకుండుట వేదములశబ్దములను పఠించి కంఠస్థముచేసి మంత్రోచ్చారణమాత్రము

చేయువ్యక్తి, అనగ్నౌ శుష్కైంధ ఇవ అగ్నిసంబంధములేని యెండినకట్టె, తత్ కర్హిచిత్ = అదియెక్కడను, న జ్వలతి = మండదు - ప్రకాశింపదు, అట్లే వేదార్థజ్ఞానములేనివాడు లోకమున నెన్నడు ప్రకాశింపడు - 'స్థాణుః తిష్ఠతేః = స్థాణువు 'స్థా' ధాతువుతో నేర్పడును. అర్థః అర్తేః - 'ఋగతౌ' గత్యర్థక ఋధాతువుచే అర్థశబ్దము ఏర్పడును. అర్ద్యతే హి అసౌ అర్థిభిః ఇతి - అర్థః. యాచకులు అర్థమువైపు గమింతురు. అథవా అర్థిభిః = అభిధానములచే గమ్యము - అభిధానములన్నియు అభిధేయమును చేరును. అరణస్థో వా యా అరణే తిష్ఠతి ఇతి. అరణస్థః-స్వామి చనిపోయినమీదట అర్థ - ధనాదియంతయు నిటనే యుండును. అందువలన నిది అర్థమన బడును. ఈనిసామ్యమును గ్రహించియే శబ్దముయొక్క యర్థమునుగూడ అర్థమనుచున్నారు. శబ్దార్థముకూడ నిటనే యుండును.

> "ఉత త్వః పశ్యన్న దదర్శ వాచం ఉత త్వః శృణ్వన్న శృణోత్యేనామ్. ఉతో త్వస్మై తన్వం విసస్రే జాయేవ పత్య ఉశతీసువాసాః" అప్యేకః పశ్యన్నపి నపశ్యతి వాచమ్. అపి చ శృణ్వన్నశృణోత్యేనామ్. ఇతి అవిద్వాంసమాహార్ధమ్. అప్యేకస్మై తన్వం విసస్రే ఇతి స్వమాత్మానం వివృణుతే. జ్ఞానం ప్రకాశన మర్థస్యాహానయా వాచోపమో త్తమయా వాచా. జాయేవ పత్యే కామయమానా సువాసా ఋతుకాలేషు. సువాసాః కల్యాణ-వాసాః కామయమానా ఋతుకాలేషు యథా స ఏనాం పశ్యతి స శృణోతీత్యర్థజ్ఞ ప్రశంసా.

న కేవలం స్మృతావేవ జ్ఞానప్రశంసా అజ్ఞాననిందా చ కింతర్హి ? వేదేఽపి 'ఉతత్వః పశ్యన్...' (ఋ. సం. ౧౦-౭౧-౪) ద్వే ఆప్యేతే ఋచౌ బృహస్పతే రార్షమ్. ఉత శబ్దోఽపి-శబ్దేన సమానార్థః త్వ ఏక ఇత్యర్థః పశ్యన్నపి వాచం మనసా స దదర్శ న పశ్యత్యేవ. అర్థానభిజ్ఞత్వాత్. స హి తాం సమ్యక్ పశ్యతి యస్తస్యా అర్థం విజానాతి. అర్థపరిజ్ఞానఫలా హి వాగిత్యభిప్రాయః. ఏవ మేకః శృణ్వన్నపి న శృణోతి ఏనాం వాచమ్. ఏవమర్థ మర్థజ్ఞస అవిద్వాంస మాహ మంత్రదృక్. సాంప్రత ముత్తరేణార్ధ

త్యేనార్థజ్ఞం ప్రశంసన్నాహ ఉతో త్వస్మై - అప్యేకస్మై కస్మైచిదర్థజ్ఞాయ తన్వం శరీరం విసస్రే వివృణోతీత్యర్థః. అర్థో వాచః శరీరం ప్రకాశన మర్థ స్యాహానయా వాచా - అనేన తృతీయేన పాదేనేత్యర్థః జాయేవ పత్య ఉశతీ సువాసాః. యథా హి జాయా వివృత్తసర్వాంగావయవా భూత్వా ఉశతీ కామయమానా పత్యే ఇష్టాయ భర్త్రే ప్రేష్ఠా దర్శయే దాత్మానమ్. తదా సః పురుషో యథా పశ్యతి తాం స్త్రియమ్. ఏవం సః ఏవైతాం వాచం యథావత్ శృణోతీతి అర్థజ్ఞ - ప్రశంసా.

అర్థము :- మంత్రార్థము — త్వః = ఏకః=ఒకమూర్ఖమనుష్యుడు - అర్థజ్ఞానములేనివాడు - కేవలము పుస్తకమును కంఠస్థముచేయువాడు, వాచమ్ = వాణిని వేదవాణిని, పశ్యన్ న దదర్శ = చూచుచుండియు చూడడు. అర్థజ్ఞానము లేనందున దానివలన లాభముపొందజాలడని భావము, త్వః - ఏకః = ఒకడు, ఏనామ్ = ఈవేదవాణిని, శృణ్వన్నపి న శృణోతి = వినుచుండియు వినడు. ఆవేదవాణియే, త్వస్మై=కొండొక యర్థ జ్ఞానముకలవానికి, తన్వమ్ = తనశరీరమును, విసస్రే - వివృణోతి = ప్రకటించును. దాచక కనబడునట్లుచేయును, సువాసాః = ఉత్తమవస్త్రము లను ధరించినదై, ఉశతీ - కామయమానా = కామించుచున్నదై, జాయా = భార్య, పత్యఇవ = పతికొఱకు శరీరమును ప్రకటించునట్లు, అప్యేకః పశ్యన్నపి న పశ్యతి వాచమ్ = మంత్రమున 'ఉత' శబ్దమున్నది. దానికి పర్యాయపదము 'అపి' అప్యేకః కశ్చిదిత్యర్థః = కొండొక మూర్ఖవ్యక్తి వేద వాణిని చూచుచు చూడడు, అపి చ శృణ్వన్నపి నశృణోత్యేనామ్ = విను చుండియు వినడు, వేదవాణిని. ఇతి అర్థమ్ - మంత్రమున సగము, అవిద్వాంసమాహ = మూర్ఖుని అర్థజ్ఞానవిహీనునిగూర్చి పలికెను. ఈమంత్ర మున 'ఉ' పదపూరకము. ఉత పదమునకర్థము 'అపి' ఉతోత్వస్మై = అప్యేకస్మై = కొండొకనికొఱకు తన్వం విసస్రే ఇతి స్వామ్ ఆత్మానం వివృణుతే = తనశరీరమును ప్రకటించును అనయా వాచా = ఈవేద వాణిచే - ఈయుక్తిచే మూడవపాదముయొక్క అర్థము, అర్థస్య ప్రకాశనం జ్ఞానమాహ - అర్థజ్ఞానము ప్రకటించెనని భావము ఉపమోత్తమయా వాచా= చతుర్థపాదమువలన ఉపమానము చెప్పబడినది. జాయేవ పత్యేకామయ మానా సువాసాః ఋతుకాలేషు = ఋతుకాలములందు కామించుచున్నదై

ఉత్తమవస్త్రములను ధరించి పత్ని తనను తాను పతికర్పించుకొనును. యథా స ఏనాం పశ్యతి = అప్పుడతడెట్లు చూచునో యట్లే యర్థజ్ఞుడైన విద్వాంసుడు వేదవాణిని చూచునని భావము. వేదతత్త్వము నతడు ప్రాప్తించును. ఇది 'అర్థజ్ఞప్రశంసా' = అర్థజ్ఞుడైన వ్యక్తినిగూర్చిన ప్రశంస.

"తస్యోత్తరా భూయసే నిర్వచనాయ."

ఉత్తరా - ఋక్ అస్యైవార్థస్య జ్ఞానప్రశంసాఖ్యస్య భూయసే బహుతరాయ నిర్వచనాయ భవిష్యతి.

ఉత్తరా-తరువాతి ఋక్కు తస్య=అదే యర్థమును భూయసే=అధికముగా, నిర్వచనాయ = చెప్పుటకొఱకు కాగలదు.

"ఉత త్వం సఖ్యే స్థిరపీతమాహుర్నైనం హిన్వన్త్యపి వాజినేషు అధేన్వా చరతి మాయయైష వాచం శుశ్రువాం అఫలామపుష్పామ్."

అప్యేకం వాక్ సఖ్యే స్థిరపీతమాహూ రమమాణం విపీతార్థం దేవసఖ్యే రమణీయే స్థాన ఇతి వా విజ్ఞాతార్థం యన్నాప్నువన్తి వాగ్ జ్ఞేయేషు బలవత్స్వపి' అధేన్వా హ్యేష చరతి మాయయా వాక్ప్రతిరూపయా. నాస్మై కామాన్ దుగ్ధే వాగ్దోహ్యాన్ దేవమనుష్యస్థానేషు యో వాచం శ్రుతవాన్ భవత్యఫలామపుష్పా మిత్యఫలాస్మా అపుష్పా వాగ్ భవతీతి వా కించిత్పుష్పఫలేతి వా. అర్థం వాచః పుష్పఫలమాహ, యాజ్ఞదైవతే పుష్పఫలే దేవతాధ్యాత్మే వా.

తద్ యథా - ఉతత్వం సంఖ్యే స్థిరపీతమాహుః (ఋ. సం. ౧౦-౭౧-౫). ఇతి దేవసఖ్యే రమణీయే స్థానే దేవలోకే విపీతార్థం గృహీతార్థమిత్యర్థః. వాక్ ఋక్ సంహితా, కించ ఏవం వాగర్థజ్ఞం న హిన్వన్తి నాను గన్తుం శక్నువన్తి. వాజినేషు ? వాగ్జ్ఞేయేషు అర్థేషు మందబుద్ధయో బహవోఽపి. ఏవం తావదర్థజ్ఞః ప్రశస్తః అథేదానీ మవిద్వా నుత్తరేణార్ధర్చేన నింద్యతే అధేన్వాచరతి - యస్యా అర్థో న పరిజ్ఞాయతే తామధీయాన

ఇతశ్చేతః చరతి యః తస్మై కిమ్ ? అఫలైవాఽపుష్పా చ వాగ్ భవతీతి. అథవా - కించిత్ పుష్పఫలేతి వా. కింకారణమ్ ? అస్తి హ్యధ్యయన మాత్రేఽపి కించిదల్పం ఫలమ్. నాసౌ పరిశ్రమో వ్యర్థ ఏవేతి భాష్య కారాభిప్రాయః. ఆహ - కింపున ర్వాచః పుష్పఫలమ్ ? ఉచ్యతే అర్థం వాచః పుష్పఫలమాహ, ఏతస్మిన్ మంత్రే మంత్రదృక్. యాజ్ఞదైవతే పుష్పఫలే దైవతాధ్యాత్మే వా. యజ్ఞపరిజ్ఞానం యాజ్ఞమ్ దేవతాపరిజ్ఞానం దైవతమ్ యదాఽభ్యుదయలక్షణోఽధర్మో అభిప్రేయతే. తదా యాజ్ఞం పుష్పం దైవతం ఫలమ్. యదా పునః నిఃశ్రేయస లక్షణో ధర్మో అభి ప్రేయతే. తదోభే యాజ్ఞదైవతే పుష్పమ్. అధ్యాత్మం ఫలమిత్యుక్తమ్.

అర్థము :- మంత్రార్థః – ఉత అపి = మఱియు, త్వమ్ = ఒక వేదజ్ఞుని, సఖ్యే = దేవసభయందు - విద్వత్సమాజమునందు లేక స్వర్గము నందు స్థిరపీతమాహుః స్థిరమవిచాలినమ్ పీతమ్ గృహీతార్థమ్ స్థిరమాహుః= అర్థజ్ఞుని - అర్థమెఱిగిన వానిని విద్వత్సమాజమున స్థిరముగా నుండువాడు- నిత్యము స్వర్గమునసుండువాడుగా చెప్పుదురు. అపి = మఱియు, ఏనమ్ = వేదార్థమును గ్రహించినయితనిని వాజినేషు = వాక్కుతోతెలియదగిన విషయములందు, న హిన్వన్తి = ఇతరులు అనుగమింపజాలరు - అతనిని- వేదజ్ఞపండితు నెవ్వరు నెదుర్కొనజాలరు. కాని, ఏషః = ఈవేదార్థమును గ్రహింపని మనుజుడు, అఫలామ్ అపుష్పామ్ = ఫలపుష్పములు లేని - అర్థజ్ఞానములేని, వాచమ్ = వాణిని, శృణ్వాన్ = వినుచు - చిలుకవలె మంత్రములను కేవలము వల్లించుచు, మాయయాఽధేన్వా = పాలి నియ్యని గోరూపవాణితో, చరతి = విహరించుచున్నాడు. వాక్ = ఈవాణి, అప్యేకమ్ = ఒకానొకనిని, సఖ్యే = దేవసమూహమున - విద్వాంసుల మధ్య, రమణీయేస్థానే ఇతి = రమణీయస్థానమున - స్వర్గమున స్థిరపీతమ్ = స్థిరమవిచాలినమ్ - చలింపని, పీతమ్ = అర్థమెఱిగినవానిని, బలవత్సుఅపివాగ్జ్ఞేయేషు = వాణిమూలమున తెలియదగు కఠిన విషయ ములందున, యం = ఎవనిని, న అప్నువంతి=ఎదుర్కొని మాటాడజాలరో, అట్టివానిని పండితుని, ఏషఃపురుషః = అర్థజ్ఞానములేని మనుజుడు, మాయయా = వాక్ప్రతిరూపయా = వాణికిప్రతిరూపమైన మాయగోవుతో, పాలుపిండని (అధేన్వా) = గోవుతో, చరతి = వేదవాణినివల్లించి అర్థమును

గ్రహింపనివాడు లోకమున వ్యర్థముగా తిరుగుననిభావము. అర్థజ్ఞుడు కాని వ్యక్తి అపుష్పామ్ అఫలామ్ = ఫలపుష్పములులేని, వాచమ్ = వాణిని, శ్రుతవాన్ = వినినవాడు, అర్థరహితముగా వేదమునువల్లించువానికి, అఫలా అస్మా అపుష్పావాగ్ భవతి = వాణిఫలపుష్పరహితయగును, కించిత్ పుష్ప ఫలేతివా=లేక అట్టివానికి కొంచెము ఫలపుష్పములతోగూడిన దగును. అర్థం వాచః పుష్పఫలమాహ - వాణియొక్క ఫలపుష్పార్థము చెప్పబడినది. యాజ్ఞదైవతే = యజ్ఞవిషయక, దేవతావిషయకజ్ఞానమె వాణిక్ పుష్ప ఫలములు, దేవతాధ్యాత్మే వా = లేక. దేవతావిషయకజ్ఞానము వాణిపుష్ప ములు, అధ్యాత్మము ఫలములుగాను వాణికి అంగీకరింపబడినవి. ముందు పుష్పములు తరువాత పండ్లు ఏర్పడును. మనుష్యుడు దేవతాజ్ఞానము ద్వారమున అధ్యాత్మమువరకు చేరునని భావము.

> **సాక్షాత్కృతధర్మాణఋషయో బభూవుః. తేఽవరేభ్యోఽ సాక్షాత్కృతధర్మభ్య ఉపదేశేన మంత్రాన్ సంప్రాదుః. ఉపదేశాయ గ్లాయన్తోఽవరే బిల్మగ్రహణాయేమం గ్రంథం సమామ్నాసిషుర్వేదం చ వేదాంగాని చ. బిల్మం భిల్మం భాసన మితి వా.**

కుతఃపునరిదం నిరుక్తశాస్త్రం ప్రధానమితరాణి చాంగాని? ఉచ్యతే- సాక్షాత్కృతధర్మాణ ఋషయో బభూవుః. సాక్షాత్కృతో యైర్ధర్మః సాక్షాత్ దృష్టః. కే పునస్తే ఋషయః? ఋషి ర్దర్శనాత్, తే సాక్షాత్కృత ధర్మాణోఽవరేభ్యః అవరకాలీనేభ్యః శక్తిహీనేభ్యః ఉపదేశేన మంత్రాన్ సంప్రాదుః సంప్రదత్తవన్తః. అథ తేఽపి ఉపదేశాయ గ్లాయన్తోఽవరే బిల్మ గ్రహణాయేమం గ్రంథం సమామ్నాసిషుః వేదం చ వేదాంగాని చ. బిల్మం భిల్మం వేదానాం భేదనం. భేదో వ్యాస ఇత్యర్థః. భాసన మితి వా. వేదాంగ విజ్ఞానేన ప్రకాశతే వేదార్థ ఇతి.

అర్థము :- ఋషయః=ప్రాచీనకాలఋషులు, సాక్షాత్కృతధర్మాణః బభూవుః = ప్రత్యేకపదార్థమును సాక్షాత్కారముచేసికొనియుండిరి, తే = వారు, అవరేభ్యః = అసాక్షాత్కృతధర్మభ్యః = ప్రత్యక్షజ్ఞానరహితులు - జ్ఞానవిజ్ఞానరహితులు నైనవారికి, ఉపదేశేన = ఉపదేశములతో, మంత్రాన్

సంప్రాదుః = మంత్రముల నొసంగిరి మంత్రములను పఠింపచేసిరి. అవరే= ఉత్తరకాలీనులు = మందప్రజ్ఞులు, ఉపదేశాయగ్లాయన్తః = మౌఖికపఠన కష్టము ననుభవించుచు (చదువుటలో) బిల్మగ్రహణాయ = సరళోపాయమును గ్రహించుటకొఱకు – సులభముగా వేదార్థమును గ్రహించుటకు, ఇమంగ్రంథం = ఈనిఘంటువును, వేదం చ వేదాంగాని చ = వేదమును వేదాంగములను, సమామ్నాసిషుః = గ్రథనమొనర్చిరి - రచించిరి, బిల్మ పదమునకర్థము ఉపాయము, బిల్మగ్రహణాయ = సరలోపాయమును గ్రహించుటకు, బిల్మం - భిల్మమ్ = భేదనమాభాసనం వా = భాసించుట - ప్రకాశింపజేయుట, ఉపేయమును బాగుగ ప్రకాశింపజేయునది. విషయభేదమువలన ఈనిఘంటువు ముత్త్రివిధములు. వానిని తెలుపుచున్నాడు.

> "ఏతావన్తః సమానకర్మాణో ధాతవః ధాతుర్దధాతేః ఏతావన్త్యస్య సత్త్వస్య నామధేయాని. ఏతావతా మర్థానా మిద మభిధానమ్. నైఘంటుకమిదం దేవతానా మ్ప్రాధాన్యే నేద మితి.

అథేదానీమ్ - నిఘంటు సమామ్నాయ విరచనా వక్తవ్యా. ఏవం లక్షణం నైఘంటుకం నామప్రకరణమ్ - తదేతదేవం లక్షణమ్ - అథ పున ర్యత్ర దేవతానాం ప్రాధాన్యేన తదేవం లక్షణమ్ దైవత మితి. యత్ అభిధానం అన్యదైవతే నిపతతి, నైఘంటుకం తదిత్యుచ్యతే గుణభూతమిత్యర్థః- సంజ్ఞా హి తస్యేయ మస్మిన్ శాస్త్రే. నైఘంటుక మితి దైవతమితి చ.

అర్థము :- ఏతావన్తః = ఇన్ని, సమానకర్మాణః ధాతవః=సమానార్థక ధాతువు లున్నవి. ధాతుః - దధాతేః = ధాతుశబ్దము 'డుధాఞ్ ధారణ పోషణయోః' అనుధాతువునకు ఔణాదికతున్ ప్రత్యయముచేసిన సిద్ధమగును. అర్థమును ధరించునది కావున ధాతువనబడును. ఏతావన్తి = ఇన్ని, అస్యసత్త్వస్య=ఈద్రవ్యమునకు, నామాని=నామములు, ఏతావతామ్ అర్థానామ్ = ఇన్ని అర్థములకు, ఇదమ్ అభిధానమ్ = ఇదినామము అనగా వాచకము. ఇదం దేవతానామ్ ఈమంత్రమునందిది దేవతానామము, నైఘంటుకమ్ = గౌణము, దేవతానామప్రాధాన్యేన = దేవతలు అప్రధాన

మగుటవలన ఇది నైఘంటుకము - అప్రాధాన్యేన = ఈపదమునందలి తృతీయా, విభక్తి హేత్వర్థమున వచ్చినది.

ఇట్లు ఈనిఘంటుకోశమున మూడు విభాగములైనవి - మొదటిది నైఘంటుకకాండము. ఇందు ఒకయర్థముగల అనేకధాతువులు, నామములు ఇయ్యబడినవి. ఉదా:— గతికర్మాణ ఉత్తరే ధాతవో ద్వావింశ శతమ్ - ముందు రాబోవు ౧౨౨ ధాతువులు గత్యర్థకములు. ఇట్టివి ఏకార్థక ధాతువు లనేకములు లెక్కింపబడినవి. పృథివీనామధేయాని ఉత్తరాణి ఏకవింశతిః = ముందురాబోవు ౨౧ నామములు పృథివికి సంబంధించినవి. ౨౧ పృథివికి పేరులు. ఒకద్రవ్యమున కనేకనామములు చూపబడినవి. ఇది నైఘంటుకకాండము.

రెండవది ఐకపదిక లేక నైగమ కాండమని చెప్పబడుచున్నది. దీని యందు కొన్ని యర్థములలో నీనామము వచ్చును. 'ఏతావతామర్థానా మిద మభిధానమ్ - ఉదా:— ఆదిత్యోఽప్యకూపార ఉచ్యతే. సముద్రోఽప్య కూపార ఉచ్యతే = ఆదిత్యునకు, సముద్రునకు అకూపారము అనునొకే నామమున్నది. ఇట్టి ప్రకరణమునకు నైగమకాండమని నామము లేక ఐకపదికకాండమందురు. ఇందు ఇదం దేవతానాం నైఘంటుకమ్ - ఇదం ప్రాధాన్యేన. దేవతానామము గౌణము, మఱియు నిది ప్రధానము అను నిట్టి యాలోచనలు - విచారణచేయబడినవి. దేవతలయొక్క ప్రాధాన్యా ప్రాధాన్యములను తెలుపదలచి, ఉదాహరణముతో గౌణదేవతయొక్క లక్షణమును చెప్పుచున్నాడు.

**తద్ యద్ అన్యదైవతే మంత్రే నిపతతి నైఘంటుకం తత్. 'అశ్వం న త్వా వారవంతమ్' అశ్వమివ త్వా వాలవంతమ్. వాలా దంశవారణార్థా భవంతి. దంశో దశతేః.**

తద్యథా అశ్వన్న త్వా వారవంతం (ఋ. సం. ౧-౨౭-౧) అస్యామ ఋచి అశ్వో నైఘంటుకః అగ్నిః ప్రధానమ్. అశ్వమివ త్వాం హేఽగ్నే! వారవంతం = వాలవంతం వందామహే. దంశవారణార్థా భవన్తి. తైర్హి దంశా దయో నివార్యన్తే. దంశః దశతేః దశతి హ్యసౌ.

అర్థము :- యత్ = ఏది, అన్యదైవతే మంత్రే = అన్యదేవతగల మంత్రమునందు, నిపతతి = వచ్చునో, తత్ = అదిదానిని, నైఘంటుకమ్= నైఘంటుకమని యందురు. అనగా నది గౌణదేవత యగును. అగౌణ దేవతకు నైఘంటుకము అనునది నామము. ఉదాహరణమునకు "అశ్వం న త్వా వారవంతం వందధ్యా అగ్నిం నమోభిః సమ్రాజంత మధ్వ రాణామ్."

అర్థము :- మంత్రార్థము – హేఅగ్నే! అధ్వరాణామ్ = ఓఅగ్నీ! యజ్ఞములలో, సమ్రాజంతమ్ = దేదీప్యమానమగుచున్న, అగ్నిమ్ = అగ్ని వగు, అన్నిదేవతలకంటె ముందు, త్వా = నిన్ను, వారవంతమ్=వెంట్రుకల తోకగల, అశ్వంన = అశ్వమువలె, నమోభిః = నమస్కారములతో, వంద ధ్యా = పూజించుచున్నాము - నిన్ను స్తుతించుచున్నాము. అనగా-అన్నింటి కంటె బలము, వేగముగల అశ్వమును ప్రశంసింతురు. అది మనుష్యుల నొకస్థానమునుండి మఱియొకతావునకు కొనిపోవుటలో అశ్వము మిక్కిలి ప్రశంసనీయమగును. అట్లే అగ్నే! ఓయగ్నీ! నీవుకూడ యజ్ఞాదికార్యము లందు అగ్రణీ = ముందుఉందువు. కావున మేము మాయభీష్టసిద్ధికొఱకు నమస్కారపూర్వకముగ నిన్ను స్తుతియింతుము.

ఈమంత్రమున అశ్వము నైఘంటుకము - గౌణము - అగ్ని ప్రధాన దేవత. వాలా = తోకలు, దంశనివారణార్థా భవంతి = ఈగలు మున్నగు దంశములను నివారించుటకగును, వారా ఏవ వాలాః = వారములే వాలాః= వెంట్రుకలు, దంశోదశతేః = దంశః - కఱచునది - కుట్టునది - దంశ ధాతువుతో దంశము అనుశబ్దమేర్పడును.

"మృగో న భీమః కుచరో గిరిష్ఠాః. మృగ ఇవ భీమః కుచరో గిరిష్ఠాః. మృగో మార్ ష్టేః గతికర్మణః – భీమో బిభ్యత్యస్మాత్. భీష్మోఽప్యేతస్మాదేవ. కుచర ఇతి చరతి కర్మ కుత్సితమ్. అథ చేత్ దేవతాభిధానమ్. క్వాయం న చరతీతి. గిరిష్ఠా గిరిస్థాయీ గిరిః పర్వతః సముద్గీర్ణో భవతి. పర్వవాన్ పర్వతః. పర్వపునః పృణాతేః ప్రీణా తేర్వా, అర్ధమాస – పర్వ – దేవానస్మిన్ ప్రీణన్తి ఇతి.

తత్ ప్రకృతీతరత్సంధి - సామాన్యాత్ - మేఘస్థాయీ
మేఘోఽపి గిరి రేతస్మాదేవ.

ద్వితీయముదాహరణమ్ - మృగో న భీమః కుచరో గిరిష్ఠాః (ఋ. సం. ౮-౮-౩౮-౨) గయో నామేంద్రపుత్రః తస్యేయ మార్షమ్. త్రిష్టుప్. ఇంద్రోఽస్య ప్రధానమ్, మృగో నైఘంటుకః. మృగో న మృగ ఇవ భీమః భీషణః. కుచరః కుత్సితచరణః హింస్రః ప్రాణివధజీవనః. గిరిష్ఠాః పర్వతాశ్రయః. క్వాయం న-చరతీతి - సర్వత్రచరతీతి.గిరిష్ఠా-మేఘస్థాయీ గతికర్మణః - నిత్యంహ్యసౌ గచ్ఛతి. బిభ్యత్యస్మాత్ సర్వ ఏవ హ్యస్మాద్ బిభేతి గిరిః పర్వతః సముద్గీర్ణో భవతి - భూమేః పర్వవాన్ శిలాశిఖర సంధిభి రసౌ తద్వాన్ భవతి. పర్వ పునః పృణాతేః పూరణార్థస్య. ప్రీణా తేర్వా తర్పణార్థస్య. దేవా నస్మిన్ హవిర్భిః ప్రీణన్తీతి. మృగో న భీమః కుచరో గిరిష్ఠాః పరావత ఆజగన్థా పరస్యాః. సృకం సంశాయ పవిమింద్ర తిగ్మం త్రి శత్రూన్ తాఢ్ఢి విమృధో నుదస్వ.

మంత్రార్థము :- కుచరః = ప్రాణివధయనెడి, కుత్సిత = నిందిత కర్మనొనర్చునట్టియు, భీమః = భయానకమయినట్టియు, గిరిష్ఠాః = పర్వతముపైనుండునట్టియు, మృగః న = సింహమువంటివాడవైన, హేఇంద్ర! ఓయింద్రా! పరావతః = అతిదూరముననుండు, పరస్యాః = పరలోకమైన ద్యులోకమునుండి, ఆజగన్థ = రమ్ము, సృకమ్ = శత్రుశరీరమున గ్రుచ్చుకొను, పవిమ్ = నీవజ్రమును, సంశాయ = పదునుపెట్టి, తిగ్మమ్=మిక్కిలి తీక్ష్ణముచేసి, శత్రూన్ తాఢ్ఢి = శత్రువులను జంపుము, మృధః=ఈహింసకులను, వినుదస్వ = దూరమొనర్పుము. వీరినికొట్టి పాఱద్రోలుము. ఈ మంత్రమున మృగము నైఘంటుకము - ఇంద్రుడు ప్రధానదేవత. మృగః మార్ష్టేః గతికర్మణః - నిఘంటుపఠిత గత్యర్థక 'మృజ్' ధాతువుతో మృగశబ్దమేర్పడుచున్నది. మృగము ఇతరజంతువులను జంపుటకు వెళ్లును - గతికలదియగును, భీమః = బిభ్యతి అస్మాత్ - దీనినుండి యితర జంతువులు భయపడును. కావున భీమము, భీష్మః ఏతస్మాదేవ = భీష్మ శబ్దముకూడ నీధాతువుతోనె యేర్పడును, కుచరః = ప్రాణులను చంపుట యను నిందనీయకర్మచేయును కావున 'కుచరము' అనబడును. అథచేత్= మఱియు, యది దేవతాభిధానమ్ = ఇయ్యది దేవతనామమగుచో నిరుక్తి

చేయును. క్వాయం న చరతి ఇతి-ఈదేవత యెక్కడ విహరింపదు. దేవత కావున తనమహిమచే నంతట విహరించునని భావము - గిరిష్ఠాః గిరిస్థాయీ= పర్వతము మీదనుండును. గిరి = పర్వతనామము. అది సముద్గీర్ణో భవతి. పృథివినుండి పైకిలేచియున్నది. పర్వవాన్ పర్వతః పర్వములు కలది.కావున పర్వతమనబడును. శిఖరములు మున్నగునవియే దానిపర్వములు. పర్వపునః పృణాతేః. పర్వశబ్దము పూరణార్థక 'పౄ' ధాతువుతో నేర్పడును. ఈశిలలు శిఖరాదులు దానిని పూరించును. ప్రీణాతేర్వా లేక తర్పణార్థక 'ప్రీఞ్' ధాతువుతోను పర్వశబ్దమేర్పడును. కాని యీపర్వశబ్దము తర్పణార్థక ధాతువుతో నేర్పడినపుడిది, అర్ధమాస - పర్వ-అర్ధమాసపర్వ = అమావాస్య-పూర్ణిమా అనునర్థమున ప్రయుక్తమగును. ఏలయన అస్మిన్ = ఈఅమా వాస్య - పూర్ణిమలందు దేవాన్ప్రీణన్తి = దేవతలను తృప్తిపఱతురు, తత్ప్రకృతి = అస్వభావముగల ఇతరత్ = మఱియొక సంధివాచక పర్వ శబ్దముకాడనగును. సంధి - సామాన్యాత్ = సంధియొక్క సమానతను తీసికొని - అనగా కాలసంధి, శిలాసంధి సమానమగునుకదా! దేవతాభిధాన పకమున, గిరిష్ఠాః-అర్థము. మేఘస్థాయీ=మేఘమునసుండునది మేఘోఽపిగిరిః = మేఘముకూడ గిరియనబడును, ఏతస్మాదేవ = ఈయుత్పత్తి వలననే సముద్గీర్ణమగుటవలన మేఘముకూడ గిరియనబడును. ఏలయన మేఘముకూడ అంతరిక్షమున ఉద్గీర్ణమగుసు పైకిలేచును.

**తత్ యాని నామాని ప్రాధాన్యస్తుతీనాం తద్దైవత మిత్యాచక్షతే. తదుపరిష్టాత్ వ్యాఖ్యాస్యామః. నైఘంటుకాని నైగమానీహేహ.**

యాని నామాని ప్రాధాన్య స్తుతీనా మగ్న్యాదీనామ్ తత్ పునరేతత్ దైవతం ప్రకరణముపరిష్టాద్ వ్యాఖ్యాస్యామః. అస్య శాస్త్రస్య- నైఘంటు కాని నైగమానిచ పదాని ప్రకరణద్వయే వ్యాఖ్యాస్యామః. అధ్యాయ పరి సమాప్తి లక్షణార్థః. పరితోషార్థో వా ద్విరభ్యాస ఇహేహేతి. (సామాన్యాయ

స్త్ర చతుష్ట్వ మతోఽన్యేఽథ నిపాతా వాయుర్వాత్వాన నూనం నూనం పాత ఋచాస్తేఽకిశ్వ్యన్తే నిష్ఫుక్తాసో హవిర్భి రితీమాన్యథాపి యా యదో హిస్యాథాపీద మర్థవంతోఽథాపీదం స్థాణురయ ముత్త్వః ప్యేసు తత్వం సంఖ్యే వింశతిః)

తత్ = ప్రాధాన్య - స్తుతీనాం దేవతానామ్ = ప్రధానముగ స్తుతిచేయ బడిన దేవతలనామములు ఏమంత్రములో నేనామములున్నవో తత్ = అకాండము, దైవతమ్ = దైవతకాండమనునామముతో, ఆచక్షతే = చెప్ప బడును, తదుపరిష్టాత్ వ్యాఖ్యాస్యామః = ఆదైవతకాండవ్యాఖ్యముందు చేయుదుము - నైఘంటుకకాండము, మఱియు నైగమకాండము ఇక్కడనె మొదట నైఘంటుకము తదుపరి నైగమము అంతమున దైవతకాండము వ్యాఖ్యానింతుము. ఇహఇహ అని ఇహపదము రెండుపర్యాయములు ప్రయోగింపబడుట అధ్యాయసమాప్తిని తెలుపును.



# ద్వితీయాధ్యాయము

## ప్రథమపాదము

### "అథ నిర్వచనమ్"

నిష్కృష్య - విగృహ్య - వచనం=నిర్వచనమ్, నామములు ఆఖ్యాతములు ఉపసర్గలు, నిపాతములు, అనువానిలక్షణములు, శాస్త్రారంభ ప్రయోజనము, వేదవేదాంగముల స్వప్రయోజననిరూపణము ప్రకరణత్రయ విభాగమువలన నిఘంటుసమామ్నాయరచనలనుగూర్చి చెప్పి దైవత కాండముయొక్క వ్యాఖ్య ముందు చేయుదుమని చెప్పి నైఘంటుకము నైగమములనుగూర్చి ముందు క్రమముగా నిటనే నిరూపణము చేయుదు మని పూర్వాధ్యాయమున చెప్పి యున్నారు. అందువలన ముందు నిర్వచన ప్రకారమును నిరూపించుచున్నారు.

అర్థము :- అథ - ఈకారణమున నిర్వచననిరూపణమును చెప్పు చున్నాము, నిష్కృష్య = విగృహ్య, వచనమ్ = నిర్వచమ్ = విడదీసి చెప్పుట నిర్వచనము.

"తద్యేషు పదేషు స్వరసంస్కారౌ సమర్థౌ ప్రాదేశికేన గుణేనా న్వితౌ స్యాతాం తథా తాని నిర్బ్రూయాత్."

తత్ = తత్రైవంసతి యేషు పదేషు స్వరసంస్కారౌ సమర్థౌ శకం ధ్వాదిత్వాత్ పరరూపం సంగతార్థౌ ప్రాదేశికేన ప్రదేశాభిధాయినా ధాతు రూపేణ గుణేనాన్వితౌ స్యాతాం భవేతామ్ తథా తాని యథాలక్షణమ్ నిర్బ్రూయాత్.

అర్థము :- తత్ = ఇది వాక్యోపన్యాసార్థము, యేషు పదేషు = ఏ పదములందు, స్వరసంస్కారౌ = ఉదాత్తాది స్వరములు, ధాతువు, ప్రత్య

యము, లోపము ఆగమము మున్నగు సంస్కారములు, సమర్థౌ = సమర్థములో, ఉత్పన్నములో, ప్రాదేశికేన గుణేన = వ్యాకరణప్రక్రియతో అన్వితౌస్యాతామ్ = అన్వితములగునో - యుక్తములగునో, తాని = వానిని తథా = ఆప్రకారముగనే, నిర్బ్రూయాత్ = నిర్వచనము చేయవలెను.

ఇట శబ్దములు రెండువిధములు. ఒకటి సమర్థములు = స్వరము-సంస్కారము, రెండు అసమర్థము = స్వరసంస్కారము - అనగా ప్రాతిపదిక ఉభయవిధములు - వ్యుత్పన్నములు అవ్యుత్పన్నములు=వ్యుత్పన్న ప్రాతిపదికల విషయమున వానిని వ్యాకరణప్రక్రియతోకూడి నిర్వచింపవలయును.

**అథానన్వితేఽర్థేఽప్రాదేశికే వికారేఽర్థనిత్యః పరీక్షేత కేనచిత్ వృత్తి-సామాన్యేన.**

అథ పునరనన్వితే స్వరసంస్కారాభ్యాంయుక్తేఽర్థే=ప్రాదేశికే అసమర్థే అర్థనిత్యోఽర్థ ప్రధానం = అర్థప్రాధాన్యేనానాదృత్య స్వరసంస్కారౌ పరీక్షేత - కేనచి దర్థవృత్తి సామాన్యేన - క్రియాగుణ సామాన్యేనేత్యర్థః.

అర్థసామాన్యం బలవత్ శబ్దసామాన్యాదితి నిర్గలితోఽర్థః.

అర్థము :- అథ = మఱియు, అర్థేఅనన్వితే = ఎక్కడ అర్థము సంగతముకాదో - శబ్దమొకవిధముగానుండి అర్థము మఱియొకవిధముగా నున్న పక్షమున, అప్రాదేశికే వికారే = వ్యాకరణ ప్రక్రియతోను సిద్ధము కాకున్నపుడు అట్టియెడ అర్థనిత్యః = అర్థమునకు ముఖ్యతకలిగించి, కేనచిత్వృత్తిసామాన్యేన = ఒకానొక - ఏదోయొక క్రియయొక్క సమానతతో, పరీక్షేత = పరీక్షింపవలెను నిర్వచనము చేయవలయును. అనగా ఆశబ్దమున నేధాతువుయొక్క సామ్యము లభించునో విచారించి దానితోనే నిర్వచనముసప్పవలయును ఏలయన అర్థము ముఖ్యము శబ్దము గౌణము.

**"అవిద్యమానే సామాన్యేఽవ్యక్షర-వర్ణసామాన్యాన్నిర్బ్రూయాత్ న త్వేవ న నిర్బ్రూయాత్ న సంస్కారమాద్రియేత. విశయవత్యో హి వృత్తయో భవంతి. యథార్థం విభక్తీః సన్నమయేత్."**

ఏవమవిద్యమానే-అసతి, అర్థసామాన్యే స్వర - వర్ణసామాన్య మాత్రే ణాపి నిర్బ్రూయాదేవ. న త్వేవ న నిర్బ్రూయాత్. ఇతరథా హి ఆనర్థక మేవ నిరుక్తశాస్త్రం స్యాత్. లక్షణపరాఙ్ముఖేషు శబ్దేషు న సంస్కార మాద్రియేత. కింకారణమ్? ఉచ్యతే - విశయః సంశయ స్తద్వత్యో ఇతి కేచిదర్థ సామాన్యేన క్వచిద్వర్తన్తే శబ్దాః. కేచిత్ స్వరసామాన్యేన, కేచిద్ వర్ణసామాన్యేన యత ఏవమ్ - అతో విభక్తీరపి యథార్థమేవ సన్నమయేత్- విపరిణమయేత్. కిం కారణమ్? తాసామపి హి వ్యత్యయో భవత్యేవ.

అర్థము :- అవిద్యమానే సామాన్యే = ఎక్కడ సమానతయు నుండదో, అక్షర - వర్ణ - సామాన్యాత్=అక్కడ అక్షర - స్వరవ్యంజనముల సామ్యముతో, నిర్బ్రూయాత్ = నిర్వచింపవలెను, న తు ఏవ న నిర్బ్రూ యాత్ = నిర్వచనము చేయక యుండరాదు. నిర్వచనముమాత్రము చేయవలసినదే. న సంస్కారమ్ ఆద్రియేత = వ్యాకరణప్రక్రియనుగూడ ఆదరింపబనిలేదు, హి=ఏలయన, వృత్తయః=శబ్దార్థములలోగల వృత్తులు, విశయవత్యః భవన్తి = మిక్కిలి సందిగ్ధములుగా నుండును. కావున, యథార్థమ్ = ఎక్కడ నేయర్థము ఉచితమనితోచునో, విభక్తీః = విభక్తు లను, సన్నమయేత్ = అణచివేయవలెను మార్చవలెను.

ఇప్పుడు అర్థము కారణముగానే వ్యాకరణమునందును శబ్దముల విపరిణామము ఎట్లు జరుగునో లేక స్వరములయు వ్యంజనములయు సామ్యముతో నిర్వచనము జరుగునో యావిధమును జూపుచున్నాడు.

"ప్రత్తమవత్త మితి ధాత్వాదీ ఏవ శిష్యేతే."

అర్థవశేన వ్యాకరణేఽపి శబ్దవిపరిణామో భవతీత్యేవం దర్శయతి ప్రత్తమవత్తమితి ధాత్వాదీ ఏవ శిష్యేతే. 'డుదాఞ్ దానే' తస్య ప్రపూర్వస్య ప్రత్తమితి అత్ర దకార అకారశ్చ ధాతుః పరో నిష్ఠాప్రత్యయః తకారః. ఏవమేవ దో అవఖండనే ఇత్యవపూర్వస్య అవత్తమ్ ఇతి. అత్రాపి దకార ఓకారశ్చ ధాతుః పరో నిష్ఠా తకారః. ఏవమ్ అనయోర్ధాత్వో రాదీ ఏవ శిష్యేతే.

అర్థము :- ప్రత్తమ్, అవత్తమ్' - అను నీరెండుధాతువులయొక్క ఆదిఅక్షరమే మిగిలియుండును. ఎట్లన 'ప్రత్త' అనుశబ్దమునందు

ప్రపూర్వక 'దా' ధాతువునకు పరమున 'నిష్ఠా' సూత్రముతో 'క్త' ప్రత్యయము చేసినమీదట ప్ర - దా - త ఈస్థితిలో 'అచ ఉపసర్గాత్తః' అను సూత్రముతో 'దా'లోని ఆకారమునకు 'త'కారము చేసి 'ఝరో - ఝరి' అనుసూత్రముతో తకారమును లోపింపజేసి, 'ఖరి చ' సూత్రముతో దకారమునకు తకారముచేసినమీదట ప్రాదిసమాసము స్వాద్యుత్పత్తి చేసిన ప్రత్తమ్ రూపమగును. ఇట్లే 'అవత్తమ్' సందును, 'దో అవఖండనే' అనునది ధాతువు. 'దో' తదుపరి 'క్త' ప్రత్యయముచేసి 'ఆదేచ ఉపదేశేఽశితి' ఓకారమునకు ఆకారము - 'అవదాత' ఈస్థితియందు 'అచ ఉపసర్గాత్తః' సూత్రముతో ఆకారమునకు తకారము చేసినమీదట 'అవ - ద్ - ద్త స్థితి యందు అవిధముగనే ఒక దకారమునకు లోపము 'చర్త్వము' చేసి సమాసము, స్వాద్యుత్పత్తి చేసినమీదట 'అవత్తమ్' రూపమేర్పడును. ఇక్కడకూడ 'దో' ధాతువుయొక్క ఆదిఅక్షరము 'ద్' కారముమాత్రము మిగులును. తదుపరి దానికి తకారమగును.

"అథాప్యస్తేర్ నివృత్తి స్థానేష్వాదిలోపో భవతి స్తః సన్తి ఇతి."

'అస్‌భువి' ఇత్యస్య నివృత్తి - స్థానేషు 'శ్నసోరల్లోపః' ఇత్యాది లోపో భవతి. ఉదాహరణ స్తః సన్తీతి ఏవమగ్రేఽపి.

అర్థము :- అథాపి మఱియు నిట్లే 'అస్తేః' అస్‌భువియొక్క నివృత్తి స్థానేషు = గుణ వృద్ధి నిషేధక స్థానములందు కిజితి 'చ' సూత్రముతో ఎక్కడ గుణవృద్ధి నిషిద్ధములో అట కిత్ ఙిత్ ప్రత్యయములు పరమున నున్నపుడు ఆదిలోపః భవతి - ఆది అక్షరమైన 'అ'కారమునకు 'శ్నసో రల్లోపః' సూత్రముతో లోపమగును. 'అస్ + తః' 'శ్నసోః'తో అకారమునకు లోపము జరిగి 'స్తః' రూపమేర్పడును.

"అథాప్యన్తలోపో భవతి గత్వా గతమ్ ఇతి."

గమేః క్త్వా ప్రత్యయే నిష్ఠాప్రత్యయే చ పరతోఽనునాసిక లోపో భవతి.

అర్థము :- మఱియు ధాతువుయొక్క అంతమునకును లోపము కలుగును. ఉదా :- 'గత్వా' యందు 'గమ్' ధాతువునకు పరమున

'క్త్వా' ప్రత్యయముచేర్చినపుడు 'అనుదాత్తోపదేశ'తో మకారము లోపించిన మీదట 'గత్వా' సిద్ధమగును. 'గతమ్' ఇందు 'గమ్ + క్త' ప్రత్యయము అనుదాత్తోపదేశ సూత్రముతో మకారమునకు లోపము జరిగినమీదట గతమ్' సిద్ధమగును. ఈరెండుస్థలములందును 'గమ్'లోని అంతిమ 'మ' కారము లోపించినది.

"అథాప్యుపధా-లోపో భవతి జగ్మతు ర్జగ్మురితి."

గమేః గమ్ - హన్ - జన్ - ఖన్ - ఘసాం ఇత్యుపధాలోపః.

అర్థము :- మఱియు కొన్నియెడల ఉపధకూడ లోపించును. ఉదా :- జగ్మతుః జగ్ముః - జగమ్ + అతుస్ ఇందు - అలోఽన్త్యాత్ పూర్వాఉపధా సూత్రమువలన ఉపధాసంజ్ఞ 'గమ - హన - జన' సూత్ర ముచే ఉపధజగమ్‌లోని గపైన ఉన్న అకారమునకు లోపము కలుగును. జగ్‌మ్ - అతుస్ - జగ్మతుస్ - జగ్మతుః అగును! ఇట్లే 'జగ్ముః' జగమ్ ఉః = అకారలోపమువలన జగ్ముః అగును. అంతిమ'స్'కారమునకు రుత్వము విసర్గ ఇతరసూత్రములవలన నేర్పడునని యెఱుగునది.

"అథాప్యుపధా-వికారో భవతి" రాజా - దండీ ఇతి.

రాజన్ దండిన్ ఇతి స్థితే సర్వనామస్థానే చాసంబుద్ధౌ - ఇతి దీర్ఘః దండిన్ ఇత్యత్రాపి ఇన్ హన్ పూషార్యమ్ణాం శౌ, సౌ చ, ఇతి దీర్ఘత్వమ్ న లోపః ప్రాతిపదికాంతస్య ఇత్యుభయోరపి నకారలోపే కృతే రాజా, దండీతి ఏవముపధా వికారో భవతి.

అర్థము :- కొన్నియెడల ఉపధా = వికారముకలుగును. ఉదా :- రాజా, దండీ రాజన్ + సు 'సర్వనామస్థానే చాసంబుద్ధౌ' సూత్రమువలన రాజన్, దండిన్ పదములలోని ఉపధాసంజ్ఞగల జకార, డకారములకు పరముననున్న అకార, ఇకారములకు దీర్ఘమగును. నకారము లోపించి రాజా, దండీ సిద్ధమగుట అకార ఇకారములకు దీర్ఘమగు వికారమని అభి ప్రాయము.



"అథాపి వర్ణలోపో భవతి-తత్త్వాయామీతి."

అత్ర చకారలోపః యాచామీత్యేవ మేతత్ ద్రష్టవ్యమ్. అయం చ ఛాన్దస ఏవ.

అర్థము :- కొన్నియెడల వర్ణము లోపించును. ఉదా :- 'తత్త్వా యామి' తం త్వా యాచామి - యాచామిపదమునుండి 'చ' లోపించి 'యామి' అయినది. ఇది ఛాందసము. వేదమునందే చకారములోపించును లౌకికభాషయందు లోపింపదు.

"అథాపి ద్వివర్ణలోపస్తృచ ఇతి."

అత్ర ఋవర్ణరేఫయో ర్లోపః - రేఫ ఏవ ఋవర్ణోదరం కృమివదను ప్రవిష్టో ద్రష్టవ్యః స ఉచ్యతే ఋవర్ణేన సాకమ్.

అర్థము :- మఱియు నొక్కయెడ రెండువర్ణము లొకేసారి లోపించును. ఉదా :- తృచః ఈపదమునకు విగ్రహము - తిస్ర ఋచః-తృచః మూడుఋక్కులు 'త్రిఋచ్' ఈస్థితిలో ఋచి త్రేః సంప్రసారణమ్. ఉత్తరపదాదిలోపశ్చ ఛందసి' అను నీవార్తికమువలన త్రికి సంప్రసారణమయి 'తృ' అయినది. ఋచఃలోని 'ఋ' లోపించినది. ఋలో రేఫకాడ సమావిష్టమై యున్నది. ఈసిద్ధాంతమునసనుసరించి 'ఋవర్ణైకదేశో రేఫో హల్త్వేన గృహ్యతే. 'ఋ' వర్ణమున నేకదేశమైన 'రేఫ' హల్‌గా అంగీకరింపబడును. దానికి పరముననున్న 'అజ్' భాగము రెండవవర్ణముగా నంగీకరింపబడును. ఈవిధముగ నిట రెండువర్ణములు లోపించినట్లగును.

"అథాప్యాది విపర్యయో భవతి - జ్యోతిర్ఘనో బిందుర్వాట్య ఇతి."

ద్యుత - దీప్తౌ, తస్యాది - వ్యాపత్త్యా జ్యోతిః హన్ హింసాగత్యోః తస్య ఘనఇతి భిదిర్ విదారణే తస్య బిన్దుః భట భృతౌతస్య వాట్యః.

అర్థము :- మఱియు నొకయెడ 'ఆది విపర్యయో' ఆది యక్షరమునకు వికారమగును. ఉదా :- జ్యోతిః, ఘనః, బిందుః, వాట్యః అను నీపదములలో - ద్యుత్ ధాతువునకు ఔణాదిక 'ఇస్' ప్రత్యయము చేయగా దస్థానమున 'జ' ఉంచినపుడు 'జ్యోతిః' అగును. ఇట్లే 'ఘన' యందు

హనధాతువుయొక్క హ స్థానమున 'ఘ', 'ఖిందు'నందు ఛిదిర్ధాతువు యొక్క 'ఛ' స్థానమున 'ఖ'; 'వాట్య' ఇందు భటధాతువుయొక్క 'భ' స్థానమున 'వ'కారము చేయబడును.

"అథాప్యాద్యన్త విపర్యయో భవతి - స్తోకా, రజ్జుః, సికతా, తర్క్వితి."

శ్చ్యుతిర్ క్షరణే. తస్యాద్యన్త విపర్యయేణ స్తోకాః సృజ విసర్గే తస్య రజ్జుః కసవికసనే తస్య సికతా, కృతీ ఛేదనే తస్య తర్కుః.

అర్థము :- మఱియు కొన్నితావులందు అద్యన్తవిపర్యయః' ఆద్యంత ములగు రెండుస్థానములందు విపర్యయమేర్పడును. ఉదా :- శ్చ్యుతిర్ క్షరణే ఈధాతువుయొక్క ఆదిఅంతఅక్షరములలో వికారమేర్పడుటవలన స్తోక' పదము ఏర్పడుచున్నది. 'సృజ'ధాతువుచే రజ్జుః, కసవికసనే ధాతువవలన సికతా కృతీఛేదనే ధాతువవలన తర్కుః శబ్దములు సిద్ధ మగును.

"అథాప్యన్తవ్యాపత్తిర్ భవతి. ఓఘో మేఘో నాధో గాధో వధూర్మధ్వితి."

వహ ప్రాపణే తస్యా - వ్యాపత్యా ఓఘః. మిహ సేచనే తస్య మేఘః, ణహ బంధనే, తస్య నాధః - గాహూ విలోడనే తస్య గాధః, వహ - ప్రాపణే తస్య వధూః, మదతృప్తౌ తస్య మధు.

అర్థము :- అక్కడక్కడ అంతిమఅక్షరము మాఱిపోవును. ఉదా :- ఓఘ - ఇందు వహధాతువుయొక్క యంతిమ 'హ' స్థానమున 'ఘ' వచ్చినది. మిహధాతువుయొక్క చివరి 'హ' స్థానమున 'ఘ' వచ్చి 'మేఘ' అయినది. ణహ్ గాహూ ధాతువులయొక్క 'హ' స్థానమున 'ధ'చేరి నాధో గాధో అయినవి.

"అథాపి వర్ణోపజనః. అస్థత్ ద్వారో భరూజేతి."

అసు క్షేపణే తస్య అస్థత్. వృఞ్ సంభక్తౌ తస్య ద్వారః భ్రస్జ పాకే తస్య భరూజః. ఏవం వ్యాకరణేఽపి అర్థవశేన లోపాగమౌ విపరిణామశ్చ

శబ్దానాం దృష్టః కిముత నిరుక్తే. యదర్థప్రధానమేవ. అతఃపవం సంప్రసారణ చిన్తా పత్రిష్యతే. తదర్థ మిదమారభ్యతే.

అర్థము :- కొండొకయెడ వర్ణముయొక్క ఆగమము జరుగును. ఉదా :- అస్థత్ - అస్‌ధాతువునకు లుఙ్‌నందు 'అస్యతే స్థుక్' సూత్రముచే 'థుక్' ఆగమమై 'అస్థత్' అగును.

వృచ్ సంభక్తౌ ధాతువునకు 'వారో' అయి దకారము ఆగమమై ద్వార్ అగును. భరూజా యందు 'భ్రస్జ్ పాకే' ధాతువునకు 'అచ్' ప్రత్యయము పరమైనపుడు 'భ' ముందు 'అ', 'ర'కుముందు 'ఊ' ఆగమమై స్త్రీలింగమున టాప్‌చేసినచో భరూజా అగును.

ఇట్లు శబ్దప్రధానమైన వ్యాకరణశాస్త్రమునందే ఒకయెడ స్వరమునకు ఆదిలోపము, మఱియొకచో అన్తలోపము కొన్నియెడల రెండువర్ణముల లోపము మున్నగు విపరిణామములు చూడబడుచున్నవి. ఇక అర్థప్రధానమగు నిరుక్తశాస్త్రము సంగతి చెప్పనేల? కావుననే కొండొక ప్రాచీనాచార్యుడు నిరుక్తశాస్త్రము నైదువిధములుగా నంగీకరించినాడు. "వర్ణాగమో వర్ణవిపర్యయశ్చ ద్వౌ చాపరౌ వర్ణవికార నాశౌ ధాతో స్తదర్థాతిశయేన యోగ స్తదుచ్యతే పంచవిధం నిరుక్తమ్."

నిరుక్తము పంచవిధము - వర్ణాగమము, వర్ణాద్యంతవిపర్యయములు, వర్ణవికారము, వర్ణనాశము, ధాతువునకు దానికంటె భిన్నార్థముతో యోగము అని, నిరుక్తశాస్త్ర మైదువిధములు.

"తద్యత్ర స్వరాదనన్తరా న్తస్థాన్తర్ధాతు ర్భవతి. తద్ ద్వి ప్రకృతీనాం స్థానమితి ప్రదిశన్తి.

యత్ర = యస్మిన్‌ధాతౌ, స్వరాత్ అకారాదేః అనన్తరా అనన్తర్హితా అన్యేన వ్యంజనేన పరా వా పూర్వా వా అన్తస్థా య ర ల వానా మన్యతమో వర్ణః అన్తర్ధాతు - ధాతుమధ్యే భవతి. తత్ ఏతదేవం లక్షణం ధాతురూపం హి ద్వి - ప్రకృతీనాం, ద్వి - స్వభావానాం, శబ్దానాం స్థానమ్. ఆశ్రయః - ఇతి. ఏవమాచార్యాః ప్రదిశన్తి తద్యథా యజ - దేవపూజా సంగతికరణ దానేషు. అత్ర సంప్రసారణపక్షే ఇష్ట్వా, అసంప్రసారణపక్షే చ యష్ట్వా.

అర్థము :- యత్ర = ఏధాతువునందు, స్వరాత్ = అకారాది స్వరముకంటె, అనన్తరాః = అవ్యవహితమగు అది లేక అంతమునందు, అంతస్థాః = య, ర, ల, వ అనువానినుండి యొకటి, అంతర్ధాతు=ధాతువు యొక్క అంతర్ = లోపలనున్నచో, తత్ = అది, ద్విప్రకృతీనామ్ = రెండుస్వభావములుగల శబ్దముల, స్థానమ్ ఇతి = స్థానములగునని, ప్రవదన్తి = ఆచార్యులు చెప్పుచున్నారు. తాత్పర్యమేమన - ఏధాతువునందుండు స్వరముకంటె - (అవ్యవహిత - వ్యవధానములేకుండ) ముందుగాని వెనుకగాని య, ర, ల, వ అనువర్ణములలో నొకవర్ణము వచ్చినచో నాధాతువు రెండువిధములగు స్వభావముగలది (ద్విప్రకృతిః) యగుచున్నది. అందొకటి సంప్రసారణరూపము, రెండవది అసంప్రసారణరూపముగలది. ఉదా :- 'యజ్' ధాతువునకు, ఇష్టమ్ - ఇష్ట్వా అనునిట్టి సంప్రసారణ రూపములు, యష్టుమ్ యష్టవ్యమ్ మున్నగు అసంప్రసారణరూపములు ఏర్పడుచున్నవి.

"తత్ర సిద్ధాయా మనుపపద్యమానాయా మితరయోపపిపాదయిషేత్."

తత్ర ఏవం సతి ఏకప్రకారేణ సిద్ధాయామ్ అర్థసిద్ధౌ అనుపపద్యమానాయామ్ ఇతరయా యుక్త్యా ఉపపిపాదయిషేత్ - ఉపపాదయితుమిచ్ఛేదర్థమ్.

అర్థము :- తత్ర = అక్కడ ఇట్టియవస్థయందు, సిద్ధాయామ్ = అర్థసిద్ధి, అనుపపద్యమానాయామ్-ఒకవిధముగా కలుగునపుడు, ఇతరయా= మఱియొకవిధముగ, ఉపపిపాదయిషేత్ = సిద్ధముచేయ యత్నింపవలెను. అనగా సంప్రసారణ అసంప్రసారణ విధములలో నేదోయొకవిధముగ అర్థసిద్ధికొఱకు యత్నింపవలయునని తాత్పర్యము.

"తత్రాప్యేకేఽల్పనిష్పత్తయో భవన్తి. యథైతత్-ఊతిః మృదుః పృథుః పృషతః కుణారుమితి."

తత్రాపి ఏతస్మిన్నపి సంప్రసారణలక్షణే ఏకే ధాతవః అల్పనిష్పత్తయో భవన్తి. అల్పేషు శబ్దరూపేషు సంప్రసారణప్రకృతి-రభినిష్పద్యన్తే.

తద్యథా - ఏతదుదాహరణజాతమ్ — ఊతిః, మృదుః పృథుః, పృషతః, కుణారుమ్ ఇతి. అవతేర్గత్యర్థస్య ఊతిః ఇతి మ్రదమర్దనే తస్య మృదుః, ప్రథప్రఖ్యాపనే తస్య పృథుః. పృష్‌దాహే తస్య పృషతః, క్వణ శబ్దార్థః తస్య కుణారుః.

అర్థము :- తత్రాపి = అందునను కొన్నిధాతువులు, అల్పనిష్పత్తయో భవన్తి = సంప్రసారణరూపమున అల్పప్రయోగములు కొలది ప్రయోగములుకలవియై యున్నవి. తద్ యథా = ఎట్లన - ఉదాహరణములు సమూహ, ఊతిః మున్నగునవి. గత్యర్థక 'అవ' ధాతువునకు క్తిప్రత్యయముచేసి 'జ్వర త్వర' సూత్రముతో 'ఊఠ్' ప్రత్యయముచేసిన 'ఊతిః' పదము సిద్ధమగును. మ్రదధాతువునకు ఔణాదిక కు ప్రత్యయము చేర్చి సంప్రసారణము చేసిన మృదుశబ్దమగును. ప్రథధాతువునకు ఔణాదిక 'కు'ప్రత్యయము చేసి సంప్రసారణముచేసినచో పృథు శబ్దమగును. ప్రుష్‌ధాతువునకు అతచ్ ప్రత్యయముచేసి సంప్రసారణముచేసిన పృషతః శబ్దమేర్పడును శబ్దార్థక క్వణ్‌ధాతువుతో బాహుళక కారుప్రత్యయము సంప్రసారణముచేసిన కుణారుః శబ్దము సిద్ధమగును.

"అథాపి భాషికేభ్యో ధాతుభ్యో నైగమాః కృతో భాష్యన్తే దమూనాః క్షేత్రసాధా ఇతి."

అథాపి ఇదమపర ముపేక్షితవ్య మనేన శబ్దాన్ నిర్బ్రువతా. కిమ్? భాషాయాం యే ప్రసిద్ధప్రయోగా స్తే భాషికా స్తేభ్యః నైగమాః ఛన్దోవిషయాః కృతః కృత్ప్రత్యయాన్తాః శబ్దాః భాష్యన్తే నిరుచ్యన్తే ఇత్యర్థః. తద్యథా- దమూనాః - క్షేత్రసాధా ఇతి. దమ ఉపశమే తస్య భాషాయామ్ దామ్యతి దమయతి దాన్తః ఇత్యేవమాదయః ప్రయోగా భవన్తి, ఛన్దసి పునః దమూనా అగ్నిరుచ్యతే. ఏవమేవ సాధ్యతే భాషాయాం సాధా ఇతి. మిత్రం న క్షేత్రసాధనమ్ (ఋ. సం. ౮-౩౧-౧౪) మిత్రమివ క్షేత్రసాధయితారమ్.

అర్థము :- అథాపి = మఱియు నీవిధముగ భాషికేభ్యః ధాతుభ్యః లౌకికధాతువులతో, నైగమాఃకృతః = వైదికకృదన్తశబ్దములు, భాష్యన్తే = అంగీకరింపబడుచున్నవి. వాని నిర్వచనముచేయబడుచున్నది — ఉదా :— దమూనాః-దమ ఉపశమే దమమన ఉపశమము. ఈధాతువుతో లోకమున

దామ్యతి, దమయతి, దాన్తః మున్నగు ప్రయోగము లేర్పడును. ఈధాతువు తనే వేదమునందు - ఊనసి ఔణాదిక ప్రత్యయముచేసి దమూనస్ = దమూనాః అను ప్రయోగము సాధింపబడును. దానియర్థము దాన్తః = దాన్తుడు, అనగా శాంతుడు అని భావము. అష్టే క్షేత్రం సాధయతీతి క్షేత్ర సాధః, క్షేత్ర ఉపపదముగల 'సాధ్'ధాతువునకు ఔణాదిక అసున్ ప్రత్యయముచేసి 'క్షేత్రసాధః' ప్రయోగము సాధింపబడును.

"అథాపి నైగమేభ్యో భాషికాః ఉష్ణమ్ ఘృతమితి."

నిగమే ఛన్దసి యే ప్రసిద్ధాః తేభ్యో భాషికాః కృత్ప్రత్యయాన్తా భాష్యన్తే తద్యథా - ఉష్ణమ్, ఘృతమితి, ఉష దాహే ఛందసి ప్రసిద్ధః. ప్రత్యుష్టగ్ం రక్షః ప్రత్యుష్టా అరాతయః (య. వా. సం. ౧ ౭) భాషాయాం పునరుషమితి శ్రూయతే. ఏవ మేవ ఘృ క్షరణ దీప్త్యోః తస్య ఛందసి ఆ త్వా జిఘర్మి (య. వా. సం. ౧౧-౨౩) భాషాయాం పునర్ ఘృతమితి శ్రూయతే.

అర్థము :- వైదికధాతువులతో లౌకికప్రయోగములు సిద్ధము చేయబడును. ఉదా :- ఉష్ణమ్ శబ్దము తఱచుగా వేదమునసే ప్రసిద్ధ ఉషదాహే అనుధాతువునకు ఔణాదిక 'నక్' ప్రత్యయముచేసి సిద్ధము చేయబడును. కాని యిది లౌకికమే లేక ఛాన్దసధాతువైన ఘృక్షరణదీప్త్యోః అనుధాతువుతో ఈలౌకికశబ్దము సిద్ధమగును.

[అథ దేశప్రసిద్ధితో శబ్ద - రూఢి - నిర్ణయము]

అథాపి ప్రకృతయ ఏవైకేషు భాష్యన్తే వికృతయ ఏకేషు.

అథాపి ఇదమపర ముపేక్షితవ్యమనేన. కిమ్? ఏకేషు ప్రదేశేషు ప్రకృతయ ఏవ ధాతుశబ్దానాం భాష్యన్తే వికృతయ ఏకేషు. ధాతో రాఖ్యాత పదభావేన యః ప్రయోగః సా ప్రకృతిః నామీభూతస్య తస్యైవ యః ప్రయోగః సా వికృతిః.

అర్థము :- మఱియు ఏకేషు = కొన్నిదేశములందు ప్రకృతయ ఏవ భాష్యతే = ప్రకృతియే - ధాతువులుమాత్రమే మాటలాడబడుచుండును. ఏకేషు వికృతయః = కొన్నిదేశములందు వికృతులు వికారములు అనగా ఆఖ్యాతనిష్పన్ననామములతో ప్రయోగింపబడును. ధాతువులుకాదు ఎట్లన :-

**శవతి ర్గతికర్మా కంబోజేష్వేవ భాష్యతే. కంబోజాః కంబల భోజాః కమనీయ-భోజా వా కంబలః కమనీయో భవతి. వికారమస్యార్యేషు భాషన్తే శవ ఇతి. దాతిర్ లవనార్థే ప్రాచ్యేషు దాత్రముదీచ్యేషు.**

శవతి ర్గతికర్మా గత్యర్థో ధాతుః కాంబోజేష్వేవ భాష్యతే. కాబులాది మ్లేచ్ఛప్రదేశేషు ప్రకృత్యా ప్రయుజ్యతే. శవతి - గచ్ఛతీత్యర్థః కంబోజాః ప్రాయేణ కంబలా నుపభుంజతే హిమప్రాయత్వా త్తస్య దేశస్య కమనీయ భోజాః కమనీయాని చైతే ద్రవ్యాణి ఉపభుంజతే. కంబలః కమనీయో భవతి. ప్రార్థనీయో హి స శీతార్తైః భవతి. ఆర్యేషు కురుక్షేత్రాదిజనపదేషు అస్యైవ - శవతేర్వికారం భాషన్తే కథమ్ ? శవ ఇతి. ద్వితీయముదాహర ణమ్ దాతిర్లవనార్థే ప్రాచ్యేషు దాతి ర్ధాతురాఖ్యాతస్థో లవనార్థే ప్రాచ్యేషు కాశ్యాది - జనపదేషు ప్రయుజ్యతే. తద్యథా - వ్రీహీన్ దాతి. యవాన్ దాతి అయమేవ నామీభూతః ఉదీచ్యేషు హరద్వారాది జనపదేషు ప్రయుజ్యతే దాత్రమ్ ఇతి.

అర్థము :- గతికర్మా = గత్యర్థకమగు, శవతిః = శవధాతువు, కంబో జేషు ఏవ = కంబోజదేశమునందే, భాష్యతే = మాటాడబడుచున్నది, కంబోజాః=కంబోజపదవ్యుత్పత్తి, కంబలభోజాః=చలిదేశమగుటచే నక్కడి వారు కంబళ్ల నెక్కుడుగా వాడుదురు. కావున వారు కంబోజులన బడుదురు. వా = లేక కమనీయభోజాః - అందుకొనదగిన రత్నములు మున్నగువస్తువులను ప్రయోగించుచుందురు. ఆదేశమునందు రత్నములధిక ముగ లభించును. కావున వారుకంభోజులనబడుదురు. కంబలః = కంబ లము అని యేలచెప్పబడునన :- కమనీయః భవతి = చలిచే పీడింపబడు నెల్లరిచే ప్రార్థనీయ = కోరబడినదగుటచే, కంబలః = కంబళి - గొంగడి యనబడును, ఆర్యేషు=ఆర్యావర్తదేశమునందు అస్య=ఈశవగతౌ ధాతువు యొక్క, వికారమ్ = వికారము - అనగా శవనామముతో చెప్పుదురు. ఆర్యావర్తములో శవధాతుప్రయోగము చచ్చుటయను నర్థములో (శవము) నున్నది. ప్రాచ్యేషు = పూర్వదిశలోనుండు జనులు లవనార్థే కోయుటయను నర్థమున, దాతిః = 'దాప్‌లవనే' ధాతువును ప్రయోగింతురు, ఉదీచ్యేషు =

ఉత్తరదేశప్రజలు, దాప్ లవనే = లవనార్థకధాతువుతో నేర్పడిన, దాత్ర= దాత్రము అనునామమును వాడుదురు.

"ఏవ మేకపదాని నిర్బ్రూయాత్."

అనేన ప్రకారేణ ఏకపదాని నిర్బ్రూయాత్ భాషా-నిగమ-వ్యవస్థయా దేశభాషా ప్రసిద్ధివిభాగేన చ.

అర్థము :- ఏవమ్ = ఈవిధముగనే, ఏకపదాని=ఒంటరిపదములను, నిర్బ్రూయాత్ = నిర్వచింపవలెను.

(తద్ధిత సమాస - నిర్వచనము)

"అథ తద్ధితసమాసేష్వేక - పర్వసు చానేకపర్వసు చ పూర్వం పూర్వమపరమపరం ప్రవిభజ్య నిర్బ్రూయాత్.

అథ పునర్యాని తద్ధితయుక్తాని సమాసయుక్తాని చ పదాని తాని కథం నిర్వక్తవ్యాని? ఉచ్యతే. తద్ధితసమాసేష్వేకపర్వసు చానేక-పర్వసు చ పూర్వం పూర్వమపరమపరమ్ ప్రవిభజ్య నిర్బ్రూయాత్. అథ తద్ధిత సమాసనిర్వచనమ్. పూర్వం తద్ధితార్థం నిర్బ్రూయాత్. పశ్చాత్ పదార్థమ్. సమాసేష్వపి పూర్వం సమాసార్థమ్ పశ్చాత్ పదార్థమ్.

అర్థము :- అథ = తద్ధితసమాసేషు = తద్ధితములందును, సమాసములందును, ఏక-పర్వసు = ఒకపదముగలిగినట్టియు, అనేకపర్వసు = అనేకపదములు గలిగినట్టియు పదములందు, పూర్వపూర్వమ్ = ప్రథమమున మొదటిదానిని, అపరమపరమ్ = తదుపరి తరువాతిదానిని, విభజ్య= చేయుచేసి, నిర్బ్రూయాత్ = నిర్వచింపవలెను.

ఉదాహరణము :-

'దండ్యః పురుషః' దండమర్హతీతి వా దండేన సంపద్యత ఇతి వా, దండో దదతేర్ధారయతి కర్మణః అక్రూరో దదతే మణిమ్. ఇత్యభిభాషన్తే దమనాదిత్యౌపమన్యవః దండమస్యా కర్షతేతి గర్హాయామ్.

దండ ఇత్యేష తద్ధితః. కస్మింశ్చిదపరాధే దండమర్హతీతి దండ్యః. దండేన వా యః సంపద్యతే సంయుజ్యతే స దండ్యః. దదతే ర్ధారయతి కర్మణః ధారయత్యర్థే వర్తమానస్య - ధార్యతే హ్యేషోఽపరాధేషు రాజభిః వేద తావత్ విశ్వే దేవాః పుష్కరేత్వా దదన్త (ఋ. సం. 8 33.౧౧) లోకే 'అక్రూరో దదతే మణిమ్' దమనాదిత్యౌపమన్యవ ఆచార్యో మన్యతే తేన హి అదాన్తా దమ్యన్తే రాజభిః. దండమస్యాకర్షతేతి గర్హాయామ్. దండమస్యా కర్షత. హి సభాసదః ఇత్యేవ మయం గర్హాయాం దృష్టః.

అర్థము :- దండ్యః పురుషః = ఈ తద్ధితపదానికి నిర్వచనము. దండమర్హతి ఇతి=దండమును పొందుటకు అర్హుడు. లేక దండేన సంపద్యతే వా= దండముతో యుక్తము చేయబడినవాడు. కావున దండ్యుడు ఇది తద్ధిత పద నిర్వచనము దండో దదతేః ధారయతి కర్మణః. ధరించుట యను నర్థముగల దదధాతువుతో 'దండ' మేర్పడును. దండనయే సమస్త ప్రజను ధరించుచున్నది. దండనచేతనే విశ్వవ్యవస్థ యేర్పడును. ఇది దండః పదనిర్వచనము. 'దద' ధాతువునకు ధారణ అనునర్థమును గలదు. ఇందుకు ప్రమాణము. అక్రూర - ఇత్యాది. వృష్ణి, అంధకులను వారికి రాజు అక్రూరుడు స్యమంతక 'మణిమ్ దదతే' మణిని ధరించుచున్నాడు. ఇతి అభిభాషంతే అని చెప్పుచున్నారు. దమనాదితి ఔపమన్యవః. ఉపమన్యుని పుత్రుడు ఔపమన్యు ఆచార్యుడు. దమనాత్ దండ ఉచ్యతే = దమనము కారణముగ దండః పదమేర్పడుచున్నదనుచున్నాడు. దీనిని బలపఱచుటకే లోకోక్తి చెప్పబడుచున్నది. గర్హాయామ్ = నిందనీయ కార్యములను చేయువాడు దండనపాత్రుడగును. అతనిని లక్ష్యమునందుంచుకొని అస్య దండమ్ ఆకర్షత = ఇతనిని దండించుము.

## 'కక్ష్యా రజ్జు రశ్వస్య' కక్షం సేవతే కక్షో గాహతేః.

క్స ఇతి నామకరణః ఖ్యాతేర్వానర్థకోఽభ్యాసః. కిమస్మిన్ ఖ్యానమితి.కషతేర్వా. తత్సామాన్యా న్మనుష్యకక్షో బాహుమూలసామాన్యా దశ్వస్య. తద్ధితస్యైవ ద్వితీయ ముదాహరణమ్. కక్ష్యా రజ్జురశ్వస్య కక్ష్యా ఇత్యేష తద్ధితః. కక్ష్య అశ్వస్య సన్నాహరజ్జుః. కక్షే భవా కక్ష్యా. గాహతేః విలోడనార్థస్య. ఖ్యాతేర్వానర్థకోఽభ్యాసః కకారః. కఖ్యాసన్ కక్ష ఇత్యుచ్యతే.

కషతేర్వా నిత్యాకాలంహ్యాసా నఖైః కష్యతే యతః బాహుమూలసామాన్యా దశ్వస్య. అశ్వస్యాపి యో బాహుమూలప్రదేశః స కక్ష ఇత్యుచ్యతే. తం సేవతఇతి కక్ష్యా సమానోదాహరణ ముచ్యతే.

అర్థము :- అశ్వస్య = గుఱ్ఱముయొక్క, రజ్జుః = త్రాడు - తంగు - కలదో దానికి కక్ష్య అని నామము. కక్ష్య అని యెందుకందురు? కక్షం సేవతే బాహుమూలమును సేవించుటవలన. కక్షయని దేనికందురు? కక్ష శబ్దము విలోడనార్థక 'గాహూ' ధాతువునకు 'క్స' అని నామకరణః 'క్స' ప్రత్యయము చేసిన కక్షశబ్దమేర్పడును. అనగా 'గాహూ' ధాతువునకు క్స ప్రత్యయము, ఆద్యన్తవిపర్యయములు చేసినమీదట కక్షశబ్దము సిద్ధమగును. వా = లేక, ఖ్యాతేః = ప్రకథనార్థక ఖ్యాధాతువునకు అనర్థకః అభ్యాసః = స్వార్థమున ద్విరావృత్తిచేయనగును. అనగా ఖ్యాధాతువునకు ద్విత్వము చేసిన కఖ్య అగును. ఆకఖ్యయే కక్ష యనబడును. వా = లేక, అస్మిన్ = ఈకక్ష చంకయందు, కిమ్ఖ్యానమ్ = ఏమి ప్రఖ్యాపనీయ - దర్శనీయ_ మేమియున్నది? ఏమియు లేదని యభిప్రాయము. ఇది గోపనీయమని భావము. కావుననే కఖ్య యని చెప్పుచు క్రమముగా కక్ష యనదొడగిరి, వా = లేక, కషతేః కషధాతువుతో కక్ష సిద్ధించును. కషధాతువునకర్థము దురదపెట్టుట, మాటిమాటికి చంకలో చెమటపట్టును, కావున దురద యేర్పడును. చెమటను దూరమొనర్చుటకు గోకవలసివచ్చును. తత్సా మాన్యాత్ మనుష్యకక్షః తస్యాః స్త్రియః సామాన్యాత్ = స్త్రీలకక్షతో సమాన మగుటచే పురుషులకక్షయు కక్ష యనబడుచున్నది. బాహుమూల సామా న్యాత్ బాహుమూలసామ్యముచే అశ్వస్య = అశ్వముయొక్క బాహుమూల ప్రదేశము కక్ష యనబడినది. అశ్వముల ముందుకాళ్లమూలము కక్ష యనబడును.

"రాజ్ఞః పురుషః రాజపురుషః రాజా రాజతేః. పురుషః పురిషాదః పురిశయః పూరయతేర్వా. పూరయ త్యంత రిత్యంతరపురుషమభి ప్రేత్య."

"యస్మాత్పరం నాపర మస్తి కించిత్ యస్మాన్నాణీయో న జ్యాయోఽస్తి కించిత్. వృక్షఇవ స్తబ్ధో దివి తిష్ఠత్యేక

స్తేనేదం పూర్ణం పురుషేణ సర్వమ్ ఇత్యపి నిగమో భవతి."

రాజపురుషమానియతా మిత్యుక్తే రాజస్వామికం పురుష మానయన్తి రాజతే ర్దీప్త్యర్థస్య. పూః శరీరమ్ పురిశయః సన్ పురుష ఇత్యుచ్యతే పూరయతేర్వా పూర్ణమనేన పురుషేణ జగదితి. నిగమశ్చ భవతి యస్మాత్ పరమపరం వా న కించిదస్తి, యస్మాచ్చ న కించిదణీయో నాపి జ్యాయోఽన్య దస్తి స ఏవ సర్వ మిత్యభిప్రాయః. వృక్ష ఇవ స్తబ్ధః స్వాత్మని యః తేన పురుషేణేదం పూర్ణం సర్వం జగదితి.

అర్థము :- రాజ్ఞః పురుషః=రాజపురుషః = రాజుయొక్క పురుషుడు రాజపురుష డనబడును. రాజా రాజతేః దీప్తి అర్థక రాజృధాతువుతో రాజాపదము సిద్ధించును. పురుషః = పురుషు డని యేలయందురు ? పురుషుడు పూః = శరీరము, బుద్ధియందు విషయోపభోగముకొఱకు ఉండును. కావున పురుషాదః = పురుషాదు డనబడుచు పురుషుడనబడెను. పురిశయః = వానియందు నిద్రించును. విశేషముగానుండును. కావున పురిశయుడగుటచే పురుషుడయ్యెను. పూః = శరీరం బుద్ధిర్వా - తయోరసౌ సీదతి పురుషాదః, తయోరసౌ శేతే ఇతి పురిశః, పురుషాదః, పురిశయశ్చసన్నైవాసౌపురుష ఉచ్యతే. పూరయతి - అంతః = లోపలనుండి సమస్త జగత్తును నింపుచున్నాడు (పూరయతి) కావున పురుషుడు అనబడును. అంతర్యామియై యంతట వ్యాప్తుడై యున్నాడు. పరమేశ్వరుడు అను నభిప్రాయముతో నిట్లు విగ్రహముచేయబడును. పురుషు డంతర్యామి యనుటకు ప్రమాణము. యస్మాత్ పరమ్ ... ... ఇత్యాదులు.

మంత్రార్థము :— యస్మాత్ = ఏపరమాత్మునికంటె, పరమ్ అపరమ్=మొదలు - లేక-అంతమునసున్నది 'న కించిత్' కొంచెమును లేదో అనగా - సృష్టియొక్క ఆద్యంతములలో నతడొక్కడే యద్వితీయుడై యుండును. యస్మాత్ = ఎవనికంటె న అణీయః అస్తికించిత్ = సూక్ష్మ వస్తువు లేదు. న జ్యాయః = అతనికంటె పెద్దవస్తువేదియు లేదు. అనగా

పరమేశ్వరుడు సూక్ష్మముకంటె సూక్ష్ముడు, స్థూలముకంటె స్థూలమని తాత్పర్యము. వృక్ష ఇవ స్తబ్ధః = వృక్షమువలె నిశ్చలుడు ఏకః = అద్వితి యుడు, దివి = ప్రకాశస్వరూపుడై తనయందే తిష్ఠతి = ఉండును, తేనేదం సర్వంపూర్ణమ్ = ఆపరమేశ్వరునితోనే యీజగత్తంతయు నిండబడి యున్నది. ఆతడే సర్వత్రవ్యాప్తుడై యున్నాడు.

> "విశ్వకద్రాకర్షః" వీతి చకద్ర ఇతి శ్వగతౌ భాష్యతే, ద్రాతీతి గతికుత్సనా కద్రాతి ఇతి ద్రాతికుత్సనా చకద్రాతి కద్రాతీతి సతోఽనర్థకోఽభ్యాసః. తదస్మిన్నస్తీతి విశ్వకద్రః సమాన స్యైవద్వితీయముదాహరణమ్ - విశ్వకద్రాకర్ష ఇతి. విశ్వక ద్రమాకర్షతీతి. విశ్వకద్రాకర్షః శ్వభిః సాకం యో గచ్ఛతి మనుష్యస్తస్మిన్ భాష్యతే. ద్రాతి కుత్సనాకుత్సిత కుత్సనే త్యర్థః. చకద్రాతి కద్రతీతి సతోఽనర్థకోఽభ్యాసః యదే వోక్తం భవతి కద్రాతీతి తదేవ చకద్రాతీతి. తదస్మి న్నస్తీతి విశ్వకద్రః.

శ్వజీవనః పురుషః సమవాదే కస్మింశ్చిత్ పక్షపాతమస్యే యం ఆకర్షతి స విశ్వకద్రాకర్షః.

అర్థము :- సమాసమునకు సంబంధించిన మరియొక యుదాహరణ మిది :— విశ్వకద్రాకర్షః = వి, ఇతి, 'వి'అను నది, చకద్రాతి = చకద్ర అనునదియును, శ్వగతౌభాష్యతే = కుక్కయొక్క నడకయందు ప్రయోగింపబడును. అది కుక్కలతో వెళ్ళువానియందు ప్రయుక్తమగును. ద్రాతి ఇతి గతి - కుత్సనా = ద్రాతి అనునది కుత్సితగతియందు ప్రయుక్తమగును. కద్రాతి ఇతి ద్రాతికుత్సనా = కద్రాతి అనునది ద్రాతి - కుత్సితద్రాతి యొక్క నిందను తెలుపును. అనగా మిక్కిలి నిందితగతిని తెలుపును ఇక చకద్రాతి అనునది కద్రాతియొక్క అనర్థక అభ్యాసము. [illegible] [illegible]. కావున చకద్ర అనగా అత్యంతనిందితగతి [illegible] [illegible] [illegible] = [illegible] [illegible] విశ్వకద్రుడు [illegible]. యం ఆకర్షతి = [illegible] [illegible] విశ్వ కద్రాకర్షః = విశ్వకద్రాకర్షుడు అనును. [illegible] [illegible] [illegible]

పురుషార్థముని నాకర్షించువాడని అర్థమగును. కుక్కవంటి నీచప్రవర్తన గలవానిని న్యాయముకొఱకు న్యాయాలయమునకు తెచ్చువాడని భావము.

> "కల్యాణవర్ణరూపః కల్యాణవర్ణస్యేవాస్యరూపమ్. కల్యాణం కమనీయమ్ భవతి. వర్ణో వృణోతేః. రూపం రోచతేః. ఏవం తద్ధితసమాసా న్నిర్బ్రూయాత్. నైకపదాని నిర్బ్రూయాత్.

అధునా రూపసమాసం దర్శయతి కల్యాణవర్ణరూపః కల్యాణవర్ణం సువర్ణం తస్యేవ యస్య రూపం స అగ్ని రన్యో వా కశ్చిత్. వర్ణో వృణోతేః ఆవృణోతి హి స ఆశ్రయమ్. రోచతే ర్దీప్తి రోచిష్ణు భవతి.

ప్రకరణోపపద - రహితాని యాని సన్తి తాని పరేణాభిద్రోహ - బుద్ధ్యా పృచ్ఛ్యమానాని న నిర్బ్రూయాత్ న నిర్వక్తవ్యానీతి. అథ వర్జ్య శిష్యనిరూపణమ్.

అర్థము :- సమాసమునకు సంబంధించిన మూడవనిరూపణము - కల్యాణవర్ణ - రూపః - కల్యాణవర్ణస్య ఇవతస్య రూపమ్ = సువర్ణమువలె నితనిరూపము సుందరము కావున కల్యాణరూపుడనబడును.

కల్యాణం కమనీయం భవతి సువర్ణమునకు కల్యాణమనునామ మేలకలిగినది? అది సుందరము, కమనీయము - ఎల్లరిచే నది ప్రార్థింప దగినది, వర్ణో వృణోతేః = వర్ణశబ్దము 'వృఞ్' ధాతువుతో నేర్పడును. వర్ణము తనయాశ్రితుని కప్పియుండును. రూపం రోచతేః రూపశబ్దము రుచ్‌ధాతువుతో నేర్పడును. రూపమెల్లరకు ఇంపగును. సౌందర్యమెల్లరకు రుచించును - ఇంపగును. ఏవమ్ = ఇట్లే, తద్ధిత సమాసాన్ = తద్ధితము లను; సమాసముల, నిర్బ్రూయాత్ = నిర్వచించవలెను.

ఏకపదాని - ప్రకరణము, ఉపపదములు లేని ఒంటరిపదములను నిర్వచింపరాదు. ఉదా :- 'జహ' ఇది ఒంటరిపదము. ప్రకరణము తెలియని, ఉపపదములేని 'జహ'అనుపదమును తెలిసికొనుట కష్టము. ఏలయన నీపదము 'ఓహాక్ త్యాగే'అనుధాతువువలన నేర్పడినదా? లేక 'హన హింసా గత్యోః'అనుధాతువువలన నేర్పడినదా? అని తెలిసికొనుటకు అది ప్రయుక్త

ప్రకరణమైనను తెలియవలయును, లేక ఉపపదసహితమైయుండవలెను. అప్పుడే యదిత్యాగార్థకమో హింసార్థకమో నిర్వచింప వీలుకలుగునని భావము.

(వర్జ్యశిష్య నిరూపణము)

"నావైయాకరణాయ నానుపసన్నాయ అనిదం విదే వా"

యస్తావదవైయాకరణః తస్మై న నిర్వక్తవ్యోఽయం సమామ్నాయో న హ్యసావలక్షణజ్ఞత్వాత్ నిరుచ్యమానమేతద్ బుధ్యేత- తతో వ్యర్థ ఏవ శ్రమః స్యాదితి. కించ వైయాకరణాయాపి సమ్యగుపసన్నాయ శిష్యవృత్తిమాస్థితాయైవ నిర్బ్రూయాత్. కించ? వైయాకరణాయాపి ఇదం వేదితుమసమర్థాయ నైవ నిర్బ్రూయాత్ కింకారణమ్?

అర్థము :- అవైయాకరణాయ = వ్యాకరణము చదువనివానికి నిరుక్తశాస్త్రము చెప్పరాదు, న అనుపసన్నాయ = శిష్యభావముతో బాగుగ సమీపింపనివానికి చెప్పరాదు. అనిదం విదేవా = అయోగ్యతవలన నిరుక్త శాస్త్రముతెలిసికొనలేని వానికిని జెప్పరాదు.

"నిత్యం హ్యవిజ్ఞాతు ర్విజ్ఞానేఽసూయా."

యో హి న విజానాతి స ఆత్మీయం దోషమాచార్య ఏవావసృజతి అథ గ్రాహ్యశిష్యనిరూపణమ్.

అర్థము :- హి = ఏలయన, అవిజ్ఞాతుః = అజ్ఞుడైన మనుష్యునకు, విజ్ఞానే - ఈశాస్త్రము నెఱుగుటయందు, నిత్యం = ఎల్లప్పుడు, అసూయా= ఆచార్యునందు దోషమునుజూపుప్రవృత్తియుండును, కావున మూఢుని యందీశాస్త్రమును జదువుక్షమత యుండదు. అట్టివానికి శాస్త్రము చెప్పరాదు.

అథ గ్రాహ్యశిష్యనిరూపణమ్. ఉపసన్నాయ తు నిర్బ్రూయాద్ యో వాఽలం విజ్ఞాతుం స్యాన్మేధావినే తపస్వినే వా.

యో మేధావీ - ప్రజ్ఞయాయుక్తః యో వా తపస్వీ తాభ్యా మవైయాకరణాభ్యామపి నిర్బ్రూయాదేవ.

అర్థము :- తు = కాని, ఉపసన్నాయ = శిష్యభావముతో బాగుగ ఉపస్థితుడైన శిష్యునకు, నిర్బ్రూయాత్ = నిరుక్తశాస్త్రమును చెప్పవలెను, వా = లేక, యః = ఎవడు, విజ్ఞాతుం అలమ్ = శాస్త్రమును తెలిసికొనదగు సమర్థతగలవానికి, మేధావినే తపస్వినే వా = మేధావియు, తపస్వియునగువానికి, ఇట్లు అన్నివిధముల సమర్థుడైన శిష్యునకే యీ శాస్త్రమును జెప్పవలయును.

"విద్యా హ వై బ్రాహ్మణ మాజగామ గోపాయ మా శేవధిష్టేఽ హమస్మి అసూయకాయానృజవేఽయతాయ న మా బ్రూయా వీర్యవతీ తథా స్యామ్."

విద్యా కిల కామరూపిణీ భూత్వా బ్రాహ్మణం కంచిదాజగామ ప్రహ్వీభూతోవాచ. చ గోపాయ మా = రక్ష మామ్. తతః తేఽహం శేవధిః భవిష్యామి. సుఖనిధానమిత్యర్థః యః ఖలు ఛాత్రః అసూయకః పరాప వాదశీలః అనృజుః క్రూరస్వభావః అయతః = అశుచిః తస్మై ఏవం లక్ష ణాయ న మాం బ్రూయాస్త్వమ్. ఏవం సత్యహం తవ నిధిః స్యామ్. భవేయ మిత్యర్థః.

అర్థము :- విద్యారూపిణీదేవి యొకప్పుడు కొండొకబ్రాహ్మణుని సమీపించినది. నన్ను రక్షింపుము అని యతని నడిగినది. నేను నీశేవధిని-నిధిని నన్ను రక్షించిన నీకు సుఖము కలిగింతును. అసూయకునకు కపటముగలవానికి, (అనృజవే) అయతాయ = యమనియమములను పాలింపక యశుచిగా నుండువానికి నన్ను అప్పగింపకు - అదియే నన్ను రక్షించువిధానము. విద్వాంసుడైన బ్రాహ్మణుడు అట్టివానికి చెప్పకూడదని భావము. శిష్యుడుగా గ్రహింపదగినవానికి ఉండవలసిన లక్షణములు వివరింపబడినవి.

"య ఆతృణత్త్యవితథేన కర్ణావదుఃఖం కుర్వన్నమృతం సంప్రయచ్ఛన్. తం మన్యేత పితరం మాతరం చ తస్మై న ద్రుహ్యేత్ కతమచ్చ నాహ."

అధునా శిష్యోపదేశమాహ. యో గురుః అవితథేన=సత్యేన బ్రహ్మణా వేదేన అదుఃఖం కుర్వ న్నమృతం జ్ఞానం సంప్రయచ్ఛతి - దదాతి తం

గురుం పితరం మాతరం చ మన్యేత జానీత ఉక్తం చ ఉత్పాదక - బ్రహ్మ దాత్రో ర్గరీయాన్ బ్రహ్మదః పితా. బ్రహ్మ జన్మ హి విప్రస్య ప్రేత్య చేహ చ శాశ్వతమ్ (వా. సం. ౨-౧౪౬) తస్మై మాతాపితృభూతాయ గురవే న ద్రుహ్యేత్ న ద్రోహం కుర్యాత్. కతమచ్చ కదాచిదపి విద్యార్థిభిః ఇతి వాక్యశేషః.

అర్థము :- యః = ఏగురువు, అవితథేన = సత్య - వేద - జ్ఞానముతో, అదుఃఖం కుర్వన్ = కొంచెముకూడ కష్టముగలిగించనివాడై, అమృతంసంప్రయచ్ఛన్ = మోక్షసాధనమైన జ్ఞానమునిచ్చుచు, కర్ణౌ = చెవులను, ఆతృణత్తి = వివృణోతి = తెఱచును. తం=ఆగురువును, పితరం మాతరంచ = తండ్రిగాను, తల్లిగాను, మన్యేత=తలంపవలయును, తస్మై= అట్టి గురువునకు, కతమచ్చనాహ=ఎన్నడును ద్రోహమును, న ద్రుహ్యేత్= చేయరాదు.

"అధ్యాపితా యే గురుం నాద్రియన్తే విప్రా వాచా మనసా కర్మణా వా. యథైవ తే న గురోర్భోజనీయా స్తథైవ'తా న్న భునక్తి శ్రుతం తత్.

అధునా దుష్టశిష్యాన్ అభికపన్తీ-విద్యా, ఇద మాహ. అధ్యాపితా యే ఛాత్రాః గురుంప్రతి నాద్రియన్తే నాదరం కుర్వన్తి. వాచా మనసా కర్మణా వా, యథైవ తే గురోర్నభోజనీయాః కృపాపాత్రాణి న భవన్తి తథైవ తాన్ దుష్ట శిష్యాన్ శాస్త్రమపి పఠితం న భునక్తి - ఫలేన న సంయునక్తీత్యర్థః.

అర్థము :- అధ్యాపితాః యే = చదివింపబడిన, విప్రాః=బ్రాహ్మణులు, మనసా వాచా కర్మణా = మనోవాక్కర్మలతో, గురుం న ఆద్రియన్తే = గురువును ఆదరింపరో, గురువులకు సేవాశుశ్రూషలు చేయరో, యథైవ తే = ఏవిధముగను చదివింపబడిన విద్యార్థులు, గురోః, న భోజనీయాః = గురువునకుపయోగపడరో, తథైవ = అట్లే, తత్ శ్రుతమ్ = వారు చదివిన చదువుకూడ, తాన్ న భునక్తి = వారిని రక్షింపదు - వారు చదివిన చదువు వారికి ఉపయోగింపదని తెలియవలెను.

"యమేవ విద్యాః శుచిమప్రమత్తం మేధావినం బ్రహ్మచర్యోపపన్నమ్. యస్తే న ద్రుహ్యేత్ కతమచ్చ నాహ తస్మై మా బ్రూయా నిధిపాయ బ్రహ్మన్ ఇతి. నిధిః శేవధిః ఇతి."

హే బ్రహ్మన్! త్వం యమేవ విద్యార్థినం విద్యాః జానీయాః శుచిం పవిత్రమ్, అప్రమత్తమ్=ప్రమాద-రహితం మేధావినమ్ ఊహాపోహకుశలం బ్రహ్మచర్యోపపన్నమ్ - జితేంద్రియమ్ కించ యః ఛాత్రః తే తుభ్యం న ద్రుహ్యేత్ న ద్రోహ ముపగచ్ఛేత్. కతమచ్చ కదాచిదపి తస్మై మాం బ్రూయాః నిధిపాయ మమ గోప్త్రే. శేవధిః సుఖనిధాన మిత్యర్థః.

అర్థము :- హే బ్రహ్మన్=ఓ బ్రాహ్మణుడా! యమేవ=ఎవనిని నీవు, శుచిమ్=పవిత్రుడు. యమనియమతత్పరుడు, అప్రమత్తమ్= ప్రమాదరహితుడు, మేధావినమ్=మిక్కిలిబుద్ధిమంతుడు, బ్రహ్మచర్యోపపన్నమ్=బ్రహ్మచర్యయుక్తుడు నైనవానినిగా, విద్యాః=ఎఱుఁగుదువో - గుర్తింతువో - మఱియు యః=ఎవడు, కతమచ్చనాహ=ఎన్నడును - ఏదశయందును, తే=నీకు, నద్రుహ్యేత్=ద్రోహముచేయడో, తస్మైనిధిపాయ=ఆనిధిని రక్షించువానికి, మా=నన్ను బ్రూయాః=చెప్పుము, శేవధిః=నిధిని శేవధియందురు, అది సుఖరాశి - బహుసుఖసాధనము.

ఇతి ప్రథమఃపాదః

ప్రథమపాదము సమాప్తము

## నైఘంటుకకాండము

## ద్వి తీ య పా ద ము

"అథాతోఽనుక్రమిష్యామః."

అథేదానీమ్-అతః శబ్దః హేతౌ. యస్మాత్ సామాన్యతః సమామ్నాయో వ్యాఖ్యాతః, అత ఇదానీమ్ విశేషతః అనుక్రమిష్యామః అనుపూర్వ్యేణ వర్ణయిష్యామః.

అర్థము :- అథ=ఇది అధికారార్థము ఏలయన-సామాన్యతః=సామాన్యముగ సమామ్నాయముయొక్క వ్యాఖ్యానముచేయబడినది. అతః=అందు

వలన నికముందు అనుక్రమిష్యామః = విశేషించి క్రమముగ నిఘంటువు యొక్క వ్యాఖ్యానము చేయుదుము.

**"గౌరితి పృథివ్యాః నామధేయమ్. యద్ దూర గతా భవతి. యచ్చాస్యాం భూతాని గచ్ఛన్తి గాతేర్వౌకారో నామకరణః."**

యదియం దూరమ్ అధ్వానం ప్రతిగతా భవతి. న హ్యస్యాః అంత ఉపలభ్యతే యత్ = యస్మాత్ అస్యాం భూతాని గచ్ఛన్తి ఆధారభూతా యామ్. గాతేర్వా గాఙ్గతౌ ఇత్యస్య ధాతోః ఓకారో నామకరణః ప్రత్యయః.

అర్థము :- గౌః = పృథివికి పేరు. (పృథివ్యాఃనామధేయమ్) యత్ = ఎందువలన నన, దూరంగతా భవతి = ఈపృథివి దూరముగా పోయియున్నది. యత్ చ = మఱియు నెందువలన, అస్యామ్=ఈపృథివి మీద, భూతాని = సర్వప్రాణులకు నిది యాధారభూతమైయున్నది. ఈ రెండువిధములగు విగ్రహమునందును గమ్'ధాతువునకు 'డో'ప్రత్యయము చేసి న 'గో'శబ్దముసిద్ధమగును. వా = లేక గాతేః 'గాఙ్గతౌ' ధాతువునకు ఓకారః నామకరణప్రత్యయః = ఓకారప్రత్యయముచేసి, గోశబ్దము సిద్ధము చేయబడును.

**"అథాపి పశునామేహ భవత్యేతస్మాదేవ."**

గౌరిత్యేతత్ - పశునామ భవతి. ఏతస్మాదేవ ధాతుద్వయాత్ గమే ర్గాతే ర్వా.

అర్థము :- అథాపి=మఱియు, ఇహ=ఈరెండుకారకములందు, కర్తా, అధికరణమునందు, ఏతస్మాత్ = ఈరెండుధాతువులతో గోశబ్దము, పశు నామ = పశువుయొక్కనామము, గోవుయొక్కవాచకమగును.

> **"అథాప్యస్యాం తాద్ధితేన కృత్స్నవన్నిగమా భవన్తి "గోభిః శ్రీణీత మత్సరమ్ (ఋ. సం. ౯-౪౬-౪) ఇతి" పయసః. మత్సరః సోమో మన్దతేః తృప్తికర్మణః. మత్సర ఇతి లోభనామ. అభిమత్త ఏనేన ధనం భవతి. పయః పిబతేర్వా ప్యాయతే ర్వా క్షీరం క్షరతేః ఘసేర్వేరో నామకరణ ఉశీరమితి యథా."**

అథాప్యస్యామ్ ఏవ పశు గవి.తద్యథా-"గోభిః శ్రీణీత మత్సరమితి గోరేక దేశస్య పయసః కృత్స్నవత్ ప్రయోగః. హేఽధ్వర్యవః గోభిః గోభ్యోభినిష్పన్నేన - రసేన శ్రీణీత ఏనం మత్సరం మాదయితారం సోమం మన్దతే తృప్తి-కర్మణః తృప్యన్తి హి అనేన దేవతాః ఏనేన ధనేన మత్తో భవతి. పయః పిబతేర్వా పానార్థస్య పీయతే హి తత్ ప్యాయతేర్వా వృద్ధ్యర్థస్య తేన హి వర్ధన్తే ప్రాణినః. క్షీరం క్షరతేః శ్చ్యోతనార్థస్య, శ్చ్యోతతే హి తదూధసః, ఘసే ర్వేరో నామకరణః అదేర్వస ఆదేశః - క్రియతే. యథా వశకాన్తౌ తస్య కృత - సంప్రసారణస్య ఈరప్రత్యయేనోశీరమితి భవతి.

అర్థము :- అథాపి = మఱియు, అస్యామ్ = ఈగోవునందే - గోపదము నందే, తద్ధితప్రత్యయముచేసి, కృత్స్నవత్ = పూర్ణగోశబ్దమువలె, నిగమా భవన్తి = వైదికప్రయోగములు ఏర్పడును. అనగా - గోశబ్దమునకు తద్ధిత ప్రత్యయముచేసినందున నేయర్థమేర్పడునో ఆయర్థమే ప్రత్యయముచేయని గోశబ్దమువలనను సిద్ధించును. ఉదా :- గోభిః = గోదుగ్ధముతో, మత్సరమ్= సోమరసమును, శ్రీణీత = పచనముచేయుము - వండుము. ఈమంత్రమున గోశబ్దము దుగ్ధము - అనునర్థమున ప్రయోగింపబడినది, మత్సరః సోమః= మత్సరము - సోమము, మత్సరశబ్దము సోమరసమునకు వాచకము, తృప్తి కర్మణః=తృప్త్యర్థక, మందతేః='మది'ధాతువుతోసిద్ధమగుటవలన మత్సర ఇతి లోభనామ = మత్సరము అని లోభమునకు పేరు ఏలయన - ఈ లోభమువలన ధనమ్ = ధనవిషయమున మనుష్యుడు, అభిమత్తః = మత్తుడు పిచ్చివాడు - అగును. పయః పిబతే ర్వా = పయస్సుపాలకు పేరు. పయశ్శబ్దమును 'పా - పానే' త్రాగుటయనునర్థముగల 'పా'ధాతువుతోనో, లేక 'ప్యాయతేః' వా = ప్యాయీవృద్ధౌ = వృద్ధ్యర్థక 'ప్యాయీ' ధాతువు తోనో సిద్ధముచేసికొనుము క్షీరమ్ = పాలివాచకమగు క్షీరముపదము క్షరతేః శ్చ్యోతనార్థక 'క్షర'ధాతువుతో సిద్ధమగును. క్షీరము = (పాలు) పొదుగు నుండి-స్తనములనుండి క్షరతి=స్రవించును, ఘసేర్వా ఈరః నామకరణః - లేక, 'ఘస్'ధాతువునకు ఈరప్రత్యయముచేసిన క్షీరశబ్దము సిద్ధించును. ఉదా :- యథా ఉశీరమ్ = ఉశీరశబ్దమేర్పడినట్లు "వశకాన్తౌ" ధాతువునకు 'ఈరక్' ప్రత్యయముచేసి సంప్రసారణముచేసిన 'ఉశీర'శబ్దము సిద్ధించును.

**''అంశుం దుహన్తో అధ్యాసతే గవి'' (ఋ. ౧౦-౯౪-౯) ఇత్యధిషవణచర్మణః, అంశుః శమష్టమాత్రో భవతి. అననాయ శం భవతీతి వా, చర్మ చరతేర్వా - ఉచ్చృతం భవతీతి వా.**

'అంశుం దుహన్తో అధ్యాసతే గవి' (ఋ. ౧౦-౯౪-౯) జగత్ అర్బుదో నామ కాద్రవేయః సర్పః తస్యార్షమ్. గ్రావస్తుతౌ వినియుక్తా హి ఇంద్ర గచ్ఛ యజ్ఞాయతనం సంస్కృతః సోమః ఇతి. ఋత్విజోఽపి అంశుం సోమాంశం, దుహన్తః ప్రపూరయన్తః. గవి గోరవయవే అధిషవణచర్మణి ప్రతీక్షమాణా ఆసతే. అంశుః శమష్టమాత్రో భవతి - వ్యాప్తమాత్రో హి యజమానేన అననాయ - జీవనాయ శం సుఖీ భవతీతి వా. చర్మ చరతేర్వా తత్ సర్వస్మిన్ శరీరే గత మిత్యర్థః ఉచ్చృతమ్ = ఉత్కృత్తమ్ శరీరాదితి వా.

అర్థము :- అంశుమ్=సోమరసమును, గవి=గోచర్మముతో నిర్మింపబడిన పాత్రవిశేషమునందు, దుహన్తో = పిండుచున్నవారై, అధ్యాసతే = కూర్చుండియున్నారు, ఇతి అధిషవణచర్మణః = ఇట గోశబ్దము సోమరసమునుంచుటకు గోచర్మముతోచేయబడిన పాత్రకునామము.

అర్థము:-అంశుః=సోమరసము,అష్టమాత్రః=వ్యాప్తమాత్రః పీతమాత్ర ఇత్యర్థః=యజమానునిచే త్రాగబడి, శమ్ = సుఖప్రదమగును, లేక - అననాయ=జీవనముకొఱకు,శంభవతి=కల్యాణకారకమగును,చర్మచరతేః=చర్మ శబ్దము గత్యర్థక 'చర'ధాతువుతో సిద్ధమైనది. చర్మము సమస్తశరీరమున వ్యాపించి యుండును. ఉచ్ఛృతం భవతీతి వా = లేక, ఒలువబడును కావున ఉచ్ఛృతమనబడును. కావుననే హింసార్థక చృతీధాతువువలన చర్మ శబ్దమేర్పడును.

**"అథాపి చర్మ చ శ్లేష్మా చ" గోభిః సన్నద్ధోఅసి వీలయస్వ (ఋ. ౬. ౪౭-౨౬) ఇతి రథస్తుతౌ.**

అథాపి చర్మ చ శ్లేష్మా చ. గోశబ్దేనోచ్యత ఇతి శేషః. గోభిః సన్నద్ధో అసి వీలయస్వేతి రథస్తుతౌ స హి చర్మణావనద్ధో భవతి. శ్లేష్మణా చ తస్యారాదయః సంశ్లేషితా భవన్తి.

అర్థము :- అథాపి = మఱియు, చర్మచ = గోవుచర్మము, శ్లేష్మ చ = శ్లేష్మయు గోశబ్దముచే చెప్పబడును. ఇందు మంత్రప్రమాణము :- హేరథమా నీవు, గోభిః = గోవుయొక్క చర్మము శ్లేష్మములతో సన్నద్ధః = గట్టిగా కట్టబడియున్నావు (అస్తి) అతః వీలయస్వ = కావున వీరత్వమును జూపుము, రథస్తుతౌ = అని యీమంత్రము రథస్తుతియందు ప్రయుక్తము.

"అథాపి స్నావ చ శ్లేష్మా చ గోభిః సన్నద్ధా పతతి ప్రసూతా (ఋ ౬-౭౫-౧౧) ఇతీషు స్తుతౌ."

అథాపి స్నావ చ శ్లేష్మా చ గోశబ్దేనోచ్యేత ఇతి శేషః గోభిః సన్నద్ధా పతతి ప్రసూతేషు స్తుతౌ స హి స్నాపనావేష్టితా భవతి. శ్లేష్మా చ సంశ్లేషితా.

అర్థము :- అథాపి = మఱియు, స్నావచ = గోశబ్దము ప్రేగుకుకూడ వాచకము, శ్లేష్మచ = శ్లేష్మకూడ గోశబ్దముచే చెప్పబడును. స్నావా శ్లేష్మ అను నీరెండును గోవువలననే కావున నీరెండును గోశబ్దముచే గ్రహింప బడును. ప్రమాణము :- బాణము స్నావా శ్లేష్మ అను నీరెంటిచే బాగుగ సన్నద్ధా బంధింపబడి, పతతి = శత్రువులమీద వెళ్లిపడును. ఇతి ఈ మంత్రము 'ఇషుస్తుతౌ' బాణస్తుతియందు పఠింపబడినది.

"జ్యాపి గౌ రుచ్యతే. గవ్యాచేత్తాద్ధితమ్ అథచేన్నగవ్యా గమ యతీషూనితి."

సా పునఃచేత్ యది గవ్యా తాద్ధితమ్, అభిధానమ్ అథ పునః న చేత్ గవ్యా గమయతీషూనితి గౌరన్య ద్రవ్యమపి.

అర్థము :- జ్యా అపి = ధనుస్సుయొక్క నారికూడ, గౌరిత్యుచ్యతే= గోశబ్దముచే చెప్పబడును, చేత్ యది గవ్యా = అవింటినారి గోవుయొక్క ప్రేగుతో చేయబడినదగుచో తాద్ధితప్రత్యయముచే నేర్పడినవామమగును. అథచేన్న = అట్లుకాని పక్షమున, గమయతీషూన్ = బాణములను చేరునది యగుచో గమ్‌ధాతువునకు డో ప్రత్యయముచేసిన గోశబ్దము సిద్ధమగును. ధనుర్గుణము = జ్యా అను నర్థమునందును గోశబ్దము గ్రహింపబడును. ఇందులకు ఉదాహరణముగా మంత్రము :-

"వృక్షే వృక్షే నియతామీమయత్ గౌస్తతో వయః ప్రపతాన్ పురుషాదః (ఋ. సం. ౧౦-౨౭-౨౨) వృక్షే వృక్షే ధనుషి ధనుషి వృక్షో వ్రశ్చనాత్ - వృత్వా క్షాం తిష్ఠతీతి వా క్షా క్షియతేర్నివాసకర్మణః. నియతా మీమయద్ గౌః శబ్దం కరోతి. మీమయతిః శబ్దకర్మా. తతో వయః ప్రపతంతి పురుషాన ధనాయ. విరితి శకునినామ వేతేర్గతికర్మణః అథాపీషు నామేహ భవత్యేతస్మాదేవ."

వృక్షే వృక్షే (ఋ. ౧౦-౨౭-౨౨) వసుక్రస్యేంద్రస్యేద మార్షమ్ త్రిష్టు బైన్ద్రి వృక్షే వృక్షే ధనుషి ధనుషి నియతా నిబద్ధా గౌః గవ్యా గమయిత్రీ వా శరాణామ్ ఇంద్రబాహ్వాకృష్టా అమీమయత్ మీమయతి శబ్దం కరోతి తతః శబ్దకరణానంతరమేవ ప్రపతాన్ ప్రపతన్తి వయః వేతేర్గతి కర్మణః ఇషవః పురుషానధనాయ-భక్షణాయ, తే హి శత్రూణాం ప్రాణాన్ భక్షయన్తి. వృక్షో వ్రశ్చనాత్ స హి వృశ్చ్యతే ఛిద్యతే రక్షనార్థమ్.

అర్థము :- మంత్రార్థము - వృక్షే వృక్షే = ప్రతిధనుస్సుమీద, నియతా = ఎక్కుపెట్టబడి, గౌః = ధనుర్గుణము, అమీమయత్ = శబ్దము చేయును, తతః = తరువాత, పురుషాదః = పురుషులను చంపు, వయః = బాణములు, ప్రపతాన్ = పడును, వృక్షపుకర్రతో ధనువు నిర్మింపబడును. అందువలన వృక్షముకాడ ధనుస్సనబడినది. వృక్షో వ్రశ్చనాత్. ఛేదింప బడును. కావున వ్రశ్చ్యతే ఛేదింపబడునది వృక్షమని నిర్వచనము ఇంధన ములకొఱకు వృక్షము ఛేదింపబడును. వాలేక వృక్షము. క్షామ్ = భూమిని, వృత్వా=ఆవరించి, తిష్ఠతిఇతి=ఉండును. కావున వృక్షమనబడును. పృథివికి క్షాయనినామము, నివాసకర్మణః క్షియతేః క్షినివాసే అనునివాసార్థక 'క్షి' ధాతువుతో క్షాశబ్దమేర్పడును. ఈపృథివిపైననే ప్రాణులు నివసించును కదా ? నియతా = ఎక్కుపెట్టబడి - బంధింపబడి, గౌః = నారి, అమీ మయత్ = శబ్దముచేయును, మీమయతిః శబ్దకర్మా మీమయతి యనగ శబ్దముచేయుట, తతః = శబ్దానంతరము బాణములు, ప్రపతన్తి = శత్రు వులమీదపడును, పురుషాన్ = పురుషులను, అదనాయ = భక్షించుటకు - చంపుటకు అని యర్థము విఃఇతి 'వి' శకునినామ 'వి' పక్షిపేరు వేతేః

గతికర్మణః గత్యర్థక 'వీ'ధాతువుచే వయః=వయ శబ్దమేర్పడును. ఈ మంత్రమున 'ఇషు' శబ్దము బాణవాచకము గతియందు తీవ్రతగలుగుటకు బాణమునందు పక్షులఈకలుజోడింతురు. ఆసంబంధముతోనే బాణము 'వి'నామముతో చెప్పబడును, వయః=పక్షులు బాణములు.

**"ఆదిత్యోఽపి గౌరుచ్యతే ఉతాదః పరుషేగవి (ఋ. ౬-౫౬-౩) పర్వవతి భాస్వతీత్యౌపమన్యవః."**

ఆదిత్యోఽపి గౌరుచ్యతే ఏతస్మిన్ మంత్రే ఉతాదః పరుషే గవి. (ఋ. ౬-౫౬-౩) భారద్వాజస్యేయ మార్షమ్ - గాయత్రీపోష్ణీ. అదః అముష్మిన్ అదిత్యమండలే పరుషే పర్వవతి పర్వభి స్తద్వతి. అథవా భాస్వతి అహోరాత్రాది పర్వతద్వతీత్యౌపమన్యవః. గవి గమనశీలో సూర్యోభగవాన్ వయ మభిప్రేతార్థసిద్ధయే స్తుమః.

అర్థము :- ఆదిత్యః అపి = సూర్యుడును, గౌః ఇత్యుచ్యతే = గోశబ్దముచే వ్యవహృతుడగుచున్నాడు. ఎట్లన :- ఉత = మఱియు, అదః = ఈ, పరుషే = పర్వములుగల - అహోరాత్రాది పర్వయుక్త గవి=సూర్యుని యందు, ఈమంత్రమునందు గోశబ్దము సూర్యుడను నర్థమున ప్రయోగింపబడినది - పరుషశబ్దమునకు పర్వవాన్ - లేక భాస్వాన్=పర్వములుగలవాడు లేక ప్రకాశముగలవాడని యర్థము అని ఔపమన్యాచార్యుని మతము.

**"అథాప్యస్యైకో రశ్మి శ్చంద్రమసం ప్రతి దీప్యతే. తదేతే నో పేక్షితవ్యమ్. ఆదిత్యతోఽస్య దీప్తి ర్భవతీతి సుషుమ్ణః సూర్యరశ్మి శ్చంద్రమా గన్ధర్వః" (యజు. ౧౮-౪౦) ఇత్యపి నిగమో భవతి.**

ఏకో రశ్మి రాదిత్యస్య సుషుమ్ణో నామ చంద్రమసం ప్రత్యవస్థితో దీప్యతే తదతేన మంత్రార్థవిదా మంత్రానుపేత్య ఈక్షితవ్యమ్-ద్రష్టవ్యమే సేయ మస్య చంద్రమసో దీప్తిః జ్యోత్స్నా ఆదిత్యతః. ఆదిత్యస్య అనుగ్రహాదేవ భవతీతి. సుషుమ్ణః సుషు - సుఖ ఇత్యర్థః. సూర్యరశ్మిః చంద్రమసంప్రతి గతః చంద్రమాః గంధర్వః.

అర్థము :- అథాపి = మఱియు, అస్య = ఈసూర్యుని, ఏకఃరశ్మిః = ఒక్కకిరణము, చంద్రమసంప్రతి దీప్యతే = చంద్రునిపై ప్రకాశించుచున్నది - చంద్రునకు ప్రకాశమిచ్చుచున్నది, తత్=ఆవిషయము, ఏతేన= వేదార్థముచెప్పువానిచే తెలిసికొనబడవలయును (ఉపేక్షితవ్యమ్). అస్య దీప్తిః=ఈచంద్రునిప్రకాశము, అదిత్యతః=సూర్యునివలన నేర్పడుచున్నది. ఇందీమంత్రము ప్రమాణము, సుషుమ్నః = సుషుమణ అనునామముగల, రశ్మిః = కిరణము, చంద్రమాః = చంద్రుడు, గంధర్వః = గాంధారయతి ఇతి గాం = సుషుమ్ణనామకకిరణమును ధరించుచున్నాడు.

"సోఽపి గౌరుచ్యతే – అత్రాహ గోరమన్వత ఇతి. తదుపరిష్టాత్ వ్యాఖ్యాస్యామః."

సోఽపి సుషుమ్ణో రశ్మిరేకః. యథాసౌ గౌ స్తస్యైద ముదాహరణమ్ అత్రాపి గౌరమన్వతేతి. తత్పున రేతదుపరిష్టాత్ ఐకపదికే వ్యాఖ్యాస్యామః.

అర్థము :- సోఽపిరశ్మిః = ఆ సుషుమ్ణరశ్మికూడ, గౌఃఉచ్యతే = గోశబ్దముచే చెప్పబడును. ఇందుప్రమాణము 'అత్రాహగోః' ఇత్యాదిమంత్రములు వీని వ్యాఖ్యానము ముందుజేయుదుము.

"సర్వేఽపి రశ్మయః గావ ఉచ్యన్తే. యత్రైతదేవం తథేయ మృగుదా హ్రియతే."

సూర్యకిరణములన్నియు గోశబ్దముచే వ్యవహరింపబడును. ఉదాహరణమునకు మంత్రము :—

"తావాం వస్తూన్యుశ్మసి గమధ్యై యత్ర గావో భూరిశృంగా అయాసః. అత్రాహ తదురుగాయస్య వృష్ణః పరమం పద మవభాతి భూరి." (ఋ. ౧-౧౫౪-౬).

తాని వాం వాస్తూని కామయామహే గమనాయ యత్ర గావో బహుశృంగాః. భూరీతి బహు నో నామధేయం ప్రభవతీతి సతః. శృంగం శ్రయతేర్వా శృణాతేర్వా శమ్నాతేర్వా శరణాయోద్గతమితి వా శిరసో నిర్గత మితి వా

**అయాసోఽయనః తత్ర తదురుగాయస్య విష్ణోర్మహాగతేః పరమం పదం పరార్ధ్యస్థమవభాతి భూరి. పాదః పద్యతేః తన్నిధానాత్పదమ్. పశు-పాద-ప్రకృతిః ప్రభాగ-పాద-సామాన్యాదితరాణి పదాని.**

తా వాం వాస్తూని ఇతి. దీర్ఘతమస ఆర్షమ్. తా తాని వాం-యువాభ్యా-మర్థాయ నివాస-స్థానాని ఉశ్మసి కామయామహే గమధ్యై గమనాయ యత్ర యేషు స్థానేషు. గావః - రశ్మయః భూరిశృంగాః బహుదీప్తయః అయాసః సంచరణశీలాః. కించ అత్రాహ యేషు స్థానేషు తత్పదమ్ ఉరుగాయస్య ఉరుగమనస్య భగవతో వృష్ణః - విష్ణోః పరమం పదమ్. అవభాతి దీప్యతే. ప్రభవతి హి తద్ బహుధాఽపి దీప్యమానమ్. శృంగం శ్రయతేః తద్ధ్యాశ్రితం భవతి శిరసి శృణాతేర్వా హింసార్థస్య తేన హి హినస్తి. శిరసో నిర్గత మితి వా శృంగమ్ పాదః పద్యతేః గత్యర్థస్య తన్నిధానాత్ పదమ్ యదుత్పద్యతే తత్ స్వరూపమేవ పాంసౌ తత్పదమిత్యుచ్యతే. పశోర్మనుష్యస్య వా-ప్రభాగపాదః దీనారాదిపాదః.

అర్థము :- మంత్రార్థః - వాం = దంపతి నుద్దేశించి చెప్పుచున్నారు. వాం = మీయిరువురియొక్క, తా - తాని - వాస్తూని = ఆగృహములను, గమధ్యై = గమనముకొఱకు, ఉశ్మసి=మేముకోరుచున్నాము, యత్ర = ఏగృహములందు, భూరిశృంగాః = మిక్కిలిప్రకాశముగల. గావః=సూర్య కిరణములు, అయాసః = సంచరించుచున్నవి, అత్రాహ = ఆస్థానము లందు, ఉరుగాయస్య = గొప్పగతికల, భగవాన్వృష్ణః=సూర్యునియొక్క, పరమంపదమ్ = ఉత్కృష్టస్థానము, భూరిఅవభాతి = మిక్కిలిప్రకాశించు చున్నది.

భూరితి బహునః నామధేయమ్. భూరి-అనుపదము బహువాచకము, ప్రభవతి ఇతి సతః = కారణమేమన - అది సమర్థమైనది. శృంగం శ్రయతేర్వా = శృంగశబ్దము శ్రీఞ్ సేవాయామ్ = ధాతువుతో సిద్ధమగును, శృంగము = శిరస్సునాశ్రయించియుండును, శృణాతేఃవా = లేక హింసార్థక శృధాతువుతో నేర్పడును. పశువు కొమ్ములతో నితరులను హింసించును, శమ్నాతేఃవా = లేక 'శమ'ధాతువుతో శృంగశబ్దము సిద్ధించును. కొమ్ములతో పొడిచి యితరులను శాంతింపజేయును, శరణాయఉద్గతమితివా = లేక

రకణాకొఱకు శృంగములు పైకి పెరిగినవి. శిరసో నిర్గతమితి వా=లేక శిరస్సునుండి పైకిపెరిగినది కావున శృంగమనబడుచున్నది. అయాసః - అయనాః = గమనముకలవి, పాదఃపద్యతేః = పాదశబ్దము 'పద్‌గతౌ' ధాతువు వలన నేర్పడినది. దీనితో నడకకల్గునో యదిపాదము తన్నిధానాత్=అపాదము ఉంచబడుటచే స్థానముకూడ పదమనిచెప్పబడును. పశు - పాదప్రకృతిః= పశువుపాదములమీద ఆధారపడి యుండుస్వభావముగలది. ప్రభాగపదః = దీనారము మున్నగునాణెములును భాగ=పాదపదముచే వ్యవహరింప బడును, ప్రభాగ పాదసామాన్యాత్ ఇతరాణి = నాణెముల సమానత వలన శ్లోకములు మున్నగు ఇతర భాగములును, పాద = పదముచే వ్యవహ రింపబడుచున్నవి.

> "ఏవమన్యేషామపి సత్త్వానాం సందేహా విద్యన్తే, తాని చేత్ సమానకర్మాణి సమాననిర్వచనాని సమానకర్మాణి చేన్నానా నిర్వచనాని యథార్థం నిర్వక్తవ్యానీతి."

సమానకర్మాణి సామాన్యక్రియయాయుక్తాని.

అర్థము :- ఏవమ్ = ఇట్లే, అన్యేషామపి సత్త్వానాం = అన్యపదార్థ ముల నామములందును, సందేహాః విద్యన్తే = సందేహములుండును, చేత్ యది తాని = అవి, సమానకర్మాణి = సమానకర్మగలవియగునెడల, యథా ర్థమ్ = అర్థము ననుసరించి, సమాననిర్వచనాని = సమాననిర్వచనములు చేయవలెను చేత్ యది నానాకర్మాణి = అనేకకర్మలు గలవియగుచో నానానిర్వచనాని నిర్వక్తవ్యాని = నానానిర్వచనములుచేయవలెను.

> "ఇమాన్యేకవింశతిః పృథివీనామధేయా న్యుత్క్రాన్తాని. తత్ర నిరృతిర్నిరమణా దృచ్ఛతేః. కృచ్ఛ్రాపత్తిరితరా. సా పృథివ్యా సందిహ్యతే తయోర్విభాగః."

ఏకవింశతిరితి సంఖ్యా పృథివీనామధేయాని. ఉత్క్రాన్తాని అను పూర్వ్యేణ పఠితానీత్యర్థః ఏభ్యోఽన్యాన్యపి నిర్వక్తవ్యాని తద్యథా-కు ఇత్యేతద్ సమామ్నాతమ్ పృథివ్యానామధేయమ్. ఉక్తం హి - "నాగ్ని చిన్నరకం యాతి న సత్పుత్రో న కుప్రదః" ఇతి. తత్రైతస్మిన్ ఏకవింశకే నామగణే నిరృతిః ఇత్యేతదభిధానమ్. నిరమణాద్ నివిష్టాని రమన్తేఽస్యాం భూతానీతి

నిర్ఋతిః పృథివీ ఇతరాకృచ్ఛ్రాపత్తిః దుఃఖసంజ్ఞికా సమానదేయత్వాత్ పృథివ్యా సన్దిహ్యతే.

అర్థము :- ఇమాని ఏకవింశతిః = ఇవి ఇరువదియొకటి, పృథివీ నామాని = పృథివినామములు, ఉత్క్రాన్తాని = క్రమముగా పఠింపబడినవి, తత్ర = వానియందు, నిర్ఋతిః = నిర్ఋతిశబ్దపునిరుక్తి, నిరమణాత్ నివిష్టాని రమన్తేఽస్మిన్ భూతాని ఇతి నిర్ఋతిః = దేనియందు ప్రవేశించి ప్రాణులు రమించునో యది పృథివి, ఇతరాకృచ్ఛ్రాపత్తిః=రెండవది నిర్ఋతి పదము దుఃఖము పర్యాయపదము. ఋచ్ఛతేః = ఋచ్ఛధాతువుచే సిద్ధమగును. సా పృథివ్యా సందిహ్యతే=పృథివీశబ్దముతోకూడ సందేహము కలుగును. తయోః విభాగః=వానిని వేఱువేఱుగా తెలిసికొనవలయును.

'తస్యా ఏషా భవతి'

అర్థము :- పృథివికి, కృచ్ఛ్రాపత్తికి రెండింటికి వాచకమైన నిర్ఋతి శబ్దమునకు ఈక్రింది ఋక్కు ప్రమాణము.

"య ఈం చకార న సో అస్య వేద య ఈం దదర్శ హిరు గిన్ను తస్మాత్. న మాతుర్ యోనా పరివీతో అన్తర్బహు ప్రజా నిర్ఋతిమావివేశ. (ఋ. ౧-౧౬౪-౩౨).

బహుప్రజాః కృచ్ఛ్రమాపద్యత ఇతి పరివ్రాజకాః వర్షకర్మేతి నైరుక్తాః య ఈం చకారేతి కరోతి-కిరతీ సందిగ్ధౌ వర్ష కర్మణా 'న సో అస్య వేద' మధ్యమః స ఏవాస్య వేద మధ్యమో యో దదర్శాదిత్యోపహితమ్. 'న మాతుర్యోనా' మాతాన్తరిక్షమ్. నిర్మీయన్తేఽస్మిన్ భూతాని. యోనిరన్త రిక్షమ్. మహానవయవః పరివీతో వాయునా అయ మపీ తరో యోని రేతస్మాదేవ పరియుతో భవతి. బహుప్రజా భూమి మాపద్యతేకర్ష కర్మణా.

య ఈం చకార ఇతి. దీర్ఘతమస ఆర్షమ్. త్రిష్టుప్ బహుప్రజాః బహ్వపత్యో దరిద్రః పురుషః కృచ్ఛ్రం దుఃఖమ్ ఆపద్యతే యః చకార

కరోతి ఈం గర్భం న సః గర్భస్య తత్త్వం వేద కేవలం త్వసా కామార్తః
పుత్రార్థీ వా కరోత్యేవ గర్భమ్. యః ఈం దదర్శ యస్త్వేనం పశ్యతి హిరుగ్
అంతర్హిత మేతస్మిన్ జఠరే ఏతస్మిన్ వా శరీరే ఈం ను ఖస్తుమ్, తస్మాత్
తస్యైవ ఏష గర్భో యాథాత్మ్యతః. స గర్భో మాతుర్యోనా గర్భాశయస్థానే
మాతురశిత - పీత - లీఢ భక్షితేన జఠరే చతుర్విధాహారపరిణామేన పరివీతః
జరాయుణా పరివేష్టితో యథాకాలం జాయతే. బహుప్రజాః = బహుశః
ప్రజాయమానః, నిరృతిం = దుఃఖమ్, అవివేశ=ఆవిశతీత్యర్థః. వర్షకర్మేతి
నైరుక్తాః నిరృతిశ్చాత్ర భూమిః. య ఈం చకారేతి యః కరోతి వర్షం
మేఘః. న సోఽస్య వర్షస్య తత్త్వం వేద. య ఈం దదర్శ = య ఏవ
పశ్యతి, ఏతద్ వర్షం హిరుక్ ఈం ను తస్మాత్ - తస్యైవ ప్రత్యక్షమ్. స
ఏవ హ్యస్య వర్షస్య తత్త్వం వేద యో దదర్శ - యః పశ్యతి ఆదిత్యస్య
రశ్మ్యంతర్గతం వర్షమనభివ్యక్తమింద్రః. స ఏవ చ మేఘోదరాన్తర్గతః
ప్రావృట్కాలే బహుప్రజాః బహుశః ప్రజాయమానో నిరృతింభూమి
మావిశతి. అయమపి ఇతరః యోనిః స్త్రీ యోనిః ఏతస్మాదేవ. అసావపి
పరియుతో భవతి. స్నావ్నా మాంసేన చ. ఏవమేతస్మిన్ మంత్రే నైరుక్తానాం
నిరృతిశబ్దేన భూమి రుచ్యతే. పరివ్రాజకానాం కృచ్ఛ్రాపత్తిః.

మంత్రార్థము :- యః = ఎవడు, ఈమ్ = గర్భమును, చకార = కలిగించెనో వీర్యనిషేకముచేయునో, సః = అతడు, అస్య = ఈగర్భము యొక్క తత్త్వమును, న వేద = తెలిసికొనడు, యః = ఎవడు, ఈమ్ = గర్భమును, దదర్శ = చూచునో ఏగర్భస్థజీవుడు దీనిననుభవించునో యత డును అధ్యాత్మదృష్టితో నెఱుఁగడు, సః = అతడు, మాతుః = తల్లియొక్క, యోనా = యోనియందు, అంతః పరివీతః=లోపల జరాయువు - మాయతో చుట్టబడియుండును. యథాసమయము ఉత్పన్నుడగును, బహుప్రజాః = ఎక్కువసంతానముకలవాడు లేక పలుమాఱు జన్మలనెత్తు ఆజీవుడును, నిరృతిమ్ = దుఃఖమును - అనగా దుఃఖమునందు, ఆవివేశ=ప్రవేశించును బహుసంతానముగల పురుషుడు - లేక పలుమాఱు జన్మలనెత్తుజీవుడు, కృచ్ఛ్రమ్ = మిక్కిలి దుఃఖమునుపొందును. అని పరివ్రాజకులమతము, వర్షకర్మేతి నైరుక్తాః = నిరృతిపదము వర్షార్థమని నిరుక్తకారు లభిప్రాయ పడుచున్నారు, యావకార = ఏదివృష్టిని గలిగించునో ఆమేఘము, అస్య న

వేద = దీనితత్త్వము నెఱుగడు. తానువర్షించుజలము తనలో నెటనుండి వచ్చినదో మేఘమెఱుగదు, యః ఇంద్రః = వర్షకర్తయగుఇంద్రుడు, ప్రత్యక్షకర్తా = వృష్టిని ప్రత్యక్షముగాచూచును అందువలన, తస్మాత్ తస్య=దానితత్త్వము, హిరుక్=అంతర్హితమై యున్నది. అనగా నాయింద్రుడే దీనినెఱుగును. మాతుః = అంతరిక్షముయొక్క, యోనా = లోపలప్రదేశ విశేషమున, అంతఃపరివీత = లోపలవాయువుతోవ్యాప్తమై, బహుప్రజాన్ = అనేకజలధారలను వర్షించుమేఘము, నిరృతిమ్ = భూమిని - భూమిమీద, వివేశ = ప్రవిష్టమగును క్రిందికివచ్చును. య ఈమ్ చకారేతి = కరోతి కిరతీ సందిగ్ధౌ వర్షకర్మణా 'య ఈమ్ చకార' = ఇందలి చకార=చేసెను. అనుక్రియ, వర్షకర్మణా = వర్షకర్మతో సందిగ్ధమైయున్నది, కృవిక్షేపే అను విక్షేపార్థక కృధాతువునకును 'చకార' రూపమేర్పడును. 'డుకృఞ్ కరణే' ధాతువువలనను 'చకార' అనురూపము ఏర్పడును. ఇట్లీరెండుధాతువు లకును వర్షకర్మతో సంబంధమున్నది. స సో అస్య వేదమధ్యమః=కావున మధ్యమస్థానములలోనున్న మేఘము ఈవర్షకర్మయొక్క తత్త్వమును ఎఱుగదు. స ఏవ అస్య వేద మధ్యమః = మధ్యస్థానీయుతమగు ఇంద్రుడే దీనితత్త్వము నెఱుగును. యః = ఏయింద్రుడు, ఆదిత్యోపహితమ్ = సూర్యునియందు నిహితమైయున్న వృష్టిని, దదర్శ = చూచెనో, స మాతుర్ యోనా మాతాఅంతరిక్షమ్ నిర్మీయన్తే అస్మిన్ భూతాని = అంతరిక్షమునకు మాత అనిపేరు, దీనియందే ప్రాణులు నిర్మింపబడును. ఉత్పన్నప్రాణు లకు అవకాశమిచ్చి ఈయంతరిక్షము గొప్పఉపకారము చేయుచున్నది. యోనిరంతరిక్షమ్ మహానవయవః = అంతరిక్షమునకు యోని యనిపేరు. యోని అనగా వర్షమునకు అంతరిక్షము విశాలప్రదేశము, పరివీతఃవాయునా= అంతరిక్షము వాయువుచే పరివేష్టితమై యున్నది, అయమపి ఇతరః యోనికావద మఱియొక యోనియై యున్నది. ఇదియు, పరియుతః భవతి= జరాయువు - మాయతో పరివేష్టితమై యున్నది, బహుప్రజాః బహుశః ప్రజాయమానః = బహుజలధారలను వర్షింపజేయుమేఘము, వర్షకర్మణా= వర్షించుటకు, భూమిమాపద్యతే = భూమిని చేరుచున్నది క్రిందికిదిగి వచ్చును.

**శాకపూణిః సంకల్పయాం చక్రే. సర్వా దేవతా జానామీతి. తస్మై దేవతోభయలింగా ప్రాదుర్బభూవ. తాం న జజ్ఞే, తాం పప్రచ్ఛ వివిదిషాణి త్వేతి. సాస్మా ఏతా మృచమాది దేశ. ఏషా మద్దేవతేతి.**

శాకపూణిః ఆచార్యః, స సంకల్పయాంచక్రే - సంకల్పం కృతవాన్. సర్వా దేవతా జానామీతి. తస్మై దేవతోభయలింగా స్త్రీపుంలింగా ప్రాదుర్బభూవ తాం పురతోఽవస్థితాం న జజ్ఞే న జ్ఞాతవాన్ కిమియం స్త్రీ స్యాదథవా పురుష ఇతి. అజానన్ పప్రచ్ఛ వివిదిషాణి త్వా-వేదితుమిచ్ఛామి త్వామ్. కిమసి పురుషః అథవా స్త్రీ? సా ఏవం పృష్టాసతీ అస్మై శాకపూణయే ఏతామృచమ్ ఆదిదేశ - ఆదిష్టవతీ. కిమ్? ఏషా మద్దేవతేతి - అస్యాం ఋచి అహం దేవతేతి.

అర్థము :- శాకపూణిః సంకల్పయామాస = సంకల్పించెను, సర్వా దేవతాః జానామి ఇతి = నేను సర్వదేవతలను ఎఱుగుదును అని, తస్మై= ఆశాకపూణి సంకల్పించగానె యతనియెదుట నొకదేవత, ప్రాదుర్బభూవ= ప్రకటమయ్యెను ఆదేవత ఉభయలింగా = స్త్రీ, పురుషలింగములుగలదియై యుండెను. లేక, మధ్యస్థానలింగము ద్యుస్థానలింగము అనురెండు లింగములు కలదియై యుండెను. తాం న జజ్ఞే = ఆశాకపూణి యాదేవత నెఱుగజాలడయ్యె. ఆదేవత స్త్రీయా లేక పురుషుడా? లేక మధ్యమస్థానీయయా ద్యుస్థానీయయా! అని గుర్తింపజాలకపోయెను. తాం పప్రచ్ఛ = అతడాదేవత నడిగెను. నిన్ను నేను తెలిసికొనగోరుచున్నాను. అని, (వివిదిషాణిత్వా) అంతట నాదేవత శాకపూణికి, ఏతామ్ ఋచమాదిదేశ = ఈక్రిందజూపిన ఋక్కును ఉపదేశించెను. మఱియు నతనితో ఏషా మద్దే వతా = ఈఋక్కునకు 'నేనే దేవతను' అని చెప్పెను - అనగా 'నీవు నిరుక్తజ్ఞాతవు, కావున మంత్రార్థజ్ఞానము మూలమున నావిషయమును తెలిసికొనుము' అని చెప్పెనని భావము. అహం దేవతా యస్యాః సా 'మద్దేవతా = నేను దేవతగాగలిగిన ఋక్కు' అని (మద్దేవతాపదవిగ్ర హార్థము).

"అయం స శిజ్క్తే యేన గౌరభీవృతా మిమాతి మాయుం ధ్వంసనావధిశ్రితా సా చిత్తిభిర్ నిహి చకార మర్త్యం విద్యుద్భవన్తీ ప్రతివవ్రిమౌహత" (ఋ. ౧-౧౬౪-౨౯).

అయం స శబ్దాయతే. యేన గౌరభిప్రవృత్తా మిమాతి మాయుం శబ్దం కరోతి. మాయుమివాదిత్యమితి వా. వాగేషా మాధ్యమికా ధ్వంసనే మేఘే అధిశ్రితా. సా చిత్తిభిర్ కర్మభిర్ నీచై ర్నికరోతి మర్త్యమ్. విద్యుద్భవన్తీ ప్రత్యూహతే వవ్రిమ్. వవ్రిరితి రూపనామ. వృణోతీతి సతః వర్షేణ ప్రచ్ఛాద్య పృథివీం తత్ పునరాదత్తే.

కతమా పున రసావృగ్ ఉచ్యతే - అయం స శింక్తే ఇతి. అయం స శబ్దాయతే మేఘః శబ్దంకరోతి. యేన గౌరభీవృతా - మాధ్యమికావాగభి ప్రచ్ఛాదితా సతీ, మిమాతి మాయుం - శబ్దం కరోతీత్యర్థః. ధ్వంసనే ఉదక ధ్వంసనే ఉదకప్రంసనే మేఘే అధిశ్రితా. సా చిత్తిభిః కర్మభిః చటచటా శబ్దైః నీచైః నిహిచకార-నీచైః కరోతి మర్త్యం మనుష్యమ్. కదా ఉచ్యతే- విద్యుద్భవన్తీ - విద్యుదాత్మనా, వర్షేణ ప్రచ్ఛాద్య పృథివీమ్. తతో వర్ష - వ్యుపరమే ప్రతి ఔహత వవ్రిమ్ - ఆత్మీయం రూపమదృశ్యం కరోతీత్యర్థః. వవ్రిరితి రూపనామ తద్వ్యావృత్త్యా స్వమాశ్రయం వర్తతే. సేయు మేకైవ దేవతా మధ్యస్థానా - విద్యుద్వా ద్యుస్థానా ఽఽదిత్యరూపా వా ఇత్యయ మేవం లక్షణో దేవతాతత్త్వసందేహ ఉపేక్షితవ్యః.

మంత్రార్థః - మంత్రార్థము :- అయం సః = ఆమేఘము, శింక్తే = గర్జించుచున్నది - మేఘము గర్జింపదు - వాస్తవమున విద్యుత్తు గర్జించును. విద్యుత్తు మేఘమునందుండి గర్జించును. కావున తాతస్థ్యభావముతో మేఘము గర్జించుచున్నదని చెప్పబడినది. మంచెలఅచుచున్నవి యున్నట్లు యేన = మేఘముచే గౌః అభీవృతా మాధ్యమికవాణి = విద్యుత్తుయొక్క గర్జనరూపమున అచ్ఛాదితమై యున్నది. అదియే, ధ్వంసనే = మేఘము నందు, అధిశ్రితా = ఆశ్రయించియుండి, మాయుమ్=శబ్దమును, మిమాతి= చేయుచున్నది. సా=ఆవిద్యుత్తు, చిత్తిభిః=గర్జనరూపకర్మలతో, మర్త్యమ్=

మనుష్యుని, నిహిచకార - నికరోతి = నీచునిజేయును, విద్యుత్తు గర్జించు నపుడు మనుజుడు భయభీతుడై అల్పుడగును - మరలనావిద్యుత్తు, విద్యు ద్రూపంతీ = మెఱపుగా మాఱి, వవ్రిమ్ = తనరూపమును, ప్రతిజెహాత = తనలో ఇముడ్చుకొనును.

విద్యుత్తునకు రెండురూపములున్నవి. ఒకటిగర్జనరూపము, రెండవది మెఱపురూపము. మేఘమున నుండువిద్యుత్తు క్రమముగా తనరెండు రూపములను ప్రకటించుచు అంతర్హితమగును కనబడకుండపోవును.

అయం స శబ్దాయతే = మేఘము శబ్దముచేయును. యేన = ఆగర్జ నతో, అభ్రప్రవృత్తాగోః = అచ్ఛాదితమాధ్యమికవాణి - మధ్యమా విద్యుత్ తస్యా ఇయమ్ మాధ్యమికవాణి = గర్జన, మిమాతి మాయుమ్ = శబ్దమును గలిగించును. మాయుమ్ ఇవ ఆదిత్యమితి వా = ఇట మాయుశబ్దముచే ఆదిత్యుడు గ్రహింపబడును. లుప్తోపమ నంగీకరించి యిట్లర్థము చెప్పి దురు. విద్యుత్తు సూర్యునివలె ప్రకాశించును కదా! వాగేషా మాధ్యమికా ధ్వంసనే మేఘే అధిశ్రితా = ఈగర్జనరూపవిద్యుత్తు మేఘమున నున్నదై, చిత్తిభిః కర్మభిః=గర్జనరూపకర్మలతో, నీచైర్నికరోతి మర్త్యమ్=మనుష్యుని భయభీతునిజేసి యల్పునిజేయును, విద్యుత్భవన్తీ = విద్యుద్రూపయై, వవ్రిం ప్రత్యూహతే = తనరూపమును మఱుగుపఱచును - అంతర్హిత మగును, వవ్రిః ఇతిరూపనామ - వవ్రియుని రూపమునకు పేరు వృణోతీతి సతః = ఆచ్ఛాదనార్థక'వృఞ్'ధాతువుతో వవ్రియేర్పడును, వర్షేణ పృథివీం ప్రచ్ఛాద్య = వర్షముతో పృథివిని కప్పి అంతట భూమిపై వర్షించి, తత్ పునఃఆదత్తే = మరల నాజలమును ఆదిత్యరూపమున తనకిరణములతో తనలో నిముడ్చుకొనును.

ఇతి ద్వితీయః పాదః

ద్వితీయపాదము సమాప్తము

## తృతీయః పాదః

"హిరణ్యనామాన్యుత్తరాణి పంచదశ. హిరణ్యం కస్మాత్ ? హ్రియత ఆయమ్యమాన మితి వా, హ్రియతే జనాజ్జనమితి

వా· హితరమణం భవతీతి వా, హృదయ రమణం భవతీతి
వా హర్యతే ర్వా స్యాత్ ప్రేప్సా కర్మణః."

హిరణ్యం కస్మాత్? హ్రియతే ఆయమ్యమాన మితి వా, హిత-రమణం భవతీతివా, హృదయరమణం భవతీతి వా హర్యతే ర్వా స్యాత్ ప్రేప్సాకర్మణః, పృథివ్యామేవ హిరణ్యముత్పద్యతే ఇత్యతః పృథివ్యభిధానా నంతరం హిరణ్యనామాని సమామ్నాతాని. కియన్తి పంచదశ. ఆయమ్య మానం-హ్రియత ఏవ శిల్పిభిః కటక - రుచక - స్వస్తికాదిభావేన విస్తీర్య మాణమ్ - హితరమణం భవతీతి వా. తేన గృహీతేన మూషికోఽపి రమతే కిముత మనుష్యః.హర్యతేర్వా స్యాత్ ప్రేప్సాకర్మణః తద్ధి సర్వైరేవప్రార్థ్యతే·

ముందు చెప్పబోవు ౧౫ నామములు బంగారమునకు చెందినవి.

అర్థము :- హిరణ్యమని యేలచెప్పబడుచున్నది. హిరణ్యమునకు నిరుక్తియేమి? ఆయమ్యమానమ్ = పొడవుచేయుబడి, హ్రియతే = లాగ బడును. లేక జనాత్ జనమ్ - ఒకమనుజునినుండి మఱియొకనిదగ్గఱకు, హ్రియతే = తీసికొనిపోబడును. అనగా ఒకరినుండి మఱియొకనిదగ్గఱకు పోవును. హితరమణం భవతీతి వా=లేక భూషణరూపమున బంగారము హితకారకము. ధరించుటవలన సుందరముగా కనిపించును, హృదయ రమణం భవతీతి వా లేక యది హృదయమునకు ఇంపుగొల్పును, ప్రేప్సా కర్మణః వా = లేక ఇచ్ఛార్థకహర్యతేర్వా స్యాత్ = 'హర్య'ధాతువుతో హిరణ్యశబ్దమేర్పడును. ప్రతివ్యక్తియు దీనిని గోరును కావున హిరణ్య మనబడును.

"అన్తరిక్షనామాన్యుత్తరాణి షోడశ."

షట్ చ దశ చ షోడశ (ముందుచెప్పబోవు పదునాఱునామములు అంతరిక్షమునకు సంబంధించినవి.)

"అన్తరిక్షం కస్మాత్? అన్తరా క్షాన్తం భవత్యన్తరేమే
ఇతి వా - శరీరేష్వన్తరక్షయమితి వా."

అంతరిక్షమ్? అన్తరాహిదం ద్యావాపృథివ్యోరవస్థితమ్. క్షాంతం చ అథవా అంతరా ఇమే ద్యావాపృథివ్యోః. అథవా శరీరేషు అంతరా మధ్యేఽవస్థితమ్ అక్షయమ్.

అర్థము :- అంతరిక్షమ్ కస్మాత్ ? అంతరిక్షమెట్లేర్పడినది ? అంతరా = ద్యు, పృథివీలోకములమధ్య నున్నది. క్షాన్తమ్=పృథివివఱకు నున్నది. క్షా = పృథివి, అంతముగాగలది పృథివి అంతరిక్షమునకు అంత మున - చివర - ఉన్నది. అందువలన క్షాంతమనబడును. లేక ద్యులోక పృథివీలోకముల మధ్యనున్నది. అన్తరా క్షియతి-నివసతి ఇతి = అందువలన అంతరిక్షమనబడును. అథవా లేక, శరీరేషు అన్తః = శరీరములోపల నివ సించును. కావున అంతరిక్షమనబడును. అక్షయమ్ - నశించనిది = అంత రిక్షముతక్క మిగిలినభూతములన్నియు నశించును. ఇది నశింపదు. శరీరము పంచభూతములతో నేర్పడినది.

"తత్ర సముద్ర ఇత్యేతత్ పార్థివేన సముద్రేణ సందిహ్యతే."

తత్ర తస్మిన్ షోడశకే అంతరిక్షనామసముదాయే సముద్రఇత్యేతత్ అభిధానం పార్థివేన సముద్రేణ జలాశయేన సందిహ్యతే.

అర్థము :- తత్ర = ఆయంతరిక్షనామములలో సముద్ర ఇత్యేతత్ = సముద్రము అనునామము, పార్థివేన సముద్రేణ=జలాశయమగు సముద్ర ముతో సందిగ్ధమగుచున్నది.

**సముద్రః కస్మాత్ ? సముద్రవన్త్యస్మా దాపః - సమభిద్రవ న్త్యేనమాపః-సమ్మోదన్తే భూతాన్యస్మిన్-సముదకో భవతి - సమునత్తీతివా.**

సముద్రవన్త్యస్మాదాపః వీచితరంగశీకరాది - భావేన; సమ్మోదన్తేఽ స్మిన్ భూతాని - సంహృష్యన్తి జలచరాణి సత్వాని. సమున్నత్తీతివా-సంక్లేద యతీత్యర్థః.

అర్థము :- సముద్రః కస్మాత్ ? సముద్రమనునామ మెట్లుకలిగినది? అస్మాత్ = ఈసాగరమునుండి, ఆపఃసముద్ద్రవన్తి=జలముతరంగరూపమున పైకిఎగురును. కావున సాగరమునకు సముద్రమనినామము, అథవా ఏనమ్ అపః సమభిద్రవన్తి = జలమీసముద్రమునుగూర్చి పరుగులిడును. కావున సముద్రమనబడును. యా = లేక, అస్మిన్భూతానిసమ్మోదన్తే = ఈ సముద్రమునందు జలచరప్రాణులు ఆనందించును. కావున సముద్రము వా లేక, సముదకో భవతి = బహుజలముగలది. కావున సముద్రము

'ఉద' జలవాచకము సముద్ర్తీతివా = ఇది వస్తువులను తడుపును - ఉన్దీ క్లేదనే ధాతువుతో సముద్రశబ్దమేర్పడును. కావున సముద్రము.

> "తయోర్విభాగః. తత్రేతిహాస మాచక్షతే - దేవాపిశ్చార్ష్టి షేణః శంతనుశ్చ కౌరవ్యౌ భ్రాతరౌ బభూవతుః. స శంత నుః కనీయాన్ అభిషేచయాంచక్రే. దేవాపిః తపః ప్రతి పేదే. తతః శన్తనో రాజ్యే ద్వాదశవర్షాణి దేవో న వవర్ష తమూచుర్ బ్రాహ్మణాః - అధర్మః త్వయా చరితః జ్యేష్ఠం భ్రాతరమంతరిత్యాభిషేచితమ్ తస్మాత్తే దేవో న వర్షతీతి. స శంతను ర్దేవాపిం శిశిక్ష రాజ్యేన. తమువాచ దేవాపిః - పురోహితస్తేఽసాని యాజయాని చ త్వేతి. తస్యైతద్ వర్షకామసూక్తమ్ తస్యైషా భవతి."

"తయో ర్విభాగః యస్మిన్నుదాహరణే లక్ష్యతే తత్ర ఇతిహాసమా చక్షతే ఆచార్యాః దేవాపి శ్చార్ష్టిషేణః శన్తనుశ్చ కౌరవ్యః కురువంశప్రభవౌ భ్రాతరౌ బభూవతుః. తయోరేకో యః కనీయాన్ శన్తనుః సః ఆత్మానమ్ అభిషేచయాంచక్రే అభిషేచితవానిత్యర్థః. సోఽభిషిక్తః సన్ రాజా బభూవ. దేవాపి స్తపః ప్రతిపేదే. తపసా బ్రహ్మణ్యమాపేదే విశ్వామిత్రవత్. తతః తేనాపచారేణ శన్తనోః రాజ్యే రాష్ట్రే ద్వాదశవర్షాణి దేవో న వవర్ష. అవర్షతి దేవే తం శన్తనుమ్ ఊచుః - ఉక్తవన్తః బ్రాహ్మణాః - అధర్మ స్త్వయా చరితః - జ్యేష్ఠం భ్రాతరం - అన్తరిత్య అతిక్రమ్య అభిషేచితమ్ - అభి షేకః ఆత్మనః కారితః యత స్త్వయా తస్మా త్తేన మర్యాదాతిక్రమేణ తే తవ రాజ్యే దేవో న వర్షతి. స ఏవముక్తః శన్తనుః దేవాపిం శిశిక్ష. రాజ్యేన తం దేవాపి రువాచ పురోహితస్తే అసాని యాజయాని చ త్వాం వార్షికేణ కర్మణా. న రాజా భవిష్యామి - భవానేవాస్తు రాజేత్యభిప్రాయః.

తస్య దేవాపేః ఏతద్ వర్షకామసూక్తమ్ అవిరభూత్. తస్య ప్రవిభా గోపదర్శనాయ ఏషా నిర్వాచికా ఋక్ భవతి.

అర్థము :- తయోః విభాగః - సాగరము, అంతరిక్షము ననురెండింటికి వాచకమగు సముద్రశబ్దమునకు ప్రకరణముననుసరించి అర్థమును

గ్రహింపవలయును. ఆరెండువిధములను జూపుటకై యేమంత్రముదాహ రింపబడినదో దానికి మొదట ఇతిహాసము జూపుచున్నాడు.

ఆర్ష్టిషేణః = ఋష్టిషేణపుత్రుడు దేవాపి, శంతనుడు, కౌరవ్యులు. కురువంశీయులు సోదరులు, వారిరువురిలో కనీయాన్ = చిన్నవాడైన శంతనుడు, అభిషేచయాంచక్రే = అభిషిక్తుడై రాజయ్యెను. దేవాపి తపః ప్రతిపేదే = తపస్సును ప్రారంభించెను. తదుపరి శంతనునిరాజ్యమునందు ద్వాదశవర్షాణి దేవః న వవర్ష=పన్నెండుసంవత్సరములు వర్షములు కురియ వయ్యె. బ్రాహ్మణులు శంతనునితో, ఊచుః = ఇట్లనిరి, త్వయా అధర్మః చరితః = నీవు అధర్మమొనర్చితివి. జ్యేష్ఠభ్రాతనతిక్రమించి (అంతరిత్వా) నీవు అభిషేచితమ్ = అభిషిక్తుడవైతివి, అందువలన దేవః న వవర్ష = వర్ష ములు కురియులేదు. అంతట శంతనుడు దేవాపిని జేరి అతనిని శిశిక్ష = ప్రార్థించెను, దేవాపి తమ్ ఉవాచ=శంతనునితో నిట్లనెను, నేను తే పురోహితః అసాని = నీకు పురోహితుడనగుదును, యాజయాని చ త్వా = నీచే యజ్ఞము చేయించెదననెను, ఏతత్ వర్షకామసూక్తమ్ = ఈవర్షకామ సూక్తమాదేవాపికి సంబంధించినదే. ఈక్రింది ఋక్ ఆసూక్తములోనిదే.

"ఆర్ష్టిషేణో హోత్ర మృషిర్నిషీదన్ దేవాపి ర్దేవసుమతిం చికిత్వాన్, స ఉత్తరస్మాదధరం సముద్రమపో దివ్యా అసృజద్వర్ష్యా అభి. (ఋ. ౧౦-౯౮-౫)

ఆర్ష్టిషేణ ఋష్టిషేణస్య పుత్ర ఇషితసేనస్యేతి వా. సేనా సేశ్వరా సమానగతి ర్వా. పుత్రః పురుత్రాయతే, నిపరణాద్ వా. పున్నరకం తతస్త్రాయత ఇతి వా. హోత్ర మృషి ర్నిషీదన్. ఋషి ర్దర్శనాత్ స్తోమాన్ దదర్శేత్యౌపమన్యవః 'తద్యదేనాం స్తపస్యమానాన్ బ్రహ్మ స్వయంభ్వభ్యానర్షత్త ఋషయోఽభవం స్తదృషీణా మృషిత్వమ్ ఇతి విజ్ఞాయతే. దేవాపి ర్దేవానా మాప్త్యా స్తుత్యా చ దేవసుమతిం దేవానాం కల్యాణీం మతిమ్ చికిత్వాం శ్చేతనావాన్. స ఉత్తరస్మా

**దధరం సముద్రముత్తర ఉద్ధతతరో భవతి. అధరోఽ ధోరః. అధో న ధావతీ త్యూర్ధ్వగతిః ప్రతిషిద్ధా.**

ఆర్ష్టిషేణః - ఋష్టిషేణస్య పుత్రః హోతృత్వే వృతః హోతృ కర్మ ప్రతి నిషీదన్ - ఉపవిష్టవాన్. దేవాపిః దేవసుమతిం - దేవానాం కల్యాణీం మతిమ్ - ఉదకసంప్రదానాభిముఖీం కర్తుం చికిత్వాన్. తథాస్తౌత్ యథా ఉత్తరస్మాత్ అంతరిక్షాత్ - సముద్రాత్ అధరం సముద్రం పార్థివం ప్రతి అపో దివ్యాః ప్రశస్తాః శస్య సంపత్కారీః అసృజత్ - అక్షారయత్ ఋష్టి రాయుధవిశేషః. తద్ బహులా సేనా యస్య సోఽయ మృష్టిషేణః. ఇషిత సేనో వా ప్రేషితసేనః - సేనా సేశ్వరా. ఇనేతీశ్వరనామ ఇనః సేనాపతిః తేన హి సా నిత్యమేవ సంయుక్తా భవతి. సమానగతిర్వా అద్యత్వ ఇవ. సమానమేకమర్థ ముద్దిశ్య జయాఖ్య మేతీతి వా సేనా పుత్రః త్రాయతేః బహ్వపి యత్ పిత్రాకృతం పాపం భవతి. తతోఽయం త్రాయతి. నిపర ణాద్వా నిపృణాతి నిదదాతి హ్యసౌ పిండాన్ పితృభ్యః ఇతి పుత్రః. అథవా పుమ్ ఇతి నరకస్థాన ముచ్యతే తతస్త్రాయత ఇతి వా పుత్రః. అపుత్రస్య గతిర్నాస్తి పుత్రిణస్తు త్రివిష్టపమితి స్మరణాత్ ఋషిర్దర్శనాత్ పశ్యతి హ్యసౌ సూక్ష్మ నప్యర్థాన్. మంత్రాః స్తోమాః తానసౌ జ్ఞానేన పశ్యతీతి ఏవమౌపమన్యవః ఆచార్యాః మన్యతే. బ్రాహ్మణమపి చైతస్మిన్ అర్థే దర్శయతి తద్యదేనాం స్తపస్యమానాన్ బ్రహ్మ ఇత్యాది. యదేనాన్ తపస్య మానాన్ ఋషీన్ బ్రహ్మ - ఋగ్యజుఃసామాఖ్యం స్వయంభు-అకృతకమ్ అభ్యానర్షత్ - ఆవిర్భూతమిత్యర్థః అనధీతమేవ. తదృషీణా మృషిత్వమ్ ఉత్తరః - ఉద్ధతతరః ఉపరిష్టాత్ అవస్థానాత్ అధరః అధోరః అధ ఏవా సావరతి గచ్ఛతి ఊర్ధ్వగతిః ప్రతిషిద్ధా.

మంత్రార్థము :— ఆర్ష్టిషేణః = ఋష్టిషేణుని పుత్రుడు (ఆర్ష్టి షేణఋషి) దేవాపి యనుఋషి దేవసుమతిం = దేవతలకుసంబంధించిన కల్యాణకరబుద్ధిని - వర్షణాభిముఖప్రవృత్తిని - వృష్టవిద్యను, చికిత్వాన్ - ఎఱుగుచున్నవాడై, హోత్రంనిషీదన్ = యజ్ఞముజేయింపకూర్చుండెను, సః = అతడు, ఉత్తరస్మాత్ = పైదియైన అంతరిక్షసముద్రమునుండి, అధరం సముద్రం=క్రిందిదియగు పార్థివసముద్రము నుద్దేశించి, దివ్యాః=

ఉత్తమమైన, సస్యసంపత్కరీషస్త్యాః = సస్యసంపదనుగలిగించు, వర్ష యోగ్యమగు, అపః = జలమును, అభిఅస్పృజత్ = వర్షింపజేసెను.

ఆర్ష్టిషేణః = ఋష్టిషేణుని పుత్రుడు; లేక - ఇషితసేనస్య వా ఇషితసేనుని పుత్రః = పుత్రుడు, సేనా - సేశ్వరా = ఇనేన సహితా-సేనా సేశ్వరాఇత్యర్థః ఇన = స్వామి = ఈశ్వరుడు ఇనతోకూడి సేనా - సేశ్వరా యగును, సమానగతిః వా లేక సమానగతికలిదియగును - ఒకే ఖయమను పేరుగల కార్యముగలదై ఒకేపద్ధతిగా నడచును, అతః=అందువలన 'సేన' అనబడును. పుత్రః = పుపుత్రాయతే = పుపు = బహుఅధికమగు-తండ్రి చేసిన అనేకపాపములనుండి, త్రాయతే = తండ్రిని రక్షించును = కాపున, పుత్రః = పుత్రుడనబడును. నిపరణాత్ వా. లేక నిపరణక్రియతో సంబంధ ముండుటవలన, 'ని'పూర్వక పృధాతువుచే నేర్పడుటవలన పుత్రః = పుత్రుడనబడును. నిపరణపదమునకర్థము పిండదానము అన్నముపెట్టుట, పుత్రుడనగా తండ్రికి అన్నము(పిండము)పెట్టువాడు పుత్రుడు అగును. లేక పుం = నరకమ్ = పుమ్అనునది నరకమునకుపేరు. దానినుండి త్రాయతే = తప్పించువాడు - రక్షించువాడు పుత్రుడు అనియర్థము ఋషిః దర్శనాత్ - స్తోమాన్ దదర్శ మంత్రదర్శనాత్ = మంత్రములను గూర్చి ఆలోచించువాడు, మంత్రస్తోమాన్ = మంత్రసమూహములను గూర్చి, దదర్శ = గూఢముగా నాలోచించి వానియర్థముల నెఱుగువాడు ఋషియనబడును' అని ఔపమన్యవిమతము. బ్రాహ్మణము నిట్లు చెప్పు చున్నది. తద్యత్ = ఎందువలన, ఏతాన్ తపస్యమానాన్ = తపస్సు నొనరించుచున్న యీఋషులకు, బ్రహ్మస్వయంభు = స్వయంభువుఅగు వేదము, అభ్యానర్షత్ = ప్రకటమయ్యెను. అతఃతే ఋషయః అభవన్ = అందువలన వారు ఋషులైరి. తద్ ఋషీణాం=అదియే ఋషులయొక్క ఋషిత్వము - ఋషిత్వము ఇతరులనుండి విద్యనభ్యసింపక తపోబలముతో అపౌరుషేయ = ఈశ్వరీయవేదమును మంత్రార్థముల నెఱిగిరి. మంత్రార్థ ద్రష్టృత్వమే ఋషిత్వమని భావము.

దేవాపిః = దేవానామ్ ఆప్త్యా = దేవతలప్రాప్తితో దేవాపి యయ్యెను. స్తుత్యా చ ప్రదానేన = స్తుతివలనను హవిర్దానమువలనను దేవప్రాప్తి కలిగినది, చికిత్వాన్ = చేతనగలవాడు - తెలిసికొనువాడు-జ్ఞానముకలవాడు

అనియర్థము, ఉత్తరః ఉద్ధతతరో భవతి = ఉద్ధతతరుడు - ఉద్ధతతరుడు- పైకిపోయినవాడు అనియర్థము, అధరః = అధోరః - అధః = క్రిందికి, అరః = వెళ్ళినవాడు, అధః న ధావతి - అధః = క్రిందికి న, ధావతి = పరుగెత్తినవాడు క్రిందికి పరుగెత్తినవాడు అని అధ శబ్దమునకు వ్యుత్పత్తి, ధావతి = పైకి పరుగెత్తినవాడు, అందువలననే, ఊర్ధ్వగతిః ప్రతిషిద్ధా = పైకిపోవుట నిషేధింపబడినది.

"తస్యోత్తరా భూయసే నిర్వచనాయ."

తస్య - ఏవార్థస్య - భూయసే బహుతరాయ, నిర్వచనాయ - ఏషా ఉత్తరా - అగ్రిమాఋక్.

అర్థము :- తస్య = ప్రకృతార్థముయొక్క, భూయసే = నిర్వచనాయ ఎక్కువ నిర్వచించుటకే, ఉత్తరా - అగ్రిమ ఋక్ = ఋక్కు.

"యద్దేవాపిః శన్తనవే పురోహితో హోత్రాయత వృత్తః కృపయన్నదీధేత్. దేవశ్రుతం వృష్టివనిం రరాణో బృహస్పతి ర్వాచమస్మా అయచ్ఛత్. శంతనుః శం తనోఽస్త్వితి వా, శమస్మై తన్వా అస్త్వితి వా. పురోహితః పుర ఏనం దధతి హోత్రాయ వృతః కృపాయమాణోఽన్వధ్యాయత్, దేవశ్రుతం దేవా ఏనం శృణ్వన్తి వృష్టివనిం వృష్టియాచినమ్, రరాణో రాతిరభ్యస్తః బృహస్పతిః బ్రహ్మాసీత్. సోఽస్మైవాచ మయచ్ఛత్ వృహదుపవ్యాఖ్యాతమ్."

యద్దేవాపి రితి - యత్ యస్మాత్ దేవాపిః జ్యేష్ఠ భ్రాతా శన్తనవే రాజ్ఞే కనీయసే భ్రాత్రే పురోహితః సన్ హోత్రాయ హోతృకర్మణ వృతః కృపయన్ కృపాం కుర్వన్ అదీధేత్ - అన్వధ్యాయత్ వృష్టిర్భవేదితి తం దేవశ్రుతం దేవైః శ్రుతం వృష్టివనిం వృష్టియాచినం, చతుర్థ్యర్థేద్వితీయా, రరాణః దదత్ వృష్టి మిత్యర్థః. బృహస్పతిః బ్రహ్మ బ్రహ్మత్వేఽవస్థితః వర్షసాధికాం వాచమ్ అయచ్ఛత్ అదదాదిత్యర్థః. శన్తనుః కస్మాత్? హే తనో శరీర! శం తవ అస్తు = శమస్మై తన్వా అస్త్వితి వా వ్యుత్పత్త్యా ఏవ మనసా వాన్త శమితి సుఖనామ. పురోహితః కస్మాత్? సర్వకర్మసు పుర ఏనం దధాతి యజమానః.

మంత్రార్థము :- యత్=ఎందుకనగా, హోత్రాయ వృతః=యజ్ఞము చేయించుటకు వరింపబడిన, దేవాపిః=దేవాపిశంతనరాజునకు పురోహితుడై, కృపయన్ = దయనుజూపుచు, అన్వధ్యాయత్ = వర్షముకొఱకు ధ్యానము చేసెను, దేవశ్రుతమ్ = దేవతలవలనవినిన, వృష్టివనిం=వృష్టిని యాచించు దేవాపికి, రరాణః = వృష్టిదానమొసర్చు, బృహస్పతిః = బ్రహ్మ, వాచమ్ అయుచ్ఛత్ = వర్షమును కలిగించువాణిని ప్రదానముచేసెను. వానితో దేవాపి దేవతలను స్తుతించెను వర్షమేర్పడెను.

శంతనుః హోతనో శం అస్తు = శరీరమా శం = శాంతి అస్తు=కలుగుగాక, లేక శమ్ అస్మై తన్వా అస్తు ఇతి వా- ఈశరీరమునకు సుఖమగుగాక ! అని ప్రశంస యీశరీరముకొఱకు చేయబడుచున్నది. ఇది శంతను శబ్దనిర్వచనము. సర్వశుభకర్మలందును 'పుర ఏనం దధతి' ముందుగా నుంచబడువాడు. కావున పురోహితుడనబడును. దేవశ్రుతమ్ దేవా ఏనం శృణ్వన్తి = దేవశ్రుతః = దేవతలితనిని విందురు - కావున దేవశ్రుతు డన బడును. వృష్టివనిం-వృష్టియాచినమ్ = వృష్టిని యాచించువానిని, రరాణః రాతిఃఅభ్యస్తః = రరాణఅనుదానిలో దానార్థక రా ధాతువునకు ద్విత్వముచేసిన 'రరాణః' శబ్దము సిద్ధించును. అయజ్ఞమునందు బృహస్పతిః ఆసీత్ = బృహస్పతి బ్రహ్మగా నుండెను. సః = అతడు, అస్మై= ఈదేవాపికొఱకు, వాచమ్ అయుచ్ఛత్=వాణినిచ్చెను. బృహత్ ఉపవ్యాఖ్యాతమ్ - బృహత్పదమునకు వ్యాఖ్యా పూర్వమే చేయబడినది.

ఇతి తృతీయః పాదః

మూడవ పాదము సమాప్తము

## చతుర్థ పాదము

సాధారణములైన ఆఱునామముల నిర్వచనము.

**"సాధారణాన్యుత్తరాణి షడ్ దివశ్చాదిత్యస్య చ."**

ప్రకృతా న్తరిక్షనామభ్యః ఇమాన్యుత్తరాణి దివో న్తరిక్షస్య సూర్యస్య చ.

"ఈముందు వర్ణించు ద్యులోకమునకు ఆదిత్యునకు సంబంధించిన ఆఱు సమాననామములు.

**"యాని త్వస్య ప్రాధాన్యే నోపరిష్టా త్తాని వ్యాఖ్యాస్యామః."**

యాని త్వస్య ఆదిత్యస్య నామాని ప్రాధాన్యేన ప్రధాన-స్తుతిభాంజి నామాని తాని ఉపరిష్టాద్ వ్యాఖ్యాస్యామః.

అర్థము :- అస్య = ఈయాదిత్యునకు, యాని = ఏముఖ్యనామము లున్నవో, తాని = వానిని, ఉపరిష్టాత్ ముందు, వ్యాఖ్యాస్యామః = వ్యాఖ్యానించెదము.

**ఆదిత్యః కస్మాత్ ? ఆదత్తే రసాన్, ఆదత్తే భాసం జ్యోతిషామ్. ఆదీప్తః భాసేతి వా అదితేః పుత్ర ఇతి వా.**

ఆదిత్య కస్మాదుచ్యతే? ఆదత్తేహ్యసౌ రసాన్ రశ్మిభి రిత్యాదిత్యః సూర్యః. జ్యోతిషాం చంద్రాదీనామ్ భాసా ఆదీప్తా వా, సర్వతోహ్యేష భాసా ఆదీప్త ఆవృతో భవతి. అదితేః పుత్రః ఆదిత్య ఇతి వా దిత్యదిత్యేతి ణ్యః అదితిర్దేవమాతా, అదిత్యా వా ఇయం ప్రజేతి శ్రుతేః.

అర్థము :- ఆదిత్యః కస్మాత్ ? ఎందువలన ఆదిత్యుడనబడు చున్నాడు సూర్యుడు ఆదత్తే రసాన్ = తనకిరణములతో రసములను గ్రహించును. అందువలన ఆదిత్యుడనబడును, జ్యోతిషామ్ = చంద్రుడు మున్నగుజ్యోతుల, భాసమ్ = ప్రకాశమును, ఆదత్తే = గ్రహించును. సూర్యోదయమైనపిదప చంద్రాదిగ్రహముల ప్రకాశము తగ్గిపోవును. వా భాసా ఆదీప్తః = లేక ప్రకాశముచే నావృతుడై ప్రకాశించును. వా అదితేః= పుత్రః=లేక అదితిపుత్రుడు, కావున ఆదిత్యుడు. "దిత్యదితి...పదాణ్యః" సూత్రముచే 'ణ్య' ప్రత్యయము చేయుటచే ఆదిత్యపదము సిద్ధమగును.

**అల్పప్రయోగం త్వస్యైతదార్చాభ్యామ్నాయే సూక్తభాక్ సూర్యమాదితేయ మదితేః పుత్రమ్.**

అల్పప్రయోగమ్ = అల్పప్రయోగవిషయం తు అస్య ఆదిత్యస్యార్చాభ్యామ్నాయే ఆదితేయ ఇతి నామ సూక్తభాక్ న హవిర్భాక్. యు 'దేవేన మదధుః'.

అర్థము :- ఆర్చాభ్యామ్నాయే ఋచః యస్మిన్ ఆమ్నాయే అభ్యావ వ్యపరి ఆమ్నాతాః సోఽయ మార్చాభ్యామ్నాయః ఋగ్వేదఇత్యర్థః

ఋగ్వేదమునందు, అస్య = ఈఆదిత్యునియొక్క అదితేయనామము, అల్పప్రయోగమ్ = కొలదిప్రయోగములుకలది, సూక్తభాక్=సూక్తమును భజించువాడు, అదితేః పుత్రః ఆదితేయః సన్=ఆదిత్యుడనబడుచున్నాడు. ఈఅదితి పుత్రత్వాభిప్రాయముతో ఋగ్వేదములో ఆదితేయశబ్దము అల్ప ప్రయోగముగా నున్నది. అదితేయపదము సూక్తభాక్ 'సూర్యమాది తేయమ్' ఇత్యాదిమంత్రములందు చూడబడుచున్నది. కాని ఆదితేయ నామముతో నెక్కడను ఆహుతి ఇయ్యబడదు. కావున నిది హవిర్భాక్ కాదు.

"ఏవ మన్యాసామపి దేవతానామాదిత్యప్రవాదాః స్తుతయో భవన్తి. తద్ యథైతన్మిత్రస్య వరుణస్యార్యమ్ణో దక్షస్య భగస్యాం శస్యేతి."

తద్యథా - ఏతదుదాహరణజాతమ్ మిత్రస్య వరుణస్యార్యమ్ణో దక్షస్య భగస్యాం శస్య ఇతి. "ఇమా గిర ఆదిత్యేభ్యో ఘృతస్నూః సనా ద్రాజభ్యో జుహ్వా జుహోమి. శృణోతు మిత్రో అర్యమా భగోనస్తు విజాతో వరుణో దక్షో అంశః. (ఋ. సం. ౨-౨౭-౧)

ఇత్యస్యామ్ ఋచి సర్వఏవాదిత్యప్రవాద స్తుత్యా స్తూయన్తే.

అర్థము :- ఏవమ్=ఈవిధముగ, అన్యాసామపిదేవతానామ్ = ఇతర దేవతలకును, ఆదిత్యప్రవాదా స్తుతయః భవన్తి = ఆదిత్యనామముతో స్తుతులున్నవి, తద్యథా = ఎట్లన, ఏతత్ = ఈయుదాహరణసముదాయము ప్రమాణము - మిత్రస్య వరుణస్య=మిత్రుడు వరుణుడు అర్యముడు, దక్షుడు మున్నగునామములన్నియు ఆదిత్యనామముతో చెప్పబడినవి. నిమ్న మంత్రమున, "ఇమా గిర ఆదిత్యేభ్యో ఘృతస్నూః సనాద్రాజభ్యో జుహ్వా జుహోమి. శృణోతు మిత్రో అర్యమా భగోనస్తు విజాతో వరుణో దక్షో అంశః, ఈమంత్రమున ఆదిత్యనామముతో నెల్లరిస్తుతిచేయబడినది.

"అథాపి మిత్రావరుణయోః - 'ఆదిత్యాదాను నస్పతీ' దాన పతీ." (ఋ. ౧-౧౩౬-౩).

మిత్రావరుణయోః - ఆదిత్యప్రవాదాః స్తుతయో భవన్తి - తద్యథా ఆదిత్యా దానునస్పతీ (ఋ. ౧-౧౩౬-౩) ఆదిత్యా ఆదిత్యౌ అదితేః పుత్రౌ దానునస్పతీ - దానానామీశాతే.

అర్థము :- అథాపి = మఱియు, మిత్రావరుణయోః = మిత్రావరుణు మిత్రుడు వరుణుడు అను ఇరువురి దేవతలస్తుతి ఆదిత్యునినామముతో చేయబడినది. ఉదాహరణము :—

"తా సమ్రాజా ఘృతాసుతీ ఆదిత్యా దానునస్పతీ. సచేతే అనవహ్వరమ్"

అర్థము :- తా = తౌ = ఆయిరువురు, సమ్రాజా = మిక్కిలి దీప్తిమంతులు, ఘృతాసుతీ = జలమును వర్షింపచేయువారు, ఆదిత్యా - ఆదిత్యౌ - అదితేః పుత్రౌ = అదితిపుత్రులు, దానునస్పతీ = దానమునకు స్వాములు, అనవహ్వరమ్ = అప్రతిహతముగ, సచేతే = యజమానుని సేవ చేయుచున్నారు. ఈమంత్రమునగల 'ఆదిత్యా' పదముచే మిత్రావరుణులు గ్రహింపబడిరి.

**అథాపి మిత్రస్యైకస్య 'ప్రనమిత్రమర్తో అస్తు ప్రయస్వాన్యస్త ఆదిత్య శిక్షతి వ్రతేన (3-౫౯-౨).**

ఇత్యపి నిగమో భవతి మిత్రస్యైకస్య ఆదిత్యప్రవాదా స్తుతిర్భవతి. తద్యథా - ప్ర స మిత్ర (ఋ. 3-౫౯-౨) హే మిత్ర! ఆదిత్య అదితేః పుత్ర! స మర్తః స మనుష్యః ప్రయస్వాన్ అన్నవాన్ ప్రాస్తు ప్రకర్షేణ భవతు యః తే-తుభ్యం శిక్షతి దదాతి హవిశ్చరులక్షణమ్.

అర్థము :- అథాపి మఱియు ఏకస్య మిత్రస్య = ఒక్కమిత్రదేవత కొఱకు విశేషరూపమున ఆదిత్యపదమీమంత్రమున ప్రయోగింపబడినది. మిత్ర ఆదిత్యః - మిత్రుడు అదితిపుత్రుడు స మర్తః-అతడు మనుష్యుడు, ప్రయస్వాన్ = అన్నముకలవాడు, ప్రఅస్తు = అగుగాక, యః = ఎవడు, తే = నీకొఱకు, వ్రతేన = యజ్ఞాదివ్రతముతో, శిక్షతి = దానమొనర్చునో - హవిస్సునిచ్చునో.

**అథాపి వరుణస్యైకస్య అథావయమాదిత్యవ్రతే తవ (ఋ. ౧-౨౪-౧౫) వ్రతమితి కర్మనామ వృణోతీతి సతః ఇదమ**

**ఇతరద్ వ్రతమేతస్మాదేవ నివృత్తికర్మ వారయతీతి సతః**
**అన్నమపి వ్రతముచ్యతే యదావృణోతి శరీరమ్**

వరుణస్యైకస్య ఆదిత్యప్రవాదా స్తుతి ర్భవతి. తద్యథా - అథా వయ మాదిత్యవ్రతే తవ ఇతి హే ఆదిత్య! వరుణ! వయమ్ తవ ఏవ వ్రతే తవైవ పరిచరణకర్మణి స్థితాః స్యామ వృణోతీతి సతః. తద్ధి కర్మ శుభ మశుభం చ కృతం సదా వృణోతి ప్రాప్నోతి కర్తారమ్. అవశ్యమేవ భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్ ఇతి స్మరణాత్ ఇదమపీతరద్ వ్రతమే తస్మాదేవ, నివృత్తికర్మ భోజనస్య యమనియమాత్మకం వా. అన్నమపి వ్రత ముచ్యతే. యదా వృణోతి శరీరమ్, రస-శోణిత-మాంసమేదో-మజ్జాస్థి-భావేన విపరిణమ మానమ్.

అథాపి - మఱియు, ఏకస్యవరుణస్య = ఒక్కవరుణ దేవతకొఱకు, ఈమంత్రమున ఆదిత్యపదము ప్రయోగింపబడినది. ఉదుత్తమం వరుణ పాశ మస్మదవాధమం విమధ్యమం శ్రథాయ అథావయ మాదిత్యవ్రతే తవానగసో అదితయే స్యామ.

మంత్రార్థము :- వరుణ! ఓవరుణా!, వయమ్ = మేము, అన్ని వైపులనుండి నీపాశములతో బంధింపబడియున్నాము. కావున మేము నీసేవ యందు ఉపస్థితులమై యున్నాము. నిన్ను ప్రార్థించుచున్నాము. ఉత్త మమ్ = పైపాశమును, అస్మత్ = మాపైనుండి, ఉత్శ్రథాయ = సడలింపు ము - తొలగింపుము, అధమమ్ = క్రిందిపాశమును, అవశ్రథాయ = తొల గింపుము, మధ్యమమ్ = అట్లే మధ్యనున్నపాశమును, విశ్రథాయ = తొలగింపుము, అథ = పాశములనుండి మేము విడివడినపిదప, ఆదిత్య వరుణదేవ! అనాగసః = నిరపరాధులము పాపరహితులమై మేము, తవ వ్రతే = నీపరిచర్యయందు, అదితయే చ = అదీనతకొఱకు, స్యామ = సమర్థులమగుదుముగాక! వ్రతమ్ ఇతి కర్మనామ ఇది కర్మనామము. వృణోతీతిసతః ఆచ్ఛాదనార్థక 'వృఞ్' ధాతువుతో వ్రతపదమేర్పడును. శుభాశుభఫలములతో నిది మనుష్యులను కప్పియుంచును. ఇదమపి ఇతరత్ = ఇదియు రెండవనివృత్తికర్మ - నివృత్త్యర్థకవ్రతము, యమనియ మాత్మక వ్రతశబ్దము ఏతస్మాదేవ = ఈవృఞ్ ధాతువుతోనె యేర్పడును.

వారయతి ఇతి సతః = యమనియమాది నామకవ్రతము స్త్రీపురుషులను ఆయా అకర్మలనుండి నివారించును, అన్నమపి వ్రతమ్ = అన్నమునకు కూడ వ్రతమని నామము, యత్ శరీరమావృణోతి = అన్నము శరీరము నావరించి వ్రతమనబడును. రసము రక్తము మాంసము మున్నగువానిచే అన్నము శరీరము నావరించుననిభావము. ఇక 'స్వః' ప్రభృతి సామాన్య నామముల నిర్వచనము.

> "స్వరాదిత్యో భవతి – సు అరణః సు ఈరణః స్వృతో రసాన్, స్వృతో భాసం జ్యోతిషామ్, స్వృతో భాసేతి వా ఏతేన ద్యౌ ర్వ్యాఖ్యాతా."

సు అరణః-సుగమన ఇత్యర్థః సు ఈరణః సుష్ఠు తమాంసి ఈరయ తీత్యర్థః. స్వృతో గతః జ్యోతిషామ్ = గ్రహనక్షత్రాదీనాం భాసేతి వా సర్వతోహ్యేష పరిగతో దీప్త్యా భవతి. ఏతేన ద్యౌర్వ్యాఖ్యాతాకాశమ్. ఉక్తం హి తాని చేత్ సమానకర్మాణి సమాననిర్వచనాని.

అర్థము :- స్వః ఆదిత్యః భవతి. స్వః - ఆదిత్యుని నామము. ఏలయన ఇది, సుఅరణః, సుఈరణః బాగుగ అంధకారమును దూరము చేయును, స్వృతః - రసాన్ = రసములను గ్రహించుటకు వెళ్లియుండును, స్వృతఃజ్యోతిషాం భాసమ్ = జ్యోతిష్మంతములగు చంద్రాదుల కాంతిని గ్రహించుటకు వెళ్లినవాడగును. స్వృతోభాసా ఇతి వా=లేక యీసూర్యుడు తన కాంతితో పరిగతుడగును - అంతట వ్యాపించియుండును, ఏతేన = ఈ యర్థసమూహముతో, ద్యౌః వ్యాఖ్యాతా = ద్యులోకము 'దివ్' శబ్దమునకును వ్యాఖ్యానము తెలిసికొనవలెను. ఇట్లే స్వఃశబ్దమునకు నిరుక్తులు నిర్వచింప వలెను.

> పృశ్నిరాదిత్యో భవతి – ప్రాశ్నుత ఏనం వర్ణ ఇతి నైరుక్తాః. సంస్ప్రష్టా రసాన్, సంస్ప్రష్టా భాసం జ్యోతిషామ్, సంస్పృష్టో భాసేతి వా. అథ ద్యౌః – సంస్పృష్టా జ్యోతిర్భిః పుణ్య కృద్భిశ్చ.

పృశ్నిరాదిత్యో భవతి. కస్మాత్? ప్రాశ్నుత ఏనం వర్ణ ఇతి నైరుక్తాః. ప్రాశ్నుతే - ప్రకర్షేణ వ్యాప్నోతి. ఏనం ఆదిత్యం వర్ణః ప్రోజ్జ్వల ఇతి నిరుక్తవిదో మన్యన్తే. అథ ద్యౌః కస్మాత్ పృశ్నిః? ఉచ్యతే సాపి హి సంస్పృష్టా జ్యోతిర్భిః గ్రహనక్షత్రైః. పుణ్య కృద్భిశ్చ.

అర్థము :- పృశ్నిః ఆదిత్యః భవతి. పృశ్ని సూర్యునిపేరు ఏలయన వర్ణః = శుభ్రవర్ణము, ఏనమ్ = ఈ ఆదిత్యుని, ప్రాశ్నుతే = వ్యాపించి యున్నది. ఇతి=అని, నైరుక్తాః=నిరుక్తకారుల నిరుక్తి, రసాన్ సంస్పృష్టా= రసములను గ్రహించువాడు, జ్యోతిషామ్ భాసం సంస్పృష్టా = చంద్రాదుల ప్రకాశము స్పృశించువాడు. ఇతని ప్రకాశముచే నక్షత్రముల ప్రకాశము సన్నగిల్లును, భాసా సంస్పృష్టః ఇతి వా = లేక కాంతితో అన్నివైపులనుండి స్పృష్టుడైయున్నాడు. అందువలన సూర్యుని పృశ్ని అందురు. ఇట్లే ద్యులోకమునకు పృశ్ని నామము. ద్యులోకమునకూడ జ్యోతిర్భిః = చంద్రుడు, నక్షత్రములు మున్నగువానితో పుణ్యకృద్భిః చ = పుణ్యాత్ము లతోను, సంస్పృష్టా = సంయుక్తుడైయున్నాడు.

**నాక ఆదిత్యో భవతి – నేతా రసానామ్, నేతా భాసామ్, జ్యోతిషాం ప్రణయః, అథ ద్యౌః కమితి సుఖనామ, తత్ ప్రతిషిద్ధం ప్రతిషిధ్యేత. న వా అముం లోకం జగ్ముషే కించ నాకమ్. న వా అముం లోకం గతవతే కించ నా సుఖమ్. పుణ్యకృతో హ్యేవ తత్ర గచ్ఛన్తి.**

ఆదిత్యో నాకః భవతి. నేతా హ్యసౌ ఆదిత్యః భాసాం సర్వాసు దిక్షు. అథ ద్యౌః స్వర్గః కస్మాన్నాక ఉచ్యతే కమితి సుఖనామ. తత్ప్రతిషిద్ధం అసుఖమిత్యర్థః. పునరపి చ ప్రతిషిధ్యమానం సుఖమితి ప్రతీయతే. బ్రాహ్మణమపి చైతస్మిన్నర్థే భవతి. న వా అముం లోకం స్వర్గలోకం జగ్ముషేగతవతే న కించ కించిత్ నాకం నాసుఖ మిత్యర్థః కిం కారణమ్? య ఏవ హి పుణ్యకృతో భవన్తి త ఏవ హి తత్ర గచ్ఛన్తి. యన్న దుఃఖేన సంభిన్నమ్ ఇతి స్మరణాత్.

అర్థము :- నాకః ఆదిత్యః భవతి. నాకము సూర్యవాచకము. ఏలయన సూర్యుడు రసములను తీసికొనివెళ్లును. రసానాంనేతా=సూర్యుడు

నాయకుడు-నడుపువాడు కావున నాక మనబడును. జ్యోతిషాం ప్రణయః= చంద్రాదులను తనవెంట గొంపోవును. అనగా నెల్లరకు గతినిచ్చువాడని యర్థము అథ ద్యౌః = ద్యులోకముకూడ నాకమనబడును. కమ్ ఇతి సుఖ నామము. తత్ ప్రతిషిద్ధం ప్రతిషిధ్యేత - కమ్ నకు వ్యతిరేకము అకమ్= దుఃఖము, న అకమ్ = నాకమ్ = నాకము - ఎక్కడ దుఃఖము ఉండదో అది నాకము. ద్యులోకమున స్వల్పదుఃఖముకూడ నుండదు. దీనికి ప్రమాణము అముం లోకమ్ = ఈలోకమునకు, జగ్ముషే = వెళ్లిన మనుష్యునకు, కించ = కొంచెముకూడ అకం = దుఃఖము, న + అకమ్ నాకమ్ = దుఃఖములేనిది కావున నటకు పుణ్యకృతః గచ్ఛన్తి = పుణ్యా త్ములే వెళ్లుదురు.

**గౌరాదిత్యో భవతి - గమయతి రసాన్ గచ్ఛత్యన్తరిక్షే. అథ ద్యౌర్యత్ పృథివ్యా అధిదూరం గతా భవతి, యచ్చా స్యాం జ్యోతీంషి గచ్ఛన్తి.**

ఆదిత్యో గౌరప్యుచ్యతే గమయతి రసాన్ ఆత్మానం ప్రతి, అథ ద్యౌః కస్మాత్ గౌః ఉచ్యతే? పృథివ్యాః అధి = ఉపరి గతా భవతి. యత్ యస్మాత్, చ అస్యాం జ్యోతీంషి గ్రహ - నక్షత్రతారకాదీని గచ్ఛన్తి తస్మాత్ గౌః.

అర్థము :- గౌః ఆదిత్యః భవతి = గోశబ్దముకూడ ఆదిత్యవాచకము. ఏలయన సూర్యుడు రసములను శుష్కింపజేయును. అంతరిక్షే గచ్ఛతి వా = లేక సూర్యుడంతరిక్షమున గతికలిగియున్నాడు. ద్యులోకముగూడ గోశబ్దముచే చెప్పబడును. పృథివ్యా అధిదూరం గతాభవతి = పృథివికి చాలదూరము వెళ్లియున్నది. యచ్చ = మఱియు ద్యులోకమున, జ్యోతీంషి = చంద్రనక్షత్రాదిజ్యోతులు, గచ్ఛన్తి = గతికలిగియున్నవి.

**విష్టపాదిత్యో భవతి. ఆవిష్టో రసాన్, ఆవిష్టో భాసం జ్యోతి షామ్, ఆవిష్టో భాసేతి వా. అథ ద్యౌరావిష్టా జ్యోతిర్భిః పుణ్యకృద్భిశ్చ.**

విష్టవాదిత్యో భవతి. రసాన్ భౌమానాంతరికాంశ్చ ప్రవిష్టో రశ్మిభి రాదాతుమ్. అథ ద్యౌః స్వర్గః కస్మాత్ విష్టప్? ఉచ్యతే ఇయమపి ఆవిష్టా జ్యోతిర్భిః గ్రహనక్షత్రాదిభిః. పుణ్యకారిభిశ్చ జీవైః.

అర్థము :- విష్టబాదిత్యో భవతి. విష్టప్ = సూర్యునినామము. ఏలయన రసములను కిరణములతో నాకర్షించి రసాన్ ఆవిష్టః = వానియందావిష్టుడై యుండును. ఆవిష్టః భాసమ్ జ్యోతిషామ్ = గ్రహదుల జ్యోతియందు ప్రవిష్టుడైయున్నాడు. ఆవిష్టః భాసాఇతి వా=లేక కాంతితో ప్రవిష్టుడు. అథ ద్యౌః = మఱియు ద్యులోకముకూడ విష్టప్ అనబడును.ఏలయన- ద్యులోకము జ్యోతిర్భిః = జ్యోతిస్సులతో, గ్రహములతో పుణ్యకృద్భిః = పుణ్యాత్ములతో ఆవిష్టః = ఆవిష్టమై యున్నది.

**నభ ఆదిత్యో భవతి - నేతా భాసామ్ జ్యోతిషాం ప్రణయః. అపి వా భనఏవ స్యాద్విపరీతః న న భాతీతివా ఏతేన ద్యౌర్వ్యాఖ్యాతా.**

అపి వా భనఏవ స్యాద్విపరీతః భాసనః సన్ నభఇత్యుక్తః విపర్యయేణ న న భాతీతి న అపితు భాత్యేవేతి నభ ఆకాశమ్.

అర్థము :- నభః ఆదిత్యః భవతి = నభము సూర్యునినామము, భాసాం నేతా భవతి = సర్వదిక్కులందును కాంతిని చేర్చును, జ్యోతిషాం ప్రణయః = గ్రహములను తీసికొనివెళ్లువాడు అనగా నన్నింటికి గతి నిచ్చువాడు. సమస్తజ్యోతిశ్చక్రము ఈసూర్యకిరణములబాలమునకు నికటమున తిరుగుచు నుండును, అపి వా అథవా భన ఏవ స్యాద్విపరీతః= భనశబ్దమునకు విపరీతరూపమ 'నభ'ముఅగును. భనః భాసనః సన్ విపరీతో నభ ఇత్యుక్తః. 'భన' ప్రకాశించుచున్నదై విపరీతమై నభః అయ్యెను. న న భాతిఇతి వా లేక న భాతి ఇతి న ప్రకాశము కాదని కాదు. అనగా మిక్కిలి ప్రకాశకమని యర్థము. కావుననే సూర్యుడు నభ శబ్దవాచ్యుడు. ఏతేన ద్యౌః ద్యులోకసంబంధవ్యాఖ్యకూడ వ్యాఖ్యాతా

వ్యాఖ్యా = వ్యాఖ్యానము చేయుబడినట్లెంచవలయును. సూర్యునివలె ద్యులోకముకూడ ప్రకాశములకు నేత యని భావము.

ఇతి చతుర్థః పాదః

చతుర్థపాదము సమాప్తము

# అథ పంచమః పాదః

(అథ రశ్మినామ నిర్వచనము)

**రశ్మి నామా న్యుత్తరాణి పంచదశ.**

ఆదిత్యసంబంధేనైవ రశ్మినామా న్యుత్తరాణి పంచదశ.

అర్థము :— ముందు వ్రాయు పదునైదు నామములు రశ్మివాచకములు (రశ్మి - కిరణము)

**రశ్మి ర్యమనాత్.**

ఉదకస్య అశ్వానాం వా నియమనాత్.

అర్థము :— యమనాత్ = నియమనమువలన రశ్మి యనబడినది. అందువలన అశ్వముయొక్క కళ్లెమును రశ్మియందురు. అది అశ్వమును ఉదకమును నియమించును. కావున గుఱ్ఱపుకళ్లెమునకు రశ్మియనిపేరు. సూర్యకిరణములు జలమును శుష్కింపజేయును. అందువలన నవియు రశ్ములనబడును.

**తేషా మాదితః సాధారణాని పంచాశ్వ - రశ్మిభిః.**

తేషాం పంచనామాని యాని ఆదితో వర్తన్తే తాని సాధారణాని అశ్వరశ్మిభిః.

అర్థము :— తేషాం = వానిలో, ఆదితః = మొదటినుండి, పంచనామాని = ఐదుపేర్లు అశ్వరశ్మిభిః = గుఱ్ఱములకళ్లెములకు సాధారణాని = సమానము. అనగా మొదటి యైదునామములు సూర్యకిరణములకును గుఱ్ఱముకళ్లెములకును వాచకములు.

(దిఙ్నామ నిర్వచనము)

దిక్ సామాన్యోత్తరాణ్యష్టౌ.

ఆదిత్యోపలక్షణా ఏవ హి దిశో భవన్తి ఇత్యాదిత్యనామభ్య ఉత్తరాణి దిక్‌నామాని.

అర్థము :— ముందున్న ఐదుపేర్లు దిశకు నామములు,

"దిశః కస్మాత్ ? – దిశతేః ఆసదనాత్, అపి వాభ్యశనాత్.

దిశతేః అతిసర్జనార్థస్య అతిసృజ్యన్తే హ్యాసు హవిరాదీని - దేవతానాం కృతే అపి వాభ్యశనాత్, అభ్యశ్నువతే ప్రాప్నువన్తి హ్యేతాస్తం తమర్థమ్.

అర్థము :— దిశః కస్మాత్ = ఎందుకు చెప్పబడుచున్నవి ? దిశతేః= అతిసర్జనార్థక 'దిశ్' ధాతువువలన దిక్‌శబ్ద మేర్పడుచున్నది. కావున దిక్కులనబడుచున్నవి. దేవతలకు ఈదిక్కులందే బలిఇయ్యబడును. ఆసదనాత్ = లేక యీదిక్కులు ఆయాపదార్థములను చేరియున్నవి, కావున దిశలనబడుచున్నవి. 'సద్'ధాతువునకు 'క్విప్' ప్రత్యయముచేసి, ఇకారము చేసి మార్పుచేసినందున దిశశబ్దము సిద్ధించును. అపి వా లేక అభ్యశనాత్= సన్నికటమగుటవలన లేక దిక్కులు పదార్థములకు మిక్కిలి సమీపము లగుటవలన దిశలనబడును. అనగా దిశలు పదార్థములను వ్యాపించి యుండునని భావము.

"తత్ర కాష్ఠా ఇత్యేతదనేకస్యాపి సత్త్వస్య నామ భవతి."

తత్ర తస్మిన్నష్టకే దిక్‌నామగణే.

అర్థము :— దిశకుగల యానామములందు 'కాష్ఠా' అను నీనామము అనేకస్య అపి సత్త్వస్య = అనేకపదార్థములకు నామము అగుచున్నది.

కాష్ఠా దిశో భవన్తి క్రాన్త్వా స్థితా భవన్తి.

కాష్ఠా దిశః పూర్వాదయః భవన్తి. కింకారణమ్ ? క్రాన్త్వా హ్యేతాస్తం తమర్థం ప్రతి గత్వా స్థితా భవన్తి. న హి తదస్తి యత్రేమా న సన్తి.

అర్థము :- 'కాష్ఠా దిశ' అని యెందుకు చెప్పబడుచున్నది ? దిక్కులు అన్నింటిని ఆవరించిచుట్టుముట్టియుండును. అందువలన కాష్ఠాః = దిక్కులనబడును.

**కాష్ఠా ఉపదిశో భవన్తీతరేతరమ్ క్రాన్త్వా స్థితా భవన్తి.**

ఉపదిశః ఆగ్నేయాదయ స్తా అపి హీతరేతరం క్రాన్త్వా దిగ్భిః సాకం స్థితా భవన్తి.

అర్థము :- ఉపదిశలుకూడ కాష్ఠాపదముచే చెప్పబడును. ఇవియు ఇతరేతరమ్ = పరస్పరము తమ్ముతాము క్రాన్త్వా = చుట్టుఆక్రమించి, స్థితాః = ఉండును.

**ఆదిత్యోఽపి కాష్ఠోచ్యతే క్రాంత్వా స్థితో భవతి.**

అసావపి క్రాన్త్వా సర్వత్ర గత్వా స్థితో భవతి.

అర్థము :- సూర్యుడుకూడ కాష్ఠా నామముచే పిలువబడును. కారణమేమన అతడును క్రాన్త్వా = అంతటవ్యాపించి తనస్థానమున స్థితో భవతి = స్థితుడైయుండును.

**ఆజ్యన్తోఽపి కాష్ఠోచ్యతే క్రాన్త్వా స్థితో భవతి.**

ఆజ్యన్తోఽపి - యుద్ధభూభాగః కాష్ఠోచ్యతే అసావపి స్వంప్రదేశం క్రాన్త్వా గత్వా స్థితో భవతి.

అర్థము :- ఆజ్యన్తః అపి = సంగ్రామభూమికూడ 'కాష్ఠా'యన బడును అదియును క్రాంత్వా=వెళ్లి తనస్థానమున స్థితోభవతి - స్థితమగును.

**ఆపోఽపి కాష్ఠా ఉచ్యన్తే క్రాన్త్వా స్థితా భవన్తీతి స్థావరాణామ్.**

ఆపః జలాన్యపి మన్త్రేఽపి చైతస్మిన్నే వార్థే భవతి.

అర్థము :- ఆపః అపి = జలములుకూడ కాష్ఠాశబ్దవాచ్యములే ఇవియు, క్రాన్త్వా = వెళ్లి జలాశయాదులందు స్థితములగును, ఇతి స్థావరాణామ్ = స్థిరముగానుండు జలవిషయము. ఇక అస్థావరములు ప్రవాహరూపమున నుండునవి యొకచోట నుండవు. కావున నవియు కాష్ఠాః = పవిత్రములు ('కాష్ఠాః మేధ్యా ఆపః') ఎప్పుడు ప్రవహించునవి యొకచో నుండవు కావున నవి మేధ్యములు పవిత్రములు. నదులరూపమున ప్రవహించుజలము అస్థావరములు. తటాగాదులందుండునవి స్థావరములు.

అతిష్ఠన్తీనామనివేశనానాం కాష్ఠానాం మధ్యే నిహితం శరీరమ్
వృతస్య నిణ్యం విచరన్త్యాపో దీర్ఘంతమ ఆశయ దిన్ద్ర
శత్రుః (ఋ. ౧-౩౨-౧౦) అతిష్ఠన్తీనా మనివిశమానానా
మిత్యస్థావరాణామ్ కాష్ఠానామ్ మధ్యే నిహితం శరీరం
మేఘః. శరీరం శృణాతేః శమ్నాతేర్వా. వృత్రస్య నిణ్యం
నిర్ణామమ్. విచరన్తి విజానన్త్యాప ఇతి. దీర్ఘం ద్రాఘతేః
తమస్తనోతేః, ఆశయదాశేతేః, ఇంద్రశత్రు రింద్రోస్య శమ
యితా వా శాతయితా వా. తస్మాదింద్రశత్రుః.

అతిష్ఠన్తీనామితి హిరణ్యస్తూపస్యార్షమ్. పానపత్త్రిరితి చ - త్రిష్టుభా వేతే. అతిష్ఠన్తీనామ్, మేఘోదరాన్తర్గతానామపామ్, అనివేశనానామ్ అనివిశమానానామ్ నహి తాః క్వచిన్నివిశన్తే, యావజ్జలాశయం నాప్నువన్తి. తాసామేవం విధానాం కాష్ఠానాం మధ్యే నిహితం అవస్థాపితం ధాత్రా శరీరమ్ ఆవృత్య తాః పునః ఆపః తస్య వృత్రస్య మేఘస్య నిణ్యం నిర్ణామం యేనాసౌ నిష్క్రమతి తం ప్రదేశం విజానన్తి ఇవ. అసావపి వృత్రస్తాసు దీర్ఘతమః దీర్ఘకాలమ్ ఆశయత్ ఆశేతేస్మ ఇత్యర్థః. శరీరం శృణాతేః హింసార్థస్య హింస్యతే హి తత్. శమ్నాతేర్వా హింసార్థస్య. తమః తనోతేః తేన హి సర్వమేవ తతం. శాతయితా హన్తా.

మంత్రార్థము :- అతిష్ఠన్తీనామ్ = ఎక్కడనిలువనట్టివై, మేఘోదరముననుండు, అనివిశమానానామ్ = ఎక్కడను తమకట్టులేనట్టి, కాష్ఠానామ్= అస్థావరములైన జలముల, మధ్యే=మధ్యమందు, శరీరమ్=మేఘశరీరము, నిహితమ్ = స్థితమైయున్నది, ఆపః = ఆజలము వృత్రస్య = మేఘము యొక్క, నిణ్యం = నిమ్నప్రదేశమున, విచరన్తి = తెలిసిసంచరించుచున్నవుడు, ఇంద్రశత్రుః = మేఘము, దీర్ఘంతమః = గాఢమైనఅంధకారమును, ఆశయత్ = విస్తరింపజేయును, అతిష్ఠంతీనామ్ అనివిశమానానామ్=నిలకడలేని అప్రతిహతగతిగలవియైన అస్థావరాణాం - కాష్ఠానామ్ = ప్రవహించు, జలముయొక్క మధ్యే=మధ్యమున, శరీరమ్నిహితమ్=మేఘముండును, శరీరమ్శృణాతేః శమ్నాతేః వా, హింసార్థక'శౄ'ధాతువుతోను, లేక ఉప శమార్థక'శమ్'ధాతువుతోను శరీరమేర్పడును, వృత్రస్య=మేఘముయొక్క,

నిమ్నేనిర్ణామమ్ = నిమ్నప్రదేశమున, విజానన్తిఆపః = ఎఱగియున్నవాని వలె-జలము సంచరించును, 'దీర్ఘంద్రాఘతేః' ద్రాఘృఆయామే = ద్రాఘృ ధాతువువలన దీర్ఘశబ్దమేర్పడును. తమఃతనోతేః 'తనువిస్తారే'ధాతువువలన తమశబ్దమేర్పడును, ఆశయత్ - అశేతేః-అజ్‌పూర్వక, 'శీఙ్‌స్వప్నే' ధాతువు వలన ఆశయత్ శబ్దము సిద్ధించును. ఇంద్రశత్రుః = ఈపదమునకర్థమేమి? ఇంద్రోఽస్య శమయితా అస్య ఇంద్రః శమయితా=ఈవృత్రుని ఇంద్రుడు శాంతింపజేయును. నాశముచేయును, శాతయితా వా = ఇంద్రుడు వృత్రుని ఖండించువాడు = అందువలన మేఘము ఇంద్రశత్రువు ఇంద్రుడు శత్రువుగా గలదియని-అర్థము. ఈవ్యుత్పత్తిననుసరించి ఇంద్రశత్రువు వృత్రుడు అని యర్థము.

**తత్ కో వృత్రః? మేఘ ఇతి నైరుక్తాః. త్వాష్ట్రోఽసుర ఇత్యైతిహాసికాః. అపాంచ జ్యోతిషశ్చ మిశ్రీభావకర్మణో వర్షకర్మ జాయతే. తత్రోపమార్థేన యుద్ధవర్ణా భవన్తి.**

మేఘ ఇతి నైరుక్తాః. త్వాష్ట్రోఽసుర ఇత్యైతిహాసికాః. నిరుక్తమధీయతే నైరుక్తాః. యది మేఘో వృత్రో య ఏషు మన్త్రేషు తత్ర తత్ర సంగ్రామః శ్రూయతే. తత్ర కః సమాధిః ? ఉచ్యతే, అపాంచ జ్యోతిషశ్చ మిశ్రీభావకర్మణో వర్షకర్మ జాయతే, తత్రోపమార్థేన యుద్ధవర్ణా భవన్తి వైద్యుతేన జ్యోతిషా వాయ్వావేష్టితేన ఇంద్రాఖ్యేనోపతాడ్యమానా ఆపః ప్రస్యన్దన్తే - ఉపమార్థేన రూపకల్పనయా యుద్ధవర్ణా భవన్తి, యుద్ధరూప కాపీత్యర్థః. నహ్యత్ర యథా ఘాతం యుద్ధమస్తి. యతో నహీన్ద్రస్య శత్రవః కేచన సన్తి.

అర్థము :— తత్ వృత్రః కః ? అప్పుడీవృత్రుడెవడు ? మేఘః = మేఘము. ఇతి నైరుక్తాః=ఇది నైరుక్తసిద్ధాంతము. త్వాష్ట్రః అసురః త్వష్ట యొక్క సంతానము అసురుడు అని ఐతిహాసికులు చెప్పుదురు. అపాంచ జ్యోతిషః చ=జలము, విద్యుత్తుఅనువాని మిశ్రీభావకర్మణః=మిశ్రీకరణము వలన - కలయికవలన వర్షకర్మ జాయతే=వర్షము కలుగును. తత్ర=ఆవర్ష క్రియయందు, ఉపమార్థేన = ఉపమానముకొఱకు, యుద్ధవర్ణాఃభవన్తి = జలము అగ్ని అనురెండింటికలయికకు యుద్ధరూపము కల్పింపబడినది -

అగ్ని జలములు పరస్పరము ప్రతిద్వంద్వులుకదా - శత్రువులకలయిక యుద్ధముకాక మఱియేమగును ? ఇదియొక అలంకారికవర్ణనము. జలాగ్నులకలయిక రూప యుద్ధక్రియవలన మేఘము ముక్కలుముక్కలుగా ఛేదింపబడి వర్షరూపము ధరించినదని భావము. అగ్ని = విద్యుత్తుసంయోగమువలన మేఘము ద్రవించి వర్షరూపమున భూమిపై బడును. ఇదియే యుద్ధము వాస్తవికయుద్ధమిట అభిప్రేతము కాదు మఱియు నింద్రునకు నెప్పుడును శత్రువు లేడు.

**అహివత్తు ఖలు మంత్రవర్ణా బ్రాహ్మణవాదాశ్చ. వివృద్ధ్యా శరీరస్య స్రోతాంసి నివారయాంచకార. తస్మిన్ హతే ప్రసస్యందిర ఆపః.**

అహివత్తుఖలు మంత్రవర్ణా - బ్రాహ్మణవాదాశ్చ - వృత్రవచ్చాహివచ్చేతి మంత్రవర్ణా మంత్రలింగాని భవన్తి. శాఖాన్తరేషు తస్మిన్ హతే వృత్రాఖ్యే మేఘే ప్రసస్యందిరే ఆపః ప్రస్యందితవత్య ఆపః.

అర్థము :— తు = మఱియు, ఖలు = నిశ్చయముగ, అహివత్ = అహిశబ్దముతో యుక్తమంత్రవర్ణాః = మంత్రవర్ణములు మంత్రముల స్వరూపము, బ్రాహ్మణవచనమున పొందబడుచున్నవి. అనగా మంత్రము లందు బ్రాహ్మణములందును, వృత్రునివలె-అహి, ఇంద్రుడు అనునిరువురు ప్రతిద్వంద్వులుగా నంగీకరింపబడినవి. అహియనిట మేఘమే కావున వృత్రుడు మేఘమే - అసురుడు ఎవ్వడు లేడు. శరీరస్యవివృద్ధ్యా = శరీర వృద్ధితో నీవృత్రుడు, స్రోతాంసి = జలధారలను, నివారయాంచకార = అడ్డగించెను. తస్మిన్ హతే = వృత్రుడు (మేఘము) మరణించినమీదట ఆపఃప్రసస్యందిరే జలధారలు - స్రోతస్సులు భూమిపై పడినవి - వర్షింప దొడగెను.

**తదభివాదిన్యేషా ఋగ్ భవతి.**

తదభివాదినీ ఋగ్ భవతి. పైవిషయమును తెలుపుఋక్కు.

"దాసపత్నీ రహిగోపా అతిష్ఠన్నిరుద్ధా ఆపః పణినేవ గావః.
అపాం బిల మపిహితం యదాసీద్ వృత్రం జఘన్వాం అప
తద్వవార." (ఋ. ౧-౩౨).
దాస పత్నీ ర్దాసాధి పత్న్యః. దాసో దస్యతే రుపదాస
యతి కర్మాణి. అహిగోపా అతిష్ఠన్ అహినా గుప్తాః
అహి రయనాదేత్యంతరిక్షే. అయమపీతరోఽహి రేతస్మాదేవ
నిర్హ్రసితోపసర్గ ఆహ న్తీతి. నిరుద్ధా ఆపః పణినేవ గావః
ఫణిర్ వణిగ్ భవతి. పణిః పణనాత్ వణిక్ పణ్యం నేనేక్తి
'అపాం బిలమపిహితం యదాసీత్ బిలం భరం భవతి.
బిభ ర్తేః. వృత్రం జఘ్నివా నపవవారతత్ వృత్రో వృణో
తేర్వా వర్తతేర్వా వర్ధతేర్వా యదవృణోత్తత్ వృత్రస్య
వృత్రత్వమ్' ఇతి విజ్ఞాయతే యదవర్తత తద్ వృత్రస్య
వృత్రత్వమ్ ఇతి విజ్ఞాయతే. యదవర్ధత తత్ వృత్రస్య
వృత్రత్వమ్ ఇతి విజ్ఞాయతే.

అహి గోపాః మేఘాన్తర్ గుప్తాః అతిష్ఠన్ స్థితవత్యః నిరుద్ధాః తా దాసపత్నీరివ ఆపః. యథా కేనచిత్ పణినా వణిజా కస్మింశ్చిద్ వీథ్యన్తరే విక్రయార్థం గావో నిరుద్ధాః తిష్ఠేయుః ఏవం స్థితవత్యస్తాః పునః ఖే నిరుద్ధాః సత్యః తేన మేఘేన తాసామ్ అపాం యత్ బిలం నిర్గమద్వారం పిహితమ్ యదా ఇంద్రః తం వృత్రం మేఘం జఘన్వాన్ జఘ్నివాన్, అపవవార అపావృతం తద్బిలమ్ తస్మిన్నిహతే అపావృతే చ ద్వారే తాః అపః ప్రసస్యం దిదే వర్షభావేనేతి సమస్తార్థః. దాసః కర్మకరః దాసో దాస్యతేః స హి ఉప దాసయతి కరోతి కర్మాణి, అహిః అయనాత్ ఏతి. హ్యసౌ అంతరిక్షే అయ మపీతరోఽహిః సర్పః - అసావపి హి ఏతి నిర్హ్రసితోపసర్గః ఆహన్తి అసౌ భోగేనేత్యాది. వణిజో యద్ద్రవ్యం తత్ పణ్యం తదసౌ నేనేక్తి నిత్యకాలం శుచీకరోతి మూల్యార్థం స్యాదితి బిలం బిభర్తేః భృతం హి తదుదకాదిభిః.

అర్థము :— మం - అ - దాసపత్నీః = కూలివారిని రక్షించునట్టి కూలిపనిచేయుచు కూలివారు అలసటచెందినపుడు జలము వారి యలస) టను దీర్చి వారిని కాపాడును కావున ఆపః = జలము దాసపత్నీః అన

బడును), అహిగోపాః = మేఘముచే రక్షింపబడుచున్న, ఆపః = జలములు, పణినా గావః ఇవ = వ్యాపారి గోవులనమ్ముటకుపూర్వము వానిని దొడ్డిలో నుంచి కాపాడునట్లు, నిరుద్ధా అతిష్ఠన్ = మేఘమునందు నిరోధింపబడి యుండును, యత్ అపాం = ఆజలములయొక్క, బిలమ్ = ద్వారము, అపిహితమ్ = మూయబడి, ఆసీత్ = ఉండినపుడు, వృత్రం జఘన్వాన్ = ఇంద్రుడామేఘమును (వృత్రమ్) చంపును, తత్ అపవవార = ఆద్వారము అపుడు తెఱువబడును - జలము వర్షించును.

దాసపత్నీః దాసాధిపత్న్యః = దాసుల రక్షించునది, దాసోదస్యతేః ఉపక్షయార్థక 'దసు'ధాతువుతో దాసశబ్దమేర్పడును. ఏలయన-దాసుడు - భృత్యుడు, కర్మాణి ఉపదాసయతి = కార్యములను సమాప్తముచేయును. ఒకదానితరువరి మఱియొకపనిని పూర్తిచేయును. అహిగోపాః - అహినా గుప్తాః = అహి = మేఘముచే సురక్షితములైన జలములు, అహిఃఅయ నాత్ = గమనమువలన అహినామము కలిగినది. గమనక్రియాసంబంధము వలన 'ఇణ్' ధాతువుతో అహిశబ్దమగును. అయమపి = ఇదియు, ఇతరః అహిః = మఱియొక సర్పవాచకము, అహివీతస్మాదేవ = దీనివలననె యేర్పడును. సర్పముకూడ గమనమొనర్చునుగదా ? అథవా నిర్హ్రసితోప సర్గః - ఆహన్తి ఇతి = సర్పముచంపును. ఆఙ్‌పూర్వక 'హన్'ధాతువుతో అహిశబ్దము ఏర్పడును 'ఆ'కు హ్రస్వము చేయబడును.

నిర్హ్రసితః ఉపసర్గః అస్య అసౌ నిర్హ్రసితోపసర్గః అహిశబ్దః. పణిః - వణిక్ = వ్యాపారివాచకము, పణిఃపణనాత్ - పణనః=వ్యాపారము చేయుటచే పణిశబ్దముకలుగును, వణిక్ పణ్యం నేనేక్తి = క్రయవిక్రయ మునకు సంబంధించినపదార్థములను, వణిక్ = వ్యాపారి, నేనేక్తి=శోధించు చుండును - విక్రయింపతగునట్లు చేయును. కావున నతడు వణిక్ అన బడును. బిలం భరం భవతి - బిలమే భరమగును. భరశబ్దము బిభర్తేః - 'డుభృఞ్'ధాతువుచే నేర్పడును. బిలము జలాదులతో నిండును. భర - బల - బిల = బిలములగును, వృత్రః = వృణోతేః వృఞ్ వరణె ధాతు వుతో వృత్రశబ్దమేర్పడును. వరణమన ఆచ్ఛాదనము - వృత్రః=మేఘము అంతరిక్షమున వ్యాప్తమై దానినాచ్ఛాదించును. ఇదియే వృత్రుని వృత్ర త్వము, వర్తతేః వా = వృతుధాతువుతో వృత్రశబ్దము సిద్ధించును. ఈ

'వృతు'ధాతువు నిఘంటువునందు గత్యర్థకముగా పఠింపబడినది. వృత్రుడు = గమనముచేయును. వర్తతేర్వా లేక వృధ్యర్థకవృధ్ధాతువుతో వృత్రశబ్దము సిద్ధించును. వర్షాకాలములో మేఘము బాగుగా వృద్ధి చెందును. యదవృణోత్ = వృత్రుడు ఆకాశమును కప్పివేయును. ఇదియే వృత్రునివృత్రత్వము. ఇతి విజ్ఞాయతే = అనితెలియుచున్నది. యదవర్తత = ఇంద్రుడు మేఘమును హననముచేసినపుడు బిలము తెఱవబడినపుడు మేఘము (వృత్రుడు) వృష్టిరూపమున భూమిపైపడును. ఇదియే వృత్రుని వృత్రత్వము అని తెలియును. మఱియు యదవర్ధత= వర్షాకాలములో అభివృద్ధిచెందును కావున నిదియే వృత్రునివృత్రత్వము.

ఇతి పంచమః పాదః

పంచమ పాదము సమాప్తము

## అథ షష్ఠః పాదము

(రాత్రినామ నిర్వచనము)

**రాత్రినామా న్యుత్తరాణి త్రయోవింశతిః,**

తమః సంతత్యా హి రాత్రిః అతో దిక్‌నామభ్య ఉత్తరాణి రాత్రి నామాని.

ముందు రాబోవు ఇరువదిమూడు నామములు రాత్రివాచకములు.

**రాత్రిః కస్మాత్ ? ప్రరమయతి భూతాని నక్తంచారీణి. ఉప రమయతీతరాణి ధ్రువీకరోతి. రాతేర్వా స్యాద్దాన-కర్మణః, ప్రదీయన్తే అస్యా మవశ్యాయాః.**

ప్రకర్షేణ రమయతి భూతాని నక్తంచారీణి పిశాచాదీని, ఇతరాణ్యపి దివాచారీణి ఉపరమయతి మనుష్యాదీని దానకర్మణః ధాతోర్వస్య ప్రదీయన్తేఽస్యా మవశ్యాయాః తుషారా ఇత్యర్థః. తే హి రాత్రౌ నిపతన్తి అవశ్య మాయన్తీ, త్యవశ్యాయాః.

అర్థము :– రాత్రిః కస్మాత్ ? = రాత్రియని యెందుకందురు ? నక్తంచారీణి భూతాని = రాత్రియందు సంచరించు పిశాచాదులను, ప్రర

మయతి = ప్రసన్నులనుజేయును. అందువలన రాత్రినామమేర్పడినది. ఇతరాను ఉపరమయతి = దినమునందు పనిచేయునితరప్రాణులకును, ఉపరామ = విశ్రాంతినికలిగించును, ధ్రువీకరోతి=ప్రతిదినము విశ్రాంతి నిచ్చి స్థిరపరచును - దీర్ఘాయువు నిచ్చును. రాతేః వా స్యాత్ దానకర్మణః= లేక దానార్థక 'రా' ధాతువువలన రాత్రిశబ్దము ఏర్పడును. అస్యామ్ = ఈరాత్రియందు, అవశ్యాయాః ప్రదీయంతే = మంచుకురియును.

(ఉషోనామ నిర్వచనము)

**ఉషో నామాన్యుత్తరాణి షోడశ.**

రాత్రే రేవహ్యాపరః కాలః ఉష అఖ్యో భవతీతి. రాత్రినామభ్య ఉత్తరాణ ఉషోనామాని. ముందటి పదునారునామములు ఉషస్సువి.

**ఉషాః కస్మాదుచ్ఛతీతి ? సత్యా రాత్రే రపరఃకాలః.**

ఉచ్ఛతీతి సత్యాః 'ఉఛీ' వివాసే వివాసయతి హియం తమాంసి. ఉషానామ మేలకలిగినది ? ఉచ్ఛతీతి=అంధకారమును వివాసమొనర్చును-తొలగించును. 'ఉచ్ఛీవివాసే' ధాతువుతో 'ఉషా'నామ మేర్పడును. రాత్రేః అపరఃకాలః = రాత్రియొక్క పశ్చిమభాగము, ఉషస్సనబడును.

**'తస్యా ఏషా భవతి'**

తస్యాః ఉషసః రాత్ర్యపరకాలత్వే ఏషా నిర్వాచికా ఋగ్భవతి.

ఉషస్సును సంబంధించినఋక్కు.

**''ఇదం శ్రేష్ఠం జ్యోతిషాం జ్యోతిరాగా చ్చిత్రః ప్రకేతో అజనిష్ట విభ్వా యథా ప్రసూతా సవితుః సవాయ ఏవా రాత్ర్యుషసే యోనిమారైక్ (ఋ. ౧-౧౧౩-౧).**

**ఇదం శ్రేష్ఠం జ్యోతిషాం జ్యోతిరాగమత్ చిత్రం ప్రకేతనం ప్రజ్ఞాతతమజనిష్ట విభూతతమమ్. యథా ప్రసూతా సవితుః ప్రసవాయ రాత్రిరాదిత్యస్య. ఏవం రాత్ర్యుషసే యోని మరిచత్ స్థానమ్ స్త్రీయోనిరభియుత ఏనాం గర్భః.**

ఇదం శ్రేష్ఠమితి అంగిరసస్య కుత్సస్యార్షం. ఇదమ్ ఉషా లక్షణం జ్యోతిః శ్రేష్ఠమ్ ఆదిత్యాదీనాం జ్యోతిషామ్. ఆదిత్యో హి తాపకః ప్రకాశకః చంద్రమా అప్యతిశీతః ప్రకాశకశ్చ. ఇదం పున ర్నాత్యుష్ణం నాతిశీతం ప్రకాశకం చ. ఇత్యేవమాదిత్యాదీనామ్ ఇదమేవ శ్రేష్ఠమ్. అగాత్ అగమత్ అగచ్ఛతీత్యర్థః. చిత్రం చాయనీయం పూజనీయం వా శ్రేష్ఠత్వాదేవ ప్రకేతః ప్రకేతనం ప్రజ్ఞాతతమమ్ అజనిష్ట జాతమిత్యర్థః విభ్వా విభూతతమమ్ విస్తీర్ణతమమ్. యథా ప్రసూతా ప్రసవమనుప్రాప్తా. రాత్రిః సవితుః ఆదిత్యస్య సవాయ ప్రసవాయ, ఏవమేవ రాత్రి రాత్రిః ఉషసో జన్మార్థం యోనిం స్థానమ్ అవకాశమ్ ఉషసే ఆరైక్ అరిచత్ అరేచయతి దదాతీత్యర్థః యథోషా ఆదిత్యస్య జన్మనో హేతుః ఏవమ్ రాత్రిరుషసో జన్మనో హేతుః ఇత్యేవ మస్యామృచి రాత్రేరేవ అపరః కాలః ఉషః ఇతి గమ్యతే. అభియుతః ఆమిశ్రీభూతః.

మంత్రార్థము :— ఇదం జ్యోతిః - ఉషానామక జ్యోతి, జ్యోతిషామ్= ఆదిత్యాది జ్యోతిష్మంతములగు పదార్థములలో, శ్రేష్ఠమ్=మిక్కిలి ఉత్తమముగా, అగాత్ = వచ్చినది - ఉదయమైనది, చిత్రః = పూజనీయము దర్శనీయము, ప్రకేతః = సుప్రసిద్ధము, విభ్వా = అంతట వ్యాపించునది, అజనిష్ట = ఉత్పన్నమైనది, యథా = ఎట్లు, ప్రసూతా రాత్రిః = పుట్టిన రాత్రి, సవితుః = సూర్యుని, సవాయ = ఉదయముకొఱకు, సూర్యరహిత ప్రదేశమునకు వెళ్లునట్లు ఈరాత్రి, ఉషసే = ఉషస్సుకొఱకు, యోనిమ్= స్థానమును ఆరైర్ = రిక్తముచేయును. స్వయముగ తొలగిపోవును, చిత్రం చాయనీయమ్=దర్శనీయము.పూజనీయము, ప్రకేతనమ్ ప్రజ్ఞాతతమమ్ = ప్రసిద్ధము, అజనిష్ట = ఉత్పన్నమైనది, విభ్వావిభూతతమమ్సర్వత్ర = వ్యాపకమైనది, స్త్రీ యోనిః=స్త్రీయొక్క భగముకూడ యోని యనబడును. ఏలయన, ఏనామ్ = ఈజ్యోతిని, గర్భః = గర్భము, అభియుతః = ఆమిశ్రీభూతః = కలిగియున్నది ఈయోని గర్భయుక్తము.

**తస్యా ఏషాపరా భవతి.**

తస్యాః ఉషసః ఏషా అపరా ఋక్ భవతి = ఆఉషస్సువిషయమున మఱియొకఋక్కు.

"రుశద్వత్సా రుశతీ శ్వేత్యాగాదారైగు కృష్ణా సదనాన్యస్యాః సమానబంధూ అమృతే అనూచీ ద్యావా వర్ణం చరత ఆమినానే." (ఋ. ౧-౧౧౩-౨)

రుశద్వత్సా సూర్యవత్సా. రుశదితి వర్ణనామ, రోచతేర్ జ్వలతి కర్మణః, సూర్యమస్యావత్స మాహ సాహచర్యాత్ రసహరణాద్వా. రుశతీ శ్వేత్యాగాత్. శ్వేత్యా శ్వేతతేః అరిచత్ కృష్ణా సదనాన్యస్యాః. కృష్ణవర్ణారాత్రిః కృష్ణం కృష్యతే ర్నికృష్టో వర్ణః అథైనే సంస్తౌతి. సమానబంధనే అమృతే అమరణ ధర్మాణౌ 'అనూచీ' అనూచ్యావితి ఇతరేతర మభి ప్రేత్య ద్యావా వర్ణం చరతః. తే ఏవ ద్యావా ద్యోతనాత్. అపి వా ద్యావా చరత స్తయా సహ చరత ఇతి స్యాత్. ఆమినానే ఆమిన్వానే అన్యోన్యస్యాధ్యాత్మమ్ కుర్వాణే.

రుశద్వత్సా రోచిష్ణువత్సా సూర్యో హి రోచిష్ణుః తం సూర్యమ్ అస్యా వత్స మాహ మంత్రదృక్. సాహచర్యాత్ మాతృసహచరో హి వత్సో భవతి. అయమపి చానయోషసా సహచరతీత్యేతస్మాత్ సామాన్యాత్ వత్స ఉచ్యతే యథా హి మాతురూధసః క్షీరాఖ్యస్య రసస్యాహర్తా భవతి వత్సః. ఏవ మేషోఽప్యౌషసికానామవశ్యాయాఖ్యానామ రసానా మాహర్తా భవతి రశ్మిభిః - ఇత్యేతస్మాత్ సామాన్యాత్ వత్సత్వమ్. శ్వేత్యా శ్వేతతేః శ్వేతవర్ణే త్యర్థః కృష్ణా కృష్ణవర్ణా రాత్రిః సదనాని స్థానాని. ఏవం తావదయ మర్ధర్చో రాత్ర్యుషసో ర్విభక్తస్తుతిః. ఉత్తరార్ధర్చేన రాత్ర్యుషసౌ సంస్తౌతి సమాన బంధూ సమానబంధనే ఆదిత్యస్య హ్యస్తమయం ప్రతి రాత్రిర్బద్ధా సంశ్లిష్టా ఉదయం ప్రత్యుషాః. అమృతే అమరణధర్మాణౌ, న హి రాత్ర్యుషసౌ మ్రియేతే. అనూచీ ఇతరేతరం సంశ్లిష్టే ద్యావౌ ద్యోతనాత్. ఉషా హి స్వేన ప్రకాశేన ద్యోతతే, రాత్రిరపి స్వేన తమోవీర్యేణ చరతః గచ్ఛతః.

మంత్రార్థము :- రుశద్వత్సా=రుశత్=సూర్యునివాచకము, (రుశత్) సూర్యుడు వత్సః=దూడ, రశద్వత్సా = సూర్యుడు వత్సగాగలది ఉష యని యర్థము. రశతి = ప్రకాశించునట్టి, శ్వేత్యా=శుభ్రవర్ణముగలదియైన,

ఉష - అగాత్ = ఉదయించెను, కృష్ణా=కృష్ణవర్ణముగలరాత్రి, అస్యాః = ఉషయొక్క, సదనాని=స్థానములను, ఆరైక్ = కాళీచేసెను, సమాన బంధూ = సమానబంధముగలవియైన ఉషారాత్రులు, అమృతే = అమరణ ధర్మముగలవి, అనూచీ = పరస్పరసంబద్ధములు, అమినానే = ఒకదానిపై మఱియొకటి యుండునది, ద్యావా = దీప్తికలవియైన ఉషారాత్రులు, వర్ణంచరతః = తమ శుక్లకృష్ణవర్ణములను పొందును. ఉషస్సు, రాత్రి అనునీరెంటికి 'సమానబంధూ' మున్నగునవి విశేషణములు. రుశదితి వర్ణనామ - 'రుశత్' అనునది వర్ణవాచకము. జ్వలతికర్మణః=జ్వలత్యర్థక రోచతేః రుచ్‌ధాతువుతో సిద్ధమగును. అస్యాః సూర్యమ్ వత్సమ్ ఆహ = ఉషస్సునకు సూర్యుడు, వత్సః = దూడ అనబడును. రసహరణాత్ = గోవునుండి దూడ పాలనుగ్రహించునట్లు సూర్యుడు ఉషస్సువలన నేర్పడిన మంచుకణములను హరించును = గ్రహించును. ఇట్లు రసహరణము చేయుటవలన సూర్యుడు ఉషస్సునకు దూడవంటివాడని భావము, సాహ చర్యాత్ వా = ఆవు దూడ రెండు నెప్పుడు కలిసియుండునట్లు సూర్యుడు, ఉషస్సు ఎప్పుడు కలిసియుండును. ఈసాహచర్యమువలనను సూర్యుడు ఉషస్సునకు దూడవంటివాడనిభావము. శ్వైత్యా శ్వేతతేః శ్వైత్యాశబ్దము- 'శ్వితావర్ణే' ధాతువువలన నేర్పడును. కృష్ణా కృష్ణవర్ణా రాత్రిః = కృష్ణా, రాత్రికి పేరు. రాత్రి నలుపువర్ణము కలిగియుండును. కృష్ణం కృష్యతేః నికృష్టో వర్ణః 'కృష్'ధాతువువలన కృష్ణశబ్ద మేర్పడును. కృష్ణవర్ణ మన్ని వర్ణములకంటె నికృష్టము - అథ ఏనే = ఈరెంటిని సంస్తౌతి = స్తుతిచేయు చుడు. ఉషస్సు, రాత్రి అనునీరెండును సమానబంధూ = సమానబంధ నము కలవి. పరస్పర మివిరెండును కలిసియుండును. ఈరెండును అమృతే = అమరధర్మాణౌ = మరణధర్మములేనివి, అనూచీఅనూచ్యౌ ఇతరేతర మభిప్రేత్య = రెండునొకదానితో మఱియొకటి కలిసియున్నవి, తే ఏవ = అవియే, ద్యావౌ = ప్రకాశవంతములు, ద్యోతనాత్=ప్రకాశించుట వలన నవి ప్రకాశవంతములు. రాత్రి నక్షత్రములవలన ప్రకాశవంతము. ఉషస్సు తనప్రకాశముతోనే ప్రకాశించును. అపి వా ద్యావా చరతః తయా సహ చరత ఇతి స్యాత్ - ద్యావా = ప్రకాశముతోకూడి ప్రకాశతములు. 'ద్యావా' పదము తృతీయాంతముగా నెంచి (ద్యావా - ద్యోః - శబ్దమునకు

తృతీయా) ప్రకాశముతో రాత్రి ఉషస్సు రెండు ప్రకాశయుక్తములన బడును. ద్యావా = ద్యావౌ - ఈశబ్దము ప్రథమాద్వివచనాంతముగా నెంచి నపుడు రాత్రి నక్షత్రముల ప్రకాశముతో ప్రకాశించునదగును. ఉషస్సు స్వప్రకాశముతో ప్రకాశవంతమగునని యర్థము, అమిమానే అమిన్వానే అన్యోన్యస్య అధ్యాత్మం కుర్వాణే = రాత్రి, ఉషస్సు రెండును పరస్పరము ఒకదానిపై మఱియొకటి యుండును.

అథాహర్నామ నిర్వచనమ్

(పగటినామ నిర్వచనము)

**అహర్నామా న్యుత్తరాణి ద్వాదశ.**

ఉషస ఏవానన్తరమ్ అహర్భవతి. తస్మాదుషోనామభ్యః ఉత్తరాణి అహర్నామాని = ముందు నిర్వచింపబోవు ద్వాదశనామములు దినమువి.

**అహః కస్మాత్ ? ఉపాహరన్త్యస్మిన్ కర్మాణి.**

ఉపాహరన్తి అస్మిన్ కర్మాణి. న హి తథా రాత్రావనుతిష్ఠన్తి కర్మాణి కర్మకరాః యథాహని.

పగటియందు కర్మకరులు కర్మలనొనర్తురు. అందువలన అహస్సు= పగలు దినము అనబడును. రాత్రియందెవ్వరు పనులొనర్పరు.

**"తస్యైష నిపాతో భవతి వైశ్వానరీయాయా మృచి."**

తస్య అహ్నః ఏష నిపాతో భవతి. వైశ్వానరీయాయామ్ వైశ్వానర దేవతాయామ్ ఋచి నైఘంటుకవృత్త్యా.

తస్య అహ్నః = 'అహః' యొక్క వర్ణనము వైశ్వానరీయాయామ్ = వైశ్వానరీయ, ఋచి = ఋక్కునందు.

> **"అహశ్చ కృష్ణమహరర్జునం చ వివర్తేతే రజసీ వేద్యాభిః వైశ్వానరో జాయమానో న రాజా వా తిరజ్జ్యోతిషాగ్ని స్తమాంసి (౬-౯-౧).**

> **అహశ్చ కృష్ణం రాత్రిః శుక్లం చాహరర్జునమ్ వివర్తేతే రజసీ వేద్యాభి ర్వేదితవ్యాభిః ప్రవృత్తిభిః వైశ్వానరో జాయ**

**మాన ఇవ॰ ఉద్యన్నాదిత్యః సర్వేషాం జ్యోతిషాం రాజా అవాహ న్నగ్నిర్జ్యోతిషా తమాంసి.**

అహః శబ్దో హి రాత్రిమహశ్చోభయ మభిధత్తే - అహశ్చ కృష్ణమితి. భరద్వాజస్యేయ మార్షమ్. అహశ్చ కృష్ణం రాత్రిః శుక్లం చాహరర్జునమ్ అర్జునశబ్దో హి శుక్లపర్యాయః వివర్తేతే విపర్యయేణ వర్తేతే రాత్రి రతీతా ఆహరాయాతమ్, అహరతీతం రాత్రిరాయాతా. ఇత్యేవమ్ రజసీ రంజకే జ్యోతిషా హి భూతాన్యహోరంజయతి తమసా రాత్రిః. వేద్యాభిః వేదిత వ్యాభిః ప్రవృత్తిభిః కించ వైశ్వానరః అగ్నిరపాతిరత్. అవాహన్ అపహన్తి స్వేన జ్యోతిషా తమాంసి. జాయమానో న రాజా జాయమాన ఇవ ఉద్యన్ సర్వేషాం సర్వభూతానాం రాజా ఆదిత్యః. యథా హ్యుద్యన్ ఆదిత్య స్తమాంసి అపహన్తి దివా ఏవమగ్నిః.

'అహః' శబ్దము దినరాత్రులకు రెండింటికి వచ్చును. ఈమంత్రమున వీని విభాగము వర్ణింపబడినది. ఒకటి అర్జునమ్ అహః = దినమన బడును, కృష్ణమ్ - అహః = రాత్రిఅందుము ఇది రెండవది.

మంత్రార్థము :- కృష్ణమ్ అహః చ = రాత్రి, అర్జునమ్ అహః చ. పగలు రెండును, రజసీ = భూతములకు తమరంగుతో రంగుకలిగించునట్టివి - రాత్రి అంధకారముతో దినము ప్రకాశముతో పదార్థములను రంగులుకలవిగా జేయును. వేద్యాభిః వేదితవ్యప్రవృత్తులతో కూడినవై, వివర్తేతే = మార్పులు చెందుచుండును. వంతులప్రకారము ఒకదాని తరువాత మఱియొకటి వచ్చుచు పోవుచు నుండును దినముతరువాత రాత్రి రాత్రితరువాత దినము అనుక్రమము ఎల్లపుడు జరుగుచుండును. జాయమానః = ఉదయించుచున్నవాడై సూర్యుడు॰ రాజా సూర్యన = రాజు వలె, జ్యోతిషా = తనప్రకాశముతో, తమాంసి = చీకట్లను, అవాతిరత్ = తొలగించును, అట్లే వైశ్వానరః అగ్నిః = వైశ్వానరనామముగల పార్థివాగ్ని - భూమిపైనుండు అగ్ని రాత్రియందు, జ్యోతిషా = తనకాంతితో, తమాంసి= చీకట్లను, అవాతిరత్ = పోగొట్టును. జాయమానో న రాజా = ఉదయించు చున్న రాజువలె సూర్యుడు, సర్వేషాం జ్యోతిషాం రాజా=సమస్త జ్యోతిస్సు లను, అవాహన్ అపహన్తి = దూరమొనర్చును.

(అథ మేఘనామ నిర్వచనమ్)

**మేఘనామాన్యుత్తరాణి త్రింశత్.**

మేఘా హ్యాహని రాత్రౌ చావిశేషేణ భవన్త్యతో రాత్ర్యహ ర్నామభ్యః ఉత్తరాణి మేఘనామాని. ముందు వర్ణింపబడు ముప్పదినామములు మేఘమునకు సంబంధించినవి.

**మేఘః కస్మాత్ ?**

మేహతీతిసతః = పదార్థములను తడుపునదగుటచే మేహతి మేఘ మనబడుచున్నది.

**అ, ఉపర, ఉపల ఇత్యేతాభ్యాం సాధారణాని పర్వత నామభిః.**

తేషాం మేఘనామ్నాం ఉపర, ఉపల ఇత్యేతాభ్యాం యాని నామాని తాని సాధారణాని పర్వతనామభిః. ఆమేఘనామములందు 'ఉపర - ఉపల' అను నామములపఅకుగల నామములు పర్వతనామభిః = పర్వత నామములతో సాధారణనామాని = సమానముగ నుండును. ఆనామము లన్నియు పర్వతమునకు మేఘమునకు, రెండింటికి వర్తించును.

**ఉపర ఉపలో మేఘో భవతి ఉపరమన్తేఽస్మి న్నభ్రాణి. ఉపరతా ఆప ఇతి వా.**

ఉపర ఇతి చ ఉపల ఇతి చ మేఘ ఉక్తో భవతి. ఉపరశబ్దాదారభ్య మేఘనామాన్యేవ న పర్వతనామాని.

ఉపగమ్య రమన్తే అస్మిన్ అభ్రాణి. అథవా ఉపగమ్య రతాః ఆపః భవన్తి, ఇతి ఉపరః ఉపలోఽప్యేతస్మాదేవ రలయో రవిశేషేణ.

ఉపర, ఉపలనామములు. అస్మిన్ = ఈమేఘమునందు, అభ్రాణి= మేఘముయొక్క పూర్వరూపములు, రమన్తే = రమించును, ర - ల - రెండకరములలో బేదములేనందున ఉపర, ఉపల శబ్దముల వ్యుత్పత్తి యొకటిగానే ఉండును. ఉపరతాఆపః ఇతి వా = జలము మేఘమునందు ఉపరతములు లేక రమించును అనుటలో భేదము లేదు.

**'జేషామేషా భవతి'**

తేషాం మేఘానామ్ ఉపరశబ్దవాచ్యత్వే విశేషలింగవాచితా ఏషా ఋగ్భవతి.

ఆ మేఘముల విషయమున ఈ ఋక్ = ఈ ఋక్కు ఉదాహరింపబడుచున్నది.

"దేవానాం మానే ప్రథమా అతిష్ఠన్. కృన్తత్రాదేషా ముపరా ఉదాయన్ త్రయస్తపన్తి పృథివీమనూపా ద్వా బృబూకం వహతః పురీమ్." (ఋ. ౧౦-౨౭-౨౩)

దేవానాం నిర్మాణే ప్రథమా అతిష్ఠన్మాధ్యమికా దేవగణాః ప్రథమ ఇతి ముఖ్యనామ. ప్రథమో భవతి. కృన్తత్రమన్తరిక్షమ్ వికర్తనం మేఘానామ్ వికర్తనేన మేఘానా ముదకం జాయతే. త్రయస్తపన్తి పృథివీ మనూపాః పర్జన్యో వాయురాదిత్యః శీతోష్ణవర్షై రోషధీః పాచయన్తి అనూపా అనువపన్తి లోకాన్ స్వేన స్వేన కర్మణా అయమపీతరో అనూపః ఏతస్మాదేవ. అనూవ్యత ఉదకేన. అపి వాన్వాబితి స్యాత్. యథా ప్రాగితి తస్యానూప ఇతి స్యాత్. యథా ప్రాచీన మితి. ద్వాబృబూకం వహతః పురీషమ్. వాయ్వాదిత్యా ఉదకమ్ బృబూక మిత్యుదకనామ. బ్రవీతే ర్వా శబ్దకర్మణో భ్రంశతేర్వా పురీషం పృణాతేః పూరయతేర్వా.

దేవానాం మాన ఇతి. వసుక్ర స్యేంద్రపుత్ర స్యాయ మార్షమ్. దేవానాం దానాదిగుణయుక్తానాం మానే నిర్మాణే. మాధ్యమికా దేవ గణాః ప్రథమాః ప్రకృష్టతమా ముఖ్యా ఇత్యర్థః అతిష్ఠన్ అవస్థితవన్తః. సృష్టా హి సర్వదేవానా మేత ఏవాగ్రే సృష్టా ఇత్యభిప్రాయః. కించ కృన్తత్రాత్ ఉత్కృన్తాత్ ఏషాం మేఘానా మింద్రేణ ఉపరాః ఆపః ఉదాయన్ ఆగతవత్యః ఆగచ్ఛన్తి చ కింకారణమ్? వికర్తనే నైవ హి మేఘానా ముదకం జాయతే. త్రయః పర్జన్యాదయః తపన్తి. పృథివీం పృథివీలోకమ్ అనూపాః

తే హ్యనువపన్తి లోకాన్ స్వేన స్వేన కర్మణా యథాకాల మనుగృహ్ణన్తి కించ ద్వౌ బృబూకం వహతః పురీషమ్ ద్వౌవాయ్వాదిత్యౌ వహతః ఆక్షిపతః ఇతః పృథివీలోకాత్ బృబూకముదకమ్ పురీషమ్ ప్రీణయితృ పూరయితృ వా. అయమపి ఇతరోఽనూపః సముద్రోనూపో వా. ఏతస్మాదేవ వపతే ర్ధాతోః. అసావపి హి అనూప్యతే అనుప్రకీర్యతే నిత్యకాలముదకేన అభి వా ఆప్నోతేః అన్వాప్యతేఽసౌ వుదకేనేతి అన్వాప్ తస్య అన్వాబిత్యేతస్య సతః అనూప ఇతి ఏష శబ్దః స్యాద్యథా ప్రాచీనమితి ప్రాగిత్యేవం సతః బ్రవీతేర్వా శబ్దార్థస్య శబ్దకారి హి తత్ భవతి. భ్రంశతేర్వా భ్రశ్యతి హి తస్మాద్భూమా దితి.

మంత్రార్థము :— మానే = సృష్టినిర్మాణసమయమున లేక దేవానాం నిర్మాణే = దేవతలనిర్మాణమున - ప్రజాపతి దేవతలను నిర్మింప ప్రారంభించినపుడు మాధ్యమిక దేవతలలో మేఘము, ప్రథమా అతిష్ఠత్ = ముఖ్యముగా నుండెను - మాధ్యమిక దేవతలను సూర్యుడు మేఘము మున్నగువానిని ప్రజాపతి ముందు సృష్టించెనని భావము. వర్షము లేకున్న జగత్తు స్థితి సంభవము కాదుగదా I ఏషామ్ = వీనియొక్క కృన్తత్రాత్ = కర్తనమువలన లేక అంతరిక్షమునుండి, ఉపరాః = జలము, ఉదాయన్ = ఏర్పడెను వచ్చెను. మేఘములను ఛిన్నాభిన్నముచేసినపుడు వర్షము ప్రారంభమయ్యెను. ఉపరశబ్దము మేఘవాచకము జలవాచకముకాదు. జలము మేఘములందు ఉండును. తాత్స్థ్యభావముతో 'మంచాః క్రోశన్తి' వలె ఉపరస్థములైన జలము ఉపరశబ్దముచే నిట గ్రహింపబడినది అనూపాః = అనుగ్రహించునవియైన, త్రయ = మూడు - వాయువు ఆదిత్యుడు పర్జన్యుడు అనుమూడును, పృథివీమ్ = పృథివియందుండు ఓషధులను, తపన్తి = పక్వముచేయును. వాయువు శీతతతోను, ఆదిత్యుడు ఉష్ణతతోను పర్జన్యుడు జలములతోను భూమిపైనుండు ఓషధులను వనస్పతులను పక్వముచేయును - వర్ధిల్లజేయును. ద్వౌ = వాయ్వాదిత్యులు, పురీషమ్= తృప్తినొనర్చు లేక నింపునట్టి, బృబూకమ్ = జలమును, వహతః = భూమి నుండి అంతరిక్షమునకు గొనిపోవును. లేక శుష్కింపజేయును. మాధ్యమికా దేవగణాః = మధ్యమలోకమగు నంతరిక్షమునందుండు దేవగణము అందు జలము, ప్రథమః ఇతి = ముఖ్యనామము మేఘము, అన్నింటికంటె

మనుష్యపు ప్రతమఃభవతి ఉత్కృష్టము అయియున్నది. కృంతత్రమ్ అంతరిక్షమ్ అంతరిక్షము కృన్తత్ర మనబడును. వికర్తనం మేఘానామ్ వికర్త లేక అంతరిక్షము మేఘములను కర్తనచేయును. ఛేదించును లేక అంతరిక్షమున మేఘముల ఛేదనభేదములు జరుగుచుండును. అందువలననే అంతరిక్షమును కృంతత్రమందురు. మేఘవికర్తనమువలన ఉదకం జాయతే = జలము వర్షించును, త్రయః తపన్తి పృథివీమనూపాః పర్జన్యా= వాయ్వాదిత్యులు శీతోష్ణజలములతో, ఓషధయః = ఓషధులను పక్వమొనర్చును. అందువలన నివి అనూపాః=అనూపములనబడును. అనూపాః అనువపన్తి, లోకాన్ స్వేనస్వేన కర్మణా = ఈవాయ్వాదులు తమకర్మలతో లోకములను అనుగ్రహించును. కావున నవి యనూపములనబడును ఆయు మపి ఇతరః అనూపః = ఇది మఱియొక అనూపము. జలప్రాయవాచక అనూపము. ఏతస్మాదేవ 'వప్'ధాతువువలననే యేర్పడును. ఇది జలప్రాయ దేశము ఉదకేన అనూప్యతే అనుప్రకీర్యతే = ఈ ప్రదేశము జలముతో తడపబడుచుండును. అథవా అన్వాప ఇతి స్యాత్ = ఏప్రదేశమునుండి జలము ఊరుచుండునో పైకివచ్చుచుండునో ఆప్రదేశము అన్వాపమన బడును. అన్వాపమే అనూపమైనది. ద్వా బృబూకం వహతః పురీషమ్ వాయ్వాదిత్యౌ = వాయువాదిత్యులు ఇరువురు ఉదకంవహతః = ఉదకమును తీసికొనిపోవును. పర్జన్యుడు ఉదకమును వర్షించును. వాయ్వాదిత్యులు భూమిపైనుండు జలములను రసములను గుప్తింపజేయును పైకిగొంపోవును ఇవి గుప్తింపజేయుచున్న అన్నమేపక్వముకాదు. బృబూకము జలవాచము బ్రవీతేః వా శబ్దకర్మణః = శబ్దార్థక 'బ్రూఞ్' ధాతువు వలన బృబూకశబ్దమేర్పడును. యా భ్రంశతే ర్వా అధఃపతనార్థక భ్రంశు ధాతువుతో బృబూకశబ్దమేర్పడును. జలము మేఘమునుండి క్రింద భూమిపైబడును. పురీషమ్ = పృణాతేర్వా, పురీషశబ్దము తర్పణార్థక ప్రీఞ్ధాతువుచే ఏర్పడును. లేక పూరయతేర్వా వృద్ధ్యర్థక పూరిధాతువుతో నేర్పడును. పూరయతి ప్రీణయతి = తృప్తునిజేయును. కావున జలము పురీషనామముచే చెప్పబడును. ఇట పురీషము జలమునకు విశేషణము.

ఇతి షష్ఠః పాదః

అష్టమపాదము సమాప్తము

# స ప్త మ పా ద ము

## (వాఙ్నామ నిర్వచనము)

**"వాఙ్నామాన్యుత్తరాణి సప్తపంచాశత్."**

మేఘేష్వేవ హి భూయసీ వాక్ భవతి. ఇతి తతోవాఙ్నామాని భవన్తి సప్త పంచాశత్ సప్త చ పంచాశచ్చ సప్త పంచాశత్.

ముందు ఏబదియేడు వాక్కునామములు వర్ణింపబడును.

**వాక్ కస్మాత్ ? వచేః.**

వాక్ కస్మాత్ ? వచేః ఉచ్యతేఽనయా ఇతి వాక్.

వచ్ ధాతువువలన వాక్కుశబ్దమేర్పడును. దేనితో మాట్లాడబడునో యది వాక్కు అనబడును అనగా వాణి.

**తత్ర సరస్వతీ ఇత్యేతస్య నదీవత్ దేవతావచ్చ నిగమా భవన్తి.**

తత్ర తస్మిన్ సప్తపంచాశత్కే వాఙ్నామగణే సరస్వతీత్యేతస్య నామ్నః నదీవత్ దేవతావచ్చ నిగమా భవన్తి. నద్యర్థయుక్తాశ్చ దేవతార్థయుక్తాశ్చేత్యర్థః.

ఆ వాక్వాచకములందు సరస్వతి ఇత్యేతస్య = సరస్వతి అను శబ్దముయొక్క దేవతావత్ = దేవతార్థముతో నదీవచ్చ = నద్యర్థముతోను గూడిన నిగమాభవన్తి = నిగమార్థమంత్రములు ఉన్నవి.

**తద్యద్ దేవతావదుపరిష్టాత్తద్ వ్యాఖ్యాస్యామః.**

తత్ తత్రైవం సతి యదభిధానం దేవతావత్ తద్ అధికృత్య ఉపరిష్టాత్ వ్యాఖ్యాస్యామః షోడశేఽధ్యాయే 'పావకానః సరస్వతీ' ఇత్యేతస్మిన్ మంత్రే.

తత్ తత్రైవం సతి = అక్కడ ఈస్థితిలో యత్దేవతావ్రత్ = దేవతార్థయుక్తసరస్వతీశబ్దముయొక్క ఉపరిష్టాత్వ్యాఖ్యాస్యామః=ముందు వ్యాఖ్యానించెదము.

ముఖ్యము ప్రశమః భవతి ఉత్కృష్టము అయియున్నది. కృంతత్రమే అంతరిక్షమ్ అంతరిక్షము కృంతత్ర మనబడును. వికర్తనం మేఘానామ్ వికర్త నేన అంతరిక్షము మేఘములను కర్తనచేయును. ఛేదించును లేక అంతరిక్షమున మేఘముల ఛేదనభేదములు జరుగుచుండును. అందువలననే అంతరిక్షమును కృంతత్రమందురు. మేఘవికర్తనమువలన ఉదకం జాయతే = జలము వర్షించును, త్రయః తపన్తి పృథివీమనూపాః పర్జన్యా= వాయ్వాదిత్యులు శీతోష్ణజలములతో, ఓషధయః = ఓషధులను పక్వమొనర్చును. అందువలన నివి అనూపాః=అనూపములనబడును. అనూపాః అనువపన్తి, లోకాన్ స్వేనస్వేన కర్మణా = ఈవాయ్వాదులు తమకర్మలతో లోకములను అనుగ్రహించును. కావున నవి యనూపములనబడును అయమపి ఇతరః అనూపః = ఇది మఱియొక అనూపము. జలప్రాయవాచక అనూపము. ఏతస్మాదేవ 'వప్'ధాతువువలననే యేర్పడును. ఇది జలప్రాయ దేశము ఉదకేన అనూప్యతే అనుప్రకీర్యతే = ఈ ప్రదేశము జలముతో తడపబడుచుండును. అథవా అన్వాప ఇతి స్యాత్ = ఏప్రదేశమునుండి జలము ఊరుచుండునో పైకివచ్చుచుండునో ఆప్రదేశము అన్వాపమనబడును. అన్వాపమే అనూపమైనది. ద్వా బృబూకం వహతః పురీషమ్ వాయ్వాదిత్యౌ = వాయువాదిత్యులు ఇరువురు ఉదకంవహతః = ఉదకమును తీసికొనిపోవును. పర్జన్యుడు ఉదకమును వర్షించును. వాయ్వాదిత్యులు భూమిపైనుండు జలములను రసములను శుష్కింపజేయును పైకిగొంపోవును ఇవి శుష్కింపజేయుచున్న అన్నమేపక్వముకాదు. బృబూకము జలవాచము బ్రవీతేః వా శబ్దకర్మణః = శబ్దార్థక 'బ్రూఞ్' ధాతువు వలన బృబూకశబ్దమేర్పడును. యా భ్రంశతే ర్వా అధఃపతనార్థక భ్రంశు ధాతువుతో బృబూకశబ్దమేర్పడును. జలము మేఘమునుండి క్రింద భూమిపైబడును. పురీషమ్ = పృణాతేర్వా, పురీషశబ్దము తర్పణార్థక ప్రీఞ్ ధాతువుచే ఏర్పడును. లేక పూరయతేర్వా వృద్ధ్యర్థక పూరీధాతువుతో నేర్పడును. పూరయతి ప్రీణయతి = తృప్తినిజేయును. కావున జలము పురీషనామముచే చెప్పబడును. ఇట పురీషము జలమునకు విశేషణము.

ఇతి షష్ఠః పాదః

ఆఱవపాదము సమాప్తము

# స ప్త మ పా ద ము

(వాఙ్నామ నిర్వచనము)

**"వాఙ్నామాన్యుత్తరాణి సప్తపంచాశత్."**

మేఘేష్వేవ హి భూయసీ వాక్ భవతి. ఇతి తతోవాక్నామాని భవన్తి సప్త పంచాశత్ సప్త చ పంచాశచ్చ సప్త పంచాశత్.

ముందు ఏబదియేడు వాక్కునామములు వర్ణింపబడును.

**వాక్ కస్మాత్ ? వచేః.**

వాక్ కస్మాత్ ? వచేః ఉచ్యతేఽనయా ఇతి వాక్.

వచ్ ధాతువువలన వాక్కుశబ్దమేర్పడును. దేనితో మాట్లాడబడునో యది వాక్కు అనబడును అనగా వాణి.

**తత్ర సరస్వతీ ఇత్యేతస్య నదీవత్ దేవతావచ్చ నిగమా భవన్తి.**

తత్ర తస్మిన్ సప్తపంచాశత్కే వాఙ్నామగణే సరస్వతీత్యేతస్య నామ్నః నదీవత్ దేవతావచ్చ నిగమా భవన్తి. నద్యర్థయుక్తాశ్చ దేవతార్థ యుక్తాశ్చేత్యర్థః.

ఆ వాక్వాచకములందు సరస్వతీ ఇత్యేతస్య = సరస్వతీ అను శబ్దముయొక్క దేవతావత్ = దేవతార్థముతో నదీవచ్చ = నద్యర్థముతోను గూడిన నిగమాభవన్తి = నిగమార్థమంత్రములు ఉన్నవి.

**తద్యద్ దేవతావదుపరిష్టా త్తద్ వ్యాఖ్యాస్యామః.**

తత్ తత్రైవం సతి యదభిధానం దేవతావత్ తద్ అధికృత్య ఉపరిష్టాత్ వ్యాఖ్యాస్యామః షోడశేఽధ్యాయే 'పావకానః సరస్వతీ' ఇత్యేతస్మిన్ మంత్రే.

తత్ తత్రైవం సతి = అక్కడ ఉన్స్థితిలో యత్దేవతావత్ = దేవతార్థ యుక్తసరస్వతీశబ్దముయొక్క ఉపరిష్టాత్వ్యాఖ్యాస్యామః=ముందు వ్యాఖ్యానించెదము.

అథైత న్నదీవత్.

అథ పునః యత్ ఏతత్ నదీవత్ తత్ వ్యాఖ్యాయతే.

ఇప్పుడు నదీవత్ = నద్యర్థయుక్తమంత్రము వ్యాఖ్యానింపబడు చున్నది.

ఇయం శుష్మేభి ర్బిసఖా ఇవారుజత్సానుగిరీణాం తవిషేభి రూర్మిభిః పారావతఘ్నీ మవసే సువృక్తిభిః సరస్వతీ మా వివాసేమ ధీతిభిః. (ఋ. ౬-౬౧-౨)

ఇయం శుష్మైః శోషణైః శుష్మమితి బలనామ. శోషయతీతి సతః. బిసం బిస్యతే ర్భేదనాకర్మణః వృద్ధికర్మణో వా సాను సముచ్ఛ్రితం భవతి సమున్నున్నమితి వా. మహద్భి రూర్మిభిః పారావతఘ్నీం పారావారఘాతినీమ్ పారంపరం భవతి. అవార మవరమ్ అవనాయ సుప్రవృత్తాభిః శోభనాభిః స్తుతిభిః సరస్వతీం నదీం కర్మభిః పరిచరేమ.

ఇయం శుష్మేభిరితి. భారద్వాజస్యార్షమ్ జగతీచ్ఛన్దః. ఇయం సరస్వతీ నదీ శుష్మేభిః బలైః బిసఖా ఇవారుజత యథా బిసఖానకో బిసమ నాదరేణైవ మృదుత్వాత్ ఖనతి. ఏవమియ మనాదరేణైవ గిరీణాం సాను శిఖరం తవిషేభిః మహద్భిః రుజతి భనక్తీత్యర్థః, తామేతాం వయమ్ పారావతఘ్నీమ్ పారావారఘాతినీం సా హి ఊర్మిభిః పారం చావారం చ ఉభేఽపి హన్తి. అవసే అవనాయ రక్షణాయ ఆత్మనః. సువృక్తిభిః సుప్రవృత్తాభిః స్తుతిభిః సరస్వతీమ్ ఆవివాసేమ పరిచరేమ. ధీతిభిః కర్మభిః స్తుతిభి శ్చానేక ప్రకారాభిశ్చేత్యర్థః. బిసం బిస్యతేర్భేదనకర్మణః తద్ధి భిద్యతే వృద్ధికర్మణో వా వర్ధతే హి తత్. పారంపరం భవతి. అపరస్మాత్ కూలాత్ అవరమ్ అవరం భవతి పరస్మాత్ కూలాత్.

మంత్రార్థము :— ఇయం = ఈసరస్వతీనది, శుష్మేభిః = బలమైన, తవిషేభిః ఊర్మిభిః = పెద్దతరంగములతో, గిరీణామ్=పర్వతములయొక్క, సాను = శిఖరములను, బిసఖా ఇవ=తామరతూడులను త్రవ్వు మనుజుని వలె, అరుజత్ = ఖండించును, అవసే = తనరక్షణకొఱకు, సువృక్తిభిః =

ఉత్తమస్తుతులతో, ధీతిభిః = కర్మలతోను, పారావతఘ్నీమ్ సరస్వతీమ్ = పారావార - రెండుతీరములను నాశనముచేయు సరస్వతిని, ఆవివాసేమ = సేవింతుముగాక - స్తుతింతుముగాక!

ఇయం = ఈసరస్వతీనది, శుష్మేభిః శోషణైః=బలముకలిగి శుష్కింపచేయు తరంగములతో, శోషయతి=శుష్కింపచేయును, బిసం బిస్యతేః భేదనకర్మణః వృద్ధికర్మణః = బిస, భేదనార్థకము వృద్ధ్యర్థకమునగు బిసధాతువుతో బిసశబ్దమేర్పడును. ఏలయన - బిసః = తామరతూడు సులభముగా విఱుగును. మఱియు నిది దీనిని భక్షించువారికి బలమును వృద్ధిచేయును, సాను సముచ్ఛ్రితం భవతి = సానువు అనగా శిఖరము - చరియసానువులు పైకి పెరుగును, సమున్నున్నం ఇతి వా = బాగుగ పైకి ప్రేరితమగును, మహద్భిః ఊర్మిభిః = పెద్దతరంగములతో, పారావతఘ్నీమ్ పారావారఘాతినీమ్ పారంపరంభవతి అవారంఅపరమ్ పారావార = ఇరు వైపులనుండు తీరములను హననముచేయు పడగొట్టునట్టి నదియగును, పారము = నదియొక్క ఆవతలితీరము, అపరము = ఇవతలితీరము.

(ఉదకనామ నిర్వచనము)

**ఉదకనామా న్యుత్తరా ణ్యేకశతమ్.**

మేఘాశ్రయా హి వాక్ మేఘోత్థం చోదకమ్. స్తనయిత్ను శబ్దపూర్వకం చేతి వాఙ్నామభ్య ఉత్తరాణ్యుదక నామాని.

ఒక నూఱు జలనామములు.

**ఉదకం కస్మాత్ ? ఉనత్తీతినతః.**

ఉదకం కస్మాత్? ఉనత్తీతి సతః తద్ధి యత్ర గచ్ఛతి తత్ర ఉనత్తి క్లేదయతి. ఉన్దీక్లేదనే=క్లేదనార్థక ఉన్దీ'ధాతువుతో ఉదకశబ్దము సిద్ధించును. ఉనత్తి = తడుపును అందువలన ఉదకమనబడుచున్నది.

(నదీనామ నిర్వచనము)

**నదీనామా న్యుత్తరాణి సప్తత్రింశత్.**

ప్రకృతేభ్య ఉదకనామభ్య ఉత్తరాణి నదీనామాని సప్త చ త్రింశచ్చ.

ఇక ముందు ముప్పదియేడు నదీనామములు.

నద్యః కస్మాత్ ?

నదనా ఇమా భవన్తి. శబ్దవత్యః, నద్యః కస్మాత్ ఉచ్యతే-నదనా హ్యేతా భవన్తి శబ్దవత్యః శబ్దసంయుక్తాః.

నదియనుపేరేల ? ఇమా నదనా భవన్తి = శబ్దముకలవి యగును. అందువలన నదులనబడును.

బహులమాసాం నైఘంటుకం వృత్తమ్ ఆశ్చర్యమివ ప్రాధాన్యేన. తత్రేతిహాసమాచక్షతే - విశ్వామిత్ర ఋషిః సుదాసః పైజవనస్య పురోహితో బభూవ. విశ్వామిత్రః సర్వమిత్రః సర్వం సంసృతమ్. సుదాః కల్యాణదానః. పైజవనః పిజవనస్య పుత్రః. పిజవనః పునః స్పర్ధనీయజవో వాఽమిశ్రీభావగతి ర్వా. స విత్తం గృహీత్వా విపాట్ చ్ఛుతుద్ర్యోః సంభేద మాయయౌ. అనుయయు రితరే. స విశ్వామిత్రో నదీ స్తుష్టావ గాధా భవత ఇతి. అపి ద్వివదపి బహువత్. తద్ యద్ ద్వివదుపరిష్టా త్తద్ వ్యాఖ్యాస్యామః.

కించ బహులం ఆసాం నదీనామ్ అన్యదేవతేషు మంత్రేషు నైఘంటుకం వృత్తం అప్రధానమ్ ఆశ్చర్యమివ ప్రాధాన్యేన. క్వచిదేవ నదీ దేవతో మంత్రః స్యాత్. తస్మిన్ సూక్తే ప్రధానా నద్య ఏవ. తత్రేమం నిదానభూత మితిహాస మాచక్షత ఇతి ఆచార్యాః. సంసృతం మవతి సంగతమ్ భవత్యేకస్మిన్. సుదాః కల్యాణదానః తస్య హి నిత్యమేవ ప్రశస్తం దానం భవతి. స్పర్ధనీయజవః తస్య హి స్పర్ధార్హో జవో వేగః. విపాట్ ఛుతుద్ర్యోః నద్యోః సంభేదం సంగమమ్ ఆయయౌ ఆగతవాన్. అనుయయుః ఇతరే తదను యాయిన స్తస్కరా వా. స విశ్వామిత్రః తాస్తితీర్షుః నదీః తుష్టావ గాధాః స్వల్పోదకా యూయం భవతేతి. అపి ద్వివత్ ద్వివచన సంయుక్తైర్ మంత్రైః. అపి బహువత్ బహువచన సంయుక్తైః మంత్రైః. తదుపరిష్టాత్ చతుర్దశాధ్యాయే వ్యాఖ్యాస్యామః.

అర్థము :— అసామ్=ఈనదులయొక్క వేదములందు, నైఘంటుకం వృత్తమ్ = గౌణరూపమున వర్ణనము అన్యదేవతాకమంత్రములందు, బహులమ్ = అధికముగానున్నది. కాని ప్రాధాన్యేన ముఖ్యముగా అల్పర్య మివ = అల్పత్వమువలెనున్నది - మిక్కిలి తక్కువగా నున్నది. గౌణ రూపమున నెక్కువగానేయున్నది. తత్ర = అనదులవిషయమున, ఇమమ్ ఇతిహాసమ్ ఆచక్షతే=ఇతిహాసమును చెప్పుచున్నాము. విశ్వామిత్రఋషిః= విశ్వామిత్రుడనుపేరుగల ఋషి, పైజవనస్యసుదాసః = పిజవనపుత్రుడు సుదాసుడను రాజునకు పురోహితః=పురోహితుడయ్యెను, విశ్వామిత్రః=సర్వ మిత్రుడు,సర్వంసంసృతమ్ = సర్వశబ్దమునకర్థము, సంసృత=అంతటవెళ్లి యున్న, సర్వశబ్దము 'సృగతౌ' ధాతువుతో నేర్పడును. పైజవనః=పిజవనస్య పుత్రః = పిజవనుని పుత్రుడు, అతడు, స్పర్ధనీయజవః = స్పర్ధకలుగుటకు దగిన వేగముకలవాడు, అమిశ్రీభావగతిర్వా = మిక్కిలివేగవంతుడు నిత్య కర్తవ్యపరాయణుడు అనియర్థము, స విత్తం గృహీత్వా = అతడు ధనము తీసికొని, విపాట్ఛుతుద్ర్యోః = విపాట్ఛుతుద్రీనామక రెండునదులయొక్క, సంభేదమ్ ఆయయౌ = సంగమమునకు వచ్చెను, ఇతరే అనుయయుః = ఇతరులతని ననుసరించిరి. అంతట స విశ్వామిత్రః=విశ్వామిత్రుడు, నదీః తుష్టావ = నదులను స్తుతియించెను. 'గాధాః భవత 'ఇతి' = ఓనదులారా! మీరు లోతులేనివిగా అగుదురుగాక! అపి ద్వివత్ అపి బహువత్ = అనదులు వర్ణనము ద్వివచన మంత్రములతోను బహువచనమంత్రముల తోను చేయబడినది, అందు ద్వివచనమంత్రవ్యాఖ్య తద్ ఉపరిష్టాత్ వ్యాఖ్యాస్యామః = ముందుచేయుదుము.

అథైతద్ బహువత్.

అథ పునః ఏతత్ బహువత్ వ్యాఖ్యాయతే.

బహువచన ఉదాహరణము.

"రమధ్వం మే వచసే సోమ్యాయ ఋతావరీ రుపముహూర్త మేవైః, ప్రసింధుమచ్ఛా బృహతీ మనీషావస్యుర హ్వే కుశి కస్య సూనుః." (ఋ. 3-33-5)

ఉపరమధ్వం మే వచసే సోమ్యాయ సోమసంపాదినే. ఋతా వరీర్ ఋతవత్యః. ఋతమిత్యుదకనామ ప్రత్యృతం భవతి. 'ముహూర్తమేవైః' అయనై రవనైర్వా. ముహూర్తో ముహుర్ ఋతుః. ఋతు ర్తేర్గతికర్మణః ముహు ర్మూఢ ఇవ కాలో యావదభీక్ష్ణం చేతి. అభీక్ష్ణ మభిక్షణమ్ భవతి. క్షణః క్షణోతేః ప్రక్ష్ణుతః కాలః కాలయతే ర్గతి కర్మణః. ప్రాభిహ్వాయామి సింధుం బృహత్యా మహత్యా మనీషయా మనన ఈషయా స్తుత్యా ప్రజ్ఞయా వా అవనాయ. కుశికస్య సూనుః కుశికో రాజా బభూవ. క్రోశతేః శబ్దకర్మణః క్రంశతే ర్వా స్యాత్ ప్రకాశయతి కర్మణః. సాధు విక్రోశయితార్థానా మితి వా.

రమధ్వం మే వచస ఇతి, త్రిష్టుభ ఏతాః. ఉపరమధ్వం మే సోమ్యాయ సోమసంపాదినే వచసే. హేఋతావరీః ఉదకవత్యః ముహూర్తమ్? యావదుత్తరేయ మహం తావదేవేత్యభిప్రాయః. (అహ్వే) (ప్రతిఅభి హ్వయామి) సింధుం బృహతీ మనీషా బృహత్యా మనీషయా మనఃపూర్వికయా (స్తుత్యా)వా ప్రజ్ఞయా అవన్యః అవనమిచ్ఛన్ గమనమిత్యర్థః. కుశికస్య సూనుః అహమితి. పితురపి గౌరవా న్మమ గౌరవమేతాః కుర్యుః ఇతి సమస్తార్థః. ఋత మిత్యుదకనామ- తద్ధి దేశం దేశం ప్రత్యృతం భవతి గతమిత్యర్థః. ఋతుర్తేః గతికర్మణః, గత్యర్థే వర్తమానస్య స హి గచ్ఛత్యేవ. ముహుర్మూఢ ఇవ కాలః అల్పత్వాత్. మూఢ ఇవ యః కాలః ఋతుః స ముహూర్త ఇత్యుచ్యతే. ప్రక్ష్ణుతః ప్రకర్షేణ హింసితః అల్పత్వాత్. కాలః కాలయతే ర్గతికర్మణః స హి సర్వాణ్యేవ భూతాని కాలయతి క్షయం నయతీత్యర్థః. క్రోశతేః శబ్దార్థస్య స హి సాధ్వేవ క్రియంతా మితి నిత్యకాలమేవ క్రోశతి. సాధు విక్రోశయితార్థానా మితి సాధుషు బ్రాహ్మణేషు విక్రోశయితా అర్థానాం దాతేత్యర్థః,

మంత్రార్థము :— ఋతావరీః = ఎక్కువ బలముకలిగినట్టి నదులారా!, ముహూర్తమ్ = కొంతతడవు, మే=నాయొక్క, సోమ్యాయవచసే = శాంతియుక్త వచనార్థము, ఏవైః ఏభిః = ఈజలములతో, ఉపరమధ్వమ్ =

ఉపశమింపుడు, ఏవైః - అవనైః - అయనైః = నారకిణకొఱకు-నాగమనము కొఱకు - అని యర్థము చెప్పి 'మీప్రవాహము నాపుడు - నేను మిమ్ము దాటిపోవలయును' అని యర్థముచేయబడినది, కుశికస్య = నేను కుశికుని, సూనుః=పుత్రుడను విశ్వామిత్రుడను, అవస్యుః బృహతీమనీషా=మిమ్ము దాటి వెళ్లవలయునను మిక్కిలికోరికతో, సింధుమ్ = నదిని, ప్రఅచ్ఛా అహ్వే ప్రాభిహ్వయామి = అధికముగా వేడుకొనుచున్నాను, ఇట 'అచ్ఛ' అనుపదము 'అభి'స్థానమున ప్రయోగింపబడినది, సోమ్యాయ సోమ సంపాదినే = ఇట సోమ్యపదము, కాంతిని సంపాదించు, ఋతావరీర్ ఋతవత్యః = జలముకలది యనునర్థమున వాడబడినది, ఋతమ్ ఇతి జలనామ = ఋతపదము జలవాచకము, ప్రత్యృతమ్ భవతి = అంతట వ్యాపించినది - అంతటలభించునది, ఏవైః = అవనైః అయనైః=ఏవపదమున కర్థము రక్షణము లేక గమనము, ఈపదము, 'అవ' లేక 'ఇణ్' దాతువుతో నేర్పడినది. ముహూర్తః - ముహుర్ఋతుః = మిక్కిలి కొంచెముకాలము ఋతుః ఆర్తేః గతికర్మణః=గత్యర్థక 'ఋ'ధాతువుచే ఋతుశబ్దమేర్పడును. ఋతుశబ్దమున కర్థము కాలము, ముహుః మూఢః ఇవ కాలః = ముహుః అన - మూఢునివంటిది, సమయము బొత్తిగా అర్థముకానిది మిక్కిలి కొంచెము అని భావము. యావదభీక్ష్ణమ్ చ = అత్యల్పము ముహూర్తము, అభీక్ష్ణము రెండును సమానార్థకములని తాత్పర్యము. అభీక్ష్ణమ్ అభిక్షణమ్. భవతి = క్షణమాత్రమును అభీక్ష్ణమందురు, క్షణః క్షణోతేః క్షణశబ్దము హింసార్థక క్షణుధాతువుతో నేర్పడును. ప్రక్ష్ణుతఃకాలః = అనగా మిక్కిలి కొంచెము సమయము. కాలః కాలయతేః గతికర్మణః = గత్యర్థక కాల ధాతువుతో కాలశబ్దమేర్పడును. కాలము ప్రాణులన్నింటిని నశింపచేయు నది. కుశికః క్రోశతేః శబ్దకర్మణః=శబ్దార్థకమగు క్రుశధాతువువలన కుశిక శబ్ద మేర్పడుచున్నది. కుశికుడు అనగా మంచికార్యము చేయువాడని యెల్లపుడు నుఱచుచుండువాడని యర్థము. విద్వాన్ = ఉపదేష్ట క్రంశతేః వా స్యాత్ ప్రకాశయతి కర్మణః = ప్రకాశితముచేయుట అనునర్థముగల 'క్రంశ్'ధాతువుతో కుశికశబ్ద మేర్పడును. ఉత్తమధర్మములను ప్రకటించు వాడు కుశికుడు అనబడును. వా అర్థానాం సాధు విక్రోశయితా = ధనము లను మిక్కిలి దానముచేయువాడనియు నర్థము చేసికొనవచ్చును.

నద్యః ప్రత్యూచుః.

ఏవ ముక్తవంతమ్ నద్యః ప్రత్యూచుః = అప్పుడాకుశికునకు నదులు చెప్పిన సమాధానము.

"ఇంద్రో అస్మాఀ అరదద్ వజ్రబాహురపాహన్ వృత్రం పరిధిం నదీనామ్ - దేవోఽనయత్ సవితా సుపాణి స్తస్య వయం ప్రసవేయామ ఉర్వీః." (ఋ. 3-33-౬)

'ఇంద్రో అస్మాన్ అరదద్ వజ్రబాహుః' రదతిః ఖనతి కర్మా. అపాహన్ వృత్రం పరిధిం నదీనామ్-ఇతి వ్యాఖ్యా తమ్. 'దేవో అనయత్ సవితా సుపాణిః' కల్యాణపాణిః పాణిః పణాయతేః పూజాకర్మణః ప్రగృహ్యపాణీ దేవాన్ పూజయన్తి 'తస్య వయం ప్రసవే యామ ఉర్వీః. ఉర్వ్య ఊర్ణోతే రిత్యౌర్ణవాభః'.

ఇంద్రో అస్మాన్ అరదత అఖనదిత్యర్థః అపాహన్ వృత్రమ్. అపావధీత్ మేఘమ్. పరిధిం నదీనామ్. ఏవం చ కృత్వా స ఏవ ఇంద్రః దేవః సవితా సర్వార్థప్రసవితా వర్షద్వారేణ అస్మాన్ అనయత్ సముద్రమ్ సుపాణిః ప్రశస్తపాణి రిత్యర్థః. యత ఏవ సోఽస్మాకం ఖనితా నేతా చ అతః తస్య ఇంద్రస్య సవే అనుజ్ఞాయామాదేశే వర్తమానా వయం యామః గచ్ఛామః.

అర్థము :- వజ్రబాహుః = చేతియందు వజ్రముధరించియున్న, ఇంద్రః = ఇంద్రుడు, అస్మాన్ అరదత్ = మమ్ములను త్రవ్వి నిర్మించి యున్నాడు వినుడు - నదీనాం పరిధిం=నదులను ధారణచేయు, వృత్రమ్= మేఘమును, అపాహన్ = హతమొనర్చెను. మేఘమును ఛేదించుటవలన జలము వర్షించి నదులేర్పడినవి అని యర్థము. సుహస్తః సవితా = మంచి హస్తములు గలిగి యెల్లర నుత్పన్నముచేయు, దేవః ఇంద్రః అనయత్ = ఇంద్రదేవత మమ్ము సముద్రమువఱకు చేర్చెను, తస్య ప్రసవే = అతని యాజ్ఞయందే, ఉర్వీః - ఉర్వ్యః = వ్యాపించి, యామః = మేమువెళ్లు చున్నాము. రదతిః = ఖనతికర్మా - త్రవ్వుట అనుఅర్థముగల 'రద' ధాతు

వృతో అరపత్ పదమేర్పడును. సుహస్తః కల్యాణపాణః=మంచిహస్తములు కలవాడు, పాణః - పణాయతేః పూజాకర్మణః = పూజించు అర్థముగల 'పణ'ధాతువుతో పాణిశబ్ద మేర్పడును. పాణీప్రగృహ్య = చేతుల నొకచో చేర్చి చేతులను జోడించి పూజచేయుచును, ఊర్వ్యః - ఊర్ణోతేః = ఆచ్ఛాద నార్థక 'ఊర్ణుఞ్'ధాతువుచే ఊర్వీశబ్దమేర్పడును, వృణోతేర్వా - లేక, ఆచ్ఛాదనార్థక 'వృఞ్'ధాతువువలన ఊర్వీశబ్దమేర్పడును - అని ఔర్ణవాభః= నిరుక్తకారులలో నొకడగు ఔర్ణవాభఆచార్యుడు చెప్పుచున్నాడు, ఊర్వీః = ఆయాదేశములను సేవించుచు మేము మాస్వామియగు ఇంద్రదేవుని ఆజ్ఞ వలన వెళ్లుచున్నాము. ఆతడే మమ్మాజ్ఞాపింపగలడు. నీవుకాదు. నీమాటలి సంగీకరింపజాలము. అని నదులు ప్రత్యుత్తరమిచ్చెను.

"ప్రత్యాఖ్యాయాన్తత ఆశుశ్రువు."

ప్రత్యాఖ్యాయ ఏవం తమృషిమ్ అన్తే అనద్యూర్చా. ఆశుశ్రువు స్తో నద్యః శ్రుతవత్య ఇత్యర్థః.

అర్థము :— నదులీవిధముగ మొదట సమాధానము చెప్పి చివరకా ఋషిప్రార్థన సంగీకరించినవి.

"ఆ తే కారో శృణు వా మా వచాంసి యయాథ దూరా దనసా రథేన. నితే నంసై పీప్యానేవ యోషా మర్యాయేవ కన్యా శశ్వచైతే." (ఋ. 3-33-౧)

ఆ శృణువామ తే కారో వచనాని యాహి దూరాదనసా చ రథేన చ నినయామ - తే పాయయమానేవ యోషా పుత్రం మర్యాయేవ కన్యా పరిష్వజనాయ నినమా ఇతి వా.

ఆతేకారో ఇతి, శృణువామ హేకారో! స్తోమానాం కర్తః వచాంసి - యయాథ యాహి త్వమ్ అనసా శకటేన సహ రథేన చ యస్మాద్దూరాత్ ఆయాతః త్వమ్ పరిక్రాంతః తస్మాత్ కారుణ్యం న స్త్వయి తేన వయ మేతాః, ని తే నంసై. నినమామ తే. నీచై ర్నమామ గాధోదకాః భవామేత్యర్థః కథం పునర్నినమా? పీప్యానేవ యోషా, పాయయమానేవ యోషా పుత్రం యథా నినమే దేవం వయం తవ నినమామ. ఏవ ముక్త్వా పుత్రోప

మయా కదాచి దయం క్రోధమియాదితి మన్వానాః సత్యః పతికన్యా - సంబద్ధామన్యాముపమాముపాదదిరే. మర్యాయేవ కన్యా శశ్వచైతే మర్యాయ మనుష్యాయ కన్యా నవోఢా శశ్వచైతే పరిష్వజనాయ కథంనామ పరిష్వజేత మామయ మిత్యభిప్రాయేణ యథా సా నినమేదేవం వయం తవ నినమామ.

మంత్రార్థము :— కారో! స్తోమరచయితా, తే వచాంసి=నీవచనము లను, ఆశృణవామ = మేము అంగీకరించుచున్నాము. నీవు, దూరాత్ ఆగతః = దూరమునుండి వచ్చియున్నావు - అలసియున్నావు, అనసా - రథేన = ఈశకటముతో, యయాథ = వెళ్లుము, పీప్యానా యోషా ఇవ. పిల్లలకు పాలిచ్చు స్త్రీవలె, తే నినంసై = మేము నీకు నమ్రులమగు చున్నాము, స్త్రీ తనవక్షస్థలమును వంచి తనబిడ్డకు పాలిచ్చునట్లు మేము తక్కువనీతితో లోతులేనివార మగుచున్నాము. మర్యాయ = పురుషుని కొఱకు, కన్యా ఇవ = నవోఢా కన్యవలె, శశ్వచైతే = పరిష్వంగముకొఱకు నమ్రయగు విధమున కారో! స్తోమకర్తా తే వచనాని = నీవచనములను, ఆశృణవామ = మేమంగీకరించుచున్నాము. దూరాత్ = నీవుదూరమునుండి వచ్చి యలసియున్నావు. అందువలన మేము నిన్నంగీకరించుచున్నాము, అనసారథేనయాహి = బండితోవెళ్లుము. పుత్రం పాయయమానా యోషా ఇవ = బిడ్డకు పాలిచ్చుతల్లివలె, తే నినమామ = నీకు నమ్రులమగుదుము, కన్యానవోఢాపరిష్వజనాయ - నూతనవధువు ఆలింగనముకొఱకు మర్యాయ ఇవ = మనుష్యునికొఱకు వంగునట్లు మేమును, నినమే = నమ్రులమగు దుము. నినంసై - నినమామ = నినమై - ఇది విపరిణామములు మాత్రమే.

(అథ అశ్వనామ నిర్వచనమ్)

**అశ్వనామా న్యుత్తరాణి షడ్వింశతిః.**

అప్సు జాతా అశ్వాః తస్మా న్నదీనామభ్యః ఉత్తరా ణ్యశ్వనామాని షడ్వింశతిః షడధికా వింశతిః. అశ్వనామములు ఇరువదియాఱు. జలముల నుండి అశ్వము లుత్పన్నములైనవి.

**తేషా మష్టా ఉత్తరాణి బహువత్.**

తేషా మశ్వనామ్నామ్ అష్టౌ యాని ఉత్తరాణి తాని బహువత్ బహు వచన సంయుక్తానీత్యర్థః.

అయిదువదియాఱు నామములలో చివరి యెనిమిదినామములు బహువచనయుక్తములు.

**అశ్వః కస్మాత్? అశ్నుతేఽధ్వానమ్ మహాశనో భవతీతి వా.**

అశ్నుతే అధ్వానమ్ వ్యాప్నోతీత్యర్థః. మహాశనో వా భవతి స హి బహు భుఙ్క్తే.

అర్థము :- అశ్వః కస్మాత్ = అశ్వమనునామమేల కలిగినది? అశ్నుతే అధ్వానమ్ = అది మార్గమున వ్యాపించును కావున అశ్వమన బడుచున్నది - అతివేగముగా పరుగెత్తును. వా మహాశనో భవతి = లేక ఎక్కువగా భుజించునది. మొదటి వ్యుత్పత్తియందు 'అశూఙ్ వ్యాప్తౌ' ధాతువుతోను, రెండవవ్యుత్పత్తియందు 'అశ భోజనే' అను ధాతువుతోను అశ్వశబ్ద మేర్పడును.

**తత్ర దధిక్రా ఇత్యేతద్ దధత్ క్రామతీతి వా, దధత్ క్రందతీతి వా. దధదాకారీ భవతీతి వా.**

తత్ర తస్మిన్ షడ్వింశకే అశ్వాభిధానగణే దధిక్రా ఇత్యేతత్ పదం సందిగ్ధమ్. దధత్ క్రామతీతి ధారయ న్నయ మశ్వారోహమ్ క్రామతీతి దధిక్రాః అథవా దధత్ ధారయ న్నయ మశ్వారోహ మాక్రందతి శబ్దం కరోతి ఇతి దధిక్రాః అథవా దధత్ ధారయ న్నయ మశ్వారోహ మాకారీ ఆకారవాన్ భవతీతి దధిక్రాః - స హి అధిరూఢే అశ్వారోహే కుంచిత గ్రీవో విప్రసృత సర్వగాత్ర ఆకృతిమాన్ భవతి.

అర్థము :- తత్ర = ఆనామములందు, దధిక్రాః = అను నామము క్రిందివిధముల వ్యుత్పన్నమై యుండవచ్చును. దధత్=భారము వహించిన వెంటనే రౌతు తనపై కూర్చుండుటయే తడవుగా, క్రామతి = బయలు దేరును, వా = లేక, ధారణచేయుచు, దధత్ క్రందతి = అఱచును - సకిలించును, అథవా = లేక, దధత్ = భారమువహించుచు, అకారీ = ఆకారముగలదియగును. అశ్వముమీద రౌతు ఆరూఢుడైనపుడు అశ్వము యొక్క యాకృతి మాఱును నడుమును వంచును, తలను పైకెత్తును.

**తస్య అశ్వవ ద్దేవతావచ్ఛ నిగమా భవన్తి.**

తస్య దధిక్రాః శబ్దస్య అశ్వవత్ అశ్వసంయుక్తాః దేవతావత్ దేవతా సంయుక్తాశ్చ నిగమా భవన్తి.

అర్థము :- తస్య = ఆ దధిక్రాః శబ్దముయొక్క అశ్వవత్ దేవతా వత్ = అశ్వసంయుక్త దేవతాసంయుక్త నిగమాః = మంత్రములగును.

**తద్యద్ దేవతావద్ ఉపరిష్టా త్తద్ వ్యాఖ్యాస్యామః.**

పంచదశేఽధ్యాయే ఆదధిక్రాః శవమా ఇత్యస్యామృచి వ్యాఖ్యాస్యామః.

తత్ = కావున, యత్దేవతావత్ = ఏది దేవతాసంబంధమో, తత్= దానిని, ఉపరిష్టాత్ వ్యాఖ్యాస్యామః=ముందు వ్యాఖ్యానము చేయుదుము.

**అథైతదశ్వవత్.**

అథ పుర్ నయుత్ అశ్వవత్ తత్ ఏతత్ వ్యాఖ్యాయతే.

అథ అశ్వవత్ అశ్వసంబంధ మిట నిచ్చుచున్నాము.

"ఉత స్య వాజీ క్షిపణిం తురణ్యతి గ్రీవాయాం బద్ధోఽపి కక్ష ఆసని. క్రతుం దధిక్రా అను సంతవీ త్వత్పథామఙ్కాంస్యన్వాపనీ ఫణత్." (ఋ. ౪-౪౦-౪)

అపి స వాజీ వేజనవాన్ క్షేపణ మనుతూర్ణ మశ్నుతేఽధ్వానమ్. 'గ్రీవాయాం బద్ధః' గ్రీవా గిరతేర్వా గృణాతేర్వా గృహ్ణాతేర్వా. అపి కక్ష ఆసనీతి వ్యాఖ్యాతమ్. 'క్రతుం దధిక్రా' కర్మ వా ప్రజ్ఞా వా 'అనుసంతవీత్వత్'. తనోతేః పూర్వయా ప్రకృత్యా నిగమః. పథామఙ్కాసి పథాం కుటిలాని - పంథాః పతతేర్వా పద్యతేర్వా పంథతేర్వా. అఙ్కోఽఞ్చతేః ఆపనీ ఫణదితి ఫణతే శ్చర్కరీతవృత్తమ్.

ఉతస్య వాజీతి గౌతమపుత్రస్య వామదేవస్యేయ మార్షమ్. ఉత స్యః అపి స ఇత్యర్థః. వాజీ వేజనవాన్ క్షిపణిం కశా-ఘాత మనుతురణ్యతి

తూర్ణమశ్నుతేఽధ్వానమ్. వ్యాప్నోతీత్యర్థః. కించ గ్రీవాయాం ఉరసి బధ్నాః బద్ధః. అపి కక్షే కక్షాయామ్ ఆసని ముఖే ఖలీనేన బద్ధః క్రతుమ్ ఆత్మీయం గమనం కర్మ దధిక్రా అశ్వః అనుసంతనోతీత్యర్థః. కించ యాన్యపి పథాం మార్గాణామ్ అఙ్కాంసి కుటిలాని తాన్యపి అనులోమా నీవ కుర్వన్ అను గామిత్వాత్ - అభిముఖ్యేన పునఃపునర్ భృశం వా ఫణతి గచ్ఛతీత్యర్థః అఙ్కాః అంచతేర్ గత్యర్థస్య.

మంత్రార్థము :— ఉత = మఱియు, స్యః వాజీ=అగుఱ్ఱము, గ్రీవాయామ్ = మెడమీద, బద్ధః = కట్టబడినదై, కక్షే = కక్ష - చంకయందు, ఆసనిఅపి = ముఖమునందును జీను కళ్లెము మున్నగువానిచే కట్టబడినదై, క్షిపణం = క్షేపణమును - ప్రేరణచేయఁగానే - కొరడా తగలగానే, తురణ్యతి = నడువ నారంభించును, దధిక్రా = ఈయశ్వము, పథాం = మార్గము, అఙ్కాంసి = వక్రతలను - మిట్టపల్లములను, అన్వాపనీ ఫణత్ = దూకుచు దాటి పరువిడును, క్రతుం = తన శీఘ్రగమనరూప కార్యమును లక్ష్యమునందుంచుకొని లేక తనమీదనున్న రౌతును శీఘ్రముగ చేర్చ వలయునను లక్ష్యముతోను, సన్తవీత్వత్ = పూర్ణమొనర్చును.

అపి స వాజీ వేజనవాన్ = ఆ వేగవంతమగు అశ్వము క్షేపణమును= కొరడా తగలగానే, తూర్ణమశ్నుతే అధ్వానమ్ = మార్గమున వ్యాపించును - అత్యంతవేగముతో మార్గమును సమాప్తముచేయును, గ్రీవగ్రహ్యత్వ గిరితేః వా గ్యా నిగరణే ధాతువువలన నేర్పడును. ఏలయన :- కంఠముతో అన్నము మ్రింగుదురు. అథవా గృణాతేః-లేక గృధాతువుచే 'గ్రీవా' పదమేర్పడును. ఏలయన కంఠముతో శబ్దము వెలువడును. గృహ్ణాతేర్ వా గ్రహధాతువుచే 'గ్రీవా'అగును. జలాదులు గ్రీవముతోనే గ్రహింపబడును. కక్షే ఆసని ఇతి వ్యాఖ్యాతమ్. వీని వ్యాఖ్య పూర్వమే చేయబడినది. క్రతుం కర్మ వా ప్రజ్ఞాం వా = కర్మముకాని, బుద్ధికాని, క్రతుశబ్దమున కర్థము, సంతవీత్వత్ - తనోతేః పూర్వయా ప్రకృత్యా నిగమః. సంతవీత్వత్ = తను ధాతువుయొక్క మొదటి ప్రకృతితో సిద్ధమగును, ప్రకృత్యన్తః సన్త్యంతశ్చ యఙ్ఙన్తే యఙ్ లుగేవచ = ఇట్టివి యాఁబువిధములగు ధాతువులున్నవి. వానిలో నిరూపము 'తను' యొక్క పూర్వప్రకృతిరూపము. పంథాః పత

తేర్వా పంథాః = పతధాతువుతోను లేక పద్యతేః పద గతౌ ధాతువుతో, పన్థతేర్వా - పంథధాతువుతో పంథాః పదము సిద్ధమగును. అఙ్క అంచతేర్వా - గత్యర్థక 'అంచు' ధాతువుతో సిద్ధమగును. ఆపనీ ఫణదితి చర్కరీత వృత్తమ్ ఆపనీఫణత్ = ఈరూపము యఙ్లుగంతమునకు చెందినది. 'ఫణగతౌ' ధాతువుతో యఙ్లుగంతములో నీరూపమేర్పడును. చర్కరీత = వైయాకరణుల యఙ్లుగంతసంజ్ఞ యగును.

(అథాదిష్టోపయోజన నిర్వచమ్)

**దశోత్తరా ణ్యాదిష్టోపయోజనానీ త్యాచక్షతే సాహచర్య జ్ఞానాయ.**

దశ యాని ఉత్తరాణి నామాని తాన్యశ్వనామసంబంధే నైఘోచ్యన్తే. తాని పునః ఆదిష్టోపయోజనాని ఆచక్షతే ఆచార్యాః ఇదమింద్రస్య అశ్వానాం నామ ఇదమగ్నేః ఇద మాదిత్యస్య - ఇత్యేవ మాదిష్టోపయోజనాని.

అర్థము :— ఉత్తరాణి దశ = ముందు రాబోవు పదినామములు అశ్వముతోనే సంబంధముగలవి. ఆదిష్టోపయోజనాని = ఆదిష్టాఉప యుజ్యన్తే అస్మిన్ అనేన వా ఇతి ఆదిష్టోపయోజనాని = అనగా నిర్దిష్టములు, ఇంద్రాదులగు నాయాదేవతలతోపాటు నిశ్చితములు. రాబోవు పదినామముల ఉపయోగప్రయోగము ఎట్టిది. ఏలయన - సాహచర్య జ్ఞానాయ = అనాదిష్టదేవతయొక్క మంత్రములందు సాహచర్యమువలన సంబంధము గల వానిని గుర్తించుట కట్టిప్రయోగములని భావము. ఇతి ఆచక్షతే అని యిట్లు వేదవిద్వాంసులు చెప్పుచున్నారు. 'హరీఇంద్రస్య' రోహితః అగ్నేః = మొదలైనవానివలె.

(జ్వలతికర్మధాతు నిర్వచనము)

**జ్వలతి కర్మాణ ఉత్తరే ధాతవః ఏకాదశ.**

యః ఏవ హి అశ్వవన్తో భవన్తి త ఏవ జ్వలన్తీవ తేజసా అతోఽశ్వే నామభ్య ఉత్తరే జ్వలత్యర్థా ధాతవః.

అర్థము :- రాబోవు ఏకాదశధాతువులు జ్వలత్యర్థకములు దీప్త్యర్థకములు.

(అథ జ్వలన్నామ నిర్వచనము)

**తావన్త్యేవో త్తరాణి జ్వలతో నామధేయాని నామధేయాని.**

తావన్త్యే వో త్తరాణి జమత్ ఇత్యేవమాదీని జ్వలతో నామధేయాని నామధేయాని అధ్యాయపరిసమాప్త్యర్థో ద్విరభ్యాసః.

రాబోవు పదకొండునామములు జ్వలతః=తేజస్సుగలిగిన ద్రవ్యముల నామములు - నామధేయాని పదద్విరుక్తి అధ్యాయసమాప్తిబోధకము.

రెండవ యధ్యాయము

సమాప్తము



# తృతీయాధ్యాయము

## ప్రథమపాదము

(కర్మనామ నిర్వచనము)

**కర్మనామా న్యుత్తరాణి షడ్వింశతిః.**

జ్వలత్యేవాగ్నౌ కర్మాణి క్రియన్త ఇతి జ్వలన్నామభ్య ఉత్తరాణి కర్మనామాని షడ్వింశతిః షడధికావింశతి రిత్యర్థః.

రాబోవు ౨౬ ఇరువదాఱు కర్మనామములు.

**కర్మ కస్మాత్ క్రియత ఇతి సతః.**

క్రియతే ఇతి కర్మేత్యర్థః = చేయబడుచున్నది కావున కర్మయనబడును.

(అథాపత్యనామ నిర్వచనము)

**అపత్యనామాన్యుత్తరాణి పంచదశ.**

సర్వకర్మణాం హ్యపత్యోత్పాదనకర్మైవ ప్రధానమ్పూనాపకరణ ద్వారేతి కర్మనామభ్య ఉత్తరాణి అపత్యనామాని.

అపత్యనామములు పదునైదు-(౧౫).

**అపత్యం కస్మాత్ ? అపతతం భవతి. నానేన పతతీతి వా.**

అపతతం పితుః సకాశాదేత్య పృథగివ తతం విస్తృతం భవతి. అనేన జాతేనాపత్యేన సతా పితా నరకే న పతతి ఇత్యపత్యం వా.

అర్థము :- అపత్యనామ మేల కలిగినది ? అపతతం భవతి పితుః సకాశాదేత్య పృథగివ తతం భవతి=తండ్రిసమీపమునుండి వేఱుగా వ్యాపక

మగుసు. సంతానము తండ్రివంశమును ముందుకు సాగించును. వా=లేక అనేన న పతతి = ఈ పుత్రసంతతివలన తండ్రి నరకమునబడదు.

**తద్ యథా జనయితుః ప్రజైవమర్థీయే ఋచౌ ఉదాహరిష్యామః.**

కిం క్షేత్రిణోఽపత్యమ్ ఉత బీజినః ? ఉచ్యతే - జనయితురేవ.

అర్థము :- యథా జనయితురేవ ప్రజా = సంతానము తండ్రిదే యని యంగీకరింపబడినది. ఔరసపుత్రుడే తండ్రిని నరకమునుండి ఉద్ధరించును. ఏవమర్థీయే = ఈవిషయమున, ఋచౌ ఉదాహరిష్యామః = రెండుఋక్కుల నుదాహరింతుము-సంతానము ఔరస, దత్తక, క్షేత్రజ కాని నాది నామములతో ననేకవిధములు. వివాహితస్త్రీయందు భర్తవలన నేర్పడు సంతానము ఔరససంతానము. దత్తుతీసికొనిన అన్యుని సంతానము దత్తకము. తనస్త్రీయందు అన్యపురుషుని వీర్యముచే నేర్పడు (నియోగముతో) సంతానము క్షేత్రజము. ఇట్లనేకవిధములు సంతానము. ఔరసపుత్రుని వలననే తండ్రి నరకమునుండి తప్పింపబడునని యాస్కఋషిమతము తద్విషయికమంత్రముల నిట పొందుపఱచుచున్నాడు.

"పరిషద్యం హ్యరణస్య రేక్ణో నిత్యస్య రాయః పతయః స్యామ న శేషోఽగ్నే అన్యజాతమస్త్యచేతానస్య మా పథో విదుక్షః."
(ఋ. ౭-౪-౭)

పరిహర్తవ్యం హి నోపసర్తవ్యమ్. 'అరణస్య రేక్ణః అరణో అపార్ణో భవతి. రేక్ణ ఇతి ధననామ రిచ్యతే ప్రయతః' నిత్యస్య రాయః పతయః స్యామ' పిత్ర్యస్యేవ ధనస్య. న శేషోఽగ్నే అన్యజాతమస్తి' శేష ఇత్యపత్యనామ. శిష్యతే ప్రయతః అచేతయమానస్య తత్ప్రమత్తస్య భవతి. మా నః పథో విదూదుష ఇతి.

పరిషద్యం హి న హి గ్రభాయ ఇతి. ఏతే త్రిష్టుభౌ. వసిష్ఠాగ్ని సంవాదే వసిష్ఠేన హతపుత్రేణ అగ్నిః ప్రార్థితః. పుత్రం మే దేహీతి. తేన కిలాసౌ ప్రత్యుక్తః "క్రీతక - కృత్రిమ - దత్తకాదీనాం పుత్రాణా మన్య

తమం కురుష్వ పుత్ర మితి. స ఏవ ముక్తః. ఏతాభ్యా మృగ్భ్యా మన్యా జాతపుత్రాన్ నింద న్నౌరసం పుత్రం యయాచే. పరిహరణీయం పరిత్యాజ్య మిత్యర్థః. అరణస్య పరకులజాతస్య రేక్ణః. యదేవ నిత్యం స్వయముత్పా దితం పుత్రాఖ్యం రా ధనం తస్యైవ వయం పతయః పాలయితారః స్యామ యస్మాత్ 'హే అగ్నే! య ఏవ జనయతి తస్యైవ హి తద్ భవతి. తస్య తు అచేతయమానస్య ప్రమత్తస్య తదపత్య మితి. మా పథో విదుక్షః అతో మాస్మాన్నేతత్ పితృపితామహప్రపితామహానుసంతతాత్ పథో మార్గాత్ విదూ దుష ఇతి సమస్తార్థః. ప్రయుతః మ్రియమాణస్యేత్యర్థః. ఏష మస్యా మృచి జనయితురేవ ప్రజా భవతి. న క్షేత్రిణో నాపి క్రేతుర్ధన్యస్య యా కస్యచిత్ ఇతి యస్మాత్ అపేత్య తతం భవతి. తస్యైవాపత్య మిత్యాశయః.

మంత్రార్థము :— అరణస్య అపగతోదకసంబంధస్య=ఎవనితో నుదక సంబంధముండదో - మరణానంతరము తర్పణ కధికారముండదో అనగా తనవీర్యముతో నుత్పన్నముకానివానిని పుత్రునిగా నెంచవద్దని భావము అన్యకులజుడు రేక్ణః అపత్యనామకధనమును, పరిషద్యమ్ = పరిహరింప దగినదిగా నెంచవలెను, నిత్యస్య పైతృకరాయః = నిత్యమైన పైతృకధనము నకే, పతయః స్యామ = పతులమగుదుము. అనగా స్వవీర్యోత్పన్నపుత్రునే తనసంతానముగా నెంచవలయును. దత్తాకక్షేత్రజాదులను సంతానముగా నెంచరాదని భావము, యా = లేక, నిత్యస్యరాయః = ఔరస - అపత్యనామ క ధనమునకే, పతయఃస్యామ = పాలకులమగుదుముగాక, ఓ అగ్నీ! అన్యజాతమ్ = ఇతరునకుబుట్టిన సంతానము న శేషఃఅస్తి = తనపుత్రుడు కాడు. అచేతానస్య అచేతయమానస్య = తెలివితేనివాడు, మూర్ఖుడు, ప్రమా దియు మాత్రమే ఇతరులను పుట్టినవానిని తనపుత్రునిగా చెప్పగలడు. అనగా మూర్ఖుడు మాత్రమే ఈవిధముగా నితరులకుపుట్టినవానివిషయమున సంతోషముకలవాడగును. పథః = సన్మార్గమునుండి, మావిదుక్షః = దూరమొనర్పకుము, అరణః అపార్ణః భవతి = అరణపదమునకర్థము అపగతఋణముగల తండ్రియొక్క ఋణమునకు పాత్రుడు కాకుండుట, స్వవీర్యజసంతానము ఔరసపుత్రునిమీదనే తండ్రియొక్క ఋణముండ గలదు. కృతకాదులపై నుండదు, యా = లేక అరణపదమునకర్థము అపగతోదకసంబంధమని చెప్పబడినది. ఉదకసంబంధము ఔరసపుత్రునకే

కలదు, రేక్ణ ఇతి ధననామ = రేక్ణము అని ధనమునకు నామము, ప్రయతః = మరణించినవానిధనము, రిచ్యతే = ఇటనే యుండును. శేష ఇతి అపత్యనామ = సంతానమునకు శేషము అని నామము. కారణము ప్రయతః = తండ్రిమరణించిన తదుపరి, శిష్యతే = సంతానమిటనే యుండును. కావున శేషమనిపేరు, విదుషః - విద్వాంసుః = హేభగవన్ మాకు ఔరససంతాన మొసంగుము.

తస్యోత్తరా భూయసే నిర్వచనాయ.

ఈ చెప్పినవిషయమును అధికముగ బలపఱచుటకు రెండవ ఋక్కును ఉదాహరించుచున్నారు.

"న హి గ్రభాయారణః సుశేవోఽన్యోదర్యో మనసా మంతవా ఉ అధా చిదోకః పునరిత్స ఏత్యా నో వాజ్యభీషాళేతు నవ్యః."
(౭-౪-౮).

న హి గ్రహీతవ్యో అరణః సుసుఖతమోఽపి. అన్యోదర్యో మనసాపి న మంతవ్యః మమాయం పుత్ర ఇతి. అథ స ఓకః పునరేవ తదేతి యత ఆగతో భగతి. ఓక ఇతి నివాస నామోచ్యతే. ఏతు నో వాజీ వేజనవాన్. అభిషహమాణః సపత్నాన్ నవజాతః స ఏవ పుత్ర ఇతి.

న హి గ్రహీతవ్యః - నాంగీకర్తవ్యః మమాయ మిత్యనేనాభిప్రాయేణ అరణః - అపార్ణః - అన్యకులజః. "సుశేవః సమ్యక్ సేవకః సుఖతమో హితైషీ, తథాపి అన్యోదర్యః అన్యజాయోదరసంభూతో యతః తస్మాత్ స మనసాపి న మంతవ్యః. కింకారణమ్? అధాచిదోకః పునరిత్స ఏతి" యస్మాత్ ఓకః స్వం నివాసస్థానమ్, స్వం వంశం వా బహునాపి కాలేన స ఏతి. అత - ఏతు ఆగచ్ఛతు వాజీ వేజనవాన్ పరేభ్యో భయదాతా అభీ షాట్ అభిషహమాణః, అభిభవన్ "సపత్నాన్ నవ్యః నవజాతః" శత్రుపుత్రస్థః. స ఏవ పుత్రో నాన్యః క్రీతక - కృత్రిమ - దత్తకాదిః.

మంత్రార్థము :- అరణః=క్షేత్రజ ఆదిపుత్రుడు, న హి గ్రభాయః- న హి గ్రహీతవ్యః = స్వీకారయోగ్యుడు కాడు, సుశేవః=పరిచార్యుడుఁటతో

సుఖమునిచ్చువాడైనను, అన్యోదర్యః = క్షేత్రజాది - సంతానము, మనసా చ = మనస్సుతోనైన, న మంతవై = అంగీకరింపతగదు, అథ = ఈపదము అథఅనునర్థమున ప్రయుక్తము హేతు - ఏలయన - పునః ఇత్ = అయి నప్పటికి, సః = అతడు, అన్యోదర్యః = ఇతరునిపుత్రుడు, ఓకః=స్వవంశ మునకు, ఏతి = పొందినవాడగును, నః = మనకుమాత్రము, వాజీ - వేజన వాన్ = వేగవంతుడు - బలవంతుడు ఇతరులకు భయంకరుడు, అభీషాట్= శత్రునాశకుడు, నవ్యః = నవీన - పుత్రుడు, ఆఏతు = ప్రాప్తించునుగాక !

న హి గ్రహీతవ్యో అరణః = క్షేత్రజపుత్రుడు గ్రహింపదగడు, సుసుఖతమోఽపి = అన్యకులజుడు పరిచర్యాదులతో నెంతసుఖదాయకు డైనను, అన్యోదర్యః = ఇతరులపొట్టనుండి పుట్టినవాడు, మనసాఽపి న మంతవ్యః మమాయంపుత్ర ఇతి=ఇతడు నాపుత్రుడు' అని మనస్సులోకూడ తలంపరాదు. అథసః = ఎందువల్లననగా అక్షేత్రజసంతానము, పునరేవ తత్ ఓకః ఏతి = మరల తనసుకన్నవారి నివాసమునకే పోవును, ఓకః = నివాస నామ ఉచ్యతే = ఓకస్సు నివసించుస్థానమునకు నామము, ఏతు = అక్కడికేపోవును, నః = మనకు, వాజీ = వేజనవాన్ = వేగవంతుడు - బలవంతుడు, అభిషహమానః = ఇతరుల సహించువాడు, సపత్నాన్ = శత్రువులపీచమణచువాడు, నవజాతః స ఏవ పుత్రః ఇతి = వాడే నవజాత పుత్రుడు కావలయును.

## అథైనాం దుహితృదాయాద్య ఉదాహరన్తి.

ఏనామృచం శాసద్వహ్నిరిత్యాదిం దుహితుర్ దాయాద్యే అర్థే ఉదాహరన్తి ధర్మవిదః.

అర్థము :— అపత్య=పుత్రుడు, కన్య ఇరువురు సమానులే. ఇరువురి యందును అపత్యత్వము - అపతతతా = సమానముగ నుండును. పుత్ర పుత్రికలలో దాయభాగీ = తండ్రిసొత్తును పంచుకొనుట కెవరర్హులు ? అను ప్రశ్నముదయించినపుడు ఇరువురు అర్హులే యగుదురు. కారణమేమన పుత్రపుత్రికలలో అపత్యత్వము = సంతానత సమానమేకదా ! ఈ విషయ మునుగూర్చి ఆలోచించుచు పుత్రపుత్రికల కిరువురకు దాయభాగిత్వమున్న దని చెప్పుచు దుహితృదాయాద్యే = పుత్రికదాయభాగిత్వవిషయమున ఏనాం = ఈఋక్కును ఉదాహరన్తి = ప్రమాణీకరించుచున్నాడు.

పుత్రదాయాద్య ఇత్యేకే.

ఏకే పునర్ధర్మవిదో మన్యన్తే యత్ పైతృకం విత్తం పుత్రస్యైవ దాయాద్యం న దుహితురితి. యథా చ దుహితాపి దాయాద్యమర్హతి తామృచ మాహ - కొందఱు ధర్మవిదులు పైతృకధనమున కధికారి పుత్రుడేకాని పుత్రిక కాదందురు. ఈవిషయమున నీక్రిందిఋక్కును ప్రమాణముగా నుదాహరింతురు.

సామాన్యముగ పుత్రపుత్రికలలో నిరువురియందును అపత్యత్వ ముండును కావున పైతృకసంపత్తి కిరువురు నర్హులే. దాయభాగిత్వము పుత్రునకువలె పుత్రికకు నుండునందురు. పుత్రుడు లేక కేవలము పుత్రికయే యున్నపక్షమున పుత్రికకు దాయభాగిత్వముండును. అంతేకాని పుత్రుడే దాయభాగి యగును. పుత్రిక కాదనుమతము వారి క్రిందిఋక్కును ప్రమాణీకరింతురని తాత్పర్యము.

> శాసద్వహ్ని ర్దుహితు ర్న ప్త్యఙ్గాద్విద్వాం ఋతస్య దీధితిం సపర్యన్ పితా యత్ర దుహితుః సేకమృంజన్ త్సంశగ్మ్యేన మనసా దధన్వే. (ఋ. ౩-౩౧-౧)
>
> ప్రశాస్తి వోఢ్హా సంతానకర్మణే దుహితుః పుత్రభావమ్. దుహితాదుర్హితా దూరే హితా దోగ్ధేర్వా నప్తార ముపాగమత్. దౌహిత్రం పౌత్రమితి విద్వాన్ ప్రజననయజ్ఞస్య రేతసో వా అంగాదంగాత్సంభూతస్య హృదయాదధిజాతస్య మాతరిప్రత్యృతస్య.విధానం పూజయన్, అవిశేషేణ మిథునాః పుత్రా దాయాదాః ఇతి.

శాసద్ వహ్నిః - ప్రశాస్తి వోఢా ఉద్వోఢా ప్రయమః, దోగ్ధేర్వా సా హి నిత్యమేవ పితుః సకాశాత్ ద్రవ్యం దోగ్ధి. నప్త్యంగాత్ నప్తారముపాగమత్ విద్వాన్ ఋతస్య - ప్రజననయజ్ఞస్య దీధితిం - విధానమిత్యర్థః. సపర్యన్- పూజయన్నిత్యర్థః యథైవ హి పుత్ర ప్రజనే ప్రజననయజ్ఞ స్తస్యతే తథైవ హి దుహితృజననేఽపి ఇత్యుభయోః సామ్యా దవిశేషః. అర్ధర్చస్యార్థమగ్రే ప్రదర్శయిష్యామ ఇత ఏవ ద్రష్టవ్యః సంగతిప్రలాపనాయ.

మంత్రార్థము :— వహ్నిఃవేథా = వివాహితపురుషుడు, దుహితుః = కన్యయొక్క పుత్రునికూడ, శాసత్ప్రశాస్తి = తనపుత్రుడని చెప్పును. ఋతస్య = గర్భాధానయజ్ఞముయొక్క, దీధితిమ్=విధానమును, విద్వాన్= ఎఱుగుచున్నవాడై, సపర్యన్ = ఆవిధానజ్ఞానమును సత్కరించుచు-జ్ఞానాను కూలవర్తనముగలవాడై, నప్త్యమ్ - నప్తారమ్ = కన్యాపుత్రుని, గాత్ = ఉపాగచ్ఛతి = మనసా = మనస్సుతో కన్యాపుత్రని తనపుత్రుడుగా అంగీక రించును. కారణమేమన - విద్వాన్పితా = పుత్రునకు, పుత్రికకు జరుపు గర్భాధానయజ్ఞము - ప్రజననయజ్ఞము ఒకేవిధముగా జరుపబడునని యెఱ తెఱుగును. కావున నిరువురు సమానమే - ఒకే శ్రేణికి చెందినవారని యెంచును. ప్రశాస్తి - వేథా సంతానకర్మణే = దుహితుః పుత్రభావమ్ = వివాహితపురుషసంతానకార్యము కొఱకు పుత్రికయొక్క సంతానమును గూడ తనసంతానముగానే యెంచును.

దుహితాపదనిరుక్తి - దుర్హితా = కన్య యెవ్వరికియ్యబడినదో వారికే అహితకారిణి యగును. దూరేహితా = లేక దూరముననుండియే హిత కారిణి యగును. ఎంతదూరమున వివాహితయగునో యంతమేలు గలిగిం చునదగును. వా దోగ్ధేః = లేక, దుహ్ధాతువుచే దుహితా శబ్దమేర్పడును. కన్య పితృకులమును, దోగ్ధి = పిండును. కావున దుహిత యనబడును, నప్తారమ్ ఉపాగమత్ = దుహితృసంతానమును దౌహిత్రమ్ = పౌత్రమ్ = మనుమనిగానెంచును, విద్వాన్ = ఎఱుగువాడు దేనిని ? ప్రజననయజ్ఞస్య= గర్భాధానయజ్ఞమును, లేక, రేతసః = వీర్యమును - ఏవీర్యము అంగా దంగాత్ = ప్రత్యంగమునుండి, లేక హృదయాత్ = హృదయమునుండి, అధిజాతస్య = బయటుపడినదో, మాతరి = తల్లిగర్భమున, ప్రత్యృతస్య = చేరినదో, విధానమ్పూజయన్ = ప్రజననానామకయజ్ఞవిధిని ఆదరించుచు విద్వాంసుడు ఈపరిణామమున చేరెను విడసగా అవిశేషేణ = సమానరూప ముతో, మిథునాః = రెండుసంతానములను, స్త్రీపుంరూపపుత్రాః=స్త్రీపురుష రూపపుత్రులనియు, మఱియు దాయాదాః = దాయభాగమునకు అధికారు లనియు నిశ్చయించును.

**తదేతదృక్ శ్లోకాభ్యా మభ్యుక్తమ్.**

అను నీవిషయము ఋక్, శ్లోకము, అను రెండింటివే చెప్పబడినది.

"అంగాదంగాత్సంభవసి హృదయా దధిజాయసే ఆత్మా వై పుత్రనామాసి స జీవ శరదః శతమ్." (శత.౧౪-౯-౪-౨౬)

"అవిశేషేణ పుత్రాణాం దాయో భవతి ధర్మతః మిథునానాం విసర్గాదౌ మనుః స్వాయంభువోఽబ్రవీత్."

హేపుత్ర! అంగాదంగాత్ సంభవసి త్వం హృదయాత్ చ అధి జాయసే. కేవలం తు పుత్రనామా త్వం అహం పితృనామా ఉభయో ర్నామమాత్రం భిన్నమిత్యభిప్రాయః. స త్వం జీవ శరదః సంవత్సరాణాం శతమ్ - శతాయుర్భవేత్యర్థః పుత్రాణాం మిథునానా ముభయేషాం స్త్రీ పుంసామ్ దాయో భవతీతి విసర్గాదౌ - సృష్ట్యాదౌ స్వాయంభువో మను రబ్రవీత్ - ఏవ మేతాభ్యా మృక్శ్లోకాభ్యా ముక్త మవిశేషేణ పుత్రస్య దుహితుశ్చ దాయాదత్వ మితి.

అర్థము :— అంగాత్ సంభవసి = ఓసంతానమా! నీవు ప్రత్యంగము నుండియు పుట్టుచున్నావు, హృదయాదధిజాయసే = హృదయమునుండి పుట్టుచున్నావు, ఆత్మావై పుత్రనామాసి = నిశ్చయముగా నాయాత్మయే పుత్రరూపమున నుపస్థితమైనది, సః జీవ శరదః శతమ్ - అట్టినీవు నూఱు శరత్తులు - సంవత్సరములు జీవించుము. మిథునానామ్ పుత్రాణాం = స్త్రీ పురుషరూప - ఉభయసంతానములు, అవిశేషేణ = సమానరూపముతో, ధర్మతః = ధర్మానుసారము, దాయః భవతి = ఇరువురు పైతృక సంపత్తికి అధికారులగుచున్నారు. ఈవిషయము సృష్టిప్రారంభముననే స్వాయం భువఃమనుః = స్వాయంభువమనువు చెప్పియున్నాడు.

న దుహితర ఇత్యేకే. తస్మాత్ పుమాన్ దాయాదోఽదాయాదా స్త్రీతి విజ్ఞాయతే. తస్మాత్ స్త్రియం జాతాం పరాస్యన్తి. న పుమాంస మితి చ. స్త్రీణాం దానవిక్రయాతిసర్గా విద్యన్తే న పుంసః.

న దుహితరో దాయాద్య మర్హన్తీత్యేవ మేకే ధర్మవిదో మన్యన్తే. బ్రాహ్మణమప్యేతస్మిన్నర్థే దర్శయతి. తస్మాత్ పుమాన్ దాయాదః, స్త్రీ అదాయాదా ఇతి. స్త్రియం పరాస్యన్తి పరస్మై ప్రయచ్ఛన్తి. ప్రదీయతే

హి పరస్మై స్త్రీ విక్రీయతే చ. వైవాహికేన శుల్కేన. అతిసర్గః పరిత్యాగః సా పి త్యజ్యతే చ స్వయంవరే మిత్రాదినా యస్తుభ్యం రోచతే తం వృణీష్వ తస్మాన్న దాయాద్య మర్హతి. కన్యా పితురపి తు పుత్ర ఏవేతి భావః.

అర్థము :— ఏకే = కొందఱు ఆచార్యులు, దుహితరః న = కన్యలు - స్త్రీసంతానము పైతృకసంపత్తిని పంచుకొన నర్హులుకారని అభిప్రాయ పడుచున్నారు. తస్మాత్ = దీనిననుసరించి, పుమాన్దాయాదః=పుత్రుడే దాయభాగమున కర్హుడని స్త్రీ కాదని యెంచుచున్నారు. ఈ సిద్ధాంతము ననుసరించి జాతాంస్త్రియమ్ = పుట్టినపుత్రికను, పరాస్యన్తి = వివాహ కాలమున పరునకిచ్చి దూరమొనర్చుచున్నారు, న పుమాంసమ్ ఇతి చ= పుత్రునట్లుచేయరు, దానవిక్రయాతిసర్గాః = దానము, అమ్మట, విడిచి పెట్టుట, స్త్రీణాంవిద్యన్తే = స్త్రీలకే కనబడుచున్నవి, న పుంసః = బాలు రకు లేదు, వివాహమున కన్యనమ్మట దానముచేయుట మున్నగునవి జరుగుచున్నవి. పుత్రునివిషయమున నిట్టివి జరుగుటచూడము.

పుంసోఽపీత్యేకే శౌనఃశేపే దర్శనాత్.

పుంసోఽపి దానవిక్రయాతిసర్గా విద్యన్త ఏవ. ఏవం హ్యుక్తమ్. దత్త, క్రీతక, కృత్రిమ, క్షేత్రజౌరసాః పుత్రాః ఇతి. భారతే! శునఃశేపస్య విక్రయో దృష్టః. పరిత్యాగోఽపి యథా విశ్వామిత్రేణ మధుచ్ఛంద ఆదీ నామ్. తస్మాద్ అనైకాంతికత్వా ద్వేషామ్ హేతూనా ముభయోరపి దాయాద్యత్వ మిత్యేకే మన్యన్తే.

అర్థము :— ఏకే = కొందఱు ఆచార్యులు, పుంసః అపి = పుత్రునకు కూడ దానవిక్రయాదులున్నవని యంగీకరించుచున్నారు, శౌనఃశేపే దర్శ నాత్ = శునఃశేపుని ఆఖ్యానమున నిట్టిది చూడబడుచున్నది. మహాభారత మున శునఃశేపుని విక్రయముచూడబడును.

అభ్రాతృమతీవాద ఇత్యపరమ్.

ఆచార్యమత మితి శేషః యైవాభ్రాతృకా భవతి కన్యా సైవ పిత్ర్యం ధనమర్హతి నేతరా సభ్రాతృకా. యతో భ్రాతురభావే తస్యాః పుత్ర ఏవ తత్పుత్రే పిండదః.

అర్థము :— అభ్రాతృమతీవాదః=అభ్రాతృమత్యాః వాదః అభ్రాతృమతీవాదః = ఈవాదము భ్రాతృరహిత కన్యకు సంబంధించినది-స భ్రాతృ సంబంధముగల కన్యకు సంబంధించినది కాదు, ఇతి అపరం = ఇది మఱియొక సిద్ధాంతము.

"అమూర్యా యన్తి జామయః సర్వా లోహితవాససః అభ్రాతర ఇవ యోషాస్తిష్ఠన్తి హతవర్త్మనః." (అథర్వ.౧-౧౭-౧)
అభ్రాతృకా ఇవ యోషా స్తిష్ఠన్తి సంతానకర్మణే పిండ దానాయ హతవర్త్మనః. ఇత్యభ్రాతృకాయా అనిర్వాహ ఔపమికః.

నిగమమప్యేతస్మిన్నర్థే ఉదాహరన్తి - అభ్రాతర ఇవ యోషా స్తిష్ఠన్తి హతవర్త్మనః ఇతి. అభ్రాతృకాయాః అనిర్వాహః - వివాహనిషేధః. ఔపమికః - ఉపమయా దర్శితః యాన్తి - స్రవన్తి నాడ్యో రక్తమ్. ఏతాః తిష్ఠన్తు ఉపరమన్తు కథమ్ అభ్రాతర ఇవ యోషాః యథా కాశ్చిత్ అభ్రాతృకా యోషా హతభర్తృ వంశ మార్గా స్తిష్ఠన్తి.

మంత్రార్థము :— యాః = ఏ, అమూః=ఈ లోహితవాససః=వస్త్రములను రక్తముతో తడుపునట్టి, జామయః = నాడులు, యన్తి = ప్రవహించుచున్నవో, వే సర్వాః = ఆవియున్నియు, హతవర్త్మనః = ప్రతిరుద్ధమార్గము గలవియై, తిష్ఠన్తి = ఉండునో - ఈమంత్రబలమున ఆగిపోవును, ఇవ = ఏవిధముగా, అభ్రాతృకా = సోదరులులేని, యోషాః=స్త్రీలు, హతవర్త్మనః= ప్రతిరుద్ధ వివాహకర్మలు గలవారైయుండిపోయెదరు. మాతాపితరులసేవకై పితృకులముననే యుందురు. కావున వారికి వివాహముకాదు. ఈమంత్రాభిప్రాయమేమన ఏస్త్రీకి గర్భస్థితియుండదో, ఏస్త్రీ యొక్క ప్రసవమార్గమునకు సంబంధించిననాడులు ఎల్లప్పుడు ప్రవహించుచుండి సతతరక్తస్రావమువలన గర్భస్థితియేర్పడదో- అట్టివారికొఱకీ ప్రార్థన, అభ్రాతృక కన్యకు మాతృసేవకొఱకు వివాహమాగిపోవునట్లు ఆమె రక్తస్రావమాగిపోవును. అభ్రాతృకా ఇవ యోషా స్తిష్ఠన్తి = సోదరులులేని స్త్రీలు పితృకులమునందే యుందురు. సంతానకర్మణే పిండదానాయ = సంతానము యొక్క కార్యము పిండము (ఆహారము) ఇచ్చుట కొఱకు, హతవర్త్మనః =

పెండ్లిలేకుండ, ఇతి=ఈఅభ్రాతృకాయాః=సోదరుడులేనిస్త్రీకి, అనిర్వాహః = వివాహములేకుండుట, ఔపమికః = ఉపమాపద్ధతిలో చెప్పబడెను.

**తస్యోత్తరా భూయసే నిర్వచనాయ.**

తస్య అనిర్వాహస్య ఉత్తరా ఋక్ భూయసే - బహుతరాయ నిర్వచనాయ.

ఆ విషయమునే అధికముగా ప్రతిపాదించుటకై తదుపరి ఋక్కు నుదాహరించుచున్నాడు.

> **"అభ్రాతేవ పుంస ఏతి ప్రతీచీ గర్తా ఋగివ సనయే ధనానామ్. జాయేవ పత్య ఉశతీ సువాసా ఉషా హస్రేవ నిరిణీతే అప్సః." (ఋ. ౧-౧౨౪-౭)**
>
> **అభ్రాతృకేవ పుంసః పితౄన్ నేత్యభిముఖీ సంతానకర్మణే పిండదానాయ న పతిమ్. గర్తారోహిణీవ ధనలాభాయ దాక్షిణాజీ గర్తః సభాస్థాణుః. గృణాతేః సత్యసంగరో భవతి· తం తత్ర యాపుత్రా యాపతికా సారోహతి. తాం తత్రాక్షైరాఘ్నన్తి సా రిక్థం లభతే.**

యథా అభ్రాతృకా కన్యా దత్తాఽపి సతీ పిత్రా పునః పుంసః పితౄ నేవ పితృవంశానేవ ఏతి. గర్తాఋగివ సనయే ధనానామ్ గర్తారోహిణీ కాచిత్ దాక్షిణాజీ దాక్షిణాత్యా స్త్రీ సా యథా సనయే - లబ్ధయే ధనానామ్. యథా జాయాపత్యే భర్త్రే సువాసా భూత్వా ఋతుకాలేషు ఆత్మానం దర్శయతి. ఏవ ముషా ఆత్మానం దర్శయతి జనానామ్. యథా హసనా స్త్రీ హసనస్వభావా దన్తాన్ దర్శయతి. చతస్రః ఏతా ఉపమా అస్యామృచి. అభ్రాతేవ పుంస ఇత్యేకా గర్తా రోహిణీవేతి ద్వితీయా, జాయేవ పత్య ఇతి తృతీయా, హస్రేవేతి చతుర్థీ.

మంత్రార్థము :— అభ్రాతా ఇవ = సోదరుడు లేనికన్య యేవిధముగ, ప్రతీచీ = తిరిగివచ్చి, పుంసఏతి = సేవజేయుటనిమిత్తము తండ్రిని, ఏతి=ప్రాప్తించునో - ఒకానొకకన్య వివాహితయైన తదుపరికూడ తన కొక సోదరుడు లేనిపక్షమున వృద్ధులైన తల్లిదండ్రులకు సేవజేయు

నిమిత్తము పరిణీతయయ్యు పతికులమును విడిచి పితృకులమునకు చేరు నట్లు, ఇవ = ఏవిధముగ, ధనానాంసనయే = ధనములప్రాప్తించుకొఱకు, పతిరహితస్త్రీ గర్తారుక్ = గర్తారోహిణీ=సభాస్థలి నారోహించునో ఇవ = ఏ విధముగ, ఉశతీ = కోరుచున్నదై, సువాసాః=ఉత్తమవస్త్రములను ధరించి, జాయాస్త్రీపత్యే = భర్తను సమీపించునో, హస్రా=నవ్వుట స్వభావముగాగల స్త్రీ, ఇవ = ఏవిధముగ తనదంతములను, నిరిణీతే = ప్రకాశితమొనర్చునో-జనులకు చూపునో ఆవిధముగానే, ఉషాః అప్సః = ఉషస్సు సర్వపదార్థ ములను, నిరిణీతే = ప్రకాశితమొనర్చును.

ఈమంత్రమున నాలుగుఉపమలున్నవి. వానిలో నొకటి భ్రాతృరహిత కన్యకు సంబంధించినది. ఈ యుపమవలన అభ్రాతృకకన్య=సోదరుడు లేని కన్యయే దాయభాగమునకు అధికారిణియని స్పష్టము చేయబడినది.

అభ్రాతృకేవ పుంసః పితౄన్ ఏతి అభిముఖీ = సోదరుడులేని కన్యయే తండ్రులకభిముఖియై తిరిగివచ్చును. ఎందులకు? సంతాన కర్మణే పిండదానాయ పతిమ్=సంతానమునకు కర్తవ్యమైన పిండదానాదు లను చేయుటకు తిరిగివచ్చును. న పతిమ్ = భర్తను చేరదు. దాక్షిణాజీ= కొండొక దాక్షిణాత్యస్త్రీ, ధనలాభాయ = ధనలాభముకొఱకు, గర్తా రోహిణీ ఇవ = సభామంటపము నారోహించునట్లు, గర్తః సభాస్థాణుః = గర్త సభా మంచకు వాచకము గృణాతేః 'గౄ'ధాతువుతో గర్తశబ్దమేర్పడును. సత్య సంగరో భవతి-గర్త = సభామంచ, సత్యసంగరము = సత్యమును చెప్పించు నది యనియర్థము. సభామంచమీద అసత్యము చెప్పబడదు. అపుత్రాస్త్రీ, మఱియు అపతికా = పతిరహితస్త్రీ సభామంచమీదఎక్కి నిర్ణయము సభిల షించును. అసహాయస్త్రీకి రాజునుండి - రాజకార్యాలయమునుండి - సహా యములభించుట ఆచారము. ఇది దక్షిణదేశాచారము. ఆసభామంచమీద, తామ్ = ఆమెను, అక్షైః అఘ్నన్తి = ప్రశ్నలు అడిగి బాధింతురు. చివరకు, సా రిక్థం లభతే = ఆమె ధనమును పొందును.

శ్మశాన సంచయోఽపి గర్త ఉచ్యతే. గురతేః అపగూర్తో భవతి. శ్మశానం శ్మశయనమ్. శ్మశరీరమ్. శరీరమ్ శృణా తేః శమ్నాతేర్వా శ్మశ్రు లోమ శ్మని శ్రితం భవతి. లోమ లు నాతే ర్వా లీయతే ర్వా.

> "నోపరస్యావిష్కుర్యాత్ యదుపరస్యావిష్కుర్యాత్ గర్తేష్ఠాః స్యాత్ ప్రమాయుకో యజమానః" ఇత్యపి నిగమో భవతి.

గురతేః ఉద్యమనార్థస్య. స హి లోకవినాశాయాభ్యుద్యతే ఇవ భవతి. శ్మశ్రు లోమ శ్మని శరీరే శ్రితం భవతి. లోమ లునాతేః ర్వాణి లీయతే తత్ర నిగమ మపి చోదాహరన్తి-నోపరస్యావిష్కుర్యాత్ ఉపరస్య యూపాఖ్యస్య - ప్రదేశస్య కంచిద ప్యంశ మిత్యర్థః. గర్తేష్ఠా శ్మశానప్రతిష్ఠో మృత ఇత్యర్థః. ప్రమాయుకః - ప్రసన్థాయుష్కో యజమానః స్యాత్.

అర్థము :- శ్మశానసంచయః అపి=శ్మశానభూమియు, గర్త ఉచ్యతే= గర్తఅనబడును. ఏలయన ఆగర్తశబ్దము ఉద్యమనార్థక 'గురీ' ధాతువుచే సిద్ధమగును. అపగూర్ణో భవతి = లోకవినాశముకొఱకు అది ఉద్యతమై యుండును. శ్మశానం శ్మశయనమ్ = శ్మశానమునకర్థము శరీరములు నిద్రించుట, శ్మ = శరీరము, శరీరమ్శృణాతేః = శరీరము 'శృణ్' హింసాయామ్ = హింసార్థక శృణ్ ధాతువుచే నేర్పడును. శరీరమునకు హింస జరుగుచునే యుండును, శమ్నాతేః వా = లేక ఉపశమార్థక 'శమ్' ధాతువుచే శరీరపదమేర్పడును. శరీరమెప్పుడో యొకపర్యాయము చల్లబడును - చనిపోవును. శ్మశ్రు లోమ = శ్మశ్రుఅనగా లోమములు, మానపు వెంట్రుకలు శ్మని = శరీరముపై శ్రితంభవతి=అదియాశ్రయించియుండును, కావున శ్మశ్రు అనబడును. లోమ లునాతేః ఛేదనార్థక లూఞ్ ధాతువుచే లోమశబ్ద మేర్పడును. లోమములు - రోమములు - ఛేదింపబడును. లీయతేః వా = లేక శ్లేషణార్థక 'లీ' ధాతువుచే లోమశబ్దమేర్పడును. శరీరము మీద ఆశ్లిష్టములై యుండును.

గర్తశబ్దము శ్మశానార్థకము. దీనిని బలపఱచుటకు యాస్కముని బ్రాహ్మణవచనము నుదాహరించుచున్నాడు ఉపరస్య = యజ్ఞమునకు చెందినట్టి చెక్కకుండనున్న యూపస్తంభముయొక్కభాగమును ప్రకటముచేయకుండుట యగును. యత్ ఉపరస్య = యూపముయొక్క చెక్కని భాగమును, అవిష్కుర్యాత్ = ప్రకటమొనర్చినచో - కనబడునట్లుంచినచో యజమానః = యజమానుడు, ప్రమాయుకఃస్యాత్ = మరణించును, గర్తే

ష్ఠాస్యాత్ = శ్మశానమునందు ఉండువాడగును, ఇత్యపి = అనియు, నిగమో భవతి మంత్రమున్నది.

> రథోఽపి గర్త ఉచ్యతే. గృణాతేః స్తుతికర్మణః స్తుతతమం యానమ్. "ఆరోహథో వరుణమిత్రగర్తమ్" ఇత్యపి నిగమో భవతి. (ఋ. ౫-౬౨-౮)

రథోఽపి గర్త ఉచ్యతే గృణాతేః స్తుత్యర్థస్య స్తుతతమం యానమశ్వాదిభ్యో యానేభ్యః సుఖతరం హి తేన గమ్యతే. ఆరోహథేతి హేమిత్ర! హేవరుణ యువామ్ స్వం గర్తం రథమారోహథః ఆరోహతమ్.

రథః అపి = రథముకూడ, గర్తఃఉచ్యతే = గర్తము అనబడును, స్తుతికర్మణః గృణాతేః = స్తుత్యర్థక 'గృ'ధాతువుచే నేర్పడునది. కావున, స్తుతతమమ్ యానమ్ = రథముపైకూర్చుండి వెళ్లుట సుఖతరమగును.

మంత్రార్థము :- వరుణ! మిత్ర! హేవరుణ! హేమిత్ర! మీరిరువురు, గర్తమ్ నాయీరథముమీద, ఆరోహథః = ఎక్కికూర్చుండుడు.

> జాయేవ పత్యే కామయమానా సువాసా ఋతుకాలేషూషా హసనేవ దంతాన్ వివృణుతే రూపాణీతి చతస్ర ఉపమాః. నాభ్రాత్రీముపయచ్ఛేత తోకం హ్యస్య తద్ భవతి ఇత్యభ్రాతృకాయా ఉపయమనప్రతిషేధః ప్రత్యక్షః పితుశ్చ పుత్రభావః.

ఉపయమన - ప్రతిషేధే వివాహార్థే పాణిగ్రహణప్రతిషేధ ఇత్యర్థః. పితుశ్చ పుత్రభావః. యదపత్య - మభ్రాతృకాయా స్తత్ పితుర్భవతి నేతరస్య. వేదుః. తస్మాత్ ఉపపన్నం భవతి. యైవాభ్రాతృమతీ సైవ పైతృకం ధన మర్హతి నేతరేతి.

అర్థము :- కామయమానా = కామించుచు, సువాసాః = ఉత్తమ వస్త్రములను ధరించుచున్నదై, జాయాఇవ = పత్నివలె, ఋతుకాలేషు = ఋతుకాలములందు, పత్యే = పతిని సమీపించునో, ఇవ = ఏవిధముగా, హసనా = హసనస్వభావముగల స్త్రీ, దంతాన్ = దంతములను, వివృణుతే = ప్రకటమొనర్చునో, ఇవ = ఆవిధముగనే, ఉషాః=ఉషస్సుకూడ

రూపాణి = రూపములను పదార్థములను ప్రకాశింపచేయును. నాలుగు ఉపమలు, అభ్రాతృమ్ = సోదరులులేని కన్యను, న ఉపయచ్ఛేత = వివాహమాడరాదు, హి = ఏలయన, తదస్య = ఆపుత్రులులేని తండ్రికి, తోకమ్ భవతి = పుత్రుడగును. అతనికి-పుత్రులులేని తండ్రికి పుత్రికయే పుత్రుడగును. ఈవిధముగ, అభ్రాతృకాయాః=సోదరులులేని కన్యయొక్క ఉపయమనప్రతిషేధః = వివాహము నిషేధింపబడుట, ప్రత్యక్షః = స్పష్ట మగుచున్నది, అత్ర, పితుశ్చ = తండ్రికిని కన్యవిషయమున పుత్రభావము, ప్రత్యక్షః = ప్రత్యక్షము, స్పష్టమగుచున్నదని భావము.

ఇంతవఱకు వ్రాయబడిన సమస్తవివరణమువలన నేమిస్పష్టమగు చున్నదనః- 'శాసద్వహ్నిః' అనుమంత్రముయొక్క పూర్వార్థమును గ్రహించి కొందఱు కన్యకు దాయభాగమున నర్హతయున్నదని సిద్ధాంతము చేసినారు.

కాని యిది సరికాదు. ఇంతవఱకు చెప్పినవివరణమంతయు పూర్వ పక్షమే. సిద్ధాంతము కాదు. వాస్తవమున సిద్ధాంతమేమన? సోదరులులేని కన్యకుమాత్రమే తండ్రియొక్క సంపదమీద అధికారముండును. కాని, సభ్రాతృక = సోదరులున్నకన్యకు తండ్రిధనము పంచుకొనుటకు దాయ భాగమునకు అర్హురాలు కాదు. ఈవిషయమును స్పష్టముచేయుటకు 'శాసద్ వహ్నిః' మంత్రముయొక్క ఉత్తరార్థమును వ్యాఖ్యానముచేయుచున్నారు.

**పితా యత్ర దుహితు రప్రత్తాయా రేతః సేకం ప్రార్జయతి**
**సందధాత్యాత్మానం సంగమేన మనసేతి.**

పితా యత్ర కాలే దుహితురప్రత్తాయాః ప్రాక్ప్రదానా దిత్యర్థః రేతః సేకం జామాతరం ప్రార్జయతి ప్రకల్పయతి తదా తస్మై తాం దుహి తరం దదత్ "సంశగ్మ్యేన మనసా దధన్వే" సంశగ్మ్యేన మనసా విగతాపుత్రత్వ సంతాపేన చేతసా సందధాత్యాత్మానం యదత్రాపత్యముత్పత్స్యతేతన్మమేతి

అర్థము :- యత్ర = ఏసమయమున, పితా = కన్యయొక్కతండ్రి, దుహితురప్రత్తాయాః = అవివాహితకన్యయొక్క, సేకం రేతః సేకమ్ = వీర్యము సించనమొనర్చుపతిని, యింజస్ ప్రార్జయతి = తెలుపును - వివాహసమయమున కన్యను కాబోవుపతికి ఇదితెలుపును - బోధించును. "ఈకన్యకు పుట్టబోవుపుత్రుడు నాపుత్రుడుగానే యెంచబడును." నను

ఈమెపుత్రుని దౌహిత్రునిగా నెంచను. నాపుత్రుడనియే యెంచెదను. అని బోధించును. ఆసమయమున నాకన్యాపిత సంశగ్మేన మనసా=సుఖయుక్త మనస్సుతో పుత్రాభావమువలన కలిగిన పరితాపమునుండి ముక్తుడై, సంచ ధస్వే = ధారణచేయును అనగా నాసమయమున తండ్రి నిర్వృతుడగును, సందధాతి ఆత్మానం సంగమేన మనసా = ఆత్మను - తనను సుసంగత మనస్సుతో యుక్తునిజేయును.

**అథైతాం జామ్యా రిక్థప్రతిషేధ ఉదాహరన్తి. జ్యేష్ఠం పుత్రి కాయా ఇత్యేకే.**

అథైతాం వక్ష్యమాణామృచం జామ్యా రిక్థప్రతిషేధ ఉదాహరన్తి ధర్మవిదః.

అర్థము :- ఏతామ్ = ఈనిమ్నలిఖితఋక్కును, జామ్యాః = కన్య యొక్క, రిక్థప్రతిషేధే = దాయభాగప్రతిషేధమునందు, ఉదాహరన్తి = ఉదాహరింతురు, ఏకే = కొందఱు ఈమంత్రమునే పుత్రికాయాః=పుత్రిక యొక్క, జ్యేష్ఠం = జ్యేష్ఠపుత్రుని, దాయభాగమునకధికారిగా సిద్ధముచేయ నుదాహరింతురు. కన్యయొక్క యితరసంతానమునకు దాయభాగ అధి కారములేదు. పుత్రికయొక్క జ్యేష్ఠపుత్రునికి మాత్రమే మాతామహుని సంపద కధికారముండును. కాని ఆమెకుబుట్టిన తక్కినపుత్రులకు మాతా మహునిసంపదను పంచుకొనుసధికారము లేదని కొందఱియభిప్రాయము.

"న జామయే తాన్వో రిక్థమారైక్ చకార గర్భం సనితు ర్నిధానమ్. యదీ మాతరో జనయంత వహ్నిమన్యః కర్తా సుకృతోరన్య ఋన్ధన్." (ఋ. 3-31-2)

న జామయే భగిన్యై జామిరన్యేస్యాం జనయన్తి జామవత్యమ్. జమతేర్వాస్యాద్ గతికర్మణః నిర్గమనప్రాయా భవతి. తాన్వ ఆత్మజః పుత్రః రిక్థం ప్రారిచత్ ప్రాదాత్ చకారైనాం గర్భ నిధానీమ్. సనితుర్ హస్తగ్రాహస్య. 'యదీమాతరోఽజన యన్త' వహ్నిం పుత్రమ్. అవహ్నించ స్త్రియమ్ అన్యనరః

సంతానకర్తా భవతి. పుమాన్ దాయాదః అన్యతరోఽర్ధయి
త్వా జామిః ప్రదీయతే పరస్మై.

జామయే భగిన్యై తాన్వః ఆత్మజః రిక్థం పైతృకం ధనమ్. న ప్రాదాత్ న ప్రదదౌ కిం తర్హి తస్యాః కరోతి? ఉచ్యతే - చకార గర్భం సనితుర్ నిధానమ్. సనితుర్ హస్తగ్రాహస్య భగిని - భర్తుః ప్రసవసమర్థాం కరోతి పుష్ణాతీత్యర్థః. కించ యదీ మాతరః యత్పుత్రద్వయం మాతరో జన యన్తి వహ్నిం వోఢారం పుత్రమవహ్నిం అవోఢ్రీం స్త్రియమ్. తయోర్ద్వ యోరపి పుత్రయోరన్యతరః ఏకతరః కర్తా సంతానకర్తా భవతి. యః పుమాన్ స ఏవ దాయాదో నేతరః కన్యాఖ్యః. పుంసో దానాతిసర్గవిక్రయాః కదాచిత్ కేనచిన్నిమిత్తేన భవన్తి. స్త్రీతు నిసర్గేణైవ దీయతే విక్రీయతే - విసృజ్యతే తస్మాదభాగా ఇతి.

మంత్రార్థము :— తాన్వః తనూజః=ఆత్మజుడు లేక ఔరసపుత్రుడు, జామయే = తోబుట్టువుకొఱకు, రిక్థమ్ = ధనమును, న అరైక్=ఇయ్యడు- అనగా, సభ్రాతృకకన్యా = సోదరులుకలిగిన కన్య దాయభాగమునకు అధికారిణి కాదు, కాని సోదరుడు తనసోదరిని, సనితుః హస్తగ్రాహస్య = భర్తయొక్క, గర్భమ్ = గర్భమును, నిధానిమ్=ధారణచేయగలుగునట్లు, చకార = చేయును. తనసోదరిని బాగుగ పోషించునని భావము. యది మాతరః = తల్లిదండ్రులు, వహ్నిమ్ = పుత్రుని, అవహ్నిం సామర్థ్యమువలన కన్యను - ఇరువురిని అజనయన్త = ఉత్పన్నముచేయునెడల, సుకృతోః = సమానప్రయత్నముతో కనిన పుత్రపుత్రికలలో, అన్యః అన్యతరః = ఇరు సంతానములలో ఒకపురుష - సంతానము, కర్తా = దాయభాగకర్తఅధికారి యగును. రెండవకన్యారూపసంతానము, ఋన్ధన్ = వస్త్రాలంకారాదులతో ఆరాధితయగును. దాయభాగమునకు అధికారిణిమాత్రము కాజాలదు

జామిః అన్యే అస్యాం జామ్ జనయన్తి జామిః = కన్య, అస్యాం = ఈమె యందు, అన్యే = ఇతరులు, జామ్ = సంతానమును కందురు. అందు వలన కన్య జామియనబడునని భావము - వా = లేక గత్యర్థక, జమతేః జమధాతువునకు 'ఇఞ్'చేసిన జామి పదమేర్పడును. నిర్గమనప్రాయా భవతీ = కన్య పుట్టిన ఇంటినుండి పతికులమునకు (నిర్గమన) వెళ్లి

పోషను. కావున జామి యనబడును, తాన్వః ఆత్మజఃపుత్రః = ఆత్మజుడు ఔరసపుత్రుడు, రిక్థం ప్రారిచత్ = ధనము నిచ్చును, అన్యతరఃజామిః అర్థ యుత్వా = రెండవ సంతానము - కన్య - బాగుగపోషించి అలంకృతనుచేసి, పరస్మై = ఇతరునకు యియ్యబడును.

ప్రథమపాదము సమాప్తము

## ద్వితీయపాదము

(మనుష్యనామ నిర్వచనము)

**మనుష్యనామాన్యుత్తరాణి పంచవింశతిః అపత్యాన్యేవహి వివృద్ధాని సన్తి మనుష్యాః.**

తస్మాత్ అపత్యనామభ్య ఉత్తరాణి మనుష్యనామాని.

రాబోవు (౨౫) ఇరువదియైదు మనుష్యనామములు. మనుష్యాః కస్మాత్ ? మత్వా కర్మాణి సీవ్యన్తి. మనస్యమానేన సృష్టాః. మనస్యతిః పునర్మనస్వీభావే. మనోః అపత్యమ్ మనుషో వా.

మత్వా జ్ఞాత్వా కర్మాణి సీవ్యన్తి సంతన్వన్తీత్యర్థః. అథవా మనస్య మానేన ప్రజాపతినా మనస్వీభావే. మనస్వీభావో నామ ప్రహృష్టతా. అథవా మనోః అపత్యం మనుష్యాః.

అర్థము :— మనుష్యుడని యేల అనబడుచున్నాడు మత్వా = ఆలోచించి కర్మలుచేయుదురు కావున మనుష్యులనబడుదురు. లేక మనస్యమానేన = ఆలోచించుచు ప్రజాపతిచే, సృష్టాః = మనుష్యులు సృష్టింపబడిరి. కావున మనుష్యులనబడుచున్నారు. మనస్యమానేన పదమునకర్థము. ప్రహృష్టమనస్యతిః పునః మనస్వీభావే. మనస్యతి ధాతువు నకు మనస్వితయని అర్థము. ప్రహృష్టత = ప్రశస్తమనస్సు, మనోరపత్యం మనుషో వా లేక మనోరపత్యమ్ = మనువుయొక్క అపత్యము మనుషః= మనుష్యుడు మను, మనుషపదములు ప్రశస్తవాచకములు.

**తత్ర పంచజనా ఇత్యేతస్య నిగమా భవన్తి తద్యథా.**

మనుష్యనామములలో 'పంచజనాః' అనునామమునకు అనేక నిగమ ములు మంత్రములున్నవి.

"తదద్య వాచః ప్రథమం మంసీయ యేనాసురాం అభిదేవా అసామ. ఊర్జాద ఉత యజ్ఞియాసః పంచజనా మమ హొత్రం జుషధ్వమ్." (ఋ. ౧౦-౫౩-౪)

తదద్య వాచః పరమం మంసీయ యేనాసురా నభిభవేమ దేవాః. అసురాః అసురతాః స్థానేష్వస్తాః స్థానేభ్య ఇతి వా. అపి వసురితి ప్రాణనామ అస్తః శరీరే భవతి. తేన తద్వన్తః సోర్దేవా నసృజత తత్ సురాణాం సురత్వమ్. అసోరసురా నసృజత. తదసురాణా మసురత్వమితి విజ్ఞాయతే.

ఊర్జాద ఉతయజ్ఞియాసః అన్నాదాశ్చ యజ్ఞియాశ్చ ఊర్గి త్యన్ననామ. ఊర్జయతీతి సతః. పక్వం సుప్రవృక్ణమితి వా. పంచజనా మమ హొత్రం జుషధ్వమ్. గంధర్వాః పితరో దేవా అసురా రక్షాంసీత్యేకే. చత్వారో వర్ణాః నిషాదః పంచమః ఇత్యౌపమన్యవః నిషాదః కస్మాత్ ? నిషదనో భవతి. నిషణ్ణ మస్మిన్ పాపకమితి నైరుక్తాః. యత్ పాంచ జన్యయా విశా పంచజనీనయా విశా. పంచపృక్తా సంఖ్యా స్త్రీపుంనపుంసకే ష్వవిశిష్టా.

తత్ వీర్యం వాచః పరమమ్ ఉత్కృష్టమ్. మంసీయ మన్యే జానే ఇత్యర్థః. యేనాసురా నభిభవేమ వయం దేవాః. హే ఊర్జాదః అన్నభక్షయితారః అపి చ యజ్ఞియాసః యజ్ఞసంపాదినో దేవాః. యూయం పంచజనాః మనుష్యాశ్చ నిషాదపంచమా వర్ణాః. మమేదం హొత్రం జుషధ్వమ్ అనుగృహ్ణీధ్వమ్. అసురాః అసురతాః స్థానేషు న సుష్ఠురతాః. స్థానేషు చపలా ఇత్యర్థః. అథవాఽస్తాః స్థానేభ్యః ప్రచ్యావితా దేవైరిత్యర్థః అసుః ప్రాణః స హి అస్తః క్షిప్తః ఇవ దేహే భవతి. రో మత్వర్థే తద్వన్తః సోర్దేవా న సృజత సురితి ప్రశస్తనామ. తస్మాత్ ప్రశస్తాదాత్మనః ప్రదేశాదిత్యర్థః. ప్రజాపతిః సురా నసృజత. అసోరసురా నసృజత అసురితి ప్రశస్తప్రతిషేధః అప్రశస్తాదాత్మనః ప్రదేశాత్ ప్రజాపతిరసురానసృజత. ఊర్గిత్యన్ననామ.

తద్ధి ఊర్జయతి బలిష్ఠం కరోతీత్యర్థః. నిషద్య హ స్తీతి నిషాదః. ప్రాణిపథ జీవనః యథా తు పంచజనశబ్దేన మనుష్యావివోచ్యన్తే తథైషనిగమః. "యత్పంచజన్యయా విశా పంచజనీనయా" పంచసంఖ్యా స్త్రీత్వం నపుంసకేష్వవిశిష్టా. తద్యథా పంచస్త్రియః పంచపురుషాః పంచకులాని ఇతి. స్త్రీపుంనపుంసకేషు విశేషో నాస్తి.

మంత్రార్థము :- అద్య = నేడు, వాచః = వాణియొక్క, తత్ పరమమ్ = ఆయుత్కృష్టమైన వీర్యమును, మంసీయ=తెలియగలిగితిని, యేన = ఏవాగ్వీర్యముతో, అసురాన్ = అసురులను అభిభవామ - అభి భవామ = పరాజితుల జేయగలుగుదుమో, ఊర్జాదః హే అన్నభక్షంయుతః! ఉత యజ్ఞియాసః=అన్నమును భక్షించునట్టియు యజ్ఞమును సంపాదించు నట్టియు దేవతలార! హే పంచజనాః = నిషాదపంచమవర్ణయుక్తమానవులార మమ హోత్రమ్ = నాయజ్ఞమును, జుషధ్వమ్ = సేవింపుడు - మీరెల్లరు నాయజ్ఞమున సమ్మిళితులగుదురుగాక! అసురాః అసురతాః స్థానేషువా = అసురులను నామమేల? స్థానములందు స్థిరులుకానివారిని అసుర లందురు. చంచలురనిభావము. అస్తాః స్థానేభ్యః ఇతివా=లేక అసురులను దేవతలు స్థానచ్యుతులనుజేసిరి. అందువలన వారు అసురులనబడుదురు. అపివా = లేక, అసుః - ఇతిప్రాణనామ = అసుశబ్దము ప్రాణవాచకము, అస్తఃశరీరేభవతి = ప్రాణము శరీరమునందు 'అస్తః'=ప్రక్షేపింపబడును - విసిరివేయబడును - కావున - అసన్క్రియాయోగమువలన ప్రాణము అసు అనబడుచున్నది. తేన = అకారణముచే, తద్వన్తః = అసువులుకలవారు - ప్రాణధారులు అసురులనబడుచున్నారు, లేక సోః = ఉత్తమస్థానము నుండి, దేవాన్ = దేవతలను, అసృజత = సృజించెను - కావున దేవతలు సురలైరి. తత్ = అదియే, సురాణాంసురత్వమ్ = సురులలోగల సుర త్వము, అసోః = కుత్సితస్థానమునుండి, అసురాన్ అసృజత = అసురులను సృష్టించెను కావున అసురులనబడిరి. అదియే కుత్సితస్థానసృజనత్వమే అసురులయసురత్వము - ఇతి విజ్ఞాయతే = అని తెలియబడుచున్నది. ఊర్క్ ఇతి = ఇది అన్నవాచకము, ఊర్జయతీతి సతః=అన్నము బలమును ప్రాణమును నిచ్చును. ఊర్జబలప్రాణనయోః = బలప్రాణనార్థక ఊర్జ ధాతువుతో ఊర్క్ పదమేర్పడును. అథవా = లేక, పక్వమ్ = పచనము

చేయబడిన అన్నము బలప్రాణదాయకమగును. కావున పక్వశబ్దముచే ఊర్క్ సిద్ధమగును. 'పక్వ'పదమునందలి పకారమునకు లోపము, 'క్వ'కు విపర్యయము, 'వ'కారమునకు 'ఊల్'ప్రత్యయము 'చక్'ఆగమమువేసి నందున పక్వశబ్దము-'ఊర్క్'గా సిద్ధించును. సుప్రవృక్ణమ్ ఇతివా అథవా లేక అన్నము తేలికగా ఖండింపబడును లేక వ్రశ్చలోనిరలోపము, సంయోగరూపమైన వకారమునకు ఊల్ దుడాగమము కుత్వముచేయుటచే వ్రశ్చతోకూడ ఊర్క్ సిద్ధమగును. 'పంచజనా మమ హోత్రం జుషధ్వమ్' ఈవాక్యమునందలి పంచజనశబ్దముచే చెప్పబడు పంచజనులెవరు? అన సమాధానము. గంధర్వాః పితరః దేవాః అసురాః రక్షాంసి" ఇతి - కొందఱు గంధర్వులు దేవతలు పితరులు - అసురులు రాకసులు - అను వీరు పంచ జనులు. చత్వారః వర్ణాః పంచమః నిషాదః ఇతి ఔపమన్యవః బ్రాహ్మణాది నాలుగువర్ణములు, పంచమః = నిషాద = చండాలుడు, వీరు పంచజను లనబడుదురని ఔపమన్యుని కథనము. నిషాదః కస్మాత్ నిషదనో భవతి = ప్రాణులను జంపువాడు నిషాదుడనబడును. నిషణ్ణమస్మిన్ పాపకమ్ ఇతివా = లేక పాపమితనియందుండును కావున నిషాదుడనబడును. అని నిరుక్తకారులు బ్రాహ్మణాది వర్ణములు నాలుగు. పంచమః నిషాదుడను నిరుక్తి నైరుక్తుల కిష్టము ఇందులకు మంత్రము నుధాహరించుచున్నాడు.

"యత్ పాంచజన్యయా విశేంద్రే ఘోషా అసృక్షత"
(ఋ-౮.3-౭)

యత్ = ఎప్పుడు, పాంచజన్యయావిశా = నాలుగువర్ణములు, ఐదవ వాడగు నిషాదుడు వారిప్రజలునెల్లరు కలిసి, ఇంద్రే = భగవంతుడగు నింద్రుని విషయమున, ఘోషాః = స్తుతులు, అసృక్షత = చేసిరో అంతట ఇంద్రుడు వర్ధించెను. ఈమంత్రమున నిషాదునితోకూడిన నాలుగువర్ణములే గ్రహింపబడినవి. పంచపృక్తాసంఖ్యా = పంచసంఖ్యానామము, పృక్త - సంపృక్త = కలిసియుండును. స్త్రీలింగము, పుంలింగము, నపుంసకలింగము అను మూడులింగములందును, సమాసరూపమున కలిసియుండును. మూడులింగములందు సంఖ్యావాచకమగు 'పంచ'అనునది సమానరూప మున నుండును.

(అథబాహునామాని)

**బాహునామాన్యుత్తరాణి ద్వాదశ.**

మనుష్యాణా మేవ హి బాహవో భవన్తీతి మనుష్యనామభ్య ఉత్తరాణి బాహునామాని రాబోవు ౧౨ ద్వాదశ బాహువాచకములు.

**బాహుః కస్మాత్ ? ప్రబాధత ఆభ్యాం కర్మాణి.**

ప్రకర్షేణ బాధతే ప్రక్షేపయత్యాభ్యాం కర్మాణి.

అర్థము :— బాహువు అనియేల ? ఆభ్యాం కర్మాణి ప్రబాధతే = ఈ రెండు బాహువులతో కర్మల నాచరించును. అందువలన బాహువులన బడును. అథాంగులినామాని = అంగులినామములు.

**అఙ్గులినామా న్యుత్తరాణి ద్వావింశతిః.**

బాహ్వోరేపహ్యఙ్గులయో భవన్తీతి బాహునామభ్య ఉత్తరాణ్యఙ్గులి నామాని = అంగుళినామములు ౨౨ ఇరువదిరెండు - అంగుళులు చేతులకే యుండును. కావున బాహునామానంతరము అంగుళినామనిర్వచనము.

**అఙ్గులయః కస్మాత్ ? అగ్రగామిన్యో భవన్తీతి వా. అగ్ర గాలిన్యో భవన్తీతి వా. అగ్రకారిణ్యో భవన్తీతి వా. అగ్ర సారిణ్యో భవన్తీతి వా. అఙ్కనా భవన్తీతి వా అంచనా భవన్తీతి వా అపి వాభ్యంచనాదేవ స్యుః.**

అగ్రగామిన్యో భవన్తి. అగ్రే హ్యేతాః కర్మసు గచ్ఛన్తి అగ్రగామిన్యో భవన్తి అగ్రే హ్యేతా గలన్త్యుదకాని - అగ్రకారిణ్యః అగ్రే హ్యేతాః కర్మాణి కుర్వన్తి.

అర్థము :— అంగులి - ఎట్లు ? అగ్రగామిన్యః భవన్తి = ముందు వెళ్లునవి. ప్రతికార్యమునందును నివి ముందుండును, అగ్రగాలిన్యః భవన్తి = ముందునీటినికార్చునవి, అగ్రకారిణ్యః భవన్తి = ముందుకార్య ముల నొనర్చునవి, అగ్రసారిణ్యః భవన్తి = ప్రతికార్యమునందు ముం దుండును అగ్రసరములగును, అంకనా భవన్తి = చిహ్నములనేర్పఱచు నవి, అంచనాః భవన్తి = పూజనొనర్చునవి, అభ్యంచనా భవన్తి = ప్రతి కార్యమునందును అభిముఖముగా - ఎదురుగా వెళ్లును. పైపర్తించిన

కార్యములందు ప్రేళ్లు - అంగుళులు ముందుండును కావున పది అంగుళు లనబడుచున్నవి.

**తాసా మేషా భవతి.**

తాసామ్ అంగులీనామ్ ఏషాఋక్ నిర్వాచికా భవతి.

ఈయంగుళుల విషయమున నీఋఙ్మంత్రము చూడనగును.

> "దశావనిభ్యో దశకక్ష్యేభ్యో దశయోక్త్రేభ్యో దశయోజనేభ్యః దశాభీశుభ్యో అర్చతాజరేభ్యో దశధురో దశయుక్తా వహద్భ్యః" (ఋ. ౧౦- ౯-౭)
>
> అవనయోఽఙ్గులయో భవన్తి అ... న్తికర్మాణి-కక్ష్యాః ప్రకాశయన్తి కర్మాణి - యోక్త్రాణి యోజనానీతి వ్యాఖ్యాతమ్. అభీశవోఽభ్యశ్నువతే కర్మాణి దశధురో దశయుక్తా వహద్భ్యః ధూర్ధూర్వతే ర్వధకర్మణః.

దశావనిభ్య ఇతి. త్రిష్టుబేషా గ్రావస్తుతౌ వినియుక్తా. హేఋత్విజః యూయమపి అర్చత స్తుతిః ప్రోచ్చారయతేత్యర్థః. దశభిరవనిభి ర్యే ఉపచర్యన్తే గ్రావాణః సోమాభిషవకర్మణి తే దశావనయస్తేభ్యో దశావనిభ్యః ఏవమేవ దశకక్ష్యేభ్యో దశయోక్త్రేభ్యో దశయోజనేభ్యో దశాభీశుభ్యః. అజరేభ్యః అజరణధర్మభ్యో దశధురో దశాంగులియుక్తా వహద్భ్యః ఇతి సమస్తార్థః అథైకపదనిరుక్తమ్ - అవన్తి - రక్షన్తి ప్రకాశయన్తి ప్రకటీకుర్వన్తీత్యర్థః. అభ్యశ్నువతే వ్యాప్నువన్తీత్యర్థః ధూర్వూర్వతే ర్వధకర్మణః.

మంత్రార్థము :— దశావనిభ్యః దశభిరవనిభి రుపచర్యన్తే యే తే దశావనయః తేభ్యః దశావనిభ్యః గ్రావభ్య ఇతిశేషః = కర్మలను రక్షించు పదిప్రేళ్లతో సోమాభిషవకర్మమునందు వేనిసేవనచేయబడినదో, వేని యుపయోగము గ్రహింపబడినదో, యట్టిశిలలకొఱకు, అర్చత=అర్పింపుడు, హేఋత్విజులారా! స్తుతియించుడు. దశకక్ష్యేభ్యః = కర్మల ప్రకాశింప జేయు దశఅంగుళులతో వేనితో కార్యమొనరింపబడినదో, యట్టి శిలల కొఱకు స్తుతియించుడు, దశయోక్త్రేభ్యః = వస్తువులను పరస్పరము కలుపునట్టి పదిప్రేళ్లతో, దశయోజనేభ్యః = పదార్థములను పరస్పరము కలుపు

నట్టి దశాంగుళులతో, అభీశుభ్యః = కార్యలగ్నములైన అంగుళులతో ఉప
యోగము పొందబడినది. అనగా కార్యములందు ప్రేళ్లు ఉపయోగింప
బడినవని భావము. అట్టి శిలలకొఱకు స్తుతులనుచ్చరించుడు. అజరేభ్యః=
అజరధర్మముగల శిలలకొఱకు స్తుతించుడు. దశయుక్తావహద్భ్యః =
దశాంగుళులతోకూడి యేశిలలు సోమాభిషవకర్మ నొనరించుచున్నవో యట్టి
శిలలను స్తుతింపుడు, దశధురః = హింసకదశాంగుళులుగల శిలలెయ్యవి
గలవో వానిని స్తుతించుడు. అవసయః అంగులయః భవన్తి = అవనులు
అంగుళులనబడును. ఏలయన - ఈయంగుళులే, కర్మాణి అవన్తి = కర్మ
లను రక్షించును. పనులన్నియు నీప్రేళ్లతోనే చేయబడును, కక్ష్యాః కర్మాణి
ప్రకాశయన్తి అంగులయః = కక్ష్యపదము అంగుళివాచకము ఏలయన
ప్రేళ్లు కర్మలను ప్రకాశింపజేయును, అభీశవః అభ్యశ్నువతేకర్మాణి = ఈ
యంగుళులు అభీశులనబడును. అంగుళులు కర్మలందు వ్యాప్తములై
యుండును, ధురః ధూర్వతేః వధకర్మణః = వధార్థకధుర్వీధాతువుతో ధురః
పదము సిద్ధమగును. ఈప్రేళ్లతో హింసయు జరుపబడును, యోక్త్రాణి
యోజనాని ఇతి వ్యాఖ్యాతమ్ = యోక్త్రశబ్దము యోజనశబ్దముతో వ్యాఖ్యా
నింపబడినది. యోజనశబ్దము బోధించుటయందు ప్రసిద్ధము. ధురః,
యోక్త్రము - రెండును అంగుళులనే తెలుపును.

ఇయమపీతరా ధూ రేతస్మాదేవ విహన్తి వహమ్ ధారయ
తేర్వా.

ఇయమపీతరా ధూః అనడుహది సంబంధినీ. ఏతస్మాదేవ ధాతో
ర్వధకర్మణః విహన్తి వహమ్ అనడుహోఽశ్వస్య వా ధారయతేర్వా సా
హి ధారయత్యశ్వమనడ్వాహం చ.

అర్థము :— ఇయమపి ఇతరా ధూః = ఇదియు మఱియొక బండి
యొక్క కాడికి నామము. 'ధూః'శబ్దము ఏతస్మాదేవ = ఈ వధార్థక ధుర్వీ
ధాతువుతో నేర్పడును, వహమ్ విహన్తి వహం స్కంధః తమ్ = ఈ కాడి
బరువును వహించు ఎద్దుయొక్క స్కంధమును - మెడను, వహతి =
వధతి - చంపును - గాయపఱచును, ధారయతేః వా=ఈ 'ధూ'కాడి గుఱ్ఱము

చేతనో లేక ఎద్దుచేతనో ధరింపబడును. ధారణార్థక ధృధాతువుతో ధూ
శబ్దము సిద్ధించును.

(అథకాంతికర్మాణః)

కాంతి - అర్థకధాతువులు

**కాంతికర్మాణ ఉత్తరే ధాతవోఽష్టాదశ.**

కాంత్యర్థకధాతువులు ౧౮.

స ఖల్వాయం పురుషో వ్యాఖ్యాతః సబాహుః సాంగుల స్తం ఖలు కామ ఏవ ప్రథమ మావివేశేత్యుత్తరే కాంత్యర్థా ఇత్యర్థః.

సాంగులః అయం పురుషః సబాహుః=సబాహువు సాంగులుడు నగు నీపురుషుడు, వ్యాఖ్యాతః = వ్యాఖ్యానింపబడెను. ఆతనిని కాముడావేశించెను.

(అథ అన్ననామములు)

**అన్ననామాన్యుత్తరాణి అష్టావింశతిః.**

అన్నమేవ హి కాంతం సర్వభావేభ్యో భవతీతి కాంతికర్మభ్య ఉత్తరాణి అన్ననామాని.

ముందురాబోవు ౨౮ ఇరువదియెనిమిది అన్ననామములు. పదార్థము లన్నిటికంటెను అన్నమే కాంతము. కాంత్యర్థకధాతువులకు తదుపరి అన్ననామములు నిర్వచింపబడినవి.

**అన్నం కస్మాత్ ? ఆనతం భూతేభ్యః - అత్తేర్వా.**

ఆనతం ప్రహ్వీభూతం భవతి భోజనాయ భూతానామ్. అత్తేర్వా అద్యతే అత్తిచ భూతాని తస్మాదన్నమ్.

అన్నమ్ - ఏల ? అన్నము సర్వప్రాణులకు ప్రహ్వీభూత = ఆనత మగుచున్నది - లేక ప్రాప్తమగుచున్నది. అత్తేర్వా = ప్రాణులన్నింటిచే తినబడును. అదభక్షణే=ధాతువుతో అన్నశబ్దమేర్పడును. ప్రాణులు తినును. కావున అన్నమనబడుచున్నది.

(అథాత్తి - కర్మాణః)

(అత్త్యర్థకములు)

**అత్తి కర్మాణః ఉత్తరే ధాతవో దశ.**

అన్నమేవ హ్యద్యత ఇత్యన్ననామభ్య ఉత్తరేఽత్తికర్మాణః సమామ్నాతాః - రాబోవు పదినామములు అత్తి అర్థములుకల ధాతువులు.

(బలనామములు)

**బలనామా న్యుత్తరాణి అష్టావింశతిః.**

య ఏవ హ్యదన్తి త ఏవ బలవన్తో భవన్తి త్యత్తికర్మభ్య ఉత్తరాణి బలనామాని.

రాబోవు ఇరువదియెనిమిది బలనామములు.

అన్నము తినువారు బలవంతులగుదురు. కావున అత్త్యర్థకధాతునామములకు తదుపరి బలనామములు వ్యాఖ్యానింపబడుచున్నవి.

**బలం కస్మాత్ ? బలం భరం భవతి బిభర్తేః.**

బలం భరం భవతి. భ్రియతే హి స యో బలిష్ఠో భవతి - బిభర్తేర్వా స హ్యన్యేషాం భర్తా భవతి.

బలము అననేల ? బలము భరమగుచున్నది. అది ధారణ పోషణముల నొనర్చును. 'డుభృఞ్' ధారణపోషణయోః ధారణపోషణార్థక ధాతువువలన బల - శబ్దమేర్పడును.

(ధననామములు)

**ధననామా న్యుత్తరా ణ్యష్టావింశతి రేవ.**

య ఏవ బలవన్తో భవన్తి త ఏవ ధనం ప్రాప్నువన్తి ఇతి బలనామభ్య ఉత్తరాణి ధననామాని.

రాబోవు ఇరువదియెనిమిది ధననామములు.

బలవంతులే ధనమును బొందుదురు. కావున బలనామములకు తదుపరి ధననామములు వ్యాఖ్యాతములు.

**ధనం కస్మాత్ ? ధినోతీతి సతః.**

ధినోతి స్తర్పణార్థః.

ధనమననేల? ధనమెల్లరిని తృప్తిపఱచును. ప్రీణనార్థక, తృప్త్యర్థక 'ధివి'ధాతువుతో ధనశబ్దమేర్పడును.

(గోనామములు)

**గోనామా న్యుత్తరాణి నవ.**

గావ ఏవ హి ప్రకృష్టం ధనమ్ ఇతి. ధననామభ్య ఉత్తరాణి గోనామాని.

ఇటపై తొమ్మిది గోనామములు.

గోవులే ఉత్తమధనము. కావున ధననామానంతరము గోనామములు.

(క్రుధ్యతినామములు)

**క్రుధ్యతి కర్మాణ ఉత్తరే ధాతవో దశ.**

ధనార్థమేవ హి గవార్థం చ క్రోధో భవతి ఇతి గోనామభ్య ఉత్తరే క్రుధ్యర్థాః సమామ్నాతాః.

(అథక్రోధనామాని)

**క్రోధనామా న్యుత్తరాణి ఏకాదశ.**

ఇటపై పదునొకండు క్రోధనామములు. క్రుధ్యర్థమునకు సంబంధించినవే క్రోధనామములు పదునొకండు.

(గత్యర్థకధాతువులు)

**గతికర్మాణ ఉత్తరే ధాతవో ద్వావింశశతమ్.**

క్రుద్ధా ఏవ సన్తః సుతరాం గచ్ఛన్తీతి క్రోధనామభ్య ఉత్తరే గతికర్మాణః = క్రుద్ధులైనవారు బొత్తిగా వెళ్లిపోవుదురు. కావున క్రోధనామానంతరము గత్యర్థకధాతువులు నూటఇరువదిరెండు వ్యాఖ్యానింపబడును.

(క్షిప్రనామములు)

**క్షిప్రనామా న్యుత్తరాణి షడ్వింశతిః.**

గతిసంబంధాదేవ క్షిప్రనామాని.

గతితో సంబంధముండుటవలన గతి - అర్థకధాతువుల తరువాత ఇరువదియారు క్షిప్రనామములు.

**క్షిప్రం కస్మాత్ ? సంక్షిప్తో వికర్షః.**

సంక్షిప్తః క్షిప్రమిత్యుచ్యతే వికర్షో వికృష్టో విక్షిప్తోఽర్థః = విక్షిప్త కార్యమును సంక్షిప్తః = సంక్షిప్తము, వికర్ష = సంకుచితము చేయుటయే క్షిప్రమనబడును. ఆలస్యముగా జరుగు కార్యమును శీఘ్రముగా చేయుట క్షిప్రమనబడును.

(అథ అంతికనామములు)

**అంతికనామాన్యుత్తరాణ్యేకాదశ.**

య ఏవ హి క్షిప్రం గచ్ఛతి స ఏవాభిప్రేతార్థస్య అంతికే - సమీపే భవతీతి క్షిప్రనామభ్య ఉత్తరాణ్యంతికనామాని.

రాబోవు పదకొండు (౧౧) అంతిక-సమీపనామములు. క్షిప్రగమనము గలవారే అభిప్రేతార్థమును సమీపింతురు. కావున క్షిప్రనామానంతరము అంతికనామములు వ్యాఖ్యానింపబడుచున్నవి.

**అన్తికమ్ కస్మాత్ ? ఆనీతం భవతి.**

ఆనీతం భవతి సన్నికృష్టత్వాత్. అన్తికమ్ అననేల? దూరమునుండి దగ్గఱకు తేబడును.

(సంగ్రామనామములు)

**సంగ్రామనామాన్యుత్తరాణి షట్చత్వారింశత్.**

అంతికీభూతానామేవ హి సంగ్రామో భవతి ఇత్యన్తికనామభ్య ఉత్తరాణి సంగ్రామనామాని.

రాబోవు ౪౬ సంగ్రామనామములు.

**సంగ్రామః కస్మాత్ ? సంగమనాద్వా సంగరణాద్వా సంగతౌ గ్రామావితి వా. తత్ర ఖల ఇత్యేతస్య నిగమా భవన్తి.**

సంగమనాద్వా - సంగచ్ఛన్తే హి పరస్పరేణ తత్ర యోధాః. సంగరణాద్వా - సంగృణన్తి సంశబ్దాయన్తే శూరా యత్ర పరస్పరేణ సంగతౌ గ్రామావితి వా. పరస్పరం జిగీషయా సమాగతౌ తత్ర భవతః.

తత్ర సంగ్రామనామగణే ఖల ఇత్యేతస్య నామ్నః నిగమాః సందిగ్ధా భవన్తి. యత ఇతరోఽపి ధాన్యానాం ఖలః గాహనభూమిః ఖలశబ్దేనోచ్యతే. అతః సందేహః.

అర్థము :- సంగ్రామః కథమ్ ఎట్లు? సంగమనాద్ వా. లేక, యుద్ధమున యోధులు యుద్ధముచేయుటకు ఏకత్రితులగుదురు - ఒకచో చేరుదురు. అందువలన సంగ్రామమనబడును. సంగరణాద్ వా-లేక సంగరణమువలన సంగ్రామమనబడును. సంగరణమన శబ్దముచేయుట. యుద్ధమున శూరులు, వీరులు నొకచో జేరి కలహించుసమయమున పెద్దగా కేకలు వేయుదురు. లేక - కోలాహలము చేయుదురు. గ్రామౌ సంగతౌ = పరస్పరము కొట్లాటకు రెండుసమూహములు - గ్రామవాసులు - ఒకచో చేరుదురు. సమ్పూర్వక'గమ్'ధాతువుతో సంగ్రామశబ్ద మేర్పడును. సమ్పూర్వక 'గౄ'ధాతువుతో సంగరణ - సంగ్రామశబ్దమేర్పడును. తత్ర = సంగ్రామనామములందు 'ఖలః'శబ్దముగల మంత్రములున్నవి.

> "అభీదమేక మేకః అస్మి నిష్షాళభీద్వా కిము త్రయః కరన్తి. ఖలే న పర్షాన్ప్రతి హన్మి భూరి కిం మా నిన్దన్తి శత్రవో నింద్రాః." (ఋ. ౧౦-౪౮-౭)
>
> అభిభవామీదమేకమేకః అస్మి. నిష్షహమాణః సపత్నానభిభవామి. ద్వౌ కిం మా త్రయః కుర్వన్తి. ఏక ఇతా సంఖ్యా ద్వౌ ద్రుతతరా సంఖ్యా త్రయస్తీర్ణతమా సంఖ్యా చత్వారశ్చలితతమా సంఖ్యా అష్టావశ్నోతేః నవ న వననీయా నావాప్తా వా. దశ దస్తా దృష్టార్థా వా వింశతి ర్ద్విర్దశతః. శతం దశదశతః. సహస్రం సహస్వత్. అయుతం నియుతం ప్రయుతం తత్తదభ్యస్తమ్. అర్బుదో మేఘో భవతి. అరణమంబు తద్దోఽంబుదః అంబుమద్భాతీతి వా. అంబుమద్భవతీతి వా. స యథా మహాన్ బహుర్భవతి వర్షస్తదివార్బుదమ్. "ఖలే న పర్షాన్ప్రతి హన్మి భూరి" ఖల ఇవ పర్షాన్ ప్రతిహన్మి భూరి ఖల ఇతి సంగ్రామనామ

ఖలతేర్వా స్ఖలతేర్వా. అయమపీతరః స్ఖల ఏతస్మాదేవ.
సమాస్కన్నో భవతి. "కిం మా నిన్దన్తి శత్రవోఽనింద్రాః"
య ఇంద్రం న విదుః. ఇంద్రోహ్యాహమస్మి అనింద్రా ఇతర
ఇతి వా.

వైకుంఠస్యేన్ద్రస్యేయ మార్షమ్. ఇదం జగత్. ఏక ఏవాహ మభి
అస్మి అభిభవామి పర్త్రే ఇత్యర్థః ఏకమేకో నిష్షాడ్ నిషహమాణః అభిభవన్
సహతిరభిభవార్థః ఛందసి. యావదేకమాగతమేక ఏవాభిభవామి సపత్నం
శత్రుమ్. అభిద్వా ద్వావప్యాగతా వేక ఏవాభిభవామి. కిము త్రయః కరన్తి
త్రయోఽపి యుగపదాగతాః సన్తః ఏకాకినోఽపి మమ కిం కుర్వన్తి? న
కించిదపీత్యభిప్రాయః కించ ఖలే న పర్షాన్ యథా ఖలేఖలస్థానే కర్షకేణ
పర్షాన్ బహూనపి సంచితాన్ పూలాన్ అప్రతిబంధేన క్షుద్యేవన్. ఏవమహ
మపి భూరీనపి శత్రూనాగతాన్ క్షణాదేవ తైరప్రతిబధ్యమానో హన్మి.
తమేవం ప్రభావం మాం కిం నిందన్తి శత్రవః? నాహం నిందార్హః స్తుత్యోఽ
హమిత్యభిప్రాయః. అపిచానింద్రాః సన్తః యే మా మింద్రం న విదుర్
యాథార్థ్యతస్తే కథమవిజ్ఞాయైవ మామింద్రం నిందన్తి? నైతన్న్యాయ్యమితి
భావః. అథైకపదనిరుక్తమ్. ఏక ఇతా సంఖ్యా సంఖ్యాత్వం ప్రాప్తేత్యర్థః.
ద్వే ద్రుతతరా సంఖ్యా ఏకస్యాః సకాశాత్. త్రయస్తీర్ణతమా ద్వయోః
సకాశాత్ చస్తా దశాంతైవ హి సంఖ్యా భవతి. వృద్ధ్యర్థావా దశానా ముపరి
పునఃపునర్వృత్యతే సంఖ్యా. ఏకాదశేత్యేవమాది. తస్మాద్దశేత్యుచ్యతే వింశతి
ర్ద్విర్దశతః ద్విర్దశవింశతి రిత్యుచ్యతే శతం దశదశతః దశకృత్వోఽభ్యస్తా
దశ దశ తాః సముదితాః శతమిత్యుచ్యతే. సహస్రం సహస్వత్ దుర్బలానా
మపి సహస్రం సముదితం బలవదేవభవతి సంఘాతస్య బలీయస్త్వాత్.
అయుతమపి దశకృత్వోఽభ్యస్తం నియుతమిత్యుచ్యతే. అర్బుదం గమనశీలం
తద్ధి తస్య దాతా మేఘః సోఽమ్బువ ఇత్యుచ్యతే స యథా ఉదకభావ
మాపద్యమానః బహుర్భవతి తద్వత్ అర్బుదమపి ద్రవ్యం వర్షత్ బహు
భవతి. అయమపీతరః ఖలః ధాన్యఖల ఏతస్మాదేవ ఖలతేః తత్రాపి హి
భ్రశ్యన్తి చూర్ణ్యమానాని ధాన్యాని.

అర్థము :- ఇదమ్ = ఈ యింద్రుడనగు నేను సమస్తజగత్తును,
అభిఅస్మి = ఓడించుచున్నాను, ఏకమేకఏవ = ఒక్కడనే శత్రువును

ఓడించుచున్నాను, నిష్టాట్ = మిక్కిలిబాగుగ శత్రువుల నోడించునేను, ద్వౌ=ఇరుపురు శత్రువులనుకూడ ఇప్పుడే ఓడించుచున్నాను, త్రయః = ముప్పురుశత్రువులు కలిసియు, కిము కరన్తి = ఏమిచేయగలరు? నన్ను ఏమియు చేయజాలరనిభావము, ఖలే = కల్లమునందు గల ధాన్యరాసులవలె నుండు శత్రుసమూహములను, భూరి = చాలమందిని, హన్మి = నేను చంపుదును, అనింద్రాః = అసమర్థులైన శత్రువులు, కిం మాం నిందన్తి = నన్ను నిందింపగలరా? ఏకహితాసంఖ్యా = ఒకటి అనునది ఇతరసంఖ్యలతో చేరును, ద్విత్వాదిసంఖ్యలందు - రెండుమొదలు పరార్థమువఱకు నుండు సంఖ్యలలో ఒకటి నివిష్టమైయుండును, ద్వౌద్రుతతరాసంఖ్యా = రెండు - ద్వాయని యేల చెప్పబడును? ఏకసంఖ్యకంటె ద్విసంఖ్య ద్రుతతరా = ఎక్కువతేజస్సుగలది, త్రయఃతీర్ణతమా = త్రిత్వసంఖ్య ద్విత్వముకంటెను త్వరగా ముందుండును, చత్వారః చలితతమా. చత్వారః = నాలుగుసంఖ్య మూటికంటె మిక్కిలివేగముగా నడచును అష్టా = సంఖ్యా, అశ్నోతేః = అశూ ధాతువుతో అష్టాపదమేర్పడును. అష్టాసంఖ్య సంఖ్యలందన్నింటియందు వ్యాప్తమైయుండును, నవ = తొమ్మిది, న వననీయాః = నవసంఖ్య సేవనీయముకాదు, న అవాప్తావా = లేక ప్రాప్తముకాదు, దశసంఖ్యలో నిదిచేరదు, దశ - దస్తా=ఇది క్షీణించును. కావున దశయనబడును, దసు = ఉపక్షయే ధాతువుతో దశపదమేర్పడును. దశసంఖ్య అంతిమము దశసంఖ్యల తదుపరి ఏకాదశ, ద్వాదశ, ఆదిసంఖ్యలలో ఏకత్వాది సంఖ్యానామములే వచ్చును. దృష్టార్థా వా = ఎందుకనగా ఈపదియునుదశసంఖ్య రాబోవుసంఖ్యలలో చూడబడిన ప్రయోజనముగలది, వింశతిః ద్విదశతః = రెండుదశలు కలిసి, వింశతిః = ఇరువదియగును. వింశతిలో దశ రెండుపర్యాయము లావృత్తమగును, శతమ్ దశదశతః = పదిదశలు శతమగును. సహస్రమ్ సహస్వత్ = సహస్రము బలయుక్తము, సహస్ = బలము, తద్యుక్తము సహస్వత్ = సహస్రము అనబడును. సహస్రసంఖ్య దానికంటె పూర్వపుశతమ్ మున్నగుసంఖ్యలను అభిభూతమొనర్చును. అతిక్రమించియుండును. అయుతమ్ నియుతం ప్రయుతమ్ తత్తదభ్యస్తమ్ = అయుత నియుత ప్రయుత అనునవన్నియు అయా సహస్రాది సంఖ్యలకు పదిపర్యాయములు అవృత్తమొనర్చిన నేర్పడును

అర్బుదః మేఘః భవతి=అర్బుదము మేఘమగును. గత్యర్థక బుధాతువు నకు ఉ ప్రత్యయముచేసి దుక్ఆగమముచేసిన అర్బుదము సిద్ధించును. అర్బుదము మేఘము అనబడును. కోట్లసంఖ్యకును అర్బుదము నామమే. అరణమ్ఆంబు = గమనశీలమగు జలములకు అరణమనిపేరు. వర్షించు మేఘము పెద్దదైనట్లు అర్బుదముకూడ సంఖ్యలో పెద్దసంఖ్యకు వాచకము ఖలఇతి సంగ్రామనామ భవతి. ఖలః = సంగ్రామవాచకము. ఖలతేర్వా = మథనార్థకఖలధాతువుతో ఖలశబ్దమేర్పడును. యుద్ధమున శత్రువులు మథింపబడుదురు. ఖలస్థలతేర్వా = హింసార్థక ఖల, స్థలధాతువులతోనే ఖలశబ్దమేర్పడును. దీనిలో శత్రువులు చంపబడుదురు. అయమపి ఇతరః ఖలః ఈఖలము కల్లము ధాన్యరాసులుంచు స్థలమునకును పేరు. ఇదియు ఖలధాతువుతో నేర్పడును. దీనిలో ధాన్యాదులు నూర్చబడును అథవా సమాస్కన్నో భవతి. అటునిటుపోవు ధాన్యాదులు దీనిలో ప్రోగుచేయుబడును.

## అథవ్యాప్తి కర్మాణః-వ్యాప్తికర్మాణః ఉత్తరే ధాతవో దశ.

సంగ్రామే హితరేతరం వ్యాప్నువన్తి యోధా ఇతి సంగ్రామనామభ్య ఉత్తరే వ్యాప్తికర్మాణః.

ముందుచెప్పబడు పదిధాతువులు వ్యాప్త్యర్థకములు. సంగ్రామమున యోధులొండొరులను వ్యాప్తులగుదురు. కలిసికొందురు. కావున సంగ్రామ నామముల యనంతరమున వ్యాప్తిఅర్థకధాతువులు వ్రాయబడినవి.

## తత్ర ద్వే నామనీ ఆక్షాణ అశ్నువానః ఆపాన అప్నువానః.

తత్ర దశకే యోహ్యశ్నోతి వ్యాప్నోతి స అక్షాణ ఇత్యుచ్యతే. ఆప్నోతి స అప్నువాన ఆపాన ఇత్యుచ్యతే.

అర్థము :— వానిలో రెండునామములు. అక్షాణము ఆపానము అని. వాని నిరుక్తియిది - అక్షాణ అశ్నువానః = వ్యాపించునది అక్షాణము, ఆపాన అప్నువానః = ఏది వ్యాప్తమో యది ఆపానమనబడును, అశ్నోతి వ్యాప్నో తీతి అక్షాణః - ఆప్నోతీతి ఆపానః = వ్యాపించునది కావున అక్షాణము, ఆపానమునసబడును.

(అథవధార్థక ధాతువులు)

**వధకర్మాణ ఉత్తరే ధాతవ త్రయస్త్రింశత్.**

యుద్ధమున నొకరినొకరు వ్యాపించి వధింతురు కావున వ్యాప్త్యనంతర మున వధార్థకధాతువులు (33) ముప్పదిమూడు వ్రాయబడుచున్నవి.

**తత్ర వియాత ఇత్యేతత్ వియాతయత ఇతి వా వియాత యేతి వా.**

వియాతయతే నానాప్రకారం యాతయతే బాధతే యః శత్రూన్ స వియాతః.

ఆ వధార్థకధాతువులలో వియాత అను నైఘంటుకపదము గలదో దాని వ్యుత్పత్తి యిట్లున్నది. యాతయతే = ఎవడు శత్రువులకు నానావిధబాధలు కలిగించునో అతడు వియాతః = వియాతుడనబడును. లేక వియాతయ ఇతి = శత్రువులకు నానావిధయాతనలు కలిగించునని యెవనిని జనులు స్తుతింతురో యతడు వియాతయః = వియాతయుడు అనబడును.

**"అఖండల ప్రహూయసే" (ఋ. ౮-౧౭-౧౨)**

**అఖండయితః, ఖండం ఖండయతేః.**

నిగమమపి చాత్ర దర్శయతి 'అఖండలప్రహూయసే' యః ఖండ యతి మేఘాన్ స అఖండయితా తస్య సంబోధనమ్ హే అఖండయితః ఇంద్ర! ప్రహూయసే = ఆహూయసే త్వమ్.

'అఖండల' ఇదియు నామమే. ఇందుకు ప్రమాణము 'అఖండల ప్రహూయసే' = హే యింద్ర! మాచే పలుమాఱులు పిలువబడుచున్నావు. అఖండల = ఖండయితా! = ఖండించువాడా అని సంబోధనార్థము. ఖండం ఖండయతేః భేదనార్థక 'ఖడి'ధాతువుచే అఖండల శబ్దమేర్పడును.

**'తళిదిత్యంతిక వధయోః' సంసృష్టకర్మ తాళయతీతి సతః.**

సంసృష్టకర్మ - తడిదిత్యేత చ్ఛబ్దస్వరూప మంతికాభిధాయి-వధాభి ధాయిత్వార్థాభ్యాం సంప్రయుజ్యతే. తడిత్ ఇతి - తడిత్ అనుపదము సమీపము, వధ అనురెండర్థములకు నామము. తాడయతి ఇతి సతః = తడధాతువునకు సమీపము, వధ, అని రెండర్థములు.

> "త్వయా వయం సుబుధా బ్రహ్మణస్పతే స్పార్హా వసు మనుష్యా దదీమహి, యానో దూరే తళితో యా అరాతయోఽభి సన్తి జంభయా తా అనప్నసః."
>
> త్వయా వయం సువర్ధయిత్రా బ్రహ్మణస్పతే స్పృహణీయాని వసూని మనుష్యేభ్య అదదీమహి. యాశ్చ నో దూరే తళితో యాశ్చాన్తికే. అరాతయో అదానకర్మణో వా. అదానప్రజ్ఞా వా. జంభయ తా అనప్నసః అప్న ఇతి రూపనామ. ఆప్నోతీతి సతః.

యథా త్వాంతికనామేదం తథేయ మృగుదాహరణమ్ - హే బ్రహ్మణస్పతే త్వయా వయం సువృధా సువర్ధయిత్రా సుష్ఠువర్ధితా అనుగృహీతాః సన్తో వసు వసూని స్పార్హా స్పృహణీయాని మనుష్యా మనుష్యేభ్యః ప్రాపణిధాయాదదీమహి. కించ యా నో దూరే అధ్వన్యవస్థితా అరాతయో యాశ్చ తడిత్ అన్తికే అదానకర్మాణః. రాతిర్దానార్థః. అస్మాక మభిమతార్థాన్ దదతో యే నివారయన్తి తే. అదానప్రజ్ఞాః న దాతవ్య మస్మాభి రేభ్య ఇత్యేవం యేషాం ప్రజ్ఞా తే. తాః తాన్ దూరాన్తికావస్థితా నుభయానపి జంభయ నిశ్చేష్టాన్ కురు త్వమ్. అనప్నసః అరూపాం శ్చైతాన్ కురు అప్న ఇతి రూపనామ తద్ధి ఆప్నోత్యాశ్రయమ్.

అర్థము :— బ్రహ్మణస్పతే! హేపరమాత్మన్! వయమ్=మేమందఱము, సువృధా త్వయా = బాగుగ సంవర్ధనచేయు నీచే, మనుష్యా=మనుష్యులనుండి, స్పార్హాస్పృహణీయ = ఉత్తమోత్తమ, వసు = ధనము, అదదీమహి = ప్రాప్తింతుము - పొందుదుముగాక! యాః నః దూరే = ఏశత్రువులు మాకు దూరమున, అభిసంతి = ఉన్నారో, యాః అరాతయః = యేశత్రువులు, తడితః = సమీపమున నున్నారో, తాః అనప్నసః = అకురూపశత్రువులను, జంభయ = హతమొనర్పుము. అరాతయః - 'రాదానే'ధాతువుచే రాతిః దానికి విపరీతము అరాతయః=దానకర్మనొనర్పనివారు. అదానప్రజ్ఞా వా = సమ్మతినొసంగని శత్రువులు అని వ్యుత్పత్త్యర్థము. అప్న ఇతి రూపనామ = అప్నశబ్దము రూపవాచకము, ఆప్నోతీతి సతః = రూపము శరీరమునందంతట వ్యాపించును. అందువలన రూపమనబడును.

**విద్యుత్తళిత్ భవతి ఇతి శాకపూణిః. సాహ్యవతాళయతి దూరాచ్చ దృశ్యతే.అపి త్విదమన్తికనామైవాభిప్రేతం స్యాత్. 'దూరే చిత్ సంతళిదివాతిరోచసే' (ఋ. ౧-౯౪-౭) దూరేఽపి సన్ అంతిక ఇవ సందృశ్యస ఇతి.**

విద్యుత్తడిత్ భవతీతి శాకపూణిరాచార్యో మన్యతే. సాహ్యవతాడయత్యశనిరూపేణ దృశ్యతే. తస్మాన్న తస్యా అంతికనామాభిసంబంధో అస్తి. అంతికార్థేఽపి ప్రయోగో దృశ్యతే. తస్మాత్ ప్రకరణోపపదే అవేక్ష్య యథా సంభవం నిర్వక్తవ్యమ్.

అర్థము :- విద్యుత్తడిద్ భవతి = ఇట తడిత్ పదమునకర్థము విద్యుత్తు ఇతి శాకపూణిః = అనిశాకపూణసిద్ధాంతము వీలయున, సా = అవిద్యుత్తు, తడిత్=అశనిరూపముతో, అవతాడయతి=చంపును, మఱియు, దూరాత్దృశ్యతే = దూరమునుండి చూడబడును. కావున నిట తడిత్‌నకు సమీపమనునర్థము సంగతముకాదు. కాని నిమ్నమంత్రమున అంతిక నామైవాభిప్రేతమ్ = ఈమంత్రమున అంతికఅర్థము ఇష్టమనుటలో అభిప్రాయము, దూరేచిత్ = తడిత్ దూరమునుండియు అంతికముననున్నట్లు కనిపించును. కావున ప్రకరణమునుబట్టి తడిత్‌శబ్దమునకర్థము అంతికము, వధ, అశని అనునర్థములు చెప్పుకొననగును.

(అథ వజ్రనామములు)

**వజ్రనామాన్యుత్తరాణ్యష్టాదశ.**

రాబోవు పదునెనిమిది (౧౮) వజ్రనామములు.

వర్జయతి వియోజయతి ప్రాణైఃప్రాణినః ఇతి వజ్రముచ్యతే వజ్రః కస్మాత్ - వర్జయతీతి సతః. వజ్రమననేల ? ప్రాణులప్రాణముల నది విడిపింపజేయును.

**తత్ర కుత్స ఇత్యేతత్ కృన్తతేః ఋషిః కుత్సో భవతి. కర్తా స్తోమానా మిత్యౌపమన్యవః, అత్రాప్యస్య వధకర్మైవ భవతి. తత్సఖ ఇంద్రః శుష్ణం జఘానేతి.**

తత్ర కుత్స ఇత్యేతత్ సందేహపదమ్. ఋషిరపి కుత్స ఇత్యుచ్యతే యదా వజ్రనామ తదా కృన్తతేః కృత్యతేఽనేనేతి కుత్సః. యదా పునరేత దర్శ్యభిధానమ్ తదా కర్తా స్తోమానామిత్యౌపమన్యవ ఆచార్యః మన్యతే. అత్రా ప్యస్యైవార్థ కర్తైవ. కిం కారణమ్ ? తత్సఖఇంద్రః శుష్ణం మేఘం జఘాన.

అర్థము :— తత్ర = వజ్రార్థకములగు పదునెనిమిదినామములలో కుత్సనామమనేకార్థకము - కుత్సపదమునకు వజ్రమని యర్థము చెప్ప వలసివచ్చినపుడు - కృన్తతేః 'కృతీఛేదనే'ధాతువుతో కుత్సశబ్దము ఏర్పడి నట్లెంచవలయును. కుత్సః అనునది కొండొకఋషికిని నామము. కుత్స పదము ఋషిబోధకమగునెడల స్తోమకర్త అని కుత్సశబ్దవ్యుత్పత్తి యగును అని ఔపమన్యాచార్యుని మతము.

ఋషిబోధక కుత్సశబ్దముకూడ 'కృతీఛేదనే'ఛేదనార్థక 'కృతీ'ధాతువు తోనే కుత్సశబ్దము సిద్ధించునని యాస్కముని అభిప్రాయము. ఉభయత్ర కుత్సపదమునకర్థము వధయనియే తెలియనగును. ఇందులకు ప్రమాణము 'తత్సఖఇంద్రః శుష్ణం జఘాన' కుత్ససఖు డింద్రుడు శుష్ణుని జఘాన = హతమొనర్చెను - వధించెను.

(ఐశ్వర్యార్థక ధాతువులు)

**ఐశ్వర్యకర్మాణ ఉత్తరే ధాతవ శ్చత్వారః.**

ఘ్నతామేవ హి వజ్రేణాయుధే నైశ్వర్యం భవతీతి వజ్రనామభ్య ఉత్తరే ఐశ్వర్యకర్మాణః - రాబోవు ౪ ఐశ్వర్యార్థకధాతువులు.

అథేశ్వరనామాని

**ఈశ్వరనామా న్యుత్తరాణి చత్వారి.**

ఈశ్వరః ఐశ్వర్యసంబంధే నైవోచ్యతే.

రాబోవు నాలుగు ఈశ్వరవాచకములు.

**తత్రేన ఇత్యేతత్ సనిత ఐశ్వర్యేణేతి వా. సనితమనేనైశ్వర్య మితి వా.**

సనితః సంభక్తః సనితమ్ సంభక్తమ్.

ఈనామములలో 'ఇన'అనునామము నిట్లు సిద్ధముచేసికొనవలెను.

సనితః ఐశ్వర్యేణ సంయుక్తః = ఐశ్వర్యముతో సంయుక్తుడు 'సనితః' అనియా - లేక-ఇతనితో ఐశ్వర్యము సంయుక్తమైనది. 'సనితమ్' అనియా సిద్ధముచేసికొనవలయును.

> "యత్రా సుపర్ణా అమృతస్య భాగమనిమేషం విదథాభి స్వరన్తి. ఇనో విశ్వస్య భువనస్య గోపాః స మా ధీరః పాక మత్రావివేశ." (ఋ. ౧-౧౬౪-౨౧)
>
> యత్ర సుపర్ణాః సుపతనా ఆదిత్యరశ్మయః. అమృతస్య భాగమ్ ఉదకస్య అనిమిషన్తో వేదనేన అభిస్వరన్తీతి వా. అభి ప్రయన్తీతి వా. ఈశ్వరః సర్వేషాం భూతానాం గోపాయితా దిత్యః. స మా ధీరః పాకమత్రావివేశేతి ధీరో ధీమాన్ పాకః పక్తవ్యో భవతి. విపక్వప్రజ్ఞ ఆదిత్యః ఇత్యుపనిషద్వర్ణో భవతి. ఇత్యధిదైవతమ్ అథాధ్యాత్మమ్ యత్ర సుపర్ణాః సుపతనానీంద్రియాణి అమృతస్య భాగం జ్ఞానస్య అని మిషన్తో వేదనేనాభిస్వరన్తీతి వా. అభిప్రయన్తీతి వా. ఈశ్వరః సర్వేషామ్ ఇంద్రియాణాం గోపాయితాత్మా స మా ధీరః పాకమత్రా వివేశేతి ధీరో ధీమాన్ పాకః పక్తవ్యో భవతి విపక్వప్రజ్ఞఆత్మా ఇత్యాత్మగతి మాచష్టే.

అధునా మంత్రమపి వ్యాచష్టే. యస్మిన్నేతదీశ్వరనామ్నా ఇతి యత్రా సుపర్ణా ఇతి అమృతస్యామరణధర్మణో భాగంభజనీయమంశ మాదాయ పృథివీలోకాదభిస్వరన్తి అభిముఖ్యేన రసాన్ గృహీత్వా ప్రయాన్తి. అని మేషమాదరపన్త ఇత్యర్థః. ఇనః ఈశ్వర ఆదిత్యః మండలాంతర పురుషో యస్తత్ర మండలే అవస్థితః ధీమాన్ బుద్ధ్యాన్వితో - బుద్ధిరేవ హి తస్య శరీరమ్. అవివేశ అవిశతు. ఇతి శబ్దః ప్రకరణ ప్రదర్శనార్థః. ఏవమయ ముపనిషద్భావేన వర్ణ్యత ఇత్యుపనిషద్వర్ణః. యస్మిన్ మండలే అవస్థితాః సుపతనాః అత్యాదరేణ నిజంకర్మ జానానాః సూర్యస్య రశ్మయః పృథ్వీతః జలస్య భాగమాదాయ సూర్యమండలం ప్రయాన్తి. స విశ్వస్య సంసారస్య రక్షకః బుద్ధిశరీరఈశ్వరః మా అవిశతు ఇతి సరలోఽర్థః.

అథాధ్యాత్మమ్ :— యత్ర యస్మిన్ శరీరే అమృతస్య అమరణ ధర్మణో జ్ఞానస్య విదథా వేదనేన విజ్ఞానేన యుక్తమభిస్వరన్తి భోక్తృర్థంఖం కుర్వన్తి. స మా అసమ్యగ్దర్శిన మాత్మమావివేశ. ఆవిశతు అను గృహ్ణాత్వి త్యర్థః తదనుగ్రహాద్వస్య సమ్యగ్దర్శనం ప్రకాశతే ఆత్మగతి మాచష్టే. ఏవమయ మాత్మజ్ఞాన మాచష్టే మంత్రః. ఆధ్యాత్మికశ్చ అస్య మంత్ర స్యాయ మర్థః.

యత్ర శరీరే స్వాయతనావస్థితానీంద్రియాణి అచేతనాని యస్య చేతనస్య భాగ మాదాయ విజ్ఞానేన భోక్తుః పటూకుర్వన్తి తత్ర దేహే అవస్థితః బుద్ధ్యధిష్ఠాతా ఆత్మా మామనుగృహ్ణాతు ఇతి.

మంత్రార్థము:— యత్ర=ఏ సూర్యునియందు, స్థితసుపర్ణా రశ్మయః= కిరణములు, అమృతస్య = పృథివిపైనున్న జలముయొక్క, భాగమ్ = అంశమును, అనిమేషమ్ = నిరంతరము, విదథా=తనవిలక్షణ విజ్ఞానముతో అభిస్వరన్తి = సుష్కింపచేయుచుండును, ఇనః = ఈశ్వరుడు, విశ్వస్య భువనస్య = సమస్తజగత్తుయొక్క, గోపాః = పాలకుడు, సఃధీరః = అతడు ప్రజ్ఞావంతుడగు ఆదిత్యుడు, మా = నన్ను, పాకమ్ = అపరిపక్వప్రజ్ఞ డను నగు నన్ను, ఆవివేశ = ఆదిత్యమండలమునకు జేర్చుము. ఇది ఆధి దైవికార్థము. (ఇక నాధ్యాత్మికము)

యత్ర = ఏశరీరమునందుగల, సుపర్ణాః = ఇంద్రియములు, అమృ తస్య = రూపాదిష్టేషు విషయముయొక్క తమభాగమును, చక్షువు రూప మును త్వక్కు స్పర్శను ఇతరేంద్రియములు తమవిషయములను, అని మేషమ్ = నిరంతరము, విదథా = విజ్ఞానముతో, అభిస్వరన్తి = ప్రకాశిత మొనర్చును, అక్కడ, ఈశ్వరః = పరమాత్మ, విశ్వస్యభువనస్య = సమస్త ఇంద్రియముల రక్షకుడు, ధీరః = ప్రజ్ఞావంతుడునగు, సః = ఆ భగ వంతుడు, పాకమ్ = పక్తవ్యబుద్ధిగల. మా = నన్ను, ఆవివేశ=ప్రవిష్టుడగు గాక ! నేను ముక్తుడనగుదును గాక ! సుపర్ణాః = సుపతనములు, శోభ నాపతములునగు, ఆదిత్యరశ్మయః = సూర్యకిరణములు, అమృతస్య భాగమ్ = జలభాగమును, అనిమిషన్తః = నిరంతరము, వేదనేన అభి స్వరన్తి = జ్ఞానముతో తపింపచేయును - ప్రకాశితమొనర్చును. పురుషుని విషయగ్రహణార్థము సమర్థులనుచేయును, ఈశ్వరః = ఈశ్వరుడు, సర్వే షాం భూతానాం గోపాయితా = సమస్తభూతరక్షకుడు - అతడు ఆదిత్యుడు,

ధీరః ధీమాన్ ప్రజ్ఞావాన్ = ప్రాజ్ఞుడు, పాకః పక్తవ్యో భవతి = పరిపక్వబుద్ధి పక్వముకాలేదో అనగా అల్పజ్ఞుడు, విపక్వప్రజ్ఞ = పూర్ణప్రజ్ఞకలవాడు, ఆదిత్య=పరమాత్మ సర్వజ్ఞుడు-ఇది ఆధిదైవికఅర్థము. ఇక ఆధ్యాత్మికము - సుపర్ణాః సుపతనాని ఇంద్రియాణి = ఇంద్రియములు తమ విషయములందు చేరి వానిని గ్రహించును. అమృతస్యభాగమ్ = జ్ఞానభాగమును - రూపాదిజ్ఞానమును కలిగించును, ఈశ్వరుడు సర్వభూతాధిపతి సమస్త ఇంద్రియములకు, గోపాయితా = రక్షకుడు, జీవునకు ఈశ్వరునకు విశేషణములు సమానములు ఇట్లు ఆత్మగతి చెప్పబడినది.

ద్వితీయపాదము సమాప్తము

## తృతీయపాదము

(అథ బహునామాని)

**బహు నామాన్యుత్తరాణి ద్వాదశ.**

ఈశ్వరాణామేవ బహుత్వం భవతి ఇత్యత ఈశ్వరనామభ్య ఉత్తరాణి బహునామాని.

బహుత్వము ఈశ్వరునకు సంబంధించినదే. అందువలన ఈశ్వర నామానంతరము బహునామములు నిర్వచింపబడుచున్నవి.

రాబోవు పండ్రెండు (౧౨) బహువాక్యములు.

**బహుః కస్మాత్? ప్రభవతీతి సతః.**

ప్రభవతి హ్యేతద్ బహుభ్యో దీయమానం బహ్వేవ బహుభ్యో దాతుం శక్యతే. నాల్పమితి భావః.

బహుసమర్థమగును. పలువురకిచ్చుటకు బహుమాత్రము సమర్థమగును అల్పమెన్నడు కాదు.

(హ్రస్వనామాని)

**హ్రస్వనామా న్యుత్తరా ణ్యేకాదశ.**

బహునామ సంబంధేనైవ హ్రస్వనామాని ఉత్తరాణి. బహుసంబంధముతో హ్రస్వనామములు పదకొండు.

**హ్రస్వో హ్రసతేః.**

హ్రసితో హి భవతి స మహతః సకాశాత్.

న్యూనార్థక హ్రస్వధాతువుతో హ్రస్వశబ్దము సిద్ధమగును. చిన్నది - అల్పము - కుఱుచ - అనబడును.

(మహన్నామాని)

**మహన్నామా న్యుత్తరాణి పంచవింశతిః.**

రాబోవు ఇరువదైదు మహద్వాచకములు.

**మహాన్ కస్మాత్ ? మానేనాన్యాన్ జహాతి. ఇతి శాకపూణిః మంహనీయో భవతీతి వా.**

అన్యాన్ హ్రస్వాన్ జహతీతి శాకపూణిః ఆచార్యో మన్యతే. అథవా మంహనీయః పూజనీయో భవతీతి మహాన్ జహాతిః తిరస్కారార్థః. అభి మానరహితత్వం మహత్వం తు వస్తుస్థితిః.

అర్థము :— మహాన్ ఎందులకు ? అది కొలతలో ఇతరములను మించియుండును. అందువలన మహాన్ = గొప్పది - గొప్పవాడు - (మహాన్) ఇతరులకంటె నెక్కుపమాన్యుడు. ఇది శాకపూణి మతము. మంహ నీయుడు పూజనీయుడు - పూజార్థక 'మహి'ధాతువుతో మహాన్ శబ్దము సిద్ధించును.

**తత్ర వవక్షిథ వివక్షస ఇత్యేతే వక్తేర్వా వహతేర్వా సాభ్యాసాత్.**

తత్ర తస్మిన్ మహన్నామగణే = ఆనామములతో వవక్షిథ, వివక్షసే - ఈ రెంటును వచ వహ ధాతువులతో నేర్పడును.

**గృహనామాన్యుత్తరాణి ద్వావింశతిః. గృహాః కస్మాత్ ? గృహ్ణన్తీతి సతామ్.**

య ఏవ మహాన్తః త ఏవ గృహిణో భవన్తి ఇతి మహన్నామభ్య ఉత్తరాణి గృహనామాని. తే హి యావదేవ కించిద్గ్రాహ్యతే తత్సర్వమేవ గృహ్ణన్తి దుష్పూరత్వాత్.

రాబోవు ఇరువదిరెండునామములు గృహార్థకములు. గొప్పవారే గృహములను సంపాదింతురు. తెచ్చినదంతయు గృహములే గ్రహించును. దుష్పూరములు - అవి నిండవు గ్రహించుటయే వానిపని.

(పరిచరణార్థక ధాతువులు)

**పరిచరణకర్మాణ ఉత్తరే ధాతవః దశ.**

గృహేష్వేవావస్థితాః పరిచర్యన్తే పరిచరన్తి చేతి గృహనామభ్య ఉత్తరే పరిచరణకర్మాణో ధాతవః.

పరిచర్యార్థక ధాతువులు పది.

(సుఖనామాని)

**సుఖనామాన్యుత్తరాణి వింశతిః.**

పరిచర్యమాణానా మేవ హి సుఖం భవతీతి పరిచరణకర్మభ్య ఉత్తరాణి సుఖనామాని. పరిచర్యననుభవించువారికి సుఖము లభించును. కావున పరిచర్యానామానంతరమున సుఖనామములు ఇరువది.

**సుఖం కస్మాత్ ? సుహితం ఖేభ్యః.**

సుహితం సుష్ఠుహిత మేతత్ ఖేభ్యః ఇంద్రియేభ్యః అతః సుఖ మిత్యుచ్యతే.

ఖేభ్యః = ఇంద్రియములకు హితముగానుండును. కావున సుఖ మనబడును.

**ఖం పునః ఖనతేః.**

ఖమ్ = ఇంద్రియము. ఖనధాతువుచే నేర్పడును. అవదీర్ణమేవ కర్ణాద్యాయతనం భవతి.

ఇంద్రియమేల 'ఖమ్'అనబడునని - అవదారణార్థక 'ఖన్'ధాతువుతో ఖమ్ శబ్దమేర్పడును. చెవులు మున్నగు నింద్రియస్థానము త్రవ్వబడి యుండును - అవదారణమన త్రవ్వుట.

(రూపనామములు)

**రూపనామాన్యుత్తరాణి షోడశ.**

య ఏవ హి సుఖిన స్త ఏవ హి ప్రాయో రూపవన్తః భవన్తి ఇతి సుఖనామభ్య ఉత్తరాణి రూపనామాని.

సుఖపడువారు రూపవంతులగుదురు. కావున రూపనామానంతరము సుఖనామములు పదునారు వ్రాయబడుచున్నవి.

**రూపం రోచతేః.**

దీప్యమానమివ హి తద్ భవతి రుచధాతువుతో రూపశబ్దము సిద్ధించును. సుందరమై ప్రకాశించునది రూపమనబడును.

(ప్రశస్యనామములు)

**ప్రశస్యనామాన్యుత్తరాణి దశ.**

య ఏవ హి రూపవం తస్త ఏవ ప్రశస్యా భవన్తీతి రూపనామభ్య ఉత్తరాణి ప్రశస్యనామాని.

రూపవంతులు ప్రశస్యులగుదురు. అందువలన రూపనామముల యనంతరము ప్రశస్యనామములు పది యిట చెప్పబడినవి.

(ప్రజ్ఞానామములు)

**ప్రజ్ఞానామా న్యుత్తరాణ్యేకాదశ.**

ప్రశస్యులే ప్రజ్ఞావంతులగుదురు. కావున ప్రశస్యనామానంతరమున ప్రజ్ఞానామములు పదునొకండు లిఖింపబడినవి.

(సత్యనామములు)

**సత్యనామా న్యుత్తరాణి షట్.**

ప్రజ్ఞావంతులు సత్యవాదులగుదురు. కావున ప్రజ్ఞానామానంతరము సత్యనామములు షట్ - ఆరు.

**సత్యం కస్మాత్ ? సత్సు తాయతే సత్ ప్రభవం భవతీతి వా.**

సత్సు తాయతే విస్తీర్యతే న హి సతాం సమీపే శక్య మనృతం వక్తుమ్. అథవా సత్ప్రభవం భవతి. య ఏవ హి సన్తః త ఏవ హి సత్యం వదన్తి.

సత్వము సత్పురుషులలో విస్తరించును. సత్ప్రభవం = సత్పురుషులనుండి సత్వముద్భవించును. కావున సత్వమనబడుచున్నది.

(పశ్యత్యర్థకధాతువులు)

**అష్టా ఉత్తరాణి పదాని పశ్యతి - కర్మాణః ఉత్తరే ధాతవ శ్చాయతిప్రభృతీని చ నామాన్యామిశ్రాణి.**

అష్టౌ యాన్యుత్తరాణి పదాని ఆమిశ్రాణి సంసృష్టానీత్యర్థః.

రానున్న ఎనిమిదిపదములు పశ్యత్యర్థకములు చాయతిః ఆదిధాతువులు నున్నవి వీనిలో చిత్యత్ ఆది కొన్ని ఆఖ్యాతములు నున్నవి. ఈరెండును కలిసిమెలసి నామములని వ్యవహరింపబడినవి (అమిశ్రనామములు)

(సర్వపద సమామ్నాయము)

**నవోత్తరాణి పదాని సర్వ-పద-సమామ్నాయ.**

నవ యాన్యుత్తరాణి పదాని సర్వ - పదసమామ్నాయే - సర్వం చతుర్విధమ్.

ముందు రాబోవు తొమ్మిదిపదములు హికం, నుకమ్, సుకమ్ ఆది కొన్ని నిపాతములు, మఱికొన్ని ఉపసర్గలు కలిపి ఇవ్వబడినవి. సర్వపద సమామ్నాయ = నాలుగువిధములగు పదార్థసంగ్రహముకొఱకు.

(అథోపమాః)

**అథాత ఉపమాః. యదత త్తత్సదృశమితి గార్గ్యః.**

అథ ఇదానీమ్ అతః అనన్తరముపమా భవన్తి. సామాన్యలక్షణమాహ బ్రవీతి-యదత త్తత్సదృశమితి గార్గ్యః. యత్కించిదర్థజాత ముతత్పదమపి తత్ స ఖ్యం భవతి యథా అగ్నిరివ ఖద్యోతః తద్భిన్నత్వే సతి తద్గత భూయో - ధర్మవత్వం సదృశత్వమ్.

యత్ = ఏవస్తువు, అతత్ = అదికాదో, కాని దానికి సమానముగా కనబడునో అది ఉపమా అనబడును. ఇది గార్గ్యునిమతము.

తదాసాం కర్మ, జ్యాయసా వా గుణేన ప్రఖ్యాతతమేన వా కనీయాంసం వా ప్రఖ్యాతమ్. వోపమిమీతే - అథాపి కనీ యసా జ్యాయాంసమ్.

తదాసాం కర్మ స ఆసాముపమానామర్థః యత్ జ్యాయసా ఉత్కృష్టేన కనీయాంసమ్ అనుత్కృష్టగుణమ్ - తద్యథా - సింహో మాణవకః. ప్రఖ్యాతతమేన వాఽఽఖ్యాతమ్. తద్యథా-చంద్రఇవ కాన్తో మాణవక ఇతి.

అథాపి క్వచిత్కనీయసా జ్యాయాంసమపి సన్త ముపమిమీతే తదేతచ్ఛంద స్యేవ ద్రష్టవ్యమ్.

అర్థము :- ఆసామ్ = ఈ ఉపమలయొక్క, తత్కర్మ=ప్రయోజన మిదియే, జ్యాయసా వా = లేక పెద్దవానితో, ప్రఖ్యాతతమేనగుణేన = లేక కొండొక ప్రసిద్ధగుణముతో, అప్రఖ్యాతం కనీయాంసమ్ = ప్రసిద్ధముకాని చిన్నవానిని, ఉపమిమీతే = ఉపమింపబడును, అథాపి అథవా = లేక, కనీయసా = చిన్నవానితో, జ్యాయాంసమ్=పెద్దవానితో ఉపమింపబడును.

హీనోపమకు ఉదాహరణము.

"తనూత్యజేవ తస్కరా వనర్గూరశనాభి ర్దశభి రభ్యధీతామ్."
(ఋ. ౧౦-౪-౬)

తనూత్యక్ తనూత్యక్తా వనర్గూవనగామినౌ అగ్నిమంథనౌ బాహూ తస్కరాభ్యా ముపమిమీతే, తత్కరో భవతి యత్ పాపకమితి నైరుక్తాః. తనోతే ర్వా స్యాత్. సంతత కర్మా భవతి. అహోరాత్రకర్మా వా. రశనాభిర్దశభి రభ్య ధీతామ్. అభ్యధాతామ్ జ్యాయాంస్తత్ర గుణోఽభిప్రేతః.

కిముదాహరణమ్? ఉచ్యతే తనూత్యజేవేతి. తనూత్యజా తనూత్యక్తౌ చౌర్యాభిప్రాయేణ హర్తవ్యం వా మర్తవ్యం వేతి. కృతాధ్యవసాయౌ తస్కరౌ వనర్గూ వనగామినౌ మార్గమోషకౌ తౌ యథా కంచిదధ్వని బధ్నీయాతాం రజ్జ్వా. ఏవ మేతావస్మద్బాహూ రశనాభిః అంగులీభి ర్దశభి రభ్య ధీతాన్ ప్రతినిబధ్నీతామ్. ఏవమస్యామృచ్యగ్నిమంథనౌ బాహూ ప్రశస్తౌ తస్కరాభ్యా మప్రశస్తాభ్యామ ఉపమిమీతే మంత్రదృక్. సంతతకర్మా

రాత్రౌ గ్రామే దివారణ్యే ముష్ణాతి. అత్ర బాహ్వోర్ జ్యాయాన్ గుణో౽భిప్రేత స్తస్కరయోః కనీయాన్.

మంత్రార్థము :– ఇవ = ఎట్లు, వనర్గూ=వనచారులు, తనూత్యజా = తనువునుగూడ లెక్కచేయని, తస్కరా=ఇద్దఱుచోరులు, దశభిః రశనాభిః= పదిత్రాళ్లతో, అభ్యధీతామ్ = ఒండొక పథికుని బంధింతురో, అట్లే మన యీ బాహువులు, దశభిః రశనాభిః = దశసంఖ్యగల అంగుళులతో, అభ్యధీతామ్ = బంధించును. ఈమంత్రమున అగ్నిని మథించు ప్రశస్తములైన రెండుబాహువులు అప్రశస్తులైన - హీనులైన ఇరువురు తస్కరులతో ఉపమింపబడినవి. తత్కరో భవతి ప్రకరణసామర్థ్యమువలన పాపముచేయు వాడు తస్కరుడనబడుచున్నాడు - అని తస్కర పదవ్యుత్పత్తి. యత్ పాపకమ్ = ఏదిపాపమో, తస్కరుడు దానినిచేయును - నైరుక్తులు-నిరుక్తకారులెల్లరు అంగీకరింతురు. తనోతే ర్వా స్యాత్ = 'తనువిస్తారే' ధాతువుతో తస్కరపదము సిద్ధించును, సంతతకర్మా భవతి = తస్కరుడు నిరంతరము చౌర్యకర్మ నొనర్చుచుండును, తత్ర = అందు, జ్యాయాన్ గుణో౽భిప్రేతః = గొప్పగుణము అభిప్రేతము బాహువులందు ప్రశస్తగుణ మంగీకరింపబడినది, చోరులలో అప్రశస్తగుణము.

“కుహస్విద్ దోషా కుహవస్తో రశ్వినా కుహాభిపిత్వం కరతః కుహోషతుః కో వాం శయుత్రా విధవేవ దేవరం మర్యం న యోషా కృణుతే సధస్థ ఆ.” (ఋ. ౧౦-౪౦-౨)

క్వ స్విద్రాత్రౌ భవథః క్వదివా క్వాభిప్రాప్తిం కురుథః క్వవసథః కో వాం శయనే విధవేవ దేవరమ్. దేవరః కస్మాత్? ద్వితీయోవరః ఉచ్యతే. విధవా విధాతృకా భవతి. విధవనాద్ వా. విధావనాద్వేతి చర్మశిరాః. అపి వా ధవ ఇతి మనుష్యనామ తద్వియోగాద్ విధవా దేవరో దీవ్యతికర్మా మర్యో మనుష్యో మరణధర్మా యోషాః యౌతేః ఆకురుతే సహస్థానే.

ద్వితీయముదాహరణమ్. ఏతస్మిన్నేవార్థే కుహస్విద్దోషా కక్షీవతో దుహితా ఘోషానామ తస్యా ఇయ మార్షమ్. హే అశ్వినౌ కుహస్విద్దోషా క్వను యువాం రాత్రౌ భవథః - కుహ వస్తోః క్వవా దివా భవతో యువామ్. యేన నాపి రాత్రావస్మాకం దర్శన ముపగచ్ఛతో నాపి దివా. కుహ క్వ చాభి పిత్వం స్నానభోజనా ద్యర్థం కురుథః. కుహ క్వ ఊషతుః వసథః ? కించ కో వాం శయుత్రా శయనే విధవేవ దేవరం యథా విధవా మృతభర్తృకా కాచిత్ స్త్రీ దేవర ముపచరతి. మర్యం మనుష్యం దేవరమ్ కృణుత కురుతే. సధస్థే సహస్థానే. ఏవమస్యామృచి దేవరేణ కనీయసా జ్యాయాంసా వ్యవాయ ఉపమీయతే. విధవయా చ యజమానః. అథైకపదనిరుక్తమ్ విధా తృకా ధాతా ధారయితా స తస్యా విగత ఇతి - విధావనాద్వా సా హి భర్తృ రభావాత్ అనిరుధ్యమానా యత్ర తత్ర విధావత్యేవ. ఇతి చర్మశిరా ఆచార్యో మన్యతే. దీవ్యతికర్మా దీవ్యత్యర్థః యోషా యౌతేః మిశ్రణార్థస్య సా హి మిశ్రయత్యాత్మానం పురుషేణసాకమ్.

మంత్రార్థము :- అశ్వినా = ఓయశ్వినీ కుమారులార! దోషా = రాత్రియందు, కుహస్విత్ = మీరెచ్చట నెటువున్నారు, వస్తోః = నిన్నటి దినమందు, కుహ = ఎక్కడనుంటిరి ? అభిపిత్వమ్ = అభిప్రాప్తి, కుహ కరతః = భోజనాదులప్రాప్తి యెక్కడ కలిగినది - ఎక్కడ భుజించితిరి ? కుహ ఊషతుః ? = ఎక్కడ నివసించుచుంటిరి ? విధవా దేవరమివ = విధవాస్త్రీ దేవరునివలె, యోషామర్యం న = ప్రతిస్త్రీ సంభోగసమయమున తనపతినివలె, కః = ఎవడు, యువామ్ = మీయిరువురిని, శయుత్రా = శయనమునందు, సధస్థే = సమాన ఆసనమున-శయ్యయందు, ఆకృణుతే= సహచరునిజేసికొనినది.

నిరుక్తి :- దేవరః కస్మాత్ ? దేవరుడని యెవనినందురు ? ద్వితీయో వర ఉచ్యతే = రెండవవరుని దేవరుడందురు.

విధవా కస్మాత్ ? = విధవ యెందులకు ? విధాతృకా భవతి = విధాతా = పోషించువాడులేని స్త్రీ విధవా యనబడును, ధాఞ్ కంపనే ధాతువువలన విధవాశబ్దము సిద్ధించును. విధవనాత్ వా = లేక భర్త మరణించిన పిదప అడ్డులేనిదై యిటునటు ధావనచేయునది విధవయనిపించు కొనును, ఇతి చర్మశిరాః = అని చర్మశిర యను ఋషి చెప్పెను 'దివ' ధాతువువలన దేవరశబ్దము సిద్ధించును. అపివా - అథవా ధవః ఇతి మనుష్య

నామ = ధవయనునది మనుష్యవాచకము, తద్వియోగాత్ = మనుష్యుని వియోగమువలన విధవ అగును. దేవరః దీవ్యతికర్మా = దేవరుడనగా తనఅన్నభార్యను నాదరించువాడు. దివ్‌ధాతువుతో దేవరశబ్దము సిద్ధించును. మర్యః మనుష్యః = మరణశీలుడు మనుష్యుడనబడును. మరణించుట అతని ధర్మము మరణధర్మామనుష్యః, యోషా యౌతేః మిశ్రణార్థక 'యు'ధాతువుతో యోషా సిద్ధమగును. యోషాస్త్రీ పురుషునితో కలిసియుండు స్వభావముకలది.

(అథ నిపాతాః)

**అథ నిపాతాః పురస్తాదేవ వ్యాఖ్యాతాః.**

అథ అనంతరం యే నిపాతాః సమామ్నాతాః యథా - అగ్నిర్వృమే ఇత్యేవమాదయ స్తే పురస్తాదేవ వ్యాఖ్యాతాః సామాన్యతః. ఇదానీముదాహరణైః వ్యాఖ్యాయన్తే.

సామాన్యతః నిపాతములు పూర్వమే వ్యాఖ్యానింపబడినవి. ఇప్పుడు వాని ఉపమార్థములకు విశేషవ్యాఖ్య చేయబడును.

**యథేతి కర్మోపమా.**

తత్ర యథేతి ఏషా కర్మోపమా.

'యథా'అనునిపాతము క్రియకు సంబంధించిన ఉపమయందు వచ్చును. ఉదా:–

**"యథా వాతో యథా వనం యథా సముద్ర ఏజతి." (ఋ. ౫-౭౮-౮) "భ్రాజంతో అగ్నయో యథా" (ఋ. ౧-౫౦-౩) "ఆత్మా యక్ష్మస్య నశ్యతి పురా జీవగృభో యథా" (ఋ. ౧౦-౯౭-౧౧)**

**ఆత్మా తతేర్వా ఆప్తేర్వా అపి వా ప్త ఇవ స్యాత్ యావద్ వ్యాప్తిభూత ఇతి.**

కిముదాహరణమ్? "యథా వాతః...ఏజతి" ఏవా త్వం దశమాస్య దశమాస్య సహావేహి జరాయుణా ఇతి హే దశమాస్య - హే దశమాస్య =

దశమమాససంభూత గర్భ! ఏతస్మాన్మాతు రుదరాదవయవైః స్నేతామేజన్ చలన్నేవేహ అన్వాదేహ బహిరాగచ్ఛ. సహ జరాయుణావోల్బేన ప్రజాయస్వ మాస్థా స్త్వమేతస్మి న్నుదర ఇత్యభిప్రాయః - భ్రాజన్తే అగ్నయో యథా. భ్రాజన్తే దహ్యమానాః అగ్నయ ఇవ రశ్మయో జనాననుగచ్ఛన్తి అపర ముదాహరణమ్. ఆత్మా యక్ష్మస్య యక్ష్మణో నశ్యతి. రోగస్యాప్యపరాగమ నాయ. కథమ్ ? జీవగృభో యథా జీవగ్రాహస్య పురైవ హననాదహతస్యైవ జీవో నశ్యతి. ఏవమాత్మా రోగస్యాపి పురైవౌషధిప్రయోగా న్నశ్యతీత్యభి ప్రాయః. ఆత్మాఽతతేర్వా సర్వగతత్వాత్.

మంత్రఖండముల యర్థము - (౧) హేగర్భ ! యథా వాత ఏజతి = ఓ గర్భమా! ఎట్లు వాయువు నడుచుచున్నదో, యథావనమ్ = ఎట్లు చెట్లు కంపించుచున్నవో, యథా సముద్రః = సముద్రమెట్లు తరంగితమగు చున్నదో అట్లే నీవు జరాయువు(మావు)తోబాటు చలించుచు బయట పడుము. (౨) యథా భ్రాజన్తః అగ్నయః = ప్రదీప్తములగు నగ్నులు వస్తురూపమును ప్రకాశింపజేయునో, (౩) యథా జీవగృభః = ప్రాణులను పట్టుకొనబోయువాడు తమను పట్టుకొనకముందే పశులు భయపడి ముందే యెట్లు చనిపోవునో యట్లే రోగమునకు సంబంధించిన ఔషధములు ప్రయోగింపకముందే ఔషధముల నామోచ్చారణతోనే రోగముయొక్క ఆత్మ (మూలకారణము) నశించును. ఆత్మా అతతేః సతతగమనార్థక అత ధాతువుతో ఆత్మపదము సిద్ధించును ఆత్మ యంతటనుండుటచే సంతత గతికలదై యున్నది. ఆప్తేర్వా - ఆప్ల వ్యాప్తౌ ధాతువుచే ఆత్మపదమేర్పడును. ఆత్మ యన్నింటిని వ్యాపించియున్నది. అపివా - అథవా ఆప్త ఇవ భవతి. ఆప్తునివలె నుండును. యావత్ వ్యాప్తిభూత ఇతి = అంతటనుండుటవలన వ్యాప్తినొంద = అన్నింటిని వ్యాపించియున్నట్లుండును.

"అగ్నిర్న యే భ్రాజసా రుక్మవక్షసః" (ఋ. ౧౦-౭౮-౨)

అగ్నిరివ యే మరుతో భ్రాజమానా రోచిష్ణూరస్కాః భ్రాజ న్వన్తో రుక్మవక్షసః.

అగ్నిరివ యే మరుతో భ్రాజమానాః భ్రాజిష్ఠతయా రోచనా రుక్మవక్షసః - య ఏవం గుణయుక్తా మరుతో భవన్తి తాన్ పయమభిప్రేతార్థసిద్ధయే స్తుమ ఇతి వాక్యశేషః.

మంత్రార్థము :— యే మరుతః = ఏమరుద్దేవతలు, అగ్నిః న = అగ్నివలె, భ్రాజసా = తేజస్సుతో యుక్తములో, మఱియు, రుక్మవక్షసః = తేజస్వియైన వక్షస్థలయుక్తములో యవి మాయుష్యమును సంపన్న మొనర్చుగాక! ఇందు (అగ్నిః న) న ఉపమార్థకము, రుక్మవక్షసః = రోచిష్ఠారస్కాః = సువర్ణమువలె కాంతియుక్త - ఉరస్సుతోకూడినవి.

చతురశ్చిద్దదమానా ద్విభీయాదాని ధాతోః. "న దురుక్తాయ స్పృహయేత్." (ఋ. ౧-౪౧-౯)

చతురః అక్షాన్ ధారయత ఇతి తద్యథా కితవా ద్విభీయాదేవమేవ దురుక్తా ద్విభీయాత్. న దురుక్తాయ స్పృహయేత్ కదాచిత్.

చతురోఽక్షాన్ ధారయమాణాత్ కితవాత్. యోఽన్యః కితవః బిభీయాన్మామయం జేష్యతీతి. నిహితేషు న తథా భయం సంభవతి. యథా కితవస్య ప్రాక్నిధానాత్. ఏవం సర్వదైవ దురుక్తాత్ బిభీయాత్ ఉద్విజేదిత్యర్థః.

మంత్రార్థము :— చిత్ = ఎట్లు, చతురః = నాలుగుపాచికలను, దదమానాత్ = ధారణచేసియున్న, కితవాత్ = జూదరినుండి, అనిధాతోః = పాచికలు విసరనంతవఱకు, బిభీయాత్ = భయపడునో, దురుక్తాయ నస్పృహయేత్ = దురుక్తము కోరరాదు. దానికి భయపడవలెను. ఇట ఉపమార్థమున 'చిత్'పదమునకు వ్యాఖ్యచేయబడినది.

'ఆ' ఇత్యాకార ఉపసర్గః. పురస్తాదేవ వ్యాఖ్యాతః. అథాప్యుపమార్థే దృశ్యతే. తద్యథా - "జార ఆ భగమ్" (ఋ. ౧౦-౧౧-౬)

జార ఇవ భగమ్. ఆదిత్యోఽత్ర జార ఇత్యుచ్యతే. రాత్రేర్జరయితా. స ఏవ భాసామ్.

పురస్తాదేవ ఆ ఇత్యర్వాగర్థే ఇత్యత్ర. అథాప్యుపమార్థః కదాచి దుపమార్థేఽపి దృశ్యతే. తద్యథా జార ఆభగమితి. జార ఇవ భగమ్. ఆదిత్యోఽత్ర అస్మిన్ మంత్రే జారః రాత్రే ర్జరయితా. తదుదయే హి రాత్రి ర్జీర్యతే. స ఏవ భాసాం చంద్రాదీనామ్. జరయితా నాశక ఇతి నిర్గలితోఽర్థః.

అర్థము :— 'ఆ'అను ఉపసర్గ - వ్యాఖ్యపూర్వమే చేయబడినది. ఇప్పుడు ఇట 'ఆ' ఉపసర్గ ఉపమార్థమున ప్రయుక్తమగుచున్నదని వ్యాఖ్య చేయబడుచున్నది. ఆ = ఎట్లు, జారః = సూర్యః - సూర్యుడు, భగమ్ = భూమియందు, అంతరిక్షమునందునున్న రసమును, లేక తనజ్యోతిని పైకి తీసికొనిపోవునో యట్లే నీవు నీతల్లిదండ్రులకు సేవచేయుము. వారిని పైన సుఖధామమున చేర్చుము. ఈమంత్రమున ఆదిత్యుడే జారశబ్దముచే అభి ప్రేతః = చెప్పబడినాడు. ఏలయన నతడే రాత్రిని జీర్ణముచేయును. నశింప చేయువాడు. స ఏవ భాసాం = అదే జ్యోతిస్సులయొక్క చంద్రుడు మొదలైనవానికాంతుల నశింపచేయును.

తథాపి నిగమో భవతి. "స్వసుర్జారః శృణోతు నః" ఇతి.

ఉషసమస్య స్వసార మాహ సాహచర్యాద్వా రసహరణాద్వా అపి త్వయం మనుష్యజారః ఏవ అభిప్రేతః స్యాత్. స్త్రీభగ స్తథా స్యాత్. భజతేః.

అస్మిన్ మంత్రే స్వసృశబ్దేన మంత్రదృగుషస మాహ. కేన సామాన్యే నేతి ఉచ్యతే సాహచర్యాద్రసహరణాద్ వా. యథా భ్రాతా స్వస్రాసాకం బాల్యే నిత్యమేవ చరతి. తథా చోషసాసాక మాదిత్యః ఇత్యేతత్సామాన్యమ్. భగో భజతేః సేవనార్థస్య స హి సేవ్యతే మైథునార్థిభిః పురుషైః. జారో మనుష్యః స హి పరకీయాం స్త్రీం భోగేన నిర్దయో భూత్వా జరయతి న తథా నిజో భర్తా. అర్థాజ్ఞనిత్వా ఇతిభావః.

అర్థము :— ఈవిషయమున (ఆదిత్యుడు జారుడు అనువిషయ మున) మంత్రమువాద ప్రమాణము. స్వసుః = భగినియొక్క - తనభగిని యైన ఉషస్సుయొక్క, జారః = నాశకుడు - సూర్యుడు-సూర్యోదయము కాగానే ఉషస్సు నశించును, నః శృణోతు = మనము వినుచున్నాము.

ఉషసమ్ = ఉషస్సును, (ప్రభాతకాంతి) సూర్యస్య స్వసారమ్ ఆహ = సూర్యునిభగిని అని చెప్పుదురు, సాహచర్యాత్ = సాహచర్యమువలన, ప్రాతఃసమయమున సూర్యోషస్సులు కలిసియుండును, రసహరణాద్వా = సూర్యోషస్సులిరువురు కలిసియే రసమును మంచురూపజలమును హరించు చున్నవి, అపితు = కాని, మనుష్యజారఏవ ఇహాభిప్రేతః స్యాత్ = మనుష్యజారునిగూర్చి చెప్పుటయే యిట అభిప్రేతము - ఇక్కడ జారుడన పరదారసంబంధముకలవాడని యర్థము. తథా = అటులనే, భజతేః = సేవనార్థక 'భజ' ధాతువుతో భగశబ్దము సిద్ధమగును. కావున నిట భగశబ్దము స్త్రీయోనికే వాచకము. ఇట అభగమే యభిప్రాయము. జారుడైన మనుష్యుడు పరస్త్రీభగమునే మిక్కిలి సేవింపగోరును. జారుడైనమనుష్యుడు పరస్త్రీ యోనిని ఎంతగా సేవింపగోరునో ఓ మానవ! నీవు నీమాతాపితరుల నంతగా సేవింపుము.

> మేష ఇతి భూతోపమా. "మేషో భూతోఽభియన్నయః" (ఋ. ౮-౨-౪౦)
>
> మేషో మిషతేః తథా పశుః పశ్యతేః.

మేష ఇత్యేషా భూతశబ్దేనోపమా. "మేషో భూతోభియన్నయః" (౮-౨-౪౦) మేషో మిషతే ర్దర్శనార్థస్య. పశుః పశ్యతేః. పశ్యతిహ్యేషా హేపర్జిన్ అభియన్ అగచ్ఛన్ ఆహ్వానసమనంతరమేవ అవిలంబమానో మేషో భూతో మేషఇవ కించిదప్యుత్తర మబ్రువన్ అయః త్వామా ప్తవానసి.

అర్థము :- మేష ఇతి - మేషశబ్దము, భూతోపమా = భూతశబ్దముతో కలిసి ఉపమావాచకమగుచున్నది, మేషఃభూతఇతి = మేషమువలె, అభియన్ = ఎదురుగా వెళ్లుచు, అయః = ఎట్లు ముందుప్రాప్తించియుంటివో యట్లే ఇప్పుడును రమ్ము. మేషః మిషతేః దర్శనార్థకమిషధాతువుతో మేషశబ్దమేర్పడును, మేషః = మేకపోతు తనపోషకుని చూచుచున్నట్లు పశుశబ్దము దృశధాతువుతో నేర్పడును. పశువు కేవలము చూచుచుండును బుద్ధిరహితము = బుద్ధిలేనిదియై యుండును.

అగ్నిరితి రూపోపమా. "హిరణ్యక రూపః స హిరణ్యసంధృగ పాన్నపాత్సేదు హిరణ్యవర్ణః" (ఋ, ౨-౩౫-౧౦ )

హిరణ్యవర్ణస్యేవాన్య రూపమ్.

గృత్సమదస్యేయ మార్షమ్. హిరణ్యరూపః-హిరణ్యసమానరూపః అపాన్నపాత్ - అపాంనప్తా మధ్యస్థానో వైద్యుతోఽగ్నిః హిరణ్యసంధృక్ - హిరణ్యమివ సంధృశ్యమానః. అపి చ సేదు స ఏవ హిరణ్యవర్ణః. హిరణ్యమ సువర్ణమ్. తద్వర్ణీయః ప్రార్థనీయ ఇత్యర్థః.

అర్థము :— అగ్నిరితి రూపోపమా = అగ్నిఅనునది రూపమునకు ఉపమ అనగా అగ్నికొఱకురూపము ఉపమింపబడును. నిమ్నమంత్రమున ఉదాహరణము.

మంత్రార్థము :— హిరణ్యరూపః=హిరణ్యమువలె-తేజస్వి, హిరణ్య సంధృక్ = హిరణ్యమువలె కనబడునది, హిరణ్యవర్ణః = సువర్ణమువంటి వర్ణముకలది, అపాం నపాత్ సః = అది అగ్ని.

థా ఇతి చ - "సం ప్రత్నథా పూర్వథా విశ్వథేమథా" (ఋ. ౫-౪౪-౧)

ప్రత్నఇవ పూర్వఇవ విశ్వఇవ ఇమఇవ ఇతి - అయమేతతరో అముష్మాత్. అసావస్తతరోఽస్మాత్. అము థా యథాసావితి వ్యాఖ్యాతమ్.

థాఇత్యయం చోపమాశబ్దః కిముదాహరణమ్ ? ఉచ్యతే,తం ప్రత్నథా పూర్వథా విశ్వథేమథా - ప్రత్నథా చిరన్తనా మహర్షయో భృగ్వాదయ స్తేషాం యథా అపి చ విశ్వథా సర్వేషాం యథా, అపి చేమథాః - వర్తమాన కాలీనానాం యజమానానాం యథా దత్తవానసి కామాన్ తథైవాస్మాక మపి దేహీత్యర్థః.

అర్థము :— థాఇతి చ - థా అనుప్రత్యయముకూడ ఉపమార్థమున ప్రయోగింపబడును. ఎట్లన పైమంత్రమునందు ఇంద్రుని స్తుతియున్నది. అందు ప్రత్నథా = పురాతనులైన అత్రివసిష్ఠాదులవలె, పూర్వథా = మొదటి ఋషులవలె, విశ్వథా = సర్వులవలె, ఇమథా = వర్తమాన ప్రజవలె

ఇట్టి పదప్రయోగములందుగల 'థా'పదము ఉపమార్థమున వాడబడినది. అయమ్ = ఈ ఇదమ్ శబ్దము అముష్మాత్ దీనికంటె ఏతతరః అధిక సమీపమున అనువర్తమున ప్రయుక్తమైనది, అసౌ = అదస్‌శబ్దము ఇదమ్ శబ్దముకంటె. అస్తతరః = దూరమున ప్రక్షిప్తమైన దూరవర్తివస్తువు నిమిత్తము ప్రయుక్తమగును, సమీపమునయున్నదానిని ఇదమ్ - ఇదియు, దూరమునయున్నదానిని తత్ - అది యనియు వ్యవహరింతుము, అముథా యథా అసౌ అముథా దీనివలె నున్నది.

> వదితి సిద్ధోపమా – బ్రాహ్మణవత్‌ వృషలవత్. బ్రాహ్మణ ఇవ వృషలఇవేతి వృషలో వృషశీలో భవతి. వృషాశీలో వా.

సిద్ధోపమా సిద్ధవైషోపమా లోకే. బ్రాహ్మణవత్ వృషలవత్ బ్రాహ్మణ వదధీతే వృషలవచ్చాక్రోశతి ఇతి.

వదితి - 'వత్'అనునిది సిద్ధోపమా లోకమునందు, వేదమునందును ఇది ప్రసిద్ధమైన ఉపమ. ఉదా :–

బ్రాహ్మణవత్=బ్రాహ్మణునివలె, వృషల = వృషశీలః = నీచమనుష్యుడు ఎద్దువంటివాడు, వృషః = ఎద్దు వృషాశీలోవా=లేక వృషధర్మమునకు సంబంధించిన అశీలః = స్వభావములేనివాడు.

ఉపమావాచకమగు 'వత్'పదమునకు ఉదాహరణము నిమ్నమంత్రము.

> "ప్రియమేధవదత్రివజ్జాతవేదో విరూపవత్. అంగిరస్వన్మహివ్రత ప్రస్కణ్వస్య శ్రుధీ హవమ్" (ఋ. ౧-౪౫-౩)
>
> ప్రియమేధః – ప్రియా అస్య మేధః యథైతేషా మృషీణామేవం ప్రస్కణ్వస్య శృణుహ్వానమ్. ప్రస్కణ్వః పుత్రః కణ్వ ప్రభవః. యథా ప్రాగ్రమ్. అర్చిషి భృగుః నంబభూవ. భృగు ర్భుజ్యమానో న దేహే. అంగారేష్వంగిరాః అంగారా అంకనాః అంచనాః. అత్రైవ తృతీయ మృచ్ఛతేత్యూచుః. తస్మాదత్రిః న త్రయ ఇతి విఖననాద్వైఖానసః భరణాద్ భారద్వాజః. విరూపో నానారూపః మహివ్రతో మహావ్రత ఇతి.

ఏషా ప్రస్కణ్వస్యార్షమ్. హే జాతవేదః మహివ్రత మహావ్రత మహాకర్మన్ యథైషా మృషీణామ్ ప్రియమేధాదీనామ్ శ్రుతవానసి పూర్వ మాహ్వానం శృణోషి వా ఏవం మమాపి ప్రస్కణ్వస్య శృణ్వాహ్వానమ్. ప్రజాపతినా కిల శుక్రమాత్మీయ మాదాయాగ్నౌ హుతమ్ తతోఽర్చిషి జ్వాలాయాం భృగుర్నామ మహర్షిః సంబభూవ. వ్యపగతేఽర్చిషి అంగారేషు యః సంబభూవ సోఽఙ్గిరా నామాభవత్. అంకనా ఇతి తే హి యత్రాశ్రయే నిధీయన్తే తచ్చిహ్నితం భవతి ఉత్పన్నే ద్వితీయే అత్రైవ కుండే తృతీయమృచ్ఛతేతి. యముద్దిశ్యోచుః భృగ్వాదయః సోఽత్రిః. న త్రయః ఏవ ఖన్యతాం భూమి శ్చతుర్థోపి నిష్క్రమిష్యతీత్యతో వాఽత్రిః ఖననాత్ స్థానస్య యో జాతః స వైఖానసః. భరణాత్ పూరణాదగ్నిస్థానస్య యో జాతః స భరద్వాజః నానారూపం యస్య స విరూపః.

మంత్రార్థము :— జాతవేదః! మహివ్రత! హే విద్వన్=ఓ గొప్ప కర్మనొనర్చువాడా! కణ్వపుత్రుడనగు నాయొక్క, హవమ్=నివేదనమును, శ్రుధిః = వినుము, ప్రియమేధవత్ = ప్రియమేధునివలె, అత్రివత్ = అత్రివలె, విరూపవత్ = విరూపమువలె, అంగిరస్వత్ = అంగిరసునివలె, ప్రియమేధాది ఇతరఋషుల విషయమును నీవు వినినట్లు నానివేదనమును కూడ వినుము. ప్రస్కణ్వుడనగా కణ్వపుత్రుడు కణ్వపదమునకు ముందు ప్రఉంచుటవలన కణ్వప్రభువుడు అని యర్థమగును. ఎట్లన, 'ప్రాగ్'పదమునందు అగ్రపదమునకు ముందు ప్రఉంచుటవలన అగ్రప్రభువుడని యర్థమగును కదా! ప్రస్కణ్వమున 'సుట్' నిపాతితము. భృగుః అర్చిషి సంబభూవ = భృగుమహర్షి జ్వాలయందు పుట్టెను.

భృగుర్ భుజ్యమానో న దేహే=భృగుః అనగా దేహమునందు భుజ్యమానః=వేయింపబడినవాడు న= కాదు, భృగుమహర్షి జ్వాల (మంట) యందు పుట్టినను అతనిశరీరము కాల్చబడలేదని భావము, అంగారేషు అంగిరాః = అంగారములందు - మంటలు ఆరిపోయిన పిదప మిగులు నిప్పుకణములందు-పుట్టినవాడు కావున అంగిరాః=అంగిరుడు అనబడును. అంగారా అంకనా భవంతి = అంగారములు అంకనలగును - అనగా నిప్పుకణములు పడినచోటు దానిచే చిహ్నితము అగును. అందువలన అంగారములు అంకనలు అనబడును, 'అకిలకిణో'ధాతువువలన అంగారశబ్ద

మేర్పడును. ఇట్లు అగ్నియందు కణ్వుడు, భృగువు, నను ఇరువురు పుట్టిరి. కావున అత్రైవ = ఇక్కడనే ఈయగ్నియందే మూడవవానినిగూడ పొందుము అని ఋషులనుటచే - అత్ర + త్రి = అత్రిః = అత్రి అనుఋషి పుట్టెను, అని అత్రిపద నిర్వచనము అథవా - లేక ఎవనికి తాపత్రయము - త్రివిధదుఃఖములు - ఉండవో యతడు అత్రి అనబడును. అనియు నిర్వచింపవచ్చునని భావము.

విఖననాత్ = అస్థలమునసే ఖననముచేయుటవలన పుట్టినవాడు కావున వైఖానసుడనబడెను, భరణాత్ = భరణక్రియతో సంబంధముండుట వలన భారద్వాజుడని నామమేర్పడెను, విరూపో = నానారూపములవలన విరూపుడను నామమేర్పడెను, మహావ్రతః - మహావ్రత ఇతి = గొప్ప కర్మ లొనర్చువాడు అనగా కర్మయోగి యనిఅర్థము. వ్రతశబ్దము కర్మ వాచకము.

ఇతి తృతీయఃపాదః

మూడవపాదము సమాప్తము

## నాల్గవపాదము

**అథ లుప్తోపమాన్యర్థోపమానీత్యాచక్షతే.**

అథ ఇదానీం యేషు పదేషు లుప్యన్తే ఉపమాశబ్దా ఇవాదయ స్తాన్యవసరప్రాప్తాని వ్యాఖ్యాయామ స్తాని పునరిమా న్యర్థోపమా నీత్యేవ మాచక్షతే. ఆచార్యాః తద్యథా.

లుప్తోపమాని - ఏవాక్యములందు ఉపమార్థకములైన ఇవాది పద ములు లోపించినవో యూవాక్యములు అర్థోపమవాక్యములు అని చెప్పుదురు.

**సింహో వ్యాఘ్ర ఇతి పూజాయామ్.**

యో హి పూజ్యః భవతి స ఉచ్యతే సింహో దేవదత్త ఇతి. అత్ర న సింహో దేవదత్తః కింతర్హి? సింహగుణాస్తత్ర కశ్చిదస్తి శౌర్యాదిః. తత ఏవ రామసింహః, విక్రమసింహః, ఆదినామాని.

సింహము, వ్యాఘ్రము అను నీరెండుపదములు పూజాపరకములు - పూజనుబోధించును. ఉదాహరణము :- సింహో దేవదత్తః ఇతి.

దేవదత్తుడు సింహము - దేవదత్తుడు సింహమా ? కాదు - కాని, దేవదత్తు నిలో సింహగుణమైన శౌర్యమువంటిశౌర్యము ఉన్నదని యర్థము. కావున దేవదత్తుడు సింహమువంటివాడని అర్థము. దేవదత్తుడు సింహః అను నీవాక్యమున సింహమువంటివాడు అని చెప్పుటకు తగిన (సింహఇవ) ఇవ - వంటి పదములేదు. అందువలన నీవాక్యము లుప్తోపమవాక్యమన బడును. దీనినే అర్థోపమ వాక్యమందురు. ఈవాక్యమున సింహపదము పూజాపరకము ప్రశంసార్థకము. సింహమెట్లుశౌర్యము కలిగినదో దేవదత్తు డును శౌర్యముకలవాడని వాక్యాభిప్రాయము. అందువలననే దేవదత్తుని సింహమునవలెంచవలయును.

### శ్వా కాక ఇతి కుత్సాయామ్.

యో హి తౌల్యాది దోషసమన్వయేన కుత్సనీయో భవతి. స ఏవ ముచ్యతే శ్వాయమితి. అత్రాపి శ్వేవాయమితివా శబ్దస్య లోపో ద్రష్టవ్యః - ధార్ష్ట్యాది - దోషసముచ్చయేన యః కుత్స్యతే స కాకోఽయ మిత్యుచ్యతే శ్వా = కుక్క, కాకః = కాకి, ఈ శ్వాకాకపదములు - నిందాపరకములు, నిందార్థకములు. తౌల్యము - లోలుపత - దోషము - చెడ్డగుణము - ఆప్లే ధృష్టత - కూడ దోషమే. లోలుపత ధృష్టత మున్నగు చెడ్డగుణములు ఉన్నచో ఆమనుష్యుని 'అయం శ్వా - అయం కాకః' వీడు కుక్క, వీడు కాకి అందురు. ఇట 'శ్వా ఇవ కాక ఇవ' కుక్కవంటివాడు, కాకివంటి వాడు. కుక్క, కాకి - అనుటలో వంటి-ఇవ అనుపదములు లోపించుటచే లుప్తోపమ అర్థోపమ వాక్యములనబడును.

### కాక ఇతి శబ్దానుకృతిః తదిదం శకునిషు బహులమ్.

స హి కాకుకాక్విితివాశ్యతే తస్మాత్ స కాక ఇత్యుచ్యతే 'వాశృశబ్దే' ధాతుః. తదిదమేవం శబ్దానుకృతి - హేతుకం నామ శకునిషు సత్వవిశే షేషు బహులం ప్రాయేణేత్యర్థః.

అర్థము :— కాకులు - 'కా కా' అని యఱచును. అందువలననే వానిని కాకులు అందురు, కాకిచేయుశబ్దమునకు అనుకరణమే 'కా కా' అనునది. శకునిషు బహుళమ్. పక్షులలో తఱచు అవి చేయుధ్వనులు కారణముగ వానికి నామము తేర్పడియుండును.

న శబ్దానుకృతిర్విద్యత ఇత్యౌపమన్యవః కాకోఽపకాలయితవ్యో భవతి।

శకునిష్వపి న శబ్దానుకృతిహేతుకం నామ విద్యతే. ఇత్యౌపమన్యవ ఆచార్యో మన్యతే. అపకాలయితవ్యో భవత్యుపఘాతభయాత్ అపసారయితవ్య ఇత్యర్థః - కాలయతి గత్యర్థః,

అర్థము :- శబ్దానుకృతిః = శబ్దానుకరణము సంగీకరించి పక్షి నామకరణము చేయ వీలుకలుగదు. ఇతి ఔపమన్యవః అని ఔపమన్యవ ఆచార్యుడంగీకరించుచున్నాడు. వారిమతమున కాకశబ్దము వ్యుత్పన్నమే. కాకః అపకాలయితవ్యః = వెళ్లగొట్టదగినది. వెడలగొట్టుట అను అర్థముగల 'కాల' ధాతువుతో కాకశబ్దమేర్పడును.

తిత్తిరి స్తరణాత్ - తిలమాత్రచిత్ర ఇతి వా।

తిత్తిరిస్తరణాత్ త్వరాప్లవనతరణయోః. ఉత్ప్లుత్యాసౌ గచ్ఛతి. అథవా తిలమాత్రచిత్రః స భవతీతి తిత్తిరిః.

అర్థము :- తిత్తిరినామమేలకలిగినది? తరణాత్ ఉత్ప్లుత్య ఎగిరి, ఎగిరి నడుచును. అందువలన తిత్తిరి అని నామమేర్పడినది. లేక తిత్తిరి యందు తిలమాత్రచిత్రః నువ్వుగింజవంటి నల్లనిచిత్రములుండును. అందు వలన నది తిత్తిరియనబడును.

కపింజలః - కపిరివ జీర్ణః. కపిరివ జవతే ఈషత్ పింగలో వా, కమనీయం శబ్దం పింజయతీతి వా.

యాదృశో హి కపిః మర్కటః జీర్ణః సన్ వర్ణతో భవతి తాదృశోఽసౌ అపి కపింజలః కమనీయం మధురం శబ్దం పింజయతి అభివ్యనక్తీతి కపింజలః. కమనీయ మిత్యత్ర గమనీయమితి క్వచిత్ పాఠః అత్ర గమనీయం ప్రార్థనీయమ్.

అర్థము :- కపింజలః అని యేల చెప్పబడుచున్నది? కపిః ఇవ జీర్ణః=మర్కటమువలె - ముసలి కోతివంటి వర్ణముగలది యగుటవలన, అథవా కపిరివ జవతే = కోతివలె వేగముగా గంతులువేయుచు నడుచును. అథవా ఈషత్ పింగలః కొంచెము పీతవర్ణము కలిగియుండును. 'ఈషత్,

నకు కకారాదేశము, గకారమునకు జకారము ఆదేశముచేసిన కపింజల శబ్దముసిద్ధించును. గమనీయం మధురం శబ్దం పింజయతి కలిగించును. కావున కపింజల మనబడును.

**శ్వా - శుయాయీ శవతేర్వా స్యాద్ గతికర్మణః శ్వసితేర్వా.**

శు ఇతి క్షిప్రనామ. క్షిప్రమసావేతి శవతేర్వా గతికర్మణః స హి నిత్యమేవ గచ్ఛతి. శ్వసితేర్వా వధకర్మణః పథికాన్ హినస్తి సః. శ్వన్నుక్షన్నితి నిపాతనాత్సాధుః.

అర్థము :— శ్వా=కుక్క, శు శీఘ్రయాయీ=శీఘ్రముగా వెళ్లునది కావున శ్వా - కుక్క యనబడును. 'శు' క్షిప్రసమానార్థకము. శు పూర్వక అయధాతువునకు కనిన్ ప్రత్యయముచేసిన శ్వా సిద్ధమగును, వా=లేక గతికర్మణః గత్యర్థక శవతేః శవధాతువువలన శ్వాశబ్దము సిద్ధించును. శ్వసితేర్వా=లేక, వధార్థక శ్వస్‌ధాతువుతో - శ్వస్‌లోని సకారమును లోపింపజేసి అన్ ప్రత్యయము చేసిన శ్వాశబ్దము సిద్ధించును. కుక్క వేటాడు జంతువు.

**సింహః సహనాత్ హింసేర్వా స్యాత్. విపరీతస్య సంపూర్వస్య వా హన్తేః సంహాయ హన్తీతి వా.**

సింహః సహనాదభిభవతి. హ్యసావన్యాన్ ప్రాణి - విశేషాన్ సంపూర్వస్య వా హన్తేరుపసర్గస్యేత్త్వేన.

అర్థము :- సహనాత్ సింహః ఇతరజంతువులను అణచును - అందువలన నీసహనక్రియాయోగమువలన సింహమనబడును. సహశబ్దమునకర్థము అభిభవము. వా = లేక హింసేః విపరీతస్య హింసపదగత అక్షరములను విపరీతముచేసిన సింహమగును, సింహము ఇతర జంతువులను హింసించును. లేక సమ్ ఉపసర్గపూర్వక హనధాతువువలన సింహమగును. సంహాయహన్తి తనశరీరమును సంకుచితముచేసికొని చంపును - సంహాయ సంకోచ్య ఆత్మానం హన్తి.

**వ్యాఘ్రో వ్యాఘ్రాణాత్ - వ్యాదాయ హన్తీతి వా.**

వ్యాఘ్రో వ్యాఘ్రాణాత్. వివిధమసౌ జిఘ్రతీతి వ్యాఘ్రః సహ్యాఘ్రాయ హన్తివ్యాదాయ హన్తీతి వా. స కిల వ్యాదాయ వక్త్రం తతో హన్తి.

అర్థము :- వ్యాఘ్రాణాత్ = వాసనచూచుటవలన వ్యాఘ్రమన బడును. దీని ఆఘ్రాణము తీవ్రముగా నుండును, వా = లేక వ్యాదాయ - అనేకవిధముల తాను వేటాడుజంతువులను, లాగి, తెచ్చి చంపును. వి, ఆ, పూర్వక ఘ్రాధాతువునకు 'ర' ప్రత్యయముచేసిన వ్యాఘ్రము సిద్ధించును.

(అథార్చతికర్మాణః)

## అర్చతి కర్మాణః ఉత్తరే ధాతవ శ్చతుశ్చత్వారింశత్.

అర్చతి కర్మాణః అర్చత్యర్థాః చత్వారి చ చత్వారింశచ్చ తాని. రాబోవు (౪౪) నలుబదినాలుగు ధాతువులు పూజార్థకములు.

(అథ మేధావినామాని)

## మేధావినామాన్యుత్తరాణి చతుర్వింశతిః. మేధావీ కస్మాత్? మేధయా తద్వాన్ భవతి. మేధామతౌ ధీయతే.

మేధావిన ఏవ అర్చన్తి స్తోతుం శక్నువన్తి నేతరే అమేధసః. ఇత్య ర్చత్యగ్రే మేధావినామాని. మేధా మతౌ ధీయతే. మతి ర్బుద్ధి స్తస్యాం యా పురుషశక్తి రభివ్యజ్యతే సా మేధా ఇత్యుచ్యతే. తద్వాన్ మేధావీ.

రాబోవు (౨౪) ఇరువదినాలుగు మేధావి నామములు మేధావీ ఎట్లు? మేధావంతుడు - మతియందుంచబడునది మేధా యగును. ధారణవతీబుద్ధి మేధస్సు అనబడును.

(అథ స్తోతృనామాని)

## స్తోతృనామాన్యుత్తరాణి త్రయోదశ. స్తోతా స్తవనాత్.

మేధావిన ఏవ స్తోతుం శక్నువన్తి ఇతి. మేధావినామభ్య ఉత్తరాణి స్తోతృనామాని. మేధావులే స్తుతిచేయగలరు. కావున మేధావినామముల తదుపరి స్తోతృనామములు నిర్వచింపబడుచున్నవి-స్తోతృనామములు (౧౩) త్రయోదశ. స్తవనక్రియవలన స్తోత యనబడును.

(అథ యజ్ఞనామాని)

**యజ్ఞనామాన్యుత్తరాణి పంచదశ. యజ్ఞః కస్మాత్? ప్రఖ్యాతం యజతి కర్మేతి నైరుక్తాః. యాచ్ఞ్యో భవతీతి వా. యజురున్నో భవతీతి వా బహు కృష్ణాజిన ఇత్యౌపమన్యవః. యజూంష్యేనం నయన్తీతి వా.**

యజ్ఞేష్వేవ హి దేవతానాం స్తుతయః ప్రయుజ్యన్త ఇతి స్తోతృనామభ్య ఉత్తరాణి యజ్ఞనామాని. ప్రఖ్యాతం లోకవేదయోః యజనం యజ్ఞ ఇతి. అథవా యాచ్ఞ్యో భవతీతి యాచ్యతే తత్ర వా యజుర్భి రయమున్న ఇవ సంక్లిన్న ఇవ భవతి. బహుత్వాదత్ర యజుషామ్. బహుకృష్ణాజిన ఇతి యద్యదత్ర దృశ్యతే సాధనం తత్తత్ కృష్ణాజిన మితి యజ్ఞః. ఉపక్రమాదారభ్యాన్తం నయన్తీతి.

ముందుగల ౧౫ పదునైదునామములు యజ్ఞవాచకములు.

అర్థము :- యజ్ఞకర్మ ప్రఖ్యాతమ్. యజ్ఞశబ్దమునకర్థము యజనము. ఇయ్యది ప్రఖ్యాతమే అని నైరుక్తాః నిరుక్తకారు లంగీకరించుచున్నారు. యజ్ఞశబ్దము యజనార్థకమని యెల్లరు నంగీకరించుచున్నారు. యాచ్ఞ్యో భవతీతి వా. యజ్ఞము కొందొకఫలము నుద్దేశించి చేయబడును యజ్ఞము యాచనీయము. అందువలన యజ్ఞమనబడుచున్నది. యజురున్నః భవతి. యాజుషమంత్రములతో ఉన్నః - క్లిన్నః భవతి. ఆర్ద్రము చేయబడును. 'ఉందీక్లేదనే' ధాతువుతో ఉన్నః భవతి. యజ్ఞమునందు కృష్ణాజినములు చాలపఱవబడును. కావున యజ్ఞమనబడును.

(అథ ఋత్విఙ్నామాని)

**ఋత్విఙ్నామాన్యుత్తరాణ్యష్టౌ. ఋత్విక్ కస్మాత్? ఈరణః ఋగ్యష్టా భవతీతి శాకపూణిః. ఋతుయాజీ భవతీతి వా.**

యజ్ఞసంబంధేనైవ ఋత్విఙ్నామా న్యుత్తరాణి. ఈరణః ఈరయితా హి స స్తుతీనాం భవతీతి ఋత్విక్. ఋగ్భిర్యష్టా యాగకారీ భవతీతి ఋత్విక్ స హి కాల ఏవ యాజయతే నాకాలమ్.

అర్థము :- ముందటి (౮) ఎనిమిదినామములు ఋత్విక్కు నామములు. ఋత్విక్కనుటకు కారణమేమి? ఈరణః - ప్రేరకుడు

యజ్ఞముకొఱకితడు ప్రేరణచేయును. కావున ఋత్విక్ అగును ఋగ్యష్టా భవతి. ఏలయన - ఈఋత్విక్కు ఋఙ్మంత్రములతో యజ్ఞముచేయును. కావున ఋత్విక్ అనబడెను. వా అథవా ఋతుయాజీ భవతి, ఋతువునందు యజ్ఞముచేయువాడు.

(అథ యాచ్ఞాకర్మాణః)

**యాచ్ఞా కర్మాణః ఉత్తరే ధాతవః సప్తదశ.**

ఋత్వికి సంబంధేనైవ యాచ్ఞాకర్మాణ ఉత్తరే ధాతవః సప్తదశ.

ఋత్విక్సంబంధముతోనే యాచ్ఞార్థకధాతువులు ౧౭ - పదునేడు.

(అథ దానకర్మాణః)

**దానకర్మాణ ఉత్తరే ధాతవో దశ.**

యాచ్ఞాసంబంధేనైవ దానకర్మాణ ఉత్తరే ధాతవో దశ. యాచ్ఞా సంబంధముతోనే దానార్థకధాతువులు దశ (౧౦).

(అథాధ్యేషణా కర్మాణః)

**అధ్యేషణా కర్మాణ ఉత్తరే ధాతవ శ్చత్వారః.**

దానసంబంధేనైవ అధ్యేషణాకర్మాణ ఉత్తరే ధాతవ శ్చత్వారః సత్కృత్య దాతృభి ర్దాతుం ప్రతిగ్రహీతౄణాం ప్రార్థనా అధ్యేషణా ఇత్యుచ్యతే. తత్ కర్మాణః తదర్థాః.

అర్థము :- ముందటి నాలుగుధాతువులు ప్రార్థనార్థకములు. అధ్యేషణా ప్రార్థనా ఇత్యుచ్యతే. అధ్యేషణయనప్రార్థన - తత్కర్మాణః = దానార్థకములు పెద్దలను సత్కరించి యజ్ఞకర్మమునందు దానమును గ్రహించుటకు అధ్యేషణా - ప్రార్థనచేయబడును.

(అథ స్వపితి కర్మాణౌ)

**స్వపితి సస్తీతి ద్వౌ స్వపితికర్మాణౌ.**

యాచ్యమానో హి సర్వోపి స్వపితీత్యధ్యేషణా కర్మభ్య ఉత్తరౌ స్వపితి కర్మాణౌ.

స్వపితి, సస్తి అను నీరెండుధాతువులు నిద్రించుటయును నర్థమున నున్నవి.

(అథ కూపనామాని)

**కూపనామాన్యుత్తరాణి చతుర్దశ. కూపః కస్మాత్ ? కుపానం భవతి. కుప్యతేర్వా.**

కూపమేవ హ్యాశ్రిత్య మరౌ సుప్యతే సుప్తః కూప ఇవ పతితో భవతీతి వా. స్వపితి కర్మభ్యా మనంతరాణి కూపనామాన్యుచ్యన్తే. కుపానం భవతి కుత్సితంపానం సాధనాపేక్షిత్వాత్. కుప్యతేర్వా యత్సంబంధాదుదకార్థినః కుప్యన్తి.

అర్థము :- ముందటి చతుర్దశ = పదునాలుగు కూపనామములు. కూపమని యేల ? కుత్సితపానం భవతి. కుపానమగుటచే కుత్సితపానము కలదగుటవలన కూపమనబడుచున్నది. కూపము - బావినుండి జలము త్రాగవలయుననిన త్రాడు బొక్కెన మున్నగుసాధనము లపేక్షితములు. అవి లేకున్న జలములభించదు. నీరుత్రాగుటకష్టము, కావున కూపము కుత్సితపానమనబడును. కుప్యతేర్వా - క్రోధార్థక కుప ధాతువుతో కూప శబ్దమేర్పడును. అందువలన కూపము అనబడును. కూపసమీపమునకు వెళ్లినవానికి జలమునులభముగా లభించదు. కావున వానికి కోపముకలుగు ననిభావము.

(అథస్తేననామములు)

**స్తేననామాన్యుత్తరాణి చతుర్దశ. స్తేనః కస్మాత్ ? సంస్త్యాన మస్మిన్ పాపకమితి నైరుక్తాః.**

కూపమాశ్రిత్య ముష్ణన్తి స్తేనా ఇత్యతః కూపనామభ్య ఉత్తరాణి స్తేననామాని. సంస్త్యానమ్ సంహతమస్మిన్ పాపకం కర్మ భవతీత్యేవం నైరుక్తా మన్యన్తే. వైయాకరణానామన్యథాస్యాదిత్యభిప్రాయః.

అర్థము :- ముందటి (౧౪) పదునాలుగు స్తేన వాచకములు కూపమునాశ్రయించి దొంగలు దొంగిలింతురు. కావున కూపనామానంతరము స్తేన - దొంగ - నామములు నిర్వచింపబడుచున్నవి. స్తేనః కస్మాత్ ? ఈ

చౌర్యమునందు పాపములు ఏకత్రితమగును ఎక్కువగును. కావున చోరుని 'స్తేనః' అందురు.

(నిర్ణీతాంతర్హితనామాని)

**నిర్ణీతాంతర్హితనామధేయాన్యుత్తరాణి షట్. నిర్ణీతం కస్మాత్? నిర్ణిక్తం భవతి.**

ఉత్తరాణి ప్రకృతేభ్యః స్తేననామభ్యః స్తేనా ఏవ హ్యన్తర్హితా భవన్తీత్యేష సంబంధః. ముందటి ఆరునామములు నిర్ణీతము అంతర్హితమునకు సంబంధించినవి. నిర్ణీతం కస్మాత్? నిర్ణీతం నిర్ణిక్తం భవతి - శుద్ధమగును. నిర్మలమగును. ఆలోచనమూలమున పరిమార్జితము చేయుబడును. కావున నిర్ణీతమనబడుచున్నది.

(అథ దూరనామాని)

**దూరనామాన్యుత్తరాణి పంచ. దూరం కస్మాత్? ద్రుతం భవతి. దురయ్యం వా?**

అంతర్హితం యద్ భవతి దూరవత్తద్భవతీత్యేష సంబంధః. ద్రుతం హి తద్ భవత్యధ్వనో మహత్వాత్. దురయం వా దుఃఖం హి తద్గమ్యతే - ప్రాప్యతే.

అర్థము :- ముందటి ఐదునామములు దూరమునకు సంబంధించినవి. దూరమేలయనబడును? మార్గము దీర్ఘమగుటచే ద్రుతం భవతి - వెళ్లియున్నట్లుండును. దురయం వా - లేక దుఃఖగమ్యము. కష్టపడి వెళ్ల దగినదగును.

(అథ పురాణనామాని)

**పురాణనామాన్యుత్తరాణి షట్ - పురాణం కస్మాత్ పురా నవం భవతి.**

దూరసంబంధేనైవ పురాణనామాన్యుత్తరాణి షట్. పురా పూర్వం నవం నూతనం భవతి. న వర్తమానకాలే,

అర్థము :- ముందటి ఆఱునామములు పురాణవాచకములు పురా నవం భవతి. పురాణమననేల? పూర్వము నూతనముగా నుండెను. ఇప్పుడు కాదు - అందువలన పురాణమనబడును.

(అథ నవ నామాని)

**నవ - నామాన్యుత్తరాణి షడేవ. నవం కస్మాత్ ? ఆనీతం భవతి.**

పురాణసంబంధేనైవ నవనామాని కార్యకారణ భావాద్వా. ఆనీతం భవతి క్షిప్రోత్పన్నం పురాణాపేక్షయేతి భావః.

అర్థము :- ముందటి ఆఱునామములు నవవాచకములు ఆనీతం భవతి. ఇప్పుడిప్పుడే తేబడినది. అందువలన నవమనబడును.

**ద్విశ ఉత్తరాణి నామాని షడ్వింశతిః.**

ద్వే ద్వే ద్విశః ఉత్తరాణీతి ప్రపిత్వేఽభీక ఇత్యేవమాదీని.

ముందటి ఇరువదియాఱు (౨౬) నామములు ద్విశః రెండేసి ఒకే అర్థమునకు వాచకములు.

**ప్రపిత్వేఽభీక ఇత్యాసన్నస్య - ప్రపిత్వే ప్రాప్తే - అభీకే- అభ్యక్తే.**

**"ఆపిత్వే నః ప్రపిత్వే తూయమాగహి" (ఋ. ౮-४-3)**

**"అభీకే చిదులోకకృత్ " ఇత్యపి నిగమౌ భవతః.**

ప్రపిత్వేఽభీక ఏతే నామన్యాసన్నస్య భవతః ప్రాప్తేఽభ్యక్తేఽభ్యాగతే. ఇదానీముదాహరణే బ్రవీతి. ఆపిత్వే నః అభీకే చిదితి. హే ఇంద్ర! త్వమేతస్మిన్నాపిత్వే ఆపాన - కాలే ప్రపిత్వే ప్రాప్తే తూయం క్షిప్రమాగహి ఆగచ్ఛ - ఆగత్య చ సోమం పిబ. హే స్తోతారః అభీకేఽభ్యాగత ఏతస్మిన్ సంగ్రామకాలే లోకకృత్ స్థానకృత్. శత్రుహ న్తైంద్రో భవిష్యతీతి ప్రార్చత.

అర్థము :- ప్రపిత్వే - అభీకే - ఈరెండును నికటమునకు నామములు. ఈరెండు సోపసర్గలు, సప్తమ్యన్తములుగా చూడబడినవి. ప్రపిత్వే

పదమునకర్థము ప్రాప్త. అభీకేపదమునకర్థము నికటగతము-సమీపాగతము రెంటికి ప్రమాణము నిచ్చుచున్నారు.

మంత్రార్థము:– (క) ఆపిత్వే=ఆపానకాలమున నుపస్థితుడైనమీదట, నః ప్రపిత్వే = మాసమీపమునకు, తూయమ్ = శీఘ్రముగా, ఆగహి = ఆగచ్ఛ=ప్రాప్తమగుదువుగాక! (ఖ) సంగే అభీకే = యుద్ధమువచ్చినపుడు, లోకకృత్ స్థానకృత్ = మైదానమునుండి తొలగనివాడు, ఇట చిత్-ఈ రెండును పాదపూర్త్యర్థకములు సంగే-ఇది సమస్త మంత్రమునందున్నది.

> దభ్రమర్భకమిత్యల్పస్య. దభ్రం దభ్నోతేః సుదంభం భవతి. అర్భకమవహృతం భవతి.
>
> "ఉపోప మే పరా మృశ మా మే దభ్రాణి మన్యథాః" (ఋ. ౧-౧౨౬-౭)
>
> "నమో మహద్భ్యో నమోఽర్భకేభ్యః" ఇత్యపి నిగమౌ భవతః.

దభ్రమర్భకమిత్యేతేఽల్పస్య నామనీ. దభ్రం దభ్నోతేర్ వధార్థస్య సుదంభం సుచ్ఛేదమల్పత్వాత్. అర్భకమవహృతం హ్రస్వమిత్యర్థః. హే రాజన్! ఉపగమ్యోపశ్లిష్య చ మే మమ పరామృశ యః ప్రదేశః పుంసేణ స్త్రియాః పరామర్ష్టవ్యః. కించ మా మే దభ్రాణి అల్పకాని లోమాని మన్యథాః. జానేఽహమేతద్యథా అలోమికాయా ఉపగమః ప్రతిషిద్ధః స్మృతౌ. రోమశాహమస్మి నిఃశంకో మాముపగచ్ఛేత్యభిప్రాయః. నమో మహద్భ్యో నమోఽర్భకేభ్యః. త్రిష్టుప్ శునఃశేపస్యార్షమ్ మహద్భ్యః మహత్పరిమాణేభ్యః దేవేభ్యో నమోఽర్భకేభ్యః అల్పపరిమాణేభ్యః.

అర్థము :- దభ్రఅర్భకపదములు అల్పవాచకములు. దంభుదంభనే అనుధాతువునకు రక్ చేర్చిన దభ్రయగును. ఎలయనగా సుదంభ - సులభముగా భేదింపబడును కావున దభ్రయనబడును. 'అవహృతః' చిన్నవాడు. అందువలన అర్భకుడనబడును. దభ్రపదమునకు మంత్రము మే ఉప =

ఉపపరామృశ=నాతో బాగుగ పరామర్శింపుము, మే = నాయొక్క సామర్థ్యములను, దభ్రాన్ = అల్పములని మా మన్యథాః=ఎంచవలదు.

అర్భకశబ్దమునకు మంత్రము - మహద్భ్యో నమః = పెద్దవారికి నమస్కారము, అర్భకేభ్యః = చిన్నవారికి నమస్కారము.

**తిరః సత ఇతి ప్రాప్తస్య తిరస్తీర్ణం భవతి. సతః సంసృతం భవతి.**

**“తిరశ్చిదర్యయా పరివర్తిర్ యాతమదాభ్యా (ఋ. ౫-౭౫-౭)**

**“పాత్రేవ భిందన్ సత ఏతి రక్షసః” ఇత్యపి నిగమౌ భవతః.**

తిరః సత ఇత్యేతే ప్రాప్తస్య నామనీ భవతః. తిరస్తీర్ణం భవతి. దూరమధ్వానమ్. సతః సంసృతం భవతి. ఏకీభూయ సృతంభవతి. పంక్తిభ్యాని హే అశ్వినౌ అస్మాన్ యుష్మే సోమం పాతుం యువామ్ ఆహ్వాయమానౌ మయా తిరశ్చిత్ తిరోఽపి అర్యయా ఈశ్వరస్యాపి రథగత్యా పరివర్తిః పరివర్తనం కృత్వా అయాతామ్ అదాభ్యౌ అహింస్యౌ. వసిష్ఠస్యార్షమ్ జగతీ ఇంద్రో అస్మాభి రారాధిత ఏతు అభ్యేతు యథా పాత్రాపాత్రాణి భిన్దన్ కశ్చిదభ్యేయాత్. ఏవం రక్షాంసి భిన్దన్.

అర్థము :— తిరః సతః అను నీరెండుపదములు ప్రాప్తవాచకములు. తిరః తీర్ణం భవతి. దూరమువఱకు మార్గమును తరించినదానికి 'తిరః' అని నామము. సతః సంసృతమ్ భవతి = ఒకటియై వెళ్లి యున్నదానిని 'సతః' అందురు.

మంత్రార్థము :— (క) అదాభ్యా=దుఃఖితులవు కాని మీరు తిరః = ప్రాప్తమైన, అర్యయా = ఉత్తమగతితో, పరివర్తిః = పరివర్తనముచేసియు, అయాతమ్ = ప్రాప్తులగుదురుగాక. అనగా నెన్నడు మీరు ఖిన్నులుకాక స్వభావతః ప్రాప్త ఉత్తమచర్యతో లోకయాత్రను నిర్వహింపుడని భావము. మీమనస్సు ఎన్నడైన వ్యాకులతచెందినచో మఱియొక మార్గమున పయ

వుంచును. ఆవశ్యకమనితోచినప్పుడు అటనుండియు పరివర్తనము చేసి కొనుడు.

(౪) పాత్రా ఇవ భిన్దన్ - కొంతెకమనుష్యుడు కుమ్మరివాని పాత్రలను పగులగొట్టుచు నిరాతంకముగ వచ్చునట్లు, సతః=ప్రాప్తమైన వానిని లనుగూడ నాశనము చేయుచువచ్చును.

> త్వో నేమ ఇత్యర్ధస్య. త్వోఽపతతః నేమోఽపనీతః అర్ధం హరతేః విపరీతాత్ ధారయతేర్వా స్యాత్ః ఉద్ధృతం భవతి. ఋధ్నోతే ర్వా స్యాత్. ఋద్ధతమో విభాగః "పీయతి త్వో అనుత్వోగృణాతి" (ఋ. ౧-౧౪౭-౪) నేమే దేవాః నేమేఽ సురాః ఇత్యపి నిగమౌ భవతః.

త్వో నేమ ఇత్యేతే నామన్యర్ధస్య అపతతః అపేత్య తతః నేమో అపనీతః పృథక్కృత ఇత్యర్థః. అర్ధం హరతే ర్విపరీతాద్ధారయతే ర్వా స్యాత్ ఉద్ధృతం హి తత్ భవతి. ఋధ్నోతేర్వా స్యాత్ ఋద్ధతమః. అభిసంపన్నతమః ఉత్కృష్టతమస అర్థమ్. హే భగవన్ త్వాం పీయతి త్వః హీనస్తోకమర్థమనుదాఖ్యామ్. అనుత్వో అనుగృణ్హాతి ఏకమర్ధం దేవాఖ్యామనుష్ఠాతీత్యర్థః. నేమే దేవాః నేమేఽసురాః అర్ధతో దేవా అర్ధతోఽసురాః ఇత్యర్థః.

అర్థము :- త్వః నేమ అను నీరెండుపదములు అర్ధవాచకములు. త్వః అపతతః 'త్వః' అనునది అపతతః = అపేత్య, తతః = పూర్ణమునుండి తొలగి వ్యాపించి యుండును. నేమః - అపనీతః = నేమ అనునదియు, అపభఙ్క్యనీతః = పూర్ణమునుండి వేఱుచేసి తీసికొని పోబడియుండును.

అర్ధం హరతే ర్విపరీతాత్ - హృధాతువునకు అప్ ప్రత్యయముచేసి హరసిద్ధముచేసి దానిని విపరీతముచేసిన అర్హసిద్ధమగును. అర్హలోని హకారమునకు ధకారముచేసిన అర్ధమ్ - అగును. పూర్ణమునుండి అర్ధం వేఱగును. ధారయతేర్వాస్యాత్ లేక ధారిధాతువుతో సిద్ధమగును. ఋధ్నోతేర్వా స్యాత్ - లేక ఋధ ధాతువుతో అర్ధశబ్దము సిద్ధముచేసికొనవచ్చును. ఋద్ధతమో విభాగః - పూర్ణమునుండి వేఱుచేయబడిన సగభాగమునకంటె ఎక్కువభాగము అర్ధశబ్దమునకు అర్థము.

మంత్రార్థము :- (క) త్వః - దేవాసురులలో సగభాగమగు (అర్ధమ్) రాక్షసులను, పీయతి = హినస్తి = నష్టముచేయును. త్వః = రెండవ సగభాగమగు (అర్ధమ్) దేవతలను అనుగృణాతి = స్తుతించును.

(ఖ) నేమే దేవాః = సగము దేవతలు, నేమేఅసురాః = సగభాగము అసురులు,

> ఋక్షాః స్తృభిరితి నక్షత్రాణామ్ నక్షత్రాణి నక్షతేర్గతి కర్మణః నేమాని క్షత్రాణి ఇతి చ బ్రాహ్మణమ్. ఋక్షా ఉదీర్ణానీవ ఖ్యాయన్తే స్తృభిస్తీర్ణానీవ ఖ్యాయన్తే.
>
> "అమీ య ఋక్షా నిహితాస ఉచ్చా" (ఋ. ౧-౨౪-౧౦)
>
> "పశ్యన్తో ద్యామివ స్తృభిః"
>
> ఇత్యపి నిగమౌ భవతః.

ఋక్షాః స్తృభిరిత్యేతే నక్షత్రాణాం నామనీ. నక్షతే ర్గతికర్మణో గత్యర్థే వర్తమానస్య తాని హి నిత్యమేవ ఆగచ్ఛన్తి. నేమాని క్షత్రాణి ధనాని క్షత్రమితి ధననామ. కింతర్హి? ధనస్వరూపాణ్యేతాని ఉదీర్ణానీవ కేనచిదూర్ధ్వం గమితానీవ ఖ్యాయన్తే. దృశ్యన్త ఇత్యర్థః. స్తృభిః స్తీర్ణానీవ ఖ్యాయన్తే దృశ్యన్తే శునఃశేపస్యార్షమ్. అమీ య ఋక్షా అమూని యాని నక్షత్రాణి నిహితాసః నిహితాని ఉచ్చా ఉచ్చైరిత్యర్థః. పశ్యన్తో వయమనేకధా ద్యామివ స్తృభిః నక్షత్రైః పృథివీం చిత్రరూపామ్.

అర్థము :- ఋక్షాః స్తృభిః ఇత్యేతే ఇవి రెండు నక్షత్రనామములు. నక్షత్రశబ్దము గత్యర్థక నక్షధాతువుచే సిద్ధమగును. ఇమాని = ఇవి నక్షత్రములు, నక్షత్రాణి = క్షత్ర = ప్రకాశరూపమగు ధనముతో ప్రకాశితములు కావు. అందువలన నక్షత్రములు అనబడును. ఇది బ్రాహ్మణ గ్రంథవ్యుత్పత్తి, ఋక్షా ఉదీర్ణానీవ ఖ్యాయన్తే పిలువన ఉదీర్ణానీవ = ఊర్ధ్వం గమితానీవ = కొందరచే పైకివేయబడినవానివలె ఖ్యాయన్తే = కనబడుచున్నవి, అందువలన నివి ఋక్షలనబడుచున్నవి. స్తృభిః తీర్ణానీవ ఖ్యాయన్తే=నక్షత్రములు ఆకాశమున పఱచబడినవానివలె కనబడుచున్నవి. కావున వీనిని స్తృభిః అనుచున్నాము.

మంత్రార్థము :— (క) అమీయుణౌః = ఈనక్షత్రములు పైన ఉంచబడినవి. (ఖ) స్తృభిః = నక్షత్రములతో ద్యులోకము చిత్రింపబడినట్లు కనబడుచున్నది.

> వమ్రీభి రుపజిహ్వికా ఇతి సీమికానామ్. వమ్ర్యో వమనాత్. సీమికా స్యమనాత్ ఉపజిహ్వికా ఉపజిఘ్ర్యః.
>
> "వమ్రీభిః పుత్రమగ్రువో అదానమ్" (ఋ. ౪-౧౯-౯)
>
> "యదత్త్యుపజిహ్వికా యద్వమ్రో అభిసర్పతి" ఇత్యపి నిగమో భవతి. (ఋ. ౮-౧౦౨-౨౧)

వమ్రీభి రుపజిహ్వికేత్యేతే సీమికానాం నామనీ భవతః. వమనాద్ధి వమన్త్యుదకం యేన మృదార్ద్రీ భవతి. స్యమనాత్ స్యమన్తి హి తా నిత్యమేవ గచ్ఛన్తి ఉపజిఘ్ర్యః ఉపజిఘ్రన్తి తాః పటు హ్యాసాం ఘ్రాణేన్ద్రియం భవతి. యదత్త్యుపజిహ్వికా భార్గవస్యేయ మార్షమ్. యదత్తి భక్షయతి ఉపజిహ్వికాన్తరమ్ప్రవిశ్య యచ్చాతిసర్పతి వమ్రః సర్వం తే అగ్నే! ఘృతమస్తు.

అర్థము :- వమ్రిభిః ఉపజిహ్వికా ఈరెండునామములు చెదలకు వాచకములు. ఉద్గిరణార్థక 'వమ్' ధాతువుతో వమ్రీ, పదము, గత్యర్థక స్యమ్‌ధాతువుతో సంప్రసారణము, కికన్‌ప్రత్యయముచేసిన సీమికా పదము సిద్ధమగును. ఇవి సతతం = ఎల్లప్పుడు, గచ్ఛన్తి=నడుచుచుండును. చెదలకు ఘ్రాణశక్తి తీవ్రముగా నుండును. అందువలననే వీనిని ఉపజిహ్వికలందురు. ఉపజిఘ్రీనుండి ఉపజిహ్వ, దానికి కన్, టాప్‌ప్రత్యయములు చేసినచో ఉపజిహ్వికా అగును.

మంత్రార్థము :— (క) వమ్రీభిః = చెదపురుగులచేత అదానమ్ = తినబడుచున్న, అగ్రువః అగ్రూనామక - కొండొక స్త్రీయొక్క పుత్రుని, యత్ - ఏకొయ్యను - (కాష్ఠము) ఉపజిహ్వికా = చెదలుతినునో, యత్ చ = మఱియు దేనియందు, వమ్రః = చెదపురుగు అతిసర్పతి=అధికము గానేర్పడును.

**ఊర్దరం కృదరమిత్యావపనస్య, ఊర్దరముద్దీర్ణం భవతి. ఊర్జే దీర్ణం వా. "తమూర్దరం న పృణతా యవేన" ఇత్యపి నిగమో భవతి. తమూర్దరమివ పూరయతి యవేన.**

ఊర్దరం కుదరమిత్యేతే ఆవపనస్య నామనీ. ఉద్దీర్ణం ఊర్ధ్వం హి తద్దీర్ణం భవతి. గృత్సమదస్యేయ మార్షమ్. తమింద్రమూర్దరం న ఊర్దరమివ పృణత పూరయత యవేన.

అర్థము :- ఊర్దర, కృదర అను నీరెండును ధాన్యమునింపు పాత్రకు నామములు. ఊర్దరం ఉద్దీర్ణం భవతి = పైభాగము మూయబడదు. ధాన్య మును నింపి ఉంచుటకు సిద్ధముచేయబడిన పెద్దగాదెలు పైభాగము తెఱవ బడియుండును. కావున నవి ఊర్దర మనబడును.

మంత్రార్థము :- తమ్ ఇంద్రమ్ = ఆయింద్రుని, ఊర్దరం న = ధాన్యమునింపు గాదెవలె, యవేన = యవధాన్యముతో, పృణత - నింపుము.

**కృదరం కృతదరం భవతి.**

**"సమిద్ధో అంజన్ కృదరం మతీనామ్" ఇత్యపి నిగమో భవతి.**

కృదరం కృతదరం భవతి. ఆవపనమిత్యర్థః అత్ర నిగమః. సమిద్ధో అంజన్ కృదరం మతీనామ్. సమిద్ధః ప్రదీప్తః అంజన్ = గతిశీలః.

అర్థము :- కృదర మననేల? అది కృతదరమ్ = చేయబడిన ఛిద్రము కలది, ధాన్యమునింపుగాదె ఒకవైపు పైభాగము తెఱవబడి యుండును. అందువలన, కృదరం = కృతదర మనబడును.

మంత్రార్థము :- సమిద్ధః = ప్రదీప్తుడవు గతిశీలుడవునగు నీవు, మతీనాం కృదరమ్=బుద్ధులభండారము, మధురఘృతమును సేవింపుము.

**రంభః పినాకమితి దండస్య - రంభ ఆరభన్త ఏనమ్.**

**"ఆత్వా రంభం న జివ్రయో వరంభ" ఇత్యపి నిగమో భవతి.**

ఆరభామహే త్వా జీర్ణా ఇవ దండమ్. పినాకం ప్రతిపినష్టేస్యే నేన.

"అవతతధన్వా పినాకహస్తః కృత్తివాసాః" ఇత్యపి నిగమో భవతి.

రంభః, పినాకమిత్యేతే దండస్య నామనీ. ఆరభన్త ఏన మస్థలా న్నార్థమ్. తాన్యస్య త్రిశోకస్యార్షమ్. ఆరభామహే వయం త్వా త్వాం రంభం న = దండమివ జివ్రయః జీర్ణా ఇత్యర్థః. ప్రతిపినష్ట్యేనేన హన్తీ త్యర్థః. పినాకహస్తో భూత్వా కృత్తివాసాః చర్మవాసా అవతతధన్వా చైవ మతీ హి.

అర్థము :- రంభ, పినాక, అను నీరెండు దండనామములు. ఏనమ్ = ఈదండమును, ఆరభన్తే = ఆలభన్తే = ఆలంబనము చేసికొందురు. వృద్ధులు దండమును ఊతగా గ్రహింతురు. కావున దండమును రంభమందురు.

మంత్రార్థము :- న = ఎట్లు, జివ్రయః = వృద్ధులు, రంభమ్ = దండమును గ్రహింతురో, అట్లే మేముకూడ హే ఇన్ద్ర! త్వా = నిన్ను, ఆరంభ = సహాయముగా తీసికొందుము, ఏనేన = ఈదండముతో, ప్రతి పినష్టి = చంపుదురు. అందువలన నీదండమును పినాకమందురు.

మంత్రార్థము :- అవతతధన్వా = ధనుస్సునెక్కుపెట్టి, కృత్తి వాసాః = చర్మధారియై, పినాకహస్తః = దండధారియై.

మేనా గ్నా ఇతి స్త్రీణామ్. స్త్రియః స్త్యాయతే రపత్రణకర్మణః. మేనా మానయన్త్యేనాః - గ్నా గచ్ఛన్త్యేనాః.

"అమేనాంశ్చిజ్జనివత శ్చకర్థ" (ఋ. ౫-౩౧-౨)

"గ్నా స్త్వా కృన్తన్నపసోఽతన్వత" (ఋ. ౧-౬౫-౪) ఇత్యపి నిగమౌ భవతః.

మేనా గ్నా ఇత్యేతే స్త్రీణామ నామనీ. స్త్యాయతే రపత్రపణకర్మణో లజ్జార్థస్య లజ్జన్తే హి తాః. మానయన్త్యేనాః స్త్రీః పురుషాః. గ్నా గచ్ఛన్తి

హ్యేనా మైథునేన ధర్మేణ. అపస్యో లాత్రే యస్యార్థమ్. హే ఇంద్ర! అమేనాంశ్చిత్ అస్త్రీకానపి స్తోతౄన్ జనివత ఏవ స్త్రీమత ఏవ చకర్థ కరోషి త్వర్థః. తస్మాత్త్వా మేవ స్తుమః ఇత్యభిప్రాయః. హే వాసః గ్నాస్త్వా కృన్తన్ స్త్రీభి స్త్వం కర్తితః తస్తుకరణాభిప్రాయేణ. అపసః అల్పకాః కువింద పుత్రకా స్త్వా మతన్వత.

అర్థము :- మేనా, గ్నా అను నీరెండుపదములు స్త్రీవాచకములు. అపత్రపణకర్మణః లజ్జార్థకస్త్యాయుతేః 'స్త్యై'ధాతువుతో స్త్రీపదము సిద్ధ మగును. స్త్రీలు స్వభావముతో లజ్జా - సిగ్గు - గలవారు, ఏనాః=ఈ స్త్రీలను పురుషులు గౌరవింతురు. అందువలన వారు 'మేనా' అనబడుదురు. వీరి దగ్గఱకు పురుషులు వెళ్లుదురు. కావున వీరు 'గ్నా' అనబడుదురు. గచ్ఛన్తి ఇతి గ్నా.

మంత్రార్థము:- (క) అమేనాన్=స్త్రీరహితపురుషులను, యువకులను, జనివతః = స్త్రీయుక్తులనుగా, పత్నీయుక్తులుగా, చకర్థ = చేయుచున్నారు. (ఖ) హే వస్త్ర! ఓ వస్త్రమా! త్వా = నిన్ను, గ్నాః = స్త్రీలు, అకృన్తన్ = నూలుపడికి సిద్ధముచేయుదురు, అపసః = చిన్నపిల్లలు వస్త్రమును నేయుదురు

శేపో వైతస ఇతి పుంస్ప్రజననస్య శేపః శపతేః స్పృశతి కర్మణః వైతసో వితస్తం భవతి.

"యస్యా ముశన్తః ప్రహరామ శేపమ్"(ఋ, ౧౦-౮౫-౩౭)
"త్రిఃస్మ మాహ్నః శ్నథయో వైతసేన (ఋ. ౧౦-౯౫-౫)
ఇత్యపి నిగమౌ భవతః.

శేపః, వైతస, ఇత్యేతే. నామనీ ఈరెండుపదములు నామములు. పుంస్ప్రజననస్య లింగస్య=పురుషుని లింగమునకు నామములు, స్పృశతి కర్మణః స్పృశత్యర్థస్య - స్పృశ్యతే హి తేన స్త్రీ. వితస్తమ్ ఉపక్షీణమ్ తద్భవతి ప్రాగనుస్మరణాత్ స్త్రియాః సూర్యాయాఅర్థమ్. యస్యాం యోనావు శన్తః పుత్రయన్మకామయమానాః ప్రహరామః ప్రక్షిపేమ ఇమం శేపమ్. ఉర్వశ్యా అర్థమ్. హే పురూరవః త్రిః స్మ మాహ్నః త్రివారమహ్నో మామ్ శ్నథయః అతాడయుస్త్వమే వైతసేన శిశ్నదండేన పూర్వమ్.

అర్థము :- శేపః, వైతసః అను రెండును పురుషలింగవాచకములు. శేపః = లింగము స్పృశతికర్మణః - స్పర్శార్థకశపధాతువుతో శేపః సిద్ధమగును. స్త్రీని స్మరించుటకు పూర్వము లింగము ఉపకీనమైయుండును. అందువలన వైతసమనబడును.

మంత్రార్థము :- (క) యస్యామ్ = ఏస్త్రీయందు, ఉశన్తః = కామించుచు, శేపమ్ = లింగమును, ప్రహరామ = ఆహతమొనర్తుమో, ప్రవేశింపజేయుదుమో.

(ఖ) హే పురూరవః! నీవు మా = నన్ను, త్రిః అహ్నః = దినము నందు మువ్మారు, వైతసేన = ఉపస్థేంద్రియముతో, శ్నథయః = ప్రహర మొనర్చితివి.

అయినేత్యుపదేశస్య

"అయా తే అగ్నే సమిధా విధేమ ఇతి స్త్రియాః (ఋ. ౪-౪-౧౫)

"ఏనా వో అగ్నిమ్" (ఋ. ౭-౧౬-౧) ఇతి నపుంసకస్య.

"ఏనా పత్యా తన్వం సంసృజస్వ" (ఋ. ౧౦-౮౫-౨౭) ఇతి పుంసః.

అయినేత్యేతే సామాన్యోపదేశస్య. స పున రుపదేశః స్త్రీ పుం నపుంసకేషు భిన్నో భవత్యత స్త్రిషు అపి ప్రదర్శ్యతే. వామదేవస్యార్షమ్. హే అగ్నే! అయా అనయా సమిధా తే తవ విధేమ పరిచర్యాం కుర్మః. వసిష్ఠస్యార్షమ్. ఏనా వః అనేన యుష్మాకం నమసా అన్నేనాగ్ని మాహువే ఆహ్వయే. సూర్యాయా ఆర్షమ్. హే వధు! ఏనా పత్యా అనేన భర్త్రా సహ తన్వం స్వతనుం సంసృజస్వ మిశ్రీకురు.

అర్థము :- అయా, ఏనా అను నిరెండును ఉపదేశమునకు చెందిన ప్రత్యక్ష నిర్దేశ వాచకములు.

మంత్రార్థము :- (క) హే అగ్నే! తే=నీయొక్క, అయా అనయా= ఈసమిధతో, విధేమ = పరిచర్యచేయుదుము అని, స్త్రియః = స్త్రీయొక్క యుపదేశము. (ఖ) వః = మీయొక్క, ఏనానమసా = ఈయన్నముతో -

ఇట్టిది నపుంసకముయొక్క యుపదేశము, ఏనాపేత్యా = ఉపశితో, తన్వం సంస్పృశస్వ = నీశరీరమును కలుపుము అను నిది పురుషుని ఉపదేశము.

సిషక్తు సచత ఇతి సేవమానస్య.

"స నః సిషక్తు యస్తురః" (ఋ.౧-౧౮-౨) స నః సేవతామ్ యస్తురః.

"సచస్వానః స్వస్తయే" (ఋ.౧-౧- ) సేవస్వ నః స్వస్తయే.

స్వస్తీత్యవినాశి నామఅస్తిరభిపూజితః సు అస్తీతి.

'సిషక్తు సచతే' ఇత్యేతే నామనీ సేవమానస్య. స నః అస్మాన్ సిషక్తు సేవతామ్. యత్ర తో యస్తురః తూర్ణకారీ పటు రిత్యర్థః. హే భగవన్ అగ్నే! సచస్వ నః స్వస్తయే స్వస్త్యయనాయ కల్యాణాయేత్యర్థః.

అర్థము :- సిషక్తు - సచతే ఈరెండుపదములు సేవింపబడువాని వాచకములు.

యః = ఎవడు, తురః = శీఘ్రకారి, పటువు = సమర్థుడో, సః = వాడు, నః = మనయొక్క, సిషక్తు=సేవనొనర్చుగాక!, నః = మనయొక్క, స్వస్తయే = కల్యాణముకొఱకు, సచస్వ=సేవచేయుము, స్వస్తిఇతి = స్వస్తి ఇతి అవినాశి నామముచేత, అభిపూజితః అస్తిః = మంచిసత్తా కల్యాణ కారియై యుండుట.

భ్యసతే రేజతే ఇతి భయవేపనయోః.

"యస్య శుష్మాద్ రోదసీ అభ్యసేతామ్" (ఋ. ౨-౧౨-౧)

"రేజతే అగ్నే పృథివీమఖేభ్యః" (ఋ. ౬-౬౬-౯)

ఇత్యపి నిగమౌ భవతః.

భ్యసతే రేజతే ఇత్యేతే నామనీ భయవేపనయోః. యస్య శుష్మాదితి యస్య ఇంద్రస్య శుష్మాత్ బలాత్ - రోదసీ ద్యావాపృథివ్యావభ్యసేతామ్ అకంపేతామ్. భారద్వాజస్యేయ మార్షమ్. మఖేభ్యః మనుష్యేః. హే అగ్నే! పృథివీ! రేజతే బిభేతి కంపతే వా.

అర్థము :- భ్యసతే రేజతే ఈరెండు ఆఖ్యాతములు - క్రియలు క్రమముగా - భయము కంపము అను అర్థములు వచ్చును. యస్య = ఏపరమేశ్వరునియొక్క, శుష్మాత్ = బలమువలన, రోదసీ = ద్యుపృథివీ లోకములు, అభ్యసేతామ్ = భీతములు కంపితములు నగును. హే అగ్నే! మహిత్వః = ఎవరియొక్క యజ్ఞములవలన - సత్కర్మలవలన, పృథివీ = భూమి, రేజతే = భయపడుచున్నది. మఱియు కంపించుచున్నది.

(అథ ద్యావాపృథివీనామాని)

**ద్యావా పృథివీ నామధేయా న్యుత్తరాణి చతుర్వింశతిః.**

ద్యావా పృథివీ నామధేయాని ద్విసంబంధేనైవోచ్యన్తే.

రాబోవు ౨౪ ఇరువదినాలుగు ద్యుపృథివీలోకముల నామములు.

**తయోరేషా భవతి.**

తయోః ద్యావాపృథివ్యోః సాహచర్యాఖ్యాయికైషా ఋగ్భవతి. ద్యుపృథివీలోకములకు సంబంధించిన ఋక్ ఇది.

కతరా పూర్వా కతరాపరయోః కథా జాతే కవయః కో వివేద. విశ్వం త్మనా బిభృతో యద్ధ నామ వివర్తేతే అహనీ చక్రియేవ" (ఋ. ౧.౧౮౫-౧)

కతరా పూర్వా కతరాపరా ఏనయోః కథం జాతే, కవయః క ఏనే విజానాతి సర్వమాత్మనా బిభృతో యద్ధ ఏనయోః కర్మవివర్తేతే చైనయోః అహనీ అహోరాత్రే. చక్రియేవ చక్రయుక్తే ఇవేతి. ద్యావాపృథివ్యో ర్మహిమాన మాచష్టే - ఆచష్టే.

అగస్త్యస్యార్షమ్. అనయోః ద్యావాపృథివ్యోః కతరా పూర్వా కతరా పరా? కథా కేన ప్రకారేణైతే జాతే పౌర్వాపర్యేణోత యుగపత్? హే కవయః! కో వివేద యుష్మాసు? న కశ్చిదపి. విస్పష్టం జానాతి. కించైతే విశ్వం సర్వం జగత్ త్మనా ఆత్మనైవ బిభృతః ధారయతో యద్ధనామ యదర్థమనయో ర్నామ నమనమ్. కించ వివర్తేతే విపర్యయేణ పర్తేతే

వైనయో రేవాన్తర్వ్యాతేఽహనీ అహోరాత్రే చక్రియేవ చక్రయుక్తే ఇవ సంబద్ధే ఇత్యర్థః. ద్యావా పృథివ్యో ర్మహిమానం మహాభాగ్యం మంత్ర దృగాచష్టే.

మంత్రార్థము :— అనయోః = ఈ ద్యావాపృథివీలోకములందు, కతరా పూర్వా = ఏది పూర్వము - ముఖ్యము, కతరా అపరా = ఏది యపరము - గౌణము, కథా జాతే = ఎట్లు పుట్టినవి, కవయః హే విద్వాంసులారా కః వివేద = మీలో నెవరు ఎఱుగుదురు? ఎవ్వరు నెఱుగరని భావము, త్మనా = తమంత తామే యీ రెండులోకములు, విశ్వమ్ = జగత్తుసంతతిని' బిభృతః = భరించి పోషించుచున్నవి, యత్ హ నామ = ఏనికర్మము' చక్రియా ఇవ = చక్రయుక్తమువలె, అహనీ = అహోరాత్రముల రూపమున, వివర్తేతే = మాఱుచుండును.

ఇతి తృతీయో అధ్యాయః

మూడవ యధ్యాయము సమాప్తము



# చ తు ర్థ అ ధ్యా య ము

## నై గ మ కాం డ ము

## ప్ర థ మ పా ద ము

**ఏకార్థ మనేకశబ్ద మిత్యేత దు క్తమ్.**

ఏకార్థమనేకశబ్దమితి - ఏతత్ పురస్తాత్ సూచితమ్. ఏతావంతః సమానకర్మాణో ధాతవః ఏతావన్త్యస్య సత్వస్య నామధేయాని ఇత్యనేన వాక్యేన. తదిదమేకార్థ మనేకశబ్దమ్ నైఘంటుక ప్రకరణమ్.

అర్థము :- ఏకార్థమ్ = ఒక్కయర్థముగల, అనేక శబ్దమ్ = అనేక శబ్దములుగల, ఇతి ఏతత్ = ఇది ఈ అతీతప్రకరణము, ఉక్తమ్ = చెప్ప బడినది.

**అథ యాన్యనేకార్థా న్యేకశబ్దాని తాన్యతః అనుక్ర మిష్యామః.**

అథ ఇదానీం యాని అనేకార్థాని ఏకశబ్దాని తాని అతః పరం అనుక్ర మిష్యామః వర్ణయిష్యామః. అత్ర అర్థస్యాప్రతీయమానస్య పర్యాయాభి ధానేన విభజ్య ప్రతిపాదనం వ్యాఖ్యా శబ్దస్యాపి వ్యుత్పాదనం వ్యాఖ్యా ఏవమ్ ఏతే ద్వే వ్యాఖ్యే. తయో రర్థపరిజ్ఞాన మేకస్యాః కార్యమ్ శబ్దపరిజ్ఞాన మేకస్యాః తదేతదుభయం నైగమే యథాసంభవం వ్యాఖ్యాస్యతే.

అర్థము :- అథ = ఇప్పుడు దీని తరువాత, అనేకార్థాని = అనేకార్థ ములుగల, ఏకశబ్దాని = ఒక్కశబ్దముగల శబ్దము, అతః = ఇటనుండి, అనుక్రమిష్యామః = చెప్పెదము.

**అనవగత సంస్కారాశ్చ నిగమాన్.**

అనవగత సంస్కారాన్=అవిజ్ఞాత సంస్కారానిత్యర్థః. యేషాం ప్రకృతి ప్రత్యయాది సంస్కారః న సాకల్యేన జ్ఞాయతే తాంశ్చ నిగమాన్ అత్రైవ వ్యాఖ్యాస్యామః.

అర్థము :— చ = మఱియు, అనవగతసంస్కారాన్ = ప్రకృతి ప్రత్యయాదులు తెలియని, నిగమాన్=శబ్దములనుకూడ వ్యాఖ్యానింతుము.

తద్దైకపదిక మిత్యాచక్షతే.

తత్ ఏత దేవం ప్రకారం ప్రకరణం యత్రైతదుభయం వ్యాఖ్యాయతే. ఏకపదికమితి నామ్నా అన్యేప్యాచార్యా ఆచక్షతే నిరూఢార్థాయ మస్మిన్ ప్రకరణే సంజ్ఞేత్యభిప్రాయః.

అర్థము :— తత్ = ఆయీప్రకరణమును, ఏకపదికమ్ = ఏకపదికమని, ఆచక్షతే = చెప్పుదురు. ఏకపదికమని యీప్రకరణము నందురు.

జహా –(౧) జహా జఘానే త్యర్థః.

అత్ర హ న్తేర్హంతేశ్చ సందేహ ఇతి భాష్యకారేణావధృతం జఘానేత్యర్థ ఇతి.

జహా పదమునకర్థము. జఘాన = చంపెను.

> "కో ను మర్యా అమిథితః సఖా సఖాయమబ్రవీత్ జహా కో అస్మదీషతే" (ఋ. ౮–౪౫–౩౭) మర్యా ఇతి మనుష్య నామ. మర్యాదాభిధానం వా స్యాత్. మర్యాదా మర్త్యై రాదీయతే. మర్యాదా మర్యాదినో ర్విభాగః. మేథతి రాక్రోశ కర్మా. అపాపకం జఘాన కమహం జాతు. కోఽస్మద్భీతః పలాయతే.

కో ను మర్యాః ఇతి. త్రిశోకమస్యేయ మార్షమ్. గాయత్రీ మా న ఏకస్మిన్నాగసి మా ద్వయోరుత త్రిషు. వధీర్మా శూర భూరిషు. ఏతస్మిన్ ప్రకరణే బ్రవీతి కో ను మర్యాఇతి. హే మర్త్యాః మనుష్యాః! యుష్మానేవ తావత్ పృచ్ఛామి. అమిథితః అనాక్రుష్టః కించిదనుక్తః అపి చ సఖా సమాన ఖ్యాతః సఖాయ మబ్రవీత్. కోన్వేవం బ్రూయాత్ మాం మావధీరితి. అపాపకం సంతం కమహం జఘాన హతవాన్ జాతు కదాచిదిత్యర్థః. పాపకారిణాం

తు హన్మీత్యభిప్రాయః. కః అస్మత్ అస్మత్తః అపాపకారీ భీతః ఈషతే పలాయతే ఇత్యర్థః. న కశ్చిదిత్యభిప్రాయః. మర్త్యా ఇతి మనుష్యనామసు పఠితమ్. తస్యోక్తా వ్యుత్పత్తిః మర్త్యో మనుష్యో మరణధర్మా అథవా మర్యాదాభిధానమ్ ఏవ అత్ర స్యాత్ న మనుష్యనామ. మర్యాదా విషయాన్త ఇత్యర్థః. మేథతి రాక్రోశకర్మా చతస్రః పత్న్యోఽశ్వమమేథన్తీతి ప్రసిద్ధ మశ్వమేధే మేథతే రాక్రోశకర్మత్వమ్. ఏవమేతస్మిన్ మన్త్రే హన్తేరేవ విశేషణార్థోఽవతిష్ఠతే న జహాతేః.

మంత్రార్థము :- మర్త్యాః = ఓ మనుష్యులార! కః ను = ఎవడు అమిథితః - నిరపరాధః = అపరాధముచేయనివాడు, (అనాకృష్టః) సఖా= మిత్రుడు, సఖాయమ్ = తనమిత్రునితో, అబ్రవీత్ = చెప్పుచున్నాడు - ఏమని? అపరాధము చేసినను నన్ను దండింపకు అని మఱియు, జహా = నేనెవరిని చంపితిని? నేను నిరపరాధిని దండించలేదు మఱియు, కః = ఎవడు, అస్మత్ = మననుండి భయపడి, ఈషతే = పాఱిపోవదలంచును? ఎవడును లేడు, మర్త్యా ఇతి = మర్త్యాఅనునది, మనుష్యనామ = మనుష్య వాచకము, మర్యాదాభిధానమ్ వా = లేక మర్యాదకుపేరు, మర్త్యైః అమీ యతే = మనుష్యులచే గ్రహింపబడుచున్నది. అందువలన మర్యాద యనబడుచున్నది, మేథతిః ఆక్రోశకర్మా = మిథధాతువునకు ఆక్రోశము అర్థము.

నిధా ॥౭॥

**నిధా పాశ్యా భవతి యన్నిధీయతే. పాశ్యా పాశసమూహః పాశః పాశయతే ర్విపాశనాత్.**

నిధా పాశ్యా భవతీతి. పర్యాయేణ తత్త్వవచనమ్. యో వాలమయః స్నాయుమయః వా పాశసమూహః పక్షిగ్రహణార్థః సః పాశ్యేత్యుచ్యతే. యత్ యస్మాత్ ఇయం నిధీయతే నీచైర్ధార్యతే. పక్షిగ్రహణార్థమ్ పాశః పాశయతే బంధనార్థస్య విపాశనాత్ తేన హి పాశ్యతే పక్షీ బధ్యత ఇత్యర్థః.

అర్థము :- నిధాపాశ్యా = వల లేక ఉచ్చు. అను దానికి పాశ్యా అనిపేరు, నిధీయతే = నిధా ఇదియు వలకే పేరు పక్షులను పట్టుకొనుటకు నేలమీద ఉంచబడును - కావున నిధా - పాశ్యా అనబడును. పాశః పాశయతేః బంధనార్థక 'పశ' ధాతువుతో పాశః సిద్ధమగును. విపాశనాత్ =

బంధించుటవలన పాశసమూహము 'పాశ్యా' యనబడును. త్రాళ్లసమూహముతో నేర్పడును వల యనియు నందురు,

> "వయః సుపర్ణా ఉపసేదురింద్రం ప్రియమేధా ఋషయో నాధమానా అవధ్వాన్తమూర్ణుహి పూర్ధి చక్షుర్ముముగ్ధ్యస్మాన్నిధయేవ బద్ధాన్ (ఋ. ౧౦-౭౩-౧౧)
>
> వయో వేర్బహువచనమ్. సుపర్ణాః సుపతనా ఆదిత్యరశ్మయః ఉపసేదురింద్రం యాచమానాః. అపోర్ణుహ్యధ్వస్త్యం చక్షుః చక్షుః ఖ్యాతేర్వా - చష్టేర్వా పూర్ధి పూరయ దేహీతి వా. ముంచాస్మాన్ పాశైరివ బద్ధాన్.

అధునా యస్మిన్ మంత్రే నిధాశబ్దః పాశ సమూహవాచీ తమానీయ ప్రస్తౌతి. నిధాశబ్దనిగమార్థమ్, వయః సుపర్ణా ఇతి శాక్త్యస్యార్షం గౌరి వీతే రియమార్షమ్. త్రిష్టుప్. వయః ఆదిత్యరశ్మయః వేః గత్యర్థస్య నామీభూతస్య బహువచనమ్- విః, వీ. వయః ఇతి సువర్ణాః సుపతనా ఉపసేదుః ఉపసీదన్తి, వ్యుష్టాయాం రాత్రౌ వహన్త్యహని ఇన్ద్రమ్ ఆదిత్యమ్, ప్రియమేధాః ప్రియయజ్ఞాః ఉదితేషు హితేషు యజ్ఞా స్తాయన్తే. ఋషయః ఆర్ష-నాత్ ప్రకాశకత్వాత్. నాధమానాః యాచమానాః అపోర్ణుహి,అపావృణు బనానామేతత్ ధ్వాన్తమ్ అధ్వస్తమ్ ఆచ్ఛాదితమ్ తమసా చక్షుః పూర్ధి పూరయ సఫలం కుర్విత్యర్థః. అథవా పూర్ధి దేహి ఇతి ముముగ్ధి అస్మాన్ ముంచాస్మాన్ నిధయా పాశైః పాశసమూహేన పక్షిణః ఇవ ఏతస్మిన్ మండలే బద్ధాన్. ఏతమర్థం యాచమానాః ఉపసేదుః. చక్షుః ఖ్యాతేర్వా దర్శనార్థస్య చష్టేర్వా దర్శనార్థస్యైవ. ఏవ మేతస్మిన్ మంత్రే నిధాశబ్దస్య పాశ-సమూహాదన్యః కోన్వర్థః స్యాత్ ?

మంత్రార్థము :- వయః పక్షిసదృశ సుపర్ణాః = బాగుగపడునట్టి సూర్యకిరణములు, నాధమానాః = ప్రార్థించుచు, ఇంద్రం = ఇంద్రుని దగ్గఱకు, ఉపసేదుః = చేరినవి, ధ్వాన్తంచక్షుః=అంధకారముచే నావరింపబడిన మనుష్యుని చక్షువును - నేత్రమును, అపోర్ణుహి = తెఱవుము, పూర్ధి = పూర్తిచేయుము. నిధయాఇవ=వలలో చిక్కుకొనియున్న, అస్మాన్= మమ్ములను, ముముగ్ధి — విడిపింపుము. అపారుహి = తెఱవుము, అధ్వ

స్తమ్ = తిమిరావృత చక్షుః=చక్షుశ్శబ్దము ఖ్యాతేర్వా = దర్శనార్థక ఖ్యా ధాతువువలనను, చష్టేర్వా లేక చక్షిఙ్ ధాతువువలన చక్షుః సిద్ధించును. పూర్తిపదమున కర్థము పూరయ=నింపుము, దేహి=ఇవ్వుము.

శితామ ॥3॥

"పార్శ్వతః శ్రోణితః శితామతః" (యజు. ౨౧-౪౩)

పార్శ్వ పర్శుమయమ్ అంగం భవతి. పర్శుః స్పృశతేః సంస్పృష్టా పృష్ఠదేశమ్ పృష్ఠంస్పృశతేః సంస్పృష్టమంగైః అంగమంగనాత్ అంచనాద్ వా, శ్రోణిః శ్రోణతేః గతి చలాకర్మణః శ్రోణిః చలతీవ గచ్ఛతః. దోః శితామ భవతి. దోర్ద్రవతేః - యోనిః శితామేతి శాకపూణిః విషితో భవతి శ్యామతో యకృతఇతి తైటీకిః. శ్యామం శ్యాయతేః యకృద్ యథా కథా చ కృత్యతే. శితిమాంసతో మేదస్త ఇతి గాలవః శితిః శ్యతేః మాంసం మానసం వా. మానసం వా మనోఽస్మిన్త్సీదతీతి వా మేదో మేద్యతేః.

శితామ ఇతి ఏతద్వచనవగతమ్, అభిధేయం చానుక్త్వైవ నిగమమేవ ప్రథమం పఠత్యాచార్యః. "పార్శ్వతః శ్రోణితః శితామత" ఇతి, వను హ విషః ప్రైషేఽయం మంత్రశేషః. పార్శ్వతః అంగాత్ ఏవం శ్రోణితః శితామతః కురుతామ్ ఇంద్రాగ్నీ ! తృప్తిమేతత్ హవిః కిమనయా స్పృష్టమ్? ఉచ్యతే సంస్పృష్టా పృష్ఠదేశమ్. అంగమంగనాత్ అంగితం హి తత్కాలేన భవతి. గతమిత్యర్థః. అంచనాద్వా అంచతి రపి గత్యర్థఏవ. గతి చలా - కర్మణః గతినిమిత్తం చలనమ్ యస్య కర్మ సోఽయం గతి - చలా-కర్మా తస్య. శ్రోణిశ్చలతీవ స్థానాత్ పశోః గచ్ఛతః దోః శితామ భవతి బాహు రిత్యర్థః దోః ద్రవతేః తస్య హి ప్రాబల్యేన పశుర్ ద్రవతి. యోనిః శితామః ఇతి శాకపూణిః ఆచార్యో మన్యతే, స చ గుదః విషితః వ్యాప్తః స పురీషేణ భవతి. శ్యామతో యకృతః - ఇతి తైటీకిః ఆచార్యో మన్యతే. యకృత్ యథా కథా చ కృత్యతే ఛిద్యత ఇత్యర్థః. శితి మాంసతో మేదస్తః ఇతి

గాలవః ఆచార్యో మన్యతే. శ్యేతాన్ మాంసాత్ శితి-మాంసతః శతేః శ్యతేః తనూకరణార్థస్య. మనోఽస్మిన్ సీదతీతి వా సర్వస్య హి మాంసే మనః సీదతి. మేదః మేద్యతేః స్నేహనార్థస్య

అర్థము :- పార్శ్వతః శ్రోణితః శితామతః=మేకయొక్క, పార్శ్వతః= ప్రక్క భాగమునుండి, శ్రోణితః = కటిప్రదేశమునుండి, శితామతః=ఇతర అంగములైన బాహువులు, యోని, కాలేయము, మున్నగు అంగములనుండి కోసితీసిన మాంసమును తినవలదు. మేకను సంబంధించిన పాలు, పెరుగు, నేయి మున్నగు పదార్థములను సేవింపుము. ఈమంత్రమునగల శితామ శబ్దమునకు ఆచార్యులు భిన్నార్థములు అంగీకరించిరి. ఉదా - శితామ శబ్దమునకు కొందఱు యోనియనియు, కొందఱు బాహువనియు కొందఱు మేదాయనియు నంగీకరించిరి. ఈ క్రింద నీవిషయము స్పష్టముచేయ బడును. పార్శ్వమ్ - పర్శుమయమ్ అంగం భవతి = పార్శ్వము - ప్రక్క భాగము, పర్శుపసలితో నిండియుండును. పర్శుః స్పృశతేః = స్పృశ ధాతువువలన పర్శుశబ్దము సిద్ధించును. సంస్పృష్టా పృష్ఠదేశమ్ = ఇది వీపుతో సంబద్ధమై యుండును. పృష్ఠమ్=స్పృశధాతువుతో నేర్పడును, సంస్పృష్ట మంగైః = అంగములతో కలిసియుండును, అంగమ్ అంగనాదంచనాత్ అంగశబ్దము గత్యర్థక, 'అగి, అంచు' ధాతువులతో నేర్పడును. ఏలయన నివి గతికలవి యగుటవలన అంగములనబడు చున్నవి, శ్రోణిః = కటిప్రదేశము-ఇదియు గతికలిగియుండును. నడచు చున్న మనుజుని, శ్రోణి = కటి = పిరుదు కూడ కదలుచుండును, గత్యర్థకశ్రోణృధాతువుచే శ్రోణిపదమేర్పడును. దోః శితామ భవతి = శితామ అను నిది బాహువాచకము. గత్యర్థక ద్రుధాతువునే దోః (బాహువు) పదమేర్పడును, కర్మ = పని - పనులన్నియు బాహువు నాశ్రయించి యుండును. బాహువు శితామ అనబడును, యోనిః శితామ = యోని శితామ అనబడునని శాకపూణి ఆచార్యుని మతము, యోనిః = గుదా - మలాశయము = ఇది మలముతో నిండియుండును, విషితవలన శితామ ఏర్పడును, శ్యామతో యకృత ఇతి తైటీకి ఆచార్యుని మతము, శ్యామువలన శితామసిద్ధమగును, శ్యామంశ్యాయతేః = 'శ్యై' ధాతువువలన (గత్యర్థకము) శ్యామ సిద్ధమగును, శ్యామమనగా యకృత్తు. అది నలుపురంగు గలిగి యుండును, మఱియు నిది సులభముగా ఖండింపబడును (యథా కథాచ

కృత్యతే)=శితి మాంసతో మేదస్త ఇతి గాలవః = గాలవముని శితి అన మాంసము క్రొవ్వు, శితిశబ్దమునకర్థము శ్వేతము = తెలుపు, క్రొవ్వు తెలుపు రంగు గలిగియుండును. తనూకరణార్థక 'షో'ధాతువుతో శితిశబ్దము సిద్ధమగును. శితిఃశ్యతేః, మాంసశబ్దవ్యుత్పత్తి మాననమ్ = మాంసాశనులు తనయింటికి వచ్చిన అతిథిఅభ్యాగతులకు మాంసముపెట్టి గౌరవింతురు. మాననమువలన మాంసమేర్పడినది, మానసం వా = లేక మనస్సుతో ప్రసన్నుడైయుండువానికి మాంసము ఎక్కువగును. మాంసాహారి మనస్సు తగ్గిపోవును, మనః అస్మిన్ సీదతి ఇతిమాంసః=మాంసమునందు మనస్సు సీదతి - క్షీణించును, అందువలన మాంసమనబడును, మేదో మేద్యతేః = 'ఞిమిదాస్నేహనే' ధాతువుతో మేదశబ్దమేర్పడును.

మేహనా (౪).

"యదింద్ర చిత్రమేహనాస్తి త్వాదాత మద్రివః. రాధస్తన్నో విదద్వస ఉభయాహస్త్యా భర" (ఋ. ౫-౩౯-౧)

యదింద్ర చిత్రం చాయనీయం మంహనీయం ధనమస్తి, యన్మ ఇహ నాస్తీతి వా. త్రీణి మధ్యమాని పదాని. త్వయా నస్తద్దాతవ్యమ్. అద్రివన్ అద్రివన్ అద్రిరాదృణాత్యేతేన అపి వాత్తేః స్యాత్.

'తే సోమాదో' ఇతి హ విజ్ఞాయతే రాధ ఇతి ధననామ రాధ్నువన్త్యనేన. తన్నస్త్వం విత్త - ధనోభాభ్యాం హస్తాభ్యా మాహర. ఉభౌ సముద్ధౌ భవతః.

మేహనా ఇత్యేతదనవగతమ్. మంహనీయమ్ ఇతి అపగమః, "యదింద్ర చిత్రమేహనాః" ఇతి నిగమః అత్రేర్భౌమస్యార్షమ్. అనుష్టుప్ ఛన్దః, హే ఇంద్ర! చిత్రం చాయనీయం యత్ మేహనా మంహనీయం పూజార్హమ్ తవ రాధః ధనమస్తి, త్వాదాతమ్ త్వయా చ దాతవ్యమ్. సః అస్మభ్యం తత్. హే అద్రివః వజ్రిన్ విదద్వసో ఆప్తధన సాంప్రతమేవ ఉభాభ్యాం హస్తాభ్యా మాభర ఆహర మా చిరాయ ఇత్యభిప్రాయః. త్రీణి మధ్యమాని పదాని మే ఇహ న ఇతి - మే మమ గృహే నాస్తి యత్ ధనమ్ అద్రిరాదృణాత్యేతేన అద్రిర్వజ్ర ఉచ్యతే. ఆదృణాతి ఆదారయతీత్యర్థః

అపి వా అత్తేః స్యాత్ అద్రిః. 'తే సోమాద' ఇతి హ విజ్ఞాయతే ఇత్యేతస్మిన్ మంత్రే విచార్యమాణే జ్ఞాయతే అత్తే రద్రిః స్యాదితి. విత్త ! ధన ! ప్రాప్తధన ! సముద్రౌ సంపూర్ణౌ విత్తవత్తః.

మంత్రార్థము :— హే అద్రివః ! వజ్రధారిన్ విదద్వసః ప్రాప్తధన హే ఇంద్ర = ఓ యింద్రా ! యత్ చిత్రమ్ = ఏ పూజనీయము, మేహనా= ఆదరింపదగిన, త్వాదాతమ్=నీచే నియ్యదగిన లేక నీచే నియ్యబడు రాధః= ధనము, ఉన్నదో, తత్ = ఆ ధనమును, నః = మాకు, ఉభయా హస్త్యా= రెండుచేతులతోను, ఆభర = ప్రదానముచేయుము, చిత్రమ్ - చాయ నీయమ్ =' చాయృపూజానికామనయోః' అనుధాతువువలన చిత్రశబ్ద మేర్పడును. కావున చిత్రమున పూజనీయమని యర్థము. మేహనా శబ్దనిష్పత్తి - మహిపూజాయామ్ - అనుధాతువుచే మేహనాశబ్దము సిద్ధించును. కావున మేహనాశబ్దమునకును పూజనీయమనియే యర్థము, మేహనాపదమునకు పర్యాయపదము మహనీయమ్, అథవా=లేక మంత్రస్థ 'మేహనాఽస్తి' అను దానిని 'మే ఇహ న అస్తి' పదచ్ఛేదము చేయవచ్చును, మే ఇహ=మేహ. ఈ సంధి ఆర్షము. దీనికర్థము 'నాగృహమున నేధనము లేదో దానిని నాకిమ్ము' అని యగును, త్వాదాతమ్ - త్వయా నః తత్ దాతవ్యమ్ = నీచే మాకది యియ్యదగినది యని అర్థము, అద్రిః ఆదృణాతి ఏతేన ఇతి అద్రిః=వజ్రము వజ్రముతో శత్రువులను చంపును. కావున వజ్రము అద్రి అనబడును. అపి వా అత్తేః అథవా = లేక 'అదభక్షణే'ధాతువుతో అద్రిశబ్దమేర్పడును. ఈ వజ్ర మెవనిమీద పడునో యతని నది తినివేయును - కావున అద్రి అనబడును, వజ్రమన అశనిపాతము. అది యెవనిమీదబడిన వాడు నశించును. 'తే సోమాదః' ఇతి హ విజ్ఞాయతే. ఈమంత్రమువలన వజ్రవాచకమగు అద్రిపదము 'అద్'ధాతువువలన నేర్పడునని తెలియుచున్నది. 'రాధ' ఇతి ధననామము రాధ ధనపర్యాయపదము. రాధ్నువన్తి అనేన రాధః=ధనముతో జనులు తనకార్యములు సిద్ధముచేసికొందురు. కావున ధనము రాధః అనబడుచున్నది. 'రాధసాధ సంసిద్ధౌ' ఈ ధాతువుతో రాధపదమేర్పడును. ఉభౌ సముద్రౌ భవతః రెండును సముద్రౌ - పూర్ణములగును. ఉభపూరణే ధాతువువలన ఉభశబ్దము సిద్ధించును.

దమూనా (౫)

> దమూనా దమ - మనా వా. దాన - మనా దాన్తమనా వా. అపి వా దమ ఇతి. గృహనామ తన్మనాః స్యాత్. మనో మనోతేః.

దమూనాః ఇతి ఏతవచనమవగతమ్ దమ-మనాః అక్రూరమనా ఇత్యర్థః. దాతవ్యం మయేతి యస్య మనసి స వా. దాన్తేషు యమనియమవత్సు పురుషేషు యస్య మనః స వా దమూనాః.

అర్థము :- దమూనాః = జీవించియున్న మనస్సుగలవాడు అని యర్థము, దమే మనో యస్య అసౌ దమమనాః దానమనా వా = ఎవని మనస్సు దానమున నుండునో యతడు (దానమనాః) దమూనా యన బడును, దాంతమనా వా లేక దాంతేషు శీలవత్సుమనో యస్య = ఎవనికి ఉత్తమపురుషుల విషయములో మనస్సు గలుగునో లేక దానబుద్ధి కలుగునో యతడు దాంతుడు. స్వాధీనమనస్కుని దమూనా యందురు. అపివా = లేక, దమ ఇతి గృహనామము, తన్మనాః స్యాత్=ఎవని మనస్సు గృహమున లగ్నమైయుండునో యతడు దమూనా యనబడును. గృహస్థుడు అనియు చెప్పవచ్చును. మనః మనోతేః 'మను అవబోధనే' ధాతువువలన మనస్సుసిద్ధము. దేనియందు మననము, సంకల్ప వికల్పములు చేయునో యది మనస్సనబడును.

> "జుష్టో దమూనా అతిథి ర్దురోణ ఇమం నో యజ్ఞముపయాహి విద్వాన్, విశ్వా అగ్నే! అభియుజో విహత్యా శత్రూయతా మా భరా భోజనాని. (ఋ. ౫-౪-౫)
>
> అతిథి రభ్యతితో గృహాన్ భవతి. అభ్యేతి తిథిషు పర కులానీతి వా. పరగృహాణీతి వా. దురోణ ఇతి గృహనామ. దురవా భవన్తి దుస్తర్పాః ఇమం నో యజ్ఞముపయాహి విద్వాన్. సర్వా అగ్నే అభియుజో విహత్య శత్రూయతా మాభర భోజనాని. విహత్యాన్యేషాం బలాని శత్రూణాం భవనా దాహర భోజనానీతి వా. ధనానీతి వా.

నిగమః - జుష్టో దమూనాః ఇతి. వసు శ్రుతస్యాత్రేయ స్యార్షమ్. త్రిష్టుప్ ఆగ్నేయీ. హే భగవన్నగ్నే జుష్టః ఆసేవిత స్త్వమస్మాభిః స్తుతిభిః దమూనాః దమ-మనాః అక్రూరమనాః భూత్వా ఉపయాహి. అతిథిశ్చ త్వ మగ్నిహోత్రాణాం దురోణే యజ్ఞగృహే యజ్ఞస్తస్యేతి తమాగచ్ఛ విశ్వాః సర్వా అభియుజః శత్రుసేనా విహత్య హత్వా కించ, శత్రూయతాం భోజ నాని అన్నాని ధనాని వా అస్మభ్యమ్ ఆభర ఆహరేతి సమస్తార్థః. అభ్యేతి అభ్యాగచ్ఛతి తిథిషు పార్వమాస్యాద్యాసు పరకులాని యజమాన - కులా నీత్యతిథిః - దురవాః దుస్తర్పాః ఉక్తం చ - "కుటుంబతంత్రాణి హి దుర్భరాణి" ఇతి.

మంత్రార్థము :- జుష్టః = మాచే స్తుతులద్వారమున, సేవితః = సేవింపబడిన, దమూనాః దాన్తః = దాంతుడు దాన్తమనస్సుగల, అతిథిః = విద్వాన్ = సర్వము నెఱుంగువాడవగు నీవు, నః = మా, దురోణే=గృహము నందు, ఇమం = ఈయజ్ఞమును, ఉపయాహి = ప్రాప్తింపుము. విశ్వా అభియుజః = శత్రువుల సమస్త సేనలను, విహత్య = చంపి, శత్రూ యతాం = శత్రువులైన లోకులయొక్క, భోజనాని = భోజనపదార్థములైన అన్నాదులను-ధాన్యాదులను, ఆభర=తెచ్చి మాకిమ్ము. అతిథిః అభ్యేతితః= అభ్యేతిథుడు అతిథి యనబడును. ఇటుఅటు తిరుగుచు పరుల యింటిలో ప్రవేశించువాడు అతిథి యనబడును. అభ్యేతి తిథిషు లేక పూర్ణిమా మున్నగు తిథులందు పరులగృహమునందు, పరకులమందు వచ్చువాడు అతిథి యనబడును. దురోణ ఇతి గృహనామ=దురోణము గృహవాచకము. గృహములు దురవా భవన్తి = అపశబ్దము తర్పణార్థకము, దుస్తర్పాః = గృహములను తృప్తిపఱచుట మిక్కిలి కష్టము, విహత్య అన్యేషాం శత్రూ ణామ్ = ఇతర శత్రుసేనలను చంపి, వారి భోజనాది వస్తువులను తెచ్చి మాయిండ్లను నింపుము.

మూషః - ౬.

మూషో మూషికా ఇత్యర్థః - మూషికాః పునః ముష్ణాతేః మూషోఽప్యేతస్మాదేవ.

మూషః, మూషికాః = సమానార్థకములు. మూషికశబ్దము 'ముష స్తేయే = స్తేయార్థకముషధాతువుతోనే మూషికశబ్ద మేర్పడును. మూష శబ్దము దానితోనే యేర్పడును.

> "సం మా తప న్త్యభితః సపత్నీరివ పర్శవః మూషో న శిశ్నా వ్యద న్తి మాధ్యః స్తోతారం తే శతక్రతో విత్తం మే అస్య రోదసీ." (ఋ. ౧-౧౦౫-౮)
>
> సంతప న్తి మామభితః సపత్న్య ఇవేమాః పర్శవః కూప పర్శవో మూషికా ఇవాస్నాతాని సూత్రాణి వ్యద న్తి స్వాంగాభిధానం వా స్యాత్. శిశ్నాని వ్యద న్తీతి వా. సంత ప న్తి మాధ్యః కామాః. స్తోతారం తే శతక్రతో! వి త్తం మే అస్య రోదసీ జానీతం మేఽస్య ద్యావా పృథివ్యావితి. త్రితం కూపే అవహిత మేతత్ సూ క్తమ్ ప్రతిబభౌ. తత్ర బ్రహ్మేతి హాస మిశ్రమృజ్మిశ్రం గాథామిశ్రం భవతి. త్రిత స్తీర్ణతమో మేధయా బభూవ. అపి వా సంఖ్యానామైవాభి ప్రేతమ్ స్యాత్. ఏకతో ద్వితస్త్రిత ఇతి త్రయో బభూవుః.

మూషః ఇతి ఏతదనవగతమ్. బహువచనం చైతత్. మూట్ మూషౌ మూషః ఇత్యేవమ్. మూషికా ఇత్యర్థః మూషికా పునర్ ముష్ణాతేః ముషస్తే యే తే హి హర న్తి ధాన్యాదీని. 'సం మా తప న్తి' ఇతి నిగమః ఇన్ద్రస్యైషా సంత ప న్తి అభితః సర్వతోఽవస్థితాః ఏతాః కూపపర్శవః కూపేష్టకాః కూపే అవస్థితం మామ్. కథమ్ సపత్నీరివ యథా సమానభర్తృకా యోషితః ఏకం భర్తార మభిసంతపేయుః దుర్వచోభిః. ఇదమస్యాః త్వయా కృతమ్ ఇదం మమ న కృతమితి. కించ మూషా న మూషికా ఇవ. శిశ్నాః శిశ్నాని వ్యద న్తి అన్నమిశ్రాణి సూత్రాణి భక్షయ న్తి అథవా స్వాఙ్గాభిధానమేతత్ స్యాత్ స్వాఙ్గాభిధానమితి శేషోఽభిప్రేతః భవతి హి తిరశ్చాం మేషస్వభావః. యచ్ఛేపం భక్షయ న్తి. ఏవమేతే మదుక్తాః అధయః కామాః సోమేన యక్ష్యే దాస్యే భోక్ష్యే ఇత్యేవమాదయః. మాం భక్షయ న్తి పీడయ న్తి హే శతక్రతో తవ స్తోతారం మా మేతే కామాః సంతాపయ న్తి. న చ త్వమస్మాన్ తస్యా

ఆపదః త్రాయసే ఇత్యభిప్రాయః. యువామపి తావత్ హే రోదసీ విత్తం జానీతం మే ప్రయోజనమ్. యదర్థమహం రోదిమి యువా మేవంభూత స్మాత్ కూపా దుద్ధరతమ్. యది నాయమింద్రోఽభ్యుద్ధరతి తత్ర తస్మిన్ సూక్తే బ్రహ్మ ఇతిహాసమిశ్రమ్ ఇతిహాసయుక్త మిత్యర్థః.

మంత్రార్థము :— హే శతక్రతో హే ఇంద్ర! తే స్తోతారం మా = నిన్ను స్తుతియించు నన్ను, సపత్నీః ఇవ=సవతులవలె, పర్శవః=బావిలోని ఇటుకలు, బాహ్యా = ఆపదలు, అభితః = అన్నివైపులనుండి, సంతపన్తి= సంతాపము కలిగించుచున్నవి, ఆధ్యః = మానసికదుఃఖములు, మా = నన్ను, మూషః శిశ్నా ఇవ = ఎలుకలు మిశ్రిత - అన్నమును వలె, లేక తమ ఉపస్థేంద్రియమునువలె, వ్యదన్తి = తినివేయుచున్నవి, అట్లే మనో వేదనలు నన్ను తినుచున్నవి. రోదసీ=ఓ ద్యావాపృథివీ లోకములారా! మీరు కూడ, అస్య = ఈనాస్తుతి ప్రయోజనమును, విత్తమ్ = తెలిసికొనుడు, అనగా మీరుకూడ నాస్తుతిప్రయోజనమును గుర్తించి చేయగలిగిన సాహ య్యము చేయుడు అని యభిప్రాయము. ఈమంత్రమునకు అర్థము వ్రాయుచు భాష్యకారుడు సూత్రశబ్దము నధ్యాహారము చేసియున్నాడు. మూషికములు అన్నముతినునపుడు ఆయన్నమున కలిసియుండు సూత్ర ములనుగూడ తినునట్లు నామనస్సును చుట్టుముట్టియున్న మానసికబాధలు నన్ను పీడించుచున్నవి. లేక ఎలుకలు కుక్కలు తమ శిశ్నములను నాకు చుండునట్లు ఆధులు - నామానసికవ్యాధులు నన్ను పీడించుచున్నవి. ఇక పర్శవః = బాహ్యవిపత్తులు నన్ను, కూపపర్శవః = కూపపతితమనుష్యుని కూపమునందలి ఇటుకలు బాధించునట్లు సంసారమనెడి కూపమునబడి యున్న నన్ను బాధించుచున్నవి. మూషికాఇవ అస్నాతాని మలవేష్టిత సూత్రాణి=ఎలుకలు మలవేష్టిత సూత్రములను భక్షించునట్లు నామానసిక బాధలు నన్ను బాధించుచున్నవి. స్వాంగాభిధానం వా స్యాత్ అథవా = లేక యిక్కడ తన ఉపస్థేంద్రియార్థమున శిశ్నశబ్దముపయోగింపబడినది. శిశ్నాని వ్యదన్తి = తన మూత్రేంద్రియమును నాకుచున్నవి. సంతపన్తి మా ఆధ్యః కామాః = నన్ను నామానసికవ్యాధులు బాధించుచున్నవి. కూపేఽవహితమ్ = సంసారమునెడి కూపమునబడియున్న త్రితమ్=త్రితు నికి, ఏతత్సూక్తం ప్రతిబభౌ = ఈ సూక్తముభాసించెను. తత్ర=ఆసూక్తము

నందు, బ్రహ్మ = వేదమంత్రములు, ఇతిహాసమిశ్రమ్ = ఇతిహాసముతో కూడియున్నవి, ఋఙ్మిశ్రమ్ గాథామిశ్రమ్ చ = ఋగ్బద్ధములు గాథా బద్ధములు నైయున్నవి. గాథ ఋక్కుయొక్క ప్రకారమేయున్నది. త్రితః తీర్ణతమః మేధయా=బుద్ధితో నెల్లరను నోడించిన వాడగుటచే నతడు త్రితః అనబడెను, సంఖ్యానామ ఏవ అభిప్రేతమ్స్యాత్ = లేక త్రితః అనునది సంఖ్యయొక్క నామమనియే గ్రహింపబడినది. ఏకతః ద్వితః త్రితః ఇతి త్రయో బభూవుః=ముగ్గురు ఉత్పన్నులైరి. మొదట నుత్పన్నుమైన వానిని ఏకతః, ద్వితః, త్రితః, అని నామములు వరుసగా పెట్టబడెనని అభిప్రాయము.

ఇషిరేణ - (౭)

"ఇషిరేణ తే మనసా సుతస్య భక్షీమహి పిత్ర్యస్యేవ రాయః
సోమరాజన్ ప్రణ ఆయూంషి తారీరహానీవ సూర్యో వాస
రాణి." (ఋ. ౮-౪౮-౭)

ఈషణేన వైషణేన వార్షణేన వా. తే మనసా సుతస్య భక్షీమహి పిత్ర్యస్యేవ ధనస్య ప్రవర్ధయ చ న ఆయూంషి సోమరాజన్! అహానీవ సూర్యో వాసరాణి. వాసరాణి వేసరాణి వివాసనాని గమనానీతి వా.

ఇషిరః ఇతి - ఏతదనవగతమ్ - ఈషణేన వా ఏషణేనవా ఋషణేన వా ఇతి శబ్దసమాధయః నిగమమేవ పఠతి. "ఇషిరేణ తే మనసా...వాస రాణి" ఇతి ప్రగాథస్యేయ మార్షమ్. హే భగవన్ సోమ! ఇషిరేణ త్వాం ప్రతి సర్వాత్మనా గతేనేత్యర్థః. ఏషణేనేతి వా. ఇచ్ఛావతా ఋషణేనేతి వా దర్శనవతా మనసా తే తవ యోఽస్మాకం స్వాంశః తమ్ భక్షీమహి. కథమ్? పిత్ర్యస్యేవ రాయః యథా పిత్ర్యో ధనాంశః అవిఘ్నేన భక్ష్యతే కించ హే సోమరాజన్! న ఆయూంషి ప్రవర్ధయ కథమ్? యథా సూర్యః వాసరాణి వాసంతికాన్యహాని వివాసనాని తాని హి శీతం వివాసయన్తి నాశ యన్తీత్యర్థః.

మంత్రార్థము :- సోమరాజన్ హే భగవన్! సోమ ఇషిరేణ మనసా = నీవైపు, సర్వాత్మనా = అన్నివిధములవెళ్లియున్న మనస్సుతో,

ఏషణేనవా మనసా = లేక ఫలప్రార్థనాయుక్తమనస్సుతో, ఋషణేన వా మనసా = లేక దర్శనమునర్థించు మనస్సుతో, పిత్ర్యస్య = పైతృకమగు, దాయ ఇవ = పితృధనమువలె, తే సుతస్య=నీచే నుత్పన్నమైన జగత్తును, భక్షీమహి = ఉపభోగింతుముగాక ! నః ఆయూంషి = మా ఆయువులను, ప్రతారీః = వృద్ధినొనర్చు, సూర్యఇవ = సూర్యునివలె - సూర్యుడెట్లు వసన్త కాలపు దినములను వర్ధిల్లజేయునో అట్లు వర్ధిల్లజేయుమనిభావము. ఇషిర శబ్దము గత్యర్థక 'ఈష'ధాతువుతో లేక ఇచ్ఛార్థక 'ఇషు'ధాతువుతోను దర్శనార్థక ఋషీధాతువుతోను సిద్ధమగును. కావున ఇషిరపదమునకు మూడుఅర్థములుచెప్పబడినవి, (ఈషణేన, ఏషణేన అర్షణేన=క్రమముగా, గతి, కోరిక, దర్శనము అని మూడర్థములు) వాసరశబ్దవ్యుత్పత్తి - గత్యర్థక వేషధాతువునకు అర ప్రత్యయముచేసిన వేసరశబ్దము సిద్ధించును. వేసర శబ్దములోని ఏకారమునకు ఆకారమాదేశముచేసిన వాసరము అగును. వాసరము = గతికలది ఎక్కువ గతికలదినము పెద్దదినమగును. వసంత ఋతువునుండి క్రమముగా పగటిసమయము ఎక్కువకాదొడగును, వివాసనాని వా = లేక శీతమును తొలగించునవి - వివాసితమొనర్చునవి - గమనాని ఇతి వా = లేక గమనశీలముకలవి. గత్యర్థక వృధాతువుచే గమనాని శబ్దముసిద్ధించును. గమనశీలము లభించును.

'కురుతన' - (౮).

> **కురుతనేత్యనర్థకా ఉపజనా భవన్తి. కర్తన - హన్తన - యాతనేతి. య ఏవార్థః కురుతేత్యుక్తే భవతి స ఏవ కురుతనేతి ఏవం కర్తన హన్తన యాతనేతి.**

"సుపిప్పలా ఓషధీః కర్తనాస్మే" ఋ.సం. ౧౦-౬౫ సుపిప్పలాః సుఫలాః ఏతాః ఓషధీః. కర్తన = కురుత, అస్మే = అస్మభ్యమ్ ఇత్యర్థః "యో నో మరుతో...హన్తనా తమ్" ఇతి. హన్తనా హన్తేత్యర్థః... "కోన్వత్ర మరుతో మామహే వః ప్రయాతన"...ఇతి - హే మరుతః కోఽన్యః యుష్మానేవ మేతస్మిన్ జగతి మామహే పూజయతి యథాఽహమ్-తతోఽస్మాన్ ప్రయాతన - ప్రయాత.

అర్థము :- కురుతన ఇత్యాది పదములందు 'న' అది నిరర్థకపదములు ఆగమములగుచుండును. 'కురుత'అనిన నేయర్థమో 'కురుతన'అనినను నదే యర్థము. 'న' అధికమైనంతమాత్రమున అర్థమున నెట్టిమార్పు ఉండదు. కావున 'న'పదము వ్యర్థము అని గుర్తింపవలయును. ఇట్లు కురుతకు కర్తన హతకు హన్తన యాతకు యాతన అని ప్రయోగములు. అర్థము - కురుత = చేయుము, హత = చంపుము, యాత = వెళ్లుము అర్థములు.

'జఠరే' - (౯).

జఠర ముదరం భవతి. జగ్ధమస్మిన్ ధ్రియతే ధీయతే వా.

జఠరమ్ ఇతి ఏతదనవగతమ్. జగ్ధమ్ భుక్తమన్నమ్ అస్మిన్ ధ్రియతే ఇతి జఠరమ్ ఉదరమిత్యవగమః.

అర్థము :- జఠరపదము ఉదరవాచకము. ఏలయన జగ్ధమ్ = తిన్న అన్నము, అస్మిన్ = దీనియందు ఉదరమునందు, ధ్రియతే=ఉంచబడును లేక ధీయతే = ధారణచేయబడును. కావున ఉదరము జఠరమనబడును. అని వ్యుత్పత్తి.

"మరుత్వాఁ ఇంద్ర వృషభో రణాయ పిబా సోమ మనుష్వధం మదాయ। ఆసించ స్వజఠరే మధ్వ ఊర్మిం త్వం రాజాసి ప్రదివః సుతానామ్" (ఋ. 3-౪౭-౧)

మరుత్వానింద్ర మరుద్భిః తద్వాన్. వృషభో వర్షితాపామ్. రణాయ రమణీయాయ సంగ్రామాయ. పిబ సోమమ్. అనుష్వధ మన్వన్నమ్. మదాయ మదనీయాయ జైత్రాయ ఆసించ స్వజఠరే మధున ఊర్మిమ్. మధు సోమమిత్యౌపమికం మాద్యతేః ఇద మపీతరన్మధ్వేతస్మాదేవ త్వం రాజాసి పూర్వేష్వప్యహఃసు సుతానామ్.

మరుత్వాం ఇన్ద్ర ఇతి నిగమః. విశ్వామిత్రస్యేయ మార్షమ్-త్రిష్టుప్ మరుత్వాన్ మరుత్సంయుక్తః - హే ఇంద్ర! త్వం వృషభః వర్షితా అపామ్,

రణాయ రమణీయాయ సంగ్రామాయ పిబ ఏకం సోమ మస్మద్రప్రదత్తమ్. అనుష్వధం స్వధాయాః పశ్చాత్, స్వధేతి అన్ననామ. కించ మదాయ మదనీయాయ పానాయ ఆసించ స్వజఠరే మధ్వః మధున ఊర్మిం సంఘాతమ్. యస్మాత్ త్వమేవ రాజా ఈశ్వరః పూర్వేష్వపి అహఃసు సుతానామ్ అభిషుతానామ్ న కేవలమాధునికానా మిత్యభిప్రాయః.

మంత్రార్థము :— ఇంద్ర ! హే ఇంద్ర ! = నీవు, వృషభః = జలమును వర్షించువాడవు. అట్టి నీవు, మరుత్వాన్ = దేవతలను వెంటనిడుకొని, సంగ్రామాయ = యుద్ధముచేయుటకు, మదాయ = జయనశీల మదముకొఱకు, అనుష్వధమ్ = అన్నభక్షణానంతరము, సోమం = సోమరసమును, పిబ = త్రాగుము, జఠరే = తనయుదరమున, మధ్వః ఊర్మిమ్ = సోమరసరాశిని, ఆసించస్వ = సోమరసముతో ఉదరమును బాగుగ నింపుము. పిలయున నీవే మొదటు, ప్రదివః = దినముయొక్క, సుతానామ్ = పిండిన సోమరసమునకు, రాజాసి = రాజవు - అధిపతివి. మరుత్వాన్ ఇంద్రః = ఇది యింద్రునకు విశేషణము, మరుద్భిః = దేవతలతో సంయుక్తుడు, వృషభః అపాం వర్షితా ! = జలమును వర్షించువాడవు, మదాయ మదనీయాయ జైత్రాయ = యుద్ధమున జయమును కలిగించు మదముకొఱకు, మధుసోమమ్ = మంత్రమున మధువు సోమమునకు పర్యాయముగా వాడబడినది. అదియు, ఔపమికమ్ = ఉపమార్థము - ఉపమతో సంబంధముండుటవలన - మాద్యతేః - 'మదీహర్షే' = హర్షార్థక 'మదీ'ధాతువుచే మధుశబ్దమేర్పడును, మద్యపానమువలన మత్తుకలుగునట్లు సోమపానము వలన జయమున కవసరమగు శక్తికలుగునని అభిప్రాయము. ఇదమపి ఇతరత్ = మధు ఇదియు మఱియొక విధమగు మద్యమే. ఇదమ్ ఇతరత్ మధు = ఇదికాదు రెండవ 'మధు' తేనె వాచకము. ఏతస్మాదేవ = ఇందువలననే యీ మదీవాచకము హర్షార్థమున వచ్చును.

ఇతి ప్రథమః పాదః

ప్రథమ పాదము సమాప్తము

# ద్వితీయపాదము

తితఉ - (౧౦).

తితఉ పరిపవనం భవతి. తతవద్వా తున్నవద్వా తిలమాత్ర తున్నమితి వా. "సక్తుమివ తితఉనా పునన్తో యత్ర ధీరా మనసా వాచమక్రత. అత్రాసఖాయః సఖ్యాని జానతే భద్రైషామ్ లక్ష్మీర్నిహితాధి వాచి" (ఋ. ౧౦-౭౧-౨)

సక్తుమివ పరిపవనేన పునన్తః సక్తుః సచతేః దుర్ధావో భవతి. కసతేర్వా స్యాత్ విపరీతస్య వికసితో భవతి. యత్ర ధీరా మనసా వాచ మకృషత ప్రజ్ఞానమ్. ధీరాః ప్రజ్ఞానవన్తః ధ్యానవన్తః. తత్ర సఖాయః సఖ్యాని సంజానతే. భద్రైషాం లక్ష్మీర్నిహితాధివాచి ఇతి. భద్రం భగేన వ్యాఖ్యాతమ్. భజనీయం భూతానామభిద్రవణీయమ్, భవద్రమయతీతి వా. భాజనవద్వా లక్ష్మీర్లాభాద్వా లక్షణాద్వా లప్స్యమానాద్ వా. లషతేర్వా స్యాత్ ప్రేప్సా కర్మణః లగ్యతేర్వా స్యాత్ ఆశ్లేష కర్మణః లజ్జతేర్వా స్యా దశ్లాఘా కర్మణః.

తితఉ ఇతి ఏతదనవగతమ్ పరిపవనమితి అభిధేయవచనమ్. తతేన చర్మణా నద్ధం తితఉ తున్నైర్వా ఛిద్రైః తద్వత్ తితఉ. తిలమాత్రాణి వా తున్నాని ఛిద్రాణి తస్మిన్నితి తితఉ నిగమః - "సక్తుమివ తితఉనా" ఇతి, విద్వత్సూక్తే బృహస్పతే రార్షమ్. యథా సక్తుం కశ్చిత్ పరిపవనేన పునాతి ఏవం వాచం ధీరాః=ధీమన్తః మేధావినః అక్రత జ్ఞానేన పునన్తోఽకృత. అత్ర సఖాయః సఖ్యాని విజ్ఞానాని సంజానతే ఇతరేతరస్య యో విజ్ఞాన ప్రకర్షః తం జానతే యస్మాత్ భద్రా ఏషాం లక్ష్మీః విజ్ఞానాఖ్యా వాచి నిహితా. భగేన వ్యాఖ్యాతమ్, స్త్రీభగస్తథా స్యాత్. అభిద్రవణీయమ్ = అభిగమనీయ మిత్యర్థః, భవద్రమయతీతి వా యస్య హి తద్భవతి స రమతే. ప్రేప్సాకర్మణః సర్వఏవ హి తమభిలషన్తి. లజ్జతేః అశ్లాఘాకర్మణః యే హి లక్ష్మీవన్తో భవన్తి తే స్వయమ్ ఆత్మానం న శ్లాఘన్తే ఏవం విద్యావన్తోఽపీతి న విస్మర్తవ్యమ్.

తితఉ పరిపవనం భవతి, తితఉ = జల్లెడ, తతవద్ వా = దానితో నేవస్తువు జల్లెడబట్టబడునో ఆవస్తువు వెదజల్లబడును. అందువలన తితఉ= జల్లెడ, తున్నవద్ భవతి = ఛిద్రములు గలదియగును లేక తిలమాత్ర తున్నమ్=తిలలు - నువ్వులు పట్టినంత చిన్నఛిద్రములు గలిగియుండును.

మంత్రార్థము :— యత్ర = ఎక్కడ, ధీరాః = విద్వాంసులు తితఉనా సక్తుమివ = జల్లెడతో సక్తు - జవచూర్ణమును శుద్ధముచేయునట్లు, పునన్తః = జల్లెడబట్టుచు - పవిత్రమొనర్చుచు-మనస్సుతో వాణిని పవిత్ర మొనర్చుచు మాట్లాడుదురు. అత్ర = అక్కడనే, సఖాయః = మిత్రులు, సఖ్యాని = మైత్రిని ఎఱుగుదురు. బుద్ధిమంతులున్న సమాజములో వాణిని చక్కగా ప్రయోగించి మిత్రతను కాపాడుదురని భావము. ఏషాం = ఈ విద్వాంసులయొక్క, అధివాచి = వాక్కులలో, భద్రా = కల్యాణయుక్త, లక్ష్మీః = లక్ష్మి, నిహితా = ఉన్నది.

వ్యుత్పత్తి :— సక్తుః సచతేః = 'షచసమవాయే'అను ధాతువువలన సక్తుః శబ్దమేర్పడును, దుర్ధావః భవతి = సక్తు కష్టపడి సిద్ధముచేయ బడును. సక్తువులో నీరుగలిపిన నది విస్తరిల్లును, కసతేః విపరీతస్య=వా లేక, కసధాతువును విపరీతముగా వ్రాసినను సక్తుశబ్దము సిద్ధించును, ధీరాః ప్రజ్ఞానవంతః = ధీరులు జ్ఞానులనబడుదురు, ధ్యానవంతః = ధ్యాన వంతులను, ధీరులందురు. భద్రశబ్దము భగశబ్దమువలె వ్యాఖ్యానించబడి నట్లెంచవలయును, భగ, భద్రశబ్దములు రెండును 'భజ'ధాతువుచే సిద్ధ మగును.భూతానామభిద్రవణీయమ్ భజనీయకా=అర్థము భూతములన్నియు పొందదగినది. భవద్రమయతి ఇతి వా లేక భద్రశబ్దము 'భవత్'అగుచు నెల్లరను రమయతి - ప్రసన్నులను చేయును. భాజనవత్ వా లేక భద్ర పురుషుడు సుపాత్రుడగును. కల్యాణాదిశుభములు పొందును. లాభాద్ లక్ష్మీః=లాభమువలన లక్ష్మియనబడును లక్ష్మిగలవారి కన్నియులభించును. 'లభ'ధాతువుతో లక్ష్మిశబ్దము సిద్ధమగును. లక్షణాద్ వా లక్షధాతువుతోను లక్ష్మిశబ్దమేర్పడును లాంఛనాద్వా='లాఛి'ధాతువుచేతను లక్ష్మి సిద్ధించును. లక్ష్మి యుండుటచే లక్షింపబడును. అందరిచే కోరబడును, ఇచ్ఛార్థక 'లష' ధాతువుతో లక్ష్మిశబ్దము సిద్ధింపగలదు. ఆశ్లేషకర్మణః లగ్యతేర్వా ఆశ్లేషార్థక

'లగ్'ధాతువుతో లక్ష్మీశబ్దము సిద్ధించును. లజ్జతేర్వా స్యాత్ అశ్లాఘ్యకర్మణః
లష్టధాతువుతో ఇక్లే లష, లగధాతువులతోనుకూడ లక్ష్మిసిద్ధించును.

శిప్రే - (౧౧)

శిప్రే ఇత్యుపరిష్టాద్ వ్యాఖ్యాస్యామః.

శిప్రేపదము ముందు (౬-౧౭-౨)లో వ్యాఖ్యానింపబడును.

'మధ్యా' - (౧౨)

"తత్ సూర్యస్య దేవత్వం తన్మహిత్వం మధ్యా కర్తోర్వితతం సంజభార. యదేదయుక్తహరితః సధస్థాదాద్రాత్రీ వాసస్తనుతే సిమస్మై" (ఋ. ౧-౧౧౫-౪)

తత్ సూర్యస్య దేవత్వం తన్మహిత్వం మధ్యే యత్కర్మణాం క్రియమాణానాం వితతం సంహ్రియతే. యదాసావయుక్తహరణా నాదిత్యరశ్మీన్ హరితోఽశ్వానితి వా. అథ రాత్రీ వాసస్తనుతే సిమస్మై వేసర మహరవయువతీ సర్వస్మాత్. అపి వోపమార్థే స్యాత్. రాత్రీవ వాసస్తనుత ఇతి. తథాపి నిగమో భవతి.

"పునః సమవ్యద్వితతం వయన్తీ" (ఋ. ౨-౩౮-౪) సమనాత్సీత్.

మధ్యా ఇతి ఏతదనవగతమ్. మధ్యే ఇత్యుపగమః. "తత్సూర్యస్య దేవత్వమితి" నిగమః ఆంగిరసస్య కుత్సస్యేయ మార్షమ్. తత్ అహం సూర్యస్య భగవతః దేవత్వం దేవతాభావం తన్మహిత్వం తచ్చ మహత్వం మహాభాగ్యం మన్యే జానే మధ్యా మధ్యే అవగణయ్య సర్వాన్ కర్మకర్తౄన్ వితతమ్ ఏతత్ ప్రకాశజాలమ్ సంహ్రియతే. కించ యదా సౌభగవాన్ సూర్యః అయుక్తయునక్తి హరితః రసహరణాత్ ఆదిత్యరశ్మీన్ సధస్థాత్ పృథివీలోకాదాకృష్య అత్ అథేత్యర్థః. రాత్రిః సిమస్మై సిమస్మాత్ సర్వస్మాత్ లోకాత్ అహరపకృష్య తమః తనుతే: అపి వోపమార్థే స్యాత్ వాస ఇవ రాత్రి తమః తనుత ఇత్యర్థః తథా చ నిగమః "పునః సమధ్యత్ వితతం వయన్తీ" గృత్సమదస్యేయ మార్షమ్. సమనాత్సీత్ సమవేష్టయ

ఛిత్సర్తః. యథా యోషిత్ కాచిత్ వాసోవయన్తీ పునః సంవేష్టయత్యస్తమన కాలే పునశ్చ వితనోత్యాదిత్యే ఉదితే ఏవమియం రాత్రిః తమః సంవేష్ట యతి.

మంత్రార్థము :— సూర్యస్య = సూర్యునియొక్క, తత్ దేవత్వమ్ = అదియే దేవత్వము, మహిత్వమ్ తత్ = అదియే మహత్త్వము - మాహా త్మ్యము, యత్ = ఏది, కర్తోః మధ్యా = చేయబడినకార్యము మధ్యలోనే వ్యాపించియున్న కిరణజాలమును, సంజభార=సంకోచింపజేయుచున్నాడు, యదా ఇత్ = ఎప్పుడు, సధస్థాత్ = పృథివీలోకమునుండి తొలగించి, హరితః = కిరణములను లేక తన అశ్వములను, అయుక్త = మఱియొక స్థానమున నియోగించును - వ్యాపింపజేయును, ఆత్ = అనంతరము, రాత్రీ = రాత్రి, సిమస్మై = సమస్తస్థలమునుండి, వాసః = దినమును, (వాసరపదమునుండి 'ర' తొలగించి వాస అని పఠింపబడినది.) అవ యువతీ పదమును అధ్యాహారముచేసి, తొలగించుచు, తనుతేతమః' అని అధ్యాహారముచేసి అంధకారమును వ్యాపింపజేయుచున్నది, అపివా ఉప మార్థే స్యాత్ = లేక ఇట ఉపమార్థము, వాసఇవ = సాలెవానిస్త్రీ పఱచి యున్న వస్త్రమును మడతపెట్టునట్లు రాత్రి దినమును తనలో నిముడ్చు కొనును - అంధకారమును వ్యాపింపజేయును. ఈవిషయమున మంత్ర ప్రమాణము, వయన్తీ = నేయుచున్న స్త్రీ, వితతమ్ = పఱచియున్న వస్త్రమును సూర్యుడస్తమించినపుడు మరల మడతపెట్టును. ఇట్లే రాత్రి అంతట వ్యాపించియున్న సూర్యకిరణములను తనలో ఇముడ్చుకొనును. అంధకారమును వ్యాపింపజేయును.

'మందూ' - (౧౩)

> "ఇంద్రేణ సంహిదృక్షసే సంజగ్మానో అభిభ్యుషా మందూ సమానవర్చసా" (ఋ. ౧-౬-౭) ఇంద్రేణ హి సంద్రృశ్యసే సంగచ్ఛమానోఽబిభ్యుషా గణేన మందూ మదిష్ణూ యువాం స్థః అపివా మందునా తేనేతి స్యాత్. సమానవర్చసేత్యేతేన వ్యాఖ్యాతమ్.

మందూ ఇతి - ఏతదనపగతమ్ మదిష్ణూ మందునేతి వా శబ్దసమాధీ "ఇంద్రేణ సంహి" ఇతి నిగమః మధుచ్ఛందస ఇయమార్షమ్. హే ఇంద్ర త్వమ్ ఇంద్రేణ ఈశ్వరేణ దీప్తేన వా అబిభ్యుషా అభయవతా మరుద్గణేన నిత్యమేవ సంగచ్ఛమానః సందృక్షసే సందృశ్యసే. మరుద్గణః త్వాం చ మదిష్ణూ నిత్యప్రముదితా విత్యర్థః. సమానవర్చసా సమానదీప్తా మందునా సమానవర్చసా మరుద్గణేన ఇత్యేవం తృతీయైకవచనమపి బోద్ధవ్యమ్.

మంత్రార్థము :- ఇంద్ర! నీవెల్లపుడు ఇంద్రేణ = సామర్థ్య యుక్తుడవై, అబిభ్యుషా = భయరహితుడవై, మందూ = బాగుగమత్తుడవై-ప్రసన్నుడవై, సమానవర్చసా=సమానతేజస్వివై, లేక నిత్యాదీప్తమరుద్గణేన అనుపదము నధ్యాహారముచేసి దేవతలతో, సంజగ్మానః=సంగతుడవగుచు, సందృశ్యసే=చూడబడుచున్నావు - కనబడుచున్నావు. లేక మందూ సమాన వర్చసా అను నీరెండుపదములు ప్రథమాద్వివచనములుగా నెంచినచో హే ఇంద్ర! నీవు దేవతలతో గూడియున్నవాడవై యెల్లపుడు కనబడు చున్నావు. మఱియు నీవు - దేవత ఇరువురు మిక్కిలి ప్రసన్నులు తేజస్వు లునై యున్నారు. అని యర్థమగును.

ఈర్మాన్తా సః ౧౫)

"ఈర్మాన్తాసః సిలికమధ్యమాసః సంశూరణాసో దివ్యాసో అత్యాః హంసా ఇవ శ్రేణిశో యతన్తే యదాక్షిషు ర్దివ్య మజ్మమశ్వాః (ఋ. ౧-౧౬౩-౧౦)

ఈర్మాన్తః సమీరితాన్తాః సుసమీరితాన్తాః పృథ్వన్తా వా. సిలికమధ్యమాః సంసృతమధ్యమాః శీర్షమధ్యమా వా. అపివా శిరఆదిత్యో భవతి. యదనుశేతే సర్వాణి భూతాని. మధ్యే చైషాం తిష్ఠతి ఇదమపీతరచ్ఛిర ఏతస్మాదేవ సమాశ్రితాన్యేత దింద్రియాణి భవన్తి సంశూరణాసః దివ్యాసో అత్యాః శూరః శవతేర్గతికర్మణః దివ్యాః దివిజాః అత్యా అతనాః. హంసాఇవ శ్రేణిశో యతన్తే. హంసా హన్తేర్ ఘ్నన్త్యధ్వానమ్ శ్రేణిశ ఇతి శ్రేణిః శ్రయతేః. సమాశ్రితా భవన్తి. యదాక్షిషు ర్యదా

మంత్రార్థము :- అగ్నే ! ఓ అగ్నీ ! త్వమ్ = నీవు, వనా = కాష్ఠము లను, కాయమానః చాయమానః = చూచుచు, కామయమానః వా = కోరు చున్నవాడవై, యత్ = ఎప్పుడు, మాతౄః అపః అగ్నిః = మాతలైన జలము లను, అగ్నికి కారణభూతములైన జలములను (అగ్నే ర్యోనిః = జలమగ్నికి కారణము) ఉపనామ్యన్ = శాంతింపచేయుచు, అజగన్ = ప్రాప్తమగుచున్నావో, తత్ నివర్తనమ్ = అనివర్తనము శాంతింపుట, న ప్రమృషే = సహింప జాలవు, ఓ అయన - దూరేఽసి సన్ = దూరమునందుండియు, అభ్యర్థ యమయ్యు, ఇభవః = ఇక్కడనే యుందువు, విద్యుత్తురూపమున నీవు జలము లోను యుందువు. నీవు పూర్తిగా నశింపవు. కేవలము అదృశ్యమౌదువు.

'లోధమ్' - (౧౬).

“లోధం నయన్తి పశుమన్యమానాః” (ఋ. ౩-౫౩-౨౩) లుబ్ధ మృషిం నయన్తి పశుం మన్యమానాః.

లోధమ్ ఇతి - ఏకపదనిగమమ్. లుబ్ధమిత్యర్థః. లోధమ్ లుబ్ధమ్ తపసః క్షీణం మాభూత్ ఇతి లోభే ఋష్యాం స్థితమృషిం మాం విశ్వామిత్రం బద్ధ్వా పశుమన్యమానాః పశుమన్యమానా ఏతే వసిష్ఠపుత్రా నయన్తి.

అర్థము :- లోధమ్ లుబ్ధమ్ = లుబ్ధుని స్వధర్మచ్యుతుని, పశు మన్యమానాః = పశువుగా నెంచి, నయన్తి = స్వధర్మమున చేర్తురు.

"శిరమ్" - (౧౭).

“శిరం పావకశోచిషమ్” (ఋ. ౮-౧౦౨-౧౧) పావకదీప్తిమ్ అనుశాయిన మితి వా ఆసీనమితి వా.

శిరమ్ ఇతి ఏకపదనిగమమ్. అగ్నిరభిధేయః. శిరమ్ ఇతి శిరమ్ పావకశోచిషమితి నిగమః. శిరం వ్యాపినమగ్నిం స్తౌమి పావయిత్రీ యస్య శోచిః దీప్తిః తం పావకశోచిషమ్.

మంత్రార్థము :- పావకశోచిషమ్ = పవిత్రమొనర్చు జ్వాలగల, శిరమ్ = వ్యాపకమగు అగ్నిని, అనుశాయినమితి వా - ఆసీనమ్ ఇతి వా = రెండు విధములు కర్థము వ్యాపకమే, యః సర్వభూతేషు అనుశేతే సోఽనుశాయీ = అగ్ని సర్వప్రాణులందును జాఠరాగ్నియై యుండును, సర్వమశ్నుతే ఇతి వా = సర్వమునందు జఠరాగ్నిరూపమున వ్యాపమైయుండును.

"విద్రఘే ద్రుపదే" - (౧౮-౧౯).

"కనీనకేవ విద్రఘే నవే ద్రుపదే అర్భకే బభ్రూయామేషు శోభేతే." (ఋ ౪-౩౨-౨౩) కనీనకే కన్యకే కన్యా కమనీయా భవతి. క్వేయం నేతవ్యేతి వా. కమనేనానీయత ఇతి వా కనతేర్వా స్యాత్ కాంతికర్మణః కన్యయో రధిష్ఠాన ప్రవచనాని సప్తమ్యా ఏకవచనానీతి శాకపూణిః.

విద్రయో ర్దారుపాద్యోః దారుదృణాతే ర్వా ద్రూణాతే ర్వా తస్మాదేవ ద్రు నవే నవజాతే అర్భకే అవృద్ధే తే యథా తదధిష్ఠానేషు శోభేతే ఏవం బభ్రూయామేషు శోభేతే. బభ్ర్వో రశ్వయోః సంస్తవః.

విద్రధే ద్రుపదే ఇత్యేతే ద్వేఽపి పదే అనవగతే విద్రధే విద్ధే ద్రుపదే ద్రుమమయే ఇత్యవగమః. ద్వయోరపి పదయో రేకఏవ నిగమః. కనీనకేవ విద్రఘే శోభేతే ఇతి వామదేవస్యార్షమ్. కన్యా కమనీయా భవతి. సర్వఏవ హి తాం ప్రార్థయన్తే అథవా క్వేయం నేతవ్యేతి వావానాయేత్యేవం ప్రతిపితా చిన్తయతీతి. కన్యా కమనేనానీయత ఇతి వా. కన్యయో రధిష్ఠాన ప్రవచనాని సప్తమ్యా ఏకవచనాని ఇతి శాకపూణిరాచార్యో మన్యతే. దారుమయే పాదపీఠే అధిరూఢే యథా కన్యకే శోభేతే ఏవం బభ్రూ బభ్రువర్ణే అశ్వే యామేషు ఇంధనశాలాసు శోభేతే. ద్రుమః దృణాతేర్వా విదారణార్థస్య ద్రూణాతేర్వా హింసార్థస్య. తస్మాదేవ ధాతుద్వయా దన్యతరస్య ద్రు ఇత్యేతదభిధానమ్ భవతి ద్రుమ ఇత్యర్థః.

మంత్రార్థము :- విద్రధే = ఖండించి, చెక్కచేయబడిన, నవే = క్రొత్త, అర్భకే = చిన్నచిన్న, ద్రుపదే = కొయ్యతో చేయబడిన పావుకోళ్ల మీద ఆరూఢులైన, కనీనకా ఇవ = కన్యలవలె, బభ్రూ = పింగళవర్ణము గల రెండుగుఱ్ఱములు, యామేషు = యుద్ధక్షేత్రములందు, శోభేతే=సుశోభితములగుచున్నవి-శోభించుచున్నవి. ఈమంత్రమునగల విద్రధే, ద్రుపదే, అర్భకే, నవే అను నీనాలుగుపదములు, కన్యయోః అధిష్ఠాన ప్రవచనాని = ఇద్దఱు కన్యలు తొడుగుకొను పావుకోళ్ల విషయకములు - వానిని

వర్తించునవి. అందువలన సప్తమీవిభక్తి యందలి ద్వివచనాంతములు అర్థముచెప్పునపుడు ద్వివచనమును ధ్యాసమున నుంచుకొనవలయును. కాని శాకపూణి ఆచార్యుడు ఏకవచనాంతమనుచున్నాడు.అప్పుడీమంత్రమున గల యీపదముల కీ యర్థమగును. విద్రధే అర్భకే నవే ద్రుపదే = చెక్క చిన్నదిగా చేయబడిన క్రొత్తపాదపీఠముమీద కూర్చున్న కన్యలవలె" అని. నిరుక్తి :— కన్యా కమనీయాభవతి. 'కముకాంతౌ' ధాతువుతో కన్యాపద మేర్పడును. కన్య సుందరముగా నుండును. బాలునికంటె బాలిక సుందరముగా నుండునని భావము. లేక కాంతిః = ఇచ్ఛా - కోరిక, కమ నీయా - శబ్దమున కర్థము ఏషణీయా అగును. కన్య యెల్లరకు కోరదగినది యనిభావము. లేక క్వ ఇయం నేతవ్యా=ఈకన్య నెటచేర్చవలెను ? ఈమె వివాహమెక్కడ చేయుదగును ? ఈయర్థమును గ్రహించి, క్వపూర్వక 'ణీఞ్'ధాతువునకు ఔణాదిక 'యక్' ప్రత్యయముచేసిన కన్యాశబ్దము ఏర్పడును. లేక కమనేన ఆనీయత ఇతి వా. ఈమె కోరుచున్న వరునిచే తీసికొనిరాబడును. కనతేర్వా స్యాత్ = లేక, కాంత్యర్థక కనధాతువుతో కన్యాశబ్దము సిద్ధించును. విద్రయోః - దారుపాద్యోః = చెక్క నిర్మింపబడిన రెండు కొయ్యపావుకోళ్లమీద, దారుదృణాతేర్వా - ద్రూణాతేర్వా = విదార ణార్థక (చీల్చుట) దృధాతువుతో కాని, హింసార్థక ద్రు ధాతువుతోకాని, దారు (కొయ్య) శబ్దమేర్పడును. దారు = కొయ్యచీల్చబడును, లేక నరక బడును. అందువలన దారువు అనబడును. అందువలననే ద్రు, ద్రూ ధాతువుచే దారువాచకమగు ద్రు శబ్దమేర్పడును, అర్భకే - అవృద్ధే=చిన్న, ఈశబ్దము పావుకోళ్లకును విశేషణమగును. ప్రథమాద్వివచనముగా నెంచి కన్యకును విశేషణమగును. తే యథా తదధిష్ఠానేషు శోభేతే = ఆకన్యలు పావుకోళ్లమీద నిలబడి యెట్లు శోభిల్లుదురో యట్లే బూడిదవర్ణముగల రెండు అశ్వములు యుద్ధరంగమున శోభిల్లును, బభ్రోః అశ్వయోః సంస్తవః = ఇది అశ్వద్వయ సంస్తుతి.

'తుగ్వని' - (౨౦).

ఇదం మేఽదాదిదం చ మేఽదాదిత్యృషిః ప్రసంఖ్యాయాహ.
"సువాస్త్వా అధి తుగ్వని" (ఋ. ౮-౧ -౩౭) సువాస్తుర్నదీ,
తుగ్వ తీర్థం భవతి. తూర్ణమేతదాయన్తి.

తుగ్వని ఇతి పీతదనవగతమ్. తీర్థమ్ అభిధేయమ్. 'సువాస్త్వా అధితుగ్వని' ఇతి నిగమః. ఇదం చ ద్రవ్యజాతం మమ దత్తవాన్ అసౌ రాజేత్యేవం పరిసంఖ్యానం కృత్వా ఋషిరాహ ఉక్తవానిత్యర్థః. క్వ? సువాస్త్వా నద్యా అధితుగ్వని తీర్థే అధి ప్రసిద్ధఃహి గంగా యమునా సరస్వత్యాది నదీనాం తీరేషు ప్రయాగపుష్కరాదితీర్థేషు స్నానం దానం చ పుణ్యకారణమితి. ప్రార్థీ = యాచకుడు, 'నాకిది యిచ్చెను. నాకిది లభించినది' అని లెక్కించి చెప్పుకొనును. సువాస్త్వా = నదీతీరమున తుగ్వనితీర్థమున సువాస్తు నదీనామము, తుగ్వ = తీర్థముపేరు - ఏలయన ఈతీర్థమునకు జనులు తూర్ణమ్ = త్వరగా వత్తురు. అందువలన తీర్థమనబడును.

'నంసంతే' - (౨౧).

"కువిన్నంసంతే మరుతః పునర్నః" (౭-౫౮-౫) పునర్నో నమన్తే మరుతః.

నంసన్తే ఇతి పీతదనవగతమ్. నమన్తే ఇత్యుపగమః. కువిన్నంసంతే ఇతి నిగమః వసిష్ఠస్యేయ మార్షమ్. తానహంమరుతః పరిచరామి యే కువిత్ బహునంసంతే నమన్తే వర్షాద్యుపకారేణ అస్మాన్ప్రతి ప్రహ్వీభవన్తి.

అర్థము :- నంసంతే = నమన్తే = ప్రణమిల్లుచున్నారు, పునః = మరల మరల, నః = మాకు, మరుతః = దేవతలు, కువిత్=అధికముగా, నంసన్తే = నమస్కరించుచున్నారు, వర్షాదులను కలుగజేసి మాకు ప్రహ్వీభూతులగుచున్నారు.

'నసంత' - (౨౨).

నసన్త ఇత్యుపరిష్టాత్ వ్యాఖ్యాస్యామః.

నసన్త ఇత్యే తదుపరిష్టాత్ ద్వాదశాధ్యాయే వ్యాఖ్యాస్యామః.

'నసంత' అనుపదము ముందు పండ్రెండవ యధ్యాయమున వ్యాఖ్యానింతుము.

ఆహనసః - (౬౩).

యే తే మదా ఆహనసో విహాయస స్తేభి రిన్ద్రం చోదయ దాతవే మేఘమ్. (ఋ. ౯-౭౫-౫)

యే తే మదా ఆహనవన్తో వంచనవన్త స్తైరింద్రం చోదయ దానాయ మఘమ్.

ఆహనసః ఇతి - ఏతదనవగతమ్. ఆహననవన్తః. ఇత్యవగమః "యే తే మదాః ఆహనసః" ఇతి నిగమః కవే ర్భార్గవస్యేయ మార్షమ్. జగతీ. హే భగవన్ సోమ! యే తే మదా ఆహనసః సమ్మోహయితారః విహాయసః మహన్త స్తైరింద్రం చోదయ ప్రేరయ దాతవే దానాయ మఘం ధనమ్.

మంత్రార్థము :- పై నగము మంత్రమునందు సోమ = ఓ సోమ! తే యే = నీ యొ, మదాః = మదములు, ఆహనసః = ఆహనవన్తః = వంచనవంతములు - సంమోహకములు, విహాయసః = పెద్దవి, తేభిః = వానితో, ఇంద్రం = ఇంద్రుని, చోదయ = ప్రేరేపింపుము, మఘందాతవే= ధనమునిచ్చుటకు అందువలన నతడు మాకు ధనిమునిచ్చును.

అద్మసత్ - (౬౪).

"ఉపో అదర్శి శున్ధ్యువో న వక్షోనోధా ఇవావిరకృత ప్రియాణి అద్మసన్ననసతో బోధయన్తీ శశ్వత్తమాగా పునరేయుషీణామ్." (ఋ. ౧-౧౨౪-౪)

ఉపాదర్శి శున్ధ్యువః - శున్ధ్యురాదిత్యో భవతి. శోధనాత్ తస్యైవ వక్షో భాసా ధ్యూఢమ్. ఇదమపీతరదధ్యక్ష ఏతస్మా దేవ అధ్యూఢం కాయే. శకునిరపి శున్ధురుచ్యతే శోధనాదేవ ఉదకచరో భవతి. ఆపోఽపి శున్ధ్యువ ఉచ్యన్తే శోధనా దేవ. నోధా ఋషిర్ భవతి. నవనం దధాతి. స యథా స్తుత్యా కామానావిష్కురుత ఏవముషా రూపాణ్యావిష్కురుతే. అద్మసత్ అద్మాన్నం భవతి. అద్మసాదినీతి వా అద్మసాని నీనీతి వా. ససతో బోధయన్తీ శశ్వత్తమాగాత్ పునరే

యుషీణామ్ స్వపతో బోధయన్తీ శాశ్వతికతమాగాత్ పున
రేయుషీణామ్-పునరాగామినీనామ్.

అద్మసత్ ఇతి-ఏతదనవగతమ్. అద్మసాదినీతి వా, అద్మసానినీతి వా శబ్దసమాప్తి ఉపో అదర్శి ఇతి నిగమః. తదేతత ఆర్షమ్. ఉపో అదర్శి ఉపశ్లిష్టాదృశ్యత ఇయముషాః కస్య? శున్ధ్యువః శోధయితు రాదిత్యస్య కథమ్? వక్షో న వక్ష ఇవ. ఉషాః ఆదిత్యవక్ష ఇవోపశ్లిష్టా దృశ్యతే. కించ నోధా ఇవావిరకృత ప్రియాణి నోధాఋషిర్భవతి. స హి యథా స్తుత్వా ప్రియాణ్యాత్మన ఆవిష్కురుతే ఏవ మియం ఉషాః ప్రకాశేన రూపాణి ఆవిష్కురుతే - ప్రకాశయతే. కించ అద్మసత్ అన్నసాధికా స్త్రీ యథా ప్రాతరేవ క్షీరాద్యుపాదానార్థం ససతః స్వపతః జనాన్ దోహకాదీన్ బోధయన్తీ, ఏవ ముషా అపి జనాన్ బోధయన్తీ శశ్వత్తమాగాత్ శాశ్వతికతమా ఆగాత్ ఆగచ్ఛతి.

మంత్రార్థము :- శున్ధ్యుగః=ఆదిత్యునియొక్క వక్షః న=ప్రకాశము వలె, ఉపఉ = ఉకారపాద పూర్తికొఱకు, ఉపగత - ఉదితా=ఉదయించినది, ఈ, ఉషా అదర్శి = కనబడుచున్నది, నోధా ఇవ = స్తుతించు ఋషివలె, అవిరకృత = సమస్తజగత్తును ప్రకాశితమొనర్చుచున్నది, ససతః = నిద్రించుచున్న జనులను, బోధయన్తీ = మేలుకొలుపుచు, అద్మసతన = గృహిణివలె, పునరేయుషీణామ్ = వెళ్లితిరిగివచ్చువారియందు, శశ్వత్తమా = నిత్యము, ఉపాదర్శి శున్ధ్యువః = ఈ ఉష, ఉప= ఉపశ్లిష్టయై అదర్శి = కనబడుచున్నది, శున్ధ్యువః = ఆదిత్యమండలమునుండి, శున్ధ్యుః ఆదిత్యః = శున్ధ్యుః సూర్యునినామము, శోధనాత్=సమస్తజగత్తును శుద్ధముచేయును, తస్యైవ వక్షఃభాసః అధ్యూఢమ్ = అతని ప్రకాశము, అతనియొక్క వక్షస్థలముపై ఆరూఢమైయున్నది, ఇవమపి = ఇదికూడ, ఇతరత్ వక్షః = మఱియొక వక్షస్థలవాచకము, వక్షః శబ్దము ఏతస్మాదేవ = దీనివలననే చెప్పబడినది, అధ్యూఢం కాయే = వక్షస్థలము శరీరముమీద ఆరూఢమైయున్నది, శకునిః అపి = పక్షికూడ, శున్ధ్యుః = శున్ధ్యు అనబడును, శోధనాదేవ = శోధనక్రియ సంబంధము వలననే, ఉదకచరో భవతి = జలమునందు సంచరించును. నీటికాకులు మున్నగు పక్షులు నీటియందుండి నీటినిక్షోభపఱచుచుండును. కావుననట్టి

వకిని సుస్న్వ అందురు, ఆపః అపి సుస్న్వ ఉచ్యన్తే = జలముకూడ సున్నశబ్దవాచ్యములగును. జలముకూడ మురికిని తొలగింపనుపయోగిం చును, నోధా ఋషిర్నవతె = స్తుతినొసర్చు ఋషి నోధాయనబడును. అతడు, నవనం దధాతి = స్తుతిని ధరించును. కావున నోధ యనబడును. అతడు యథా=ఎట్లు స్తుతులమూలమున తనకామములను ప్రకటించునో యట్లే ఏవమ్ ఉషాః=ఉషస్సు, రూపాణి ఆవిష్కురుతే = పదార్థములను ప్రకట మొనర్చును, అద్మసత్ అద్మాన్నమ్ భవతి = అన్నమును అన్నమందురు, అద్మసాదినీ ఇతి = అన్నము ప్రాప్తమొనర్చు గృహిణి అద్మసాదిని యనబడును, అద్మసాదినీ = గృహిణి ఇంటిలోనున్న వారికందఱికి అన్న మును పంచును. మఱియు నాగృహపత్ని - గృహిణి, ససతః = నిద్రించు వారిని నిద్రనుండిలేపును, పునరేయుషీణామ్ = పోయితిరిగివచ్చువారిలో, శశ్వత్తమా అగాత్ = శశ్వత్తమా నిత్యమగును.

ఇష్మిణః - (౨౫).

> "తే వాశీమన్త ఇష్మిణః" (ఋ. ౧-౮౭-౬) ఈషణేన ఇతి
> వైషణేన ఇతి వార్షణేన ఇతి వా. వాశీతి వాఙ్నామ·
> వాశ్యత ఇతి సత్యాః.

ఇష్మిణః ఇతి ఏతదనవగతమ్. ఈషణేన ఇతి వా, ఏషణేన ఇతి వా, అర్షణేన ఇతివా, శబ్దనమాథయుః "తే వాశీమన్త ఇష్మిణః" ఇతి నిగమః. రహూగణపుత్ర గౌతమస్యేయ మార్షమ్. జగతీ. య ఏవ వాశీమన్తః వాగ్మినః ఇష్మిణః ఈషణినః ఉపగమనవన్తః ఏషణినో వా ఇచ్ఛావన్తః అర్షణినో వా సర్వార్థానాం ద్రష్టారః. మరుతః తానేవ స్తౌమీత్యభ్యాహారః

అర్థము :— తే = అవి - వారు, ఇష్మిణః = గతిశీలురు, వాశీమన్తః= వాగ్మిలు - మాటకారులు వెళ్లువారు - గతిశీలురు. చూచువారు కోరువారు ఇష్మిణః అనబడుదురు. ఈషణినః = వెళ్లువారు, ఏషణినః = కోరువారు, అర్షణినః = చూచువారు, వాశీ = వాణికి నామము పిలియున, వాశ్యతే ఇతి సత్యాః = వాణితో శబ్దముచేయును. అనగా మాటలాడును.

వాహః - (౨౮).

“శంసావాధ్వర్యో ప్రతి మే గృణీహీన్ద్రాయ వాహః కృణవావ జుష్టమ్” (ఋ. 3-౫3-3) అభివహన - స్తుతిమభిషవణ ప్రవాదాం స్తుతిం మన్యన్తే ఐన్ద్రీత్యేవ శస్యతే.

వాహః ఇతి ఏతదనవగతమ్ శంసావాధ్వర్యో ఇతి నిగమః విశ్వామిత్రస్యేయ మార్షమ్. త్రిష్టుప్ హే అధ్వర్యో! ఏహి ప్రతిగృణీహి శంసావ అవాముభావపి. వాహః స్తోత్రమ్ కృణవావ జుష్టం ప్రియమ్. ఏవ మిదమభివహన స్తుతిః అథవా అభిషవణప్రవాదా స్తుతిః ఉభయథాపి తు ఇయం ఐన్ద్రీ శస్యతే.

మంత్రార్థము :— హోత అధ్వర్యువుతో చెప్పుచున్నాడు. అధ్వర్యో!= ఓ యధ్వర్యువా!, శంసావ = మనమిరువురము స్తుతిచేయుదము, మే = నాకు, ప్రతిగృణీహి = సమాధానము చెప్పుము, ఇంద్రాయ = ఇంద్రుని కొఱకు, లేక ఐశ్వర్యప్రాప్తికొఱకు, జుష్టమ్ = ప్రియమైన, వాహః = స్తుతిని, కృణవావ = చేయుదము, అభివహనస్తుతిమ్ వాహః = ఉత్తమ జ్ఞానమును ప్రాపక కలిగించు - స్తుతి, ‘వహప్రాపణే’ ధాతువుతో వాహః శబ్దము సిద్ధమగును. వహనక్రియాసామ్యమువలన నీస్తుతిప్రాపక స్తుతి యని అర్థముచెప్పబడినది, అభిషవణప్రవాదాం వా = లేక సోమరసమును నిష్పన్నముచేయు వర్ణనము. ‘వాహః’ శబ్దమునకు వాచకమగును, ఐన్ద్రీ తు ఏవ శస్యతే = రెండర్థములును, ఐన్ద్రీ తు = ఇంద్రసంబంధమునే తెలుపును.

పరితక్మ్య - (౨౯).

పరితక్మ్యేత్యుపరిష్టాత్ వ్యాఖ్యాస్యామః. పరితక్మ్య ఇతి ఏతదుపరిష్టాత్ వ్యాఖ్యాస్యామః ఏకాదశాధ్యాయే ‘సరమా’పదనిరుక్తౌ.

పరితక్మ్యపదము ముందు వ్యాఖ్యానముచేయుదుము. ఎక్కడ? ఏకాదశాధ్యాయమున ‘సరమా’పదనిరుక్తియందు.

ఇతి ద్వితీయః

ద్వితీయపాదము సమాప్తము

# తృ తీ య పా ద ము

సువితే - (౨౮).

సువితే సు ఇతే సూతే సుగతే. ప్రజాయా మితివా. "సువితే మా ధాః" (మై. సం. ౧-౫-౭) ఇత్యపి నిగమో భవతి.

సువితే ఇతి-ఏతదనవగతమ్. సు ఇతే ఇతి. సూతే ఇతి శబ్దసమాధీ. యదా సు ఇతే ఇతి తదా సుగతే ఇత్యర్థః. యదా సూతే ఇతి తదా ప్రజాయామ్ 'సూతే దేవదత్తా పుత్రమ్' ఇతి. ప్రజాయాత ఇత్యర్థః. "సువితే మాధాః" ఇత్యపి-నిగమః. హే తానూనప్త్ర! ఏవం మాం సువితే సుగతే స్థానే ధేహి అథవా యథా బహ్వపత్యాః స్యామ తథా కుర్విత్యర్థః

అర్థము :- సువితే=ఇది అనవగతము మఱియు నిది యనేకార్థకము ఆ యనేకార్థము లెయ్యవి? సు ఇతే = మంచిగతికలది. ఇదియొక అర్థము రెండవయర్థమున విగ్రహమిట్లుండును, సూతే=కనును-కావున నె ప్రజాయా మితివా = అనగా సువితే పదమును సూతే అని నిరుక్తిచేసినపుడు దీని సంబంధము ప్రజా-సంతానముతో నుండును. 'సూతే ప్రజామ్' సంతానమును కనును. సూతే అని యర్థము చెప్పినపుడు 'సు' ధాతువునకు ఛాందస ఇడాగమము చేసిన సువితే శబ్దమేర్పడును.

మంత్రార్థము :- హే పరమేశ్వర! మా = నన్ను, సువితే = ఉత్తమ గతిగల స్థానమునందు - స్వర్గమునందు, ధాః = ధారణచేయుము - చేర్చుదువుగాక!

దయతే - (౨౯).

దయతి రనేకకర్మా "నయేన పూర్వం దయమానాః స్యామ" (మై. సం. ౪-౧౩-౮) ఇత్యుపదయా కర్మా. "య ఏక ఇద్విదయతే వసు" ఇతి దానకర్మా వా విభాగకర్మా వా. దుర్వర్త్తు ర్భీమో దయతే వనాని" ఇతి దహతి కర్మా. దుర్వర్త్తుర్దుర్వారః "విదద్వసు ర్దయమానో వి శత్రూన్" ఇతి హింసాకర్మా. "ఇమే సుతా ఇందవః ప్రాతరిత్వానా సజోషసా పిబత మశ్వినా తాన్ అయం హి వామూతయే

వందనాయ మాం వాయసో దోషాదయమానో అబూబుధత్"
దయమాన ఇతి,

దయతి ఇతి. ఏష శబ్దః అనేకకర్మా - అనేకార్థః ఉపదయాకర్మా - ఉపదయతి రక్షణముచ్యతే నవేన ధాన్యేన పూర్వం పురాణం దయమానాః రక్షన్తః స్యామ యః ఇన్ద్రః ఏక ఇత్ ఏక ఏవ వి వివిధం వసు ధనం దయతే దదాతి. కస్మై ? దత్తవతే హవీంషి అథవా విభాగకర్మా=విదయతే విభజతే ఇత్యర్థః - "దుర్వర్తుర్భీమో దయతే వనాని" ఏతస్మిన్ మన్త్రే దహతి కర్మా - దుర్వారః దుర్వారణీయ ఇత్యర్థః. భీమః సర్వప్రాణి భయంకరః యదాయ మగ్నిః దయతే దహతి వనాని. "వివద్వసుర్దయ మానో విశత్రూన్" ఏతస్మిన్ మన్త్రే హింసాకర్మా. పునరపీంద్రః విదయ మానః వివిధం హింసన్ శత్రూన్ యే మేఘవధప్రతిబంధినః. దయమాన ఇతి అత్ర దయతిర్ గత్యర్థః. దయమానః ఉడ్డీయమానః కాకోఽన్తరిక్షేఽధ స్తాత్ మాం సుప్తం దోషాయాం ప్రాబోధయత్. దోషా రాత్రిః. యథా ఏషా హి యోషా నిశపకదోషా తోషాయ కేషాం న మహీతలే స్యాత్.

అర్థము :— దయధాతువు అనేకార్థకము (౧) రక్ష (౨) దానము విభాగము (౩) దహించుట (౪) హింస (౫) గతి. ఈయర్థములు మంత్రాంశములు వ్రాయబడుచున్నవి. (౧) నవేన పూర్వం దయమానాః స్యామ = క్రొత్తఅన్నముతో ప్రాతఅన్నమును రక్షించుకొందము. ఇది రక్షణార్థకము. (౨) యః ఇంద్రః = ఏ యింద్రుడు, ఏక ఇత్ = ఒక్కడే, వివసు = నానా విధ ధనములను, దయతే = విభజించుచున్నాడు పంచుచున్నాడు. ఇది విభాగము - దానమునకు ఉదాహరణము. దహనార్థమున (౩) ఈయగ్ని దుర్వర్తుః = దుర్వారమై, భీమః = భయంకరమై, వనాని = అరణ్యము లను, దయతే = దహించును, (౪) దయ - హింసార్థమునకు ఉదా :- ఇంద్రః వివద్వసుః = ప్రాప్తధనుడై, విదయమానః – శత్రువులను హింసించుచున్నాడు. (౫) దయ - గత్యర్థమునకు ఉదా :— యే సుతాః అభిషుత ఇందవః = ఏ సోమరసములుగలవో, తాన్=వానిని, ప్రాతరిత్వానా = ప్రాతఃగమనశీలురగు అశ్వినులారా!, సజోషసా = సమాన ప్రీతిగలమీరు, పిబతమ్ = త్రాగుదురుగాక! పిలియున, అయమ్=ఈసోమరసము, వామ్= మీయిరువురియొక్క, ఊతయే = రక్షణకొఱకు, వందనాయ = స్తుతించు

టకైయున్నది. ఈవిషయము, మామ్ = నన్ను - నాకు, దోషా = రాత్రి యందు, వయమానః=ఎగురుచున్న వాయసః=కాకరాజు, అబూబుధత్ = చెప్పెను, వయతి = పైకిఎగురుట అను క్రియ గతికర్మకు బోధకము.

'నూచిత్ - నూ చ' - (౩౦-౩౧).

నూ చిదితి నిపాతః పురాణ నవయోః నూ చేతి చ. "అద్యా చిన్నూ చిత్తదపో నదీనామ్" (ఋ. ౬-౩౦-౩) అద్య చ పురా చ తదేవ కర్మ నదీనామ్."

"నూచ పురాచ సదనం రయీణామ్" (ఋ.౧-౯౬-౭) అద్య చ పురా చ సదనం రయీణామ్ - రయిరితి ధననామ రాతే ర్దానకర్మణః.

నూచిత్ ఇతి - ఏషనిపాతః - పురాణ నవయోః అర్థయో ర్వర్తతే. నూ చ ఇతి చ. నూచిదిత్యస్యోదాహరణమ్ - "అద్యా చిన్నూ చిత్తదపో నదీనామ్" భారద్వాజస్యేయ మార్షమ్. అద్య చ పురా చ. తదేవ కర్మ వర్తతే నదీనామ్. నూచేత్యస్యోదాహరణమ్. "నూ చ పురా చ సదనం రయీణామ్" కుత్సస్యేయ మార్షమ్ అద్య చ పురా చ సదనం రయీణామ్ ధనానామ్. లోకే తు ధాయామ్ - ఇతి "అర్థ - రై - విభవా అపి" ఇతి ధననామస్వమరాత్. సదనం స్థానం గృహం వా దానకర్మణ ఇతి. దానం భోగో నాశ ఇత్యత్ర దానస్యైవాభ్యర్హితత్వాత్ ఇతి.

అర్థము :- నూచిత్ = నూచిత్అనునిది నిపాతము. ఇది పురాణము నవము అనునర్థములలో నున్నది. నూ చ = ఇక 'నూ' అనునదియు, నిపాతః = నిపాతమే - దీనికి అర్థముకూడ ప్రాతక్రొత్తలే - ఓ యింద్ర! పరమేశ్వర ! = నీవు నదులకు పూర్వమున నేకర్మ ఉంచితివో - కలిగించితివో, అదియే, అద్యాచిత్ - నూచిత్ = నేడును ఉన్నది - పూర్వమున నుండెను. అట్లే, రయీణామ్=ధనములకు, నూ చ పురా చ=పూర్వము, ఇప్పుడును, సదనమ్ = స్థానము - గృహము ఉండెను. ఉన్నది, రయిః = ధనమునకు నామము = ధనార్థకము, దానకర్మణః - రాతేః = దానార్థక 'రా' ధాతువుచే రయిశబ్దమేర్పడినది.

"దావనే అకూపారస్య - (3౨-33).

> "విద్యామ తస్య తే వయమకూపారస్య దావనే" (ఋ. ౫-౩౯-౨) విద్యామ తస్య తే వయ మకూపరణస్య దానస్య.

దావనే ఇతి. ఏతదనవగతమ్. దానస్య ఇత్యవగమః. అకూపారస్య ఇతి. ఏతదనవగతమ్, అకూపరణస్య ఇత్యవగమః ద్వయోరప్యేతయో రేక ఏవ నిగమః. "విద్యామ తస్య తే వయమకూపారస్య దావనే. అత్రేన్ద్ర మస్యేయ మార్షమ్. హే ఇంద్ర! తస్య తే తవ ధనస్య దావనే దానస్య విద్యామ లభేమహి. అకూపారస్య - అకూపరణస్య సర్వదా పూర్ణస్యేత్యర్థః. ఘాపత్కృస్య ధనస్య వయమేవ లబ్ధారః స్యామేత్యభిప్రాయః.

అర్థము :- హే ఇంద్ర! వయమ్ = మేము, తే = నీయొక్క, అకూపారస్య = కుత్సితముకాని, దేనిని పొంది మేము పూర్ణులమగుదుమో యట్టి, దావనే = దానస్య - దానమును, విద్యామ = పొందుదుముగాక !, దావనే = దానము, అకూపారస్య = అకుత్సితము - పూర్ణము అని యీ రెండుపదముల కర్థము.

> ఆదిత్యోఽప్యకూపార ఉచ్యతే అకూపారో భవతి దూరపారః సముద్రోఽప్యకూపార ఉచ్యతే అకూపారో భవతి మహాపారః. కచ్ఛపోఽప్యకూపార ఉచ్యతే. అకూపారో న కూపమృచ్ఛతీతి కచ్ఛపః కచ్ఛం పాతి - కచ్ఛేనపాతీతి వా. కచ్ఛేన పిబతీతి వా. కచ్ఛః ఖచ్ఛః ఖచ్ఛదః. అయమపీతరో నదీ - కచ్ఛః ఏతస్మాదేవ కమ్ ఉదకమ్ తేన ఛాద్యతే.

ఆదిత్యోఽప్యకూపారః స హి మహతోఽధ్వనః పారయితా భవతి. ఉదయాదారభ్య యావదస్తమితి. మహాపారః విస్తీర్ణపారః ఇత్యర్థః. స కూపమృచ్ఛతి అల్పోదకత్వాత్. కింతర్హి ? సముద్రం నదీం వా. కచ్ఛపః కచ్ఛమ్ ఆత్మనో ముఖ - సంపుటం పాతి రక్షతి స హి కించిత్ దృష్ట్వా

స్వశరీరే ఏవ ముఖ-సంపుటం ప్రవేశయతి. కచ్ఛే న జలహార్యంగాని పాతీతి వా. ఖచ్ఛపః ఖమ్ ఆకాశం ఛాదయతి నిగమాః పర్యేష్యాః.

అర్థము :- ఆదిత్యోఽపి = సూర్యుడుకూడ అకూపారుడనబడును. ఏలయన నతడు, అకూపారః = గొప్పమార్గమును దాటిపోవును. ఉదయము మొదలు అస్తమయముపఱకు సుదీర్ఘమార్గమును దాటిపోవును, సముద్రోఽపి = సముద్రముకూడ అకూపారమనబడును. అదియును, మహాపారః = గొప్పపారముకలది. సముద్రపుపారము - అవతలితీరము విస్తృతము గొప్పది - దీర్ఘమును, కచ్ఛపోఽపి = తాబేలుకూడ, అకూపార మనబడును. ఏలయన నదియు అకూపారః - న కూపమృచ్ఛతి = కొలదిజలముగల కూపమును - బావిని కోరదు, కచ్ఛపః కస్మాత్? కచ్ఛం పాతి=కూర్మము తనముఖమును రక్షించుకొను స్వభావముకలది. కచ్ఛపమనబడును. అని కచ్ఛపశబ్ద నిర్వచనము. కచ్ఛేన పాతి ఇతి వా = లేక - కచ్ఛేన = కటాహ ముతో తన అంగములను, పాతి = రక్షించుకొనును, కచ్ఛేన పిబతీతి వా = లేక తనముఖసంపుటముచే జలమును త్రాగును. కావున కచ్ఛపమన బడును, కచ్ఛః ఖచ్ఛః ఖచ్ఛపః = కచ్ఛపము ఖచ్ఛః ఖచ్ఛపః అనియు చెప్పబడును ఏలయన? కచ్ఛము=ముఖసంపుటము-కటాహము అననేల? ఖేన ఛాద్యతే ఖం ఆచ్ఛాదయతి ఇతి వా = తనముఖమును ఆకాశముచే రక్షించుకొనును. మఱియు ఆకాశముచే ముఖముకప్పబడియుండును, అయుమపి ఇతరః = నదీతీరముకూడ కచ్ఛః అనబడును. ఇదియును 'ఛద'ధాతువుచే నేర్పడును, కమ్ = ఉదకము, తేన ఛాద్యతే = తీరము ఉదకముతో ఆచ్ఛాదితమైయుండును. కప్పబడియుండును. కావున నదీ తీరము కచ్ఛమనబడునని నిరుక్తి.

'శిశీతే' (౩౮) "శిశీతే శృంగే రక్షసే వినిక్షే" (ఋ. ౫-౨-౯)
నిశ్యతి శృంగే రక్షసో వినిక్షణాయ, రక్షో రక్షితవ్య
మస్మాత్ రహసి క్షణోతీతి వా. రాత్రౌ నక్షత ఇతి వా.

శిశీతే ఇతి పదపదగతమ్. నిశ్యతి ఇత్యవగమః. శిశీతే శృంగే రక్షసే వినిక్షే ఇతి నిగమః. యథా హి వృషభస్తరూన్నిఘ్నన్ శృంగే తీక్ష్ణే కరోతి ఏవ మగ్నిరపి దారూణి దహన్ తీక్ష్ణే కరోతి జ్వాలాః. రక్షసాం వినిక్షణాయ

విహింసనాయేత్యర్థః. వివిక్తే ప్రదేశే క్షణోతి - హనస్తీత్యర్థః. రాత్రౌ నక్షతే గచ్ఛతి ఇతి వా రక్షః.

మంత్రార్థము :— రక్షసేవినిక్షే = తన శత్రువులను రాక్షసులను చంపుటకు ఎద్దు తనకొమ్ములను తీక్ష్ణముచేసియుంచును. మనుష్యుడుకూడ తనశత్రువులైన రాక్షసులను చంపుటకవసరములైన ఆయుధములను తీక్ష్ణ ములుగా నుంచవలయును. రక్షః రక్షితవ్యమస్మాత్ - రక్షః = ఎందు కందురా ? దీనితో తన రక్షణచేసికొనవలయును, రహసి క్షణోతి ఇతివా - రహసి = ఏకాంతమున, క్షణోతి = రాక్షసుడు ఏకాంతమున చంపును. రాత్రౌ నక్షతి ఇతి వా - ఏలయన నితడు రాత్రియందు వెళ్లును.

సుతుకః - (౩౫),

అగ్నిః సుతుకః సుతుకేభి రశ్వైః. (ఋ. ౧౦-౩-౭)

సుతుకనః సుతుకనై రితి వా. సుప్రజాః సుప్రజోభి రితి వా.

సుతుకే ఇతి - ఏతదనవగతమ్ సుతుకనః ఇత్యుపగమః. అగ్నిః సుతుకః "సుతుకేభి రశ్వైః" ఇతి నిగమః. హే అగ్నే ! సుతుకః సుతుకనః సుగమనః ఇత్యర్థః. సుతుకనైరేవ సుగమనైరశ్వైః అథవా సుప్రజోభిః కులజైరిత్యర్థః. ఆగచ్ఛేత్త్వ మిహ కర్మణి.

అర్థము :— సుతుకః = మంచిగతికల, ఉత్తమసంతానముగల, అగ్నిః = అగ్ని, సుతుకేభిరశ్వైః = ఉత్తమగతిగల అశ్వములతో లేక ఉత్తమకులమునందుబుట్టిన అశ్వములతో రమ్ము.

సుప్రాయణాః - (౩౬).

"సుప్రాయణాః అస్మిన్ యజ్ఞే విశ్రయన్తామ్" సుప్రగమనాః (యజు. ౧౮-౩౫)

సుప్రాయణాః ఇతి ఏతదనవగతమ్. సుగమనాః ఇతి శబ్దప్రతీతిః. 'సుప్రాయణాః అస్మిన్ యజ్ఞే విశ్రయన్తామ్' ఇతి నిగమః. ఏతాః ద్వారః సుప్రాయణాః సుగమనా భవన్తు. అస్మిన్ యజ్ఞే విశ్రయన్తాం కవాటోద్ఘాట నేన విశ్రియన్తామ్. అస్మిన్ యజ్ఞే = ఈయజ్ఞమునందు, సుప్రాయణాః = ఉత్తమగతికలుగునట్టి అవకాశమునిచ్చు ద్వారములు విశ్రయన్తామ్. తెఱవ బడి యుండుగాక !

అప్రాయువః - (38).

"దేవా నో యథా సదమిద్ వృధే అసన్నప్రాయువో రక్షి
తారో దివే దివే" (ఋ. 1-89-1)

దేవా నో యథా సదా వర్ధనాయ స్యుః. అప్రాయువోఽప్రమా
ద్యన్తః రక్షితారశ్చ అహన్యహని.

అప్రాయువః ఇతి. ఏతదనవగతమ్. అప్రమాద్యన్తః ఇత్యేవముక్త ప్రతీతిః. దేవా నో యథా ఇతి నిగమః - ఆగచ్ఛన్తు దేవాః సదైవ వర్ధనా యోద్యతాః అసన్ స్యురిత్యర్థః. అప్రాయువః అప్రమాద్యన్తః రక్షితారశ్చ దివే దివే = అహన్యహని.

అర్థము :- యథా = ఏవిధముగ, సదమిత్ = ఎల్లప్పుడు, దేవాః = దేవతలు, నః = మాయొక్క, వృధే = వృద్ధికై, అప్రాయువః = ప్రమాద రహితులై, దివేదివే = ప్రతిదినము, రక్షితారః = రక్షించువారు, అసన్ = అగుదురుగాక !

చ్యవనః - (39).

చ్యవన ఋషి ర్భవతి. చ్యావయితా స్తోమానామ్. చ్యవాన మిత్యప్యస్య నిగమా భవన్తి.

"యువం చ్యవానం సనయం యథా రథమ్ పునర్యువానం
చరథాయ తక్షథుః (ఋ. 10-39-4)

యువాం చ్యవనం సనయం పురాణమ్ యథా రథం పునర్యు
వానం చరణాయ తతక్షథుః యువా ప్రయౌతి కర్మాణి
తక్షతిః కరోతి కర్మా.

చ్యవనః ఇతి - ఏతదనవగతమ్. చ్యావనః ఇత్యేవ మన్త్రప్రతీతిః. "యువం చ్యవానమ్" ఇతి నిగమః కక్షీవత్యా ఘోషాయా ఇదమార్షమ్. హే అశ్వినౌ ! యథా కశ్చిచ్ఛిల్పి చిరంతనం రథం గమనాసమర్థం గమన సమర్థం కుర్యాత్, ఏవం యువాం చ్యావనమ్ ఋషిమ్ సనయం వృద్ధం గమనాసమర్థం సన్తం యువానం తక్షథుః కృతవన్తౌ స్థ ఇత్యర్థః. ఏవమే

తస్మిన్ మంత్రే చ్యవనఋషి రుక్తః స హి గ్రాయతే పాకస్యే వ్యాఖ్యానే. జీర్ణః సన్ అశ్విభ్యాం పునర్యువాకృత ఇతి.

అర్థము :— చ్యవనఋషి ర్భవతి=మంత్రద్రష్టయగు ఋషి చ్యవన మహర్షి. స్తోమానాం చ్యావయితా=మంత్రములను ప్రాప్తింపజేయు ఉపదేష్ట, చ్యవానమితి=చ్యవాన్అనువాడున్నాడు, అస్య నిగమాః భవన్తి = ఇందు మంత్రములు ప్రమాణములు, చ్యవాన్ నామముగల మంత్రములు లభించుచున్నవి.

మంత్రార్థము :- హే అశ్వినీకుమారౌ = అశ్వినీకుమారులార! మీ రిరువురు, సనయమ్ = వేదోపదేష్టయగు వృద్ధచ్యవానుని, ప్రాతరథమును బాగుచేయునట్లు, చరథాయ = యువకునివలె చరించునట్లు, తక్షథుః = చేయుడు, యువా ప్రకరోతి కర్మాణి = కర్మలనొకదానితరుపరి మరి యొకటి చేయుచుండును కావున యువకుడనబడును, తక్షతిఃకరోతికర్మా= తక్షధాతువిట కరోత్యర్థకము.

రజః - (౩౮).

> రజో రజతేః జ్యోతీ రజ ఉచ్యతే. ఉదకం రజ ఉచ్యతే. లోకా రజాంస్యుచ్యన్తే. అసృగహనీ రజసీ ఉచ్యేతే.
>
> "రజాంసి చిత్రా విచరన్తి తాన్యవః" (౧-౬౩-౫) ఇత్యపి నిగమో భవతి.

రజ ఇతి అనేకార్థమ్. రజతేః ఇతి వ్యుత్పత్తిః. జ్యోతి రజ ఉచ్యతే, తద్ధి అనురంజయతి ద్రవ్యాణి స్వేన ప్రకాశేన "యా తే అగ్నే రజః శయాతనూః" ఇత్యేవ ముదాహరణమ్ ద్రష్టవ్యమ్. ఉదకం రజ ఉచ్యతే తదపి హి స్వేన స్నేహఖ్యేన గుణేన అనురంజయతి" భువో యజ్ఞస్య రజసశ్చ నేతా ఇతి నిగమః హే అగ్నే! త్వమేవాస్య యజ్ఞస్య భువః పృథివీలోకాదముం లోకం నేతా. రజసః ఉదకస్య చ నేతా. లోకా రజాంసి ఉచ్యన్తే - తేష్వపి హి ప్రాణినో రజ్యన్తే. "త్వయా దృఢాని సుకృతో రజాంసి" ఇతి నిగమః అసృగహనీ రజసీ ఉచ్యేతే. అసృక్ రుధిరమ్ అహశ్చ "మాసి మాసి రజో హ్యాసాం దుష్కృతాన్యపకర్షతి" ఇతి రుధి

రసోఽభ్యుదాహరణమ్. "అహశ్చ కృష్ణమహరర్జునం చ" ఇత్యహ్నః ఉదా
హరణమ్.

అర్థము :- రజః = నిఘంటుపఠిత గత్యర్థక 'రజ'ధాతువువలన సిద్ధమగును, జ్యోతిః రజ ఉచ్యతే = రజస్సు జ్యోతికి పేరు. జలమునకు రజస్సు అనినామము. లోకములు రజస్సు అనబడును. రక్తము, దినము రెండును రజశ్శబ్దముతో వ్యవహరింపబడును. ఈ యన్నింటియందును గతిఉన్నది. కావుననే ఇవి యన్నియు రజస్సులనబడును. చిత్రారజాంసి= చిలకబైన జలము, వివర్తై = అనబడును.

'హరాః' - (౪౦).

> హరో హరతేః జ్యోతిర్హర ఉచ్యతే. ఉదకమ్ హర ఉచ్యతే. లోకాః హరాంస్యుచ్యన్తే. అసృగహనీ హరసీ ఉచ్యేతే. "ప్రత్యగ్నే హరసా హరః శృణీహి" (ఋ. ౧౦-౮౭-౨౫) ఇత్యపి నిగమో భవతి.

హర ఇత్యేతదనేకార్థమ్. హరతేః ఇతి వ్యుత్పత్తిః. జ్యోతిర్హర ఉచ్యతే హరతి తమ ఇతి హరః "యా తే అగ్నే హరః శయాతనూః" ఉదకం హర ఉచ్యతే. తద్ధి ప్రియతే ప్రాణిభిః జీవనాయ. లోకాః హరాంస్యుచ్యన్తే తేభ్యో హి క్షీణపుణ్యాః ప్రాణినో హ్రియన్తే. ఇతో వాముతో వా యత్ స్మర్యతే భగవద్గీతాయామ్ క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతీతి"

అర్థము :- 'హృఞ్'ధాతువుతో హరశబ్దము సిద్ధించును. జ్యోతిః హర ఉచ్యతే. హరః = జ్యోతికిపేరు, జ్యోతి = స్నేహమును - తైలమును, హరతి = హరించును - శుష్కింపజేయును. లేక అంధకారమును జ్యోతి హరించును - తొలగించును. లోకములు స్వర్గమునుండి క్షీణపుణ్యులైన మర్త్యులను హరించును. కావున లోకములుకూడ హరనామముచే చెప్ప బడును. మనుష్యాదిప్రాణులు తమజీవనముకొరకు జలమును హరింతురు. కావున ఉదకముకూడ హరవాచ్యమే. అసృక్ రుధిరము - రక్తము. అదియు క్షీణతను హరించును. కావున హరశబ్దముచే చెప్పబడును. తమస్సును హరించును కావున దినము హరమనబడును.

మంత్రార్థము :— హే అగ్నే=ఓ యగ్నీ! నీవు, విశ్వతః ప్రతి=అన్ని వైపులనుండి, హరసా = నిజతేజస్సుతో, హరఃస్ఫృణీహి = ఆతతాయుల తేజస్సును అణచివేయుము.

జుహురే - (౪౧).

"జుహురే విచితయన్తః" (ఋ. ౫-౧౯-౨) జుహ్వరే విచేతయమానాః.

జుహురే ఇతి పఠితపదగతమ్. జుహ్వరే ఇత్యవగమః "జుహురే విచితయన్తః" ఇతి మన్త్రే ఆత్రేయస్యార్షమ్. జుహురే జుహ్వరే జుహ్వతి" యే అగ్నిం విచితయన్తః విచేతయమానా నరాః వృద్ధాః వృతం వివిశుః తే=ఎవరు, విచితయన్తః - విచేతయమానాః=సర్వానుష్ఠానములను సరిగా తెలిసికొనినవారై, జుహురే = యజ్ఞమొనర్చిరో.

వ్యన్తః - (౪౨).

"వ్యన్త ఇత్యేషోఽనేకకర్మా పదం దేవస్య నమసా వ్యన్తః" (ఋ. ౬-౧-౪) ఇతి పశ్యతి కర్మా. "వీహి శూర పురోడాశమ్" (ఋ. ౩-౪౧-౩) ఇతి ఖాదతి కర్మా. "వీతం పాతం పయస ఉస్రియాయాః" (ఋ. ౧-౧౫౩-౪) అశ్నీతం పిబతం పయస ఉస్రియాయాః ఉస్రియేతి గోనామ. ఉస్రవిణో అస్యాం భోగాః ఉస్రేతి చ.

వ్యన్తః ఇత్యేషోఽనేకకర్మా అనేకార్థః. తద్యథా - 'పదం దేవస్య నమసా వ్యన్తః' ఇతి ఇత్యత్ర పశ్యతికర్మా. భరద్వాజస్యేయ మార్షమ్ పదం స్థానమ్. దేవస్య అగ్నే వ్యన్తః పశ్యన్తే నమసా నమస్కారేణ మన్త్రా ఇత్యర్థః ప్రాప్తః. "వీహి శూర పురోడాశమ్" ఇతి ఇత్యత్ర ఖాదతికర్మా. వీహి భక్షయ పితమస్మత్ప్రదత్తమ్ హే శూర! ఇంద్ర! పురోడాశమ్. "వీతం పాతం పయస ఉస్రియాయాః" ఇతి హే మిత్రావరుణౌ! ఉస్రియాయాః గోః పయసః పయసా నిష్పన్నస్య స్వం భాగమస్మాభి - ర్దీయమానం వీతమ్. అశ్నీతం పిబతం చ. ఉస్రా ఇత్యపి చ గో నామ.

అర్థము :— 'వీ' గతి - ప్రజనన - కాన్త్యసన-ఖాదనేషు=వీ ధాతువునకు గతియున్నగు ననేకార్థములున్నవి. ఆ 'వీ' ధాతువుచే 'వ్యన్తః' సిద్ధమగును. కావున ననేకార్థములు కలది వ్యన్తశబ్దము. దేవస్య = పరమేశ్వరుని, పదం = ధామమును, నమసా = స్తుతితోను, నమనముతోను, వ్యన్తః = చూచుచు, ఇట వ్యన్తశబ్దమునకు దర్శనమర్థము, హే సూత పురోడాశమ్ = పురోడాశమును, వీహి = తినుము. ఇట ఖాదనార్థకము ఉస్రియాయాః = ఆవుయొక్క, పయసః = పాలతో తయారుచేయబడిన పదార్థములను, వీతంపాతం = తినుము, త్రాగుము, ఇక్కడ అశనార్థకము. ఉస్రియేతి గోనామ = ఉస్రియా ఇది గోవాచకము, ఉస్రా ఇతి చ=ఉస్రా కూడ గోవాచకము ఉస్రావిణః అస్యాం భోగాః = ఈ గోవు మూలమున ననేకభోగములు మనుజులకు సిద్ధించును.

క్రాణాః - (౪౩).

> "త్వమింద్ర! మతిభిః సుతే సునీథాసో వసూయవః గోభిః
> క్రాణా అనూషత" గోభిః కుర్వాణాః అస్తోషత.

క్రాణాః ఇతి - పదమనవగతమ్. కుర్వాణాః ఇత్యర్థప్రతీతిః "గోభిః క్రాణా అనూషత" ఇతి నిగమః. హే ఇంద్ర! త్వమస్మిన్ సోమే మతిభిః మతిమద్భిః సుతే అభిషుతే సుష్ఠు యే స్తోతుం శక్నువన్తి తే సునీథాః వసూయవః వసు కామాః గోభిః వాగ్భిః స్తుతిలక్షణాభిః ఆభిముఖ్యేన కుర్వాణాః అనూషత అస్తోషత - స్తువన్తీత్యర్థః.

అర్థము :— హే ఇన్ద్ర! మతిభిః = బుద్ధిమంతులైన యాజ్ఞికులచే, సుతే అభిషుతే = సిద్ధముచేయబడిన సోమమునందు, సునీథాసః = ప్రశంసింపదగిన, వసూయవః వసుకామాః = ధనాభిలాషులైన విద్వాంసులు, గోభిః = వాణులతో, క్రాణాః = స్తుతులనొనర్చుచు, త్వామ్ = నిన్ను, అనూషత = స్తుతించుచున్నారు.

'వాశీ' - (౪౪).

> "ఆతు షించ హరిమీం ద్రోరుపస్థే వాశీభి స్తక్షతాశ్మన్మ
> యీభిః" (ఋ. ౧౦-౧౦౧-౧౦) ఆసించ హరిం ద్రో

**రుపస్థే ద్రుమమయస్య హరిః సోమో హరితవర్ణః. అయ మపీతరో హరి రేతస్మాదేవ. వాశీభి స్తక్షతాశ్మన్ మయీభిః వాశీభి రశ్మమయీభి రితి వా వాగ్భి రితి వా.**

వాశీ ఇతి ఏతదనవగతమ్. వాగ్భిరితి శబ్దసమాధిః "ఆ తూ షించ హరిమీం ద్రోరుపస్థే వాశీభి స్తక్షతాశ్మన్మయీభిః" ఇతి. బుధస్య సోమపుత్ర స్యార్షమ్. ఆసించ ప్రక్షిప ఏతం హరిం హరితవర్ణం సోమమ్ ద్రోరుపస్థే ద్రోణకలశస్యోపరి - యూయమపి చ హే హోతారః! ఏనం సోమం వాశీభిః వాగ్భిః తక్షత సంస్కురుత పునీతేత్యభిప్రాయః. అయమపీతరో హరిః మర్కటః ఏతస్మాదేవ హరితవర్ణత్వా ద్ధరి రుచ్యతే.

అర్థము :- హరిమ్ = హరితవర్ణముగల సోమమును, ద్రోః ఉపస్థే = కొయ్యపాత్రయందు, ఆసించ = తడుపుము, అశ్మన్మయీభిః = పాషాణ నిర్మిత, వాశీభిః = శస్త్రములతో, తక్షత = ఖండించుడు లేక యీహరిత వర్ణసోమమును, అశ్మన్మయీభిః = వ్యాపనసమర్థమగు, వాశీభిః = వాణు లతో, తక్షత = సంస్కరించుడు పవిత్రమొనర్పుడు - స్తుతించుడని యర్థము, అయమపి = ఇదియును, ఇతరో హరిః = మఱియొక హరిః = కోతి - మర్కటము ఇదియును హరితవర్ణము కలుగుటచే హరి యన బడును. రామాయణమున హరితవర్ణపు మర్కటములవర్ణన చూడనగును. విషుణః - (౪౫).

"స శర్ధదర్యో విషుణస్య జన్తో ర్మా శిశ్నదేవా అపి గుర్ఋ తమ్ నః" (ఋ. ౭-౨౧-౫)

**స ఉత్సహతాం యో విషుణస్య జన్తో ర్విషమస్య. మా శిశ్న దేవా అబ్రహ్మచర్యాః. శిశ్నం శ్నథతేః అపి గుర్ఋతం నః సత్యం వా యజ్ఞం వా.**

విషుణ ఇతి ఏతదనవగతమ్. విషమస్య ఇత్యవగమః. "స శర్ధదర్యో విషుణస్య జన్తో ర్మా శిశ్నదేవా అపి గుర్ఋతమ్ నః" ఇతి - స శర్ధత్ స ఏవోత్సహతా మిమమస్మద్యజ్ఞ మాగంతుమ్. య ఏవ అర్యః ఈశ్వరః ఆత్మీయానా మింద్రియాణామ్ జితేంద్రియ ఇత్యర్థః. యశ్చ విషుణస్య

విషమస్య యజ్ఞవిధ్వంసయితుః జన్తోః రాక్షసాదేః నిగ్రహాయ సమర్థః శిశ్నదేవాశ్చ మా అగచ్ఛన్తు. శిశ్నం లింగమ్. కతా లోకా భవిష్యన్తి శిశ్నోదర పరాయణాః ఇతి భాగవతోక్తేః.

అర్థము :— సః = ఆతడు, అర్యః = ఇంద్రియములకు, స్వామి = జితేంద్రియుడు అగుపురుషుడు, నః = మనయొక్క, ఋతం = యజ్ఞము నందు, శర్ధత్ = రానుత్సహించుగాక !, విషుణస్య = విషమస్య = కుటిల పురుషుని నిగ్రహింపసమర్థుడు, శిశ్నదేవాః = లింగము నారాధ్యదేవతగా నెంచువారు కాముకులు, మాఅపిగుః = రాకుందురుగాక !, మఱియు నెట ఋతం పదమునకు సత్యమర్థమగునో యట కాముకులు సత్యమును పొంద కుందురుగాక ! అని యర్థమగును. శిశ్నదేవాః = అబ్రహ్మచర్యాః - బ్రహ్మ చర్యరహితులు, శిశ్నం శ్రథతేః = నిఘంటుపఠితవధార్థక శ్రథధాతువుచే శిశ్నశబ్దమేర్పడును. ఏలయన దీనిచే వధచేయబడును. 'యస్యాముశన్తః ప్రహరామ శేపమ్.'

జామిః - (౪౬).

> "ఆ ఘా తా గచ్ఛానుత్తరా యుగాని యత్ర జామయః కృణ్వన్నజామి. ఉపబర్బృహివృషభాయ బాహుమన్య మిచ్ఛస్వ సుభగే పతిం మత్" (ఋ. ౧౦-౧౦-౧౦)
>
> ఆగమిష్యన్తి తాన్యుత్తరాణి యుగాని. యత్ర జామయః కరిష్యన్త్యజామికర్మాణి జామ్యతిరేకనామ బాలిశస్య వా. అసమానజాతీయస్య వోపజనః. ఉపధేహి వృషభాయ బాహుమ్. అన్యమిచ్ఛస్వ సుభగే పతిం మదితి వ్యాఖ్యాతమ్.

జామిః భగినీ ఆఘాతా మత్ ఇతి. ఇయం యమీ కృతయుగే యమం ప్రార్థయాంచకార. ఏహి మైథునాయ సంగచ్ఛావ ఇతి. తా మకామయమానోఽ సావనయుక్త్యా ప్రత్యువాచ. ఆ ఘాతా గచ్ఛాన్ 'ఘా' ఇత్యనర్థక ఏవ ఆగచ్ఛాన్ ఆగమిష్యన్తీత్యర్థః. తా తాని ఉత్తరాణి యుగాని యత్ర యేషు జామయః భగిన్యః భ్రాతౄణామ్ అజామి- యోగ్యాని - మైథున - సంబం

భాని కర్మాణి కరిష్యన్తి కలియుగాన్తే. న హ్యయం కలియుగే వర్తత ఇత్యభిప్రాయః. అతో బ్రవీమి ఉపబర్బృహి ఉపధేహి వృషభాయ రేతో వర్షయిత్రే బాహుం పాణిమ్ అన్యమిచ్ఛస్వ అన్యమన్వేషయ. హే సుభగే పతిం మత్ మత్తః ఇత్యర్థః. నాహం తవ పతిర్ భూత్వా భవితుం శక్నోమీతి భావః.

మంత్రార్థము :- ఘా ఇది నిపాతకః, తా = అవి, ఉత్తరాయుగాని = రాబోవు యుగములు, ఆగచ్ఛాన్ = వచ్చును, యత్ర = ఏ సమయము లందు, జామయః = తోబుట్టువులు, అజామికర్మాణి = సోదరునితో చేయ దగని మైథునము మున్నగుకర్మలను, కృణ్వాన్ = చేయుదురు, కాని ఇప్పు డాయుగముకాదు, కావున నో సోదరీమణులార! వృషభాయ = నీయందు రేతస్సునుంచుటకు, అన్యయువకుని కొఱకు, బాహుమ్ = బాహువును, ఉపబర్బృహి = ధారణచేయుము మఱియొక యువకుని మెడలో నీబాహు వుల నుంచుము, హే సుభగే! = ఓ సౌభాగ్యవతి!, మత్ అన్యమ్ = నాకంటె భిన్నుడగు మఱియొకనిని, పతిమిచ్ఛస్వ = పతిగా వరింపుము, జామి అతిరేకనామ. జామి పునరుక్తమునకు పేరు. బాలిశస్యవా = తెక, మూర్ఖు నకు పేరు అసమానజాతీయస్య వా = ఉపజనః = తేక అసమానజాతీయము నకు నామము. సోదరునకు సోదరి స్త్రీయగుటచే అసమానజాతీయ విజాతీయ యగును. కొందఱు సమానజాతీయ యనియు వచ్ఛేదముచేసి యున్నారు. వారిమతమున సోదరి సజ్ఞాతి = బంధువు అగును.

పితా - (౪౮).

"ద్యౌర్మే పితా జనితా నాభిరత్ర బంధుర్మే మాతా పృథివీ మహీయమ్. ఉత్తానయో శ్చమ్వో ర్యోని రన్తరత్రా పితా దుహితుర్గర్భ మాధాత్" (ఋ. ౧-౧౬౪-౩౩)

ద్యౌర్మే పితా పాతా పాలయితావా జనయితా, నాభిరత్ర బంధుర్మే మ తా పృథివీ మహతీయమ్. బంధుః సంబంధ నాత్. నాభిః సన్నహనాత్ నాభ్యా సన్నద్ధా గర్భా జాయన్త ఇత్యాహుః ఏతస్మాదేవ జ్ఞాతీన్ సనాభయ ఇత్యాచక్షతే స బంధవ ఇతి చ. జ్ఞాతిః సంజ్ఞానాత్ ఉత్తానయో

శ్చమ్వోऽర్యోని రంతః - ఉత్తానః ఉత్తతానః ఊర్ధ్వతానో వా. తత్ర పితా దుహితుర్ గర్భం దధాతి పర్జన్యః పృథివ్యాః.

పితా ఇతి పితృవచనగతమ్. పాతా వా పాలయితా వా ఇత్యుపగమః "ద్యౌర్మే పితా" ఇతి వ్యక్తమస్య అర్థమ్. అయం ద్యౌః ఏషా ఏవ మమ పితా. జనితా జనయితా ఉత్పాదయితేత్యర్థః. నహనమేవ నాభిః బంధుః మాతా పృథివీ మహీయమ్ ఇతి - సర్వభూతానాం ద్యావాపృథివ్యౌ మాతాపితరౌ ఉచ్యేతే తత్ర తత్ర.

మంత్రార్థము :— ద్యౌః = ద్యులోకము, మే=నాయొక్క, జనితా= ఉత్పాదకుడు, పితా = పిత - పాలకుడు, (ద్యులోకము వర్షింపచేయును. ఆవర్షమువలన అన్నము, దానివలనవీర్యము, వీర్యమువలన పురుషుడు నేర్పడును. కావున ద్యులోకమే వీర్యసేచకుడై పితా - పాలయితా అగుచున్నాడని భావము) ఇయం మహీ పృథివీ = ఈ విశాల, విస్తృతపృథివి అన్నము నొసంగి బంధువై నాకు మాత తల్లి యగుచున్నది. తల్లియొక్క నాభితో సంబద్ధమై రస - హరినాడి=గర్భస్థనాడితో సంబద్ధమై యుండును. ఆరసహరినాడితో శిశువు పోషింపబడును. అట్లే పృథివినుండి లభించు అన్నాదులమూలమున ప్రాణి = మనుజుడు జీవనధారణచేయును, ఉత్తానయోః చమ్వోః = పైకి వ్యాపించియున్న ద్యుపృథివీలోకముల, అంతః యోనిః = మధ్యప్రదేశము - అంతరాళమునందు, పితా = పర్జన్యుడు లేక ద్యులోకము, దుహితుః = రసములను పిండు పృథివీలోకముపై గర్భం = జలమును, ఆధాత=ధారణముచేయును. పితా పాతా వా పాలయితా వా = రక్షకుడు పాలకుడునగును, జనితా - జనయితా = ఉత్పాదకుడగును, బంధుః = సంబంధనాత్ = అంగసంబంధమువలన, పిత = బంధువగును, బంధనార్థక 'నహ' ధాతువుచే నాభిసిద్ధమగును. నాభ్యా సంబద్ధాః గర్భాః జాయంతే = మాతృనాభితో రసహరనాడితో సంబద్ధమై గర్భమేర్పడును, జ్ఞాతిః సంజ్ఞానాత్ = బాగుగ తెలియబడినవారు జ్ఞాతులనబడుదురు, దుహితుః = రసములను పిండునట్టి పృథివియందు, పితా = రక్షకుడైన పర్జన్యుడు, గర్భందధాతి = గర్భధారణచేయును.

శంయోః - (౪౮).

> శంయుః - సుఖంయుః "అథా నః శం యో రరపో దధాత" (ఋ. ౧౦-౧౫-౪) రపో రిప్రమితి పాపనామనీ భవతః శమనం చ రోగాణాం యావనం చ భయానామ్. అథాపి శంయుర్ బార్హస్పత్య ఉచ్యతే.
>
> "తచ్ఛంయో రావృణీమహే గాతుం యజ్ఞాయ గాతుం యజ్ఞపతయే" ఇత్యపి నిగమో భవతి. గమనం యజ్ఞాయ యజ్ఞపతయే,

శంయోః ఇతి ఏతదనవగతమ్. పంచమ్యన్తం వా షష్ఠ్యన్తం వా సత్. నిగమస్త్వేషః "అథా నః శంయోరరపో దధాత" కస్య శమనం? కస్య వా యావనమ్? ఇతి పర్యనుయోగే ప్రాప్తే రోగాణాం భయానాం చ ఇత్యధ్యాజహార భాష్యకారః. రోగశమనం చ దధాత భయయావనం చ శాంతరోగా యథా స్యామ - ప్రహీణ సర్వభయాశ్చ తథా కురుతేత్యభిప్రాయః యదపి చాన్యత్ కించిత్ - అరపః అపాపం తదపి దధాత దత్తేత్యర్థః. బార్హస్పత్యో బృహస్పతేః పుత్ర ఉచ్యతే. "తచ్ఛంయో రావృణీమ హే గాతుం యజ్ఞాయ గాతుం యజ్ఞపతయే" ఇతి శంయో రేవ బృహస్పతి పుత్రస్యార్షమ్. శంయోః సకాశాత్ ఇతి అభిముఖ్యే వృణీమహే కిమ్? గాతుం గమనం యజ్ఞాయ యజ్ఞపతయే చ.

శమ్, యోః = అనునివి రెండుపదములు, శమ్ = రోగశమనము, యోః = భయమును దూరమొనర్చుట, అథ = మఱియు, నః = మా రోగశమనము - భయాపనయనము, రపః = నిష్పాపత్వము అనువానిని, దధాత = ధారణచేయుము, రపః రిప్రమ్ = ఈరెండును పాపనామములు, శంయోః = రోగశమనము, భయాపహరణము, అథాపి=అథవా, శంయుః= బార్హస్పత్యః = బృహస్పతిపుత్రుడు శంయువు, శంయు నామక తన యంతరాత్మయొక్క ప్రయోజనము కొఱకు, గాతుం యజ్ఞాయ, యజ్ఞ

మునకు గమనము కొఱకు, గాతుం యజ్ఞపతయే = యజ్ఞపతియొక్క ఆగమనము కొఱకును, ఆవృణీమహే = ప్రార్థించుచున్నామని చెప్పుచున్నాడు.

ఇతి తృతీయః పాదః

తృతీయ పాదము సమాప్తము

## నాల్గవ పాదము

అదితిః - (౪౯).

అదితి రదీనా దేవమాతా.

అదితిః ఇతి - ఏతదనవగతమ్. అదీనా ఇత్యుపగమః. దేవమాతాభిధేయా ఐతిహాసికపక్షేణ. అదితిః కశ్యపస్య మహర్షేః ధర్మపత్నీ ఆదిత్యాది దేవానాం జననీ చ.

అర్థము :- అదితిః=దైన్యరహితయైన దేవమాత అని ఐతిహాసికులు చెప్పు అర్థము. నైరుక్తకాపులు మాత్రము - అదితిర్ద్యౌః అదితి యను ద్యులోకము మున్నగు క్రిందిమంత్రమున చెప్పిన యర్థములు అదితి పద వ్యవహృతము లందురు.

“అదితి ర్ద్యౌరదితి రంతరిక్ష మదితిర్మాతా స పితా స పుత్రః. విశ్వే దేవాః అదితిః పంచజనా అదితి ర్జాత మదితి ర్జనిత్వమ్” (ఋ. ౧-౮౯-౧౦)

ఇత్యదితే ర్విభూతి మాచష్టే. ఏతాన్యదీనానీతి వా.

"అదితిర్ద్యౌః" గౌతమస్యేయ మార్షమ్. అదితిః ఏవ ద్యౌః అదితి రేవ చాంతరిక్షమ్ అదితిః ఏవ మాతా సర్వభూత నిర్మాత్రీ స ఏవ పితా - పాలకః. స ఏవ హి పుత్రః. యేఽపి చైతే విశ్వేదేవాః సర్వే దేవా ఏతేఽపి అదితిరేవ. పంచజనాః గంధర్వాదయః అదితిరేవ. కింబహునా యావదేతత్ కించిత్ జాతం చ జనిత్వం చ జనిష్యమాణం చ సర్వమప్యేతత్ అదితి రేవ. ఏవ మనేన మంత్రేణ మంత్రదృక్ అదితేర్విభూతి మాచష్టే. నైరుక్త పక్షేణ ఏతాని ద్యు-లోకాదీని సర్వాణి అదీనాని అనుపక్షీణాని ఇతి యోజ్యమ్. న హ్యేషాం క్షయోఽస్తీతి.

అర్థము :— అదితిః ద్యౌః = అదితి - దేవమాతయే ద్యులోకము. అదితియే అంతరిక్షము - అదితి సర్వభూతములకు మాత, పితయు, అదితియే పుత్రుడు, పంచజనులు, భూతము, భవిష్యత్తు, అంతయు అదితియే. ఈ మంత్రమున అదితిమహిమ గానముచేయబడినది. ఏతాని సర్వాణి అదీనాని = ఇవియన్నియు అదీనములే.

'ఏరిరే' - (౫౦).

"య మేరిరే భృగవః" (ఋ. ౧-౧౪౩-౪) ఏరిర ఇతీర్తిరుప సృష్టోఽభ్యస్తః.

ఏరిరే ఇతి ఏతదనవగతమ్. ఆ ఈరిరే ఇత్యవగమః. "యమేరిరే" ఇతి దీర్ఘతమస ఆర్షమ్. యమగ్ని మాభిముఖ్యేన ఈరితవంతః - ప్రేరితవంతః, స్థాపితవన్తః భృగవః భృగువంశీయా ఋషయః.

అర్థము :- 'ఏరిరే'పదము ఆజ్పూర్వక, గత్యర్థక, 'ఈర'ధాతువు యొక్క లిట్‌లకారరూపము. యమ్ = ఏ సర్వజ్ఞుడగు పరమేశ్వరుని, భృగవః = భృగువుమున్నగు తపోవంతులగు ఋషులు, ఏరిరే = అభిలషిత ప్రయోజనసిద్ధికొఱకు ప్రార్థించుచున్నారు - ప్రేరణచేయుచున్నారు.

జసురిః - (౫౧).

"ఉత స్మైనం వస్త్రమథ్రిం న తాయు మనుక్రోశన్తి క్షితయో భరేషు. నీచాయమానం జసురిం న శ్యేనం శ్రవశ్చాచ్ఛా పశుమచ్చ యూథమ్" (ఋ. ౪-౩౮-౫)

అపి స్మైనం వస్త్రమథిమివ వస్త్రమాథినమ్ వస్త్రం వస్తేః తాయురితి స్తేననామ. సంస్త్యానమస్మిన్ పాపకమితి నైరుక్తాః. తస్యతే ర్వా స్యాత్. అనుక్రోశన్తి క్షితయః సంగ్రామేషు. భర ఇతి సంగ్రామనామ. భరతేర్వా హరతేర్వా. నీచాయమానం నీచై రయమానమ్. నీచై ర్నినితం భవతి. ఉచ్చై రుచ్ఛ్రితం భవతి. జస్తమివ శ్యేనమ్. శ్యేనః శంసనీయం గచ్ఛతి శ్రవశ్చాచ్ఛా పశుమచ్చ యూథమ్. శ్రవ

శ్చాపి పశుమచ్చ యూథమ్, ప్రశంసాం చ యూథం చ ధనం చ యూథంచేతి వా యూథం యౌతేః సమాయుతం భవతి.

జసురిః ఇతి వితపనవగతమ్. వస్త్రమ్ ఇత్యవగమః "ఉతస్మైనం" ఇతి నిగమః. వామదేవ స్యార్షమ్. త్రిష్టుప్. ఉతస్మైనమ్ అప్యేనమింద్రమ్ అనుక్రోశన్తి ఆహ్వయన్తి. క్షితయః మనుష్యాః భరేషు సంగ్రామేషు వస్త్ర మథిం న వస్త్రాపహర్తారమివ తాయుమ్ చోరమ్ నీచాయమానమ్ నీచైర్గచ్ఛన్తం జసురిం న జసురిమివ శ్యేనం వాజపక్షిణమ్ వస్త్రమ్ బద్ధమ్. శ్రవశ్చ అచ్ఛా కీర్తిం చాభిసంధాయ కథం నామ ? ప్రశస్యేమహి జితమేభి రిత్యేతమర్థ మభిసంధాయ. పశుమచ్చ యూథమ్ అనేక పశుజాతిసంయుక్తం పశుయూథ మభిసంధాయ. వస్త్రేః ఆచ్ఛాదనార్థస్య వస్యతే ర్వా స్యాత్ క్షయార్థస్య. భరతేర్వా భ్రియన్తే తస్మిన్ యోద్ధారః. హరతేర్వా హ్రియన్తే హి తస్మిన్ జీవితాని వసూని చ. ఏవ మిహ నీచాయమానం శ్యేనమిత్యనేన సంబంధా జ్జసురి ర్బద్ధ ఇత్యుపపద్యతే.

మంత్రార్థము :— ఉత = మఱియు, స్మ = ఇది పదపూరణార్థము, ఏనమ్ = ఈ యింద్రుని, భరేషు = యుద్ధములందు, క్షితయః = మనుష్యులు, అనుక్రోశన్తి = కేకలు పెట్టి పిలుతురు. 'మమ్ము రక్షింపుము' అని జసురిం శ్యేనం న = బంధనరహితడేగను వలె, నీచాయమానమ్ = క్రింద నడచు, వస్త్రమథిం తాయుం న = వస్త్రములను దొంగిలించుచోరునివలె, అనగా వస్త్రముల దొంగనుచూచి యెట్లు కేకలు పెట్టుదురో యట్లే యుద్ధము లందు జనులు స్వరక్షార్థము పరమేశ్వరుని కేకలతో నాహ్వానింతురు. ఏలయన :- అచ్ఛాశ్రవః చ = ఉత్తమమైన నీయశస్సును వినుచుంటిమి, పశుమత్ చ యూథమ్ = పశుసమూహము లభించుగాక ! అని యెంచి ఇంద్రుని ఆహ్వానింతురు. వస్త్రమ్ వస్తేః = 'వసు' అచ్ఛాదనే ధాతువుతో వస్త్రము సిద్ధించును. తాయురితి స్తేననామ = తాయువు చోరుని పేరు, అస్మిన్=ఇతనియందు, పాపకం పాపసంస్త్యానం=పాపసమూహముండును. అందువలన నతడు, స్తేనః = దొంగయనబడును. తస్యతేర్వా స్యాత్. ఉపక్షయార్థక 'తసు' ధాతువుచే తాయుశబ్దమేర్పడును. చోరుడు అధార్మికు డగుటవలన నెల్లపుడు క్షీణించుచుండును. భర ఇతి = సంగ్రామమునకు

వాచకము, భరతే ర్వా హరతే ర్వా యుద్ధమునందు లాభము, హరణము వస్తుప్రాప్తి వస్తుహరణము రెండు జరుగును. అందువలన యుద్ధమునకు భరమనినామము. నీచైః నిచితం భవతి=పేలియున క్రింద పేర్చితమగును, ఉచ్చై రుచ్ఛ్రితమ్ = పైకి పేర్చబడియుండును, శ్యేనః ప్రశంసనీయం గచ్ఛతి = వేగగతి ఉద్ధయనము ప్రశస్తమగుటచే నది శ్యేనమనబడును. శ్రవశ్చాపి పశుమచ్చ యూథం ప్రశంసాం చ యూథం చ = ప్రశంసను, యూథము పొందవలెను. ధనం చ యూథంచేతి శ్రవః=శ్రవమన ధనము. ధనమును - సమూహమును, యూథం యౌతేః సమాయుతం భవతి. 'యు' మిశ్రణామిశ్రణయోః = ధాతువువలన యూథ శబ్దమేర్పడును. స్త్రీ బాల పురుష లెల్లరు మిశ్రీభూతులగుదురు, అందువలన యూథ శబ్దవాచ్యు లగుదురు.

జరతే - (౧౨).

“ఇంధాన ఏనం జరతే స్వాధీః”(ఋ. ౧౦-౪౫-౧) గృణాతి.

జరతే ఇతి - ఏతదనవగతమ్ “ఇంధాన ఏనం జరతే స్వాధీః” స్వాధీః శోభనధీః ఇంధానః అజస్రం నిత్యం జరతే స్తౌతి. జరతిః స్తుతికర్మా. 'గృ' స్తుతౌ, గృణాతి.

అర్థము :- జరతే = గృణాతి, ఉపదిశతి = ఉపదేశించును - లేక, స్తౌతి = స్తుతించును - ఎట్లన స్వాధీః = సుబుద్ధికలవాడు, ఏనం = ఈ పరమేశ్వరుని, ఇంధానః = తన హృదయమున ప్రదీప్తుని జేయుచు, భక్తితో హృదయమున ధరించును. జరతే = స్తుతించును. జనులలో ఈశ్వరుని భక్తి నుపదేశించును.

'మందినే' - (౧౩).

మందీ మందతేః స్తుతికర్మణః “ప్రమందినే పితుమదర్చతా వచః” (ఋ. ౧-౧౦౧-౧) ప్రార్చత మందినే పితుమద్వచః.

మందినే ఇతి - ఏతదనవగతమ్. మందతేః స్తుతికర్మణః. మంద నీయః స్తుతిమాన్ వేత్యర్థప్రతీతిః. “ప్రమందినే పితుమదర్చతా వచః” ఇతి కుత్సస్యేయ మార్షమ్. హే స్తోతారః ప్రార్చత పూజయత - మందినే

మదనీయాయ స్తుత్యాయ ఇంద్రాయ పితుమత్ అన్నసంయుక్తం వచః వచనమ్.

అర్థము :– స్తుత్యర్థక 'మది'ధాతువుతో మందినే శబ్దమేర్పడును. మందినే=స్తుతియోగ్యుడగు నింద్రునికొఱకు, పితుమత్=అన్నసంయుక్త వచనమును, ప్రార్చత = బాగుగ నుచ్చరింపవలయును.

'గోః' - (౫౪).

> గౌర్ వ్యాఖ్యాతః "అత్రాహ గోరమన్వత నామ త్వష్టురపీచ్యమ్ ఇత్థా చంద్రమసో గృహే" (ఋ. ౧-౮౪-౧౫) అత్ర హ గోః సమమంసతాదిత్య - రశ్మయః స్వం నామ. అపీచ్య మపచితమ్ అపగతమ్ అపి హితమ్. అన్తర్హితం వా. అముత్ర చంద్రమసో గృహే.

గోశబ్దస్య రహస్యగతస్యాయ మర్థః. అత్రాహ అత్రైవ ఏతస్మిన్ చంద్రమండలే గోః సుషుమ్నస్యైకస్య సూర్యరశ్మేః ఇతరే సూర్యరశ్మయః అమన్వతత ఆమన్యన్త ఇత్యర్థః. కిమ్? నామ నమనం ప్రహ్వత్వ ముపస్థాన మిత్యర్థః. అపీచ్య మపగతమ్ చంద్రమండలే అంతర్హితమ్. ఇత్థా చంద్రమసో గృహే అముష్మిం శ్చంద్రమండలే ఇత్యర్థః.

అర్థము :- గో పదమునకు వ్యాఖ్య పూర్వముచేయబడినది. అత్ర చంద్రమసో గృహే = చంద్రమండలమునందు, ఇత్థా=ఈ త్వష్టుః=సూర్య మండలమునుండి, అపీచ్య = బయటికివెళ్లియున్న, గోః = సుషుమ్నా నామకసూర్యరశ్మియొక్క అవస్థానమును, (ప్రహ్వభావము) ఇతర సూర్య కిరణములు, అమన్వత = అంగీకరించెను. అపీచ్యయొక్క నిరుక్తి అర్థము అపచితమ్ = వేఱుచేసియుంచియున్న, అపగతమ్ = వెడలిపోయియున్న, అపహితమ్ = వేఱైధారణచేయబడియున్న, అంతర్హితమ్ = లోపలయుంచ బడియున్నది. అనగా సూర్యమండలములోని ఇతరకిరణములు సుషుమ్నా నామకిరణమును చంద్రమండలమున చేరి దానిని ప్రకాశింపజేయుట కంగీకరించినవని భావము. సుషుమ్నానామకకిరణమునకు గోవు అని నామము.

గాతుః - (౫౫).

**గాతు ర్వ్యాఖ్యాతః. "గాతుం కృణవన్నుషసో జనాయ" (ఋ. ౪-౫౧-౧) ఇత్యపి నిగమో భవతి.**

గాతుః ఇతి వ్యాఖ్యాతః గమనం యుజ్ఞపతయే ఇత్యర్థః.

అర్థము :- గాతు అనుపదమునకు వ్యాఖ్యానము పూర్వమే చేయ బడినది.

మంత్రార్థము :- ఉషసః = ఈ ఉషస్సులు, జనాయ=మనుష్యుల కొఱకు, గాతుం కృణ్వన్ = గమనము చేయుచున్నవి.

దంసయః - (౫౬).

**దంసయః కర్మాణి. దంసయన్తి ఏనాని. "కుత్సాయ మన్మన్నహ్యశ్చ దంసయ" (ఋ. ౧౦-౧౩౮-౧) ఇత్యపి నిగమో భవతి.**

దంసయ ఇతి. ఏతదనేకేషాం కర్మణామభిధానమ్. "కుత్సాయ మన్మన్నహ్యశ్చ దంసయః" ఇతి. మన్మన్ మన్యమానాః కుత్సాయ పృథివీం కృషతే కృషీవలాయ దంసయః కృషికర్మాణి సఫలాని కర్తుమ్.

అర్థము :- దంసయః = కృషికర్మలు, ఏనాని = ఈ కర్మలను, దంసయన్తే = భృత్యులు సమాప్తముచేయుదురు, అందువలన నొకరులు దంసయు అనబడుదురు. ఉపక్షయార్థక 'దసి'ధాతువుచే దంసిపద మేర్పడును.

మంత్రార్థము :- అహ్యః = మేఘమునందుండు, అపః = జలము, కుత్సాయ = కృషీవలుని కొఱకు, దంసయః = కర్మలను సఫలముచేయు టకు, మన్మన్ = అంగీకరించుచు పృథివికివచ్చును.

'తూతావ' - (౫౭).

**"న తూతావ నైన మశ్నో త్యంహతిః" (ఋ. ౧-౯౪-౨) "న తుతావ నైనమంహతి రశ్నోతి. అంహతిశ్చాం హశ్చాం హూశ్చ హన్తేః నిరూఢోపధాత్ విపరీతాత్.**

రూతావ ఇతి. ఏతదనవగతమ్. ఋతావ ఇత్యుపగమః. 'స రూతావ' ఇతి హే భగవన్ అగ్నే! స ఏవ రూతావ వర్ధతే ప్రజాధన యశోభిః - న చ ఏనం అంహతిరపి పాపమపి అశ్నోతి ఆప్నోతి యస్మై త్వం ప్రసీదసి.

అర్థము :- సః = ఆ మనుష్యుడు - సంతానము, ధనము, యశస్సు ననువానితో దినరాత్రులు వృద్ధిపొందును, ఏనమ్ = ఇతనిని, అంహతిః= పాపముకూడ, న అశ్నోతి = ప్రాప్తింపదు, అంహతి, అంహస్, అంహు అను నీమూడును సమానార్థకములు. నిరూఢోపదాత్ విపరీతాత్ - హన్తేః = హనధాతువునకు ఉపధయైన 'అన్'ను తొలగించి విపరీతముచేసిన, 'అన్హ' అని యిట్లు మార్చిన అంహతి మున్నగు శబ్దము లేర్పడును.

'చయసే' - (౫౮).

> "బృహస్పతే చయసే ఇత్పియారుమ్" (ఋ. ౧-౧౯౦-౫) బృహస్పతే యచ్చాతయసి దేవపీయుమ్ పీయతిర్ హింసా కర్మా.

చయసే ఇతి ఏతదనవగతమ్. చాతయసి ఇత్యర్థప్రతీతిః. హే బృహస్పతే త్వం తం శత్రుం చయసే చాతయసి నాశయసి. యో హి దుష్కృతిః దేవ పియారు ర్దేవానాం ద్వేషకర్తా.

మంత్రార్థము :- హే బృహస్పతే, పియారుం = దేవహింసకుని, చయసే = చాతయసి = నశింపచేయుదువు.

వియుతే - (౫౯).

> వియుతే ద్యావా పృథివ్యౌ వియవనాత్. "సమాన్యా వియుతే దూరే అన్తే" (ఋ. ౩-౫౪-౭) సమానం సంమానమాత్రం భవతి. మాత్రా మానాత్. దూరం వ్యాఖ్యాతమ్ - అన్తో అతతేః.

వియుతే ఇత్యేతదేకమేవ. ద్యావాపృథివ్యోరభిధానమ్. వియవనాత్ ఇతి నిర్వచనమ్. ఋగాదిరే మిశ్రణార్థః, "సామాన్యా వియుతే దూరే అన్తే" విశ్వామిత్రస్యేయం మార్షమ్. సామాన్యౌ ద్యావాపృథివ్యౌ సమానపరిమాణౌ వియుతే చ విమిశ్రీభూతే దూరే అన్తే చ.

అర్థము :— వియవనాత్ = విమిశ్రీభావము వలన - వేఱగుటవలన, ద్యావాపృథివ్యౌ = ద్యులోకము, పృథివీలోకము, వియుతే = వేఱువేఱుగా నున్నవి.

మంత్రార్థము :— సామాన్యా పరిమాణతః = పరిమాణమున సమా నములయ్యు వేఱువేఱుగా నున్నవి, దూరే అన్తే = దూరమునను సమీప మునను ద్యుపృథివీలోకములు రెండును వేఱే. కొండొకడు దూరసమీపము లకు (దూరే అన్తే) ద్యావాపృథివీ అనునవి రెండింటికి నామమనెను. అతని మతమున ద్యులోకము దూరమని, పృథివీలోకము నికటము - దగ్గఱ - అనియు నర్థమగును. సమాస శబ్దనిరుక్తి = సమ్మానమాత్రమ్ = పరిమాణమాత్రమే, మాత్రామానాత్=మానము=కొలత, మానాత్ = కొలత వలన అన్నిటికంటె చిన్న అవయవము మాత్రయగును దూరశబ్దమునకు వ్యాఖ్యపూర్వమే చేయబడినది,అన్తః అతతేః - 'అత'సాతత్యగమనే ధాతువు వలన అన్తశబ్దమేర్పడును, అన్త = సమీపవస్తువు ప్రాప్తమైయుండును.

ఋధక్ - (౬౦).

ఋధగితి పృథగ్భావస్య ప్రవచనం భవతి. అథాప్యృధ్నో త్యర్థే దృశ్యతే.

"ఋధగయా ఋధగుతాశమిష్ఠాః" (య. ౮-౨౦)ఋధ్ను వన్నయాక్షీః ఋధ్నువన్నశమిష్ఠా ఇతి చ.

ఋధక్ ఇతి అనేకార్థమ్. ఋధక్ ఇతి పృథగ్భావస్య ప్రవచనం భవతి. యదిన్ద్ర దివి పార్యే యదృధక్ భారద్వాజస్యేయ మార్షమ్. హే ఇంద్ర ! యత్ యది త్వమ్ దివి ద్యులోకే పార్యే పారణీయే స్థానేఽవస్థితః పృథగివ ఇత్యర్థః. కదాచిత్ ఋధ్నోత్యర్థే అపి దృశ్యతే - "ఋధగయా - ఋధగుతాశమిష్ఠాః" ఇత్యస్మిన్ మంత్రే హే భగవన్ అగ్నే ! యత్ అస్మాభిః అల్పమపి హుతం హవిః ఋధక్ ఏవ త్వమయాః ఋద్ధమేవ దేవతాతృప్తి సమర్థం యాగమకార్షీ రిత్యర్థః. కించ ఋధగుతాశమిష్ఠాః యదపి కించి ద్విగుణమ్ అకార్ష్మ వయమేతస్మిన్ యజ్ఞే తదపి పాపమస్య యజ్ఞస్య అశమిష్ఠాః స్విష్టకృద్రూపేణ శమితవానసి.

అర్థము :- ఋధక్ ఇతి, ఋధక్ పదము, పృథక్ భావస్య = పృథక్త్వమునకు, ప్రవచనం భవతి = వాచకమగును, అథాపి=మఱియు, ఋధ్నోత్యర్థే సమృద్ధి అనునర్థమునందును, దృశ్యతే = కనబడుచున్నది.

మంత్రార్థము :- ఋధక్ = ఋద్ధమె దేవతలను తృప్తిపఱచుటలో సమర్థమే, అయాః = నీవు యజ్ఞముచేసితివి. నీవుచేసినది కొంచెమైనను మేము దానిని అధికముగానెంచి గ్రహించితిమి, ఉత=మఱియు, ఋధక్= ఋద్ధియుక్తమనియే యెంచి నీవు మాపాపములనన్నింటిని శమింపజేసితివి. యజ్ఞమున నేను లోపముచేసినను దానిని నీవు త్రుటిరహితముగానె స్వీకరించితివి. యజ్ఞమున త్రుటిజన్యపాపమును యజ్ఞవైగుణ్యమును శాంతము చేసితివి.

"అస్యాః అస్య ఇతి ద్విషష్టిః పదాని" (౬౧-౬౨)

అస్యా ఇతి చాస్యేతి చోదాత్తం ప్రథమాదేశే. అనుదాత్త మన్వాదేశే. తీవ్రార్థతరముదాత్తమ్. అల్పీయోఽర్థతర మనుదాత్తమ్. "అస్యా ఊ షు ణ ఉపసాతయే భువోఽహేళమానో రరివాఁ అజాశ్వ" (ఋ ౧-౧౩౮-౪) అవస్యతా మజాశ్వ. అస్మై నః సాతయ ఉపభవ. అహేళమానోఽక్రుధ్యన్ రరివాన్ రాతిరభ్యస్తః. అజాశ్వేతి పూషణమాహ. అజాశ్వా అజాఅజననాః అథానుదాత్తమ్. "దీర్ఘాయు రస్యా యః పతి ర్జీవాతి శరదః శతమ్" (ఋ. ౧౦-౮౫-౩౯) దీర్ఘాయు రస్యా యః పతిః జీవతు స శరదః శతమ్. శరచ్ఛృతా అస్యా మోషధయో భవన్తి శీర్ణా ఆప ఇతి వా.

అస్యాః ఇతి అస్య ఇతి చ పదద్వయం స్త్రీపుంసవిషయమ్. ఉదాత్తం ప్రథమాదేశే. ప్రథమ ఇతి ముఖ్యనామ. ముఖ్యశ్చ ప్రధానముచ్యతే. అనుదాత్తమన్వాదేశే ప్రధానమర్థమనుయో వర్తతే గుణభావేన. లోకేఽపి హి తీవ్రార్థతరముదాత్తమ్ తద్యథా ఉదాత్తమేతత్ కులమితి. అల్పీయోఽర్థతర మనుదాత్తమ్. అప్రధానమిత్యర్థః. ఉదాహరణైరేవానయో ర్విభాగం దర్శయతి. "అస్యా ఊ షు ణః" పదచ్ఛేదస్యార్థమ్. అస్యాః అస్యై సాతయే

లబ్ధయే. హే పూషన్ అస్మాకమ్ ఉపసమీపే భువః భవ. కథమ్? అహేడమానః అక్రుధ్యన్ సర్వైర్హ్యభ్యర్థ్యమానః క్రుధ్యతి ఇత్యభిప్రాయః రరివాన్ దానవాన్ అజాశ్వ భాగాశ్చ శ్రవస్యతామ్ అస్మాకం ధనమిచ్ఛతామ్. "దీర్ఘాయురస్యా" ఇతి. యోఽస్యాః దత్తాయాః పతిః స దీర్ఘాయురస్త్వితి. జీవతు సశరదః శతమ్ ఇతి. ఏతస్మిన్ మంత్రే భర్తృకన్యా సంయోగే సతి భర్త్రైవ ప్రధానమ్. తస్మాత్ అస్యా ఇతి ఏతదనుదాత్తమ్. శృతాః పక్వాః, శీర్ణా ఆప ఇతి వా. వర్షాసు హి ప్రవృద్ధాని స్రోతాంసి శరది విశీర్య భిద్యన్తే.

అర్థము :— అస్యాః = ఇది స్త్రీలింగవిషయకము. అస్య = ఇది పుంవిషయకము. ఈ రెండుపదములు స్వరకృతవిశేషతవలన నొకయెడ ప్రధానము ముఖ్యము, మఱియొకయెడ గౌణము - అముఖ్యములు అగుచుండును, ఉదాత్తం ప్రథమాదేశే=ప్రధానతను చెప్పుచు నీపదద్వయము ఉదాత్తములగును, అన్వాదేశే అనుదాత్తమ్=గౌణము అప్రధానమును తెలుపుచు అనుదాత్తములగును, తీవ్రార్థతరమ్ = ఉత్కృష్టగుణయుక్తమైయది ఉదాత్తమనబడును, అల్పీయోఽర్థతరమ్ అనుదాత్తమ్ = హీనగుణయుక్తమును అనుదాత్తమందురు.

మంత్రార్థము :— హే అజాశ్వ = గమనశీల - అశ్వములుగల, ఓ పూషన్, నః = మాయొక్క, అస్యాః సాతయే అస్యై సాతయే = ఈ యుపలబ్ధికొఱకు, ఉపభవ = సమీపవర్తుడవగుము, అహేడమానః అక్రుధ్యన్ = క్రుద్ధుడవుకాక, (యాచ్యమానః సర్వః క్రుధ్యతీత్యర్థః) రరివాన్ = దానమిచ్చుచు, అవస్యతామ్ = ధనాభిలాషులమగు మాకు, అజాశ్వ భాగాకృతి = అశ్వములుగల పూషన్!, ఉ - ను ఈ రెండుపదములు పదపూరకములు, రాతిః అభ్యస్తః రరివాన్ = 'రా'దానే క్వసు అయినమీదట ద్విత్వమయినది ఇపుడు అనుదాత్తమున కుదాహరణము నిచ్చుచున్నాము, అస్యాః = ఈ స్త్రీయొక్క, యః పతిః = ఎవడు భర్తయో యతడు, దీర్ఘాయుః = దీర్ఘాయుష్షుగలవాడు, శరదః శతం = నూఱుసంవత్సరములు, జీవాతి = జీవించును, శరత్ - నిరుక్తి - అస్యామ్ = ఈశరత్తునందు, ఓషధయః = ఓషధులు, శృతాః = పక్వములగును, శీర్ణా ఆప ఇతి వా = లేక ఈ శరదృతువునందు, జలము తగ్గిపోవును.

అస్య :—

అస్యేతి అస్యా ఇత్యేతేన వ్యాఖ్యాతమ్. "అస్య వామస్య పలితస్య హోతు స్తస్య భ్రాతా మధ్యమో అస్త్యశ్నః. తృతీయో భ్రాతా ఘృతపృష్ఠో అస్యాత్రాపశ్యం విశ్పతిం సప్త పుత్రమ్" (ఋ. ౧-౧౬౪-౧)

అస్య వామస్య వననీయస్య పలితస్య పాలయితుః. హోతుర్ హ్వాతస్య. తస్య భ్రాతా మధ్యమోఽ స్త్యశనః. భ్రాతా భరతేర్ హరతి కర్మణః. హరతే భాగం భర్తవ్యో భవతీతివా. తృతీయో భ్రాతా ఘృతపృష్ఠోఽస్యాయ మగ్నిః. తత్రాపశ్యం సర్వస్య పాతారం పాలయితారం వా. విశ్పతిం సప్తపుత్రం సప్తమపుత్రం సర్పణ పుత్రమితి వా. సప్త సృప్తా సంఖ్యా. సప్తాదిత్యరశ్మయ ఇతి వదన్తి.

అస్య ఇతి ఏతత్పదం పుంవిషయం షష్ఠ్యంతమ్. అస్య వామస్య - అస్య వామీయం సూక్తమ్. దీర్ఘతమస ఆర్షమ్. అస్య సూర్యస్య వామస్య వననీయస్య స్తుతిభిః పలితస్య పాలయితుః హోతుః హ్వాతవ్యస్య ఆహ్వా నార్హస్య. తస్య భ్రాతా భాగహర్తా ఉదకేన మధ్యమః మధ్యమస్థానః అస్తి విద్యతే. అశ్నః అశనః వ్యాపనో వాయురిత్యర్థః. తృతీయః అస్య వాయోః భ్రాతా హవిర్భాగహర్తా ఘృతపృష్ఠః ఆజ్యపృష్ఠః అయమగ్నిః పృథివీస్థానః. విశ్పతిం విశ్వస్య జగతః పాలయితారం. సప్తసంఖ్యాకా యుక్తా అస్య రశ్మయః పుత్రాః తేనాసౌ సప్తపుత్రః. సర్పణపుత్రమితి-సర్పణా హి తస్య రశ్మయో ముహూర్తమప్యనవస్థాయినో యస్య పుత్రాః సోఽయం సప్తపుత్రః. సప్త సృప్తా సంఖ్యా షడ్భ్యః సకాశాత్. ఏవం సప్తసంఖ్యోపేతాః సర్పణ క్రియాయోగ్యా వా ఆదిత్యరశ్మయః ఆదిత్యస్య పుత్రాః ఇతి మంత్రవిదః వదన్తి మన్యన్తే.

అర్థము :- అస్య = ఈ పదముయొక్క వ్యాఖ్య, 'అస్యాః' పదవ్యాఖ్య ననుసరించి తెలిసికొనవలెను.

మంత్రార్థము :- అస్య = ఈ, వామస్య = వననీయస్య = స్తుతిచేయు దగినట్టియు, పలితస్య=సర్వజగత్పాలకుడు నైనట్టియు, హోతుః=ఆహ్వాన యోగ్యుడునైన, సూర్యునియొక్క, మధ్యమః = మధ్యమస్థానీయుడైన, భ్రాతా = సోదరుడు, అశ్నః అస్తి = వ్యాపకుడైన వాయుదేవత ఉన్నది, అస్య = ఈ వాయువుయొక్క, తృతీయః భ్రాతా = మూడవ భ్రాత - సోదరునివంటివాడు, ఘృతపృష్ఠః అస్తి = ఘృతముచే స్పృశింపబడు అగ్ని ఉన్నాడు, అత్ర = ఆదిత్యుడు, వాయువు, అగ్ని అను మూటియందు సప్త పుత్రమ్ = సప్తపుత్రుడైన సూర్యుని, విశ్పతిమ్ = సర్వాధికుడైన విశ్వ పాలకునిగా, అపశ్యమ్=చూచుచున్నాను. తెలిసికొనుచున్నాను భ్రాతా - భరతేర్హరతి కర్మణః - హరత్యర్థక భృఞ్ ధాతువుచే సిద్ధమగును, హరతే భాగమ్ = సోదరుడు సొత్తును పంచుకొనువాడు, భర్తవ్యో భవతీతి వా = లేక పాలన పోషణచేయదగినవాడు, సప్తపుత్రం సప్తమపుత్రం సర్పణ పుత్రం వా = సూర్యుడు, సప్తవిధ = ఏడువిధములగు కిరణములుగల వాడుగా సంగీకరింపబడుచున్నాడు. అందువలన సప్తపుత్రుడనబడు చున్నాడు. కిరణములే సూర్యునికి పుత్రస్థానీయములు. సప్తమపుత్రః = ఐతిహాసికులు సూర్యుని సప్తమపుత్రునిగా చెప్పుదురు. అట్లు బ్రాహ్మణ వాక్యము చెప్పుచున్నది. "తస్మిన్నాదిత్యః సప్తమః ఇన్ద్రోఽష్టమః పుత్రః" సర్పణపుత్రోవా = సూర్యుడు సర్పణశీలముగల పుత్రులుగలవాడు. సూర్యకిరణములే యతనిపుత్రులు. అవి అహోరాత్రములు నిరంతరము గతిశీలములు - క్షణముకూడ నిలకడగా నుండవు. సప్తసృప్తాసంఖ్యా=అంక సంఖ్యకు సమీపమున కొంచెము మందుకు, సర్పణము = జరిగినందున, సప్త యనబడుచున్నది.

> "సప్త యుంజంతి రథమేకచక్ర మేకో అశ్వో వహతి సప్త
> నామా. త్రినాభిచక్ర మజర మనర్వం యత్రేమా విశ్వా
> భువనాధి తస్థుః" (ఋ. ౧-౧౬౪-౨)

> సప్త యుంజన్తి రథమ్. ఏకచక్ర మేకచారిణమ్. చక్రం
> చకతేర్వా చరతేర్వా క్రామతేర్వా. ఏకోఽశ్వో వహతి సప్త
> నామాదిత్యః సప్తాస్మై రశ్మయో రసా నభినంనామయన్తి.

> సప్తైన మృషయః స్తువన్తీతి వా. ఇదమపీతర న్నామైతస్మాదేవ అభిసన్నామాత్ సంవత్సరప్రధానః ఉత్తరోఽర్ధర్చః త్రినాభిచక్రమ్. త్ర్యృతుః సంవత్సరః గ్రీష్మో వర్షా హేమన్త ఇతి.

సప్త సంఖ్యోపేతాః సర్పణా వా యుంజన్తి యోజయన్త్యాత్మనా రశ్మయః. రథం రంహణమాదిత్యముద్యన్నేవ హ్యసావాదిత్యో రశ్మిభిర్యుజ్యతే. ఏకచక్రమ్ ఏక ఏవ హ్యసౌ అంతరిక్షే చరతి. ఏకో అశ్వః ఏక ఏవ అశ్వః సప్తనామా. అథవా సప్తాస్మై రశ్మయో రసానభిసంనామయన్తి. సప్తైన మృషయః నమన్తి స్తువన్తి ఇతి. త్రినాభిసంయుక్తం కాలచక్రమజరమ్ అజరణధర్మాణమ్. అనర్వమ్ అప్రత్యృతమన్యస్మిన్ అనాశ్రితమిత్యర్థః. త్ర్యృతుర్హి సంవత్సరః గ్రీష్మో వర్షా హేమన్తః ఇతి. ఏతదేవాస్య త్రినాభిత్వమభిప్రేతమ్. సంవత్సర ప్రధాన ఉత్తరోఽన్వర్ధర్చః నాదిత్యప్రధానః.

మంత్రార్థము :- ఏకచక్రం రథం సప్తయుంజన్తి = ఒంటరిగా తిరుగు సూర్యుడను రథమునకు సప్తకిరణములనెడి గుఱ్ఱములు జోడింపబడుచున్నవి. ఏకః సప్తనామా సూర్యః = సప్తనామకుడనబడు సూర్యుడొక్కడే, అశ్వః = వ్యాపకుడై, వహతి=తిరుగుచున్నాడు. అట్లు తిరుగుచు, త్రినాభి - చక్రమ్ = గ్రీష్మవర్షా - హేమంతఋతువులనెడి మూడు నాభులతోగూడినట్టియు, అనర్వమ్ = దేనిని ఆశ్రయింపనట్టియు, అజరమ్ = ఎన్నడు జీర్ణముకాని ధర్మముకలిగినట్టియు, సంవత్సరచక్రమును ప్రవృత్తమొనర్చుచున్నాడు. యత్రేమా విశ్వాభువనాధితస్థుః = అందు సమస్త భూతములు నివసించుచున్నవి. ఏకచక్రం - ఏకచారిణమ్. చక్రమ్ = చక్రశబ్దము చలనార్థక 'చక'ధాతువుతో లేక గత్యర్థక 'చర'ధాతువుతోను లేక గత్యర్థక క్రముధాతువుతోను ఏర్పడును. సప్తనామా ఆదిత్యః=ఆదిత్యునకు సప్తనామా అనినామము. ఏలయన ఈ సూర్యుని సప్తకిరణములు, రసాన్ అభిసన్నయన్తి = రసములను ప్రాప్తింపజేయును, లేదా సప్త ఋషయః స్తువన్తి = ఈ సూర్యుని సప్తఋషులు స్తుతింతురు. కావున సూర్యుడు సప్తనామా అనబడు చున్నాడు. ఇదమపి ఇతరత్ (నామ) అభి సన్నామాత్ = ఈ అభిసన్నామమువలననే మఱియొకనామ మేర్పడినది. (స్వమ్ అర్థం ప్రత్యాయయితుం అభిముఖ్యేన సంన్నమతి=తనగుణమును

ప్రకటింపచేయుటకే ఎదుట నిలబడుటచే నామమేర్పడును) ప్రతిపదార్థ నామమునందును దానిగుణములు దానికి లోబడియుండును. గుణముల ననుసరించియే కదా నామకరణముచేయబడును. సంవత్సరప్రధాన ఉత్తరోఽర్ధర్చః=ఈ ఋఙ్మంత్రపుఉత్తరార్ధభాగము సంవత్సరవిషయము వర్ణింపబడినది. త్రినాభిచక్రమ్ ఋతుః సంవత్సరః గ్రీష్మః వర్షా హేమన్తః ఇతి = త్రినాభిచక్రమున కర్థము - గ్రీష్మవర్షాహేమన్తములనెడి మూడు ఋతువులుగల సంవత్సరము.

> **సంవత్సరః - సంవసంతేఽస్మిన్ భూతాని. గ్రీష్మో గ్రస్యన్తే అస్మిన్ రసాః. వర్షా వర్షత్యాసు పర్జన్యః. హేమన్తో హిమవాన్ హిమం పునర్ హన్తేర్వా - హినోతే ర్వా. అజరమజరణ ధర్మాణమ్. అనర్వమప్రత్యృతమన్యస్మిన్. యత్రేమాని సర్వాణి భూతాని అభిసంతిష్ఠన్తే.**

గ్రీష్మ = గ్రస్యన్తే అస్మిన్ రసాః సూర్యేణ. వర్షా వర్షత్యాసు పర్జన్యః. తదేతత్ ప్రత్యక్షమేవ. హేమన్తః హిమవాన్ - తత్ర హి బహు భవతి హిమమ్. హిమం హన్తేరోషధివనస్పతీన్ - హినోతే ర్వా తర్పణార్థస్య. తేన హి పుష్యన్తి యవాదయః. గమనార్థస్య వా తద్ధి గమయతి క్షయం భూతాని. అజరం సంవత్సరచక్రమ్. అజరణధర్మి న హి సంవత్సరస్య జరానామ ధర్మోఽస్తి. అనర్వమ్ అప్రతిగతమనాశ్రితమన్యత్ర క్వచిత్. యత్ర యస్మిన్ ఇమా ఇమాని విశ్వా సర్వాణి భువనా భూతాని అధి ఉపరి తస్థుః అభిసంతిష్ఠన్తే ఆశ్రితాని చ వినాశముపయాన్తి.

అర్థము :— భూతములన్నియు నిందుండును. కావున సంవత్సరము అనబడుచున్నది. రసములు జలాదులిందు గ్రస్యన్తే - శుష్కించును. కావున గ్రీష్మమనబడును. మేఘములు వర్షించును కావున వర్షా అని వర్షఋతువునకు నామమేర్పడినది. హిమయుక్తమగుటచే హేమంత నామము కలిగినది. హిమము - మంచు ఓషధులను, వనస్పతులను హింసించును. హనధాతువుచే హిమశబ్దమేర్పడును. హిమం (హన్తేర్వా) లేక హినోతేర్వా తర్పణార్థక హి ధాతువువలన హిమశబ్దమేర్పడును. హిమము యవాదిసస్యములను పోషించును, తృప్తిపఱచును, అజరమ్ =

స్వభావముతో జీర్ణముకానిది, సంవత్సరమున జరా = జీర్ణమగు ధర్మము లేదు, అనర్వమ్ అప్రత్యృతమ్ = ఇతరస్థలములకు వెళ్లనిది - దేనిని ఆశ్రయించనిది.

తం సంవత్సరం సర్వమాత్రాభిః స్తౌతి "పంచారే చక్రే పరివర్తమానే" (ఋ. ౧-౧౬౪-౧౩) ఇతి పంచర్తుతయా పంచఋతవః సంవత్సరస్య ఇతి చ బ్రాహ్మణమ్. హేమన్త శిశిరయోః సమాసేన. "షడర ఆహురర్పితమ్" (ఋ. ౧-౧౬౪-౧౨) ఇతి షడృతతయా. అరా ప్రత్యృతా నాభౌ. షట్ పునః సహాతేః.

"పంచారే చక్రే" ఇతి - పంచారే చక్రే ఋతవః అత్ర అరత్వేనాభిప్రేతాః. పరివర్తమానే పరిగృహ్యేదం జగద్వర్తమానే తస్మిన్నాతస్థుః. కాలచక్రం హి సర్వమేవేదం జగదధిరూఢమ్ బంభ్రమీతి హేమన్తశిశిరయోః సమాసేన ఏకత్వేనేత్యర్థః. పంచర్తుత్వమ్ అరాః ప్రత్యృతా నాభౌ ప్రతిగతా ఇత్యర్థః. షట్ పునః సహాతేః తే హి పంచసంఖ్యామభిభూయ వర్తన్తే.

అర్థము :- ఆ సంవత్సర మన్నివిధముల స్తుతిచేయబడును. పరివర్తమానే = తిరుగుచున్న, పంచారే = వసంతము, గ్రీష్మము, వర్ష, శరత్, హేమంతములు అను ఐదు అరలుగల సంవత్సరరూపచక్రమునందు సమస్తవిశ్వము స్థితమైయున్నది. పంచర్తవః సంవత్సరస్య ఇతి బ్రాహ్మణమ్ = సంవత్సరము పంచఋతువులు కలదియని బ్రాహ్మణముకూడ చెప్పుచున్నది, హేమన్తశిశిరయోః సమాసేన = హేమంతశిశిరఋతువులు రెండుకలిసి యొకటిగా ఎంచబడును. కావున వసంతాదిశిశిరాంతఋతువులు ఆఱు అరలుగల సంవత్సరరూప చక్రమున సమస్తవిశ్వము స్థితమైయున్న దని భావము. చక్రపుకుండలో ఆకులు ఇమిడియుండునట్లు సంవత్సరరూప చక్రనాభియందు ఋతువులు, ప్రత్యృతాః = ఇమిడియుండి - ప్రతిగతములై అరలనబడుచున్నవి. షట్ సహాతేః = పంచసంఖ్యలనుండి అభిభవమై స్థితమగుటవలన షట్ అనబడుచున్నది.

"ద్వాదశారం న హి తజ్జరాయ" (ఋ. ౧-౧౬౪-౧౧) "ద్వాదశ ప్రధయః చక్రమేకమ్" (ఋ. ౧-౧౬౪-౪౮) ఇతి మాసానామ్. మాసా మానాత్. ప్రధిః ప్రహితో భవతి. "తస్మింత్సాకం త్రిశతా న శంకవోఽర్పితాః షష్టిర్న చలా చలాసః" (ఋ. ౧-౧౬౪-౪౮) షష్టిశ్చ హ వై త్రీణి చ శతాని సంవత్సరస్యాహోరాత్రాః" ఇతి చ బ్రాహ్మణం సమాసేన. "సప్తశతాని వింశతిశ్చ తస్థుః" (ఋ. ౨-౧౬౪-౧౧) సప్త చ వై శతాని వింశతిశ్చ సంవత్సరస్య అహోరాత్రాః - ఇతి చ బ్రాహ్మణమ్ విభాగేన - విభాగేన.

"ద్వాదశారం న హి తజ్జరాయ" ఇతి ద్వాదశ ప్రధయః చక్రమేకమ్. ఇతి మాసానామ్ ఏతౌ పాదౌ భవత ఇతి వాక్యశేషః. తస్మిన్ సాకం త్రిశతా న శంకవోఽర్పితాః షష్టిర్న చలాచలాసః ఇతి. మాసా మానాత్ మీయతే హి తైః సంవత్సరః. ప్రధిః - ప్రశ్లిష్య చక్రే నిహితః భవతి. తస్మిన్ చక్రే సాకం త్రిశతా షష్టిర్ చ షష్ట్యధికాని త్రీణ్యహోరాత్రశతాని శంకవ ఇవా ర్పితాని. చలాచలాసః చలాని చ అచలాని చ. "షష్టిశ్చ హ వై త్రీణి చ శతాని సంవత్సరస్య అహోరాత్రాః ఇతి చ బ్రాహ్మణం సమాసేన అహో రాత్రయో రేకత్వేనేత్యర్థః. సప్తశతాని వింశతిశ్చ తస్థుః" ఇతి బ్రాహ్మణ మప్యేతస్మిన్నర్థే భవతి. సప్త చ వై శతాని వింశతిశ్చ సంవత్సరస్యాహో రాత్రాః ఇతి చ బ్రాహ్మణమ్ అహోరాత్రయో ర్విభాగేన విభాగేన ఇతి. ఏవమేతస్మిన్ సూక్తే సంవత్సరం సర్వామాత్రాభిః స్తౌతి.

అర్థము :- ద్వాదశారమ్ సంవత్సరచక్రమ్ = పండ్రెండు మాసము లనెడి అరలు - ఆకులుగల చక్రము, న హి జరాయ=అది క్షీణించుటకు కాదు, మాసము = కొలత - మానమువలన మాసములనబడుచున్నవి. ఈ మాసములచే సంవత్సరము కొలతపెట్టబడును, ద్వాదశప్రధయః = సంవత్సరచక్రమున పండ్రెండు పరిధులున్నవి. ప్రధిః ప్రహితో భవతి

పరిధిః - ప్రహితః = చక్రమున పోడించియుంచబడినది, శంకవః న = మేకులవలె నాసంవత్సర చక్రమున ౩౬౦ అహోరాత్రములు అర్పింపబడియున్నవి. దినరాత్రులు సాకం = కలిసి ౩౬౦ దినరాత్రులు వేఱుగా లెక్కించిన 720 అగును. త్రీణి శతాని 300, షష్టిః అఱువది ౬౦. విడి విడిగా అహోరాత్రములు లెక్కించిన సప్త చ శతాని 700 వింశతిశ్చ-౨౦, అహోరాత్రములు కలిసి ౩౬౦. ఈ సూక్తమున సంవత్సరచక్రము సవివరముగా వర్ణింపబడినది.

ఇతి చతుర్థాధ్యాయః

నాల్గవ యధ్యాయము సమాప్తము



# ఐదవ అధ్యాయము

## (చతురశీతి - ౮౪ పదాని పదములు)

## ప్రథమ పాదము

సస్నిమ్ - (౧).

> "సస్నిమవిందచ్చరణే నదీనామ్" (ఋ. ౧౦-౧౩౯-౬.)
> సస్నిం సంస్నాతం మేఘమ్.

సస్నిమ్ ఇత్యేతదనవగతమ్. అర్థానవబోధ ఏవానవగమ ఇతి కథ్యతే విశ్వావసో ర్దేవగంధర్వస్యేయ మార్షమ్. సస్నిం సంస్నాతమ్. అద్భిః పరి వేష్టితమ్. సర్వతః పరిస్రుతమ్ వా ధౌతమితి యావత్. మేఘమ్ ఇంద్రః అవిన్దత్.

అర్థము :— గత అధ్యాయమునుండి ప్రకృతి, ప్రత్యయము, శబ్దముల ప్రకరణము నడచుచున్నది. ఈ యధ్యాయమునందు ఆ ప్రకరణమే నడచుచున్నది. ప్రథమమున 'సస్నిమ్' శబ్దమునుగూర్చి విచారణ ప్రారంభింపబడినది. సస్నిమ్ శబ్దముయొక్క ప్రకృతి, ప్రత్యయము దాని యర్థముకూడ అనవగతము - తెలియదు - సస్నిమ్ శబ్దమునకర్థము మేఘము. ఈ యర్థము ప్రకరణమునుబట్టి తెలియుచున్నది. ఇందులకీమంత్రము ప్రమాణము. "సస్నిమవిందత ఇత్యాదిప్రమాణము.

మంత్రార్థము :— ఇంద్రుడు నదీనామ్ = శబ్దముచేయు జలముల యొక్క చరణే = చరణస్థానమున - అంతరిక్షమున - సస్నిమ్ = మేఘమును, అవిందత్ = పొందెను.

ష్ణా శౌచే ష్ణా వేష్టనే ధాతువునకు కిత్ ప్రత్యయము, లిడ్వత్ ద్విత్వాదులుచేసిన సస్నిమ్ శబ్దము ఏర్పడును. నదీనామ్ - ణద్ - అవ్యక్తశబ్దే ధాతువుచే నది శబ్దమేర్పడును.

భాష్యార్థము :- వవ్రిం సంవృతం మేఘమ్ = మేఘమును, మేఘము - అద్భిః = జలములతో, సంవృతమ్ = బాగుగ వేష్టింపబడి యున్నది. అందువలన నది మేఘమనబడును. అట్టి మేఘమును, ఇంద్రుడు పొందెను. లేక ధౌతమ్ బాగుగ ప్రక్షాళితము=మేఘమనబడును

వాహిష్ఠః - (౭) - దూతః - (౩).

> "వాహిష్ఠో వాం హవానాం స్తోమో దూతోహువన్నరా" (ఋ. ౮–౨౬–౧౬) వోఢృతమో హ్వానానాం స్తోమో దూతో హువన్నరౌ. నరా మనుష్యాః నృత్యన్తి కర్మసు. దూతో జవతేర్వా. ద్రవతేర్వా వారయతేర్వా. "దూతో దేవానామసి మర్త్యానామ్" ఇత్యపి నిగమో భవతి.

వాహిష్ఠః - ఇత్యేతదనవగతమ్. వోఢృతమ ఇత్యవగమః. తదత్ర నిగమః. "వాహిష్ఠో నరా" విశ్వమనసో వైయశ్వస్యేయ మార్షమ్. గాయత్రీ. హే నరా! హే నరౌ సమస్తానాం హోతవ్యానామ్ స్తోమానామ్ ఆహ్వాతవ్యానాం చ. య ఏవ ఏషః వాహిష్ఠః అతిమాత్రం వోఢా అయమేవ స్తోమః. యువాం దూత ఇవ 'హువత్' ఆహ్వయదిత్యర్థః. ఏషచాస్మత్ ప్రేరితః స్తోమః స సర్వథా యువాభ్యాం భాతు భవతు. యస్మాన్ మనుష్యాః కర్మస్వాసక్తి తేషు నృత్యన్తి గాత్రాణి ఇతస్తతః ప్రక్షిపన్తి తస్మాన్నరా ఇత్యుచ్యన్తే. దూతః కస్మాత్? జవతేః ద్రవతేర్వా గత్యర్థాత్. వారయతేర్వా యతోఽసౌ వారయత్యనర్థాన్ తదేతదృచాభ్యుక్తమ్. దూతో దేవానామసి మర్త్యానామ్.

అర్థము :- వాహిష్ఠః = ఉత్తమవాహకుడు (వోఢృతమః) దూతః = సందేశవాహకుడు లేక అనర్థనివారకుడు అనియర్థము.

మంత్రార్థము :— నరాః! హే నరౌ! ఓ యశ్విని కుమారులార!, హవానాం = స్తోత్రములయొక్క, (హూయతే ఆహూయతే ఏభిరితి హవాః స్తోత్రాణి = వీనిచే పిలువబడునో యవి హవాః స్తోత్రములు) వాహిష్ఠః = ఉత్తమవాహకుడు, స్తోమః = మంత్రసమూహము - వేదము, దూతః = సందేశవాహకుడు - అనర్థనివారకుడునై, యువామ్ = మీయిరువురిని, హువత్ = పిలుచుచున్నాడు.

భాష్యార్థము :- వోఢృతమః హ్వానామ్ = స్తోత్రములయొక్క ఉత్తమవాహకుడు, స్తోమః = మంత్రసముదాయము - వేదము, దూతః= సందేశ వాహకుడు-లేక అనర్థనివారకుడునై, హువత్=ఆహ్వానించుచున్నాడు, నరౌ! హే అశ్వినీకుమారౌ!=ఓ అశ్వినీకుమారులార!, నరాః=మనుష్యులు-నరులు అని మనుష్యులనందురు. ఏలయన వీరు నృత్యన్తికర్మసు=పనులు చేయునపుడు నటింతురు. తమశరీరముల నిటునటు కదలింతురు. అందు వలన నరులనబడుదురు, దూతః = దూతపదమునకు నిర్వచనము - జవతేర్వా = గత్యర్థక 'జు'ధాతువుతో క్తప్రత్యయముచేసి, 'జ' కు 'ద' చేసి కాని, గత్యర్థక - 'ద్రు'ధాతువుతోగాని, వారయతేః = వారిధాతువుతోకాని దూతశబ్దము సిద్ధమగును, వారయతి=దోషములను దూరముచేయువాడు = ణ్యంతవారిస్థానమున దూచేసి భావార్థమున క్తప్రత్యయము చేసిన దూత పదమేర్పడును.

మంత్రార్థము :- హే పరమాత్మన్! = నీవు, దేవానాం దూతోఽసి దివ్యగుణములకు ప్రాపకుడవు, మర్త్యానామ్=సర్వమనుష్యులకు, అంతశ్చ రసి = లోపలనుండువాడవు.

వావశానః - (४).

> వావశానః వష్టేర్వా వాశ్యతేర్వా. "సప్తస్వసౄరరుషీర్వా వశానః (ఋ. ౧౦-౫-౫) ఇత్యపి నిగమో భవతి.

వావశానః ఇత్యనవగతమ్ - వష్టేర్వా వాశ్యతేర్వేత్యవగమః. తథా చ నిగమః. "సప్త...వావశానః" త్రితస్యాప్త్యస్యాయ మార్షమ్. త్రిష్టుప్ - 'సప్తస్వసౄః' భగిన్య ఇవ యా అర్చిషః "అరుషీః" ఆరోచనాః 'వావశానః' కామయమానః వావశ్యమానో వా శబ్దంకుర్వాణ ఇత్యర్థః. తదేవం సామానాధి కరణ్యాత్, శబ్దసారూప్యాచ్చ వావశానః ఇత్యస్య కాన్త్యర్థత్వం శబ్దకర్తృత్వం చోపపద్యతే.

అర్థము :- వావశానః ఈపదమునకర్థము, 'వష్టేర్వా' లేక 'వశ' కాంతౌ అనుధాతువు శబ్దమును సిద్ధముచేసి కోరుచు అని యర్థము చెప్ప వలెను. లేదా, వాశ్యతేర్వా 'వాశృ' శబ్దే అనుధాతువుతో వావశానశబ్దము

సిద్ధముచేసి శబ్దముచేయుచు అని యర్థము చెప్పనగును. వావశానశబ్దము నకు కోరుచు, శబ్దమొనర్చుచు అని రెండర్థములు.

మంత్రార్థము :– అగ్ని, సప్తభగినులకు సమానముగ, అరుషీః = బాగుగ ప్రదీప్తమై, కాళీ, కరాళీ, మున్నగు జ్వాలలను కోరుచు, రేవా, శబ్దముచేయుచు మండెను. అనగా - జ్వాలలను ప్రసరింపచేయుచు అగ్ని ప్రజ్వలించెను. - బాగుగమండెనని భావము. అఙ్పూర్వక 'రుష్'ధాతువుచే 'అరుషీః' శబ్దము సిద్ధమగును. ఆఙ్లోని ఆకారమునకు హ్రస్వమైనది.

వార్యమ్ - (౫).

> వార్యం వృణోతేరథాపి వరతమమ్. "తద్వార్యం వృణీమహే వరిష్ఠం గోపయత్యమ్. (ఋ. ౮-౨౫-౧౩)
>
> తత్ వార్యం వృణీమహే వరిష్ఠం గోపాయితవ్యమ్ గోపాయితారో యూయమ్ స్థ యుష్మభ్య మితి వా.

వార్యమ్ ఇత్యజ్ఞాతమ్ - వరయితవ్యమ్ ఇతి స్పష్టమ్. అథవా వరతమం శ్రేష్ఠతమమ్. నిగమే సోదాహరతి. "తద్వార్యం వృణీమహే ... గోపయత్యమ్" వార్యమ్ వరణీయం ధనమితి శేషః. వరిష్ఠం వర్షిష్ఠం గోపత్యయం గోపాయితవ్యం రక్షణీయం చ యత్ యుష్మదీయం ధనం తద్ వయం వృణీమహే. యతః యూయమ్ గోపాయితారః రక్షకాః స్థ. అథవా యుష్మభ్యం యుష్మత్సకాశాద్ వృణీమహే.

'వృఙ్ వరణే' ధాతువునకు ణ్యత్ప్రత్యయము చేసిన 'వార్యమ్' శబ్దము సిద్ధమగును. వరింపదగినదని అర్థము. అథవా = లేక వరతమమ్ = అతిశ్రేష్ఠమని యర్థము.

మంత్రార్థము:– హే విద్వాంసులైన స్తోతలార! మేము, వార్యమ్=ఎల్లరిచే కోరదగిన - మిక్కిలి శ్రేష్ఠమైన ధనమును - జ్ఞానమును, వృణీమహే = కోరుచున్నాము, ఆ ధనము - వరిష్ఠమ్ = మిక్కిలి శ్రేష్ఠము. అధికము, అది గోపయితవ్యం = రక్షింపదగినది, యూయమ్ గోపాయితారః స్థ = దానిని మీరు రక్షించువారైయున్నారు, యుష్మభ్యమితివా = ఏ ధనము మీకొఱకు రక్షింపదగినదో దానినే మేము కోరుచున్నాము.

అన్ధః - (౮).

అన్ధ ఇత్యన్ననామా ధ్యానీయం భవతి. "ఆమత్రేభిః సించతా మద్య మన్ధః" (ఋ. ౨-౧౪-౧) ఆసించతామత్రైః ర్మద నీయమన్ధః. అమత్రం పాత్రమమా అస్మిన్నద న్త్యమా పున రనిర్మితం భవతి. పాత్రం పానాత్ తమోఽప్యన్ధ ఉచ్యతే నాస్మిన్ ధ్యానం భవతి. న దర్శనమంధ స్తమ ఇత్యభిభాష న్తే అయమపీతరోఽన్ధ ఏతస్మాదేవ. "పశ్యదక్షణ్వాన్న విచేత దన్ధః (ఋ. ౧౦-౨౭-౧౧) ఇత్యపి నిగమో భవతి.

అన్ధః ఇత్యనేకార్థత్వా దనవగతమ్. యస్మాదేతదాధ్యానీయమ్ భవతి, తస్మాదన్ధః ఇత్యుచ్యతే. అన్నాపరపర్యాయః ఇత్యవగమః - అన్నం హి సర్వేషా మాధ్యానీయమ్ ప్రార్థయితవ్యం భవతి. తదేతన్నిగమేనోదాహరతి. "ఆమత్రేభిః సించతా మద్యమన్ధః!" గృత్సమదస్యేయ మార్షమ్. హే అధ్వర్యవః ఆమత్రేభిః పాత్రైః మద్యమ్ మదనీయమ్ ఏతత్సోమాభిధానమ్ అన్ధః అన్నమ్ ఆసించత యతోఽస్మిన్ అమా సహ అదన్తి తతః అమత్రం పాత్రం భవతి అథవా అమా శబ్దేన పరిమాణహీనతా బోధ్యతే. అపరిమితాః అస్మిన్ అదన్తి ఇతి వా. పాత్రం పునః కస్మాత్? ఉచ్యతే పీయతేఽనేనేతి. అథ చ తమసోఽపి వాచకః అన్ధః. యతః న ధ్యానం భవతి. నేత్రయోః దృష్టినిరోధాత్ అత ఏవ లోకేఽపి దృష్టినిరోధే 'అన్ధ న్తమః' ఇత్యుచ్యతే. ఏనమర్థం నిగమేన దర్శయతి - "పశ్యదక్షణ్వాన్న విచేతదన్ధః" య ఏవ అక్షణ్వాన్ చక్షుష్మాన్ వేదార్థవిజ్ఞానవాన్ ఇతి యావత్ స ఏవ విచేతత్ పశ్యన్నాస్తే నిత్యయుక్తత్వాత్ - అపరస్తు యో అన్ధః వేదార్థ విజ్ఞానహీనః స న విచేతత్ న పశ్యతి, న విజానాతీత్యర్థః. తదేవమస్మిన్ మంత్రే "అక్షణ్వాన్" ఇత్యేతస్య శబ్దస్య సన్నిధానాత్ అన్ధః అదర్శనలక్షణం తమః ఏవ.

అన్ధః = అన్ధశబ్దము అన్నవాచకము. ఏలయన అధ్యానీయం భవతి = అన్న మెల్లరకు చింతనీయము. ప్రాణిమాత్రమునకు అన్నమును గూర్చి యాలోచనయుండును. అందఱు అన్నమును గోరుదురు. ఆఙ్ పూర్వక 'ధ్యై'చింతాయామ్ ధాతువునకు అసున్ ప్రత్యయముచేర్చిన అంధ

శబ్దమేర్పడును. అధ్యాయతే యత్ తత్ అన్ధః=ధ్యానింపబడునది‧ అంధః= అన్నము.

మంత్రార్థము :— ఓ యజ్ఞకర్తలార ! మద్యమన్ధః = మదమును కలిగించు సోమరూపఅన్నము, అమత్రేభిః = పెద్దపాత్రలతో, ఆసించత = అగ్నియందువేయుడు.

అర్థము :- ఆసించత = అగ్నియందుంచుడు, అమత్రైః = పాత్రములతో, మద్యమ్ మదనీయమ్ = మదమును కలిగించు, అంధః=సోమరూపఅన్నము, అమత్రమ్ = అనగా పాత్రము, అమా అస్మిన్ అదన్తి = దేనియందు తిందురో అది అమత్రమ్ = పాత్ర లేదా అమా = అనగా అపరిమితము, అమాత్యనరనిర్మితం భవతి - పాత్రం పానాత్ = దీనితో పానము చేయుదురు కావున పాత్రమనబడును. తమోఽప్యన్ధః ఉచ్యతే = తమస్సు చీకటికి అంధః అనినామము, అస్మిన్ = దీనియందు, న ధ్యానంభవతి = ఏమియు తెలియదు. న దర్శనమ్ = ఏమియు కనిపించదు. కావున, అంధం తమః ఇతి అభిభాషంతే = ఇది అంధునిచేయునట్టి అంధకారము, అయమపి = ఇదికాద, ఇతరః = మరొక, అంధః = గ్రుడ్డివాడు, ఏతస్మాదేవ = ఇందువలననే పిలువబడుచున్నాడు.

మంత్రార్థము :— అకిత్వాన్ = విజ్ఞానవంతుడైన మనుజుడు వేదార్థము నెఱింగి సర్వమునుజూచునో - ఎఱుంగునో-యతడే, అకిత్వాన్ = అనబడును. అన్ధః = వేదజ్ఞానములేనివాడు ఏమియు తెలిసికొనజాలడు. శాస్త్రీయజ్ఞానము లేనివాడు కన్నులుండియు అంధుడనబడును.

అసశ్చన్తీ - (౩).

> "అసశ్చన్తీ భూరి ధారే పయస్వతీ" (ఋ. ౬-౭౦-౨)
> అసజ్యమానే ఇతి వా. అవ్యుదస్యన్త్యావితి వా బహుధారే ఉదకవత్యౌ.

అసశ్చన్తీ ఇత్యేతదజ్ఞాతమ్. అసజ్యమానే పరస్పరమశ్లిష్యమాణే ఇత్యర్థప్రతీతిః. అవ్యుదస్యన్త్యౌ అనుపక్షీణే వా. తమిమమర్థం నిగమేన బోధయతి "అసశ్చన్తీ భూరిధారే పయస్వతీ" భూరిధారే బహూదకక్షరణస్వభావే బహుధారే పయస్వత్యౌ ఉదకవత్యౌ భరద్వాజస్యేయ మార్షమ్.

అర్థము :- అసశ్చన్తీ = అసజ్యమానే=లిప్తముకాక వేఱుగానుందు నట్టి, అవ్యుదస్యన్త్యౌ ఇతి వా = అనుపక్షీణము, అవిపర్యాసితము.

మంత్రార్థము :- అసశ్చన్తీ=పరస్పరముకలియక వేఱుగనుండుదు, భూరిధారే=సర్వభూతములను ధారణచేయు అధికజలమును కురింపజేయు, పయస్వతీ = జలముగల ద్యులోకపృథివీలోకములు యజమానునికొఱకు, ఘృతమ్ = సస్యాదులను వర్ధిల్లజేయు జలమును వర్షింపజేయును. అసజ్యమానే ఇతి వా = పరస్పరము కలిసికొననిది, అవ్యుదస్యన్త్యౌ = క్షీణించనివి విపర్యాసితములుకానివి.

వనుష్యతి - (౮).

> వనుష్యతి ర్హన్తి - కర్మా అనవగతసంస్కారో భవతి. "వనుయామ వనుష్యతః" (ఋ. ౮-౪౦-౭) ఇత్యపి నిగమో భవతి.
>
> "దీర్ఘ ప్రయజ్యుమతి యో వనుష్యతి యో వయం తం జయేమ పృతనాసు దూఢ్యః" (ఋ. ౭-౮౨-౧) దీర్ఘ ప్రతతయజ్ఞమభి జిఘాంసతి యో వయం జయేమ పృతనాసు దూఢ్యం దుర్ధియం పాపధియమ్. పాపః పాతాఽపేయానాం పాప త్యమానోఽవాజేవ పతతీతి వా, పాపత్యతేర్వా స్యాత్.

వనుష్యతి = హన్త్యర్థే వర్తమానోఽయం శబ్దః. అనవగతసంస్కారః. నాస్య ప్రకృతిప్రత్యయాదివిభాగో జ్ఞాతుం శక్యతే ఇతి. (క) తదేత న్నిగ మాభ్యాముదాహరతి. "వనుయామ వనుష్యతః" (ఖ) దీర్ఘం ప్రయజ్యు - మతియో వనుష్యతి" (క) నాభాకస్యేయ మార్షమ్. హే ఇంద్రాగ్నీ ! అస్మాన్ వనుష్యతః హన్తుమిచ్ఛతః శత్రూన్ వయం వనుయామ హన్మ ఇత్యర్థః (ఖ) వశిష్ఠస్యేయ మార్షమ్. జగతీ. హే ఇంద్రావరుణౌ దీర్ఘ ప్రతతయజ్ఞమ్ నిత్యయాజినమ్ అగ్నిహోత్రిణ మితి యావత్. అతి యః వనుష్యతి అభిజిఘాంసతి హన్తుమిచ్ఛతీత్యర్థః. తం వయం పృతనాసు సంగ్రామేషు జయేమ. దూఢ్యం దుర్బుద్ధిం పాపమతిమ్. పాపః కస్మాత్ ? యస్మాత్ సః అపేయాన్ పాతుమయోగ్యాన్ పిబతి తస్మాత్ పాపః. అథవా

పాపాత్యమానః పాపేన కర్మణా పునః పునః పాత్యమానః అవాఙ్ నిపైరేవ నరకమేవేమితి యావత్ పతతీతి వా పాపః. పాపత్యతేర్వా పాపః పాతి అస్మాత్ ఆత్మాన మితివా పాపః.

వనుష్యతిః - హన్తికర్మా = చంపుట యనియర్థము. అనవగత సంస్కారః భవతి. ఈ శబ్దముయొక్క ప్రకృతిప్రత్యయములు అవిదితములు.

మంత్రార్థము - రెండవ మంత్రార్థము :- యః = ఎవడు, దీర్ఘ ప్రయజ్యుమ్ = నిత్యాగ్నిహోత్రుని, అతివనుష్యతి = చంపగోరుచున్నాడో, తం దూఢ్యమ్ దుర్బుద్ధిమ్ = ఆ దుర్బుద్ధుని - మందబుద్ధుని-నీచుని, వయమ్ = మేము, పృతనాసు = సంగ్రామములందు, జయేమ = జయింతుముగాక!

భాష్యార్థము :— దీర్ఘప్రతతయజ్ఞమ్ = దీర్ఘకాలము ఎవని యజ్ఞము సాగునో వానిని - నిత్యాగ్నిహోత్రుని, అభిజిఘాంసతి = చంపగోరునో, వయం తం జయేమ = మేము వానిని జయింతుముగాక! పృతనాసు = యుద్ధములందు, దూఢ్యమ్ = దుర్ధియమ్ - పాపబుద్ధిమ్ = దుర్బుద్ధుని, పాపబుద్ధుని - నీచమానవుని, పాపః = పాపి, పాపివ్యుత్పత్తియేమి? పాతా అపేయానామ్ = త్రాగదగని పానీయములను త్రాగువాడు పాపియగును, వా = లేక, పాపత్యమానః = ఆ పాపకర్మమూలమున మాటిమాటికి పడవేయబడువాడు - పాపి అవాఙేవ పతతితి వా = లేక పాపి క్రిందికే పడవేయబడువాడు - అని పాపిపదవ్యుత్పత్తి, "పా-నీ-విషిభ్యః పః" అను ఔణాదికసూత్రము ననుసరించి 'ప' ప్రత్యయమగును. పాధాతువునకు పాపః - (పాతి ఆత్మానమ్ అస్మాత్ పాపః)

తరుష్యతి - (౯).

తరుష్యతి రప్యేవం కర్మా. "ఇంద్రేణ యుజా తరుషేమ వృత్రమ్" (ఋ. ౭-౪౮-౨) ఇత్యపి నిగమో భవతి.

తరుష్యతి - ఏషో౽పి శబ్దః ఏవం కర్మా హననార్థం ఏవేత్యభిప్రాయః తథా చ నిగమః = "ఇంద్రేణ యుజా తరుషేమ వృత్రమ్" వసిష్ఠస్యేయ

మాహ్వమ్. ఇంద్రేణ యుజాః సంయుక్తాః సన్తః వయమ్ సంగ్రామే వృత్రం శత్రుమ్ తరుషేమ మారయేమ.

అర్థము :- తరుష్యతిః - అపి = తరుష్యతి కూడ, ఏవంకర్మా = ఈ యర్థముకలదియే. హింసార్థకమే, (నిరుక్తకారులు 'తౄప్లవనసంతరణయోః' తౄధాతువునకు గత్యర్థము నంగీకరించినను, 'తరతి మృత్యుమ్ తరతి బ్రహ్మహత్యామ్' అను నిట్టి ప్రయోగములవలన నీ తౄ ధాతువు హననార్థకముగాను చూడబడుచున్నది.) ఈ తౄధాతువునకు కండ్వాదిత్వాత్ యక్ ప్రత్యయము ఉకార, షకారము ఉపజనము చేసినందున 'తరుష్యతి' సిద్ధమగును.

మంత్రార్థము :- ఇంద్రేణయుజా = ఇంద్రుని సహాయమునుపొంది మేము, వృత్రం = శత్రువును, తరుషేమ = చంపుదుముగాక!

భన్దనా - (౧౦).

> **భన్దనా భందతేః స్తుతికర్మణః. "పురుప్రియో భన్దతే ధామభిః కవిః" (ఋ. ౩-౩-౪) ఇత్యపి నిగమో భవతి. "స భందనా ఉదియర్తి ప్రజావతీః" ఇతి చ. (ఋ. ౯-౫౬-౪౧)**

భన్దనాః-స్తుత్యర్థే వర్తమానాత్, భన్దతేః భది కల్యాణే సుఖే చ ఇత్యస్మాద్ధాతోః ల్యుటి భన్దనః. తథా చ నిగమః - పురుప్రియో భన్దతే ధామభిః కవిః అథ చ "స భన్దనా ఉదియర్తి ప్రజావతీః" పురుప్రియః బహుకామప్రియః స్తోతా. భన్దతే స్తౌతి. ధామభిః నామభిః అనేకైః ప్రకారై రిత్యర్థః. కవిః క్రాన్తదర్శన ఇత్యర్థః. పురుప్రియః స్తోతా అగ్నేః స్తుతిమంతరా కిం కుర్యాత్ ఇతి భందతే స్తుత్యర్థత్వముపపన్నమ్.

స్తుతికర్మణః స్తుత్యర్థక భన్దతేః, 'భది' కల్యాణే సుఖే చ" ఇందలి చకారమువలన 'వది' అభివాదనస్తుత్యోః ఈ ధాత్వర్థమునుండి, 'స్తుతిని గ్రహించి భన్దనాశబ్దమేర్పడును.

మంత్రార్థము :- పురుప్రియః = ఎక్కువకామనగల, కవిః=క్రాంతదర్శియైన విద్వాంసుడు, ధామభిః = నానావిధనామములతో, భన్దతే = స్తుతించును - అగ్నినిస్తుతించును, సః విద్వాన్ = ఆ విద్వాంసుడు, ప్రజా

వతీః = సంతానమే ప్రయోజనముగాగల, ఛన్దనాః = స్తుతులను, ఉది యర్తి = చెప్పుచుండును.

ఆహనః - (౧౧).

"అన్యేన మదాహనో యాహి తూయమ్" (ఋ. ౧౦-౧౦-౮)

అన్యేన మదాహనో గచ్ఛ క్షిప్రమాహంసీవ భాషమాణేత్య

సభ్య-భాషణాదాహనా ఇవ భవత్యేతస్మాదాహనః స్యాత్.

ఆహనః - ఇత్యేతత్ పదం సంబోధన మనవగతమ్. అప్రతీయ మానార్థత్వాత్. ఆహంసీత్యేవమర్థః ప్రతీయతే, నిగమేనోదాహరతి "అన్యేన మదాహనో యాహి తూయమ్" యమస్యేదమార్షమ్ వృషస్యన్తీం యమీం యమః కథయతి - అన్యేన ఇతరకులోత్పన్నేన కేనాపి నరేణ మత్ మత్తః మద్భిన్నేనేత్యర్థః త్వం హే ఆహనః మైథునాయ తూయం క్షిప్రం సత్వర మిత్యర్థః - యాహి గచ్ఛ. త్వమ్ అసభ్యభాషణాత్ ఆహంసి ఇవ తస్మాత్ ఆహనా అసి. అహమసభ్యం త్వదీరితం శ్రోతుమప్యక్షమః కిం పునః కర్తుమ్ ? ఏతస్మాదేవ కారణాత్ ఆహనః స్యాత్. యస్య సవిధే ఏతత్ కథ్యతే స ఆహన్యత ఇవ వచసాఽసభ్యత్వాత్.

మంత్రార్థము :- హే ఆహనః ! = కఠోరభాషణ మొనర్చునీవు, తూయమ్ = శీఘ్రముగా, నాకంటె భిన్నుడైన మఱియొకని అన్యుని వివాహమాడుము. ఓ కటుభాషిణీ నీవు నన్ను విడిచి శీఘ్రముగ అన్యుని వివాహమాడుము. నేను నీదుర్వచనములను వినజాలకున్నాను.

భాష్యార్థము :- అన్యేన మత్ = నాకంటె భిన్నుడైన మఱియొక వ్యక్తిని, ఆహనః ! = ఓ కటుభాషిణి !, గచ్ఛ = వెళ్లు, క్షిప్రం=శీఘ్రముగ, ఆహంసి ఇవ భాషమాణా = నీవు మాటలాడుచు బాధకలిగించుచున్నావు అసభ్యభాషణమువలన, ఆహనః స్యాత్ = సుత్తెతో కొట్టినట్లు ప్రహారమొనర్చు చున్నావు. కావుననే నీవు ఆహనః అని సంబోధింపబడుచున్నావు.

నదః - (౧౨).

ఋషి ర్నదో భవతి. నదతేః స్తుతికర్మణః. "నదస్య మా రుధతః కామ ఆగన్" (ఋ. ౧-౧౭౯-౪)

నదనస్య మా రుధతః కామ ఆగమత్. సంరుద్ధప్రజననస్య బ్రహ్మచారిణ ఇతి ఋషిపుత్ర్యా విలపితం వేదయన్తే.

నదః - ఇత్యేతదజ్ఞాతమ్. ఋషిర్నదో భవతి ఇతి పర్యాయేణ తత్ప్రాఖ్యానమ్. స్తుత్యర్థాత్ నదతేః. నదితా స్తోతా నదతి స్తౌతి ఇతి వా. తదేతన్నిగమేన ప్రదర్శయతి. నదస్య మా రుధతః కామ అగన్ లోపాముద్రాయాః ఇయమార్షమ్. నదస్య నదనస్య స్తోతురిత్యర్థః. మా మామ్ అయం కామ ఆగత ఆగతవాన్ ఇతి. సంరుద్ధం ప్రజననమింద్రియం యేన తస్య బ్రహ్మచారిణో అగస్త్యస్య విషయే ఋషిపుత్ర్యాః లోపాముద్రాయాః విలపితం విలాపం ఋషయః వేదయన్తే ప్రఖ్యాపయన్తి.

అర్థము :– నదఃశబ్దమున కర్థము ఋషిః=పరమాత్మను స్తుతించువాడు - జపము వేదపాఠము చేయువాడు, స్తుతికర్మణః = స్తుత్యర్థక నదతేః - 'ణద'ధాతువువలన నేర్పడును. ణద ధాతువు 'అవ్యక్తే శబ్దే' అవ్యక్తశబ్దార్థమున నున్నది. కాని యీధాతువునకు నిఘంటువునందు పూజ, లేక స్తుతి యని యర్థము చెప్పబడినది.

మంత్రార్థము :- నదస్య = వేదపాఠ, జపము మున్నగునవి చేయు ఋషి, రుధతః = జితేంద్రియుడైన కారణముచే, మా = నాయందు, కామః = కామవాసనా, అగన్ = వచ్చినది - కలిగినది.

భాష్యార్థము :- నదస్య = జపవేదపాఠాదుల నొనర్చు, మా = నా యందు, రుధతః = తనను తాను నిగ్రహించుకొన్న - జితేంద్రియుడనైన నాకు, కామః = కామవాసన, ఆగమత్ = వచ్చినది - ఉత్పన్నమైనది, సంరుద్ధప్రజననస్య బ్రహ్మచారిణః = జననేంద్రియమును నిగ్రహించి జితేంద్రియుడై బ్రహ్మచారియైయున్న అగస్త్యఋషివిషయమున నతని పత్ని లోపాముద్ర యీవిధముగ విలపించుచున్నదని ఋషిపుత్రికయైన లోపాముద్రయొక్క విలాపము అని ఋషులు చెప్పుచున్నారు.

సోమో అక్షః - (౧౩).

"న యస్య ద్యావా పృథివీ న ధన్వ నాంతరిక్షమ్ నాద్రయః సోమో అక్షాః" (ఋ. ౧౦-౮౯-౬)

అక్ష్ణోతేరిత్యే వమేకే "అనూపే గోమాన్ గోభిరక్షాః సోమో దుగ్ధాభిరక్షాః. లోపాశః సింహం ప్రత్యఞ్చ మత్సాః" (ఋ. ౯-౧౦౭-  )

క్షియతి నిగమః పూర్వః క్షరతి నిగమః ఉత్తరః ఇత్యేకే అనూపే గోమాన్ గోభిర్యదా క్షియత్యథ సోమో దుగ్ధాభ్యః క్షరతి సర్వే క్షియతి నిగమా ఇతి శాకపూణిః.

సోమో అక్షః - ఇత్యేతే ద్వేపదే. అత్ర చ అక్షః ఇత్యేతత్ పదమ నేకార్థత్వా దనవగతమ్. అస్యైవ చ సంబంధాత్ ఉపలక్షణార్థం 'సోమ' శబ్దోఽత్ర సమామ్నాతః. తదేత న్నిగమేన స్పష్టీకరోతి.

(క) "న యస్య ద్యావాపృథివీ న ధన్వ నాంతరిక్షం నాద్రయః సోమో అక్షః" విశ్వామిత్రపుత్రస్య రేణో రియమార్షమ్. న యస్య ఇంద్రస్య ద్యావాపృథివీ ద్యావాపృథివ్యౌ మహిమాన మశ్నువాతే వ్యాప్నుత ఇత్యర్థః. 'న ధన్వ' సోదకమ్. న అంతరిక్షమ్ న అద్రయః పర్వతాః అశ్నువన్తి కశ్చ పునః మహిమాన మశ్నోతి ఉచ్యతే. సోమఏవ అక్షః అశ్నోతీత్యర్థః ఏవ మస్మిన్ మంత్రే వ్యాప్త్యర్థో అశ్నోతిరేవ అక్షః శబ్దేన నిరుక్తః ఇత్యేవమేకే

మంత్రార్థవిదః మన్యన్తే.

(ఖ) "అనూపే గోమాన్ గోభిరక్షాః సోమో దుగ్ధాభిరక్షాః" సప్తర్షీణా మియమార్షమ్. బృహతీ. అనూపే జలప్రాయే దేశే. గోమాన్ గోభిః సహిత ఇత్యర్థః. యదా అక్షః క్షియతి నివసతీతి యావత్. అథ తదా వారం వారం దుగ్ధాభిరపి గోభిః గోభ్యః ఇత్యర్థః. సోమః అక్షః క్షరతి. రసవసాధ్యత్వా త్తస్య దేశస్య.

తదేవం పూర్వనిగమే "అనూపే గోమాన్ గోభిరక్షః" అక్షః క్షియతే ర్నివాసార్థాత్ ఉత్తరనిగమే చ "సోమో దుగ్ధాభిరక్షః" అక్షః క్షరతేః క్షరణార్థాత్. ఇత్యేవమేకే ఆచార్యాః వదంతి పరం శాకపూణిః అక్షః ఇతి క్షియతేరేవ సమర్థయతి.

అర్థము :- సోమో అక్షః=ఏకపదిక ప్రకరణమునడచునప్పుడు ఇట సోమః అక్షః రెండుపదము లెందుకీయబడినవి ? ఉత్తరము. అక్షః=

ఇదినాపము, అఖ్యాతముకాదు సోమః యొక్క సామానాధికరణ్యము కొఱకు ఇట అక్షాః అను అఖ్యాతము మాత్రమే గ్రహింపబడును; కాని, అక్షసూక్తాదులందు పఠింపబడిన అక్షప్రాతిపదికము గ్రహింపరాదు అని తెలుపుటకు ఇక్కడ సోమపదము అక్షపదముతోపాటు గ్రహింపబడినది. ఈ అక్షాః పదము అశ్నుతే క్షియతి, క్షరతి అశూఙ్ వ్యాప్తౌ క్షినివాసే క్షర సంచలనే అనుధాతువులతో సిద్ధమగును. అక్షాః అనునది 'అశూ'ధాతువు యొక్క లుఙ్‌లకారమునకు సంబంధించిన ఛాందసరూపము. ఈ విషయమును గుర్తించుచు ఆచార్యుడు అశ్నోతి రిత్యేకే అనిచెప్పుచున్నాడు.

మంత్రార్థము :— యస్య = ఎవని మహిమను, ద్యావాపృథివీ = ద్యుపృథివీలోకములు, న అక్షాః = వ్యాపింపజాలవో, ధన్వన=సముద్రము వ్యాపింపజాలదో, అంతరిక్షం న = అంతరిక్షము వ్యాపింపజాలదో, అద్రయః న = పర్వతములును, అంతమును పొందజాలవో, కాని అతని మహిమను కేవలము సోమముమాత్రము తెలిసికొనగలిగినది. ఇట అక్షాః అనుపదము అశ్నుతే, అశ్నువాతే అనువాని స్థానమున ప్రయోగింపబడినది

మంత్రార్థము :— అనూపే = జలప్రాయప్రదేశమున గోమాన్ = గోవులుగలవ్యక్తి, యది అక్షాః = నివసించుచున్నచో, అప్పుడాదేశము పైరులతో నిండియుండుకారణమున, సోమః = ఆసోమము దుగ్ధరూపమున, దుగ్ధాభిః = పిండిన - గోవులనుండి నిరంతరము, అక్షాః = క్షరతి = ప్రవహించుచుండును. ఈ మంత్రమున 'గోభిరక్షాః' అక్షాః పదము నివాసార్థక 'క్షి'ధాతువుయొక్క. 'లుఙ్'లకారరూపము. వేదమునందు లుఙ్, లఙ్, లిట్ అను నీ లకారము ముక్కాలములందును వచ్చును. ఇట 'అక్షైషీత్' స్థానమున 'అక్షాః'పదము ప్రయోగింపబడినది. ఇట లుఙ్ వర్తమానకాలమున ప్రయోగింపబడినది. కావుననే ఆచార్యుడు 'క్షియతి నిగమః పూర్వః' "సోమో దుగ్ధాభిరక్షాః" అను నీ పూర్వమంత్రమున అక్షాఃపదము సంచలనార్థక క్షరధాతువునకు సంబంధించినదని నుడివియున్నాడు. ఇది లుఙ్ రూపము. అక్షారీత్‌స్థానమున 'అక్షాః' అని వర్తమానకాలమున ప్రయోగింపబడినది. కావున ఆచార్యుడు "క్షరతి నిగమ ఉత్తరః ఇత్యేకే" ఏకే = కొందఱు ఆచార్యులు తరువాతిదియైన 'గోభిరక్షాః'లోని 'అక్షాః'పదము క్షరతినిగమః సంచలనార్థక క్షరధాతురూపము అని చెప్పుచున్నారు.

'సర్వే క్షియతి నిగమా ఇతి శాకపూణిః' కాని, శాకపూణి ఆచార్యు డిట్లనుచున్నాడు. పైమంత్రములలోని మూడుస్థానములందు వచ్చిన 'అక్షాః'పదము నివాసార్థక 'క్షి'ధాతువునకు సంబంధించినదే 'అశూ' 'క్షర' అనుధాతువులకు సంబంధించినదికాదు అని. ఏలయన మూడుస్థానము లందును నివాసార్థమే మంత్రార్థములందు సుసంగతమగుచున్నది. అది యెట్లన "న యస్య ద్యావాపృథివీ అక్షాః" యస్య=ఎవనికి, ద్యుపృథివీ లోకములు, అంతరిక్షము, సముద్రములు, పర్వతములు నేవియు నివాస స్థానములు కావో, 'అనూపే గోమాన్' మంత్రార్థమున నివాసము అను అర్థము చెప్పియే యున్నాము. 'సోమో దుగ్ధాభిరక్షాః' స్థలమునందును క్షరతి అర్థముగ్రహింపక నివాసార్థము గ్రహించుటయే యుచితము. 'గోభిః దుగ్ధాభిః' పాలుపిండిన తదుపరికూడ గోవుల ఊధః=పొదుగు, క్షియతి=ఉండును. ఇట గోభిః తృతీయావిభక్తి సప్తమ్యర్థమున ప్రయో గింపబడినది.

శ్వాత్రమ్ - (౧౪).

> శ్వాత్రమితి క్షిప్రనామాశు అతనం భవతి. "స పతత్రీత్వరం స్థా జగద్ యచ్ఛ్వాత్రమగ్నిరకృణోజ్జాతవేదాః" (ఋ. ౧౦-౮౮-౪) స పతత్రి చేత్వరం స్థావరం జంగమం చ పతత్ క్షిప్రమగ్నిరకరో జ్జాతవేదాః.

శ్వాత్ర మిత్యేతదనవగతమ్. ఆశు అతనం భవతీతి శబ్దసమాధిః క్షిప్రనామేతి అభిధేయవచనమ్. తదత్ర నిగమః "స పతత్రీత్వరం స్థా... జాతవేదాః" స అగ్నిః పతత్రి ఇతశ్చేతశ్చేతశ్చ పతనశీలమ్. ఇత్వరం గమనశీలం పశుపక్ష్యాది జంగమ మిత్యర్థః. స్థాః - స్థావరం చ వృక్షాది యత్ కించిత్ జగదస్తి తత్సర్వం ప్రళయే శ్వాత్రమ్ క్షిప్రమ్ ఝటి తిత్యర్థః. ఆత్మసాత్ అకృణోత్ అకరోత్. ప్రళయేఽగ్నిః సర్వమాత్మసాత్ కరోతీత్యభిప్రాయః.

అర్థము :— శ్వాత్రమ్ ఇతి క్షిప్రనామ = శీఘ్రమునకు పేరు. ఆశు అతనం భవతి = శీఘ్రమే సతతగతి యుండును. ఆశు ఉపపదముకాగా,

ఆతసాతత్యగమనే వలన రక్ప్రత్యయమగును. పృషోదరాదిత్వాత్ అను దానింబట్టి 'అక్ష'సందు వర్ణవిపర్యయమ్. 'క్ష త' అయి శ్వాత్రమ్ అగును.

మంత్రార్థము :— సః = ఆతడు, జాతవేదాః = సర్వజ్ఞుడు, సర్వవ్యాపకుడునైన పరమేశ్వరుడు, శ్వాత్రమ్ = ఎక్కువ త్వరగా, పతత్రిః = ఎగురునట్టి పక్షులు మున్నగువానిని, ఇత్వరమ్ = గమనశీల సత్త్వాదులను స్థాః = స్థావరములైన వృక్షములను - అనగా జడచేతనాత్మకమగు సమస్త జగత్తును, అకృణోత్ = నిర్మించును.

ఊతిః - (౧౫).

**ఊతి రవనాత్ - "ఆ త్వా రథం యథోతయే" (ఋ. ౮-౬౮-౧) ఇత్యపి నిగమో భవతి.**

ఊతిః - ఇత్యేతత్ ప్రతీతమ్, అవనమిత్యర్థాపగమః. అవనాత్ రక్షణాదిత్యర్థః. తథా చ నిగమః ఆ త్వా రథం యథోతయే ప్రియమేధస్యార్షమ్ హే ఇంద్ర! త్వా త్వామ్ వయమ్ ఆవర్తయామసి ఆవర్తయామహే ఆత్మనః ఊతయే రక్షణాయ. రథం యథా - యథా కశ్చిత్ సమర్థః పురుషః రథమ్ ఆవర్తయేత్ తథేత్యుపమా.

అర్థము :- ఊతిః = రక్షణ, రక్షించుటవలన ఊతి అనబడును. రక్షణ, గతి, కాంతి, మున్నగు అర్థములుగల 'అవ'ధాతువుతో ఊతిశబ్దము సిద్ధించును.

మంత్రార్థము :— నడవజాలని మనుజుడు రథం = బండినధిలషించునట్లు, హే ఇంద్ర! = ఓ పరమేశ్వర! మేము స్తుతులతో మారక్షణకొఱకు నిన్ను ఆహ్వానించుచున్నాము-ప్రార్థించుచున్నాము, ఊతి, యూతి, జూతి అను సూత్రమువలన అవరక్షణే ధాతువుతో ఊతిశబ్దము సిద్ధించును.

హసమానే - (౧౬).

**హసమానే ఇత్యుపరిష్టాత్ వ్యాఖ్యాస్యామః.**

హసమానే - ఇత్యేతత్పదమగ్రే వ్యాఖ్యాస్యామః "ప్రపర్వతా ముశతీ ఉపస్థాత్" ఇత్యస్మిన్ మంత్రే.

హసమానే అను నీపదమును ముందు వ్యాఖ్యానింతుము.

పడ్భిః - (౧౭).

> "వమ్రకః పడ్భిరుపసర్పదింద్రమ్ (ఋ.౧౦-౯౯-౧౨) పానై
> రితి వా. స్పాశనైరితి వా, స్పర్శనైరితి వా.

పడ్భిరిత్యామ్నాతమ్ - పానైః స్పాశనైర్వేతి శబ్దసమాధిః. తథా చ నిగమః "వమ్రకః పడ్భిరుపసర్పదింద్రమ్" వమ్రస్య వైఖానసస్యాయమార్షమ్. వమ్రకః పూర్వకల్పాన్తరీణః కశ్చిత్ పడ్భిః - సోమపానైః అథవా గుణ స్పాశనైః - స్తుతికథనైః ఇంద్రమ్ ఉపసర్పత్ ఉపసృప్తవాన్

పడ్భిః - 'పత్' ఈ రూపము 'పా = పానే' ధాతువుచేత స్పశబాధన స్పర్శనయోః అను ధాతువుచేత సిద్ధమగును. పానపదమునకర్థము. సోమ పానము - స్పశబాధనస్పర్శనయోః - తో బాధన లేక స్పర్శ - స్తుతులతో స్పృశించుట యగును.

మంత్రార్థము :— వమ్రకః = వమ్రకనామకఋషి లేక వమ్రకః= వామనుడు - పొట్టిమనుష్యుడు, పడ్భిః = సోమపానములతో - స్పాశన - నిమంత్రణలతో, స్పర్శనైః = స్తుతులతో, పానైః = సోమపానములతో, స్పాశనైః = బాధలతో లేక స్తుతిరూపస్పర్శలతో, ఇంద్రమ్ = ఇంద్రుని మహారాజును - ఐశ్వర్యశాలిని. ఉపసర్పత్ = ప్రాప్తించును.

ససమ్ - (౧౮).

> "ససం న పక్వమవిదచ్ఛుచన్తమ్" (ఋ. ౧౦-౭౯-౩)
> స్వపనమేతన్మాధ్యమికం జ్యోతి రనిత్యదర్శనమ్ తదివా
> విదజ్జాజ్వల్యమానమ్.

ససమ్ ఇత్యామ్నాతమ్. స్వపనమిత్యర్థప్రతీతిః అథ నిగమః - "ససం న పక్వమవిదచ్ఛుచన్తమ్" సప్తేర్వా జంభరస్యాయ మార్షమ్. ససం న పక్వమ్ - యథైవ స్వపనశీలం మాధ్యమికం జ్యోతిర్వైద్యుతాఖ్యమ్ పక్వమ్ అభివ్యక్తం వర్షాసు ఉపర్యపస్థానాదయుత్యేనైవ దృశ్యతే. తథైవ నిర్వాణాన్తః ప్రవిష్టమపి సంతమగ్నిమతిమహత్వాత్ శుచన్తమ్ దీప్యమానమ్ అవిదత్ అపశ్యత్.

అర్థము :- ససమ్ = స్వపనమ్ - శయనమని యర్థము. స్వపార్థక 'షస' ధాతువునకు 'పచాద్యచ్' సూత్రముతో అచ్ ప్రత్యయముచేసిన 'సస'

సిద్ధమగును. సస్తి - స్వపితి - ఇతి ససమ్ = శయనించువాడు - నిద్రించు వాడని యర్థము.

మంత్రార్థము :— ససమ్ = నిద్రించుచున్న - శయనించియున్న - అనగా దాగియున్న, పక్వమ్ = ఇప్పుడు వర్షాకాలమున ప్రకటమైన, శుచన్తమ్ = దీప్యమానమగుచున్న - ప్రకటమగుచున్న, విద్యుత్తు, న = వలె, తొమ్మిదిమాసములు గర్భమున దాగియుండి పరిపక్వమై గర్భము నుండి బయటపడి శోభాయమానమగుచున్న సంతానమును తండ్రి పొందును.

స్వపనమ్ ససమ్ = నిద్రించుచున్నదై అని యర్థము. వర్షర్తువునకు పూర్వమెటనో దాగియుండి వర్షాకాలమున ప్రకటమగు మాధ్యమికదేవత - అంతరిక్షమునసుండు మేఘమున అనిత్యదర్శనమునిచ్చుచు-అప్పుడప్పుడు కనబడు విద్యుత్తువలె, అవిదత్ = గర్భమునుండి బయటబడి శోభించు సంతానమును తండ్రి పొందును.

ద్వితా - (౧౯).

> "ద్వితా చ సత్తా స్వధయా చ శంభుః" (ఋ. 3-౧౭-౫)
> ద్వైవిధం సత్తా మధ్యమే చ స్థానే ఉత్తమే చ శంభుః సుఖభూః"

ద్వితా = ద్వైతమ్. ద్విప్రకారము, ద్వితా ఇత్యప్రతీతమ్ - ద్వైవిధమిత్యవగమః. నిగమేన సమర్థయతి. "ద్వితా చ సత్తా స్వధయా చ శమ్భుః" ద్వితా చ సత్తా ద్వైవిధం చ యస్య విద్యమానతా. మధ్యమే స్థానే వైద్యుతేన భావేన, ఉత్తమే చ సూర్యరూపేణ. స్వధయా చ అన్నేన సర్వ భూతానాం వర్షణద్వారేణ యః శంభుః సుఖస్య భావయితా అగ్నిః ఇతి.

మంత్రార్థము :— హే అగ్నే! సత్తా=నీ సత్త, విద్యమానతా ద్వితా = రెండువిధములుగ నున్నది. విద్యుత్తురూపమున మధ్యమస్థానమున - అంతరిక్షమున సూర్యరూపమున ఉత్తమస్థానమున నున్నది. తథా = అట్లే, స్వధయా = జల - వృష్టిజలముతో, శంభుః = సుఖభూః = సమస్తజగత్తునకు సుఖముకలిగింతువు, ద్వైవిధం సత్తా = రెండువిధములగు సత్త

నీకున్నది, మధ్యమేచ స్థానే - ఉత్తమేచ = మధ్యమస్థానమున విద్యు ద్రూపమున; ఉత్తమస్థానమున సూర్యరూపమున నున్నది.

వ్రాః - (౨౦).

"మృగం న వ్రా మృగయన్తే" (ఋ. ౮-౨-౬) మృగమివ వ్రాత్యాః ప్రైషాః.

వ్రాః. ఇత్యేతదజ్ఞాతమ్ వ్రాత్యాః ఇత్యవగమః నిగమేన స్పష్టీకరోతి. "మృగం న వ్రాః మృగయన్తే" హే అగ్నే వ్రాః వ్రాత్యాః ప్రైషాః యుష్మత్ స్తవసంయుక్తాః త్వాం ప్రతి ప్రహితా ఇత్యర్థః. మృగం న = మృగమివ అన్యే వ్యాధాః వ్రాత్యాః మృగయన్తే మార్గయన్తే త్వామితి. తదత్ర మృగ సంబంధాత్ వ్రాః శబ్దః లుబ్ధక - వాచకః ఇత్యుపపన్నమ్. వ్రాః శబ్దమున కర్థము వ్రాత్యాః ప్రైషాః = భృత్యులు.

మంత్రార్థము :- వ్రాః = వేటగాని నౌకరులు - సేవకులు, మృగం న - మృగమునువలె వేటాడదగిన వ్యాఘ్రాది క్రూరజంతువులను, మృగ యన్తే = వెదకుదురు. అట్లే అనధికారులు ఈశ్వరుని వెదకుదురు. కాని ఈశ్వరుని పొందజాలరు. భాష్యార్థ - మృగమివ=మృగముతోసమానముగ. వ్రాత్యాః ప్రైషాః = వ్రాత్యులు నౌకరులు.

వరాహః - (౨౧).

వరాహో మేఘో భవతి వరాహారః. "వరమాహార మాహార్షీ" రితి చ బ్రాహ్మణమ్. విధ్యద్వరాహం తిరో అద్రిమస్తా (ఋ. ౧-౬౧-౭) ఇత్యపి నిగమో భవతి. అయ మపీతరో వరాహ ఏతస్మాదేవ. బృహతి మూలాని, వరం వరం మూలం బృహతీతి వా "వరాహమింద్ర ఏముషమ్" (ఋ. ౮-౭౭-౧౦) ఇత్యపి నిగమో భవతి. అంగిరసోఽపి వరాహా ఉచ్యన్తే "బ్రహ్మణస్పతి ర్వృషభి ర్వరాహైః. (ఋ. ౧౦-౬౭-౭)

అథాప్యేతే మాధ్యమికా దేవగణా వరాహవ ఉచ్యన్తే. "పశ్యన్ హిరణ్య చక్రానయోదంష్ట్రాన్ విధావతో వరాహూన్" (౧-౮౮-౫)

వరాహః - అనేకార్థత్వాత్ ప్రతీతి - గోచరో న. వరాహో మేఘః కుతః? యస్మాత్ స వరాహారః. వరమ్ ఉదకమ్ ఆహారో యస్య. 'తదే తద్ వరమాహారమాహార్షీః' ఇతి బ్రాహ్మణేన సమర్థితమ్. ఇమమేవార్థం నిగమేన ద్రఢయతి. "విధ్యద్ వరాహం తిరో అద్రిమస్తా" వరాహం మేఘం విధ్యత్. తిరః దూరేఽవస్థితమ్ అద్రిమ్ వజ్రమ్ అస్తా క్షేప్తా అథ చాయమపి ఇతరో వరాహః శూకరాపరపర్యాయః వరాహ ఏవ. యతః అయమపి వరం మూలాఖ్య మాహరతి. వరం వరం మూలం వృహతి ఉద్యచ్ఛతీతి వా వరాహః. ఇమమర్థం నిగమేన ద్రఢయన్నాహ. "వరాహమింద్ర ఏముషమ్" హే ఇన్ద్ర! వరాహమ్-సూకరరూపేణావస్థితమ్ అసురమ్ ఏముషమ్ మోహ స్థానీయమ్. అంగిరసోఽపి వరాహా ఉచ్యన్తే. తద్యథా "బ్రహ్మణస్పతి ర్వృషభి ర్వరాహైః" మరుదాదయః సర్వేఽపి మాధ్యమికా దేవగణాః వరాహశబ్దవాచ్యాః 'అయో దంష్ట్రాన్ విధావతో వరాహూన్' ఇతి నిగమాత్.

అర్థము :- వరాహః = మేఘము, వరాహరః - వరమ్ = జలము, ఆహరః = భోజనముగాగలది, వరాహరము = మేఘము, వరమ్ = జల రూపమగు, ఆహరమ్ భోజనమును, ఆహర్షీః = నీవు తెచ్చుచున్నావు, అతః = కావున నీవు వరాహ మనబడుచున్నావు, ఇతి చ బ్రాహ్మణవచనమ్ = అని యిట్లు బ్రాహ్మణము చెప్పుచున్నది.

మంత్రార్థము :- అద్రిమ్ = వజ్రమును విసుచు ఇంద్రుడు, తిరః = అడ్డముగా తిరిగి మేఘమును, విధ్యత్ = ప్రహరమొనర్చెను.

భాష్యార్థము :- అయమపి = ఇదియు, ఇతరః వరాహః = మఱియొక వరాహము, శూకరవాచకము. వరాహశబ్దము, ఏతస్మాదేవ = దీనివలననే - వరాహణవలననే ఏర్పడును. ఎట్లన? వరమ్ = శ్రేష్ఠమైన, ముస్తాదీనామ్ మూలాఖ్యమ్ ఆహరమ్ = తుంగముస్తలు - మూలములను పేరుగల దుంపలను భోజనముగ గ్రహించును, బృహతి మూలాని = వేరులను పెకలించుచుండును. అందువలన వరాహమనదును.

మంత్రార్థము :- ఇంద్రః = ఇంద్రుడు, ఏముషమ్ = అసురులలో, మోహస్థానీయ వరాహమ్ = మోహస్థానీయుడైన వారాహమను అసురుని చంపెను, ఏముషమ్ = ఈ పదమునందలి ఆ స్థానమున ఏ చేర్పబడినది. (ఛందస్సునందు) - అథవా = లేక, ఇంద్రుడు, ఏముషమ్ = జలముతో నిండిన, వరాహమ్ = నల్లనిమేఘమును చంపెను. అంగిరసఃఅపి = అంగిరసులనువారుకూడ, వరాహాఉచ్యన్తే = వరాహములనబడును, ఎట్లన - బ్రహ్మణస్పతిః = బృహస్పతి, (ఋగ్యజుః సామజ్ఞాతా) వర్షాభిః=హవిస్సులను వర్షించు, వరాహైః = చెమటను ఓడ్చు అంగిరసులను వారితో ఉదక రూపద్రవిణమును ప్రాప్తింపజేయును

అథాపి = మఱియు, ఏతే మాధ్యమికా దేవగణాః=ఈ మధ్యమస్థానమునసుండు మరుత్తులు మున్నగు దేవగణములును, వరాహవః=వరాహువులని చెప్పబడుచున్నవి.

మంత్రార్థము :- హిరణ్యచక్రాన్=సువర్ణచక్రములుగల రథముపై కూర్చుండి, అయోదంష్ట్రాన్ = లోహనిర్మితములగు ఆయుధములుగల, విధావతః = ఇటునటు పరుగిడు, వరాహూన్ = దేవతల నాహ్వానించు మరుత్తులను మిమ్ములను, పశ్యన్ = చూచుచు, స్తౌతి = స్తుతించుచున్నాడు.

స్వసరాణి - (౨౨).

> స్వసరాణ్యహాని భవన్తి స్వయం సారీణి, అపి వా స్వరాదిత్యో భవతి. స ఏనాని సారయతి "ఉస్రా ఇవ స్వసరాణి" (ఋ. ౧-3-౮) ఇత్యపి నిగమో భవతి.

స్వసరాణి - ఇత్యేతదప్రతీతమ్. స్వయం సారీణీతి ప్రతీతోఽర్థః, స్వసరాణి అహాని యతః తే స్వయం సరన్తి. అథవా స్వః ఆదిత్యః స ఏనాని సారయతి - గమయతి తత ఏతాని స్వసరాణి. ఇమమర్థం నిగమేన సమర్థయతి. 'ఉస్రా ఇవ స్వసరాణి' మధుచ్ఛన్దస ఇయమార్షమ్. ఉస్రాః రశ్మయః స్వసరాణి దినాని. రశ్మిసంబంధాత్ - స్వసరాణి దినాని ఇత్యుపపత్తిః.

అర్థము :- స్వసరాణి అహాని భవన్తి. స్వసర = దినములనబడును, స్వయం సారీణి = ఇవి స్వయముగా జరుగుచుండును. (సరణమన జరుగుట) గతి నొసర్చుచుండును, అపివా = లేక, స్వః ఆదిత్యః భవతి = స్వః=సూర్యునినామము. ఆ సూర్యుడే, సరాణి=ఈ దినములను నడపును కావుననే దినములు స్వసరములు అనబడును.

మంత్రార్థము :- ఇవ = ఎట్లు, ఉస్రాః = సూర్యకిరణములు, స్వసరాణి = దినములను ప్రకాశింపజేయుటకు ప్రాప్తించునో అట్లే, విశ్వేదేవాసః ! = ఓ సమస్తదేవతలార ! మీరుకూడ రండు.

శర్యాః - (౨౩).

> శర్యాః అంగులయో భవన్తి. సృజన్తి కర్మాణి. శర్యా ఇషవః శరమయ్యః. శరః శృణాతే. "శర్యాభి ర్న భరమాణో గభస్త్యోః" (ఋ. ౯-౧౧౦-౫) ఇత్యపి నిగమో భవతి.

శర్యాః అనవగతమ్. శరమయ్యః ఇత్యుపగమః. ఇషవోఽభిధేయాః శర్యాః అంగులయః. యస్మాదిమాః కర్మాణి సృజన్తి. శృణాతేర్హింసార్థాత్ శరః. తదేతత్ నిగమేన ప్రతిపాదయతి - "శర్యాభిః న భరమాణో గభస్త్యోః" (ఋ. ౯-౧౧౦-౫) శరమయీభిః ఇషుభిః యథా కశ్చిత్ కంచిత్ అభితర్జయేత్ ధానుష్కః తథేమం సోమం ఏభిః గ్రావభిః గభస్త్యోర్బాహ్వో రవస్థితైః యూయ మభితర్జయత.

అర్థము :- శర్యాః అంగుళయో భవన్తి=శర్యా అంగుళులనబడును. ఏలయన, ఈ వ్రేళ్లు, కార్యాణిసృజన్తి = కార్యములను చేయును. సృజ ధాతువువలన సర్జా, సర్జావలన శర్యాపదము సిద్ధించును. శర్యాః = బాణములు - శరములనబడును. ఏలయన నివి శరమయ్యాః = శరకండములతో నిర్మింపబడును. (రెల్లుగడ్డికాండములవంటి గట్టి గడ్డివిశేషమునకు సంబంధించిన కాండములు (శరకండ హిందీలో) ఉండును. వానిచే శరములు = బాణములు నిర్మింపబడును.) 'శౄ హింసాయామ్' అను ధాతువుతో శరశబ్దము సిద్ధించును. శరము = బాణము హింసాసాధనము.

మంత్రార్థము :- న = ఎట్లు, భరమాణః = ధనుర్ధారణచేసిన వ్యక్తి, గభస్త్యోః = బాహువులతో, శర్యాభిః = బాణములతో చంపునో అట్లే

నిఘ్నను ఈ దేవతలను సోమపానయోగ్యుల నెనప్పుము. ఇట శర్యాశబ్దము బాణవాచకము.

అర్కః - (౨౪).

అర్కో దేవో భవతి యదేన మర్చతి. అర్కో మన్త్రో భవతి యదనేనార్చన్తి. అర్కమన్నం భవతి అర్చతి భూతాని. అర్కో వృక్షో భవతి. సంవృత్తః కటుకిమ్నా. "గాయన్తి త్వా గాయత్రిణోఽర్చన్త్యర్కమర్కిణః. బ్రహ్మాణస్త్వా శతక్రత ఉద్వంశమివ యేమిరే" (ఋ. ౧-౧౦-౧)

గాయన్తి త్వా గాయత్రిణః ప్రార్చన్తి తేఽర్కమర్కిణో బ్రాహ్మణా స్త్వా శతక్రతో ఉద్యేమిరే వంశమివ. వంశో వనశయో భవతి వననాచ్ఛ్రయత ఇతి వా.

అర్కః-ఇత్యనేకార్థపదమ్. అర్కో దేవః యస్మాత్ ఏనమర్చన్తి = పూజయన్తి, మంత్రోఽపి అర్క ఇత్యుచ్యతే యతోఽనేనార్చన్తి. అన్నమపి అర్కపదవాచ్యమ్ యస్మాత్సర్వేషా మేతదర్చ్యం భవతి. అర్కః వృక్షోఽపి (జిల్లేడు) ఇతి. ప్రసిద్ధః - యతః స కటుకభావేన వ్యాప్తో భవతి. అర్కస్య దేవపర్యాయత్వే నిగమః - "గాయన్తి త్వా...యేమిరే" మధుచ్ఛన్దస ఇయమార్షమ్. అనుష్టుప్ - గాయన్తి-త్వా గాయత్రిణః స్తువన్తి త్వాం సామగాః సామభిః. అర్చయన్త్యర్క మర్కిణః పూజయన్తి త్వామ్ ఋగ్భిః హోతారః బ్రాహ్మణాః, హే శతక్రతో! ఉద్వంశమివ యేమిరే-వంశమివ త్వామ్. ఉద్యేమిరే స్తుతిభిః వర్ధయన్తి. వంశః కస్మాత్? వనే శయిత ఇవ లక్ష్యతే. వననాత్ సంవిభాగాత్ శ్రూయతే ఇతి వా వంశః. అస్మిన్ మంత్రే అర్కః దేవః. అర్కిణః - మంత్రిణః అర్కో మంత్రః.

అర్థము :- అర్కః = ప్రతిదేవుడు అర్కః అనబడును. అర్చ పూజాయామ్ - పూజార్థక 'అర్చ'ధాతువునకు 'ఘఞ్'ప్రత్యయముచేసిన అర్కశబ్దమగును. ఏలయన, లోకులు దేవుని పూజింతురు, స్తుతింతురు - అర్కః - ఇది మంత్రవాచకము. ఏలయన జనులు తమ యిష్టదేవుని మంత్రములతో నర్చింతురు. అర్కః = అన్నము. ఇది ప్రాణులనన్నింటిని

జీవింపజేయును. 'అర్చ'ధాతువు పూజనార్థకముకూడ. అర్కః = చెట్టు - జిల్లేడు. కటుకిమ్నా సంవృత్తః = అది కటుతాయుక్తము.

మంత్రార్థము :— శతక్రతో! ఓ యింద్ర! గాయత్రిణః = సామ గానముచేయు విద్వాంసులు, త్వా = నిన్నుగూర్చి గానముచేయుదురు, అర్కిణః = మంత్రవేత్తలు, త్వా = నిన్ను అర్చింతురు, బ్రహ్మాణః = ఋత్విజులు, కొండొకడు వంశం = బొంగును, వ = పైకెత్తునట్లు నిన్ను, ఉద్యేమిరే = పైకెత్తుదురు నిన్ను గొప్పగా స్తుతింతురు.

భాష్యార్థము:- త్వా=నిన్ను, గాయత్రిణః=సామవేదులు, గాయన్తి= గానముచేయుదురు, అర్కిణః = మంత్రజ్ఞులు నిన్ను అర్చింతురు, హే శతక్రతో ! = ఇంద్రా ! బ్రాహ్మణులు నిన్ను బొంగువలె పైకెత్తుదురు, (ఉద్యేమిరే) వంశము=వనమున శయించుటచే వంశః = బొంగు అందురు. వననాత్ = బొంగు బహుప్రయోజనకారియై, సంభజన = ఎక్కువ యుప యోగింపబడుటచే, వంశః = అనబడును వనన క్రియాయోగమువలన వంశమనబడును.

పవిః - (౨౫).

**పవీ రథనేమి ర్భవతి. యద్ విపునాతి భూమిమ్ "ఉత పవ్యా రథానామద్రిం భిన్దన్త్యోజసా" (ఋ. ౫-౫౨-౯) తం మరుతః క్షురపవినా వ్యయుః ఇత్యపి నిగమౌ భవతః.**

పవిః-ఇత్యేతదజ్ఞాతమ్. విపునాతి భూమి మిత్యవగతిః. రథనేమిరితి అభిధేయాఖ్యానమ్. తథా చ నిగమః - ఉత పవ్యా రథానామ్ ఓజసా శ్వావాశ్వస్యేయ మార్షమ్. ఉత అపి చ రథానాం పథ్యాః-యా రథనేమయః అద్రిం - మేఘమ్. ఓజసా - బలేన భిన్దన్తి విదారయన్తి. రథసాహచర్యాత్ పవిః నేమిః. అథ చాపరో నిగమః - "తం మరుతః క్షురపవినా వ్యయుః" ఏతస్మిన్నపి బ్రాహ్మణే చక్రనేమిః క్షుర - ధారాకారాభిప్రేతా.

అర్థము :— పవిః = రథనేమి అది భూమిని కుళ్లగించును - భేదించును.

మంత్రార్థము :— ఉత = మఱియు, రథానాం పవ్యా = చక్రము లను నడపుటకు; ఓజసా = పరాక్రమముతో, అద్రిమ్ = పర్వతమును

భిన్దన్తి = భేదించును, మరుతః=మరుత్‌నామకదేవతలు, తమ్=ఆవృత్రుని, క్షురపవినా = కత్తివంటి ఆకృతిగల రథచక్రముతో, వ్యయుః = సమస్తావయవబంధనములను, ఛేదించెను - వేఱుచేసెను.

వక్షః - (౨౬).

వక్షో వ్యాఖ్యాతమ్.

వక్షః = వ్యాఖ్యాతమేతత్. "ఉపో అదర్శి శుంధ్యువః" ఇత్యేతస్మిన్ మంత్రే. వక్షః - ఈ పదమునకు (౪ అ.౨౪) వ్యాఖ్యవ్రాయుబడినది.

ధన్వ - (౨౭).

ధన్వాన్తరిక్షమ్ ధన్వన్త్యస్మాదాపః. "తిరో ధన్వాతిరోచతే ఇత్యపి నిగమో భవతి. (ఋ. ౧౦-౧౮౭-౨)

ధన్వ - ధన్వఅంతరిక్షమ్. యస్మాదస్మాదాపో ధన్వన్తి. తథా చ నిగమః" తిరో ధన్వాతిరోచతే" త్వరః తీర్ణతమమ్. అతి అతిత్య అస్మాన్ ప్రత్యేతి. రోచతే ప్రకాశతే. నానేన మహతా కదాచిదప్యస్తీర్యతే - ఇత్యాశయః.

అర్థము :- ధన్వ = ధన్వన్ శబ్దము, అంతరిక్షమ్ = అంతరిక్షమునకు వాచకము, ధన్వన్త్యస్మాదాపః = అంతరిక్షమునుండి జలము గతిగొనచ్చుచుండును క్రిందికి వచ్చుచుండును. 'ధవిగతౌ'ధాతువునకు కనిన్ ప్రత్యయముచేసిన ధన్వన్ పదము సిద్ధించును.

మంత్రార్థము :- యః=ఏ యాదిత్యరూపాగ్ని, తిరః=ఎల్లరను తిరస్కరించి, అతిధన్వ=అంతరిక్షము నతిక్రమించి, రోచతే=ప్రకాశించుచున్నాడు.

సినమ్ - (౨౮).

సినమన్నం భవతి. సినాతి భూతాని. "యేన స్మా సినం భరథః సఖిభ్యః" (ఋ. ౩-౬౭-౧) ఇత్యపి నిగమో భవతి.

సినమ్ - అజ్ఞాతమేతత్. యస్మాదిదం సినాతి భూతాని తస్మాత్సినమన్నమ్ అన్నమభిధేయమ్. తథా చ నిగమః - "యేన స్మా సినం భరథ

సఖిభ్యః" సఖిభ్యః సమానఖ్యానేభ్యః యజమానేభ్యః సినమ్ అన్నమ్. భరథః ధత్థః. అన్నమేవ హి ప్రాయేణ యజమానైః ప్రార్థ్యతే.

సినమ్ - అన్నము అని యర్థము - అన్నము, సినాతి భూతాని = ప్రాణులను బంధించి యుంచును. ప్రాణులన్నియు అన్నవశమున నుండును. బంధనార్థక (షిఞ్)ధాతువునకు ఔణాదిక నక్ ప్రత్యయము చేసిన సినమ్ సిద్ధమగును.

మంత్రార్థము :— ఏ మహాభాగ్యమువలన ప్రతాపమువలన, సఖిభ్యః = మిత్రులకొఱకు అన్నమును ధారణచేయుచున్నావో-తెచ్చి యిచ్చుచున్నావో.

ఇత్థా - (౨౯).

**ఇత్థా అముథేత్యేతేన వ్యాఖ్యాతమ్.**

తృతీయాధ్యాయమున ఇత్థాపదము అముథా నిపాతముతో వ్యాఖ్యానము చేయబడినది.

సచా - (౩౦).

**"సచా సహేత్యర్థః. వసుభిః సచా భువా" (ఋ. ౮౩౩౫-౧) వసుభిః సహభువౌ.**

సచా - సచా ఇతి అప్రతీతార్థో నిపాతః. సహ ఇత్యర్థప్రతీతిః. తథా చ నిగమః "వసుభిః సచాభువా" వసుభిః సహితౌ భూత్వా ఇత్యర్థః. సచా పదమునకు సహ అని అర్థము.

మంత్రార్థము :— ఓ అశ్వినీ కుమారులార! అగ్నిమున్నగు దేవతలతో, సచాభువా = కూడి మీరు సోమరసమును పానముచేయుడు.

చిత్ - (౩౧).

**చిదితి నిపాతోఽనుదాత్తః పురస్తాదేవ వ్యాఖ్యాతః. అథాపి పశునామేహ భవత్యుదాత్తః. "చిదసి మనాసి ధీరసి" చితాస్త్వయి భోగా శ్చేతయస ఇతి వా.**

చిత్ - చిదితి అనుదాత్తో నిపాతః పూర్వమేవ వ్యాఖ్యాతః. యదా త్వాయం పశునామ తదా ఆద్యుదాత్తః. తద్యథా చిదసి మనాసి ధీరసి యస్మాత్త్వయి భోగాశ్చితాః తస్మాత్ త్వం చిత్ అసి. చేతయసి వా యస్మాత్ తస్మాత్ చిత్".

అర్థము :— చిత్ = అనుదాత్త నిపాతము. దీని వ్యాఖ్యానము పూర్వమే చేయబడినది. ఇది పశునామమగుచో ఆద్యుదాత్తమగును.

మంత్రార్థము :- హే దేవవాణీ!, చిత్అసి = నీవు చైతన్యము నిచ్చు దానవు, మనాసి = మననశక్తినిచ్చుదానవు, ధీఃఅసి = బుద్ధినిచ్చుదానవు. త్వయి = నీయందు, భోగాః = సమస్తభోగములు, చితాః = సంచితములై యున్నవి. అథవా చేతయసే = నీవు చేతననొసంగుదానవు.

ఆ - (౩౨).

ఆ ఇత్యాకారః ఉపసర్గః పురస్తాదేవ వ్యాఖ్యాతః. అథాప్య ధ్యర్థే దృశ్యతే. అభ్ర ఆ అపః (ఋ. ౫-౪౮-౧) అభ్రే ఆ అపోఽపోఽభ్రేఽధీతి.

ఆ - ఇత్యాకారః ఉపసర్గః - పూర్వమేవ వ్యాఖ్యాతః. అయముప సర్గః అధ్యర్థే ఉపరిభావే ఐశ్వర్యే వాపి దృశ్యతే. తద్యథా - "అభ్ర ఆ అపః" అంతరిక్షలోకస్య ఆ ఉపరి అభ్రో మేఘః తస్మిన్ అపః జలాని.

అర్థము :— ఆ - ఆకారము ఉపసర్గ - పూర్వమే వ్యాఖ్యానింప బడినది. అథాపి = మఱియు, అధిఅర్థేఽపిదృశ్యతే = పైన, ఐశ్వర్యము అను అర్థములందును చూడబడుచున్నది.

మంత్రార్థము :- ఆ = పైన, అభ్రే = ఆకాశమునందు, అపః = జలము, అభ్రేఅధి = ఆకాశమునందు.

'ద్యుమ్నమ్ - (33).

ద్యుమ్నమ్ ద్యోతతే ర్యశో వా. "అస్మే ద్యుమ్నమధిరత్నం చ ధేహి (ఋ. ౭-౨౫-3) అస్మాసు ద్యుమ్నం చ రత్నం చ ధేహి.

ద్యుమ్నమ్ - ఇత్యనేకార్థమ్. ద్యోతతే ఇతి ద్యుమ్నమ్. తచ్చ యశో వా అన్నం వా అత్ర నిగమః - "అస్మే ద్యుమ్నమధి రత్నం చ ధేహి" అస్మే అస్మాసు ద్యుమ్నమ్ యశః అన్నం వా రత్నం చ ధేహి నిధేహి దేహీత్యర్థః.

అర్థము :- ద్యుమ్నమ్ = ద్యుమ్నమని యశస్సు, అన్నము అను వానికి పేరు. దీప్త్యర్థక 'ద్యుత'ధాతువునకు 'నక్'ప్రత్యయముచేసిన ద్యుమ్న శబ్దమేర్పడును. ద్యోతతే దీప్యతే ఇతి ద్యుమ్నమ్.

మంత్రార్థము :- అస్మే అధి - అస్మాసు=మాయందు, ద్యుమ్నమ్= యశస్సును, అన్నం రత్నం చ = అన్నమును, రత్నమును, ధేహి = ఉంచుము - మాకు యశస్సును, అన్నమును, రత్నమును ఇమ్ము అని యర్థము.

ఇతి ప్రథమపాదము

## ద్వితీయపాదము

పవిత్రం - (౩౪).

పవిత్రం పునాతేః. మంత్రః పవిత్రముచ్యతే. "యేన దేవాః పవిత్రేణ ఆత్మానం పునతే సదా" ఇత్యపి నిగమో భవతి. (సా. ఉ. ౫-౨-౮-౫)

రశ్మయః పవిత్రముచ్యన్తే. "గభస్తి పూతః" "గభస్తి పూతో నృభి రద్రిభిః సుతః" (ఋ. ౯-౮౬-౩౪) ఇత్యపి నిగమౌ భవతః.

ఆపః పవిత్రముచ్యన్తే. "శతపవిత్రాః స్వధయా మద న్తీః" (ఋ. ౭-౪౭-౩) బహూదకాః. అగ్నిః పవిత్రముచ్యతే. వాయుః పవిత్రముచ్యతే. సోమః పవిత్రముచ్యతే. సూర్యః పవిత్రముచ్యతే, ఇంద్రః పవిత్రముచ్యతే. "అగ్నిః పవిత్రం స మా పునాతు. వాయుః సోమః సూర్యఇంద్రః పవిత్రం తే

మా పునన్తు" ఇత్యపి నిగమో భవతి. (ఆప. శ్రౌ. ౧౨-౧౯-౬)

పవిత్రమ్ (క) మంత్రః పవిత్ర మిత్యుచ్యతే. యస్మాదేతత్ పునాతి. అత్ర నిగమః "యేన దేవాః పవిత్రేణ ఆత్మానం పునతే సదా" పవిత్రేణ పావయిత్రా మంత్రేణ. స్పష్టమన్యత్ (ఖ) రశ్మయః అపి పవిత్ర ముచ్యన్తే. యస్మాదేతా అపి పునన్తి. తద్యథా నిగమః. "గభస్తి పూతః" గభస్తయో రశ్మయః (గ) ఆపోఽపి పవిత్రశబ్దవాచ్యాః యతః తా అపి పునన్తి. తథా చ నిగమః "శతపవిత్రాః స్వధయా మదన్తీః" శతపవిత్రాః బహుజలవత్యః. స్వధయా అన్నేన. (ఘ) అగ్నిరపి పవిత్రపదాభిధేయః. వాయురపి. సోమశ్చాపి. సూర్యశ్చాపి. ఇంద్రోపి చ తథా చ. నిగమః. అగ్నిః పవిత్రం స మా పునాతు. వాయుః సోమః సూర్య ఇంద్రః పవిత్రం తే మా పునన్తు. పవిత్రం పావనాః సర్వే. స్పష్టమన్యత్.

అర్థము :– 'పూఙ్ పవనే' ధాతువుతో పవిత్రశబ్దము సిద్ధమగును. మంత్రః పవిత్రముచ్యతే = మంత్రము పవిత్రమని చెప్పబడును. వేద మంత్రముతో మనుష్యుడు పవిత్రుడగును.

మంత్రార్థము :- యేన పవిత్రేణ = ఏ పవిత్రముతో - వేదమంత్ర ముతో, దేవాః = దేవతలు, సదా = ఎల్లప్పుడు, ఆత్మానం పునతే = తమ్ము పవిత్రముగా చేసికొందురో, రశ్మయః = సూర్యకిరణములు, పవిత్ర ముచ్యన్తే = పవిత్రములనబడును - ఏలయన - సూర్యకిరణస్పర్శవలన ప్రతివస్తువు పవిత్రమగును. ప్రాణులరోగములు దూరములగును. గభస్తి పూతః = ఓ సోమమా ! నీవు సూర్యకిరణములచే పవిత్రమైతివి, నృభిః = ఋత్విజులచే, అద్రిభిః = శిలలతో, సుతః = అభిషవమై - పిండబడి, ధన్వసి = పవిత్రమగుచున్నావు. ఆపః = జలములు, పవిత్రమ్ ఉచ్యన్తే= పవిత్రములని చెప్పబడుచున్నవి. జలము మనుజుని పవిత్రునిచేయును.

మంత్రార్థము:- శతపవిత్రాః-బహూదకాః=మిక్కిలిజలము కలవాడు స్వధయా = జలసేచనముచే ఉత్పన్నమైన, మదన్తీః = ప్రాణులను తృప్తి పరచుచుదివ్యజలము సోమరూపమగు అన్నమును ప్రాప్తించును. అగ్ని, వాయువు, సోమ, సూర్యుడు, ఇంద్రుడు, అన్నియు పవిత్రములు. అగ్ని

పవిత్రము. అది నన్ను పవిత్రునిచేయును. అట్లే వాయుసూర్యాదులును నన్ను పవిత్రుని చేయునుగాక !

తోదః - (౩౫).

తోద స్తుద్యతేః.

తోద - 'తుదవ్యథనే' ధాతువుతో సిద్ధమగును. తోదము = యామి - యొక్క బిలము.

> "పురు త్వా దాశ్వాన్ వోచేఽరిరగ్నే తవ స్విదా. తోదస్యేవ శరణ ఆ మహస్య" (ఋ. ౧-౧౫౦-౧) బహు దాశ్వాన్ త్వా మేవ అభిహ్వయామి. అరిరమిత్ర ఋచ్ఛతేః. ఈశ్వరోఽ ప్యరి రేతస్మాదేవ. యదన్యదేవత్యా అగ్నావాహుతయో హూయన్త ఇత్యేదద్ దృష్ట్వైవ మవక్ష్యత. 'తోదస్యేవ శరణ ఆ మహస్య' తుదస్యేవ శరణే అధిమహతః.

తోదః - అనవగతమ్ - తుద ఇత్యవగమః 'తుద్'వ్యథనే ఇత్యస్మాద్ధాతోః ఘఞా తోదః. తథా చ నిగమః. "పురు త్వా దాశ్వాన్ వోచేఽరిరగ్నే తవ స్విదా" "తోదస్యేవ శరణ ఆ మహస్య"

దీర్ఘతమస ఆర్షమ్ - ఉష్ణిక్. పురు దాశ్వాన్ బహు దానవాన్. త్వా త్వామ్. వోచే ఆహ్వయామి. "అరిః అగ్నే!" తవ స్విత్ ఆ - సమర్థోఽహం త్వాం స్తోతుం బహు హవిః చ దాతుమ్. తోదస్య తున్నస్య. ఆ ఉపరి. శరణే బిలే. మహస్య మహతః. అత్ర తోద శబ్దః తున్నస్య భూప్రదేశస్య వాచకః.

అరిః తస్మాత్ ఋచ్ఛతేః హింసార్థాత్. ఈశ్వరోఽపి అరిః ఏతస్మాదేవ ధాతోః. యతో అన్యదైవత్యాపి ఆహుతయః అగ్నావేవ హూయన్తే. న చ తస్య గ్రహణశక్తిర్హీనా భవతి. తస్మాదరిః ఈశ్వరః సమర్థ ఇత్యర్థః. ఇతి ఏషోఽభిప్రాయః మన్త్రద్రష్టుః.

మంత్రార్థము :- పురు = అధిక, దాశ్వాన్ = దానముగలవాడనై - పూర్తిగ నన్ను సమర్పించుకొని, హే అగ్నే ! = ఓ యగ్నీ !, త్వా = నీతో,

వేచే = చెప్పుచున్నాను, ఓ యగ్ని నిన్నాహ్వానించుచున్నాను, అరిః = నీవీ శ్వరుడవు - సర్వసమర్థుడవు. కావుననే, మహస్య తేదస్య ఇవ = గొప్ప కాపమువంటి, శరణే ఆ = నీశరణమునందు అధిష్ఠితుడనైన నేను త్వా = నిన్ను, స్విత్ ఆవేచే = రక్షణకొఱకు, ఆహ్వానించుచున్నాను.

భాష్యార్థము :— బహుదావ్నాన్ = బహుదానమొసఁగు నేను, త్వా మేవ = నిన్నే, అభిహ్వయామి=ఆహ్వానించుచున్నాను, అరిః=అమిత్రః = శత్రువునకు అరి అని పేరు. 'ఋచ్ఛగతౌ'అనుధాతువుచే అరిశబ్దమేర్పడును. ఋచ్ఛతిగచ్ఛతి అసౌ శత్రూన్ ప్రతి - గచ్ఛతి = శత్రువులకెదురువెళ్లువాడు అందువలన అరిః అనబడుచున్నాడు. అర్యతే వా లేక శత్రువులితనిమీద దాడిచేయువత్తురు. కావునను అరి యనబడును, ఈశ్వరః అపి అరిః = ఈశ్వరుడును అరి యనబడును, ఏతస్మాదేవ = ఈ గమనక్రియాయోగము వలననే ప్రాణులన్నియు ఈశ్వరునివైపు వత్తురు. లేక ఈశ్వరుడందఱిపై అనుగ్రహముచే గతిమంతుడగును, యత్ = ఏలయన, అన్యదైవత్యా ఆహుతయః = ఇతర దేవతలకు సంబంధించిన ఆహుతులు, అగ్నౌ ఏవ = అగ్నియందే వేయబడును, హూయన్తే ఇతి ఏతత్ దృష్ట్వా = చూచి, ఏవమ్ అవక్ష్యత్ = ఇట్లనెను, అగ్నియే సర్వహవిస్సులకు స్వామి, తుదస్య ఇవ శరణే అభిమహతః = గొప్పకాపమువంటి ఎల్లరకు శరణుడవగు నీయందే.

స్వఞ్చాః - (౨౬).

స్వంచాః సు అంచనః "ఆజుహ్వానో ఘృతపృష్ఠః స్వంచాః" (ఋ-౩౭-౧) ఇత్యపి నిగమో భవతి.

స్వంచాః అస్పష్టమేతత్. సు + అంచనాః ఇతి స్పష్టమ్. తథా చ నిగమః - "ఆ జుహ్వానో ఘృతపృష్ఠః స్వంచాః" ఆ జుహ్వానః = ఆ హూయమానః. ఘృతపృష్ఠః = ఘృతాక్తపృష్ఠః, స్వంచాః శోభనగమనః.

స్వంచాః = స్వంచపదము సు అంచనః = శోభనగమనార్థమున ప్రయుక్తము.

మంత్రార్థము :— ఆజుహ్వానః = ఆయాకర్మలందు ప్రజ్వలితమై అగ్ని ఆహ్వానము చేయబడినది, ఘృతపృష్ఠః = నేతితో బాగుగ నించింప

బడినది, స్వంచాః = బాగుగ గమనమును చేయుచువెళ్లి తనప్రకాశముతో సూర్యునిలో కలియును లేక సూర్యునితో స్పర్ధచేయును.

శిపివిష్టః = (౩౭) - విష్ణుః - (౩౮).

> శిపివిష్ట, విష్ణుః ఇతి విష్ణోః ద్వే నామనీ భవతః. కుత్సితార్థీయం పూర్వం భవతీతి ఔపమన్యవః. కిమిత్తే విష్ణో! పరిచక్ష్యం భూత్ ప్రయద్ వవక్షే శిపివిష్టో అస్మి'' మా వర్పో అస్మదపగూహ ఏతద్ యదన్యరూపః సమిథే బభూథ'' (ఋ. ౭-౧౦౦-౬)
>
> కిం తే విష్ణో! అప్రఖ్యాతమేతద్ భవతి. అప్రఖ్యాపనీయం యన్నః ప్రబ్రూషే శేప ఇవ నిర్వేష్టితోఽస్మీత్య ప్రతిపన్నరశ్మిః. అపి వా ప్రశంసానామైవాభిప్రేతం స్యాత్. కిం తే విష్ణో! ప్రఖ్యాత మేతద్ భవతి ప్రఖ్యాపనీయం యదుత ప్రబ్రూషే. శిపివిష్టోఽస్మీతి ప్రతిపన్నరశ్మిః. శిపయోఽత్ర రశ్మయ ఉచ్యన్తే. తైరావిష్టో భవతి. మా వర్పో అస్మదప గూహ ఏతత్. వర్ప ఇతి రూపనామ వృణోతీతి సతః. యదన్యరూపః సమిథే సంగ్రామే భవసి సంయతరశ్మిః.

శిపివిష్టః విష్ణుశ్చేతి ద్వే నామనీ విష్ణోర్భవతః. తత్ర శిపివిష్టః ఇత్యేతత్ గుణపదమ్ అనవగతం చ అనేకార్థత్వాత్. శేప ఇవ నిర్వేష్టితః ఇత్యర్థావగమః. అనయోః పూర్వం నామ కుత్సితమర్థమభిధత్తే ఇతి ఔపమన్యవః ఆచార్యో మన్యతే. ఏనమేవార్థం ప్రథయన్ ఋచముదాహరతి. "కిమిత్తే విష్ణో,...సమిథే బభూథ" వశిష్ఠస్యేయ మార్షమ్. కిమిత్తే విష్ణో! కిమేతదవైకమ్ విగతరశ్మిరూపమ్. పరిచక్ష్యమ్ పరిఖ్యాపనీయమ్ భూత్ భవతి? నాన్యాని రూపాణి తే సన్తి. యేనైవం ప్రవవక్షే పునః పునః బ్రూషే అస్మాకమగ్రతః ఇతి శేషః. శిపివిష్టః అస్మీతి శేప ఇవ నిర్వేష్టితః అస్మి అప్రతిపన్నరశ్మిః హి సూర్యః ఉదయవేలాయాం నిర్వేష్టితః శేపస్వరూపో భవతి. తస్య తద్రూపగుణయోగితయా న కుత్సార్థతేత్యుపపన్నమ్. అపివా శిపివిష్టః ఇతి నామస్యాత్. కుతః - శిపయః బాలరశ్మయః తాభిః ఆవేష్టితః

శిపివిష్టః. తదేవం కిం తే విష్ణో! ప్రఖ్యాపనీయమేతద్ భవతి యత్ ప్రబ్రూషే అహం శిపివిష్టః ప్రతిపన్నరశ్మి రస్మి ఇతి. వర్పః ఇతి రూపస్య నామ వృణోతీతి సతః. అస్మత్ అస్మాకమగ్రతః అపగూహ తం సంవృతం కురుష్వ. ఏతద్‌రూపమ్ యదన్యరూపః యేనాన్యేన రూపేణ. సమిథే సంగ్రామే బభూథ భవసి.

అగ్రిమా ఋక్ అస్యైవార్థస్య ప్రశంసాపరకస్య బహుతరాయ నిర్వచనాయ. "ప్రతత్తే...పరాకే" వసిష్ఠస్యేయ మార్షమ్. హే శిపివిష్ట విష్ణో! అహం తే తవ నామ ప్రశంసామి వయునాని యుష్మద్ విషయాణి ప్రజ్ఞానాని, విద్వాన్ జానానః అహమ్ అర్యః - స్తుతీనాముచ్చారణే సమర్థః అస్మి అథవా త్వమ్ అర్యోసి మయి కృపాం కర్తుమ్. తం త్వాం ప్రశంసార్థ మహం గృణామి స్తౌమి. తవసం మహాన్తమ్. అతవ్యాన్ అమహన్ అహమ్, అస్య రజసః అన్తరిక్షలోకస్య. పరాకే పరాక్రాన్తే స్థానే క్షియన్తం నివసన్తమ్.

హే శిపివిష్ట విష్ణో! వయునాని విద్వాన్ అర్యః అతవ్యాన్ అహం రజసః పరాకే క్షియన్తం తవసం త్వామ్ ప్రశంసామీత్యన్వితిః.

అర్థము :- శిపివిష్టః, విష్ణుః = శిపివిష్టుడు, విష్ణువు అను నీ, ద్వే = రెండు, నామనీ = నామములు, విష్ణోః భవతః = విష్ణువునివైయున్నవి, ఔపమన్యవః = ఆచార్యుడు ఔపమన్యవుడు, పూర్వమ్ = ఈ రెండింటిలో మొదటినామమును, కుత్సితార్థీఽయం భవతి = నిందిత అర్థము కలదియగునని అంగీకరించుచున్నాడు.

మంత్రార్థము :— విష్ణో! ఓ విష్ణూ! నీవు, శిపివిష్టః అస్మి = నేను శిపివిష్టుడను, యత్ప్రవవక్ష = పలుమారు ఏదిచెప్పుచున్నావో యది, తే = నీయొక్క, పరిచక్ష్యం భూత్‌కిమ్ ? = ప్రఖ్యాతసాధారణ రూపమా ? అనగా నిట్లు చెప్పుకొనుట యుక్తముకాదని యభిప్రాయము. శేప ఇవ నిర్వేష్టితః శిపివిష్టః అని దీని నిరుక్తి - అనగా శేప ఇవ = శిశ్నముతో సమానమని - శిశ్నమువంటిదని చెప్పబడినది. ఇది అశ్లీలము. అప్రతిపన్న రశ్మిః = కిరణరహితుడు అని చెప్పబడినది. ఉదయకాలమున సూర్యుడు అప్రతిపన్నరశ్మిః = కిరణములులేనివాడగుచున్నాడు. అందువలన నతడా సమయమున శేపరూపుడగుచున్నాడు. వర్పః = ఈ రూపమును, అస్మత్ =

మాయెదుట, మాప్రఖ్యాపయ = ప్రకటింపకు - చెప్పవద్దు, అపగూహ ఏతత్ = దీనిని దాచియుంచు, శిపివిష్ట శబ్దవాచ్యమగు నీ యీ యుపమేయ రూపమును, అపగూహ = మఱుగున నుంచుము, అథవా = లేక బాల కిరణములతోగూడిన యీ రూపమును దాచియుంచుము. పూర్ణకిరణ యుక్తుడవై ప్రకటమగుము, యదన్యరూపః = మఱియొకరూపముతో, సమిథే = సంగ్రామమున, బభూథ = ఉందువో పూర్ణరశ్మిజాలముతోగూడి యుందువో - అనగా మధ్యందినీయ స్వరూపయుక్తుడవై నీ స్వరూపమును ప్రకటింపుము.

భాష్యార్థము :- విష్ణో! = ఓ విష్ణూ! ఏతత్ = (శిపివిష్ట - నామ) ఈ అప్రఖ్యాత - అప్రఖ్యాపనీయ = ప్రకటింపదగని-చెప్పకొదగని రూపము, కిమితే? = నీదేనా?, నః = మాయెదుట, యత్ = దేనిని, ప్రబ్రూషే= చెప్పచున్నావో ఇదియేనా నీరూపము? శేప ఇవ నిర్వేష్టితః అస్మి - అప్రతి పన్నరశ్మిః = శిశ్నమువలె నిర్వేష్టిత పూర్ణరశ్ములతో యుక్తముకానిదై యున్నది. అపి వా అథవా = లేక, ఏతత్ = ఈ శిపివిష్టనామము, ప్రశంసా నామ ఏవ = ప్రశంసానామమే, అభిప్రేతం స్యాత్ = ప్రశంసకు తగిన - అంతట వెల్లడింపదగిన యీనామము, అభిప్రేతము = అనగా ఈ నామము మిక్కిలి పవిత్రము. ఇందు అశ్లీలత నామమాత్రమైన లేదు. ఏలయన దీనియర్థమిది—శిపయః = ఇట - శిపయః అన రశ్ములు కిరణములు అని యర్థము, శిపివిష్టనామమునగల శిపిశబ్దమునకర్థము రశ్మి - కిరణము, శిపిభిః = కిరణములతో, విష్టః = యుక్తుడు - శిపివిష్టః = రశ్మియుక్తుడు - కిరణయుక్తుడని యర్థము చెప్పబడినది. వర్పఇతినామ=వర్పమురూపము నకు పేరు, వృణోతి ఇతి సతః = వరణార్థక వృఞ్ ధాతువుతో వర్పశబ్దము సిద్ధమగును. రూపము ఆవరించియుండును, యదన్యరూపః సంయుత రశ్మిః = అన్యరూపముతో సంబద్ధుడవు, సమిథే = యుద్ధసమయమున అనేక రశ్ములతో సంబద్ధుడవై, భవసి = ఉందువు.

అఘృణిః - (౩౮).

**అఘృణి రాగతఘృణిః. "అఘృణే సంసచావహై" (ఋ. ౬-౫౫-౧) ఆగతఘృణే సంసేవావహై.**

అఘృణిః=అనవగతమేతత్. అగతఘృణిః - అవగతమేతత్. ఘృణిః దీప్తిః క్రోధో వా. తథా చ నిగమః - "అఘృణే సంసచావహై" అఘృణే! అగతదీప్తే! సంసచావహై సంసేవామహై అవాం పరస్పరమిత్యర్థః.

అర్థము :— అఘృణిః = దీప్తి, లేక క్రోధమును పొందినవాడు అని యర్థము, అగతదీప్తిః = అగతక్రోధః = దీప్తియుక్తుడు అని యర్థము.

మంత్రార్థము :- అఘృణే! = ఓ అగతదీప్తి = ఓ దీప్తికలవాడా! లేక ఓ క్రోధయుక్త! సంసచావహై = మేమిరువురము, సంసేవావహై = బాగుగ సేవింతుముగాక!

పృథుజ్రయాః - (౪౦)

> పృథుజ్రయాః - పృథు - జవః - "పృథుజ్రయా అమినా దాయుర్దస్యోః" (ఋ. ౩-౪౯-౨) ప్రమాపయ దాయుర్ద స్యోః.

పృథుజ్రయః - అనవగతమేతత్. పృథుజవ ఇతి జ్ఞాతమ్. నిగమేనో దాహరతి - "పృథుజ్రయా అమినాదాయుర్దస్యోః" పృథుజ్రయో విస్తీర్ణ వేగః దస్యోః మేఘస్య ఆయుః అమినాత్ అనాశయత్.

అర్థము :— పృథుజ్రయః = పృథుజవః = అతివేగవంతుడు.

మంత్రార్థము :- పృథుజ్రయాః = అతివేగవంతుడైన ఇంద్రుడు, దస్యోః = దస్యుని, ఆయుః = ఆయుష్షును, అమినాత్ = నశింపజేయు చున్నాడు. నిఘంటువునందు గత్యర్థమున 'జ్రి' ధాతు వుపలకింపబడి యున్నది. పృథు = విశాలము - అతి, జ్రయస్ = గతిగల - 'జ్రి' ధాతువు నకు 'అసున్' ప్రత్యయముచేసిన - 'జ్రయస్' సిద్ధించును.

అథర్యుమ్ - (౪౧).

> "అగ్నిం నరో దీధితిభి రరణ్యోర్హస్తచ్యుతీ జనయన్త ప్రశ స్తమ్. దూరేదృశం గృహపతి మథర్యుమ్" (ఋ. ౭-౧-౧) దీధితయోఽఙ్గులయో భవన్తి. ధీయన్తే కర్మస్వరణీ ప్రత్యృత ఏనే అగ్నిః. సమరణాజ్జాయత ఇతి వా. హస్తచ్యుతీ హస్త

ప్రచ్యుత్యా. జనయన్త ప్రశ స్తం దూరే దర్శనం గృహపతి మతనవ స్తమ్.

అథర్యుమ్ - ఇత్యజ్ఞాతమ్. అతనవంతమిత్యర్థ ప్రతీతిః. గమనవన్త మిత్యర్థః తథా చ నిగమః. "అగ్నిం నరో...గృహపతి మథర్యుమ్" వశిష్ఠ స్యేయ మార్షమ్. అరణ్యోః దీధితిభిః ప్రశస్తమ్. దూరే దృశమ్ గృహ పతిమ్ అథర్యుమ్ అగ్నిం హస్తచ్యుతా జనయన్తః నరః ఇత్యన్వయః యస్మాదిమాః కర్మసు ధీయన్తే తస్మాత్ దీధితయః అంగుళయో భవన్తి. అరణీ కస్మాత్? ప్రత్యృత ఏనే ప్రతిగత ఇత్యర్థః - అగ్నిః సమరణాత్ అరణ్యోః సమరణాత్ సమాగమనాత్ జాయతే ఇత్యగ్నిః. హస్తచ్యుతీ హస్తాభ్యాం ప్రచ్యావయన్తః దూరే దృశమ్ దూరే దర్శనమ్. గృహాణాం పతిమ్ అథర్యుం వ్యాచష్టే అతనవంతం గమనశీలమ్. గత్యర్థాత్ అతతేః ల్యుటి అతనమ్ తద్వన్తమ్.

అథర్యుమ్ = అతనవ న్తమ్ = సతతగమనశీలుని, 'అత సాతత్య గమనే'ధాతువునకు ల్యుట్ ప్రత్యయముచేయుటచే అతనము సిద్ధమైనది, తప్ అస్యాస్తీతి అతనవాన్ = అతనముగలవాడు, అతనవంతుడు - అతన పదమునకు 'వతుప్' ప్రత్యయముచేసిన అతనవాన్ సిద్ధమగును. అతన వన్తమ్ = గతికలవానిని.

భాష్యార్థము :- దీధితయః = అంగుళులు-వ్రేళ్లు, ధీయన్తేకర్మసు= కర్మలందు వ్రేళ్లు ఉపయోగింపబడును. అరణీ అరణి ఎందువలన? ఏనే = ఈ యరణులను ప్రతిగతః ప్రత్యృతః=అగ్ని ప్రాప్తించును. అరణు లలో అగ్ని త్వరగా అంటుకొనును. అగ్ని వీనిదేనా అన్నట్లు అరణులలో త్వరగా వ్యాపించును. రెండు అరణులు కట్టెలు - పరస్పర సంఘర్షవలన అగ్ని యుత్పన్నమగును. ఋ గతౌధాతువుతో అరణిశబ్దము సిద్ధము. సమర ణాత్ జాయతే ఇతి వా = సమాగమము రెండుఅరణుల కలయికవలన చెప్పదును. హస్తచ్యుతి యనగా చేతులుపయోగించుటచే, ప్రశస్తం = ఉత్తమమైన దూరే దృశమ్ = అగ్నిదూరమునుండి కనబడునది - బాగుగ ప్రకాశించునది యని అర్థము, గృహపతిమ్ = గృహకార్యములను నడపునది.

మంత్రార్థము :- నరః = మనుజుడు, దీధితిభిః = అంగుళులతో - వ్రేళ్లతో పట్టుకొని, హస్తచ్యుతీ = చేతులతో అరణులలో సంఘర్షణము చేసినపుడు అగ్ని ఉత్పన్నమగును, ప్రశస్తమ్ = ఉత్తమము, దూరే దర్శమ్ = ప్రకాశమువలన దూరమునుండి కనబడునది, గృహపతిమ్ = ఇంటిపనులు నడపునది, అథర్యుమ్ = సతతగమనమొనర్చునది దేవతల వైపు ఊర్ధ్వగతి కలదియగు, అగ్నిమ్ = అగ్నిని, జనయన్త = ఉత్పన్న మొనర్తురుగాక !

కాణుకా - (౪.౨).

> "ఏకయా ప్రతిధాఽపిబత్. సాకం సరాంసి త్రింశతమ్. ఇంద్రః సోమస్య కాణుకా" ఏకేన ప్రతిధానేన అపిబత్ (ఋ. ౮-౭౭-౪) సాకం సహేత్యర్థః. ఇంద్రః సోమస్య కాణుకా కాన్తకానీతి వా. క్రాన్తకానీతివా కృతకానీతి వా. ఇంద్రః కాంత సోమస్య ఇతి వా కణేఘాత ఇతి వా కణేహతః కాన్తి తహః తత్రైతద్ యాజ్ఞికాః వేదయన్తే త్రింశదుక్థ పాత్రాణి మాధ్యందినే సవన ఏకదేవతాని తాన్యేతస్మిన్ కాల ఏకేన ప్రతిధానేన పిబన్తి తాన్యత్ర సరాంసి ఉచ్యన్తే. త్రింశద పరపక్షస్యాహోరాత్రాంస్త్రింశత్ పూర్వపక్షస్యేతి నైరుక్తాః. తద్యా ఏతాశ్చాంద్రమస్య ఆగామిన్య ఆపో భవన్తి రశ్మ యస్తా అపరపక్షే పిబన్తి. తథాపి నిగమో భవతి. "యమ క్షితి మక్షితయః పిబన్తి" ఇతి. తం పూర్వపక్ష ఆప్యాయ యన్తి తథాపి నిగమో భవతి. "యథా దేవా అంశు మాప్యాయయన్తి" ఇతి.

కాణుకా - అనవగతమేతత్. అనేకార్థత్వాత్. కాన్తకాని కృతకాని ఇతి వేత్యేవమాదయః శబ్దసమాధయః. నిగమేన సమర్థయతి - 'ఏకయా... కాణుకా'-కాణ్వస్య కురుసుతస్యేదు మార్షమ్. గాయత్రీ. ఏకయా ప్రతిధా ఏకేన ప్రణిధానేన సకృత్ ప్రణిహితేన చేతసా ఇత్యర్థః. ఇంద్రః సాకమ్ సహ త్రింశతం సోమస్య కాణుకా కాంతకాని సరాంసి పిబత్ అపిబత్.

కాణుకా కస్మాత్? యస్మాదేతాని కాంతకాని భవన్తి. ప్రియాణీత్యర్థః అథవా క్రాంతకాని పూర్ణాని సోమరసేన. కృతకాని ఇతి వా. ఋత్విగ్భిః ఇంద్రార్థం సంస్కృతాని. అథవేన్ద్రః సోమస్య కాణుకః కాన్తః రసిక ఇత్యర్థః అథవా కణేఘాతః కాణుకః కణేహత్య ఆకంఠం పానమిత్యర్థః.

అత్ర యాజ్ఞికానాం మతే త్రింశత్ సరాంసి ఉక్థపాత్రాణి మాధ్యం దినే సవనే ఏకదైవతాని - ఏతస్మిన్ తాని సర్వాణి ఏకేనైవ ప్రయత్నేన పిబతి అతః తానీహ సరాంసి ఇత్యుచ్యన్తే. పరం నైరుక్తానాం మతే త్రింశత్ అపరపక్షస్య అహోరాత్రాః త్రింశత్ పూర్వపక్షస్య. తద్ యాః ఏతాః చన్ద్రమసి భవా అపః భవన్తి రశ్మయః సూర్యస్యేతి శేషః. తాః చంద్రాదాగతా ఆపః అపరపక్షే పిబన్తి. ఏతచ్చ నిగమేనాపి ప్రతిపన్నమ్. "యమక్షితి - మక్షితయః పిబన్తి" అక్షితమ్ అక్షీణం సోమమ్. అక్షితయః సూర్యస్య రశ్మయః పిబన్తి. సూర్యస్య రశ్మయః చంద్రం పూర్వపక్షే ఆప్యాయయన్తి అపరపక్షే పీత్వా. అత్రాపి నిగమః - "యథా దేవా అంశు మాప్యాయయన్తి" యథా యేన ప్రకారేణ దేవాః సూర్యరశ్మయః అంశుం సోమమ్ ఆప్యాయయన్తి పూరయన్తి. తన్నైరుక్తానాం మతే సరస్ ఇత్యేతత్ జలనామ.

అర్థము :- కాణుకాపదమునకు మూడర్థములున్నవి. కాన్తకాని ఇతి వా. 'కము'కాన్తౌధాతువుతో సిద్ధమైన కాణుకాశబ్దమునకర్థము ప్రియము. సోమముతో నిండిన ప్రియసరోవరములను అనుసర్థమున కాంతి - అనఇచ్ఛ = కోరిక, క్రాంతకాని వా గత్యర్థక 'క్రము'ధాతువుతో సిద్ధమగు కాణుకాశబ్దము అఖిలం = సమస్తము, కార్త్స్న్యేన క్రాంతకాని నిచైర్ బిలం యావత్ గతాని = పూర్ణముగా సోమరసముతో నిండియున్న సరస్సులకు విశేషము. కృతకాని ఇతి వా. నిర్మలీకరణార్థక 'కృ'ధాతువుతో సిద్ధమయిన కాణుకాశబ్దమునకర్థము-యాజ్ఞికులచే శుద్ధముచేయబడి సిద్ధముచేయబడిన సరస్సులు అని యర్థము.

ఇంద్రః సోమస్య కాంత ఇతి వా = కాణుకాశబ్దము ఇంద్రశబ్దము నకు విశేషణము లేక కాణుకశబ్దమునకర్థము కాంతుడు ప్రియుడు, వల్లభుడు - అని ఇంద్రుడు సోమరసమునకు వల్లభుడు. కణేఘాతః, కణేహతః ఇతి వా. ఇచ్ఛాపర్యంతము తృప్తికలుగునంతవరకు త్రాగెనని

యర్థము. అనగా నిట కాణుకాశబ్దము క్రియావిశేషణమని తెలియనగును. కాణుకా యథాస్యాత్ తథా ఇంద్రః సోమస్య సరాంసి అపిబత్=ఇంద్రుడు తనకు బాగుగతృప్తికలుగునట్లు సోమరసముతోనిండిన సరోవరములను త్రాగెనని అర్థము. ఇట్లు కాణుకాపదము ఇంద్రునకు విశేషణము, సరో విశేషణము, పానవిశేషణమైనదని భావము.

మంత్రార్థము:- సోమస్య = సోమరసమునకు, కాణుకా = వల్లభుడు ప్రియుడునై ఏకాగ్రచిత్తముతో పూర్తిగానిండియున్న, కాణుకా = ఋత్విజులచే శుద్ధపఱచబడి సిద్ధముచేసిన సోమరసమును, త్రింశతే సరాంసి = ముప్పదిపాత్రలలో నిండియున్న సోమరసమును ఒక్కగ్రుక్కలో త్రాగెనని అర్థము. త్రింశత్ సరాంసి = అనగా మాధ్యందినసవనమునందు ఇంద్రదేవతాక ముప్పది ఉక్థసంబద్ధపాత్రలని యర్థము. సరాంసి అనగా ఉక్థసంబద్ధపాత్రలని యర్థము.

భాష్యార్థము :- ఏకేన ప్రతిధానేన = ఒకే చిత్తైకాగ్రతతో, అపిబత్= త్రాగెను, సాకమ్ = సహ, ఇంద్రః = ఇంద్రుడు, సోమస్య = సోమరసము యొక్క, కాణుకా = కాంతకాని ఇతి వా = ప్రియమైన, క్రాంతకాని ఇతి వా = లేక ఋత్విజులచే సిద్ధముచేయబడిన (ఇంద్రునిచే త్రాగబడుటకు) ఇంద్రః సోమస్య కాంతః ఇతి వా = ఇంద్రుడు సోమమునకు వల్లభుడు అని (ఇక్కడ కాణుకాపదము ఇంద్రవిశేషణము) కణేఘాతః ఇతి వా కణేహతుడు = కాంతిహతుడు. అనగా కంఠముపఱకు సోమరసమును పానముచేయుట, కణేశబ్దము శ్రద్ధాప్రతిఘాతమనునర్థమున ప్రయోగింపబడును. ఈ యర్థమున కాణుకాశబ్దము క్రియావిశేషణమగును. తత్ర = ఈ విషయమునందు యాజ్ఞికుల సిద్ధాంతము మఱియొకటియై యున్నది. త్రికంత్ ఉక్థపాత్రాణి, సరాంసి = ఉక్థపాత్రలు - త్రింశత్ = అవి ముప్పది, మాధ్యందినసవనే = మాధ్యందినసవనమునందు, ఏకదేవతాని= ఒకే ఇంద్రదేవతకు సంబంధించినవైన వాని సన్నిటిని, ఏకస్మిన్ కాలే = ఒకే సమయమున ఒకే చిత్తైకాగ్రతతో, పిబన్తి = త్రాగుదురు, తాని = ఆ ఉక్థపాత్రలే, సరాంసి=సరస్సులని యిట చెప్పబడినవి. కాని నైరుక్తాః= నిరుక్తకారులుమాత్రము వేఱుగా అంగీకరించుచున్నారు, త్రింశత్ అహోరాత్రములు - అనగా పదునైదు పగళ్లు, పదునైదురాత్రులు - కలిసిముప్పది

అహోరాత్రములు అను అపరపక్షము నంగీకరించుచున్నారు. త్రింశత్ పూర్వపక్షస్య = మఱియు నిట్లే దినరాత్రులు కలిసి (౩౦) ముప్పది పూర్వపక్షమునకు సంబంధించినవగును, తత్=అందువలన, తా ఏతాః = ఆ యీ, చాంద్రమస్యః = చంద్రునికి సంబంధించిన, ఆగామిన్యః = సూర్యుని నుండి వచ్చు, ప్రతిపత్ - పాడ్యమి, విదియ మున్నగు తిథులలో వచ్చునట్టి, అపఃరశ్మయః = ఉదకరూప - లేక ఉదకమువంటి శీతల కిరణములున్నవో వానిని, అపరపక్షే = కృష్ణపక్షమున, పిబన్తి = త్రాగుదురు, అట్లే మంత్రమున చెప్పబడినది. యమక్షితమ్ = చంద్రుని యందుచేరిన సుషుమ్ననామక సూర్యకిరణమును, కృష్ణపక్షమున, అక్షితయః పిబన్తి = సూర్యకిరణములు పానముచేయును, తమ్ = ఆచంద్రుని, పూర్వ = శుక్లపక్షమున సూర్యకిరణములు, ఆప్యాయయన్తి = వృద్ధి చేయును. అట్లే మంత్రమున చెప్పబడినది. యథా దేవా అంశుమ్ ఆప్యాయయన్తి = ఎట్లు దేవాః = సూర్యకిరణములు, అంశుమ్= చంద్రుని, ఆప్యాయయన్తి =వృద్ధినొందించును.

అధ్రిగుః - (౪౩).

> అధ్రిగుః మన్త్రో భవతి. గవ్యధికృతత్వాదపి వా ప్రశాసన మేవాభిప్రేతం స్యాత్తచ్ఛబ్దవత్వాదధ్రిగో శమీధ్వం సుశమి శమీధ్వం శమీధ్వమధ్రిగవితి.

అధ్రిగుః - అనవగతమేతత్. అనేకార్థత్వాత్. అధ్రిగుః మంత్రః కస్మాత్ ? గవి అధికృతో భవతి. అథవా అధ్రిగు శబ్దేన ప్రశాసనం సంప్రేషణమభిప్రేతమ్ స్యాత్ - గోరనిత్యత్వాత్. అధిగో శబ్దవత్వాత్ అధ్రిగుః నామ దైవ్యః శమితా తస్య ప్రశాసనమేతత్ స్యాత్. తద్ యథా హే అధ్రిగో ! అధృతగమన ! అగ్నే ! శచీవః కర్మవన్ తుభ్యం త్వదర్థమ్. శ్చ్యోతన్తి క్షరన్తి. ఇంద్రోఽపి అధ్రిగుః. సోఽపి అధర గమనః. తథా చ నిగమః - అధ్రిగవ ఓహ మింద్రాయ" ఓహమ్ ఊహమ్.

అర్థము:— అధ్రిగుః - మంత్రః=అధ్రిగుపదమునకర్థము మంత్రము. గవి అధికృతత్వాత్ = వేదవాణియందు అధికృతమగుటవలన, అపివా లేక, తచ్ఛబ్దవత్వాత్ = ఆశబ్దము అధ్రిగో కలిగియుండుటవలన, ప్రశాసన

మేవ = ప్రశాసన రూపకార్యమే, అభిప్రేతమ్ = ఇష్టమైనది. అనగా శాసకుడగు రాజును అధిగుః అందురు. గవి = భూమిపై, అధికృతః = అధికృతుడు, అధిగుః = భూమికి అధిపతి యగును మంత్రమిట్లే చెప్పుచున్నది - శమిత ! = బాగుగశాంతిని స్థాపించునట్టి, అధ్రిగో ! = ఓ శాసకుడవగునోరాజా ! శమీధ్వమ్ = శాంతిని స్థాపింపుము. శమీధ్వమ్ = శాంతిని స్థాపించుము. ఇది ఐతరేయ బ్రాహ్మణవచనము. అగ్నిః అపి=అగ్నికూడ, అధ్రిగుః ఉచ్యతే = అధ్రిగు అని చెప్పబడును. అట్లే మంత్రము చెప్పుచున్నది. "తుభ్యంశ్చోతన్తి అధ్రిగో శచీవః" అధ్రిగో ! = అధృతగమన ! ఎన్నడు నష్టము కానిగతికలవాడా మఱియు శచీవః ! = కావున నెల్లపుడును కర్మవత్ = కర్మశీలుడవగునో అగ్నే !, తుభ్యం = నీకొఱకు, శ్చోతన్తి = ఘృతాదులు - స్నిగ్ధపదార్థములు ఇచ్చుచుందురు, ఇంద్రః అపి అధ్రిగుః ఉచ్యతే = ఇంద్రుడుకూడ అధ్రిగుః అనబడును, ఇందుకు మంత్రము "అధ్రిగవ ఓహమింద్రాయ" అధ్రిగవే=సదాగమనశీలుడు, అప్రతిహత = అడ్డులేని గతికలవాడునగు, ఇంద్రాయ = ఇంద్రునికొఱకు, ఓహమ్ = మిక్కిలిశ్రేష్ఠము, దానముచేయదగినదియునగు ధనమును ఇచ్చుచున్నాడు.

అఙ్గూషః - (౪౪).

> ఆఙ్గూషః స్తోమ ఆఘోషః. "ఏనాఙ్గూషేణ వయమింద్ర వన్తః" (ఋ. ౧-౧౦౫-౧౯) అనేన స్తోమేన వయమింద్ర వన్తః.

అఙ్గూషః - అప్రతీతార్థమ్. ఆఘోషః ఇతి ప్రతీతార్థమ్. స్తోమోఽభిధేయః తథా చ నిగమః - "ఏనాంగూషేణ వయమింద్రవన్తః" ఏనా ఏనేన స్తోమేన స్తుత్వా వయమింద్రవన్తః - ఇంద్రయుక్తాః స్యామేతి.

అర్థము :- అంగూషః = స్తోమః - స్తోమవేదమర్థము, ఏలయన వేదమే, ఆఘోషః = ఘోషింపదగినది - అంతట ప్రచారము చేయదగినది.

మంత్రార్థము :- ఏనఅంగూషేణ = అంతటప్రచారముచేయదగిన యీ స్తోమవేదమును పఠించుటవలన వయమ్ = మేము, ఇంద్రవన్తః =

పవిత్ర - శ్రేష్ఠఆత్మగలవారము అగుదుము, లేదా పరమేశ్వరునిచే అను గృహీతులమగుదుము. ఇంద్రః = ఆత్మా - పరమాత్మ యనియర్థము.

ఆపాన్తమన్యుః - (౪౫).

> "ఆపాంతమన్యుస్తృపల ప్రభర్మా ధునిః శిమీవాఞ్ఛరుమాఀ ఋజీషీ. సోమో విశ్వాన్యతసా వనాని నార్వాగింద్రం ప్రతిమానాని దేభుః" (ఋ. ౧౦-౮౯-౫)

ఆపాతితమన్యుః తృప్రప్రహారీ క్షిప్రప్రహారీ సోమో వేంద్రో వా. ధునిః ధునోతేః. శిమీతికర్మనామ. శమయతేర్వా శక్నోతేర్వా - ఋజీషీ సోమః యత్ సోమస్య పూయమానస్యాతిరిచ్యతే తద్ ఋజీషమ్ అపార్జితం భవతి. తేనర్జీషీ సోమః అథాప్యైన్ద్రో నిగమో భవతి. "ఋజీషీ వజ్రీ" (ఋ. ౫-౪౦-౪) ఇతి హర్యోరస్య స భాగో ధానాశ్చ. ధానా భ్రాష్ట్రే హితా భవన్తి. ఫలే హితా భవన్తీతి వా. "బబ్ధాం తే హరీ ధానా ఉపఋజీషం జిఘ్రతామ్" ఇత్యపి నిగమో భవతి. ఆదినాభ్యాసే నోపహితే నోపదామాదత్తే. బభస్తిరత్తికర్మా. సోమః సర్వాణ్యతసాని వనాని. నార్వాగింద్రం ప్రతిమానాని దభ్నువన్తి యైరేనం ప్రతిమిమతే నైనం తాని దభ్నువన్తి. అర్వాగేవైన మప్రాప్య వినశ్యన్తీతి ఇంద్రప్రధానేత్యేకే. నైఘంటుకం సోమకర్మోభయప్రధానేత్యపరమ్.

ఆపాన్తమన్యుః - అనవగతమేతత్. ఆపాతితమన్యు రిత్యవగమః. తథా చ నిగమః - "ఆపాన్తమన్యు... ప్రతిభాజనాని దేభుః" విశ్వామిత్ర సుతస్య రేణో రియ మార్షమ్. త్రిష్టుప్ ఆపాన్తమన్యుః - ఆపాదితదీప్తిః. ఉత్పాదితక్రోధో వా, అరిఘ్నతమో తృపల ప్రభర్మా క్షిప్రప్రహారీ ధునిః శత్రూణాం ధూనయితా. శిమీవాన్ కర్మవాన్ శమమాన్ హింసావాన్. ఋజీషీ సోమః ఇంద్రశ్చ. విశ్వాని సమగ్రాణి. అతసా అనుపక్షీణాని వనాని జలాని అర్వాగేవ ఊనాన్యేవ తస్మాదింద్రాత్. ప్రతిమానాని స్తోత్రాణి. న దేభుః న దభ్నువన్తి నాభిభవితుం శక్నువన్తీత్యర్థః. పూయమానస్య సోమస్య యత్, అతిరిచ్యతే అసారం కిట్టమ్ తత్ 'ఋజీషం' భవతి. తద్వాన్ ఋజీషీ సోమః ఇంద్రోఽపి ఋజీషీ యతోఽవశిష్టమ్ ఋజీషమ్ ఇంద్రస్య హర్యోరశ్వయో ర్భాగః. ఋజీషీ వజ్రీ" ఇతి నిగమేనాపి చైతదేవ సమర్థ్యతే

ధానాశ్చ. ధానాః కస్మాత్. భ్రాష్ట్రే హితా నిహితా భవన్తి. అథవా భ్రాష్ట్రా
దపతార్య ఫలే ఫలకే నిహితా భవన్తి. తథా చ నిగమః. "బబ్ధాం తే హరీ
ధానా ఉపజిఘ్రతామ్" ఇత్యనేన నిగమేన ధానా ఋజీషం సోమ - ఋజీషమ్
చ ఇంద్రస్యాశ్వయోరేవ భాగః ఇతి సిద్ధ్యతి. అత ఏవేయమ్ ఋక్ స ఉభయ
ప్రధానా అపి తు ఐంద్ర్యేవ. బబ్ధామ్ ఇత్యేతత్ పదం వ్యాకరోతి -
బభస్తిః భక్షణార్థః అదినా అభ్యాసేన ఉపహితేన ఉపశ్లిష్టేన భభస్ఇతి
ద్విత్వీకృతేనేత్యర్థః. ఉపధామా దత్తే లుంపతీత్యర్థః. ఘసిభసోర్ హలి చ
ఇత్యనేన సూత్రేణోపధాలోపే ధత్వే చ కృతే జశ్త్వేన బబ్ధామ్ ఇత్యేతత్
వ్యాకృతం భవతి. కేచిత్ ఇమాముభయప్రధానా మపి మన్యన్తే ద్వౌ
ప్రథమౌ పాదౌ ఐంద్రౌ తృతీయశ్చ సౌమ్య ఇతి.

భాష్యార్థము :— అపాతతమన్యుః = క్రోధయుక్తుడు, దీప్తి
యుక్తుడు, తృప్రప్రహరీ = శీఘ్రముగా ప్రహరమొనర్చువాడు, సోమపాన
మొనర్చినవాడు శీఘ్రప్రహరము చేయుగలడు, ఇంద్రో వా ఇంద్రః = సోమ
పానముచేసిన ఇంద్రుడుకూడ శీఘ్రప్రహరమొనర్చువాడు అని సోమపక్షము
నను చేయువచ్చును, ధునిః ధునోతేః = ధూఞ్ ధాతువుతో ధుని సిద్ధ
మగును, శమీతి = కర్మనామము, శమయతేః = కర్మ అనిష్టమును
శమింపజేయును, శక్నోతేర్వా = లేక కర్మవలన మనుజుడు సమర్థుడగును,
శమీ = ణ్యన్తశముధాతువుతో కాని 'శక్'ధాతువుతో కాని సిద్ధమగును
ఋజీషీ = సోమము, సోమస్య హూయమానస్య = వడపోసిన సోమము
యొక్క, యత్=మిగిలిన భాగము, తద్ఋజీషమ్ = ఋజీషమనబడును,
అథాపి ఐన్ద్రో నిగమో భవతి = మఱియు ఋజీషీ అనునది ఇంద్రుని
నామముగా మంత్రమున ప్రయుక్తమైనది. "ఋజీషీ వజ్రీ" ఇతి =
ఇంద్రుడు ఋజీషి యనబడును. ఇంద్రప్రశస్తములైన అశ్వములు,
వజ్రముకలవాడు. ఇట 'ఋజీష' = సోమముయొక్క పిప్పిని తినునది
(అర్శఆదిభ్యోఽచ్ చేసినసిద్ధమగును) అశ్వమనబడును. ప్రశస్తములైన
అశ్వములుగల ఇంద్రుడు ఋజీషీ అనబడును, హర్యోరస్య స భాగో
ధనాశ్చ సః = ఆ ఋజీష - సోమమునకు సంబంధించిన పిప్పి గుజ్జముల
భాగము, మఱియు ధానాః=వేయించినయవలు మున్నగుధాన్యములును
గుజ్జములభాగమే, హే ఇంద్ర! తే హరీ = నీ అశ్వములు, ధానాః =

వేపుడుయవలు మున్నగుధాన్యములను, బబ్ధామ్ = భక్షించునుగాక! ఉప ఋజీషం జిఘ్రతామ్ = ఋజీషం = ఉపజిఘ్రతామ్ తినునుగాక! - ఇట్టి మంత్రములు కలవు. అభ్యాసేన భస ఉపహితేన=ఆదినా = మొదట - అభ్యాసముతో ఉపహిత ఉపశ్లిష్ట ద్విత్వముచేయబడిన, ఉపధామ ఆదత్తే= ఉపధయైన అకారములోపించును, బభస్తిః అత్తికర్మా ='భస'ధాతువు తినుట యనునర్థమున వచ్చును, సోమః సర్వాణి అతసాని వనాని = సోమము సమస్తఅక్షీణవనములను తన మహిమచే వ్యాప్తమైయున్నది, నార్వాగింద్రం ప్రతిమానాని దభ్నువన్తి ఇంద్రమ్=ఇంద్రుని ఉపమానము లన్నియు ప్రత్యర్థులై, న దభ్నువన్తి=నష్టపఱపజాలవు, అతని యెదుట నిలబడజాలవు, యైరేనం ప్రతిమిమతే యైః=వేనితో ఇంద్రుని ఉపమింప జాలుదువో, ఉపమిమతే = లేక ఎదిరింపజాలుదువో - పరాజితునిచేయ గలుగుదువో నాశనముచేయలేమో అర్వాక్ ఏవ = ముందుగానే ఇతనిని పొందకయే, వినశ్యన్తి = నశించును, కొందఱీమంత్రమును ఇంద్రప్రధాన ముగా నంగీకరింతురు.

మంత్రార్థము :- ఇంద్రపక్షమున అషాంతమన్యుః=క్రోధయుక్తుడు, తృపలప్రభర్మా = శత్రుప్రహారము శీఘ్రముగా చేయువాడు, ధునిః = శత్రువులను కంపింపజేయువాడు, శిమీవాన్ = కర్మశీలుడు, శరుమాన్ = అస్త్రములతో సుసజ్జితుడై హింసావంతుడు, ఋజీషీ=ప్రశస్త అశ్వములు కలవాడునైన ఇంద్రుడు విశ్వానిఅతసావనాని=సమస్తవనములను, జలము లను తనమహిమతో వ్యాపించియున్నవాడు. అట్టి ఇంద్రుని, ప్రతిమానాని= లోకమున నెట్టి యుపమానములు, న దేభుః = నశింపజేయజాలవు - పైపెచ్చు ఈ యుపమానములన్నియు ఇంద్రుని ఎదుర్కొనుటలో స్వయ ముగానే నశించును. ఇంద్రుని సమీపింపజాలవు.

సోమపక్షమున - అషాంతమన్యుః = సంస్కారముతో దేనిదీప్తియుత్ప న్నము చేయబడినదో, తృపలప్రభర్మా = అభిషవపాషాణములతో శీఘ్ర ప్రహారములతోకూడిన, ధునిః = పాత్రములను కంపింపజేయు, శిమీ వాన్ = యజ్ఞమువలన కర్మశీలము, శరుమాన్ = అభిషవసంబంధి హింసా యుక్తము, ఋజీషీ = పిప్పిగల, సోమరసము, విశ్వాని=సమస్త అతసా = క్షీణముగాని, వనాని = వనములను, జలాని = జలములను తన సామర్థ్య

ముతో తిరస్కరింపబడై యున్నది. ప్రతిమానాని = సర్వోపమానములు, నదేషుః = ఈ సోమము నెదుర్కొనజాలవు - సర్వశ్రేష్ఠమని భావము.

శ్మశా - (౪౬).

"శ్మశా శు అశ్నుత ఇతి వా. శ్మాశ్నుత ఇతి వా. "అవ శ్మశా రుధద్ వాః అవారుధత్ శ్మశావారితి (ఋ. ౧౦-౧౦౫-౧)

శ్మశా అస్పష్టమేతత్. శ్మాశనీ శ్మాశనీ త్యపగమః. శు శీఘ్రమ్ అశ్నుతే వ్యాప్నోతీతి శ్మాశనీ కుల్యా నదీ వా. శ్మ శరీరమ్ అశ్నుతే ఇతి శ్మాశనీ నాడీ - విగృహ్యమాణమేతత్పదమనేకార్థమపి భవతి. నిగమే నోదాహరతి - "అవ శ్మశాః రుధద్వాః" అవారుధత్ ఉపరోత్స్యతి వాః జలమ్. శ్మశా ఇవ కుల్యోపోదకమ్.

శ్మశా - ఈ పదము నది, కాలువ, నాడి అనువానికి వాచకము. నది, కాలువ అని అర్థము చెప్పునపుడు పదము శు అశ్నుతే: శు శీఘ్రముగా అశ్నుతే = వ్యాపించును. అని శు ధాతువుతో శ్మశా సిద్ధమగును. శ్మశా = నాడికి వాచకమైనపుడు, శ్మ = శరీరమున, అశ్నుతే = వ్యాపించును అని వ్యుత్పత్తి చెప్పవలయును.

మంత్రార్థము :- శ్మశా = నది, కాలువ యెట్లు, వాః = జలమును, అవారుధత్ = అడ్డగించునో, అథవా = లేక, నాడి శరీరమును నెట్లు వ్యాపించునో అట్లే హే ఇంద్ర! నా స్తుతి నిన్నెన్నడు అడ్డగించును? నా యీ ప్రార్థన నిన్నెప్పుడు నాకనుకూలుని జేయును?

ఇతి ద్వితీయపాదము

ద్వితీయపాదము సమాప్తము

## తృ తీ య పా ద ము

ఉర్వశీ - (౪౭).

ఉర్వశ్యప్సరా, ఉర్వభ్యశ్నుతే ఊరుభ్యా మశ్నుతే, ఉరుర్వా వశో అస్యాః, అప్సరా అప్సారిణీ, అపి వాఽప్స ఇతి రూప నామాప్సాతేరప్సానీయం భవత్యాదర్శనీయం, వ్యాపనీయం

వా స్పష్టం దర్శనాయేతి శాకపూణిః. 'యదప్స' ఇత్యభక్షస్య, అప్సో నామ, ఇతి వ్యాపినః. తద్రా భవతి రూపవతీ, తదన యాత్త మితి వా; తదస్యై ద త్తమితి వా.

తస్యా దర్శనాన్మిత్రావరుణయోః రేతశ్చస్కన్ద. తదభివాది న్యేషర్గ్ భవతి. "ఉతాసి మైత్రావరుణో వసిష్ఠోర్వశ్యా బ్రహ్మన్ మనసోఽధిజాతః. ద్రప్సం స్కన్నం బ్రహ్మణా దైవ్యేన విశ్వేదేవాః పుష్కరే త్వాదద న్త" (ఋ.౭-౩౩-౧౧) అప్యసి మైత్రావరుణో వసిష్ఠోర్వశ్యా బ్రహ్మన్ మనసో అధి జాతో ద్రప్సం స్కన్నం బ్రహ్మణా దైవ్యేన. "ద్రప్సః సంభృతః ప్సానీయో భవతి. సర్వే దేవాః పుష్కరే త్వాఽ ధారయన్త. పుష్కరమంతరిక్షం పోషతి భూతాని ఉదకం పుష్కరం పూజాకరం పూజయితవ్యం వా. ఇదమపీతరత్ పుష్కరమేతస్మాదేవ పుష్కరం వపుష్కరం వా. పుష్పం పుష్పతేః" (యజు.౧-౧౪)

ఉర్వశీ - అప్సృష్టమ్. ఉరు మహద్ యశః అభ్యశ్నుతే అభివ్యాప్నోతి, ఊరుభ్యాం పురుషం సంగమసమయే అశ్నుతే - వ్యాప్నోతి, అథవా ఉరుః మహాన్ అస్యాః వశః కామః ఇత్యేతే శబ్దసమాధయః. ఉర్వశీ అప్సరసానామ. అప్సరాః కస్మాత్? అద్భ్యః సృతాః నిర్గతాః ఇత్యప్సరసః. అథవా అప్స ఇతి రూపనామ. కస్మాత్? ప్సాతేః ప్రతిషేధపూర్వాత్ భక్షణార్థాత్ రూపం హి అప్సానీయం అనదనీయం భవతి. తత్తు ఆదర్శనీయమ్ అభిముఖ్యేన ద్రష్టవ్యం భవతి. అథవా ఆప్నోతేః అప్సః. దర్శనాయ స్పష్టం భవతి ఇతి శాకపూణిః. అప్సం రూపం గృష్ణాతీతి అప్సరాః ఇతి. రూపవతి ఇత్యర్థః. తద్ అప్సః రూపమ్ అనయా ఆత్తం గృహీతం వేత్యప్సరాః (రాతిరాదా నార్థః). అథవా తద్రూపమ్ ధాత్రా అస్యై దత్తమితి వా. తామ్ ఉర్వశీం దృష్ట్వా మిత్రావరుణయోః రేతః చస్కంద స్కన్నమ్. ఇమమర్థమ్ ఏషా వక్ష్యమాణా ఋక్ ప్రతిపాదయతి - "ఉతాసి...దదన్త" వశిష్ఠస్య సపుత్రస్యేయ మార్షమ్. ఉతాసి - అప్యసి మైత్రావరుణః హే వశిష్ఠ త్వం మిత్రావరుణయో రుత్పన్నోఽసి? కిం సంఘర్షేణ ఉర్వశ్యాః సకాశాత్ న.

హే బ్రహ్మన్! త్వం మనసోఽధిజాతః స సంభూతేణ. తత్ కిం త్వం మనసోఽభిధ్యానాదేవోత్పన్నః? ఇత్యాహ న. కథం పునరుత్పన్నః? ఉచ్యతే ఉర్వశీ దర్శనాత్ మిత్రావరుణయోః ద్రప్సం వీర్యం స్కన్నమ్. దేవానాం స్వభూతేన బ్రహ్మణా ఋగ్ యజుః సామాఖ్యేన విశ్వేదేవాః మైతద్ భూమౌ నిపతేదితి కుంభస్యోపరి పుష్కరే ఉదకే అంతరిక్షే వా త్వా త్వాం తేన శుక్రేణ సహైకతాం గతమ్ అదస్త ఆధారయన్నిత్యర్థః. ద్రప్సః వీర్యం కస్మాత్? స హి సంభృతః స్త్రీయోనేః ప్సానీయో భక్షణీయో భవతి. భరణీయశ్చ. పుష్కరమ్ అంతరిక్షమ్ తద్ధి భూతాని పోషతి పాలయతి. జలమపి పుష్కరమ్. తదపి భూతాని పోషయతి. ప్రాణాకరం కమలాపర పర్యాయం పుష్కరశబ్దేనోచ్యతే. యస్మాదేతత్ వపుషః కరం పోషకం భవతి. పుష్పం కస్మాత్? పుష్పతేరితి. ఇత్యేవమనేకార్థః పుష్కరశబ్దః.

అర్థము :– ఉర్వశీ ఇది అప్సరకు వాచకము. ఈ యప్సర విద్యుత్తు స్త్రీ - కూడ. దీని నిర్వచనమిట్లున్నది - ఉరు అభ్యశ్నుతే - ఉరు= అధికముగ, అభ్యశ్నుతే = నలువైపుల వ్యాపించును - విద్యుత్తువ్యాపకము. స్త్రీకూడ తనగుణములచే వ్యాపకము, ఉరుభ్యామశ్నుతే = విద్యుత్తు రెండు పెద్దపదార్థములతో వ్యాపించును. స్త్రీ పక్షమున పెద్దబంధులతో లేక జ్ఞాన కర్మలతో వ్యాప్తమగును. ఉరుర్వా వశో అస్యాః. అస్యాః = ఈ విద్యుత్తు యొక్క, స్త్రీయొక్కయు, వశః=వశము, ఉరు=పెద్దది విద్యుత్తువశములో సమస్తప్రపంచముండును. ఇంటిస్థితి యంతయు స్త్రీ వశమున నుండును. అప్సరా అప్సారిణీ = విద్యుత్తు జలములో నడచును. స్త్రీకూడ కర్మలందు బాగుగ చరించును. కావున విద్యుత్తు స్త్రీ అప్సరాయనబడును. అప్ కర్మకుకూడ పేరు. అప్ జలమనుట ప్రసిద్ధమే. 'సృగతౌ' ధాతువువలన సారిణీశబ్దము సిద్ధించును. అప్స = జలములందు, కర్మలందు చరించు స్వభావము కలిగియుండుటచే విద్యుత్తు స్త్రీ అప్సర యనబడును. అపివా= లేక - అప్స - ఇది రూపమునకు నామము. అప్సకు మతుప్ అర్థములో రచేర్చి టాప్ చేసిన అప్సరా శబ్దము సిద్ధించును. ఇట్లు అప్సర అనగా రూపవతి అని యర్థమగును, అప్స = రూపము, రా = దానిని గ్రహించు, నది - అప్సరా యనబడును, తత్ = ఆ రూపము, అనయా = ఈమెచే, ఆత్తమ్ = పొందబడినది. కావునను అప్సర రూపవతి యని భావము

'రా దానే' అనుధాతువుతో ఏర్పడును - కావున అప్సర యనబడును. తత్ = ఆ రూపము పరమేశ్వరునిచే విద్యుత్తునకు, స్త్రీకి, దత్తమ్ = ఇయ్యబడినది. కావున స్త్రీ, విద్యుత్తులు అప్సరనామముచే చెప్పబడును, అప్సాతే రప్సానీయం భవతి - 'ప్సా భక్షణే' ధాతువునకు విపరీతార్థము అభక్షణ అర్థము గ్రహించి నఞ్ పూర్వక 'ప్సా' ధాతువుతో అప్సరాశబ్దము సిద్ధము చేయవచ్చును. అప్పుడు అప్సానీయం భవతి. స్త్రీరూపము అభక్షణీయం = భక్షింపదగినది కాదు. విద్యుత్తురూపము భక్షణీయము కాదు. అపితు = అయితే, ఆదర్శనీయం వ్యాపనీయం వా భవతి = ఆరూపము దర్శనీయమగును. కాని భక్షణీయము కాదు కావున నఞ్ పూర్వక 'ప్సా' ధాతువుతో అప్సరాశబ్దము సిద్ధముచేసికొనవలెను. కావుననే శాకపూణి ఆచార్యుడు స్త్రీ, విద్యుత్తుల రూపము దర్శనీయమే, కాని స్పర్శనీయము కాదనుచున్నాడు. కావున నఞ్ పూర్వక 'స్పృశ' ధాతువునందలి సకారమునకు పకారవిపర్యయము, వర్ణలోపముచేసిన అప్స - (అస్పృశ్య) సిద్ధమగును. అప్సనుండి అప్సరా అగును. యదప్స ఇతి అభక్షస్య = అప్స అభక్షనామము 'అప్సానామ' అప్స అనునది వ్యాపకము - వ్యాపకశీలముగలదానికి నామము. ఈ మంత్రమునందు అప్స పదము అభక్ష్యము వ్యాపి అనునర్థమున ప్రయుక్తమైనదని తెలియదగును. తస్యాః = ఆ ఉర్వశీ - విద్యుత్తు దర్శనమువలన మిత్రావరుణయోః = మిత్రావరుణములనుపేర్లుగల రెండువాయువుల, రేతః = బలము, చస్కంద = కారెను. (నిఘంటువునందు రేతస్సు బలనామములో పఠింపబడినది) తదభివాదినీ ఏషా ఋక్ - ఆ విషయమునే ఋక్ చెప్పుచున్నది.

మంత్రార్థము :— వసిష్ఠ! వాసకతమమగు నోజలమా! మైత్రావరుణః అసి = నీవు మిత్ర, వరుణనామములుగల ద్వివిధవాయువులవలన జనించితివి, బ్రహ్మన్! = అన్నదాతవగు నోజలమా! ఉర్వశ్యా మనసః - అధిజాతః = నీవు విద్యుత్తుయొక్క సంకల్పసామర్థ్యమువలన జనించితివి, ద్రప్సం స్కన్నం త్వా = జలరూపమున పరిణమించిన నిన్ను, దైవ్యేన బ్రహ్మణా = ఉత్తమ - అన్నము నుత్పన్నముచేయుటకు విశ్వేదేవాః = సమస్తదేవతలు, సూర్యకిరణములు, పుష్కరే = అంతరిక్షమున, త్వా అదధత = నిన్ను ధారణచేయుచున్నవి.

భాష్యార్థము :- అప్యసి మైత్రావరుణః వసిష్ఠ ! వాసకతమ జలము కావున, అసి = అయితివి, కించ = మఱియు నీవు మిత్రావరుణులకు పుట్టిన వాడవు, బ్రహ్మన్=ఓ అన్నదాత !, ఉర్వశ్యాః=విద్యుత్తు యొక్క, మనసః= మనస్సునుండి, అధిజాతః = ఉత్పన్నమైనవి, ద్రప్సం స్కన్నం త్వా=జల రూపమున పరిణమించిన విద్యుత్తుయొక్క మనస్సునుండి యుత్పన్నమైన దనిభావము. అట్టి నిన్ను దైవేన బ్రహ్మణా=ఉత్తమమగు అన్నము నుత్పన్నము చేయుటకు, ద్రప్సః=జలసంస్కృతః=ఏకత్రితమగుచు, స్నానీయః భక్షణీయ= భోగయోగ్యమగుచున్నది, విశ్వేదేవాః పుష్కరే = సమస్తదేవతలు అంత రిక్షమున, త్వా = నిన్ను, అధారయన్త = ధారణచేయుచున్నారు. జలము జీవనమున కాధారము. అదియేయము ఉపభోగార్హము. ఆచార్యులు కొందఱు ద్రప్సమును వీర్యమందురు. స్నానీయ = భక్షణీయమగుటవలన సంభోగయోగ్యమందురు, ఏలయన వీర్యము దానికి భక్షణీయము, పుష్కరమ్ = అంతరిక్షము ఏలయన ఇది భూతములను పోషించును, ఉదకం = జలముకూడ పుష్కరమనబడును. ఇట జలార్థకపుష్కరము పూజార్థకము, పూజయితవ్యమ్ = దేవ, పితృమనుష్యుల తర్పణలో ఉప యోగపడును. ఈ జలము దేవతయగుటచే పూజనీయముకూడ. పుష్కర శబ్దము మఱియొక అర్థము వపుష్కరమ్ = పుష్కరశబ్దము నుండియే వపుష్కరశబ్దమేర్పడినది. శరీరమును శోభావంతము చేయునది వపుష్కర మగును. పుష్కరమనగా కమలము. కమలమువలనే శరీరము సలంక రింతురు. వికసనార్థక పుష్పధాతువుచే పుష్పశబ్దమేర్పడును. పుష్పము వికసించును కదా !

వయునమ్ - (౪౮).

> వయునం వేతేః కాన్తిర్వా ప్రజ్ఞా వా “స ఇత్తమోఽవయునం
> తతన్వత్ సూర్యేణ వయునవచ్చకార” (ఋ. ౬-౨౧-౩)

స తమోఽప్రజ్ఞానం తతన్వత్ స తం సూర్యేణ ప్రజ్ఞానవచ్చకార. వయునమ్ అనేకార్థమ్ అస్పష్టం చ. వయునం వేతేః ఇతి ధాతునిర్దేశః ఇదేవం కాన్తిః ప్రజ్ఞా వా. తథా చ నిగమః “స ఇత్తమో ... వయునవచ్చ కార” సః ఇంద్రః ఇత్ ఏతత్ నైకం తమః అవయునమ్. అప్రజ్ఞాన

లక్షణమ్. తతన్వత్ - సర్వతః తతమ్ సూర్యేణ వయునవత్ ప్రజ్ఞానవత్ చకార.

అర్థము :- వయునమ్ ఈశబ్దమున కర్థము కాంతి మఱియు ప్రజ్ఞానము బుద్ధి - 'వీ' ధాతువుతో వయునశబ్దమేర్పడును.

మంత్రార్థము :- స ఇత్ = పరమైశ్వర్యవంతుడగు పరమేశ్వరుడు అంతట వ్యాపించియున్న ఆవయునమ్ = అంధకారమును-అజ్ఞానాంధకారమును, ఆ తన్వత్=అంతటవ్యాపించియున్న అంధకారమును తొలగించిసూర్యోదయము మూలమున సర్వమును కాంతివంతము ప్రజ్ఞావంతము చేసెను.

వాజస్పత్యమ్ - (౪౯).

**వాజస్పత్యమ్ - వాజపతనమ్ "సనేమ వాజస్పత్యమ్" (ఋ. ౯-౯౮-౧౨) ఇత్యపి నిగమో భవతి.**

వాజస్పత్యమ్ - అజ్ఞాతమేతత్ వాజపతన మిత్యవగమః తథా చ నిగమః. "సనేమ వాజపత్యమ్" వాజమన్నమ్. ఏతదస్మాకమితి మన్యమానాః సన్తో యం సోమమాభిముఖ్యేన పతన్తి స వాజపత్యః సోమః సనేమ భజేమహి.

వాజస్పత్యమ్ = వాజపతనమ్. అనగా సోమము, వాజమ్=అన్నము, పత్యం=పతనము, యస్మిన్ అన్నం పతనం తమ్ దనియందుకలదో, తమ్= అతనిని అనగా సోమమున కెదురుగా నిలబడి ఇది వాజము = అన్నము, మాకిది సర్వోత్తమభోజ్య పదార్థము అని యెంచి దానిని పొందుటకు దాని మీద - పత్యః = విరగబడుదురో, సఃవాజస్పత్యః = అది సోమము

మంత్రార్థము :- వాజస్పత్యమ్ = బుద్ధివర్ధకమగు సోమమును, సనేమ = సేవింతుముగాక!

వాజగంధ్యమ్ - (౫౦)

**వాజగంధ్యమ్ గధ్యత్యుత్తరపదమ్. "అశ్యామ వాజగంధ్యమ్" ఋ. ౯-౯౮-౧౨) ఇత్యపి నిగమో భవతి.**

వాజగంధ్యమ్ - కేవలం గధ్యతెః ఉత్తరే పదే యస్య తాదృశమ్ గధ్యమ్ గ్రాహ్యమ్.

అర్థము :- వాజగంధ్యమ్ - వాజాయ బలాయ గంధ్యమ్ గధ్యమ్ గ్రాహ్యమ్ = బలముకొఱకు గ్రహింపదగిన పాలు, ఘృతము పెరుగు మున్నగునవి వాజగంధ్యమనబడును. వాజగంధ్యము అనునీపదమున గధ్యపదము ఉత్తరపదమునున్నది.

మంత్రార్థము :- అశ్యామ = మేము పొందుదుముగాక! వాజగంధ్యమ్ బలముకలిగించు క్షీరఘృతాదులను.

గధ్యమ్ - (౫౧).

**గధ్యమ్ గృహ్ణాతేః. "ఋజ్రా వాజం న గధ్యం యుయూషన్" (ఋ. ౪-౧౬-౧౧) ఇత్యపి నిగమో భవతి.**

గధ్యమ్ = అస్పష్టమ్. గధ్యమ్ గృహ్ణాతేః - గ్రాహ్యమిత్యర్థః తథా చ నిగమః. ఋజ్రా వాజం న గధ్యం యుయూషన్ ఋజ్రా ఋజునా మార్గేణ. వాజం న గధ్యమ్. అన్నమివ గ్రాహ్యమ్ యుయూషన్ = పునః పునః మిశ్రయన్. గధ్యమ్ = ఈ శబ్దము గృహ్ణాతేః 'గ్రహ' ఉపాదానే ధాతువుతో నేర్పడును.

మంత్రార్థము :- హే ఇంద్ర! వాజం = అన్నమువలె, గధ్యమ్ = గ్రహింపదగిన పదార్థమును, యుయూషన్ = ప్రాప్తింప గోరుచు నీవు ఋజ్రా = సరలమార్గముతో సదాచారపూర్వకముగ, యాసి = వెళ్లు చున్నావు.

గధితా - (౫౨).

**గధ్యతి ర్మిశ్రీభావకర్మా - "ఆగధితా పరిగధితా (ఋ. ౧-౧౨౬-౬) ఇత్యపి నిగమో భవతి,**

గధితా - అప్రతీతార్థమ్ మిశ్రీభావకర్మణః గధ్యతేః గధితా ఇత్యేవ గమః తథా చ నిగమః ఆగధితా పరిగధితా ఆగధితా ఆగ్రహితా ఆమిశ్రితో వా పరిగధితా పరిమిశ్రీకృతః గధితా = మిశ్రితమగుట, సంయుక్తమగుట అని గధితా పదార్థము.

మంత్రార్థము:- సగధితా = సర్వకార్యములందు నాతో కలిసియున్న, పరిగధితా = అన్నివైపులనుండి నాతో కలిసియున్న రాజ్ఞీ అని మంత్రార్థము.

కౌరయాణః - (౧౩).

**కౌరయాణః కృతయానః "పాకస్థామా కౌరయాణః" (ఋ. ౮-౩-౨౧) ఇత్యపి నిగమో భవతి.**

కౌరయాణః - అస్పష్టమేతత్. కృతయాన ఇతి స్పష్టమ్. తథా చ నిగమః. "పాకస్థామాః కౌరయాణః" పాకస్థామా విపక్వప్రాణః కౌరయాణః సంస్కృతయానః. కౌరయాణ పదమునకు కృతయానుడు - అని యర్థము. శత్రువులనుగూర్చి కృత = చేయబడిన, యానః=ప్రయాణము గలవాడు అని యర్థము.

మంత్రార్థము :- పాకస్థామా - పాకః = పరిపక్వః మహాన్ స్థామా ప్రాణో యస్య సః = బలవంతుడైన మనుష్యుడు ఎల్లప్పుడు శత్రువులను గూర్చి, కృతప్రస్థానః = ప్రస్థానముచేయ సిద్ధముగానుండువాడు.

తౌరయాణః - (౧౪).

**తౌరయాణః తూర్ణయానః. "స తౌరయాణ ఉపయాహి యజ్ఞం మరుద్భిరింద్ర సఖిభిః సజోషాః" ఇత్యపి నిగమో భవతి.**

తౌరయాణః - అజ్ఞాతమ్, తూర్ణయానః ఇతి జ్ఞాతమ్. నిగమేనోదాహరతి - "స తౌరయాణః...సఖిభిః సజోషాః" హే ఇంద్ర! త్వమ్ తూర్ణ యానో భూత్వా సఖిభిః మరుద్భిః సాకమ్ యజ్ఞమ్ ఉపయాహీత్యన్వయః తౌరయాణ=తూర్ణయానః తూర్ణం యానం యస్య సః=త్వరగా చురుకుగా తత్పరతతో పనిలో లగ్నమగువాడు అని యర్థము,

మంత్రార్థము :- హే ఇంద్ర! మిత్రులయినదేవతలతో కలిసి సజోషాః = ప్రీతిపూర్వకముగ వ్యవహరించునీవు, తౌరయాణ = చురుకుదనముతో కూడినవాడవై, యజ్ఞమ్ = మాయజ్ఞమును, ఉపయాహి=ప్రాప్తుడ వగుము.

అహ్రయాణః - (౫౫).

అహ్రయాణోఽహ్రీతయానః. అనుష్ఠుయా కృణుహ్యహ్రయాణః" (ఋ. ౪-౪-౧౪) ఇత్యపి నిగమో భవతి.

అహ్రయాణః - అప్రతీతమ్ - అహ్రీతయానః ఇతి స్పష్టాప్రతీతిః. అలజ్జితయాన ఇత్యర్థః. నిగమేనోదాహరతి. "అనుష్ఠుయా కృణుహ్యహ్రయాణః అనుష్ఠుయా అనుష్ఠానేన కృణుహి కురు. అహ్రయాణః - అహ్రీతయానః. అహ్రీతమ్ అలజ్జితమ్ యానం గమనమ్ యస్య స శ్లాఘ్య గమన ఇత్యర్థః = ఏవిధమైన సిగ్గుపడకుండ నడచువాడు అని అర్థము.

మంత్రార్థము :- హే రాజన్! అనుష్ఠుయా = ధర్మానుష్ఠానపూర్వకముగ, అహ్రయాణః=ఎట్టి సంకోచములేనివాడవై నడచు నీవు, కృణుహి= చేయుము-

హరయాణః - (౫౬).

హరయాణః హరమాణయానః. "రజతం హరయాణే" (ఋ. ౮-౨౫-౨౨) ఇత్యపి నిగమో భవతి.

హరయాణః-అవిస్పష్టమ్. హరమాణయానః ఇతి సుస్పష్టమ్. అత్ర నిగమః "రజతం హరయాణే" రజతం రజతమయం రజతవికృతం వా. హరయాణే హరమాణయానే నిత్యమేవాభిప్రస్థితయానే.

హరయాణః = హరమాణయానః శత్రూణాం జీవనస్య హరణశీలమ్ యానం యస్య సః=శత్రువుల జీవనహరణకర్త అని యర్థము. హరయాణే= పరస్పరము అందరులను హరించువాడు. సూర్యచంద్రాదుల నివాసస్థానము రమణీయమైన ఆకాశమునందు, రజతం = వెండివలె తళతళలాడు నక్షత్రసమూహరూపిణియైన రథమును మేము ప్రతిదినము, అసనామ = భజించుచున్నాము.

ఆరితః - (౫౭).

"య ఆరితః కర్మణి కర్మణి స్థిరః (ఋ. ౧-౧౦౧-౪) ప్రత్యృతః స్తోమాన్.

ఆరితః - అనవగతమేతత్. ప్రత్యృత ఇతి అర్థప్రతీతిః. ప్రతి స్థానే అచ్ ఉపసర్గః. అత్ర నిగమః - "యః ఆరితః కర్మణి కర్మణి స్థిరః" కర్మణి సర్వాన్ స్తోమాన్ ప్రతిఆరితః అవస్థిత ఇత్యర్థః. ఆరితః ప్రత్యృతః= ప్రతిగత = చేరెను అని యర్థము.

మంత్రార్థము :- యః ఇంద్రః = ఏ యింద్రుడు, స్థిరః = ఎల్లపుడు, స్థిరుడో - అవిచలితుడో, కర్మణి కర్మణి = ప్రతికార్యమునందు - యజ్ఞమునందు ఆరితః = నిత్యము చేరెను.

వ్రన్దీ - (౫౮),

> వ్రన్దీ వ్రన్దతేర్ మృదుభావకర్మణః. "నియద్ వృణక్షి శ్వస నస్య మూర్ధని శుష్ణస్య చిద్వ్రన్దినో రోరువద్వనా" (ఋ. ౧-౫౪-౫) నివృణక్షి యచ్ఛ్వసనస్య మూర్ధని శబ్దకారిణః శుష్ణస్యాదిత్యస్య చ శోషయితూ రోరూయమాణో వనానీతి వా వధేనేతి వా.
>
> "అవ్రద న్తవీళితా" (ఋ. ౨-౨౪-౩) ఇత్యపి నిగమో భవతి. వీళయతిశ్చ వ్రీళతతిశ్చ సంస్తంభకర్మాణౌ పూర్వేణ సంప్రయుజ్యేతే.

వ్రన్దీ అవిదితార్థమ్. వ్రన్దతేః మృదుభావకర్మణః. అయం ధాతు రేవాప్రతీతః. అత్ర నిగమః - "నియద్ వృణక్షి...రోరువద్వనా. నివృణక్షి నిర్వర్జయసి. యత్ యస్త్వమ్ హే ఇంద్ర! మేఘం హత్వా. శ్వసనస్య శబ్దం కుర్వతః వాయోః మూర్ధని ఉపరి శుష్ణస్య చిత్ శోషయితుః ఆదిత్యస్య వ్రందినః శబ్దస్య మృదుభావకర్మతాం ప్రదర్శయితుమపరమపి నిగమము దాహరతి - "అవ్రంద న్త వీళితా" వీళయతిః వ్రీళయతిశ్చ సంస్తంభార్థకౌ. పూర్వేణ అనేనైవానంతరవర్తినా వ్రన్దీ శబ్దేన.

అర్థము :- వన్దీ, వ్రన్దీ శబ్దమృదుభావకర్మణః = కోమలతార్థము గలది. వ్రందతేః 'వ్రన్ద'ధాతువుతో సిద్ధమగును.

మంత్రార్థము :- హే ఇంద్ర! యద్ యతః = ఎందువలన, శ్వస నస్య = శబ్దమొనర్చు వాయువుయొక్కయు, శుష్ణస్యచిత్ = రసముల

నెండగట్టు, ద్రవందినః = పక్వముచేసి (ఆమ్రాదిఫలములందు) కోమల తను సృష్టించు ఆదిత్యునియొక్కయు, మూర్ధని = పైన, రోరువద్వనాని= శబ్దముచేయు జలములను, నివృణక్షి = వర్షింపచేయుము.

భాష్యార్థము :— నివృణక్షి యదేయతః = ఎందువలన నీవు వర్షింప జేయుచున్నావో, శబ్దకారిణః శ్వసనస్య = శబ్దమొనర్చు వాయువుయొక్క, మూర్ధని = పైన, శుష్కస్య శోషయితుః = రసములనన్నింటిని శోషింపచేయు శుష్కింపచేయు, ఆదిత్యస్య = సూర్యునిపైనకూడ, రోరూయమాణః = గర్జించుచున్న, వనాని = జలములను, వధేన ఇతి వా=లేక మేఘమును వధించి వర్షింపజేయుచున్నావు. సంస్తంభకర్మాణౌ = ఉక్కిరి కఠోరార్థక ములు, పీళయతిశ్చ = పీడధాతువు, పీడయతిః చ = పీడధాతువు = పూర్వేణ = మొదటిదానితో, "అవ్రందంత"తో సంప్రయుజ్యేతే = కలిసి పోవును ప్రయోగింపబడును.

మంత్రార్థము :- వ్రీడితా = కఠినముగానుండు మామిడికాయలు మున్నగుఫలములు, అవ్రందంత = కోమలములగుచున్నవి. మెత్తబడును. అనియు మంత్రము.

నిష్షపీ - ౫౯.

> **నిష్షపీ - స్త్రీకామో వినిర్గత - సపః. సపః సపతేః స్పృశతి కర్మణః. "మానో మఘేవ నిష్షపీ పరాదాః" (ఋ. ౧-౧౦౪-౫) స యథా ధనాని వినాశయతి మాసత్వం తథా పరాదాః.**

నిష్షపీ-అనవగతమేతత్. వినిర్గత = సపః ఇత్యవగమః. స్త్రీకామః అభి ధేయః సపః శేపః కస్మాత్? తేన హి స్త్రీ స్పృశ్యతే. అత్ర నిగమః - మానా మఘేవ నిష్షపీ పరాదాః స్త్రీకామః యథా ధనాని నాశయతి తథా అస్మాన్ మా పరాదాః పరాఙ్ముఖాన్ దధీథాః మఘా = ధననాశకః.

అర్థము :— నిష్షపీ = స్త్రీకామః - స్త్రీలను గోరువాడు వ్యభిచారి, వినిర్గతసపః = వినిర్గతః సపః శేఫః ఉపస్థేంద్రియః యస్య సః నిత్యోత్థిత శేఫః ఇత్యర్థః. అత్యన్తవ్యభిచారి. 'షప' సమవాయే - అనుధాతువుతో సపః

శబ్దము సిద్ధమగును కాని, ఇక్కడ స్పృశతి కర్మణః స్పర్శ అర్థము గ్రహింపబడినది.

మంత్రార్థము :— హే ప్రభో! ఇవ = ఎట్లు, నిష్టప్ = వ్యభిచారి, అజితేంద్రియుడు నగుపురుషుడు, మఘా = ధనధనములను నష్టపఱచు చుండునో అట్లే నః = మమ్ములను, మాపరాదాః = నీవు విడువవలదు. అనగా మమ్ములను దుర్వ్యసనములందు విడువవలదని భావము.

తూర్ణాశమ్ - (౬౦).

**తూర్ణాశముదకం భవతి. తూర్ణమశ్నుతే. తూర్ణాశం న గిరే రధి ఇత్యపి నిగమో భవతి.**

తూర్ణాశమ్-అస్పష్టమ్. తూర్ణమ్ అశ్నుతే ఇతి స్పష్టమ్. ఉదకమభి ధేయమ్. అత్ర నిగమః - "తూర్ణాశం న గిరేరధి" తూర్ణాశం న జలమివ. గిరేరధి మేఘస్యోపరి వ ర్తమానమ్. ఉదకనామసు అపఠితత్వాత్ అప్రతీతమేతత్ పదమ్.

అర్థము :— తూర్ణాశమ్ ఉదకం భవతి = జలమును తూర్ణాశ మందురు, ఏలయన జలము, తూర్ణమ్ = మిక్కిలివేగముగ అశ్నుతే = వ్యాపించును.

మంత్రార్థము :— గిరేః = మేఘముయొక్క, అధి = మధ్యనుండు, తూర్ణాశం న = జలమువలె నేను నిన్ను ఆత్మరక్షణకొఱకు ఆహ్వానించు చున్నాను. వర్షమును గోరువారు మేఘములనుండి జలమునర్థింతురు. అట్లే ఆత్మరక్షణకొఱకు నిన్ను ఆహ్వానించుచున్నాను.

క్షుంపమ్ - (౬౧).

**క్షుంపమహిచ్ఛత్రకం భవతి యత క్షుభ్యతే "కదా మర్త మరాధసంపదా క్షుమ్పమివ స్ఫురత్. కదా నః శుశ్రవత్ గిర ఇంద్రో అఙ్గ" (ఋ. -౮౪-౮) కదా మర్తమనారాధ యన్తమ్ పాదేన క్షుంపమివావస్ఫురిష్యతి కదా నః శృణోతి చ గిర ఇంద్రో అఙ్గ. అఙ్గేతి క్షిప్రనామ. అఞ్చితమేవాఙ్కి తమ్ భవతి. (యజు. ౧-౧౭)**

క్షుమ్పమ్ - అస్పృష్టమ్. యస్మాత్ క్షుభ్యతే తస్మాత్ క్షుమ్పమ్ ఇతి స్పృష్టమ్. తచ్చ అహిచ్ఛత్రమ్ భవతి. క్షుమ్ప ఇతి పదవాచ్యమ్ ఛత్రాకాపరపర్యాయమ్. అత్ర నిగమః "కదా మర్తమరాధ ... ఇంద్రో అఙ్గ" కదా కస్మిన్ కాలే. మర్తమ్ మనుష్యమ్. అరాధసమ్ అనారాధయన్తమ్. పదా పాదేన. క్షుమ్పమ్ అహిచ్ఛత్రమివ స్ఫురత్ అవస్ఫురిష్యతి అభి హింసిష్యతీత్యర్థః. కదా చ నః అస్మాకం గిరః స్తుతీః శుశ్రవత్ శ్రోష్యతి? అఙ్గ క్షిప్రమ్.

అర్థము :— క్షుమ్పమ్ = క్షుంపము, అహిచ్ఛత్రకము = పాముపడగ స్పృశించినమాత్రమున క్షుభ్యతే = క్షుబ్ధమగును.

మంత్రార్థము :— కదా = ఎప్పుడు, అరాధసమ్=పూజింపనివానిని, ఆ యింద్రుడు ఎప్పుడు పాముపడగను (క్షుంపమ్) కాలితో నలిపినట్లు, స్ఫురత్ = నలిపివేయును? కదా = ఎప్పుడు, నః = మాయొక్క, గిరః = స్తుతులను, అఙ్గ = శీఘ్రముగ, శుశ్రవత్ = వినును.

భాష్యార్థము :— కదా = ఎప్పుడు, అనారాధయన్తమ్ = పూజింపని వానిని, పాదేన = పాదముతో, క్షుంపమివ = పాముపడగను మర్దించునట్లు అవస్ఫురిష్యతి = మర్దించును, కదా చ = మఱియు నెప్పుడు, అఙ్గ = శీఘ్రముగ, నః గిరః = మావాక్కులను-స్తుతులను, ఇంద్రః = ఇంద్రుడు, శృణోతి = వినును! అఙ్గ పదము శీఘ్రవాచకము, అంచితమేవ = అంక, అంగపదములకు ప్రకృతి.

నిచుంపుణః - (౬.౨).

నిచుంపుణః సోమో నిచాన్తపృణో నిచమనేన ప్రీణాతి. "పత్నీవన్తః సుతా ఇమ ఉశన్తో యన్తి వీతయే. అపాం జగ్మి నిచుంపుణః" (ఋ. ౮-౯౩-౨౨) పత్నీవన్తః సుతా ఇమేఽద్భిః సోమాః కామయమానా యన్తి వీతయే పానాయ అపాం గన్తా నిచుంపుణః.

సముద్రోఽపి నిచుంపుణ ఉచ్యతే. నిచమనేన పూర్యతే, అవభృథోఽపి నిచుమ్పుణ ఉచ్యతే. నీచైరస్మిన్ క్వణన్తి,

**నీచైర్దధతీతి వా. "అవభృథ నిచుంపుణ" ఇత్యపి నిగమో భవతి.**

నిచుంపుణః అజ్ఞాతమేతత్, నిచాన్తపృణః ఇతి స్పష్టమ్. సోమో అభిధేయః యస్మాదేషః నిచమనేన పానేన ప్రీణాతి. నిగమేనోదాహరతి. "పత్నీవన్తః...జగ్మిర్నిచుంపుణః" సుకక్షస్యేయమార్షమ్. పత్నీభిః అద్భిః తద్వన్తః జలయుక్తా ఇత్యర్థః. సుతాః అభిషుతాః ఇమే సోమాః ఉశన్తః కామయమానాః ఇవ యన్తి దేవాన్ ప్రతిగచ్ఛన్తీత్యర్థః. వీతయే అపాం పానాయ. నిచుంపుణః సోమః అస్మాభిర్ధీయమానః దేవాన్ప్రతి జగ్మిః గన్తా భవిష్యతీతి యోజ్యమ్. అవభృథోఽపి నిచుంపుణః. నీచైః అస్మిన్ క్వణన్తి శబ్దంకుర్వన్తి. నీచైః అస్మిన్ యజ్ఞపాత్రాణి దధతీతి వా. తథా చ "నిగమః. "అవభృథ నిచంపుణః" హే అవభృథ దేవ! హే వరుణ! త్వం నిచంపుణో భూత్వా నీచైః శబ్దం కుర్వన్ యజ్ఞగృహేషు అవతిష్ఠసే ఇతి. 'నిచంకుణ' శబ్దోఽపి నీచైః క్వణనాత్ వ్యాఖ్యాతో బోద్ధవ్యః.

అర్థము :— నిచుంపుణః=ఇది సోమమునకు నామము. ఏలయన - ఆ సోమము నిచాన్తపృణః = తినబడి ఆనందమును కలిగించును. నిచమనేన = భక్షణమువలన నది ప్రీణాతి = తృప్తినిజేయును.

మంత్రార్థము :- పత్నీవన్తః = రసముగల, సుతాః అభిషుత ఇమే = ఈ సోమములు, ఉశన్తః = కోరుచున్నవై, వీతయే = పానముకొఱకు దేవతలగూర్చి, యన్తి = వెళ్లును - ప్రాప్తించును, నిచుంపుణః = ఈ యానందితుజేయుసోమము భక్షణకొఱను, అపాం జగ్మిః = జలములను ప్రాప్తించును. అనగా సోమరసము జలముతో కలిపి త్రాగుదురు.

భాష్యార్థము :— ఇమే సోమాః = ఈ సోమరసములు, సుతాః = అభిషుతములై, అద్భిః పత్నీవన్తః = జలములతో పత్నీవంతములుగా నంగీకరింపబడినవి - జలములు సోమములకు పత్నులు. యే కామయ మానాః = కోరుచున్నవై, వీతయే = పానముకొఱకు దేవతలసమీపమునకు, యన్తి = చేరును, నిచుంపుణః = సోమరసమునకు సంబంధించిన పిప్పి: అపాంగన్తా = జలములందు పడవేయబడును, యా=ఈ సోమము జలములను జేరును. జలము కలిపియియ్యబడును.

సముద్రః అపి = సముద్రముకూడ, నిచుంపుణమనబడును. ఏలయన నీసముద్రము, నిచమనేన = నీటితో, పూర్యతే = నింపబడును. నిచమ్యతే ఇతి = త్రాగబడును. కావున జలము నిచమన మనబడును. నిచమనపూర్వకత్వమే నిచుంపుణమైనది

అవభృథః అపి = యజ్ఞాదిశుభకర్మలు కూడ నిచుంపుణములన బడును. ఏలయన - అస్మిన్=యజ్ఞాదిశుభకర్మమునందు, నీచైః క్వణన్తి= మెల్లగా నెమ్మదిగాశబ్దమొనర్తురు - నెమ్మదిగా మాటాడుదురు. యజ్ఞాది శుభకర్మలు అల్లరిచేయక శాంతముగా జరుపుదురు. ఈ నీచైః క్వణమే నిచుంపుణమైనది. ఏలయన శుభకర్మ పాపకర్మలను, అవదధతి = నీచైః అణచియుంచును - పాపమును పాఱద్రోలును - అందువలననే అవ భృథము.

మంత్రార్థము :- అవభృథ! యజ్ఞాదిశుభకర్మమా! ఓ నిచుంపుణా నీవు శాంతముగా కోలాహలములేకుండ చేయబడుదువు. అట్లే మంత్రమున నున్నది. నిచుంపుణః నిచుఙ్క్ణోతి చ=నిచుంపుణ నిచుంకుణశబ్దములు పర్యాయపదములు. వేదమున నిట్లు పాఠభేదముకూడ చూడబడుచున్నది.

పదిమ్ - (౨౩).

> పదిర్గన్తుర్ భవతి యత్పద్యతే. "సుగురసత్ సుహిరణ్యః స్వశ్వో బృహదస్మై వయ ఇంద్రో దధాతి. యస్త్వా యన్తం వసునా ప్రాతరిత్వో ముక్షీజయేవ పదిముత్సినాతి" (ఋ. ౧-౧౨౫-౨) సుగుర్భవతి సుహిరణ్యః స్వశ్వో బృహదస్మై వయ ఇంద్రో దదాతి యస్త్వాయన్త మన్నం న ప్రాతరాగామిన్నతిథే. ముక్షీజయేవ పదిముత్సినాతి కుమారః. ముక్షీజా మోచనాచ్చ సయనాచ్చ తననాచ్చ.

పదిమ్ - అనపగతమ్. పదిః పద్‌గతౌ ఇత్యస్మాద్ధాతోః ఇత్యవగమః. గన్తుః పక్షీ అభిధేయః. నిగమేన సమర్థయతి. "సుగురసత్ సహిరణ్యః భవతి. స ఏవ స్వశ్వః" బృహత్ మహత్ అస్మై వయః అన్నమ్ ఇంద్రః దదాతి. దదాతి. యస్త్వాఽయన్తం వసునా ప్రాతరిత్వః ప్రాతరాగామిన్నతిథే!

అయన్తం మధ్వానమ్. వసునా అన్నేన. ముక్షీజయేవ పాశ్యయా ఇవ పక్షిం పతితారం పక్షిణమ్. ఉత్సినాతి బధ్నాతి. ముక్షీజా కస్మాత్ మోచనాత్ అథవా సయనాత్ బంధనాత్ అథవా తననాత్ సా హి పక్షిణో వధార్థం తన్యతే.

అర్థము :— పధిమ్ = పధిశబ్దమునకర్థము. గన్తుర్ భవతి పక్షీ = యాత్రికుడు, యత్ = ఎందువలన? అది, అతడు ఇటునటు వెళ్లు చుండును. కావున పక్షి యాత్రికుడు పధిశబ్దవాచ్యులనిభావము.

మంత్రార్థము :— ప్రాతరిత్వః = ప్రాతఃకాలముననేవచ్చు, అతిథే! యః = ఏ గృహస్థుడు, అయన్తం = వచ్చుచున్న, త్వా ఇవ = నిన్నువలె కొండెకకుమారుడు, ముక్షీజయా = వలతో - ఉచ్చుతో, పధిమ్ = పక్షిని ఉత్సినాతి = బంధించును - వశపఱచుకొనునో, అట్లే నిన్నుకూడ, వసునా = అన్నాదులతో వశపఱచుకొనును - నీ హృదయమును హరించును. ఆ మనుష్యుడు, సుగుః = మంచిగోవులు కలవాడు, సుహిరణ్యః = మంచి బంగారముకలవాడు, స్వశ్వః = మంచిఅశ్వములుకలవాడు, అసత్ = అగును, అస్మై = అట్టి అతిథిసేవకునకు, ఇంద్రః = పరమైశ్వర్యశాలియైన ఈశ్వరుడు, బృహత్ వయః = దీర్ఘఆయువును, దధాతి = ఇచ్చును, శతపథములో 'హిరణ్యమ్' అనిచెప్పి హిరణ్యపదమునకర్థము యశస్సు అని చెప్ప బడినది అట్లే 'వీర్యం వై అశ్వః' అని చెప్పి అశ్వశబ్దమునకు వీర్యము - బలము - అని చెప్పబడినది. గోశబ్దము వేదములందు ధనమాత్రమునకు ప్రయోగింపబడినది. ఇట్లు అతిథిని సేవించు గృహస్థునకు ధనము, యశస్సు, బలము దీర్ఘ - ఆయువు ప్రాప్తమగును. వయః పదమునకు అన్నమనియు నర్థము.

భాష్యార్థము :— ముక్షీజా = వలను ముక్షీజా అని యేల యందురు? మోచనాత్ చ = దీనినుండి, ముక్తిం = విడుపు కలుగును, సయనాత్ చ = బంధింపబడుటవలనను, తతనాత్ = వఱచబడును కావునను.

పాదుః పద్యతేః - (౬౪).

పాదుః - పద్యతేః "ఆవిః స్వః కృణుతే గూహతే బుసం స పాదురస్య నిర్ణిజో న ముచ్యతే" (ఋ. ౧౦-౨౭-౨౪) ఆవి

షక్కృణుతే భానమాదిత్యః గూహతే బుసమ్. బుసమిత్యుదక
నామ బ్రవీతేః శబ్దకర్మణః. భ్రంశతేర్వా. యద్ వర్షన్
పాతయత్యుదకమ్, రశ్మిభిస్తదాదత్తే. (యజుః. ౨-౪౯)

పాదుః ఆనపగతమ్-పద్యతేః ఇత్యర్థః అవగమః. తథా చ మన్త్రః -
"ఆవిః...ముచ్యతే, ఆవిః కృణుతే ఆవిష్కరోతి. స్వః ఆదిత్యః. గూహతే
సంవృణోతి. బుసమ్ ఉదకమ్. పాదుః గమనమ్. నిర్ణిజః సూర్యస్య స
ముచ్యతే నోపరమతే బుసమ్ కస్మాత్? ఉచ్యతే బ్రవీతేః శబ్దకర్మణః -
యస్మాదేతత్ శబ్దం కరోతి తస్మాత్ బుసం జలమిత్యర్థః. భ్రంశతేర్వా
స్యాత్ యస్మాత్ తత్ మేఘాత్ భ్రశ్యతే తస్మాత్ బుసం జలమ్.

అర్థము :- పాదుః 'పదగతౌ' ధాతువువలన నేర్పడును అందువలన
పాదుః = గమనము అని యర్థము.

మంత్రార్థము :- సః = ఆ సూర్యుడు, స్వః = తేజస్సును - ప్రకాశ
మును - తాపమును, ఆవిష్కృణుతే=ప్రకటించును, బుసం=జలమును,
గూహతే = గ్రహించును, అస్య = ఈ, నిర్ణిజః = శోధకుడైన సూర్యుని
యొక్క, పాదుః = గతి - కర్మ, న ముచ్యతే = విడువబడదు సూర్యుడు
నిరంతరముగతిశీలుడు.

భాష్యార్థము :- ఆవిష్కృణుతే = ప్రకటించును, భానమ్=ప్రకాశ
మును - తేజస్సును - తాపమును, ఆదిత్యః=సూర్యుడు, బుసం గూహతే=
జలమును సంగ్రహించును - శుష్కింపజేయును. బుసమ్ - జలమునకు
పేరు, బుస - శబ్దకర్మణః = శబ్దముచేయుట యనునర్థముగల, బ్రవీతేః =
బ్రూఞ్ వ్యక్తాయాంవాచి అనుధాతువుతో సిద్ధమగును. భ్రంశతేర్వా -
'భ్రంశుఅధఃపతనే' అను ధాతువుచే భ్రంశశబ్దమును, యత్ బుసమ్ =
ఏ జలమును, వర్షన్ = వర్షించుచు, పాతయతి = భూమిపై పడునట్లు
చేయునో, దానిని తదుపరి, రశ్మిభిః = కిరణములతో శుష్కింపజేయును -
గ్రహించును, ఆదత్తే = అందువలన బ్రూ ధాతువుచే బుసమ్ సిద్ధమైనది.
భ్రంశతోకూడ బుస తయారగును.

ఇతి తృతీయఃపాదః

మూడవపాదము సమాప్తము

# చతుర్థపాదము

వృకః - (౬౫).

వృకశ్చంద్రమా భవతి - వివృతజ్యోతిష్కో వా వికృత - జ్యోతిష్కోవా విక్రాంత-జ్యోతిష్కోవా. ''అరుణో మాసకృద్ వృకః పథా యన్తం దదర్శ హి. ఉజ్జిహీతే నిచాయ్యా తష్టేవ పృష్ఠ్యామయీ విత్తం మే అస్య రోదసీ'' (ఋ. ౧-౧౦౫-౧౮) అరుణ ఆరోచనో మాస కృన్మాసానాం చార్ధ మాసానాం చ కర్తా భవతి. చన్ద్రమా వృకః పథా యన్తం దదర్శ నక్షత్రగణమ్. అభిజిహీతే నిచాయ్య యేన యేన యోక్ష్యమాణో భవతి చంద్రమా స్తక్ష్ణువన్నివ పృష్ఠరోగీ. జానీతం మేఽస్య ద్యావా పృథివ్యావితి.

ఆదిత్యోఽపి వృక ఉచ్యతే. యదాకృష్ణే ''అజోహవీ దశ్వినా వర్తికా వామాస్నో యత్సీమముంచతం వృకస్య'' (ఋ. ౧-౧౧౭-౧౬) ఆహ్వాయదుషా అశ్వినావాదిత్యేనాభిగ్రస్తా తామశ్వినౌ ప్రముముచతు రిత్యాఖ్యానమ్.

వృకః అవిదితమ్. అనేకార్థత్వాత్. యస్మాదయం వివృత-జ్యోతిష్కః అథవా వికృతజ్యోతిష్కః అథవా విక్రాంతజ్యోతిష్కః తస్మాత్ వృకః. చంద్రః ఇత్యభిధేయం పదమ్. ఏవమస్య శబ్దస్య సమాధయః కార్యాః. తత్ర నిగమః ''అరుణో మాస...అస్య రోదసీ. అరుణః ఆరోచనః. మాసకృత్- మాసానాం కర్తా. వృకః చంద్రమాః పథా స్వేన మార్గేణ యన్తం గచ్ఛన్తం దదర్శ పశ్యతి నక్షత్రగణం నిచాయ్య దృష్ట్వా చ ఉజ్జిహీతే ఉదేతి. తష్టా ఇవ పృష్ఠయామయీ పృష్ఠరోగీ విత్తమ్ జానీతమ్. రోదసీ ద్యావాపృథివ్యౌ. ఏవమత్ర అరుణశబ్దాత్ మాసశబ్దసాహచర్యాత్ వృకః చంద్రః. ఆదిత్యోఽపి వృకః యస్మా దసౌ తమ ఆవృణక్తి. అత్ర మంత్రః - అజోహవీద ... వృకస్య'' అజోహవీత్ ఆహ్వాయత్. ఉషాః హే అశ్వినౌ! వాం యువామ్. వర్తికా వర్తనశీలా. ఆస్నః ఆస్యాత్. అముంచతమ్ వృకస్య ఆదిత్యస్య వృకస్య ఆస్యాత్ మామ్ అముంచతమ్ ఇతి నిగదితోఽర్థః.

అర్థము :- వృకః = చంద్రమాః భవతి = వృకము చంద్రుడు అని యనబడును. ఏలయన ఈ చంద్రుడు వివృత జ్యోతిష్కుడు. ఇతర నక్షత్రాదులకంటె నధిక జ్యోతి - ప్రకాశము కలవాడు. వికృతజ్యోతిష్కః = ఈ చంద్రుడు వికృతజ్యోతికలవాడు. సూర్యుని ప్రకాశము వేడిగనుండును. ఇతని ప్రకాశము చల్లగానుండును. అందువలన వికృతజ్యోతిష్కుడు, వృకః యా విక్రాంత జ్యోతిష్కః = లేక విక్రాంత జ్యోతిష్కుడు. నక్షత్రాదుల కాంతికంటె నెక్కువకాంతిగలవాడని తాత్పర్యము. వృకశబ్దము చంద్రుని కొఱకు ఈ మంత్రమున నున్నది.

మంత్రార్థము :- అరుణః = ఎదుటనున్న సమస్తజగత్తును తన ప్రకాశముతో ప్రకాశింపజేయుచు నెల్లరను ఆహ్లాదపఱచుచు, మాసకృత్ = మాసములను పక్షములను సృష్టించుచు, వృకః = చంద్రుడు, పథా = తనమార్గమున, యన్తం = వెళ్లుచు నక్షత్రగణమును, దదర్శ = చూచు చుండును, నిచాయ్య = చూచి, ఉజ్జిహీతే = ఆ నక్షత్రముతోబాటు ఉదయించును. దగ్గఱనున్న నక్షత్రముతో సంబంధమేర్పడును. పృష్ఠయామయీవ = పృష్ఠరోగివలె, తష్టా = చిత్రానక్షత్రయుక్తచంద్రునితో సంగతి చేయును.రోదసీ ఓ ద్యులోకపృథివీలోకములార ! మే=నాయొక్క, అస్య= ఈ వచనమును, విత్తమ్ = ఎఱుగుదురుగాక విందురుగాక !

భాష్యార్థము :- అరుణ ఆరోచనః = సమస్తజగత్తును ప్రకాశింప జేయుచు, మాసకృత్ = మాసములను, పక్షములను నిర్మించు చంద్రుడు, వృకః = వృకము, చంద్రుడు, పథా = మార్గమున, యన్తమ్ = వెళ్లుచు, నక్షత్రగణమ్ = నక్షత్రములను, దదర్శ = కలిసికొనును, అభిజిహీతే = ఉదయించును, ఆయా నక్షత్రములతో కలియును, నిచాయ్య = చూచి ఆ నక్షత్రములతోకలిసి, యోక్ష్యమాణః = సంయుక్తుడగును, పృష్ఠరోగీవ = వీపుపై రోగముగలవానివలె, చిత్రానక్షత్రపృష్ఠమున రోగమున్నది, చంద్రుని పృష్ఠముమీద నల్లనిమచ్చలున్నవి, తక్షవస్ = చంద్రుడు ప్రతిదిన మొక్కొక్క నక్షత్రముతో కలియును. ఇరువదియేడు (౨౭) నక్షత్రము లున్నవి. మాసమున కొకసారి అన్నిటితోను కలియును. ఓ ద్యుపృథివీ

శ్లోకములార! నావచనమును మీ రిరువురు, జానీతమ్ = ఎఱుగుదురుగాక విందురుగాక!

ఆదిత్యః అపి = సూర్యుడుకూడ, వృకః అనబడును, యత్ = ఏలయన నతడు, అవృక్ క్తే = తన ప్రకాశముతో జగత్తును ఆవరించును, అంధకారమును నశింపజేయును. కావున సూర్యుడు వృకశబ్దవాచ్యుడగు చున్నాడు.

మంత్రార్థము :- వర్తికా - ఉషాః = ఉషస్సు, అజోహవీత్ = పిలిచెను, హే అశ్వినౌ! వామ్ = ఓ యశ్వినీ దేవతలార! మీరిపుడు నన్ను వృకస్యఆస్నః = సూర్యుని ముఖమునుండి, అముంచతమ్ = విడిపించి యున్నారు.

భాష్యార్థము :- అజోహవీత్ = పిలిచెను (ఆహ్వయత్) ఉషాః - ఉషస్సు, సూర్యేణ = సూర్యునితో, అభిగ్రస్తా = గ్రస్తయైయున్నపుడు - అశ్వినీకుమారులను పిలిచెను. ఆహ్వానించెనని యర్థము. అప్పుడామెను (ఉషస్సును) అశ్వినీకుమారులు సూర్యునిముఖమునుండి అముంచతమ్= విడిపించిరి. ఈ ఆఖ్యానము నడచుచున్నది.

> శ్వాఽపి వృక ఉచ్యతే వికర్తనాత్. "వృకశ్చిదస్య వారణ ఉరామథిః" ఉరణ - మథిః. ఉరణ ఊర్ణావాన్ భవతి. ఊర్ణా పునర్వృణోతేః ఊర్ణోతే ర్వా. వృద్ధవాశిన్యపి వృకీ ఉచ్యతే. "శతం మేషాన్ వృక్యే చక్షదానమృజ్రాశ్వమ్ తం పితా అంధం చకార. (ఋ. ౧-౧౧౬-౧౬) ఇత్యపి నిగమో భవతి.

శ్వాఽపి వృకః యస్మాద్ ఏషః వికర్తయతి. అత్ర మంత్రః - "వృకశ్చిదస్య వారణ ఉరామథిః. ఉరామథిః ఉరణమథః ఉరణో మేషః తాన్ మథ్నాతీతి సతః. ఉరణః కస్మాత్ ? ఊర్ణావాన్ భవతి. ఊర్ణా కస్మాత్? వృణోతేః ఊర్ణోతేర్వా. వృద్ధవాశినీ శివా అపి వృకీ భవతి. అత్రాపి నిగమః శతం మేషాన్...చకార" చక్షిత్ = పరితుష్టః ఋజ్రాశ్వనామానం రాజర్షిమ్ క్రోధేన పితా అంధం కృతవాన్.

శ్వాఽపి = కుక్కకూడ, వృక ఉచ్యతే = వృకమనబడును ఏలయన, వికర్తనాత్ = మనుజులను కఱచును. కావున కుక్క వృక మనబడును.

మంత్రార్థము :- వృకః చిత్ వృకోఽపి = వృకముకూడ - కుక్క కూడ, అస్య = ఈ యింద్రునియొక్క, వారణః = శత్రువులను నివారించు నది. మఱియు సాధనములనుగూర్చి చెప్పనేల ?

భాష్యార్థము :- ఉరామథిః = ఈ యింద్రుని కుక్క, ఉరామథి = మేషములను మేకలను పాఱద్రోలునది, ఉరామథిః ఉరణమథిః అన బడును, ఉరణః = మేషములను మథించునది, ఉరణః కస్మాత్ ఉరణ యననేమి ? ఊర్ణావాన్ = ఉరణమున ఉన్నియుండును, ఊర్ణాపునః వృణోతేః = ఉన్నిని అందఱు కోరుదురు. కావున నది ఊర్ణా యనబడును, చలిని నివారించుటకు ఉన్నినెల్లరు కోరుదురు. ఊర్ణాతేర్వా = జనులు ఉన్నిగుడ్డలతో తమ శరీరములను కప్పుకొందురు. అందువలన ఉన్ని యనబడును. బాగుగశిక్షితమైన తరువాత కుక్క ఎంతటి యుపయోగకారి యగునో ఈ మంత్రమున చూపబడినది.

వృద్ధవాశినీ = పెద్దగా అఱచు ఆడతోడేలుకూడ వృకీ అనబడును.

మంత్రార్థము :- వృక్యై = ఆడతోడేలు కొఱకు, శతంమేషాన్ = అనేక మేకలను ఇచ్చునట్టి, తమ్ ఋజ్రాశ్వమ్ = మంచిగుఱ్ఱములుగల వేటగానిని, పితా = రాజు అంధం చకార - కైదులోనుంచవలెను.

జోషవాకమ్ - (౬౬).

జోషవాకమిత్యవిజ్ఞాతనామధేయమ్. జోషయితవ్యం భవతి. "య ఇంద్రాగ్నీ సుతేషు వాం స్తవత్తేష్వృతా వృధా. జోష వాకం వదతః పజ్రహోషిణా న దేవా భసథశ్చన" (ఋ. ౬-౫౯-౪) య ఇంద్రాగ్నీ సుతేషు వాం సోమేషు స్తౌతి తస్యాశ్నీథః. అథ యోఽయం జోషవాకం వదతి విజం జపః ప్రార్జితహోషిణౌ న దేవౌ తస్యాశ్నీథః.

జోషవాకమ్ - అవిజ్ఞాతమేతత్. జోషయితవ్యం పరస్మై విజ్ఞాపయితవ్యం భవతి. అత్ర మంత్రః - "య ఇంద్రాగ్నీ ... భసథశ్చన." హే ఇంద్రాగ్నీ! యః యజమానః సుతేషు అభిషుతేషు సోమేషు వాం యువాం స్తవత్ స్తౌతి, తస్య అశ్నీథః స యువయో రతిప్రియ ఇత్యర్థః. అథ యః జోషవాకమ్ అవిజ్ఞాతమ్, వదతః వదతి వ్రజహోషిణా ప్రభూత-యాగౌ, దేవా దేవౌ తస్య హవీంషి కదాపి యువాం న భసథః భక్షయథః. విజంజపః జలతీరజాపీ.

అర్థము :— జోషవాకమ్ = అవిజ్ఞాతము. అస్పష్టము నగువచనము జోషయితవ్యం భవతి. ఏలయున - ఆవచనము పరితర్కణీయము - విజ్ఞాపనీయము నగును జుషపరితర్కణే ధాతువువలన నేర్పడును.

మంత్రార్థము :— ఇంద్రాగ్నీ! = ఓ యింద్రాగ్నులార!, యః = ఎవడు, సుతేషు=సోమము అభిషుతములైనమీదట, వామ్=మీ యిరువురిని, స్తవత్ = స్తుతించునో, తేషు = ఆయజ్ఞాదికార్యములందు, ఋతావృధా = సత్యమువృద్ధిజేయు, దేవా - ఓ దేవతలార!, అతని యన్నమును మీరు గ్రహింతురు. జోషవాకం వదతః = అస్పష్టముగా మాటలాడువాని అన్నమును, వ్రజహోషిణా వ్రజహోషిణౌ! = ప్రభూతయజ్ఞములు గల ఓ దేవతలార!, న భసథశ్చన = మీరిరువురు తినరు. అనగా నో దేవులార! మీరు సతతకర్మశీలుడగు, స్తోతుః = యజమానుని అన్నమును భుజింతురు. అతని మాటలను విందురు. కాని, ఎవడు, మౌనమువహించి జపించుచు కర్తవ్యకర్మల నాచరింపడో వానియెడ మీరు దయజూపరు.

భాష్యార్థము :- యః = ఏమనుజుడు, ఇంద్రాగ్నీ!=ఓ యింద్రాగ్ని దేవతలార!, సుతేషు సోమేషు = సోమసవనము చేసినపుడు, స్తౌతి = మిమ్ము స్తుతించునో అతని యన్నమును, అశ్నీథః = మీరు తిందురు. ఎవడు, జోషవాకం వదతి = అస్పష్టవచనమును పలుకునో, విజంజపః = మౌనజపముచేయునో, యతనియన్నమును, ప్రాజ్ఞితహోషిణౌ = బహుయజ్ఞముల నర్జించిన దేవతలార! మీరు, న అశ్నీథః = మీరు ఇరువురు తినరు.

కృత్తిః - (౬౩).

కృత్తిః కృన్తతేర్యశో వా అన్నం వా. "మహీవ కృత్తిః శరణా త ఇంద్ర" [(ఋ. ౮-౯౦-౯) - సుమహ త్త ఇంద్ర శరణమంతరిక్షే, కృత్తిరివేతి. ఇయమపి ఇతరా కృత్తిరేతస్మాదేవ సూత్రమయీ ఉపమార్థే వా. "అవతతధన్వా పినాక హస్తః కృత్తి వాసాః" ఇత్యపి నిగమో భవతిః

కృత్తిః - అనేకార్థత్వాత్ అనవగతమ్. కృన్తతేః ఇతి ధాతునిర్దిష్టః. యశః అన్నం చ కృత్తిః. యస్మాత్ యశోఽరీణాం మర్మాణి కృన్తతి. అన్నమపి చ దురుపయుక్తమాయుః కృన్తతి ఇతి స్పష్టమ్. అత్ర నిగమః "మహీవ..." మహీవకృత్తిః మహతీవ కీర్తిః అన్నం వా. శరణా శరణమ్. అంతరిక్షే అంతరిక్షలోకే.

అథేయమపరా కృత్తిః కంథేతి ప్రసిద్ధా అపి ఏతస్మాదేవ కృంతతేః ధాతోః. సా హి సూత్రైః తంతుభిః గ్రథితా భవతి. అథవా చర్మణః కృత్త్యా సూత్రమయీ కృత్తిః ఉపమితా వికర్తనాత్సామ్యాత్. తథాహి మంత్రః "కృత్తిం వసానః..." తృతీయేఽధ్యాయే వ్యాఖ్యాతోఽయం మంత్రః.

అర్థము :- కృత్తిః = యశస్సు, అన్నము కృత్తిశబ్దమునకర్థము. కృతీఛేదనే ధాతువువలన కృత్తిశబ్దమేర్పడును. యశస్సు అనేకములైన చెడ్డలను ఖండించును. అన్నము ఆకలిని నశింపజేయును. యశస్సు శత్రువుల హృదయములకు బాధకలిగించును.

మంత్రార్థము :- ఇంద్ర! = ఇంద్రా!, తే మహీవశరణా = నీ గొప్పశరణము, కృత్తిః = అంతరిక్షమున వ్యాప్తమైన, కృత్తిః = యశస్సు వలె నాకు నీశరణము గొప్పది.

భాష్యార్థము :- ఇంద్ర! నీశరణము మిక్కిలిగొప్పది. అంతరిక్షే ఆకాశమున వ్యాపించిన, కృత్తిః = యశస్సువలె, ఇయమపి ఇతరాకృత్తిః = ఇది మఱియొక కృత్తి, సూత్రమయీ = చీలికలతో నిర్మింపబడినగంత. కృత్తియనబడును, ఏతస్మాత్ = కర్తనవలననే నిదియు నేర్పడును. గంత (కృత్తి)కూడ 'కృతీ'ఛేదనే ధాతువువలననే యేర్పడును. ఉపమార్థేవా

చర్మముకూడ కృత్తియనబడును. చర్మవాచకకృత్తిశబ్దము గుడ్డపేలికలతో నిర్మింపబడిన గంతతో ఉపమింపబడును. చర్మమువంటిదే గంతకూడ.

మంత్రార్థము :— అవతతధన్వా = ధనుర్గుణమును వింటికొటినుండి దించినవాడై, పినాకహస్తః = దండమును చేతియందుకలవాడై, కృత్తివాసాః = చర్మరూపవస్త్రమును ధరించినవాడై, ఇట్లే మంత్రమున్నది.

శ్వఘ్నీ - (౨౮).

> శ్వఘ్నీ కితవో భవతి స్వం పునరాశ్రితం భవతి. "కృతం న శ్వఘ్నీ విచినోతి దేవనే" (ఋ. ౧౦-౪౩-౫) కృతమివ శ్వఘ్నీ వివినోతి దేవనే. కితవః కిం తవాస్తీతి శబ్దానుకృతిః, కృతవాన్ వాశీర్నామకః.

శ్వఘ్నీ - అస్పష్టమేతత్. స్వం హన్తీతి స్పష్టమ్. శ్వఘ్నీ కితవ ఇత్యభిధేయమ్. స్వమ్ స్వామిన మాభిముఖ్యేన శ్రితం భవతి. తథా చ నిగమః. "కృతం న శ్వఘ్నీ" దేవనే అస్తారే. విచినోతి కతమ ఏతేషాం మధ్యే జలం దాస్యతి ఇతి నిర్వాచయతి. కితవః కస్మాత్? కిం తవ ఇత్యస్య శబ్దస్య అనుకరణమ్. యతో ద్యూతకరైరన్యైః కితవైః స సదా పృచ్ఛ్యతే కిం తవాస్తీతి తస్మాత్ కితవః. అథవా కృతవానయం భూయాత్ ఇతి సుహృద్భిరాశాస్యతే.

అర్థము :— శ్వఘ్నీ కితవో భవతి = జూదరి శ్వఘ్నీ అనబడును. ఏలయన జూదరి, స్వం = ధనమును, హన్తి = నాశనముచేయును, స్వం పునరాశ్రితం భవతి = ధనము కొండొకని ఆశ్రయించి యుండును. కావున నది స్వమ్ అనబడును. శ్రీ కి వ చేయుటచే శ్వ - స్వ - సిద్ధమగును.

మంత్రార్థము :- శ్వఘ్నీ = జూదరి, దేవనే = జూదమునందు, కృతం న = ఎట్లు జయమును, విచినోతి = వెదకునో, యట్లే త్యాగియైన మానవుడు దుర్గుణములను దూరమొనర్చుటకు పరమేశ్వరుని తేజస్సును వెదకును.

భాష్యార్థము :- కృతమివ = విజయమును, శ్వఘ్నీ = జూదరి దేవనే = జూదమునందు, విచినోతి = వెదకును, శ్వఘ్నీ = కితవుడు, కితవ

పదమునకు వ్యుత్పత్తి - కిం తవ అస్తి = నీదగ్గఱ ఏమి యున్నది? అని జూదరులు పరస్పరము ప్రశ్నించుకొనుచుందురు. కిం తవ అనుపదమునకు అనుకృతియే కితవ శబ్దము. కింతవ శబ్దానుకృతియే కితవ శబ్దమన బడుచున్నది. అథవా కృతవాన్ వా = ఇతడు విజయా అగుగాక! (కృతమస్యాస్తీతి కృతవాన్) విజయుడవగుదువుగాక, అను ఆశీర్వాదనామక కృతవాన్ శబ్దమే కృతవత్ కృతవ, కితవ అయినది. జూదరులు తమమిత్రుని విజయమును కోరుదురు.

సమమ్ - (౬.౯).

> సమమితి పరిగ్రహార్థీయం సర్వనామానుదాత్తమ్. "మా నః సమస్య దూఢ్యః పరిద్వేషసో అంహతిః. ఊర్మిర్న నావమావధీత్" (ఋ. ౮-౭౫-౯) మా నః సర్వస్య దుర్ధియః పాపధియః సర్వతో ద్వేషసో అంహతి రూర్మిరివ నావమావధీత్. ఊర్మిరూర్ణోతేః నౌః ప్రణోత్తవ్యా భవతి. నమతేః వా తత్కథమనుదాత్త ప్రకృతి నామ స్యాత్, దృష్టవ్యయం తు భవతి. "ఉతో సమస్మిన్నాశిశీమహి నో వసో" ఇతి సప్తమ్యాం శిశీతిః దానకర్మా 'ఉరుష్యాణో అఘాయతః సమస్మాత్'. ఇతి పంచమ్యామురుష్యతి రక్షాకర్మా. అథాపి ప్రథమా బహువచనే. 'నభన్తా మన్యకే సమే"

సమస్య-సమమితి పరిగ్రహార్థీయం సర్వనామ పూర్వముదాహృతమ్ అనుదాత్తమిదమ్. అథ నిగమః "మానః సమస్య... విరూపస్యాం గిరస స్యేయ మార్షమ్. గాయత్రీ. మా నః-మాస్మాన్. సమస్య సర్వస్య దూఢ్యః దుర్ధియః పాపబుద్ధయః పరిద్వేషసః సర్వతో ద్వేష్టారః. అంహతిః వధః, ఊర్మిర్న ఊర్మిరివ నావమ్ అవధీత్.ఊర్మిః కస్మాత్ అచ్ఛాదనార్థాత్ఊర్ణోతేః. సా హి జలమధ్యే తరిమాచ్ఛాదయతి. ప్రపూర్వాత్ నుదతేర్వా స్యాత్ సా హి పరం పారం గన్తుమ్ ప్రణోత్తవ్యా భవతి. అథవా నమతేః ఊర్మిః హి పారగమనాయ నమ్రైవ భవతి.

నను నామ్నాముదాత్త-ప్రకృతిత్వాత్ నిపాతానాం చ అనుదాత్త ప్రకృతిత్వాత్ కథమ్ "ఉతో సమస్మిన్" ఇత్యాదౌ మంత్రే సమమిత్యేతస్య అనుదాత్తస్య నిపాతస్య 'సమస్మిన్' ఇతి రూపం సంపద్యేత. యస్మాదస్య వ్యయో వికృతిర్ దృశ్యతే? ఏవమేవ "ఉరుష్యాణో అఘాయతః సమస్మాత్" ఇత్యస్మిన్ మంత్రే పంచమ్యాం వికారో దృశ్యతే. "నభన్తామన్యకే సమే" ఇతి ప్రథమా బహువచనే వికారో లక్ష్యతే. అతోచ్యతే "ఛందసి దృష్టానువిధిర్భవతి" ఇతి కృత్వా అనుదాత్త ప్రకృతి అపి సమమిత్యేతత్ పదం నామైవ సంజాత మిత్యర్థః. శేషిహి-యచ్ఛ.

అర్థము :- సమమ్ = సమమ్ ఇది పరిగ్రహార్థీయమ్ = సర్వము యొక్క వాచకము. సర్వనామ సంజ్ఞక అనుదాత్త సంజ్ఞకలది.

మంత్రార్థము :- హే భగవన్ ! సమస్య = ఎల్లరికొఱకు, దూఢ్యః= పాపబుద్ధికలవాడు, పరిద్వేషసః = అన్నివైపులనుండి శత్రుత్వముగల మనుష్యుని, అంహతిః = హింస, ఊర్మిః = తరంగము, నావం న = నావనువలె, నః = మమ్ములను, మాఅవధీత్ = చంపకుము పెద్దపెద్ద అలలు నావను ముంచునట్లు పాపబుద్ధులుగల హింస మా = మమ్ములను చంపకుండుగాక !

భాష్యార్థము :- నః = మమ్ములను, సర్వస్య = ఎల్లరికొఱకు, దుర్ధియః = పాపబుద్ధికలవారు, సర్వతః = అన్నివైపులనుండి, ద్వేషసః = ద్వేషించువారి, అంహతః = హింస, నావమ్ = నౌకను, ఊర్మిరివ = తరంగమువలె మమ్ములను, మాఅవధీత్ = చంపకుండుగాక ! ఊర్మియని తరంగము నేల యందురు? అచ్ఛాదనార్థక 'ఊర్ణుఞ్' ధాతువువలన ఊర్మిశబ్దము సిద్ధించును. ఊర్మి నావ నన్నివైపులనుండి ఆచ్ఛాదించి - కప్పి ముంచివేయును. అందువలన తరంగము ఊర్మియనబడును. నౌః = నౌక. ప్రణోత్తవ్యా భవతి. నావ - "ణుద్ ప్రేరణే" ధాతువుచే సిద్ధమగును. నావప్రేరితమగును. నడుపబడును. నమతేర్వా - నమధాతువువలన నావ శబ్దము సిద్ధించును. నమనమనగా వంగుట. నౌక నడచునపు డిటు నటు వంగుచుండును - ఒరుగుచుండును. కావున నౌక - నావ అనబడును.

అర్థము :- తత్ = ఆ సమశబ్దము అనుదాత్తప్రకృతి = అనుదాత్త స్వభావముకలిగిన, నామ కథం స్యాత్=నామమెట్లు కాగలదు? ఫిషోఽన్త ఉదాత్తమ్ అను ఫిట్‌సూత్రము వలన నామములు అంతోదాత్తములగును. అనుదాత్తములుకావు, దృష్టవ్యయం తు భవతి. ఈసమశబ్దము దృష్టవ్యయ= చూడబడుచున్న వికారముకలిగి నామమగును. అవ్యయము కాజాలదు. అవ్యయము అనుదాత్తమగును. 'చాదయోఽనుదాత్తాః' అది ఫిట్‌సూత్రము. సమశబ్దము దృష్టవ్యయ మనుటకు నిమ్నప్రమాణమున్నది. "ఉతో సమస్మిన్" అను నీమంత్రమున సమశబ్దము 'సమస్మిన్' అని సప్తమీ విభక్తిలో కనబడుచున్నది. ఈ మంత్రమున కర్థము - "ఉతోఽపి చ వసో! హే సర్వవాసక పరమాత్మా! నః = మాకు, సర్వస్మిన్=సర్వవిధజ్ఞానము నందు మఱియు భోగములందును, ఆశీః హి=సుఖమును ప్రసాదింపుము. శశీతిః = దానార్థక 'శీ' ధాతువుయొక్క యఙ్‌లుగంతరూపము. "ఉరుష్యాణో అఘాయతః సమస్మాత్ (ఋ. ౫-౨౪-౩) ఈ మంత్రమున సమ శబ్దము పంచమ్యంతమున కనబడుచున్నది.

మంత్రార్థము :- హే పరమాత్మన్! నః = మమ్ములను, సమస్మాత్ అఘాయతః = సమస్త పాపాచరణమునుండి, ఉరుష్య = రక్షింపుము, ఉరుష్యతిః రక్షాకర్మా. ఉరుష్యతి ధాతువు రక్షార్థమున వచ్చును. అథాపి ప్రథమా బహువచనే సమశబ్దము ప్రథమాబహువచనమునను చూడనగును - "నభన్తామన్యకే సమే" ఇందు సమే అని ప్రథమాబహువచన 'జస్' రూపము - అర్థము. సమే అన్యకే ఇతర శత్రువులెల్లరు, నభన్తామ్ = లేకుండురుగాక! పాఱిపోవుదురుగాక!

కుటస్య - (౭౦) - చర్షణిః - (౭౧).

**"హవిషా జారో అపాం పిపర్తి పపురిర్నరా. పితా కుటస్య చర్షణిః" (ఋ. ౧-౪౬-౪) హవిషా అపాం జరయితా. పిపర్తి పపురితి పృణాతి నిగమౌ వా ప్రీణాతి నిగమౌ వా. పితా కృతస్య కర్మణశ్చాయితాదిత్యః.**

కుటస్య. చర్షణి. ఉషేఽపి అనవగతే. కృతస్య చాయితా ఇత్యేతౌ శబ్దసమాధీ తథా చ నిగమః. "హవిషా జారో...చర్షణిః" ప్రస్తుతవ్యాఖ్యేయము

మార్థమ్. హే నరా! హే నరౌ! అశ్వినౌ! ఏష సూర్యః పితా పాతా॰ కూటస్య కృతస్య చక్షణిః చాయితా ద్రష్టేత్యర్థః అపాం సర్వభూతాన్తర్గతానామ్ జారః జరయితా, శోషకః ఇత్యర్థః. పపురిః పూరయితా చ. హవిషా ఉదకేన. పిపర్తి పూరయతి. పపురిః కస్మాత్? ఉచ్యతే పూరయతేః వా ప్రీణయతేర్వా. ఏవముభయార్థప్రకాశకావేవ మంత్రే లభ్యేతే, కుటస్య = కృతస్య - చేయబడిన, చక్షణిః = ద్రష్టా అని అర్థములు.

మంత్రార్థము :- నరా! హే ద్యావాపృథివీ = ఓ ద్యుపృథివీలోకము లార! మీయిరువురిలో, ఏకః=ఒకరు, అపాంజారః=జలములను శుష్కింపచేయునది - ఎండబెట్టునది, పపురిః = పాలించునది లేక తృప్తిని కలిగించునది, కుటస్య - కృతస్య కర్మణః చక్షణిః = చేయబడిన కర్మల, ద్రష్టా= చూచునది, పితా = పితృస్థానీయము, హవిషా = జలముతో, పిపర్తి = పాలించును - లేక తృప్తికలిగించును. పిపర్తి = ఈ శబ్దము 'పౄ' పాలన పూరణయోః ధాతువుతో నేర్పడును. పిపురిః శబ్దముకూడ ఈ ధాతువు వలననే యేర్పడును. లేక ప్రీఞ్ తర్పణే ధాతువువలన పిపురి యేర్పడును.

భాష్యార్థము :- హవిషా = జలముతో, అపామ్=జలములయొక్క జరయితా = శోషకుడు. పిపర్తి పిపురి యీ రెండుశబ్దములు 'పౄ' ధాతు సిద్ధములు, పితా = సర్వపాలకుడు, కృతస్య=చేయబడిన, కర్మణః = కర్మయొక్క, చాయితా ద్రష్టా = చూచువాడు ఎవడు? సూర్యః = సూర్యుడు.

శంబః - (౭౨).

> శంబ ఇతి వజ్రనామ. శమయతేర్వా. శాతయతేర్వా "ఉగ్రో యః శంబః పురుహూత తేన" (ఋ. ౧౦-౪౨-౭)
> ఇత్యపి నిగమో భవతి.

శంబః - అనవగతమ్. శమయతేర్వా స్యాత్ - శాతయతేర్వా స్యాత్, ఇత్యవగమః - వజ్రనామేత్యభిధేయమ్. తథా చ నిగమః. "ఉగ్రో యః శంబః పురుహూతః తేన" పురుహూత! బహుభిరాహూత! ఉగ్రో యః శంబః ఉద్గూర్ణో వజ్రః

అర్థము :— శంబః = ఇది వజ్రనామము - వాచకము. 'శము' ధాతువునకు వ్యస్తరూపము, శంబః లేక - వ్యస్త 'శబ్దనాతనే' ధాతుసిద్ధము.

మంత్రార్థము :— పురుహూత ! = ఓ యింద్ర !, యః ఉగ్రః = ఏది యుగ్రమో - క్రూరమో అది నీవజ్రము (శంబః) తేన = దానితో శత్రువు లందఱిని తరిమివేయుము.

కేపయః - (౮౩).

**కేపయః కపూయా భవన్తి. కపూయమితి పునాతి కర్మ కుత్సితమ్ దుష్పూయం భవతి. "పృథక్ ప్రాయన్ ప్రథమా దేవహూతయోఽకృణ్వత శ్రవస్యాని దుష్టరా. న యే శేకుర్యజ్ఞియాం నావ మారుహమీర్మైవతే న్యవిశన్త కేపయః" (ఋ. ౧౦-౪౪-౬)**

పృథక్ ప్రాయన్. పృథక్ ప్రథతేః. ప్రథమా దేవహూతయో యే దేవాన్ ఆహ్వాయన్త, అకుర్వత శ్రవణీయాని యశాంసి దురనుకరాణ్యన్యైః. యేఽశక్నువన్ యజ్ఞియాం నావమారోఢుమ్. అథ యే నాశక్నువన్ యజ్ఞియాం నావమారోఢుమ్ ఈర్మైవ తే న్యవిశన్త - ఇహైవ తే న్యవిశన్త, ఋణే హైవ తే న్యవిశన్త అస్మిన్నేవ లోకే ఇతి వా. ఈర్మమ్ ఇతి బాహునామ, సమీరితతరో భవతి. కేపయః - అనవగతమ్. కపూయాః భవన్తీతి శబ్ద సమాధిః. యదేతత్ పాపకారి ప్రాయశ్చిత్తేన పునాతి కుత్సితం కర్మ. యచ్చ దుష్పాపం తత్ పూయమానం కపూయమ్ ఇతి శబ్దేనోచ్యతే తథా చ ఋక్ - "పృథక్ ప్రాయన్... కేపయః" పృథక్ భూత్వా ప్రాయన్ అగచ్ఛన్ ప్రథమా ముఖ్యాః. దేవహూతయః దేవానామాహ్వాతారః. దుష్టరా దుష్టరాణి. శ్రవస్యాని యశాంసి అకృణ్వత అకుర్వత. యే త్వత్ర సన్తి పంచితాః యజ్ఞియాం నావమారోఢుం నాశక్నువన్. ఈర్మైవ ఇహైవ తే కపూయాం యోనిం శ్వయోనిం సూకరయోనిం వా న్యవిశన్త. ఈర్మమ్ ఇతి బాహునామ. స హి అన్యేభ్యః అఙ్గేభ్యః సమీరితతరో భవతి.

అర్థము :- కేపయః - కపూయాః = నిందితకర్మల నొనర్చువారు, భవన్తి = అగుచున్నారు, కేపయః = ఈశబ్దమును బహువచనములో 'ను'

ప్రత్యయమైనది. కపూయమ్ - పునాతి = శుద్ధముచేయును - ప్రాయశ్చిత్త ముతో నిందితకర్మను శుద్ధముచేయును దుష్ప్రాయం భవతి=కాని యాకర్మ దుష్ప్రాయశుద్ధము కాదగినది కాదు. అనగా పాపియైన మనుష్యుడు చేసిన నిందిత కర్మను ప్రాయశ్చిత్తముచేయును. కాని శుద్ధముకాదని భావము. ఇట్టి కపూయము కేపయ, మనబడును. కుత్సితం కర్మ పునాతి ఇతి కపూయః = పాపులు

మంత్రార్థము :— ప్రథమాః = సర్వోత్తములు, దేవహూతయః = దేవతల నాహ్వానించువారు - యజ్ఞముల నొనర్చువారు, యే = ఏ పవిత్ర పురుషులుగలరో, దుష్టరా = దుస్తరమైన, శ్రవస్యాని = శ్రవణ మొనర్మ యోగ్యములైన అనగా ఇతరులనుకరింపజాలని యశోవంతములగు కర్మ లను, అకృణ్వత = చేసిరో వారు యజ్ఞియనౌకను ఆరోహించుటకు సమ ర్థులై, పృథక్ప్రాయన్ = నీచులమార్గమునుండి వేరై పరమధామమునకు వెళ్లిరి, ఎల్లపుడు నిందితకార్యములందు తత్పరులైయుండువారు, ఈర్మైవ= ఈ నరకలోకమునన్, న్యవిశన్త = ప్రవేశించిరి.

భాష్యార్థము :— పృథక్ = భిన్నమార్గమున, ప్రాయన్ = పరమ ధామమున చేరిరి, పృథక్ ప్రథతేః = ప్రథధాతువుచే పృథక్ శబ్దము సిద్ధమగును. భిన్నవస్తువు స్వయముగ విస్తరించును, ప్రథమాః=అందఱి కంటె శ్రేష్ఠులు, దేవహూతయః = దేవతలనాహ్వానించువారు, అకుర్వత్ = చేయుచుండిరి, శ్రవణీయాని = వినదగినవి, యశాంసి = యశస్సులను, దురనుకరాణి అన్యైః = ఇతరులచే ననుసరింపజాలని, యే - అశక్నువన్= ఎవరు సమర్థులై యజ్ఞియనావనెక్కగలిగిరో వారు పరమధామమున చేరిరి. ఇతరులు అధర్మాచరణపరులు, వారు ఈర్మైవ = ఈ నరకముననే, న్యవి శన్త = దుఃఖముల ననుభవింతురు, తే ఋణేహ = వారు పితృఋణము, ఋషిఋణము, దేవఋణము ననుఋణత్రయముననే యుండి నీచ యోనులను బొందుదురు, ఈర్మన్ ఇతి బాహునామ = ఈర్మన్ బాహు వాచకము ఏలయన బాహువు ఇతరాంగములకంటె పొడవుగానుండును. తూతుమాకృషే - (౭౪).

> "ఏతా విశ్వా సవనా తూతుమాకృషే స్వయం సూనో సహసో యాని దధిషే" (ఋ. ౧౦-౫౦-౬౧) ఏతాని

సర్వాణి స్థానాని తూర్ణం ఉపాకురుషే స్వయం బలస్య
పుత్ర యాని ధత్స్వ (యజు. ౬-౨౯)

తూతుమాకృషే - అనవగతే పదే ఏతే. తూర్ణమ్ ఉపాకురుషే ఇత్యేతా శబ్దసమాధి సహసః బలస్య. సూనో సుత! తూతుమ్ తూర్ణమ్ ఆకృషే ఉపాకురుషే. దధిషే ధారయసి. తూతుమాకృషే = తూర్ణమ్ ఆకురుషే శీఘ్రముగా చేయుచున్నావు.

మంత్రార్థము :- సహసః సూనో! = ఓ బలముయొక్క పుత్రా!, యాని = వేనిని, స్వయమ్ = స్వయముగా, దీధిషే = నిర్మించుచున్నావో.

భాష్యార్థము :- ఏతాని సర్వాణి = ఈ స్థానములన్నింటిని, తూర్ణమ్ ఉపాకృషే = శీఘ్రముగా నిర్మించుచున్నావు, బలస్యపుత్ర! = ఓ బలపుత్రా! యానిధత్సే = వేనిని నీవు ధరించుచున్నావో.

అంసత్రమ్ - (౭౫).

అంసత్ర మంహానస్త్రాణం ధనుర్వా కవచమ్ వా. కవచం కుఅంచితం భవతి, కాంచితం భవతి, కాయేఽంచితం భవతీతి వా. ప్రీణీతాశ్వాన్ సుహితం జహోథ "స్వస్తివాహం రథవిత్ కృణుధ్వమ్. ద్రోణాహావ మవతమశ్మచక్ర మంసత్ర కోశం సించతా నృపాణామ్" (ఋ. ౧౦-౧౦౧-౭) ప్రీణీతాశ్వాన్ సుహితం జయాథ జయనం వో హితమస్తు స్వస్తివాహనం రథం కురుధ్వం ద్రోణాహావం ద్రోణం ద్రుమమయం భవతి. ఆహావ అహ్వానాదావహా అవహానాదవతోఽవాతితో మహాన్ భవత్యశ్మచక్ర మశనచక్ర మసనచక్రమితి వా. అంసత్రం కోశమ్, అంసత్రాణి వః కోశస్థానీయాని సన్తు. కోశః కృష్ణాతేర్వికుషితో భవతి. అయమపీ కోష ఏతస్మాదేవ. సంచయ ఆచితమాత్రో మహాన్ భవతి. సించత నృపాణం నరపాణమ్. కూపకర్మణా సంగ్రామముపమిమీతే.

అంసత్రమ్ - అనవగతమ్. అనేకార్థత్వాత్. అంహసస్త్రాణమ్ ఇత్యర్థ ప్రతీతిః. ధనుర్వా కవచం వేత్యభిధేయే. కవచం కస్మాత్ ? కు కుటిలమ్ అంచితమ్ భవతి. స హి తస్య స్వభావః. అథవా కాంచితమ్ - ఈషదంచితం భవతి. అథవా కాయే అంచితం గతం భవతి. తథా చ నిగమః - "ప్రీణీతాశ్వాన్ ... నృపాణమ్" సోమపుత్రస్య బుదస్యేయ మార్షమ్ - ప్రీణీత యవసాదినాతర్పయత అశ్వాన్, హితం - సుహితమ్. జయాథ జయథ. స్వస్తివాహం - మంగల వాహమ్. కృణుధ్వమ్ - కురు ధ్వమ్. ద్రోణం - ద్రుమమయమ్. ఆహవం రథమ్. అవతమ్ - సంగ్రామ రూపమ్. అశ్మచక్రమ్ - వ్యాపనచక్రమ్. అంసత్రకోశమ్ - యుష్మాకం ధనూంషి కవచాని చ కోశస్థానీయాని భవన్తు. సించత - ఉత్సించత. నృపాణమ్. నరపాణమ్ ద్రోణమ్ కస్మాత్ ? ద్రుమమయం తత్ భవతి. ఆహ్వానాత్ ఆవాహః. ఆవహః - ఆవహనాత్. అవతః - అవాజితః గత ఇత్యర్థః. కోశః కస్మాత్ ? కుష్ణాతీతి సతః. అథవా వికుషణాత్ కోషః. ఇతరః కోశోఽపి అస్మాదేవ. నృపాణమితి రూపేన సంగ్రామస్యోపమా.

అర్థము :— అంసత్రమ్ = అంహసఃత్రాణమ్ = ప్రహారమునుండి రక్షించువాడు, ధనుషః = కవచము. కవచమనగా కు అంచితమ్ = ఇది వంకరగా నిర్మింపబడును. దానిస్వభావమే వక్రము. యా కాంచితం భవతి = లేక కొంచెము వక్రముగా చేయబడునది, అథవా కాయే అంచితం భవతి = లేక ఇది శరీరమును అంటుకొనియుండును, కాయ + అంచ = కవచము అగును.

మంత్రార్థము :- హే సైనిక ! = ఇప్పుడు సంగ్రామము ఉపస్థితమై యున్నది. అతః = అందువలన, అశ్వాన్ = అశ్వములను, ప్రీణీత = తృప్తిపఱచుము, ఇత్ = మఱియు, రథమ్ = రథమును, స్వస్తివాహమ్ = సుఖముగా పయనించుటకు తగినట్లు, కృణుధమ్ = చేయుము, అవతమ్ = ఈ సంగ్రామ రూపకూపమునుండి, నృపాణమ్ = శత్రువుల రుధిరరూప బలమును, సించత = తడుపుము ద్రోణాహవమ్ = వీకూప - సంగ్రామమున ద్రోణద్రుమమయ = కొయ్యతోచేయబడిన రథము ఆహవమైయున్నదో, అశ్మచక్రమ్ = వ్యాపించు చక్రములున్నవో, అంసత్రకోశమ్ = ధనుస్సులే ఉంచబడినవో, హితంజయాయ = ఈ నిజయము హితకారి యగుగాక !

భాష్యార్థము :- ప్రీణీత అశ్వాన్ = గుఱ్ఱములను తృప్తిపఱచుము, సుహితం జయథ = ఎల్లరకు హితము కలిగించు జయమును పొందుము, జయనం వః = హితమస్తు నీవిజయము హితకారి యగుగాక !, రథం స్వస్తి వాహనం కురుధ్వమ్ = రథమును సుఖముగ తీసికొనివెళ్లగలుగుసట్లు చేయుము, ద్రోణాహావమ్ - ద్రోణమ్ = కొయ్యతోచేయబడిన కుండము, ఆహావమ్ = కూపసమీపమున పశువులు నీరుత్రాగుటకు చేయబడిన కుండము, పశువుల నాహ్వానించునది కావున నది అహావమనబడును. నీరు త్రాగుటకు పశువులిటకు తేబడును. అఙ్ పూర్వక 'హ్వేఞ్' ధాతువుతో ఆవహము సిద్ధమగును. అవతః ఆవాతితో మహాన్ భవతి = కూపము, అవ = క్రిందికి, మహాన్ = మిక్కలి లోతుగా, అతితః = వెళ్లియున్నది; త్రవ్వబడియున్నది. కావున కూపమును అవతః అందురు, అశ్మచక్రమ్= అశ్మచక్రమనగా అశనచక్రమ్ = వ్యాపించుసట్టి చక్రములు, వా అసన చక్రమ్ = లేక విసరబడు చక్రములుగల, అంసత్రకోశం అంసత్రాణి - అంసత్ర = ధనుస్సులే నీకోశస్థానమున నుండునుగాక ! కోశః కుష్ణాతేః వికుషితః భవతి. 'కుషనిష్కర్షే' ధాతువువలన కోశము సిద్ధమగును. కోశ (ఒర) చర్మమయము. చర్మముచే నిర్మింపబడును. అయమపి=ఇదియు, ఇతరః కోశః భవతి = మఱియొక కోశము. కోశశబ్దము దీనివలననె సిద్ధమగును. అనగా ధనమునకు సంబంధించిన కోశముకూడ ఈ ధాతువు వలననే సిద్ధించును. సంచయః—ఈ కోశమును సంచయమనియు నందురు. అచితమాత్రః వా మహాన్ భవతి = ఈ కోశమునందు రూప్యాది-నాణెములు ఎక్కువగా సంచయముచేయబడును.

కాకుదమ్ - (౨౬).

కాకుదం తాలు ఇత్యాచక్షతే. జిహ్వా కోకువా సాఽస్మిన్ ధీయతే. జిహ్వా కోకువా కోకూయమానా వర్ణాన్ నుదతీతి వా కోకూయ తేర్వా స్యాత్ శబ్దకర్మణః. జిహ్వా జోహువా. తాలు తరతేః తీర్ణతమమంగమ్, లతతే ర్వా స్యాత్ లంబకర్మణో విపరీ తాత్ యథా తలమ్, లతేత్య విపర్యయః.

"సుదేవో అసి వరుణ యస్య తే సప్తసింధవః. అనుక్షరన్తి
కాకుదం సూర్మ్యం సుషిరామివ" (ఋ. ౮-౬౯-౧౨)
సుదేవస్త్వం కల్యాణ దేవః కమనీయదేవో వా భవసి వరుణ
యస్య తే సప్తసింధవః సింధుః స్రవణాత్. యస్య తే సప్త
స్రోతాంసి తాని తే కాకుదమనుక్షరంతి సూర్మి కల్యాణోర్మి
స్రోతః సుషిరమను యథా.

కాకుదమ్ - అస్పష్టమేతత్. జిహ్వా కోకువా ఇత్యుచ్యతే. సా హి వర్ణాభివ్యంజనాయ నిధీయతే యస్మిన్ తత్ కాకుదమ్. తాలు ఇత్యర్థః. అభిధేయమేతత్. కోకువా జిహ్వా. అథవా కోకూయమానా శబ్దం కుర్వాణా సా తాలుని శబ్దాన్ నుదతి తస్మాత్ కోకువా. నుదనాత్ కాకుదశబ్దం నిరుక్తం స్యాత్. జిహ్వా కస్మాత్? యస్మాత్ సా జోహువా తస్మాత్ జిహ్వా. తయా సర్వే ఆత్మని అన్నం జుహ్వతి. అథవా తయా ఆహ్వయన్తి తరతేః తాలు. తద్ధి అన్యేభ్యః అంగేభ్యః తీర్ణతరం భవతి. లంబార్థకాత్ లతతేర్వా ఆద్యన్త-విపర్యయేణ తాలు స్యాత్. అవిపర్యయేణ చ లతతేరేవ లతా. తథా చ నిగమః. "సుదేవో ... సుషిరామివ" సుదేవః శోభనో దేవః. అసి త్వం హే వరుణ! యస్య తే సప్త సింధవః అంతరిక్షనద్యః. కాకుదం తాలు. సూర్మ్యమ్ - కల్యాణోర్మి స్రోతః సుషిరామ్ - నగరోదక - నిస్సరణ భూమిమివ అనుక్షరన్తి. సింధుః కస్మాత్? స్రవణాత్.

అర్థము :- కాకుదమ్ = తాలువు, ఇతి ఉచ్యతే = చెప్పబడు చున్నది, జిహ్వా = కోకువా అనబడును, కోకువా = జిహ్వా, సా = ఆ జిహ్వా, అస్మిన్ = ఈ తాలువు - దవడ - యందు, ధీయతే - స్థాప్యతే = ఉంచ బడును. శబ్దముల నుచ్చరించునపుడు, జిహ్వాతాలువు = దవడలతో సంబ ద్ధమగును, అతః = అందువలన నది తాలువును, కువాధానం సత్=జిహ్వాతో లగ్నముచేయుటవలన కువాధానమై కాకుద అనబడును. జిహ్వను కోకువా అననేల? జిహ్వ కోకూయమానా = అట్టి శబ్దమునుచేయుచు తాలువునందు వర్ణములను ప్రేరించును, కోకువానుద = కాకుద యన బడును. కోకూయతే ర్వా స్యాత్ శబ్దకర్మణః=శబ్దార్థక యఙ్లుగంత 'కుఙ్ -ధాతువుచే కోకువా సిద్ధమగును. జిహ్వా శబ్దముయొక్క వ్యుత్పత్తి ఏమన?

జిహ్వాయే జుహువాయై జిహ్వాయనబడసాగినది. ఈజిహ్వతోనే ప్రాణులు అన్నమును తమలో హవనముచేయును. 'హు' దానాదానయోః = దాన ఆదానఅర్థముగల హుధాతువుతో నేర్పడి జిహ్వ యనబడును. అహ్వాయతితి వా = జిహ్వతో ఆహ్వానింతురు. శబ్దము స్పర్ధయు అర్థముగల హ్వేఞ్ ధాతువుతో జిహ్వాశబ్దము సిద్ధమగును. తాలు - తరతేః తాలువ్యుత్పత్తి తృప్లవనతరణయోః - తరణార్థక తృధాతువువలన తాలు శబ్దమేర్పడును. తాలు - తాలువృదవత - తాలువు తీర్ణతమమంగమ్ = ఇది ఇతర అంగములకంటె విస్తీర్ణము. కావున నిది తృదాతువుతో నేర్పడి తాలు-తాలువు అనబడుచున్నది. లతతే ర్వా స్యాత్ = లంబార్థక 'లత' ధాతువుచే నేర్పడును. లత శబ్దమును విపర్యయముచేసిన తలయగును. లతతేర్విపర్యయాత్ వా = లత విపర్యయము తలయై దానివలన తాలుశబ్దమేర్పడును. విపర్యయముచేయకున్న లతా శబ్దమగును.

మంత్రార్థము :— వరుణ ! = ఓవరుణా ! సుదేవః అసి = నీవు ఉత్తమదేవతవు, అభీష్టదేవతవు, కల్యాణకారివి - అభీష్టదేవతవు - యస్య తే = అట్టి నీతాలువును, సప్తసింధవః = శబ్దరూపసప్తనదులను - సప్త విభక్తులు అనుక్షరన్తి = నింపుచుండును, సుషిరామ్ సూర్మ్యమ్ ఇవ = ఏడు సప్తరంధ్రములుగల కాలువ యందు జలము ప్రవహించునట్లు సప్తవిభక్తులుగల శబ్దరూపనదులు ప్రవహించుననిభావము.

భాష్యార్థము :— సుదేవస్త్వం = కల్యాణదేవః-కమనీయదేవః వా = సుదేవుడవు కల్యాణకారిదేవతవు, కమనీయదేవుడవు, అనియర్థము. యస్య తే = అట్టినీయొక్క, సప్తసింధవః = ఏడునదులు, ఏడుసముద్రములు - తద్రూపశబ్దములు వానివిభక్తులు సింధుః = స్రవణాత్ = ప్రవహించుట వలన సింధుః =(నది) అనబడును. యస్య తే=అట్టినీయొక్క, సప్తస్రోతస్సులు, సప్తవిభక్తులు తాని=అవి, తేకాకుదమ్=నీతాలువును, అనుక్షరన్తి= అనుగమనముచేయును, సూర్మ్యమ్ - కల్యాణోర్మ్యమ్ = మంచిప్రవాహముగల, స్రోతః సుషిరమివ = కాలువ ఛిద్రములవైపు ప్రవహించునట్లు - అని.

వీరిటే - (౨౭).

> వీరిటం తైటీకిరంతరిక్షమేవాహాపూర్వం వయతేరుత్తర మిరతేర్వయాంసీర స్త్యస్మిన్ భాంసి వా. తదేతస్యామృచి ఉదాహర స్త్యపి. "ప్రవావృజే సుప్రయా బర్హిరేషా మా విశ్పతీవ వీరిట ఇయాతే. విశామక్తోరుషసః పూర్వహూతౌ వాయుః పూషా స్వస్తయే నియుత్వాన్. (ఋ. ౭-౩౯-౨)
>
> ప్రవృజ్యతే సుప్రాయణం బర్హిరేషామేయాతే సర్వస్య పాతారౌ వా పాలయితారౌ వా. వీరిటమంతరిక్షమ్, భియో వా భాసో వా తతిః అపి వోపమార్థే స్యాత్ సర్వపతీ ఇవ రాజానౌ వీరిటే గణే మనుష్యాణాం రాత్ర్యా వివాసే పూర్వస్యామభి హూతౌ వాయుశ్చ నియుత్వాన్ పూషా చ స్వస్త్యయనాయ. నియుత్వాన్ నియుతోఽస్యాశ్వాః. నియుతో నియమనాద్వా. నియోజనాద్వా

వీరిటే - అనవగతమ్. అనేకార్థం చ వీరిటమంతరిక్షం భవతీతి తైటీకిరాచార్యః మన్యతే. అస్మిన్ శబ్దే పూర్వం 'వీ' ఇతి వయతేః ఉత్తరమ్ 'రిట' ఇతి ఇరతేః అస్మిన్ వయాంసి ఇరన్తి గచ్ఛన్తి భాంసి వా ఇతి వీరిటమ్ అంతరిక్షమ్. తథా చ నిగమః - ప్రవావృజే...నియుత్వాన్" వసిష్ఠస్యేయమార్షమ్ త్రిష్టుప్. ప్రవావృజే బర్హిః - ప్రస్తీర్యత ఇత్యర్థః సుప్రయా - సుప్రగమనమ్. విశ్పతి జగతః పాతారౌ. ఆ ఇయాతే = ఆగచ్ఛతః ఇవ పాపపూరకః. అథవా ఉపమాయాః వాచకః. అస్మిన్ పక్షే వీరిటే గణే. విశాంమనుష్యాణామ్. అక్తోఃరాత్ర్యాః - పూర్వహూతౌ-పూర్వస్యామేవ అభిహూతౌ. వాయుః నియుత్వాన్ నియుతోఽస్యాశ్వాః. పూషా చ. నియుతః నియమనాత్ నియోజనాద్ వా. 'నియుత్' శబ్దోఽశ్వవాచీ. నియుత్వాన్ వాయురేవ న తు పూషా ఇత్యేతత్ మతం భాష్యకారస్య.

అర్థము :- తైటీకిః - తైటీకి ఈ ఆచార్యుడు, వీరిటమ్ అంతరిక్షము ఆకాశమే అందురు. ఈ ఆచార్యులు, పూర్వం = ముందు, వయతేః = పక్షి అర్థమునవచ్చు 'వి'శబ్దపూర్వక 'ఈర'ధాతువునకు ఇటన్ ప్రత్యయముచేసి

వీరిట శబ్దము సిద్ధముచేయుదురు. ఉత్తరమ్ = ఇతరులు, ఈరితేః = భాసపూర్వ ఈరధాతువుతో సిద్ధముచేయుదురు. అస్మిన్ = ఆకాశమునందు, వయాంసి = పక్షులు, ఈరన్తి = ఎగురును లేక శబ్దముచేయును. కావున ఈయాకాశమునకు వీరిట అనునామమేర్పడెను. భాంసివా = లేక ఈ యాకాశమునందు, జ్యోతిష్మత్తములగు పదార్థములు సూర్యాదులు గమనము చేయును. కావున భాస్ ఈర వీరిట నామమేర్పడెను. తత్ = ఈవిషయము నిరుక్తమందు ఉదాహరింతురు.

మంత్రార్థము :- అక్తోః = రాత్రిగడచినపిదప, ఉషసః = ఉషఃకాలము వచ్చిన తరువాత, పూర్వ హూతౌ = మొదటియాహ్వానమునందు (నియుత్వాన్) = ఎల్లరను నియంత్రించు, లేక నియంత్రణమున లగ్నము చేయు (వాయువు) ఈవాయువు పూషా చ = సూర్యుడును, స్వస్తయే = యజమానుని, లేక యెల్లరి కల్యాణముకొఱకు, వీరిటే = ఆకాశమున, ఆ ఇయాతే = వచ్చుచుందురు. అప్పుడు, విషాంవిశామ్=ఈమనుష్యులకై సుప్రయాః = శుభాగమనయుక్త, బర్హిః = వృద్ధి, ప్రవావృజే=ప్రదానము చేయబడును, విశ్పతీ = ఈవాయుసూర్యులు ఇరువురు, ప్రజాపాలకులు, యా సుప్రయాః = లేక సుభగమనయుక్త, బర్హిః = కుశాసనము, ప్రవావృజే=వఱపబడును, ఈవాయుసూర్యులు, సర్వస్య పాతారౌ = రక్షకులు, పాలయితారౌ వా = పాలకులు అయిన వాయుసూర్యులు, వియాతే = వచ్చినప్పుడు, ఏషాం = ఈప్రజలకు, సుప్రాయణమ్ = శుభగమనయుక్త, బర్హిః = వృద్ధి, ప్రవృజ్యతే = ప్రదానముచేయుదురు, వీరిటమంతరిక్షమ్= వీరిటఆకాశమనబడును. ఏలయన భియో వా భాసో వా తతిః=ఈ యాధార రహితమైన ఆకాశమున భయము కలుగును. దీనియందు సూర్యచంద్ర నక్షత్రాదుల జ్యోతులవిస్తారము కలదు, అపివా = లేక ఉపమార్థేస్యాత్ = మంత్రమున ఇవశబ్దమును ఉపమార్థకముగా గ్రహించిన పక్షమున, విశ్పతీవ - సర్వపతీ ఇవ = సమస్తప్రజలను పాలించు ఇరువురరాజులు, మనుష్యాణాం వీరితే = మనుష్యుల సమూహమునందు వచ్చునట్లు, వాయుసూర్యులిరువురు ఆకాశమున నడచెదురు. ఇట్లు వీరిటశబ్దము గణమునకును వాచకమగును. అని యాస్కునిమతము. రాత్ర్యావివాసే= రాత్రిగడచినపిదప, పూర్వస్యాం అభిహూతౌ = ప్రథమముగుపిలుపునందే,

వాయుః చ నియుత్వాన్=నియోజనకర్త లేక నియమనకర్త యగును. సూర్యశ్చ పూషా చ = సూర్యుడును, స్వస్త్యయనాయ = శుభాగమనాయ భవతి.

ఈమంత్రమున నాక పదము పదపూర్తికొఱకు - మఱియు వీరిట పథమునకు గమనమనియర్థము చెప్పినపుడు ఉపమార్థమునగును, నియుక్త వాన్ పదవ్యుత్పత్తి-నియుతః అస్య అశ్వాః=ఈవాయువుయొక్క అశ్వములు నియుత్ అనబడును. ఏలయన నవి నియంత్రణమున నుంచబడును లేక నియోజనాత్ = రథాదులందు బోడింపబడుటవలన అశ్వములు నియుత ములని చెప్పబడును.

అచ్ఛ - (౭౮).

**అచ్ఛాభేః ఆప్తుమ్ ఇతి శాకపూణిః.**

అచ్ఛ - శబ్దము అభేః నిపాతస్యార్థే వర్తతే ఇతి శాకపూణిమతమ్. అచ్ఛ అనునిపాతము అభేః అభి అభిముఖ్యార్థమున వర్తించును-ప్రయుక్త మగును. శాకపూణిఆచార్యుడు ఈఅచ్ఛశబ్దమునకర్థము ఆప్తుమ్ = ప్రాప్తిం చుటకొఱకు అని చెప్పుచున్నాడు.

పరి - (౭౯), ఈమ్ - (౮౦), సీమ్ - (౮౧).

**పరీమ్సీమితి వ్యాఖ్యాతౌః.**

పరి, ఈమ్, సిమ్ అను వీనివ్యాఖ్యానము ప్రథమాధ్యాయమున చేయబడినది.

ఏనమ్ - (౮౨), ఏనామ్ - (౮౩).

**ఏనమేనామస్యా అస్యేత్యేతేన వ్యాఖ్యాతమ్.**

ఏనమ్, ఏనామ్ - ఉభేఽపి ఏతే పదే అస్యాః అస్య ఇతి పదద్వయేన చతుర్థేఽధ్యాయే వ్యాఖ్యాతే.

ఏనమ్, ఏనామ్ అను నిరెండుపదముల వ్యాఖ్య అస్యాః, అస్య ఇతి ఏతేన అను దీని వ్యాఖ్యానమునను సరించి తెలిసికొననగును.

సృణిః - (౮౪).

**ఇతి చతురుత్తరమ్ అశీతిః పదాని.**

సృణి అను నీపదమువఱకు నీయధ్యాయమున ౮౪ పదముల వ్యాఖ్య చేయబడినది.

**సృణిరంకుశో భవతి సరణాత్. అంకుశోఽఞ్చతే రాకుచితో భవతి ఇతి వా. ''నేదీయ ఇత్ సృణ్యః పక్వమేయాత్'' ఇత్యపి నిగమో భవతి. అంతికతమ మంకుశాదేయాత్ పక్వమౌషధమాగచ్ఛత్వితి ఆగచ్ఛత్వితి.**

సృణి - అనవగతమ్. సరణాత్ సృణి రిత్యవగతమ్. అంకుశో వాచ్యః. అంకుశః కస్మాత్? యత ఏష ఆకుచితో భవతి. సరతి గచ్ఛతి అనేన గజమార్గమితి సృణిః. తథా చ నిగమః - "నేదీయ ఇత్సృణ్యః పక్వమేయాత్" నేదీయః అంతికతమమ్ - అతిసమీపమిత్యర్థః. సృణ్యః అంకుశాదేయాత్ ప్రాగేవ అంకుశాకర్షణాత్ పూర్వమేవ పక్వ మౌషధమా మేయాత్ ఆగచ్ఛతు.

ద్విరభ్యాసో ఽధ్యాయ - పరిసమాప్తి - సూచకః ఇత్యేవం పంచమాధ్యాయస్య అష్టావింశతి - ఖండాత్మకత్వం ప్రతిపాదయన్ సంక్షిప్య సంహరతి. సస్నిమిత్యాదినా - (సస్నిమ్, అనచ్ఛే, స యుస్య, వరాహః, గాయన్తి త్వా, పవిత్రం, పురుత్వా, శిమిత్రే, ప్రతద్వే, అగ్నిం, నర, అయాస్త మన్యో, ఉర్వశ్యప్సరాః, ఉతాస, స ఇత్, నియుత్, శవామర్త, పత్నివన్తః, సుగుః, వృకశ్చన్ద్రమా, ఉరణమథి, యు ఇష్టాగ్నీ. మానః సమస్య, హవిషా జారః, పృథక్, ప్రాయన్, ప్రసితాన్యాప. సుదేవః, ప్రథావృషే)

సృణిః - సృణి అంకుశనామము. సరణాత్ సరణ - గమనము, గజశిరస్సుమీద గమనకారణమున సృణిః అంకుశమనబడును, అంకుశః= అంకుశశబ్దము అంచతేః, అంచుధాతువుచే నేర్పడును. అంచతి గచ్ఛతి

గజశిరసి = గజశిరస్సున గతికలది. కావున అంకుశమనబడును, అంకుశము అకుంచితమనబడును. ఎదుట కొంచెము వంచియుండును. అందువలన అకుంచితమనబడును.

మంత్రార్థము :- సీరాయుక్త ! = ఓ కృషీవలుడార ! నాగళ్లను సన్నద్ధము చేయుడు. కాడిని సవరింపుడు. ఇహకృతే యోనౌ చ = సిద్ధము చేయబడిన క్షేత్రమునందు కృషివిద్య ననుసరించి, గిరా బీజం వపత = బీజములను నాటుడు - విత్తుడు. శ్రుష్టిః సభరా అసత్ = త్వరగా భూమి సస్యశ్యామలమగుగాక ! మంత్రమునందలి ఇతి పదపూర్తికొఱకు, నేదీయః = నికటసమయమునందే, సృణ్యః = సస్యము, పక్వమేయాత్ = పక్వమగుగాక ! అంకుశాత్ = కొడవలితో కోయుటకు పూర్వమే వ్రీహియవాదులు మనకు ప్రాప్తములగుగాక !

రామయాఖ్యసుతుడు, అంబాతనూజుడు, సకలశాస్త్రనిష్ణాత, శ్రీ మహాత్మానందసరస్వతీస్వామి (ముక్తి రామోపాధ్యాయ) శిష్యుడు నగు పండిత గోపదేవకృత ఆంధ్రానువాదము యాస్కముని విరచిత నిరుక్తమున

పంచమాధ్యాయము

సమాప్తము



# షష్ఠాధ్యాయము

## ప్రథమ పాదము

(ద్వాత్రింశచ్ఛతం - ౧౩౨) పదాని

ఆశుశుక్షణిః - (౧).

"త్వమగ్నే ద్యుభిస్త్వమాశుశుక్షణిస్త్వమద్భ్య స్త్వమశ్మన స్పరి. త్వం వనేభ్య స్త్వమోషధీభ్య స్త్వం నృణాం నృపతే జాయసే శుచిః." (ఋ. ౨-౧-౧) త్వమగ్నే ద్యుభిరహోభి స్త్వమాశుశుక్షణిః. ఆశు ఇతి చ శు ఇతి చ క్షిప్రనామనీ భవతః. క్షణిరుత్తరః క్షణోతేః. ఆశు శుచా క్షణోతీతి వా సనోతీతి వా. శుక్ శోచతేః పంచమ్యర్థే వా ప్రథమా. తథాహి వాక్య - సంయోగః ఆ ఇతి ఆకార ఉపసర్గః పురస్తాచ్చికీర్షితజ ఉత్తరః ఆశు శోచయిషురితి. శుచిః శోచతే ర్జ్వలతి - కర్మణః. అయమపీతరః శుచిరేతస్మాదేవ, నిషిక్త మస్మాత్పాపకమితి నైరుక్తాః.

ఆశుశుక్షణిః - అనవగతమేతత్. ఆశు శుచా సనితా, క్షణితా వా ఇత్యవగమః. తథా చ నిగమః - "త్వమగ్నే!...శుచిః" - గృత్సమదస్యేయ మార్షమ్. జగతీ హే భగవన్! అగ్నే! త్వం ద్యుభిః - అహోభిః ఆశు శుక్షణిః - ఆశు శుచా క్షణిః - క్షణోతేః హింసార్థాత్. సనోతేర్వా సంభజ నార్థాత్. మధ్యమం 'శు' ఇత్యేతదక్షరం శుచేర్దీప్త్యర్థస్య, ఆశు - క్షిప్రం శుచా - దీప్త్యా, క్షణోతి హినస్తి ఇతి ఆశుశుక్షణిః అథవా ఆశు శుచా సనోతి సంభజతీతి వా. శుక్ కస్మాత్? శోచతేః. అయమేకో నిర్వచనవిధిః. అథా

పరః పంచమ్యాః అర్థే ప్రథమా వా. తథా హి పంచమీత్వేన విపరిణ తస్యాస్య శబ్దస్య వాక్యే సంగతి ర్భవతి. త్వమద్భ్యః త్వమశ్మనస్పరి త్వం వనేభ్యః ఇత్యాదీని బహూని పదాని పంచమ్యన్తాన్యేవ ఏవ. తస్మాదనేనాపి పంచమ్యన్తేన భవితవ్యమిత్యభిప్రాయః పురస్తాత్ ఆ ఇత్యాకారః ఏషః ఉపసర్గః. ఉత్తరః - అనన్తరః శుశుక్షణిరితి చతురక్షరః శబ్దః, చికీర్షితః చికీర్షితావర్థాజ్జాతః సన్నన్తాద్ధాతో రిత్యర్థః. యః ఆ శుశోచయిషుః ఆదిదీప యిషుః భవతి స ఆ శుశుక్షణిః యియమాన ఇత్యర్థః. తస్మాత్ త్వమగ్నే జాయసే. అద్భ్యః వైద్యుతాత్మనా జాయసే. అశ్మనః పరి పరస్పరాభిఘాతా జ్జాయసే వనేభ్యః - దారుభ్యః. ఓషధీభ్యః-శరాదిభ్యః. నృణాంమనుష్యాణాం పతే జాయసే - అభివ్యజ్యసే శుచిఃదీప్తః.

శుచిః కస్మాత్ ? జ్వలత్యర్థాత్ శోచతేః. అయమపీతరః శుచిః లౌకికః శబ్దః ఏతస్మాదేవ శోచతేః సంపద్యతే ఇతి వైయాకరణాః మన్యన్తే. నైరు క్తాస్తు నిఃపూర్వాత్ సించతేర్మన్యన్తే. యస్మాత్పాప మస్మాత్ నిష్షిక్తం భవతి అన్యస్మిన్ సిక్తమిత్యర్థః.

అర్థము :— ఆశుశుక్షణిః = ఆశు, శు, ఈరెండుపదములు శీఘ్ర వాచకములు. వీని తరువాత 'క్షణిః' పదమునందు హింసార్థక 'క్షణు' ధాతువున్నది. మిక్కిలి శీఘ్రముగా నాశనముచేయునది యని యర్థ మైనది. అగ్ని వెంటనే దగ్ధముచేయును. రెండవయర్థము, ఆశు=శీఘ్రము గానే, శుచా = దీప్తితో, క్షణోతి = నష్టపఱచునది. ఆశు - శుచ్‌క్షణిః - ఆశుశుక్షణిః. యా లేక షణ్ సంభక్తౌ వలన ఆశు = శీఘ్రముగా శుచా = దీప్తిచే - ప్రకాశముతో, షణి = ఇచ్చునది, యా లేక అఙ్ పూర్వక సన్నన్త శుచ్‌ధాతువునకు ఔణాదిక అని ప్రత్యయము చేయుటవలన ఆశుశుక్షణిః సిద్ధమగును. ప్రదీప్తము చేయగోరువాడు అని అర్థము.

మంత్రార్థము :- అగ్నే ! = ఓ యగ్నీ !, త్వమ్ = నీవు, ద్యుభిః = దినములందు అమావాస్య మున్నగు పర్వదినములందు యాజ్ఞికుల ద్వారమున అరణి మున్నగు పదార్థముల మథనమువలన ఉత్పన్నము చేయబడు చున్నావు. ఇట ద్యుభిః పదము తృతీయ, సప్తమి, అర్థములందు ప్రయుక్తమైనది. మఱియు త్వమ్ = నీవు, ఆశుశుక్షణిః = అతిశీఘ్రముగ

నష్టపఱచువాడవు - అతిశీఘ్రముగ ప్రకాశముతో నుండి - ప్రజ్వలించి దగ్ధముచేయువాడవు. నీవు నిప్రకాశముతో అనేక లాభములను కలిగించువాడవు. నీవు శుచిః = ప్రకాశముతో దేదీప్యమానుడవు, అథవా లేక ఆశుశుక్షణిః = ప్రథమాన్త పదము పంచమ్యర్థమున నున్నది. అగ్నీ! నీవు శీఘ్రముగా ప్రజ్వలింపచేయు పురోహితునివలన నుత్పన్నమగుచున్నావు. త్వమ్ = నీవు, అద్భ్యః = జలమునుండి విద్యుత్తురూపమున, ఆవిర్భవించుచున్నావు, త్వమ్ = నీవు, అశ్మనః = రాతినుండి, రాళ్లసంఘట్టనవలన, పరిపరితః = అన్నివైపులనుండి, యుత్పన్నమగుచున్నావు, త్వమ్ వనేభ్యః= కట్టెలనుండి ఉత్పన్నమగుచున్నావు, త్వమ్ = నీవు, ఓషధీభ్యః = రెల్లుమున్నగు ఎండుతృణవిశేషములనుండి ఏర్పడుచున్నావు, నృణాంపతే = ఓ మానవపాలక !.

భాష్యార్థము :- శుక్శోచతేః = దీప్త్యర్థక 'శుచ్' ధాతువు క్విప్ ప్రత్యయముచేయుటవలన 'శుక్' శబ్దము సిద్ధమగును పంచమ్యర్థే వా ప్రథమా, మంత్రమున ఆశుశుక్షణిః పదము పంచమ్యర్థమున ప్రథమాంతము ప్రయోగింపబడినది. తథా హి వాక్యసంయోగః - ఏలయన అన్నివాక్యములతో మేళనము అన్వయమిట్లే కుదురును. మంత్రమున అద్భ్యః, అశ్మనః, వనేభ్యః, అని పదములన్నియు పంచమ్యన్తములై ప్రయోగింపబడినవి. కావున ఆశుశుక్షణిః-ఈ ప్రథమాన్తపదముకాడ శీఘ్రముగా నిన్ను ప్రదీప్తము చేయువలచిన పురోహితునివలన లేక మనుష్యునివలన అని పంచమ్యర్థము చెప్పవలయును.ఆశుశుక్షణియందలి ఆకారము ఉపసర్గ. ఆ తరువాతగల శుశుక్షిపదము సన్నన్త శుచ్ధాతువువలన నుత్పన్నమైన శుశుక్షిధాతువు. ఆశుశోచయిషుః ఇతి ఆదీప్తమునప్పకోరికగలవాడు అని యర్థము. శుచిః = దీప్తిఅర్థముగల శుచిశబ్దము శోచతేః జ్వలతి కర్మణః = జ్వలత్యర్థక శుచ్ధాతువుతో నేర్పడును- కాని నైరుక్తాః నిరుక్తాచార్యులు నిష్షిక్తమ్ పాపకమ్ = పాపసముదాయము లేక మైల దీనినుండి పూర్తిగ వెడలిపోయినది. కావున నిష్షిక్తమందురు. పవిత్రవాచకమగు శుచిశబ్దముకాడ - జ్వలనార్థక శుచధాతువువలననే యేర్పడినది అందురు. షిచ్పూర్వకసిచ్ధాతువువలననే శుచిశబ్దమేర్పడునని యందురు.

52)

ఆశాభ్యః - (౨).

“ఇంద్ర ఆశాభ్యస్పరి సర్వాభ్యో అయం కరత్” (ఋ. ౨-౪౧-౧౨).

ఆశా దిశో భవన్తి ఆసదనాత్. ఆశా ఉపదిశో భవన్తి అభ్యశనాత్.

ఆశాభ్యః - అనేకార్థత్వాదనవగతమ్. ఆసదనాత్ ఆశాః ఇత్యవగమః. నిగమేనోదాహరతి - "ఇంద్ర ఆశాభ్యః ... అభయంకరత్". ఇంద్రః ఆశాభ్యో భావి భయం అభయం కరోత్వితత్యర్థః. యతస్తాః పరస్పరేణ అభ్యశ్నువతే తస్మాదాశాః ఉపదిశోఽపి భవన్తి.

మంత్రార్థము :- ఇంద్రః పరమాత్మా సర్వాభ్యః ఆశాభ్యః = అన్ని దిశలనుండి ఉపదిశలనుండి, అభయం పరికరత్=అభయము నొసంగుగాక !

భాష్యార్థము :- ఆశాః దిశాః = దిశలు, భవన్తి = అగును, ఆసదనాత్ = ఆసన్నము లగుటచేత నికటములగుటచే, మఱియు, ఆశాః = దిశలుఉపదిశలుకూడ, భవన్తి = అగును, అభ్యశనాత్=పరస్పరము వ్యాప్తములై యుండుటవలన.

కాశిః - (౩).

కాశిర్ముష్టిః ప్రకాశనాత్. ముష్టిః మోచనాద్ వా మోషణాద్ వా మోహనాద్ వా. “ఇమే చిదింద్ర రోదసీ అపారే యత్ సగృభ్ణా మఘవన్ కాశిరిత్తే” (ఋ. ౩-౩౦-౫) ఇమే చిదింద్ర రోదసీ రోధసీ ద్యావాపృథివ్యౌ విరోధనాత్. రోధః కూలం నిరుణద్ధి స్రోతః కూలం రుజతేర్విపరీతాత్ లోష్టోఽవిపర్యయేణ. అపారే దూరపారే యత్ సంగృభ్ణాతి మఘవన్ కాశిస్తే మహాన్.

కాశిః - అనవగతమేతత్. ప్రకాశనాత్ కాశిః ఇత్యవగమః ముష్టిరిత్యభిధేయవచనమ్. ముష్టిః కస్మాత్ ? అసౌ ముచ్యతే ఇతి మోచనాత్ ముష్టిః స్యాత్. అథవా తేన ముష్యతే ఇతి మోషణాత్ ముష్టిః స్యాత్

అథవా ముష్టా పరః ముష్ణాతి ఇతి ముష్టిః స్యాత్ ఇతి పర్యాయప్రసక్తం ముష్టినిర్వచనమ్. కాశిం నిగమే నోదాహరతి "ఇమే చిదింద్ర···కాశిరిత్తే" హే ఇంద్ర! ఇమేచిత్ - ఇమే అపి. రోదసీ ద్యావాపృథివ్యౌ. ఏవమపి అపారే దూరపారే సతీ యత్ సంగృభ్ణాసి సంగృహ్ణాసిత్వమ్ మఘవా తే కాశిః ముష్టిః మహాన్! ఆశ్చర్యకర ఇత్యభిప్రాయః 'రోదసీ' రోధసీ కస్మా దుచ్యేతే? విరోధనాత్ యస్మాదేతే వివిధాని భూతాని రున్ధః ఇతి. కూల మపి రోధః పదవాచ్యమ్. యస్మాదేతత్ అపి జలస్రోతాంసి నిరుణద్ధి. కూలం కస్మాత్? విపరీతాత్ రుజతేరితి. లోష్టః అపి అస్మాదేవ ధాతోర విపరీతాత్. ప్రసక్తాను ప్రసక్త నిర్వచనమేతత్.

అర్థము :— కాశిః = దీనియర్థము ముష్టిః = పిడికిలి, ప్రకాశనాత్= ప్రకాశితమగుచున్నటచే ఈముష్టి పిడికిలి తనలో (గుప్పిటి) ఉన్నవానిని ప్రకటింపజేయును. ముష్టిర్మోచనాద్ వా = పిడికిలిలోనుండి వస్తువు విడిపింపబడును. 'ముచ్లృ' మోచనే ధాతువువలన ముష్టిశబ్దమేర్పడును. యదా మోషణాద్ వా దీనినుండి కొంతెకవస్తువు విడిపింపజేయుబడును. ముష్స్తేయే ధాతువువలన ముష్టిశబ్దము సిద్ధించును, మోహనాద్వా - ఒకని ముష్టిలో ఏమున్నదో సరిగా చెప్పజాలము. కావున 'ముహ' వైచిత్యే ధాతువువలన సిద్ధించును.

మంత్రార్థము :- హే ఇంద్ర! ఇమేచిత్=ఇవికూడ, అపారే రోదసీ= పారరహితములై అంతులేని ద్యూలోకపృథివీలోకములనుగూడ, సంగృభ్ణా = నీవు నీముష్టియందు బిగించియున్నావు, హే మఘవన్! = ఓ ధన పతి!, నీ కాశిః = పిడికిలి, మహాన్ = గొప్పది.

భాష్యార్థము :— రోదసీ అని యేల? ఇవి రోధసీ=రోదసీ యనబడు చున్నవి. అయినచో రోదసీ యననేల? ఇతి - ద్యూపృథివీలోకములు వివిధ ప్రాణులను విరోధనాత్ అడ్డగించుచున్నవి - నిరోధించుచున్నవి. కావున వీనిని రోధసీ, రోదసీ యనుచున్నారు. రోధః = కూలమ్ = ఒడ్డు - తీరము. ఒడ్డు - తీరము స్రోతస్సులను అడ్డగించును. (నిరుణద్ధిస్రోతః) - 'రుజో భంగే' ధాతువుతో కూలశబ్దము సిద్ధించును. విపరీతాత్ = విపరీతముచేసిన, రుజ్ - దానిని విపరీతముచేసిన 'జూర్' అగును. దానికి ప్రత్యయము.

లోష్టాఽవిపర్యయేణ = విపర్యాయముచేయకున్న ఈ దుప్ ధాతువుతోనే లోష్టశబ్దముకూడ నేర్పడును. అపారే - దూరపారే=వేనిపారము దూరముగ నున్నవో అవి, యుపారే అనబడుచున్నవి, యత్ సంగృభ్ణాసి = ఎందువలన నన్నిటిని ముష్టిలోనుంచుకొనుచున్నావో అందువలన నీముష్టిః = కాసః, మిక్కిలి, మహస్ = గొప్పది.

కుణారుమ్ - (౪).

"అహస్తమింద్ర సంపిణక్ కుణారుమ్" (ఋ. 3-30-౮)
అహస్తమింద్ర కృత్వా సంపింధి పరిక్వణనం మేఘమ్.

కుణారుమ్ - అనవగతమేతత్. క్వణనమితి శబ్దసమాధిః. మేఘో వాచ్యః. తదత్ర నిగమః. "అహస్త ... కుణారుమ్" అహస్తమ్-అప్రతికార సమర్థమ్ కృత్వా తతః పునః సంపిణక్ సంపింధి సంచూర్ణయేత్యర్థః. కుణారుమ్ - పరిక్వణనశీలమ్ శబ్దం కుర్వాణమితి యావత్.

మంత్రార్థము :- హే ఇంద్ర! అహస్తమ్ =చేతులులేని - (ఎదుర్కొన నసమర్థులైన) కుణారుమ్ = ఆ గర్జించుస్వభావముగల, మేఘం = మేఘమును, సంపిణక్ = చూర్ణమైనట్టుము - తునకలు తునకలుగా చేయుము.

భాష్యార్థము :- హే ఇంద్ర! అహస్తమ్ = హస్తములులేని - ఎదుర్కొన నసమర్థమగు మేఘమును నసమర్థునిగా చేసి సంపింధి=తునకలు తునకలుగాచేయుము. పరిక్వణనమ్=గర్జించు మేఘమును సామర్థ్యముతో.

అలాతృణః - (౫).

"అలాతృణో బల ఇంద్ర వ్రజో గోః పురా హన్తోర్భయమానో వ్యార". సుగాన్ పథో అకృణోన్నిరజేగాః ప్రావన్ వాణీః పురుహూతం ధమన్తీః" (ఋ. 3-30-౧౦). అలాతృణోఽలమాతర్దనో మేఘో బలో వృణోతేర్ వ్రజో వ్రజత్యంతరిక్షే, గోరే తస్యా మాధ్యమికాయా వాచః పురా హననాత్ భయమానో వ్యార. "సుగాన్ పథో అకృణోన్నిరజేగాః". సుగమనాన్ పథోఽకరోన్నిరజనాయ గవామ్.

"ప్రావన్ వాణీః పురుహూతం ధమన్తీః" అపో వా వహనాద్ వాచో వా వదనాత్. బహుభిరాహూత ముదకం భవతి. ధమతిర్గతి కర్మా.

అలాతృణః - అజ్ఞాతమేతత్. అలమాతర్దన ఇత్యుపగమః. నిగమేన స్పష్టీకరోతి - "అలాతృణో ... ధమన్తీః" హే ఇంద్ర! హన్త్రోః పురా భయమానః, అలాతృణః, బలః, వ్రజః గోః వ్యార. సుగాన్ పథః అకృణోత్. నిరజే గాః పురుహూతం ధమన్తీః వాణీః ప్రావన్ ఇత్యన్వితిః. అథవ్యాఖ్యా హన్త్రోః హననాత్. పురా పూర్వమ్. బలః జలపూరితో మేఘః. వ్రజః - అంతరిక్షే వ్రజనశీలః అంతరిక్షచారీత్యర్థః ఏషః మేఘః మాధ్యమికాయాః త్వదీయాయాః గోః వాచః శబ్దం శ్రుత్వేతి శేషః. భయమానః బిభ్యత్ వ్యార-విశ్లథీభవతీత్యర్థః. స త్వమేనం మేఘం విదారయన్ పథః మార్గాన్ సుగాః - గమనయోగ్యాన్ అకృణోత్ - కృతవాన్. యేన గాః గవామ్ అపామిత్యర్థః నిరజనాయ నిర్గమనాయ. పురుహూతమ్ - ఉదకం ధమన్తీః వహన్తీః వాణీః - అపః, ప్రావన్ = ప్రాగచ్ఛన్. తదేవం పురా హననాత్ భయమానః ఇత్యనేన సంబంధాత్ అలాతృణః మేఘః ఇత్యుపపన్నమ్. అథైకపద నిరుక్తమ్. అలాతృణః కస్మాత్? యస్మాదేషః అలమాతర్దనో భవతి. పూర్ణః పీడక ఇత్యభిప్రాయః బలః వృణోతేః. వ్రజశ్చ వ్రజతేః. వ్రజత్యాసావంతరిక్షే. వాణీః కస్మాత్? వహనాత్ వదనాద్ వా. పురుభిః బహుభిః హూతః పురుహూతః.

మంత్రార్థము :— హే ఇంద్ర! అలాతృణః = జలముతో నిండియున్న కారణమున దేనిని సులభముగా చంపవీలగునో, వ్రజః=అంతరిక్షమున భ్రమించు, బలః = మేఘమును ఛేదించుచు, గోః = జలమును (ఇట గాః పదము షష్ఠ్యర్థమున ద్వితీయావిభక్తిలో ప్రయోగము, నిరజే = నిష్క్రమించుటకై - బయటపడుటకై, పథః = మార్గములను, సుగాన్ = అనాయాసముగ వెళ్లుటకు తగినట్లు, అకృణోత్=చేయుచున్నావు, ప్రావన్ వాణీః = బయటపడు నాజలము, ధమన్తీః = క్రిందివైపు పోవుచు, పురుహూతమ్=పార్థివజలమువైపు తటాకాదులలోగల జలమునందు కలియును.

భాష్యార్థము :- అలాతృణః - అలమాతర్దనః అలాతృణః పదమున కర్థము, అలమ్ = పర్యాప్తము, ఆతర్దనం = హింసా హింసా యస్య సః మేఘః = దేనికి హింసకలుగునో యది మేఘము అనగా జలముతోనిండి శీఘ్రముగ వర్షింపబోవు మేఘము, బలః = మేఘనామము, బలము.బలమన మేఘమనియర్థము జలమును కప్పియుండు మేఘమును బలమందురు, వ్రజః = గన్తా వెళ్లునది, వ్రజతి అంతరిక్షే = అంతరిక్షమున మేఘము గతి కలిగియుండును, గోశబ్దమునకర్థము వాణి. ఏతస్యాః మాధ్యమికాయాః వాచః = మాధ్యమికవాణివలన విద్యుత్తుయొక్క గర్జనవలన - హననాత్ పురా—హననముకంటె ముందు, భయమానః = భయపడుచు, వ్యార = శిథిలమై బయటబడవచ్చెను, సుగాన్ పథః అకృణోన్నిరజేగా సుగమ నాన్ పథో అకృణోన్నిరజనాయ గవామ్. గవామ్ = జలములయొక్క, నిరజనాయ = బయటికి వచ్చుటకు, సుగాన్ = సులభముగా బయట పడుటకు తగిన, పథః = మార్గములను, అకరోత్ = సిద్ధముచేసెను, పురుహూతమ్ = జలము జలాశయములవైపు, ధమన్తీః = గతినొనర్చుచు జలము, ప్రావన్ = ప్రవహింపదొడగెను, ఆపో వా వహనాత్ వాణీ = జల మును వాణియందురు, వహనాత్ = ప్రాణులెల్లను గ్రహించును, వాచో వా వదనాత్ = మాటలాడుటవలన వాణి యని వాక్కనందురు. పురు హూతమ్ = ఇది జలమునకు పేరు, పురు = బహుజనులచే, ఆహూతమ్ = పిలువబడును, గత్యర్థకధమధాతువుతో ధమన్తీః పదము సిద్ధమగును.

సలలూకమ్ - (౬).

> "ఉద్వృహ రక్షః సహమూలమింద్ర వృశ్చా మధ్యం ప్రత్యగ్రం శృణీహి ఆకీవతః సలలూకం చకర్థ బ్రహ్మ ద్విషే తపుషిం హేతిమస్య" (ఋ. ౩-౩౦-౧౭).

ఉద్ధర రక్షః సహమూలమింద్ర మూలం మోచనాద్వా, మోషణాద్వా, మోహనాద్వా. వృశ్చ మధ్యం ప్రతి శృణీహ్యగ్రమగ్రమాగతం భవత్యాకియుతో దేశాత్. సలలూకం సంలుబ్ధం భవతి పాపకమితి నైరుక్తాః. సరరూకం వా స్యాత్సర్తరభ్యస్తాత్. తపుషి స్తపతేః హేతిర్హన్తేః. సలలూకమ్=అనపగత మేతత్. సంలుబ్ధమిత్యుపగమః - తథా చ నిగమః. - ఉద్వృహ... హేతిమస్య - హే

ఇంద్ర! ఏతద్ రక్షః సహమూలమ్ ఉద్వృహ - ఉద్ధర - ఉన్మూలయేతి యావత్. అస్య మధ్యం వృశ్చ - ఛిన్ది అగ్రం చ ప్రతిశృణీహి ప్రతి జహీత్యర్థః. ఆకీవతః ఆ కస్మాత్ దేశాత్ ఏతదున్మూలయ, తస్మాత్ యం విచారయన్తోఽపి న విచారయితుం పారయేయుః. ఉన్మూల్య చైతత్ 'సల లూకం' సంలుబ్ధం సంమూఢం చకర్థ కురు. యత్ ఏష బ్రహ్మద్వేషీ తస్మాదస్మై తపుషిం తాపయిత్రీం హేతిం శస్త్రవిశేషం పునః పునః క్షిపేతి శేషః.

అథైక-పద నిర్వచనమ్. సహమూలం మూలైః సహ వర్తమానమ్. మూలం పునర్మోచయతేః, మోషయతేః, మోహయతేర్వా. అగ్రం కస్మాత్? ఆగతం భవతి. ఆకీవతః. కియతః దేశాత్. సలలూకం కస్మాత్? సంలుబ్ధ మేతత్ భవతి. సాభ్యాసాత్ సర్తేర్వా సరరూకమేవ సలలూకమ్. నైరుక్తాః పునః సలలూకం పాపకమిత్యాచక్షతే తపుషిః కస్మాత్? తాపయతీతి సతః. హేతిః కస్మాత్? హన్తీతి సతః.

మంత్రార్థము :- హే ఇంద్ర! రక్షః = రాక్షసుని, సహమూలమ్ = వేళ్లతోపాటు, ఉద్వృహ = పెరికివేయుము, మధ్యమ్ = దీనిమధ్యభాగ మును, వృశ్చ = ఖండించుము, ప్రత్యగ్రం = దీనిప్రతిచివరిభాగమును, ప్రతిశృణీహి = నష్టముచేయుము, ఆకీవతః = దూరదేశమువఱకు, సల లూకం = పాపిని, చకర్థ = చేయుము = పంపివేయుము, బ్రహ్మద్విషే = బ్రహ్మద్వేషికొఱకు, తపుషిం = తపింపజేయు, హేతిమ్ = ఆయుధమును, అస్య = అతనిపై వెయుము

భాష్యార్థము :- ఉద్వృహ = ఉద్ధరింపుము - పెరికివేయుము, మూలముయొక్క వ్యుత్పత్తి - మోచనాత్ = మొదలుతో విడిపించుట, పెరికివేయుటకు మూలమందురు. మోషణాద్ వా = లేక వేరు దాగి యుండును - చౌర్యముకాడ కనబడకుండునట్లు చేయబడును. అందు వలన ముషస్తేయే ముచ్ల్మోచనే ధాతువులతో, లేక ముహమోహనే అజ్ఞాత మగుటవలనను వేరు భూమిలో నెంతలోతుకు పోయినదో తెలియకుండుట చేతనుమూల మనబడును. ప్రత్యగ్రమ్=ప్రతిఅగ్రభాగమును. అగ్రమననేమి? ఆగతం భవతి = వచ్చియున్నది యగును. ఆకీవతః శబ్దమునకు అర్థము - ఎంతదూరమువఱకు వెళ్లియున్నది? చాలదూరము వెళ్లినదని అర్థము

సలలూకమ్ = ఇతరనైరుక్తకారులు సలలూకమునకు వ్యుత్పత్తి యిట్లుం దురు. సమ్ 'పూర్వక 'లుభ' విమోహనే విమోహనార్థక ధాతువునకు క్త ప్రత్యయముచేసి స్వార్థమున 'కన్' ప్రత్యయమును జేసి సంలులుబ్ధక సంలులూకమ్ యుజేలుగంతపదమును సిద్ధముచేయుదురు. గడబడచేయు వాడు = పాపి అనియర్థము. యాస్కునిమతమున అభ్యస్తాత్సరతేః = యజేలుగన్త, సృధాతువునకు స్వభావార్థమున 'అక' ప్రత్యయముచేసి సరరూకమ్ - (సలలూకమ్) అని సిద్ధపఱపబడును. వ్యర్థముగా నిటు నటు తిరుగువాడు - సరణశీలుడు అని యర్థము. తపుషిః = తపసంతాపె సంతాపార్థక తపధాతువుతో సిద్ధమగును. హేతిః హన్తేః = హనధాతువునకు 'క్తిన్' ప్రత్యయముచేసిన హేతిః సిద్ధమగును. ఆయుధమని అర్థము.

కత్పయమ్ - (౭).

> "త్య చిదిత్థా కత్పయం శయానమ్" (ఋ. ౫-3౨-౮)
> సుఖపయసమ్. సుఖమస్య పయః.

కత్పయమ్ - అనవగతమేతత్ కపయమిత్యవగమః. సుఖ - పయస మిత్యర్థః. మధురోదకో మేఘోఽభిధేయః అత్ర నిగమః 'త్యమ్ ... శయా నమ్' త్యం తం మేఘమ్. ఇత్థా ఏవమ్. కత్పయమ్ సుఖోదకమ్. శయా నమ్ సుప్తమ్. ఇంద్రః కత్పయం జఘానేతి సంబంధాత్ కత్పయో మేఘః ఇత్యుపపద్యతే.

అర్థము :- కత్పయమ్ = కపయ - సుఖపయసమ్ = సుఖప్రవ జలముకలది, తియ్యనినీరుకలది యనియర్థము. అస్య = ఈ మేఘము యొక్క, జలమ్ = జలము, సుఖంపయః = సుఖప్రదము.

మంత్రార్థము :- ఇత్థా = ఈవిధముగ త్యంచిత్ కత్పయమ్ = ఆ మధురజలముగల, శయానమ్=అంతరిక్షమున పడియున్న మేఘమును, అసూర్యేతమసి = సూర్యరహిత అంధకారమున, వావృధానమ్ = వృద్ధి బొందుచున్న వానిని మొదలైన.

విస్రుహః - (౮).

"విస్రుహః ఆపో భవన్తి విస్రవణాత్. వయా ఇవ రురుహుః సప్త విస్రుహః" ఇత్యపి నిగమో భవతి. (ఋ. ౨-౩౫-౮).

విస్రుహః - అనపగతమేతత్. విస్రవణాదిత్యవగమః. "వయా ఇవ ... విస్రుహః" వయా ఇవ - శాఖా ఇవ, సప్త సర్పణాః విస్రుహః - వివిధస్రవణాః రురుహుః పృథివ్యాం ప్రాదుర్భూతా ఇత్యర్థః. విస్రుహః = విస్రుహములు, ఆపఃభవన్తి = జలములనబడును. విస్రవణాత్ = స్రవణశీలముగలవగుటవలన.

మంత్రార్థము :- సప్త = ఏడు, విస్రుహః = గంగా ఆది నదీ భేదముతో, లేక సముద్రభేదముతోగాని, లేక సప్తపదార్థము-సర్పణాః=ప్రవహించు స్వభావముగల, విస్రుహః = నదీమున్నగు జలములు, వయాఇవ= వృక్షశాఖలవలె, రురుహుః = భూమిమీద ప్రాదుర్భూతములైయున్నవి - నదులరూపమున ప్రవహించుచున్నవి.

వీరుధః - (౯).

వీరుధ ఓషధయో భవన్తి విరోహణాత్. "వీరుధః పారయిష్ణవః" ఇత్యపి నిగమో భవతి. (ఋ. ౧౦-౯౭-౩)

వీరుధః అజ్ఞాతమేతత్. విరోహణా భవన్తీత్యవగమః. వీరుధః కస్మాత్? యస్మాదేతాః విరోహన్తి తస్మాత్ విరోహణాః సత్యో వీరుధః ఉచ్యన్తే. ఓషధయ ఇత్యభిధేయవచనమ్. అత్ర నిగమః "వీరుధః పారయిష్ణవః పారయిష్ణవః పారయిత్ర్యః".

అర్థము :- వీరుధః = వీరుధులు, ఓషధయోభవన్తి = ఓషధులగును, ఓషధులను వీరుధులందురు, విరోహణాత్ = భూమినుండి పైకి వచ్చుటవలన, వివిధంరోహన్తి = అనేకవిధములు నివి యంకురించును.

మంత్రార్థము :- పారయిష్ణవః = రోగమునుండి ఒడ్డునవేయు, వీరుధః = ఓషధులార!.

నక్షద్దాభమ్ - (౧౦).

**నక్షద్దాభమశ్నువానదాభమభ్యశనేన దభ్నోతీతి - "నక్ష ద్దాభం తతురిం పర్వతేష్ఠామ్" ఇత్యపి నిగమో భవతి. (ఋ. ౬-౨౨-౨).**

నక్షద్దాభమ్ అప్రతీతమేతత్. న క్షణుదాభమిత్యర్థ ప్రతీతిః అశ్ను వాన దాభమితి పర్యాయేణాభిధేయవచనమ్. అభ్యశనేన అభివ్యాపనేన దభ్నోతి హినస్తి ఇతి నక్షద్దాభః. నిగమోఽపి భవతి. "నక్షద్దాభం తతురిం పర్వతేష్ఠామ్ - తతురిం - త్వరణశీలమ్. నక్షద్దాభమ్ అభివ్యాపనమాత్రే ణైవ హన్తారమ్. పర్వతేష్ఠామ్ - మేఘస్థాయినమ్.

అర్థము :- నక్షద్దాభమ్ = నక్షద్దాభము అశ్నువానదాభమ్=వ్యాపించి నశింపజేయునది లేక వ్యాపకమై గతిని కలిగించునది అని యర్థము. వ్యాప్త్యర్థక నక్ష ధాతువు, గత్యర్థకము, లేక వధార్థకమునగు దభధాతువు నిఘంటువునందు పఠింపబడినది. అభ్యశనేన=వ్యాప్తితో, దభ్నోతి=గతిని కలిగించును లేక చంపును.

మంత్రార్థము :- నక్షద్దాభమ్ = వ్యాప్తమై దుష్టులను నాశనము చేయువాడు, తతురిమ్ = దుఃఖసాగరమునుండి తరింపజేయువాడు, పర్వతేష్ఠామ్ = మేఘముననున్నవాడునగు నాపరమేశ్వరుని, అభివాజ యన్తః = బాగుగనెఱుగుచు.

అస్క్రృధోయుః - (౧౧).

**అస్క్రృధోయు రకృధ్వాయుః. కృధ్వితి హ్రస్వనామ, నికృత్తం భవతి. యో అస్క్రృధోయు రజరః స్వర్వాన్ ఇత్యపి నిగమో భవతి.**

అస్క్రృధోయుః - అస్పష్టమేతత్ - అకృధ్వాయుః ఇతి స్పష్టమ్. కృధు ఇతి హ్రస్వనామ. తద్ధి నికృత్తమివ భవతి హ్రస్వత్వాత్. తస్య నఞా సమాసః. అకృధ్వాయుః దీర్ఘాయురిత్యర్థః. తథా చ నిగమః. "యో... స్వర్వాన్" అజరః జరాధర్మరహితః. స్వర్వాన్ సుష్ఠు శత్రూణాం మీరయితా.

అర్థము :— అస్క్రృధోయుః = దీర్ఘాయువు, అకృధ్వాయుః = దీర్ఘాయువు, కృధు ఇతి హ్రస్వనామ=కృధు హ్రస్వమునకు పేరు. నికృత్తం భవతి = ఇది పెద్దదానినుండి ఖండింపబడినదగుచున్నది.

మంత్రార్థము :— యః పరమాత్మా=ఏ పరమాత్మ, అస్క్రృధోయుః= దీర్ఘాయువు నాశములేనిది అగునో, అజరః = వృద్ధాప్యము లేనిదగును, స్వర్వాన్ = ఆనందమయుము, కృధు కృతీ ఛేదనే ధాతువువలన కృధు శబ్దము సిద్ధించును ఔణాదిక 'కు' ప్రత్యయముచేసిన కృతుఅగును. కృతు - కృధు అగును.

నిశ్రృంభా - (౧౨)

> నిశ్రృంభా నిశ్రథ్యహారిణః. "అజాసః పూషణం రథే నిశ్రృంభాస్తే జనశ్రియమ్. దేవం వహన్తు బిభ్రతః"(ఋ ౬-౫౫-౬) అవహన్త్వజాః పూషణం రథే నిశ్రథ్యహారిణస్తే. జనశ్రియం జాతశ్రియమ్.

నిశ్రృంభాః అనవగతమేతత్. నిశ్రథ్య హారిణ ఇత్యుపగమః. నిశ్లథయా దృఢయా గత్యా హరన్త ఇత్యర్థః. నిగమేనోదాహరతి-"అజాసః...బిభ్రతః" భరద్వాజస్యేయం మార్షమ్. నిశ్రృంభాః అజాసః, జనశ్రియం పూషణం దేవం రథే బిభ్రతః అవహన్త ఇత్యన్వితిః. అథ వ్యాఖ్యా. నిశ్రృంభాః అశ్లథ గతిమన్తః అజాసః అశ్వాః జనశ్రియమ్ ఉద్భూతశ్రియమ్ పూషణం సర్వేషాం పోషయితారం దేవం రథే అవస్థితమ్ బిభ్రతః ధారయన్తః అవహన్త - ఆవహన్తు. అత్ర అశ్వవిశేషణత్వాత్ నిశ్రృంభాః ఇత్యస్య పదస్య అశ్లథ - గతిమంతః ఇత్యేషోఽర్థ ఉపపన్నః.

అర్థము :— నిశ్రృంభాః = నిశ్రథ్యహారిణః - నిశ్రథయా దృఢయా గత్యా హారిణః హరణశీలాః = శిథిలముకాని - దృఢమైనగతితో హరించు - తీసికొనిపోవునట్టి గుఱ్ఱములు.

మంత్రార్థము :- నిశ్రృంభాః = అవిశ్రాంత - అశిథిలగతితో తీసికొని వెళ్లునట్టి, అజాసః = సూర్యునిహయములు, జనశ్రియమ్ = ఉత్పన్న శోభ - ప్రకాశముగల, ప్రదీప్త - పూషణం దేవమ్ = సూర్యదేవుని, రథమ

రథే = రథమునందు, బిభ్రతః = ధారయన్తః = ధారణచేయుచు, ఆవ హన్తు = తీసికొనివెళ్లునుగాక !

బృబదుక్థమ్ - (౧౩).

**బృబదుక్థో మహదుక్థో వక్తవ్యమస్మా ఉక్థమితి బృబదుక్థో వా. "బృబదుక్థం హవామహే" ఇత్యపి నిగమో భవతి.**

బృబదుక్థమ్ = అస్పష్టార్థమేతత్. మహదుక్థః అథ చ వక్తవ్యమస్మై ఉక్థమితి స్పష్టోఽర్థః. తథా చ నిగమః - బృబదుక్థం హవామహే ఉక్థమ్ శస్త్రమ్. బృహత్ - మహత్ వా ఉక్థమ్ యస్య స బృహదుక్థః తమ్. బృహదుక్థఏవ బృబదుక్థః. హకారస్థానే బకారః. హవామహే ఆహ్వాయామహే.

అర్థము :- బృబదుక్థమ్ బృహత్ - మహత్ ఉక్థం స్తోమం స్తుతిర్వా యస్య స తమ్=మిక్కిలి గొప్పస్తోమము స్తుతిగలిగిన దేవాధిదేవ పరమేశ్వరుడు బృబదుక్థుడనబడును. అట్టిదేవుని అథవా, బృహత్ వక్తవ్యమ్ అస్మై ఉక్థం స స్తోత్రం బృబదుక్థః = చెప్పదగిన స్తుతి ఎవనికొఱకు చేయబడునో యతడు, బృబదుక్థః = బృబదుక్థుడనబడును, తమ్ = అతనిని.

మంత్రార్థము :- బృబదుక్థమ్ = మిక్కిలి ప్రశస్తమైన స్తుతిగలిగిన దేవాధిదేవుని, హవామహే = మేమాహ్వానించుచున్నాము.

బుదూదరః - (౧౪).

**బుదూదరః సోమో మృదూదరో, మృదురుదరేష్వితి వా. "బుదూదరేణ సఖ్యా సచేయ" ఇత్యపి నిగమో భవతి (ఋ. ౮-౪౮-౧).**

బుదూదరః - అస్పష్టమేతత్. మృదూదరః ఉదరేషు మృదుర్వేతి స్పష్టమ్. తథా చ నిగమః "బుదూదరేణ ... సచేయ" బుదూదరేణ మృదూదరేణ సోమేన. సఖ్యా సమాన స్థానేన. సచేయ - సంసచేయమ్. ప్రకరణాత్ శబ్దసారూప్యాచ్చ బుదూదరః మృదూదరః.

అర్థము :- బుదూదరః-శబ్దమునకర్థము. మృదూదరుడు. మృదువే బుదువైనది. ఛిద్రసహితమగుటచే బుదు మృదువుకోమలము లేక మెత్త

ఏది - తేలికైనది అని అర్థము. దేనివిషయమునఏది-ఉదరమున మృదువై యుండవచ్చునను ఆశంస కలుగునో యది ఋదూదరః. ఋదూదర మనబడును. ఏది తేలికయై దేనిని తినినమీదట ఉదరముకూడ తేలికగా నుండునో యది మృదూదరమనబడును. సోమపానము చేయువారు సోమము తేలికగా నుండవలెనననియు అది పానముచేసినమీదట వమనము కారాదనియు అది తేలికగా జీర్ణము కావలయునని కోరుదురు. అట్టి సోమము మృదూదరమనబడును. మృదూదరపదములో మొదటిమకారము తొలగించిన ఋదూదరమగును.

మంత్రార్థము :- ఋదూదరేణ = మృదూదరమునకు మిత్రభూత మైన సోమరసముతో, సచేయ = నేను సేవచేయబడుదునుగాక! అనగా వికారముకలిగింపనిసోమమును నేను సేవింతునుగాక అని భావము.

ఋదూపే - (౧౫).

**ఋదూపే ఇత్యుపరిష్టాత్ వ్యాఖ్యాస్యామః.**

ఋదూపే పదమును ముందు వ్యాఖ్యానింతుము.

పులుకామః - (౧౬).

**పులుకామః పురుకామః. "పులుకామో హి మర్త్యః" (ఋ. ౧-౧౭౯-౫) ఇత్యపి నిగమో భవతి.**

పులుకామః దుర్జ్ఞేయమేతత్. పురుకామ ఇతి సుజ్ఞేయమ్. నిగమే సోదాహరతి "పులు... మర్త్యః"మర్త్యః మరణధర్మా మనుష్యః పురుకామో బహుకామో భవతి.

అర్థము :- పులుకామః = పురుకామః, పురు = బహు, కామ = కోరికలు, పురుకామః = ఎక్కువకోరికలు కలవాడు.

మంత్రార్థము :- హి = ఏలయన, మర్త్యః = మనుష్యుడు స్వభావముతో, పులుకామః = ఎక్కువకోరికలుకలవాడు.

అసిన్వతీ - (౧౭).

**అసిన్వతీ అనశ్నాదన్త్యౌ. "అసిన్వతీ బప్సతీ భూర్యత్తః" (ఋ. ౧౦-౭౯-౧) ఇత్యపి నిగమో భవతి.**

అసిన్వతీ దుర్బోధమేతత్. అసఙ్ఖాదన్త్యావితి సుబోధమ్. అత్ర నిగమః "అసిన్వతీ ... భూర్యత్తః" అసిన్వతీ అసంఖాదన్త్యే ఇవ అసంచూర్ణయన్త్యౌ ఇవ బప్సతీ భక్షయన్త్యౌ. భూరి దారుజాతం హవిర్జాతం వా. అత్తః భక్షయతః.

అర్థము :- అసిన్వతీ ఈపదమునకర్థము అసంఖాదన్త్యే = నమలక ఉండునది.

మంత్రార్థము :- అసిన్వతీ = నమలక, బప్సతీ = తినుచు ఇతని దవడలు, భూరి = అధికముగా, అత్తః = తినుచున్నవి.

కపనాః - (౧౮).

> కపనాః కంపనాః క్రిమయో భవన్తి. "మోషథా వృక్షం కపనేవ వేధసః" ఇత్యపి నిగమో భవతి. (ఋ. ౫-౫౪-౬).

కపనాః - అనవగతమేతత్. కంపనాః ఇత్యవగమః. క్రిమయః వాచ్యాః. తదేతమర్థం నిగమేన ద్రఢయతి. "మోషథాః ... వేధసః" మోషథాః ముష్ణీథ. కపనాః కంపనాః క్రిమయః ఇత్యర్థః.

అర్థము :- కపనాః - కపన - కంపన - క్రిమి (ముక్కపురుగు) అనబడును. కపన అన్నను, కంపన అన్నను రెండింటికి ముక్కపురుగు అని యర్థము.

మంత్రార్థము :- వేధసః = పదార్థమును లోపల తిని డొల్లచేయు, కపనా - కంపన - ముక్కపురుగు, వృక్షమివ = వృక్షమునువలె, మోషథాః = సారహీనముచేయుదురు.

భాఋజీకః - (౧౯).

> భా ఋజీకః ప్రసిద్ధభాః. "ధూమకేతుః సమిధా భాఋజీకః" ఇత్యపి నిగమో భవతి (ఋ. ౧౦-౧౨-౨).

భాఋజీకః - నార్థప్రతీతిః. ఋజుభా ఇతి ప్రతీతిః ప్రసిద్ధభాః ఇతి పర్యాయేణ నిరుక్తిః. తథా చ నిగమః "ధూమకేతుః ... భాఋజీకః"

ధూమకేతుః ధూమప్రధానః, ధూమ - ధ్వజో వా, సమిధా సమింధనేన. భాఋజీకః ప్రసిద్ధభాః.

అర్థము :- భాఋజీకః = ప్రసిద్ధభాః=ప్రసిద్ధము, అప్రతిహత = అడ్డగింపని, భా=కాంతి-దేనిదీప్తి, ఋజీకా అప్రతిహతా=అడ్డగింపబడనిదో యుది, అకుటిలా=అప్రతిహతదీప్తిగలది,-ప్రసిద్ధదీప్తిగల, ఋజీకభాః అగుచు భాఋజీక యని చెప్పబడును. ఋజీక = అకుటిలము = అప్రతిహతము కావున ప్రసిద్ధము.

మంత్రార్థము :- ధూమకేతుః = అగ్ని, సమిధా = సమిధతో - ఇంధనముతో, భాఋజీకః = ప్రసిద్ధదీప్తియగును. అగ్ని ఇంధనముతో బాగుగ ప్రజ్వలించును.

రుజానాః - (౨౦).

> రుజానా నద్యో భవన్తి, రుజన్తి కూలాని. "సంరుజానాః పిపిష ఇంద్ర శత్రుః" (ఋ. ౧-౩౨-౬) ఇత్యపి నిగమో భవతి.

రుజానాః - ఇత్యేతదేకం పదమనవగతమ్. రుజన్త్య ఇత్యవగమః. కూలాని రుజన్తి ఇతి హేతుః నిర్దిష్టః నద్యోఽభిధేయాః. అత్ర నిగమః. "సంరుజానాః ... శత్రుః" ఇంద్ర - శత్రుః ఇంద్రస్య శాతయితవ్యః ఇత్యర్థః.

అర్థము :- రుజానాః నద్యః = నదులని చెప్పబడును. రుజానా శబ్దము నదికి వాచకము - ఏలయున-నదులు కూలములను కూలజేయును.

మంత్రార్థము :- ఇంద్రశత్రుః=ఇంద్రుడు అనుశత్రువు (ఇంద్రశ్చ అసౌ శత్రుశ్చ) అని ఇంద్రశత్రుః అను సమస్తపదమునకు విగ్రహము. (శత్రుః = శమయితా - శాతయితా) నదులు తమ తరంగములతో తీరములను కూలద్రోయునట్లు ఇంద్రుడు సంపిపీషే = మేఘమును పిండిచేసెను.

జూర్ణిః - (౨౧).

> జూర్ణిర్జవతేర్వా, ద్రవతేర్వా, దూనోతేర్వా. "క్షిప్తా

జూర్ణి ర్నవక్షతి" (ఋ. ౧-౧౨౯-౮) ఇత్యపి నిగమో భవతి.

జూర్ణిః - అనవగతమేతత్. జవనాత్ - ద్రవణాత్, దవనాత్ వా ఇతి శబ్దసమాధయః. శక్తిర్వాచ్యా. హింసార్థాత్ జవతే ర్జూర్ణిః. గతికర్మణో ద్రవతేర్వా జూర్ణిః. హింసార్థాత్ దునోతేర్వా జూర్ణిః. తథా చ నిగమః - "క్షిప్తా... వక్షతి" రక్షోభిః క్షిప్తా అపి జూర్ణిః-శక్తిః అస్మాన్ ప్రతి న వక్షతి న ప్రాప్నోతీత్యర్థః.

అర్థము :- జూర్ణిః = జూర్ణిశబ్దము, జవతేర్వా 'జు' గతౌ ధాతువునకు నిప్రత్యయము చేసి జూర్ణిశబ్దము సిద్ధముచేయబడును. 'జు'ధాతువునకు గతి - గమనము అర్థము కావున జూర్ణిః. అనగా గతిగలిగినది అని యర్థము. ద్రవతేర్వా, గత్యర్థక 'ద్రు'ధాతువుతోను జూర్ణిశబ్దము సిద్ధించును. ఉకారము, రేఫము, పరస్పరము మార్పుచేసి, దకారమునకు జకారముచేసిన ద్రు - ధాతువుతోను జూర్ణిపదము సిద్ధించును. దూనోతేర్వా హింసార్థక 'దూఞ్'ధాతువుతోను జూర్ణిశబ్దము సిద్ధించును. హింసించువాడు అని యర్థము.

మంత్రార్థము :- క్షిప్తా = మావైపుకు పంపబడిన సేన, జూర్ణిః = వేగముగలది, హింసకమునగు - సేన న వక్షతి = మావఖకు రాబాల కుండుగాక!

ఓమనా - (౨౨).

"పరిభ్రుంసమోమనా వాం వయోఽగాత్" (ఋ. ౭-౬౮-౪)
పర్యగాద్వా భ్రంసమహారవనాయాన్నమ్.

ఓమనా ఇత్యనవగతమ్. అవనాయేత్యవగమః. నిగమేనోపపాదయతి- "పరిభ్రుంసమోమనా ... ఽగాత్" భ్రుంసమ్ - అహః - వయః=అన్నమ్. పరి - ప్రతి. ఓమనా అవనాయ అగాత్ గచ్ఛతి. ఏవమస్మిన్ మంత్రే అస్యానేర్థవిర్ధాన - సంబంధాత్ - ఓమనా శబ్దస్య అవనాయ ఇత్యేషా వివరణతి దుపపద్యతే.

అర్థము :- ఓమనా - పదమునకర్థము - అవనాయ = రక్షించుట కొఱకు అని.

మంత్రార్థము :- వామ్ = మీయిరువురి, ఓమనా = రక్షణకొఱకు - తృప్తికొఱకు, ఘ్రంసం = ప్రతిదినము, వయః = అన్న - హవిష్యాన్నము పర్యగాత్ = ప్రాప్తమగును - మీకియ్యబడును. ఓమనా - అనుపదము నందు - ఓమన్‌శబ్దము - చతుర్థీవిభక్తికొఱకు - ఆ చేయబడినది. ఓమన్ ఆ ఓమనా - అయినది. 'సుపాంసులుక్' సూత్రముతో - ఓమన్ పదము నందు 'అవ' ధాతువు మన్‌ప్రత్యయము. వ - స్థానమున 'ఊఠ్' ఆగుటవలన ఓమన్ సిద్ధమగును.

ఇతి ప్రథమః పాదః

ప్రథమ పాదము సమాప్తము

## ద్వితీయ పాదము

ఉపలప్రక్షిణీ - (౨౩).

ఉపలప్రక్షిణీ ఉపలేషు ప్రక్షిణాతి ఉపలప్రక్షేపిణీ వా. (ఇంద్ర ఋషీన్ పప్రచ్ఛ దుర్భిక్షే కేన జీవతి' ఇతి-తేషామ్ ఏకః ప్రత్యువాచ - "శకటః శాకినీ గావో జాలమస్యన్దనం వనమ్. ఉదధిః పర్వతో రాజా దుర్భిక్షే నవ వృత్తయః". ఇతి సా నిగదవ్యాఖ్యాతా.)

"కారురహం తతో భిషగుపలప్రక్షిణీ ననా. నానాధియో వసూయవోఽను గా ఇవ తస్థిమేంద్రాయేందో పరిస్రవ." (ఋ. ౯-౧౧౨-౩) కారురహమస్మి కర్తా స్తోమానామ్. తతో భిషక్ తత ఇతి సంతాననామ పితు ర్వా పుత్రస్య వా. ఉపలప్రక్షిణీ సక్తుకారికా. ననా నమతేర్మాతా వా దుహితా వా. నానాధియో నానాకర్మాణః వసూయవో

శాశదానః - (౭౦).

**శాశదానః శాశాద్యమానః. "ప్రస్వాం మతిమతిరచ్ఛాశ దానః" (ఋ. ౧-౩౩-౧౩) ఇత్యపి నిగమో భవతి.**

శాశదానః - అప్రతీతార్థమేతత్. శాశాద్యమానః ఇత్యవగమః. నిగమే నోపపాదయతి - "ప్రస్వాం మతిమతిరచ్ఛాసదానః ఇంద్రేణ పునః పునః శాద్యమానః వృత్రః స్వాం మతిమ్ ఉదకదానవిరోధినీం బుద్ధిమ్ అతిరత్ అజహాత్ - అత్యజదిత్యర్థః. శాశదానః యఙ్‌లు గన్త శద్‌శాతనే యొక్క రూపము. మాటిమాటికి శత్రువును ఖండించుచు నఱకుచు - ధమన మొనర్చుచు ఇంద్రుడు వృత్రుని ఛేదించెను. ఇంద్రునిచే శాసింపబడిన మేఘము 'వీరికి జలము నియ్యను' స్వాం మతిమ్ తన మతిని = బుద్ధిని ప్రాతిరత్=వదలివేసెను. శాశదానః శాశాద్యమానః = ఇంద్రునిచే ఛేదింప బడిన ఆ మేఘము జలమునియ్యకూడదను తనబుద్ధిని త్యజించెను. అథవా తిరతిర్ వృద్ధ్యర్థః ప్రాతిరత్ క్రియకర్థము. 'తన స్తుతిని వృద్ధిచేసికొనెను' అని యర్థ్యోను. మతిపదమునకర్థము స్తుతి, తిరతిపదమునకర్థము వృద్ధి అయ్యోను. - శత్రువును చంపివేయువాడు తనస్తుతిని పెంపుచేసికొనుట లోకసిద్ధమేకదా!

ఇతి తృతీయః పాదః

మూడవపాదము సమాప్తము

అథ చతుర్థః పాదః

## నాల్గవ పాదము

సృప్రః - (౭౧), సుశిప్రః - (౭౨).

**సృప్రః సర్పణాత్. ఇదమపీతరత్. సృప్రమేతస్మాదేవ సర్పిర్వా తైలం వా. "సృప్రకరస్నమూతయే" (ఋ. ౮-౩౨-౧౦) ఇత్యపి నిగమో భవతి. కరస్నౌ బాహూ కర్మణాం ప్రస్నాతారౌ. సుశిప్రమేతేన వ్యాఖ్యాతమ్. "వాజే**

సుశిప్రగోమతి" (ఋ. ౮-౨౧-౮) ఇత్యపి నిగమో భవతి.
శిప్రే హనూ నాసికే వా. హనుర్హన్తేః నాసికా నసతేః
"విష్యస్వ శిప్రే విసృజస్వ ధేనే" ఇత్యపి నిగమో భవతి.
ధేనా దధాతేః.

సృప్రః - అప్రతీతార్థం పదమ్. సర్పణాదిత్యవగమః ఇదమపీ తరత్ సృప్రం సర్పతేరేవ జ్ఞాతవ్యమ్ తచ్చ ఘృతం తైలం వా భవతి, 'సృప్రకరస్నమూతయే' ఇతి నిగమః. కరస్నౌ బాహూ. సృప్రకరస్నం దీర్ఘబాహుమ్. ఊతయే అవనాయ. వయం దీర్ఘబాహుమ్ ఇంద్రం ఊతయే ఆహ్వాయామహే ఇతి సంగతిః. సుశిప్రః అనవగతమేతత్. వ్యాఖ్యాతం చ సృప్రశబ్దేనైవ. ఏతదపి సర్పతేరేవ నిర్వక్తవ్యమిత్యభిప్రాయః. "వాజే సుశిప్ర గోమతి" ఇత్యపి నిగమః. ప్రశస్తే శిప్రే హనూ నాసికే వా యస్య స సుశిప్రః. అస్మిన్ మంత్రే హన్వోః నాసికయోర్వా శిప్రశబ్దవాచ్యతా భావాత్ మంత్రాంతర ముదాహరతి. "విష్యస్వ శిప్రే విసృజస్వ ధేనే" ఇతి హే ఇంద్ర! త్వం హవిర్భక్షణాయ శిప్రే దీర్ఘేహనూ నాసికే వా 'విష్యస్వ' విముంచస్వ అపి చ ధేనే అధస్తనే దంష్ట్రే విసృజస్వ. అథైక పద నిరుక్తమ్. హనుః కస్మాత్? హన్తీతి సతః. నాసికా కస్మాత్? నసతీతి సతః. అప్నోత్యర్థః. నమత్యర్థే వా. నసిః అగ్రే వక్ష్యమాణః. ధేనాః కస్మాత్? దధాతేః ఇతి నిరాహాచార్యః.

అర్థము :- సృప్రః సృప్ర సర్పణాత్ = సర్పణక్రియా యోగము వలన సర్పవాచకము. ఇదమపి ఇతరత్=ఇదియు మఱియొక సృప్రమ్- సృప్రము - సర్పిర్వా తైలం వా. కఱగిన ఘృతము, లేక - తైలము - నూనె - అనువానికి వాచకము. సృప్రమ్ సర్పణక్రియ సంబంధము వలననే సృప్రమని యనబడుచున్నది. 'సృప్రకరస్నమ్' మున్నగువాని వ్యాఖ్య పూర్వమే చేయబడినది. కరస్నౌ = బాహువులు, కర్మణాం ప్రస్నాతారౌ = ఈ బాహువులు పనులుచేయునవి. సుశిప్రమ్ = ఈశబ్దముగూడ సృప్రశబ్దమువలెనే వ్యాఖ్యానము చేయబడినట్లెంచునది. 'వాజే సుశిప్ర' మున్నగుమంత్రములు 'విద్మాసఖిత్వమ్' ఆదియందు వ్యాఖ్యాతము చేయబడినది. శిప్రే హనూ=శిప్ర=దవడవాచకము. నాసికకు కూడ వాచకము

హనుః = హనుశబ్దము, హన్తేః=హనహింసాగత్యోః ధాతువుతో నేర్పడును. హను = అన్నము కొఱకు గతినొనర్చును, నాసిక గంధమును గ్రహించుటకు నాసికాశబ్దము నసతేః = ప్రాప్త్యర్థక, గత్యర్థక నసధాతువువలన కల్గును.

మంత్రార్థము :- శ్రిపే = దవడలను, విష్యస్వ = భోజనార్థము ఉపయోగింపుము. ధేనే-జిహ్వా=నాలుక, చిఱునాలుక రెండింటిని విసృజస్వ ప్రయోగింపుము. ధేనా దధాతేః డుధాఞ్ ధారణపోషయోః ధాతువువలన ధేనా సిద్ధించును. వీనియందు అన్నముంచబడును.

రంసు - (౭౩).

> రంసు రమణీయేషు రమణాత్. "స చిత్రేణ చికితే రంసు భాసా" ఇత్యపి నిగమో భవతి.

రంసు - అనవబుద్ధమేతత్. రమణీయేషు ఇతి సుబుద్ధమ్. రంసు కస్మాత్? రమణాత్. నిగమేనోదాహరతి - "స చిత్రేణ చికితే రంసు భాసా" అగ్నిః స్తుత్యః. 'సః' అగ్నిః 'చిత్రేణ చాయనీయేన భాసా యుక్తః ఇతి శేషః. 'రంసు' రమణీయేషు స్థానేషు ద్యులోకాదిషు చికితే నివస తీత్యర్థః.

అర్థము :- రంసు=రమణీయేషు = రమ్య, సుందరస్థానములందు. రమణాత్ = రమించుటవలన. రంసు - రమ్ - క్విప్ - సుప్.

మంత్రార్థము :- సః = ఆయగ్ని, చిత్రేణభాసా = విచిత్రకాంతితో యుక్తమై, రంసు = రమణీయస్థానములందు లేక అగ్నిహోత్రాదులందు, చికితే - జ్ఞాయతే = తెలియబడును.

ద్విబర్హాః - (౭౪).

> ద్విబర్హా ద్వయోః స్థానయోః పరివృఢః మధ్యమే చ స్థాన ఉత్తమే చ. "ఉత ద్విబర్హా అమినః సహోభిః" ఇత్యపి నిగమో భవతి.

ద్విబర్హాః - అజ్ఞాతమేతత్. ద్వయోః స్థానయోః పరివృఢః ఇతి జ్ఞాతమ్. "ఉత ద్విబర్హా అమినః సహోభిః" ఇతి నిగమః. మధ్యమే వైద్యుతేన ఉత్తమే చ సూర్యాత్మనా రూపేణ పరివృఢః నిరుక్తే ఇతరే పదే.

అర్థము :— ద్విబర్హా = మధ్యమే ఉత్తమే చ స్థానే=అంతరిక్షమున ద్యులోకమున, ద్వయోః స్థానయోః = రెండుస్థానములందును, పరివృఢః = వృద్ధినొందిన = వ్యాపించియున్నది, ద్విబర్హా అనబడును. అనగా ఈ యొకే జ్యోతి మధ్యస్థానే = అంతరిక్షమున విద్యుత్తురూపమునను, ఉత్తమే = ద్యులోకమునందు సూర్యరూపమునను స్థితమై యున్నది. ద్విపూర్వక బృహ్ ధాతువునకు అసున్ ప్రత్యయము ద్విబర్హా.

అక్రః - (౨౫).

**అక్ర ఆక్రమణాత్. "అక్రో న బభ్రిః సమిథే మహీనామ్" ఇత్యపి నిగమో భవతి.**

అక్రః - అనవగతమేతత్. ఆక్రమణాదక్ర ఇత్యవగమః. ప్రాకారోఽభిధేయః "అక్రో న బభ్రిః సమిథే మహీనామ్" ఇతి నిగమః. అక్రే న = ప్రాకారే ఇవ. సమిథే సమిత్యామ్ సంగ్రామ ఇతి యావత్. మహీనామ్, మహతీనామరిసేనానామ్ బభ్రిః భర్తా ధారయితేత్యర్థః.

అర్థము :- అక్రః = ప్రాకారము-దుర్గము విలయున యుద్ధసమయమున శత్రువు వీనిమీద ఆక్రమణముచేయును.

మంత్రార్థము ::— ఆ యగ్ని అక్రో న = ప్రాకారము - దుర్గమువలె, మహీనామ్ = గొప్పవియైన శత్రుసేనలతో, సమిథే = యుద్ధమునందు, బభ్రిః = భరణపోషణముల నొనర్చువాడు - అనగా పెద్దసేనలతో యుద్ధమొనర్చు శత్రువు దాడిచేసినపుడు ప్రాకారాదులను రక్షించువాడు సిద్ధమగునట్లు మనలను పోషించునట్టియు, ధారణచేయునట్టియు అగ్ని మనమనోరథములను పూర్ణమొనర్చుగాక !.

ఉరాణః - (౨౬)

**ఉరాణః ఉరు కుర్వాణః "దూత ఈయసే ప్రదివ ఉరాణః" ఇత్యపి నిగమో భవతి.**

ఉరాణః - అనవగతమేతత్. ఉరు కుర్వాణ ఇత్యవగమః. "దూత ఈయసే ప్రదివ ఉరాణః" ఇతి నిగమః. హే అగ్నే! త్వం ప్రదివః పురాతనః దూతః అసి - అతః దూతత్వేన ఈయసే యాచ్యసే - కథం?

యతః త్వమ్ 'ఉరాణః' దేవేభ్యో దత్తమల్పమపి హవిః ఉరు - బహు కర్తుం సమర్థోఽసి. ఉరాణః - ఉరుకుర్వాణః = అల్పమునధికము చేయువాడు.

మంత్రార్థము :- ప్రదివః = చిరంతనుడు, దూతః=దూతకార్యముల నెఱిగినవాడవు, ఉరాణః = స్వల్పము నధికముచేసి చూపువాడవునైన ఓ అగ్నీ! ఈయసే = నీవు మమ్ముల ప్రాప్తించితివి.

స్త్రియానామ్ - (౭౭).

**స్త్రియా ఆపో భవన్తి స్త్యాయనాత్ - "వృషా సింధూనామ్ వృషభః స్త్రియానామ్" ఇత్యపి నిగమో భవతి.**

స్త్రియానామ్ - అనవగతమేతత్. స్త్యానాత్ సంహననాత్ స్త్రియాః ఇత్యవగమః - 'స్త్యై' శబ్దసంఘాతయోః ఇత్యస్మాత్ భౌవాదికాత్. ఆపో అభిధేయాః. ఆప ఏవ పార్థివానామ్ అవయవానామ్ సంహననే కారణాని అథవా హిమరూపేణ ఆత్మనైవ సంహతా భవన్తి. "వృషా సింధూనామ్ వృషభః స్త్రియానామ్" ఇతి నిగమః. హే ఇంద్ర! త్వమ్ వృషా అసి వర్షితాసి. సింధూనామ్ స్యందనానాం స్త్రియానాం సంహంత్రీణామ్ అపామ్ వర్షితాసి. హే వృషభ! వర్షితః!.

స్త్రియాః = జలములు, స్త్యాయనాత్ = సంహనన క్రియాయోగము వలన, స్త్యైష్ట్యై శబ్దసంఘాతయోః ధాతువుచే సిద్ధమగును. జలము సంఘాతమువలన హిమరూపమున పరిణమించును.

మంత్రార్థము :- హే ఇంద్ర! నీవు సింధూనాం = నదీనదములను వర్షజలములతో వృష్టింతువు. స్త్రియానాం హిమరూపపరిణత సంహత జలమును వర్షింపజేయుదువు.

స్త్రిపాః - (౭౮).

**స్త్రిపాః - స్త్రియాపాలన ఉపస్థితాన్ పాలయతీతివా. "స న స్త్రిపా ఉత భవా తనూపాః" ఇత్యపి నిగమో భవతి.**

స్త్రిపాః - అనవగతమేతత్. స్త్రియా-పాలనః ఉపస్థితాన్ పాలయతి వేత్యవగమః. కూపోఽభిధేయః. "స నః స్త్రిపా ఉత భవా తనూపాః" ఇతి నిగమః. హే అగ్నే! త్వం నః స్త్రిపా కూపం ఇవ తనూపాః రక్షకః భవా భవ. ఇతి మంత్రార్థః.

అర్థము :- స్త్రిపాః=స్త్రియాపాలన ఉపర్యుక్త జలముల పాలయిత. కూపము సముద్రము. ఉపస్థితాన్ పాలయతి ఇతివా-లేక తృష్ణార్తులు సమీపించినపుడు వారి దప్పికను తీర్చునది.

మంత్రార్థము :- ఓ అగ్నీ! ఉత నః మఱియు ఆ నీవు, స్త్రిపాః = కూపమువలె నః తనూపాభవ = మా తనువుల రక్షకుడవు కమ్ము-కూపము తనను సమీపించిన తృష్ణార్తులను రక్షించునట్లు మేమిచ్చు హవిస్సును గ్రహించి మాతనువులను రక్షింపుమని భావము.

జవారు - (౪౯).

"జవారు - జవమానరోహీ జరమాణరోహీ గరమాణరోహీతి వా. అగ్రే రుప ఆరుపితం జవారు" ఇత్యపి నిగమో భవతి.

జవారు - అప్రతీతార్థమేతత్. జవమానారోహి, జరమాణారోహి, గరమాణారోహీతి శబ్దసమాధయః. అథ నిగమః - "అగ్రే రూప ఆరుపితం జవారు" 'అగ్రే' పూర్వసర్గాదౌ రుప ఆరుపితం భూమ్యాః దేవైః ఆరోపితం జవారు జవమానారోహి మండలం యస్య తం సూర్యం హే యజమాన! త్వం ప్రాప్నుయాః ఇత్యర్థః.

అర్థము :- జవారు = జవమానరోహి = వేగయుక్తుడవై, ఆరూఢ జరమాణరోహి = జీర్ణతను నశింపజేయుచు, ఆరూఢ అథవా గరమాణరోహి ఇతి వా = లేక నిర్బలతా, లేక రోగాదులను మ్రింగుచుఆరూఢ.

మంత్రార్థము :- పూర్వసర్గారంభమున రుపః = పృథ్వినుండి పైకెత్తి, ఆరుపితమ్ = దేవినుండి ఆకాశమున నెక్కించి జవారు = వేగవంతమ్మై, ఆరూఢ = సూర్యమండలము ప్రకాశించును, సృష్టి ఆరంభమున దేవతలు సూర్యుని భూమినుండి పైకెత్తి ఆకాశమున స్థిరపఱచిరి. సూర్యుడు వేగముగా ఆకాశమున జేరి యట ప్రకాశించుచున్నాడు.

జరూథమ్ - (౮౦).

**జరూథమ్ - గరూథమ్ గృణాతేః. "జరూథం హన్యక్షిరాపే పురంధిమ్" (ఋ. ౭-౯-౬) ఇత్యపి నిగమో భవతి.**

జరూథమ్ - అనవగతమేతత్. గరూథమిత్యవగమః. గృణాతేరితి ధాతుర్నిర్దిష్టః. అత్ర నిగమః - "జరూథం హన్యక్షి రాయే పురంధిమ్" హే అగ్నే! వసిష్ఠః త్వాం సందీపయన్ 'జరూథమ్' స్తోత్రం హన్ త్వాం ప్రతి ప్రాపయన్ యక్షి యజతి 'రాయే' ధనాయ ధనమధిగన్తుమిత్యర్థః. పురంధిమ్ బహుకర్మాణాం బహుబుద్ధిమ్ వా త్వామ్.

అర్థము :- జరూథమ్ = గరూథమ్. ఇది స్తోత్రవాచకము. గృణాతేః గృధాతువుతో నేర్పడును. హే అగ్నిదేవ! జరూథమ్ = నీస్తుతిని నీకుచెప్పుచు నీ యెదుట నుంచుచు వశిష్ఠుడు యక్షి = యజ్ఞముచేసెను. రాయే = ధనప్రాప్తికొఱకు, పురంధిమ్ = ఏలయన నీవు మిక్కిలిదాతవు బహుకర్మసాధకుడవు. వశిష్ఠుడు యజ్ఞముచేసినాడు - కావున మేమును నిన్నుగూర్చి యజనమొనర్తుము.

కులిశః - (౮౧)

**కులిశ ఇతి వజ్రనామ - కూలశాతనో భవతి. స్కంధాంసీవ కులిశే నావివృక్ణాహిః శయత ఉపపృక్ పృథివ్యాః" (ఋ. ౧-౩౨-౫). స్కంధో వృక్షస్య సమాస్కన్నో భవతి. అయమపీతరః స్కంధః ఏతస్మాదేవ అస్కన్నం కాయే. అహిః శయత ఉపపర్చనః పృథివ్యాః.**

కులిశః ఇత్యనవగతమ్. కూలశాతనమితి శబ్దసమాధిః వజ్రనామేత్యభిధేయ వచనమ్. నిగమేనోదాహరతి స్కంధాంసీవ కులిశేనావివృక్ణాహిః శయత ఉపపృక్ పృథివ్యాః స్కంధాంసీవ వృక్షశాఖా ఇవ-కులిశేన కూలశాతనేన వజ్రేణ వివృక్ణా ఛింధి. అహిః అగమనో మేఘః శయతే శేతే పృథివ్యాః. ఉపపృక్ - ఉపపర్చనః ఉదకభావేన సంపర్కస్య కర్తా భూత్వా, అత్ర వధ - సాహచర్యాత్ కులిశః వజ్రః ఉపపద్యతే. స్కంధః

కస్మాత్ ? వృక్షస్య సమాస్కన్నో భవతి. అయమపీతరః స్కంధః మానవాదేః ఏతస్మాదేవ ధాతోర్భవతి. దేహే అస్కన్నో భవతి.

కులిశః - వజ్రనామ - వజ్రవాచకము కూలశాతనః = నది కూలము లను కూల్ద్రోయునట్లు కులిశము మేఘములను, పర్వతశిఖరములను ఖండించును కూల్ద్రోయును.

మంత్రార్థము :- ఇంద్రుడు కులిశేన = తన వజ్రముతో స్కంధాంసీవ = వృక్షశాఖలనువలె మేఘమును, వివృక్ణా = ఛేదించును, అహిః = అప్పుడామేఘము భూమిపైబడును, వృష్టిరూపమున భూమింజేరును. ఉపపృక్ - భూమినిస్పృశించి దానిపై శయనించును వర్షించును.

భాష్యార్థము :- స్కంధః - అననేల సమాస్కన్నో భవతి=పిలయున స్కంధః-శాఖ వృక్షమున లగ్నమైయుండును. ఇది మఱియొక స్కంధము శరీరముపైధరించు కంథా (సంన్యాసులు ధరించుబొంత) కూడ స్కంధ మనబడును. అదియు శరీరమున లగ్నమైయుండును, అహిః = మేఘము శయతే = భూమినిస్పృశించి దానిపై పడియుండును. ఉపపర్చనః పృథివ్యాః=పృథివితో సంపర్కముచేయును.

తుంజః - (౮-౨).

> తుంజః తుంజతేర్దానకర్మణః. "తుంజే తుంజే య ఉత్తరే స్తోమా ఇంద్రస్య వజ్రిణః. న విన్ధే అస్య సుష్టుతిమ్" (ఋ. ౧-౭-౭) దానే దానే య ఉత్తరే స్తోమా ఇంద్రస్య వజ్రిణో నాస్య తైర్విందామి సమాప్తిం స్తుతేః.

తుంజః - అనవగతమేతత్. దానార్థస్య తుంజతేః ఇత్యవగమః. తథా చ నిగమః - "తుంజే తుంజే ... సుష్టుతిమ్." మధుచ్ఛన్దసః ఆర్షమ్. ఐంద్రీ గాయత్రీ. తుంజే తుంజే దానే దానే 'యే ఉత్తరే' ఉత్తరోత్తరే దాన పరితుష్టేన మయా స్తోమాః స్తుతయః వజ్రిణః వజ్రధారిణః ఇంద్రస్య చింత్యన్త ఇతి శేషః. అహం తేషాం స్తోమానాం 'సుష్టుతిం' స్తుతేః సమాప్తిం 'న విన్దే' న విందామి. మదీయాః ఉత్తమోత్తమాః అపి స్తుతయః ఇంద్రం ప్రాప్య న్యూనా భవన్తీత్యర్థః. తుంజః=దానము, దానకర్మణః=దానార్థక తుంజతేః 'తుజ' ధాతువు నిఘంటువునందు దానార్థకమున నున్నది.

మంత్రార్థము :- తుంజేతుంజే = ప్రతిదానముపైన, వజ్రిణః ఇంద్రస్య = వజ్రధారియైన ఇంద్రునకు సంబంధించి యే, ఉత్తరే = ఒక దానికంటె మఱియొకటి మించియున్న, స్తోమాః = స్తోమము స్తుతులు గలవౌ వానికంటెను, అస్యఇంద్రస్య = ఈ యింద్రుని, సుష్టుతిం = స్తుతి సమాప్తిని, న విన్ధే = పొందవీలులేదు.

భాష్యార్థము :- దానే దానే = ప్రతిదానముపైన, యే ఉత్తరే స్తోమాః = ఏ ఉత్తరోత్తర స్తుతులున్నవో ఒకదానికంటె మఱియొకటి మించినగుణము కలిగియున్నవి. న అస్య = దీనియొక్క, తైః = ఆ స్తుతులతో, సమాప్తిం స్తుతేః = స్తుతి సమాప్తిని, విందామి = పొందుచున్నాను. సుష్టుతిమ్ = సమాప్తి, పూర్ణత్వము.

బర్హణా - (౮౩).

**బర్హణా పరిబర్హణా. "బృహచ్ఛ్రవా అసురో బర్హణా కృతః" (ఋ. ౧-౫౪-౩) ఇత్యపి నిగమో భవతి.**

బర్హణా - అనవగతమేతత్. పరేరుపసర్గస్యాధ్యాహారేణావగమః. పరిబర్హణా పరివర్ధనం పరిహింసనం వా నిగమేనోపపాదయతి. "బృహచ్ఛ్రవా అసురో బర్హణాకృతః" యేనేంద్రేణ బృహచ్ఛ్రవా బృహద్ద్వేషః అసురః మేఘః బర్హణాపరివృద్ధ్యా హింసయా వృషభః కృతః వర్షణశీలః కృతః.

అర్థము :- బర్హణా = పరిబర్హణా = పరివృద్ధి చేత, పరిహింస అని యర్థము. వృద్ధ్యర్థక చేత హింసార్థక 'బృహ' ధాతువునకు కర్త్రార్థమున 'ల్యుట్' ప్రత్యయము.

మంత్రార్థము :- ఏ యింద్రుడు బృహచ్ఛ్రవా = పెద్దగా ఉఱుము చున్న, అసురః = మేఘమును, బర్హణాకృతః = హింసతో చేత వృద్ధితో వర్షించువానినిగా చేసెను.

తతనుష్టిః - (౮౪).

"యో అస్మై ఘ్రంస ఉత వా య ఊధని సోమం సునోతి భవతి ద్యుమాఁ అహ. అపాపః శక్ర స్తతనుష్టి మూహతి తనూ శుభ్రం మఘవా యః కవాసఖః" (ఋ. ౫-౩౪-౩).

ఘ్రంస ఇత్యహర్నామ, గ్రస్యన్తే అస్మిన్ రసాః. గోరూధ ఉద్ధత
తరం భవతి. ఉపోన్నద్ధమితి వా. స్నేహానుప్రదానసామాన్యాద్ రాత్రిర
ప్యూధ ఉచ్యతే. స యో అస్మా అహన్యపి వా రాత్రౌ సోమం సునోతి,
భవత్యహ ద్యోతనవాన్ అపోహత్యపోహతి శక్రస్తితనిషుం ధర్మసంతానాద
పేతమ్ అలంకరిష్ణు మయజ్వానం తనూశుభ్రం తనూశోభయితారం
మఘవా, యః కవాసఖో యస్య కపూయాః సఖాయః. తతనుష్టిః - అనవ
గతమేతత్. తితనిషుః ఏవం స్యాత్. నిగమేనోపపాదయతి. యో అస్మై ...
కవాసఖః సంవరణస్య ప్రాజాపత్యస్యార్షమ్ ఐన్ద్రీ జగతీ.

యః కశ్చిద్ యజమానః అస్మై ఇన్ద్రాయ ఘ్రంసే దినే ఉతవా
అపి వా ఊధని రాత్రౌ సోమం సునోతి అభిషుణోతి అహర్నిశం సోమాభిషవ
పరః తిష్ఠతీత్యర్థః. స ఏవ ద్యుమాన్ ద్యోతనవాన్ భవతి. అహ ఇతి
నిశ్చయే. అతశ్చ విపరీతం ధర్మానుష్ఠానాత్ అపేతమ్, అలం కర్మభి
రిత్యేవం వాదినమ్ అయజ్వానమితి యావత్, తతనుష్టిమ్ వివిధైః
ప్రకారైః స్వవిత్తాని తితనిషుమ్ అభివర్ధయితుమ్ ఈహమానమ్ తనూశుభ్రమ్
కాయమండనపండితమ్ ఉదరంభరిమ్ విషయైషిణమితి యావత్. మఘవా
ధనస్వామీ ఇన్ద్రః 'అపాప' అప+అప 'ఊహతి' నాశయతీత్యర్థః. ఏవం
యశ్చ అన్యోపి కశ్చిత్ 'కవాసఖః' కపూయసఖః భవతి తమపీన్ద్రో నాశ
యతి. ఏవమస్మిన్ మన్త్రే తతనుష్టిశబ్దేన వాచ్యః విషయాసక్తః శబ్దావిరోధా
దిత్యుపపత్తిః.

అథైకపదనిర్వచనమ్ - ఘ్రంసః కస్మాత్? ఉచ్యతే గ్రసతేః,
అస్మిన్నహని సూర్యేణ యస్మాత్ రసాః గ్రస్యన్తే తస్మాత్ ఘ్రంసః అహ
ఇతి. గోః ఊధః కస్మాత్? తద్ధి ఉద్ధతతరం భవతి. అన్యేభ్యః అంగేభ్యః
ఇతి. ఉపోన్నద్ధం వా కేనచిద్ ఉపశ్లేష్య ధేనోర్జఠరే నద్ధం భవతి. ఇదం
తావత్ శబ్దసామాన్య-ప్రసక్తం నిర్వచనమ్. స్నేహస్యానుప్రదాన సామా
న్యాత్ రాత్రిరపి ఊధః పదవాచ్యా. సాపి భృశపీయథావి స్నేహకాన్ అవశ్యా
యాన్ ధారయతి.

అర్థము :- తతనుష్టిః = అర్థము. విషయోపభోగప్రధానుడు,
తతన్ = భోగసంతానమును భోగపరంపరను, ఉష్టిః = కోరువాడు, 'తను
విస్తారే' ధాతువుచే తతన్, 'వశ కాంతౌ' ధాతువుచే ఉష్టిః సిద్ధమగును.

అగ్నిహోత్రాది ధర్మసంతానమునుండి తొలగి కేవలము భోగముల ననుభవించుటలో మునిగితేలుమనుష్యుడు తతనుష్టిః అనబడును.

మంత్రార్థము :- యః = ఎవడు, ఘ్రంసే = దినమున, ఉతవా = లేక, ఊధని = రాత్రియందు, అస్మై = ఈ యింద్రునికొఱకు, సోమం సునోతి = సోమసవనము నాచరించునో, సః = అతడు, ద్యుమాన్, అహ ఐశ్వర్యవాన్ తేజస్వీ = కాంతిమంతుడు, ఐశ్వర్యయుక్తుడు, తేజస్వియు, భవతి = అగును, శక్రః మఘవా = ఐశ్వర్యశాలీ=ధనవంతుడగు నింద్రుడు, తనూశుభ్రమ్=కేవలము తనశరీరమునలంకరించుకొనువాడు, తతనుష్టిమ్ = అగ్నిహోత్రాదిధర్మకర్మలను విడిచి విషయభోగతత్పరుడునైనవానిని, అప + ఊహతి-అపోహతి = నాశనముచేయును. యః=ఎవడు, కవాసఖః= దుర్జనసాంగత్యము చేయునో వానినిగూడ ఇంద్రుడు విడువడు - నాశము చేయునని భావము.

భాష్యార్థము :— ఘ్రంసఇత్యహర్నామ, ఘ్రంసః = దినము, దినమునందు సూర్యునిమూలమున, రసాఃఅగ్రస్యన్తే = రసములు శుష్కించును. కావున దినము ఘ్రంసమనబడును, గోరూధః—ఆవుపొదుగు, ఉన్నతతరః= ఎక్కువ ఉన్నతము, ఇది ఆవుపొట్టకు తగిలింపబడియున్నట్లుండును, (ఉపోన్నద్ధమ్) స్నేహానుప్రదానసామాన్యాత్ = స్నేహ=రసము. (గోవు - పొదుగు పాలనిచ్చును. రాత్రి మంచుగురిపించును. ఇది రాత్రి - పొదుగుల సామ్యము - రెండు రసప్రదానముచేయును) ఈ రసప్రదానసామ్యమునుబట్టి రాత్రికూడ ఊధస్సు (పొదుగు) అనబడును, ఏమనుష్యుడు ఇంద్రునికొఱకు రాత్రిందినములు సోమసవనమొనర్చునో యతడు ధనవంతుడు, కాంతిమంతుడు తేజస్వియు నగును (అహద్యోతనవాన్) ఇట అహపదము పూరకము మాత్రమే. అపోహతి = నశింపజేయును. అపోహతిశక్రః = ఇంద్రుడతనినికూడ నశింపజేయుచున్నాడు. తతనిమమ్ - విత్తాని తనితుమిచ్ఛన్తమ్ = ధనమును సంచయముచేయదలచువాని, అయజ్వానమ్ = యజ్ఞాదులనొనర్పనివాని, తనూశుభ్రమ్ తనూశోభయితారమ్ = కేవలము తనశరీరనిమిత్తముగా భోగవిలాసములందు ఆసక్తుడైన వానిని, కవాసఖం = దుష్టులసాంగత్యముకలవానిని ఇంద్రుడు నాశనము చేయును, విడువడు.

ఇలీబిశః - (౮౫).

> "న్యవిధ్యదిలీబిశస్య దృళ్హా విశృంగిణమభినచ్ఛుష్ణమింద్రః" (ఋ. ౧-౩౩-౧౨). నిరవిధ్యదిలాబిలశయస్య దృఢాని వ్యభినచ్ఛృంగిణమ్ శుష్ణమింద్రః.

ఇలీబిశః - అనవగతమేతత్. ఇలా-బిలశయః ఇత్యవగమః. మేఘో వాచ్యః. నిగమేనోపపాదయతి - "న్యావిధ్యత్ ... శుష్ణమింద్రః" హిరణ్య స్తూపస్యార్షమ్. జస్త్రి త్రిష్టుప్. ఇంద్రః దేవః శక్రః 'ఇలాబిశస్య' ఇలా హేతోః ఉదకనిర్గమన బిలాని సంపద్య శయానస్య మేఘస్య 'దృళ్హా' దృఢాని దుర్భేద్యాని జలనిరోధసమర్థాని స్థానానీతి యావత్ 'న్యావిధ్యత్ - నిరవిధ్యత్ నిరతాడయదిత్యర్థః. విశృంగిణమ్ తడిద్భిః దీప్తిమన్తం శిఖర వంతమ్ 'శుష్ణమ్' బలవంతమ్ మేఘమ్ అభినత్ అదారయత్. ఏవమస్మిన్ మంత్రే శబ్దసామ్యాద్ధాత్వవిరోధాచ్చ ఇలీబిశో మేఘః ఇత్యుపపన్నం భవతి.

అర్థము :- ఇలీబిశః = మేఘము బిలే ఉదకే శేతే = నీటియందు పరుండును కావున మేఘము ఇలీబిశః అనబడును. బిలేశయః-వర్ణవ్యాపత్తి వర్ణలోపమువలన ఇలీబిశ అనది

మంత్రార్థము :- ఇంద్రుడు, ఇలీబిశస్య=మేఘముయొక్క, దృళ్హా దృఢాని = దుర్భేద్యమైన స్థానములను, నిరవిధ్యత్ = వధించి పడవేసెను తథా శుష్ణమ్=బలవంతము, విశృంగిణమ్=శృంగములుగల లేక విద్యుత్తుల వలన దీప్తిమంతమునగు మేఘమును స్వయముగా, అభినత్ - ఛిన్న భిన్నముచేసెను.

కియేధాః - (౮౬).

> "అస్మా ఇదు ప్రభరా తూతుజానో వృత్రాయ వజ్రమీశానః కియేధాః. గోర్న పర్వ విరదా తిరశ్చేష్యన్నర్ణాంస్యపాం చరధ్యై" (ఋ. ౧-౬౧-౧౨). అస్మై ప్రహర తూర్ణం త్వరమాణో వృత్రాయ వజ్రమీశానః. కియేధాః కియద్ధా

**ఇతి వా క్రమమాణ ధా ఇతి వా. గోరివ పర్వాణి విరద మేఘస్యే ష్యన్నర్ణాంస్యపాం చరణాయ.**

కియేధాః - ఇత్యనవగతమ్. కియద్ధాః ఇత్యవగమః. క్రమమాణధాః ఇతి వా. అత్ర నిగమః "అస్మై ... చరధ్యై" నోధస్య గౌతమస్యేయ మార్షమ్. ఐంద్రీ - త్రిష్టుప్. హే ఇంద్ర! ఏష వృత్రః కియేధాః కియదప్యుదకపరిమాణం ధారయతి. త్వమస్మై తూతుజానః త్వరమాణః వజ్రమశనిమ్ ప్రభర ప్రహర. యస్మాత్ త్వమస్మాకమీశానః ఈశ్వరోఽసి 'గోర్న పర్వ' గోరివ పర్వాణి విరద విదారయ. తిరశ్చా తిర్యగ్గమనేన వజ్రేణ. 'అపా చరధ్యై ప్రబాధ్యః అపో దాతుం అర్ణాంసి ఉదకాని ఇష్యన్ ఈహమానః త్వమ్. తదేవం శబ్దసారూప్యాత్ అర్థావిరోధాచ్చ కియేధాః ఇత్యస్య కియద్ధాః ఇత్యేవార్థ ఉపపన్నః.

అర్థము :- కియేధాః - కియద్ధాః - కియదపి = అపరిమాణముదకం, ధాః ధారయతి ఇతి=అపరిమితజలమును ధారణచేయుమేఘము, అని కియేధాః పదార్థము. క్రమమాణో వా ధారయతి వా = లేక - క్రమణ మొనర్చు శత్రుసేనల సద్దగించుసేనాపతి - రాజు - ఇంద్రుడు-మేఘము.

మంత్రార్థము :- ఇత్ = పదపూర్తికొఱకు, అస్మై వృత్రాయ = ఈ వృత్రునికొఱకు, తూతుజానః = అతిశీఘ్రముగా, లేక ఇట తుజ్ ధాతువు హింసార్థకము - చంపుచు, వజ్రమ్ = వజ్రమును, ప్రభరా = ప్రహర మొనర్చుము, - ఈశానః = హే ఇంద్ర! వజ్రంప్రహర = వజ్రప్రహర మొనర్చుము - నీవు సమస్తజగత్తునకు స్వామివి, మఱియు కియేధాః = అపరిమితబలము - శక్తి - కలవాడవు, అతః = అందువలన ప్రహర మొనర్చుము, గోః పర్వం న=హింసకుడు గోవుయొక్క యవయవములను ఛేదించునట్లు నీవును, విరదా = విదారణచేయుము, తిరశ్చా అర్ణాంసి ఇష్యన్ = అడ్డముగా వర్షతి = జలములను వర్షింపజేయుచు, అపాంచరధ్యై = జలముభూమిపై ప్రవహించునట్లు మేఘములను ఛేదింపుము.

భూమిః - (౮౭).

**భృమిర్భ్రామ్యతేః - "భృమిరస్యృషికృన్మర్త్యానామ్" (ఋ. ౧-౩౧-౧౬) ఇత్యపి నిగమో భవతి.**

భృమిః - అనవగతమేతత్. భ్రమణమిత్యవగమః. భృమిః కస్మాత్? భ్రామ్యతీతి సతః ఇతి నిర్వచనమ్. నిగమేన సమర్థయతి. "భృమిరస్యృషి కృన్మర్త్యానామ్. హిరణ్యస్తూపస్యార్షమ్. హే అగ్నే! త్వమ్ మర్త్యానామ్ మానవానాం 'భృమిః' సంసారచక్రే భ్రామయితాసి - ఋషికృత్ దర్శన కర్తాపాసి. మనుష్యాణాం దర్శనశక్తిః త్వదధీనైవేత్యభిప్రాయః. ఏవమస్మిన్ మంత్రే అర్థావిరోధాత్ భృమిరగ్నిరేవ విశష్యతే.

అర్థము :- భృమిః = భ్రమణశీలః భ్రామ్యతేః 'భ్రము'ధాతువుతో భృమిశబ్దమేర్పడినది. యా లేక భృమిః = భ్రామకమనియు నర్థమగును. భృమి స్వయముగా భ్రమణస్వభావముకలది. అన్యులను భ్రమింప జేయును, కావున భ్రామకమును అగును.

మంత్రార్థము :- హే అగ్నిదేవ! నీవే మానవులను భ్రమణ మొనర్చు భృమిః అసి = భృమివి, సమస్తబ్రహ్మాండమును, భ్రామకః = త్రిప్పువాడవు - సంసారము మోక్షము మీయధీనమునసే యున్నవి. ఋషి కృత్ = దర్శనము - జ్ఞాన విజ్ఞానముల కలిగించువాడవు నీవే, జ్ఞానమును ప్రకాశింపచేసి మనుష్యులకు మోక్షమునిచ్చువాడవు నీవే.

విష్పితః - (౮౭).

> విష్పితో విప్రాప్తః. "పారం నో అస్య విష్పితస్య పర్షన్" (ఋ. ౭-౬౦-౭). ఇత్యపి నిగమో భవతి.

విష్పితః-అనవగతమేతత్-విప్రాప్తః ఇత్యవగమః. విస్తీర్ణః ఇతశ్చ తశ్చ సర్వతో యః ప్రాప్తః స విష్పితః. తదేతన్నిగమేనోపపాదయతి. పారం నో అస్య విష్పితస్య పర్షన్ సః అస్మాకమ్ అస్య జగదధ్వనో జ్ఞానమస్తి. అతః వయమస్య విష్పితస్య సర్వతో విస్తారవతః పారమ్ పర్షన్ - పారం యామ. తదేవం శబ్దసారూప్యాదర్థావిరోధాచ్చ, విష్పితః సంసారాధ్వా నిత్యుపపద్యతే.

మంత్రార్థము :- అస్య విష్పితస్య - ఈ అతివిస్తీర్ణసంసారపథము యొక్క, నః = మమ్ములను, పారం పర్షన్ = పారమునుచేర్చుము.

తురీపమ్ - (౨౯).

> "తన్నస్తురీపమద్భుతం పురువారం పురుత్మనా. త్వష్టా పోషాయ విష్యతు రాయే నాభానో అస్మయుః" (ఋ. ౧-౧౪౨-౧౦) తన్నస్తూర్ణాపి మహత్ సంభృతమాత్మనా త్వష్టా ధనస్య పోషాయ విష్యత్విత్యస్మయురస్మాన్ కామయమానః.

తురీపమ్ - అనవగతమేతత్. 'తూర్ణాపి' ఇత్యవగమః. ఉదకమభిధేయమ్. యతస్తత్ తూర్ణమాప్నోతి. నిగమేనోదాహరతి. "తన్నః ... అస్మయుః" దీర్ఘతమస ఇయమార్షమ్. త్వాష్ట్రీ - అనుష్టుప్. 'తత్ నః తురీపమ్' తదస్మాకముదకమ్ 'అద్భుతమ్' - మహదిత్యర్థః. పురువారం బహుదేశాంతరమావృణోతీతి తం పురుత్మనా బహునాత్మనా ఏవం లక్షణముదకం త్వష్టా 'నః నాభా' అస్మాకం మధ్యే విష్యతు విముంచతు వర్షాభిః ఇతి శేషః. అస్మయుః అస్మాననుగ్రహీతుం కామయమానః. రాయే ధనస్య పోషాయ అభివృద్ధయే. అస్మయుః త్వష్టా రాయే పోషాయ నః నాభా అద్భుతం పురుత్మనా పురువారం తత్ తురీపం విష్యతు ఇత్యేవమన్వితిః. తదేవం విష్యతు ఇత్యనేన క్రియాపదేన సాహచర్యాత్ తురీపమ్ జలమిత్యుపపద్యతే.

మంత్రార్థము :- తత్ - అది, నః = మనయొక్క, తురీపమ్ = శీఘ్రముగ లభించుజలము, అద్భుతమ్ = మహత్ = గొప్పది - (అద్భుత శబ్దము మహత్ నామములందు పఠింపబడియున్నది. పురువారమ్ = మిక్కిలి గొప్పప్రదేశము నాక్రమించునది - (జలము) ఆ జలమును, పురుత్మనా = బహుస్వరూపముతో, నాభా = మధ్యమున, అస్మయుః అస్మాన్ = మమ్ములను, కామయమానః = కోరుచు, నాభానః దీప్యమాన - ప్రకాశించు, త్వష్టా - రాయే పోషాయ = పోషణకొఱకు - ధనపుష్టికొఱకు, విష్యతు = ప్రదానముచేయునుగాక !, త్వష్టా=పరమేశ్వరుడు మాకృపికి, గోధనమునకు పుష్టిని కలిగించువర్షమును కురియించుగాక.

రాస్పినః - (౯౦).

**రాస్పినో రాస్పీ రపతేర్వా రసతేర్వా. "రాస్పినస్యాయోః" ఇత్యపి నిగమో భవతి.**

రాస్పినః - అప్రతీతార్థమిదమ్. రాస్పీ - రపతేః శబ్దకర్మణః రస తేర్వా శబ్దార్థాత్ ఇత్యుపగమః. "రాస్పినస్యాయోః" ఇతి నిగమః రాస్పినః రపణశీలస్య రసనశీలస్య వా జలస్య ప్రాప్తవ్యర్థమ్. ఆయువః ఇతి మనుష్య నామ. ఏవమస్మిన్ మంత్రే రాస్పిన్ శబ్దేన జలం స్తోతా వా అభిధీయతే. శబ్దసారూప్యాత్ అర్థావిరోధాచ్చ.

అర్థము :— రాస్పినః = బహూదకము లేక వక్తా. రపతేర్వా - రస తేర్వా = శబ్దార్థక రప, రస ధాతువులతో రాస్పినః శబ్దము సిద్ధమగును. మిక్కిలి శబ్దముచేయుజలము - లేక మిక్కిలి స్తుతిచేయుస్తోతా - అని యర్థము.

మంత్రార్థము :- రాస్పినస్య ఆయోః = జలప్రాప్తికొఱకు లేక స్తుతిప్రయోక్తకు, పుత్రప్రాప్తికొఱకు.

ఋుంజతిః - (౯౧).

**ఋుంజతిః ప్రసాధనకర్మా. "ఆవఋుంజసే ఊర్జాం వ్యుష్టిషు" (ఋ. ౧౦-౭౬-౧) ఇత్యపి నిగమో భవతి.**

ఋుంజతి - ఋుంజతిః ప్రసాధనార్థః. భాఋజీకః ఇత్యనేనాస్య పదస్య గతార్థతాం మన్యమానో భాష్యకారః నిగమం నాపఠత్. ఋుంజతిః = ఋుంజతి ఋుంజధాతువు వేదమునందు అలంకరించుట యనునర్థమున ప్రయుక్తమై యున్నది.

మంత్రార్థము :— మరుతః=దేవతలార ! విద్వాంసులార ! ఊర్జామ్= బలవంతమైన, వ్యుష్టిషు = ఉషస్సులందు, ఋుంజసే = హృదయముల నలంకరించుటకై.

ఋజునీతి - (౯౨).

> ఋజురిత్యప్యస్య భవతి. "ఋజునీతీ నో వరుణః" (ఋ. ౧-౯౦-౧) ఇత్యపి నిగమో భవతి.

ఋజునీతి - ఋజురపి అస్మాదేవ ప్రసాధనార్థాత్ ఋంజతేర్భవత్వ్యః అత్ర నిగమః - "ఋజునీతీ నో వరుణః" ఋజునీతి ఋజునేత్రః

"ఋజునీతీ నో వరుణో మిత్రో నయతు విద్వాన్. అర్యమా దేవైః సజోషాః" ఋజునీతి ఋజుః ఇతి అపి=ఋజుః అను శబ్దముకూడ ఈ 'ఋంజ'ధాతువుతోనే సిద్ధమగును. ఋజునీతీ = సరళ సత్యనీతి.

మంత్రార్థము :- దేవైః సజోషాః = దేవతలతోపాటు ప్రసన్న మనస్సుగల వరుణః = వరుణుడు, మిత్రుడు, విద్వాంసుడు, అర్యముడు, నః = మమ్ములను, ఋజునీతీ = సరళనీతితో-సరళమార్గమున, నయతు= నడపునుగాక !

పతద్వసూ - (౯౩).

> ప్రతద్వసూ ప్రాప్తవసూ "హరీ ఇంద్ర ప్రతద్వసూ అభిస్వర" (ఋ. ౮-౧౩-౨౭) ఇత్యపి నిగమో భవతి.

ప్రతద్వసూ-అనవగతమ్. ప్రాప్తవసూ ఇత్యవగమః. నిగమోఽత్ర - "హరీ ఇంద్ర ప్రతద్వసూ అభిస్వర" హే ఇంద్ర! ఇహ కర్మణి త్వా హరీ= తావశ్వౌ ప్రతద్వసూ = ప్రాప్తర్ఘ్నేష - ధానా - ధనౌ, రథే యుంజానః త్వం అభిస్వర = అస్మాన్ ప్రత్యాగచ్ఛ. హరీశబ్దసాహచర్యాత్ ప్రతద్వసూ అశ్వౌ ఇత్యుపపన్నం భవతి. ప్రతద్వసూ = ప్రాప్తవసూ, ప్రాప్తం వసు ధనం యేన సః ప్రాప్తవసుః = ధనమును పొందినవాడు అనియర్థము. ప్రాప్తవసుయొక్క ద్వివచనము ప్రాప్తవసూ, అదియే ప్రతద్వసూ.

మంత్రార్థము :- హే ఇంద్ర! ప్రతద్వసూ - పొందిన గడ్డి అను ధనముగలవి, హరీ = ఈ నీ రెండుగుఱ్ఱములు ఐనవి. అనగా నీగుఱ్ఱములు గడ్డిని బాగుగతినినవి కావున వీనిని రథమునకు జోడించి, అభిస్వర = సోమపానార్థము మాకడకు రమ్ము.

హినోత - (౯౪).

> హినోతానో అధ్వరం దేవయజ్యా హినోత బ్రహ్మ సనయే ధనానామ్. ఋతస్య యోగే విష్యధ్వమూధః శ్రుష్టీవరీ ర్భూతనాస్మభ్యమాపః" (ఋ. ౧౦-౩౦-౧౧)
>
> ప్రహిణుత నోఽధ్వరం దేవయజ్యాయై. ప్రహిణుత బ్రహ్మ ధనస్య సవనాయ. ఋతస్య యోగే యజ్ఞస్య యోగే యాజ్ఞే శకట ఇతి వా. శకటం శకృదితం భవతి. శనకై స్తకతీతి వా. శబ్దేన తకతీతి వా "శ్రుష్టీవరీ ర్భూతనాస్మభ్యమాపః" సుఖవత్యో భవతాస్మభ్యమాపః.

హినోత ఇత్యనుపగతమ్. ప్రహిణుత ఇత్యర్థః. నిగమో నోదాహరతి. "హినోత అస్మభ్యమాపః" కవష స్యైలూషస్యార్షమ్. హే ఋత్విజః దేవయజ్యాయై - దేవయజనార్థమ్. అధ్వరమ్ యజ్ఞమ్ హినోత - ప్రహిణుత ప్రగమయతేత్యర్థః. బ్రహ్మస్తుత్యాఖ్యమ్. నః అస్మాకమ్ ధనానాం సనయే- సవనాయ, అపి చ ఋతస్య యజ్ఞస్య యోగే సంయోగే, ఊధః సోమపూర్ణమధిషవణ చర్మ యాజ్ఞే శకటే వా స్థాపితమధిషవణచర్మ విష్యధ్వమ్ విముంచధ్వమ్. ఏవం ఋత్విజ ఉక్త్వా సాంప్రత మపో బ్రవీతి. యూయమపి హే ఆపః ! ఏభిః ఋత్విగ్భిః ఉత్సిచ్యమానా ఇత్యర్థః. శ్రుష్టీవరీః సుఖవత్యః అస్మభ్యమ్ భూతన భవత. అథైకపదనిరుక్తమ్. శకటం కస్మాత్? శకృతా - గోమయేన ఇతం యుక్తం భవతి, అథవా శనకైః భారాక్రాంతత్వాత్ తకతి గచ్ఛతి తస్మాత్ శకటమ్. శబ్దం కుర్వాణం తకతీతి వా.

అర్థము :- హినోత = ప్రహిణుత = పంపుడు, 'హి' గతౌ వృద్ధౌ చ ధాతువుతో సిద్ధమగును. వేదమున హినుత = ఇందలి 'ఉ'కారమునకు గుణమగుటవలన హినోత = అయినది.

మంత్రార్థము :- హే ఋత్విజులార ! దేవయజ్యా=దేవయజనము నకై, నః = మాయొక్క, అధ్వరమ్ = యజ్ఞమును, హినోత = ప్రాప్తింపజేయుడు. మీమిత్రులను మాయజ్ఞమునకు పంపుడు. బ్రహ్మ=వేదమును

దేవస్తుత్యర్థము వేదము పఠింపుడు, యజ్ఞమున సమ్మిళితులై వేదమును పఠించుటవలన మీకు ధనముకూడ లభించును, ఋతస్యయోగే = యజ్ఞ సంయోగమున యజ్ఞమున జేయుటకు, ఊధః = రాత్రిని, విష్యధ్వమ్ = త్యజింపుడు, లేచి కూర్చుండుడు, హే ఆపః !=ఓ జలమా !. అస్మభ్యమ్ = మాకొఱకు, శ్రుష్టీవరీః = సుఖప్రదములగుదురుగాక ! ఋత్విగ్భిః = ఋత్విజులచే కదుపబడి జలములార ! మాకు సుఖముచేకూర్చుడు.

భాష్యార్థము :— ప్రహిణుత నః అధ్వరమ్ దేవయజ్యాయై=మాయజ్ఞమున దేవయజనమునకై పంపుడు. ప్రహిణుత బ్రహ్మధనస్య సవనాయ= ధనప్రాప్తికొఱకు వేదమును పఠింపుడు, ఋతస్య యజ్ఞస్య యోగే=యజ్ఞ సమయమున, యజ్ఞే శకటే=యజ్ఞశకటముపై, అధిషవణ = చర్మముంచ బడినది - దానిని విడువుడు, శకటమ్ కస్మాత్ ? శకటమనేల ? శనకైః తకతి - భారమువహించుటవలన నెమ్మదిగా నడుచును - ధ్వనిచేయుచు (శబ్దేనచలతి) నడుచును కావున శకటమనబడును. శకృత్ = గోమయము, ఇతమ్ = ప్రాప్తము, శనకైః తకతి...శబ్దేన తకతి = శబ్దముచేయుచు నడుచును, తకతి=గచ్ఛతి, శ్రుష్టీవరీః-సుఖవత్యః=సుఖప్రదములు - భూతన- అగుదురుగాక ! ఆపః=జలములార ! అస్మభ్యమ్=మాకొఱకు.

చోష్కూయమాణః - (౯౫), చోష్కూయతే - (౯౬).

> "చోష్కూయమాణ ఇంద్ర భూరి వామమ్" (ఋ ౧-33-3) దదత్ ఇంద్ర బహువననీయమ్. "ఏధమాన ద్విళుభయస్య రాజా చోష్కూయతే విశ ఇంద్రో మనుష్యాన్". వ్యృదస్య త్యేధమానా నహర్ద్వేష్ట్యసున్వతోఽభ్యాదధా త్యుభయస్య రాజా దివ్యస్య చ పార్థివస్య చ చోష్కూయమాణ ఇతి. చోష్కూయతే శ్చర్కరీతవృత్తమ్.

చోష్కూయమాణః - చోష్కూయతే ఇత్యేతే అనవగతార్థే - ఏతే సుబంతతిఙన్తే. అనయోః పూర్వం సుబన్తమ్ ఉత్తరం చ తిఙన్తమ్ ఏతయో ర్ధాతురప్రతీతః, ప్రకరణాదివశేన అస్య దానార్థతా. "చోష్కూయ మాణ ఇంద్ర భూరివామమ్" ఇతి నిగమః చోష్కూయమాణః - దదత్, భూరి = బహు, వామమ్=వననీయమ్. ఇతి సుబన్తమ్. తిఙన్తముదాహరతి

"ఏధమానః ... మనుష్యాన్ ఏధమానాన్ - దీప్యమానాన్ ద్వేష్టీతి ఏధమాన ద్విట్ సోమాభిషవమకుర్వాణాన్ అసున్వతః - అయజ్వనః ఇత్యర్థః. ఉభయస్య దివ్యస్య పార్థివస్య చ రాజా ఇంద్రః చోష్కూయతే వ్యాదస్యతి. ఏవమత్ర ఏధమానద్విడ్ ఇత్యనేన పదేన సంబంధాత్ చోష్కూయతే ఇత్యస్య పదస్య వ్యాదానోఽర్థః. ఉపపన్నః ఉభయత్రాపి చోష్కూయతి శబ్దః చర్కరీత - వృత్తేన సమాధేయః.

చోష్కూయమాణః - దదన్ = ఇచ్చుచు, 'ష్కుఞ్'ధాతువు - దాన మిచ్చుట, వ్యాదసననిరాకరణ (నాశ) అర్థములందు అంగీకరింపబడినది.

మంత్రార్థము :- హే ఇంద్ర ! నీవు భూరి = ఎక్కువ, వామమ్= వననీయమౌ సస్యసంపత్కారమౌ = ధనధాన్యములను వృద్ధిచేయు ఉదక మును, చోష్కూయమాణః = ఇచ్చుచు, మా పణిః భూః = వ్యాపారివి కాకుందువుగాక ! కృపణుడవు కావలదు.

మంత్రార్థము :- ఉభయస్య రాజా = దివ్యము మానుషమునను ద్వివిధధనములకు నీవు రాజువు-స్వామివి అట్టి ఇంద్రుడు ఏధమానద్విట్= వృద్ధిపొందుచున్నవారికి శత్రువు, అసున్వతఃద్వేష్టి = యజ్ఞాదికర్మల నొనర్పనివారిని ఇంద్రుడు ద్వేషించును, సోమసవనాతి = యజ్ఞముల నొనర్చుమనుష్యులకు స్వర్గము నొసంగును.

భాష్యార్థము :- వ్యాదస్యతి = నశింపజేయును, ఏధమానానహః = ప్రతిదినము వృద్ధిపొందువారిని, అసున్వతః ద్వేష్టి = యజ్ఞములనొనర్పని వారిని ద్వేషింతువు. యజ్ఞాదులనొనర్చువారిని, అభ్యాదధాతి = స్వర్గాదు లను ప్రాప్తింపజేయుదువు, దివ్యస్య పార్థివస్య చ రాజ్యాదివ = దివ్య ధనములకు స్వామివి. చోష్కూయమాణః ఈ ప్రయోగము చర్కరీత వృత్తమౌ యున్నది మొదటిమంత్రము 'ష్కుఞ్'ధాతువుయొక్క చోష్కూయమాణప్రయోగము దానార్థమునను, ఈ మంత్రమున ఆధాతువే నాశార్థమున ప్రయోగింపబడినది.

సుమత్ - (౯౭).

> సుమత్ స్వయమిత్యర్థః "ఉపప్రాగాత్ సుమన్మేధాయి మన్మ" (ఋ.౧-౧౬౨-౭) ఉపప్రైతు మాం స్వయం యన్మే మనోఽధ్యాయి యజ్ఞేనేత్యాశ్వమేధికో మంత్రః.

సుమత - ఇత్యనవగతమ్. స్వయమిత్యవగమః. అత్ర నిగమః - "ఉపప్రాగాత్మేధాయి మన్మ" ఉపప్రాగాత్ ఉపప్రైతు మాం ప్రకర్షేణ ఏత్విత్యర్థః స్వయమేవ మే మమ మనోఽపి అధ్యాయి వివిధాన్ సంకల్ప వికల్పాన్ చకార. ఏష మంత్రః అశ్వమేధికః.

సుమత్ = స్వయమ్ = తనకుతాను.

మంత్రార్థము :— సుమత్=స్వయముగానే, ఉపప్రాగాత్=నాకులభించును గాక ! మన్మ మననీయ వస్తు=నామనస్సున సంకల్పితవస్తుజాతము స్వయముగానే నాకు లభించునుగాక, మే మనః అధాయి = నామనస్సున నేయే సంకల్పములు కలుగునో, ప్రభో నీకృపవలన నాయాసంకల్పితములు నాకు ప్రాప్తములగుగాక !

దివిష్టిషు - (౯౮).

> దివిష్టిషు - దివఏషణేషు "స్థూరం రాధః శతాశ్వం కురుంగస్య దివిష్టిషు" (ఋ. ౮-౪-౧౯) స్థూరః సమాశ్రితమాత్రో మహాన్ భవతి. అణురను స్థవీయాంసమ్ ఉపసర్గో లుప్తనామకరణో యథా సంప్రతి కురుంగో రాజా బభూవ కురుగమనాద్వా, కులగమనాద్వా. కురుః కృన్తతేః క్రూరమిత్యప్యస్య భవతి. కుష్ణాతేః వికుషితం భవతి.

దివిష్టిషు - అనవగతమేతత్. దివ ఏషణేషు ఇత్యవగమః. తథా చ నిగమః "స్థూరం ... దివిష్టిషు" మేధాతిథేరార్షమ్. బృహతీ - స్థూరం స్థూలం మహదిత్యర్థః. రాధః - ధనమ్, శతాశ్వమ్=శతశోఽశ్వైః సంయుక్తమిత్యర్థః. కురుంగస్య రాజ్ఞః. దివిష్టిషు - క్రియాసు దక్షిణాభూతమ్. దివిష్టిః క్రియా - తాభిర్ హి ద్యులోకం గంతుమిష్యతే. కురుంగేణ దత్తా దక్షిణా

సర్వగరీయసీత్యభిప్రాయః. ఆధికపదనిర్వచనమ్. స్థూరః కస్మాత్? సమాశ్రితమాత్రో మహాన్ భవతి సమస్తాః హిమాత్రాః తత్రాశ్రితాః భవన్తి. స్థూలప్రసంగేన అణుశబ్దమపి నిర్వక్తి- స్థవీయాంసమ్ మహాన్తమను యో వర్తతే సః అణుః, అన్వితి లుప్తప్రత్యయః ఉపసర్గః. యథా సంప్రతిత్యే తత్ పదం లుప్తనామకరణం లోకే ప్రయుజ్యమానం దృశ్యతే.

కురంగః కస్మాత్? ఉచ్యతే - కురుగమనాత్ కులగమనాత్ వా. కురూన్ గచ్ఛతీతి కురుంగః - శత్రూణాం కులాని బేతుం గచ్ఛతీతి వా. కురుః కస్మాత్? శత్రూన్ కృన్తతీతి సతః. క్రూరమిత్యేతత్ పదమపి కృన్తతేరేవేతి బోధ్యమ్. కులం పునః కృష్ణాతేః ఉద్ధి వికుషితం భవతి. విస్తీర్ణత్వాదిత్యభిప్రాయః ప్రసక్తానుప్రసక్తనిర్వచనమేతత్. దివిష్టిషు = దివపిషపేషు = స్వర్గమున ప్రాపింపజేయు క్రియలు, అనుష్ఠానములు - దివిష్టులనబడును, దివః = స్వర్గస్య, ఇష్టిః ఏషణమ్ దివిష్టియనబడును. స్వర్గేచ్ఛ.

మంత్రార్థము :— కురుంగస్య = క్రూరశత్రువులపైబడు రాజు యొక్క, దివిష్టిషు = స్వర్గప్రాప్తిసాధనభూతయజ్ఞాదిక్రియలందు, శతాశ్వమ్ = శతాశ్వయుక్త. స్థూరమ్ = గొప్ప, రాధః = ధనము దక్షిణగా లభించును, స్థూరః = సమాశ్రితమాత్రః - ఏకత్రితమైన అవయవసము దాయము, అణుః = సూక్ష్మము, స్థవీయాంసమ్ అను = స్థూలమునను స రించును, స్థూలాధీనము : కావున అణువులనబడును. ఇట 'అను' ఉప సర్గము లుప్తనామకరణః = లోపించిన నామముకలది, సంప్రతి వలె - అనుప్రాతిపదికము క్విప్ ప్రత్యయము లోపించినది. అనులోని 'ను' స్థానమున 'ణు' చేర్చిన అణుః అగును. కురుంగః = రాజు, అతడు కురుదేశముపై దండెత్తుటచే కురుంగః అయ్యెను. కురూన్ గచ్ఛతీతి కురుంగః - కురుః - కృంతతేః - ధాతువుతో నేర్పడును. అనగా శత్రువు లను కృన్తతి = ఛేధించునుకావున కురుః అనబడును. ఈ కృతంతేవలననే క్రూరశబ్దమేర్పడును. కులంకుష్ణాతేః కుల 'కుషనిష్కర్షే' ధాతువువలన కుల శబ్దమేర్పడును. ఏకగోత్రీకులు అనేకులుకలిసి కులమనబడును.

దూతః - (౯౯).

దూతో వ్యాఖ్యాతః॥

దూతః-పూర్వం వ్యాఖ్యాతః. జవతేః ద్రవతేర్వా సాధ్యః (5 అ. 3 ఖ.)

దూతశబ్దము వ్యాఖ్యానింపబడినది.

జిన్వతి - (౧౦౦).

జిన్వతిః ప్రీతికర్మా - భూమిం పర్జన్యా జిన్వన్తి దివం జిన్వన్త్యగ్నయః" (ఋ. ౧-౧౬౪-౫౧) ఇత్యపి నిగమో భవతి.

జిన్వతి - అప్రతీతార్థమేతత్. ప్రీతికర్మేత్యర్థవచనమ్. "భూమిం పర్జన్యా జిన్వన్తి దివం జిన్వన్త్యగ్నయః" ఇతి నిగమః మంత్రమిమం సప్తమాధ్యాయే వ్యాఖ్యాస్యామః-సప్తమాధ్యాయమున నీమంత్రము వ్యాఖ్యానింపబడును. జిన్వతిః ప్రీణన, తర్పణార్థకధాతువువలన నేర్పడినది.

ఇతి చతుర్థః పాదః

చతుర్థపాదము సమాప్తము

## పంచమపాదము

అమత్రః - (౧౦౧)

అమత్రోఽమాత్రో మహాన్ భవత్యభ్యమితో వా. "మహాఁ అమత్రో వృజనే విరప్శి" (ఋ. ౪-౩౬-౪) ఇత్యపి నిగమో భవతి.

అమత్రః - అనపగతమేతత్. అమాత్ర ఇత్యవగమః. అభ్యమితః కేనచిన్నాభిహింసితో వా స్యాద్ అమత్రః. తథా చ నిగమః-"మహాఁ అమత్రో వృజనే విరప్శీ" విశ్వామిత్రస్యార్షమ్. ఐంద్రీ త్రిష్టుప్. ప్రభావేణ మహాన్ అథ చ అమత్రః - పరిమాణహీనః, వృజనే - సంగ్రామే విరప్శి-విరావణ శీలః ఇంద్రః అభ్యుద్యతం శత్రుబలం పాతయతే ఇత్యర్థః.

అర్థము :- అమత్రః = అమాత్రః = మాత్రారహితుడు. మహాన్ — గొప్పవాడు, అభ్యమితః వా=లేక శత్రువులచే హింసింపబడనివాడు అపరా భూతుడు.

మంత్రార్థము :- మహ=మహాన్, ఇంద్రః అమత్రః=పరిమాణ రహితుడు, వృజనే = సంగ్రామమున, విరప్శీ=శత్రువుల నాహ్వానించువాడు.

ఋచీషమః - (౧౦౨).

"స్తవే వజ్ర్యృచీషమః (ఋ. ౧౦-౨౨-౨) స్తూయతే వజ్రీ ఋచా సమః.

ఋచీషమః - అనవగతమేతత్. ఈకారో ఽత్రానవగతః. ఋచా సమః ఇత్యవగమః. "స్తవే వజ్ర్యృచీషమః" ఇతి నిగమః. ఇహ ఏతస్మిన్ కర్మణి అద్య స్తవే విజేతుం స్తూయతే అస్మాభిః వజ్రీ ఋచీషమః ఋచా సమః. స్తుత్యభిప్రాయేణ యావతా అర్థేన సహితా ఋగుచ్చార్యతే తావానేవ ఐశ్వర్యయోగాత్ ఇంద్రః అస్తీత్యభిప్రాయః. అత్ర స్తుతిసంబంధాత్ శబ్దసారూప్యాచ్చ ఋచీషమః ఋచాసమః ఇత్యుపపన్నం భవతి.

అర్థము :- ఋచీషమః - ఇంద్రునిస్తుతి యెంతగాచేయబడునో ఐశ్వర్యప్రభావమువలన నాయింద్రుడంతగా వర్ధిల్లజేయును. అని యర్థము.

మంత్రార్థము :- స్తవే=స్తుతితో, వజ్రీ=ఇంద్రుడు, ఋచీషమః = ఋచాసమః ఆ స్తుతితో సమానముగానే యగుచుండును. అనగా నె స్తుతియు ఇంద్రునిమించదని భావము. అర్చనమ్మృక్=స్తుతినామముఋక్, ఋచా = ఋక్కుతో, సమః = సముడు, - ఋచీషమః=ఋక్కుతోసమానుడు.

అనర్శరాతిమ్ - (౧౦౩).

అనర్శరాతిమ్ అనశ్లీలదానమ్- అశ్లీలం పాపకమ్ అశ్రీమద్విషమమ్. "అనర్శరాతిమ్ వసుదాముపస్తుహి" (ఋ. ౮-౯౯-౪) ఇత్యపి నిగమో భవతి.

అనర్శరాతిమ్ - అనవగతమేతత్. అనశ్లీలదాన మిత్యవగమః. తథా చ నిగమః - "అనర్శరాతిం వసుదాముపస్తుతిమ్" నేమస్యాయ మార్షమ్.

ఐంద్రీ బృహతీ. హే స్తోతః! అనర్వరాతిమ్ - అపాపదానమ్ ఏవమింద్రం వసుదాం - వసుదాతారముపగమ్యోపగమ్య సావధానేన చేతసా స్తుహి. విగ్రహప్రసక్తమశ్లీలశబ్దం వ్యాచష్టే - అశ్లీలం - పాపకం శ్రియం లక్ష్మీం రాతీతి శ్రీరం తన్న భవతీతి అశ్రీరమ్, లలయోరైక్యాత్ అశ్లీలమేతదేవాహ - అశ్రిమద్విషమమ్.

అర్థము :- అనర్వరాతిం=అనశ్లీలదానం = పవిత్రదానము. అనర్వా అనశ్లీలా రాతిర్దానం యస్య తమ్. లక్ష్మిని హరింపని దానముకలవానిని.

మంత్రార్థము :- ఓ మానవా! నీవు అనర్వరాతిం = పవిత్రదాతయు. వసుదాం = ధనదాతయు నగు నింద్రుని, ఉపస్తుహి = స్తుతింపుము.

భాష్యార్థము :- అశ్లీలం పాపకం = పాపమును కలిగించునది అశ్లీలమనబడును, అశ్రిమత్ విషమం = శ్రీకరముకానిది శ్రీనిహరించునది కష్టదాయకము విషమము అశ్లీలము.

అనర్వా - (౧౮౪).

అనర్వా అప్రత్యృతోఽన్యస్మిన్. "అనర్వాణం వృషభం మంద్రజిహ్వం బృహస్పతిమ్ వర్ధయా నవ్యమర్కైః" (ఋ. ౧-౧౯౦-౧) అనర్వమ్ అప్రత్యృతమ్ అన్యస్మిన్ వృషభమ్ మంద్రజిహ్వం మందనజిహ్వం మోదమానజిహ్వ మితి వా. బృహస్పతిం వర్ధయ నవ్యమర్కై రర్చనీయైః స్తోమైః.

అనర్వా - అనవగతమేతత్. అప్రత్యృత ఇత్యుపగమః. యో నాన్య స్మిన్నాశ్రితః స్వప్రధానపవేత్యర్థః. నిగమేన సమర్థయతి - "అనర్వాణం వృషభం మంద్రజిహ్వం బృహస్పతిం వర్ధయానవ్యమర్కైః" అగస్త్యస్యాయ మార్షమ్. త్రిష్టుప్. హే స్తోతః అనర్వాణం - స్వేన మహిమ్నోపగతం వృషభం. వర్షితారం మంద్రజిహ్వం - మదనా హర్షకరా జిహ్వా యస్య తం హర్షకర - ఘోషమిత్యర్థః. నవ్యం - స్తుత్యం బృహస్పతిం అర్కైః - మంత్రైః వర్ధయ.

అర్థము :- అనర్వా = అన్యస్మిన్ అప్రత్యృతః = ఇతరునికడకు వెళ్లనివాడు - స్వతంత్రుడు.

మంత్రార్థము :— అనర్వాణమ్=స్వాతంత్రుడు - స్వతంత్రుడు అన్యు నాశ్రయింపనివాడు, వృషభమ్ = శ్రేష్ఠుడు, మంద్రజిహ్వామ్ = మధుర జిహ్వుడు, నవ్యమ్ = స్తుతియోగ్యుడునగు, బృహస్పతిమ్ = వేదజ్ఞపండి తుని, అర్కైః = మంత్రములతో = స్తుతులతో, వర్ధయ = వర్ధిల్లచేయుము, వాగ్దాతయగుపరమేశ్వరుని స్తుతియింపుము.

భాష్యార్థము :— అనర్వామ్ = అప్రత్యృతం = ఇతరుని ఆశ్ర యింపని, స్వతంత్రుని అనర్వా అందురు. మంద్రజిహ్వామ్ = మధుర జిహ్వుని, మోదమానజిహ్వుని, నవ్యమ్=అర్చనీయస్తోత్రములతో స్తుతింప దగినవానిని, ఋగతౌ ధాతువు, వనిప్ లేక వప్రత్యయము. అనర్వా, మద్ - ధాతువు - హర్షము - స్తుతిఅర్థము-రక్ప్రత్యయము - మంద్రజిహ్వా.

అసామి - (౧౦౫).

అసామి - సామి ప్రతిషిద్ధమ్. సామిస్యతేః. "అసామ్యో జో బిభృథా సుదానవః" (ఋ. ౧-౩౯-౧౦) అసమాప్తం బలం బిభృత కల్యాణదానాః.

అసామి - అనవగతమేతత్. సామి సమాప్తం తన్న భవతీతి అసామి అసమాప్తమిత్యవగమః. తథా చ నిగమః - "అసామ్యోజో బిభృథా సుదా నవః", అసామి = అసమాప్తమ్, ఓజః బలమ్ బిభృథ - ధారయత, సుదానవః ! - కల్యాణదానాః, హే మరుతః=యూయమ్ స్తోతృద్వేష్టౄన్ ఇమ మిత ధ్వంసం స్యతేతి పూర్ణోఽర్థః.

అర్థము :- అసామి = సామికి విపరీతము - అసామి, సామి = సమాప్తము, 'షో - అన్తకర్మణి' ధాతుసిద్ధము. కావున అసామి = అనం తము - అసమాప్తము, సామి స్యతేః సామి 'షో' ధాతువుచే నేర్పడును.

మంత్రార్థము :— సుదానవః = ఉత్తమదానమొనర్చుదేవతలార ! యూయమ్ = మీరెల్లను, అసామి = అనన్త - ఓజః=బలమును బిభృథాః= ధరింపుడు.

62)

గల్దయా - (౧౦౬).

> "మా త్వా సోమస్య గల్దయా సదా యాచన్నహం గిరా। భూర్ణిం మృగం న సవనేషు చుక్రుధం క ఈశానం న యాచిషత్" (ఋ॰ ౮-౧-౨౦) మా చుక్రుధం త్వాం సోమస్య గాలనేన సదా యాచన్నహం గిరా గీత్యా స్తుత్యా భూర్ణిమివ మృగం న సవనేషు చుక్రుధం క ఈశానం న యాచిష్యత ఇతి. గల్దా ధమనయో భవన్తి గలనమాసు ధీయతే. "ఆ త్వా విశన్త్విందవ ఆ గల్దా ధమనీనామ్" నానావిభక్తీ త్యేతే భవత ఆగలనా ధమనీనామిత్యత్రార్థః.

గల్దయా - అనవగతమేతత్. గలితధానీ స్యాత్. గల్దా ధమన్యో భవన్తీత్యభిధేయాఖ్యానమ్. అత్ర నిగమః - "మా త్వా ... న యాచిషత్" మేధాతిథేరియమార్షమ్. ఐన్ద్రీ బృహతీ. హే ఇంద్ర! సోమస్య గల్దయా - గాలనేన ధమనేనేత్యర్థః. సదా చ గిరా - స్తుత్యా సవనేషు - యజ్ఞేషు యాచన్నహం, భూర్ణిమ్ మృగం న - భ్రమణశీలం మృగమివ త్వాం న చుక్రుధమ్ - క్రోధయేయమ్. అర్థాన్తరేషు వ్యాఖ్యాతి. అత్ర లోకే ఈశానమ్ ఈశ్వరమ్ సమర్థమితియావత్ - కో న యాచిషత్ న యాచిష్యతే. సర్వే ఏవ ఈశ్వరాన్ యాచన్తే ఇతి త్వయా న క్రోద్ధవ్యమిత్యభిప్రాయః. గల్దా ధమనయో భవన్తీమమర్థముపపాదయితుం మన్త్రాన్తరేణోదాహరతి. "ఆ త్వా ... ధమనీనామ్" హే ఇంద్ర! ధమనీనామ్ - నాడీనామ్ ఆగల్దాః - ఆగలనాః ధమనీరనుప్రవిశ్య, మదకారకా ఇత్యర్థః. ఇందవః - సోమాః - త్వా - త్వామ్, ఆవిశన్తు. ఏతస్య పదస్య గల్దయా గల్దా ఇత్యేవం ప్రకారాణి రూపాణి నానావిభక్తిషు దృశ్యంతే.

అర్థము :— గల్దయా - గల్దా = ధమనులు, నాడులు = జ్ఞానతంతువులు, గలనమ్ ఆసు ధీయతే = రసము వీనియందుంచుబడును.

మంత్రార్థము :- భూర్ణి మృగం న = భ్రమణశీలమృగమువలె, త్వా = నిన్ను, అహమ్ = నేను, సోమస్యగల్దయా = సోమరసమును నింపుటతో, సదా = ఎల్లప్పుడు, సవనేషు=యజ్ఞములందు, గిరా=సంగీతముతో,

యాచన్ = యాచించుచు, మా చుక్రుధమ్ = క్రోధింపకుందుముగాక, కః = లోకమునందెవడు, ఈశానమ్ = ఐశ్వర్యశాలిని, న యాచిషత్ = యాచింపడు ? ఎల్లరు యాచింతురు. లేకున్న వ్యవహారము నడవదు. ధనికులను యాచింపక తప్పదుకదా !

భాష్యార్థము - మా చుక్రుధమ=క్రోధింపకుందుముగాక ! త్వామ్ = నిన్ను, సోమస్యగాలనేన = సోమరసమును నింపుటతో, స్తుత్యా = గీతికతో, భూర్ణిమివ మృగమ్ = భయగుపోతు మృగమువలె, సవనేషు = యజ్ఞము లందు, చుక్రుధమ్ = క్రుద్ధుడైన ఎవడు ఈశానమ్ = ఐశ్వర్యశాలిని, న యాచిష్యతే = యాచింపకుందును ? గర్దా = ధమనులు - నాడులు అన బడును. వానియందు రసముంచబడును.

మంత్రార్థము :- ధమనీనామ్ = నాడులందు, అగల్దాః = జ్ఞాన నాడులు - వానియందు, త్వా = నిన్ను, ఇందవః = రసములు, ఆవిశన్తు= ప్రాప్తించుసుగాక !, నానావిభక్తి తు ఏతే భవతః = గల్దా - ధమనీనామ్ = ఈ రెండు భిన్నవిభక్తులుగలవి. కావునవే నాడులందు జ్ఞానతంతువులు అని యర్థము చెప్పబడినది.

జల్హవః - (౧౦౪).

> "న పాపాసో మనామహే నారాయాసో న జల్హవః" (ఋ. ౮-౬౧-౧౧) న పాపా మన్యామహే నాధనాః, న జ్వలనేన హీనాః. అస్త్యస్మాసు బ్రహ్మచర్యమధ్యయనం తపో దానం కర్మేతి ఋషిరవోచత్.

జల్హవః - అనవగతమేతత్. జ్వలనహీనాః ఇత్యుపగమః. తథా చ నిగమః - "న పాపాసో...న జల్హవః" ప్రగాథపుత్రస్య భర్గస్యార్షమ్. ఛన్దో బృహతీ. న వయం పాపాసః పాపాః ఇత్యేవం మనామహే మన్యామహే యతోఽస్మాసు బ్రహ్మచర్యమధ్యయనం దానం చాస్తి తస్మాన్న వయం పాపాః న చ వయమ్ అరాయాసః - ధనహీనాః నాపి చ వయం జల్హవః - అజ్వలనశీలాః అనాహితాగ్నయో వేత్యభిప్రాయః.

జల్హవః - జల్హా జ్వలనేన హీనాః - జ్వలనరహిత - అగ్నిరహిత = అగ్నిహోత్రరహితులము కాము.

మంత్రార్థము :— న మనామ హే పాపాసః=మేము ప్రాపులము కాము, న అరాయాసః=ధనహీనులము కాము, న జల్హవః = అగ్నిహోత్రహీనులము కాము.

బకురః - (౧౦౮).

బకురో భాస్కరో భయంకరో భాసమానో ద్రవతీతి వా. "యవం వృకేణాశ్వినా వపన్తేషం దుహన్తా మనుషాయ దస్రా అభిదస్యుం బకురేణా ధమన్తోరు జ్యోతిశ్చక్రథు రార్యాయ. (ఋ. ౧-౧౧౭-౨౧) యవమివ వృకేణాశ్వినౌ నివపన్తౌ. వృకో లాంగలం భవతి. వికర్తనాత్ లాంగలం లంగతేర్లాంగూలవద్ వా. లాంగూలం లగతేర్లంగతే ర్లంబతేర్వా. అన్నం దుహన్తౌ మనుష్యాయ దర్శనీయావభి ధమన్తౌ. వస్యం బకురేణ జ్యోతిషా వోదకేన వార్య ఈశ్వరపుత్రః.

బకురః - ఇత్యనవగతమ్. భాస్కరః, భయంకరః భాసమానో ద్రవతీతి వా శబ్దసమాధయః. అత్ర నిగమః - యవం వృకేణ ... చక్రథురార్యాయ" కక్షీవత ఆర్షమ్. అశ్వినీ త్రిష్టుప్. హే అశ్వినౌ! వృకేణ - లాంగలేన హలేనేతి యావత్, యవం - యవగోధూమాది ధాన్యమ్. వపన్తా- వపన్తౌ, మనుషాయ - మనుష్యాయ, ఇషమ్ - అన్నమ్ దుహన్తా - దుహన్తౌ ప్రపూరయన్తావిత్యర్థః. దస్రా-శత్రూణాం దాసయితారౌ ఇత్యేవం కర్మాణౌ యువామ్ అభిదస్యుమ్ - నాశకం దుష్టకమ్ బకురేణ - జలౌఘేన ధమన్తా - దూరీకుర్వన్తౌ స్థః. అపి చ - ఆర్యాయ - ఈశ్వరపుత్రాయ ఋజ్రాశ్వాయ ఉరుజ్యోతిః చక్రథుః-కృతవన్తౌ ఇత్యర్థః. అన్ధః ఋజ్రాశ్వః యుష్మదనుకమ్పయా చక్షుష్మాన్ బభూవేత్యర్థః. అథైకపదనిరుక్తమ్ వృకః కస్మాత్? వికర్తయతీతి సతః, లాంగలం కస్మాత్? లంగతేర్వా

స్యాత్ లాంగూలవద్ వా భవతి. లాంగూలం చ లగతేః లింగతేః లంబతేర్వా సాధ్యమ్.

అర్థము :— బకురః = భాస్కరుడు జ్యోతిస్సు సమూహము - జల సమూహము. ఏలయన జ్యోతిప్రకాశమునిచ్చును. జలము జీవనమును, లేక తేజస్సునిచ్చును, అగ్ని, జలము రెండును రౌద్రరూపమును ధరించి నప్పుడు భయంకరములగును. భాస్కరుడు జ్యోతిసమూహము, జలసమూహము, భయంకరమే-బకురము. భాస్కరః - బకుర. జ్యోతి జలము భాసమానములై ప్రవహించును.

మంత్రార్థము :- అశ్వినా = ఓ అశ్వినులార !, వృకేణ = నాగలితో. యవం వపన్తా = యవాదిధాన్యములను విత్తుచు, ఇషం = అన్నమును, దుహన్తా = నింపుచు, దస్రా = శత్రునాశనమొనర్చుచు, లేక పశ్వాదుల సహాయముతో కృషియున్నగువానిని చేయుచు, బకురేణ = జ్యోతితో, జల సమూహముతో, (సూర్యుడాతపముతో రోగనాశనము చేయును, వర్షపు జలముతో దుర్భిక్షమును దూరముచేయును). దస్యుమ్ అభిధమన్తా = దుష్టులను దమనముచేయుచు మీరిద్దరు, ఆర్యాయ = శ్రేష్ఠమనుజుని కొఱకు, మనుషాయ = సాధారణమానవులకొఱకును, ఉరుజ్యోతిః = ప్రకాశరూప ఆనందమును, చక్రథుః = కలిగించుచున్నారు.

భాష్యార్థము :— వృకేణ=నాగలితో, యవమివ నివపన్తౌ = యవాది ధాన్యమును విత్తుచు, వృకః లాంగలంభవతి = లాంగూలము నాగలి యన బడును. భూమిని వికర్తనముచేసి పెళ్లగించును. కావున నాగలి వృకమన బడును. గత్యర్థక 'లగి' ధాతువుతో లాంగులశబ్దము సిద్ధించును. నాగలి నడపబడును. లాంగూలవద్వా = తోకవలెనె వలె ఉండును. లాంగులము 'లగి' ధాతుసిద్ధమే. అన్నం దుహన్తౌ మనుష్యాయ = మనుజునికొఱకు అన్నమును ప్రాప్తింపజేయుచు, దస్రౌ = దర్శనీయములు - సుందరులు, దస్యుం=అభిధమన్తౌ = దుష్టులను అణచుచు = నాశనమొనర్చుచు, బకు రేణ=జ్యోతిషా = జలేనవా=బకుర = జ్యోతితో లేక జలముతో, ఆర్యాయ = ఈశ్వరపుత్రాయ = వేదానుకూలాచరణము చేయువానికొఱకు

బేకనాటాన్ - (౧౦౯).

> బేకనాటాః ఖలు కుసీదినో భవన్తి. ద్విగుణ కారిణో వా, ద్విగుణదాయినో వా, ద్విగుణం కామయన్త ఇతి వా. "ఇంద్రో విశ్వాన్ బేకనాటాఁ అహర్దృశః ఉత క్రత్వా పణీఁరభి" (ఋ. ౮-౬౬-౧౦) ఇంద్రో యః సర్వాన్ బేకనాటానహర్దృశః సూర్యదృశో య ఇమాన్యహాని పశ్యన్తి న పరాణీతి వాఽభిభవతి కర్మణా పణీంశ్చ వణిజః.

బేకనాటాన్ - ఇత్యనవగతమ్. ద్విగుణకారిణః ద్విగుణదాయినః ద్విగుణకామినో వేతి శబ్దసమాధయః. కుసీదినోఽభిధేయాః. నిగమేన సమర్థయతి - "ఇంద్రో విశ్వాన్ బేకనాటాఁ ... పణీఁరభి" ప్రగాథస్య కతేభాగ్ద్వతమ్ ఐంద్రీ బృహతీ. ఇంద్రః బేకనాటాన్ - కుసీదజీవినః పురుషాన్ అహర్దృశః - ఇహైవ జన్మని సూర్యం న పశ్యన్తి యతః తేషాం కృతే అంధేన తమసా వృతా లోకా భవన్తి. ఏవం విధాన్ వృద్ధ్యాజీవినో నరాన్ అభిభవతి. అథ చ పణీన్ - వణిజోఽపి అభిభవతి. తేఽపి విశుద్ధేన కర్మణా న వ్యవహరన్తి.

అర్థము :— బేకనాటాః = బేకనాటులు, కుసీదినో భవన్తి = వడ్డీ వ్యాపారులు, వారిని, ద్విగుణకారిణః = రెట్టింపుచేయువారు అందురు. ద్విగుణదాయినోవా = లేక రెట్టింపువడ్డీకి రూప్యములిచ్చువారు, ద్విగుణం కామయన్తః = రెట్టింపుకోరువారు.

భావార్థము :- యః ఇంద్రః = ఏ యింద్రుడు, సర్వాన్ బేకనాటాన్ = వడ్డీవ్యాపారులెల్లరు, అహర్దృశః=విషయోపభోగమును ప్రధానముగ నెంచువారు - వర్తమానదినమును మాత్రమే చూతురు చనిపోయిన మిదప వారు సూర్యదర్శనము చేయజాలరు. అంధకారావృత నీచజన్మములను పొందుదురు. వారిని ఇప్పుడు కనబడుదినములలో సూర్యుని జూతురు. న పరాణి = మరణానంతరము వారికి సూర్యదర్శనము లేక అంధకారమున బడియుందురు - వడ్డీవ్యాపారముచేయు. పణీంశ్చ = వ్యాపారులు నట్టిఅంధకారావృతలోకములను పొందుదురు.

అభిధేతన - (౧౧౦).

"జీవాన్నో అభిధేతనాదిత్యాసః పురా హథాత్. కద్ధస్థ హవనశ్రుతః" (ఋ. ౮-౬౭-౫) జీవతో నోఽభిధావతా దిత్యాః పురాహననాత్ క్వను స్థ హ్వానశ్రుత ఇతి. మత్స్యానాం జాలమాపన్నానామేతదార్షం వేదయన్తే. మత్స్యా మధౌ ఉదకే స్యందంతే మాద్యన్తేఽన్యోన్యం భక్షణాయేతి వా. జాలం జలచరం భవతి జలే భవం వా జలేశయం వా.

అభిధేతన - అనవగతమేతత్. అభిధావత ఇత్యవగమః అథ నిగమః - "జీవాన్నో అభిధేతనాదిత్యాసః పురా హథాత్ - కద్ధస్థ హవనశ్రుతః జాలమాపన్నానాం మత్స్యానామేతదార్షమ్ ఇతి ఆచార్యాః వేదయన్తే - ప్రఖ్యాపయన్తి. ఆదితేయీ గాయత్రీ. హే ఆదిత్యాసః! ఆదిత్యాః జీవాత్ నః - జీవతః అస్మాన్, పురా హథాత్ - హననాత్ పూర్వమేవ యూయం అభిధేతన - అభిధావత. అహతానేవాస్మాన్ యూయం సభాజయతేత్యాశయః. హే హవనశ్రుతః! - ఆర్తానామాహ్వానం శృణ్వన్తీతి తదోక్తాః యూయం కత్ హస్థ - క్వ ను స్థేత్యర్థః. మత్స్యోపధజాత - దయస్య ఋషేర్వా కస్యచిదియమార్షం స్యాత్. అథైకపదనిర్వచనమ్ - మత్స్యాః కస్మాత్? మధౌ ఉదకే స్యందంతే గచ్ఛన్తీతి మత్స్యాః. మధౌ అన్యోన్యం భక్షణాయ మాద్యన్తి హృష్యన్తీతి వా. జాలం కస్మాత్? జలచరం భవతి. అథవా జలే భవం భవతి. అథవా జలేశయం భవతి.

అర్థము :- అభిధేతన = అభిధావత=పరుగెత్తుడు. మావైపు శీఘ్రముగ రండు.

మంత్రార్థము :- హవనశ్రుతః ఆదిత్యాసః = ఆహ్వానము వినునో ఆదిత్యులార!, కత్ హ స్థ = మిరెక్కడనున్నారు? మీరు వినరు రారు, పురాహథాత్=చంపబడుటకు ముందె, జీవాత్ నః=జీవించియున్న మావైపు, అభిధేతన = పరుగెత్తుడు, జీవించియుండగానే మమ్ముల కాపాడుడు. అని మత్స్యములనుచున్నవి. మమ్ముపట్టుకొనుటకు పల్లెకారులు వచ్చుచున్నారు. కావున మీరు వచ్చి మమ్ముల గాపాడుడు.

భాష్యార్థము :- జీవతః నః అభిధావత = "జీవించియున్న మావైపు పరుగెత్తుడు, పురాహననాత్ = చంపబడకముందే, క్వ సు స్థ = మీరెట నున్నారు ?, హవనశ్రుతః = మా ఆర్తనాదములను = మా పిలుపులను వినువారు మీరే, మత్స్యానాం జాలమాపన్నానాం = వలలో చిక్కుపడియున్న మత్స్యముల, ఉక్తి = వచనమని, ఏతత్ అర్థం వేదయన్తే = వేదజ్ఞులు చెప్పుచున్నారు. మత్స్యాః కస్మాత్ ? = మత్స్యములని యేల యందురు ?, మధౌ ఉదకే స్యన్దన్తే = మధౌ = జలమున విచరించును కావున మత్స్యములనబడుచున్నవి, మాద్యన్తే అన్యోన్యం భక్షణాయ ఇతి వా = లేక పరస్పర భక్షణకొఱకు మాద్యన్తే = ప్రసన్నములగుచున్నవి. కావున మత్స్యములనబడును. భస్ధాతువు భక్షణార్థకము. మద్ + భస్ + య = మత్స్యము, జాలం = జాలము = వల - జలమున చరించును - కావున జాలమనబడుచున్నది. జలశబ్దమునకు 'అణ్' చేసిన జాలమగును.

అంహురః - (౧౧౧).

> "అంహురోఽంహస్వానంహూరణమిత్యప్యస్య భవతి. కృణ్వన్నంహూరణాద్ ఉరు" (ఋ. ౧-౧౦౫-౧౮) ఇత్యపి నిగమో భవతి. "సప్త మర్యాదాః కవయస్తతక్షుస్తాసామేకా మిదభ్యంహురో గాత్" (ఋ. ౧౦-౫-౬). సప్తైవ మర్యాదాః కవయశ్చక్రుస్తాసామేకా మప్యభిగచ్ఛన్నంహస్వాన్ భవతి. స్తేయం తల్పారోహణం బ్రహ్మహత్యాం భ్రూణహత్యాం సురాపానం దుష్కృతస్య కర్మణః పునః పునః సేవాం పాతకేఽనృతోద్యమితి.

అంహురః - అనవగతమేతత్. అంహస్వానిత్యవగమః. మత్వర్థేరః ప్రత్యయః. ఏతస్య పదస్య - 'అంహూరణః' ఏవమపి ప్రయోగో దృశ్యతే తదేతత్ ప్రాసంగికం నిగమేన సమర్థయతి - "కృణ్వన్నంహూరణాదురు" అంహూరణాత్ - అంహస్వతః కూపాత్, ఉరు-బహు త్రాణమ్, కృణ్వన్ - కుర్వన్ బృహస్పతిః, కూపే పతితః త్రితః దేవాన్ అహ్వయదితి శుశ్రావ. అంహురః ఇతి పదే నిగమేనోదాహరతి - "సప్తమర్యాదాః ... అంహురో

గాత్" - కవయః - మేధావినః, సప్తమర్యాదాః తతక్షుః - కృతవన్త ఇత్యర్థః. తాసాం మర్యాదానాం మధ్యాత్ ఏకామపి అభిగాత్ - అభిగచ్ఛన్ అంహురః అంహస్వాన్ భవతి. కాః పునస్తాః మర్యాదాః ? ఉచ్యతే స్తేయమ్-చౌర్యమ్, తల్పారోహణమ్ - గురుతల్పగమనమ్ బ్రహ్మహత్యా భ్రూణహత్యా సురా - పానం దుష్కృతస్య కర్మణః పునః పునః సేవా పాతకే అసత్యకథనం చేతి.

అర్థము :- అంహురః = అంహస్వాన్ = అంహూరణః — అహురః అంహస్వాన్ అంహూరణః ఈమూడుశబ్దములు పర్యాయపదములు; అర్థము పాపి.

మంత్రార్థము :- అంహూరణాత్ = పాపినుండి (సంసారకూపము నుండి) ఉరు = గొప్ప త్రాణమును, కృణ్వన్ = చేయుచు, వేదజ్ఞుడైన ఉపదేశకుడు దుఃఖితుడైనవాని పిలుపును వినవలెను. అను నీమంత్ర వ్యాఖ్యానము (ఆఱవ అధ్యాయము)న చేయబడినది.

మంత్రార్థము :- కవయః=జ్ఞానులు, సప్తమర్యాదలు తతుక్షః = నిర్మించిరి=నిర్ణయించిరి, తాసామ్ = వానిలో, ఏకామ్ ఇత్ = ఒకదానిని చేసినైనను, అభ్యగాత్ = పొందునో ఆచరించునో యతడు, అంహస్వాన్ = పాపియగును,సప్త ఏవ మర్యాదాః కవయశ్చక్రుః=జ్ఞానులు ఏడు మర్యాదలు బంధించిరి - నిర్ణయించిరి. వానిలో నెయొక్కటిచేసినను మనుజుడు పాపి యగును. ఆమర్యాదలేవియన :- 1) స్తేయమ్ = దొంగతనము. 2) తల్ప గమనమ్ = పరస్త్రీ గమనము. 3) బ్రహ్మహత్యా=వేదవిదుడైన విద్వాంసుని వధించుట. 4) భ్రూణహత్యా = గర్భపాతము. 5) సురాపానమ్ = కల్లు మున్నగు మత్తుపదార్థసేవనము. 6) దుష్కృతస్య కర్మణః పునః పునః సేవామ్ = చెడ్డ-నింద-పాపకర్మలనాచరించుట. 7) పాతకేఽనృతోద్యమ్ = పాపముచేసి దానిని కప్పిపుచ్చుటకు అసత్యముచెప్పుట, ఇవి సప్త మర్యాదలు.

బత - (౧౧౭).

బత ఇతి నిపాతః ఖేదానుకంపయోః. "బతో బతాసి యమ నైవ తే మనో హృదయంచావిదామ. అన్యా కిల త్వాం కక్ష్యేవ యుక్తం పరిష్వజాతే లిబుజేవ వృక్షమ్. (ఋ. 63)

౧౦-౧౦-౧౩) బతో బతాసి యమ నైవ తే మనో హృదయం చ విజానీమోఽన్యా కిల త్వాం పరిష్వంక్ష్యతే కక్ష్యేవ యుక్తం లిబుజేవ వృక్షమ్. లిబుజా వ్రతతిర్భవతి లీయతే విభజతీతి. వ్రతతిర్వర ణాచ్చ సయనాచ్చ తననాచ్చ.

బతః - అనవగతమేతత్. అనేకార్థత్వాత్. నిపాత ఇతి పదజాతి నిశ్చయః. ఖేదానుకంపయోః ఇతి అర్థోక్తిః. అత్ర నిగమః-"బతో బతాసి... లిబుజేవ వృక్షమ్" యమి యమం ప్రతి కథయతి. హే యమ! త్వం బతః - దుర్బలః అసి ఇతి బత-మహత్కష్టమిత్యర్థః. అహం తే హృదయం మనః చైవ న అవిదామ-అర్థాత్ తవ హృద్గతమధ్యవసాయం చ న విజానీమః అన్యామత్త ఇత్యర్థః. కక్ష్యేవ లిబుజేవ కక్షజాతా వల్లీ ఇవ కాచిత్ యోషిత్ పరిష్వజాతే - పరిష్వంక్ష్యతే. అథైకపదనిరుక్తమ్. లిబుజాః కస్మాత్? యస్మాదేతా లీయన్తే విభజంతి తస్మాత్ లిబుజాః వ్రతత్యః లతాః ఇత్యర్థః. వ్రతతిః కస్మాత్? వరణాత్ సయనాత్ తతనాద్వా.

అర్థము :- బత ఇతి నిపాతః - నిపాతము. ఖేదము, అనుకంప అని రెండర్థములు.

మంత్రార్థము :- యమి యమునితో చెప్పుచున్నది - "హే యమ! బత = ఇది దుఃఖకరవిషయము నీవు బతః = నీవు దుర్బలుడవు-దుర్బల హృదయుడవు - ఏలయన నేను నిన్ను పలుమారు ప్రార్థించితిని కాని, నీవు నాకడకు రాలేదు. అథవా లేక న ఏవ తే మనః హృదయం చ=నేను నీమనస్సును హృదయమును, అవిదామ = తెలిసికొనజాలకపోయితిని, ఓహో! నేనిప్పుడు తెలిసికొంటిని కక్ష్యేవ = అశ్వకక్షయందు, గజ కక్షయందు వానినడుమునకు కట్టుత్రాడు లగ్నమైయున్నట్లు సమీపస్థ వృక్షమున లత అల్లుకొనియుండునట్లు నీకుకూడ మఱియొకస్త్రీ ఇంపైనది నీపరిష్వంగము పొందినట్లున్నది - నీకు మఱియొకస్త్రీతో సంబంధ మేర్పడినది.

భాష్యార్థము :- బతః బలాత్ అతీతః భవతి = బలరహితమగుట బతఅనబడును, యమ బతః=దుర్బలుడవు - అసి=అయితివి. ఇది ఖేదకర

విషయము, నైవ తే మనః హృదయం చ విజానీమః = నీమనస్సు హృదయము తెలిసికొనజాలకపోయితిని, అన్యా కిల త్వాం పరిష్వంక్ష్యతే = మఱియొకస్త్రీ ఆలింగనముచేసికొనును, కక్ష్యేవ యుక్తమ్ లిబుజా ఇవ వృక్షమ్= నడుమునకు బంధించు త్రాడు గుఱ్ఱమును ఏనుగునువలె లత వృక్షమును వలె అన్యస్త్రీ నిన్నాలింగనముచేసికొనును. లిబుజా వ్రతతిర్భవతి = లిబుజా లతకుపేరు. లత వృక్షమును చుట్టుకొనును. కావున నది, వ్రతతి = లత అనబడును. వరణాత్ - సయనాత్-తననాత్చ-వ్రతతిః=లతవిస్తరించును.

వాతాప్యమ్ - (౧౧౩).

> వాతాప్యముదకం భవతి వాత ఏతదాప్యాయయతి-''పునానో వాతాప్యం విశ్వశ్చంద్రమ్'' (ఋ. ౯-౯౩-౫) ఇత్యపి నిగమో భవతి.

వాతాప్యమ్ - అనవగతమేతత్. వాతాప్యముదకం భవతీతి వాచ్య - వచనమ్. వాత ఏతదాప్యాయతీతి అర్థవచనః. "పునానో వాతాప్యం విశ్వశ్చంద్రమ్" ఇతి నిగమః. నోధసో గౌతమస్యాయమార్షమ్. హే సోమ! పుత్రపౌత్ర సహితం మాం పునానః - పూయమానః వాతాప్యమ్ - ఉదకమ్ ఉపమాస్వ - ఉపనిర్మిమీహి, చంద్రమ్-చాయనీయముదకమ్, విశ్వాః-సర్వాః.

అర్థము :- వాతాప్యమ్ = ఉదకము, వాతః = వాయువు, ఏతత్ = ఈజలమును, ఆప్యాయయతి = చల్లబఱచును. లేక వాతః = ఋతు పవనము ఉదకమును వృద్ధిచేయును. ఆప్యాయయతి.

మంత్రార్థము :- హే ప్రభో! పునానః = మమ్ము పవిత్రము చేయుచు నీవు, విశ్వశ్చంద్రమ్=సమస్తజగత్తునకు ఆహ్లాదమును కలిగించు వాతాప్యమ్ = జలమును శ్రేష్ఠముగా నిర్మించుము, వర్షమును కురియింపుము, విశ్వశ్చ చంద్రమ్ = సర్వాహ్లాదకము ఇట హ్రస్వాచ్చ - న్ద్రోత్తరపదే మంత్రే = హ్రస్వమునకు తరువాత నున్న చంద్రపదమునకు 'సుట్' ఆగమమైనది. చది ఆహ్లాదే అనుధాతువువలన చంద్రపదము సిద్ధించును.

చాకన్ - (౧౧౪).

"వనే న వాయో న్యధాయి చాకన్" (ఋ. ౧౦-౨౯-౧)

**వన ఇవ వాయో వేః పుత్రశ్చాయన్ ఇతి వా కామయమాన ఇతి వా, వేతి చ య ఇతి చ చకార శాకల్యః. ఉదాత్తం త్వేవమాఖ్యాతమ్ అభవిష్యదసుసమాప్తశ్చార్థః.**

చాకన్ - అనవగతమేతత్. చాయన్ కామయమానో వేతి శబ్దసమాధీ. "వనే న వాయో న్యధాయి చాకన్" ఇతి నిగమః. వనే న - వనే ఇవ, వాయః=పక్షి స్వే నీడే యథా ఆత్మీయం శిశుం న్యధాయి-నిదధాతి. చాకన్-భయాద్దిశః నిరీక్షమాణః. అస్మిన్ శాకల్యః యత్ 'వా' ఇతి 'యః' ఇతి చ యత్ పదవిభాగం చకార తన్న విచారక్షమమ్. యతః-ఏతస్మిన్ పదద్వయే సతి న్యధాయి ఇతి ఆఖ్యాతమ్ - క్రియాపదమ్ ఉదాత్తమభవిష్యత్. యద్వృత్తాత్ పరస్య నిత్యమాఖ్యాతస్య నిఘాతః న భవతీతి లక్షణవిదాం మతమ్ - న చేదముదాత్తమ్ తస్మాత్ యః ఇతి నేదం యద్వృత్తమ్ అపి తు ఏకమేవ పదమ్. అపరం చ శాకల్యమతేన పదవిభాగే కృతే మంత్రార్థ ఏవ న సుసమాప్తః భవతి. పదద్వయే సతి కోఽర్థః భవిష్యతి వా శబ్దస్య? నేహ కశ్చిద్వికల్పః సముచ్చయో వా నాపి చోపమార్థః. ఉపమాయాః న శబ్దేనైవ కృతార్థత్వాత్. తస్మాత్ ఆఖ్యాతస్య అనుదాత్తత్వాత్ అర్థాసంభవాచ్చ నైతత్ పద-ద్వయమ్.

అర్థము :- చాకన్ - నిఘంటువునందు 'చక' ధాతువు ఇచ్ఛార్థకముగ ఇయ్యబడినది. దానికి శతృప్రత్యయము చేసినమీదట చకన్ - అయినది. చకన్ - లోని 'క' స్థానమున 'య' చేసిన 'చాయన్' అగును. కావుననే చకన్-పదమునకు చాయన్ అర్థము చెప్పబడినది, అర్థము చూచుచు. లేక కామయమానః ఇతి వా = కోరుచు.

మంత్రార్థము :- వనే న = వనమునందువలె లేక వనే = వృక్షే = చెట్టుమీదవలె, వాయః పక్షిపిల్ల, చాకన్=భయముతో నిటునటు చూచుచు, లేక ఆహారపదార్థమును గోరుచు, న్యధాయి = ఉంచబడునట్లు, పరమేశ్వరుని రచన వేదము నీకు వనమున స్థాపింపబడినదై లభించును. అనగా -

'ఉపహ్వరే గిరీణామ్ సంగమే చ నదీనామ్ = ఆవేదజ్ఞానము పర్వతగుహలలోను, నదులసంగమస్థానమునను ప్రాప్తము కాగలదని చెప్పబడినది.

భాష్యార్థము :- వనే న = వనమునందువలె, వాయః = వేఃపుత్రః = పక్షిపిల్ల, చాయన్ = ఇటునటు చూచుచు, కామయమానః = భోజన పదార్థమును కోరుచు, వా - ఇతి యః ఇతి చకార శాకల్యః. వాయః - పదమును వా, యః అని శాకల్యఆచార్యుడు విభజించెను. వేఃపుత్రః = వాయః అను ఏకపదమును శాకల్యుడు 'వా' 'యః'అని విభజించుట యాస్కముని నిరుక్తకారుడు శాకల్యుని పదవిభాగ మశుద్ధమని నుడివెను. "ఉదాత్తం త్వేవమాఖ్యాతమభవిష్యత్" ఏవమ్ = ఇట్లు 'వా', 'యః' అని పదవిభాగముచేసినచో మంత్రమునన్నున్న-'స్వధాయి' ఆఖ్యాతము తిఙన్తమ్= క్రియాపదము అది ఉదాత్తమగును. (ఏపదములలో యత్పదముండునో ఆపదములు యద్వృత్తములనబడును) యద్వృత్తపదములకు పరమున వచ్చు ఆఖ్యాతమునకు నిత్యఅనుదాత్తము కాదు. ఉదాత్తమగును. మఱియు 'అసుసమాప్తశ్చార్థః' అట్లు చేసినందున ఇట స్వధాయి క్రియ ఉదాత్తమగు నెడల మంత్రార్థము సంగతముకాదు. 'వా' 'యః' పదములు విభక్తము చేసినచో వానియర్థము ఇట సంగతముకాదు. కావున శాకల్యుని యీ పద విభాగము సరికాదు.

రథర్యతి - (౧౧౫).

> రథర్యతి ఇతి సిద్ధస్తత్ప్రేప్సుః రథం కామయత ఇతి వా. "ఏష దేవో రథర్యతి" (ఋ. ౯-౩-౫) ఇత్యపి నిగమో భవతి.

రథర్యతి - అనవగతం తావదిదం పదమ్. నిరాహాచార్యః రథం హర్యతి ఇతి. హర్యతిః పునః ప్రేప్సార్థః. రథం కామయతే ఇతి వా రథర్యతి. నిగమేనోదాహరతి "ఏష దేవో రథర్యతి" శునఃశేపస్యేయమార్షమ్. సామీ గాయత్రీ. ఏష సోమో దేవః రథర్యతి - రంహణమాత్మనో గమన మిచ్ఛతి.

అర్థము :- రథర్యతి = సిద్ధః, తత్ప్రేప్సుః = ప్రసిద్ధమే రథం హర్యతి = రథమును కోరువాడు, హర్యధాతుఫ్ప్రేప్సార్థకము. రథం

కామయతే ఇతి వా = రథమును, కామయతే = కామించువాడు-రథర్యతి అనబడును. రథమాత్మనః కామయత ఇతి రథీయతి (సుప ఆత్మనః క్యచ్ ప్రత్యయః) రథీయతి పదమే రథర్యతి బనది.

మంత్రార్థము :- ఏష దేవః = ఈదేవుడు సోముడు, రథర్యతి = రథమును కోరుచున్నాడు.

అస్రామ్ - (౧౧౬).

**"ధేనుం న ఇషం పిన్వత మసక్రామ" (ఋ. ౬-౬౩-౮) అసంక్రమణీమ్.**

అస్రామ్ - అనవగతమేతత్. అసంక్రమణీమ్ ఇతి ఏతేన శబ్దేన సమాధత్తే నిగమేన చోపపాదయతి. "ధేనుం న ఇషం పిబన్తమసక్రామ్" భారద్వాజస్యార్షమ్. ఆశ్వినీ త్రిష్టుప్. హే అశ్వినౌ ! యువామ్ నః అస్మభ్యం ధేనుం - తర్పయిత్రీం అస్రాం - అసంక్రమణీం అనపాయి నిమిత్తార్థః. ఇషం - అన్నలక్షణాం పిన్వతం - ప్రవారయతమ్. శబ్దసారూప్యాదర్థా విరోధాచ్చ అస్రామిత్యేతస్య శబ్దస్య అసంక్రమణీమిత్యేష విపరిణామః ఉపపన్నః.

మంత్రార్థము :- ఓ బహుభోజనముచేయు అశ్వినీకుమారులార ! నః = మాకొఱకు, ధేనుం = తృప్తిపఱచు, ఇషం = అన్నమును, అస్రాం = ఎన్నడును సంక్రమణముకాని అనపాయియైన ద్యులోకమునుండి, పిన్వతం - సించింపుడు - తడుపుడు. అన్నమునకు నిమిత్తమగు జలమును వర్షింపజేయుడు.

ఆథవః - (౧౧౭).

**అథవ ఆధవనాత్. "మతీనాం చ సాధనం విప్రాణాం చాధవమ్" (ఋ. ౧౦-౨౬-౪) ఇత్యపి నిగమో భవతి.**

ఆథవః - అనవగతం పదమ్ ఆధవనాత్ ఇత్యేవ మవగమయతి. నిగమేన చ సమర్థయతి "మతీనాం ... చాధవమ్" ఇతి ఐంద్రస్య విమదస్యార్షమ్. పౌష్ణీఅనుష్టుప్. హే పూషన్ ! దేవ ! వయం త్వా త్వాం మతీనాం ప్రజ్ఞానాం సాధనం-సాధయితారమ్, విప్రాణాం చ మేధావినామ్

ఆధవం-ఆకంపయితారం మహాన్తమపి మేధావినః త్వాం దృష్ట్వా ప్రోత్కంపి తమానసా భవన్తీత్యాశయః. మంసీమహి - మన్యామహే. శబ్దసారూప్యాదర్థా విరోధాచ్చ ఆధవః ఆకంపనః ఉపపద్యతే. ఆధవః = కంపింపజేయువాడు, ఆధవనాత్ = ధూఞ్ కంపనే ధాతువుచే ఆధవశబ్దము సిద్ధించును. కావున కంపింపజేయువాడని యర్థము.లేక ధుగతిస్థైర్యయోః ధుగతిస్థైర్యము అను అర్థముగల ధు ధాతువువలనను అధవః శబ్దము సిద్ధమగును. కావున ఆధవః = స్థైర్యమునొసంగువాడు అనియర్థము,

మంత్రార్థము :- హే పూషన్దేవ! మేము నిన్ను మతీనాంచ సాధనం = ప్రజ్ఞానసాధయితవనియు, విప్రాణాం చ ప్రాప్తప్రజ్ఞగల మేధావులను ఆకంపయితవనియు కంపింపజేయువాడవనియు ప్రేరకుడవు వారికి స్థిరతనొసంగువాడవనియు, మంసీమహి = మనామహే = అంగీక రించుచున్నాము.

ఇతి పంచమః పాదః

పంచమ పాదము సమాప్తము

## అథ షష్ఠః పాదః

అనవబ్రవః - (౧౧౮).

అనవబ్రవోఽనవక్షిప్తవచనః - "విజేషకృదింద్ర ఇవానవ బ్రవః" ఇత్యపి నిగమో భవతి. (ఋ. ౧౦-౮౪-౫).

అనవబ్రవః - అనవగతంపదమ్. అనవక్షిప్తవచనః ఇత్యేవమవగమ యన్ నిగమేనోదాహరతి. "విజేషకృదింద్ర ఇవానవబ్రవః" మన్యోరార్షమ్. త్రిష్టుప్. - విజేషకృత్ - విజయకారకః ఇంద్ర ఇవానవబ్రవః ఇంద్రవచనా క్షిప్తవచనః నహీంద్రస్య వచనం కేనచిదాక్షేప్తుం శక్యతే. త్వం హేమన్యో! అస్మాకం అధిపా అధిష్ఠాయ రక్షకో భవ.

అనవబ్రవః = అనవక్షిప్తవచనః (అనవక్షిప్తం అప్రతిహతం వచనం యస్య సః) అనవక్షిప్త-నిరర్థకముకాని వచనముగలవాడు-సార్థకవచనుడు.

మంత్రార్థము :— హేమన్యో! ఇంద్ర ఇవ = ఇంద్రునివలె నీవు, అనవబ్రవః = అప్రతిహతవచనుడవు - సార్థకవచనుడవు. కావుననే, విజేష కృత్ = విజయమును సాధించువాడవు.

సదాన్వే - (౧౧౯), శిరింబిఠః - (౧౨౦).

"అరాయి కాణే వికటే గిరిం గచ్ఛ సదాన్వే. శిరింబిఠస్య సత్వభిస్తేభిష్ట్వా చాతయామసి." (ఋ. ౧౫-౫-౧) అదా యిని కాణే వికటే. కాణోఽవిక్రాంతదర్శన ఇత్యౌపమన్యవః. కణతేర్వా స్యాదణూభావకర్మణః. కణతిః శబ్దాణూభావే భాష్యతేఽనుకణతీతి. మాత్రాణూభావాత్ కణో దర్శ నాణూభావాత్ కాణః. వికటో విక్రాంతగతిరిత్యౌపమన్యవః. కుటతేర్వా స్యాత్ విపరీతస్య వికుటితో భవతి. గిరిం గచ్ఛ. సదానోనువే శబ్దకారికే. "శిరింబిఠస్య సత్వభిః". శిరింబిఠో మేఘః. శీర్యతే బిఠే. బిఠమంతరిక్షమ్ బిఠం వీరిటేన వ్యాఖ్యాతమ్. తస్య సత్త్వైరుదకైరితి స్యాత్తైష్ట్వా చాతయామః. అపి వా శిరింబిఠో భారద్వాజః. కాలకర్ణో పేతోఽలక్ష్మీర్నిర్ణాశయాంచకార తస్య సత్త్వైః కర్మభిరితి స్యాత్. తైస్త్వా చాతయామః. చాతయతిర్నాశనే.

సదాన్వే, శిరింబిఠః - సదాన్వే ఇత్యేతత్ పదమనవగతమ్. సదా నోనువే ఇత్యవగమః సదా శబ్దకారికే ఇత్యర్థః శిరింబిఠః ఇత్యేతదపి పద మనవగతమ్. బిఠేఽన్తరిక్షే శీర్యత ఇత్యవగమః. నిగమేనోభే ఉదాహరతి "అరాయికాణే ... చాతయామసి" శిరింబిఠస్య భారద్వాజస్యార్షమ్. అనుష్టుప్. హే అరాయి! దుర్భిక్షాధిష్ఠాతృదేవతే! అథవా హే అలక్ష్మి! కాణే! ఏక నేత్రే! మందదర్శనశక్తికే! వికటే! వికుటితగతికే! సదాన్వే దుర్భిక్షపీడితజనరవాకులే! త్వం గిరిం - పర్వతం గచ్ఛ మాత్రతిష్ఠః. తేభిస్తైః ప్రసిద్ధైరిత్యర్థః శిరింబిఠస్య మేఘస్య ఋషేర్వా భారద్వాజస్య సత్వభిః - నామభిః త్వా - త్వాం చాతయామసి — నాశయామః. అథైక పదనిరుక్తమ్ - ప్రసంగప్రాప్తం కాణం వ్యాచష్టే-కాణః కస్మాత్? అపి

క్రాంతదర్శనో భవతి యస్మాత్ తస్మాత్ కాణః ఇత్యేవమౌపమన్యవః ఆచార్యో మన్యతే. అథవా అణూభావార్థాత్ కణతేః కాణః స్యాత్. అస్య దర్శనమణు భవతి. కణతిః పునః శబ్దానుభావే భాష్యతే తద్ యథా అనుకణతీతి. మాత్రాయాః అణూభావాత్ కణః శ్యామాకాదీనామ్. వికటః కస్మాత్? విక్రాంతా వికృతా గతిర్యస్యేతి ఔపమన్యవ ఆచార్యో నిర్వక్తి. అథవా విపరీతాత్ కుటతేః వికటః స్యాత్ కుబ్జీభూత ఇత్యర్థః. శేషం యద్యప్యంతరిక్షనామసు అపఠితం తథాపి పిఠేన వ్యాఖ్యాతం పూర్వమ్. శిరింబిఠో భారద్వాజో వా స హి అనేన సూక్తేన అలక్ష్మీః నిరణాశయత్. అద్యాపి అలక్ష్మీపరిభూతాః జనాః అస్యర్షేః జలేఽవతీర్య సూక్తమేత జ్జపన్తీతి.

అర్థము :— సదాన్వే - సదానోనువే! సదా పూర్వక 'ను' ధాతువుతో యఙ్ లుగన్త 'పచాద్యచ్' గతో గుణాభావము టాప్ సదాన్వా సిద్ధమగును. సంబోధనమున హే సదాన్వే! ఎల్లప్పుడు శబ్దముచేయు దుర్భిక్షాధిదేవతే! (ఇట 'ను'ధాతువు శబ్దార్థము) దుర్భిక్షసమయమున నెల్లప్పుడు అల్లరి జరుగుచుండును. లేక హే అలక్ష్మి! వస్తువుల యభావమువలన జను లల్లరిచేయుచుందురు - దుర్భిక్షమ్ము అలక్ష్మియే ఈమంత్రమునకు దేవతలు. వర్షమువలననే దుర్భిక్షము నశించును. ఈమంత్రమున దుర్భిక్ష నాశమునకు కారణమైన వర్షము కురియింప యత్నముచేయవలెనని చెప్ప బడినది. శిరింబిఠః = పదమునకర్థము మేఘము. బిఠః అన్తరిక్షనామము, బిఠే అంతరిక్షే శీర్యత ఇతి శిరింబిఠః అంతరిక్షమున చంపబడునది. అంత రిక్షమున మేఘహననము జరుగును. మేఘహత్యవలననే వర్షమేర్పడును. శౄహింసాయామ్ ధాతువుతో శిరి సిద్ధమగును. శిరిః బిఠే యస్య సః శిరిం బిఠః = మేఘము.

మంత్రార్థము :— హే అరాయి! = ఎన్నడు నేమియు నియ్యని ఓ దుర్భిక్షదేవతే! హే అలక్ష్మి! కాణే!=వికృతదర్శనముగల ఒంటికంటి దేవతా! వికటే! = భయంకరరూపధారిణీ! సదాన్వే! = ఎల్లప్పుడు నల్లరి చేయించు దుర్భిక్షదేవతా! నీవు, గిరిం గచ్ఛ=పర్వతములపైకి పారిపొమ్ము మేము, శిరింబిఠస్య = మేఘముయొక్క. తేభిః సత్త్వభిః=జలములతో త్వా = నిన్ను, చాతయామసి నాశయామః = నశింపజేయుదుము. -సత్త్వ

శబ్దము జలవాచకము. చాతయతి నాశార్థమున ప్రసిద్ధము. దుర్భిక్షసమయ మున అలక్ష్మిరూపపిశాచము తాండవించునపుడు మనుష్యునిలో దానబుద్ధి కలుగదు. కావుననే దుర్భిక్షసమయమున అలక్ష్మికి విశేషణము 'అరాయి' ప్రయోగింపబడినది. అన్నాభావమువలన కంటిజ్యోతి తగ్గిపోవును. అందు వలననే అలక్ష్మి కాణే=ఒంటికన్నుగలదిగా చెప్పబడినది. కఱవుకాలమున ప్రాణుల నడక తడబడును. అలక్ష్మి విరూపిణియై వికటాయనబడినది. దుర్భిక్షసమయమున గృహము లల్లకల్లోలములై యల్లరితోకూడియుండును. నేడు ఇంటిలో ఇది లేదు, అదిలేదు ఎక్కడలభించును? అని జనులల్లాడు చుందురు. అందువలననే దుర్భిక్షదేవతకు 'సదాన్వే' విశేషణము వాడ బడినది. మంత్రమున కాణోఽవిక్రాంతదర్శనః దర్శనం అవ లోకనం యస్య సః - ఎవనికి ఒకనేత్రముండదో యతడు కాణః అనబడును. ఒంటి కంటివాడు. 'క్రమ్' ధాతువునకు ఘఞ్ ప్రత్యయముచేసిన క్రామ - కాణ అగును. అని ఔపమన్యవ ఆచార్యునిమతము. కణతేర్ వా స్యాత్ అణూ భావకర్మణః లేక స్వల్పార్థక కణ్ ధాతువునకు ఘఞ్ ప్రత్యయముచేసిన కాణ యగును. కణతిః శబ్దాణూభావే=మందముగా మెల్లగా మాట్లాడుట అను అర్థముగల కణధాతువుచే కణతి శబ్దమేర్పడును. అనుకణతి = నెమ్మదిగా మాటాడుచున్నాడు. మాత్రాణూభావాత్ కణః=లోకమునందు కణశబ్దము అణుభావమునందు చూడబడుచున్నది. అతిస్వల్పపరిమాణముకల వస్తువు కణము అనబడును. దర్శనలోపమువలన కాణ అనియు పరిమాణాల్పత వలన కణముఅనియు లోకవ్యవహారము. వికటః - విక్రాంతగతిః ఇతి ఔపమన్యవు. వికటః = విక్రాంతగతికలవాడు, వికృతగతికలవాడు, అని యర్థము. భయంకరవస్తువు వికృతమగును. అనిఉపమన్యుని పుత్రుడు ఔపమన్యవు అనును. విపరీతార్థక కుటధాతువువలన వికటశబ్దమేర్పడును. గిరిం గచ్ఛ = పర్వతముపైకి వెళ్లుము. సదాన్వే - శబ్దకారికే = ఎల్లపుడు శబ్దముచేయువాడు సదానవే అనబడును. కాలకర్ణ=దుర్భిక్షము, సత్వైః - సత్కర్మభిః = సాత్వికకర్మలతో జపతపదానాదికర్మలతో, త్వా = అలక్ష్మి వగునిన్ను దుర్భిక్షమును, చాతయామః = నాశము చేయుదుము. ఎవడు కంఠమువఱకు జలములో నిలబడి యీసూక్తమును జపించునో యా మనుజుడు తనదారిద్ర్యమును నాశనము చేయును.

పరాశరః - (౧౨౧).

> పరాశరః పరాశీర్ణస్య వశిష్ఠస్య స్థవిరస్య జజ్ఞే. "పరాశరః శతయాతుః వశిష్ఠః" (ఋ. ౭-౧౮-౨౧) ఇత్యపి నిగమో భవతి. ఇంద్రోఽపి పరాశరః ఉచ్యతే. పరాశాతయితా యాతూనామ్. "ఇంద్రో యాతూనామభవత్ పరాశరః" ఇత్యపి నిగమో భవతి.

పరాశరః - అనేకార్థత్వాదనవగతమ్ పరాశీర్ణజ ఇత్యవగమః. పరాశరః పరాశీర్ణస్య స్థవిరస్య వశిష్ఠస్య అజాయత. నిగమేన సమర్థయతి. "పరాశరః శతయాతుర్వశిష్ఠః" వశిష్ఠస్యేయమార్షమ్. ఐంద్రీ - త్రిష్టుప్ పరాశరః శతయాతుః వశిష్ఠః ఇత్యేవమాదయః ఋషయః. తే సఖ్యభావం నాశయన్తీత్యర్థః. ఇంద్రోఽపి పరాశరః యతః స పరా - శత్రూన్ శాతయతి. యాతూనామ్ - యాతయితవ్యానామ్ అసురాదీనామిత్యర్థః అత్రాపి నిగమః "ఇంద్రో యాతూనామభవత్ పరాశరః" పరాశరః = ఒకఋషి, పరాశీర్ణస్య స్థవిరస్య వశిష్ఠస్య = సర్వదుర్గుణనాశకుడు, అత్యంతవృద్ధుడు, అయిన వశిష్ఠునిపుత్రుడు పరాశరుడు, జజ్ఞే = పుట్టెను.

మంత్రార్థము :- హే ఇంద్ర! పరాశరఋషి శతయాతుః (ఇతడు నొకఋషి) బహుయాతు = రాక్షసులను చంపువాడు. వశిష్ఠుడు వీరెల్లరు నీమిత్రతను విడువజాలరు. ఇంద్రోఽపి పరాశర ఉచ్యతే = ఇంద్రుడును పరాశరుడనబడును, పరాన్ శత్రూన్ యాతూన్ = రాక్షసులను నాశము చేయువాడు పరాశరుడు - ఇంద్రుడు ఒకఋషిని, రాక్షసులను, శృణాతి = హినస్తి ఇతి పరాశరః = ఇంద్రః, మంత్రార్థః ఇంద్రః = ఇంద్రుడు, యాతూనామ్ = రాక్షసులయొక్క పరాశరః = నాశకుడు, అభవత్ = అయ్యెను.

క్రివిర్దతీ - (౧౨౨).

> క్రివిర్దతీ - వికర్తనదంతీ. "యత్రా వో దిద్యుద్రదతి క్రివిర్దతీ" (ఋ. ౧-౧౬౬-౬) ఇత్యపి నిగమో భవతి.

క్రివిర్దతీ - అవిజ్ఞాతమేతత్. వికర్తనదంతీత్యవగమః. తథా చ నిగమః "యత్రా వో విద్యుద్రదతి క్రివిర్దతీ అగస్త్యస్యేయ మార్షమ్. జగతీ. హే మరుతః! యత్ర-యస్మిన్ మేఘే విద్యుత్ - శస్త్రం ప్రక్షిప్తం యుష్మాభిః. తమేవ మేఘం రదతి - విలిఖతి విదారయతీత్యర్థః. క్రివిర్దతీ - వికర్తన సమర్థ దంతయుక్తేత్యర్థః. విద్యుతో విశేషణమ్

మంత్రార్థము :— హే మరుతః! = దేవతలార! యత్ర యత్ర = ఏమేఘమునందు, వః = మీయొక్క, క్రివిర్దతీ విద్యుత్ = ఖండించు దంతయుక్త ప్రక్షిప్త ఆయుధము. రదతి = వర్షింపబేయుటకు మేఘమును చీల్చివేయును. క్రివిర్దతీ = వికర్తనదంతీ = ఖండించుదంతములతో యుక్తము.

కరూళతీ - (౧౨౩).

> కరూళతీ - కృత్తదతీ అపి వా దేవం కంచిత్ కృత్తదంతమ్ దృష్ట్వైవమవక్ష్యత్. "వామంవామం త ఆదురే దేవో దదాత్వర్యమా. వామం పూషా వామం భగో వా దేవః కరూళతీ" (ఋ. ౮-౩౦-౨౮).
>
> వామం వననీయం భవతి. ఆదురిరాదరణాత్. తత్కః కరూళతీ? భగః పురస్తాత్తస్యాన్వాదేశ ఇత్యేకమ్ పూషే త్యపరమ్. సోఽదన్తకః. 'అదన్తకః పూషా' ఇతి చ బ్రాహ్మణమ్.

కరూళతీ - అనవగతమేతత్. కృత్తనవతీత్యవగమః. అపి వా కృత్త దంతం కంచిత్ దేవం విలోక్యైవమవక్ష్యత్. తథా చ నిగమః - "వామం వామం ... దేవః కరూళతీతి" వామదేవ స్యార్షమ్. ఐంద్రీ. అనుష్టుప్. హే ఆదురే! యజమాన! దేవః అర్యమా తే తుభ్యమ్ - ఆత్మనః వామం వామమ్ అతీవేష్టం ధనం దదాతు. అపి చ పూషా భగశ్చ అపి తే ఇష్టం ధనం దదాతు. కరూళతీ దేవః అపి వామం ధనం దదాతు. అత్ర కరూళతీ ఇత్యేతత్ గుణపదత్వాత్ సందిగ్ధమ్. అత్ర విచార్యతే ఏతత్పదం పూర్వ వర్తినో భగస్య విశేషణం స్యాదుత పూష్ణః? అత్రైక ఆచార్యో వదతి - సన్నిధానసామర్థ్యాత్ భగస్యైవాన్వాదేశః. అపరశ్చ కథయతి - యతః

'అదన్తకః పూషా' ఇతి బ్రాహ్మణవచనాత్ కరూళతీత్యేతత్ పదం పూష్ణో విశేషణమ్. యత్తు పూర్వేణ సంనిధానసామర్థ్యాదిత్యుక్తం తన్న - యతః యస్య యేనార్థ సంబంధః దూరస్థమపి తస్య తత్. అర్థతో హ్యసమర్థానామ్ ఆనన్తర్యమకారణమ్.తస్మాత్ శబ్దసారూప్యాదర్థోపపత్తేశ్చ కరూళతీ పూషైవ.

కరూళతీ = కృత్తదతీ = ఖండితదంతములు కలవాడు, అపివా = లేక - కృత్తదంతం కంచిత్ దేవం దృష్ట్వా=ఖండితదంతములుగల కొండొక దేవతను జూచి, ఏవమవక్ష్యత్ = ఇట్లనెను - అనియర్థము చెప్పవచ్చును.

మంత్రార్థము :- అదురే! ఆదరణీయ! యజమాన! దేవః అర్యమా = న్యాయకారియైన దేవుడు నీకు, వామం వామం = ప్రశస్త ధనమును, దదాతు = ఇచ్చుగాక! వామమ్ = ప్రశస్త, దేవః పూషా = పోషణకర్తయైన దేవుడు ప్రశస్తధనము నొసంగుగాక!, వామం దేవః భగఃకరూళతీ దదాతు = అహింసకుడు, శాంతుడునైన దేవుడు నీకు ప్రశస్త ధనము నిచ్చుకాక!.

భాష్యార్థము :- వామం వననీయం భవతి. వామ - వననీయ - సంభజనీయ = బాగుగ సేవింపదగినది ఇష్టము - ప్రశస్తము, అదురిః ఆదరణాత్ = ఆదరముచేయుటవలన ఆదురి అనబడును. దేవతలనాదరించు యజమానుడా!, తత్ కః కరూళతీ? విఱుగగొట్టబడిన దంతములు గలవాడు అనగా అహింసకశాంతచిత్తుడు. అనగా భగ - పూషా అనువానిలో కరూళతీ ఎవనికి విశేషణము? సమాధానము. భగశబ్దమునకు విశేషణము. ఏలయన పూషాకంటె భగశబ్దము ముందు ప్రయోగింపబడినది. కావున కరూళతీశబ్దము భగవిశేషణము. అనునిది యొకరిమతము. కాదు 'పూషా'కువిశేషణమని మఱియొకమతము. కరూళతీ అదంతకుడని చెప్ప బడినది. కావున నది పూషా - విశేషణమని రెండవమతము. పూషా అదంతకుడని బ్రాహ్మణవచనముకూడ చెప్పుచున్నది. కావున అర్థబల ముచే కరూళతీశబ్దము పూషాపదమునకే విశేషణమని భగమునకు కాదని నిశ్చయము.

దనః - (౧౨౪).

"దనో విశ ఇంద్ర మృధ్రవాచః" (ఋ. ౧-౧౭౪-౨) దాన మనసో నో మనుష్యానింద్ర మృదువాచః కురు.

దనః - అజ్ఞాతమేతత్. దానమనసః ఇత్యవగమః. నిగమేనోదాహరతి, "దనోవిశ ... వాచః" అగస్త్యస్యేయమార్షమ్. హే ఇంద్ర! దనః - దాన మనసః. మృధ్రవాచః ఏవ ఏతాన్ విశః - మనుష్యాన్ అస్మభ్యం కురు.

దనః - దానమనసః అనుదానికి సంక్షిప్తరూపము. దనః = దానము నిచ్చు మనస్సుగలవాడు అని యర్థము.

మంత్రార్థము :- హే ఇంద్ర! దనోవిశః = దానమిచ్చుమనస్సుగల మమ్ములను, విశః = మనుష్యులను, మృధ్రవాచః = మధురభాషణులను జేయుము.

శరారుః - (౧౨౫).

"అవీరామివ మామయం శరారురభిమన్యతే" (ఋ. ౧౦-౮౬-౯). అబలామివ మామయం బాలోఽభిమన్యతే సంశిశరిషుః.

శరారుః - అనవగతమేతత్. సంశిశరిషుః ఇత్యవగమః. తథా చ నిగమః - "అవీరామివ ... అభిమన్యతే. అవీరాం - అబలామివ అపతి గ్రహామివ మామ్ అయం బాలః - మూర్ఖః శరారుః - సంశిశరిషుః - సంశర్తు కామః శరీరం తితకురిత్యర్థః. అభిమన్యతే-క్షుద్రయా మత్యా ఇమామభి భవిష్యామీత్యేవం మన్యతే. ఇంద్రపత్న్యా ఇదం వచనమ్. సహుషస్య విషయే అన్యస్య వా కస్యచిత్. శరారుః = సంశిశరిషుః - జిఘాంసుః = చంపగోరువాడు.

మంత్రార్థము :- ఇంద్రపత్ని అనుచున్నది - అయం = ఇతడు, బాలః = మూర్ఖుడు, శరారుః = చంపగోరుచున్నవాడై, మాం = నన్ను, అవీరామివ = అబలనువలె, అభిమన్యతే = తలచుచున్నాడు. తన తుచ్ఛ బుద్ధితో ఈమెను అణచగలుగుదునని తలంచుచున్నాడు. ఈమె అబల,

ఏమిచేయగలుగును ? ఏమియు చేయజాలదు అని యనుకొనుచున్నాడు. కాని నేను వీరాంగనను - అబలను కాను.

ఇదంయుః - (౧౫౬).

**ఇదంయు రిదం కామయమానః. అథాపితద్వదర్థే భాష్యతే. వసూయురిన్ద్రో వసుమానిత్యత్రార్థః. "అశ్వయుర్గవ్యూరథ యుర్వసూయుః" (ఋ. ౧-౫౧-౧౪) ఇత్యపి నిగమో భవతి.**

ఇదంయుః - అనేకార్థత్వాదనవగతమ్. ఇదం కామయమాన ఇత్యవ గమః. యుః ఇత్యేతత్ కామయతేరర్థే కించ యుః శబ్దః తద్వదర్థేఽపి వర్తతే తద్యథా - "అశ్వయుర్గవ్యూ రథయుర్వసూయుః" ఇతి నిగమే ఇంద్రః అశ్వాదిభిః తద్వాన్.

ఇదంయుః - 'ఇదమ్' శబ్దముతో అభిలషిత పదార్థము నిర్దేశింపబడి నది ఆ వస్తువాచీశబ్దముతో ఇచ్ఛార్థమున 'యు'ప్రత్యయము చేర్చబడినది. ఎట్లన - అశ్వయుః, వసూయుః - మున్నగునవి. ఇచ్ఛార్థక యుప్రత్యయాన్త పదము లనేకములు పూర్వముదాహరింపబడినవి. అథాపి తద్వదర్థే - భాష్యతే-అపి చ మత్వర్థక యుప్రత్యయము మంత్రములందు వచ్చును. ఎట్లన :- వసూయురింద్రః - వసూయుః అర్థము వసుమాన్ అని గ్రహింపబడినది. ఈమత్వర్థక 'యు' ప్రత్యయాన్తపదముగల మంత్రమిట నిచ్చుచున్నారు. అశ్వయుః - ఇత్యాది.

మంత్రార్థము :- అశ్వయుః = గుఱ్ఱములుకలవాడు, గవ్యుః = మంచిగోవులుకలవాడు, రథయుః=రథములుకలవాడు, అట్లే వసూయుః = ఉత్తమధనయుక్తుడై ఇంద్రుడు ప్రజలకు ఇయ్యదగిన ధనములకు స్వామి యగుచున్నాడు.

కీకటేషు - (౧౫౭).

**"కిం తే కృణ్వన్తి కీకటేషు గావో నాశిరం దుహ్రే న తపన్తి ఘర్మమ్. ఆనో భర ప్రమగందస్య వేదో నైచాశాఖం మఘవన్ రన్ధయా నః" (ఋ. ౩-౫౩-౧౪).**

కిం తే కుర్వన్తి కీకటేషు గావః. కీకటో నామ దేశోఽనార్య
నివాసః. కీకటాః కిం కృతాః, కిం క్రియాభిరితి ప్రేప్సా వా.
నైవ చాశిరం దుహ్రే న తపన్తి ఘర్మం హర్మ్యమాహర
నః ప్రమగందస్య ధనాని. మగందః కుసీదీ. మాగందో
మామాగమిష్యతీతి చ దదాతి తదపత్యం ప్రమగందోఽ
వ్యత్యన్త కుసీది కులీనః. ప్రమదకో వా యోఽయమేవాస్తి
లోకో న పర ఇతి ప్రేప్సుః. పండకో వా. పండకః పండగః
ప్రార్దకో వా ప్రార్దయత్యాండావాండావాణీ ఇవ వ్రీడయతి
తత్స్తంభే. నైచాశాఖం నీచాశాఖో నీచైః శాఖః. శాఖాః
శక్నోతేః. ఆణిరరణాత్. తన్నో మఘవన్ రంధయేతి
రధ్యతిర్వశగమనే.

కీకటేషు - అనవగతమేతత్. కిం కృతాః ఇతి శబ్దసమాధిః. కిం క్రియాభిరితి వా. నిగమేనోదాహరతి - "కిం తే కృణ్వన్తి మఘవన్రంధయా నః", విశ్వామిత్రస్యేయమార్షమ్. ఐంద్రీ త్రిష్టుప్. హే ఇంద్ర! కీకటేషు అనార్యదేశ నివాసిషు మనుష్యేషు తాః గావః తే - తవ కిమ్ - కముపకారం కృణ్వన్తి? కుర్వన్తి న కమపి ఇత్యర్థః. నాశిరం దుహ్రే - నాప్యాశిరార్థం దుహ్యన్తే నాపి ఘర్మే తప్యమానేఽగ్నిభావం గచ్ఛన్తి. అగ్నిహోత్రాదిషు చేతరాస్వపి క్రియాస్విత్యర్థః. తాః గాః నః ఆభర - ఆహర తాభిః వయం తవోపకరిష్యామః. ప్రమగందస్య - వృద్ధ్యా - జీవినః వేదే - ధనమపి చ నైచాశాఖం నీచకులప్రసూతస్య హీనకులస్యేత్యర్థః యద్ధనం తదపి నః రంధయ - సంసాధయ. అథైకపదనిర్వచనమ్-కీకటాః కస్మాత్? యస్మాత్ తే కిమపి న కుర్వన్తి దేవపితృమనుష్యాదీనాం ముఖ్యక్రియాభిః తస్మాత్ తే కీకటా ఉచ్యన్తే. అథవా యే నాస్తికాః సన్తః క్రియాభిః - దేవతాతిథిసేవాదూపాభిః కిమ్ - కో లాభః ఇత్యేవం వదన్తి తే కీకటాః అనార్యా ఇత్యర్థః. మగందః కస్మాత్? మామ్ ఇయాత్ ఇత్యేవం విచార్య యః పరేభ్యో ధనం దదాతి స మగన్దః - కుసీదాజీవీ. మామ్+గమ్+ద మగంధః. తస్య అపత్యం పుమాన్ ప్రమగందః అపత్యార్థే ప్ర. ప్రస్కణ్వస్యేతివత్. అథవా ప్రమదకః ప్రమాదశీలః పరస్మిన్ లోకేఽవిశ్వాస

పరాయణః నాస్తికః ఇత్యర్థః. అథవా పండకః - నపుంసకః ప్రమగందః స్యాత్ పండం గచ్ఛతీతి సతః.

అర్థము :- కీకటేషు = కీకటో నామ దేశః = కీకటమను దేశము. అనార్యనివాసః = అనార్యులుండుదేశము. కీకటాః-నిర్వచనమ్ కిం కృతాః- కిం కృతం యైః తే=నింధితకర్మలొనర్చువారు, వా=లేక, కిం క్రియాభిః ?= యాగాదులు, సంధ్యావందనాదులు మున్నగు సత్కర్మలనొనర్చిన, కిమ్ ?= ఏమికలుగును ? అనునిట్టి, ప్రేప్స = తాత్పర్యముకలవారు - కింకృతులు అనబడుదురు. కీకటాః = కీకటులు.

మంత్రార్థము :- హే ఇంద్ర ! కీకటేషు = అనార్యదేశములందు, గావః = ఉన్నగోవులు, కిం తే కృణ్వన్తి=మీకేమి చేయుచున్నవి.?, నాశిరం దుహ్రే = అనార్యులు వానిపాలు పిండరు, న ఘర్మం తపన్తి = గోఘృతా లతో అగ్నిహోత్రాదిక్రియలు చేయరు, ప్రమగందస్య = వడ్డీతో బ్రతుకు వాని, వేదః = ధనమును, నః ఆభర=మాకు తెచ్చియిమ్ము, మఘవన్ ! = హే యింద్ర !, నః = మాలో, నైచాశాఖం రంధయ = అపనతవంశజులను- వాని, ధనమును నశింపజేయుము నీవు వశపఱచుకొనుము, న తపన్తి ఘర్మం హర్మ్యం=అగ్నిహోత్రాది ధర్మకర్మలాచరింపరు, ప్రమగందస్య= వడ్డీవ్యాపారుల ధనమును, నః ఆభర = మాకిమ్ము. మగందః = వడ్డీతో జీవించువాడు, ఈధనము ద్విగుణము త్రిగుణమునై మరల నాకు తిరిగి వచ్చునను కోరికతో నితరులకు ధనమునిచ్చువాడు మగందుడనబడును. వాని మగసంతానము (మగందస్య అపత్యంపుమాన్) ప్రమగందు డనబడును. అత్యంతకుసీదకులీనః = మిక్కిలిగా వడ్డీసంపాదించువాడు ఈలోకముతక్క మఱియొకలోకములేదని వడ్డీలధనముతో భోగములననుభ వించు పాషండుడు - ప్రమగందుడనబడును. వా లేక - ప్రమగందుడు = పండకః పండగః - పండకుడనబడును. పండకుడనగా షండుడు=నపుంస కుడు - నీచకర్మలొనర్చువాడు. నైచాశాఖమ్ - నీచాశాఖః - నీచైఃశాఖః - నీచైఃశాఖా సంతానాదిరూపా యస్య - సః నీచాశాఖః. తస్య ఇదం స్వం నైచాశాఖమ్. శాఖాః శక్నోతేః 'శక్ల' శక్తౌ ధాతువుతో శాఖాశబ్దము సిద్ధించును. వృక్షమున శాఖలు వ్యాపించునట్లు వంశము సంతానముతో వ్యాపించును. అణిః అరణాత్ - అరణాత్ = గమనముచేయుటవలన రధ్యతర్పశగమనే-

'రథ వశగమనే' ధాతువువలన రథ్యతి అగును. 'మా రథామ ద్విషతే = ద్వేషించువానివశము కాకుందుముగాక !.

బున్దః - (౧౨౮).

**బుంద ఇషుర్భవతి. బుందో వా భిందో వా భయదో వా భాసమానో ద్రవతీతి వా. "తువిక్షం తే సుకృతం సూమయం ధనుః సాధుర్బుందో హిరణ్యయః. ఉభా తే బాహూ రణ్యా సుసంస్కృత ఋదూపే చిదృధూవృధా" (ఋ. ౮-౭౭-౧౧) తువిక్షం బహువిక్షేపం మహావిక్షేపం వా తే సుకృతం సూమయం సుసుఖం ధనుః. సాధయితా తే బున్దో హిరణ్యయః. ఉభౌ తే బాహూ రణ్యౌ వా మర్మ ణ్యర్ధనవేధినౌ గమనవేధినౌ వా.**

బున్దః - ఇత్యేతదనవగతమ్ - భిన్దో వా భయదో వా భాసమానో ద్రవతి వేతి శబ్దనమాధయః. ఇషురితి అభిధేయాఖ్యానమ్. నిగమేనోదాహరతి - "తువిక్షం తే ... చిదృధూవృధా" కురుసుతస్యేయమార్షమ్. హే ఇంద్ర! తువిక్షం - బహువిక్షేపమ్, సుకృతం - శోభనకర్మకారిణమ్ సూమయం - సుహ్రూహాం సుఖకరమ్. ధనుః సాధుః - స్తోమానాం శత్రుసార్థానాం చ సాధయితా బుందః - ఇషుః హిరణ్యయః - హిరణ్యవికృత ఇత్యర్థః తే ఉభౌ బాహూ ఉభావపిబాహూ రణ్యౌ - రమణీయౌ అథవా యుద్ధయోగ్యౌ సుసంస్కృతౌ - సమ్యగ్ అలంకృతౌ ఋదూపే - అర్ధనేన గమనేన శత్రూణాం పాతయితారౌ ఋదూవృధామర్మవేధినౌ ఇత్యర్థః. అత్ర ధనుః సాహచర్యాత్ - బుందః ఇషుః. అన్యత్ సుస్పష్టముదాహరణం ప్రాహ - "నిరావిధ్యద్ ... స్వాతతమ్" బహూనాం మేఘానాం మధ్యే పన్నామ్ - ఉదకదానసమర్థమ్ మేఘమ్ ఇంద్రః నిరావిధ్యత్ అథ చ స్వాతతమ్ - ఆకర్ణమాకృష్టమ్ బుందమ్ - ఇషుమ్ ఆధారయత్ తదేవమాకర్షణ - సంబంధాత్ బుందః ఇషురేవ.

అర్థము :— బుందః = ఇషుః - బాణము బుందము - భిందము అనియు నందురు. 'భిదిర్' విదారణే ధాతువు-ఘఞ్ప్రత్యయముతో భిందమగును. భిన్దతి = ఛేదించును కావున భిందమనబడును. భిందమే

భందము బుందము అయినది. బాణము భయము కలిగించును. కావున భయదము అనబడును భాసమానో ద్రవతి = మెఱయుచు గమించును కావున - బుందమనబడును, భాస్ + ద్రు బుందయగును.

మంత్రార్థము :— హే ఇంద్ర! తువికమ్=బహువిక్షేపము చేయువాడు - చాలదూరము బాణములను విసురువాడు, సుకృతం సూమయం= నీధనువు సుఖప్రదము, హిరణ్యయః = సువర్ణమయము, సాధుః - అభీష్టమును సిద్ధింపజేయునది. తే ఉభా బాహూ=నీరెండు బాహువులు, రణ్యా= రణయోగ్యములు, లేక రమణీయములు, సుసంస్కృతే=బాగుగ నలంకరింపబడినవి, ఋదూపే = బాణములను వదలి శత్రుపాతమొనర్చునవి, ఋదూవృధా = మర్మభేదము చేయునవి.

భాష్యార్థము :- తువికమ్ = బహువిక్షేపమ్ బహుబాణములను బహుదూరము విసురువాడు, సుకృతమ్=బాగుగ చేయబడిన లేక ఉత్తమ కార్యము, సూమయం = సుఖప్రదము. ధనుః = ధనుస్సు, తే బుందః = నీబాణము, హిరణ్యయః = హేమమయము, ఉభౌ తే బాహూ రణ్యౌ = నీరెండుబాహువులు రమణీయములు, సాంగ్రామ్యౌ = సంగ్రామయోగ్యములు, ఋదూపే అర్దనపాతినౌ గమనపాతినౌ శబ్దపాతినౌ=గతితో శత్రువుల పతనమొనర్చునవి, శబ్దపాతినౌ = శబ్దముతోనె శత్రువుల భేదించునవి, మర్మాణి అర్దనవేధినౌ = మర్మస్థలములను భేదనమొనర్చునవి. మఱియొక బుందప్రయోగమంత్రః.

> "నిరావిధ్యత్ గిరిభ్య ఆధారయత్ పక్వమోదన మింద్రో బుందం స్వాతతమ్" (ఋ. ౮-౭౭-౬) నిరవిధ్యత్ గిరిభ్యః. ఆధారయత్ పక్వమోదనమ్ ఉదకదానమ్ మేఘమ్. ఇంద్రో బుందం స్వాతతమ్.

మంత్రార్థము :— ఇంద్రః = ఇంద్రుడు, బుందం స్వాతతం = బాణమును బాగుగలాగి, గిరిభ్యః = మేఘములనుండి, పక్వం = బాగుగ పక్వమైన జలముతోనిండియున్న మేఘమువలె, నిరావిధ్యత్ = భేదించెను ఆధారయత్ = చీల్చివేసెను. అందువలన వర్షమేర్పడెను.

భాష్యార్థము :- నిరవిధ్యత్ గిరిభ్యః=మేఘములనుండి ఛేదించెను. అధారయత్ = మేఘమును ఛేదించెను, పక్వమ్ ఓదనమ్ = పక్వము చేయబడిన ఓదనమును జలదానయోగ్యమేఘమును ఛిన్నభిన్నముచేసెను జలము వర్షరూపమున భూమినిజేరెను.

వృందమ్ - (౧౨౯)

వృంద – బున్దేన వ్యాఖ్యాతమ్.

వృన్దమ్-వృందమ్ ఇత్యేతత్ బుందేనైవ వ్యాఖ్యాతమవధారణీయమ్. వృన్దారకశ్చ ఇత్యేదపి బున్దేనైవ వ్యాఖ్యాతం జ్ఞాతవ్యమ్. ప్రకరణతః కశ్చిద్ వన్యో గజః అపి వృన్దారక పదవాచ్యః సంభవతి

వృన్దః - అనునీపదము బున్ద పదమువలెనే వ్యాఖ్యానము చేయబడి నట్లెంచవలయును. వ్యుత్పత్తి అర్థములు బున్దపదమునకెట్లో యట్లే వృన్ద పదమునకును గలవు. వృన్దము = సమూహవాచకము, వృన్దారకశ్చ = వృందారకముకూడ బున్దపదమువలె వ్యాఖ్యానింపబడినదని యెంచునది, వృన్దారకము - వన్యగజము - అడవియేనుగునకును నామము. ప్రకరణ మునుబట్టి మఱియొకటియు కావచ్చును. వృన్దారకపదము పూజా వాచకము, మఱియు సమూహవాచకము

కిః - (౧౩౦).

"అయం యో హోతా కిరు స యమస్య కమప్యూహే యత్సమంజన్తి దేవాః. అహరహర్జాయతే మాసి మాస్యథా దేవా దధిరే హవ్యవాహమ్" (ఋ. ౧౦-౫౨-౩) అయం యో హోతా కర్తా స యమస్య కమప్యన్నమ్, అభివహతి యత్ సమశ్నువన్తి దేవాః అహరహర్జాయతే మాసే మాసే, అర్ధమాసేఽర్ధమాసే వా. అథ దేవా నిదధిరే హవ్యవాహమ్.

కిః అనవగతమేతత్ కర్తా ఇత్యవగమః. నిగమేన ప్రతిపాదయతి - అయం యో హోతా కిరు ... హవ్యవాహమ్" విశ్వేదేవానామియమార్షమ్. ఆగ్నేయీ అయం యః అగ్నిః పార్థివః దేవానాం హోతా - ఆహ్వాతా యమస్య కిః ఉ సః. స యమస్య భగవతః ఆదిత్యస్య కర్తా తథా

చోక్తమ్. "ఏష ప్రాతః ప్రసువతి, తస్మాత్ ప్రాతః సోపతిష్ఠంతే అపి చ కమ్ - అన్నమపి ఊహే - అభివహతి. అహరహః-ప్రతిదినం హోతౄణాం గృహేషు జాయతే. మాసి మాసి చ పితృయజ్ఞేషు అర్ధమాసే అర్ధమాసే చ దర్శపూర్ణమాసేషు అథ - అతఏవ దేవాః హవ్యవాహమ్ - హవిషామ్ వోఢారమేనం దధిరే-నిదధిరే. అత్ర యమస్య షష్ఠీయోగాత్ కిః ఇత్యేతస్య పదస్య కర్తా ఇత్యర్థః సంపద్యతే.

కిః = కర్తా, కృ ధాతువునకు ఇన్‌ప్రత్యయము, ఋకారమునకు లోపము కిః సిద్ధము.

మంత్రార్థము :- యః అయమ్ హోతా = ఏ యజ్ఞాగ్ని కలదో, సః యమస్య కిః = అది యమస్య = ఆదిత్యునకు, కిః కర్తా = కర్త, 'అగ్నేర్వా ఆదిత్యో జాయతే ఇతి శ్రుతేః' (అగ్నినుండి ఆదిత్యుడు ఉత్పన్నుడగుచున్నాడు - అని శ్రుతిః) ఈయగ్ని కమ్ అపి ఊహే = అన్నమును కూడ వహించుచున్నది. అన్నము అగ్నివలననే యేర్పడుచున్నది. "అగ్నౌ ప్రాస్తాహుతిః సమ్యగాదిత్యముపతిష్ఠతే. ఆదిత్యాజ్జాయతే వృష్టిః వృష్టే రన్నం తతః ప్రజాః" = అగ్నియందుంచబడిన ఆహుతి ఆదిత్యుని జేరును. ఆదిత్యునివలన వృష్టి, దానివలన అన్నము, తదుపరి ప్రజా, కమ్ = అన్నమునకు పేరు, యత్ = ఆ యున్నమును, దేవాః = దేవతలు, సమం జంతి = తిందురు, ఇట అంజూధాతువునకు ప్రకరణవశమున భోజనము - తినుట యని అర్థము. ఈయగ్ని, అహరహః = ప్రతిదినము, అగ్ని హోత్రులయింట ఉత్పన్నమగును, అర్ధమాసే, మాసి మాసి చ అమావాస్యాపూర్ణిమలందు, ప్రతిమాసమునందు పితృయజ్ఞమునందును ఇష్టులందును ప్రజ్వలింపచేయబడును. కావుననే దేవాః = దేవతలు, హవ్యమును, వహించు అగ్నిని = యజ్ఞాగ్నిని ధారణచేయుచున్నారు. (నిదధిరే).

ఉల్బమ్ - (౧౩౧).

**ఉల్బమూర్ణోతే ర్వృణోతేర్వా. "మహత్తదుల్బం స్థవిరం తదాసీత్" ఇత్యపి నిగమో భవతి.**

ఉల్బమ్ - అనపగతమేతత్ - జరాయురిత్యవగమః. ఊర్ణోతేః వృణోతేర్వేతి ధాతునిర్దేశః. నిగమేన సమర్థయతి - "మహత్తదుల్బం స్థవిరం

తదాసీత్" మహత్ - మహాపరిమాణమిత్యర్థః తదుల్బం జరాయు ఆసీత్. స్థవిరం - చిరన్తనమ్. యేన త్వమావేష్టితః హే అగ్నే! త్వం పూర్వం ప్రవిష్టవానసి. ఏవమావేష్టనసంబంధాత్ ఉల్బం జరాయు.

ఉల్బం - జరాయు ఆవరణము, ఊర్ణోతేః - 'ఉర్ణుఞ్ ఆచ్ఛాదనే' వలన ఉల్బ మేర్పడును. వృణోతేర్వా లేక 'వృఞ్'ధాతువుతో సిద్ధమగును. గర్భము జరాయువు - ఉల్బముతో ఆచ్ఛాదితము, లేక పరివేష్టితమై యుండును. కప్పబడి చుట్టబడి యుండును.

మంత్రార్థము :- తత్ = ఆ ఉల్బము జరాయువు, మహత్ = గొప్పది, స్థవిరమ్ = స్థూలము పురాతనము, ఆసీత్ = ఉండెను.

ఋబీసమృబీసమ్ - (౧౩౨)

(ఇతి ద్వాత్రింశచ్ఛతమ్ పదాని)

**జహా నస్ని మాశుశుక్షణిస్త్రీణి. ఇతి నిఘంటౌ షష్ఠోఽధ్యాయః.**

**ఋబీసమపగతభాసమపహృత భాసమంతర్హితభాసం గత భాస వా.**

ఋబీసం ఋబీసం - అనవగతమేతత్. అపగతభాసమ్, అపహృత భాసం, అంతర్హితభాసం, గతభాసం, వేతి శబ్దసమాధయః. తథా చ నిగమః- "హిమేనాగ్నిం ... స్వస్తి" కలీవతఆర్షమ్. త్రిష్టుప్, అశ్వినీ. హే అశ్వినౌ! హిమేన - ఉదకేన అతిప్రవృద్ధమ్ గ్రీష్మస్యాన్తే అగ్నిం - అగ్నివత్తీక్ష్ణమ్, ఘ్రంసం = అహః ఇమాన్ లోకాన్ దిధక్షంతమివ యువాం అవారయేథామ్. ఏతుమత్రం - అన్నవతిం ఊర్జం అస్మై అగ్నయే అధత్తమ్. హే అశ్వినౌ! ఋబీసే - పృథివ్యాం అగ్నిరనుప్రవిష్టోఽన్తః. తం ఉత్ నిన్యథుః. సర్వగణం - సర్వనామానమ్. స్వస్తి - స్వస్త్యయనార్థం అస్య విశ్వస్య జగతః. ఏవమత్ర ఋబీసశబ్దేన పృథివీ ఇత్యుచ్యతే. ఋబీసం = పృథివీ, ఏలయన ఈపృథివి - అపగతభాసం=ప్రకాశరహితము, అపహృతభాసం = దీనినుండి ప్రకాశమపహరింపబడినది, అంతర్హితభాసంవా = దీనియందు ప్రకాశితమంతర్హితమై యున్నది. ఈకారణములవలన పృథివిని ఋబీస మనుచున్నారు.

"హిమేనాగ్నిం ఘ్రంసమవారయేథామ్. పితుమతీమూర్జ మస్మా అధత్తమ్. ఋబీసే అత్రిమశ్వినావనీత మున్నిన్య థుః సర్వగణం స్వస్తి" (ఋ. ౧-౧౧౬-౮) హిమేన ఉదకేన గ్రీష్మాంతే అగ్నిమ్ ఘ్రంసమహరవారయేథామ్ అన్నవతీం చాస్మా ఊర్జమధత్తమగ్నయే యోఽయమృబీసే పృథివ్యామగ్నిరంతరౌషధివనస్పతిష్వప్సు తమున్నిన్యథుః సర్వగణం సర్వనామానమ్. గణో గణనాద్ గుణశ్చ. యద్వృష్ట ఓషధయః ఉద్యన్తి ప్రాణినశ్చ పృథివ్యాం తదశ్వినోః రూపం తేనైతౌ స్తౌతి స్తౌతి.

గణః కస్మాత్ ? స హి యస్మాత్ బహుసంయోగాత్ గణ్యతే. గుణోఽపి అస్మాదేవ గణధాతోః. అసావపి గణ్యతే ఏవ-ద్విగుణః త్రిగుణః ఇతి అధునాస్య మంత్రస్య సంగత్యర్థం భాష్యకృత్ బ్రూతే యద్వృష్ట ఓషధయః ఉద్యన్తి ఇత్యాదినా అశ్వినోః మహాభాగ్యమేవ.

మంత్రార్థము :- హే అశ్వినౌ ! మీరు హిమేన=వర్షపుశీతలజలముతో, గ్రీష్మ - అంతమున, అగ్నిం ఘ్రంసం = అగ్నివలె సంతప్తదినమును, అవారయేథామ్ = దూరముచేయుదురు. మఱియు, ఋబీసే = పృథివి యందలి, అవనీతం అంతర్హితం = భూమియందు దాగియున్న అగ్నిని, ఉన్నిన్యథుః = బయటికి తీయుదురు, అస్మై = ఈ అగ్ని హోత్రునికొఱకు లేక సర్వప్రాణులకొఱకు. పితుమతీం = అన్నముతోనింపి, ఊర్జం = బల మును, అధత్తం = దానముచేయుదురు, సర్వగణం స్వస్తి=సర్వప్రజలకు కల్యాణము - శుభము - కలుగుగాక ! గ్రీష్మ - ఋతువునందు సంతప్త ప్రాణులకు వర్షర్తువుయొక్క శీతలజలమే శాంతిని ప్రసాదించును, యః అయం అగ్నిః = ఈ యగ్ని, ఋబీసే = పృథివియందలి, అంతరౌషధి వనస్పతిషు = ఓషధులందు వనస్పతులందు, అప్సు = జలములందు ఉన్నది. ఆయగ్నిని మీరు వీనినుండి, ఉన్నిన్యథుః = వెలికితీయుదురు, గ్రీష్మమునందు తాపముచే శుష్కించి వాడియున్న ఓషధ్యాదులను శాంతింపజేయుదురు. వానిని ఉజ్జీవింపజేసి భూమిని సస్యశ్యామలము చేయుదురు, సర్వగణం సర్వనామానాం = సర్వవస్తుసమూహమును -

పదార్థమాత్రమును అని యర్థము. ఈ యగ్నియే ఓషధి, వనస్పతి మున్నగు నానావిధనామములతోనెప్పు సమస్తపదార్థములందును అవస్థితమై యున్నది. ఈనామములన్నియు అగ్నివే. ఏలయన అగ్నివలననే యివి యన్నియు నుత్పన్నము లగుచున్నవి. గణో గణనాత్ = గణనవలననె గణమనబడుచున్నది, గణమన సమూహము. గణమునందలి వస్తువు లన్నియు గణింపబడును - లెక్కింపబడును. కావున గణము. 'గణ సంఖ్యానె ధాతువుతో గణశబ్దము సిద్ధమగును. గుణశ్చ గుణశబ్దముకూడ గణధాతుసిద్ధమే. గుణముకూడ లెక్కింపబడును. ద్విగుణము త్రిగుణము చతుర్గుణము అని, యత్వృష్టే ఓషధయ ఉద్యన్తి = వర్షము కురిసిన మీదటనే ఓషధులు వనస్పతులు నన్నియు అంకురించును - ఉజ్జీవితము లగును, ప్రాణినశ్చ పృథివ్యాం=భూమిపైనున్న ప్రాణులన్నియు జీవనము నొంది ప్రకాశించును. తద్ అశ్వినో రూపం = ఇదియంతయు అశ్వినుల రూపమే, తేన = ఆకారణముచేతనే, ఏతౌ స్తూతి = ఈ యశ్వినుల స్తుతి చేయబడినది. రెండవస్తుతి శబ్దము అధ్యాయసమాప్తి సూచకము. ఇతి నిరుక్తే పూర్వషట్కే షష్ఠో అధ్యాయః నైగమకాండే పూర్వార్ధం సమాప్తము.

నిరుక్తమున పూర్వషట్కమున నాఱవ యధ్యాయము సమాప్తము. నైగమకాండమున పూర్వార్ధము సమాప్తము.

సకలశాస్త్ర నిష్ణాత - పండిత శ్రీ ముక్తి రామోపాధ్యాయ శిష్య కళా ప్రపూర్ణ పండిత గోపదేవ విరచిత - ఆంధ్రానువాదము.



# అథ దైవతకాండమ్

## (దైవతకాండము)

## సప్తమాధ్యాయము

### ప్రథమపాదము

**అథాతో దైవతమ్.**

అథ - నైఘంటుక - నైగమకాండానంతరమున అతః = ఇటనుండి దైవతమ్ = దైవతకాండము ప్రారంభింపబడుచున్నది.

**తద్యాని నామాని ప్రాధాన్యస్తుతీనాం దేవతానాం తద్దైవత మిత్యాచక్షతే.**

యాని నామాని ప్రాధాన్యస్తుతీనామ్ అగ్న్యాదీనాం దేవతానాం తద్దైవత ప్రకరణమాచార్యాః ఆచక్షతే. నిఘణ్టు వేఽస్మిన్ ప్రకర సంజ్ఞేత్యభిప్రాయః.

తద్ = ఇది ప్రారంభార్థము. ప్రాధాన్యస్తుతీనాం = ప్రాధాన్యేన = ముఖ్యముగా నేదేవతల స్తుతిచేయబడినదో, దేవతానాం=ఆ అగ్ని మున్నగు దేవతలయొక్క, యానినామాని = ఏనామములు గలవో, తద్ దైవతం = అది దైవతప్రకరణమని, ఆచక్షతే = ఆచార్యులు చెప్పుచున్నారు.

**సైషా దేవతోపపరీక్షా.**

యా ప్రకరణోపన్యాసేనైవావసరప్రాప్తా ఏతైకస్యా దేవతాయా అగ్న్యాదేః ఉపగమ్యోపగమ్య పరీక్షా వక్ష్యత ఇతి వాక్యశేషః. పరీక్షా చ తన్నామప్రవృత్తి - తత్స్తుత్యుదాహరణ - తన్నిర్వచనాత్మకాత్ర బోధ్యా.

సా ఏషా = ఆ యీ, దేవతేపపరీక్షా = దేవతలకు సంబంధించిన, సామాన్యతః = సామాన్యముగాను, విశేషతః = విశేషముగాను, పరీక్షా = పర్యాలోచనము.

**యత్కామ ఋషిర్యస్యాం దేవతాయామార్థపత్యమిచ్ఛన్ స్తుతిం ప్రయుంక్తే తద్దైవతః స మంత్రో భవతి.**

యమర్థం కామయమానః, ఋషిర్యస్యాం దేవతాయామభిష్టుతాయాం ఆర్థపత్యం అర్థ - పతి - భావం స్వామిత్వమిచ్ఛన్ అముష్యా దేవతాయాః ప్రసాదేనాహమముష్యార్థస్య పతిస్స్యామీత్యేతాం బుద్ధిం పురోధాయ స్తుతిం ప్రయుంక్తే తద్దైవతః తద్దేవతాక ఏవ స మంత్రో భవతి. ఏతన్మంత్రే దేవతాజ్ఞానలక్షణమ్.

అర్థము :— యత్కామః = ఏవస్తువును కామించుచు, ఋషిః = ఋషి, యస్యాం దేవతాయాం = ఏదేవతాస్తుతిని చేసినమీదట, ఆర్థపత్యం= అర్థపతిత్వమును, (అనగా ఫలానదేవతను స్తుతించిన ఫలానార్థమునకు పతినగుదును) ఇచ్ఛన్ = కోరుచు, స్తుతిం ప్రయుంక్తే = స్తుతిజేయునో, స మంత్రః = ఆ మంత్రము, తద్దైవతః = ఆదేవతకు చెందినదని యెంచవలెను.

**తాస్త్రివిధా ఋచః. పరోక్షకృతాః. ప్రత్యక్షకృతాః. ఆధ్యాత్మిక్యశ్చ.**

తత్ర - తస్మిన్ త్రైవిధ్యే పరోక్షకృతానామృచామేతల్లక్షణం భవతి. నామవిభక్తిభిః నామ్నః ప్రాతిపదికస్య ఏతేన తిఙాం వ్యుదాసః. ఆఖ్యాతస్య తిఙన్తస్య.

ప్రాయః = తఱచుగా ఋక్కులు, తిరోహితార్థములు. వానినే మనస్సునందుంచుకొని చెప్పుచున్నాడు. తాః ఋచః = ఆ ఋక్కులు, త్రివిధాః = ముప్విధములు, పరోక్షకృతాః = పరోక్షరూపముతో కొండొక యర్థమును ప్రకటించునవి, ప్రత్యక్షకృతాః = ప్రత్యక్షరూపముతో నొక యర్థమును తెలుపునవి, ఆధ్యాత్మిక్యః = ఆత్మ పరమాత్మలకు సంబం

ధించిన యర్థములను దెలుపునవి. ఇట్లు - ఋక్కులు పరోక్షకృతములు, ప్రత్యక్షకృతములు, ఆధ్యాత్మికములు నని మువ్విధములు.

తత్ర పరోక్షకృతాః సర్వాభిర్నామవిభక్తిభిర్యుజ్యన్తే ప్రథమ పురుషైశ్చాఖ్యాతస్య.

తత్ర = వానియందు, పరోక్షకృతాః = పరోక్షకృతమంత్రములు, సంపూర్ణనామ విభక్తులతో, తిఙన్తప్రథమపురుషతోను కూడియుండును. ప్రత్యేకవిభక్తికి సంబంధించిన ఉదాహరణములు క్రమముగా :-

"ఇంద్రో దివ ఇంద్ర ఈశే పృథివ్యాః" (ఋ. ౧౦-౮౯-౧౦)

ఇంద్రో దివః స్వర్గస్య ఈశే ఈష్టే ఇంద్ర ఏవ పృథివ్యాః ఈష్టే. ప్రథమాయామేతదుదాహరణమ్. స్వర్గస్య పృథివ్యాశ్చేంద్ర ఏవ ప్రధానః స్వామీత్యర్థః.

ఇంద్రుడు ద్యులోకమునకు పృథివీలోకమునకు స్వామి. ఈమంత్రమున ఇంద్రప్రథమావిభక్తి. అట్లే ఈశే ప్రథమపురుష.

"ఇంద్రమిద్ గాథినో బృహత్" (ఋ. ౧-౭-౧).

హే గాథినః ! సామగాః ! ఇంద్రమిత్ ఇంద్రమేవ యూయమ్ బృహతా సామ్నా అభిష్టుత.

గాథినః ! = ఓ సామగానమొనర్చు మానవులారా !, ఇంద్రమ్ ఇత్ = ఇంద్రునే, బృహతా సామ్నా = బృహత్సామముతో స్తుతియింపుడు. ఇట ఇంద్రమ్ ద్వి - వి.

"ఇంద్రేణైతే తృత్సవో వేవిషాణాః" (ఋ, ౭-౧౮-౧౫)

తృతీయాయామేతదుదాహరణమ్. ఇంద్రేణైతే మేఘాః వేవిషాణా వ్యాప్నువానాః తృత్సవో దారయితవ్యాః.

ఇంద్రేణ = ఇంద్రునిచే, తృత్సవః=దారయితవ్యములు = ఛేదింప దగినవి. ఏతే = ఈ, మేఘాః = మేఘములు, వేవిషాణాః = మాటిమాటికి వ్యాప్తములగుచు పెరుగుచున్నవి. ఇట ఇంద్రపదము ఇంద్రేణ అని తృతీయావిభక్తికి ఉదాహరణము.

"ఇంద్రాయ సామ గాయత" (ఋ. ౮-౯౮-౧).

హే ఉద్గాతారః! ఓ ఉద్గాతలార! ఇంద్రునికొఱకు బృహత్సామము గాయత = గానమొనర్పుడు. ఇంద్రాయ - చతుర్థీవిభక్తి.

"నేంద్రాదృతే పవతే ధామ కించన" (ఋ. ౯-౬౯-౬).

నేంద్రాదృతే ప్రాతఃసవనాదీనాం కించిన కించిదపి ధామ పవతే-పూయతే. ఇంద్రమేవైతే వ్యాప్నువన్తీతి. ఇంద్రాత్ఋతే=ఇంద్రుడు లేక యేస్థానము పవిత్రముకాదు. ఇట - ఇంద్రాత్ - పంచమీవిభక్తికి ఉదాహరణము.

"ఇంద్రస్య ను వీర్యాణి ప్రవోచమ్" (ఋ. ౧-౩౨-౧).

యాని చకార ప్రథమాని వజ్రీత్యగ్రిమభాగః. ఇంద్రస్య అహం వీర్యాణి వీరకర్మాణి ప్రవోచమ్ ప్రబ్రవీమి. యాని చకార ప్రథమాని అకృతపూర్వాణి అన్యైః. వజ్రీ వజ్రసంయుక్త ఇంద్రః.

ఇంద్రునియొక్క పరాక్రమములు వర్ణింతును. ఇంద్రస్య-ఇంద్రుని యొక్క ఇది షష్ఠీవిభక్తి.

"ఇంద్రే కామా అయంసత ఇతి.

ఇంద్రే కామాః మనోరథాః అయుంసతదివ్యాసః పార్థివా ఉత. హే స్తోతారః! యే దివ్యాః కామాః యే చ పార్థివాః తే ఇంద్రే ఏవ ఉపనిబద్ధాః, తం ప్రార్థయత స హి కామానామీష్టే. సప్తమ్యామేతదుదాహరణమ్.

ఇంద్రే = ఇంద్రునియందు, దివ్యాసః = దివ్యములు, పార్థివాః = పార్థివములు నగు కామములన్నియు ఉపనిబద్ధాః = అయంసత = అతడే సర్వకామములకు నధిపతి - స్వామి, ఇది ఇంద్రే = ఇంద్రునియందు, సప్తమికి ఉదాహరణము.

**అథ ప్రత్యక్షకృతా మధ్యమపురుషయోగాః త్వమితి చైతేన సర్వనామ్నా. "త్వమింద్ర బలాదధి" (ఋ. ౧౦-౧౫౩-౨) "వి న ఇంద్ర మృధో జహి" (ఋ. ౧౦-౧౫౨-౪) ఇతి.**

అధునా ప్రత్యక్షకృత - మంత్రలక్షణముచ్యతే. మధ్యమ - పురుష యోగాః మధ్యమేన పురుషేణ సంయుక్తా యే మంత్రాః తే ప్రత్యక్ష - కృతాః. త్వమితి చైతేన సర్వనామ్నా సంయుక్తాః తే చ ప్రత్యక్షకృతాః, యత్ర త్వమిత్యేవం శ్రూయతే తత్రాఽవిద్యమానేఽపి మధ్యమః పురుషోఽ ధ్యాహార్యః, యత్ర తు మధ్యమః పురుషః శ్రూయతే తత్రావిద్యమానమపి త్వమిత్యేతత్సర్వనామాధ్యాహార్యమ్. "హే ఇంద్ర! త్వమ్ బలాదధిజాతః బలేనేంద్రత్వం ప్రాప్తః. హే ఇంద్ర! త్వం విజహి నాశయ, నోఽస్మాకం ఏతాన్ మృధః మృధకర్తౄన్ శత్రూన్.

అర్థము :- అథ = ఇప్పుడు, ప్రత్యక్షకృతమంత్రములు మధ్యమ పురుష, మఱియు త్వం అనుసర్వనామముతో సంయుక్తములైయుండును. ఎట్లన :- హే ఇన్ద్ర! త్వం=నీవు, బలాదధిజాతః=బలమువలన జనించితివి. అనగా నీవు బలస్వరూపుడవు. ఇట త్వమ్ సర్వనామము. మఱియు నీమంత్రమునకు తదుపరి చరణమున అసి మధ్యమపురుష. హే ఇంద్ర! నః = మాయొక్క, మృధః = హింసకశత్రువులను, విజహి=చంపుము.

యత్ర-ఏమంత్రమున త్వం పదము శ్రూయతే = వినబడునో - అట అవిద్యమానేమధ్యమపురుషఅధ్యాహారముచేసికొనవలయును.ఏమంత్రమున మధ్యమపురుషపఠింపబడునో యట లేని త్వం సర్వనామము అధ్యాహార్య మగును.

> అథాపి ప్రత్యక్షకృతాః స్తోతారో భవన్తి పరోక్షకృతాని స్తోతవ్యాని. "మా చిదన్యద్విశంసత" (ఋ. ౮-౧-౧) "కణ్వా అభిప్రగాయత" (ఋ. ౧-౩౭-౧) "ఉప ప్రేత కుశికాశ్చేతయధ్వమ్" (ఋ. ౩-౫౩-౧౧) ఇతి.

అథాపి క్వచిత్ ప్రత్యక్షకృతాః స్తోతారో భవన్తి, పరోక్షకృతాని స్తోతవ్యాని. యుష్మత్ప్రయోగైర్హి క్వచిత్ స్తోతారః సంబధ్యన్తే. ప్రత్యక్షమక్షి గోచరం పరోక్షం అక్షిభ్యాం పరమితి వివేకః. హే స్తోతారః! మా ఇంద్రాద్ అన్యత్ కించిత్ అపి - విశంసత - అభిష్టుత. కణ్వా అభిప్రగాయత. హే కణ్వాః! హే కణ్వగోత్రీయాః ఋత్విజ ఇంద్రమేవ అభిప్రగాయత. ఉప ప్రేత కుశికాశ్చేతయధ్వమ్. హే కుశికాః! స్తుతిప్రోక్తారః ఋత్విజః!

ఉపప్రప ఇత ఆగచ్ఛత. చేతయధ్వం విజానీధ్వమేతత్. యుథైష ఇంద్రో వృత్రం శత్రుం జంఘనత్ హతవాన్.

అథాపి అథ చ మఱియు కొండొకచోట స్తోతారః ప్రత్యక్షకృతా భవన్తి = స్తోతలు ప్రత్యక్ష - కృతలై స్తోతవ్యదేవతలు పరోక్షకృతాని = పరోక్షకృతలగుదురో - అట్టియెడ ఉదాహరణార్థము.

క) మిత్రో = మిత్రులార! చిత్ పాదపూరణార్థము, అన్యత్ = ఇంద్రునికంటె భిన్నమైన మఱియొకని నెవనిని, మావిశంసత = వివిధస్తుతి చేయువలదు.

ఖ) హే కణ్వాః! = మేధావులైన ఋత్విజులార!, అభిప్రగాయత= మిక్కిలిగస్తుతిజేయుడు.

గ) కుశికాః = హే ఉచ్చస్వరముతో స్తుతిసొనర్చు ఋత్విజులార!, ఉపప్రహత = వెళ్లుడు, చేతయధ్వం = ఎఱుగుడు.

> అథాధ్యాత్మిక్య ఉత్తమపురుషయోగాః. అహమితి చైతేన సర్వనామ్నా.

ఉత్తమేన పురుషేణ యా ఋచో యుక్తాః తాశ్చ ఆధ్యాత్మిక్యః.

అథ=మఱియు, ఉత్తమపురుషయోగాః=ఏమంత్రములతో, ఋక్కులతో ఉత్తమపురుష సంబంధము ఉండునో, అహమితి చ ఏతేన సర్వనామ్నా = అహం అను ఉత్తమపురుషసర్వనామముతో యుక్తములై యుండునో యవి ఆ మంత్రములు ఋక్కులును ఆధ్యాత్మికములగును.

> యథైతదింద్రో వైకుంఠః. లవసూక్తమ్. వాగాంభృణీయమితి.

ఉదాహరణా త్రయమాధ్యాత్మికమ్. వైకుంఠా నామ అసురీ బభూవ. తస్యాః కిల తపసః ప్రభావేణాపత్యత్వమింద్ర ఆ జగామ స వైకుంఠోనామ బభూవ. తస్యాత్మస్తుతి సంయుక్తమేవమాది బ్రహ్మ ప్రాదురభూత్.

"అహం భువం వసునః పూర్వ్యస్పతిరహం ధనాని సంజయామి శాశ్వతః" మాం హవన్తే పితరం న జన్తవోఽహం దాశుషే విభజామి భోజనమ్ ఇతి. కించాహమేవ పతిః, అహమేవ చ శత్రుభ్యః సకాశాత్ సమస్తాని ధనాని సంజయామి. లవసూక్తే స ఏవ లవ బ్రవీతి. ఏవం హైవంచ మే మనో వర్తతే. గాంచ అశ్వం చ సనుయాం సంయోజయేయ మేతాన్ యజమానాన్. కువిత్ బహు అహం సోమస్య అపామితి. అహం రుద్రేభి ర్వసుభిశ్చరామ్యహమాదిత్యైరుత విశ్వదేవైః. అహం మిత్రావరుణోభా బిభర్మ్యహమింద్రాగ్నీ అహమశ్వినోభా ఇతి. వాగాంభృణీయే వాగేవ బ్రవీతి - అహమేవ రుద్రేభిః వసుభిః ఆదిత్యైః విశ్వేదేవైః విశ్వైశ్చ దేవైః సాకంభూతా చరామి స్తుతియాచెను. అహమేవ మిత్రావరుణా - మిత్రావరుణౌ ఉభా - ఉభావపి ఇంద్రాగ్నీ అశ్వినా - అశ్వినౌ చ ఉభా-ఉభావపి బిభర్మి హవిషా మత్పూర్వకం హవిః సంప్రదానం సర్వదేవతాభ్య ఇత్యభిప్రాయః. యథా ఏతత్ ఆధ్యాత్మికమంత్రముల ఉదాహరణత్రయము. ఇంద్రో వైకుంఠః ఇంద్ర వైకుంఠనామకసూక్తము లవసూక్తము వాగాంభృణీయసూక్తము - ఈమూడుసూక్తములు ఆధ్యాత్మికములు. వీనిలో ఇంద్రవైకుంఠసూక్తము - ఉదాహరణము.

"అహం భువం వసునః పూర్వ్యస్పతిః" అహం = నేను ఇంద్రుడనై, వసునః = సర్వవిధధనములకు, పూర్వ్యఃపతిః=మొదటిస్వామిని, భువం = అయియుంటిని - ఇప్పుడు ఉన్నాను ముందుకూడ ఉందును. లవసూక్తమునకు. "ఇతి వా ఇతి మే మనో గామశ్వం సనుయామితి" ఇతి వా ఇతి- ఈ యావిధముల మేమనః = నామనస్సు కోరుచున్నది - ఏమని - గామ్ అశ్వమ్ = గోవులను, అశ్వములను ఈయజమానునకు, సనుయాం = ఇత్తునుగాక. వాగాంభృణీయసూక్తమునకు ఉదాహరణము, "అహం రుద్రేభిర్వసుభిశ్చరామి" = నేను రుద్రులతో వసుదేవతలతో చరింతును.

**పరోక్షకృతాః ప్రత్యక్షకృతాశ్చ మంత్రాః భూయిష్ఠాః. అల్పశః ఆధ్యాత్మికాః.**

ఉపసంహరతి-పరోక్షేతి. భూయిష్ఠాః అతిబహవః, అల్పశః-అల్పాః.

పరోక్షకృత, ప్రత్యక్షకృతమంత్రములు ఎక్కువ. ఆధ్యాత్మిక మంత్రములు తక్కువగా ఉన్నవి.

**అథాపి స్తుతిరేవ భవతి నాశీర్వాదః. "ఇంద్రస్య ను వీర్యాణి ప్రవోచమ్" (ఋ. ౧-౩౨-౧) ఇతి. యథా ఏతస్మిన్ సూక్తే.**

నాశీర్వాద ఇతి తత్రాశీర్న్యాయ్యా స్తుతేరాశీరర్థత్వాత్. అథాపి యత్రాశీరేవ తత్ర స్తుతిః ప్రయోజ్యా.

అథాపి 'క్వచిత్' మఱియు అక్కడ అక్కడ స్తుతిరేవ భవతి. కేవలము స్తుతియేయుండును, నాశీర్వాదః = ఆశీర్వాదముండదు. అనగా తనకొఱకేమియు ప్రార్థనచేయబడదు. ఉదా:- "ఇంద్రస్య ను వీర్యాణి ప్రవోచమ్" మున్నగుసూక్తములందు కేవలము స్తుతి యున్నది.

**అథాప్యాశీరేవ న స్తుతిః. "సుచక్షా అహమక్షీభ్యామ్ భూయాసమ్. సువర్చా ముఖేన". సుశ్రుత్కర్ణాభ్యాం భూయాసమ్. ఇతి. తదేతద్ బహులమాధ్వర్యవే యాజ్ఞేషు చ మంత్రేషు.**

సుచక్షః సువర్చాః సుతేజస్కః సుశ్రుత్ శోభనకర్ణః తదేతద్ ఏవం విధం మంత్రజాతమ్ ఆధ్వర్యవే యజుర్వేదే బహులం-ప్రాయోఽస్తి. యాజ్ఞేషు కర్మకాండమంత్రేషు చ.

అథాపి = మఱియు ఒకయెడ కేవలము ప్రార్థనచేయబడినది-స్తుతి యుండదు. ఎట్లన:- అహం అక్షీభ్యాం = కన్నులతో, సుచక్షాః = బాగుగ చూచువాడను, ముఖేన = ముఖముతో, సువర్చాః = మంచితేజస్సుగలవాడను, కర్ణాభ్యాం సుశ్రుత్ - చెవులతో బాగుగవినగలవాడను, భూయాసమ్ = అగుదునుగాక! తదేతత్ బహులమ్ = ఇట్టి ప్రార్థనమంత్రములు ఆధ్వర్యవే = యజుర్వేదమున లేక యాజ్ఞేషు మంత్రేషు = యజ్ఞప్రధాన మంత్రములందు ఎక్కువగా చూడబడును.

అథాపి శపథాఽభిశాపౌ. "అద్యా మురీయ యది యాతుధానో అస్మి. అథా స వీరైర్దశభిర్వియూయాః" (ఋ. ౭-౧౦౪-౧౫) ఇతి.

యద్యహం యాతుధానః రక్షోఽస్మి తర్హి అద్యైవ మురీయ - మ్రియేయ ఇతి శపథః. అథా - అథ యో మాం వృథా సంతమ్ మోఘమ్ - మిథ్యా

యాతుధాన ఇత్యాహ స దశభిర్వీరైః పుత్రైః వియూయాః - వియుక్తో భవేత ఇత్యభిశాపః.

అథాపి = మఱియు ఒకయెడ, శపథాభిశాపౌ = శపథముచేయ బడుట మఱియు నొకచో శపించుట యుండును. ఎట్లన:-

క) "యది యాతుధానః అస్మి = నేను రాక్షసుడనగుచో, అద్యా మురీయ = నేడే చచ్చిపోవుదునుగాక! అనగా రాక్షసుడనై యొక్కదినము కూడ బ్రతుకజాలను.

ఖ) అథా = మఱియు, సః = ఆదుష్టుడు, రాక్షసుడను కాని నన్ను రాక్షసుడనువాడు, వీరైః దశభిః పుత్రైః = వీరులైన పదిమంది పుత్రులతో బాటు, వియూయాః = వియుక్తుడగుగాక! అనునది శాపము ఉపర్యుక్త రెండుమంత్రములందు ఒకటి నాలో రాక్షసభావమేర్పడినచో నేను బ్రతుక జాలనని శపథముచేయుట రెండవదానియందు - ఉత్తముడనైన నన్ను రాక్షసుడను దుష్టుడు వీరులైనపుత్రులతో నశించుగాక! యని శాపము చూడనగును.

**అథాపి కస్యచిద్ భావస్యాచిఖ్యాసా. "న మృత్యురాసీదమృతం న తర్హి" (ఋ. ౧౦-౧౨౯-౨). "తమ ఆసీత్తమసా గూళ్హమగ్రే" (ఋ ౧౦-౧౨౯-౩).**

భావస్య అర్థస్య ఆచిఖ్యాసా నేతి జగతోఽనుత్పత్తికాలే మృత్యో రిత్యయం వ్యపదేశః నాసీత్ మర్త్యస్యాభావాత్. అమృతమపి నాసీత్ మృత్యోరభావాదేవ. తమసా అంధకారేణ గూఢం - నిగూఢం తమ ఏవా సీదితి భావః.

అథాపి = మఱియు కొండొకచోట, కస్యచిత్ భావస్య = ఒకానొక పదార్థముయొక్క తత్త్వజ్ఞానమునకు సంబంధించిన, ఆచిఖ్యాసా = వివక్ష చేయబడినది ఎట్లన:-

క) తర్హి = ప్రళయకాలమున, న మృత్యుః ఆసీత్ = మృత్యువు లేదు - (మర్త్యుడే లేడు కావున మృత్యువెక్కడ) అమృతం న ఆసీత్ = మోక్షములేదు (బంధనములేదు కావున) ఖ) అగ్రేసృష్టి=ఉత్పన్నమగు

టకు పూర్వము, తమసా గూఢమ్ = సర్వము అంధకారము ఆవృతమై యుండెను. తమ ఆసీత్ = తమస్సుండెను.

అథాపి పరిదేవనా కస్మాచ్చిద్భావాత్. "సుదేవో అద్య ప్రపతేదనావృత్" (ఋ. ౧౦-౯౫-౧౪) "న విజానామి యది వేదమస్మి" (ఋ. ౧౨-౧౬౪-౩౭)

"సుదేవో అద్య ప్రపతేదనావృత్" పురూరవస ఆర్షమ్. త్రిష్టుప్. పరిదేవనా. సుదేవః-స శోభనో దేవః స్యాత్ యో హ్యనయా ప్రియయా ఉర్వశ్యా వియుక్తో భృగుప్రపాతమ్ పర్వతోపరిష్టాత్ అనావృత్-అనావర్తమాన అద్య ప్రపతేత్ పతిష్యతి. "న విజానామి" - దీర్ఘతమస ఆర్షమ్. నహ్యేతత్ అహం విస్పష్టం జానామి యది వా ఇదమస్మి కారణమ్ బ్రహ్మాఖ్యమ్. అథవా ఇదం తత్కార్యం బ్రహ్మాస్మీతి. జీవబ్రహ్మణోర్మధ్యే కతమోఽహమితి న వేద్మి. తదా జ్ఞానాజ్ఞానాభ్యామేవ మోక్షబంధౌ.

అథాపి = మఱియు నొకచోట, కస్మాత్ చిత్ భావాత్ = కొండొకవిశేష భావము కారణముగ, పరిదేవనా = విలాపము చేయబడినది, ఎట్లన :- మిక్కిలి దుఃఖముకలుగుచున్నది-విలయన-నేను, సుదేవః=మంచివాడను కాను. నాజీవనము వ్యర్థము.

క) సుదేవః శోభనోదేవః - సః స్యాత్ = అతడుత్తమదేవుడగును, యః = ఎవడు, ప్రియయా ఉర్వశ్యా వియుక్తః భృగుః ఇవ=ప్రియమైన ఉర్వశినుండి వియుక్తుడైన భృగునివలె, అనావృత్ = మరల తిరిగిరాక, అద్య = నేడే, ప్రపతేత్ = ప్రాణము త్యాగముచేయునో-కాని నేను బలహీన కారణముగ నట్లుచేయజాలకున్నాను.

ఖ) న విజానామి = నేను, ఇదం = ఈ శరీరమేనా? యదివా = లేక యీశరీరముకంటె భిన్నుడనా? యని తెలిసికొనలేకున్నాను. అనగా నేను శరీరమునా? శరీరముకంటె భిన్నమైన ఆత్మనా యని ఇంతకాలము నుండి యీపరివర్తనశీలముగల జగత్తునందు అనేకపర్యాయములు జరామరణాదిదుఃఖముల ననుభవించుచు తెలిసికొనజాలకపోయితినని దీర్ఘతమాముని విలపించెను.

**అథాపి నిన్దాప్రశంసే. "కేవలాఘో భవతి కేవలాదీ" (ఋ. ౧౦-౧౧౭-౬) "భోజస్యేదం పుష్కరిణీవ వేశ్మ (ఋ. ౧౦-౧౦౭-౧౦) ఇతి. ఏవమక్షసూక్తే ద్యూతనిన్దా చ కృషిప్రశంసా చ.**

మన్త్రేషు భవతః ఇతి శేషః తద్యథా ఏతే ఉదాహరణే నిన్ద్యతే ప్రశస్యతే చాభ్యామితి నిన్దాప్రశంసే. కేవలాఘో భవతి కేవలాదీ. అదదతో నిన్దా, ఆత్మనైవ కేవలం యో అన్నమత్తి న దేవపితృమనుష్యేభ్యో దదాతి స కేవలమఘమేవ ప్రాప్నోతి. తదుక్త మన్వత్రాపి - భుంజతే తేత్వఘం పాపాః యే పచంత్యాత్మ కారణాత్" ఇతి. "భోజస్యేదం పుష్కరిణీవ వేశ్మ. దాతృప్రశంసా. భోజస్య - రాజ్ఞః ఇదం వేశ్మ - గృహం పుష్కరిణీ ఇవ - పుష్కరైర్దైవతమ్ విమానమివ. "అక్షైర్మా దీవ్యః కృషిమిత్ కృషస్వ. విత్తే రమస్వ బహు మన్యమానః". కృషిమిత్ కృషస్వ. కృషిమేవ కురు తస్యాం హి బహవో గుణాః సన్తి స్వాతంత్ర్యాదయః విత్తే రమస్వ స్వల్పమేవోపార్జితం బహు మన్యమానః మా విత్తలోభేన దీవ్యస్తత్ర బహవో అనర్థాః సన్తి. నిజమపి విత్తం హారయిష్యసి. శతం సంప్రతి సన్తి యే ద్యూతక్రీడయా హృత - సర్వస్వాః ప్రతిపథి బుభుక్షితా భ్రమన్తి తతః త్యాజ్యం ఖలు సద్భిరేవ దుర్వ్యసనమిదమితి భావః. మూజవాన్మహా అక్షపుత్ర స్తస్యేయం ఆర్షమ్.

మఱియు నొకచోట కొందఱకు చెడుగు నిందచూపబడినది. మఱియొక విషయమున ప్రశంసయు చూపబడినది. ఎట్లన? - కేవలాదీ=తనయాశ్రితులకు పెట్టక, దేవపితృమనుష్యులకు దానమియ్యక ఒంటరిగా తానొక్కడే తినువాడు కేవలము పాపభాగియే యగును. పుణ్యభాగి కాడు. ఇక దాతృ వర్ణన మొనర్చుచు నతనిని ప్రశంసించుమంత్రము - ఏ రాజు ఎల్లప్పుడు దానముచేయునో ధర్మాచరణమునసుండునో యతనివైభవమును వర్ణించుచు మంత్రమిట్లుచెప్పును - భోజస్య ఇదం వేశ్మ=రాజు యొక్క యీగృహము, పుష్కరిణీవ = తటాకము = చెఱువు హంసలు కమలములు మున్నగు వానితో సుశోభితమై యుండునట్లు అలంకృతమై యుండును. ఇత్యేవమ్ = ఈవిధముగ అక్షసూక్తే = అక్షసూక్తమున ద్యూతనిన్దా చ కృషిప్రశంసా

చ = జూదనిందయు, కృషిప్రశంసయు, చేయబడినది ఎట్లన :- అక్షైర్మా దీవ్యః, కృషిమిత్ కృషస్వ, విత్తే రమస్వ, బహుమన్యమానః తత్ర గావః కితవ తత్ర జాయా తన్మే విచష్టే సవితాయమర్యః.

మంత్రార్థము :- కితవ=ఓ జూదరీ, అక్షైః=పాచికలతో, మాదీవ్యః = ఆడవద్దు, కృషిమిత్ కృషస్వ = కృషిచేయుము, విత్తే=పురుషార్థముతో ధర్మకర్మలనాచరించి ప్రాప్తించిన ధనమునందు, రమస్వ=ఆనందింపుము, బహుమన్యమానః = ధర్మముతో కష్టార్జితధనమునే గొప్పగా నెంచుము. జూదము మున్నగుమార్గములతో నెక్కువసంపాదింప నెంచకుము. తత్ర = కృషికర్మయందే, గావః = గోవులు, జాయా చ = ఉత్తమస్త్రీ లభించును, అయమర్యః సవితా = ఈ జగదుత్పాదకుడగు స్వామిఈశ్వరుడు, మే = నాకు, తత్ విచష్టే = ఈ విషయమును అనేకవిధముల చెప్పుచున్నాడు.

ఏవముచ్చావచైరభిప్రాయైః ఋషీణామ్ మంత్రదృష్టయో భవన్తి.

ఏవమ్ = ఈవిధముగ, ఉచ్చావచైః అభిప్రాయైః=నిమ్నోన్నతము లైన, ఋషీణాం=ఋషుల అభిప్రాయములతో, మంత్రదృష్టయః=మంత్ర దర్శనములు భవన్తి = అగుచున్నవి అనగా ఈశ్వరునిచే నిర్మింపబడిన మంత్రములందు నిందాస్తుతులు హర్షశోకాదులు కొంతెకనిమిత్తముతో ఆలోచింతురు. ఋషులు మంత్రములను దర్శించువారేకాని మంత్రకర్తలు కారు. అని యభిప్రాయము.

తద్యేఽనాదిష్టదేవతా మంత్రాస్తేషు దేవతోపపరీక్షా.

యే అనాదిష్టదేవతా-లింగా మంత్రాః తేషు దేవతాః కథమన్వేష్యాః? తదేతద్ విచార్యతే యే అనాదిష్ట-దేవతా - లింగాః మన్త్రాః తేషు మంత్రేషు దేవతోపపరీక్షా - దేవతాయాః అతః పరమ్ పరీక్షా ఉపపత్తితః వర్ణిష్యతే ఇతి వాక్యశేషః.

తద్ = అందువలన, యే మంత్రాః = ఏమంత్రములు, అనాదిష్ట దేవతాః = దేవతాచిహ్నరహితములో, తేషు = ఆమంత్రముల విషయమున పరీక్షచేయబడును.

## యద్దైవతః స యజ్ఞో వా యజ్ఞాఙ్గం వా తద్దేవతా భవన్తి.

యస్మిన్ యజ్ఞే యే అనాదిష్ట - దేవతా - లింగా మంత్రా వినియుజ్యన్తే తద్దేవతా ఏవ హి తే భవన్తి, తద్యథా - అగ్నేయ్యో అగ్నిష్టోమే. యజ్ఞాఙ్గం వా ప్రాతఃసవనే యో వినియుజ్యతే స ఆగ్నేయః. యో మాధ్యం దినే స ఐంద్రః యః తృతీయసవనే స ఆదిత్యః స యజ్ఞః = ఆయజ్ఞము, యద్దైవతః = యే దేవతగలదియో ఆయజ్ఞమున లేక ఆ యజ్ఞాంగమున, అనాదిష్ట దేవతాకమంత్రము వినియుక్తమో ఆ మంత్రములకన్నింటికి నదియే దేవత. ఏది యాయజ్ఞమునకు యజ్ఞాంగమునకు దేవతయో, "అనాదిష్టదేవతామంత్రాః" = దీని శబ్దార్థమిదియే - అనాదిష్టా = అనిర్దిష్టా- అనిరూపితా దేవతా యేషాం తే అనాదిష్టదేవతా మంత్రాః = ఏమంత్రము లందు దేవతావిశేషము నిర్దేశింపబడదో అందువలననే యేవి దేవతాచిహ్న రహితములో ఆ మంత్రములు అనిర్దిష్టదేవతామంత్రము లనబడును. ఎట్లన :- 'ఆగ్నేయః అగ్నిష్టోమః = అగ్నిష్టోమ యజ్ఞము-అగ్నిదేవతాకము. ఆయజ్ఞమున ఏ యనాదిష్టదేవతాకమంత్రములు వినియుక్తములగునో ఆమంత్రములకన్నింటికి అగ్నియే దేవత యగును. యజ్ఞాఙ్గమనగా యజ్ఞ సాధనము. వేనిమూలమున యజ్ఞము సాధింపబడునో యవి యజ్ఞాంగము లని భావము. ఎట్లన శిల్పయజ్ఞమున, అగ్ని, వాయువు, విద్యుత్తు మున్నగు నవి సాధనములు.

## అథా అన్యత్ర యజ్ఞాత్ ప్రాజాపత్యా ఇతి యాజ్ఞికాః

అథాన్యత్ర యజ్ఞాత్ ప్రాజాపత్యాః తే మంత్రా ఇతి యాజ్ఞికా మన్యన్తే ప్రాజాపత్యాః - ప్రజాపతిదేవతాకాః ప్రజాపతిశ్చ బ్రహ్మ.

అథ = మఱియు, అన్యత్ర యజ్ఞాత్ = యజ్ఞవిషయముసు వెలుపల అనాదిష్టమంత్రము లెయ్యవిగలవో యవి యన్నియు ప్రజాపతిదేవతాక మంత్రములు అని యాజ్ఞికులందురు. యజ్ఞము, యజ్ఞాంగము నను రెండింటికి వెలుపల - ఉపాకరణ ప్రాయశ్చిత్త జపాదులందు - వినియో గించుమంత్రములకు దేవతయెవరన - ప్రజాపతి యామంత్రములకు దేవతయని యాజ్ఞికులు చెప్పుచున్నారు. ప్రజాపతి పరమాత్మయే యా

మంత్రములందు ఉపాస్యదేవత. అతః = అందువలననామంత్రములకు ప్రజాపతియే దేవత.

నారాశంసా ఇతి నైరుక్తాః

నారాశంసాః తే మంత్రా ఇతి నైరుక్తా మన్యన్తే. నారాశంసః అగ్నిర్ యజ్ఞో వా. వక్ష్యతి హి - యజ్ఞ ఇతి కాత్థక్యః. అగ్నిరితి శాకపూణిః. యజ్ఞ శబ్దేన చ విష్ణురుచ్యతే "విష్ణుర్వై యజ్ఞః" ఇతి హ విజ్ఞాయతే. యజ్ఞేన యజ్ఞ మయజన్త దేవా ఇతి పురుషసూక్తాచ్చ

నైరుక్తాః = నిరుక్తకారుల సిద్ధాంతము, అది యెద్దియన :- యజ్ఞము నందు, వినియుక్తములుకాని, 'అనాదిష్టదేవతాకమంత్రముల దేవత నారా శంసాః. నరాశంసః దేవతా యేషాం తే నారాశంసాః మంత్రాః - అగ్నిః లేక యజ్ఞమే. యజ్ఞ శబ్దముచేత "యజ్ఞో వై విష్ణుః అనుదాని ననుసరించి విష్ణుదేవత అభిప్రేతము. కాని ముఖ్యసిద్ధాంత మిదియే. అనాదిష్ట - అనా విష్కృత దేవతాకమంత్రములకన్నిటికి అగ్నియే దేవత. ఇదియే ముఖ్య సిద్ధాంతమని భావము ఏలయన - 'అగ్నిర్వై భూయిష్ఠభాగ్ దేవతానామ్ 'అగ్నిర్వై సర్వాదేవతా ఇత్యాది ప్రమాణమువలన సమస్తదేవతలందును అగ్ని ముఖ్యదేవత, అన్నిదేవతలందును అగ్ని నివసించుననుట నిర్వివాద విషయము అందువలన నేమంత్రమునందు దేవతాచిహ్నము లభించదో ఆమంత్రమునకు దేవత అగ్నియే ముఖ్యతాకారణమున గ్రహింపనగును.

అపి వా సా కామదేవతా స్యాత్.

అపివా సా ఋక్ - మంత్రః, యోఽనావిష్కృత - దేవతా - లింగః స కామదైవతః స్యాత్. కామతోఽభిప్రేతః తస్మిన్ దేవతా కల్పయితవ్యేతి భావః.

అపి వా లేక సా ఋక్ = ఆ ఋక్కు లేక ఆమంత్రము, ఏది అనావిష్కృతదేవతాకమో కామదేవతా స్యాత్ = తన కిష్టమైనదేవత కల్పింపబడినదేవత కలదియగును. తనకిష్టమైనదేవతను ఆమంత్రమున కల్పింపవచ్చునని భావము.

ప్రాయోదేవతా వా. అస్తి హ్యాచారో బహులం లోకే. దేవదైవత్య మతిథి దైవత్యం పితృదైవత్యమ్.

ప్రాయో దేవతా వా తస్మిన్ మంత్రే స్యాత్. అగ్న్యధికారే వర్తమానే, ఆగ్నేయో మంత్రః భవతి, ఇంద్రాధికారే చైంద్ర ఏవేతి. అథవా ప్రాయ ఇతి బాహుల్యముచ్యతే. అన్యత్రప్రాయో దేవదత్త ఇత్యుక్తే అన్యత్రబహుల ఇత్యేవ గమ్యతే. ఏవమిహాపి ప్రాయోదేవతేత్యుక్తే బహులదేవతేతి స్యాత్. కశ్చిద్ గృహీ నిర్దిశతి ఇదం మే దేవదేవత్యం ద్రవ్యమ్ ఇదంమే అతిథిదేవత్యమ్, ఇదంమే పితృదేవత్యమ్ ఇతి. తత్రైవం నిర్దిష్ట తత్ రాశేర్యదన్యదవశిష్యతే తద్దేవ. పితృ - మనుష్యాణాం సాధారణం భవతి. ప్రాయోదేవతా వా లేక ప్రాయః శబ్దముచే అధికారము గ్రహింప బడినది ఏదేవతయొక్క అధికారమున నిట్టి అనిర్దిష్ట - అనావిష్కృత దేవతాలింగముగల మంత్రములు పఠింపబడియున్నవో వాని యొక్క దేవతయు నాయధికృతదేవతయే యగును. లేక ప్రాయఃశబ్దము బాహుల్య వాచకమగును. ఇట్టి అనావిష్కృత-దేవతాకమంత్రములు సర్వసాధారణ మగుటవలన బహుదైవతమంత్రములనియో లేక వైశ్వదేవమంత్రములనియో చెప్పబడును. అస్తి హి ఆచారో లోకే బహులమ్ = ఏలయన లోకమున నీప్రకారము తఱచుగా నున్నది. ఏమన-దేవదైవత్యమ్ - అతిథిదైవత్యమ్ - పితృదైవత్యమ్ - ఇదం మే కర్మ ద్రవ్యంవా దేవదైవత్యమ్ - ఇది నాకర్మ లేక ఇది నాద్రవ్యము. దేవదైవత్యమ్. దేవదేవత నుద్దేశించినది, ఈ నా దవ్యము అతిథిదేవత నుద్దేశించినది, ఈద్రవ్యముపితృదేవత నుద్దేశించినది. అనురీతికలదు. ఈద్రవ్యము పితృదేవతాకనిమిత్తము - మున్నగునవి.

> యాజ్ఞదైవతో మంత్ర ఇతి. అపి హ్యదేవతా దేవతావత్ స్తూయన్తే. యథాశ్వప్రభృతీ న్యోషధి పర్యంతాని.

యోఽనావిష్కృత - దేవతా - లింగో మంత్రః స యాజ్ఞో వా స్యాత్ దైవతో వా. విష్ణుర్వై యజ్ఞ ఇతి హ విజ్ఞాయతే. విష్ణుః పున రాదిత్య ఏవ - నైరుక్తానామ్. ద్యుస్థానే సమామ్నానాత్.

అశ్వప్రభృతీన్యోషధిపర్యంతాని అశ్వాదీని సత్త్వాని ఓషధ్యాదీనిద్రవ్యాణి చ. ఆత్మనోఽపి చ హితాహితం న ప్రతిపద్యన్తే తాని కథమభిష్టుతాని.

ఇప్పుడు అంతిమ నిశ్చయమును చెప్పుచున్నారు. ఏదేవతయు లేని మంత్రము యాజ్ఞదైవతము యాజ్ఞము లేక దైవతము అగును. 'విష్ణుర్వై యజ్ఞః' అనుదీని ననుసరించి యజ్ఞమన విష్ణువు. నైరుక్తుల విషయమున

విష్ణుశబ్దము ఆదిత్యగ్రాహకము. అందువలన అనిర్దిష్టదేవతాకమంత్రము ఆదిత్యదేవతాకమంత్రమనుట నిశ్చితము

యా తేన దైవతమగును దేవత యేమంత్రమునకు సంబంధించినదో యది దైవతమనబడును. మఱియు సామాన్యదేవతాత్వము అగ్నియందే యున్నది. 'అగ్నిర్వై సర్వా దేవతాః' అని సిద్ధాంతముకదా! కావున నేదేవతయులేని మంత్రము అగ్నిదేవతాకమగును. ఈవిధము ననుసరించి ఇట్టి మంత్రములకన్నింటికి ఆదిత్యుడో లేక అగ్నియో దేవతయగును.

ప్రశ్న :— అపి హి అదేవతా దేవతావత్ స్తూయన్తే దేవత కానిది కూడ దేవతవలె స్తుతింపబడుచున్నదికదా! ఎట్లన:- అశ్వప్రభృతీని ఓషధిపర్యంతాని - అశ్వముమొదలు ఓషధివఱకుగల పదార్థములు స్తుతింప బడినవి కదా ?

**అథాప్యష్టౌ ద్వంద్వాని.**

మఱియు నెనిమిది ద్వంద్వములు - ఉలూఖలము, హవిర్ధానము, ద్యావాపృథివీ - ద్యుపృథివీలోకములు ఇవియన్నియు దేవతలు కానివి దేవతలవలె స్తుతింపబడినవికదా! ఇదియేల ?

> **స న మన్యేత అగంతూ నివార్థాన్ దేవతానామ్. ప్రత్యక్ష దృశ్యమేతద్ భవతి. మహా - భాగ్యాత్ దేవతాయాః ఏక ఆత్మా బహుధా స్తూయతే.**

స శిష్యః మేధావీ న మన్యేత న జానీయాత్. సమ్యక్ విరుద్ధమేత ల్లక్ష్యేణ లక్షణముచ్యతే ఇతి. అగంతూనివార్థాన్ దేవతానామ్మన్యమానః. లోకే తావదేతే మనుష్యాణామనిత్యానామ అశ్వాదయోఽర్థాః, ఆగంతవః ఉపాయినశ్చానిత్యాః. తద్వది దేవతానామప్యేవమేవ తతస్తాసాం తేషాం చానిత్యత్వాత్ - స్తుతిరనర్థకా. ప్రత్యక్షదృశ్యమేతద్ భవతి - ప్రత్యక్షత ఏవైతద్ దృశ్యతే, ఉపకరణమశ్వాదయః ఉపక ర్తవ్యా మనుష్యాః. దేవతానా మపి చేంద్రాగ్నిసూర్యప్రభృతీనా ముపకరణం హరిరోహిద్దరిత్ ప్రభృతయో అశ్వాః. తస్మాదుభయేషా ముపకరణోపక ర్తవ్యతా - సామాన్యాత్ - మను ష్యాణ్వివదనిత్యత్వం దేవతానామితి యుక్తమతః స శిష్యో న మన్యేత నైతత్సమ్యగభిధీయత ఇతి.

సమాధానము :- ఉత్తరముచ్యతే-మహాభాగ్యాద్దేవతాయా ఏక ఆత్మా బహుధా స్తూయతే యస్మాత్ తస్మాత్ సర్వమేతత్ సమ్యగితి. సన మన్యేత-మేధావియైన శిష్యుడు లేక నాస్తికుడు కాని ఇట్టి యాక్షేపము చేయరాదు. ఏమని చేయరాదన - ఆగంతూనివార్థాన్ - సాంసారిక పదార్థములు వచ్చి పోవునవి - మనుష్యులనిత్యులు - వారి ఉపకరణములు - సాధనములు - అశ్వాదులు అనిత్యములే. ఇట్లే దేవతానామ్ - దేవతలు వారి ఉపకరణములు అనిత్యములే. అందువలన వారి స్తుతి నిరర్థకము. ప్రత్యక్షదృశ్యమేతద్ భవతి. ఇయ్యది ప్రత్యక్షముగా చూడబడుచున్నది. ఉపకరణములు అశ్వాదులు, ఉపకరణీయులు మనుష్యులు. ఇట్లే ఇంద్రాది దేవతలు ఉపకార్యులు. వారి హరి, హరిత్, రోహితములనెడి అశ్వాదులు ఉపకరణములు అన్నియు ననిత్యములే. కావున నిట్టి ఉపకరణోపకార్యత్వసామాన్యమువలన మనుష్యులు - అశ్వములవలె అనిత్యములే. వారి స్తుతియు నిరర్థకమే. అని యనరాదనిభావము. ఏలయన? దీనికి సమాధానము చెప్పుచున్నాము. దేవతాయా మహాభాగ్యాత్ = దేవత మహైశ్వర్యసంపన్నము - అందువలన - ఏకఆత్మా = ఒక యాత్మయయ్యు ఆ దేవతాత్మ కార్యకారణభేదమువలన బహుధా = అనేకవిధములగుచు, బహుధాస్తూయతే=అనేకవిధముల స్తుతింపబడుచున్నది. కావున దేవతయు ఆ దేవతోపకరణములయు స్తుతి నిరర్థకము కాదు. దేవతకు సంబంధించిన ఐశ్వర్యవిషయమున స్వాయముగా వేదము ప్రమాణము అది ఎట్లన :-

"రూపం రూపం మఘవా బోభవీతి మాయాః కృణ్వానః" అనేక మాయలను రచించుచు ఇంద్రుడు ప్రతిరూపమునందు ప్రత్యేకస్థానమున నుపస్థితుడగును.

ఏకస్యాత్మనో అన్యే దేవాః ప్రత్యఙ్గాని భవన్తి.

మహాభాగ్యాదేకస్య దేవతాత్మన అగ్న్యాదయః ప్రకృతిభేదేన అన్యే దేవా జాతవేదః ప్రభృతయః ప్రత్యంగాని భవన్తి, అగ్నీన్ద్రసూర్యాణాం పరస్పరాపేక్షిమస్త్యత్వమ్. అగ్నీంద్రసూర్యాది భిన్నభిన్నదేవతలు ఏకస్యఆత్మనః= ఒకేఆత్మకు దేవతాత్వముతో ఒకేవస్తువునకు ప్రత్యంగములువలె భవన్తి = అగుచున్నవి. ఘటములన్నియు మట్టిరూపమున నొక్కటియేకదా?

అపి చ సత్త్వానాం ప్రకృతిభూమభిః ఋషయః స్తువన్తీత్యాహుః.

సత్త్వానామశ్వాదీనాం ప్రకృతిభూమభిః కారణమహిమభిః తానశ్వాదీనభిష్టువన్తీత్యాహురాత్మవిదః. తద్యథా - ద్యౌష్టే పృష్ఠం పృథివీ శరీరమ్ ఆత్మాఽన్తరిక్షమ్ ఇత్యేవమాదీని. అపిచ = మఱియు, అశ్వాదీనాం=అశ్వాది పదార్థములయొక్క, ప్రకృతిభూమభిః = సత్తాలక్షణముగల ఒకేమహాత్మ హిరణ్యగర్భునియొక్క స్థావరజంగమభేదముతో - అనేకధా విపరిణామముతో కార్యకారణములలోగల యభేదబుద్ధిగలవారై ఋషులు స్తువన్తి = స్తుతిజేయుచున్నారు. అశ్వాదులనుగూడ స్తుతించుచున్నారనిభావము.

ప్రకృతిసార్వనామ్న్యాచ్చ,

మహానేవాయమాత్మా విశ్వరూపః స్తూయతే. ప్రకృతి సార్వనామ్న్యాదితి. చ = మఱియు, ప్రకృతిసార్వనామ్న్యాత్ ప్రకృతేః సర్వనామ ప్రకృతిసర్వనామ తస్య భావః తస్మాత్ ప్రకృతిసర్వనామ్న్యాత్. ఏలయన మహైశ్వర్యసంపన్నదేవతను సంబంధించినదే యీసమస్తవిభూతి స్థావరజంగమాత్మక సమస్తజగత్తు. అందువలన ఆదేవతలను దేవతలవలె స్తుతి జేయబడుట అయుక్తమనుట తగదు! అనగా వేనిని అదేవతలు అనుచున్నావో వానియందు ఆకారణత్వేన దేవత యుండనేయున్నది. ఇట్లు అదేవతలస్తుతియు దేవతాస్తుతియే యనుచున్నది.

ఇతరేతరజన్మానో భవన్తి ఇతరేతరప్రకృతయః.

మనుష్య - ధర్మవిపరీతో హి దేవతాధర్మః. అతో భేదమాశ్రిత్య ప్రతిసమాధీయతే ఇతరేతరజన్మానో భవన్తీతరేతర ప్రకృతయో దేవా ఐశ్వర్యాత్. న మనుష్యాణామియం శక్తిరస్తి - అనైశ్వర్యాత్.

మనుష్యుల యుపకరణములవలె దేవతల ఉపకరణములును అనిత్యములే. కావున మనుష్యులు దేవతలు సమానులేయని యింతకు పూర్వము చెప్పబడినది. అది యుక్తముకాదు. ఏలయన మనుష్యులు దేవతలు సమసీనిలో చాలభేదమున్నది. మనుష్యధర్మము దేవధర్మము కంటె అత్యంతము భిన్నము ఐశ్వర్య - అనైశ్వర్యకారణమువలన -

దేవతలు ఐశ్వర్యసంపన్నులు, మనుష్యులు అనీశ్వరులు. ఎట్లన? చెప్పు చున్నాము. ఇతరేతరప్రకృతయః అగ్న్యాదిదేవతాః=ఇతరేతరప్రకృతులు గల అగ్నిమున్నగు దేవతలు పరస్పరము ఒండొరులకు కారణమగుచు, ఇతరేతరజన్మానః భవన్తి = ఒకరు మఱియొకరికి జన్మనిచ్చువారగు చున్నారు. సమర్థులగుటవలన ఒకయెడ అగ్ని సూర్యునియుత్పన్నము చేయును. 'ఏష ప్రాతః ప్రసువతి' అను ప్రమాణమువలన మఱియొక యెడ సాయంకాలమున నడచి ఆసూర్యుడే అగ్నినుత్పన్నముచేయును. ఇట్లు సర్వదేవతలు పరస్పరము - తమలోతాము - కార్యకారణములగు చున్నవి. మనుష్యులట్లు కారు. దేవదత్తునిపుత్రుడు యజ్ఞదత్తుడు తన తండ్రికి పుత్రుడుగానే యుండునుకాని జనకుడు కాజాలడు.

### కర్మజన్మానః

కర్మఫలసిద్ధయే లోకస్య అగ్ని - వాయు - సూర్యాః జాయన్తే నహ్యేతేభ్యః ఋతే లోకస్య కర్మఫలసిద్ధిః స్యాత్.

అటులయిన ఈ అగ్ని మున్నగుదేవతలు ఇట్టిసామర్థ్యము కలిగి యుండియు అగ్ని మున్నగురూపములతో నేల జన్మింతురు? అని ప్రశ్నింపగా సమాధానము చెప్పబడుచున్నది.

కర్మజన్మానః =కర్మనిమిత్తం జన్మ యేషాం తే కర్మజన్మానః. ఎవరిజన్మకు కర్మము నిమిత్తమో వారు కర్మజన్మానః అనబడుదురు. సాంసారిక ప్రాణుల కర్మఫలము సిద్ధించుటకై మఱియు నాప్రాణుల లోకయాత్ర సరిగా నడుపుటకై అగ్ని - ఆదిదేవతలు జన్మింతురు. విగ్రహ ధారణమొనర్తురు. ఏలయన అగ్ని సూర్యాదులు లేకున్న మనజీవన యాత్ర నడువదు. మనపనులు నెఱవేరవు. కావున నాదేవతలు జన్మింతురు. (ఈశ్వరుడు వాని నుత్పన్నముచేయునని తాత్పర్యము.)

### ఆత్మజన్మానః

కర్మఫలసిద్ధయే లోకస్య ఆత్మజన్మానః, స్వస్మాత్ స్వయంజాయన్తే.

ప్రశ్న :- అటులైన నీదేవతలు ఎవనివలన నుత్పన్నములగుచున్నవి? వీనికి కారణమెవరు? ఉత్తరము- - 'ఆత్మజన్మానః' ఆత్మనో జన్మ

యేషాం తే = తమంతట తామే జన్మించును. లోకానుగ్రహకాంక్షయా = (లోకము ననుగ్రహించు కాంక్షతో).

**ఆత్మైవైషాం రథో భవతి. ఆత్మాశ్వాః ఆత్మాయుధమ్, ఆత్మేషవః. ఆత్మా సర్వం దేవస్య దేవస్య.**

తత్ర యదుక్తం అశ్వాదీని సత్త్వాని అశ్వ - రథప్రభృతీని చ ద్రవ్యాణి అదేవతాః ఇతి ఏతదయుక్తమ్ దేవతా ఏవేమా రథాదిరూపేణ హి దేవతైవాత్మానం వికృత్య ప్రకృతిభేదేన రథాదిసాధ్యమర్థం సాధయతి సా తద్రూపా సతీ రథాదిస్తుత్యా స్తూయతే.

మఱియు సర్వైశ్వర్య సంపన్నములయిన యాదేవతలయొక్క సంకల్పమువలననె వారి యాత్మయే రథముగానేర్పడును. ఆత్మయే అశ్వము. ఈ ఆయుధము, బాణము - సర్వము - ఆదేవత కోరినదంతయు సిద్ధమగును. కావున అశ్వాదులదేవతలే దేవతలవలె స్తుతిచేయబడుచున్నవను నీకథనము - ఆశంక నిరాధారము.

ఇతి ప్రథమః పాదః

ప్రథమ పాదము సమాప్తము

## ద్వితీయః పాదః

**తిస్ర ఏవ దేవతా ఇతి నైరుక్తాః. అగ్నిః పృథివీస్థానః వాయుర్వేంద్రో వాన్తరిక్షస్థానః. సూర్యో ద్యుస్థానః.**

అస్మిన్నర్థే శ్రుతిరప్యుచ్యతే ప్రజాపతిర్వై త్రీన్ మహిమ్నోఽసృజతాగ్నిం వాయుం సూర్యమ్. ప్రజాపతిః లోకానభ్యతపత్ తేభ్యోఽభితప్తేభ్యో రసాన్ ప్రావృహదగ్నిం పృథివ్యా వాయుమంతరిక్షాత్ సూర్యం దివ ఇతి.

ఇంతవఱకు 'ఆత్మైవేదం సర్వమ్' 'పురుష ఏవేదం సర్వం యద్ భూతం యచ్చ భావ్యమ్' 'అథాతో విభూతయోఽస్య పురుషస్య' 'ఏష ఇంద్ర ఏష ప్రజాపతిః' ఇత్యాది ప్రమాణములతో ఇది యంతయు ఆత్మయే' 'ఇది యంతయు పురుషుడే' భూత, భవిష్యద్వర్తమానములు'

'ఇతడింద్రుడు, ఇతడు ప్రజాపతి' 'ఈవిభూతులన్నియు బ్రహ్మమనివే' అని ప్రమాణములతో, ప్రజాపతితక్క మఱియొకటి ప్రపంచమునలేదని అద్వైతపక్షము చూపబడినది. అశ్వములు గోవులు మున్నగువాని స్తుతియు సార్థకమని చెప్పబడినది. కాని వ్యావహారికదశలో విధిమంత్రములు అర్థవాద సిద్ధాంతమును గ్రహించి ఆ యాకారములతో దేవతానిమిత్తక యజ్ఞయాగాదులొనర్చుచున్నారు. వాని ననుసరించి భిన్నభిన్నదేవతలు వాని యస్తిత్వవ్యవహారదశలను పురస్కరించుకొని వర్ణింపబడినది.

ఈ దేవతలెన్ని? అవి యెయ్యవి? అనిచెప్పుటకు నైరుక్తుల సిద్ధాంతము చెప్పుచున్నాడు.

మూడే దేవతలు. అగ్ని మొదటిది. అది పృథివీస్థానికము. రెండవ దేవత వాయువు లేక విద్యుదాఖ్య - ఇంద్రుడు. అంతరిక్షస్థానికము. మూడవది సూర్యుడు ద్యుస్థానీయము.

**తాసాం మహాభాగ్యాదేకైకస్యాఽపి బహూని నామధేయాని భవన్తి.**

తాసామేవ - తిసృణామగ్న్యాదీనాం మహాభాగ్యాత్-ఐశ్వర్యయోగాత్, ఏకాత్మనామనేకధా వికుర్వన్తీనామేకైకస్యాః ప్రతివికారం జాతవేదాః, వైశ్వానరః వరుణః రుద్రః అశ్వినౌ ఉషా ఇత్యేవమాదీని బహూని నామ ధేయాని భవన్తి.

అర్థము :— మహాభాగ్యాత్ = పరమైశ్వర్యమువలన, తాసామ్ = ఆమూడింటిలో, ఏకైకస్యాః = ఒక్కొక్కదేవతకు, బహూనినామధేయాని= బహునామములు కలవు.

**అపి వా కర్మపృథక్త్వాత్. యథా హోతాధ్వర్యుర్బ్రహ్మోద్గాతేత్యప్యేకస్య సతః.**

అపివా పృథక్త్వహేతుకో నామధేయలాభః స్యాత్. యథా- హోతా, అధ్వర్యుః, బ్రహ్మ, ఉద్గాతా - ఇతి ఏకస్యాపి సతః నానా - నామాని భవితుమర్హన్తి.

అపివా = లేక, కర్మపృథక్త్వాత్ = కార్యభేదమువలన ప్రయుక్తమైనను, యథా ఏకస్య సతః = హోత, అధ్వర్యుడు, బ్రహ్మ-బ్రహ్మ ఉద్గాత యని నామములు కలుగును. ఒకవ్యక్తి - ఒకచో హోతగాను, ఇంకొకచోట బ్రహ్మగాను, మఱియొకయజ్ఞనిర్వహణలో అధ్వర్యుడుగాను, కొండొకచోట యాతడే ఉద్గాతగాను వ్యవహరించునట్లు - స్థాన, కార్య - భేదమువలన ఒకేవ్యక్తి నానా నామములతో వ్యవహరింపబడునట్లు - ఒకే, దేవత వికారభేదమువలన నానా నామములుకలది యగును.

## అపివా పృథగేవ స్యుః. పృథగ్ఘి స్తుతయో భవన్తి.

అపివా పృథక్ పృథక్ - అత్యన్తభిన్నా విభేత్ప్రత్తికేన భేదేన స్యురితి యాజ్ఞికా ఆహుః. హి ఇతి హేతౌ; యస్మాత్ పృథక్ పృథక్ అగ్న్యాదీనాం స్తుతయోభవన్తి. పృథగగ్నేః-అగ్నిమీడే" ఇత్యేవమాద్యాః. పృథగ్జాతవేదసః 'ప్రనూనం జాతవేదసమ్.' పృథక్ సూర్యస్య "హరిద్భిః" ఉపపన్నం పర్యాయవచనత్వే తేషామ్. తస్మాత్ స్తుతినియమాత్ పశ్యామః. పృథక్ పృథగగ్నివైశ్వానరప్రభృతయః ఇతి.

యాజ్ఞికుల కథనము :—

అపివా=లేక, పృథక్ పృథక్ ఏవస్యుః=వేఱువేఱుగానే నామములున్నవి. అనగా ఒకేదేవతకు అనేకనామములుండుట కాదు. దేవతలు వేఱువేఱుగనే యున్నారు. కావున నామములు భిన్నములు. హి = అందువలననే భిన్న భిన్నస్తుతులు చేయబడినవి. (పృథక్ స్తుతయః భవన్తి) స్తుతులు భిన్నములు కావున దేవతలు భిన్నములే - భిన్నులే. నైరుక్తమతమున దేవతలు మూడేయైనను యాజ్ఞికులమతమున దేవతలనేకులు.

## తథా అభిధానాని.

యథైవ హి స్తుతిభేదాత్ స్తుత్యభేదః, ఏవమేవాభిధానభేదా దభిధేయ భేదః అపి భవితుమర్హతి. నైకస్యానేకాభిధాయితా. 'ఆఖ్యాహ్వాఽభిధానం త్వేత్యమరాదభిధానమ్ నామ.'

(అథ సమానార్థత్వసాధనమ్)

దేవతలలోగల బహుత్వమును బట్టియే దేవతలనామములనేకము లేర్పడినవి. కర్మభేదమువలన కాదు. లోకమున వస్తువులెన్నియున్నవో యన్నినామములుండుట ప్రసిద్ధము. నామములెన్నియో వస్తువులు నన్నియే.

> "యథో ఏతత్ కర్మపృథక్త్వాదితి బహవోఽపి విభజ్య కర్మాణి కుర్యుః.

యదో ఏతత్ యత్పునరేతదుక్తమ్ కర్మపృథక్త్వాదితి. అనైకాంతిక ఏష దృష్టాంతః. దృష్టో హి ప్రకృతిభేదాత్ ప్రతికర్మభేదః.

యదో ఏతద్ కర్మపృథక్త్వాత్ ఇతి = కార్యభేదమువలన ఒకదేవతకే అనేకనామములేర్పడునని చెప్పుట యుక్తము కాదు. ఏలయన బహవోఽపి మనుష్యాః = పెక్కురు మనుష్యులు విభజించి, కర్మాణి కుర్యుః=కర్మలు చేయుదురు. కర్మవిభాగమువలన వేఱునామము లేర్పడవు

> తత్ర సంస్థానైకత్వం సంభోగైకత్వం చ ఉపేక్షితవ్యమ్. యథా పృథివ్యాం మనుష్యాః పశవో దేవా ఇతి స్థానైకత్వమ్. సంభోగైకత్వం చ దృశ్యతే. యథా పృథివ్యాః పర్జన్యేన చ వాయ్వాదిత్యాభ్యాం చ సంభోగః. అగ్నినా చేతరస్య లోకస్య.

తత్ర తస్మిన్ పృథక్త్వే సతి సంభోగైకత్వం సంస్థానైకత్వం చ ఉపపత్తితః ఈక్షితవ్యమ్. సమస్థానతయా ఏకత్వం స్థానైకత్వమ్ సంభోగో నామ ఇతరేతరోపకారిత్వమ్, సమానకార్యకర్తృత్వం వా. తచ్చ పునః పునర్భిన్న స్థానానామపి భవతి. యథా పృథివ్యాః పర్జన్యేన చ వాయ్వాదిత్యాభ్యాం చ సంభోగః. కథమ్ ? పృథివీ ఓషధ్యుత్పత్తౌ స్వకార్యారంభే పర్జన్యవాయ్వా దిత్యకృతముపకారం నోపేక్షతే. తదుక్తమ్ - "త్రయస్తపన్తి పృథివీమనూపాః" - ఇతి అగ్నినా చ ఇతరస్య లోకస్య. తదప్యుక్తమ్ - "అగ్నిర్వా ఇతి వృష్టిం సమీరయతి" దివం జిన్వన్త్యగ్నయ ఇతి

ఇప్పుడు యాస్కముని ఏకత్వవాదము, త్రిత్వవాదము, బహుత్వ వాదము నను మూడింటి సమానార్థతను సిద్ధము చేయుచున్నాడు.

తత్ర = ఆమూడువాదములందును, సంస్థానైకత్వము=స్థానైకత్వము, సంభోగైకత్వం చ = సంభోగైకత్వమునుగూర్చి, ఉపేక్షితవ్యమ్=విచారింప ఆలోచింప వలయును. అనగా ఈదేవతలన్నింటియొక్క సమానస్థానమున సమానభోగమువలన - సమానత - ఏకత నెఱుంగవలయును ఎట్లన :- పృథివ్యామ్ = భూమిపై, మనుష్యాః = మనుష్యులు, పశవః = పశువులు, దేవాశ్చ = దేవతలు, అనునీమూడింటికి స్థానైకత్వం దృశ్యతే = చూడబడు చున్నది. అనగా మనుష్యాదులు పరస్పరము భిన్నములగుచు నొకేస్థాన మున పృథివిపై నుండుటవలన వీనిలో ఏకస్థానత్వము చూడబడుచున్నది. సమానభోగమునకు సంబంధించిన ఏకతయు చూడబడుచున్నది. యథా - మఱియు నేవిధముగ - పృథివ్యాః పర్జన్యేన = పృథివికి మేఘముతో, వాయ్వాదిత్యాభ్యాం చ = వాయువు ఆదిత్యుడు ననురెండింటితోను, సంభోగః = సమానభోగమున్నది. అగ్నినా చ ఇతరస్య లోకస్య = ఇతర లోకము - అంతరిక్షలోకము - అందు పార్థివఅగ్నితోపాటు ఆదిత్యాగ్నితో సంభోగః = సమానభోగమున్నది. అందువలన నీమూడులోకములు అంత రిక్షము, అగ్ని, ఆదిత్యుడు నీమూడింటి సంభోగ-ఏకతవలన నీమూడింటిని ఒకేదేవతగా నెంచవలయును.

## తత్రైతన్నరరాష్ట్రమివ.

తత్ర తస్మిన్ సందేహే సతి ఏతన్నరరాష్ట్రమివ యథా రాష్ట్రమిత్య భేదః. నరా ఇతి భేదః. ఏవం పృథివ్యగ్నిరిత్యభేదః జాతవేదా వైశ్వానరః ఇతి భేదః. స్వమతే సూక్ష్మప్రమాణేన త్రిత్వమేవేతి బోధ్యమ్.

తత్ర = అట - భేదాభేదవిషయకసందేహమునందు-ఏతత్ సర్వమ్= ఇది యంతయు, నరరాష్ట్రమివ = నరాః - రాష్ట్రమ్. ఇవ = నరులు - రాష్ట్రమువలెనని తెలిసికొనవలయును. నరాః = భిన్నులు, రాష్ట్రమ్ ఏకమ్ = ఒక్కటి. మనుష్యులు ఒకరికంటె ఇంకొకడు భిన్నుడు. వారి యాకృతిరూపాదులు భిన్నములు. భిన్నరూపాదులు ఎల్లరు కలిసి ఒక్క రాష్ట్రముగా నెంచబడుదురు. అట్లే బ్రహ్మమను రాష్ట్రమునందు బ్రహ్మ రూపమొక్కటి. అందు పరమేశ్వరనిర్మిత దేవతలనేకులయ్యు రాష్ట్ర దృష్టితో నొక్కటిగా నెంచవలయునని తాత్పర్యము. ఇట్లు ఏకత్వ, బహుత్వ, త్రిత్వవాదములన్నియు నుపపన్నములని యెంచునది.

అథాకారచింతనమ్ దేవతానామ్.

యాజ్ఞిక పక్షాదనన్తరమిదమారభ్యతే అథాకారచింతనమ్ దేవతానామ్ ఇతి. అథ = ఇప్పుడు, దేవతానాం = దేవతలయొక్క ఆకారచింతనమ్ = ఆకృతినిగూర్చి విచారణజేయబడుచున్నది.

పురుషవిధాః స్యురిత్యేకమ్.

కిమాకారస్తు చిన్త్యతే? కిమస్తి ఉత నాస్తి? ఇహ ద్వివిధా ఆకారవన్తోఽర్థాః చేతనాశ్చా చేతనాశ్చ. తత్ర చేతనా మనుష్యాదయః, అచేతనాశ్చ పాషాణాదయః. తత్రైతద్ భవతి - కిమమీ మనుష్యాదివచ్చేతనా ఉత పాషాణాదివదచేతనాః? తత్ర పురుషవిధాః స్యురిత్యేకం మన్త్రేషు దర్శనమ్. పురుషప్రకారాః పురుషవిగ్రహాః ఇత్యర్థః.

ఏకమ్ = ఒకమతమేమన-దేవతలఆకృతి పురుషవిధాఃస్యుః = మనుష్యుల యాకృతివలె నుండును.

చేతనావద్వద్ధి స్తుతయో భవన్తి.

కోఽత్రహేతుః? యస్మాచ్చేతనావతామివ స్తుతయో దేవతానాం మన్త్రేషు భవన్తి తస్మాత్. పురుషాకారవిగ్రహా ఇతి నిశ్చీయతే.

హి = ఏలయన, స్తుతయః = దేవతలయొక్క స్తుతులు, చేతనావద్వత్ = చేతనగలవారి ఆకృతివలె, భవంతి=ఉండును. అనగా దేవతలు మనుష్యాకృతివంటి ఆకృతికలవారు. వారిస్తుతి మనుష్యులస్తుతులవలె ఉన్నందువలన, చేతనావద్వత్ = అందలి మొదటివత్ మతుబర్థమున, రెండవవత్ - సదృశార్థమున ప్రయుక్తము. యద్యపి చేతనావత్ శబ్దముచే మనుష్యుడే కాక గవాదిప్రాణికూడ గ్రహింపబడును. ఏలయన గవాది జంతువులందు చైతన్యముండును. కాని, హితాహిత - వివేకలక్షణ విశిష్ట జ్ఞానము గవాదులందుండదు. మనుష్యులందుండును. అందువలన చైతన్యముతోసామ్యమున్నను మనుష్యులందు విశేషమున్నది. కావున మనుష్యాకృతితోనే దేవతలయాకృతికి సాదృశ్యము చెప్పబడినది.

తథాభిధానాని.

యథైవ పౌరుష విధ్యముపపద్యతే చేతనావత్సదృశ - స్తుతిభిః, తత్పౌరుషవిధ్యం ప్రతి తాః . స్తుతయః కారణం భవన్తి. ఏవమభిధానాని నామాన్యపి చేతనావతామివైవ. తథా =-ఏలయన, ఆవిధమునకు సంబంధించిన అభిధానాని = పరస్పరఅభిధానములు - ఉత్తరప్రత్యుత్తరములు చేయబడినవి. మనుష్యులలో పరస్పర ఆలోచనలు జరుగునట్లు దేవత లందును ఒకరినొకరు సంబోధించి మనవివాదములు చూడబడినవి. కావున దేవతలస్వరూపము మనుష్యస్వరూపసదృశములే యగును.

> అథాపి పౌరుషవిధికైరంగైః సంస్తూయన్తే. "ఋష్వా త ఇంద్ర స్థవిరస్య బాహూ" (ఋ. ౬-౪౭-౮) "యత్సంగృభ్ణా మఘవన్ కాశిరిత్తే" (ఋ. 3-30-౫)

కించ పౌరుషవిధ్యత్వే యాన్యఙ్గాని తైః సంస్తూయన్తే. తద్యథా = "ఋష్వాత ఇంద్ర స్థవిరస్య బాహూ ఉపస్థేయామ శరణం బృహన్తా. తస్య తే తవ ఇంద్ర ! ఋష్వౌ - దర్శనీయౌ శత్రూణామ్ స్థవిరస్య-మహతః, బాహూ - హస్తౌ బృహన్తా - బృహన్తౌ శరణా - శరణ్యౌ ఆశ్రయణీయౌ నిత్యముపస్థేయామ - ఉపతిష్ఠేమేత్యేతదాశాస్మహే. యత్సంగృభ్ణామఘవన్ కాశిరిత్తే" దూరపారేఽపి రోదసీ సంగృభ్ణాసీత్యహో హే ఇంద్ర తే మహాన్ కాశిర్ముష్టిరితి వాక్యార్థః.

దేవతలయొక్క పురుషవిధతాయందు మఱియొక హేతువుకలదు అథాపి = మఱియు నాలెండవకారణమిదియే, పౌరుషవిధికైః అంగైః సంస్తూయన్తే = దేవతలస్తుతి మనుష్యులఅంగములవంటి అంగములు కలిగియున్నట్లు చేయబడుచున్నది. ఎట్లన ?

మంత్రార్థము :— హే ఇంద్ర ! స్థవిరస్య = వృద్ధుడవైన, తే = నీ యొక్క, ఋష్వా = శత్రునాశక, బాహూ = భుజములశరణుజొచ్చుచున్నాము. ఈమంత్రమున ఇంద్రుని బాహువులబలము ప్రశంసింపబడినది.

ద్వితీయ మంత్రార్థము :- హే ఇంద్ర! మఘవన్! నీవు, అపారే రోదసీ = అంతములేని ద్యుపృథివీలోకములను, కాశః ఇత్ = నీభారిముష్టి, సంగృభ్ణా = తనలోగ్రహణముచేయును. ఇందు ఇంద్రుని ముష్టి = పిడికిలి ప్రశంసింపబడినది బాహువులు, ముష్టి మనుష్యుల అంగములు. ఇట్టి యంగములు ఇంద్రుడు కలిగియున్నట్లు వర్ణింపబడినందున ఇంద్రుడు మనుష్యునివంటి ఆకృతికలవాడని స్పష్టమగుచున్నది.

**అథాపి పౌరుషవిధికైః ద్రవ్యసంయోగైః. "ఆ ద్వాభ్యాం హరిభ్యామింద్ర యాహి" (ఋ. ౨-౧౮-౪) "కల్యాణీ ర్జాయా సురణం గృహే తే" (ఋ. ౩-౫౩-౬)**

ఆ ద్వాభ్యాం హే భగవన్! ఇంద్ర! యది తావత్తవ ద్వౌ హరీ సన్నిహితౌ తాభ్యాం హరిభ్యామాయాహి. అథ చత్వారః. తతః తైః చతుర్భిః. కల్యాణీర్జాయా సురణం గృహే తే. హేభగవన్! ఇంద్ర! తే కల్యాణీర్జాయా స్త్రీ సురణం యద్యాన్యద్రమణీయం తత్తత్సర్వం తే - తవ గృహే వర్తతే.

అథాపి - అథచ - మఱియు, పౌరుషవిధికైః = మనుష్యులకు సంబంధించిన, ద్రవ్యసంయోగైః = ద్రవ్యముల సంబంధములతో దేవతల స్తుతి చేయబడినది. ఎట్లన :—

మంత్రార్థము :- క) హే ఇంద్ర! ద్వాభ్యాం హరిభ్యామ్ = రెండు గుఱ్ఱములతో, ఆయాహి = రమ్ము. నీదగ్గఱనున్న రెండుగుఱ్ఱములను జోడించిన రథముతో రమ్ము.

ఖ) హే ఇంద్ర! తే గృహే = నీయింటియందు, కల్యాణీః జాయా= కల్యాణిసౌభాగ్యశాలినియైన భార్య యున్నది, సురణమ్ = అందమైన వస్తువులన్నియు నీయింటనున్నవి. అని యీరెండుమంత్రములందును అశ్వములు, సుందరమైనభార్య, సమస్తరమణీయ పదార్థములు మనుష్యుని యిండ్లనున్నట్లు దేవతయైన యింద్రుని యింటనున్నట్లు వర్ణింపబడినది.

**అథాపి పౌరుషవిధికైః కర్మభిః. "అద్ధీంద్ర పిబ చ ప్రస్థితస్య" (ఋ. ౧౧-౧౧౬-౭) "ఆశ్రుత్కర్ణ శ్రుధీ హవమ్"**

అథాపి అయమపరో హేతుః పౌరుషవిధ్యే. పౌరుషవిధికైః కర్మభిః సంస్తూయన్తే దేవతాః. తద్యథా అద్ధీన్ద్ర పిబ చ ప్రస్థితస్య. హే ఇంద్ర స త్వమ్ అస్య సోమస్య ప్రస్థితస్య ప్రపహతః అద్ధి పిబ చ స్వమంశమితి శేషః. ఆ శ్రుత్కర్ణ శ్రుధీహవమ్ హే శ్రుత్కర్ణ ఇంద్ర! అభిముఖ్యేన శ్రుధి - శృణు త్వమ్ హవమ్ - ఆహ్వానమస్మాకమ్. తదేవం లింగపంచకేన పురుషవిధత్వం సిద్ధమ్.

మఱియు మనుష్యులను వర్ణించినట్లే కర్మలతో దేవస్తుతియు చేయ బడినది. ఎట్లన :-

మంత్రార్థము :- క) హే ఇంద్ర! అప్రతిహతశ్రవణశక్తిగల ఓ యింద్రా మాఆహ్వానమును వినుము. సోమమును అద్ధి - పిబ=త్రాగుము-తినుము. ఖ) హే ఇంద్ర! ప్రస్థితస్య = ఉపస్థితమైయున్న సోమమును అద్ధిపిబ = త్రాగుము. అని ఈరెండు మంత్రములందును తినుట, త్రాగుట, వినుట మున్నగుక్రియలు మనుష్యులవలె దేవతకు సంబంధించి వర్ణింప బడినది.

**అపురుషవిధాః స్యురిత్యపరమ్. అపురుషవిధాః స్యుః ఇత్యపరం దర్శనమితి వాక్యశేషః.**

ఇప్పుడు మఱియొక మతమును చూపుచున్నాడు - ఇందు దేవతలు మనుష్యులవంటివారు అని యింతవఱకుచెప్పినది సరికాదు. ఏలయన మనుష్యులు చేతనులు దేవతలు అచేతనములు ఉపర్యుక్తమతము సరి కాదనుచున్నాడు.

**అపి తు యత్ దృశ్యతే అపురుషవిధం తత్. యథా అగ్ని ర్వాయురాదిత్యః - పృథివీ చంద్రమా ఇతి.**

యత్ దేవతాకారాదికం దృశ్యతే అపురుషవిధాః అగ్న్యాదయః తత్సామాన్యాదింద్రాదయోఽపి అపురుషవిధాః దేవతాత్వాదిశేషాదితి భావః.

అపితు = కాని, యద్దృశ్యతే = ప్రత్యక్షముగా నేది దృశ్యతే = కనబడుచున్నదో యది, అపురుషవిధమ్=మనుష్యవిధముకాదు. మనుష్య సదృశముకాదు. ఏలయన అగ్ని, వాయువు, సూర్యుడు, మున్నగు దేవతలు

జడములు. పృథివి, చంద్రుడు మున్నగునవి కూడ. కావున, దేవతలు మనుష్యాకారులనుట యీప్రత్యక్షదర్శనమునకు విరుద్ధము. ప్రత్యక్షము నపలాపముచేయుట తగదని భావము.

యథో ఏతచ్చేతనావద్వద్ధి స్తుతయో భవన్తి ఇతి. అచేతనాన్యప్యేవం స్తూయన్తే. యథాఽక్షప్రభృతీన్యోషధిపర్యన్తాని

అచేతనేష్వప్యక్షాదిషు చేతనావత్ స్తుతేః దృష్టత్వాత్ ఇతి. ఓషధే! త్రాయస్వైనమిత్యాదౌ.

యథోఏతత్ = మఱియు, ఈదేవతలస్తుతి చేతనములకువలె చేయబడినదికదా? అందులో అచేతనములైన ఓషధ్యాదులయు స్తుతిచేయబడినట్లు చూచుచున్నాముకదా! ఇది ప్రత్యక్షము.

యథో ఏతత్ పౌరుషవిధికైరంగైః సంస్తూయన్తే ఇతి అచేతనేష్వప్యేతద్ భవతి. "అభిక్రందంతి హరితేభిరాసభిః" (ఋ. ౧౦-౯౪-౨) ఇతి గ్రావస్తుతిః.

ఏతే వదన్తి శతవత్ సహస్రవదభిక్రందంతి హరితేభిరాసభిః.

ఏతే - గ్రావాణః అభిషవకర్మ కుర్వాణా శతవత్ శతమివ సహస్రవత్ - సహస్రమివ అభిక్రందంతి - ఆహ్వయన్తి సోమపాత్ర్యాన్ హరితేభిః సోమసంసర్గాత్ హరిద్వర్ణైః ఆసభిః - ఆస్యైః. న హి గ్రావ్ణాం యథా భూతాన్యాస్యాని సన్తి యత్సంయోగేన చ స్తూయన్తే తస్మాత్ అహేతురయం యత్ పౌరుషవిధికైరంగైః సంస్తూయన్త ఇతి.

మఱియు పురుషసదృశలంగములు కలవారుగా చెప్పబడినవియు సరికాదు. ఏలయన అచేతనములవిషయమునను నిట్లది చూపబడినది. ఎట్లన:- "హరితేభిః ఆసభిః = హరిత = ఆకుపచ్చనిరంగుగల ముఖములతో, అభిక్రందంతి = శిలలుకూడ పిలుచుచున్నవి, (ఏశిలలపై సోమము తీయబడినదో యాశిలలు ఆకుపచ్చనిరంగుగలవి యగును.)

యథో ఏతత్ పౌరుషవిధికైః ద్రవ్యసంయోగై రిత్యేతదపి తాదృశమేవ. "సుఖం రథం యుయుజే సింధురశ్వినమ్" (ఋ. ౧౦-౭౫-౯) ఇతి నదీస్తుతిః.

'సుఖం రథం యుయుజే' ఇతి నదీస్తుతిః. సుఖం - సుఖహేతుం లోకస్య - రథం - రంహణమ్ ఉదకం యుయుజే-యుక్తవతీ సింధుః-నదీ అశ్వినమ్ - అశనేన - వ్యాపనేన తద్వ్యస్తమ్. తేన వాజమ్ - అన్నమ్ సనిషత్ - ఉత్పాదితవతీ.

మఱియు దేవతలు మనుష్యులకుసంబంధించిన వస్తువులవంటి వస్తువులు - ద్రవ్యములు కలవారు కావున దేవతలు మనుష్యాదులుగా వర్ణింపబడినవని చెప్పబడినదో యదియు సరికాదు. ఏలయన నీవిషయము అచేతనపదార్థముల విషయమునను జూడబడుచున్నది. ఎట్లన :- సింధుః= నది, సుఖం = సుఖదాయకమై, అశ్వినమ్ = అంతట ప్రవహించు, రథమ్= జలరూపరథమును, యుయుజే = ధారణచేసియున్నది. ఈమంత్రమున నది జలరూపరథముతో కూడియున్నట్లు అలంకారికవర్ణన చూడబడు చున్నది.

యథో ఏతత్ పౌరుషవిధికైః కర్మభిః ఇత్యేదపి తాదృశమేవ

న చ పునర్గ్రావ్ణాం యథా భూతమశనమస్తి. తస్మాదిదమప్తి రూపకమేవ.

మఱియు, మనుష్యులుచేయు కర్మలవంటికర్మలు దేవతలుచేసినట్లు వర్ణింపబడినవియో యదియు సరికాదు. ఏలయన - ఇట్టి కర్మలు జడపదార్థముల విషయమునను వర్ణింపబడుట జూచుచున్నాము. ఎట్లన :-

"హోతుశ్చిత్ పూర్వే హవిరద్యమాశత" (ఋ. ౧౦-౯౪-౨) ఇతి గ్రావస్తుతిరేవ.

హోతకంటె ముందుగానే యాశిలలు అద్యం హవిః = భక్ష్యమగు హవిస్సును, ఆశత్ = తినివేసినవి. ఇట భక్షణము తినుట యనుక్రియ శిలలయందును అలంకారికముగా వర్ణింపబడినది. ఈచెప్పబడిన యుక్తుల

వలన దేవతలు చేతనులు అని చెప్పుటకు చూపినహేతువులన్నియు అనైకాంతికములని హేత్వాభాసములని రూపింపబడినది. కావున దేవతలు చేతనులు కారు. జడములేయని సిద్ధమైనది.

ఇప్పుడిక మూడవపక్షము.

**అపి వోభయవిధాః స్యుః.**

ఉభయత్ర ప్రామాణ్యాత్. పురుషవిధాశ్చ అపురుషవిధాశ్చేత్యర్థః.

అపివా - అథవా = లేక ఉభయవిధాః స్యుః = దేవతలు ఉభయ విధములనుట యుక్తమగును. అనగా ఉభయవిధప్రమాణములు లభిం చుటవలన దేవతలు జడములు, చేతనములునని రెండువిధములుగా నంగీకరించుట యుచితము. రెండువిధములు స్వతంత్రములు.

**అపి వా పురుషవిధానామేవ సతాం కర్మాత్మానః ఏతే స్యుః. యథా యజ్ఞో యజమానస్య.**

పురుషవిధానామేవ సతాం పృథివ్యాదీనాం కర్మాత్మానః ఏతే స్యుః. అపురుషవిధాః క్షితిః, జలాదయః. పరే తు అధిష్ఠాతారః పురుషవిగ్రహాః. యథా యజ్ఞో అశ్వమేధాదిరధిష్ఠాతుర్యజమానస్య.

ఇప్పుడు నాల్గవపక్షము.

అపివా - అథవా = లేక, చిత్ అచిత్ అని రెండువిధములైన దేవత లున్నవి. కాని, ఏతే కర్మాత్మానః స్యుః యే అచిత్ = అచేతనదేవతలు, కర్మస్వరూపములు మఱియు నవి చేతనదేవతల యధీనములు. అనగా దేవతలు ద్వివిధములు. కాని పురుషవిధచేతనదేవతలు స్వతంత్రములు. జడములు వాని యధిష్ఠాతృత్వమున నుండును. ఎట్లన యజమానుని యజ్ఞము. యజ్ఞము కొన్నిమంత్రములకు దేవతయేయైనను నది యజ మానుని యధీనము. అందువలననే యజమానుని యజ్ఞమని వ్యవహారము కూడ కలదు. జడదేవతలరచన పురుషవిధదేవతల ప్రయోజనముకొఱకే.

**ఏషచాఖ్యాన సమయః.**

ఏష చాఖ్యానసమయః. మహాభారతే ఏష ఏవ సిద్ధాన్తః ప్రదర్శిత ఇత్యర్థః. పృథివీ స్త్రీరూపేణ భారావతారణాయ బ్రహ్మాణం యయాచే

అగ్నిశ్చ బ్రాహ్మణరూపేణ వాసుదేవార్జునావృభౌ ఖాండవం యయాచే. పురుషేణాగ్నిరూపేణ చ ఖాండవం దదాహ. ఇత్యేవమాది. తదేతత్ చతుర్ధాభిధ్యతే. మంత్రార్థదర్శనాదేవ. ౧) పౌరుషవిధ్యమ్. ౨) అపౌరుషవిధ్యమ్. ౩) కర్మాత్మాతోభయవిధ్యమ్. ౪) నిత్యమౌభయవిధ్యమేవేతి, సర్వం చైతదుపపద్యతే మహాభాగ్యో నతై శ్వర్యాత్.

మీష చ మఱియు నిది ఆఖ్యానసమయః = ఆఖ్యానసిద్ధాంతము కాత. మహాభారతమునందు ఆఖ్యానముల మూలమున నీసిద్ధాంతము స్థిరపఱపబడినది. అట పృథివి స్త్రీరూపముధరించి బ్రహ్మను తన భారమును తొలగింపుమని యాచించినది. అగ్ని కృష్ణార్జునులను ఖాండవ దహనమును యాచించినది.

ఇట్లు చతుర్విధ దైవతావాదమున్నది. ౧) పురుషవిధము, ౨) అపురుషవిధము, ౩) ఉభయవిధము, ౪) కర్మాత్మోభయవిధము. మూడవ విధమున దేవతలు స్వతంత్రరూపమున నంగీకరింపబడినవి. నాల్గవ పక్షమున పురుషవిధప్రయోజనార్థము అధిష్ఠాతృత్వమున అపురుషవిధ దేవతలకల్పన చేయబడినది. మూడు, నాల్గుపక్షములలోగల భేదమింతయే.

ద్వితీయ పాదము సమాప్తము

# తృతీయ పాదము

**తిస్ర ఏవ దేవతా ఇత్యుక్తం పురస్తాత్, తాసాం భక్తిసాహచర్యం వ్యాఖ్యాస్యామః.**

భక్తిశ్చ సాహచర్యం చ భక్తికృతం వా సాహచర్యమ్ ఇతి. లోకాదీనామేవ అగ్న్యాదిభిర్భజనం భక్తిః - సహచరభావః సాహచర్యమ్.

దేవతలు మూడే యని పూర్వము చెప్పబడినది. తాసామ్ = వానియొక్క, భక్తి-సాహచర్యమ్=భక్తి, సాహచర్యములను వ్యాఖ్యానింతుము ఇప్పుడీవిషయము నిరూపింపబడును. అగ్ని వాయువు ఆదిత్యుడు నను నీమూడుదేవతలతో నే యే పదార్థములకు భక్తి-సంబంధము ఉన్నది,

ఏయే యితరదేవతలు నీమూటియంతర్గతములో, మఱియు నేయేదేవతల సాహచర్య మీమూడుదేవతలతో నున్నదో, అనగా నొకేమంత్రమున సమాన రూపమున స్తుతి చూపబడుచున్నదో ఆనువిషయములు ఇప్పుడు వ్యాఖ్యానింపబడునని భావము.

> అథైతాన్యగ్నిభక్తీని. అయం లోకః. ప్రాతః సవనమ్. వసంతః. గాయత్రీ. త్రివృత్స్తోమః రథన్తరం సామ. యే చ దేవగణాః సమామ్నాతాః ప్రథమే స్థానే. అగ్నాయీ పృథివీలేతి స్త్రియః.

అథేతి విశేషాధికారే. అగ్నిం భజంతే. అగ్నినా వా భజ్యన్తే ఇత్యగ్ని భక్తీని. అయం భూలోకః. వసన్తఋతుః. గాయత్రీ ఛందః. స్తోమ ఋగ్భాగః. సామ - సామవేదభాగః. ప్రథమస్థానే భూలోకే.

అర్థము :- ఏతాని అగ్నిభక్తీని = ఇవియన్నియు అగ్నిభాగులు అగ్నికిసంబంధించినవి. ఏది ? ఏది ? అయంలోకః=ఈభూలోకము, ప్రాతః-సవనమ్=ప్రాతఃకాలీనయజ్ఞము, వసన్తః = వసన్త -ఋతువు, గాయత్రీ ఛందః = గాయత్రీఛందస్సు, త్రివృత్‌స్తోమః=త్రివృత్‌స్తోమము, రథన్తరం సామ=రథంతరమను పేరుగల సామము,ఇయ్యవి ప్రథమస్థానమునదేవగణాః సమామ్నాతాః = దేవగణములు పఠింపబడినవి. మఱియు నీదేవసమూహమునకు అంతర్భాగములుగా అగ్నాయీ పృథివి ఇడా అను నీముగ్గురు స్త్రీలు అన్నియు అగ్నిభక్తికములే. భూలోకము, వసంతఋతువు, ప్రాతః సవనము ననువీనివర్ణనము అగ్నిదేవతాకమంత్రములందు చూడనగును. ఈయగ్నిదేవతాకమంత్రముల ఛందస్సు గాయత్రినామకము. త్రివృత్ స్తోమము, రథంతరనామకసామము. ఇవియు అగ్నిదేవతాకమంత్రములకు చెందినవే యగును. ప్రథమస్థానపఠితదేవతల ప్రతినిధియు అగ్నియే. అగ్నాయి పృథివి ఇడా అనునివియు అగ్ని - అంతర్గతములనియే యెఱుంగునది.

> అథాస్య కర్మ. వహనంచహవిషామ్ ఆవాహనం చ దేవతానామ్. యచ్చ కించిత్ దార్ష్టివిషయకమగ్నికర్మైవతత్.

అథాస్య - అగ్నేః కర్మ సహభావి వహనం చ హవిషామిత్యేవమాది. దార్ష్టివిషయకమ్ - ప్రకాశాదికర్మేత్యర్థః.

అర్థము :- అథ = మఱియు, అస్య = ఈయగ్నియొక్క కర్మ - పని ఏమి ? హవిషాం వహనమ్ = హవిస్సులను చేర్చుట, దేవతానాం ఆవాహనం చ = దేవతలను ప్రాప్తింపజేయుట, యత్ చ కించిత్=ఏకొంచెము, దార్ష్టివిషయకమ్ = ప్రకాశప్రదానము, తత్ = అదియంతయు అగ్నికి సంబంధించినకర్మయే.

అథాస్య సంస్తవికా దేవాః. ఇంద్రః.సోమః. వరుణః. పర్జన్యః, ఋతవః.

"ఇంద్ర అగ్నిశ్చ దాశుషో దురోణే సుతావతో యజ్ఞమిహోపయాతమ్" ఇతీంద్రేణ సంస్తవః. "అగ్నీషోమావిమం మే శ్రుణుతం వృషణాహవమ్" ఇతి సోమేన సహ సంస్తవః. "త్వం నో అగ్నే వరుణస్య విద్వాన్ దేవస్య హేడోఽవయాసిసీష్ఠాః" ఇతి వరుణేన. "అగ్నీపర్జన్యావవతం ధియం మేఽస్మిన్ హవే సుహవా సుష్టుతిం నః" ఇతి పర్జన్యేన.

"అగ్నే దేవాం ఇహావహ సాదయ యోనిషు త్రిషు పరిభూష పిబ ఋతునా" ఇతి ఋతుభిః సంస్తవః.

అథ = మఱియు, అస్య = ఈయగ్నియొక్క, సంస్తవికాదేవాః = ఏకత్రితస్తుతిగల దేవతలు లేక సహచరదేవతలు ఇంద్రః సోమః = ఇంద్రుడు, సోముడు, వరుణుడు, మేఘములు; ఋతువులు.

ఆగ్నావైష్ణవం హవిర్న త్వృక్సం స్తవికీ దశతయీషు విద్యతే

అగ్నావిష్ణూ సజోషసేమా వర్ధన్తు వాం గిరః. హే అగ్నావిష్ణూ! ఇమాః ఏతా అస్మద్గిరః అస్మత్స్తుతయః వర్ధన్తు వర్ధయన్తు యువామ్.

దశతయీషు దశమండలావయవ-ప్రవిభాగేన తాయత ఇతి దశతయః ఋగ్వేదః తస్య శాఖా దశతయ్యాః, తాసు సర్వాస్వపి శాఖాసు ఏకాపి హవిష్యవినియుక్తా శస్త్రమధ్యపాతినీ ఋక్ అగ్నావిష్ణ్వోః సంస్తవికీ నాస్తి.

అర్థము :— అగ్నితోపాటు విష్ణుదేవతకుకూడ హవి యియ్యబడును. తు = కాని, దశతయీషు = దశసు మండలేషు తాయతే ఇతి దశతయః ఋగ్వేదః తస్య శాఖాసు దశతయీషు ఋగ్వేదీయాసు ఋక్షు ఇత్యర్థః. (దశమండలములుగా విభజించి విస్తరింపబేయబడిన ఋగ్వేదము దశతయు యనబడును. దానిశాఖలు దశతయీలు, దశతయీషు=వానియందు అనగా సమస్తఋగ్వేదమునందు) సమస్తఋగ్వేదమంత్రములలో-ఋక్కులలో - నొక్కఋక్కుకూడ అగ్ని విష్ణువనను ఇరువురుదేవతలకు సంబంధించిన స్తుతిగల సంస్తవికి ఋక్కు లేదు.

అథాప్యాగ్నాపౌష్ణం హవిర్న తు సంస్తవః.

అథాప్యాగ్నాపౌష్ణం హవిః, ఏవ న తు సంస్తవః హవిషి. పృథక్ - పృథకేవ అగ్నిః స్తూయతే పూషా చ.

అర్థము :- అథాపి మఱియు నీవిధముగనే ఆగ్నాపౌష్ణం హవిః-అగ్ని పూషా అనునీరెండుదేవతలకు సంబంధించిన హవిస్సు సమానరూపమున నీయబడినది. కాని న తు సంస్తవః = కాని సంస్తవము లేదు. ఒకే మంత్రమున అగ్నికి పూషకు సంబంధించిన స్తుతిమంత్రము కనబడదు. ఆదేవతలస్తుతి వేఱువేఱుగానె చేయబడినది

తత్రైతాం విభక్తిస్తుతిమృచమ్ ఉదాహరన్తి.

తత్ర తస్మిన్ సంస్తవే అగ్నిపూష్ణోః ఏతాం విభక్తస్తుతిం ఋచముదాహరన్తి నైరుక్తాః.

ఆసంస్తవమునందు అగ్ని, పూషా, అనునీరెండుదేవతలకు సంబంధించిన వేఱువేఱుస్తుతిగల ఋక్కును ఉదాహరణరూపమున నిరుక్తకారులు చూపుచున్నారు.

> "పూషా త్వేతశ్చ్యావయతు ప్రవిద్వానవష్టపశుర్భువనస్య గోపాః. స త్వైతేభ్యః పరిదదత్ పితృభ్యోఽగ్నిర్దేవేభ్యః సువిదత్రియేభ్యః" (ఋ. ౧౦-౧౭-౩)

పూషా త్వేతః ప్రచ్యావయతు. విద్వాన్. అనష్టపశుః, భువనస్య గోపా ఇత్యేష హి సర్వేషాం భూతానాం గోపా

యితా [ఆదిత్యః]ః స త్వైతేభ్యః పరిదదత్పితృభ్యః ఇతి. సాంశయికః తృతీయః పాదః. పూషా పురస్తాత్ తస్యాన్వాదేశః ఇత్యేకమ్. అగ్నిరుపరిష్టాత్తస్య ప్రకీర్తనేత్యపరమ్. అగ్నిర్దేవేభ్యః సువిదత్రియేభ్యః. సువిదత్రం ధనం భవతి. విందతేర్వైకోపసర్గాత్. దదాతేర్వా స్యాత్ ద్వ్యుపసర్గాత్.

భగవాన్ ఆదిత్యః పథామ్ అధిపతిః మృతం త్వామ్ "ఇతః మనుష్య లోకాత్ ప్రచ్యావయతు ప్రగమయతు అనష్టపశుః అవ్యవహితజ్ఞానః. కించ భూతజాతస్య గోపాః - రక్షితా సః పూషా త్వామేతేభ్యః - చంద్రమండలోపాంతవాసిభ్యః పితృభ్యః పరిదదత్ - పరిదదాతు. అగ్నిరపి చైతేభ్యః ఉత్కృష్య దేవేభ్యః సువిదత్రియేభ్యః - యే విద్యుతో మధ్యే నివసన్తి తేభ్యః పరిదదాతు. ఏవమియం విభక్తస్తుతిః. సువిదత్రం ధనం భవతి విందతేః వా ఏకోపసర్గాత్" సు ఇతి ఏతేన ఏకేన ఉపసర్గేణ ఉపసృష్టాత్. దదాతేర్వా ద్వ్యుపసర్గాత్ సువిభ్యాం ద్వాభ్యామ్ ఉపసర్గాభ్యామ్ యుక్తాత్. తద్యేషామస్తి తే సువిదత్రియాః.

మంత్రార్థము :- విద్వాన్ = అప్రతిహతజ్ఞాని అనష్ట - పశుః = అడ్డులేని జ్ఞానముకలవాడు అక్షిదర్శనముకలవాడు, అందువలననే భువన గోప్తా = లోకరక్షకుడు, పూషా = పోషణకర్తయునగు ఆదిత్యుడు, త్వా = నిన్ను, ఇతః = ఈలోకమునుండి, చ్యావయతు = ఉత్తమమార్గమున నడపునుగాక !, సః = ఆయగ్నిదేవత, త్వా = నిన్ను, ఏతేభ్యః పితృభ్యః = ఈపితరులకు, పరిదదత్ = ఇచ్చునుగాక, మఱియు, సువిదత్రియేభ్యః దేవేభ్యః = ఐశ్వర్యయుక్తదేవతలకు ఇచ్చునుగాక ! అనగా నీయాత్మను పితృలోకమునకు దేవలోకమునకు చేర్చునుగాక.

సాంశయికః తృతీయః పాదః = ఈమంత్రమునగల మూడవపాదము సందిగ్ధముగానున్నది. 'స త్వైతేభ్యః పితృభ్యః పరిదదత్' అనునీమూడవ పాదమునందలి 'సః'పదము సర్వనామము. మంత్రమునగల ప్రథమ ద్వితీయపాదములందలి పూషాపదమునకు గ్రాహకమగును. అట్లే చతుర్థ పాదమునందలి 'అగ్ని'పదమునకు గ్రాహకముకావచ్చు. పూషా, అగ్ని

అని రెండుపదములతోను 'సః' పదము సంబంధమగును. తస్య ప్రకీర్తనా ఇతి అపరమ్ అ'సః'పదప్రయోగము అపరము వేఱుఅనునది రెండవపక్షము. సువిదత్రమ్ - ధనమ్ - ధనవాచకము విందతేర్వా వీకోపసర్గాత్ ఏకఉప సర్గముగల విందతేః 'విద్లలాభే' అనుధాతువుతో సువిదత్ర శబ్దము సిద్ధించును. దదాతేః వా స్యాత్ ద్వ్యుపసర్గాత్ - సు విఅనురెండుఉపసర్గలతో కూడిన 'దా'దానే' ధాతువువలనను సువిదత్రశబ్దము సిద్ధించును. (సువిదత్రం ధనం విద్యతే యేషాం తే సువిదత్రియాః) ధనముగలవారు సువిదత్రియాలనబడుదురు. సువిదత్రియేభ్యః ధనముగలవారికొఱకు అని యర్థము.

> అథైతాని ఇంద్రభక్తీని. అంతరిక్షలోకః. మాధ్యందినం సవనమ్. గ్రీష్మః. త్రిష్టుప్. పంచదశస్తోమః బృహత్సామ. యే చ దేవగణాః సమామ్నాతా మధ్యమే స్థానే యాశ్చ స్త్రియః.

మహదాదయః దేవగణాః. స్త్రియః అదిత్యాద్యాః - స్పష్టమ్ అన్యత్.

అర్థము :- అథ = మఱియు, ఏతాని = ఇవి, ఇంద్రభక్తీని=(ఇంద్ర దేవతాకములు) ఇంద్రభక్తికములు అంతరిక్షలోకః = అంతరిక్షలోకము, మాధ్యం దినం సవనమ్ = మాధ్యందినసవనము, గ్రీష్మః = గ్రీష్మ కాలము, త్రిష్టుప్ త్రిష్టుప్ ఛందస్సు పంచదశస్తోమము, బృహత్సామము, యే చ=ఇవి, మఱియు, మధ్యమే స్థానే = మధ్యమస్థానమునందు, దేవగణాః సమామ్నాతాః = దేవగణములు పఠింపబడినవో, యువియు, మఱియు, యాశ్చ స్త్రియః = ఏ స్త్రీలు పఠింపబడినవో యువియు ఇంద్రునితో ఏనికన్నింటికి సంబంధమున్నది.

> అథాస్య కర్మ రసానుప్రదానం వృత్రవధః. యా చ కా చ బలకృతిరింద్రకర్మైవ తత్.
>
> అస్య ఇంద్రస్య కర్మ రసానుప్రదానం వర్షాది. వృత్రవధః మేఘవధో యాచకా చ బలకృతిః కర్మ అన్యాపి ఇంద్రకర్మ ఏవతత్ ఇతి.

అథ = మఱియు అస్యకర్మ = ఇంద్రునికార్యము, వర్షాది రసాను ప్రదానము. వర్షాదులమూలమున ఉదకమునొసంగుట. వృత్రునివధ మేఘములనుభేదించుట. ఏకొంచెము బలమునకు సంబంధించినకార్యము కలదో యదియంతయు ఇంద్రునికార్యమే ఆతనిచమత్కారమే.

**అథాన్య సంస్తవికా దేవాః. అగ్నిః. సోమః. వరుణః. పూషా. బృహస్పతిః. బ్రహ్మణస్పతిః, పర్వతః, కుత్సః, విష్ణుః వాయుః. అథాపి మిత్రో వరుణేన సంస్తూయతే.**

తద్యథా - ఇంద్రాగ్నీ రోచనా దివః ఇత్యగ్నినా సంస్తవః. సోమేన సంస్తవః - ఇంద్రాసోమా సమఘశంసమ్. వరుణేన సంస్తవః - ఇంద్రా వరుణా యువమధ్వరాయ నః.

"ఇంద్రాపూషణా వయం సఖ్యాయ స్వస్తయే హువేమ వాజసాతయే" ఇతి పూష్ణా సంస్తవః. ఇదం వామాస్యే హవిః ప్రియమింద్రాబృహస్పతీ. ఇతి బృహస్పతినా సంస్తవః. విశ్వం సత్యం మఘవానా ... అచ్ఛేంద్రా బ్రహ్మణస్పతీ ఇతి బ్రహ్మణస్పతినా సంస్తవః. ఇంద్రాపర్వతా ఇతి పర్వతేన సంస్తవః. ఇంద్రాకుత్సా వహమానా రథేన ఇతి కుత్సేన సంస్తవః. ఇంద్రావిష్ణూ దృంహితాః శంబరస్య నవ పురో నవతిం చ అథిష్టమ్ ఇతి విష్ణునా సంస్తవః. ఇంద్రవాయూ ఇమే సుతా ఇతి వాయునా సంస్తవః

ఆ నో మిత్రా వరుణా ఘృతైర్గవ్యూతిముక్షతమ్. మధ్వా రజాంసి సుక్రతూ ఇతి.

అథ = మఱియు అస్య = ఈయింద్రదేవునికి, సంస్తవికా దేవాః = సమానః స్తవః యేషాం తే = సమానస్తుతిగల దేవతలు సమాసముగా స్తుతింపబడిన దేవతలు - ఎవ్వియన - అగ్ని, సోముడు మున్నగునవి.

మఱియు, మిత్రునితోకూడ ఇంద్రునిస్తుతి చేయబడినది. అనగా ఇంద్రమిత్రులు ఇరువురు సంస్తవిక దేవతలు, ఇంద్రునికి ఇవి సహచారీ దేవతలేయై యున్నవి. కాని వీనిలోకూడ అనేకదేవతలు వేఱువేఱుగ పరస్పరము ఒకరితోనొకరు సాహచర్యము కలిగియుందురు.

**పూష్ణా రుద్రేణ చ సోమస్య.**

సోమాపూషణా జననా రయీణామ్. సోమారుద్రా యువమేతాన్యస్మే విశ్వా తనూషు భేషజాని ధత్తమ్ ఇతి రుద్రేణ సంస్తవః.

మఱియు సోమునకు పూషాకు, రుద్రదేవతలతో సాహచర్యమున్నది.

**అగ్నినా చ పూషా. వాతేన చ పర్జన్యః.**

మఱియు, పూషాకు అగ్నితోను, పర్జన్యునకు వాతముతోను సంస్తవన మున్నది. సంమిళితస్తుతి కలదు సాహచర్యమునున్నది.

**అథైతాన్యాదిత్యభక్తీని. అసౌ లోకః. తృతీయసవనమ్. వర్షా జగతీసప్తదశస్తోమః. వైరూపంసామ. యే చ దేవ గణాః సమామ్నాతా ఉత్తమే స్థానే యాశ్చ స్త్రియః.**

యే చ దేవగణాః సమామ్నాతా ఉత్తమే స్థానే ఆదిత్యాదయః. యాశ్చ స్త్రియః - ఉషాః, సూర్యా, వృషాకపాయీ, సరణ్యూః, దేవపత్న్యః ఇతి.

అథఏతాని = ఈనిమ్నలిఖితములు, ఆదిత్యభక్తీని = ఆదిత్యుని భాక్కులు = ఆదిత్యుని భజించునవి. అసౌ లోకః = ఈలోకము, ద్యులోకము, తృతీయసవనము, వర్షము, జగతిఛందస్సు, సప్తదశస్తోమము వైరూపసామము, ఉత్తమస్థానపఠితదేవతలు, వాని కంతర్గతలగుస్త్రీలు, ఇవి యన్నియు ఆదిత్యుని భజించునవియే.

**అథాస్య కర్మ రసాదానం రశ్మిభిశ్చ రసధారణమ్. యచ్చ కించిత్ ప్రవహ్లితమ్ ఆదిత్యకర్మైవ తత్. చంద్రమసా వాయునా సంవత్సరేణేతి సంస్తవః.**

అస్య - ఆదిత్యస్య, కర్మ రసాదానం - రసగ్రహణమ్. రశ్మిభిః - కిరణైః, రసస్య జలస్య ధారణమ్. ప్రవహ్లితం - పరజ్యోతిస్తిరస్కారః. పూర్వాపరం చరతో మాయయైతౌ ఇతి చంద్రమసా సంస్తవః. పంచపాదం పితరమ్ ఇతి చ సంవత్సరేణ సంస్తవః.

అథ అస్య కర్మ = మఱియు నీయాదిత్యునికర్మ రసాదానమ్ = రసమునాకర్షించుట, రశ్మిభిశ్చ రసధారణమ్ = కిరణములతో రసమును - జలమును ధరించుట, యచ్చకించిత్ = మఱియు, ప్రవహ్లితమ్=ఓషధ్యాదుల పోషణ, వనస్పతులవృద్ధి, వానిపుష్టి మున్నగునదంతయు అదిత్యుని కర్మయే - సూర్యునికార్యమే. చంద్రుడు, వాయువు, వర్షము వీనితోపాటు అస్య = ఆదిత్యుని సమానస్తవము సాహచర్యము ఉన్నది.

**ఏతేష్వేవ స్థానవ్యూహేషు ఋతుచ్ఛందః - స్తోమపృష్ఠస్య- భక్తిశేషమనుకల్పయేత.**

ఋతవశ్చ ఛందాంసి చ స్తోమశ్చ పృష్ఠాని చ ఋతుచ్ఛందః స్తోమ పృష్ఠస్య. ఋతుభక్తిశేషమ్, ఛందోభక్తిశేషమ్, స్తోమభక్తిశేషం పృష్ఠభక్తి శేషం చ. అను కల్పయేత ఊహేత.

ఏతేషు ఏవ స్థానవ్యూహేషు = ఈస్థానవ్యూహములందే = పృథివ్యాది స్థానసమూహములందే, ఋతుచ్ఛందః స్తోమపృష్ఠస్య=ఋతువు, ఛందస్సు, స్తోమము, పృష్ఠము నను వీనియొక్క, భక్తిశేషమ్ = అవశిష్టభాగమును, అనుకల్పయేత = కల్పనచేయునది.

**శరదనుష్టుబేకవింశస్తోమో వైరాజం సామేతి పృథివ్యాయత నాని. హేమంతః పంక్తిస్త్రిణవస్తోమః శాక్వరం సామేతి అంతరిక్షాయతనాని.**

అన్తరిక్షాయతనాని - అంతరిక్షలోకాయతనాని. ఆయతనం-స్థానమ్

శరత్, అనుష్టుప్, ఏకవింశతి-స్తోమము, వైరాజసామము నను నివి యన్నియు పృథివీస్థానీయములు.

హేమంతము, పంక్తి, త్రిణవస్తోమము శాక్వరసామము, ఇవి యున్నియు, అంతరిక్షస్థానీయములు.

**శిశిరోఽతిచ్ఛందాస్త్రయస్త్రింశత్ స్తోమో రైవతం సామేతి ద్యుభక్తీని.**

ద్యాం భజన్త ఇతి ద్యుభక్తీని. అపివా ఆదిత్యం భజన్త ఇతి ద్యుభక్తీని. భక్తిగ్రహణం ప్రణాలికోపపత్త్యర్థం చ యా త్వేతేషాం స్తుతిః. సా స్తుతిసంక్రమణన్యాయేన స్థానాధిపతేః సూర్యస్య స్తుతిరితి. సర్వత్రైవమ్.

శిశిరఋతువు అతిచ్ఛందస్సు, త్రయస్త్రింశస్తోమము, రైవతసామము ఇవియన్నియు ద్యులోకభాగులు.

మంత్రా మననాత్.

తేభ్యో హ్యధ్యాత్మాధిదైవాధియజ్ఞాది-మంత్రారో తదేషాం మంత్రత్వమ్.

ఇప్పటివఱకు పైననేవిచారణలు చేయబడినవో యవియన్నియు మంత్రాశ్రితములు అమంత్రములు కింవ్యుత్పత్తికా-వివ్యుత్పత్తులుకలవియో ఇప్పుడు చెప్పుచున్నాము. మననమువలన మంత్రములనబడును.

ఛందాంసి ఛాదనాత్.

అథ ఛందాంసి కస్మాత్? ఛాదనాత్ - యైరాత్మానమాచ్ఛాదయన్ దేవామృత్యోః బిభ్యతః తచ్ఛందసాం ఛందస్త్వమ్ ఇతి విజ్ఞాయతే.

మంత్రములు ఛందోమయములు. అందువలన ఛందస్సుయొక్క వ్యుత్పత్తినిచ్చుచున్నారు. ఛాదనాత్ = ఛాదనమువలన - కప్పుటవలన - ఛందస్సులనబడుచున్నవి. మృత్యువునకు భయపడుచు దేవతలు-విద్వాంసులు మంత్రములతో - ఛందస్సులతో తమ్ముదాము కప్పుకొందురు. కావున వీనికి ఛందస్సులనిపేరు.

స్తోమః స్తవనాత్. యజుర్యజతేః.

యజతేః ధాతోః. తేన హి విశేషతః ఇజ్యేత

స్తవనమ్ - స్తుతిచేయుటవలన స్తోమమనబడును. యజతేః=యజన క్రియాయోగమువలన యజుః = యజుస్సు నామమేర్పడినది. యజుర్వేదముతో యజ్ఞమునకు విశేషసంబంధమున్నది.

సామ సమ్మితమృచా. అస్యతేర్వా. ఋచా సమం మేన ఇతి నైదానాః. గాయత్రీ గాయతేః స్తుతికర్మణః. త్రిగమనా వా విపరీతా. గాయతో ముఖాదుదపతత్ ఇతి చ బ్రాహ్మణమ్.

సమ్మితమ్-తుల్యపరిమాణమ్. మేనే బ్రహ్మేతి శేషః ఇతి నైదానాః. నిదానగ్రంథవిదః. గాయత్రీ గాయతేః స్తుతికర్మణః తయా హి గీయన్తే - స్తూయన్తే దేవతాః, ఉదపతత్ - నిరగాత్.

ఋచా సమ్మితం = ఋక్కుతో సమానపరిమాణముకలది కావున సామమనబడినది. ఋక్కుతో ఉపాసనాభేదముతో సామములనబడును. స్యతేః వా = షో౽న్తకర్మణతో సామపదమేర్పడును. సామము ఉపాసనాత్మకము. ఈ ఉపాసన అన్తకర్మ=చివరికార్యము. జ్ఞాన, కర్మ ఉపాసనలలో నిది చివరిది. అంతిమము కావున సామమనబడినది. ఋచా సమం మేనే = లేక, దేవతలు ఋక్కుతో సమానముగానెంచిరి. అందువలన సామమనబడుచున్నది. అని నైదానులు - నిదానగ్రంథమునెఱిగినవారు చెప్పుచున్నారు. (నిదానమొకగ్రంథవిశేషము. దానినధ్యయనముచేసినవారు - తజ్ఞులు - నైదానులనబడుదురు.) ఛందస్సు నిర్వచనమైపోయినది. ఆఛందస్సులు గాయత్రీ,త్రిష్టుప్ మున్నగునవియే,ఇప్పుడు వానినిర్వచనము. స్తుతికర్మణః - స్తుత్యర్థకగాయతేః గైధాతువుతో గాయత్రీ సిద్ధమగును. ఈగాయత్రి ఛన్దస్సుతో దేవతాస్తుతిచేయబడినది కావున దీనిపేరు గాయత్రి. లేక త్రిగమనా - త్రీణిగమనాని యస్యాః సా = దీనికి మూడుచరణములు కలవు. త్రిగమనశబ్దమును విపరీతముచేసిన గాయత్రిశబ్దముసిద్ధించును గాయతః = గానముచేయుబ్రహ్మముఖమునుండి, ఉదపతత్ = బయటపడెను. కావున గాయత్రి అయ్యెనని బ్రాహ్మణకారులు చెప్పుదురు.

ఉష్ణిగుత్స్నాతా భవతి. స్నిహ్యతేర్వా స్యాత్ కాంతికర్మణః. ఉష్ణీషిణీవేత్యౌపమికమ్. ఉష్ణీషమ్ స్నాయతేః

ఉత్స్నాతా - గాయత్రీ చతుర్భిరక్షరైరధికైరుద్వేష్టితా ఇవ భవతి స్నిహ్యతేః వా స్యాత్ కాంతికర్మణః స్నిగ్ధం దేవతానాం కాంతమేతచ్ఛన్దః. ఔపమికమ్ చత్వార్యక్షరాణ్యస్యాః ఉష్ణీషమివ లక్ష్యన్తే తేనోష్ణిక్. స్నాయతేః శౌచార్థస్య శుద్ధం హి తద్భవతి శుక్లమ్.

ఉష్ణిక్ - అని పేరెలకలిగినది ? ఉత్స్నాతా భవతి = ఈఛందస్సు గాయత్రికంటె నాలుగక్షరములతో అధికముగా ఉద్వేష్టితమై యున్నది. కావున ఉష్ణిక్ - అని దీనికి నామము కలిగినది. లేక, కాంతికర్మణః

ఇచ్ఛార్థక స్నిహ్యతేః 'ష్ణిహ' ధాతువుతో ఉష్ణిక్ శబ్దమేర్పడినది. ఈఛందస్సు దేవతలకిష్టములు - స్నిగ్ధము - ప్రియము. ఉష్ణీషిణీవ ఇతి ఔపమికము. లేక, గాయత్రికంటె నాలుగక్షరములు ఈఛందస్సునకు తలగుడ్డస్థానమున అధికముగానున్నవి. శిరోభూతములు. కావున ఉష్ణీషము - తలగుడ్డతో నుపమింపబడినది. ఉష్ణిక్ - ఛందస్సు.

**కకుప్ కకుభినీ భవతి. కకుప్ చ కుజతేర్వా. ఉబ్జతేర్వా.**

స ఉష్ణిక్ భాగతేన పాదేనోపహితేన మధ్యతః కకుబిత్యుచ్యతే. స హ్యస్యా కకుబివ మధ్యతో, తేన కకుభినీవ కకుప్. అథ కకుప్ కస్మాత్? కుజతేర్వా - కౌటిల్యార్థస్య ఉబ్జతేర్వా - న్యగ్భావార్థస్య, నతం హి తద్భవతి.

అర్థము :— కకుప్ ఛందస్సు ఉష్ణిక్ ఛందస్సు భేదమే. ఈఛందస్సు మధ్యనుందు పాదములలో కొన్నిఅక్షరము లధికముగానుండును. అందు వలన నీఛందస్సు మధ్యలో పైకిపెరిగినట్లు - మనుష్యునిగూనివలె ఎద్దు మూపురమువలె ఉండును కావున కకుభినీ భవతి. మూపురముగలదివలె అగును. కావునకకుప్-అనబడి. కకుప్ చ కుజతేర్వా లేక, కౌటిల్యార్థక 'కుజ్' ధాతువుతో కకుప్శబ్దము సిద్ధించును. ఉబ్జతేర్వా లేక న్యగ్భావార్థక 'ఉబ్జ' ధాతువువలనను కకుప్శబ్దము సిద్ధించును. న్యగ్భావమన వంగి యుండుట. ఎద్దుమూపురమునకు రెండువైపుల వంపు కనబడునుగదా!

కుబ్జశ్చ.

కుబ్జోఽప్యనయోరేవాన్యతరస్మాత్.

కుబ్జః = గూని, గూనికలవాడు. కుబ్జశబ్దము పైనజూపిన రెండు (కుజ, ఉబ్జ ధాతువులలో నొకదానిచే నేర్పడును)

**అనుష్టుబనుష్టోభనాత్. గాయత్రీమేవ త్రిపదాం సతీం చతుర్థేన పాదేనానుష్టోభతి. ఇతి చ బ్రాహ్మణమ్.**

గాయత్రీ త్రిభిరష్టాక్షరైః పాదైః సమాప్యతే. పునరపరః చతుర్థః పాదః యేన తామేవానుష్టోభతి తస్మాత్ అనుష్టుప్.

అనుష్టోభనాత్ - అనుష్టోభనము - అనుస్తవనము - అనుకరణము చేయుటవలన అనుష్టుప్ నామమేర్పడినది. త్రిపదాం సతీం గాయత్రీమేవ.

మూడుపాదములు కలిగిన గాయత్రీఛందస్సునే చతుర్థపాదేన - చతుర్థ చరణముతో అనుష్టోభతి=అనుకరించును అందువలన అనుష్టుప్ అనబడు చున్నది. ఇతి బ్రాహ్మణవచనమ్ - అని బ్రాహ్మణము చెప్పుచున్నది.

బృహతీ పరిబర్హణాత్. పంక్తిః పంచపదా.

పరివృద్ధాసా బృహతి భవతి. అనుష్టుభశ్చతుర్భిరక్షరైః - పంచభిః పాదైః పంక్తిరిత్యుచ్యతే.

పరిబర్హణాత్ = పరివృద్ధివలన బృహతినామమేర్పడినది. అనుష్టుప్ నందు నాలుగక్షరములధికమగును. పంచపదాపంక్తిః=ఐదుపాదములవలన పంక్తి అనబడును.

త్రిష్టుప్ స్తోభత్యుత్తరపదా. కా తు త్రితా స్యాత్. తీర్ణతమం ఛందః. త్రివృద్వజ్రః. తస్య స్తోభతీతి వా. యత్ త్రిరస్తోభత్ తత్ త్రిష్టుభస్త్రిష్టుప్త్వమ్. ఇతి విజ్ఞాయతే.

స్తోభతిధాతురుత్తరం పదం యస్యాః సేయం స్తోభత్యుత్తరపదా అథ పునః పూర్వపదే యేయం త్రితా త్రిత్వం శ్రూయతే - 'త్రి' ఇతి ఏతత్ కిమర్థమ్? తీర్ణతమం - స్తుతతమమిదం ఛందః గాయత్ర్యాదిభ్యో బహుత్వాత్ సేయం తీర్ణతమా చ స్తోభతి చేతి త్రిష్టుప్. త్రివృద్వజ్రః తస్య స్తోభతి ఇతి వా, వజ్రం ఆయుధమ్. ఐంద్రమేతచ్ఛన్దః. వజ్రం చేన్ద్రో భక్తిః, తస్మాదుపపద్యతే. యత్ త్రిరస్తోభత్ తత్ త్రిష్టుభస్త్రిష్టుప్త్వమ్. ఇతి విజ్ఞాయతే - ఇతి.

త్రిష్టుప్ నామమెట్లు కలిగినది?

స్తోభత్యుత్తరపదా - ఏలయనః- ఇందుస్తుభ్ ఉత్తరపదము. కావున త్రిష్టుప్ అనబడినది. కా తు త్రితా స్యాత్? ఈత్రితా - త్రి - ఏమిటి? తీర్ణతమం ఛందః = ఈఛందస్సు తీర్ణతమమ్ ఛందస్సులను దాటి పోయినది. ఇతర ఛందస్సులకంటె ఇది విస్తృతము. అందువలన స్తుభ్ నకుపూర్వము త్రి - ప్రయుక్తమైనది. వా లేక, త్రివృత్ వజ్రః తస్య స్తోభతి = త్రివృత్ = వజ్రము - దానిని స్తుతిచేయును. కావున త్రిష్టుప్ - అయినది. యత్ - ఎందువలన త్రిః అస్తోభత్ = ముమ్మారు స్తుతించినదో

తద్=అందువలన, త్రిష్టుభః త్రిష్టుప్త్వమ్. త్రిష్టుప్త్వమ్ - కలది - త్రిష్టుప్ అయినది. అని విజ్ఞాయతే = తెలియబడుచున్నది.

**జగతీ గతతమం ఛందః. జలచరగతిర్వా. జల్గల్యమానోఽ సృజత్ ఇతి చ బ్రాహ్మణమ్.**

జగతీ గతతమం ఛందః అంత్యమిత్యర్థః. అతః పరమతిచ్ఛందాంసి. జలచరగతిర్వా జలోర్మికాకారో హి తస్యాః ప్రస్తారః. జగల్గల్యమానోఽసృజత్ ఇతి చ బ్రాహ్మణమ్. గ్లై హర్షక్షయే. క్షీణహర్ష ఇవ కిలైతాం ప్రజాపతిః ససృజే దదర్శేత్యర్థః - స హి ఛందాంసి క్రియున్తే నిత్యత్వాత్ ఏవ ఛందసామ్. అనాది నిధనా నిత్యా వాగుత్సృష్టా స్వయంభువేతి స్మరణాత్.

గతతమంఛందః - మిక్కిలిగ ముందుకు నడుపబడిన చందస్సు - అన్నిటికంటె అన్త్య-చివరిఛందస్సు. అందువలన నిది జగతి అనబడినది. లేక - జలతరంగములవలె దీనివిస్తారము జరిగినది. కావున జగతి అనబడినది. జల్గల్యమానః అసృజత్=ప్రజాపతి ఈఛందస్సును క్షీణహర్షము గలవాడై సృజించెను. కావున జగతి అనబడినదని బ్రాహ్మణము.

**విరాడ్ విరాజనాత్ వా విరాధనాద్వా. విప్రాపణాద్ వా. విరాజనాత్ సంపూర్ణాక్షరా. విరాధనాదూనాక్షరా. విప్రాపణాదధికాక్షరా.**

విరాజం నిరాహ విరాట్ ఇతి సః కస్మాత్? విరాజనాద్వా విరాధనాద్వా విప్రాపణాద్వా. విరాజనాత్ సంపూర్ణాక్షరా సాకల్యాత్ విరాజత ఇవ. విరాధనాత్ ఊనాక్షరా వైకల్యాత్ విరాధ్యన్తీవ హి సా. విప్రాపణాత్ అధికాక్షరా విప్లుతేవ హి సా స్వరూపాత్.

విరాజనాత్ వా = లేక ప్రదీప్తమగుటవలన, విరాధనాత్ వా = విగత వృద్ధియగుటవలన, లేక విప్రాపణాత్=విశేషప్రాప్తికలుగుటవలన విరాట్-ఛందః - నామము కలిగినది. విరాజనాత్ = సంపూర్ణాక్షరముకలదగుటవలన విరాట్, విరాధనాత్=ఊనాక్షరములుగలదగుటవలన-విరాట్ విప్రాపణాత్ - అధికాక్షరముకలదగుటవలన విరాట్ ఛందస్సు అగునని భావము.

**పిపీలికామధ్యేత్యౌపమికమ్. పిపీలికా పేలతేర్గతి కర్మణః.**

మధ్యాల్పాక్షరపాదా యా సాపి పిపీలికామధ్యేవ భవతి పిపీలికా స్వరూపా. పిపీలికా కస్మాత్? పేలతేర్గతికర్మణః - గత్యర్థస్య, పేల్యతే గమ్యతే యయా సా కీటికేత్యర్థః.

మధ్యన అల్పాక్షరపాదముగలది పిపీలికాఛందస్సనబడును. పిపీలిక యొక్క, మధ్యభాగమువలె నుండును. పిపీలికవలె నుండును కావున పిపీలిక - ఛందస్సులనబడును. గత్యర్థక పేలధాతువువలన పిపీలికాశబ్దము సిద్ధించును. పిపీలిక - చిన్నకీటము చీమ.

**ఇతీమా దేవతా అనుక్రాంతాః.**

ఇతికరణః ప్రకరణసమాప్త్యర్థః. ఇమాః దేవతాః అనుక్రాంతాః అగ్నిః, జాతవేదాః, వైశ్వానరః - ఇత్యేవమాద్యాః సమాసతో నిర్దిష్టా ఇత్యర్థః.

ఈవిధముగ అగ్న్యాదిదేవతలు సంక్షేపముగ వర్ణింపబడినవి.

**సూక్తభాజః. హవిర్భాజః. ఋగ్భాజశ్చ భూయిష్ఠాః కాశ్చిన్ని పాతభాజః.**

కాశ్చిత్ హవిర్భజన్తే న సూక్తమ్ కాశ్చిత్ సూక్తం భజన్తే న హవిః, కాశ్చిదుభయం భజన్తే.

ఋగ్భాజశ్చ భూయిష్ఠాః ప్రాయేణేత్యర్థః.

నిపాతో హి ద్వివిధః. దేవతాంతరైః సహ సాధారణ్యేనోపస్తుతా నైఘంటుకత్వేన చ.

వీనిలో కొన్ని సూక్తభాక్కులు మఱికొన్ని హవిర్భాక్కులు కూడ. కొన్నిదేవతలు సూక్తభాక్కులే కాని హవిర్భుక్కులు కావు. కొన్ని హవిర్భుక్కులే సూక్తభాక్కులుకావు. కొన్ని ఉభయభాక్కులు నున్నవి. ఋగ్భాజశ్చ భూయిష్ఠాః ఋగ్భాక్కులు అధికముగానుండును. కాశ్చిత్ నిపాతభాజః = కొన్ని నిపాతభాక్కులు ఉన్నవి. వేరువర్ణన ఒక్కసూక్తమునందో అనేకసూక్తములందో కానగునో ఆదేవతలు సూక్తదేవతలనబడును. ఏదేవతలనుద్దేశించి హవిర్దానము చేయబడునో యాదేవతలు హవిర్భాక్కు

లనబడుదురు వారు సూక్తభాక్కులు కారు. అన్యాన్య - ఇతరదేవతలతో నదేవతలవర్ణన గౌణరూపమున చేయుబడునోయాదేవతలు నిపాతభాక్కులన బడుదురు. కొండొకఋక్కునందు వర్ణనగల దేవత ఋగ్భాక్ అనబడును.

**అథోతాభిధానైః సంయుజ్య హవిశ్చోదయతి. ఇంద్రాయ వృత్రఘ్నే. "ఇంద్రాయ వృత్రతురే" "ఇంద్రాయాం హోముచ ఇతి. (మై. సం. 3-౧౫-౧౧).**

అథ ఇతి విశేషాధికారే ఉత ఇత్యప్యర్థే - అభిధానైః విశేషణశబ్దైః తద్యథా "ఇంద్రాయ వృత్రఘ్నే ఏకాదశకపాలం నిర్వపేత్ ఇతి.

అథ, ఉత, ఇందు అథశబ్దము విశేషఅధికారార్థము. ఉతశబ్దము అపిఅర్థమున అభిధానైః = విశేషణపదములతో అభిధానైః సంయుజ్య = గుణములనుచెప్పునామములతో హవిస్సు ఇయ్యబడును. ఎట్లన :- ఇంద్రాయవృత్రఘ్నే=వృత్రహంతకుడగు నింద్రునకు హవిస్సు దానము చేయబడును. వృత్రఘ్న, వృత్రతుర, అంహోముచ ఇంద్రునకివి సార్థక విశేషణములు - ఇట్టి విశేషణవిశిష్టుడైన ఇంద్రునకు హవి ప్రదానము చేయబడును. ఎట్లన:- "ఇంద్రాయ వృత్రఘ్నే ఏకాదశకపాలం నిర్వపేత్"

**తాన్యప్యేకే సమామనన్తి.**

ఏకే - నైరుక్తాః తాన్యపి - గుణపదాని వృత్రహం హోముక్ప్రభృతీని దేవతాపదసమామ్నాయే పృథక్ పృథక్ సమామనన్తి.

ఏకే = కొందఱు నిరుక్తకారులు, తాన్యపి = ఈగుణపద - విశేషణ పదములనుగూడ దేవతాపదసమామ్నాయమున పృథక్ పృథక్పఠన్తి = విడివిడిగా చదువుదురు.

**భూయాంసి తు సమామ్నానాత్. యత్తు సంవిజ్ఞానభూతం స్యాత్ ప్రాధాన్యస్తుతి తత్సమామనే.**

అహం తు న సమామనే. కస్మాత్ ? భూయాంసి తు = బహుతరాణి సమామ్నానాత - కథనాత్, గుణపదాని, తతోఽన్యాన్యపి బహుతరాణి సన్తి. మహభాగ్యాద్దేవతాయా గుణానామియత్తా నాస్తీతి. తేషాం సర్వేషాం సమా

మ్నానే సమామ్నాయస్యాపరినిష్ఠైవ స్యాత్. తస్మాద్భూయాంసి తు... యదేతత్సం విజ్ఞానభూతం రూఢమగౌణం నిర్విశేషణం లబ్ధప్రధానస్తుతిదేవతాపద మగ్న్యాది తత్సమామనే న గౌణం వ్రతభృత్ వ్రతపత్యాది. సమామనే పదకథనేన నిఘంటుకకర్తృత్వం యాస్కస్యైవ సిద్ధ్యతి స కశ్యపస్యేతి విచారణీయమితి శ్రీగురుచరణాః సీతారామశాస్త్రిణః

తు = కాని, భూయాంసి = ఇట్లు బహుదేవతలగును. వాని సమా మ్నానాత్ = సమామ్నాయమువలనను చాల ఎక్కువగును. తు అహమితి శేషః - నేను మాత్రముప్రాధాన్యస్తుతి = ప్రధానస్తుతిచేయబడినదియు, సంవిజ్ఞానభూతంస్యాత్=విజ్ఞానభూతమైనదియునగు విశేష్యమును దేవతగా నంగీకరింతును. విశేషణముల నంగీకరింపను.

అథోత కర్మభిర్ ఋషిః దేవతాః స్తౌతి. వృత్రహా. పురం దరః. ఇతి.

వృత్రహా శతక్రతుః పురందరః, గోత్రభిద్, వజ్రబాహుః ఇతి.

మఱియు ఋషిః వేదము, కర్మభిః = కర్మములనామముగ్రహించి, దేవతాః స్తౌతి = దేవతలను స్తుతియించును. ఎట్లన-వృత్రహా, పురందరః. వృత్రుని చంపువాడు, పురములను విదారణచేయువాడు, - అని.

తాన్యపి ఏకే సమామనన్తి.

తాన్యపి ఏకే కర్మనామధేయాని సమామనన్తి.

ఏకే = కొందఱు నైరుక్తులు, తాన్యపి = ఆకర్మనామములనుగూడ దేవతాసమామ్నాయమున చదువుదురు.

భూయాంసి తు సమామ్నానాత్.

ఇతి స ఏవ దోషః.

కాని, ఇట్లు కర్మనామములు, కర్మవిశేషణములు పఠనమువలన దేవతలసంఖ్య మిక్కిలి యధికమగును.

వ్యంజనమాత్రం తు తత్ తస్య అభిధానస్య భవతి. యథా బ్రాహ్మణాయ బుభుక్షితాయౌదనం దేహి. స్నాతాయాను లేపనమ్. పిపాసతే పానీయమితి.

తత్ - తస్యైవేంద్రాదేః ముఖ్యస్య సంవిజ్ఞానపదస్య వ్యంజనమాత్రం విశేషణమాత్రం భవతి. అతో న సమామనే తాని.

తత్తు = వృత్రహా ఆది = వృత్రహంతకుడు మున్నగు కర్మబోధక పదములు, తస్య అభిధానస్య = ఇంద్రుడు అను నామమునకు, వ్యంజన మాత్రం భవతి = విశేషణముమాత్రమే యగును. ఉదా :- బ్రాహ్మణుడు ఆకలిగొనియున్న అతనికి అన్నముపెట్టుము. స్నానముచేసిన గంధము నిమ్ము. దప్పికగొనియున్న త్రాగుటకు నీరిమ్ము.

ఇందు - బ్రాహ్మణుడొక్కడు. మిగిలినవి విశేషణములు. అవి విశేష్యములు కావు అట్లే ఉపర్యుక్తదేవతలవిషయమున నెంచవలెను. విశేష్యములే దేవతలు - విశేషణములు కావు.

ఇతి తృతీయః పాదః

మూడవ పాదము సమాప్తము

# చతుర్థపాదము

అథాతోఽనుక్రమిష్యామః.

తదర్థమధికారవచనమ్ అథేతి - అతః - ఇతి అనంతర్యే, అను-అను పూర్వ్యేణ - క్రమిష్యామః - వర్ణయిష్యామో వ్యాఖ్యాస్యామ ఇతి వాక్యశేషః.

అథ - ఇది అధికారవచనము. అతః = ఇటనుండి (తర్వాత) అను క్రమిష్యామః = నిఘంటువుయొక్క దైవతకాండమును క్రమముగా వ్యాఖ్యానింతుము.

అగ్నిః పృథివీస్థానః, తం ప్రథమం వ్యాఖ్యాస్యామః.

పృథివ్యేవాస్య విశేషతః స్థానమ్. న అంతరిక్షమ్ - న ద్యౌః, తత్ర కర్మాధికారాత్తస్య.

అగ్నిః పృథివీస్థానః. అగ్నిదేవత పృథివీస్థానీయము - (పృథివ్యేవ స్థానం యస్య అసౌ పృథివీస్థానః - న - అంతరిక్షమ్. న ద్యౌః) పృథివియే స్థానముగా గలది. అంతరిక్షము దివము రెండును అగ్నికి స్థానములు కావు. అట్టి యగ్నినిగూర్చి ముందుగా వ్యాఖ్యానింతుము.

**అగ్నిః కస్మాత్ ? అగ్రణీర్భవతి. అగ్రం యజ్ఞేషు ప్రణీయతే, అంగం నయతి సంనమమానః.**

యథా - అగ్నిర్వై దేవానాం సేనానీః. అథవా అంగం నయతి సంనమమానః, యత్రాయం సన్నమయతి సాధనత్వేన వైదికే వా లౌకికే అర్థేవా తత్ర సన్నమమాన ఏవ ఆత్మానం ప్రధానీకృత్య సర్వమన్యదాత్మ నోఽఙ్గతాం నయతి - గుణీకరోతీత్యర్థః.

అగ్నికి అగ్నినామ మెట్లు కలిగినది ? అగ్రణీర్భవతి = అగ్ని ముందుండును అగ్రశబ్దము ప్రధానవాచకము. అగ్ని అన్నివిషయము లందును తనను ముందుతీసికొని పోవును. అయ్యది స్వీయముగా ముందుండి యుపకరించును. అగ్రం యజ్ఞేషు ప్రణీయతే=యజ్ఞకార్యము నందు అగ్ని ముందుగా తీసికొనిపోబడును. అగ్నితోనే యన్నికార్యములు ప్రారంభములగును, అథవా సన్నమమానః =తృణమునుగాని కాష్ఠమును గాని దేనినైనను ఆశ్రయమిచ్చి అంగం న యతి =ఆత్మాధీనముచేసి కొనును. అందువలననే అగ్నియనబడుచున్నది.

**అక్నోపనో భవతీతి స్థౌలాష్ఠీవిః. న క్నోపయతి న స్నేహ యతి.**

స్థూలాష్ఠీవతః పుత్రః స్థౌలాష్ఠీవిః. అయమక్నోపనో భవతీతి తస్మా దగ్నిరితి. న స్నేహయతీతి - విరూక్షీకరోతీత్యర్థః స హి తస్య స్వభావః.

స్థౌలాష్ఠీవినామ ఆచార్యుడు చెప్పుచున్నాడు - ఏమని - అగ్ని అక్నోపనః భవతి అక్నోపనమగును. న స్నేహయతి = స్నిగ్ధముచేయదు. సర్వరసములను శుష్కింపజేయును. అందువలన అగ్ని యనబడును. అక్నోపనశబ్దము అస్నేహనము - విరూక్షీకరణము శుష్కింపజేయును.

**త్రిభ్యః అఖ్యాతేభ్యః జాయత ఇతి శాకపూణిః. ఇతాత్ అక్తాత్ దగ్ధాద్వా. నీతాత్. స ఖల్వేతే రకారమాదత్తే - గకారమనక్తేర్వా దహతేర్వా నీః పరః.**

త్రయాణాం ధాతూనామ్ అభిధేయాః క్రియా అత్ర లక్ష్యన్తే తద్యథా ఇతాత్ - ఇణ్ గతౌ ఇత్యస్మాదిత్యర్థః. అక్తాత్ దగ్ధాద్ వా అనక్తేర్వా దహతేర్వా ఏతయోర్వికల్పః. తతః నీతాత్ - 'ణీఞ్' ప్రాపణే ఇత్యేతస్మాత్. స ఖలు శాకపూణిరాచార్యః ఏతేః ధాతోః అకారమ్ ఆదత్తే గకారమ్ అనక్తేర్వా దహతేః కృతకుత్వం, జక్త్వం కృతఘత్వం, జక్త్వయోర్వికల్పేన నీః పరః ఏష హ్రస్వః, ఏతి చ వ్యనక్తి చ రూపాణి, అథవా ఏతి చ దహతి చ నయతి చ హవీంషి దేవేభ్యః ఇత్యగ్నిః.

శాకపూణిఆచార్యుని కథనమేమన ఈఅగ్నిశబ్దము మూడుక్రియలతో నేర్పడుచున్నది ఇతాత్ 'ఇణ్'ధాతువువలన, అక్తాత్ దగ్ధాత్ వా - అంజూ దహ, ధాతువులతో నీతాత్ - ణీఞ్ ధాతువుతోను. అంజూ, దహ అనురెండింటిలో నొకదానితో అది వికల్పము. సః ఖలు = ఆ శాకపూణి, ఏతేః అకారమాదత్తే=ఇణ్ ధాతువునుండి అకారమును గ్రహించుచున్నాడు. గకారమును, అనక్తేః, దహతేఃవా అంజూ, దహధాతువులనుండి తీసికొనుచున్నాడు. చివరకు 'నీ ధాతువును తీసికొని అగ్నిశబ్దము సిద్ధమగునని చెప్పుచున్నాడు.

**తస్యైషా భవతి.**

తస్య - అగ్నిమీళే ఇత్యేతత్ ప్రముఖాయిచ ఉదాహరణమ్.

**"అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవమృత్విజమ్. హోతారం రత్నధాతమమ్" (ఋ. ౧-౧-౧).**

అగ్నిమీళే - అగ్నిం యాచామి. ఈళిరధ్యేషణాకర్మా, పూజాకర్మా వా. పురోహితో వ్యాఖ్యాతో యజ్ఞస్య. దేవో దానాద్ వా. ద్యోతనాద్వా దీపనాద్వా. ద్యుస్థానో భవతీతి వా. యో దేవః సా దేవతా. హోతారం హ్వాతారమ్. జుహోతేర్హోతేత్యౌర్ణవాభః రత్నధాతమమ్ రమణీయానాం ధనానాం దాతృతమమ్.

పురోహితః - పురః ఏనమ్ దధతీతి, దేవః దదాతిహ్యసౌ సర్వాణి దీపనాద్వా దీపయతి హ్యసౌ తేజోమయత్వాత్. హోతారం - హ్వాతారం దేవతానామ్. ఔర్ణవాభఆచార్యస్తు జుహోతేః-హు దానాదనయోః ఇత్యస్మాత్ మన్యతే హోతా ఇతి.

మంత్రార్థము :- యజ్ఞస్య పురోహితమ్ = యజ్ఞముపురోహితుడు - సర్వయజ్ఞములందును ముందుంచబడు. దేవమ్ = ప్రదీపకుడు, ఋత్విజమ్ = ప్రతిఋతువునందును చేయబడుయజ్ఞమునకు యష్టయు, హోతారం = దేవతలనాహ్వానించు, రత్నధాతమమ్ = రత్నములనిచ్చునట్టియు, అగ్నిమ్ = అగ్నిదేవుని, ఈడే = స్తుతించుచున్నాను, యాచించుచున్నాను.

ఈడిరధ్యేషణాకర్మా. ఈడధాతువిట యాచనార్థకము. పూజాకర్మావా - లేక స్తుత్యర్థకము. పురోహితుడు, యజ్ఞము రెండును వ్యాఖ్యానింపబడినవి. దేవః దానాద్వా = దానముచేయుటవలన దేవుడనబడును, దీపనాద్వా = దీపనకర్తయగుటవలన, ద్యోతనాద్వా = ప్రకాశకుడగుటవలన, ద్యుస్థానో భవతీతి వా = ద్యులోకమున నుండుటవలనను దేవుడనబడును. యో దేవః సా దేవతా = దేవుడే దేవత హోతారమ్-హ్వాతారమ్= దీనియర్థము హోతా = ఆహ్వానించువాడు, హుధాతువుతో హోతా సిద్ధించును. ఇది ఔర్ణవాభునికథనము. రత్నధాతమమ్=రమణీయానామ్ ధనానాం దాతృతమమ్ = ఉత్తమమైన ధనములనిచ్చువాడు.

తస్యైషాఽపరా భవతి. "అగ్నిః పూర్వేభిః ఋషిభిరీడ్యో నూతనైరుత. స దేవాఁ ఏహ వక్షతి" (ఋ. ౧-౧-౨)

అగ్నిర్యః పూర్వైః ఋషిభిరీళితవ్యో వన్దితవ్యో అస్మాభిశ్చ నవతరైః స దేవానిహావహత్వితి.

అగ్నిః యః పూర్వేభిః - పూర్వైః చిరన్తనైః ఋషిభిః ఈడితవ్యః - ఈడనం పూజనమర్హతి. అస్మాభిశ్చ నవతరైః నవ్యైః. స దేవానిహ-ఏతస్మిన్ కర్మణి అస్మాకమావహతు. అయగ్నిదేవతావిషయమునకు సంబంధించిన మఱియొకఋక్కు.

మంత్రార్థము :– అగ్నిః = ఏ అగ్ని, పూర్వేభిః ఋషిభిః = పూర్వపు ఋషులచే, ఈడ్యః = యాచింపదగినవాడో, సః అగ్నిః = ఆయగ్ని, ఉత = మఱియు, నూతనైః = నూతనములైన, అస్మదాదిభిః=మనవంటివారిచేతను, ఈడ్యః = స్తుతింపదగినవాడు. ఆయగ్నియే ఇహ = ఈయజ్ఞమునందు, దేవాన్ = దేవతలను, ఆవక్షతి = పిలుచుకొనివచ్చును గాక !.

స న మన్యేతాయమేవాగ్నిరితి. అప్యేతే ఉత్తరే జ్యోతిషీ అగ్నీ ఉచ్యేతే. తతో ను మధ్యమః.

సః శిష్యః న మన్యేత - న విజానీయాత్ అయమేవాగ్నిః పృథివి స్థాన ఇతి. అపి ఏతే ఉత్తరే జ్యోతిషీ - మధ్యమం చ, ఉత్తమం చ అగ్నీ ఉచ్యేతే తతో ను యథా మధ్యమః అగ్నిశబ్దేనోచ్యతే. తథేమామృచముదాహరిష్యామః.

సః = ఆ, నిరుక్తాధ్యేతా = నిరుక్తము నధ్యయనముచేయుశిష్యుడు, న మన్యేత=ఎంచరాదు - ఇంతకుమించి మఱియేమియులేదని తలంచరాదని భావము. పైమంత్రమున వర్ణించిన అగ్నితప్ప మఱియొక యగ్నిలేదని భావము. అపి = కాని, ఏతే ఉత్తరే జ్యోతిషీ = పైనసుండు సూర్యుడు విద్యుత్తు అను రెండుజ్యోతిస్సులు భూమిస్థమగు నగ్నికంటె భిన్నముగా నున్నవి. అవియు అగ్నిశబ్దవాచ్యములే. అవి పార్థివాగ్నికంటె ఉత్తమం చ, మధ్యమం చ = ఉత్తమము, మధ్యమము అని చెప్పదగినవి రెండు జ్యోతిస్సులున్నవి. మధ్యమాగ్ని విద్యుత్తు, ఉత్తమాగ్ని సూర్యుడు. ఈ విషయమే ఉత్తరే =ద్వివచనపదముచే చెప్పబడినది. అగ్నిశబ్దముచే విద్యుత్తు, సూర్యుడు గ్రహింపబడును. తతః ను మధ్యమః = మధ్యమాగ్ని విద్యుత్తును తెలుపుమంత్రము నుదాహరించుచున్నాము.

"అభి ప్రవన్త సమనేవ యోషాః కల్యాణ్యః స్మయమానాసో అగ్నిమ్. ఘృతస్య ధారాః సమిధో నసన్త తా జుషాణో హర్యతి జాతవేదాః" (ఋ. ౪-౫౮-౮).

అభినమన్త సమనస ఇవ యోషాః. సమనం సమననాద్వా. సంమాననాద్వా. కల్యాణ్యః. స్మయమానాసః. అగ్నిమిత్యౌపమికమ్. ఘృతస్య ధారా ఉదకస్య ధారాః సమిధో

నసన్త. నసతి రాప్నోతికర్మా వా. నమతికర్మా వా.
తా జుషాణో హర్యతి జాతవేదాః. హర్యతిః ప్రేప్సాకర్మా.
విహర్యతీతి.

అభిప్రవన్త-అభిముఖ్యేన నయన్తి ప్రవహ్వీభవన్తి ఘృతస్య-ఉదకస్య ధారాః మధ్యమమ్ అగ్నిమ్. కథమ్? సమనా ఇవ యోషాః సమనసః - సమానమనసః. ఏకస్మిన్ భర్తరి యాసాం మనాంసి వర్తన్తే తాః సమనసః. తా యథా కల్యాణ్యః - రూపయౌవనాదిగుణసంపన్నాః స్మయమానాసః - ఈషద్ధసన్త్యః పరిష్వంజనాయ అభినమేయుః తథా మధ్యస్థానమగ్నిం ఘృతస్య ధారాః సమిధః - సమింధయన్త్యః, నసన్త - ప్రాప్నువన్తీత్యర్థః. హర్యతి - పునః పునః ప్రేప్సతి - అభికామయతే ఏవం చ యోఽయ మగ్నిశబ్దః అసామర్థ్యాత్ మధ్యమం జ్యోతిరాహ తస్మాత్ సుష్ఠు నస మన్యేత అయమేవాగ్నిః పృథివీ స్థాన ఇతి

మంత్రార్థము :- కల్యాణ్యః=కల్యాణయుక్తలు, స్మయమానాసః= చిఱునవ్వులతోనవ్వుచు, సమనా = సమానమనస్కులుంచు, యోషాః = స్త్రీలు, అభిప్రవన్త=తమపతిని అనుకూలవతులై ప్రాప్తించునట్లు, ఘృతస్య ధారాః = జలధారలు, సమిధః=సమిధలుప్రజ్వాలింపజేయుచు, అగ్నిమ్= మధ్యమస్థానీయమగు అగ్నిని - విద్యుత్తును, నసన్తః = ప్రాప్తింతురు, తాః = ఆధారలను, జుషాణః = సేవించు, జాతవేదాః = మధ్యమస్థానీయాగ్ని, హర్యతి = మాటిమాటికి కోరును. పత్ని పతినిగోరునట్లు.

సమనమ్ సమననాత్ = సమానముగ మననముచేయుటవలన, సమ్మాననాత్వా = సమానముగ గౌరవించుటవలనగాని, సమనలనబడును. సమానం మనః యాసాం తాః = సమానమనస్సుగలస్త్రీలు అనియర్థము. సమనస్ - లోని సకారలోపమువలన సమన అనబడుచున్నారు. కల్యాణ్యః స్మయమానాసః ఇతి ఔపమికమ్ = కల్యాణయుక్తలై చిఱునవ్వులు నవ్వుచు - ఇదియుపమా. నసతిః ఆప్నోతికర్మా - నసతి అనగా ప్రాప్తించుట - నమతికర్మా - లేక నస ధాతువు నమనార్థకము. లేక హర్యతిః ప్రేప్సాకర్మా = హర్యధాతువునకర్థము అభిలషించుట ఈమంత్రమున అగ్నిశబ్దము విద్యుద్వాచకము. జలధారలతో విద్యుదుత్పత్తి యగునని వర్ణింపబడినది.

"సముద్రాదూర్మిర్మధుమాఁ ఉదారత్" (ఋ. ౪-౫౮-౧)
ఇత్యాదిత్యముక్తం మన్యన్తే.

సముద్రాత్ - ఉదకసంఘాతాత్. ఊర్మిః సర్వస్య తేజసః ఛాదకః ప్రకాశేన మధుమాన్ - ఉదకవాన్ ఉదారత్ - ఉదేతి అహన్యహని.

సముద్రాత్ = మున్నుగుమంత్రములందు, ఆదిత్యమ్ ఉక్తమ్ మన్యన్తే = అనగా నీమంత్రమునందు ఆదిత్యాగ్ని గ్రహింపబడినదని యర్థము. "సముద్రాదూర్మిర్మధుమాఁ ఉదారదుపాంశునా సమమృతత్వ మానట్, ఘృతస్య నామ గుహ్యం యదస్తి జిహ్వా దేవానామమృతస్య నాభిః"

సముద్రాత్ - ఆకాశమునుండి లేక ఉదకసంఘాతమునుండి, ఊర్మిః = ప్రకాశముతో నన్నింటిని అచ్ఛాదితమొనర్చు, మధుమాన్ = ఉదకవంతమగు, ఆదిత్యః = ఆదిత్యుడు, ఉదారత్ = దిగెను - లేక ఉదయించెను. అంశునా = ఈయాదిత్యుడు చంద్రునితో సంయుక్తుడై, అమృతత్వమ్ = అమరణధర్మమును, సమ్ ఉపానట్ ఉపసంవ్యాప్నోతి=ప్రాప్తించును - పొందును. ఎట్లన ఘృతస్య = హవిస్సు లేక ఉదకముయొక్క, యద్ గుహ్యం నామ అస్తి = అవిదితరహస్యము చంద్రునియందేది యున్నదో దానిని, దేవానామ్ = రశ్మలతో - కిరణము లను జిహ్వలతో నిత్యమాస్వాదించును. అచంద్రుడు అమృతస్యనాభిః = బంధనస్థానము - హేతువు అని యర్థము. సూర్యుడమరుడగుటకు తనకిరణములతో చంద్రునాస్వాదించుటయే యనితాత్పర్యము. ఈ మంత్రమునకు తాత్పర్యమేమనః- చంద్రునియందమృతమున్నది. చంద్రుడు సూర్యునినుండి ప్రకాశము గ్రహించును. సూర్యుడు చంద్రునినుండి అమృతమునుగ్రహించి యమరుడగుచున్నాడు. ఇట్లు సూర్యచంద్రులు పరస్పరము ఉపజీవ్య ఉపజీవక భావము కలిగియున్నారు. ఈమంత్రమున ఆదిత్యాగ్ని అభిప్రేతము.

ఈమంత్రమున అగ్నిశబ్దముకాని, అగ్నివాచకశబ్దము కనిపింపదు. అట్టియెడ ఆదిత్యరూపఅగ్ని యెట్లుగ్రహింపబడినదని యెవరేని శంకించినచో సమాధానము. ఈసూక్తమున నొకమంత్రమున అగ్నిశబ్దము చూడబడు

చున్నది. కావున నీసూక్తమంత్రములన్నియు అగ్నిదేవతామంత్రములు గానే యెంచబడుచున్నవి. ప్రకరణఆధారమువలనను ఈసూక్తమునకు అగ్నియే దేవతగా గ్రహింపబడినది. బ్రాహ్మణముకూడ నీవిషయమును సమర్థించుచున్నది.

> "సముద్రాద్ధ్యేషోఽద్భ్య ఉదేతి" (కౌ. బ్రా. ౨౫-౧) ఇతి చ బ్రాహ్మణమ్. అథాపి బ్రాహ్మణం భవతి. "అగ్నిః సర్వా దేవతాః" (ఐ. బ్రా. ౨-3) ఇతి. తస్యోత్తరా భూయసే నిర్వచనాయ.
>
> "ఇంద్రం మిత్రం వరుణమగ్నిమాహురథో దివ్యః స సుపర్ణో గరుత్మాన్. ఏకం సద్విప్రా బహుధా వదన్త్యగ్నిం యమం మాతరిశ్వానమాహుః (ఋ. ౧-౧౬౪-౪౬)
>
> ఇమమేవాగ్నిం మహాన్తం [చ] ఆత్మానం బహుధా మేధావినో వదన్తి. ఇంద్రం మిత్రం వరుణమగ్నిం దివ్యం చ గరుత్మన్తమ్ దివ్యో దివిజః. గరుత్మాన్. గరణవాన్. గుర్వాత్మా మహాత్మేతివా.

ఆదిత్యః సముద్రాదుదేతి న చ పార్థివః తస్మాదాదిత్యోఽత్రాగ్నిరభిప్రేతః. ఇంద్రం మిత్రం వరుణమిత్యేతైరభిధానైరేతమేవాగ్నిమ్, ఆహుః తత్త్వవిదః. అథ - అపి చ యోఽయం దివ్యః-దివిజః సుపర్ణః-సుపతనః, గరుత్మాన్ - గరణవాన్, స్తుతిభిః తద్వాన్ రసానాం వా గరితా ఆదిత్యః, అయమపి స ఏవాగ్నిరిత్యాహ. కిం బహునా ఇమమేవాగ్నిమ్, ఏకమ్ - మహాన్తమ్, ఆత్మానమ్. అనన్తత్వేన పశ్యన్తో విప్రాః - మేధావినః ఆత్మవిదో బహుధా వదన్తి, అగ్నిం యమమ్మాతరిశ్వానమిత్యాద్యైశ్చాభిధానైః. తస్మాదయమేవాగ్నిః ఇతి.

అర్థము :— హి = ఏలయన - ఏషః = ఈయాదిత్యాగ్నియే, సముద్రాత్ - ఆకాశాత్ - ఉదకాత్ = ఆకాశమునుండి, లేక ఉదకమునుండి, ఉదేతి = ఉదయించుచున్నది. కావున నిట పార్థివాగ్నిని గ్రహింపక సౌరాగ్ని గ్రహింపబడినది. పార్థివాగ్ని ఉదకమునుండి ఉత్పన్నముకాజాలదు.

ఆకాశమునుండియు నుత్పన్నముకాదు. కావున సౌర - అగ్ని గ్రహింప బడినది. పార్థివాగ్ని ఉదకము పరస్పరవిరుద్ధములు అగుట లోకప్రసిద్ధము. బ్రాహ్మణవచనముకూడ - అగ్నియే సర్వదేవతలనుచున్నది. అగ్నియే ముఖ్యము. అగ్నికథనమువలననె ఇతరదేవతలగ్రహణము కలుగును.

తస్య = ఆబ్రాహ్మణవాక్యమును, భూయసేనిర్వచనాయ = అధిక ముగా నిర్వహించుటకే దానిని సమర్థించుటకే మఱియొకఋక్కు ప్రమాణ ముగా నుదాహరించుచున్నారు.

మంత్రార్థము :- అగ్నిమ్ = అయగ్నినే, ఇంద్రం, మిత్రం, వరుణం ఆహుః=ఇంద్రుడని, మిత్రుడని, వరుణుడని భిన్నభిన్ననామము లతో ఆహుః = పేర్కొనిరి. మఱియు అయగ్నియే దివిజః = దివ్యము, దివ్యలోకవాసి, సుపర్ణః=పతనశీలము, గరుత్మాన్=స్తుతించునది, రసముల నాకర్షించునది. ఆదిత్యుడుకూడ అయగ్నియే, ఏకం సద్ అగ్నిం = ఒక్క టియేయైన అగ్నినే మేధావులైన విప్రులు ఆత్మజ్ఞానులు, బహుధా = అనేక నామములతో పిలుచుచున్నారు. యమమ్, మాతరిశ్వానం = యముడని మాతరిశ్వుడని అగ్నినె చెప్పుచున్నారు. గరుత్మాన పదనిర్వచనము - గరణవాన్ స్తుతిమంతుడు, గుర్వాత్మా, మహాత్మా గురుః ఆత్మా యస్య = ఎవనిఆత్మ గురు = గొప్పదో, సః గరుత్మాన్ = గురుఆత్మా = గొప్పఆత్మ - మహాత్మా.

> యస్తు సూక్తం భజతే యస్మై హవిర్నిరూప్యతే అయమేవ సోఽగ్నిః. నిపాతమేవై తే ఉత్తరే జ్యోతిషీ ఏతేన నామధే యేన భజేతే.

యః సూక్తం భజతే ప్రధానతః స్తుత్యత్వేనేత్యర్థః. యస్మై చ హవిర్ని రూప్యతే ఆగ్నేయమష్టాదశకపాలం నిర్వపేత్ ఇతి. అయమేవ సోఽగ్నిః పార్థివః. నిపాతమేవ ఏతే ఉత్తరే జ్యోతిషీ - సూర్యేంద్రరూపే భజేతే. నిపాతో నామ అప్రాధాన్యమిత్యర్థః.

ఆక్షేపమునకు సమాధానము. నిస్సందేహముగా అనేకదేవతలనామము అగ్నియే. ఆదిత్యుడు, విద్యుత్తుకూడ అగ్నియే. కాని అవిగౌణములు.

గౌణవృత్తితో అవి అగ్నినామముతో వ్యవహరింపబడుచున్నవి. వాస్తవమున పార్థివలగ్నియే అగ్ని.

యస్తు = ఏ అగ్ని, సూక్తం భజతే = స్తుతిభాక్కు అగునో, అనగా అనేకసూక్తములు ఎవనినామముతో వ్యవహరింపబడుచున్నవో, యస్మై = ఎవనికొఱకు, హవిఃనిరూప్యతే = ఎవనికిహవిస్సు ఇయ్యబడునో ఆతడగ్నియే. అదియే పృథివీస్థానియులగ్ని. అది విద్యుత్ కాదు. ఆదిత్యు డును కాదు. ఏతేన నామధేయేన=ఈఅగ్నినామముతో నిపాతం=నిపాతము గౌణమేయగును.

చతుర్థ పాదము సమాప్తము

## పంచమ పాదము

జాతవేదాః కస్మాత్ ? జాతాని వేద. జాతాని వైనం విదుః. జాతే జాతే విద్యత ఇతి వా. జాతవిత్తో వా. జాతధనః. జాతవిద్యో వా జాతప్రజ్ఞానః. యత్తజ్జాతః పశూనవిందత ఇతి తజ్జాతవేదసో జాతవేదస్త్వమితి బ్రాహ్మణమ్. తస్మా త్సర్వానృతూన్ పశవః అగ్నిమభిసర్పన్తి ఇతి చ.

జాతానివేద. సహి తదస్తి జాతమస్మిన్ లోకే యంవసౌ న వేద సర్వజ్ఞ ఇత్యర్థః. జాతే జాతే విద్యత ఇతి వా, న తదస్తి జాతం యస్యోదరే జఠరానలరూపేణాసౌ నాస్తి. జాతప్రజ్ఞానః; నిసర్గత ఏవాస్య జాతం ప్రజ్ఞాన మిత్యర్థః. బ్రాహ్మణమపి చ భవతి, జన్మైర్వేదేశ్చ జాతవేదా ఇతి, యత్త జ్జాతః పశూన్ ప్రాణిమాత్రమవిన్దత. యదసౌ జాతమాత్ర ఏవ నిసర్గతః పశూన్ అవిందత - అలభత తజ్జాతవేదసో జాతవేదస్త్వమ్ ఇతి విజ్ఞాయతే. సర్వానృతూన్ సర్వేషు ఋతుషు పశవః ప్రాణినః.

అర్థము :— అగ్నికి జాతవేదుడనునామమేల కలిగినది ? జాతవేదాః అనుపదమునకు వ్యుత్పత్తియేమి ? జాతానివేద = ప్రపంచపు సర్వపదార్థ ముల నతడెఱుగును. అతడు సర్వజ్ఞుడు. జాతాని వా ఏనం విదుః = ప్రపంచమున పుట్టినపదార్థములన్నియు నితనినెఱుగును. అందువలన

ఇతడు జాతవేదుడు. జాతే జాతే విద్యత ఇతి వా - లేక, ఇతడు పుట్టిన ప్రతిపదార్థమునందును ఉండును. కావున జాతవిదుడు. జాతవిత్తో వా జాతధనః జాతం విత్తం యస్మాత్ సః = ఎవనివలన విత్తము - ధనము పుట్టినదో యతడు జాతవేదుడు = జాతవిద్యో వా జాతప్రజ్ఞానః. లేక, స్వభావముతోనే జ్ఞానవంతుడు కావున జాతవేదుడు లేక స్వభావముతో ప్రకాశశీలుడు. యత్తద్ జాతః పశూనవిందత=పుట్టుచున్న పశువులనన్నిం టిని పొందినవాడు కావున ఇదియే జాతవేదసో జాతవేదస్త్వమ్=జాతవేదుని జాతవేదస్త్వము. ఇది బ్రాహ్మణవచనము. తస్మాత్ = అందువలననే తమస్వామిగా నెంచి ప్రతిఋతువునందును పశువులు అగ్నిని అభిసర్పన్తి= చేరును. అగ్నివైపు పోవును.

> తస్యైషాభవతి. "జాతవేదసే సునవామ సోమమరాతీయతో నిదహాతి వేదః. స నః పర్షదతి దుర్గాణి విశ్వా నావేవ సింధుం దురితాత్యగ్నిః (ఋ ౧-౯౯-౧)
>
> జాతవేదస ఇతి జాతవేదస్యాం వైవం జాతవేదసేఽర్చాయ సునవామ సోమమితి. ప్రసవాయాఽభిషవాయ సోమం రాజానమమృతమరాతీయతో యజ్ఞార్థమితి స్మో నిదహాతి నిశ్చయేన దహతి భస్మీకరోతి. సోమో దదదిత్యర్థః. స నః పర్షదతి దుర్గాణి విశ్వాని దుర్గమాని స్థానాని నావేవ సింధుం జలదుర్గాం మహాకూలాం తారయతి. దురితాత్యగ్నిరితి దురితాని తారయతి.

జాతవేదసే ... దురితాత్యగ్నిః-జాతవేదసే జాతానాముత్పన్నానామ్ సర్వేషాం వేదసే - వేదిత్రే యద్వా జాతైః సర్వైః జ్ఞాయమానాయ జాత ధనాయ జాతప్రజ్ఞాయ వా అగ్నయే అరాయీం సోమం సునవామ - అభిషుణుయామ జాతవేదే గుణవిశిష్టమగ్నిం యష్టుం సోమాభిషవం కరవామేత్యర్థః. సః అగ్నిః నః - అస్మాన్ అరాతీయతః - అరాతిమ్ - శత్రు మివాస్మానాచరతః శత్రోః వేదః - ధనమ్ నిదహతి భస్మీకరోతు ఇత్యర్థః. అపి చ సః అగ్నిః నః - అస్మాన్ విశ్వా - సర్వాణి దురితా - దుర్గమనాని

ఘోర్తుమశక్యాని దుఃఖాని అతిపర్షత్ - అతిపారయతు దుఃఖాన్యతిక్రమయ్య సుఖం ప్రాపయతు ఇత్యర్థః. దృష్టాన్తేన స్పష్టీకరోతి నావేవ సిన్ధుమ్ యథా కశ్చిత్ కర్ణధారః గ్రాహాదిదుష్టసత్త్వాకులాం నదీం నావా తారయతి తథా అగ్నిరస్మాన్ పాపాని తారయతు.

మంత్రార్థము :- జాతవేదసే = ఉత్పన్నప్రతిపదార్థమునెఱుగునట్టి లేక పుట్టినప్రతిదానిచే నెఱుగబడుచున్న అగ్నికొఱకు మేము లతారూప సోమమును సునవామ = పిండుచున్నాము. సః = ఆయగ్ని, నః=మమ్ము లను శత్రువులవలె నాచరించువాని, వేదః = ధనమును, నిదహాతి = భస్మ మొనర్చుగాక ! మఱియు నాయగ్ని మమ్ములను విశ్వా=సమస్త దురితా = కఠినదుర్గమదుఃఖముల, అతిపర్షత్ = పారమునచేర్చుగాక ! చతురుడైన నావికుడు నావా = నౌకతో, సింధుం = నదీమివ = నదిని దాటవేయునట్లు చతురుడైననావికుడు నావతో మొసళ్లుమొదలగు దుష్టజంతువులతో నాకుల మగునదిని యాత్రికులను దాటించునట్లు మమ్ములను అగ్ని దుర్గమ దుఃఖములను తరింపచేయునుగాక !.

తస్యైషాపరా భవతి. “ప్రనూనం జాతవేదసమశ్వం హినోత వాజినమ్. ఇదం నో బర్హిరాసదే.” (ఋ. ౧౦-౧౮౮-౧) ప్రహిణుత జాతవేదసం కర్మభిః సమశ్నువానమ్. అపి వోప మార్థే స్యాత్. అశ్వమివ జాతవేదసమ్ ఇతి. ఇదం నో బర్హిరాసీదత్వితి.

ప్రహినోత ప్రహిణుత ప్రేరయత స్తుతిభిరేతమ్ జాతవేదసమ్ అశ్వం జగత్ అశ్నువానం వాజినం అశ్వమివ ఇదం నో బర్హిరాసదే ఇదమస్మత్ కర్మ బర్హిషోపలక్షితం ‘యజ్ఞమాసదేత్’ ఆసీదతు.

మంత్రార్థము :- నూనమ్ - ఇది పదపూరణార్థము. ఓ దేవతలార ! అశ్వం కర్మభిః సమశ్నువానమ్ = కర్మములతో నెల్లరను వ్యాపించు, వాజినమ్ = జ్వాలలుకారణముగ చంచలమైన - లేక, వేగవంతమైన, అగ్నిం = ఈయగ్నిని, నః = మాయొక్క, ఇదం బర్హిః = ఈబర్హిచే నుప లక్షితమగు కర్మమునందు - యజ్ఞమునందు, ఆసదే = ప్రాప్తించుటకు, ప్రహినోత = ప్రహిణుత - ప్రేరయత = ప్రేరేపింపుడు. అపి వా ఉపమార్థే.

లేక, 'అశ్వమ్' ఇది ఉపమార్థమున నున్నది. అశ్వమువలె వేగవంతమగు అగ్నిని, ఇదం నః బర్హిః ఆసీదతు=ఈమాబర్హిని ప్రాప్తింపుమని చెప్పుదుపు గాక - ప్రేరేపింతురుగాక !

తదేతదేకమేవ జాతవేదసం గాయత్రం తృచం దశతయీషు విద్యతే. యత్తు కించిదాగ్నేయం తత్ జాతవేదసానాం స్థానే యుజ్యతే. తదేతదేకమేవ జాతవేదస్యం గాయత్రం తృచం యత్తు కించిదాగ్నేయం మంత్రజాతం తత్ జాతవేదసానాం మంత్రాణాం స్థానే వినియుజ్యతే. శాస్త్రెః. తేన అగ్నిరేవ జాతవేదా కర్మపృథక్త్వాత్ మహాభాగ్యాద్ వా.

తత్ = అందువలన, ఏతత్ ఏకమేవ = ఈయొక్కటియే, జాతవేదసమ్ = జాతవేదశబ్దయుక్త, గాయత్రమ్ = గాయత్రీఛందోబద్ధమైన తృచమ్ = మూడుఋక్కులుగల సూక్తము, దశతయీషు = ఋగ్వేదమునందు, విద్యతే=ఉన్నది, యత్ తు కించిత్ ఆగ్నేయం సూక్తం=ఏకొంచెము ఆగ్నేయసూక్తము గాయత్రీఛందోబద్ధమై యున్నదో, తత్తు = అది మాత్రము, జాతవేదసానాం స్థానే యుజ్యతే = జాతవేదసులస్థానమున ప్రయుక్తమైనది. దీనివలన జాతవేదా, అగ్ని అనుపదములు రెండును పర్యాయపదములని తెలియుచున్నది.

> స న మన్యేతాయమేవాగ్నిరితి. అప్యేతే ఉత్తరే జ్యోతిషీ జాతవేదసీ ఉచ్యేతే. తతో ను మధ్యమః. 'అభిప్రవన్త సమనేవ యోషాః' ఇతి తత్పురస్తాత్ వ్యాఖ్యాతమ్. అథాసావాదిత్యః. "ఉదుత్యం జాతవేదసమ్" ఇతి. తదుపరిష్టాత్ వ్యాఖ్యాస్యామః. యస్తు సూక్తం భజతే యస్మై హవిర్నిరూప్యతే అయమేవ సోఽగ్నిర్జాతవేదాః నిపాతమేవై తే ఉత్తరే జ్యోతిషీ ఏతేన నామధేయేన భజేతే.

ఉదుత్యం జాతవేదసం జాతవేదసం సూర్యముద్వహన్తీత్యత్ర జాతవేదాః సూర్యః. యద్యపి మంత్రదర్శనమవిశిష్టం త్రయాణామపి జ్యోతిషాం జాతవేదస్త్వే, తథాపి పార్థివోఽగ్నిరితరయా ప్రసిద్ధ్యా విశేష్యతే

జాతవేదస్త్వం హి యథా ప్రసిద్ధమస్మిన్నగ్నౌ న తథా వైద్యుతే న తథా సూర్యే.

అర్థము :- సః = ఆ నిరుక్తాధ్యేతా న మన్యేత = తెలిసికొనరాదు, అయం ఏవ అగ్నిః ఇతి = జాతవేదశబ్దమువలన ఈయగ్నియే గ్రహింపబడుచున్నది, ఏతే అపి=ఈరెండును, ఉత్తరే మధ్యమ = ఉత్తరవిద్యుత్తు, సూర్యుడును, జాతవేదసీ = జాతవేదులనియే, ఉచ్యేతే = చెప్పబడుచున్నవి, తతః ను మధ్యమః = కావున మధ్యమమునకుచెందిన ఉదాహరణనిచ్చుచున్నాము. 'అభ్రప్రవపన్త సమనేవ' ఇతి పురస్తాత్ వ్యాఖ్యాతమ్ = పూర్వమే వ్యాఖ్యానము చేయబడినది. అథ అసౌ ఆదిత్యః = మఱియు నీ ఉత్తరజాతవేదుడైన ఆదిత్యుడు - "ఉదుత్యం జాతవేదసమితి తద్ - "ఉదుత్యమ్" అను నీమంత్రమునకును ముందు, ఉపరిష్టాత్ - వ్యాఖ్యాస్యామః = వ్యాఖ్యానము చేయుదుము.

ఏది సూక్తభాక్కు అగునో, దేనికి హవిస్సు ప్రదానము చేయబడునో అయ్యూపార్థివజాతవేదాః కలదో - ఆరెండును విద్యుత్తు సూర్యుడును ఈ నామముతో గౌణరూపమున చెప్పబడినవి.

పంచమ పాదము సమాప్తము

## షష్ఠః పాదః

వైశ్వానరః కస్మాత్ ? విశ్వాన్నరాన్నయతి. విశ్వ ఏనం నరా నయన్తీతి వా. అపి వా విశ్వానర ఏవ స్యాత్. ప్రత్యృతః సర్వాణి భూతాని తస్య వైశ్వానరః.

విశ్వాన్ నరాన్ ఇతో లోకాత్ అముం లోకం నయతి. ప్రత్యృతః సర్వాణి భూతాని - విశ్వాని హ్యసౌ భూతాని ప్రతి ఋతః ప్రవిష్ట ఇత్యర్థః తస్య విశ్వానరస్య అపత్యం వైశ్వానరః.

వైశ్వానరః కస్మాత్ ? వైశ్వానరనామ మేలకలిగినది ? విశ్వాన్ నరాన్ నయతి. (క) సర్వమానవులను నీలోకమునుండి పరలోకమునచేర్చును. (ఖ) వా లేక విశ్వేనరాః = సర్వమానవులు, ఏనం = ఏనిని, నయన్తి -

ప్రాప్నువన్తి = చేరుదురు, అపి వా - అథవా = లేక విశ్వాన్ అర ఏవ స్యాత్ = విశ్వాన్ = సర్వమును-సర్వులను. అరః=ప్రాప్తుడగును (స్యాత్) సర్వాణి భూతాని = ప్రత్యృతః=ప్రాప్తమైయుండును. అన్నింటియందును ఉండును. అట్టివాడు విశ్వానరుడు అనబడును. విశ్వానర ఏవ వైశ్వానరః. తద్ధిత అణ్ ప్రత్యయము చేసిన విశ్వానరపదము వైశ్వానరమగును. విశ్వానరుడే వైశ్వానరుడు.

తస్యైషా భవతి.

తస్య = ఆవైశ్వానరునకు సంబంధించిన, ఏషా = ప్రాధాన్యస్తుతి ఋక్ భవతి = ఇది ప్రధానస్తుతి కలిగిన ఋక్భవతి - ఋక్కు అయి యున్నది.

> "వైశ్వానరస్య సుమతౌ స్యామ రాజా హి కం భువనానామభిశ్రీః. ఇతో జాతో విశ్వమిదం విచష్టే వైశ్వానరో యతతే సూర్యేణ" ఇతో జాతః సర్వమిదమభివిపశ్యతి. వైశ్వానరః సంయతతే సూర్యేణ. రాజా యః సర్వేషాం భూతానామభిశ్రయణీయస్తస్య వయం వైశ్వానరస్య కల్యాణ్యాం మతౌ స్యామేతి. (ఋ. ౧-౯౮-౧)

ఇతః - పృథివీలోకాత్ ఓషధివనస్పతిభ్యః యః జాతః విశ్వమిదం విచష్టే సర్వమిదమభిపశ్యతి. యశ్చ యతతే - సంయతతే సూర్యేణ సంగచ్ఛతే స్వేన భాసా. రాజా చ యో భువనానామ్ - సర్వేషాం భూతానామ్, అభిశ్రీః - అభిశ్రయణీయః - ఆశ్రయణీయః. తస్య వయమేవం గుణయుక్తస్య వైశ్వానరస్య నిత్యం సుమతౌ కల్యాణ్యాం మతౌ స్యామ.

అర్థము:- వయమ్=మేము, వైశ్వానరస్య=వైశ్వానరునియొక్క, సుమతౌ= కల్యాణకరబుద్ధియందు, స్యామ = ఉందుముగాక! మాకు వైశ్వానరుని కల్యాణబుద్ధి లభించునుగాక!. హి కమ్ రెండుపదములు పదపూర్తికై యున్నవి. ఎవడు, భువనానామ్ = సమస్తపదార్థములకు, అభిశ్రీః = ఆశ్రయమో - ఆశ్రయింపదగిన - రాజా = రాజు-స్వామియైయున్నాడో, మఱియు నెవడు ఇతః=ఈపృథివీలోకమునుండి ఓషధులవలన నుత్పన్న

మైన, ఇదం విశ్వం విచష్టే = ఈసమస్తమును, అభివిపశ్యతి = ఈసర్వ ప్రపంచమును సర్వప్రాణులను చూచుచున్నాడో లేక ప్రకాశకుడగుటచే చూపుచున్నాడో మఱియు నేవైశ్వానరుడు, సూర్యేణ = సూర్యునితో, యతతే = సంగచ్ఛతే = సంగతుడగుచున్నాడో.

తత్ కో వైశ్వానరః ?

వర్షకర్మణైనం వైశ్వానరం యస్మాత్ మంత్రదృక్ స్తౌతి.

అప్పుడీవైశ్వానరుడెవరు ? భావార్థమేమన :- శాస్త్రములందు వైశ్వానరశబ్దము ఆత్మార్థమున ప్రయుక్తమైయున్నది. మఱియు ఇంద్రుడు, ఆదిత్యుడు, వాయువు, ఆకాశము, ఉదకము, భూమి, మున్నగువానిని తెలుపుటకు వేఱువేఱుగ ప్రయోగింపబడియుండుటయు జూచుచున్నాము. కావున సంశయము కలుగును. అందువలన నిట వైశ్వానరశబ్దముచే నెయ్యది యభిప్రేతము ? అని ప్రశ్నాభిప్రాయము.

మధ్యమ ఇత్యాచార్యాః

ఆచార్యాః = మాఆచార్యులు - యాస్కమునిగురువు - మధ్యమః ఇతి = ఇట వైశ్వానరపదముచే మధ్యమఅగ్ని = విద్యుత్తు గ్రహింపదగిన దని చెప్పుచున్నారు.

వర్షకర్మణా హ్యేనం స్తౌతి.

హి = ఏలయన, ఏనం = ఈవైశ్వానరుని వేదమున, వర్షకర్మణా = వృష్టితో, స్తౌతి = స్తుతిచేయబడినది.

"ప్ర నూ మహిత్వం వృషభస్య యం వోచం పూరవో వృత్రహణం సచన్తే. వైశ్వానరో దస్యుమగ్నిర్జఘన్వా అధూనోత్కాష్ఠా అవ శంబరం భేత్" (ఋ. ౧-౫౯-౬)

ప్రబ్రవీమి తత్. మహిత్వం మహాభాగ్యం వృషభస్య వర్షితురపామ్. యం పూరవః పూరయితవ్యా మనుష్యాః. వృత్రహణం మేఘహనమ్. సచన్తే సేవన్తే వర్షకామాః. దస్యుర్దస్యతేః. క్షయార్థాత్. ఉపదస్యన్త్య స్మిన్రసాః.

ఉపదాసయతి కర్మాణి. తమగ్నిర్వైశ్వానరో ఘ్నన్. అవాధూనోదపః కాష్ఠా అభినత్. శంబరం మేఘమ్.

ప్రవోచమ్ - ప్రబ్రవీమి, అహమ్ మహిత్వమ్-మహాభాగ్యమ్, వృషభస్య - వర్షితురపామ్ యమ్ మన్యే అపి పూరవః - పూరయితవ్యాః మనుష్యాః కామైః వృత్రహణం - మేఘహననం సచన్తే - సేవన్తే వర్షకామాః స్తుతిభిః. వైశ్వానరః - అగ్నిః దస్యుం దాసయితారం రసానాం శంబరం - మేఘముదకవన్తమ్ ఉదకపూర్ణమ్ జఘన్వాన్ - హతవాన్ వృత్రమ్. అవభేత్ - అవాభినత్, వ్యదారయత్, విదార్య చ అధూనోత్ - వర్షభావేనాకంపయత్. అకారయత్ కాష్ఠాః - అపః. స వర్షత్వస్మాకమిత్యభిప్రాయః.

మంత్రార్థము :- నూ = శీఘ్రముగా వృషభస్య అపాం వర్షితుః = వర్షమును కురియించు విద్యుత్తుయొక్క, మహిత్వం = మహాభాగ్యం = మహత్తును, ప్రవోచం = ప్రబ్రవీమి=బాగుగచెప్పుచున్నాను, యమ్ వృత్రహణమ్ = ఏ మేఘహంతకుని, పూరవః = వర్షముచేనింపదగిన - వర్షము నభిలషించు మానవులు, సచన్తే = స్తుతియించుచున్నారు, వైశ్వానరః = అగ్నిః = ఈవైశ్వానరనామక విద్యుదగ్ని, దస్యుమ్=రసములను క్షయింపజేయు అవర్షణుని, జఘన్వాన్ = నష్టముచేయును - ఈవిద్యుత్తే, కాష్ఠాః = మేఘమునందుండు సమస్తజలమును, అధూనోత్ = కంపింపజేయును, శంబరం = మేఘమును, అవభేత్ = ఛిన్నభిన్నమొనర్చెను. ఈవిద్యుదగ్నియే వర్షింపజేయునని అభిప్రాయము. దస్యుః=దస్యతేః క్షయార్థాత్ = క్షయార్థక 'దసు'ధాతువుతో దస్యుశబ్దము సిద్ధమగును. అస్మిన్ రసా ఉపదస్యన్తి = దీనియందు - అవర్షణమునందు రసాః=రసములు, ఉపదస్యన్తి = నశించును, కర్మాణి ఉపదాసయతి = అనావృష్టివలన శుభకర్మలన్నియు నశింపజేయును, తమ్ = ఆదస్యుని = అవర్షణమును, వైశ్వానరః = వైశ్వానరనామకవిద్యుదగ్ని. ఘ్నన్ = నశింపజేయును.

అథాసావాదిత్య ఇతి పూర్వే యాజ్ఞికాః.

పూర్వే యాజ్ఞికాః - సాక్షాత్కృత - ధర్మాణః ఇత్యర్థః.

పూర్వే యాజ్ఞికాః=పూర్వయుగపుయాజ్ఞికులు-సాక్షాత్కృత ధర్మము గలవారు, అసావాదిత్యః = ఈసూర్యుడే వైశ్వానరుడని చెప్పుచున్నారు.

ఏషాం లోకానాం రోహేణ సవనానాం రోహ ఆమ్నాతః. రోహాత్ ప్రత్యవరోహశ్చికీర్షితః. తామనుకృతిం హోతాగ్ని మారుతే శస్త్రే వైశ్వానరేణ సూక్తేన ప్రతిపద్యతే. సోఽపి న స్తోత్రియమాద్రియేత. ఆగ్నేయో హి భవతి. తత ఆగచ్ఛతి మధ్యస్థానా దేవతా. రుద్రం చ మరుతశ్చ. తతో అగ్నిమిహస్థానమత్రైవ స్తోత్రియం శంసతి.

య ఏవ హి లోకానామారోహణానుక్రమః - పృథివీ, అంతరిక్షమ్ ద్యౌః ఇతి స ఏవ సవనానామపి క్రమః - ప్రాతఃసవనమ్, మాధ్యందినం, తృతీయసవనమితి. కస్మింశ్చిత్ కర్మణి రోహప్రాతిలోమ్యేన రోహాత్ ప్రత్యవరోహః చికీర్షితః.కర్తుమిష్టః సః అగ్నిష్టోమసామ్ని యజ్ఞాయజ్ఞీయే యత్ శస్త్రం ఆగ్నిమారుతం తత్ర తాం తత్సవనలోక ప్రత్యవరోహానుకృతిం చికీర్షం శస్త్రం వైశ్వానరీయేణ సూక్తేన ప్రతిపద్యతే ప్రారభతే, సోఽపి న స్తోత్రియమాద్రియేత. కస్మాత్? ఆగ్నేయో హి భవతి ప్రత్యవరోహే కర్తవ్యే స చ పునరాగ్నేయోఽయం స్తోత్రియః, అగ్నిశ్చ పృథివీస్థానః తద్యది తమాద్రియేత, న ప్రత్యవరోహానుకృతి - ప్రారంభః స్యాత్. అన్యేషు శస్త్రేషు చ యుక్తం యదూర్ధ్వమారురుక్షమాణః స్తోత్రియేణ ప్రతిపద్యతే, ఇహ పునరవరురుక్షమాణో ద్యుస్థానాధిదేవతాః శంసమానః క్రమేణ వైశ్వానరీయేణ సూక్తేన ప్రతిపద్యత ఇతి తేన జ్ఞాయతే ఆదిత్యో వైశ్వానర ఇతి. తత ఆగచ్ఛతి మధ్యస్థానా దేవతా రుద్రం చ మరుతశ్చ. తద్యథా-"ఆ తే పితుర్మరుతాం సుమ్నమేతు". తతోఽపి మధ్యస్థానాత్ ఇహ-స్థానమ్ - పృథివీస్థానం ప్రత్యవరుహ్య అత్రైవ తం స్తోత్రియం శంసతి ప్రశంసతి తదేవమేతస్మాత్ విధ్యనుకరణాత్ పశ్యామ ఆదిత్యో వైశ్వానర ఇతి.

అర్థము :– ఏషాం లోకానాం = ఈలోకముల, రోహేణ = ఆరోహణమువలన. సవనానాం=సవనముల(ప్రాతఃసవనము, మాధ్యందినసవనము, సాయంసవనముల)యొక్క, రోహ ఆమ్నాతః=ఆరోహణము పఠింపబడినది. యజ్ఞకర్త యీ మువ్విధసవనముల నాచరించి క్రమముగా పృథివి, అంతరిక్షము. ద్యులోకము అనులోకములను బొందును రోహాత్పునః=ఆరోహ

ణముసుండి, ప్రత్యవరోహః = అవరోహణమును, చికీర్షితః కర్తుమిష్టః = అభి ప్రేతము, అనగా సామాదుసవనములతో ద్యులోకమున నారూఢుడైన యజ్ఞకర్త, ద్యులోకమునుండి పృథివికిదిగుటకు ఇష్టపడునని అభి ప్రాయము తాం అనుకృతిం = ఆ యనుకృతిని - అవతరణానుకృతిని, హోతా = హోత, అగ్నిమారుతే శాస్త్రే = అగ్నిమారుతశాస్త్రమునందు - స్తోత్రమునందు, వైశ్వానరీయేణ సూక్తేన = వైశ్వానరీయసూక్తముతో ప్రతి పద్యతే = ప్రారంభించును. కాని, సోఽపి = అతడును, స్తోత్రియం = ఆగ్నేయస్తోత్రమును, న ఆద్రియేత = ఆదరింపడు. హి = ఏలయన అతడు ఆగ్నేయః = ఆగ్నేయుడు భవతి = అగుచున్నాడు.

అతః = అనంతరము. హోతా = హోత, మధ్యస్థానాదేవతా = మధ్యస్థానీయతవైపు, ఆగచ్ఛతి = వచ్చును - ఆదేవతలు రుద్రం చ మరు తశ్చ = రుద్రుడు మరుత్తులు, అనగా మరల రుద్ర - మరుద్దేవతాక మంత్రములను హోత గానముచేయును. తతః = తదుపరి, ఇహస్థానం - అగ్నిం=పృథివీస్థానీయు అగ్నివైపుకు మరలును, అత్ర వై స్తోత్రం శంసతి = ఇక్కడ స్తోత్రియు = ఆగ్నేయస్తోత్రమును, శంసతి = గానముచేయును. ఈ ప్రత్యవరోహక్రమమువలన వైశ్వానరశబ్దము ఆదిత్యవాచకమని స్పష్ట మగుచున్నది.

అథాపి వైశ్వానరీయో ద్వాదశకపాలో భవతి. ఏతస్య హి ద్వాదశవిధం కర్మ.

ఏతస్య హి సూర్యస్య ద్వాదశ విధం - ద్వాదశమాస - ప్రవిభాగ - లక్షణం కర్మ. తేనైకస్మాదపి దేవతా - గుణ - కపాలవిధ్యనుకరణాత్ పశ్యామ ఆదిత్యో వైశ్వానర ఇతి.

అథాపి = మఱియు, వైశ్వానరుడు - ఆదిత్యుడనుటకు ఇదియొక కారణము. ఎట్టిదనగా:- వైశ్వానరః ద్వాదశకపాలః భవతి = వైశ్వానరీయ హవిస్సు - పురోడాశము - ద్వాదశకపాలములు కలది యగును. వైశ్వా నరునకు సంబంధించినహవిస్సు పురోడాశము. ద్వాదశకపాలములందు పక్వముచేయబడును. హి = ఏలయన, ఏతస్య = ఈసూర్యునికి సంబం ధించిన కర్మ, ద్వాదశవిధం = ద్వాదశవిధములు కలది - ఆదిత్యుడు

ద్వాదశమాసప్రవర్తకుడు, అతః = ఈసామ్యమును పురస్కరించుకొని (సూర్యునికర్మ ద్వాదశవిధము. వైశ్వానరీయపురోడాశము ద్వాదశకపాల పక్వము) వైశ్వానరశబ్దము ఆదిత్యవాచకమని స్పష్టమగుచున్నది.

అథాపి బ్రాహ్మణం భవతి. "అసౌ వా ఆదిత్యః అగ్నిః వైశ్వానరః ఇతి."

తస్మాత్ సూర్యో వైశ్వానర ఇతి అథాపి నివిత్సౌర్యవైశ్వానరీ భవతి. ఆ, యో, ద్యామ్ భాత్యా పృథివీమ్ ఇతి. ఏష హి ద్యావాపృథివ్యావాభాస యతి - నివిదిత్యాకృతివిశిష్టో మన్త్రః. శస్త్రమధ్యపాతి. స తథా భవతి యథా సూర్యో వైశ్వానరో న పార్థివో న మధ్యమః ఇతి. ఆ యో ద్యాం భాత్యా పృథివీమ్ ఇతి. న చ పునరాదిత్యాదన్యోఽవభాసయతే ద్యావా పృథివ్యౌ, యత ఉచ్యతే - ఏష హి ద్యావాపృథివ్యావాభాసయతి.

అథాపి = మఱియు, నివిత్స్తోత్రము సౌర్యవైశ్వానరీ భవతి=సూర్య వైశ్వానరులకు సంబంధించినది. సూర్యుని వైశ్వానరుని ప్రకటించుచున్నది. ఎట్లన - యః = వైశ్వానరుడు, ద్యామ్ ఆభాతి పృథివీమ్ ఆభాతి = ద్యు పృథివీలోకములను ప్రకాశితమొనర్చును. అందువలన ద్యులోకపృథివీ లోకములను ప్రకాశింపజేయువాడు ఆదిత్యుడే. ఈప్రమాణమువలనను వైశ్వానరుడన ఆదిత్యుడే యగుచున్నాడు.

అథాపి ఛాందోమికం సూక్తమ్ సౌర్యవైశ్వానరం భవతి. "దివి పృష్టో అరోచత" (యజు 33-92) ఇతి. ఏష హి దివి పృష్టో అరోచతేతి.

దివి పృష్టో అరోచత. న చ పునరాదిత్యాదన్యో దివి పృష్టో ద్యులోకే స్పృష్టః - అవస్థిత ఇత్యర్థః. అరోచత రోచతే. దీప్యతే.

మఱియు ఛాందోమికసూక్తముకూడ సూర్యుని వైశ్వానరశబ్దముచే ప్రకటించుచున్నది. ఆసూక్తమున నిట్లున్నది - దివి = ద్యులోకమున, పృష్టః = అవస్థితుడైన, వైశ్వానరః = వైశ్వానరుడు, అరోచత = ప్రకాశించు చున్నాడు, ఇతి = దీనివలన, వైశ్వానరుడు ఆదిత్యుడని స్పష్టమగుచున్నది.

హి = ఏలయన, ఏషః = ఈసూర్యుడే, దివిపృష్టః = ద్యులోకమున నవ స్థితుడై, అరోచత = ప్రకాశించుచున్నాడు.

**అథాపి హావిష్పాంతీయం సూక్తమ్ సౌర్యవైశ్వానరం భవతి.**

తత్ర మంత్రః - "విశ్వస్మా అగ్నిం భువనాయ దేవా వైశ్వానరం కేతుమహ్నామకృణ్వన్. వైశ్వానరం కేతుం కర్తారమహ్నామకృణ్వన్నితి. నైవ తావదాదిత్యాదన్యస్య అహ్నాం కర్తృత్వముపపద్యతే పార్థివే మధ్యమే వా. తేన పశ్యామః సూర్యో వైశ్వానర ఇతి.

మఱియు హవిష్పాంతీయసూక్తముకూడ వైశ్వానరుడు సూర్యుడే యని సూచించుచున్నది. ఆసూక్తమునః- "విశ్వస్మా అగ్నిం భువనాయ దేవా వైశ్వానరం కేతుమహ్నామకృణ్వన్".

దేవాః = దేవతలు, విశ్వస్మైభువనాయ = సమస్తప్రపంచమునకు, వైశ్వానరమగ్నిమ్ = వైశ్వానరాగ్నినే, అహ్నామ్ = దినములను, కేతుం = కర్తగా నిర్మించువానినిగా, అకృణ్వన్=చేసిరి. దీనినిబట్టి వైశ్వానరపదము ఆదిత్యపర్యాయవాచకమని అన్నివిధముల స్పష్టమగుచున్నది.

**అయమేవాగ్నిర్వైశ్వానర ఇతి శాకపూణిః. విశ్వానరావిత్యేతే ఉత్తరే జ్యోతిషీ. వైశ్వానరోఽయం యత్ తాభ్యాం జాయతే.**

అయమేవ పార్థివోఽగ్నిర్వైశ్వానర ఇతి శాకపూణిరాచార్యో మన్యతే. న మధ్యమో న సూర్యః. కేనహేతునా? విశ్వానరావేతే ఉత్తరే జ్యోతిషీ సూర్యేంద్రరూపే. యత్తాభ్యాం జాయతే తత్పార్థివోఽగ్నిర్వైశ్వానర ఇతి.

అయమేవఅగ్నిః = ఈలౌకికాగ్నియే = పార్థివాగ్నియే-వైశ్వానరాగ్ని న మధ్యమః - న సూర్యః = మధ్యమాగ్నివిద్యుత్తుకాని, సూర్యుడుకాని, కాదు అని శాకపూణిఆచార్యునిమతము కేనహేతునా = ఆదియెట్లన - చెప్పుచున్నాడు. (ఉచ్యతే) ఏతే ఉత్తరే జ్యోతిషీ = విద్యుత్తు సూర్యుడు నను జ్యోతులు, విశ్వానరౌ = విశ్వానరు లనబడుచున్నవి. అయం=పార్థివాగ్ని వైశ్వానరః=వైశ్వానరుడనబడుచున్నది ఏలయన యత్ తాభ్యాం జాయతే =

ఈయగ్ని విద్యుత్తును, సూర్యుడు - ననురెండింటినుండి ఉత్పన్నమగు చున్నది. విశ్వానరుల అపత్యము వైశ్వానరుడు.

కథం త్వయమేతాభ్యాం జాయత ఇతి. యత్ర వైద్యుతః శరణమభిహన్తి యావదనుపాత్తో భవతి మధ్యమధర్మైవ తావద్ భవత్యుదకేంధనః శరీరోపశమనః, ఉపాదీయమాన ఏవాయం సంపద్యత ఉదకోపశమనః శరీరదీప్తిః.

కథం న్వయం పార్థివోఽగ్నిరేతాభ్యాం జాయతే? ఉచ్యతే - యత్ర వైద్యుతః అగ్నిః శరణమ్. ఆశ్రయమాత్రనే కాదు ఉదకమ్ అన్యద్వా అభిహన్తి - ప్రాప్నోతిత్యర్థః. తత్ ప్రదీప్యతే. స చ పునః యావదను పాత్తో భవతి మనుష్యైరస్పృష్టో భవత్యపరిగృహీతో వా. మధ్యమధర్మైవ తావత్ భవతి. యదసౌ ఉదకేంధనః శరీరోపశమనః స చ పునః ఉపాదీయమాన ఏవ అయమ్-పార్థివోఽగ్నిః సంపద్యతే. ఉపాత్తో హి మనుష్యైః స్వాభావికధర్మం హిత్వా పార్థివధర్మం ప్రతిపద్యతే. ఉదకోపశమనః శరీర దీప్తిః. ఏవం తావన్మధ్యమాదయం విశ్వానరాత్స జాయతే తేనాయం తదపత్యం ఇతి భవతి హి తద్ధితార్థేఽపత్యే వైశ్వానరః.

అర్థము :— కథం తు = ఏవిధముగా, అయమ్ = ఈయగ్ని - నిప్పు. ఏతాభ్యామ్ = ఈవిద్యుత్తు, సూర్యులనుండి, జాయతే = పుట్టుచున్నది? చెప్పుడు. చెప్పుచున్నాము - యత్ర వైద్యుతః అగ్నిః = విద్యుదగ్ని, శరణమ్ = ఆశ్రయమును - కాష్ఠము, జలము, లేక మఱియేవస్తువునైనను, అభిహన్తి = ప్రాప్తించునో, అప్పుడు యావత్ = ఎంతవఱకు, అనుపాత్తః భవతి = మనుష్యైః = మనుష్యులచేతను, లేక అపార్థివపదార్థములచేతను తెలియబడదో, తావత్ = అంతవఱకు - అప్పటివఱకు, మధ్యమధర్మా ఏవభవతి=మధ్యమధర్మవంతము-విద్యుత్తుధర్మముకలదిగానే యుండును. విద్యుత్తు - స్వభావమెయ్యది? ఉదకేంధనః = ఉదకమే ఇంధనముగా కలిగియుండును - అనగా జలముతో వృద్ధిపొందును. శరీరోపశమనః = శరీరముతోగాని, పార్థివపదార్థముతోగాని, గ్రహింపబడుచున్నదై వెంటనే, అయమ్ సంపద్యతే = ఇది అగ్నినిప్పు - రూపమున పరిణమించును.

మఱియు నీపార్థివాగ్ని స్వరూపము వైద్యుతాగ్నిస్వభావముకంటె భిన్నముగా నుండును. ఉదకోపశమనః = నీటితో శాంతింపజేయబడును. నిప్పు ఆర్పబడును. మఱియు నీపార్థివాగ్ని=నిప్పు, శరీరదీప్తిః=పార్థివపదార్థసంబంధము వలన దీప్తమగును - ప్రజ్వలించును. అందువలన పార్థివాగ్ని యిట్లు విద్యుదగ్నినుండి పుట్టునని స్పష్టమగుచున్నది. విద్యుత్తు మఱియొక వస్తుసంబద్ధము కానంతవఱకే విద్యుత్తుగానుండును. వేఱొకపార్థివ పదార్థమును స్పృశింపగానే యది నిప్పుగామాఱి దానిని కాల్చును. కావున అగ్ని విద్యుత్తునుండి యేర్పడును - పుట్టును. విద్యుత్తు విశ్వానరుడు - దానియపత్యము - సంతానము అగ్నివైశ్వానరుడనబడును.

> అథాదిత్యాత్. ఉదీచీం ప్రథమసమావృత్త ఆదిత్యే కంసం వా మణిం వా పరిమృజ్య ప్రతిస్వరే యత్ర శుష్కగోమయ మసంస్పర్శయన్ ధారయతి తత్ ప్రదీప్యతే. సోఽయమేవ సంపద్యతే.

అథ పునరాదిత్యాత్ కథం జాయతే? ఉదీచీం దిశం ప్రథమసమావృత్త ఆదిత్యః తస్మిన్. కంసం వా మణిం వా పరిమృజ్య ప్రతిస్వరే - ప్రత్యాపతాపే. యత్ర శుష్కగోమయం ధారయతి తత్ప్రదీప్యతే యః శుష్కగోమయే అగ్నిర్జాయతే స ఏవ మాదిత్యాదపి కంసాద్వా మణేర్వా జాయతే తదపత్యాపేక్షయాప్యస్య వైశ్వానరత్వముపపద్యతే.

అర్థము :- అథ = మఱియు, ఆదిత్యాత్ = సూర్యునినుండి, యీ అగ్ని - నిప్పు ఎట్లు ఉత్పన్నమగునన - సమాధానము - ఉదీచీం=ఉత్తర దిక్కున, ఆదిత్యేప్రథమసమావృత్తే = ప్రథమమున రాగానే - సూర్యోదయముకాగానే, కంసం వా మణిం వా = ఘూతలద్దమునుగాని, సూర్యకాంతమునునిగాని పరిమృజ్య = బాగుగశుద్ధముచేసి, ప్రతిస్వరే = ఉష్ణసమయమున వెలుపల ఆతపమున సూర్యకిరణములాయద్దముపైన, మణిపైన పడునట్లు పట్టుకొని వానినుండి సూర్యకిరణములకాంతి - ఎండిన గోమయముపై పడునట్లుచేసినచో ఆగోమయమున నగ్నిపుట్టి యది భస్మమగును. ఏవమ్ = ఇట్లు, ఆదిత్యతాపము అగ్నిగా మాఱి శుష్కపదార్థమును తగలపెట్టుట లోకసిద్ధవిషయము. దీనింబట్టి సూర్యునినుండి

అగ్ని = నిప్పు ఏర్పడుచున్నదని స్పష్టమగుచున్నది. కావున అగ్ని విశ్వా నరాగ్ని సూర్యునిసంతానమే యగుచున్నది.

> అథాప్యాహ. "వైశ్వానరో యతతే సూర్యేణ" (ఋ. ౧-౯౮-౧) ఇతి. న చ పునరాత్మనాత్మా సంయతతే. అన్యేనైవాన్యః సంయతతే. ఇత ఇమమాదధాత్యముతోఽముష్యరశ్మయః ప్రాదుర్భవన్తి. ఇతోఽస్యార్చిషస్తయో ర్భాసోః సంసంగం దృష్ట్వైవమవక్ష్యత్.

అథాపి వైశ్వానరో యతతే సూర్యేణ ఇతి మంత్రదృక్ ఆహ. స చ పునరాత్మాత్మనా సంయుతతే కిం తర్హి? అన్యేనైవాన్యః సంయుతతే-సంగచ్ఛతే యథా దేవదత్తో యజ్ఞదత్తేన. ఇతో లోకాత్ ఓషధిభ్యః శరాదిభ్యో వనస్పతిభ్యో వా మథిత్వా ప్రత్యక్ష ఏవ ఇమమాదధాతి - అభ్యాదధాతీత్యర్థః. అముతో మండలాత్ - ఆదిత్యమండలాధిష్ఠాతుః స్వభూతా రశ్మయః ప్రాదుర్భవన్తి. ఇతః - తేజః పిండాత్ అస్య భౌమాగ్నే రర్చిషః ప్రాదుర్భవన్తీతి. తయోర్భాసోః సంగం దృష్ట్వైవ మవక్ష్యత్ మంత్రదృక్ వైశ్వానరో యతతే సూర్యేణ ఇతి.

అథాపి ఆహ = మఱియు ఈ వైశ్వానర అగ్ని సూర్యునితో సంగతమగునని చెప్పబడినది. అదియు మాపక్షమునే బలపఱచుచున్నది. న చ పునః ఆత్మా ఆత్మనా సంయుతతే = తనతో తాను కలిసికొనును అను వ్యవహారము లోకమున బూదము, అన్యేన ఏవ ఆత్మా సంయుతతే = తాను ఇతరునితో కలియును - తనతో తాను కలియుననుట సంగతముకాదు. యజ్ఞదత్తునితో దేవదత్తుడు కలియుననుట సంగతము. భూమిపైనుండు అగ్ని ఎక్కడో దూరములోనున్న సూర్యునితో కలియుటెట్లు సంభవము? అన ఇట నొకవ్యక్తి పార్థివపదార్థములైన రెండుకట్టెలను గ్రహించి వాని నొకదానిపై మఱియొకదానినుంచి మథించి, ఇమమ్ అగ్నిమ్ = అగ్నిని పొందగలుగుచున్నాడుకదా! అట్లే అముతః = పైనుండి, అముష్య = సూర్యునియొక్క కిరణములు (రశ్మయః), ప్రాదుర్భవన్తి = సూర్యునినుండి కిరణములు బయలుదేరును, ఇతః = ఇటనుండి భూమిపైనుండి, అర్చిషః =

అగ్నిజ్వాలలు పైకి పయనించును. పైనుండి సూర్యకిరణములు క్రిందికి, క్రిందినుండి అగ్నిజ్వాలలు పైకిప్రసరించి, తయోః = ఆ సూర్యాగ్నులు, భాసోః=దీప్తులయొక్క సంగమమేర్పడును. ఇట్టికలయికను-సంగమమును జూచియే మంత్రద్రష్ట = ఋషి, అవక్ష్యత్ = అనెను, "వైశ్వానరో యతతే సూర్యేణ" అని.

> అథ యాన్యేతాన్యౌత్తమికాని సూక్తాని భాగాని వా సావిత్రాణి వా సౌర్యాణి వా పౌష్ణాని వా వైష్ణవాని వా వైశ్వదేవ్యాని వా తేషు వైశ్వానరీయా ప్రవాదా అభవిష్యన్. ఆదిత్యకర్మణా చైనమస్తోష్యన్నితి. ఉదేషీతి అస్తమేషీతి. విపర్యేషీతి.

యది సూర్యో వైశ్వానరో అభవిష్యత్తతఃఇమ యాన్యేతాని ఔత్తమికాని సూక్తాని ఉత్తమస్థాన - దేవతా - విశేషస్తుత్యర్థాని భాగాని వా సావిత్రాణి వా పౌష్ణాని వా వైష్ణవాని వా వైశ్వదేవ్యాని తేషు సూక్తేషు వైశ్వానరీయాః ప్రవాదాః, భగాదీనాం విశేషణత్వేన అభివిష్యన్. హేభగ! వైశ్వానర హే సవితః వైశ్వానర ఇత్యేవమాదయః. ఆదిత్య కర్మణా చ ఏనమస్తోష్యన్. ఉదేషీత్యస్తమేషీతి విపర్యేషీతి. ఇతి కరణ ఏవం శబ్దార్థే. ఏవ ముదేషి త్వం వైశ్వానర! ఏవమస్తమేషి ఏవమ్ విపర్యేషి ఇతి. న చ పునరేత దుభయమప్యస్తి తస్మాన్నైష సూర్యో వైశ్వానర ఇతి.

అర్థము :- అథ = మఱియు, వాస్తవమున వైశ్వానరశబ్దము ఆదిత్య వాచకమే యగునెడల యాని=ఏవి ఔత్తమికాని సూక్తాని = ఉత్తమ స్థానీయసూక్తములో, ఉదా :- భగాని, సావిత్రాణి సౌర్యాణి పౌష్ణాని వైష్ణవాని వైశ్వదేవ్యాని భగ సవితా, సూర్య, పూషా, విష్ణు విశ్వేదేవ, అను నీదేవతలకు సంబంధించినవి కలవో, తేషు = వానియందు, వైశ్వానరీయాః ప్రవాదాః=భగ మున్నగుశబ్దములు వైశ్వానరునకు విశేషణములగుచున్నవి. ఆదిత్యకర్మణా చ = మఱియు ఆదిత్యునికర్మతో, అస్తోషన్ = వైశ్వానర స్తుతియే యగును. ఎట్లన :- ఉదేషీతి = నీవు ఉదయించుచున్నావు, అస్తమ్ ఏషి ఇతి = అస్తమించుచున్నావు, విపర్యేషీతి = నీవు మరల తిరిగివచ్చుచున్నావు - ఇవియన్నియు సూర్యునికర్మలు. కాని, భగ సవితా

ఆదులకు వైశ్వానరాదులకు విశేషణముగా ప్రయోగింపబడుట చూడము. ఆదిత్యకర్మలతో భగాదులస్తుతి చేయుబడదు, కావున వైశ్వానరశబ్దము ఆదిత్యవాచకమనుట సరికాదు.

**ఆగ్నేయేష్వేవ హి సూక్తేషు వైశ్వానరీయాః ప్రవాదాః భవన్తి. అగ్నికర్మణా చైనం స్తౌతీతి. వహసీతి. పచసీతి, దహసీతి.**

వైశ్వానరమృత ఆజాతమగ్నిమ్ ఇత్యేవమాదయః.

ఏవం వైశ్వానర! వహసి హవీంషి, పచసి పక్తవ్యాని, దహసి దగ్ధవ్యాని, తస్మాదయమేవాగ్నిః వైశ్వానర ఇతి స్థితమ్.

ఆగ్నేయేష్వేవ సూక్తేషు ప్రత్యేక=ఆగ్నేయసూక్తలందే వైశ్వానరీయాః ప్రవాదాః = వైశ్వానరునికి సంబంధించిన విశేషణములు, భవన్తి = చూడబడినవి. ఏనం చ = మఱియు అగ్నికర్మణా = అగ్నికిసంబంధించిన కార్యములతో వైశ్వానరుని స్తుతిచేయబడును. ఎట్లన? వహసి ఇతి = హే వైశ్వానర! నీవు తీసికొనిపోవుచున్నావు. పచసీతి = వండుచున్నావు, దహసీతి = కాల్చుచున్నావు. కావున వైశ్వానరశబ్దము అగ్నివాచకమే సూర్యవాచకము విద్యుత్తువాచకము కాదు.

షష్ఠ పాదము సమాప్తము

ఇతి షష్ఠః పాదః

## సప్తమః పాదః

ఈవిధముగ స్వపక్షస్థాపనానంతరము ఇప్పుడు క్రమముగ రెండు పూర్వపక్షములను ఖండించుచున్నాడు.

**యథో ఏతత్ వర్షకర్మణా హ్యేనం స్తౌతీత్యస్మిన్నప్యేతదుపపద్యతే.**

యథో ఏతత్ ఇతి. యత్పునరేతదుక్తం వర్షకర్మణా యస్మాత్ స్తౌతి తస్మాన్మధ్యమ ఇతి. అస్మిన్నపి పార్థివేఽగ్నౌ ఏతదుపపద్యతే వర్షకర్మ.

యథా ఉ ఏతత్ వర్షకర్మణా ఏనం స్తౌతి = వృష్టిరూపకర్మతో వైశ్వానరుని స్తుతిచేయబడినది. కావున, మధ్యమాగ్ని విద్యుత్తు అని యేది చెప్పబడినదో అదియును సరికాదు. ఏలయన - అస్మిన్నపి = ఈపార్థివాగ్ని యందును నిదియంతయు; ఉపపద్యతే ఉపపన్నమగును. అదియెట్లన - ఈక్రిందిమంత్రము జూడుడు.

"సమానమేతదుదకముచ్చైత్యవ చాహభిః। భూమిం పర్జన్యా జిన్వన్తి దివం జిన్వన్త్యగ్నయః" (ఋ. ౧-౧౬౪-౫౧)

ఇతి సా నిగదవ్యాఖ్యాతా. సమానమ్ - ఏకమేవేదమ్ ఉదకమ్ - ఉదకత్వేనావిశిష్టమ్, ఉచ్చైత్యవచాహభిః. ఉత్ ఏతి చ ఊర్ధ్వం చైతి. అహోభిర్నిమిత్తభూతైః పునశ్చాహోభిరేవ అవాజేతి నీచైరాగచ్ఛతి. భూమిం పర్జన్యా మాధ్యమికా దేవగణా జిన్వన్తి - తర్పయన్తి, ఓషధ్యుత్పత్తయే ఏవం తావదవాజేతి. అథ పునరూర్ధ్వం దివం జిన్వన్త్యగ్నయః ఇతి. యథైవాముతో వర్షేణేమాం పర్జన్యా జిన్వన్తి. తథైవాహుతి - ప్రభావేణ వర్షేణ దివం జిన్వన్త్యగ్నయఃఆహుతయో హ్యగ్నౌప్రక్షిప్తాఃపునర్వర్షంప్రకల్పయన్తి.

మంత్రార్థము:— ఏతత్ సమానమ్ ఉదకమ్=ఈజలము ఒక్కటియే ఏది అహోభిః = కొన్నిదినములలో, ఉత్ చ ఏతి = పైకిపోవునో, అవ చ ఏతి = మరల క్రిందికి వచ్చునో - ఒకప్పుడు పైకిపోయి మరల క్రిందికి వచ్చుజలము ఒక్కటే రెండుకాదు. పర్జన్యాః = మేఘములు, భూమిం = భూమిని, జిన్వన్తి = తృప్తిమొనర్చును - తడుపును. అగ్నయః=అగ్నులు, దివం = ద్యులోకమును, జిన్వన్తి = తృప్తిమొనర్చును-తడుపును.

"అగ్నౌ ప్రాస్తాహుతిః సమ్యగాదిత్యముపతిష్ఠతే. ఆదిత్యాజ్జాయతే వృష్టిర్ వృష్టేరన్నం తతః ప్రజాః."

అగ్నిలో వేయబడిన ఆహుతి ఆదిత్యుని చేరును. ఆదిత్యునివలన వర్షము - దానివలన అన్నము, ఆయన్నమువలన ప్రజలు ఉత్పన్న

లగుదురు - పోషింపబడుదురు. దీనింబట్టి వృష్టికర్మ అగ్నికి అధీనమని స్పష్టపడుచున్నది. ఇతి=ఈవిధముగ సా ఋక్ నిగదవ్యాఖ్యాతా=నిగదేనైవ వ్యాఖ్యాతా = నిగదేనశబ్దముచేతనే వ్యాఖ్యాతా = వ్యాఖ్యానింపబడినది. అనగా సుగమము-కావుననే ఈమంత్రమునకు యాస్కముని వ్యాఖ్యానము చేయలేదు.

"కృష్ణం నియానం హరయః సుపర్ణా అపో వసానా దివ ముత్పతన్తి. త ఆ వవృత్రన్త్సదనాదృతస్యాదిద్ ఘృతేన పృథివీ వ్యుద్యతే." (ఋ. ౧-౧౬౪-౪౭)

కృష్ణం నిరయణం రాత్రిః. ఆదిత్యస్య హరయః సుపర్ణా హరణా ఆదిత్యరశ్మయః. తే యదాముతో అర్వాంచః పర్యావర్తన్తే. సహస్థానాదుదకస్యాదిత్యాత్. అథ ఘృతే నోదకేన పృథివీ వ్యుద్యతే. ఘృతమిత్యుదకనామ. జిఘర్తేః సించతికర్మణః.

కృష్ణం నియానం వర్త్మ రాత్రిః ఆదిత్యస్య ద్వే అయనే శుక్లం చోత్తరం కృష్ణం చ దక్షిణమ్. భగవానాదిత్యో యదా జగదనుగ్రహాయ గర్భముదకమాత్మన్యాధిత్సురుత్తరాయణం ప్రతిపద్యతే తదైతే హరయః - రసహరణాః సుపర్ణాః సుపతనాః రశ్మయః సర్వస్మాదస్మాల్లోకాత్ అపో జలాని వసానాః ఆదదానాః, దివం - ద్యోతనవంతమేతమాదిత్యం ప్రతి ఉత్పతన్తి. ఆదిత్య ఉత్తరాయణే మాసైః షడ్భిః ఆహితోదకగర్భః సంప ద్యతే. పరిషిక్తోదకగర్భో దక్షిణం వర్త్మ ప్రతిపద్యమానో నభస్యాత్ మాసాత్ ప్రభృతి ప్రసూయతే. తదిదముచ్యతే - "త ఆవవృత్రన్త్సద నాదృతస్య" ఇతి. తే రశ్మయః యదా అముతః - అముష్మాత్ ఆదిత్యాత్ ఋతస్య ఉదకస్య సదనాత్ - సహస్థానాత్ ఆవవృత్రన్ - పర్యావర్తన్తే. ఆత్ - అథ ఘృతేన - ఉదకేన పృథివీ వ్యుద్యతే - వివిధముద్యతే.

మంత్రార్థము :- హరయః = రసములను హరించు, సుపర్ణాః సూర్యరశ్మయః = సూర్యకిరణములు, అపోవసానాః = జలమును తీసికొని, దివం = ఆదిత్యలోకమునకు, ఉత్పతన్తి = పైకిపోవును. ఇదియే ఉత్త

రాయణకాలము, తే = అవియే మరల, కృష్ణం నియానమ్ = కృష్ణ మార్గము=దక్షిణాయనసమయమున, ఉదకస్య=జలముయొక్క, స్థానాత్= స్థానమునుండి - ఆదిత్యలోకమునుండి, ఆవవృత్రన్ = తిరిగివెళ్లును. మఱియు, ఆత్ ఇత్ = ఆసమయమున, ఘృతేన = జలముతో, పృథివీ = భూమి, వ్యుద్యతే=సించింపబడును-తడుపబడును. కృష్ణం నియానమ్ = కృష్ణమార్గము - దక్షిణాయనము, రాత్రేః ఆదిత్యస్య = సూర్యునిరాత్రి ఆది - హరయః హరణాః = రసమును హరించునవి, సుపర్ణా ఆదిత్యస్య రశ్మయః = సూర్యకిరణములు, తే = అవి, యదా=ఎప్పుడు, అముతః = అలోకమునుండి - ఆదిత్యలోకమునుండి, అర్వాంచః=క్రిందనున్న పృథివీ లోకమునకు, పర్యావర్తన్తే = మరలివచ్చును, సదనాత్ = ఉదకస్థాన మైన, ఆదిత్యలోకాత్ = సూర్యలోకమునుండి, ఘృతమితి ఉదకనామ = జలమునకు ఘృతమనిపేరు, సించతి కర్మణః జిఘర్తేః = సించత్యర్థక 'ఘృ' ధాతువువలన ఘృతమ్ సిద్ధమగును. ఈమంత్రమున స్పష్టముగా ఆదిత్యనామము పఠింపబడియున్నను ప్రకరణమునుబట్టి అగ్నియే గ్రహింపదగును. రెండుదకలందును వృష్టికర్త మధ్యమాగ్ని విద్యుత్తు, గ్రహింపబడలేదు.

> అథాపి బ్రాహ్మణం భవతి. అగ్నిర్వా ఇతో వృష్టిం సమీర యతి ధామచ్ఛద్దివి ఖలు వై భూత్వా వర్షతి మరుతః సృష్టాం వృష్టిం నయన్తి.

అగ్నిః ఇతో లోకాత్ వృష్టిం సమన్తతః ఈరయతి. ధూమభూతా ఆప ఓషధివనస్పతిభ్యః వినివర్త్యమానాః ఆహుతిభూతాశ్చాముం లోక మావిశన్తి. అగ్నేర్వై ధూమో జాయతే ధూమాదభ్రమ్ అభ్రాద్ వృష్టిరితి హ విజ్ఞాయతే. తాః ధామచ్ఛదాదిత్యః ఖలు దివి భూత్వా ధామ్నాం ఛాదయితా రశ్మిభిర్మేఘరూపైః మధ్యస్థానమాపాదయతి. ఏవం తేన సృష్టాం వృష్టిం మధ్యస్థానాత్ మరుతో వాయవో మేఘోదరాణి విదార్య తేభ్యో విక్షిప్తాం వృష్టిమిమం లోకమ్ నయన్తి - ప్రాపయన్తీత్యర్థః.

అథాపి = మఱియు, బ్రాహ్మణం భవతి = బ్రాహ్మణవాక్యము కూడ ఇట్లున్నది. "అగ్నిః = యజ్ఞాగ్ని, ఇతః = ఇటనుండి - పృథివీ

లోకమునుండి, వృష్టిం సమీరయతి = వృష్టిని ప్రేరేపించుచున్నది. దివి= అంతరిక్షమున. ఛాదయచ్ఛద్ భూత్వా = ఆదిత్యుడు మేఘరూపికిరణముల ప్రకాశమునకు ఆచ్ఛాదకుడై, వర్షతి = వర్షించును. ఇట్లు ఆదిత్యునిచే సృష్టాంవృష్టిం=సృష్టింపబడిన వర్షమును, మరుతః=వాయువులు మధ్యమ స్థానమున మేఘములను విచ్ఛిన్నముచేసి, నయన్తి=పృథివివఱకు తీసికొని పోవును మఱియొక బ్రాహ్మణవచనము.

> "యదా ఖలు వై అసావాదిత్యోఽగ్నిం రశ్మిభిః పర్యావర్తతే
> అథ వర్షతి" ఇతి.

తదేవమేతత్ వర్షకర్మ-సమానం సర్వేషాం జ్యోతిషామిత్యహేతుర్మ ధ్యస్య వైశ్వానరత్వే భవతి.

యదాఖలు = ఎప్పుడు, అసౌ ఆదిత్యః=ఈయాదిత్యుడు, రశ్మిభిః= తనకిరణములతో, అగ్నింపర్యావర్తతే = అగ్నివైపు - క్రిందికి వచ్చును - వర్షించును, ఈవిధముగ ఈవర్షాకర్మ అగ్ని, సూర్య, విద్యుత్తులను ముగ్గురికి సంబంధించినదై యున్నది. ఈవర్షాకర్మకారణముగ మధ్య మాగ్ని విద్యుత్తును వైశ్వానరునిగా సిద్ధముచేయుట యుక్తిసంగతముకాదు.

> **యథో ఏతద్రోహాత్ ప్రత్యవరోహశ్చికీర్షిత ఇత్యామ్నాయ వచనాదేతత్ భవతి.**

యదో ఏతత్ - యత్ పునరేతదుక్తమ్ యాజ్ఞికపక్షే - రోహాత్ ఇతి. ఆమ్నాయవచనాత్ ఏవం భవతి, రోహాత్ ప్రత్యవరోహః ఇత్యర్థవాద మాత్రమేవ.

యథా ఉ ఏతత్ = మఱియు రోహాత్ = ఆరోహణక్రమముతోనే, ప్రత్యవరోహః = ప్రత్యవరోహణము చేయవలెను. కావున ఆదిత్యుడు వైశ్వానరసంజ్ఞకలవాడనుటయు సరికాదు. ఏతత్ ఆమ్నాయవచనాత్ భవతి = ఇది ఆమ్నాయవచనము-విధివాక్యము-ననుసరించి అగుచున్నది. మఱియు లోకముల ఆరోహణముకేవలము ఫలస్తుతిమాత్రమేయైయున్నది. వైశ్వానరునితో యేమ్యస్థానియొక్కయు సంబంధము అభిప్రేతము కాదు.

యథో ఏతద్వైశ్వానరీయో ద్వాదశకపాలో భవతీత్యనిర్వచనమ్ కపాలాని భవన్తి. అస్తి హి సౌర్య ఏకకపాలః పంచకపాలశ్చ.

యదో ఏతత్-యదపిచోక్తమ్. ఏతదప్యకారణంసూర్యస్య వైశ్వానరత్వే. కస్మాత్? వ్యభిచారాత్. యతోఽస్తి హి సౌర్య ఏకకపాలః పంచకపాలశ్చ.

యదోఏతత్ = మఱియు, వైశ్వానరీయః ద్వాదశకపాలః భవతి = వైశ్వానరీయపురోడాశము ద్వాదశకపాలమును కలదియనియు, అట్టి సూర్యునికర్మలు ద్వాదశ = పన్రెండుఅనిచెప్పి అందువలన వైశ్వానరశబ్దము ఆదిత్యవాచకమని యేదిచెప్పబడినదో యదియు సరికాదు. ఏలయన కపాలాని = కపాలములు, అనిర్వచనమ్ భవన్తి = వ్యభిచరితములగును, హి = ఏలయన, సౌర్యః = సూర్యునకుసంబంధించిన, ఏకపురోడాశము పంచకపాలశ్చ = ఒకకపాలముగలది, పంచకపాలములుగలది యగును.

యతో ఏతత్ బ్రాహ్మణం భవతీతి బహుభక్తివాదీని హి బ్రాహ్మణాని భవన్తి. పృథివీ వైశ్వానరః. సంవత్సరో వైశ్వానరః. బ్రాహ్మణో వైశ్వానరః. ఇతి.

భక్తిర్నామగుణకల్పనా, యేన కేనచిద్ గుణేన బ్రాహ్మణం సర్వం సర్వథా బ్రవీతి. తత్ర తత్త్వమన్వేష్యమేవ భవతి.

యదోఏతత్ = మఱియునది - అసౌ వా ఆదిత్యః అగ్నిః వైశ్వానరః ఇతి = ఈయాదిత్యుడే వైశ్వానరః అగ్ని అని బ్రాహ్మణవచనముకూడ ఆదిత్యుడే వైశ్వానరుడని చెప్పుచున్నదని యేదిచెప్పబడినదియో యదియును సరికాదు. హి = ఎందువలన నన - బ్రాహ్మణాని = బ్రాహ్మణములు. బహుభక్తివాదీని = బహుభక్తివాదులు, ఇట భక్తియన గుణకల్పనా - బ్రాహ్మణములు ఏదోయొకగుణముతో విశేషణముతో ఏదోయొకదేవతను వర్ణించును. ఇట్లే బ్రాహ్మణము వైశ్వానరవిశేషణము అనేకముతో జోడించినది. అనేకవిశేష్యములతో సంబద్ధముచేసినది. ఎట్లన - పృథివీ వైశ్వానరుడని, సంవత్సరము వైశ్వానరుడనియు, బ్రాహ్మణుడు వైశ్వానరుడనియు అనేకవిశేష్యములతో వైశ్వానరపదము విశేషణముగా వర్ణింపబడినది.

యథో ఏతన్నివిత్సౌర్య వైశ్వానరీ భవతీత్యస్యైవ సా భవతి. "యో విడ్భ్యో మానుషీభ్యో దీదేత్" ఇత్యేష హి విడ్భ్యో మానుషీభ్యో దీప్యతే.

సా నివిత్ అస్యైవ అగ్నేః భవతి. కథమ్? యో విడ్భ్యో మానుషీభ్యో దీదేదితి. తతః కిమ్? ఏష హి విడ్భ్యో మానుషీభ్యో దీప్యతే.

మఱియు నివిత్ = స్తోత్రము. సౌర్యవైశ్వానరీ భవతి = సూర్యుని వైశ్వానరునికి ద్యోతకమని యేదిచెప్పబడినదో తదపి = అదియును సరికాదు. కారణమేమన - సా=ఆస్తోత్రము - స్తుతి అస్య ఏవ భవతి. ఈ పార్థివఅగ్నికి సంబంధించినదే. ఈయగ్నినే వైశ్వానర - అగ్నియని చెప్పును. ఆదిత్యుని తెలుపదు. ఏలయన ఆసూక్తమునందే యీమంత్రమున్నది - "యో విడ్భ్యో మానుషీభ్యో దీదేత్"

మంత్రార్థము :- యః = ఏయీయగ్ని, మానుషీభ్యః విడ్భ్యః = మానుషీప్రజలవలన, దీదేత్ = ప్రదీప్తముగును-ప్రజ్వలింపజేయబడును. అందువలన నీసూక్తమున స్పష్టముగా పార్థివాగ్నికొఱకే చెప్పబడినది.

యథో ఏతచ్ఛాన్దోమికం సూక్తం సౌర్యవైశ్వానరం భవతీత్యస్యైవ తద్భవతి. జమదగ్నిభిరాహుతః ఇతి. జమదగ్నయః ప్రజమితాగ్నయో వా. ప్రజ్వలితాగ్నయో వా. తైరభిహుతో భవతి.

ఛాందోమికం ఛందోమయుక్తేషు దాశరాత్రికేషు యత్ సూక్తం తత్ సౌర్యవైశ్వానరమితి. తదపి అస్యైవ అగ్నేర్భవతి. కథమ్? తత్ర హి ఏతద్విశిష్టం పార్థివాగ్నేర్ వాచకం లింగం భవతి. "జమదగ్నిభిరాహుతః" ఇతి. జమదగ్నయో హ్యేన మాహుతిభిర్జుహోతి నాదిత్యమ్. అసంభవాత్. తస్మాదత్రాపి యత్ వైశ్వానర-లింగం తదప్యేతస్య పార్థివస్యాగ్నేర్వ్యంజకం భవతి.

మఱియు ఛాన్దోమికం సూక్తం సౌర్యవైశ్వానరం భవతీతి = సౌర్య వైశ్వానరుని సమర్థకము = సమర్థించునని యేది చెప్పబడినదో యదియును సరికాదు. కారణమేమన :- తత్ సూక్తమ్ = ఆసూక్తము, అస్య ఏవ

భవతి = ఈపార్థివాగ్నికి సంబంధించినదే - పార్థివాగ్నినే తెలుపును ఆ సూక్తమునందే 'జమదగ్నిభిః' మున్నగుశబ్దములు ప్రయోగింపబడి యున్నవి. జమదగ్నిభిః = యాజ్ఞికులచే, ఆహుతః=హవనముచేయబడినది- ఆహుతియియ్యబడినది. ఇది వైశ్వానరాగ్నియే. జమదగ్నయః ప్రజమితాగ్నయః = జమదగ్నిపదమునకర్థము ప్రభూతాగ్ని, వా - లేక ప్రజ్వలితాగ్నయః = ప్రజ్వలితాగ్నికలవారు - ఋత్విజులచే, అభిహుతః = హోమము చేయబడినది. వైశ్వానరాగ్ని. యాజ్ఞికులు ఈపార్థివాగ్నియందే ఆహుతు లిత్తురు. ఆదిత్యునియందియ్యరు. దీనింబట్టికూడ వైశ్వానరశబ్దము ఆదిత్య వాచకము కాదని స్పష్టమగుచున్నది.

యథో ఏతద్ధవిష్పాన్తీయం సూక్తం సౌర్యవైశ్వానరం భవతీత్యస్యైవ తద్ భవతి.

తత్ అపి అస్యైవ భౌమాగ్నేర్భవతి. యత్తస్య సూక్తస్య యా ప్రథమా ఋక్ సా ఆగ్నేయీ భవతి. న సౌరీ.

మఱియు ఏతత్ హవిష్పాన్తీయం సూక్తమ్ = ఈహవిష్పాన్తీయ సూక్తము సూర్యుని వైశ్వానరునిగా చెప్పుచున్నది. అని యేదిచెప్పబడినదో యదియును అస్యైవభవతి = ఈభౌమాగ్నినే తెలుపుచున్నది. ఏలయన ఈసూక్తముయొక్క ప్రథమఋక్ = మొదటిమంత్రమీయర్థమునే స్పష్టముగా చూపుచున్నది.

"హవిష్పాన్తమజరం స్వర్విది దివి స్పృశ్యాహుతం జుష్టమగ్నౌ. తస్య భర్మణే భువనాయ దేవా ధర్మణే కం స్వధయా పప్రథన్త". (ఋ. ౧౦-౮౮-౧)

హవిర్ యత్ పానీయమ్. అజరమ్. సూర్యవిది-దివిస్పృశి అభిహుతం జుష్టమగ్నౌ తస్య భరణాయ చ భావనాయ చ ధారణాయ చ. ఏతేభ్యః సర్వేభ్యః కర్మభ్యో దేవా ఇమ మగ్నిమన్నేనా పప్రథన్త.

దేవానామజరం - పాన్తమ్ - పానార్హం హవిః పురోడాశాది స్వర్విది - సూర్యవిది దివిస్పృశి - ద్యామసౌ స్పృశత్యహన్యహని హవిరుపసయున్నా దిత్యమ్. అహుతమభిహుతమ్ విస్సృష్టం జుష్టమ్ - ప్రియం తస్య హవిషః భర్మణే బహులీకరణాయ భావనాయ చ ధర్మణే - ధారణాయ. ఇమమేవ అగ్నిం పృథివీస్థానమ్ స్వధయా అన్నేన హవిషా - ఆజ్యేన పురోడాశేన చ అప్రథన్త దేవా అవర్ధయన్తేత్యర్థః.

మంత్రార్థము :- పాన్తమ్ = పానముచేయదగిన, అజరమ్ = జరా రహితమైన, జుష్టం = దేవతలకు ప్రియమైన, హవిః = హవిస్సును, స్వర్విది = ఆదిత్యునెఱిగిన, దివిస్పృశి = ద్యులోకమున పైకివెళ్లునట్టి, అగ్నౌ = అగ్నియందు, ఆహుతమ్ = వేసినహవిస్సును, దేవాః = దేవతలు, తస్య భర్మణే = దానిభరణపోషణార్థము, భువనాయ = విభూతియుక్తము చేయుటకు, ధర్మణే = దానినిధరించుటకు స్వధయా = ఆజ్యముతో, హవిస్సుతో, అప్రథన్త = వృద్ధిచేసెను. ఏతేభ్యః సర్వేభ్యః కర్మభ్యః = ఈసర్వకార్యములకొఱకు, దేవాః = దేవతలు, ఇమమగ్నిమ్ = ఈయగ్నిని, అన్నేన = అన్నముతో, అప్రథన్త = వృద్ధిచేసిరి. ఇట్లు ఈసూక్తపు ప్రథమమంత్రమునందే ఈయగ్నిలింగమగు వైశ్వానరశబ్దముతో సంబద్ధ మగుచు, సుతరాం = పూర్తిగ దానియగ్నిసంబంధిత్వమును బోధించు చున్నది. ఆదిత్యుని సంబంధమును కాదు.

అథాప్యాహ.

యథా చాయమేవ పృథివీస్థానో అగ్నిర్వైశ్వానరః న మధ్యమః, తథేమముపరం మంత్రం ప్రకరోతి.

ఇట్లు రెండుపక్షములను యాస్కముని ఖండించి యిప్పుడు స్పష్ట ముగా వైశ్వానరుని అగ్నిబోధకుని సిద్ధముచేయుటకు మఱియొకమంత్రము నుదాహరించుచున్నాడు.

> "అపాముపస్థే మహిషా అగృభ్ణాత విశో రాజానముపతస్థుర్ఋగ్మియమ్. ఆ దూతో అగ్నిమభరద్వివస్వతో వైశ్వానరం మాతరిశ్వా పరావతః"

అపాముపస్థ ఉపస్థానే మహత్యన్తరిక్షలోక ఆసీనా మహాన్త ఇతి వా గృహ్ణాత మాధ్యమికా దేవగణాః. విశ ఇవ రాజానముపతస్థుః. ఋగ్మియమృగ్మన్తమితి వా. అర్చనీయమితి వా. పూజనీయమితి వా. అహరద్యం దూతో దేవానామ్ వివస్వతః ఆదిత్యాత్. వివస్వాన్వివాసనవాన్. ప్రేరితవతః పరాగతాద్వా[అపివా] అస్యాగ్నేర్వైశ్వానరస్య మాతరిశ్వానమాహర్తారమాహ. మాతరిశ్వా వాయుః. మాతర్యన్తరిక్షే శ్వసితి. మాతర్యాశ్వనితీతి వా.

అపాముపస్థే-ఉపస్థానే యత్రోపగమ్య తిష్ఠన్త్యాపః సోఽపాముపస్థః - అన్తరిక్షలోకః తస్మిన్నపాముపస్థే మహిషాః-మహాన్తః అగృభ్ణాన్ అగృహ్ణన్. గృహీత్వా చ విశ ఇవ మనుష్యా ఇవ రాజానమ్పరివార్య ఉపతస్థుః. ఋగ్మియమ్ - ఋగ్భిః స్తుతిభిః తద్వన్తమ్ అర్చనీయమ్ - అర్చనార్హం వా యమాభరత్ - ఆహరత్ దూతః దేవానాం మాతరిశ్వా - వాయుః అగ్నిమ్ వైశ్వానరమ్ పరావతః - ప్రేరితవతః వివస్వతః - ఆదిత్యాత్. ఏవమేతస్మిన్ మన్త్రే యత ఆహ్రియతే యేన - చాహ్రియతే సర్వే తే పృథివ్యపదిష్టాః అత్ర వివస్వత ఆహ్రియతే మాతరిశ్వనా వైశ్వానర ఇతి. తస్మాదేతయో ర్వివస్వన్మాతరిశ్వనోః సన్నిధానవ్యపదేశే సతి సాక్షాత్ వైశ్వానరశబ్దేన పార్థివోఽగ్నిర్వ్యవతిష్ఠతే వైశ్వానర ఇతి.

అర్థము :— అపామ్ - ఉపస్థే ఉపస్థానే = జలముల స్థానమున - అంతరిక్షే = అంతరిక్షమునందు, మహిషః = మాధ్యమికదేవగణము - వాయువులు - ఈవైశ్వానరాగ్నిని, అగృభ్ణత = గ్రహించెను. రాజానమ్ = రాజును, విశఇవ = ప్రజలుచుట్టుముట్టియుండునట్లు-వాయువులు, ఋగ్మియమ్ = స్తుత్యము, పూజనీయమగు నియగ్నిని, ఉపతస్థుః = చుట్టునిలబడినవి. ఆవరించియుండునని యర్థము. దూతః = మాతరిశ్వాదేవతలదూతయగు వాయువు, పరావతః = దూరమునయున్న వివస్వతః = సూర్యునినుండి, వైశ్వానరమ్ అగ్నిమ్ = వైశ్వానరాగ్నిని, ఆభరత్=తెచ్చెను.

యాస్కముని 'మహిషా'శబ్దమును సప్తమ్యంతముగాకూడ అంగీకరించెను. ప్రథమాంతముగాను అంగీకరించెను. సప్తమ్యంతముగా నెంచి

'అపాముపస్థే' పదమునకు విశేషణముచేసి మహత్యంతరిక్షలోకే = విశాలమైన అంతరిక్షలోకమునందు అని యర్థమొనరించెను. మఱియు ప్రథమాన్తముగానెంచి మహిషాః = మహాన్తః = గొప్పదియగు మాధ్యమికదేవగణమని యర్థముచెప్పెను. ఋగ్మియమ్ ఇతి - ఋగ్మంతమితి వా అర్చనీయమ్ ఇతి వా పూజనీయమ్ ఇతి వా. అని ఋగ్మియం పదమునకర్థము ఋగ్మాన్ = స్తుతిగలవాడు, వా - లేక అర్చనీయుడు పూజనీయుడు అని. వివస్వాన్ - వివాసనవాన్=అంధకార మును తొలగించువాడు - దూరమొనర్చువాడు, ప్రేరితవతః = ప్రేరణ చేయు, పరాగతాత్ అపి వా = లేక, దూరమునచేరియున్న ఆదిత్యుని నుండి. అస్య అగ్నేఃవైశ్వానరస్య = ఈవైశ్వానరనామక అగ్నియొక్క, మాతరిశ్వానమ్ = వాయువును, ఆహర్తారమ్ = ఆహరణముచేయునదిగా - తెచ్చునదిగా చెప్పబడెను. మాతరిశ్వా = వాయుః = వాయువును మాత రిశ్వాయని ఏల చెప్పుచున్నారు? మాతరి = అంతరిక్షే - శ్వసితి = అంత రిక్షమున నిది చరించును లేక అంతరిక్షే = అంతరిక్షమునందు, ఆశు = శీఘ్రముగ, అనితి = చలించును - చరించును. కావున వాయువు మాత రిశ్వా అనబడినది.

అథైనమేతాభ్యాం సర్వాణి స్థానాన్యభ్యాపాదం స్తౌతి.

అథైనం భౌమాగ్నిమేతాభ్యాం వక్ష్యమాణాభ్యాం సర్వాణి పృథివ్యం తరిక్షద్యులక్షణాని. స్థానాన్యభ్యాపాదం వ్యవస్థాప్య స్తౌతి మంత్రదృక్.

అథ=ఇప్పుడు, ఏనం=ఈపార్థివాగ్నిని, ఏతాభ్యాం = ఈక్రిందజూపిన రెండుఋక్కులతో, సర్వాణిస్థానాని = పృథివి, అంతరిక్షము మున్నగు సర్వస్థానములందును, మంత్రదృక్ = మంత్రద్రష్ట, స్తౌతి = స్తుతించును, ఈయగ్ని పార్థివ - అగ్నిదేవత ఆయాస్థానములను జేరి, తత్తద్దేవతాత్వేన = ఆయాదేవతారూపమున స్తుతివిషయమగునని తాత్పర్యము.

> "మూర్ధా భువో భవతి నక్తమగ్నిస్తతః సూర్యో జాయతే ప్రాతరుద్యన్, మాయా మూ తు యజ్ఞియానామేతామపో యత్తూర్ణిశ్చరతి ప్రజానన్" (ఋ. ౧౦-౮౮-౬).

**మూర్ధా మూర్తమస్మిన్ ధీయతే. మూర్ధా యః సర్వేషామ్ భూతానాం భవతి నక్తమగ్నిః. తతః సూర్యో జాయతే ప్రాతరుద్యన్ త్స ఏవ ప్రజ్ఞాం త్వేతాం మన్యన్తే యజ్ఞియానాం దేవానాం యజ్ఞసంపాదినామ్. అపో యత్కర్మ చరతి ప్రజానన్త్సర్వాణి స్థానాన్యనుసంచరతి త్వరమాణః.**

అగ్నిర్భువః - భూలోకస్య మూర్ధా భవతి. విశేషతస్తు నక్తం-రాత్రౌ తత్ప్రకృతత్వాదాలోకస్య భూతానాం చాన్నపక్తృత్వత్ప్రకృతత్వాత్. తతః సూర్యో జాయతే ప్రాతరుద్యన్ రాత్రావగ్నిత్వేన లోకస్యోపకారం కృత్వా ప్రాభాతాయామ్ రాత్ర్యామాహ్నికైరుపకారైరుపకరిష్యన్ సూర్యో భూత్వా జాయతే క ఏనాం జానాతి? మాయాం యజ్ఞియానాం - యజ్ఞసంపాదినామ్. అపః యత్కర్మ ఆదిత్యాత్మనా అస్యాత్మనా చ కర్తవ్యం ప్రజానన్ - ప్రకర్షేణ జానన్, సర్వాణి స్థానాని అనుసంచరతే తూర్ణిః త్వరమాణః కర్మకాలమపరిహాపయన్నిత్యభిప్రాయః

మంత్రార్థము :- నక్తమ్ = రాత్రిసమయమున, అగ్నిః = ఈయగ్నియే, భువః=భూలోకమునకు, మూర్ధా భవతి = శిరస్సగును, శిరస్సు లేకున్న ప్రాణి జీవింపజాలనట్లు ఈయగ్నిలేకున్న రాత్రియందు జీవలోకమెట్లు జీవించును? అందువలననే అగ్ని శిరస్సనబడినది. ముఖ్యవస్తువని అభిప్రాయము. తదుపరి రాత్రి గడచినమీదట ప్రాతః సూర్యుడుదయించుచున్నాడు. ఈయగ్నియే సూర్యరూపమున నుదయించుచున్నది. ఇదియే అగ్నిదేవునిమాయ. దీనిని యాజ్ఞికులెఱుగుదురు. యత్ అపః = ఏకర్మను - స్వాధికారప్రయుక్తకర్మను, ప్రజానన్ = ఎఱుగుచు అగ్నిదేవత, తూర్ణిః=శీఘ్రతతో, చరతి = సర్వస్థానములను, అనుసంచరతే = చేరును. మూర్ధా-మూర్తమస్మిన్ ధీయతే = దేనిసహాయముతో లేక, దేనియందు శరీరము స్థితమో యదియే మూర్ధ యనబడును. మూర్ధా యః సర్వేషాం భూతానాం భవతి = అగ్ని సర్వభూతములందును ముఖ్యము - లేక సర్వప్రాణుల జీవనవిషయము.

**తస్యోత్తరా భూయసే నిర్వచనాయ.**

తథేయమపరా ఋక్ భూయస్తరమేతమేవార్థం వక్తి.

ఈవిషయమునే ఈక్రిందిఋక్కు ప్రతిపాదించును.

"స్తోమేన హి దివి దేవాసో అగ్నిమజీజనచ్ఛక్తిభీ రోదసి ప్రామ్. తమూ అకృణ్వం స్త్రేధా భువే కం స ఓషధీః పచతి విశ్వరూపాః" (ఋ. ౧౦-౮౮-౧౦)

స్తోమేన హి యం దివి దేవాః అగ్నిమజనయన్ [శక్తిభిః] కర్మభిర్ద్యావాపృథివ్యోః ఆ పూరణమ్. తమకుర్వం స్త్రేధా భావాయ. పృథివ్యామంతరిక్షే దివీతి శాకపూణిః.

స్తోమేన - స్తుతిభిః, శక్తిభిః - కర్మభిః అగ్నిహోత్రాదిభిః, దివి - ద్యులోకే, ఏతం - అగ్నిం ఆదిత్యాత్మనా రోదసి ప్రామ్ ద్యావాపృథివ్యోః పూరణం, దేవాసః (ఆజ్జసేరసుక్) - దేవాః అజీజనన్ - అజనయన్ తదుక్తమ్=ఏష సోదియాత్ యద్యేతామగ్న్యావాహుతిం న జుహుయాదితి ఆహుతిభిరేవైనం జనయన్తి. తమకృణ్వన్ - తమేవాగ్నిం కృతవన్తః త్రేధా భువే త్రేధాభావాయ పృథివ్యామంతరిక్షే దివి ఇతి.

మంత్రార్థము :— దేవాసః = దేవతలు, స్తుతిభిః (స్తోమేన)-శక్తిభిః - కర్మభిః = అగ్నిహోత్రాదికర్మలతో, దివి = ద్యులోకమున, ఆదిత్యాత్మనా రోదసి = అంతరిక్షమున, పృథివీలోకమున ప్రామ్=ప్రపూర్ణ=నిండియున్న అగ్నిమ్ = ఈయగ్నిని, అజనయన్ = ఉత్పన్నముచేసిరి. ఆపార్థివాగ్నికి మూడురూపముల నొసంగిరి. (తమ్ = ఆపార్థివాగ్నిని, త్రేధా భువే అకృణ్వన్) సః = ఆయగ్నియే, విశ్వరూపాః=సర్వరూపములుగల ఓషధులను, (ఓషధీః) పచతి = పక్వముచేయును, అనగా - దేవతలు = విద్వాంసులు తమయజ్ఞకర్మలతో అగ్నిని ద్యులోకము, అంతరిక్షము, భూమి అను ముల్లోకములందును నింపిరి. అని భావము.

యదస్య దివి తృతీయం తదసావాదిత్యః. ఇతి హి బ్రాహ్మణమ్.

బ్రాహ్మణమపి చైతమేవార్థం బ్రవీతి అయమేవాగ్నిః ఆదిత్యో భవతి ఇతి అస్య పార్థివస్యాగ్నేః. ఏకమేవ ఇదం జ్యోతిః జగద్ధాత్రా - సర్గయే త్రేధా విభక్తం పృథివ్యామంతరిక్షే దివి చ.

అస్య = ఈయగ్నియొక్క, యత్తృతీయమ్ = మూడవభాగమే, దివి = ద్యులోకమున, అసావాదిత్యః = ఈయాదిత్యుడు - సూర్యుడు - అని బ్రాహ్మణము నుడువుచున్నది. సర్వము జ్యోతియే.

తదగ్నికృత్య స్తౌతి.

తత్త్రైవంసతి జ్యోతిషా దివి తృతీయమాదిత్యాఖ్యం హవిష్పాన్తమిత్యేవ మాధ్యాను అగ్నికృత్య మంత్రదృక్ స్తౌతి. ఇదానీం పార్థివాగ్నిమాదిత్యత్వేన స్తౌతీత్యాహ.

ఈజ్యోతినొక్కదానినే అగ్నికృత్య = అగ్నిరూపమునొసంగి మంత్రద్రష్ట = ఋషి స్తుతించుచున్నాడు.

అథైనమేతయాదిత్యకృత్య స్తౌతి.

అథ = మఱియు, ఏనమ్ = ఈపార్థివాగ్నినే, అదిత్యకృత్య=సూర్య రూపమునొసంగి, ఏతయా = నిమ్నఋక్కుతో, స్తౌతి=స్తుతించుచున్నాడు.

> "య దేదేనమదధుర్యజ్ఞియాసో దివి దేవాః సూర్యమాదితేయమ్. యదా చరిష్ణూ మిథునావభూతావాదిత్ప్రాపశ్యన్ భువనాని విశ్వా". (ఋ. ౧౦-౮౮-౧౧)
>
> యదైనమదధుర్యజ్ఞియాః సర్వే దివి దేవాః సూర్యమ్ ఆదితేయమ్ అదితేః పుత్రమ్. యదా చరిష్ణూ మిథునౌ ప్రాదురభూతామ్ సర్వదా సహచారిణౌ. ఉషాశ్చాదిత్యశ్చ. మిథునౌ కస్మాత్ ? మినోతిః శ్వయతికర్మా. థు ఇతి నామకరణః. థకారో వా. నయతిః పరః. వనిర్వా సమాశ్రితావన్యోన్యం నయతః. వనుతో వా. మనుష్యమిథునావప్యేతస్మాదేవ. మేథన్తావన్యోన్యం వనుత ఇతి వా.

యదైనం సూర్యం ఆదితేయం - ఆదితేః పుత్రం, దివి అదధుః - ద్యులోకే స్థాపితవన్తః దేవా యజ్ఞియాసః యజ్ఞసంపాదినః, యజమానాః. యదా చైతౌ చరిష్ణూ - సర్వదా సహచరణశీలౌ, మిథునౌ ప్రాదురభూతామ్ ఉషాశ్చాదిత్యశ్చ. ఆత్ - తదా ప్రాపశ్యన్ - ప్రకర్షేణాపశ్యన్. భువనాని-

భూతాని విశ్వా విశ్వాని సర్వాణీత్యర్థః. 'థు' ఇతి నామకరణః - ప్రత్యయః, థకారో వా నామకరణో వికల్పేన. నయతిః పరః 'ణీఞ్' ధాతు - ఉత్తర పద వనిర్వా వనసంభక్తౌ వికల్పేన. అథ కోఽర్థః? సమాశ్రితౌ అన్యోన్యం వా సంభక్తౌ. మనుష్యమిథునౌ అపి ఏతస్మాదేవ. తౌ హి కర్మార్థం మేథన్తౌ ఇవ పరస్పరేణ కాలం నయతః.

మంత్రార్థము :— యువా ఇత ఏనం = ఎప్పుడు ఈ, అదితేయం = అదితిపుత్రుడైన సూర్యుని, యజ్ఞియాసః దేవాః = యాజ్ఞికదేవతలు, దివి = ద్యులోకమున, అదధుః = ఉంచిరో, యదా — మఱియు నెప్పుడు, చరిష్ణూ = కలిసియుండు, మిథునౌ = ఉషస్సు, ఆదిత్యులనుఇరువురు, అభూతామ్ = ప్రకటమైరో - ఉదయించిరో, అత్ = ఆసమయమున, విశ్వాభువనాని = సమస్తభూతములు, ప్రాపశ్యన్ = వీరిని చూచిరి.

మిథునౌ కస్మాత్? మిథునశబ్దమెట్లేర్పడినది? శ్రయతి కర్మా మినోతిః = శ్రయత్యర్థక 'మి' ధాతువునకు పరమున, థు ఇతి నామకరణః = థు అనుప్రత్యయముకాని, లేక థకారము కాని, థ ప్రత్యయముకాని, చేసి తరువాత ఉత్తరపదమున 'నీ' ధాతువు - న - చేర్చిన మిథున పదము సిద్ధమగును. వనిఃవా = లేక, వనధాతువువలనను ఏర్పడును. సమాశ్రితౌ అన్యోన్యం నయతః = ఒకరినొకరు ఆశ్రయించి కాలమునయింతురు, వనుతఃవా = లేక పరస్పరము కలసియుందురు. 'వనుసంభక్తౌ' మనుష్య మిథునావపి మనుష్యులజంటకూడ స్త్రీపురుషులు భార్యాభర్తలు మిథున మనబడుదురు. ఆ మిథునశబ్దముకూడ 'వను' ధాతువుతోనే సిద్ధమగును. మేథన్తౌ అన్యోన్యం వనుతః ఇతి వా = ఈమిథునశబ్దము 'మేథ్' 'వను' అను రెండుధాతువులవలనను సిద్ధముకాగలదు. పరస్పరము స్త్రీపురుషులు ఒకరు మఱియొకరికి మేధా = బుద్ధినిగఱపుచు, అపరాధము జరిగినపుడు ఒకరినొకరు దండించుకొనుచు కాలముగడపువారు మిథునశబ్దవాచ్యు లగుదురు.

అథైనమేతయాఽగ్నికృత్య స్తౌతి.

అథ పునః ఏనం - ఆదిత్యం ఏతయా - ఉత్తరయర్చా, ఏతస్మిన్నేవ సూక్తే అగ్నికృత్య హోతృత్వేన స్తౌతి. హోతృత్వేన హ్యగ్నేః కర్మ న సూర్యస్య. తస్మాదిదమగ్నిర్ వైశ్వానరీయం సూక్తమ్.

మఱియు, మరల నీయగ్నికే రూపమొసంగి యీక్రిందిఋక్కుతో స్తుతిచేయుచున్నాడు.

> "యత్రా వదేతే అవరః పరశ్చ యజ్ఞన్యోః కతరో నౌ వివేద. ఆ శేకురిత్సధమాదం సఖాయో నక్షన్త యజ్ఞం క ఇదం వివోచత్" (ఋ. ౧౦-౮౮-౧౭)

> యత్ర వివదేతే దైవ్యౌ హోతారౌ. అయం చాగ్నిరసౌ చ మధ్యమః.కతరో నౌ యజ్ఞే భూయో వేద ఇత్యాశక్నువన్తి. తత్సహమదనం సమానాఖ్యానా ఋత్విజస్తేషాం యజ్ఞం సమశ్నువానానాం కో న ఇదం వివక్ష్యతీతి.

యత్ర - యస్మిన్ కర్మణి వివదేతే అవరః పరశ్చ దైవ్యౌ హోతారౌ - అయం చ అగ్నిః పార్థివః, అసౌ చ మధ్యమః వాయుః. యజ్ఞన్యోః - యజ్ఞనేత్రోః నౌ ఆవయోర్ మధ్యే ఉభావప్యావాం య స్య నేతారౌ కతరో బహు వేదేతి వివాదం కుర్వాతే. సఖాయః - సమానఖ్యానాః, ఋత్విజో యజ్ఞే వినియుక్తాః యే నక్షన్త - సమశ్నువతే యజ్ఞమ్. తే సధమాదం - సహమాదమ్. సహర్షముపక్రమ్య ఆశేకుః వక్తుమాశక్నువన్తి. క ఇదం వివోచత్ - కో న ఇదం వివక్ష్యతీతి. మధ్యమం ఇంద్రం ఉత్తమం సూర్యం అయమేవ - పార్థివః.

మంత్రార్థము :- యత్ర = ఏకర్మమునందు, అవరః పరః చ = ఈభూగోళపుటగ్ని, ఆమధ్యమలోకపుటగ్నివిద్యుత్తు, వివదేతే = వివదించుచున్నవి, యజ్ఞన్యోః = యజ్ఞమునునడపు మనయిరువురిలో నెవరు యజ్ఞవిషయమునెక్కువగా నెఱిగినవాడు? యజ్ఞనేతృత్వము నెవడు బాగుగ చేయగలడు అక్కడ సఖాయః = ఋత్విజులు, నక్షన్తయజ్ఞం=ఏయజ్ఞముప నున్నవారు, ఇత్ = ఈయిరువురియొక్క, సధమాదం = స్పర్ధను లేక సంఘర్షమును, ఆ శేకుః = దూరమొనర్చుటకు సమర్థులైరి ? వారు చెప్ప సాగిరి. ఈయిరువురిలో నెవరు సమర్థులో ఎవరుచెప్పగలరు ? మాకు

ఇద్దఱుసమర్థులుగానే కనబడుచున్నారు. యత్ర వివదతే దేవ్యౌ హోతారౌ= ఏయజ్ఞమున నిరువురు హోతలు వివరింతురో - ఆదేవతలెవరు? అయం చ అగ్నిః = ఈపార్థివ - అగ్ని, అసౌ చ మధ్యమః అగ్నిః = విద్యుత్తు, కతరః నౌ యజ్ఞం భూయః వేద = మనయిరువురిలో నెవరు యజ్ఞము నెక్కుడుగా నెఱుగును? అశక్నువస్తి = అసమర్థులగుచున్నారు, తత్సహ మదనం = ఆ సంఘర్షను దొలగింప, సమానాఖ్యానా ఋత్విజః = సమాన జ్ఞానముగల యజ్ఞకర్తలు, తేషాం యజ్ఞం సమశ్నువానానాం = యజ్ఞమున నుపస్థితులయినవారిలో నెవరు కః స ఇదం వివక్ష్యతి = నిర్ణయించి చెప్పగలరు?

తస్యోత్తరా భూయసే నిర్వచనాయ.

యథా అగ్నిప్రధాన మేతత్సూక్తం న సూర్యప్రధానమ్, తస్యోత్తరా ఋక్ భూయసే నిర్వచనాయ-బహుతరాయ నిరుచ్య వచనాయ. అస్యాం హి విభజ్య వాయోః కేవలోఽగ్నిరేవ స్తూయతే పూర్వస్యాముభావపి.

ఆ విషయమునే అధికముగా ప్రతిపాదించుటకి క్రిందిఋక్ ఉదాహరింపబడుచున్నది.

"యావన్మాత్రముషసో న ప్రతీకం సుపర్ణ్యోఽవసతే మాతరిశ్వః. తావద్దధాత్యుపయజ్ఞమాయన్ బ్రాహ్మణో హోతురవరో నిషీదన్" (ఋ. ౧౦-౮౮-౧౯)

యావన్మాత్రముషసః ప్రత్యక్షం భవతి ప్రతిదర్శనమితి వా. అస్త్యుపమానస్య సంప్రత్యర్థే ప్రయోగః. ఇహేవ నిధేహీతి యథా. సుపర్ణ్యః సుపతనాః. ఏతా రాత్రయో వసతే మాతరిశ్వన్ జ్యోతిర్వర్ణస్య. తావదుపదధాతి యజ్ఞమాగచ్ఛన్ బ్రాహ్మణో హోతాస్యాగ్నేర్హోతురవరో నిషీదన్.

హే మాతరిశ్వన్! యావన్మాత్రం న సంప్రతి, ఉషసః ప్రతీకమ్ - ప్రత్యక్తం ప్రతిగతం ప్రకాశస్య ఏతాః సుపర్ణ్యః - సుపతనా రాత్రయ ఆత్మని అనుప్రవిష్టమ్ తమో వసతే - ఛాదయన్తి. తావత్ యజ్ఞమ్ ఉపాయన్ ఆగచ్ఛన్ బ్రాహ్మణః హోతృత్వే నిషీదన్ ఉపదధాతి - ధారయతి హోత్రం కరోతి. ఇతి పార్థివో అగ్నిః విశేషతోఽభిష్టూయతే. హోతృజప ఇతి. అనగ్నిః - అగ్నిభిన్నో యో వైశ్వానరః తత్సూచక ఇత్యర్థః. తమేవాహ - హే దేవసవితః సర్వస్య ప్రసవితః.

మంత్రార్థము :— యావన్మాత్రమ్ = ఎప్పటివఱకు, ఉషసః = ఉషఃకాలముయొక్క, ప్రతీకం = దర్శనముఅగునో, న (న శబ్దమునకు సంప్రతి అని అర్థము) ఇప్పుడు, ఉషస్సుదర్శనముకానంతవఱకు - ఇక ముందు కాబోవుచున్నది - అనగా రాత్రి - అవసానదశలో) సుపర్ణ్యః = మంచిపతనములుగల - రాత్రివసతే = అంధకారముతో సమస్తజగత్తు అచ్ఛాదితమైయున్నది. మాతరిశ్వః = హే వాయో!, తావత్=అంతవఱకు, బ్రాహ్మణః = యజ్ఞకర్తయగు బ్రాహ్మణుడు, హోతుః=హోతయొక్క, యజ్ఞంఆయన్ = యజ్ఞమునవచ్చి పశ్చిమభాగమున, నిషీదత్=కూర్చుండిన వాడై, ఉపదధాతి = ఈవైశ్వానర - అగ్నిని, ఆధానముచేయును - యజ్ఞ కుండమునసుంచును.

యావన్మాత్రం ఉషసః=ఎంతవఱకు ఉషస్సుయొక్క, ప్రత్యక్తం= ప్రత్యాగమనము, భవతి = అగునో, ప్రతిదర్శనం = పునర్దర్శనమగునో యంతవఱకు, అస్తి = ఉన్నది, ఉపమానస్య = ఉపమయొక్క, సంప్రత్యర్థే = సంప్రతి = ఇప్పుడు అర్థమునందు, ప్రయోగః = ప్రయోగము, ఇహ ఇవ నిధేహి = ఉంచుము, యథా = ఎట్లన, "ఇక్కడ ఉంచుము" ఇట్టిప్రయోగమునందువలె, సుపర్ణ్యః = సుపతనా ఏతాః రాత్రయః = మంచిపతనములుగల యీరాత్రులు, వసతే = ఆచ్ఛాదితముచేయును. హే మాతరిశ్వన్! = హే వాయో! జ్యోతిర్వర్ణస్య = ప్రకాశముయొక్క జ్యోతిని, ఉపదధాతి = ఆధానముచేయును, యజ్ఞాగ్నిని ప్రజ్వలింప

చేయును, యజ్ఞం ఆగచ్ఛన్ బ్రాహ్మణః హోతా=యజ్ఞమునవచ్చి బ్రాహ్మణుడు హోత, అస్య అగ్నేః హోతః=ఈ హోతయగు అగ్నియొక్క, అవరః నిషీదన్=పశ్చిమభాగమున కూర్చున్నవాడై,ప్రాతఃకాలమునపూర్వాభిముఖుడై కూర్చుండు ఆచారమున్నది.అందువలన పశ్చిమభాగమునకూర్చుండవలెను.

> హోతృజప స్త్వనగ్నిర్వైశ్వానరీయో భవతి. "దేవ సవిత రేతం త్వా వృణతేఽగ్నిం హోత్రాయ సహ పిత్రా వైశ్వానరేణ." ఇతి. ఇమమేవాగ్నిం సవితారమాహ. సర్వస్య ప్రసవితారమ్. మధ్యమం వా. ఉత్తమం వా పితరమ్.

ఏవం భౌమం త్వాం తే పిత్రా వైశ్వానరేణ వృణుతే ఋత్విజః.

హోతృజపః తు=హోతృజపము హోతచేయుజపము,అనగ్నిః వైశ్వానరీయః భవతి = అగ్నికంటె భిన్నమైన వైశ్వానరునకు సంబంధించినజపము ఆజపము.'దేవసవితః' ఇత్యాది-దానియర్థము-సవితః దేవ != ఓసకలజగదుత్పాదక దేవ! ఏతం త్వా అగ్నిం=ఈఅగ్నివైన నిన్ను వైశ్వానరేణ పిత్రాసహ= తండ్రియైన వైశ్వానరుతోపాటు, హోత్రాయ=యజ్ఞకర్మకొఱకు, వృణుతే= వరించుచున్నారు. ఇట్లు ఇందు వైశ్వానరుని అగ్నికి తండ్రిగా అంగీకరింపబడినది. మీరింతవఱకు వైశ్వానర అగ్నిని విశ్వానర - మాధ్యమిక - అగ్ని-విద్యుత్తు-మఱియు సూర్యుడు నను నీరెండింటి సంతానమని వర్ణించుచు వచ్చిరి. అగ్ని విద్యుత్తు, సూర్యులునునువాని సంతానమని చెప్పుచు వచ్చినారు కదా! ఈ హోతృజపమున దానికి విపరీతముగా పుత్రుడే తండ్రియేనా అని శంకింపగా సమాధానము చెప్పుచున్నారు. ఇమమేవఅగ్నిం = ఈపార్థివమగు అగ్నినే యిట - హోతృజపమునందును, సవితారం ఆహ సర్వస్య ప్రసవితారం = సమస్తఅగ్నిహోత్రాదికర్మకు ఉత్పాదకుడని చెప్పినారు. అన్నింటికి ప్రేరకుడని యంగీకరింపబడినది. మధ్యమ్ ఉత్తరమ్ వా పితరమ్ = మఱియు, మధ్యమస్థానదేవత విద్యుత్తు, ఉత్తర దేవత సూర్యుడు నను వీనిని పితా = తండ్రిగాచెప్పబడినది. ఏలయన, జపవచనమునందు 'పిత్రా' అని వేదవ్యపదేశము స్పష్టముగా చెప్పబడినది. ఇది యాస్కముని సమాధానము. ఇక శాకపూణి సమాధానము.

**యస్తు సూక్తం భజతే యస్మై హవిర్నిరూప్యతే అయమేవ సోఽగ్నిర్వైశ్వానరః. నిపాతమేవైతే ఉత్తరే జ్యోతిషీ ఏతేన నామధేయేన భజేతే భజేతే.**

నిపాతమేవైతే ఉత్తరే - అగ్రిమే జ్యోతిషీ, వైశ్వానర ఇతి ఏతేన నామధేయేన, భజతే భజతే-ధారయేతే. ద్విరభ్యాసోఽధ్యాయ సమాప్త్యర్థః. ఏకం చ వైశ్వానరో భౌమోగ్నిఽస్తత్ర విపక్షిత ఇతి సిద్ధమ్.

యస్తు = ఏదైతే, వైశ్వానరసూక్తం భజతే = సూక్తమెవనిపేరుతో నున్నదో, యస్మై హవిర్నిరూప్యతే = ఎవనికొఱకు హవి యియ్యబడునో; సః తు = అతడైతే, వైశ్వానరుడే, అయమేవ అగ్నిః = ఇతడే అగ్ని, ఏతే ఉత్తరేజ్యోతిషీ=ఉత్తరజ్యోతిస్సులు-విద్యుత్సూర్యులు వైశ్వానరనామముతో నిపతింపబడినవి. నిపాతమేవ భజతే = గౌణతాభాగులే విద్యుత్సూర్యులకు వైశ్వానరపదము గౌణార్థమున ప్రయోగింపబడినదని తాత్పర్యము.

భజతే - ద్విరుక్తి అధ్యాయసమాప్తిబోధకము.

ఇతి సప్తమోఽధ్యాయః

సప్తమాధ్యాయము సమాప్తము.



# అథాష్టమోఽధ్యాయః

## (త్రయోదశ పదములు)

## ప్రథమ పాదము

ద్రవిణోదాః - ౧

ఇంతవఱకు అగ్నిమున్నగు పదముల నిర్వచనముచేసి యిప్పుడు ద్రవిణోదపదమును నిర్వచించుచున్నారు.

> ద్రవిణోదాః కస్మాత్? ధనం ద్రవిణముచ్యతే - యదేనదభిద్రవన్తి. బలం వా ద్రవిణమ్ - యదేనేనాభిద్రవన్తి. తస్య దాతా ద్రవిణోదాః.

'ద్రవిణోదాః' ఇత్యేతత్ దేవతాపదమ్ నిర్వచనీయం వర్తతే తదర్థమారభతే ద్రవిణోదాః కస్మాత్? యస్మాత్ ఏతత్ అభిద్రవంతి తస్మాత్ ద్రవిణం - ధనం భవతి అథవా ద్రవిణం బలమ్ భవతి, కుతః? ఉచ్యతే యస్మాదనేన సంయుక్తాః పరాన్ అభిద్రవన్తి. తస్య ద్రవిణస్య ధనస్య బలస్య వా దాతా ద్రవిణోదాః.

అర్థము :- ద్రవిణోదాః కస్మాత్? ద్రవిణోదన నామమేల కలిగినది? ముందు ఇందలి మొదటిపదమునకు నిరుక్తిచెప్పుచున్నాము. ధనం ద్రవిణముచ్యతే = ధనము ద్రవిణమనబడును. ఏలయన? యత్ = ఎందువలన ఈధనము(ఏనత్)వైపు జనులు పరువిడుదురో - ధనమును గోరువారు ధనముకొఱకు పరుగులు పెట్టుదురు కావున, అతః = ధనము ద్రవిణమనబడినది - బలం వా ద్రవిణమ్=వా లేక, బలము ద్రవిణము. ఏలయన బలముకలవారు ఇతరులపై దాడిచేయుదురు, (యదేతేన యుక్తా

పర్యాభిద్రవన్తి) ద్రవిణోదాః = ఇట్టిధనము నిచ్చువాడు ద్రవిణోదు డనబడును.

తస్యైషా భవతి.

ఆ ద్రవిణోదస్సుని ప్రాధాన్యమును దెలుపు - స్తుతించు ఋక్కు.

"ద్రవిణోదా ద్రవిణసో గ్రావహస్తాసో అధ్వరే. యజ్ఞేషు దేవమీడతే" (ఋ. ౧-౧౫-౭)

ద్రవిణోదా యన్తమ్. ద్రవిణస ఇతి ద్రవిణసాదిన ఇతి వా ద్రవిణసానిన ఇతి వా ద్రవిణస్తస్మాత్ పిబత్వితి వా. యజ్ఞేషు దేవమీడతే. యాచన్తి స్తువన్తి వర్ధయన్తి పూజయన్తీతి వా

తస్యాః ద్రవిణోదా - దేవతాయాః ప్రాధాన్యస్తుతియుక్తా వక్ష్యమాణా ఋక్ అస్తి. "ద్రవిణోదా - దేవమీడతే".

మేధాతిథేరార్షమ్. ద్రవిణసః - ఋత్విజః, గ్రావహస్తాసః-కరధృత ప్రస్తరాః సోమోత్కుట్టన - నిమిత్తమిత్యభిప్రాయః, అధ్వరే - యజ్ఞే అగ్నిష్టోమాదౌ యజ్ఞేషు - యజతిషు హవిః సంప్రదానేషు సవనేషు యాగస్థానేషు వా యం ద్రవిణోదసం దేవమ్ ఈడతే-యాచన్తి, స్తువన్తి, వర్ధయన్తి, పూజయన్తి వా స ద్రవిణోదాః దేవః సః ధనాని యచ్ఛతు ఇత్యాశేషమధ్యాహృత్య మంత్రార్థసమాప్తిః కర్తవ్యా.

అథైకపదనిరుక్తమ్. ద్రవిణసః కస్మాత్ ? యస్మాత్ ఇమే ధనస్య గవాదిరూపస్య దేవతార్థస్య హవిషో వా సంభక్తారః భవన్తి తస్మాత్ ద్రవిణసః ఇతి ఉచ్యన్తే అథవా ద్రవిణసాదనాత్ ద్రవిణసః.

ద్రవిణసః ఇత్యస్య పదస్య పంచమ్యేకవచనత్వే ద్రవిణోదాః సోమః. తదేవం యం దేవం ద్రవిణోదసం యజ్ఞేషు గ్రావహస్తాః ఋత్విజః ఈడతే స దేవః ద్రవిణోదాః ద్రవిణసః అస్మాత్ సోమాత్ ద్రవిణ సువిభాజకాదాదాయ స్వం భాగం పిబతు ఇత్యేవమాశాస్మహే.

మంత్రార్థము :— ద్రవిణోదా:, ఇట యః పదము అధ్యాహారముచేసి. యః ద్రవిణోదాః=ఎవడు ధనము, బలము నిచ్చునో, తమ్=ఆదేవుని, యజ్ఞేషు= యాగస్థానములందు, అధ్వరే = అగ్నిష్టోమాది యజ్ఞమునందు, గ్రావహస్తాసః = శిలలు హస్తమునధరించిన, (సోమమును దంచుటకుపయోగించు రాళ్లుపట్టుకొని) ద్రవిణసః = ద్రవిణరూప ధనమునాశించు ఋత్విజులు, ఈడతే = స్తుతింతురు - వర్ధిల్లజేయుదురు - పూజింతురు, అథవా = లేక, ఇట ద్రవిణసః = ఇది సాంతపంచమ్యంతము, ద్రవిణరూప = ధనరూప సోమమునుండి, లేక. ద్రవిణమును సంభజనచేయువారు ఆ సోమమునుండి తమయంశమును గ్రహించి, ఆ ద్రవిణోదాదేవులు త్రాగుదురుగాక !.

ద్రవిణసః - దీనివ్యుత్పత్తి - ద్రవిణసాదిన ఇతి వా = ద్రవిణమును పొందుదుము అని కర్మచేయుటకు కష్టపడువారు ద్రవిణసః అనబడిరి. ద్రవిణసాదిన ఇతి వా - లేక, గవాదిధనమునుగాని లేక దేవతానిమిత్తక హవిస్సునుగాని సంభజనచేయువారు ద్రవిణసః అగుదురు.

భాష్యార్థము :— ద్రవిణోదాః యః తమ్=(ఏకవాక్యతనుకల్పించుటకిట యః పదము అధ్యాహారము చేయబడినది) ఎవడు ద్రవిణదాతయో యతనిని అని అర్థము అగును. ద్రవిణసః = ఈపదమునకర్థము - ద్రవిణసాదినః = దక్షిణమున్నగుద్రవిణమును పొందుటకు యజ్ఞాదికర్మల నొనర్చుటలో, సీదన్తి కృచ్ఛ్రేణ = కష్టపడుయాజ్ఞికులు ద్రవిణసాదినః = ద్రవిణసాదులు అనబడుదురు. లేక ద్రవిణమును-సోమమును, సంభజన= సేవనచేయువారు ద్రవిణసాదినః అనబడుదురు. 'షణ'సంభక్తౌ ధాతువు వలన ద్రవిణసః - తస్మాత్ పిబతు ఇతి - లేక ద్రవిణస్ పదము సకారాంతము పంచమి. దానినుండి అనగా సోమరూపద్రవిణమునుండి సోమము నుండి తమభాగమును గ్రహించి త్రాగుదురుగాక.

> పూర్వపక్షము – తత్ కో ద్రవిణోదాః? ఇంద్ర ఇతి క్రౌష్టుకిః. స బల ధనయోర్దాతృతమః తస్య చ సర్వా బల కృతిః "ఓజసోజాతముత మన్య ఏనమ్" ఇతి చాహ. అథాప్యగ్నిం ద్రావిణోదసమాహ ఏష పునరేతస్మాజ్జాయతే.

"యోఽశ్మనోరంతరగ్నిం జజాన". (ఋ. ౨-౧౨-౩)
ఇత్యపి నిగమో భవతి.

అథాత్ర విచార్యతే కోఽయం నామ ద్రవిణోదా దేవః? ఆచార్యః క్రౌష్టుకిస్తావత్ ఇంద్రం ద్రవిణోదసం మన్యతే యతః ఇంద్ర ఏవ బలస్య ధనస్య చ నిరుపమో దాతేతి. సర్వా ఏవ చ బలక్రియాః ఇంద్రస్యైవ. తథా చ మంత్రకృతాపి సమర్థితమేతత్ "ఓజసో జాతముత మన్య ఏనమ్" అహమిమమింద్రమ్ అతిమహతో బలరాశేః జాతమ్ మన్యే. తస్మాత్ ద్రవిణస్య బలస్య దాతృత్వేన ద్రవిణోదాః ఇంద్రః. అపరం చ నిగమే అగ్నిః ద్రావిణోదస ఉక్తః. ద్రవిణోదసః అపత్యం పుమాన్ ద్రావిణోదసః, ద్రవిణోదసో జాత ఇత్యర్థః. తథా చ ఐంద్రే సూక్తే నిగమః - "యోఽశ్మనో అన్తరగ్నిం జజాన" యో ఇంద్రః అశ్మనో అశనవత్యోః ద్యావా పృథివ్యోః అన్తః మధ్యే అగ్నిం జజాన - జనయతి.

అర్థము :— తత్ = అప్పుడు, కః ద్రవిణోదాః ? = ద్రవిణోదుడెవడు? ఇంద్రః = ఇంద్రుడు అని క్రౌష్టికి ఆచార్యునిమతము. ఏలయన సః = ఆ యింద్రుడే, బలధనయోః = బలధనములను ఇచ్చువారిలో, దాతృ తమః = అత్యంతము ఉత్తముడు సర్వశ్రేష్ఠుడు, చ = మఱియు సర్వా బలకృతిః = సమస్తబలకార్యము, తస్య = ఇంద్రునిదే, ఈప్రపంచమున శక్తిచమత్కారమంతయు ఇంద్రునికి సంబంధించినదే. ఈవిషయము ఈ మంత్రమువలన ప్రకటమగుచున్నది. "ఓజసో జాతమ్ ఉత" నేను ఏనమ్ = ఈయింద్రుని, ఓజసోజాతమ్ = బలమునుండి పుట్టినవానినిగా, మన్యే = అంగీకరింతును ఇంద్రుడు బలమునుండి యుత్పన్నుడు కావుననే బలమునకు సంబంధించిన కార్యములన్నింటిని చేయువాడింద్రు డని నేనంగీకరించుచున్నాను.

అథాపి చ = మఱియు నింద్రుని ద్రవిణోదస్త్వమునకు ఇంకొక హేతువు మంత్రమున, అగ్నిమ్ = అగ్నిని, ద్రవిణోదసమాహ = ద్రవిణో దసుని అపత్యమని చెప్పబడెను, (ద్రవిణోదసః అపత్యమ్ ద్రావిణోదసః.) ఇక అగ్ని ఇంద్రునిఅపత్యమని ఇంద్రునినుండి పుట్టినదని యెట్లంగీకరింప గలమందురేని అందులకీ నిగమము ప్రమాణము. "యోఽశ్మనోన్తరగ్నిం

జజాన" యః = బలరాశియగు ఇంద్రుడు, అశ్మనోః=ద్యావాపృథివీలోకముల, అంతః = మధ్య, అగ్నిమ్ = అగ్నిని - వైద్యుతాగ్నిని, జజాన = ఉత్పన్న మొనర్చెను లేక చేయుచున్నాడు. మఱియు, సమత్సు = యుద్ధములందు శత్రువులను భేదించువాడు ఇంద్రుడు. దీనింబట్టి ఇంద్రుడే బలరాశి యనియు అగ్నికి జన్మనిచ్చినవాడనియు స్పష్టమగుచున్నది.

**అథాపి ఋతుయాజేషు ద్రావిణోదసాః ప్రవాదా భవన్తి. తేషాం పునః పాత్రస్యేంద్రపానమితి భవతి.**

అథ తృతీయం హేతుముపన్యస్యతి - ఋతుయజనసంబంధిషు మంత్రేషు ద్రవిణోదః పదయుక్తాః ప్రవాదాః శ్రూయన్తే యథా - "అపాత్ హోత్రాదుత పోత్రాదమత్తోత నేష్ట్రాదజుషత ప్రయోహితమ్, తురీయం పాత్ర మమృక్తమమర్త్యం ద్రవిణోదాః పిబతు ద్రవిణోదసః"

అథాపి = మఱియు, ఇంకొక ప్రమాణము - ఋతుయాజేషు - ఋతవో యైః మంత్రైః ఇజ్యన్తే తే ఋతుయాజః = ఏమంత్రములతో ఋతుయజ్ఞములు చేయబడునో యవి ఋతుయాజులనబడును. ఆ ఋతు యాజులందు ద్రావిణోదసాః ప్రవాదాః భవన్తి - ద్రవిణోదమునకు సంబంధించిన చర్చలు ఎక్కువగా నున్నవి. తేషాం పునః పాత్రస్య = ఆ ఋతుయాజులపాత్రకు, ఇంద్రపానము ఇతిభవతి=ఇంద్రపానమ్ అను నామము కలదు.

ఈవిధముగ ఈయజ్ఞములపాత్రకు ఇంద్రపాన - పాత్రమని నామ మున్నప్పుడు ఇంద్రుడు సోమమునుచేయుపాత్ర ఇంద్రపానమనబడుట వలనను ద్రవిణోదాః = ఇంద్రుడేయని స్పష్టమగుచున్నదని భావము.

**అథాఽప్యేనం సోమపానేన స్తౌతి.**

ఇత్యస్మిన్ మంత్రే ఋతుయాజానాం యత్పాత్రమ్ యేన తే హూయన్తే తస్య 'ఇంద్రపానమ్' ఇతి సమాఖ్యా వర్తతే తస్మాత్ ద్రవిణోదాః ఇంద్రః.

అథాపి = మఱియు ఋతుయాజులందు, ఏనమ్ = ఈయింద్రుని, సోమపానేన = సోమపానముతో, స్తౌతి = స్తుతిచేయబడును. ఈకథనము

నకు తాత్పర్యమేమన:- ఋతుయాజములందు ద్రవిణోదసునకు సంబంధించిన చర్చ మిక్కిలిగా నున్నది. మఱియు నీఋతుయాజులందు పాత్ర కూడ ఇంద్రునినామముతోనే యున్నది. మఱియు సోమపానమునందును ఇంద్రునిస్తుతి చేయబడినది. దీనింబట్టి ద్రవిణోదస్ శబ్దమునకతిరిక్తము మఱియొండు లేదు. ఏలయన సోమపానముచే ఇంద్రునికిమించి మఱియొకని స్తుతియును లేదు.

అథాప్యాహ "ద్రవిణోదాః పిబతు ద్రావిణోదసః" ఇతి. (ఋ. ౨-౩౭-౪).

అయం చాపరశ్చతుర్థో హేతుః - యస్మాత్ ఏనమింద్రం సోమపానేన మంత్రకృత్ స్తౌతి - మందస్వ హోత్రాత్ ద్రవిణోదః పిబ ఋతుభిః" సోమసంస్కారస్య ఇంద్రార్థత్వాత్ న హి అన్యః కశ్చిద్దేవః సోమపానేన స్తూయతే తస్మాదింద్ర ఏవ ద్రవిణోదాః.

అపి చైతత్ పంచమం కారణమ్ - ద్రవిణోదాః పిబతు ద్రావిణోదసః యస్య ద్రవిణోదస - అగ్నిః అపత్యం స దేవః ద్రవిణోదాః ఇంద్రః పిబతు ఇతి. తదేవమాచార్యః క్రౌష్టుకిః నిజమత - సమర్థనాయ పంచ హేతూన్ ఉపపాదితవాన్.

అర్థము:- అథాపి = మఱియు ఇంద్రుని ద్రవిణోదస్త్వమునకు మఱియొక హేతువు - ఆహ మంత్రః = మంత్రముచెప్పుచున్నది, ద్రావిణోదసః = ద్రవిణోదునిపుత్రుఁడగు అగ్నినిగూర్చి ద్రావిణోదసః = ద్రావిణోదసుడు, పిబతు = పానముచేయునుగాక అనెను. అనగా ద్రవిణోదసుని అపత్యం సంతానము అగ్ని యని అంగీకరింపబడినది. ఆయగ్ని ఇంద్రుని వలన ఉత్పన్నమైనది. కావున ఇంద్రుడే ద్రవిణోదసుడని పర్యాయముగా చెప్పబడినది.

ఈవిధముగ క్రౌష్టికిఆచార్యుడు ఉపర్యుక్తహేతువులమూలమున ఇంద్రుడే ద్రవిణోదాః - అని యంగీకరించుచున్నాడు - ఇక దీనికి సమాధానము ఉత్తరపక్షము.

అయమేవాగ్నిః ద్రవిణోదాః ఇతి శాకపూణిః. ఆగ్నేయేష్వేవ హి సూక్తేషు ద్రావిణోదసాః ప్రవాదా భవన్తి. "దేవా అగ్నిం ధారయన్ ద్రవిణోదామ్" (ఋ. ౧-౯౬-౧) ఇత్యపి నిగమో భవతి.

అయం పార్థివోగ్నిరేవ ద్రవిణోదాః ఇతి శాకపూణేః ఆచార్యస్య ద్వితీయం మతమ్ యస్మాత్ ఆగ్నేయేష్వేవ సూక్తేషు ద్రవిణోదః సంబంధినః ప్రవాదాః సన్తి. తథా చ నిగమః "దేవాః అగ్నిం ధారయన్ ద్రవిణోదామ్" అథ చ యది మాధ్యమికోఽభవిష్యత్ తతః యాన్యేతాని మాధ్యమికాని ఐంద్రాణి పార్జన్యాని వారస్పత్యాని వా సూక్తాని సన్తి తేషు ద్రావిణోదస ఏవ ప్రవాదాః అభవిష్యన్ న చైతదస్తి, తస్మాత్ సూక్తేషు అగ్నికర్మణా స్తవనాత్ ద్రవిణోదాః అగ్నిరేవ.

అర్థము :- అయమగ్నిః ఏవ ద్రవిణోదాః=ఈయగ్నియే ద్రవిణోదాః=ద్రవిణోదుడు, ఇంద్రుడు - కాడు (న - ఇంద్రః) అని శాకపూణి ఆచార్యుని మతము, హి = ఏలయన, ఆగ్నేయేషు సూక్తేషు ఏవ = అగ్నిదేవతాక సూక్తములందే ద్రవిణోదసునికి సంబంధించినచర్చ బహుళముగానున్నది. ఎట్లన :- "దేవా అగ్నిమ్" ఈమంత్రమున దేవతలు ద్రవిణోదామ్ = ద్రవిణములు - హవిస్సులు వహించు, అగ్నిమ్ = అగ్నిని, ధారయన్ = ధారణచేసిరి, ఈమంత్రమున ద్రవిణోదసునిచర్చ ఆగ్నేయమంత్రమున చేయబడినది. ద్రవిణోదసునే అగ్నికివిశేషణముగా చెప్పబడినది. కావున ద్రవిణోదాః అగ్నియేకాని ఇంద్రుడు కాదు.

యథో ఏతత్ స బలధనయోర్ దాతృతమ ఇతి సర్వాసు దేవతాసు ఐశ్వర్యం విద్యతే. యథో ఏతదోజసో జాతముత మన్య ఏనమితి చాహేత్యయమప్యగ్నిరోజసా బలేన మథ్యమానో జాయతే తస్మాదేనమాహ సహసస్పుత్రం సహసః సూనుం సహసో యహుమ్.

అథ చ యత్ క్రౌష్టుకినా ప్రతిపాదితమ్ బలస్య ధనస్య చ దాతా ఇంద్రః ఏవ తన్న ఖేదకమమ్. యతః సర్వ ఏవ దేవాః ఐశ్వర్యశాలినః.

అథ చ యదప్యుక్తం క్రౌష్టుకినా "ఓజసో జాతముత మన్య ఏనమ్" తదపి న యుక్తః అగ్నిరపి ఓజసా-బలేన మథ్యమానః జాయతే అతః ఏవ చైనమగ్నిం సహస్పుత్రం సహసః సూనుమ్, సహసో యహుం సమామనన్తి తథా చ నిగమాః.

క) ద్రవన్నః సర్పిరాసుతిః ప్రత్నో హోతా వరేణ్యః. సహసస్పుత్రో అద్భుతః. ద్రవన్నః - ద్రుమాన్నః సర్పిరాసుతిః - సర్పిరాసవో యస్య, ప్రత్నః - పురాతనః, హోతా వరేణ్యః - వరణీయః సహసః - బలస్య పుత్రః, అద్భుతః - విలక్షణః.

ఖ) "త్వం యద్యవిష్ఠ సహసః సూనవాహుతః. ఋతావా యజ్ఞియో భువః" విరూపస్యార్షమ్. ఆగ్నేయీ గాయత్రీ. హే యవిష్ఠ - యువతమ, సహసః - బలస్య సూనో పుత్ర! ఆహుతః-అభిహుతః, ఋతావా-సత్యవాన్, యజ్ఞియః - యజ్ఞసంపాదకః, భువః - భవతి.

గ) "అగ్నే! వాజస్య గోమత ఈశానః సహసో యహో. అస్మే ధేహి జాతవేదో మహిశ్రవః". గౌతమస్యార్షమ్. ఆగ్నేయీ ఉష్ణిక్. హే అగ్నే! త్వమ్ సహసః బలస్య, యహో! పుత్ర గోమతః వాజస్య-అన్నస్య ఈశానః-ఈశ్వరః జాతవేదాః చ అసి. అస్మే - అస్మాసు మహిశ్రవః - మహద్ గవాదిధనం ధేహి. తదేవమేతేషు మంత్రేషు అగ్నిరపి ఓజసో జాత ఇత్యుపపన్నమ్.

అర్థము :- యథాఏతత్ = మఱియు నేది, సః=ఇంద్రుడు, బలధన యోః = బలధనములయొక్క, దాతృతమః = సర్వోత్తమదాతయని ఏది చెప్పబడినదో యది సరికాదు. ఐశ్వర్యము సర్వాసు దేవతాసు = సర్వ దేవతలందును పొందబడుచున్నది. ధనబలదాతృత్వమనునది సమస్త దేవతలందును కలదు. ఇంద్రుని నొసట నిదివిశేషముగా వ్రాయబడ లేదు. కావున నింద్రుడు ద్రవిణోదాః కాదు. కాని అగ్నియే ద్రవిణోదాః అని సిద్ధమగుచున్నది.

యదోఏతత్ = మఱియు నేను. ఏనమ్ = ఇంద్రుని, ఓజసో జాతమ్ = బలమునుండి ఉత్పన్నుడైనాడని మన్యే = అంగీకరించు చున్నాను. కావున ఇంద్రుడే ద్రవిణోదాః అని యేదిచెప్పబడినదో యా

హేతువుకూడ నిరర్థకమే. ఏలయన అయమపిఅగ్నిః = ఈయగ్నికూడ, ఓజః = బలముతో, మథ్యమానః = మథించుటవలననే ఉత్పన్నమగును. (జాయతే) అందువలన బలమునుండియే అగ్నియు నుత్పన్నమైనది. తస్మాద్ ఏనమ్ ఆహ = కావుననే అగ్నివిషయమునను, సహసస్పుత్రం = బలపుత్రుడని, సహసః సూనుమ్=బల - సూనుడనియు, సహసోయహుం= బలమునకు పుత్రుడనియు చెప్పబడినది. ఇట్లు ఇంద్రునివిషయమున నేహేతువులు ద్రవిణోదుడగుటకు చెప్పబడినవో అగ్నివిషయమునను అట్టి హేతువు లెక్కువయే చెప్పబడినవి. కావున అగ్నిద్రవిణోదా వాచ్యుడగు చున్నాడు.

> యథో ఏతత్ అగ్నిం ద్రావిణోదసమాహేతి ఋత్విజోఽత్ర ద్రవిణోదస ఉచ్యన్తే హవిషో దాతారస్తే చైనం జనయన్తి, "ఋషీణాం పుత్రో అధిరాజ ఏషః" ఇత్యపి నిగమో భవతి,

యచ్చ పునరేతదుక్తమ్ - "అగ్నిం ద్రావిణోదసమాహ" తదపి న. యత స్తత్ర ద్రవిణోదసః ఇంద్రాజ్జాత ఇతి నాయమభిప్రాయః. అస్మిన్ మంత్రే తు ఋత్విజ ఏవ ద్రవిణోదసః నిగమేనాపి చ సమర్థితమేతత్ "ఋషీణాం పుత్రో అధిరాజ ఏషః".

యదో ఏతత్ = మఱియు, నేది, చెప్పబడినదో - అగ్నిం ద్రావిణో దసమ్ ఆహ = మంత్రమున అగ్నిం = అగ్నిని, ద్రావిణోదసమ్=ద్రవిణో దసుని అపత్యము అనిచెప్పబడినది. కావున ద్రవిణోదసుడనగా ఇంద్రుడు అని, అదియు సరికాదు. ఏలయన అత్ర = ఇట ఈమంత్రమునందు, ఋత్విజః = ఋత్విజులే, ద్రవిణోదసః=ద్రవిణోదసులు అని, ఉచ్యన్తే= చెప్పబడుచున్నారు, ఈఋత్విజులే హవిర్దాతలు, వారే యీఅగ్నిని, జన యన్తి = ఉత్పన్నముచేయుచున్నారు. కావున అగ్నియే ద్రావిణోదస్ ద్రావిణోదసుడు అని చెప్పబడుచున్నది. కావున నిస్సందేహముగా అగ్నియే ద్రావిణోదసుడు - ద్రవిణోదసునిఅపత్యము. కావున నిట ద్రవిణోదసులు ఋత్విజులే కాని ఇంద్రుడు కాదు. ఈఅగ్నియు ఋత్వి జులచేతనే ఉత్పన్నము చేయబడినది. అగ్ని ఋత్విజులసంతానము. ఋత్విజులు ద్రవిణోదసులు. అగ్నియే ద్రావిణోదసుడు. ఇంద్రుడు కానేకాదు.

యథో ఏతత్ తేషాం పునః పాత్రస్యేంద్రపానమితి భవతీతి భక్తిమాత్రం తత్ భవతి. యథా వాయవ్యానీతి సర్వేషాం సోమపాత్రాణామ్.

యథో ఏతత్ సోమపానేనైనం స్తౌతీత్యస్మిన్నప్యేతత్ ఉపపద్యతే–"సోమం పిబ మందసానో గణశ్రిభిః (ఋ.౫-౬౦-౮) ఇత్యపి నిగమో భవతి.

యచ్చ పునః పాత్రస్య 'ఇంద్రపానమ్' ఇతి సమాఖ్యేత్యుక్తం తదపి స యతః తత్తు భక్తిమాత్రమ్ గుణతః సంవాదః దుర్బలా హి సమాఖ్యా, యతః అసామర్థ్యాత్ గుణానువాదః "యథా వాయవ్యాని సోమపాత్రాణి" "సర్వేషాం సోమపాత్రాణామ్" నానాదేవతానామపి సతామ్. యచ్చ పున రుక్తమ్ సోమపానేనైనం స్తౌతి తత్తు అగ్నావపి సంపద్యతే తథా చ నిగమః- "సోమం పిబ మందసానో గణశ్రిభిః" మందసానః - మాదమానః - గణశ్రిభిః - గణశో భవంతమాశ్రయద్భిః.

యదో ఏతత్ = మఱియు నిది, ఆ ఋతుయాజులపాత్రనామము ఇంద్రపానము, అని యేదిచెప్పబడినదో యది భక్తిమాత్రమే. అది వారి భక్తినామము - గౌణనామమే. యథా = ఎట్లన - సర్వేషాం సోమపాత్రాణామ్ = సమస్తసోమపాత్రలనామము, వాయవ్యాని ఇతి = వాయువ్యపాన పాత్రలని నామము పెట్టబడినది.

యథా ఏతత్ = మఱియు నేది సోమపానేన = సోమపాననామమును గ్రహించి, ఏనం స్తౌతి = ఈయింద్రుని స్తుతిచేయబడినది అని యేది చెప్పబడినదో యదియు, అస్మిన్నపి ఏతత్ ఉపపద్యతే = అదియు అగ్ని విషయమునను, ఈసోమపానమంత్రములలో చూడబడినది - "సోమం పిబేతి" - హే అగ్నే ! సోమం పిబ = సోమమును త్రాగుము, గణశ్రిభిః = నీతోటివారితోపాటు - అనగా సోమపానము కేవలమింద్రునితోత్తేమియు కాదు - అగ్నియు సోమపానముచేయును. కావున సోమపానమనెడి విశేష ముతో ఇంద్రుని ద్రవిణోదసునిగా సిద్ధముచేయదలచుట నిర్హేతుకము.

యథో ఏతత్ ద్రవిణోదాః పిబతు ద్రావిణోదస ఇత్యస్యైవ తద్భవతి. "మేద్యంతు తే వహ్నయో యేభిరీయసేఽరిషణ్యన్ వీళయస్వా వనస్పతే. ఆయూయా ధృష్ణో అభిగూర్యా త్వం నేష్ట్రాత్ సోమం ద్రవిణోదః పిబ ఋతుభిః"(ఋ.౨-౩౭-౩) మేద్యన్తు తే వహ్నయో వోఢారో యైర్యాస్యరిష్యన్ దృఢీ భవాయూయ ధృష్ణో అభిగూర్యత్వం నేష్ట్రీయాద్ధిష్ణ్యాద్ధిష్ణ్యో ధిషణ్యో ధిషణాభవః. ధిషణా వాగ్ధిషేర్దధాత్యర్థే. ధీసాది నీతి వా. ధీసానినీతి వా. వనస్పత ఇత్యేనమాహైష హి వనానాం పాతా వా పాలయితా వా. వనం వనోతేః. పిబర్తుభిః కాలైః.

యచ్చ పునరుక్తమ్ - ఋతుయాజేషు ద్రవిణోదాః పిబతు ద్రావిణోదసః" తత్తు అస్యాగ్నేరేవ భవతి. అగ్నేరపి ఋతుయాజేషు సోమభాగిత్వాదితి. తథా చ ఋక్ మేద్యన్తు తే ... పిబ ఋతుభిః" గృత్సమదస్యార్షమ్. ఋతవ్యా జగతీ. హే వనస్పతే! ద్రవిణోదః భగవన్! ఏతే తే వహ్నయః - వోఢారః అశ్వాః, యేభిః - యైః, ఈయసే - నిత్యం గచ్ఛసి అరిషణ్యన్ అహింస్యమానః. ఏభిరశ్వైరాగత్య అస్మద్ యజ్ఞం వీళయస్వ దృఢమాత్మానం సంపాదయ సోమం పాతుమిత్యర్థః. ఆయూయ-ఆమిశ్రయ. హే ధృష్ణో! శత్రూణాం ధర్షయితః అగ్నే! అభిగూర్య - అభ్యుద్యమ్య తతః నేష్ట్రీయాత్ ధిష్ణ్యాత్ సోమం - నేష్ట్రా వషట్కృతం పిబ ఋతుభిః - కాలైః సహ. అథైకపదనిరుక్తమ్ - అగ్నిః వనస్పతిః కథమ్? యత ఏష వనానాం పాతా పాలయితా వా. అన్యర్థతోఽపి నైతాన్ దహతి. వనమ్ కస్మాత్ వనోతేః సంభజనార్థాత్. ధిష్ణ్యః కస్మాత్? ధిషణ్యో భవతి ధిషణా భవో వా. ధిషణా చ వాగ్భవతి దధాత్యర్థే వర్తమానాత్ ధిషేః. సా హి అర్థాన్ ధారయతి. అథవా ధీః ప్రజ్ఞా కర్మ వా అస్మిన్ సీదతి ఇతి ధిషణా అథవా ధీః సనోతి - సంభజతే. తస్మాత్ అగ్నిరేవ ద్రవిణోదాః నేంద్రః ఇతి శాకపూణేః సర్వస్వమ్.

అర్థము :— యదేతత్ = మఱియు ఏది యేది చెప్పుచున్నావో, ద్రావిణోదసః = అగ్నికి జన్మనిచ్చువాడు ఇంద్రుడు -(ఇంద్రః)-పిబతు = సోమపానముచేయునుగాక !' అని యది అస్యైవ = ఈయగ్నిపక్షమునవే సంగతమగుచున్నది. ఏలయన సోమపానాధికారము అగ్నికి ఋతుకాలములందు చెప్పబడినది. అందువలన నీమంత్రమున కీయర్థమే చెప్పవలయును. ఏమని - ద్రవిణోదసులు ఋత్విజులు వారిచే నుత్పన్నముచేయబడు అగ్నియే ద్రవిణోదాః = ద్రవిణోదుడు. ఇక మీరుచెప్పునట్టి 'ద్రవిణోదుడు ఇంద్రుడు - అతనిఅపత్యము ద్రావిణోదసుడు - అగ్ని' అని యది సరికాదు. పార్థివాగ్నియే సోమపానము చేయునుగాక యనియే మంత్రార్థము.

మంత్రార్థము :— వనస్పతే! ద్రవిణోదః హేవనస్పతే ! = వృష్టి జలమును రక్షించు ఓ యగ్ని !, తే వహ్నయః = నీజ్వాలలు లేక నీయశ్వములు, మేద్యన్తు = బాగుగ ఘృతాహుతులతో స్నిగ్ధములు స్నేహయుక్తములగునుగాక !, యేభిః = ఏజ్వాలలతో లేక అశ్వములతో, అరిష్యన్ అహింస్యమానః = ఎవరిచేతను హింసింపబడనివాడవై, ఎవరిని నీవు హింసింపక గతినొనర్చుచున్నావు (ఈయుషే) - జ్వలించుచున్నావు ఏకాయస్వ=స్థిరపడుము. అనగా దీర్ఘకాలమొనర్చు యజ్ఞములందు 'చిరకాలము ప్రదీప్తుడవై యుండుము. ధృష్ణో = శత్రువులను పరాభవించు అగ్నీ ! ఆయూయ = సంమిశ్ర్య = బాగుగ కలిపి అభిగూర్య = పైకెత్తుకొనివెళ్లి, నేష్ట్రాత్ = ఋత్విక్కునియజ్ఞశాలనుండి, ఋతుభిః = ఆయాఋతువులలో, సోమం పిబ = సోమపానముచేయుము.

భావార్థము :- వహ్నయః - వోఢారః = వహించువాడు వహ్ని యనబడును. వహ్ని = అగ్ని, తనజ్వాలలతో హవ్యద్రవ్యములను సూక్ష్మమొనర్చి యంతటను చేర్చును. ఏజ్వాలలతో అగ్ని గతికలదియగునో వానితో నెవరిని హింసింపడు. అరిషణ్యన్ - అహింస్యమానః = మఱియు నెవరిచే తాను హింసింపబడడు. ధృతీభవ = ఎల్లప్పుడు యజ్ఞములందు ప్రజ్వలించుచు అగ్ని దృఢపడును, ఆయూయ = హవ్యపదార్థములను బాగుగ మిశ్రణముచేయును, ధృష్ణః = రోగరూపశత్రువులను పరాభవించును - దూరమొనర్చును, నేష్ట్రీయాత్ధిష్ణ్యాత్ = ఋత్విక్కుని అగ్నిగృహమునుండి, అభిగూర్య = హవ్యమును పైకిగొనిపొమ్ము - అగ్ని

హవ్యద్రవ్యములను అగ్నిగృహమునుండి పైకికొనిపోవును. ధిష్ణ్యః ధిషణ్యః ధిషణాభవః - దిషణాచవాక్ వాణికి ధిషణా యనినామము - వేదవాణి - ధిషణాయాఃభవః ధిషణ్యః, ధిష్ణ్యః - దధాత్యర్థేధిషేః = ధారణార్థక ధిష ధాతువుతో ధిషణాశబ్దము సిద్ధించును. ధీసానినీతివా = వాణిజ్ఞానమును కలిగించును. కావున ధిషణా = వాక్కు. ధీసానినీ అనబడును. ధీసాదినీ వా - లేక ఆవాక్కుజ్ఞానమునిచ్చునది. కావున ధీసానినీ అనబడును. అనగా వాణి ధీసదనా ధీసనసా అగుచు ధిషణా యనబడునని భావము. వనస్పతే ఇతి = అగ్నివనస్పతియనబడును. కారణమేమన ఏష హి వనానాం పాతా పాలయితా = వనసంభక్తౌ ధాతువువలన వనపదము సిద్ధించును. వనపదము జలవాచకము. జలముచే వనము అడవి - వృక్ష సముదాయము - తడుపబడును. ఏషః అగ్నిః వనానాం జలానాం పాతా = జలములకురక్షకుడు, పాలయితా = పాలించువాడు కావున అగ్ని వనస్పతి అనబడుచున్నది. వనశబ్దము జలవాచకము. వనపదము నిఘంటువు జలనామములలో పఠింపబడినది. అట్లే ఋతుశబ్దము కాలవాచకము. ఇట్టిమంత్రమున ద్రవిణోదస్ అగ్నియని చెప్పబడినది. వనస్పతి ద్రవిణోదః రెండును అగ్నియొక్క విశేషణములే. అగ్నియే వృష్టిజలము నకు పతి, అగ్నివలననే వర్షములేర్పడును.

"అగ్నౌ ప్రాస్తాహుతిః సమ్యగాదిత్యముపతిష్ఠతే. అనిమనువు".

అగ్నియందుంచబడిన ఆహుతి ఆదిత్యునిచేరును.

ఇట్లు ద్రవిణోదాః వాస్తవమున అగ్నియే. ఎటనైన ఇంద్రాదులకు ద్రవిణోదపదమువాడబడినచో నది గౌణార్థమున వాడబడినట్లు ఎంచునది.

ప్రథమ పాదము సమాప్తము

## ద్వితీయ పాదము

అథాతః ఆప్రియః - ౧

**ఆప్రియః కస్మాత్ ? ఆప్నోతేః ప్రీణాతేర్వా. ఆప్రీభిరా ప్రీణాతి ఇతి చ బ్రాహ్మణమ్.**

అథాత ఆప్రియః - అథ ఇతి విశేషాధికారే. అతః ఇత్యానన్తర్యే. ఆప్రియః - ఆప్రీషు నిర్వక్తవ్యాః శబ్దాః వక్ష్యన్తే ఇతి శేషః. ఇహ కారణా వభిధేయే అభిధాననియమో నైరుక్తానామ్ తదర్థముపోద్ధత్య బ్రూతే ఆప్రియః కస్మాత్? ఆప్రియః ఋచః యతః ఏతాః అప్నువన్తి ప్రీణన్తి వా దేవతాః. అథవా ఆప్రియః దేవతాః ఆప్యన్తే వా ఇత్యభిప్రాయః తథా చ బ్రాహ్మణమ్ - ఆప్రీభిరాప్రీణాతితి.

అర్థము :- అథ = అధికారార్థము, అతః=దీనితరువాత, ఆప్రియః = ఆప్రీదేవతలవ్యాఖ్యచేయబడును. ఆప్రియః కస్మాత్? = ఆప్రీ పేరేల వచ్చినది? ఆప్నోతేః = ఆప్ల్వ్యాప్తౌ ధాతువుతో ఆప్రీసిద్ధమగును. లేక

ప్రీణాతేర్వా లేక ఆజ్పూర్వక 'ప్రీఞ్'ధాతువుతో సిద్ధమగును.

ఏ ఋక్కులవలన మనుష్యులకు సుఖము ఆనందము లభించునో మనుష్యులు ప్రసన్నులగుదురో ఆఋక్కులు ఆప్రీ అని పిలువబడును ఆ ఋక్కులు కారణముగా - ఋగ్దేవతలుకూడ ఆప్రీ అనబడును. ప్రీఞ్ధాతువుతో ఆప్రీసిద్ధముచేసినపుడు దానిని సమర్థించుటకు బ్రాహ్మణ వచనము ఉదాహరింపబడుచున్నది. ఆప్రీభిః = ఆప్రీఋక్కులతో ఆప్రీణాతి = మనుష్యులను ఆనందితులచేయును.

ఆప్రీదేవతలు పంద్రెండుగురు. ఇధ్మ, తనూనపాత్, నారాశంస, ఈడ, బర్హిషద్వారః, ఉషాసానక్తా, దైవ్యాహోతారా, తిస్రోదేవీః, త్వష్టృ, వనస్పతి, స్వాహాకృతయః.

తాసామిధ్మః ప్రథమాగామీ భవతి, ఇధ్మః సమింధనాత్. తస్యైషా భవతి.

ఆ ఇధ్మకు ఈ ఋక్.

"సమిద్ధో అద్య మనుషో దురోణే దేవో దేవాన్ యజసి జాతవేదః. ఆ చ వహ మిత్ర మహశ్చికిత్వాన్త్వం దూతః కవిరసి ప్రచేతాః." (ఋ. ౧౦-౧౧౦-౧)

**సమిద్ధో అద్య మనుష్యస్య గృహే దేవో దేవాన్ యజసి**
**జాతవేద ఆ చ వహ మిత్ర మహశ్చికిత్వాంశ్చైతనావాం**
**స్త్వం దూతః కవిరసి ప్రచేతాః ప్రవృద్ధచేతాః.**

తాసాం ఆప్రీసంజ్ఞకానామ్ ఋచాం మధ్యే ఇధ్మః ప్రథమాగామీ - ప్రథమమాగన్తుం శీలమస్యేతి. ఆప్రీ - పద దేవతా - పద - సమామ్నాయ ఇతి శేషః. ఇజ్యాయాః తత్పూర్వకత్వాదితి తనూనపాన్నరాశంసయోః అనిత్యత్వాచ్చ. తస్య ఇధ్మస్య - సమిత్సమూహస్య ప్రాధాన్యస్తుతివాచికా ఏషా ఋగ్భవతి "సమిద్ధో అద్య ... కవిరసి ప్రచేతాః" జమదగ్నేరార్షమ్. త్రైష్టుభమ్. హే ఇధ్మ! యస్త్వం సమిద్ధః - సందీప్తః, అద్య - ఏతస్మిన్ యజనీయే అహని, మనుషః - మనుష్యస్య, దురోణే - యజ్ఞగృహే, దేవః - హవిషాం దాతా, యజసి, హే జాతవేదః జాతవేదస ఆధారభూత! ఇతి లాక్షణికం పదమ్, హే మిత్రమహః - మిత్రాణాం పూజయితః. చికిత్వాన్ - జానానః, ఆ చ వహ = ఆహ్వాయ చ యతః త్వమ్ దూతః కవిః ప్రచేతాః అసి. కవిః - క్రాంతదర్శనః, ప్రచేతాః - ప్రకృష్టజ్ఞానః.

అర్థము :— ఈ ఉపర్యుక్త ద్వాదశ (౧౨) దేవతలందు ఇధ్మః = ఇధ్మనామకఆప్రీదేవత, ప్రథమాగామీ = (మొదటవచ్చునది) ప్రథమం ఆగన్తుం శీలం యస్య సః. ప్రథమాగామీ = అన్నింటికంటె ముందు వచ్చును. ఇధ్మః ఇధ్మ = ఏందువలన, సమింధనాత్ = ప్రదీప్తమగుట వలన - మండుటవలన ఇధ్మయనబడును. అనగా ఇంధనము

మంత్రార్థము :— హే ఇధ్మ! ఓ యింధనమా! అద్య = నేడు మనుషః = ప్రతిగృహస్థుడైన మనుజునియొక్క, దురోణే=ఇంటియందు, సమిద్ధః = ప్రదీప్తమై, దేవః = హవిర్దాత లేక, ద్యోతనశీలమగునీవు, దేవాన్ = దేవతలను, యజసి = యజనముచేయుచున్నావు. జాతవేదః != అగ్నియగునీవు, నాగృహమునందును, ఆవహచ = ఆహ్వానించుము. మఱియు యజనమొనర్పుము. ఏలయన, హే జాతవేదః! త్వం=నీవు, మిత్రమహ = మిత్రులకు పూజయితవు, చికిత్వాన్ = జ్ఞానవంతుడవు, మఱియు, త్వం = నీవు, ప్రచేతాః = ప్రవృద్ధజ్ఞానవంతుడవైన, కవిః=క్రాంతదర్శిని, మేధావీ= మాతవు

భాష్యార్థము :- మనుషః మనుష్యస్య = ప్రత్యేకమనుష్యుని గృహమునందు, చికిత్వాన్ = చేతనావాన్ = జానానః = తెలిసికొనుచు, ప్రచేతాః = ప్రవృద్ధచేతాః = ప్రకృష్టజ్ఞానముకలవాడు.

యజ్ఞేధ్మ ఇతి కాత్థక్యః. అగ్నిరితి శాకపూణిః.

కాత్థకస్య పుత్రః కాత్థక్యః ఆచార్యః ఏవం మన్యతే యత్ యః అయం ఇధ్మః ఆధీయతే ప్రతిప్రణవమిధ్మో యజ్ఞే స ఏవాయమ్. శాకపూణిః పునః అరాదుపకారిత్వాత్ ప్రైషస్య సన్నిపత్యోపకారిత్వాద్ చ ఇధ్మమ్ అగ్నిమేవ సమర్థయతి. 'సమిద్ధో అద్య' ఇత్యాదిమంత్రే సర్వేషామభిధానానామ్ కర్మణాం చ ప్రాధాన్యేనాగ్నిపక్షీయత్వాత్. అగ్నిపక్షే అభిధానాని కర్మాణి చ అగౌణాని ఇధ్మపక్షే చ గౌణాని. తదేవం గౌణముఖ్యయోర్మధ్యే ముఖ్యకార్యసంప్రత్యయః ఇతి న్యాయాత్. యాస్కాచార్యోఽపి ఏతదేవ సమర్థయతి

అర్థము :- కాత్థక్యః = కత్థకునిఅపత్యము కాత్థక్యుడు. అతని వచనము - ఏమన - ఈ యజ్ఞేధ్మ = యజ్ఞస్య ఇధ్మః = యజ్ఞకాష్ఠము మండుచున్న అగ్నియందువేయబడుఇంధనము - కట్టె అగ్నిహోత్రమున నుపయోగింపబడువల్ల యజ్ఞేధ్మ అనబడును. కాని శాకపూణిఆచార్యుడు మాత్రము ఇధ్మః = ఇధ్మఅగ్నియనుచున్నాడు. ఇధ్మ = అగ్ని వాచకము= యాస్కమునియు ఇధ్మ = అగ్నియేయని అంగీకరించుచున్నాడు. అందువలన అగ్నిపక్షమున మంత్రార్థము,

హే అగ్నే ! త్వమ్ = నీవు, ప్రదీప్తః = ప్రజ్వలింపబడియున్నావు, అద్య = నేడు, మనుషః=మనుష్యునియొక్క, దురోణే = ఇంటియందు, దేవః = దీపన= ద్యోతనుడవగుచు, దేవాన్ యజసి=దేవతలను యజనము చేయుచున్నావు, హే జాతవేదః = ప్రజ్ఞానశీలుడవగు ఓయగ్నీ ! నీవు మాగృహములందును, ఆవహ యజచ=దేవతలనాహ్వానించుము-యజనము చేయుము. ఏలయన, నీవు మిత్రమహః = మిత్రులయుపకారమున ప్రవృత్తుడవు, చికిత్వాన్ = నియధికారక్షేత్రమును నెఱుగుదువు ! త్వం దూతః = నీవు సర్వయజమానులకు దూతవు, నీవు, కవిః = క్రాంతదర్శివి, ప్రచేతాః = ప్రవృద్ధప్రజ్ఞానము.

తనూనపాత్ - 3

తనూనపాదాజ్యమితి కాత్థక్యః. నపాదిత్యనన్తరాయాః ప్రజాయా నామధేయం నిర్ణతతమా భవతి. గౌరత్ర తనూ రుచ్యతే. తతా అస్యాం భోగాః తస్యాః పయో జాయతే పయస ఆజ్యం జాయతే. అగ్నిరితి శాకపూణిః. ఆపోఽత్ర తన్వః ఉచ్యన్తే. తతా అంతరిక్షే తాభ్య ఓషధివనస్పతయో జాయన్త ఓషధివనస్పతిభ్యః ఏష జాయతే

"తనూనపాత్ పథ ఋతస్య యానాన్మధ్వా సమంజన్ స్వదయా సుజిహ్వ. మంత్రాని ధీభిరుత యజ్ఞమృంధన్ దేవత్రా చ కృణుహ్యధ్వరం నః." (ఋ. ౧౦-౧౧౦-౨)

తనూనపాత్ పథ ఋతస్య యానాన్ యజ్ఞస్య యానాన్మధునా సమంజన్ స్వదయ కల్యాణజిహ్వ మననాని చ నో ధీభిర్యజ్ఞం చ సమర్ధయ దేవాన్ నో యజ్ఞం గమయ.

నిర్వ్యాక్తవ్యమేతత్. కాత్థక్యః తనూనపాత్ - ఆజ్యమితి బ్రూతే. కథం పునః? నపాత్ ఇతి అనన్తరాయాః ప్రజాయాః నామధేయమ్. పితుర నన్తరా పుత్రాఖ్యా అనన్తరా చ పౌత్రాఖ్యా యతః సా నిర్ణతతమా భవతి పుత్రస్తావత్ పితుః నీచైర్నతః భవతి పౌత్రశ్చ సతతమః. తనూః - గౌః యతః అస్యామ్ క్షీరదధ్యాదయో భోగాః తతా భవతి. గోః పయో జాయతేఽతః గోః పుత్రః పయః పయసశ్చ ఆజ్యం జాయతే తస్మాదాజ్యం తన్వా నపాత్. తథా చ నిగమః - "తనూనపాత్ పథ - కృణుహ్యధ్వరం నః" హేతనూనపాత్ - హేఘృత! ఏతాన్ ఋతస్య పథః - యజ్ఞస్య మార్గాన్ యానాన్ - ప్రాపింపి, మధ్వా-మధురేణ ఆస్వాదేన సమంజన్-సంప్రక్షయన్, స్వదయ - స్వాదుతామాపాదయ. హే సుజిహ్వ! మన్మాని - మననాని, ధీభిః - స్వైః కర్మభిః, ఋన్ధన్ - సంసాధయన్, సమర్ధయ - సంపాదయ. దేవత్రా - దేవాన్ నః అధ్వరం - యజ్ఞం, గమయప్రాపయ. అస్మాక మధ్వరం స్విష్టం కురుష్వైతత్ వయం త్వాత్ర ఆశాస్మహే.

శాకపూణిరాచార్యః పునః తనూనపాతమగ్నిమేవ మన్యతే. తన్మతే తన్వః ఆపః తస్మాదేతా అంతరిక్షే తతా భవన్తి. అద్భ్యశ్చ ఓషధయో వనస్పతయశ్చ జాయన్తే తత్రైవష శాకపూణి మతేన మంత్రార్థః హేఅగ్నే! తనూనపాత్ త్వం ఏతాన్ యజ్ఞస్య మార్గాన్ హవీంషి చ మధ్వామధురేణ పాకకృతేన రసేన సమంజయన్ మృష్టీకురు. హేస్వర్చిః అస్మదభిమతా న్యర్థవస్తూని నః సంసాధయన్ యజ్ఞం చ సమర్థయన్ స్వసామర్థ్యాత్ దేవత్రా - దేవప్రవిష్టం కుర్వితి.

అర్థము :- తనూనపాత్ = ఆజ్యము ఇతి కాత్థక్యః = అని కాత్థక్యుని మతము కాని అగ్నిరితి శాకపూణిః=శాకపూణిఆచార్యునిమతమున, తనూన పాత్ = అగ్ని యని అర్థము.

నపాత్ = అనన్తరాయాః ప్రజాయాః = పౌత్రునినామము-తండ్రి యనంతరము పుత్రుడు - అతని యనంతరము - పౌత్రుడు ఈపౌత్రుని నామమే తనూనపాత్. మొదటితరముతండ్రి, రెండవతరముపుత్రుడు, మూడవతరము పౌత్రుడు = మనుమడు. ఈమూడవతరముపౌత్రుని నామమే తనూనపాత్ అనబడును. తండ్రికి సతుడు, పుత్రుడు, పుత్రుని కంటె నతతముడు పౌత్రుడు.

గౌః అత్ర తనూః = ఇట గోవు తనువు అనబడును. ఏలయన అస్యాం = ఈగోవునందు, భోగాః తతాః = గోవునందు (పాలు, పెరుగు, వెన్న, నేయి) అను భోగములు భోజ్యపదార్థములు సుఖదుఃఖసాధనములు విస్తృతమగుచున్నవి, తస్యాః పయో జాయతే = ఆ గోవునుండి పాలు లభించును, ఆ క్షీరమునుండి ఘృతాదులు ఏర్పడును. అగ్నిః ఇతి శాకపూణిః = శాకపూణిఆచార్యుడు తనూనపాత్ అనగా అగ్ని యనుచున్నాడు. ఆపః పునః తన్వః = ఆ జలము తనువులు-వీరిమతమున మేఘజలములు, తన్వఉచ్యన్తే = తనువులనబడును, ఏలయన తతాః = అంతరిక్షమున నీమేఘములు వ్యాపించియుండును, తాభ్యః = ఆమేఘములవలన, ఓషధి వనస్పతయో జాయన్తే = ఓషధులు వనస్పతులు పుట్టును. భూమిపై - ఓషధివనస్పతిభ్యః = ఆ యోషధివనస్పతులవలన, ఏషః = ఈ, తనూన పాత్ అగ్నిః = అగ్ని, జాయతే = ఉత్పన్నమగును.

భాష్యార్థము :— కాత్థక్యునిమతమున తనూనపాత్ = హే అజ్య! ఓ ఆజ్యమా! ఘృతమా!, ఋతస్య = యజ్ఞముయొక్క, యానాన్ - పథం = ఫలప్రాపకమార్గములను, మధ్వా = మధురమై, స్వాదు = రుచితో, సమంజన్ = కలుపుచు - యుక్తముచేయుచు, స్వదయ = ఆస్వాదన యోగ్యముచేయుము, హే సుజిహ్వ! మన్మాని = ఏవస్తువులను మేము కోరుదుమో వానిని, ధీభిః = మాకర్మలచే, రంధన్ = సిద్ధముచేయుచు, యజ్ఞమ్ సమర్ధయ = మాయజ్ఞమును వృద్ధిచేయుము, అధ్వరమ్ = మా యధ్వరమును, దేవత్రా కృణుహి = దేవాధీనమొనర్పుము - దేవతల జేర్పుము.

శాకపూణమతమున - హే తనూనపాత్ అగ్నే! ఋతస్య యానాన్ పథః = యజ్ఞమునకు సంబంధించిన ఫలప్రదమార్గములను మధ్వా = పాకకృతమధురరసముతో, సమంజన్ = బాగుగనభివ్యక్తముచేయుచు, స్వదయ = స్వాదుయుక్తమొనర్పుము, హే సుజిహ్వ = ఉత్తమజ్వాలలు, గల అగ్నీ!, మన్మాని = మాయభిమతపదార్థములను, ధీభిః=మాకర్మలతో, ఋన్ధన్ = సిద్ధముచేయుచు, యజ్ఞమ్ సమర్ధయ = మాయజ్ఞమును వర్ధిల్లజేయుము, నః = మా, అధ్వరమ్ = యజ్ఞమును, దేవత్రా = దేవాధీన మొనర్పుము - దేవతలచేర్పుము.

నరాశంసః - (౪)

> నరాశంసో యజ్ఞ ఇతి కాత్థక్యః. నరా అస్మిన్నాసీనాః శంసన్తి. అగ్నిరితి. శాకపూణిః నరైః ప్రశస్యో భవతి. నరైః మనుష్యైః శస్యతే స్తూయతే ఇతి నరాశంసః. తస్యైషా భవతి.

ఆనరాశంసకు సంబంధించిన ఋక్కు.

> "నరాశంసస్య మహిమానమేషాముపస్తోషామ యజ్ఞియస్య యజ్ఞైః. యే సుక్రతవః శుచయో ధియంధా స్వదన్తి దేవా ఉభయాని హవ్యా." (ఋ. ౭-౨-౨)

నరాశంసస్య మహిమానమేషాముపస్తుమో యజ్ఞియస్య యజ్ఞైః యే సుకర్మాణః శుచయో ధియం ధారయితారః స్వదయన్తు దేవా ఉభయాని హవీంషి సోమం చేతరాణి చేతి వా తాంత్రాణి బావాపికాని చేతి వా.

నరాశంసః యజ్ఞో భవతీతి ఏవం కాత్థక్యఆచార్యః వక్తి. యతః నరాః అస్మిన్ ఆసీనాః శంసన్తి. శాకపూణిరాచార్యస్తు నరాశంసమగ్నిమేవాహ. యతః ఏషః నరైః ప్రశస్యో భవతి తస్యైషా ఋక్ ప్రాధాన్య-స్తుతిర్ భవతి - నరాశంసస్య ... ఉభయాని హవ్యా" కాత్థక్యమతేన మంత్రార్థః - నారాశంసస్య - యజ్ఞస్య, మహిమానమ్ - మహాభాగ్యమ్, వయమ్ ఉపస్తోషామః - ఉపస్తుమః ఉపగమ్య అభికీర్తయామః. యజనస్య - యజనసంపాదయితుః, యజ్ఞైః - కర్మభిః యుక్తాః ఉపస్తుమః. యే సుక్రతవః - సుకర్మాణః జగదుపకృతినిరతా ఇత్యర్థః, శుచయః - నిష్పాపాః, ధియంధాః - స్వాధికారకర్మణాం ధారయితారః మతీనాం వా, ఏవం గుణయుక్తాః తే దేవాః స్వదన్తి - ఆస్వాదయన్తు ఉభయా హవ్యా-ద్వివిధాని హవీంషి, సోమం ఇతరాణి చ పశుపురోడాశధానాదీని యది చ సామికః పశుర్న తతః తాంత్రాణి - ప్రయాజాజ్యభాగస్విష్టకృదాదీని ప్రావాపికాని చ - ప్రధానహవీంషి చ. ఇత్యేతదాశాస్మహే. శాకపూణిమతేన మంత్రార్థః - యోఽయమేషాం ప్రభూతోపకృతిపరః నరాణాం ప్రశస్యః నరాశంసోఽగ్నిః తం వయం ఉపస్తుమః శేషం పూర్వవత్.

అర్థము :- నరాశంసః - యజ్ఞః = యజ్ఞము అని కాత్థక్యమతము. ఏలయన, అస్మిన్=ఈయజ్ఞమునందు, ఆసీనాః=కూర్చుండియున్న, నరాః= నరులు, శంసన్తి = స్తుతింతురు, కావున నరాశంసమనగా యజ్ఞము. ఈ నిరుక్తివలన నరాశంసః అనగా యజ్ఞమే అగును. కాని శాకపూణిఆచార్యుడు నరాశంసపదమునకర్థము అగ్ని అనుచున్నాడు ఏలయన- అగ్ని నరైః = నరులచే, శస్యతే = ప్రశంసింపబడును, కావున అగ్నియే నరాశంసుడని యర్థము.

మంత్రార్థము :- యజ్ఞైః = ఉత్తమకర్మలతోకూడిన మేము, యజ్ఞియస్య నరాశంసస్యయజ్ఞార్హ = యజ్ఞమునకభిమతమగుఫలమును సంపాదించుయజ్ఞముయొక్క, మతయొకపక్షమున- అగ్నియొక్కమహిమను - మహాభాగ్యమును లేక విభూతిని, ఉపస్తోషామ = స్తుతింతుము, యే సుక్రతవః = ఉత్తమకర్మలందు ప్రవృత్తులు, ధియంధాః = ఉత్తమబుద్ధిని. లేక ఉత్తమకర్మలను ధారణచేయువారునైన, దేవాః = దేవులు, దేవతలు- విద్వాంసులు, ఉభయాని = మాచేసియ్యబడు ద్వివిధములగుహవ్యములను, సోమరసము పురోడాశము మున్నగునన్నాదులు, తంత్రాణిచావాపకానిచ = తంత్రముభయార్థకప్రయోగము. ఆవాపః = సామాన్యహోమః (శబ్దకల్పద్రుమ) = సామాన్యహోమము, అగ్నిపక్షమున అభిమతఉపకారమొనర్చు, నరాశంసః = మనుష్యులచే ప్రశంసింపబడుఅగ్నిని మేము స్తుతింతుము. ఆయగ్నియందు వేయబడుహవిస్సులను దేవతలాస్వాదింతురుగాక! మిగిలినది పూర్వవత్ = పూర్వమువలె.

ఈళః -(౫)

**ఈళః ఈట్టేః స్తుతికర్మణః. ఇంధతేర్వా. తస్యైషాభవతి.**

స్తుత్యర్థముగల ఈడధాతువువలన ఈళఃసిద్ధమగును. ఇంధతేర్వా లేక ఇంధధాతువువలన సిద్ధించును. ఆ ఈళకు ఉదాహరణమియుక్.

"ఆ జుహ్వాన ఈడ్యో వంద్యశ్చాయాహ్యగ్నే వసుభిః సజోషాః. త్వం దేవానామసి యహ్వ హోతా స ఏనాన్యక్షీషితో యజీయాన్" (ఋ. ౧౦-౧౧౦-౩)

**ఆహూయమాన** ఈళితవ్యో వందితవ్యశ్చాయాహ్యగ్నే వసుభిః సహజోషణ స్త్వం దేవానామసి యహ్వ హోతా. యహ్వ ఇతి మహతో నామధేయమ్ యాతశ్చ హూతశ్చ భవతి. స ఏనాన్ యక్షీషితో యజీయాన్. ఇషితః ప్రేషితః ఇతి వాధీష్ట ఇతి వా. యజీయాన్ యష్టృతరః.

ఈళఃకస్మాత్? ఉచ్యతే స్తుత్యర్థాత్ ఈట్టేః, దీపనార్థాత్ ఇంధతేర్వా సాధ్యః. తస్యైషా ప్రాధాన్యస్తుతిః "ఆజుహ్వాన ఈడ్యో ... యజీయాన్"

హే అగ్నే! త్వమ్ ఈడ్యః - సర్వస్య లోకస్య వంద్యః స్తుత్యః అసి. స త్వమ్ ఆజుహ్వానః - ఆహూయమానః సమ్ప్రీతిర్భూత్వా ఆయాహి - ఆగచ్ఛ. హే యహ్వ! మహన్! త్వం దేవానాం హోతా - ఆహ్వాతా అసి. అస్మాభిః ఇషితః - ప్రేషితః త్వమ్ ఏనాన్ దేవాన్ యక్షి - యజ యతః త్వమ్ యజీయాన్‌అసి - యష్టృతరోఽసి.

అథైకపదనిరుక్తమ్ - యహ్వః కస్మాత్? యస్మాదయం యాతశ్చ హూతశ్చ భవతి తస్మాత్ యహ్వః.

ఈళ - అగ్ని ఇది 'ఈడస్తుతౌ' అను ధాతువువలనను, దీపనార్థక 'ఞిఇంధీ' ధాతువువలనను ఈళశబ్దమేర్పడును. అగ్ని స్తుతియోగ్యము. స్తుతికి విషయము. కావున స్తుతిచేయబడును.

మంత్రార్థము :— అగ్నే! హే భగవన్! అగ్నిదేవ! ఈడ్యః=హవిస్సు ఆజ్యము మున్నగువానిచే దీపింపజేయదగియున్నావు, వంద్యశ్చ = స్తుతింప యోగ్యుడవు. ఆజుహ్వానః = ఆహూయమానః = ఆహ్వానింపదగినవాడవు, ఆయాహి = మాయజ్ఞమునకురమ్ము, యహ్వ = హే మహన్=గొప్పవాడా! వసుభిఃసజోషాః = గృహస్థులచే సేవింపదగినవాడవు, దేవానాం హోతా అసి = దేవతలనాహ్వానించువాడవు, అట్టినీవు ఇషితః = మాచేపంపబడిన వాడవై, ఆదరముతో నియుక్తుడవై, దేవాన్ యక్షి=దేవతలను పూజింపుము. యజ్ఞమొనర్పుము! పిలువన నీవు, యజీయాన్ యష్టృతరః =ఎక్కువ యజనకర్తవు.

భాష్యార్థము :— ఆహూయమానః = ఆహ్వానముచేయబడినవాడవు. (ఆజుహ్వానః = ఆహూయమానః అని యర్థము), ఈడ్యః ఈడితవ్యః = దీపనయోగ్యుడవు - ప్రజ్వాలింపజేయదగినవాడవు, వంద్యశ్చ = స్తుతింప దగినవాడవు, సజోషాః - సహజోషణాః = ఒకేసారి పలువురిచే సేవింపదగిన వాడవు, యహ్వామహతోనామధేయమ్=గొప్పవాడవు; యహ్వ-పదవ్యుత్పత్తి - యాతః చ హూతశ్చ భవతి = వెళ్లినవాడు, పిలుపబడినవాడు అనియర్థము. ఇషితాః ప్రేషితః = ప్రేరితుడు - అధీష్టుడు.

బర్హిః - (౬)

బర్హిః పరిబర్హణాత్. తస్యైషా భవతి-"ప్రాచీనం బర్హిః ప్రదిశా పృథివ్యా వస్తో రస్యా వృజ్యతే అగ్రే అహ్నామ్. వ్యుప్రథతే వితరం వరీయో దేవేభ్యో అదితయే స్యోనమ్" (ఋ ౧౦-౧౧౦-౪)

ప్రాచీనం బర్హిః ప్రదిశా పృథివ్యా వసనాయాస్యాః ప్రవృజ్యతే అగ్రే అహ్నామ్ బర్హిః పూర్వాహ్ణే తద్ విప్రథతే వితరం వికీర్ణతరమితి వా విస్తీర్ణతరమితి వా వరీయో వరతరమురుతరం వా దేవేభ్య శ్చాదితయే చ స్యోనమ్ – స్యోనమితి. సుఖనామ, స్యతేరవస్యన్త్యేతత్, సేవితవ్యం భవతీతి వా.

బర్హిరిత్యేతన్నిర్వచనీయం పదమ్. తత్ పునః ప్రసిద్ధమేవ కుశరూపం యజ్ఞస్యాఙ్గమ్ ఇతి. బర్హిః కస్మాత్? ఉచ్యతే పరిబర్హణాత్ - పరిచ్ఛేదనాత్. తస్య బర్హిషః ఏషా ప్రాధాన్య - స్తుతిః "ప్రాచీనంబర్హిః... అదితయే స్యోనమ్" ప్రాచీనం - ప్రాగగ్రమ్ - బర్హిః - కుశా. ప్రవృజ్యతే ప్రచ్ఛిద్యతే లూయతే ఇతి యావత్. ప్రదిశా - విధివాక్యేన ప్రస్తరణ - మంత్రేణేతి యావత్ అస్యాః పృథివ్యాః వస్తోః - వసనాయ - ఆచ్ఛాదనాయేత్యర్థః. అగ్రేఅహ్నామ్ - పూర్వాహ్ణే విప్రథతే - విస్తీర్యతేవితరమ్ - విస్తీర్ణాదపి విస్తీర్ణతరమ్, వరీయః-వరతరమ్ ఉరుతరమ్ వా. కస్మాదేవం పునః క్రియతే? ఉచ్యతే దేవేభ్యః అదితయే చ స్యోనమ్-సుఖం స్యాదిత్యభిప్రాయః. స్యోనం కస్మాత్? ఉచ్యతే స్యతేః ప్రాణినః అవస్యన్త్యేతత్ సర్వస్య సేవనీయం భవతీతి వా.

అర్థము :— వృద్ధ్యర్థక 'బృహ' ధాతువునకు పరమున 'ఇసి' ప్రత్యయముచేర్చిన 'బర్హిస్'అగును. బర్హిః - కుశ = దర్భ - అగ్ని - పరిబర్హణ చేసినందువలన లేక వృద్ధియగుటవలన బర్హిఅనబడును. కుశ-కోయబడును తెగకొట్టబడును - యజ్ఞాగ్నియందు విస్తరించును - పెద్దదియగును. కుశ - దర్భ యజ్ఞమునకు ముఖ్యాంగము. వేదికకు నలువైపుల పఱచబడును. మఱియు యజ్ఞమునవేయబడిన హవ్యద్రవ్యము అగ్నిచేదహింపబడి

అంతటవ్యాపించును. సర్వభూతములకు సర్వదేవతలకు చేరును. ఇట బర్హిపదముచే కుశ, అగ్ని రెండును గ్రహింపబడినవి.

మంత్రార్థము :- అస్యాః = ఈ పృథివ్యాః = వేదికను, వస్తోః = కప్పుటకు, ప్రదిశా (విధివాక్యముతో) పూర్వదిక్కునసో, లేక ఉత్తరదిక్కునసో దర్భలు కోయబడును) లేక ప్రస్తరణ - పఱచబడును. ప్రదిశా - మంత్రముతో అహ్నామగ్రే = రాబోవు దినములయొక్క పూర్వాహ్ణమున, ప్రాచీనంబర్హి = పూర్వదిశయందున్నకుశ - దర్భలు వృజ్యతే=కోయబడును లేక పఱచబడును, వరీయః = శ్రేష్ఠవితరమ్ = మిక్కిలివిస్తీర్ణముగా, దేవేభ్యః = విద్వాంసులకొఱకు-దేవతలకొఱకు, అదితయే చ = పృథివి కొఱకు, స్యోనమ్=సుఖమునుకలిగించునది-(యజ్ఞకర్మలవలన వర్షములు కురియును, భూమిపై ఓషధులు వర్ధిల్లును. అన్నముత్పన్నమగును) విప్రథతే = ఇట్లు బర్హి విస్తీర్ణమగును.

అగ్నిపక్షమున :- బర్హిః = యజ్ఞాగ్ని, ప్రాచీనబర్హిః = బాగుగ ప్రజ్వరిల్లినఆహవనీయాగ్ని, ప్రవృజ్యతే = ప్రజ్వాలింపజేయబడును. ప్రదిశా=మంత్రముతో, అస్యాః పృథివ్యాః = ఈపృథివిని ఆచ్ఛాదించుటకు, అగ్నితోనే, వస్తోః = ఆచ్ఛాదింపబడును. అగ్రేఅహ్నామ్ = పూర్వాహ్ణమున, ప్రథతే = వ్యాపించును. ఆయగ్ని, వరీయః = ఇతరజ్యోతులకంటె శ్రేష్ఠము. ఆయగ్ని, దేవేభ్యః=దేవతలకు - విద్వాంసులకు, అదితయేచ = పృథివికి, స్యోనమ్ = సుఖదాయకమగును.

భాష్యార్థము -- ప్రాచీనంబర్హిః - ప్రాచ్యామంచితమ్ గతమ్ ప్రాచీనమ్ = పూర్వదిక్కున కోయబడిన - వేదికను పూర్వదిశయందు పఱచబడిన లేక ముందుప్రజ్వాలించినఅగ్ని = అగ్ని యున్నింటికంటె ముందుగా సిద్ధముచేయబడును, ప్రదిశా = ప్రస్తరణమంత్రముతో - విధి వాక్యముతో, పృథివ్యాః = భూమియొక్క - వేదికయొక్క, వసనాయ = ఆచ్ఛాదనాయ = కప్పుటకు - భూమినికప్పుటకు లేక వ్యాపించుటకు, ప్రవృజ్యతే = దర్భకోయబడును. అగ్నిప్రజ్వాలింపజేయబడును, అగ్రే అహ్నామ్ = పూర్వాహ్ణమున - ప్రాతఃకాలమున, విప్రథతే - దర్భ వివిధ పద్ధతులలో పఱచబడును - విశేషరూపమున అగ్ని ప్రజ్వాలింపజేయ బడును. వితరమ్ - వికీర్ణతరమ్ = బాగుగపఱచబడిన - బాగుగవిస్తరింప

జేయుబడిన, వరీయః వరతరమ్ శ్రేష్ఠతరమ్=మిక్కిలి ఎక్కువ, స్యోనమ్= సుఖదాయకమగును. స్యోనమ్ ఇతి సుఖనామ = సుఖమునకుపేరు, స్యతేషు - 'షో'అంతకర్మణి ధాతువువలన స్యోనశబ్దము సిద్ధించును, అవస్యన్తి ఏతత్ వ్యవస్యన్తి = ఈసుఖమును జీవనమునకాధారముగ నిశ్చయింతురు, సేవితవ్యం వా భవతి = సుఖముకొఱకు బర్హి = దర్భ - అగ్ని, సేవనీయ=సేవింపదగినదగును, సర్వస్య సుఖమీప్సితమ్=సుఖము కోరనివారెవరు? ఎల్లరు సుఖమునభిలషింతురు.

ద్వారః - (౭)

ద్వారో జవతేర్వా ద్రవతేర్వా ధారయతేర్వా తాసామేషా భవతి.

ఆ ద్వారముల నిఱుక్కన వర్ణించును.

"వ్యచస్వతీ రుర్వియా విశ్రయన్తాం పతిభ్యో న జనయః శుంభమానాః. దేవీర్ద్వారో బృహతీర్విశ్వమిన్వా దేవేభ్యో భవత సుప్రాయణాః" (ఋ. ౧౦-౧౧౦-౫)

వ్యంజనవత్య ఉరుత్వేన విశ్రయన్తాం పతిభ్య ఇవ జాయా ఊరూ మైథునే ధర్మే శశోభిషమాణాః వరతరమంగ మూరూ దేవ్యో ద్వారో బృహత్యో మహత్యో విశ్వమిన్వా విశ్వమాభిరేతి యజ్ఞే. గృహద్వార ఇతి కాత్థక్యః. అగ్నిరితి శాకపూణిః.

నిర్వక్తవ్యమేతత్. జవతేః, ద్రవతేర్వా, వారయతేర్వా సాధ్యాః. బహు వచనాంతమేతత్. తాసామేషా ప్రాధాన్య - స్తుతిః-"వ్యచస్వతేరుర్వియా... భవత సుప్రాయణాః" వివిధేన అంచనేన గమనేన యుజ్యన్త ఇతి వ్యచస్వత్యః, ఉర్వియాః - ఉరుత్వేన - మహత్వేన విశ్రయన్తామ్ - విశ్రయన్తామ్, పతిభ్యో న జనయః-పతిభ్యః జాయా ఇవ. యథా సుశోభిష మాణాః - ప్రహర్షాత్ శోభయితుమీహమానాః జాయాః మైథునే ఊరూ వివృణ్వన్తి తథైవైతాః అపి ద్వారాః విశ్రయన్తామ్. హే దేవ్యః! దాస -

హేతుభూతాః- బృహతీర్మహత్యః విశ్వమిన్వాః - విశ్వం సర్వం ఆభిః ఏతి యజ్ఞోపకరణమితి విశ్వమిన్వాః ! యూయమ్ దేవేభ్యః హవిర్దాతృభ్యః సుప్రాయణాః - సుప్రగమనాః భవత ఇత్యేవమాశాస్మహే. ఉత్తరోఽర్ధర్చః ప్రత్యక్షకృతః- కార్థక్యః పునరాచార్యః గృహద్వారవివేతి మన్యతే. శాకపూణిరాచార్యః పునరగ్నిమేవాహ. తన్మతే మంత్రార్థః - అగ్నిరర్చిషో ద్వారః. జవనాత్ ద్రవణాత్ రక్షఃప్రభృతీనామ్ వారణాద్ వా ద్వారః, వ్యచస్వతీః-వివిధాంచనశీలాః, ఉరుత్వేన విశ్రయన్తామ్ పతిభ్యో జాయా ఇవ తా విశ్వమిన్వా యూయమస్య హవిషః సుప్రగమనా భవత.

అర్థము :– ద్వారః - గత్యర్థక 'జు' లేక 'ద్రు' ధాతువులతో ద్వార శబ్దము సిద్ధించును. ఇది నిత్యబహువచనాంతము. వారయతేర్వా లేక, నివారణార్థక 'వారి'ధాతువుతో ద్వారశబ్దము సిద్ధించును. యజ్ఞశాల ద్వారమేర్పడును. ఇది కార్థక్యునిమతము. శాకపూణిమతమున ద్వారశబ్దమున కర్థము అగ్ని - ద్వారముతోనే రాకపోకలుజరుగును. నివారణము వారించుటయు జరుగును. అందువలన 'జు, ద్రు'ధాతువులవలనను - నివారించుటలో 'వారి'ధాతువుతోను ద్వారశబ్దము సిద్ధించును అగ్నిపక్షమున అగ్నియే హవిస్సు వెళ్లుటకుసాధనము. కావున అగ్నిపక్షమున 'జు, ద్రు'ధాతువులతో ద్వారపదమేర్పడును. మఱియు యజ్ఞాగ్నివలన రోగనివారణము జరుగును కావున 'వారి'ధాతువువలనను ద్వారశబ్దముసిద్ధించును.

మంత్రార్థము :– జనయః = స్త్రీలవలె - భార్యలవలె - పతులకు భార్యలు తమభర్తలకొఱకు, శుంభమానాః = తమ్ము తాము అలంకరించుకొనినవారై భర్తలను ప్రసన్నులనొనర్చుటకై తమశరీరములను విస్తృతలను జేయునట్లు దేవీః ద్వారః = దివ్యగుణయుక్త దానయుక్త యజ్ఞశాల ద్వారములార ! వ్యచస్వతీః = బహువిధములుగా రాకపోకలతోగూడి, ఉర్వియా = విస్తృతములై మహత్వముతోగూడి, బృహతీః = గొప్ప, విశ్వమిన్వాః = సర్వవిధఉపకరణములతోగూడి మమ్ములను, విశ్రయన్తామ్ సేవింతురుగాక ! దేవేభ్యః=దేవతులకొఱకు, సుప్రాయణాభవత = బాగుగ గతినిత్తురుగాక ! రాకపోకలకు ఆటంకములను గలిగింపకుందురుగాక. అవాంఛితులను నివారింతురుగాక !

ఇట ద్వారములు అగ్నివాచకములని కొకపూణిమతము. ఆపక్షమున మంత్రార్థము - హవిస్సులీ అగ్నిమూలమున బయటికిపోవును. అగ్నివలన రోగములు నివారింపబడును. పైనచెప్పిన నిరుక్తిననుసరించి జు, హు, వారి ధాతువులవలన ద్వారశబ్దము సిద్ధించును. వ్యచస్వతీః, ఉర్వియాః, జవీః, బృహతీః, విశ్వమిన్వాః = ఈవిశేషణముల అర్థములు అగ్నిపక్షమునను సంగతములగును.

ఉషాసానక్తా - (౮)

ఉషాసానక్తోషాశ్చ నక్తా చోషా వ్యాఖ్యాతా, నక్తేతి రాత్రి నామ, అనక్తిభూతాని అవశ్యాయేన, అపి వా నక్తా అవక్తవర్ణా. తయోరేషా భవతి. ఉషా, నక్తా అనునిరెంటి విషయమున ఋఙ్మంత్రము.

"ఆనుష్వయన్తీ యజతే ఉషాకే ఉషాసా నక్తా సదతాం నియోనౌ. దివ్యే యోషణే బృహతీ సురుక్మే అధిశ్రియం శుక్రపిశం దధానే" (ఋ. ౧-౧౧౦-౬)

సేష్మీయమాణే ఇతి వా సుష్వాపయన్త్యావితి వా సీదతామితి వా. న్యాసీదతామితివా యజ్ఞియే ఉపక్రాంతే, దివ్యే యోషణే బృహత్యౌ మహత్యౌ సురుక్మే సురోచనే అధిదధాతే శుక్ర పేశనం శ్రియమ్, శుక్రం శోచతేర్జ్వలతికర్మణః. పేశ ఇతి రూపనామ. పింశతేర్విపిశితం భవతి.

ఇత్యేకం పదమ్. ఏవం విగ్రాహ్యామ్ - ఉషాశ్చ నక్తాచేతి. అత్ర ఉషాః వ్యాఖ్యాతా నక్తేతి రాత్రేర్నామ అనక్తి - క్లేదయతి భూతాని అవశ్యాయేనేతి నక్తా అపి వా అవ్యక్తవర్ణా న+అక్తా వ్యక్తా ఇత్యనక్తా. అకారలోపే నక్తా యథాహః సర్వమిదం వ్యక్త - రూపం కరోతి న తథా రాత్రిః. తయోః ఏషా ప్రాధాన్యస్తుతిః. "ఆసుష్వయన్తీ ... దధానే" ఆసుష్వయన్తీ - మిథః స్మయమానే సుష్వాపయన్త్యౌ వా-సుప్తు లోకాన్ స్వాపయన్త్యౌ వా. యజతే- హేతుకర్తృత్వేన యజతే. యజ్ఞియే - యజ్ఞసంపాదయిత్ర్యౌ. ఉపాకే =

ఉపక్రాన్తే ఉపగమ్యేతరేతరం క్రాన్తేత్యర్థః, దివ్యే - దివిజాతే, యోషణే - సమ్మిశ్రే, బృహతీ - మహత్యౌ. సురుక్మే - సురోచనే సుదీప్తే, ఇత్యర్థః, శుక్రపిశమ్ - శుక్రపేశసమ్ శ్రియమ్ అధి దధానే - ధారయన్త్యౌ ఆసదతామ్ - ఆసీదతామ్.

అథైకపదనిరుక్తిః - శుక్రంకస్మాత్ ? ఉచ్యతే జ్వలతికర్మణః శోచతేః పేశ ఇతి చ రూపనామసు పఠితమ్. పింశతేః పునః సాధ్యమ్ యస్మాత్ తత్ విపిశితమ్ - వికసితం భవతి.

ఉషా సా నక్తా - దీనికి విగ్రహము - ఉషాశ్చ నక్తా చ ఇతి ఉషానక్తా - ఇట ఉషా - స్థానమున 'ఊ' 'ఉషాసోషసః' అనుదానిచే 'ఉషాసా' ఆదేశమైనది. ఉషాపదమునకువ్యాఖ్య పూర్వమేచేయబడినది. నక్తా ఇతి రాత్రినామ - నక్తాపదము రాత్రివాచకము. అనక్తి భూతాని అవశ్యాయేన = ఈరాత్రి సమస్తపదార్థములను మంచుతో నింపును - యుక్తముచేయును. అందువలన నక్త యనబడినది. అపివా - లేక నక్తా అవ్యక్తవర్ణా అని యర్థము రాత్రియందు వస్తువులరంగురూపములు తెలియవుకదా ?

మంత్రార్థము :— ఆసుష్వయన్తీ = పరస్పరము చిఱునవ్వులు నవ్వుచు మనుష్యులు రాత్రియందు శయనించునట్లుచేయునో, యజతే= యజ్ఞమును సంపాదించునో, ఉపాకే = ఒకరిదగ్గఱకొకరువెళ్లి, దివ్యే - ద్యోతనశీలముగల, లేక, స్వర్గీయయోషణే = పరస్పరముకలిసి, బృహతీ= గొప్పవియైన, సురుక్మే = బాగుగప్రదీప్తములై, శుక్రపేశసంశ్రియమ్ అధిదధానే = శుక్లరూపశోభనుధరించినవియై, ఉషా సా నక్తా = ఉషస్సు, రాత్రి అను రెండును, యోనౌ మనగృహములందు న్యాసీదతామ్ = నియమముగా లభించునుగాక !

భావార్థము :— ఆసుష్వయన్తీ = స్మేయమానే ఇతివా = చిఱు నవ్వు నవ్వుచు, సుష్వాపయన్త్యౌ ఇతి వా = లేక శయనింపజేయుచు, సీదతేష్వు ఇతి వా, లేక, 'ని'పదపూరకముగా అంగీకరించి కేవలముసీదతామ్‌తో ఆఙ్ ఉపసర్గచేర్చి ఆసీదతామ్ = అవస్థితమగుదురుగాక. మాగృహముల సమీపమునకు వత్తురుగాక ! లేక - న్యాసీదతామ్ ని, ఆ ఉపసర్గలచేర్చి, నియమితరూపమున మమ్ము ప్రాప్తింతురుగాక ! అనియర్థము చెప్పు

వచ్చును. యజతే - యజ్ఞియే = యజ్ఞసంపాదకయజ్ఞార్హ, ఉపక్రాన్తే - ఉపగమ్య క్రాన్తే = ఒకరికొకరు దగ్గఱచేరి ప్రశంసనీయు, శుక్రపేశసం = శుక్లరూపము. శుక్రం శోచతేర్జ్వలతికర్మణః = జ్వలనార్థక'శుచ'ధాతువు వలన శుక్రశబ్దము సిద్ధించును. పేశ ఇతి రూపనామ. పేశపదము రూప వాచకము. పింశతేః = పిశధాతువుచే నేర్పడును. విపిశితం భవతి = వికసించును - దీప్తమగును.

"సాయం సాయం గృహపతిర్నో అగ్నిః ప్రాతః ప్రాతః సౌమనస్య దాతా. ప్రాతః ప్రాతః గృహపతిర్నో అగ్నిః సాయం సాయం సౌమనస్యదాతా" (అథర్వ. ౧౯-౫౫-3४)

ఈమంత్రమునందు ప్రాతః, సాయం రెండువేళల గృహస్థుడు యజ్ఞముచేయువలయునని విధింపబడుచున్నది. ఈయగ్నియే మనకు సుఖ శాంతులనొసంగును.

దైవ్యాహోతారా - (౯)

దైవ్యా హోతారా దైవ్యాహోతారావయం చ అగ్నిరసౌ చ మధ్యమః. తయోరేషా భవతి.

ఆరెండింటికి సంబంధించిన మంత్రము.

"దైవ్యాహోతారా ప్రథమా సువాచా మిమానా యజ్ఞం మనుషో యజధ్యై ప్రచోదయన్తా విదథే కారూ ప్రాచీనం జ్యోతిః ప్రదిశా దిశన్తా" (ఋ. ౧౦-౧౧౦-౭)

దైవ్యౌ హోతారౌ ప్రథమౌ సువాచౌ నిర్మిమానౌ యజ్ఞం మనుష్యస్య మనుష్యస్య యజనాయ ప్రచోదయమానౌ యజ్ఞేషు కర్తారౌ పూర్వస్యాం దిశి యష్టవ్యమితి ప్రతిశన్తౌ.

ఇత్యేతన్నిర్వక్తవ్యమ్ - దైవ్యౌ హోతారావితి. శబ్దసమాధిః. అయమగ్నిః అసౌ చ మధ్యమః ఇత్యభిధేయవచనమ్. తయోరేషా ప్రాధాన్య - స్తుతిః "దైవ్యా ... ప్రదిశాదిశన్తా".

దైవ్యా-దేవేషు భవౌ దైవ్యౌ, హోతారా- హోతారౌ, ప్రథమా-ప్రథమౌ-ముఖ్యావిత్యర్థః, సువాచా - ప్రశస్తవాచౌ, మిమానా యజ్ఞమ్ - యజ్ఞనిర్మాతారౌ, మనుషః - మనుష్యస్య, యజధ్యై యజనాయ, ప్రచోదయన్తా-ప్రేరయమాణౌ, విదథేషు - యజ్ఞేషు, కారూ-కర్తారౌ, హోతుః అనుగ్రహస్య కర్తారావిత్యర్థః, ప్రాచీనం - ప్రాచ్యాం దిశి జ్యోతిః - ఆహవనీయాఖ్యః, ప్రదిశా = మంత్రేణ, దిశన్తా=ప్రదిశన్తౌ హోతృమైత్రావరుణౌ యథా స్వభావతో యజనేప కాలే వర్తమానౌ తథా తౌ మమాపి వర్తేతామ్.

దైవ్యాహోతారా - దైవ్యౌహోతారౌ = ఈఅగ్ని, అంతరిక్షస్థానీయ వాయువనను నీరెండును దైవ్యాహోతారా అనుశబ్దముచే గ్రహింపబడినవి.

మంత్రార్థము :- ప్రథమా. మనుష్యాపేక్షతో ముఖ్యములైన సువాచా, వాక్కు మున్నగు ఇంద్రియములను ఉత్తమముచేయు, యజ్ఞం=యజ్ఞము యొక్క, మిమానా = నిర్మించు, మనుషః = మనుష్య = మనుష్యుని, యజధ్యై = యజనాయ = యజ్ఞముచేయుటకు, ప్రచోదయన్తా = ప్రేరేపించుచు, విదథేషు = యజ్ఞములందు, కారూ = కర్త - ఋత్విక్కు, ప్రదిశా = మంత్రముతో, ప్రాచీనంజ్యోతిః = పూర్వదిశయందు ఆహవనీయాగ్నిని, దిశన్తా = నిర్దేశించుచు, దివ్యాహోతారా = దివ్యగుణసంపన్నులైన. లేక స్వయముగానే దేవ (స్వార్థమున తద్ధితప్రత్యయము) హోతారా= దేవతలనాహ్వానించుచు, వాయువు, అగ్ని మాయీయజ్ఞమును సంపన్నము చేయునుగాక ఇందు, ప్రాచీనం జ్యోతిః=పూర్వదిశయందు యజనమొనర్ప వలయుననను విషయమును దిశన్తా=నిర్దేశించుచు, పూర్వస్యాందిశి = పూర్వదిశయందు, యష్టవ్యమ్=యజనముచేయవలయును, ఇతి=అని, ప్రదిశన్తౌ= నిర్దేశించుచు, కారూ = కర్తలు, మనుషః - మనుష్యస్య మనుష్యస్య= ప్రతిమనుష్యుని గృహమునందు - ప్రతిమనుష్యుడు వేదోక్తవిధిననుసరించి పూర్వదిశయందు ప్రవేశించి యజ్ఞముచేయువలయునని ఈమంత్రమున బోధింపబడినది ఈయజ్ఞమువలన రోగనివృత్తికలుగును. శుభభావనలు వర్ధిల్లును. మనుష్యుడు ప్రసన్నుడైయుండును. అనియు సూచింపబడినది.

తిస్రోదేవీః - (౧౦)

**తిస్రో దేవీః - తిస్రో దేవ్యః = ముగ్గురుదేవతలు. తాసామేషా భవతి - వారికి సంబంధించిన మంత్రము.**

"ఆ నో యజ్ఞం భారతీ తూయమేత్విళా మనుష్వదిహ చేతయన్తీ. తిస్రో దేవీర్ బర్హిరిదం స్యోనం సరస్వతీ స్వపసః సదన్తు" (ఋ. ౧౦-౧౧౦-౮)

ఏతు నో యజ్ఞం భారతీ క్షిప్రమ్. భరత ఆదిత్యస్తస్య భా ఇడా చ మనుష్యవదిహ చేతయమానా తిస్రః దేవ్యో బర్హిః రిదం సుఖం సరస్వతీ చ సుకర్మాణ ఆసీదన్తు.

తిస్రః దేవ్యః ఇత్యర్థః - తాసాం ప్రాధాన్యస్తుతిపరా ఏషా ఋక్ - "ఆ నో యజ్ఞం ... స్వపసః సదన్తు" భారతీ, ఇలా, సరస్వతీ, చేతి తిస్రో దేవ్యః అభిముఖ్యేన అస్మాకం యజ్ఞం తూయం శీఘ్రం ఆగచ్ఛన్తు. కాః పునరేతా దేవ్యః? తత్ర ప్రథమా భారతీ, ఉదకేన సర్వభూతానాం భరణాత్ భరతః సూర్యః తస్యేయమితి భారతీ సూర్యస్య స్వభూతా భాః దీప్తిరిత్యర్థః. ద్వితీయా ఇలా పార్థివత్వాత్ మనుష్యవదిహ కర్మణి చేతయన్తీ - చేతయమానా జానానేత్యర్థః. తృతీయా మధ్యస్థానా దేవీ సరస్వతీ చాగచ్ఛతు, తాః ఏతాః స్వపసః - సుకర్మాణః దేవ్యః స్యోనం - సుఖమేతత్ బర్హిః ఆసదన్తు = ఆసీదన్తు ఇత్యేతద్ వయమాశాస్మహే. మూడుదేవతలు ఆదిత్యజ్యోతిః (భారతి) - అగ్ని (ఇడా) విద్యుత్తు - (సరస్వతి).

మంత్రార్థము :- నః = మాయొక్క, యజ్ఞం = యజ్ఞమునందు, భారతి-(భరతఆదిత్యస్తస్య ఇయం భారతీ) భరతః-సూర్యుడు, తస్య=అతనికి సంబంధించిన, ఇయంభాః = ఈదీప్తి, (అగ్నిః) ఆదిత్యజ్యోతి, మనుష్వత్ = మనుష్యునివలె, చేతయన్తీ = తెలుపునట్టి, ఇడా=భూమిపైనుండు అగ్ని, సరస్వతి - సరస్వతి, అనగా జలములోనుండు విద్యుత్తు, తూయం ఆ ఏతు = శీఘ్రముగ ప్రాప్తించుసుగాక! ఇట్టిమూడుదేవతలు (తిస్రో దేవీః) స్వపసః = ఉత్తమకర్మల నొనర్చునట్టివారు, స్యోనం = సుఖపూర్వకముగ, ఇదంబర్హిః = ఈకుశాసనముమీద, ఆసదన్తు = ఆసీదన్తు= కూర్చుండుదురుగాక!

భాష్యార్థము :- ఏతు నో యజ్ఞం భారతీ-తూయం = మాయజ్ఞమున ఆదిత్యునిజ్యోతిభారతి త్వరగావచ్చునుగాక! అభరతః - ఆదిత్యః సూర్యుని భరతః భరతుడందురు. ఏలయన, బిభర్తిసర్వభూతాని - ఉదకేన - జల

షముతో సర్వభూతములనుపోషించును - భరించును. కావున సూర్యుడు భరతుడనబడును. తస్య - ఆ సూర్యుని భాః = దీప్తి, ఇడా చ = పృథివీ - భూమిపైనుండు ఇడా - అగ్ని - ఇహ ఇక్కడయీభూమిపై మనుష్వత్ = మనుజునివలె, చేతయన్తీ = చైతన్యమునుకలిగించునది, తిస్రో దేవ్యః = ఈముగ్గురుదేవతలు. ఇదం బర్హిః = ఈకుశాసనముపై సుఖపూర్వకముగ, సరస్వతీ చ = విద్యుత్తును - జలమునుండి ఉత్పన్నమగునది-సుకర్మాణః ఉత్తమకర్మలొనర్చు ఈముగ్గురుదేవతలు, ఆసీదన్తు=కూర్చుండురుగాక !. ఇడా - ఇది పృథ్వీవాచకము - నిఘంటువునందు పఠింపబడినది. కావున పృథివీస్థానీయఅగ్ని ఇడా - యనబడును. స్వపసః = సుకర్మాణః = స్వపస్ - అర్థము ఉత్తమకర్మలొనర్చువారు, సరస్వతీ = మధ్యమస్థానీయ దేవత.

త్వష్టా - (౧౧)

త్వష్టాతూర్ణమశ్నుత ఇతినైరుక్తాః. త్విషేర్వాస్యాత్ దీప్తి కర్మణః త్వక్షతేర్వా స్యాత్ కరోతికర్మాణః. తస్యైషా భవతి. త్వష్టృవిషయక మంత్రము.

“య ఇమే ద్యావా పృథివీ జనిత్రీ రూపైరపింశద్ భువనాని విశ్వా. తమద్య హోతరిషితో యజీయాన్ దేవం త్వష్టార మిహ యక్షి విద్వాన్” (ఋ. ౧౦-౧౧౦-౯)

య ఇమే ద్యావా పృథివ్యౌ జనయిత్ర్యౌ రూపైరకరోద్ భూతాని చ సర్వాణి తమద్య హోతరిషితో యజీయాన్ దేవం త్వష్టారమిహా యజ విద్వాన్.

నిర్వ్యక్తవ్యమేతత్ - అస్మిన్ పూర్వపదం క్షిప్రార్థాత్ తూర్ణాదాదేయమ్ ఉత్తరం చ పదమశ్నోతేః సాధ్యం తూర్ణమశ్నుతే ఇతి త్వష్టా అథవా దీప్త్యర్థాత్ త్విషేః సాధ్యం అథవా కరోత్యర్థాత్ త్వక్షతేః. తస్య పునరేషా ఋక్ - "య ఇమే ... యక్షి విద్వాన్" యః త్వష్టా ఇమే ద్యావాపృథివీ - ద్యావాపృథివ్యౌ సర్వభూతానాం జనిత్రీ - జనయిత్ర్యౌ రూపైః - అనేక ప్రకారైః విశ్వా - సర్వాణి భువనాని - భూతాని అపింశత్ - అకరోత్, హే

హోతః! తం - త్వష్టారం దేవం అద్య ఇషితః త్వం యక్షి - యజ. విద్వాన్ - మయేదం కర్తవ్యమితి జానాసః.

త్వష్టాపదమునకర్థము తూర్ణం = శీఘ్రముగా, అశ్నుతే = వ్యాపించు వాడు - అని నైరుక్తాః = నిరుక్తకారులు చెప్పుచున్నారు, వా = లేక, దీప్తి అర్థక 'త్విష్'ధాతువువలన కాని, కరోతిఅర్థక-క్రియాసామాన్యము తెలుపు త్వక్షతేః - 'త్వక్షూ'ధాతువువలనగాని త్వష్టాశబ్దము సిద్ధించును. త్వక్షూ పదమునకు కృశించుట - తనూకరణమైనను ఇట నాయర్థమును విడిచి, క్రియాసామాన్యవాచకమైనది.

మంత్రార్థము :- యః = ఏ, త్వష్టాజనిత్రీ=సర్వభూతోత్పాదకుడు, ఇమే = ఈ, ద్యావాపృథివీ=ద్యుపృథివీలోకములను, వివిధైః=పలువిధము లైన రూపములతో, విశ్వాభూతాని = సర్వప్రాణులను, అపింశత్=నిర్మించు చున్నాడో, హోతః = ఓహోతా!, ఇషితః = ఈశ్వరునిచే ప్రేరితుడవైన నీవు, యజీయాన్ = ఉత్తమయజనకర్తవు, విద్వాన్ = సమస్తయజవిద్య నెఱుగుచున్నవాడవై అద్య = నేడు, ఇహ = ఇక్కడనే, తం త్వష్టారం దేవం = ఆ త్వష్టృదేవుని - అగ్నిని యక్షి = యజనమొనర్పుము.

భాష్యార్థము :- యః = ఎవడు, ఇమే=ఈద్యుపృథివీలోకములను, జనయిత్ర్యౌ = సమస్తభూతములను సృష్టించువానిని, రూపైః అకరోత్ = విభిన్నరూపములతో నిర్మించెనో, భూతాని చ సర్వాణి = సర్వప్రాణులను కూడ నిర్మించెనో, తం = ఆతనిని, అద్య = నేడు, హేహోతః! ఓహోతా!, ఇషితః = ఆ యీశ్వరునిచేప్రేరితుడవై నీవు, యజీయాన్‌యష్టృతరః = ఉత్తమయాజకుడవు, దేవం త్వష్టారం = ఆ త్వష్టృదేవుని-అగ్నిని, విద్వాన్= నీకర్తవ్యము నెఱుగుచు, యజ = యజనముచేయుము.

**మాధ్యమికస్త్వష్టేత్యాహుః మధ్యమే చ స్థానే సమామ్నాతః. అగ్నిరితి శాకపూణిః.**

అత్ర కేచిదాచార్యా ఆహుః మధ్యమేస్థానే సమామ్నానాత్ త్వష్టా మాధ్యమిక ఇతి కించైతస్మిన్నేవ మంత్రే వ్యపదేశాత్ ఇదం సంపద్యతే కథమితి చేదుచ్యతే - యః అకరోత్ తం యజేతి త్వష్టుర్విప్నో యష్టా తస్యైవ సంబోధనః హేహోతరితి. న చ పార్థివాగ్నేరన్యో హోతా తస్మాత్

యః యష్టా స పార్థివః యశ్చ ఇజ్యతే స మధ్యమః. త్వష్టేతి ఐతిహాసికాః పునః సర్వశిల్పినామాచార్యం దేవవార్ధకిం దాక్షాయణీసుతం ద్వాదశాదిత్యా నామన్యతమం త్వష్టారం మన్యంతే. శాకపూణిస్తు ఇమం పార్థివమేవాగ్నిం త్వష్టారం మన్యతే. యత్ పునరుక్తం మధ్యమే సమామ్నానాత్ తదపి న యతోఽయమప్యగ్నిః మధ్యమే సమామ్నాతః. యచ్చ పునర్వ్యపదేశా దిత్యుక్తం తదపి న యతో వ్యపదేశాదన్యత్వమధ్యవసాతుమశక్యమ్. అనన్యత్వేఽపి వ్యపదేశా భవన్తి- తద్ యథా - "అగ్నిమగ్న ఆవహ" అత్ర సత్యపి వ్యపదేశేఽనన్యత్వమ్. న హి పార్థివాదగ్నేరన్యః హవిష్మాన్ సూక్త భాగస్తి కశ్చిదస్తి యోఽనేన హోతృత్వాభిధానేన ఆహూయేత ఇజ్యేత వా. తస్మాత్ త్వష్టా పార్థివాగ్నిరేవ.

అర్థము :- మాధ్యమికః త్వష్టా=ఇక్కడ మధ్యమస్థానీయ వాయువు వర్ణనయున్నది. అని కొందఱాచార్యులనుచున్నారు. మఱియు నిందులకు కారణమునకాడ వారనుచున్నారు. అది యెద్దియన - మధ్యమే చ స్థానే సమామ్నాతః = ఈ త్వష్టా నిఘంటువునందు మధ్యమస్థానియదేవతలలో పఠింపబడియున్నది. ఇక్కడనైతే అప్రదేవతా ప్రసంగమున ఇది పఠింప బడినది. అగ్నిః ఇతి శాకపూణిః. కాని శాకపూణిఆచార్యుడు త్వష్టా అగ్ని వాచి అనుచున్నారు.

తస్యైషాఽపరా భవతి.

అగ్నివాచకత్వష్టాకు సంబంధించిన మఱియొక మంత్రము.

"ఆవిష్ట్యో వర్ధతే చారురాసు జిహ్మానామూర్ధ్వః స్వయశా ఉపస్థే. ఉభే త్వష్టుర్బిభ్యతుర్జాయమానాత్ ప్రతీచీసింహం ప్రతిజోషయేతే" (ఋ. ౧-౯౫-౫)

ఆవిరావేదనాత్తత్యో వర్ధతే చారురాసు. చారుః చరతేః, జిహ్మం జిహీతేః, ఊర్ధ్వముచ్ఛ్రితో భవతి. స్వయశా ఆత్మ యశాః, ఉపస్థ ఉపస్థానే. ఉభే త్వష్టుర్బిభ్యతుర్జాయ మానాత్ ప్రతీచీసింహం ప్రతిజోషయేతే. ద్యావా పృథివ్యా వితి వా. అహోరాత్రే ఇతి వా – అరణీ ఇతి వా.

యథాచాయం పార్థివోఽగ్నిరేవ త్వష్టా తథా తస్య ఏషా విశిష్టతర లింగా అపరా ఋక్ - "ఆవిష్ట్యో వర్ధతే ... ప్రతిజోషయేతే" ఆవిః - ప్రకాశః తస్య తనితా - ఆవిష్ట్యః, చారుః - చరణశీలః, ఆసు - క్రియాసు ప్రజ్ఞాసు వా వర్ధతే. జిహ్మానామ్ - కుటిలానామ్ ఊర్ధ్వః-ఊర్ధ్వమేవ జ్వలతి, స్వయశాః - ఆత్మయశాః, ఉపస్థే - ఉపస్థానే, ఉభే - ఉభేఅపి అస్య త్వష్టుః అగ్నేః బిభ్యతుః. కే పునః బిభ్యతుః ? ద్యావాపృథివ్యౌ వర్ధమానోఽయమగ్నిరావాం భక్ష్యతే ఇతి. అహోరాత్రే వా బిభ్యతుః. అరణీ వా ఏవమయమేవాగ్నిః త్వష్టేతి సంపన్నమ్.

మంత్రార్థము :- ఆవిష్ట్యః = ప్రకాశవిస్తారకుడు, చారుః = చరణశీలుడగుఅగ్ని, ఆసు = ఈయజ్ఞక్రియలందు, వర్ధతే = వృద్ధిపొందును, జిహ్మానామ్ = కుటిలశీలురగుమనుష్యుల, ఉపస్థే=మధ్యనున్న, ఊర్ధ్వః= ఊర్ధ్వగామియేయగును. ఏలయన స్వయశాః = ఊర్ధ్వగమనము అగ్నికి స్వభావమే, జాయమానాత్ త్వష్టుః = ప్రజ్వలితమగుఅగ్నినుండి, ఉభే ద్యావాపృథివ్యౌ=ద్యుపృథివీలోకములురెండును, బిభ్యతుః=భయపడును. కాని. అయినను ప్రతీచీ = ప్రతిప్రాణియు, ఈయగ్నిని సమీపించుచు, సింహంప్రతిజోషయేతే = సహనస్వభావముగల అగ్నిని సేవించును.

భాష్యార్థము :- ఆవిః = ఆవేదనాత్ ఆవిః - ప్రకాశమును ఆవిః అందురు. ఏలయన - ఆవేదన = అన్నింటిని ప్రకాశింపచేయుటవలన - ఆవిష్ట్యః ఆవిః - కిముందు త్యఃప్రత్యయము, త్యః యొక్క అర్థము తనితా = ప్రకాశమును విస్తరింపజేయునది, తత్త్యః తస్య త్యః - దాని యొక్క విస్తారకుడు, చారుః = సుందరము - మనోహరము 'చర'ధాతువుతో సిద్ధమగును, సుందరవస్తువు చిత్తమును చలింపజేయును, చిత్తే చరతి ఇతి చారుః, జిహ్మమ్ = అర్థము = కుటిలము - జిహీతేః 'ఓహాజ్'గతౌ ధాతువు వలన జిహ్మ శబ్దమేర్పడును. జిహీతే కుటిలతాం గచ్ఛతి ఇతి జిహ్మమ్ అనబడును. ఊర్ధ్వః = ఉచ్ఛ్రితోభవతి=పైకిపోయినది - ఉత్ + శ్రితః = పైకిపొంగిన, స్వయశాః=ఆత్మయశాః=తనవిశేషత-తనస్వభావము, ఉపస్థే - ఉపస్థానే=సమీపమునసుండుటయందు అత్వష్టవలన నెవరు భయపడుదురు ద్యావాపృథివీ ద్యుపృథివీలోకములు లేక-దినరాత్రులు-అహోరాత్రే-లేక - అరణులు అగ్ని తమ్ముదహించునేమో యనుభయమునతో ప్రతీచీ తం ఏనం

అగ్నిం = ప్రతిఅగ్నినిగూర్చి అభిముఖముగా సహం సహసమ్ ప్రతి జోషయేతే = ఈయగ్ని మనలననుగ్రహించుననుచు అగ్నిని చేరును. ఇట్లు ఇక్కడ త్వష్టాఅగ్నివాచకమే.

ద్వితీయ పాదము సమాప్తము

# తృతీయ పాదము

వనస్పతిః - (౧౭)

**వనస్పతిర్వ్యాఖ్యాతః.**

వనస్పతి పదవ్యాఖ్యానముచేయబడినది.

**తస్యైషాభవతి.**

వనస్పతికి సంబంధించిన ఋక్కు.

"ఉపావసృజత్మన్యా సమంజన్ దేవానాం పాథ ఋతుథా హవీంషి, వనస్పతిః శమితా దేవో అగ్నిః స్వదన్తు హవ్యే మధునా ఘృతేన" (ఋ. ౧౦-౧౧౦-౧౦)

ఉపావసృజాత్మనాఽఽత్మానం సమంజన్ దేవానామన్న మృతావృతా హవీంషి కాలే కాలే వనస్పతిః శమితా దేవో అగ్నిరిత్యేతే త్రయః స్వదయంతు హవ్యమ్ మధునా చ ఘృతేన చ.

పూర్వం వ్యాఖ్యాతః వనానాం పాతా పాలయితా వేత్యత్ర. తస్యైషా ఋగ్భవతి. "ఉపావసృజత్ - మధునా ఘృతేన" త్మన్యా సమంజన్ - ఆత్మనాత్మానమభివ్యంజయన్, దేవానాం పాథః - అన్నమ్, ఋతుథా - ఋతౌ ఋతౌ హవీంషి ఉపావసృజ - దేవేభ్యో దేహి. కిం చ వనస్పతిః శమితా, దేవః ఇత్యేతే త్రయః. అత్ర వనస్పతిః శమితా ఇత్యుభేఽప్రత్యక్షే దేవతే దేవస్త్వగ్నిరసందిగ్ధః ఇతి త్రయః. మధునా - ఉదకేన ఘృతేన చ స్వదన్తు - స్వదయన్తు.

మంత్రార్థము :- హే వనస్పతి అగ్నే! త్మన్యా - ఆత్మనా = నీవు స్వయముగా నియంతటనీవే, సమంజన్ = నీస్వరూపమును ప్రకటించుచు ప్రజ్వలితమైయుండి, ఋతుథా = ఋతువులకనుకూలముగ లేక ప్రతి ఋతువునందును, దేవానాం పాథః హవీంషి = దేవతలయన్నమును హవిస్సులను, ఉపావసృజ = దేవతలకు ఇమ్ము, ఉపగమ్యాఅవసృజ = సమీపించి యిమ్ము, వనస్పతిః గార్హపత్యాగ్నిః శమితా దక్షిణాగ్నిః దేవః అగ్నిః = ఆహవనీయాగ్ని యీమూడగ్నులు, మధునా ఘృతేనమిశ్ర = ఘృతముతో, హవ్యం స్వదన్తు = ఆస్వాదింపజేయును లేక - మధునా = ఉదకేన ప్రోక్షణాదిగతేన = ఉదకముతో ప్రోక్షణాదులనుపొందిన - శ్రౌతసూత్రములందు గృహస్థుడు త్రివిధమగు అగ్నికి పరిచర్యచేయ వలయునని వ్రాయబడియున్నది. ౧) గార్హపత్యాగ్ని ౨) దక్షిణాగ్ని 3) ఆహవనీయాగ్ని - గార్హపత్యాగ్ని = గృహస్థాశ్రమమునప్రవేశించునపుడు వివాహసమయమున వెలిగింపబడు అగ్ని. దానిని గృహస్థాశ్రమమునందు స్నంతవటకు ఆరకుండునట్లు ఎల్లపుడు ప్రజ్వలింపజేయుచుండును. (౨) దక్షిణాగ్ని = యజ్ఞమునందు వేయుటకు స్థాలీపాకము ఋత్విజులకు దక్షిణరూపమునిచ్చుటకు ఖాద్యపదార్థములును దేనియందు పక్వము చేయబడునో యది దక్షిణాగ్ని. దానికి అన్వాహార్యపచనము అని రెండవ నామము. (3) ఆహవనీయాగ్ని - నిత్యము దేనియందు అగ్నిహోత్రాది యజ్ఞముచేయబడునో ఆయగ్ని ఆహవనీయాగ్ని అనబడును.

పైమంత్రమున వనస్పతిపదమునకర్థము గార్హపత్యాగ్ని వ్రాయ బడినది. పిలయున వనస్పతి, గృహపతి పదములురెండును సమానార్థక ములు. వనపదమునకర్థము - నివాసము అలయమునని యు ఉన్నది. శమితా అన దక్షిణాగ్ని అనియర్థము. ఏలయన - శమయతి యజ్ఞస్య న్యూనతామితి శమితా=యజ్ఞన్యూనతను శమింపజేయునది కావున శమితా-దక్షిణాగ్ని. స్థాలీపాకము, ఋత్విజుల కియ్యబడుదక్షిణ అనునీరెండును యజ్ఞన్యూనతను తొలగించును - శాంతింపజేయును. కావున శమితాగ్ని అనబడినది. ఋత్విజులకు దక్షిణగానియ్యబడు ఖాద్యపదార్థములీయగ్ని యందే పక్వముచేయబడును. స్థాలీపాకముకూడ అందువలననది దక్షి ణాగ్నియైనది. ఇకమూడవది అగ్నిదేవత. ఎల్లపుడు దీప్యమానమగుటచే

దేవ అనబడును. దీనినే ఆహవనీయమందురు. ఆహవనీయము; అగ్ని రెండు పర్యాయవాచకములు.

**తత్కో వనస్పతిః? యూపఇతి కాత్థక్యః. అగ్నిరితి శాకపూణిః. తస్యైషా అపరాభవతి.**

ఆవనస్పతి సంబంధమున-యూపపక్షమున నిది రెండవమంత్రము'

**అంజన్తి త్వామధ్వరే దేవయన్తో వనస్పతే! మధునా దైవ్యేన. యదూర్ధ్వ స్తిష్ఠా ద్రవిణేహ ధత్తాద్ యద్వా క్షయో మాతురస్యా ఉపస్థే"**

**అంజన్తి త్వామధ్వరే దేవాన్ కామయమానా వనస్పతే మధునా దైవ్యేన చ ఘృతేన చ యదూర్ధ్వః స్థాస్యసి ద్రవిణాని చ నో దాస్యతి యద్వా తే కృతః క్షయో మాతురస్యా ఉపస్థే-ఉపస్థానే.**

అత్ర విచార్యతే కో నామ వనస్పతిః? కాత్థక్యో బ్రూతే యూపః ఇతి శాకపూణిస్తు కథయతి అగ్నిరితి. యథాయం యూపః తథేయమ్ ఋక్ - "అంజన్తి ... ఉపస్థే" అధ్వరే - యజ్ఞే దేవయన్తః - దేవాన్ యష్టుకామాః ఋత్విజః హేవనస్పతే! యూప! త్వాం మధునా దైవేన ఘృతేన అంజన్తి - మ్రక్షయన్తి. యతోఽతః త్వం ఊర్ధ్వః తిష్ఠాః-స్థాస్యసి. అస్యాః మాతుః - పృథివ్యాః ఉపస్థే - ఉపరి క్షయో - నివాస, ద్రవిణాని-ధనాని ధత్తాత్-దాస్యసి తదస్మిన్ మంత్రే వనస్పతిశబ్దేన యూపో వాచ్యః, ఇతి కాత్థక్యః.

అర్థము:— అప్పుడు వనస్పతియనవేమి? వనస్పతి=యూపము అని కాత్థక్యుని మతము. యూపః=యజ్ఞస్తంభము, యూపముకాదు, వనస్పతి యన అగ్నియని శాకపూణిఆచార్యుడు.

మంత్రార్థము:— వనస్పతే! హే యూప! దేవయన్తః దేవాన్ యష్టుం కామయమానాః=దేవతలను యజనముచేయగోరుచు ఋత్విజులు, యజమానులును, అధ్వరే = యజ్ఞమునందు, మధునా దైవ్యేన = ఘృతముతో, త్వాం = నిన్ను, అంజన్తి = తడుపుదురు, నేతిని నీపైరాయుదురు

అందువలన నీవు, ఊర్ధ్వః తిష్ఠ = పైకినిలబడుదువు, ఇహ = ఇక్కడ మాకు, ద్రవిణాధత్తాత్ = ధనములనిత్తువుగాక ! యద్వా = లేక, తే = నీయొక్క, క్షయః = నివాసము, అస్యాః మాతుః = ఈభూమియనెడి తల్లిపైన (ఉపస్థే) అనగా నీవు నిలుచుటకు భూమి గొయ్యి త్రవ్వియున్నది. నీవు చాలతడవు దానిపై నిలబడియుందువు. యజ్ఞమునందుపయోగ పడుదువు. ఆయజ్ఞఫలరూపమున మాకు ధనములభించుచుండును. ఇట్టి మంత్రమున యూపముకొఱకు వనస్పతిపదము ప్రయోగింపబడినది. అగ్నిరితి శాకపూణిః.. వనస్పతిశబ్దము అగ్నివాచకమని శాకపూణి అను చున్నాడు.

తస్యైషా పరా భవతి.

ఆ అగ్నికి మఱొకశబ్దము వనస్పతియని మఱొక ఋక్కునందున్నది.

"దేవేభ్యో వనస్పతే హవీంషి హిరణ్యపర్ణ ప్రదివ స్తే అర్థమ్.
ప్రదక్షిణిద్రశనయానియూయ ఋతస్య వక్షి పథిభిరజిష్ఠైః"

(మై. సం. ౪-౧౩-౭)

దేవేభ్యో వనస్పతే హవీంషి హిరణ్యపర్ణ ఋతపర్ణాపి వోపమార్థే స్యాద్ధిరణ్యవర్ణపర్ణేతి. ప్రదివస్తే అర్థం పురాణస్తే సోఽర్థోయం తే ప్రబ్రూమో యజ్ఞస్య వహాపథిభీరజిష్ఠైర్ ఋజుతమైః రజస్వలతమైః ప్రపిష్టతమైరితి వా.

శాకపూణిమతే అగ్నేః వనస్పతి-శబ్దేనాభిధాయికా ఏషా అపరా ఋక్ భవతి - "దేవేభ్యో వనస్పతే ... రజిష్ఠైః" వసిష్ఠస్యార్షమ్. హే వనస్పతే ! అగ్నే ! హిరణ్యపర్ణ ! జ్వలిత ! దేవేభ్యః హవీంషి వక్షి - వహ. కథమ్ ప్రదక్షిణిత్ పితృదర్మవిపరీతేన రశనయా నియూయ - నిబధ్య ఋతస్య - యజ్ఞస్య రజిష్ఠైః - ఋజుతమైః రజస్వలతమైః వా - అతి మాత్రముదకవద్భిర్వా అపి వా ప్రపిష్టతమైః = సురూపతమైః పథిభిః మార్గైః యతో వయమ్ ప్రదివః చిరంతనం తే అర్థమ్ హవిర్వహనాధికార లక్షణం విద్మః.

అస్మిన్ మంత్రే హవిషో వహనసంయోగాత్ వనస్పతిః అగ్నిః ఇత్యుపపన్నమ్.

మంత్రార్థము :- హిరణ్యపర్ణ వనస్పతే! పితృయజ్ఞము, అతిథి యజ్ఞమునను రెండుపక్షములుగల, లేక సువర్ణసమానపక్షములుగల ఓ వనస్పతే! గార్హపత్యాగ్నీ! (భాష్యకారుననుసరించి హిరణ్యపర్ణశబ్దమున కర్థము ఋతపర్ణయజ్ఞరూపపర్ణములుగల - పితృయజ్ఞము అతిథియజ్ఞము నను రెండుయజ్ఞములు రెండుఱెక్కలు. మఱియొకయర్థము హిరణ్యపర్ణ- సువర్ణపు రంగువంటి రంగుకల జ్వాలారూపపక్షములుగల అగ్నీ!) ప్రదక్షిణిత్ రశనయా నియూయ = తనకుదక్షిణపువైపు త్రాటితో బంధించి దేవతల కొఱకు హవిస్సును తీసికొనివెళ్లుటయనెడి తనధర్మమునననుసరించి, ఋతస్య = యజ్ఞముయొక్క, రజిష్ఠైః = సరలతమములగు, పథిభిః = మార్గములతో, దేవేభ్యః = దేవతలకొఱకు హవీంషి = హవిస్సులను, వక్షి= తీసికొనిపొమ్ము - వహింపుము - మేము, తే = నీయొక్క, ప్రదివః అర్థం= సనాతనప్రయోజనము నెఱుగుదుము. ఓగార్హపత్యాగ్నీ! దేవతలకొఱకు హవిస్సులను మోయుట నీకు సనాతనధర్మమని మేమెఱుగుదుమని భావము.

భాష్యార్థము :- దేవేభ్యః = దేవతలకొఱకు, వనస్పతే! = ఓ గార్హ పత్యాగ్నీ! హవీంషి = హవిస్సులను. హిరణ్యపర్ణ - అర్థము = ఋతుపర్ణ యజ్ఞములే పర్ణములుగాగల, అపి వా = లేక ఉపమార్థేస్యాత్ = హిరణ్య పర్ణశబ్దమిట ఉపమార్థమున నున్నది. హిరణ్యపర్ణ అనగా హిరణ్యవర్ణ ఇతి = బంగారమువంటివర్ణముగల జ్వాలరూపపక్షములుకలదియని - ఉపమార్థము - ప్రదివః పదము పురాణవాచకము. తే అర్థమ్ = నీప్రయో జనము, పురాణః తే సః అర్థః = దేవతలకై హవిస్సులను వహించుట అగ్నికి సనాతన - పురాణధర్మము ప్రబ్రూమః=హవిస్సులను వహించుట నీసనాతనకర్తవ్యమని మేముచెప్పుచున్నాము. పథిభిః = మార్గములతో, రజిష్ఠైః = ఋజుతమైః = సరలములైన, రజస్వలతమైః = ఉదకములతో యుక్తమైన, ప్రదిష్టతమైః ఇతి వా = లేక అత్యంతసుందరరూపములుగల.

ఇట్లు ఈమంత్రమున హవిస్సులను వహించుటకుసంబంధించిన వర్ణనముండుటవలన నిటవనస్పతిశబ్దము అగ్నివాచకమేయగును.

**తస్యా ఏషా అపరా భవతి.**

వనస్పతికి సంబంధించిన మఱొకఋక్కు.

**"వనస్పతే రశనయా నియూయ పిష్టతమయా వయునాని విద్వాన్. వహా దేవత్రా దిధిషో హవీంషి ప్రచ దాతారమమృతేషు వోచః" (మై. ౪-౧౩-౭)**

వనస్పతే రశనయా నియూయ సురూపతమయా వయునాని విద్వాన్ ప్రజ్ఞానాని ప్రజానన్ వహ దేవాన్ యజ్ఞే దాతుర్హవీంషి ప్రబ్రూహి చ దాతారమమృతేషు దేవేషు. అథేయమపరాపి ఋక్ ఇమమేవార్థం సమర్థయతి. "వనస్పతే ... వోచః" వనస్పతే అగ్నే పిష్టతమయా - సురూపయా రశనయా నియూయ బద్ధ్వా వయునాని స్వాధికారప్రజ్ఞానాని విద్వాన్ జానానః హవీంషి వహ. అపిచాస్య దిధిషః దాతుః దేవత్రా - దేవాన్ ప్రతి ప్రదాతారమ్ అమృతేషు వోచః = కథయస్వ. ఏవం వనస్పతిః అగ్నిరేవ.

మంత్రార్థము :— వనస్పతే! = ఓగార్హపత్యాగ్నీ! పిష్టతమయా = అత్యంతసుందరమైన, రశనయా = త్రాటితో, నియూయ = బంధించి, వయునాని = తనకర్తవ్యములను, విద్వాన్ = ఎఱుగుచు నీవు, దిధిషః = దాతయగుయజమానుని, హవీంషి = హవిస్సులను, దేవత్రా = దేవతల నుద్దేశించి, వహ = తీసికొనివెళ్లుము. అమృతేషు దాతారం ప్రవోచః = దేవతలందు యజమానునిగూర్చి ప్రసంగించుము.

ఇట్లు ఈమంత్రమున వనస్పతిశబ్దము గార్హపత్యాగ్నికై ప్రయోగింపబడినది. పిష్టతమయా సురూపతమయా 'పిశ్' అను రూపము. కావున పిష్టతమ - పదమునకర్థము - సురూపతమము - సుందరతమము, దిధిష పదమునకర్థము - దిత్సు - దానమొనర్పగోరు - ఇట ధా ధాతువు, ఇచ్చుట అను అర్థమున గ్రహింపబడినది. అమృత = అమరణాః. అమరా నిర్జరా దేవాః.

స్వాహాకృతయః - (౧౩)

స్వాహాకృతయః. స్వాహా ఇత్యేతత్ సు ఆహేతి వా, స్వావాగాహేతి వా స్వంప్రాహేతి వా స్వాహుతం హవి ర్జుహోతీతి వా. తాసామేషా భవతి.

పైనజూపిన నానావిధస్వాహాకృతులకు సంబంధించిన - ఋక్ = ఋక్కు.

"సద్యోజాతో వ్యమిమీత యజ్ఞమగ్నిర్దేవానామభవత్పురోగాః. అస్య హోతుః ప్రదిశ్యృతస్య వాచి స్వాహాకృతం హవిరదన్తు దేవాః" (ఋ. ౧౦-౧౧౦-౧౧)

సద్యో జాయమానో నిరమిమీత యజ్ఞమగ్నిర్దేవానామభవత్పురోగామ్యస్య హోతుః ప్రదిశ్యృతస్య వాచ్యాస్యే స్వాహాకృతం హవిరదన్తు దేవాః.

నిర్వక్తవ్యాః. కాః పునస్తాః? యా యాగాత్మహాహాయ ఉత్తమే ప్రయాజే స్వాహాకారేణ సంస్క్రియన్తే. స్వాహాకృతయః కస్మాత్? సు - శోభనమ్, ఆహ ఇతివా స్యాత్. అథవా బ్రాహ్మణానుగతేన నిర్వచనేన తం స్వా వాక్ ఆహ, స్వం ప్రాహేతివా. తాసామేషా ఋక్ భవతి. "సద్యోజాతో... హవిరదన్తు దేవాః" యః సద్యోజాతోఽగ్నిః యజ్ఞం విమిమీత - నిర్వర్తయతి యస్చ జాతమాత్ర ఏవ దేవానాం పురోగాః - పురోగామీ అభవత్. తస్యాస్య దేవానాం హోతుః - ఆహ్వాతుః ప్రదిశి ప్రాచ్యాం దిశి ఋతస్య - గతస్య వాచి - అస్యే స్వాహాకృతం హవిః దేవా అదన్తు ఇతి యోజనా.

అర్థము :— స్వాహాకృతయః = స్వాహాకృతికి అర్థము. స్వాహా - అని యనుట మంత్రములచివర 'స్వాహా' అనుట. స్వాహా అనుదానికర్థము. సు- ఆహ - ఇతి వా - యా లేక, మిక్కిలి ఉత్తమముగా చెప్పినాడు. అనగా మధురవచనము ప్రియవచనము, కల్యాణకారివచనము, శుభకర వచనము - సు - శోభనమ్=బాగుగ ఆహ = వక్తి = చెప్పుచున్నాడు. అని స్వాహా. స్వావాగ్ ఆహ ఇతి వా లేక - స్వా-తన - తనహృదయముయొక్క వాక్కు = వాణి, ఆహ = చెప్పుచున్నది. అనగా తనహృదయమునగల

దానినే వాక్కుతో చెప్పుచున్నాడని యర్థము. ప్రకటముచేయుచున్నాడు - సత్యభాషణము చేయుచున్నాడు - స్వం ప్రాహ ఇతి వా, యా = లేక, స్వమ్ = తనపదార్థమునుగూర్చియే, ప్రాహ = చెప్పుచున్నాడు. తన వస్తువునే గ్రహించుచున్నాడు. ఇతరులవస్తువును హరింపడు, అపరిగ్రహమును పాలించుచున్నాడు. అని యర్థము - స్వాహుతం హవిర్ జుహోతి ఇతి వా. వా = లేక, స్వాహుతం = సుగృహీతం = బాగుగచూచి, సామగ్రి నంతటిని, స్వచ్ఛముచేసి, విధిపూర్వకముగ యజ్ఞముచేయును. ఆహుత కర్థము. గృహీతము - గ్రహింపబడినది. సు = సుష్ఠు = బాగుగ, ఆహుతం - గృహీతం - గ్రహింపబడిన, హవిః = హవిస్సును, జుహోతి = వ్రేల్చుచున్నాడు.

మంత్రార్థము :– సద్యఃజాతః = అప్పుడే ప్రజ్వలితముచేయబడిన, అగ్నిః = అగ్ని, యజ్ఞమ్ = యజ్ఞమును, వ్యమిమీత = నిరమిమీత = చేయుచున్నది, మఱియు నేయగ్ని, దేవానాం పురోగా అభవత్ = సమస్త యజ్ఞములందును పురోగామి = ముందుండునే, ప్రదిశి = పూర్వదిశయందు, ఋతస్య = గతించియున్న - చేయబడిన, అస్య హోతుః = దేవతలయాహ్వానకర్త, ఈయజ్ఞముయొక్క వాచి=వాక్కునందు, (వాక్కు అనగా నిటముఖము గ్రహింపబడినది) ముఖము, స్వాహాకృతం హవిః = స్వాహాశబ్దమునుంచి అగ్నియందు ఉంచబడిన హవిస్సును, దేవా అదన్తు = దేవతలు భక్షింతురుగాక! గ్రహింతురు.

భాష్యార్థము :– సద్యః = తత్కాలమున అప్పుడే ప్రజ్వలింపజేయబడిన అగ్ని, యజ్ఞం నిరమిమీత = యజ్ఞమును నిర్మించును. ఈ అగ్ని సమస్తయజ్ఞములందును పురోగామి = ముందుండునది. అభవత్ = అగ్రణీయగును. అస్య హోతుః = ఈయజ్ఞముయొక్క, ప్రదిశ = పూర్వదిశయందు, ఋతస్య = ప్రణీతయొక్క వాక్కునందు ముఖమునందు, స్వాహాకృతం హవిః = స్వాహా అని యుచ్చరించి అగ్నియందుంచిన హవిస్సును, అదన్తు దేవాః = దేవతలు భక్షింతురుగాక! గ్రహింతురుగాక! ఇట్లు స్వాహాపదమునుచ్చరించి యజ్ఞముచేయుదురు. ప్రతిదినము ఆహవనీయాగ్ని ఆసమయముననే ప్రజ్వలింపజేయబడును యజ్ఞము పూర్వదిశయందుచేయవలయును. శుద్ధస్థానమున చేయనగును. అగ్నిబాగుగ

ప్రజ్వాలించినమీదటనే యందు ఆహుతినుంచవలయును. మంత్రాంతమున స్వాహాశబ్దము నుచ్చరింపవలెను. అగ్నిజ్వాలయే దానిముఖము.

ఇతీమా ఆప్రీదేవతా అనుక్రాంతాః. ఇతీమాః - ఇధ్మాద్యాః ఆప్రీ దేవతాః అనుక్రాంతాః.

ఇతి = ఈవిధముగ ఇమాః ఆప్రీదేవతాః = ఇధ్మాద్యాప్రీదేవతలు, అనుక్రాంతాః = క్రమముగా వర్ణింపబడినవి.

> అథ కిం దేవతాః ప్రయాజానుయాజాః? ఆగ్నేయా ఇత్యేకే.
>
> "ప్రయాజాన్మే అనుయాజాఁశ్చ కేవలానూర్జస్వన్తం హవిషో దత్తభాగమ్. ఘృతం చాపాం పురుషం చౌషధీనా మగ్నేశ్చ దీర్ఘమాయురస్తు దేవాః" (ఋ. ౧౦-౫౧-౮)
>
> "తవ ప్రయాజా అనుయాజాశ్చ కేవలానూర్జస్వన్తో హవిషః సన్తు భాగాః. తవాగ్నే యజ్ఞోఽయమస్తు సర్వస్తుభ్యం నమన్తాం ప్రదిశశ్చతస్రః" (ఋ. ౧౦-౫౧-౯)
>
> ఆగ్నేయా వై ప్రయాజాః ఆగ్నేయా అనుయాజా ఇతి చ బ్రాహ్మణమ్.

అథ కిం దేవతాః ప్రయాజానుయాజాః? ఆప్రసితాదిః యజమానోప స్థానాంతః క్రియాకలాపః ప్రయాజః. ప్రయాజప్రవాదాశ్చ నానాదేవతాః, ఆప్రీణాం వషట్కారేణ సంబంధాత్ సర్వస్య చాస్యాస్య సమంజసో విశేష భావః సతి చైవం కార్త్స్న్యేనాకపూని విప్రతిపద్యతే తస్మాత్ వ్యవస్థాయై ఉపక్రమతే అథ కిమిత్యాదినా - ఏకే పునరాచార్యాః ఆగ్నేయా ఇతి బ్రాహ్మణవచనాత్ మన్యంతే.

సౌచీకేనాగ్నినా, విశ్వైశ్చ దేవైః మిథః సంవాదే, దృష్టే ఇమ్మస్తే ఋచౌ. అగ్నిః విశ్వేదేవైః సంవదతే. తే తమూచుః 'ఏహి నో హవీంషి వహ' ఇతి. స తానువాచ - యష్మై భాగేఽస్మీతి. తే తమూచుః 'వృణీష్వేతి' స చానయా ఋచా వవ్రే - "ప్రయాజాన్మే ... దీర్ఘమాయురస్తు. దేవాః" హే విశ్వేదేవాః! ప్రయాజాన్ మే - మమ కేవలాన్ - నాన్యయా

దేవతయా సంపృక్తాన్ నిరవశేషాన్ ఇతి యావత్, ఊర్జస్వన్తం - రసవంతమ్ సర్వస్యహవిషో యజ్ఞే దత్తమ్ భాగమ్, అపాం-జలానాం సారభూతం చ ఘృతమ్. అథ చౌషధీనాం పురుషం - పురోడాశం మే నిత్యం భాగః స్యాత్ హే దేవాః! మమ అగ్నేః దీర్ఘమాయురస్తు.

అగ్నినైవముక్తాః విశ్వేదేవాః తమనుజజ్ఞిరే - అగ్నిమయయా ఋచా - "తవప్రయాజాః...ప్రదిశశ్చతస్రః" హే అగ్నే! స కేవలం తే ప్రయాజాః అనుయాజాశ్చ హవిషః ఊర్జస్వన్తో హవిషో భాగాః భవిష్యన్తి అపి తు సర్వ ఏవ యజ్ఞః త్వదధీనో భవిష్యతి అపి చ చతస్రః ప్రదిశః తుభ్యం నమన్తామ్. ఏవం తావత్ ప్రయాజాః అనుయాజాశ్చ ఆగ్నేయా ఏవ.

అర్థము :- ఇప్పుడీ విషయము నాలోచింతము. ఈ ప్రయాజ, అనుయాజలు ఏదేవతకు వాచకములు?

ఏకే = కొందఱు ఆచార్యులిట్లు చెప్పుచున్నారు. ఈ ప్రయాజ, అనుయాజలు ఆగ్నేయాః = అగ్నిదేవతావాచకములు. ఎట్లన :- "ప్రయాజాన్మే అనుయాజాంశ్చ" అను నీరెండుమంత్రములు ప్రతిపాదించుచున్నవి.

సౌచీకాగ్ని, విశ్వేదేవతలు అనువీయిరువురిమధ్యసంవాదముజరిగినది. అప్పుడు విశ్వేదేవులు సౌచికి అగ్నితో నిట్లనిరి - "ఏహి నో హవ్యంవహ" 'రమ్ము మాహవిస్సులను తీసికొనిపొమ్ము.

సౌచీకఅగ్ని :- యజ్ఞమునందు నాకు భాగమియ్యవలసియుండును'

అప్పుడు దేవతలు :- 'కోరుకొనుము నీకేభాగము కావలయునో కోరుకొనుము.

సౌ. అగ్ని :- నిమ్మియిక్కతో ప్రయాజాన్మే అనుయాజాంశ్చ అను నివియన్నియు నాకు కావలెను.

మంత్రార్థము :- హే విశ్వేదేవాః! మే = నాకు, కేవలాన్ - సంపృక్తాన్ - అన్యదేవతలతో సంబంధములేని - విశేషప్రయాజ అనుయాజ మంత్రములమూలమున ఊర్జస్వన్తమ్ = అన్నింటికంటె మిక్కిలి సారవన్తములైన, హవిషః భాగమ్ = హవిర్భాగమును, దత్త - ఇత్తురుగాక! అపాంఘృతమ్ = జలముల - సారభూతమగు ఘృతమును, ఓషధీనాం =

అన్నములచే నిర్మింపబడిన పురోడాశమును, దత్త = ఇత్తురుగాక ! ఓ దేవత లార ! అగ్నినగునాకు దీర్ఘాయువును ప్రసాదింతురుగాక ! అని ఇట్లు సౌచీక అగ్ని కోరగా దేవతలెల్లరు "ప్రయాజ - అనుయాజలు అన్నియు నీవే యగుగాక !" అని సమాధానముచెప్పిరి. హే సౌచీకఅగ్నీ ! తవ ప్రయాజా అనుయాజాశ్చ కేవలాః = అన్యదేవతలతో సంపృక్తములుకాని ప్రయాజ, అనుప్రయాజమంత్రములతోనియబడు హవిస్సులన్నియు నీయవియే యగును. నీవు కోరినట్లు హవిస్సులన్నియు నివేదనమనుభవింపుము. ఓ యగ్నీ ! సర్వేఃయజ్ఞః = సమస్తయజ్ఞము నీదియేయగును, చతస్రఃదిశః. ప్రదిశః = ఈదిక్కులు, వీనియంతర్గత సమస్తభూతములు, ప్రాణులు సన్నియు, తుభ్యం నమన్తామ్ = నీకేనమస్కరించునుగాక - నీకే ప్రణమిల్లునుగాక ! కావున నిట్లు ప్రయాజ, అనుయాజలు అన్నియు అగ్నికి సంబంధించినవే యగును.ఇందులకు బ్రాహ్మణవచనముకూడ ప్రమాణము ఆగ్నేయా వై ప్రయాజా = ఈప్రయాజలుఅగ్నిదేవతాకములు మఱియు, ఆగ్నేయా అనుయాజా ఇతి చ = అనుయాజలుకూడ అగ్నిదేవతాకములే.

నానాదేవతా ఏవ ప్రయాజప్రవాదాః.

ఈప్రయాజలు అనేకదేవతాపరకములు అని ఇంతకుముందు చెప్పబడెను. దానినే యిట ప్రదర్శించుచున్నాము.

ఛన్దోదేవతా ఇత్యపరమ్. ఛందాంసి వై ప్రయాజాః ఛందాంస్యనుయాజా ఇతి చ బ్రాహ్మణమ్.

ఋతుదేవతా ఇత్యపరమ్. ఋతవో వై ప్రయాజా ఋతవోఽనుయాజా ఇతి చ బ్రాహ్మణమ్.

పశుదేవతా ఇత్యపరమ్. పశవో వై ప్రయాజాః పశవో అనుయాజా ఇతి చ బ్రాహ్మణమ్.

ప్రాణదేవతా ఇత్యపరమ్. ప్రాణా వై ప్రయాజాః ప్రాణా వా అనుయాజా ఇతి చ బ్రాహ్మణమ్.

**ఆత్మదేవతా ఇత్యపరమ్. ఆత్మా వై ప్రయాజా ఆత్మా వా అనుయాజా ఇతి చ బ్రాహ్మణమ్.**

నానాదేవతాః ప్రవాదాః ఇతి యదుక్తం తదనుప్రదర్శ్యతే.

క) ప్రయాజా అనుయాజాశ్చ ఛందోదేవతాః యతః "ఛందాంసి వై ప్రయాజాః ఛందాస్యనుయాజాః" ఇతి బ్రాహ్మణేన సమర్థ్యతే.

ఖ) ఋతుదేవతాః ఇత్యపరమ్. ఏతదపి బ్రాహ్మణేన సమర్థితమ్. "ఋతవో వై ప్రయాజా ఋతవో అనుయాజాః ఇతి.

గ) పశుదేవతా ఇత్యపరమ్. అత్రాపి బ్రాహ్మణమ్ "పశవో వై ప్రయాజాః ప్రశవో అనుయాజాః"

ఘ) ప్రాణదేవతా ఇత్యన్యత్ - ఏతదపి బ్రాహ్మణానుమోదితమ్ - "ప్రాణా వై ప్రయాజాః ప్రాణా వా అనుయాజా ఇతి.

ఙ) ఆత్మదేవతా ఇతీతరత్. అత్రాపి బ్రాహ్మణమ్. "ఆత్మా వై ప్రయాజాః ఆత్మా వా అనుయాజాః ఇతి"

ఇత్యపరమ్ మతమ్. ఇదిమఱియొకమతము. ఛందోదేవతాః = ఋతుదేవతా ఇత్యపరమ్ - మఱియొకమతము. ఈప్రయాజ అనుయాజలు ఋతుదేవతాకములని. పశుదేవతా ఇత్యపరమ్ - మఱొకరు పశుదేవతాకము లని. ప్రాణదేవతా ఇత్యపరమ్ - మఱొకరు - ప్రాణదేవతయని ఆత్మదేవతా ఇత్యపరమ్ - ఆత్మదేవతయని మఱొకరు. ఇట్లు బ్రాహ్మణగ్రంథములందు ప్రయాజఅనుయాజల కనేకదేవతలంగీకరింపబడినవి. కాని వేదము స్వతః ప్రమాణము. అందువలన వేదమునను సరించి ఏనికిదేవత—

**ఆగ్నేయా ఇతి తు స్థితిః. భక్తిమాత్రమితరత్. కిమర్థం పునరిదముచ్యతే.**

**యస్యై దేవతాయై హవిర్గృహీతం స్యాత్ తాం మనసా ధ్యాయేత్ వషట్ కరిష్యన్నితి హ విజ్ఞాయతే.**

తదేవం సతి కేన నిశ్చీయేత? ఉచ్యతే సర్వే ప్రయాజానుయాజా శ్చాగ్నేయా ఏవ ఇతరత్తు భక్తిమాత్రమ్. యత: యస్యై దేవతాయై హవిర్ గృహీతం స్యాత్ తామేవ మనసా ధ్యాయేత్ వషట్ కరిష్యన్నితి వచనాత్.

అనగా స్థితి: - సిద్ధాన్తపక్ష: - సిద్ధాన్తపక్షము వీనిలో ప్రయాజాను యాజలు అగ్నిదేవతకు సంబంధించినవియే అని అంగీకరింపవలెను.

ఇతరత్=ఇతరసర్వసిద్ధాంతములు, భక్తిమాత్రమ్ = భాక్తములు, గౌణములు, పూర్వపక్షమాత్రములే.

అటులయిన నాపక్షముల నిట నేల విచారింపవలసివచ్చినదన - సమాధానము :— వాస్తవమేమన యస్యై దేవతాయై = ఏదేవత కిచ్చుటకు, హవి: గృహీతం స్యాత్ = హవిస్సు గ్రహింపబడుచున్నదో తామ్ = ఆ దేవతను, మనసా ధ్యాయేత్ = మనస్సుతో ధ్యానింపవలయును. వషట్ కరిష్యన్ - వషట్ - స్వాహా ఉచ్చరించి అగ్నిలో నాహుతివేయునపుడా దేవతను మనసులో ధ్యానింపవలెను. ఇది నియమము. కావున నిట ప్రయాజలు, అనుయాజలు ననువానికి సంబంధించిన దేవతనుగూర్చి విచారించవలసివచ్చినది. దేవతనుగూర్చి విచారింపక చేయు యజ్ఞము వికలమగును. అది సఫలము కానేరదు. మంత్రదేవతను తప్పక ధ్యానింపవలెను.

ఇతీమాని ఏకాదశాప్రీసూక్తాని.

ఇతి ఇమాని ఏకాదశాప్రీ - సూక్తాని వృత్తాని.

ఇట్లీపదునొకండు ఆప్రీసూక్తములు చెప్పబడినవి.

**తేషాం వాసిష్ఠమాత్రేయం వాధ్ర్యశ్వం గార్త్సమదమితి నారాశంసవన్తి. మేధాతిథం దైర్ఘతమసం ప్రైషికమిత్యథ యవన్త్యతోఽన్యాని తనూనపాత్వన్తి తనూనపాత్వన్తి.**

తేషామ్ = వానిలోనుండి, వాసిష్ఠమ్ = వసిష్ఠఋషి, ఆత్రేయమ్= అత్రిఋషి, వాధ్ర్యశ్వమ్ = వధ్ర్యశ్వఋషి, గార్త్సమదం = గృత్సమద ఋషి - అనువీరికి సంబంధించినసూక్తములు నరాశంసలు, తనూనపాత్ యొక్క వికల్పమునకు సంబంధించినవానినుండి, ఇతి నారాశంసవన్తి = ఇవి నరాశంసలుగలవి. మైధాతిథమ్ = మేధాతిథిఋషియొక్కయు దైర్ఘతమసమ్ = దీర్ఘతమాఋషియొక్క, ప్రైషికం=ఆప్రీ ప్రైషాధ్యాయ సూక్తములు ఇతి యే ఉభయవన్తి తనూనపాత్ - నరాశంస - ఉభయ, దేవతలకుసంబంధించినవి, అతః అన్యాని = వీనికంటెభిన్నమైన, తనూన పాత్వన్తి= తనూనపాత్‌కు సంబంధించినవి. వానిఋషులు అగస్త్యుడు విశ్వామిత్రుడు కాశ్యపుడు, జమదగ్ని, ప్రైషాధ్యాయమునకు సంబంధించిన మంత్రము ప్రైషమంత్రములనబడును. ఏలయన వానియందు 'హోత ర్యజ'అనునట్టి ప్రేరణ యజ్ఞమునకొఱకు చేయబడినది. ప్రైష - ప్రేరణ - తనూనపాత్వన్తి అనుపదద్విరుక్తి అధ్యాయసమాప్తి సూచకము.

అష్టమాధ్యాయము సమాప్తము.



# నవమాధ్యాయము

## ప్రథమ పాదము

అథ యాని పృథివ్యాయతనాని సత్త్వాని స్తుతిం లభన్తే తాన్యతోఽనుక్రమిష్యామః.

అథ ఇత్యనేన పదేన ప్రకృతాదర్థాదనంతరమధికరోతి. యానీతి యాని పునఃపృథివ్యాయతనాని పృథివీఆయతనమ్ ఆశ్రయో యేషాం తాని, సత్త్వాని - ద్రవ్యాణి స్తుతిం లభన్తే ఇతి సమామ్నాతాని తాని ఇతః పరమ నుక్రమిష్యామః - వ్యాఖ్యాస్యామః.

అథ = దీనికి తదుపరి, అగ్నికంటెభిన్నమైన, యాని పృథివ్యాయత నాని = పృథివిఆశ్రయముగాగలవి) పృథివీస్థానీయములగు సత్త్వాని=పదార్థ ములు, స్తుతిం లభన్తే = వేదములందు వర్ణింపబడిన వానిని - ఇటనుండి, అనుక్రమిష్యామః = వర్ణింతుము = వ్యాఖ్యానింతుము.

అశ్వః - (౧)

తేషామశ్వః ప్రథమాగామీ భవతి. అశ్వో వ్యాఖ్యాతః, తస్యైషా భవతి,

"అశ్వో వోళ్హా సుఖం రథం హసనాముపమంత్రిణః. శేపో రో మణ్వన్తౌ భేదౌ వారిన్మండూక ఇచ్ఛతీంద్రాయేన్దో పరిస్రవ"
(ఋ. ౯-౧౧౨-౪)

అశ్వో వోళ్హా సుఖం వోళ్హా రథం వోఢా. సుఖమితి కల్యాణ నామ. కల్యాణం పుణ్యం సుహితం భవతి, సుహితం గమ యతీతి వా. హసైతా వా పాతా వా పాలయితా వా శేప

**మృచ్ఛతీతి వా వారి వారయతి మా నో వ్యాఖ్యాతః తస్యైషా భవతి.**

తేషాం = ద్రవ్యాణాం మధ్యే అశ్వః ప్రథమగామీ. పురుషానుజా తత్వాదిత్యభిప్రాయః. తథా చ శ్రుతిః. "తస్య అహుత్యాః పురుషోఽజాయత, ద్వితీయామజుహోత్ తతోఽశ్వోఽజాయత" అశ్వశ్చ పూర్వం వ్యాఖ్యాతః. తస్య చ ఏషా ప్రాధాన్య - స్తుతిః - "అశ్వోవోఢా...పరిస్రవ"

యథా వోఢా = వాహకః అశ్వః సుఖం రథమిచ్ఛతి, యథా చ ఉపమంత్రిణః - నిమంత్రితాః హసనామ్ = హాస్యమ్ వినోదమితియావత్ ఇచ్ఛన్తి, యథా చ శేపః = రశ్మయః రోమణ్వన్తౌ భేదౌ రోమకూపాన్ భేదయన్తి, యథా చ మండూకః వాః = జలమిచ్ఛతి తథైవ హే భగవన్! వయం త్వామిచ్ఛామః. హే దయాళో! నః ఇంద్రాయ = ఐశ్వర్యాయ, త్వం పరిస్రవ = దయాంకురు. సుఖమితి - కళ్యాణనామ, కల్యాణం చ పుణ్యమ్ పుణ్యం పునః సుహితం భవతి. సుహితం ప్రాపయతీతి వా. వారి కస్మాత్? వారయతి పిపాసామితి సతః. మా నో వ్యాఖ్యాతః. తస్యైషా.

అర్థము:-తేషామ్=ఆపృథివిపైనుండు పదార్థములలో,అశ్వః=గుఱ్ఱము ప్రథమగామీ భవతి. (ప్రథమం ఆగన్తుం శీలం యస్య సః) ప్రథమమున వచ్చు స్వభావముగలది. మనుష్యుని సృష్టితరువాత సృష్టియందు అశ్వముయొక్క ఉత్పత్తియే జరిగినది. సర్వజీవజంతువులందు మొదట అశ్వమే జన్మించినది. అశ్వమేధమువంటి ప్రముఖయజ్ఞమునందు యజ్ఞమునకు ముఖ్యాంగము అశ్వమే కావున నిట దానివిషయమే విచారింతుము అశ్వో వ్యాఖ్యాతః = అశ్వవ్యాఖ్యానము పూర్వముచేయబడినది. 'అశ్నుతే అధ్వానమితి అశ్వః మహాశనో భవతి. ఇత్యాది తస్యైషా భవతి. ఆ యశ్వ విషయమున నిమంత్రము.

మంత్రార్థము :— వోఢా = వహించునది - చేర్చునది, అశ్వః = గుఱ్ఱము, సుఖం రథం = విశ్రాంతినిచ్చు రథమును కోరును, ఉపమంత్రిణః = నిమంత్రించువారు, హసనామ్ హస్యమ్ = వినోదమును,

కోరుదురు, అనగా తనగృహమునకాహ్వానించిన - మనుష్యునకు సర్వవిధ సుఖమునొసంగగోరుదురు, శేషః. రోమణ్వన్తౌభేదౌ = సూర్యరశ్మికాపము లను తెలుపును. మండూకః=కప్ప, వాః = జలమును, ఇచ్ఛతి = కోరును, గృహస్థుడు ధనమును గోరుచుండును. ఏలయన ధనములేకున్న జీవన నిర్వహణముకాదు. ఇందో !=హే ఐశ్వర్యశాలిన్ పరమాత్మన్! ఇంద్రాయ= ఐశ్వర్యముకొఱకు, పరిస్రవ = ఐశ్వర్యవర్షముకురియింపుము.

భాష్యార్థము :- సుఖమ్ = అనునిది, కల్యాణనామ = కల్యాణము నకు వాచకము, కల్యాణమ్ = పుణ్యము - అందురు. పుణ్యం సుహితం భవతి = పుణ్యము మిక్కిలిసుఖకారకమగును, సుహితం గమయతీతి వా = ఉత్తమసుఖము - హితమును - ప్రాప్తింపజేయును, వారి = వార యతి - జలము దప్పికను తొలగించును. అందువలన జలము, వాః = వారిఅనబడును.

> "మా నో మిత్రో వరుణో అర్యమాయురింద్ర ఋభుక్షా మరుతః పరిఖ్యన్ యద్వాజినో దేవజాతస్య సప్తేః ప్రవ క్ష్యామో విదథే వీర్యాణి" (ఋ. ౧-౧౬౨-౧)
>
> యద్ వాజినో దేవైర్జాతస్య సప్తేః సరణస్య ప్రవక్ష్యామో యజ్ఞే విదథే వీర్యాణి మానస్త్వం మిత్రశ్చ వరుణశ్చా ర్యమా చాయుశ్చ వాయురయన ఇంద్రశ్చోరుక్షయణ ఋభూణాం రాజేతి వా మరుతశ్చ పరిఖ్యన్.

"మా నో మిత్రో ... వీర్యాణి" దీర్ఘతమస ఆర్షమ్. అనేన సూక్తేన అశ్వమేవ ఆహూయతే. యదా వయం విదథే- యజ్ఞే దేవజాతస్య - దేవైః జాతస్య సప్తేః - సరణశీలస్య వాజినః - అశ్వస్య వీర్యాణి - బలాని ప్రవ క్ష్యామః - కథయిష్యామః తదా నః - అస్మాన్ మిత్రః, వరుణః, అర్యమా, ఆయుః - వాయుః, ఋభుక్షా - ఋభూణాం దేవానాం రాజా, మరుతశ్చ మా పరిఖ్యన్ = మా పరిచక్షీరన్ కిం తర్హి అనుమన్యన్తామేవ. ఋభుక్షాః కస్మాత్? ఉరుక్షయణో భవతి - ఉరౌ అంతరిక్షే క్షియతి నివసతీతి.

మంత్రార్థము :- యత్ - ఎప్పుడు, విదథే = యజ్ఞమునందు మనము, దేవజాతస్య = దేవతలవలన, ఉత్పన్న = సూర్యుడు లేక అగ్ని, వలన ఉత్పన్న - 'సూరాదశ్వం వసవో నిరతష్ట' ప్రజాపతినా ద్వితీయా మజు హెూత్ తతోఽశ్వోఽజాయత' ఇత్యాది సప్తేః = సరణశీలముగల, వాజినః = వేగశీలమును గలిగిన అశ్వముయొక్క, వీర్యాణి=గుణములను పరాక్రమము, బలము, సామర్థ్యము మున్నగువానిని, ప్రవక్ష్యామః = వర్ణింతుము, అప్పుడు నః = మనకు, మిత్రః = ఎల్లరకుమిత్రుడు, వరుణః = శ్రేష్ఠుడు, అర్యమా = న్యాయకారియు, ఆయుః = వాయువు, (ఆయుశబ్దముచే వాయువుగ్రహింపబడినది - వకారములోపించినది) ఇంద్రః = ఐశ్వర్యశాలి. ఋభుక్ష = సత్యమునకాశ్రయమునిచ్చువాడు, మరుతః = మరుత్తులు - ప్రతాపి, మా పరిఖ్యన్ = ప్రతిషేధింపకుందురు గాక! - ఆయాగుణముల కధిష్ఠాతలగు దేవతలు - మిత్రాదులు మమ్ము ప్రతిషేధింపక ఉత్సాహితులను జేయుదురుగాక!

భాష్యార్థము :- యద్ = ఎప్పుడు, వాజినః = వేగశీలముగల అశ్వముయొక్క, దేవైర్జాతస్య = సూర్యాదిదేవతలనుండి జన్మములభించిన, సప్తేః సరణస్య = వేగముస్వభావముగాగల గుఱ్ఱమును, ప్రవక్ష్యామః = ప్రశంసింతుమో, విదథే = యజ్ఞమునందు, వీర్యాణి = గుణములను ప్రశంసించునపుడు మమ్ములను, త్వం = నీవు మిత్ర, వరుణ, అర్యమా, వాయువు, (ఆయుః - పదముచే వాయువుగ్రహింపబడినది. వకారము లోపించినది) ఆయుః అయనః = అంతటగమనముచేయునది. వాయువు ఋభుక్షా = ఉరుక్షయణః = అంతరిక్షమునందుండువాడు, ఉరౌ = అంతరిక్షమున, క్షియతి = నివసించును - లేక - క్షిధాతువునకు ఐశ్వర్యమర్థము. అప్పుడు ఋభుక్షా దేవరాజు అనియర్థమగును, మరుతశ్చ = మరుత్తులు - ఈ దేవతలెల్లరు మమ్ము, మాపరిఖ్యన్ = నిషేధింపకుందురుగాక! సహాయకులు - ప్రేరకులగుదురుగాక!

శకునిః - (౨).

> శకునిః - శక్నోతి ఉన్నేతుమాత్మానమ్, శక్నోతి నదితుమితి వా, శక్నోతి తకితుమితి వా, సర్వతః శంకరోఽస్త్వితి వా, శక్నోతేర్వా.

శకునిః కస్మాత్? ఆత్మానమున్నేతుం శక్నోతీతి శకునిః. అథవా శక్నోతి నదితుమ్. అథవా శక్నోతి తకితుం - గన్తుమ్ అథవా అయం నః సర్వతః శం కరోఽస్త్వితి సర్వైః ఆశాసితవ్యో భవతి.

శకునిః కస్మాత్? ఆత్మానమున్నేతుం శక్నోతీతి = శకునిః = పక్షి పక్షి తనను పైకి గొంపోవుటయందు ఎగురుటలో సమర్థమగును. అథవా లేక శక్నోతి నదితుమ్ = శబ్దముచేయుటయందు సమర్థము. అథవా లేక శక్నోతి తకితుమ్=గమనముచేయుటయందుసమర్థము, అథవా లేక అయం= ఈపక్షి, సర్వతః శంకరోఽస్త్వితి = అన్నివైపులనుండి మనకు, శంకరః = శుభముకలిగించునదియగుగాక - లేక - శక్నోతేః = సామర్థ్యముకలది. కావున శకుని యనబడును. అని శకునిపదనిర్వచనము.

తస్యైషా భవతి-

ఈవిషయమునకు సంబంధించిన ఋఙ్మంత్రము.

"కనిక్రదజ్జనుషం ప్రబ్రువాణ ఇయర్తి వాచమరితేవ నావమ్- సుమంగలశ్చ శకునే భవాసి మా త్వా కాచిదభిభా విశ్వ్యా విదత్" (ఋ. ౨-౪౨-౧)

న్యక్రందీజ్జన్మ ప్రబ్రువాణో యథాస్య శబ్దస్తథా నామేరయతి వాచమీరయితేవ నావమ్ సుమంగలశ్చ శకునే! భవ కల్యాణమంగలః. మంగలం గిరతేర్గృణాత్యర్థే, గిరత్య నర్థాన్ ఇతి వా- అఙ్గలమఙ్గవత్- మజ్జయతి పాపకమితి నైరుక్తాః. మాం గచ్ఛత్వితి వా. మా చ త్వా కాచిదభి భూతిః సర్వతో విదత్-

తస్య = శకునేః ఏషా ప్రాధాన్యస్తుతిః. "కనిక్రదత్ ... విదత్" గృత్సమదస్యార్షం. శకుని - రుత - శ్రవణే వినియుజ్యతే జనుషం ప్రబ్రువాణః - ఆత్మనోఽభిజాతిం ప్రఖ్యాపయన్ కనిక్రదతే- - పునఃపునః క్రన్దసి- అపి చ అరితా నావమ్ ఇవ - నావికః నౌకామివ వాచమ్ ఇయర్తి" ఇయర్షి- ఈరయసి ప్రేరయసీత్యర్థః స త్వం హే శకునే! సుమంగలః అస్మాకం

భవాసి - భవ, త్వాం కాచిదపి - అభిభా - అభిభూతిః పరకృత ఉపద్రవః విశ్వాఽసర్వప్రకారా మా విదత్ - ప్రాప్నోతు.

అథైకపదనిరుక్తిః - మంగలం కస్మాత్? ఉచ్యతే గృణాత్యర్థే వర్తమానాత్ గిరతేః ధాతోః. మంగలం కిల స్తుత్యం భవతి. గిరతి అనర్థాన్ ఇతి వా స్యాత్ అథవా అంగాని దధిమధ్వక్షతాని అస్య సన్తీతి అంగరమ్ (మత్వర్థేరః) రలయోరైక్యాత్ అంగలం మకారోపజనేన మంగలమ్. నైరుక్తాః పునః మంగలం మజ్జయతేః సాధయన్తి యస్మాన్మంగలం పాపం మజ్జయతి నాశయతి. అథవా మాం గచ్ఛతు ఇతి వా స్యాత్.

మంత్రార్థము :— జనుషం = తనయుత్పత్తి చెక అభిజాతిని ప్రబ్రువాణః = చెప్పుచున్నట్లు, కనిక్రదత్ = గర్జించుచున్నది, అరితా = నావికుడు, నావంఇవ = నౌకను అవలియొడ్డునచేర్చుటకు నడుపునట్లు, వాచం ఇయర్తి = వాణిని ప్రేరేపించుచున్నది. అట్టి ఓ శకునీ! నీవు, మాకు, సుమంగలః భవాసి = అగుదువు - ప్రశస్తమంగళకారిణివగుము, త్వా = నిన్ను, విశ్వాఽసర్వతః = అన్నివైపులనుండి, కాచిత్ = ఎవరినైనను, కొంచెక, అభిభాః = పరిభవము, మావిదత్ = ప్రాప్తింపకుందురుగాక !.

భాష్యార్థము :- న్యక్రందీత్=గర్జించుచున్నది, జన్మప్రబ్రువాణః = తనజన్మ - జాతి లేక ఉత్పత్తి చెప్పుచున్నదివలె, యథా అస్య శబ్దః = ఎట్లు దీనిశబ్దమున్నదో, తథా = అట్లు, నామ ఈరయతి వాచం = శబ్దము చేయుచున్నది, ఈరయితా ఇవ నావం = నావికుడు, నౌకను నడపునట్లు, సుమంగలశ్చ శకునే = ఓ పక్షీ! ప్రశస్తమంగళము కలవానవుకమ్ము. (భవ), కల్యాణమంగలః = కల్యాణమంగళముకలది, మంగలం = మంగళము వ్యుత్పత్తిగృణాత్యర్థే గిరతేః = గృణాత్యర్థక గృధాతువువలన, గీర్యతే స్తూయతే సః = ఆ శకుని స్తుతికివిషయము. గిరతి అనర్థాన్ ఇతి వా = అది అనర్థములను మ్రింగును - దూరమొనర్చును. యాస్కాత్రేక, అంగలమ్ అంగవత్ = అంగలశబ్దమున మొదట మకారముచేర్చిన మంగలమ్ అగును. ఈ అంగలమేమిటి? అన అంగవత్ = అంగయుక్తము - దధి, మధు, అక్షతలు మున్నగుపదార్థములతో యుక్తము. అంగశబ్దముతో 'ర' ప్రత్యయము, రకారమునకు లకారముచేసిన అంగలశబ్దము సిద్ధిం

చును. ముఞ్చయతి పాపకం ఇతి నైరుక్తాః = పాపమును ముంచివేయును - నష్టమొనర్చును అని నిరుక్తకారులమతము. అందువలన మంగలశబ్దము మస్జధాతువునకు అలచ్‌ప్రత్యయముచేసిన మంగలపదమేర్పడును మాం యచ్ఛతు ఇతి వా = సన్నిధి పొందుగాక ! అనునర్థములో మామ్‌పూర్వక గమ్ ధాతువునకు అలచ్ ప్రత్యయముచేసిన మంగలశబ్దమేర్పడును. మా చ త్వా = నిన్ను, కాచిత్ అభిభూతిః = కొంచెకతిరస్కారము, సర్వతో మా విదత్ = అన్నివైపులనుండి లభింపకుండునుగాక !.

గృత్సమదమర్థమభ్యుత్థితం కపింజలోఽభివవాశే. తదభి వాదిన్యేషర్గ్భవతి.

ఆవిషయమునే యీఋక్కు చెప్పుచున్నది.

"భద్రం వద దక్షిణతో భద్రముత్తరతో వద, భద్రం పురస్తాన్నో వద భద్రం పశ్చాత్ కపింజల"

ఇతి సా నిగదవ్యాఖ్యాతా. గృత్సమదో గృత్సమదనః. గృత్స ఇతి మేధావినామ గృణాతేః స్తుతికర్మణః.

ఏవం కించిత్ ససాధయిషుః గృత్సమదః అభ్యుత్థితః తమ్ అభ్యుత్థితమ్ కపింజలః శకునిః తత్సిద్ధిమావేదయన్ అభివవాశే తదభివాదినీ చ ఏషా ఋక్ - "భద్రం వద ... కపింజల" సర్వతః త్వమస్మాకం భద్రం వదేతి స్పష్టమ్. గృత్సమదః కస్మాదుచ్యతే యస్మాదసౌ గృత్సః - మేధావీ మదనః - హర్షాలుః చ తస్మాత్ గృత్సమదః.

మంత్రార్థము :- సాధారణముగ పక్షి కొంచెకదిశయందు మంచిది, మఱియొకదిశయందు చెడ్డది యగును. పక్షినామమే శకునిః = మంచి చెడుగులశకునమును సూచించునది. మంత్రమున ప్రార్థనచేయబడినది. (కొంచెక కార్యము చేయనుద్దేశించి గృత్సమదుడు - అభ్యుత్థితుడు - అభ్యుత్థితం = లేచినగృత్సమదునిచూచి, కపింజలపక్షి - తీతర్ - తీతువు అతనికార్యసిద్ధిని సూచించుచు అఱచెను అప్పుడతడు చేసిన ప్రార్థనను తెలుపుమంత్రమిది. హే కపింజల భద్రం వద దక్షిణతః = ఓ కపింజల ! దక్షిణమున నిలబడియున్న మాకొఱకు కల్యాణయుక్తముగ పలుకుము.

ఉత్తరతః భద్రం వద = ఉత్తరదిశయందున్నవాఁడవై కల్యాణకరశబ్దము మొనర్పుము. పురస్తాత్ భద్రం వద = పూర్వదిశయందు లేక ఎదురుగ, భద్రం=వద=భద్రము పలుకుము, పశ్చాత్ భద్రంవద=వెనుకనుండియు భద్రముపలుకుము - అన్నివైపులనుండియు నీవు మాకు భద్రము పలుకు వాఁడవగుము. గృత్సమదః గృత్సమదనః - అనబడును. గృత్సశ్చ అసౌ మదనః చ ఇతి గృత్సమదనః. గృత్సః = మేధావీ మదనః హర్షాలుః = మేధావియై మిక్కిలిప్రసన్నుఁడగువానిని గృత్సమదుఁడందురు. గృత్స మదనుడే గృత్సమదుఁడయ్యెను. స్తుత్యర్థక 'గృ'ధాతువుతో గృత్సశబ్దము సిద్ధించును. గృత్సః = అనగా మేధావి అనియర్థము.

మండూకాః - (3)

> మండూకా మజ్జూకా మజ్జనాత్. మదతేర్వామోదతి కర్మణః
> మందతేర్వా తృప్తికర్మణః. మండయతేరితి వైయాకరణాః,
> మండ ఏషామోకః ఇతి వా, మండో మదేర్వా ముదేర్వా.

నిర్వక్తవ్యమేతత్. మండూకాః మజ్జూకాః భవన్తి యస్మాదతే జలే నిత్యమగ్నాః భవన్తి. మోదత్యర్థాత్ మదతేః వా సాధ్యాః నిత్యముదితా హి ఏతే. తృప్త్యర్థాత్ మన్దతేర్వా స్యుః ప్రచురోదకవాసిత్వాత్ నిత్యతృప్తా హి ఇమే. వైయాకరణాస్తు మండూకాన్ మండయతేః సాధయన్తి యత ఇమే విధాత్రా నైకచిత్రాభిః భక్తిభిః మండితా భవన్తి. అథవా మండే - ఉదకే ఓకః - స్థానం యేషాం తే మండూకాః. మండః పునః మదేః ముదేః వా సాధ్యః.

అర్థము:— మండూకాః=మండూకములు-కప్పలు, మజ్జూకం=మజ్జూకములగును, మజ్జనాత్=జలములో మునిగియుండుటవలన, అతః=అందు వలనమండూకములను మజ్జూకములనిరి.మజ్జూకమే మండూకమైనది. కప్ప ఎప్పుడు సంతోషముతోనుండును. తృప్తిఅర్థముగల'మదీ' ధాతువుతో సిద్ధ మగును.మోదతి కర్మణః మోదార్థకమదతేః='మదీ'హర్షే ధాతువువలన మం డూక పదమేర్పడును. మండయతేః ఇతి వైయాకరణాః కాని వైయాకరణులు 'మడి'భూషాయాం హర్షే చ ధాతువువలన మండూకశబ్దమును సాధింతురు. మండయన్తి వర్షాకాలమితి మండూకాః = వర్షఋతువును అలంకరించును.

మండ ఏషాం ఓకః మండ = ఏనికి నివాసస్థానము - మండ - ఉదక వాచకము, మదేర్వా ముదేర్వా మండహర్షార్థక మదః 'మదీ' లేక 'ముద' ధాతువువలన మండశబ్దమేర్పడును. జలముతో స్నానపానాదులు జరిగి ఆనందము లభించును. కావున జలము మండము అనబడును.

**తేషా మేషా భవతి.**

వానికి సంబంధించినఋక్కు.

"సంవత్సరం శశయానా బ్రాహ్మణా వ్రతచారిణః. వాచం పర్జన్యజిన్వితాం ప్ర మండూకా అవాదిషుః"(ఋ.౭-౧౦౩-౧) సంవత్సరం శిశ్యానా బ్రాహ్మణా వ్రతచారిణో అబ్రువాణాః. అపి వోపమార్థే స్యాత్, బ్రాహ్మణా ఇవ వ్రతచారిణ ఇతి. వాచం పర్జన్యప్రీతాం ప్రావాదిషుర్మండూకాః. వసిష్ఠో వర్షకామః పర్జన్యం తుష్టావ. తం మండూకాః అన్వమోదన్త. స మండూకాననుమోదమానాన్ దృష్ట్వా తుష్టావ. తదభివాదిన్యేషర్గ్ భవతి.

"ఉప ప్రవద మండూకి వర్షం మా వద తాదురి. మధ్యే హ్రదస్య ప్లవస్వ విగృహ్యా చతురః పదః"(అథ.౪-౧౫-౧౪) ఇతి సా నిగదవ్యాఖ్యాతా.

తేషాం మండూకానామభివాదినీ ఏషా ఋక్ "సంవత్సరం ... అవాదిషుః" వసిష్ఠస్యార్షమ్. సంవత్సరపర్యన్తమ్ వ్రతచారిణః - కృతవాక్సంయమాః శశయానాః - ప్రసుప్తా ఇవ బ్రాహ్మణాః మండూకాః పర్జన్యజిన్వితాం - పర్జన్యేన తర్పితాం వాచం ప్ర అవాదిషుః - ప్రావోచన్. ఏవమనుశ్రూయతే పురా కిల వర్షకామో వసిష్ఠః పర్జన్యం తుష్టావ తం స్తుహి స్తుహీతి మండూకాః అన్వమోదన్త. స చానుమోదమానాన్ భృశం రటతో మండూకానేవ ప్రాప్తవర్షనిమిత్తపరితుష్టః స్తోతుముపక్రాన్తః. తదభివాదినీ చ ఏషా ఋగ్ భవతి - "ఉప ప్రవద ... చతురః పదః" తాదురి! తరణశీలే! స్పష్టమన్యత్.

మంత్రార్థము :- సంవత్సరం = ఒక్క సంవత్సరము, శశయానాః - శిశ్యానాః - మెదలక యొకచో పడియుండి బ్రాహ్మణాః = మాటలాడుటకు సమర్థులైయుండియు (ఇట బ్రాహ్మణశబ్దము బ్రూఞ్ ధాతువునకు సంబంధించినది) వ్రతచారిణః = మౌనముసాధించుచు, మండూకాః = మండూకములు, ప్రావాదిషుః = అఱవసాగెను, పర్జన్యజిన్వితామ్ = మేఘములచే సంతృప్త, వాచమ్ = వాణిని - అనగా ఎనిమిదిమాసములు మౌనముగా పడియుండి యీమండూకములు వర్షాకాలము ప్రాప్తింపగానే అఱవసాగెననిభావము.

భాష్యార్థము :- శశయానాః - అర్థము. శిశ్యానాః=మెదలకశయనించియుండి, బ్రాహ్మణాః = అర్థము మాటలాడ - అఱచుటకు సమర్థములయ్యు (ఇట బ్రాహ్మణశబ్దము బ్రూఞ్ ధాతుసిద్ధము) వ్రతచారిణః = అర్థము అబ్రువాణాః = వాక్సంయమమొనర్చి - శబ్దముచేయనివై, బ్రాహ్మణులు వర్షాకాలమురాగానే భాద్రపదమాసమున వేదపఠనముప్రారంభించునట్లు - (ఇట బ్రాహ్మణపదము ఉపమావాచకము) (అపి వా ఉపమార్థే స్యాత్) మండూకములుకూడ వర్షఋతువురాగానే మిక్కిలిగా అఱవదొడగును. వర్షమునుగోరుచు వసిష్ఠుడు పర్జన్యుని స్తుతిచేయదొడగెను. మండూకములతని ననుమోదించెను-తనననుమోదించు మండూకములను జూచి వసిష్ఠుడు వానిని స్తుతియింపప్రార్థించెను. తదభివాదినీ = దాని ననువదించు, ఏషా ఋగ్ భవతి = ఋక్కు ఇది.

మంత్రార్థము :— ఓమండూక! (మండూకములతల్లి, లేక - వానపత్ని) మా ఉప = నాసమీపమునకు వచ్చి పలుకుము - (ప్రవద) పెద్దగా పలుకుము, వర్షమ్ ఆవద = వర్షమునకభిముఖివై పెద్దగా పలుకుము, హే తాదురి ! = తరణస్వభావముగల మండూకి ! హ్రదస్య మధ్యే = మడుగుమధ్య, ప్లవస్వ = ఈదుము, చతురః పదః = నాలుగుపదములను, విగృహ్య = ప్రసారించి.

అక్షాః - (౪)

అక్షా అశ్నువత ఏనానితి వాభ్యశ్నువత ఏభిరితి వా.

తేషామేషా భవతి.

ఆ అక్షలయొక్క ఋక్కు.

"ప్రావేపా మా బృహతో మాదయన్తి ప్రవాతేజా ఇరిణే వర్వృతానాః. సోమస్యేవ మౌజవతస్య భక్షో విభీదకో జాగృవిర్మహ్యమచ్ఛాన్" (ఋ. ౧౦-౩౪-౧)

ప్రవేపిణో మా మహతో విభీదకస్య ఫలాని మాదయన్తి. ప్రవాతేజాః ప్రవణేజాః. ఇరిణే వర్తమానాః. ఇరిణం నిర్ఋణమ్, ఋణాతేరపార్ణం భవతి, అపరతా అస్మాదోషధయ ఇతి వా. సోమస్యేవ మౌజవతస్య భక్షః. మౌజవతః మూజవతి జాతః. మూజవాన్ పర్వతో ముంజవాన్. ముంజో విముచ్యత ఇషీకయా. ఇషీకేషతేః గతికర్మణః. ఇయమపీతరేషీకైతస్మాత్ ఏవ. విభీదకో విభేదనాత్. జాగృవిర్జాగరణాత్. మహ్యమచచ్ఛదత్ ప్రశంసత్యేనాన్ ప్రథమయా నిందత్యుత్తరాభిః ఋషేరక్షపరిద్యూనస్యైతదార్షం వేదయన్తే.

అక్షాః కస్మాత్? దీవ్యన్తః కితవాః యస్మాదేతాన్ హస్తైః అశ్నువతే- వ్యాపయన్తి తస్మాదక్షాః. అపి వా అభిపూర్వాదశ్నోతేః కరణే కారకే, కితవాః ఏభిః ధనమ్ అభ్యశ్నువతే ప్రాప్నువన్తీత్యర్థః. తేషామక్షాణామ్ అభివాదినీ ఏషా ఋక్ - "ప్రావేపా మా బృహతో ... మహ్యమచ్ఛాన్." అక్షప్రతస్య మౌజవత ఇయమార్షమ్. ప్రావేపాః - ప్రవేపిణః వేపనశీల వృక్షజాతాః ఇత్యర్థః, బృహతః - మహతః, విభీదకః ఉదకబహులదేశ జాతః తస్య ఫలాని అక్షాః ఇరిణే నిర్గతర్ణే స్థానే వర్వృతానాః - వర్తమానాః, ప్రవాతేజా - ప్రచురవాతే స్థానే జాతాః, సోమస్యేవ మౌజవతస్య అక్షః - యథా యజమానం మాదయతి హర్షయతి తథా అయం విభీదకః అక్షః జాగృవిః - జాగరణకర్తా మహ్యమ్ అచ్ఛాన్ = అచచ్ఛదత్ దేవనార్థం మమ మనః ఉత్సాహయతి. మౌజవతః సోమః. యస్మాదేష మూజవతి పర్వతే జాతః. మూజవాన్ కస్మాత్? యతోఽయం ముంజవాన్. ముంజః కస్మాత్? ఇషీకయా విముక్తో భవతి. ఇషీకా కస్మాత్? ఉచ్యతే గత్యర్థాదిషతేః.

యతః సా ముంజాన్నిర్గతా భవతి. విభేదనాత్ విభీదకః. అక్షపరిద్యూనస్య ఋషేరార్షమేతత్ ఇతి కేచిత్ వేదయన్తే.

'అశూజ్' వ్యాప్తౌ - ధాతువునకు కర్త, లేక కరణ అర్థమున 'స' ప్రత్యయముచేసిన అక్షపదము సిద్ధించును ఈశబ్దము ఏకవచనాంతము బహువచనాంతముకాడ ఉన్నది. అక్షః, అక్షాః అక్షమెట్లు చెప్పు చున్నారు? ఏనాన్ అశ్నువతే = జూదరులు ఏనిని వ్యాప్తముచేయుదురు. తమ పిడికిలియందుంచుకొందురు. అభ్యశ్నువతే ఏభిః ఇతి వా = లేక ఈయక్షములవలన జూదరులు దుర్గతులతో వ్యాప్తులగుదురు.

మంత్రార్థము :— బృహతః = పెద్ద విభీదక (బహేడా. తాళ) వృక్షముయొక్క, ప్రావేప్రాః = మిక్కిలిగా కదలుచున్న, ప్రవాతేజాః = ప్రచురవాయువుగల స్థలమునందు పుట్టిన, ఇరిణే వర్వృతానాః=జలరహిత స్థానమునందున్న, అక్షము విభీదక-ఫలములు, మా=నన్ను, మాదయన్తి= మత్తునిగా జేయుచున్నవి, మౌజవతస్య = ముజవాన్ పర్వతముమీద పుట్టిన సోమస్య=సోమముయొక్క, భక్షః=భక్షణము మత్తుకలిగించును, విభిదకః - విభిదకవృక్షఫలము అక్షము జయము పరాజయము అను రెండు అవస్థలందును, జాగృవిః = మేలుకొలుపును, (జూదరి జయము పొందినచో, సంతోషముతో మేల్కొనును. ఓడిపోయినవాడు దుఃఖముతో నిద్రపోజాలక మేల్కొనియుండునని భావము) మహ్యమ్=నాకు, అచ్ఛాన్ = అచ్ఛాదితముచేసియున్నది, జూదముకొఱకు నామనస్సును ఉత్సాహిత మొనర్చియున్నది. జూదమాడుటతప్ప మఱియొకటి తోచకున్నది.

భాష్యార్థము :— ప్రవేపిణః = చలించునవి, మహతః=పెద్దదియైన, విభీదకస్య ఫలాని = విభీదకఫలములు, మా = నన్ను, మాదయన్తి = మత్తునిచేయుచున్నవి, ప్రవాతేజా = ప్రచురవాయుస్థానమునబుట్టినవి, ఇరిణేవ ర్తమానా = జలరహితస్థలమందు ఉందునవి, ఇరిణమ్-నిర్ౠణమ్= జలరహితప్రదేశమున, ఋణాతేః అపార్ణం భవతి—ఋధాతువువలన ఋణ శబ్దమును అపపూర్వకమగు అపార్ణము, అపగతఋణము - నిర్ౠణము = ఇందు నకారము లోపించిన ఇరిణమగును. అపగతా ఓషధయః అస్మాత్= ఈప్రదేశమునుండి ఓషధులుతొలగిపోయినవి. ఇట నేమియు నుత్పన్నము

కాదు. అందువలన నీప్రదేశము ఇరిణమైనది, మౌంజవతః మూజవతి జాతః = భవార్థమున తాద్ధితఅణ్‌ప్రత్యయము, మూజవాన్ = పర్వతము- మూంజవాలాపర్వతము ముంజః కస్మాత్? విముచ్యతే ఇషీకయా=శలాక నుండి విముక్తమగును, ఇషీకా = ఈనె, శలాకా = దానినుండి విడివడి ముక్తమగుటచే ముంజయనబడును. గత్యర్థకఇషీధాతువుతో ఇషీకా సిద్ధ మగును. ఈ ఇషీకా = పుల్ల, ముంజనుండి బయటికవచ్చును. నిర్గమన కారణమున నది ఇషీకా యనబడును. ఇదియు మఱియొక ఇషీకా = అయుమపి అపరా=ఈరెండవఇషీకతోనే బాణము నిర్మింపబడును, ఏతస్మా దేవ = ఇషీధాతువుతో సిద్ధమగును, విభేదకః విభేదనాత్ = కోష్ఠశుద్ధి చేయును కావున విభేదనమనబడినది, జాగృవిః జాగరణాత్=జాగరణము వలన జాగృవి = నిద్రలేకుండుట, మహ్యామ్ అచచ్ఛదత్ = ఈవిభేదక వృక్షము తనఫలములతో నన్ను ఆచ్ఛాదితమొనర్చినది. నామనస్సును పలుమాఱు జూదమాడ ప్రేరేపించినది, ప్రశంసతి ఏనాన్ ప్రథమయా = మొదటిమంత్రము అక్షలను ప్రశంసించినది. కాని తదుపరి జూదమువలన దుష్టపరిణామమేర్పడును కావున ఉత్తరయుక్కులలో జూదము నిందింపబడినది. అక్షంసే = పాపములచే పరాజితుడైన ఋషివిలాపమిది యని వేదజ్ఞులు చెప్పుచున్నారు. జూదమువలన మనుజునకు మొదట లాభము కలిగినప్పుడతడు మిక్కిలి సంతోషించును. అతడు క్రమముగా జూదమునందు ఆసక్తిని పెంచుకొని తత్పరుడగును. అదుర్వ్యసనమున చిక్కుపడి భయానకపరిణామములను పొందును. చివరకు సర్వస్వము పోగొట్టుకొని జూదమును నిందింపవలెనగును. జూదరియొక్క యీదుస్థితియే యీసూక్తమున వర్ణింపబడినది

ప్రావాణః - (గ)

> గ్రావాణో హన్తేర్వా గృణాతేర్వా గృహ్ణాతేర్వా. తేషామేషా భవతి.
>
> "ప్రైతే వదన్తు ప్రవయం వదామ గ్రావభ్యో వాచం వదతా వదద్భ్యః. యదద్రయః పర్వతాః సాకమాశవః శ్లోకం ఘోషం భరథేంద్రాయ సోమినః" (ఋ. ౧౦-౯౪-౧)

ప్రవదన్త్వేతే ప్రవదామ వయం గ్రావభ్యో వాచం వదత వదద్భ్యో యదద్రయః పర్వతా ఆదరణీయాః సహ సోమ మాశవః క్షిప్రకారిణః, శ్లోకః శృణోతేః, ఘోషో ఘుష్య తేః, సోమినో యూయం స్థేతి వా సోమినో గృహేష్వితి వా.

గ్రావాణః కస్మాత్? వర్ణవ్యాపత్త్యుపజనాభ్యాం హన్తేః సాధ్యాః. స్తుత్యర్థాత్ గృణాతేర్వా. గృహ్ణాతేర్వా. తేషామభివాదినీ ఏషా ఋక్ "ప్రైతే వదన్తు ... సోమినః" అర్బుదస్యార్షమ్. యతః అద్రయః ఆదరణీయాః పర్వతాః - పర్వవన్తః సాకమాశవః - సహభూతాః క్షిప్రకారిణః తం సోమమభిషుణ్వన్తః యూయం సోమినః - యజమానస్య గృహేషు ఇంద్రాయ శ్లోకం - శ్రవణీయం హృదయప్రసాదనం ఘోషం - శబ్దం భరథ - ధారయత తస్మాత్ యుష్మానధికృత్యాహం బ్రవీమి ఏతే - ఉద్గాతారః యుష్మభ్యం ప్రవదన్తు - స్తుతీః ఉచ్చారయన్తు. వాచం వదద్భ్యః - ఘోషం కుర్వద్భ్యః ఏభ్యః గ్రావభ్యః వయమపి చ హోతారః ప్రవదామ స్తోత్రాణి ఉచ్చారయేమ. శ్లోకః శృణోతేః ఘోషశ్చ ఘుష్యతేః - సాధ్యః.

గ్రావన్ (గ్రావా) శిలా = రాయి, హన్తేర్వా హన్ ధాతువునకు, 'పృషో దరాదిత్వాత్' 'హ'స్థానమున గ్రఆదేశము, తదుపరి క్వనిప్ప్రత్యయము చేసిన గ్రావాశబ్దము సిద్ధించును. రాతివలన దెబ్బతగులును. కావున ఇది గ్రావా - రాయి యనబడును. గృహ్ణాతేర్వా లేక రాయి చేతతో గ్రహింప బడును. కావున 'గ్రహ' ధాతువుచే గ్రావన్ శబ్దమేర్పడును. గృణాతేర్వా లేక, 'గౄ' శబ్దే ధాతువువలన 'గ్రావన్'శబ్దము సిద్ధించును. రాళ్ల పరస్పర ఘర్షణవలన శబ్దమేర్పడును.

మంత్రార్థము :- ఏతే ప్రవదన్తు = ఉద్గాతలు చెప్పుదురుగాక! ఏమని? వయం 'ప్రవదామ=మేము చెప్పుదుము అని' వాచం వదద్భ్యః = (అభిషవశబ్ద)మును చేయుచున్న, గ్రావభ్యః = శిలలకు, వదత = మీరు అధ్వర్యులు చెప్పుదురుగాక! యత్ (ఈ యత్పదము పుంలింగబహువచన స్థానమున వచ్చినది) ఏ యీ అద్రయః=ఆదరణీయపర్వతములు, సాకం= అవయవములతోపాటు, ఆశవః = హోమఅభిషవసమయమున వ్యాప్త

మగుచు, లేక శీఘ్రముగ మీరెల్లరు, శ్లోకమ్ = శ్రవణయోగ్యమగు, ఘోషమ్ = అభిషవశబ్దమును, ఇంద్రాయభరథ=ఇంద్రునిసమీపమునకు తీసికొనివెళ్లుడు. సోమినః = సోమవంతుడగు యజమానునిగృహమునందు.

భావార్థము :- అద్రయః = ఆదరణీయములు, అద్రి = ఆదరింప దగినది, ఆశవః క్షిప్రకారిణః = శీఘ్రతనొనరించునవి లేక వ్యాప్తము లగునవి, - లేక భోక్తలు, శ్లోకః శృణోతేః = 'శ్రు' శ్రవణే ధాతువుతో శ్లోక శబ్దము సిద్ధము, శ్రూయతే ప్రశస్యతే ఇతి శ్లోకః = శ్రవణయోగ్యము హృదయగ్రాహి, ఘోషో ఘుష్యతేః = 'ఘుషిర్' అవిశబ్దనే ధాతువువలన ఘోషశబ్దమేర్పడును, ఘఞ్ ప్రత్యయము, సోమినః యూయం స్థ ఇతి వా= లేక, 'సోమినః' ప్రథమాబహువచనాంతముగా సంగీకరించిన, అప్పుడు మీరు సోమవంతులు అని యర్థమగును, సోమినో గృహేష్వితివా = లేక సోమవంతుడగు యజమానుని గృహములందు అనియర్థము చెప్పుకొనుడు.

నారాశంసః - (౬)

యేన నరాః ప్రశంస్యన్తే స నారాశంసో మన్త్రః.

దేనిచే నరులు ప్రశంసింపబడుదురో ఆమంత్రము నారాశంస మనబడును.

తస్యైషా భవతి.

దానికి సంబంధించిన ఋక్కు.

అమందాన్ స్తోమాన్ ప్రభరే మనీషా సింధావధిక్షియతో భావ్యస్య యో మే సహస్రమమిమీత సవానతూర్తో రాజా శ్రవ ఇచ్ఛమానః".

అమన్దాన్ స్తోమాన్ అబాలిశానవల్పాన్ వా. బాలో బలవర్తి భర్తవ్యో భవత్యంబాస్మా అలం భవతీతి వాంబాస్మై బలం భవతీతి వా బలో వా ప్రతిషేధవ్యవహితః ప్రభరే మనీషయా మనన ఈషయా స్తుత్యా ప్రజ్ఞయా వా. సింధావధిని వసతో భావయవ్యస్య రాజ్ఞో యో మే సహస్రం నిరమిమీత

> సవానతూర్తో రాజాఽతూర్ణ ఇతి వాఽత్వరమాణ ఇతి వా
> ప్రశంసామిచ్ఛమానః.

నారాశంసః పూర్వం సమామ్నాతః. కః పునరేష నారాశంసః ? ఉచ్యతే యేన నరాః ప్రశస్యన్తే సః నారాశంసః మంత్రః. తదభివాదినీ ఏషా ఋక్ భవతి. "అమన్దాన్...ఇచ్ఛమానః" దానపరితుష్టః కక్షీవాన్ ఏవం బ్రవీతి అమన్దాన్ - అబాలిశయోగ్యాన్ బహూన్ స్తోమాన్ ప్రభరే - ప్రహరే ఉచ్చారయే ఇత్యర్థః మనీషా-స్తుత్యా మత్యా వా భావ్యస్య-భావయవ్యస్య సింధౌ అధిక్షియతః - నివసతః యః రాజా మే సహస్రం-బహూన్ సవాన్ అమిమీత నిర్మితవాన్. అతూర్తః - అతూర్ణః అచపల ఇత్యర్థః. శ్రవః - ప్రశంసామ్ ఇచ్ఛమానః - ఈహమానః. యః అతూర్తః శ్రవ ఇచ్ఛమాన భావయవ్యో రాజా మే సహస్రం సవాన్ అమిమీత సింధౌ అధిక్షియతః తస్య అహం మనీషా అమన్దాన్ స్తోమాన్ ప్రభరే ఇతి మంత్రాన్వయః.

యేన నరాః ప్రశంస్యన్తే=దేనితో మనుష్యప్రశంస జరుగునో యది నారాశంసమంత్రము. నరాశంస ఏవ నారాశంసః = నరాశంసమే నారాశంసము.

మంత్రార్థము :— సింధౌ = నదియొద్దున, అధిక్షియతః = నివసించు భావ్యస్య = భావ ఆత్మా తమిచ్ఛతీతి భావయుః స ఏవ భావయవ్యః (భావయు యత్, కిద్గుణః, వాన్తోయిప్రత్యయే) తస్య భావయవ్యస్య - భావయవ్యస్య యొక్కయే భావ్యమైనది. ఆత్మతత్త్వమును గోరు తపస్వి లేక రాజుయొక్క అనుగ్రహమువలన అమన్దాన్ స్తోమాన్ = మిక్కిలిగొప్పవి యగు వేదములను, మనీషా = బుద్ధితో, లేక స్తుతియించుచు, ప్రభరే = ధరించుచున్నాను. యః అతూర్తః రాజా = గంభీరుడు లేక తొందరపడని వాడునగు రాజు. శ్రవః ఇచ్ఛమానః = ప్రశంసల గోరుచున్నవాడై, మే = నాకు, లేక నావంటివారికి, సహస్రం సవాన్ = వేలకొలది యజ్ఞములను, అమిమీత = నిర్మించెను.

భాష్యార్థము :— అమందాద్ అబాలిశాన్ అనల్పాన్ వా = మూర్ఖులు కానివారిని లేక పెద్దలను, బాలః బలవర్తీ = బాలకుడు బలవంతుని రక్షణలోనుండువాడు, బాలుడు అనగా బలవంతుని అధీనమునసుండువాడు

అని బాలశబ్దవ్యుత్పత్తి, భర్తవ్యో భవతి = భరణపోషణయోగ్యుడు కావున బాలుడనబడును, లేక బాలునికి తల్లియే పోషింప పర్యాప్తము కావున తల్లియే అలం బాల యైనది. (భర్తవ్యః భార్యః భార్యైవ బాలః అంబా అస్మై బలం భవతీతి వా) బలో వా ప్రతిషేధవ్యవహితః - లేక అబల శబ్దముయొక్క 'అ'మధ్యలో వచ్చిన బ + అ - బాలః అగును. ఈబాలకు నిలో బలములేదు. ప్రభరే = ధారణచేయుదును, మనీషయా మనసః ఈషయా = మనస్సుయొక్క స్తుతితో - మనోయోగపూర్వకస్తుతితో లేక ప్రజ్ఞయా = ప్రజ్ఞతో.

ప్రథమ పాదము సమాప్తము

# ద్వితీయ పాదము

యుద్ధోపకరణాని :—

**యజ్ఞసంయోగాత్ రాజా స్తుతిం లభేత. రాజసంయోగాత్ యుద్ధోపకరణాని. తేషాం రథః ప్రథమాగామీ భవతి.**

యథా రాజా యజ్ఞసంయోగాత్ స్తుతిం లభతే తస్మాత్ రాజసంయోగాత్ యుద్ధోపకరణాన్యపి స్తుతిభాంజి భవన్తి. యుద్ధోపకరణేషు చ రథ ఏవ ప్రథమాగామీ

యజ్ఞసంబంధమువలన రాజు స్తుతినిపొందును. రాజసంబంధము వలన యుద్ధసాధనములు ఉపకరణములుకూడ స్తుతియోగ్యములగును. వానిలో మొదటిది రథము.

ఈ చిన్నభూమికతో యాస్కుడు యుద్ధోపకరణదేవతలనుగూర్చి వ్యాఖ్యానించుచున్నాడు.

తేషామ్=ఆయుద్ధోపకరణములలో, రథము. ప్రథమాగామీ భవతి = మొదటిదిగా లెక్కింపబడినది.

రథః - (౭)

రథః రంహతేర్గతికర్మణః – స్థిరతేర్వా స్యాత్ విపరీతస్య రమమాణోఽస్మిన్ తిష్ఠతీతి వా, రపతేర్వా, రసతేర్వా. తస్యైషా భవతి.

రథసంబంధ ఋక్కు.

"వనస్పతే వీడ్వంగో హి భూయా అస్మత్సఖా ప్రతరణః సువీరః. గోభిః సన్నద్ధో అసి వీళయస్వాస్థాతా తే జయతు జేత్వాని" (ఋ. ౬-౪౭-౨౬)

వనస్పతే దృఢాంగో హి భవ అస్మత్సఖా ప్రతరణః సువీరః కల్యాణవీరః గోభిః సన్నద్ధో అసి వీళయస్వేతి సంస్తంభస్వ, ఆస్థాతా తే జయతు జేతవ్యాని. రథః కస్మాత్ ? ఉచ్యతే గత్యర్థాత్ రంహతేః.

అథవా విపరీతాత్ స్థిరతేః సాధ్యః అథవా రమమాణః అస్మింస్తిష్ఠతీతి రథః. అథవా రపతేః రసతేర్వా నిర్వక్తవ్యః తస్య రథస్య ఏషా ఋక్ "వనస్పతే ... జేత్వాని" గర్గస్యార్థమ్. హే వనస్పతే! వనస్పతిజాత! రథ! త్వమస్మాభిరుచ్యసే - వీడ్వంగః - దృఢాంగో భూయాః భవ. అస్మత్సఖా - అస్మాకం మిత్రమ్ కిం చ ప్రతరణః-సంగ్రామాణాం పారం నేతా సువీరః భవ. గోభిః సన్నద్ధః అసి - గవ్యేన చర్మణా శ్లేష్మణా చ బద్ధః అసి. స త్వం వీడయస్వ - సంస్తభ్నుహి. తే ఆస్థాతా-త్వదుపరి స్థితః యోద్ధా జేత్వాని - జేతవ్యాని జయతు.

మంత్రార్థము :- రథః = రథము యొక్క వ్యుత్పత్తి - గతికర్మణః గత్యర్థక రంహతేః 'రంహ' ధాతువుతో సిద్ధమగును. రంహధాతువునకు 'క్థన్'ప్రత్యయము. స్థిరతేర్వా స్యాత్ విపరీతస్య=స్థిరశబ్దమును విపరీతము చేసిన 'రస్థి'యగును. దానినుండి రథశబ్దము సిద్ధించును రథమునందు మనుష్యుడు స్థిరముగా కూర్చుండును. ఏనుగు, గుఱ్ఱము అనువానిపై కూర్చుండుటకంటె రథముపైకూర్చుండుట సుఖకరము. రమమాణో వా

అస్మిన్ తిష్ఠతి ఇతి రథః = రథముపై సుఖముగా మనుజుడు కూర్చుండును. కావున రథమనఁబడును. లేక శబ్దార్థక - 'రప', 'రస' ధాతువు వలనను రథశబ్దమేర్పడును. రథము నడుచునపుడు శబ్దము = ధ్వని కలుగుచుండును.

మంత్రార్థము :- వనస్పతే! = కొయ్యచేచేయఁబడిన ఓ రథమా!, వీడ్వంగః = మిక్కిలిదృఢమైన అంగములుగలదానా! అస్మత్సఖా భూయాః=మాకు సఖుఁడవుకమ్ము. ప్రతరణః=నీవు మమ్ము సంగ్రామము లందు సంగ్రామహద్దులను దాటింపగలవు, సువీరః = మంచివీరులుకలిగి యుందువు, గోభిః సన్నద్ధఅసి = గవ్యచర్మములతో 'సరేశ' మున్నగు పదార్థములతో గట్టిగ బంధింపబడియుందువు, వీళయస్వ = స్వయముగా దృఢపడి వీరతను ప్రదర్శింపుము, తే ఃస్థాతా = నీపైకూర్చుండు వీరుడు శత్రువులను జయించునుగాక!

దుందుభిః - (౮)

దుందుభిరితి శబ్దానుకరణమ్. ద్రుమో భిన్నః ఇతి వా దుందుభ్యతేర్వా స్యాత్ శబ్దకర్మణః.

తస్యైషా భవతి.

దుందుభియొక్క ఋక్కు.

"ఉపశ్వాసయ పృథివీ ముత ద్యాం పురుత్రా తే మనుతాం విష్ఠితం జగత్. స దుందుభే సజూరింద్రేణ దేవైర్దూరాద్ద వీయో అపసేధ శత్రూన్" (ఋ ౬-౪౭-౨౯)

ఉపశ్వాసయ పృథివీం చ దివం చ బహుధా తే ఘోషం మన్యతామ్ విష్ఠితం స్థావరం జంగమం చ యత్ స దుందుభే! సహజోషణ ఇంద్రేణ చ దేవైశ్చ దూరాద్ దూరతరమపసేధ శత్రూన్.

దుందుభిః శబ్దానుకరణమాత్రమేతత్. ద్రుమో భిన్నః ఇతి వా స్యాత్. ద్రుమాత్ పూర్వం పరమ్ భిదేరుత్తరమ్. యత ఏష ద్రుమసంభవః

చర్మణా చ పినద్ధో భవతి. శబ్దార్థాత్ దుందుభ్యతేః తస్యైషా - "ఉప శ్వాసయ ... అపసేధ శత్రూన్" భారద్వాజస్యేయమార్షమ్. హేదుందుభే! త్వం శబ్దేన ఏతాం పృథివీం ద్యాం చ ఉపశ్వాసయ ఆపూరయ పురుత్రా బహుధా వర్తమానస్య తే ఘోషం మనుతామ్ - మన్యతామ్. యచ్చేదం విష్ఠితమ్ - స్థావరమ్ జగత్ - జంగమం చ. తదేవం ద్యావాపృథివీ-పూరణ సమర్థస్త్వం, హే దుందుభే! ఇంద్రేణ అన్యైశ్చ దేవైః సహ సజూః సమ్ప్రీతః శత్రూన్ దూరాద్దవీయః - అతిదూరం శత్రూన్ అపసేధ - అపకాలయ. యథా తే న పునరాగచ్ఛేయుః. దుందుభిరపి యుద్ధోప కరణమ్

దుందుభిః = దుందుభి వాద్యవిశేషమునకు నామము. శబ్దానుకరణము, ఆ వాద్యమునుండి వెలువడు దుమ్‌దుమ్ అను ధ్వనిననుసరించియే దానికి దుందుభి అనునామము కలిగినది. నగారా డోలు అని తెలుగుపేరు. ద్రుమో భిన్న ఇతి వా = నఱకబడిన - ఛేదింపబడిన వృక్షమనవచ్చును, వృక్షముయొక్క స్థూలమైనభాగమును గ్రహించి దానిపై చర్మమును తొడిగి యిదిచేయబడినది. ఓదుందుభి! నీ నాదముతో పృథివిని పృథివీమ్ ఉత ద్యాంచ=ద్యులోకమును, ఉపశ్వాసయ=నింపుము, నీ యొక్క దానవద్యుఘ్య పురుత్రా=మిక్కిలిగొప్పదియగు నీ ధ్వనిని స్థావరజంగమాత్మకముగు నీజగత్తు అంగీకరించుగాక! ఓ దుందుభీ! సః = అట్టినీవు, ఇంద్రేణ సజూః = ఇంద్రునితో మిత్రతను సంపాదించుచు, ఇంద్రునితోపాటు, దేవైః = ఇతరదేవతలతోను మైత్రిని గూర్చుకొనుచు, దూరాత్, దవీయః = దూరముకంటె దూరము - మిక్కిలిదూరము, శత్రూన్ అపసేధ = శత్రువులను పాఱద్రోలుము.

ఇషుధిః - (౯)

ఇషుధిరిషూణామ్ నిధానమ్.

ఇషుధిః - అమ్ములపొది - బాణములనుంచుపేటిక - తూణీరము.

తస్యైషా భవతి.

దానికి సంబంధించిన ఋక్కు.

"బహ్వీనాం పితా బహురస్య పుత్రశ్చిశ్చాకృణోతి సమనావ గత్య, ఇషుధిః సంకాః పృతనాశ్చ సర్వాః పృష్ఠే నినద్ధో జయతి ప్రసూతః" (ఋ. ౬-౭౫-౫)

**బహూనాం పితా బహురస్య పుత్ర ఇతి ఇషూనభిప్రేత్య ప్రస్మయత ఇవా-పావ్రియమాణః శబ్దానుకరణం వా సంకాః సచతేః. సంపూర్వాద్వా కిరతేః పృష్ఠే నినద్ధో జయతి. ప్రసూత ఇతి వ్యాఖ్యాతమ్.**

ఇషుధిః ఇషూణాం నిధానమ్ భవతి. తస్యైషా - "బహ్వీ నాం... ప్రసూతః" బహ్వీనామ్ - బహూనామ్ ఇషూణాం పితా - పాతా, పుత్రాః - బహునః త్రాతా యశ్చ - చిశ్చాకృణోతి ఉద్ఘాట్యమానః ప్రకర్షేణ స్మయతే ఇవ, సమనా - సంగ్రామం వగత్య - ప్రాప్య. స ఇషుధిః సంకాః-యుద్ధాని సర్వాశ్చ పృతనాః - సేనాః పృష్ఠే నినద్ధః - బద్ధః ప్రసూతః - ధనుష్యేభ్య ప్రక్షిప్తః జయతి, చిశ్చాకృణోతి - అపావ్రియమాణః ఉద్ఘాట్యమానః ఇత్యర్థః స్మయత ఇవ. సంకాః కస్మాత్? సచతేః సంపూర్వాత్ కిరతేః వా స్యాత్.

మంత్రార్థము :- ఇషుధిః=తూణీరము, బహ్వీనామ్ = పలుబాణము లకు, పితా=రక్షకము, తూణీరమునందు బాణములనేకములుంచబడును. అది వానిని రక్షించుచుండును, అస్య = ఈతూణీరమునకు బహుః పుత్రః = అనేకబాణములు పుత్రులు. సమనాఅవగత్య=ఇవి యుద్ధమునుతెలిసికొని, చిశ్చాకృణోతి=తూణీరపుమూత తొలగించినపుడు బాణపుంఖములకాంతితో నవ్వుచున్నట్లుండును, లేక చించిం అనుధ్వనిచేయును,పృష్ఠే నినద్ధః=వీపుపై బంధింపబడి, ప్రసూతః=బాణములను విడుచుచు సంకాః=యుద్ధములను, పృతనాఃసర్వాశ్చ = సమస్తసేనలను, జయతి = జయించును, ఇషుశబ్దము ఉభయలింగకము. అతః బహ్వీనామ్అనిస్త్రీలింగముబహుః పుంలింగప్రయో గముచిశ్చా ఇది హసనార్థకము, లేక-శబ్దానుకరణము, చిశ్చా=''చించిం'అని శబ్దానుకరణము సంకశబ్దము యుద్ధపర్యాయవాచకము, 'షచ' సమవాయే ధాతువువలన సంకశబ్దము సిద్ధించును. సంపూర్వాద్వాకిరతేః=సమ్పూర్వక

కృధాతువుయొక్కరూపము, సంకః. ప్రస్మయతే ఇవ అపాప్రియమాణః = మురాకతీసినపుడు తూణీరము తనలోని బాణపుంఖములదీప్తితే నవ్వు చున్నదాయన్నట్లుండును.

హస్తఘ్నః - (౧౦)

హస్తఘ్నో హస్తేహన్యతే. తస్యైషా ఋగ్భవతి.

దాని విషయమున ఋక్కు.

"అహిరివ భోగైః పర్యేతి బాహుం జ్యాయా హేతిం పరి బాధమానః. హస్తఘ్నో విశ్వా వయునాని విద్వాన్ పుమాన్ పుమాంసం పరిపాతు విశ్వతః" (ఋ.౬-౭౫-౧౪)

అహిరివ భోగైః పరివేష్టయతి బాహుమ్. జ్యాయా వధాత్ పరిత్రాయమాణో హస్తఘ్నః సర్వాణి ప్రజ్ఞానాని ప్రజానన్. పుమాన్ పురుమనా భవతి, పుంసతేర్వా.

హస్తే హన్యతే గోధాఉపరపర్యాయః తస్యైషా-"అహిరివ...పరిపాతు విశ్వతః" యః అయం హస్తఘ్నః - అహిరివ - సర్ప ఇవ భోగైః - కుటిల భావైః బాహుం - భుజమ్ పర్యేతి - పరివేష్టయతి ధానుష్కస్యేతి భావః. జ్యాయాః - హేతిం పరిబాధమానః - జ్యాఘాతం నియంధన్, వయునాని విద్వాన్ పుమానివ - ప్రజ్ఞానబహులః పురుష ఇవ ఏతం ధనుర్ధారిణం విశ్వతః సర్వతో భావేన పరిపాతు - రక్షతు. పుమాన్ కస్మాత్ ? పురుమనా భవతి. పుంసతేర్వా సాధ్యః.

హస్తఘ్నః - శబ్దార్థము. దస్తానా ... హస్తే స్థితో హన్యతే జ్యయా= హస్తేస్థితః = హస్తమునందున్నదై, జ్యాయా = వింటినారిచే, హన్యతే = ప్రహరముచేయబడును.

మంత్రార్థము :— అహిః = సర్పము, భోగైః = తనపడగలతో బాహుంపర్యేతి = మనుష్యునిభుజముపై, పర్యేతి = చుట్టుకొనునట్లు, ఈ హస్తఘ్నము వింటినారితో (జ్యాయాః) హేతిమ్ = ప్రహరమును-దెబ్బను, పరిబాధమానః = తప్పించుచు, బాహుంపర్యేతి = చేతికి చుట్టుకొని

యుండును. విశ్వావయునాని = సమస్తకార్యాకార్యములను, విద్వాన్ = తెలిసికొనుచు, పుమాన్ = ఒకమనుష్యుడు, పుమాంసమ్ = మఱియొక మనుజుని రక్షించునట్లు హస్తఘ్నము యోధుని సర్వతః = అన్నివైపుల నుండి, పరిపాతు = రక్షించుగాక।

భాష్యార్థము :- అహిః ఇవ=సర్పమువలె, బాహుం పరివేష్టయతి = భుజమును చుట్టియుండును, జ్యాయాః = వింటినారియొక్క, పథాత్ = దెబ్బలనుండి, బాహుమ్ = భుజమును, పరిత్రాయమాణః = రక్షించుచు తప్పించుచు, సర్వాణి = సమస్తములైన ప్రజ్ఞానాని = కర్తవ్యాకర్తవ్యము లను, ప్రజానన్ = ఎఱుగుచు, పుమాన్ పురుమనా భవతి = గొప్పమనస్సు గలవాడు ఉదారుడు కావున పుమాన్ పురుషుడనబడును. పుంసతేర్వా = అభివర్ధనార్థక 'పుంస'ధాతువుతో పుమాన్ శబ్దముసిద్ధించును. పుమాన్ = వృద్ధిగొఱకు అగ్రసరుడుఅగువాడు పుమాన్ అనబడును.

అభీశవః - (౧౧)

అభీశవః వ్యాఖ్యాతాః. తేషా మేషా భవతి.

తత్సంబంధ ఋక్కు.

"రథే తిష్ఠన్ నయతి వాజినః పురో యత్ర యత్ర కామయతే సుషారథిః. అభీశూనాం మహిమానం పనాయత మనః పశ్చాదనుయచ్ఛన్తి - రశ్మయః" (ఋ. ౬-౭౫-౬)

రథే తిష్ఠన్ నయతి వాజినః పురస్తాత్ సతో, యత్ర యత్రకామయతే. సుషారథిః కల్యాణసారథిః. అభీశూనాం మహిమానం పూజయామి మనః పశ్చాత్ సన్తో అను యచ్ఛన్తి రశ్మయః.

అభ్యశ్నువతే ఇతి అభీశవః, పూర్వం వ్యాఖ్యాతాః. తేషామ్ ఏషా - "రథే తిష్ఠన్ ... యచ్ఛన్తి రశ్మయః" రథే - స్యందనే తిష్ఠన్ - వర్తమానః సుషారథిః - సుశిక్షితః సారథిః, పురఃసతః - అగ్రతః యుక్తాన్, వాజినః - అశ్వాన్ పశ్చాత్ స్థితః అపి సః యత్ర యత్ర యోద్ధా కామయతే-వాంఛతి

యత్ర యత్ర నయతి. ఏతచ్చ న సారథేః మహత్త్వమ్ యతః అనభీశుకః సారథిః కించిదపి కర్తుం న క్షమః అతోఽభీశూనామేవ మహిమానం - మహత్త్వం పనాయత - పూజయామి. యత్ సారథేః మనః పశ్చాత్ - తదిచ్ఛానుకూలం రశ్మయః అభీశవః అశ్వాన్ అనుయచ్ఛన్తి-ఉపరమయన్తి.

మంత్రార్థము :— సుషారథిః = ఉత్తమసారథి, యత్ర యత్ర కామయతే=ఎక్కడికెక్కడికి పోవనిచ్ఛగించునో, రథే తిష్ఠన్ = రథమున, కూర్చుండి, వాజినః = గుఱ్ఱములను, పురః = ముందుకు, నయతి = తీసికొనిపోవును. కాని, అభీశూనామ్ మహిమానం పనాయత=ఇదిపగ్గముల మహిమగా తెలిసికొనుచున్నాను. సారథిది కాదు రశ్మయః = పగ్గములు, మనఃపశ్చాత్ = సారథిమనస్సువెనుక. అనుయచ్ఛన్తి = అశ్వములను నియమించును, పనాయత - పూజయామి = నేని కళ్లెములను స్తుతియింతును, పనాయత = పూజయామి. ఈపనాయతశబ్దమున పురుష, వచనము. రెండింటికి వ్యత్యయముకలదు.

ధనుః - (౧౭)

**ధనుర్ధన్వతే ర్గతికర్మణః వధకర్మణో వా, ధన్వ న్త్యస్మాదిషవః తస్యైషా భవతి.**

**"ధన్వనా గా ధన్వనాజిం జయేమ ధన్వనా తీవ్రాః సమదో జయేమ. ధనుః శత్రోరపకామం కృణోతి ధన్వనా సర్వాః ప్రదిశో జయేమ" (ఋ. ౬-౭౫-౨)**

ఇతి సా నిగదవ్యాఖ్యాతా. సమదః సమదో వాత్తేః సమ్మదో వా మదతేః. గత్యర్థాత్ ధన్వతేః. వధార్థాత్ వా. తస్య ఏషా - "ధన్వనా గా... జయేమ". వయం ధన్వనా - ధనుషా తాః శత్రూణాం గాః - ధేనూః జయేమ. అపి చ ఆజిమ్ - ఆజవనమ్ లక్ష్యవేధ ప్రతిద్వంద్వితామిత్యర్థః. జయేమ. తీవ్రాః - ప్రచండాః సమదః - సంగ్రామాన్ ధన్వనా జయేమ అస్మాకం ధనుః శత్రోః అపకామమ్ - ఇచ్ఛావిరుద్ధం కృణోతు - కరోతు ధన్వనా ఏవ చ వయమ్ దిశః ప్రదిశః జయేమ ఇత్యేవమాశాస్మహే.

ధనుః ధనుష గతికర్మణః గత్యర్థక ధన్వతేః 'ధవి'ధాతువువలన సిద్ధమగును. ధన్వన్తి బాణాః యస్మాత్ = దేనినుండి బాణములు వెడలునో యది ధనుః = ధనుస్సు, వధకర్మణో వా వధార్థక 'ధవి' ధాతువు వలనను ధనుస్సుశబ్దము సిద్ధించును. శత్రువులనుచంపుటకు ధనువు సాధనము.

మంత్రార్థము:— మేము ధనుస్సుతో ధన్వనా = ధనుస్సుతో గాః = శత్రువులగోవులను జయింతుము, ధన్వనా = ధనుస్సుతో, ఆజిమ్= యుద్ధమును జయింతుము,ధనువుసహాయముతోనే తీవ్రాః, సమదోజయేమ= ఉగ్రులగు శత్రుసైనికులను జయింతుము. ధనుః = ధనుస్సే, శత్రోః = శత్రువుయొక్క, అపకామం కృణోతి = కోరికను వ్యర్థముచేయును, ధన్వనా = ధనుస్సుతోనే, సర్వాః - ప్రదిశః=సమస్తదిశలను ఉపదిశలను కూడ జయింతుము.

భాష్యార్థము :- సమదః-ఇది బహువచనాంతము, సమదో వా త్తేః= సమ్‌పూర్వక అద్‌భక్షణే ధాతువువలన సమదశబ్దము సిద్ధించును, యుద్ధమున పరస్పరము భక్షింతురు కావున ... సమదమన యుద్ధము. సమదో వా మదతేః - సమ్‌పూర్వక 'మదీ'హర్షే- ధాతువువలన సమదశబ్దము సిద్ధించును. యుద్ధమున మత్తులై ప్రసన్నులై ఒండొరులతో పోరాడుదురు కావున యుద్ధము సమదమనబడును.

జ్యా - (౧౩)

**జ్యా జయతే ర్వా, జినాతేర్వా ప్రజావయతి ఇషూన్ ఇతి వా తస్యా ఏషా భవతి.**

జ్యా విషయమున ఋక్కు.

**"వక్ష్యన్తీవదా గనీగన్తి కర్ణం ప్రియం సఖాయం పరిషస్వ జానా. యోషేవ శింక్తే వితతాధిధన్వం జ్యా ఇయం సమనేపారయన్తీ (ఋ. ౬-౭౫-౩)**

**వక్ష్యన్తీ వా గచ్ఛతి కర్ణం ప్రియమివ సఖాయమిషుం పరిష్వజమానా యోషేవ శింక్తే శబ్దం కరోతి వితతాధి**

ధనుషి జ్యేయం సమనే సంగ్రామే పారయన్తీ పారం నయన్తీ.

జ్యా జయతేః జినాతేర్వా సాధ్వా. తస్యా ఏషా - "వక్ష్యన్తీ వేదా ... పారయన్తీ" వక్ష్యన్తి ఇవ - కించిద్ వక్తుకామేయం జ్యా శింజనీ కర్ణమ్ - ఆగనీగన్తి - ఆగచ్ఛతి ప్రియం సఖాయం కాముకం పరిష్వజమానా - ఆలింగితుమీహమానా యోషా ఇవ - తరుణీ ఇవ. శింక్తే - మధురం శబ్దం కరోతి. అధిధన్వన్ వితతా - ధనుషి అధ్యారోపితా సమనేయుద్ధే పారయన్తీ - పారంప్రాపయన్తీ. వితతా, పారయన్తీ ఇత్యేతే జ్యావిశేషణే.

అర్థము :— జ్యా - వింటినారి, జయతేర్వా 'జి'జయే - ధాతు సిద్ధము. వింటినారి జయముకలిగించును. లేక జినతేర్వా 'జ్యా - వయో హానౌ' ధాతుసిద్ధము - జ్యా ఇది శత్రుజీవనమును హరించును. ప్రజావయతి ఇషూన్ ఇతివా = ఇది బాణములను నడపును.

మంత్రార్థము :— మంత్రమున ఇత్ పదపూర్త్యర్థము. వక్ష్యన్తి ఇవ = కొంచెము చెప్పదలచుకొన్నదానివలె వింటినారి (జ్యా) కర్ణం ఆగనిగన్తి వచ్చును. బాణమును విడుచుసమయమున జ్యా చెవివఱకు లాగబడును, కొండొక యోషా-తరుణస్త్రీ కాముకుడైన తనసఖునిచేరి కౌగిలించుకొనునట్లు పరిషస్వజమాన బాణప్రయోగసమయమున వింట్రాడు మాటిమాటికి కర్ణసమీపమున చేరునని భావము మఱియు జ్యా అధిధన్వన్ = బాగుగవిస్తరింపబడి - శింక్తే - అవ్యక్తశబ్దముచేయును.

ఇషుః - (౧౪)

ఇషురీషతేర్గతికర్మణో వధకర్మణో వా. తస్యైషా భవతి.

అబాణ సంబంధమగు ఋక్కు.

"సుపర్ణం వస్తే మృగో అస్యాదన్తో గోభిః సన్నద్ధా ప్రతతి ప్రసూతా. యత్రా నరః సంచవిచద్రవన్తి తత్రాస్మభ్య మిషవః శర్మ యంసన్" (ఋ. ౬-౭౫-౧౧)

సుపర్ణ వస్త ఇతి వాజానభిప్రేత్య మృగమయో అస్యాదన్తో
మృగయతేర్వా గోభిః సన్నద్ధా పతతి ప్రసూతేతి వ్యాఖ్యా
తమ్ యత్ర నరాః సంద్రవన్తి చ విద్రవంతి చ తత్రా
స్మభ్యమిషవః శర్మ యచ్ఛన్తు శరణం సంగ్రామేషు.

గత్యర్థాత్ ఈషతేః వధార్థాత్ వా సాధ్యః. తస్యైషా "సుపర్ణం ... యంసన్" అయమిషుః సుపర్ణం వస్తే - శోభనాన్ పక్షాన్ ధారయతి. ఏషాం మృగః దన్తః మృగమయ ఇత్యర్థః ఇమే గోభిః సంనద్ధాః-గవ్యేన స్నాయ్వా శ్లేష్మణా చ బద్ధాః. - ప్రసూతాః ధనుష్కేణ ప్రక్షిప్తాః పతంతి-గచ్ఛంతి. యత్ర యుద్ధే నరః - మనుష్యాః సంచ-రన్తి విద్రవన్తి చ తత్ర యుద్ధే ఇషవః - బాణాః అస్మభ్యం శర్మ - కల్యాణం యంసన్ - యచ్ఛన్తు.

అర్థము :- ఇషుః = బాణము, గత్యర్థక 'ఈష' ధాతువుచే సిద్ధమగును. లేక వధార్థక 'ఈష' ధాతువుచే సిద్ధమగును, ఇషువు = బాణము చంపును, గమించును.

మంత్రార్థము :— సుపర్ణంవస్తే = ఈబాణము శోభములైన పక్షములను ధరించును. ఇషు - మృగోదన్తః మృగశృంగపుచివరిభాగముచే సిద్ధముచేయబడును. బాణపుచివరిభాగము తానెయ్యది భేదింపవలయునో దానినివెదకునదిగా నుండునని యర్థము - చర్మముతో బంధింపబడి యుండును, ప్రసూతాపతతి = విసరివేయబడును - వేగముగావిసరబడి లక్ష్యమునుభేదించును, యత్ర = ఏయుద్ధమున, నరః = మనుష్యులు, సంద్రవన్తి - విద్రవంతి చ = పరస్పరము కలిసివిడిపోవుటజరుగునో అట్టి - తత్ర = యుద్ధమునందు, బాణములు అస్మభ్యమ్=మనకొఱకు, కల్యాణం శరణం చ = శుభమును ఆశ్రయమును యంసన్ = ఇచ్చును.

భాష్యార్థము :— సుపర్ణంవస్తే = మంచిపక్షములు కలిగియుండునని, వాజాన్=బాణవిషయమున చెప్పబడును. బాణములపిడి - మీద పంఖము లుండును. పంఖముకొక్క దానివలన వేగముగపోవును. మృగమయః = మృగముయొక్క కొమ్ముతో బాణము నిర్మింపబడును. అస్యాః దంతః = దీనిచివరిభాగము మొనతేలియుండును. ఈబాణము మృగయతేర్వా =

తానేలక్ష్యమును భేదింపవలయునో దానినివెదకుచు పోవునని భావము. శర్మ పదమునకు శరణము ఆశ్రయమునని యర్థము.

అశ్వాజనీ - (౧౫)

> అశ్వాజనీం కశేత్యాహుః, కశా ప్రకాశయతి భయమ్ అశ్వాయ, కృష్యతేర్వాణూభావాత్. వాక్ పునః ప్రకాశయత్యర్థాన్. ఖశయా. క్రోశతేర్వా.
>
> అశ్వకశాయా ఏషా భవతి.

గుఱ్ఱపుకొరడా సంబంధ ఋక్.

> "అజంఘ్నన్తి సాన్వేషాం జఘనా ఉపజిఘ్నతే. అశ్వాజని ప్రచేతసో అశ్వాన్త్సమత్సు చోదయ" (ఋ. ౬-౭౫-౧౩)
>
> అఘ్నన్తి సానూన్యేషాం సరణాని సక్థీని. సక్థిః సచతేరా సక్తోఽస్మిన్ కాయః. జఘనాని చోపఘ్నన్తి. జఘనం జంఘన్యతే. అశ్వాజని ప్రచేతసః ప్రవృద్ధచేతసోఽశ్వాన్ సమత్సు సమరణేషు సంగ్రామేషు చోదయ.

అశ్వాజనీ కశా భవతి. అథ కశా కస్మాత్? అశ్వాయ భీతిం ప్రకాశయతి తస్మాత్ కశా అథవా అణూభావాత్ కృశతేః కశా. సా చర్మణః అపకృష్టా భవతి అణ్వీ చ. అథవా వాణీ అపి కశేత్యుచ్యతే సాపి అర్థాన్ ప్రకాశయతి, అథవా వాణీ, ఖే-ముఖే శేతే ఇతి ఖశయా సతీ కశా. అథవా శబ్దకర్మణః క్రోశతేః కశా - వాక్ అశ్వస్య యా కశా - తాడనీ తస్యైషా - "అజంఘన్తి ... సమత్సుచోదయ" హే అశ్వాజని! ఏషామ్ అశ్వానాం సాను - సానూని సముచ్ఛ్రితానీత్యర్థః అజంఘన్తి - అభిహంసి జఘనా - జఘనాని ఉపజిఘ్నతే - తాడయసి. ప్రచేతసః - ప్రకృష్టచిత్తాన్ ఇమాన్ అశ్వాన్ సమత్సు - సంగ్రామేషు చోదయ ప్రేరయ. సానూని సక్థీని భవన్తి సర్తారః తత్ప్రతేనైవ సరన్తి. సక్థిః పునః సచతేః యుక్తః కృత్స్నః కాయః అస్మిన్ సక్తో భవతి జఘనం కస్మాత్? యుతః తత్ జంఘన్యతే పునః పునః కశయా తాడ్యతే.

అర్థము :- అశ్వాజనిమ్ అశ్వాజనిని కశా = కొరడా - అందురు. కశాయననేల? ప్రకాశయతి = భయమును ప్రకటించును. అశ్వాయ = గుఱ్ఱమునకు, అందువలన కశా = కొరడా యనబడును. 'కాశృ'ధాతువుతో కశా సిద్ధమగును. కశా కృశా - సన్ననిది, అణుభావ - కృశ=సన్ననిది యగుటచే కశా యనబడును. వాక్పునః ప్రకాశయత్యర్థాన్-కావున వాణియు కశాయనబడును. వాణిఅర్థములను ప్రకాశింపచేయును, ఖశయా = వాణి ముఖేశయతి - ముఖమునశయనించును కావున ఖశయా-కశా - అనబడును, క్రోశతేర్వా - వాణితో నిందింతురు. కావుననది కశా యనబడును.

మంత్రార్థము:- అశ్వాజని=ఓ కశా! కొరడా! సారథి నీచే, ఏషామ్= ఈయశ్వములయొక్క, సాను = ఉన్నతముగానున్న కటిప్రదేశమునందు ఆజంఘన్తి = తాడింతురు కొరడాతో కొట్టుదురు, జఘనాన్ ఉప జిఘ్నతే = కటిపైకొట్టుదురు. అశ్వాజని! సమత్సు = యుద్ధములందు అశ్వాన్ = గుఱ్ఱములను, ప్రచేతసః చోదయ = సారథిచేయుకొరడా సంకేతము గుర్తించునట్లు చేయుము.

భాష్యార్థము :- ఆఘ్నన్తి = కొట్టుదురు. సానూని ఉచ్ఛ్రితాని = ఉన్నతస్థానములను, (కటిప్రదేశములందు) సరణాని సక్థిని=ఎముకలను, సక్థి - శబ్దము 'షచ'ధాతుసిద్ధము. సక్థి - ఆసక్త - ఈశరీరము ఎముకల మీద ఆసక్తమైయున్నది. శరీరమున ఎముకలులేకున్న నదినిలబడజాలదు. జఘనమ్ = కటిప్రదేశము - పిరుదులు, జఘన్యతే = మాటిమాటికి కటి మీదనే కశతో కొట్టుదురు. కావున కటి జఘనమనబడుచున్నది. హనహంసా గత్యోః హనధాతువునకు గతియనుఅర్థముకూడ ఉన్నది - సాను - సక్థి = ఎముక - అది లేకున్న శరీరమిటునటు కదలుటయు జరుగదు.

ఉలూఖలమ్ - (౧౬)

> ఉలూఖలమురుకరం వోర్ధ్వఖం వోర్కరం వా. "ఉరు మే కుర్విత్యబ్రవీత్" తదులూఖలమభవత్. ఉరుకరం వై తత్తదులూఖలమిత్యాచక్షతే పరోక్షేణ ఇతి చ బ్రాహ్మణమ్. తస్యైషా భవతి.

రోలు సంబంధమగు ఋక్కు.

"యచ్చిద్ధి త్వం గృహేగృహే ఉలూఖలక యుజ్యసే. ఇహ ద్యుమత్తమం వద జయతామివ దుందుభిః"(ఋ.౧-౨౮-౫)

ఇతి సా నిగదవ్యాఖ్యాతా.

ఉలూఖలం కస్మాత్? ఉరుకరత్వాదితి శద్ధి బహ్వన్నం కరోతి. ఊర్ధ్వఖం వా ఉలూఖలమ్. తస్య ఊర్ధ్వం - ఉపరిఖం - ఖాతం భవతి. ఊర్కరం వా. ఊర్క్ - అన్నం తత్కరోతి ఇతి ఊర్కరమ్. అథవా 'ఉరు మే కురు' ఇత్యబ్రవీత్ తస్మాదులూఖలమభవత్. తథా చ బ్రాహ్మణమ్. "ఉరుకరంవై తత్తదులూఖలమిత్యాచక్షతేఽపరోక్షేణ" తస్యైషా- "యచ్చిద్ధి... దుందుభిః" ఉలూఖలక! యద్ధి త్వం ప్రతిగృహం యుజ్యసే తథాపి ఇహ - అస్మద్గృహే ద్యుమత్తమమ్ - దీప్తిమత్తమమ్ శబ్దం వద - జయ తాం వీరాణాం దుందుభిరివ.

అర్థము :– ఉలూఖలమ్ = ఉలూఖల శబ్దనిర్వచనము - ఉరు కరమ్ - ఉరు = ఎక్కువ నాకొఱకు అన్నమును, కురు = చేయుము. అని మనుష్యుడనెను. నాకొఱకు అన్నమునెక్కువచేయుము అని సందు వలన ఉలూఖలమ్ అనబడినది - వా అథవా ఊర్ధ్వఖమ్-ఈఉలూఖలము- రోలుయొక్క ముఖమ్ = ముఖముపైకి ఆకాశమునకుండును. వా - లేక ఊర్కరమ్ - ఊర్జపివ కరణార్థం తదుత్పద్యతే = ధాన్యమును దంచుటకే యది నిర్మింపబడినది. కావున ఊర్కరమ్ = ఉలూఖల రోలు అనబడినది. అన్నమునెక్కువచేయునది.

మంత్రార్థము :– ఉలూఖలక! ఓ రోలా! నీవుప్రతిగృహమునందు ఉపయోగింపబడుచున్నావు. అట్టినీవు నాయింటియందును జయతాం దుందుభిః ఇవ = జయశీలురైనవారిదుందుభివలె పెద్దగా ధ్వనిచేయుము. ద్యుమత్తమమ్=దీప్తిమంతమైన ధ్వనిని నాగృహమున జేయుము.

ద్వితీయ పాదము సమాప్తము

## తృతీయ పాదము

వృషభః - (౧౭)

వృషభః ప్రజాం వర్షతీతి వాతి బృహతి రేత ఇతి వా తద్ వృషకర్మా వర్షణాత్ వృషభః.

తస్యైషా భవతి.

ఇది వృషభసంబంధ ఋక్.

"న్యక్రందయన్నుపయన్త ఏనమమేహయన్ వృషభం మధ్య ఆజేః. తేన సూభర్వం శతవత్సహస్రం గవాం ముద్గలః ప్రధనే జిగాయ" (ఋ. ౧౦-౧౦౨-౫)

న్యక్రందయన్నుపయన్త ఏనమితి వ్యాఖ్యాతమ్. అమేహయన్ వృషభం మధ్య ఆజేరాజనయస్యాజవనస్యేతి వా. తేన తం సూభర్వం రాజానమ్ భర్వతిరత్తి కర్మా. తద్వా సూభర్వమ్. సహస్రం గవాం ముద్గలః ప్రధనే జిగాయ. ప్రధన ఇతి సంగ్రామనామ ప్రకీర్ణాన్యస్మిన్ ధనాని భవన్తి.

వృషభః కస్మాత్ ? స హి ప్రజాం వర్షతి ప్రజాహేతు రేతః సించతి. అతిబృహతి రేతో వా - రేతః సేక్తుమతిశయేనాత్మానముద్వృచ్ఛతీతి వా. భకారేణోపజనేన వర్షణాత్ వృషభః. తస్యైషా - "న్యక్రందయన్ ... జిగాయ" ఆజేః - యుద్ధస్య మధ్యే ఉపయన్తః - ప్రాప్తాః సైనికాః. ఏనం వృషభం - పుంగవమ్ న్యక్రందయన్త - ఉచ్చైః శబ్దంకుర్వాణ మకుర్వన్. అమేహయన్ - మలమూత్రాదినా వ్యరేచయన్. తేన వృషభేణ ముద్గలః ప్రధనే - యుద్ధే సూభర్వమ్ - సమ్యక్ శతవత్ గవాం సహస్రం జిగాయ - జితవాన్. ప్రధనం కస్మాత్ ? ఉచ్యతే యతోఽస్మిన్ ప్రకీర్ణాని ధనాని భవన్తి తస్మాత్ ప్రధనం యుద్ధమ్.

అర్థము :- వృషభః = ఆబోతు, ప్రజాం వర్షతి ఇతి వా = ఇది ప్రజను వర్షింపజేయును వీర్యనిషేకముతో ప్రజను = సంతానము నుత్ప

న్నముచేయును. అతివృహతిరేత ఇతివా = ఇది మిక్కిలిగా రేతస్సును వర్షింపచేయునిద్దముగును. కావున వృషభమనబడును వృహధాతువు ఉద్య మానార్థకము. తద్వృషకర్మా కావున ఇది వర్షించునది - ఇష్టి వర్షణాత్ = వర్షమువలననే వృషభమనబడుచున్నది.

మంత్రార్థము :- ఆజేః = యుద్ధముమధ్య, ఉపయంతః = వచ్చిన సైనికులు, ఏనమ్ వృషభమ్ = ఈవృషభమును, న్యక్రందయన్=అఱచు నట్లుచేసిరి, దానితో పెద్దగా శబ్దముచేయుదురు. అమేహయన్ = మూత్ర పురీషాదులను విడుచునట్లుచెయుదురు. అందువలన వృషభము తేలికయై సుఖమనుభవించును. బాగుగపనికూడచేయును, తేనవృషభేన = ఆ యాబోతుతో ముద్గలుడు, ప్రధనే = యుద్ధమునందు, సూభర్వమ్ = మంచిమోదకములు మున్నగుపదార్థములను భుజించురాజును, లేక సూభర్వమ్ = గోవిశేషణముగా సంగీకరించినపక్షమున ఆయాబోతుతో. గవాంసహస్రమ్ = గోసహస్రమును జిగాయ = జయించెను.

భాష్యార్థము :- ఆజేః = అజయనస్య = అజవనస్య ఇతి ?. ఆజి పదనిరుక్తి. అజయన=జయమును కలిగించునది. లేక అజవన - తేజగతి కలది. యుద్ధము = గందరగోళముతోనిండినస్థలము, అఙ్పూర్వక 'జి' జయే, అఙ్పూర్వ 'జు'గతౌ ధాతువువలనను అజిశబ్దము సిద్ధించును తం సూభర్వం రాజానమ్ = బాగుగ మంచిపదార్థములను భుజించురాజును, లేక వృషభపక్షమున అఙ్పూర్వక భర్వతిః అత్తికర్మా - భర్వధాతువు భక్ష ణార్థకము. యుద్వా - సూభర్వామ్. ఉపపదము గవాం సహస్రం - అనుదానికి విశేషణము మిక్కిలిబాగుగ గడ్డిమున్నగుపదార్థములను తినిన గవాం సహస్రమ్ = వేయిగోవులను, జిగాయ = జయించెను. ప్రధనమనగా సంగ్రామనామము యుద్ధవాచకము ప్రకీర్ణాని అస్మిన్ ధనాని భవన్తి = దీనియందు ధనము వెదజల్లబడును.

ద్రుఘణః - (౧౮)

ద్రుఘణో ద్రుమమయో ఘనః. తత్రేతిహాసమాచక్షతే-ముద్గలో భార్మ్యశ్వ ఋషిర్వృషభం చ ద్రుఘణం చ యుక్త్వా సంగ్రామేవ్యవహృత్యఆజిం జిగాయ. తదభివాదిన్యేషర్గ్ భవతి.

"ఇమం తం పశ్య వృషభస్య యుంజమ్ కాష్ఠాయా మధ్యే ద్రుఘణం శయానమ్ యేన జిగాయ శతవత్సహస్రం గవాం ముద్గలః పృతనాజ్యేషు" (ఋ. ౧౦-౧౦౨-౯)

ఇమం తం పశ్య వృషభస్య సహయుజం కాష్ఠాయా మధ్యే ద్రుఘణం శయానం యేన జిగాయ శతవత్సహస్రం గవాం ముద్గలః పృతనాజ్యేషు. పృతనాజ్యమితి సంగ్రామ నామ పృతనానామ జనాద్వా జయనాద్వా. ముద్గలో ముద్గవాన్ ముద్గిలో వా, మదనం గిలతీతి వా, మదంగిలో వా, ముదంగిలో వా. భార్మ్యశ్వో భృమ్యశ్వస్య పుత్రః. భృమ్యశ్వో భృమయోఽస్యాశ్వా అశ్వభరణాద్వా.

ద్రుఘణః - ద్రుమమయో ఘనః ముద్గర ఇత్యర్థః అత్రేతిహాసః - ముద్గలో భార్మ్యశ్వః ఋషిః పురా ద్వితీయస్య గోః అభావాత్ ద్రుఘణమేవ వృషభేణసహ యుక్త్వా రాజ్ఞాసహ ఆజిం ససర్ప జిగాయ - జితవాంశ్చ. ఏతస్య అర్థస్య అభివాదినీ ఏషాఋక్ - "ఇమం తం పశ్య ... పృతనాజ్యేషు" ఆజ్యాన్తే కేనచిత్ పృష్టః ముద్గలః కేన రాజానమ్ అజైషీః ఇతి స రాజాన మజ్ఞమివ కుత్సయన్ ప్రత్యువాచ - ఇమం తం వృషభస్య యుంజమ్ - సహయుక్తం కాష్ఠాయాః - ఆజ్యాంతస్య మధ్యే శయానం ద్రుఘణం పశ్య యేనాహం రాజానం జితవాన్. పృతనాజ్యేషు - సంగ్రామేషు శతవత్ గవాం సహస్రమ్. పృతనానాం - సేనానాం అజనాత్ - గమనాత్ పృతనాజ్యః - సంగ్రామః పృతనానాం జయనాత్ వా పృతనాజ్యమ్. ముద్గవాన్ ముద్గలః మత్వర్థే లో నామకరణః అథవా ముద్గాన్ గిలతి - భక్షయతీతి ముద్గగిలః ముద్గగిలఏవ ముద్గలః. మదనం - కామం గిలతి - వశీకరోతీతి వా. మదం - ఉద్రేకం గిలతి ఇతి వా. ముదం హర్షం గిలతి ఇతి వా. భార్మ్యశ్వః - భృమ్యశ్వస్య పుత్రః - భృమయః - ఆసన స్థాయినః అస్య అశ్వాః వా. బిభర్తి వాహా అశ్వాన్ ఇతి వా స్యాత్.

అర్థము :- ద్రుఘణః - ద్రుమమయః - వృక్షముతో, లేక కాష్ఠముతో నిర్మింపబడిన ఘనః = గదా = ముద్గరము. అత్ర = ఈవిషయ

మున, ఇతిహాసమును చెప్పుచున్నారు. ముద్గలో భార్మ్యశ్వః ఋషిః = భృమ్యశ్వుని పుత్రుడు - భార్మ్యశ్వుడు ముద్గలుడు. అతడు వృషభం = ఎద్దును, ద్రుఘణం చ=ముద్గరము(గద)ను. యుక్త్వా=కలిపి, సంగ్రామే= యుద్ధమున, వ్యవహృత్య=వానినుపయోగించి, 'ఆజింజిగాయ=జయించెను.

మంత్రార్థము :- ఓ ముద్గల! నీవు ఒక్క వృషభసహాయముతో రాజును జయించితివి. యుద్ధమున అని ప్రశ్నించినపుడు ముద్గలుడు సమాధానమిట్లుచెప్పెను - కాష్ఠాయాః మధ్యే = సంగ్రామభూమియందు, వృషభస్య = ఎద్దుయొక్క, ఇమంతం = ఈయుంజం = సహయోగి. శయానం = పడియున్న, ద్రుఘణం = ముద్గరమును(గడను), పశ్య = చూడుము - దానిసహాయముతో నేను (ముద్గలుడను) గవాం శతవత్ సహస్రమ్ = శతమునూటితోకూడిన సహస్రమును - అనగా పదునొకండు వందలగోవులను, పృతనాజ్యేషు = యుద్ధమున, జిగాయ = జయించితిని.

భాష్యార్థము :- ఇమం తం పశ్య వృషభస్య సహయుజమ్ = సహయోగియైన ఈయెద్దును-ఆపోతును చూడుము, కాష్ఠాయామధ్యే=రణభూమి మధ్య, ద్రుఘణం శయానం = ఆ పడియున్న (అవస్థితం) ముద్గరము - గద చూడుము దానిసహాయముతో, శతవత్ సహస్రమ్ గవాం=ఒకవందతో గూడిన వేయిగోవులను ముద్గలుడు, పృతనాజ్యేషు = యుద్ధమున - పృతనాజ్యమనయుద్ధము (పృతనాః మనుష్యులు, యస్మిన్ = దేనియందు, అజన్తి = గచ్ఛన్తి వెళ్లుదురో అది పృతనాజ్యమ్ - యుద్ధము) జయనాత్ వా=మనుజులు యుద్ధమున జయింతురు, కావున పృతనాజ్యం=యుద్ధము, (పృతనా యత్ర జయన్తి తత్ పృతనాజ్యం యుద్ధం - జనులు జయించునది. యుద్ధము) ముద్గలమెట్లన? ముద్గవాన్ = ముద్గ= పెసలుగలవాడు పెసలుతినువాడు (ముద్గాన్ = పెసలను - గిలతి - భక్షయతి = తినును. కావున ముద్గిలః) - వా. లేక - మదనం గిలతి = కామమును వశమును చేసికొనువాడు - జితేంద్రియుడు, ముదం హర్షం గిలతి - ఇతి - ముదం గిలః = ముదంగిలుడు మదంగిలః - మదం = ఉద్రేకమును, గిలతి = వశీకరోతి - మదమునువశపఱచుకొనువాడు - మందగిలుడు శాంతచిత్తుడు భృమ్యశ్వస్యపుత్రుడు - భార్మ్యశ్వః - భార్మ్యశ్వుడు భృమ్యశ్వః-భృమయః

అశ్వాః యస్య = ఎవని అశ్వములు చంచలములో యతడు భృమ్యశ్వుడు, అశ్వభరణాద్వా = లేక అశ్వములను భరణాత్ - పోషించుటవలనను భృమ్యశ్వుడనబడును.

పితుః - (౧౮)

పితురిత్యన్ననామ పాతేర్వా, పిబతేర్వా, ప్యాయతేర్వా.

తస్యైషా భవతి.

"పితుం ను స్తోషం మహో ధర్మాణం తవిషీమ్. యస్య త్రితో వ్యోజసా వృత్రం విపర్వమర్దయత్ (ఋ.౧-౧౮౭-౧) తం పితుం స్తౌమి మహతో ధారయితారం బలస్య. తవిషీతి బలనామ తవతేర్వా వృద్ధికర్మణః. యస్య త్రిత ఓజసా బలేన. త్రితస్త్రిస్థానః ఇంద్రో వృత్రం విపర్వాణమ్ వ్యర్దయతి.

పితురితి పదం రక్షాకర్మణః పాతేః పానార్థాత్ పిబతేర్వా, తర్పణార్థాత్ ప్యాయతేర్వా సాధ్యః తచ్చాన్నమ్. తస్యైషా - "పితుం ను స్తోషమ్... విపర్వమదర్యత్ ఆగస్త్యస్యార్షమ్. అహమ్ మహః మహతః - తవిషీమ్ - బలస్య ధర్మాణం - ధారయితారం తం పితుమ్ - అన్నమ్ స్తోషమ్ - స్తౌమి యస్య ఓజసా - బలేన త్రితః - త్రిష్వపి స్థానేషు అప్రతిహత - ప్రభావః ఇంద్రః వృత్రం విపర్వం-విగతసంధిబంధనమ్ కృత్వా వ్యర్దయత్ అపునరావృత్తయే వివిధం అర్దయతి. ను ఇతి వృద్ధౌ.

అర్థము :— పితుః = ఇది అన్ననామము - ఇది రక్షించునది. అందువలన 'పా'రక్షణేధాతువువలన పితుఃశబ్దము సిద్ధించును. లేక భక్షణముచేయబడును కావున భక్షణార్థక 'పా'ధాతువుచే సిద్ధమగును లేక, అన్నము శరీరవృద్ధికి హేతువు, కావున వృద్ధ్యర్థక 'ప్యాయీ'ధాతువువలనను సిద్ధించును.

మంత్రార్థము :— మహః - గొప్ప, తవిషీమ్ = బలమును, ధర్మాణమ్ = ధారణచేయు, పితుమ్ = అన్నమును, ను స్తోషమ్=ఆదరింతును.

యస్య ఓజసా = ఏయన్నబలముతో, త్రితః = బలము, స్థలము, అంతరిక్షమను నీమూడుస్థానములందును, అప్రతిహతగతుడై ఇంద్రుడు వృత్రం = వృత్రుని, విపర్వమ్ = ఆస్థిసంధులను, ఎముకలసంధులను. విఱుగగొట్టి - విడదీసి, వ్యర్దయత్ = హననముచేసెను. చంపిపడవేసెను.

భాష్యార్థము :- తం పితుం స్తౌమి = నేను అన్నము నాదరింతును, మహతఃబలస్య = గొప్పబలమును, ధారయితారం = ధరించువాడను, తవిషీతి బలనామ = తవిషియనగా బలము, వృద్ధికర్మణః తవతేః=వృద్ధ్యర్థకతుధాతువుతో త్రితః=మూడుస్థానములందు సమానగతిగలిగినయింద్రుడు, వృత్రం=ఒక్కొక్క ఎముకలసంధిని త్రుంచి వ్యర్దయతి=చంపిపడవేసెను.

నద్యః . (౨౦)

నద్యో వ్యాఖ్యాతాః - తాసామేషా భవతి - "ఇమం మే గంగే యమునే సరస్వతి శుతుద్రి స్తోమం సచతా పరుష్ణ్యా అసిక్న్యా మరుద్వృధే వితస్తయార్జీకీయే శృణుహ్యా సుషోమయా" (ఋ. ౧౦-౭౫-౫)

ఇమం మే గంగే యమునే సరస్వతి శుతుద్రి పరుష్ణి స్తోమమాసేవధ్వమసిక్న్యా చ సహ మరుద్వృధే వితస్తయా చార్జీకీయ ఆశృణుహి సుషోమయా చేతి సమస్తార్థః. అథైకపదనిరుక్తమ్ గంగాగమనాత్ యమునా ప్రయువతీ గచ్ఛతీతి వా, ప్రవియుతం గచ్ఛతీతి వా. సరస్వతీ సర ఇత్యుదకనామ సర్తేస్తద్వతీ. శుతుద్రీ శుద్రావిణీ క్షిప్రద్రావిణ్యాశుతున్నేవ ద్రవతీతి వా. ఇరావతీం పరుష్ణీత్యాహుః పర్వవతీ భాస్వతీ కుటిలగామినీ. అసిక్న్యశుక్లాసితా సితమితి వర్ణనామ తత్ప్రతిషేధోఽసితమ్. మరుద్వృధాః సర్వా నద్యో మరుత ఏనా వర్ధయన్తి. వితస్తాఽవిదగ్ధా వివృద్ధా మహాకూలా. ఆర్జీకీయాం విపాడిత్యాహుః. ఋజీకప్రభవా వర్జుగామినీవా, విపాడ్ విపాటనాత్వా, విప్రాశనాద్వా, విప్రావ

ణాద్వా, పాశా అస్యాం వ్యపాశ్యన్త వసిష్ఠస్య ముమూర్షత స్తస్మాద్ విపాడుచ్యతే. పూర్వమాసీదురుంజిరా. సుషోమా సిన్ధుర్యదేనా మభిప్రసువన్తి నద్యః సిన్ధుః స్యన్దనాత్.

నద్యో వ్యాఖ్యాతాః పూర్వమ్. తాసామేషా ఇమం మే గంగే - సుషోమయా హే మరుద్వృధే! గంగే! యమునే! సరస్వతి! శుతుద్రి - పరుష్ణ్యా అసిక్న్యా, వితస్తయా సుషోమయా సహ ఆర్జికీయే యూయమ్ - మే-మమ స్తోమం - స్తుతం సచతా - సచత ఆసేవధ్వమిత్యర్థః. ఆశృణుహి - అభిముఖ్యేన స్థిత్వా శృణుత. అథైకపద నిరుక్తమ్ - గంగా కస్మాత్? యతః సా విశిష్టంస్థానం గచ్ఛతి గమయతి వా తస్మాత్ గంగా. యమునా కస్మాత్? యస్మాదియమ్ ప్రయువకమన్యాభిః నదీభిః ప్రయువతి - మిశ్రయతి గచ్ఛతి తతో యమునా ఇత్యుచ్యతే

సరస్వతి చ పునః - సరసా ఉదకేన తద్వతీ భవతి. సరః సర్తేః. శుతుద్రీ - శు - క్షిప్రం ద్రవిణీ అథవా ఆశు కేనచిత్ తున్నేవ ద్రవతి పరుష్ణీ పునః ఇరావతీ (రావి) ఇతి ప్రసిద్ధా, యస్మాదియం పర్వవతీ - కుటిలగామినీ యాని కుటిలాని తాన్యస్యాః పర్వాణీవ తైస్తద్వతీ. అసిక్నీ పునః అశుక్లా అసితా కృష్ణోదకా ఇత్యర్థః. మరుద్వృధాః సర్వా ఏవ నద్యః మరుద్వృధాః ఉచ్యన్తే యస్మాదేనా మరుతః వర్ధయన్తి వర్షైః. తస్మాదనేన శబ్దేన ప్రత్యేకం నదీనామ విశేషణత్వేనానుషజ్యతే. వితస్తా కస్మాత్? యస్మాదియమవిదగ్ధా వివృద్ధా మహాకూలా విస్తీర్ణా వా తస్మాత్ వితస్తా కస్మాత్? వైదేహికో నామాగ్నిః సోఽన్యా నదీః నిర్దదాహ న వితస్తామ్ ఇతి సామిధేనీ - బ్రాహ్మణేఽనుశ్రూయతే. తస్మాదియమవిదగ్ధేత్యుక్తా.

ఆర్జికీయా లోకే విపాట్ (వ్యాస) నామ్నా ప్రసిద్ధా. యస్మాదియం ఋజీకాత్ పర్వతాత్ జాతా తస్మాదార్జికీయా. ఋజుగామినీ వా. విపాట్ కస్మాత్? యస్మాదతి వేగవత్త్వాత్ భూమి మియం విపాటయతి తస్మాత్ విపాట్. విపాశనాత్ వా. సుత - మరణ - శోకార్తః వసిష్ఠః ముమూర్షుః ఆత్మానం పాశైర్బద్ధ్వా అస్యాం మమజ్జ తే చ పాశాః అస్యా ఉదకేన వ్యపాశ్యన్త - పూర్వమస్యా నామ 'ఉరుంజిరా' ఇత్యాసీత్. అథవైదకానాం

విప్రాపణాత్ విపాట్. సుషోమాసింధుః సా కస్మాత్? యత ఏనామ్ అభిప్రసువన్తి అన్యాః బహులాః నద్యః అభిగచ్ఛన్తి. సింధుః పునః అవిచ్ఛే దేన స్యందనాత్ ఇతి.

అర్థము :— నదులవ్యాఖ్య సమాప్తము. నదనాభవన్తి శబ్దవత్యః. ఈనదులు 'ణద' అవ్యక్తే శబ్దే' ధాతువువలన నద్యశబ్దము సిద్ధమైనది - ధ్వని చేయుచున్నవి.

మంత్రార్థము :- హే గంగే! యమునే! సరస్వతి! శుతుద్రి పరుష్ణ్యాసహ=పరుష్ణితోపాటు, మే = నాయొక్క, ఇమం స్తోమం=ఈస్తుతిని, ఆ సచత = సేవింపుడు. ఓ నదులార! మీరెల్లరు నాయీస్తోత్రమును వినుడు. మఱియు మరుద్వృధే! దేవతలచే వృద్ధిచేయదగిన ఓ అర్జికీయే! ఋజీకపర్వతమునుండి పుట్టిన నీవుకూడ అసిక్న్యా సుషోమయా వితస్తయా =అసిక్ని సుషోమా వితస్తతోపాటు ఆశృణుహి=నాస్తుతిని వినుము.

అథ=ఇప్పుడు ఏకపదనిరుక్తమ్. ఒక్కొక్కపదనిరుక్తి చేయబడును. గంగా గమనాత్ = ఈగంగ, అనవరత=నిరంతరగతితో నడచుచుండును. లేక ఉత్తమస్థానమును చేర్చును. కావున గంగయనబడుచున్నది. గచ్ఛతీతి గంగా గమయతి వా విశిష్టం స్థానమ్ ప్రాణినః ఇతి. నడచుచుండును కావున గంగ-విశిష్టస్థానమునప్రాణులను చేర్చును కావున గంగయనబడును. యమునా కస్మాత్? ప్రయువతీ గచ్ఛతి - ప్రకర్షేణ మిశ్రయన్తీ స్వాన్యుద కాని అన్యాభిః నదీభిః సహ గచ్ఛతి = తనజలములను అన్యనదీజలములతో బాగుగకలుపుచు ప్రవహించును కావున యమున అనబడుచున్నది. వా లేక ప్రవియుతం గచ్ఛతి స్తిమితమివ గచ్ఛతి = ఎక్కువ చలనములేక ధ్వనిచేయక నడచును. కావున యమున అనబడును. సరస్వతీ - సరః ఇతి ఉదకనామ - సరయని ఉదకమునకుపేరు దానితో - ఉదకముతో కూడియున్నది కావున సరస్వతి. శుతుద్రీ కస్మాత్? శుద్రావిణీ = క్షిప్ర ద్రావిణీ - వేగముతో ప్రవహించునది కావున శుతుద్రీ - లేక తున్నాఇవ విద్ధాఇవ ద్రవతి = కొరడాతో కొట్టబడి పరువిడుచున్నదా యనునట్లు వేగముగ ప్రవహించుచున్నది కావున శుతుద్రి యనబడుచున్నది. ఇరా వతీం పరుష్ణీత్యాహుః = ఇరావతిని పరుష్ణి యందురు. పర్వము కలది

కావున పరుష్ణి = కుటిలగతితో ప్రవహించును కావున పరుష్ణియనబడు
చున్నది. అసిక్నీ ఏల? ఇది అసితా - అశుక్లా = నల్లనిది, సితమితి శుక్ల
వర్ణనామ సిత = శ్వేతము - తెలుపు తత్ప్రతిషేధః = దానికివిపరీతము
నలుపు నల్లనిరంగుగలజలముతో ప్రవహించును కావున అసిక్నీ అనబడు
చున్నది. మరుద్వృధాః = సర్వనదులు మరుత్=దేవతలచే వృద్ధిపొందును
కావున మరుద్వృధాః అనబడుచున్నవి. వితస్తా కస్మాత్? అవిదగ్ధా = ఈ
వితస్తా దహింపచేయబడలేదు. వైదేహకనామకఅగ్ని నదులనన్నిటిని
దగ్ధముచేసినది. ఈనది యొక్కటియే దానిచే కాల్చబడలేదు. కావున
వితస్తా 'యనబడుచున్నది. ఆ విదగ్ధయే తదుపరి వితస్తాయనబడసాగినది
విస్తీర్ణ = విస్తృతమైనది - లేక, పెద్దపెద్దతీరములు కలది కావున వితస్త
యనబడుచున్నది. ఆర్జీకీయాం విపాడిత్యాహుః = ఆర్జీకీయానదిని విపాట్
అందురు. విపాట్విపాశానదియే ఆర్జీకీయానది. ఋజీకప్రభవా వా ఆర్జీ
కీయా = ఋజీకపర్వతమునుండి వెలువడినది కావున ఆర్జీకీయా యనబడు
చున్నది. ఈనది వంకరటింకరగాకాక తిన్నగా ప్రవహించుచున్నది అందు
వలనను ఆర్జీకీయా యనబడుచున్నది, విపాటనాత్ - విపాట్ = ప్రబల
వేగముతో ప్రవహించి భూమిని బ్రద్దలు చేయుచుండును అందువలన
విపాట్ అనబడుచున్నది - లేక వసిష్ఠుడు అనునొకఋషి ముమూర్షుః =
చావగోరినవాడై తనను పాశములతో బంధించుకొని ఈనదియందు పడి
మునగనారంభించెను. కాని నదీ జలములచే నతనిపాశములు శిథిలములై
విడిపోవుటవలన నతడు విపాశుడయ్యెను. అందువలన నీనది విపాట్
అనబడుచున్నదని యొకప్రతీతి. విప్రాపణాత్ వా లేక ఈనది జలమును
వివిధప్రదేశములందు జేర్చును. కావున విపాట్ అనబడుచున్నది. పూర్వ
మీనది ఉరుంజిరా నామముతో ప్రసిద్ధమైయుండెడిది. ఉరు ప్రభూతం
జలమ్ యస్యాం సా ఉరుంజిరా. ఈనదియందు మిక్కిలిజలముండుటచే
ఉరుంజిరా యనబడెడిది. తదుపరి వసిష్ఠుని విపాశుంజేసి విపాట్ అయినది.
సింధుః సుషోమాసింధుః = సింధునది సుషోమా యనబడెడిది. అన్య
నదులు ఈనదియందు అభిప్రసువన్తి = వెళ్లికలియును. ఈసింధునది
పర్వతములనుండి స్యందించుచున్నది - కావున సింధుఅనబడుచున్నది.

అపః - (౨౧)

> అప ఆప్నోతేః - తాసామేషా భవతి-"ఆపో హి ష్ఠా మయో భువ స్తాన ఊర్జే దధాతన. మహే రణాయ చక్షసే" (ఋ. ౧౦-౯-౧)
>
> ఆపో హి స్థ సుఖభువ స్తా నోఽన్నాయ ధత్త-మహతే చ నో రణాయ రమణీయాయ చ దర్శనాయ.

సర్వషూభిః ఆప్యం తస్మాదాప్నోతేః ఆపః. తాసామ్ ఏషా-"ఆపో ... చక్షసే" సింధుద్వీపస్యార్షమ్. హే ఆపః యూయం మయోభువః - సుఖస్య భావయిత్ర్యః స్థ. తాః యూయమ్ నః = అస్మాకమ్. ఊర్జే = అన్నాయ దధాతన - ధారయత. నః - మహే - మహతే రణాయ-రమ్యాయ చక్షసే - దర్శనాయ.

జలము సర్వత్ర = అంతట వ్యాప్తము ఆప్ల్ వ్యాప్తౌ ధాతువుతో ఆపః శబ్దము సిద్ధించును.

మంత్రార్థము :— ఆపః - ఓ జలమా! మయోభువః - స్థ=సుఖము కలదానవగుము, తాః = ఆ నీవు, నః = మమ్ము, ఊర్జే = అన్నముకొఱకు, దధాతన = స్థాపితుల జేయుము - మమ్ముల నన్నము పొందదగినవారల నుగా జేయుము, మహే = గొప్ప, రణాయ = రమణీయమైన, చక్షసే = దర్శనముకొఱకు యోగ్యులనుజేయుము. ఆపః = ఓ జలమా! స్థసుఖ భవః = నీవు సుఖకారకము, తాః = అవి, నః=మమ్ములను, అన్నాయ = అన్నమునుత్పాదనచేయుటకొఱకు, ధత్త = యోగ్యునిచేయుము, మహతే చ రణాయ = రమణీయాయ దర్శనాయ = మహనీయదర్శనముకొఱకు యోగ్యులను జేయుము.

ఓషధయః - (౨౨)

> ఓషధయ ఓషద్ధయ స్తీతి వా. ఓషత్యేనా ధయ న్తీతి వా. దోషం ధయ న్తీతి వా. తాసామేషా భవతి.

"యా ఓషధీః పూర్వా జాతా దేవేభ్యస్త్రియుగం పురా.
మనై ను బభ్రూణామహం శతం ధామాని సప్త చ"
(ఋ. ౧౦-౯౭-౧)

యా ఓషధయః పూర్వా జాతా దేవేభ్యః త్రీణి యుగాని పురా మన్యే ను తద్ బభ్రూణామహం బభ్రువర్ణానామ్ హరణానామ్ భరణానామితి వా. శతం ధామాని సప్త చ, ధామాని త్రయాణి భవన్తి స్థానాని నామాని జన్మానీతి. జన్మాన్యత్రాభిప్రేతాని సప్తశతం పురుషస్య మర్మణాం తేష్వేనా దధతీతివా. ఓషత్ - దహత్ కాయికం రోగజాతం ధయన్తి - పిబన్తి నాశయన్తీతి యావత్ ఇత్యోషధయః ఓషతికస్మింశ్చిదుదరాదావంగే ధయన్తి - పిబన్తి ఇతి వా. దోషం ధయన్తీతి వా స్యాత్. తాసామేషా - "యా ఓషధీః ... ధామాని సప్త చ" య ఏతాః ఓషధయః పూర్వాః ప్రథమాః జాతాః దేవేభ్యః త్రియుగం పురా జాతాః. తాసాం బభ్రువర్ణానామహం శతం సప్తోత్తరం ధామాని మనై - జానే సప్తశతం ఓషధిజాతయః అస్మిన్ మంత్రే అభిప్రేతాః.

అర్థము :— ఓషధయః - ఏల? ఇవి మందులు శరీరమున నేదేని యంగమున రోగమునకుసంబంధించిన మంటయున్నగునవి కలిగిన ఓషధిః ఓయుతే = మందుతినబడును. ఓషధి రోగమును నశింపజేయును. అందు వలననే ఓషధులనబడుచున్నవి. దోషం ధయన్తి ఇతి వాఽలేక ఓషధులు వాత, పిత్త - కఫనామకధాతువులదోషములను నాశమును చేయును. అందువలన ఓషధులనబడుచున్నవి.

మంత్రార్థము :— యా ఓషధీః = ఓషధులు, దేవేభ్యః = దేవతల కంటెముందు పుట్టినవో కలి, ద్వాపర - త్రేతాయుగములకంటెపూర్వము కృతయుగమున బుట్టినవో బభ్రూణామ్ = ఓషధులు పరిపక్వమై పేలా బూడిదవర్ణముగలవియైనప్పుడు, వానిని - నేను - ౧౦౭ జాతులుగల ఓషధు లను ఎఱుగుదును.

భావార్థము :— ధామాని త్రయాణి భవన్తి = ధామానిలోకములు మూడు అవి - స్థానము, నామము, జన్మము. ఇక్కడ జన్మశబ్దము జాతి యనునర్థమున గ్రహింపబడినది. పురుషస్య మర్మణాం తేష్వేనా దధతీతి

వా. మనుష్యులశరీరమున ధామాని = స్థలములు మర్మస్థానములున్నవో వానియందు సుఖముకలిగించుటకు - దుఃఖమును తొలగించుటకు ఓష ధులు ఉపయోగింపబడును. మనుష్యశరీరమున ౧౦౭ మర్మస్థానము లున్నవి. వీనియందే రోగములు ఉత్పన్నములగును.

రాత్రిః - (౨౩)

> రాత్రిః వ్యాఖ్యాతా తస్యా ఏషా భవతి - ఆరాత్రి పార్థివం రజః పితురప్రాయి ధామభిః. దివః సదాంసి బృహతీ వితిష్ఠస ఆత్వేషం వర్తతే తమః" (అథ. ౧౯-౪౭-౧)
>
> ఆపూపురస్త్వం రాత్రి పార్థివం రజః స్థానైర్మధ్యమస్య దివః. సదాంసి బృహతీ మహతీ వితిష్ఠస ఆవర్తతే త్వేషం తమో రజః.

పూర్వం వ్యాఖ్యాతా రాత్రిః. తస్యాః ఏషా - "ఆరాత్రి ... ఆత్వేషం వర్తతే తమః" కుశికస్యార్షమ్. హే రాత్రి! యత్ త్వం పితుః ధామభిః అంతరిక్షలోకేన సహ పార్థివం పృథివీలోకమపి ఆ అప్రాయి - అపూ పురః దివః సదాంసి ద్యులోకస్యాపి స్థానాని - బృహతీ - మహతీ వితిష్ఠసే- వ్యాప్తవత్యసి. త్వేషం దీప్తం తమః రజః - పృథివీలోకే ఆవర్తతే చక్ర వద్భ్రమతి.

రాత్రి పూర్వమువ్యాఖ్యానింపబడినది. రాతేర్దానకర్మణః దానార్థక 'రా'ధాతువువలన రాత్రిశబ్దమేర్పడును.

మంత్రార్థము :- రాత్రి! పితుః ధామభిః (పితా మధ్యమలోకము) అంతరిక్షలోకముతో పార్థివంరజః = పృథివీలోకమును, ఆ + అప్రాయి = నిండియున్నవి, దివః సదాంసి = ద్యులోకస్థానములనుగూడ వ్యాపించి యున్నవి. బృహతీ - మహతీ = నీవు వివిధరూపములతో వివిధస్థానము లందు, వితిష్ఠసే = వర్తిల్లుచున్నావు. మరల త్వేషమ్ తమః ఆవర్తతే = నీయొదీప్తమగు నంధకారము ఈలోకమునసే తిరుగుచున్నది.

భాష్యార్థము :- ఆపూపురః త్వంరాత్రిః= రాత్రి! నీవు, పార్థివం రజః=పృథివీలోకమును నింపియున్నావు, స్థానైర్మధ్యమస్యదివః సదాంసి=

దివమునయొక్క అంతరిక్షముయొక్కయు స్థానములను నింపియున్నావు, మహతి = గొప్పదానవైయున్నావు, ఆవర్తసె = చక్రముపలెతిరుగుచున్నావు.

అరణ్యానీ - (౨౯)

> అరణ్యాన్యరణ్యస్యపత్నీ - అరణ్యమపార్ణం గ్రామాదరమణం భవతీతి వా. తస్యా ఏషా భవతి.
>
> "అరణ్యాన్యరణ్యాన్యసౌ యా ప్రేవ నశ్యసి. కథా గ్రామం న పృచ్ఛసి న త్వాభీరివ విందతీ" (ఋ. ౧౦-౧౪౬-౧)
>
> అరణ్యానీత్యేనామామన్త్రయతే యా సావరణ్యాని వనాని పరాచీవ నశ్యసి కథం గ్రామం న పృచ్ఛసి న త్వా భీర్వి న్దతీవేతీవః పరిభయార్థే వా.

అరణ్యానీ పునరరణ్యస్య పత్నీ. పాలయిత్రీ దేవతా. అరణ్యం కస్మాత్? తద్ధి గ్రామాత్ అపార్ణమ్ - అపగతం భవతి అరమణం భవతీతి. తస్యా ఏషా - "అరణ్యాన్యరణ్యాన్యసౌ - భీరివ విందతి" ఐరమ్మదస్య దేవమునేరార్షమ్. అరణ్యే సముపజాత దిదృక్షః మంత్రదృక్ భీతః సన్ అరణ్యదేవతాం స్తౌతి. హే అరణ్యాని! కథం త్వమ్ అరణ్యాని - వనాని ప్రేవ - పరాఙ్ముఖీవ అనావర్తమానా నశ్యసి? కథా - కథం గ్రామం న పృచ్ఛసి? న త్వా భీరివ విందతి - త్వమీషదపి న బిభేషీత్యర్థః.

అర్థము :- అరణ్యాని = అరణ్య పత్ని, అరణ్యనిరుక్తి - అపార్ణం గ్రామాత్ గ్రామాత్ అపగతః - దూరముపెళ్లినది. అరమణం భవతీతి వా - లేక - అరణ్యము సుఖదముకాదు - సుఖమునియ్యదు.

మంత్రార్థము :- అరణ్యమున తిరుగుచు మంత్రదృక్ = అరణ్యమున కధిష్ఠాత్రి దేవతతోననుచున్నాడు - ఓ అరణ్యాని! ఓ అరణ్యపత్ని! నీవు వనములవైపు ప్రేవ=పరాచీనివ-పరాఙ్ముఖి, అనావర్తమానా నశ్యసి = ప్రణశ్యసి = తిరిగివచ్చుమాటయైనచెప్పక వెళ్లుచున్నావు - ఎందుకు గ్రామమునడుగవు తిరిగివచ్చుటకు అనుమతిగోరవు? నీకు భయము కలుగుటలేదా!

89)

భాష్యార్థము :— అరణ్యాని ఇతి ఏనామ్ ఆమంత్రయతే=అరణ్యాని! అని సంబోధించి అభిముఖముచేసికొనుచున్నాడు యా లేక అసా = ఈ యరణ్యాని వనములు, పరాచీ ఇవ=పరాఙ్ముఖములైనవానివలె తిరోహితము లగుచున్నవి. అట్టినీవు, కథం గ్రామం న పృచ్ఛసి = గ్రామమునెందుల కడుగవు? గ్రామమునకు వచ్చుటకు అజ్ఞయెందులకు తీసికొనవు? న త్వాభీఃవిందతి? నీకు భీతికలుగుటలేదా? ఇవః పరిభయార్థే వా=ఇట ఇవ పదము పరిభయార్థమున-లేక కొంచెముభీతి అనుఅర్థమున ప్రయోగము కొంచెమైన నీకు భయముకలుగుటలేదా? ఋషిఅనుచున్నాడు - 'ఓ అరణ్యపత్ని! నేను దిక్కు తెలియక ఈయరణ్యమున ఇటునటుతిరుగుచు ననేకకష్టముల ననుభవించుచున్నాను. కాని ఆశ్చర్యమేమన నీవుమాత్రము అరణ్యమువైపునకే పరుగులిడుచున్నావు. కొంచెమైన నీవు భయపడ కున్నావు నీవు నీపతిదేశ్వరునుండి గ్రామము వైపువెళ్లుటకు అజ్ఞనెందుకు తీసికొనవు? మహదరణ్యమరణ్యానీ హిమారణ్యయోర్మహత్వే సూత్రమువలన మహారణ్యార్థమున 'ఙీష్' 'ఆనుక్' ప్రత్యయములకు ఆగమములైనది. యాస్కాచార్యుడు దీనినంగీకరింపక అరణ్యపత్ని అర్థమున 'ఙీష్' 'ఆనుక్' ప్రత్యయముల యాగమము నంగీకరించుచున్నాడు. కావున పాణినిమత మున అరణ్యానికి అర్థము గొప్పఅరణ్యము. యాస్కమునిమతమున అరణ్యాని అర్థము - అరణ్య - పత్ని.

శ్రద్ధా - (౨౫)

శ్రద్ధా శ్రద్ధానాత్. శ్రత్ సత్యం ధీయతే అస్యాం సా శ్రద్ధా. తస్యా ఏషా భవతి.

శ్రత్ = సత్యము అది దేనియందుండునో యది శ్రద్ధాయనబడును తద్విషయకఋక్కు.

"శ్రద్ధయా అగ్నిః సమిధ్యతే శ్రద్ధయా హూయతే హవిః. శ్రద్ధాం భగస్య మూర్ధని వచసా వేదయామసి". (ఋ. ౧౦-౧౫౧-౧)

శ్రద్ధయా అగ్నిః సాధు సమిధ్యతే శ్రద్ధయా హవిః సాధు హూయతే శ్రద్ధాం భగస్య భాగధేయస్య మూర్ధని ప్రధా నాంగే వచసేనావేదయామః.

శ్రత్ ఇతి సత్యనామ. తత్ అస్యాం ధీయతే ఇతి శ్రద్ధా. తస్యా ఏషా - శ్రద్ధయా - "అగ్నిః ... వేదయామసి" శ్రద్ధాయాః కామాయన్యాః ఆర్షమ్. శ్రద్ధయా అగ్నిః సమిధ్యతే శ్రద్ధయా ఏవ చ హవిః హూయతే. భగస్య - భాగధేయస్య ధర్మస్య మూర్ధని శ్రద్ధా ఏవ వర్తతే అర్థాత్ శ్రద్ధైవ ప్రధానమంగమితి. వచసా ఏవ "అశ్రద్ధామనృతే దధాత్ శ్రద్ధాం సత్యే ప్రజాపతిః" ఇత్యనేన వచనేన వేదయామసి ఆఘోషయామః. నాశ్రద్ధ ధానస్య ధర్మ ఇతి.

అనగా ధర్మార్థకామమోక్షములవిషయమున ఎట్టి విపర్యములేక, 'ఈవిషయమిట్టిదే' అనుబుద్ధి శ్రద్ధయనబడును. 'అశ్రద్ధామనృతేఽదధాత్ శ్రద్ధాం సత్యే ప్రజాపతిః = పరమేశ్వరుడు అసత్యమున అశ్రద్ధను, సత్యమున శ్రద్ధను స్థాపించెను.

మంత్రార్థము :- శ్రద్ధయా అగ్నిః = శ్రద్ధతో అగ్ని, సమిధ్యతే - ప్రదీప్తముచేయబడును, శ్రద్ధయా హవిః హూయతే = శ్రద్ధతోనే హవిస్సు ఆహుతిచేయబడును, అతః = అందువలన, శ్రద్ధామ్ = శ్రద్ధను, భగస్య = భాగధేయము సంపద - ధర్మముయొక్క, మూర్ధని = శిరస్సుమీద, వచసా = తనవాక్కుతో, వేదయామసి = ఎల్లరకు ఎలుగెత్తిచెప్పుదుము. మేము సకలసాంసారికసంపదలకంటె వేదనిధియైనశ్రద్ధకు సర్వాధిక మహత్త్వము నంగీకరింతుము. యః శ్రద్ధధానో జాయతే తస్యేష్టం న క్షీయతే - "శ్రద్ధయేష్టం చ పూర్తం చ" ఇత్యాది శ్రుతిస్మృతిదర్శనము వలన శ్రద్ధతో సత్యమైనఆస్తిక్యబుద్ధితో చేయబడిన యజ్ఞాదిక్రియలు ఫలప్రదములై యైహికాముష్మికకల్యాణమునొసంగును. శ్రద్ధయే సత్యము.

పృథివీ - (౨౬)

పృథివీ వ్యాఖ్యాతా. తస్యా ఏషా భవతి.
పృథివివ్యాఖ్యానింపబడినది - ఇది పృథివీవిషయకఋక్.

"స్యోనా పృథివి భవానృక్షరా నివేశనీ. యచ్ఛానః శర్మ సప్రథః" (ఋ. ౧-౨౨-౧౫)

సుఖానః పృథివి భవానృక్షరా నివేశనీ. ఋక్షరః కంటకః ఋచ్ఛతేః. కంటకః కంతపో వా కృన్తతేర్వా కంటతేర్వా

స్యాత్ గతికర్మణః. ఉద్గతతమో భవతి. యచ్ఛ నః శర్మ యచ్ఛన్తు శరణం సర్వతః పృథు.

వ్యాఖ్యాతా. తస్యా ఏషా "స్యోనా పృథివి ... శర్మ సప్రథా" పేథాతి భేరార్థమ్. హే పృథివి! త్వమస్మాకం స్యోనా-సుఖరూపా భవ. అనృక్షరా-కంటకరహితా నివేశనీ - నివాసార్హాసతి. త్వమస్మభ్యం సప్రథాః - సర్వతః పృథు విస్తీర్ణ మిత్యర్థః శర్మ - సుఖం యచ్ఛ - దేహి. ఋక్షరః=కంటకః ఋచ్ఛతేః సాధ్యః. కంటకః పునః కన్తపో భవతి. కమహం తాపయాని ఇత్యుద్గత స్తిష్ఠతి. కంటతేర్వా సాధ్యః యస్మాత్స తరోరుద్గతో భవతి.

అర్థము :- పృథివీవ్యాఖ్య పూర్వమే చేయబడినది. (౧-౧౪-౫) అథవా దర్శనేన పృథివీ ఇత్యాది.

మంత్రార్థము :- హే పృథివి! స్యోనాభవ = మాకొఱకు నీవు సుఖావహమగుదువుగాక! అనృక్షరా = నిష్కంటక = కంటకరహితవు, నివేశనీ = ఉత్తమనివాసయోగ్యవుకమ్ము, సప్రథాః - సువిస్తీర్ణాభవ = నీపైనివసించుమాకు విశాలస్థానము సుఖమునిచ్చుదానవు కమ్ము.

భాష్యార్థము :- ఋక్షరః కంటకః = ముల్లు, గత్యర్థక 'ఋచ్ఛ'ధాతువుతో సిద్ధమగును. కంటకము వృక్షములపై పైకిదేలియుండును (కంటకము - కంతపోవా) ఛేదనార్థక 'కృతీ'ధాతువుతోను సిద్ధమగును. కంటకము గ్రుచ్చుకొనును - గత్యర్థక'కట'ధాతువువలనను సిద్ధమగును. ఉద్గతమోభవతి = మిక్కిలిపైకి నిలబడియుండును. యచ్ఛ నః శర్మ = మాకుసుఖమునిమ్ము. యచ్ఛన్తు శరణమ్ = ఆశ్రయమునిత్తువుగాక! సర్వతఃపృథుః = అన్నివైపులవిస్తీర్ణము.

అప్వా (౨౭)

అప్వా వ్యాఖ్యాతా. తస్యా ఏషాభవతి.

"అమీషాం చిత్తం ప్రతిలోభయన్తీ గృహాణాంగాన్యప్వే పరేహి, అభిప్రేహి నిర్దహ హృత్సు శోకై రంధేనామిత్రాస్తమసా సచంతామ్" (ఋ. ౧౦-౧౦౩-౧౨)

అమీషాం చిత్తాని ప్రజ్ఞానాని ప్రతిలోభయమానా గృహాణాం
గాన్యప్వే పరేహి అభిప్రేహి నిర్దహైషాం హృదయాని
శోకై రంధేనామిత్రా స్తమసా సంసేవ్యన్తామ్.

పూర్వం వ్యాఖ్యాతా. తస్యా ఏషా - "అమీషాం ... సచంతామ్"
అమీషామ్ - అస్మదరీణాం చిత్తం - మనః ప్రతిలోభయన్తీ హే అప్వే!
ఏషామంగాని గృహాణ - సర్వగాత్రాణి అవిశ. యేనైతే సంమూఢాః స్యుః.
అపిచైతాన్ పరేహి - పరాగచ్ఛ. అథచైతాన్ క్షిప్రమ్ అభిప్రేహి ఏషాం
హృత్ - హృదయం సుశోకైః నిర్దహ. ఇమే చాస్మాకమ్ అమిత్రాః-శత్రవః
అంధేన తమసా సచంతామ్ - సంసేవ్యన్తామ్.

అప్వా పదవ్యాఖ్య చేయబడినది (ఋ. ౬-౧౨-౪)

మంత్రార్థము :- అప్వే ! = హే భీతి ! నీవు అమీషామ్ = ఈశత్రు
వుల, చిత్తం = మనస్సును. ప్రతిలోభయన్తీ = లోభింపజేయుచు, వీరి,
అంగాని = ప్రత్యంగమును, గృహాణ = గ్రహింపుము, వానిలో నీవు కలిసి
పొమ్ము - పరేహి - పరాగచ్ఛ = చాలదూరము వీరిని వెంటాడుము.
అభిప్రేహి = వారియెదుటనుండుము, శోకైః = దుఃఖములతో వీరిహృద
యములను, హృత్సు నిర్దహ = దగ్ధముచేయుము, అమిత్రాః = వీరు
శత్రువులు, అంధేనతమసా = కటికచీకటితో, సచన్తామ్ = వీరు సంసేవితు
లగుదురుగాక ! వీరు, కింకర్తవ్యవిమూఢులై నావకవర్తులగుదురుగాక !

అగ్నాయీ - (౩౪)

అగ్నాయ్యగ్నేః పత్నీ. తస్యా ఏషా భవతి – "ఇహేంద్రాణీ
ముపహ్వయే వరుణానీం స్వస్తయే. అగ్నాయీం సోమ
పీతయే" (ఋ. ౧-౨౨-౧౨) ఇతి సా నిగదవ్యాఖ్యాతా.

అగ్నేః పత్నీ. తస్యైషా - "ఇహేంద్రాణీమ్ ... సోమపీతయే"
ఇహ అస్మిన్కర్మణి అహమ్ ఇంద్రాణీం వరుణానీం చ స్వస్తయే - కల్యా
ణాయ ఉపహ్వయే - ఆహ్వయామి. కించ సోమపీతయే - సోమస్యపానాయ
అగ్నాయీమ్ - అగ్నేః పత్నీమ్ ఉపహ్వయే.

మంత్రార్థము :— ఇహ = ఈయజ్ఞకర్మమున, సోమపీతయే=సోమ పానార్థము. స్వస్తయే = ఆత్మకల్యాణముకొఱకును, ఇంద్రాణీమ్ = ఇంద్రపత్నిని, వరుణానీమ్ = వరుణపత్నిని, అగ్నాయీమ్ = అగ్ని పత్నిని, ఉపహ్వయే = పిలుచుచున్నాను. ఇట - ఇంద్రాణీం-సూర్యుడు-లేక - వాయువు అనువానిశక్తిని, వరుణానీమ్ వరుణుని - జలముయొక్క కాంతి - మాధుర్యము, మున్నగుగుణములశక్తిని, అగ్నాయీమ్ = అగ్ని యొక్క తేజస్విత దాహకత మున్నగుశక్తులను, ఉపహ్వయే = నాయందు ధరించుచున్నాను అని కొందఱాచార్యులర్థముచెప్పుదురు.

తృతీయ పాదము సమాప్తము

## చతుర్థ పాదము

ముసలమ్ - (౨౯)

**అథాతోఽష్టౌ ద్వంద్వాని ఉలూఖలముసలే.**

అథ = అనంతరము, అష్టౌ - ద్వంద్వాని = ఎనిమిదిజంటలవ్యాఖ్య చేయబడును. అందు ఉలూఖలమ్ వ్యాఖ్యాతమ్ ౯-౨౦-౧ ఉలూఖలము వ్యాఖ్యానింపబడినది.

ముసలమ్ - ముహుఃసరమ్ - రోకలివ్యుత్పత్తి - ముహుః = మాటి మాటికి, సరమ్ = పైకిక్రిందికి కదలుచుండును. అందువలన ముసలమ్-ముహుః సరమ్ అందురు. ధాన్యమును దంచునపుడు ముసలమ్ = రోకలి పైకిక్రిందికి చలించును - కదలును-కావున ముసలమనబడును. సరము - సలము ఒక్కటే. రలయో రభేదః ర, ల - ములలో భేదములేదు.

**తయో రేషా భవతి.**

రోలు, రోకలికి సంబంధించినఋక్కు.

**"అయజీ వాజసాతమా తాహ్యుచ్చా విజర్భృతః, హరీ ఇవాం ధాంసి బప్సతా" (ఋ. ౧-౨౮-౭)**

ఆయష్టవ్యే అన్నానాం సంభక్తతమే, తే హ్యుచ్చైర్వి
గ్రియేతే హరీ ఇవాన్నాని భుంజానే,

ఉలూఖలం పూర్వం వ్యాఖ్యాతమ్. ముసలం ముహుః సరం భవతి. యతస్తత్ ముహుః ముహుః వ్రీహ్యాదిషు సరతి. తయోరేషా - "ఆయజీ ... వప్సతా" ఆయజీ - మర్యాదయా యష్టవ్యౌ వాజసాతమా - అన్నానామ్ సంభక్తతమే తే ఉచ్చైర్విజర్భృతః - విగ్రియేతే. తే ఉలూఖలముసలే అస్మాకం గేహే నిత్యం హరీ ఇవ అశ్వౌ ఇవ అంధాంసి-అన్నాని బప్సతా - భుంజానే.

మంత్రార్థము :- ఆయజీ=గృహస్థులకెల్లరకొఱకు, పూజ్యము-లేక, ప్రాప్తవ్యములగు వాజసాతమా=అన్నములను సంస్కరించియిచ్చు రోలు రోకలి అంధాంసి=గడ్డిని, అన్నమును,బప్సతా=తినుచు,హరీ ఇవ=ఇంద్రుని గుఱ్ఱములవలె, తా = ఆరోలురోకలి అనువానిని, ఉచ్చా = ఎక్కువగా, విజర్భృతః = ఉపయోగింతురు.

భావార్థము :- ఆయజీ ఆయష్టవ్యౌ=పూజ్యములు ప్రాప్తవ్యములు, వాజసాతమా అన్నానామ్ సంభక్తతమే = అన్నములను సంస్కరించి యిచ్చునట్టి, తే = ఆ రోలురోకలి రెండును, ఉచ్చైః=ఎక్కువగా విగ్రి - యేతే = ఉపయోగింపబడును, హరీఇవ = ఇంద్రాశ్వములవలె, అన్నాని= అన్నములను, బప్సతా = భుంజాతే = తినుచు, విజర్భృతః విగ్రియేతే,

హవిర్ధానే - (30)

హవిర్ధానె హవిషాం నిధానే = హవిస్సులను మోయునట్టి బండ్లు రెండు.

తయోరేషా భవతి.

వానియొక్క ఋక్కు.

"ఆ వాముపస్థమద్రుహా దేవాః సీదన్తు యజ్ఞియాః ఇహాద్య సోమపీతయే" (ఋ. ౨-౪౧-౨౧)

**ఆసీదన్తు వాముపస్థముపస్థానామద్రోగ్ధవ్యే ఇతి వా యజ్ఞియా దేవా యజ్ఞసంపాదిన ఇహోద్య సోమపానాయ.**

హవిషాం నిధానే. తయోః ఏషా - "ఆవాముపస్థమ్...సోమపీతయే" గృత్సమదస్యార్షమ్. హే హవిర్ధానే! అద్రుహా-అద్రోగ్ధవ్యౌ యువాముచ్యేథే. యత్ర చ యువాముపగమ్య స్థితే తత్ వాముపస్థమ్ - ఉపస్థానమ్ యజ్ఞియాః - యజ్ఞసంపాదినః దేవాః ఇహ కర్మణి అద్యోపగమ్య సీదన్తు - నిషీదన్తు సోమపీతయే - సోమపానాయ.

మంత్రార్థము :- హవిర్ధానె! = ఎడ్లబండ్లా! ఆసీదన్తు = వచ్చి కూర్చుందురుగాక! అద్య = నేడు ఇహ = ఈయజ్ఞకర్మయందు, సోమపీతయే = సోమపానార్థము, అద్రుహా = ఎన్నడు ద్రోహముచేయని, యజ్ఞియాః = యజ్ఞమును నిర్వహించు, దేవాః = విద్వాంసులు, వామ్ = మీరెంటియొక్క, ఉపస్థమ్ = దగ్గఱ, ఆసీదన్తు = ఉపస్థితులగుదురుగాక!

ద్యావాపృథివీ - (౩౧)

**ద్యావాపృథివ్యౌ వ్యాఖ్యాతే ద్యౌశ్చ పృథివీ చ ఇత్యేతే పదే వ్యాఖ్యాతే.**

ద్యు, పృథివీశబ్దములు రెండును వ్యాఖ్యానింపబడినవే.

**తయోరేషా భవతి.**

వానివిషయమున ఋక్కు.

**"ద్యావా నః పృథివీ ఇమం సిధ్రమద్యదివిస్పృశమ్. యజ్ఞం దేవేషు యచ్ఛతామ్" (ఋ. ౨-౪౧-౨౦)**

**ద్యావ్యాపృథివ్యౌ న ఇమం సాధనమద్య దివిస్పృశం యజ్ఞం దేవేషు నియచ్ఛతామ్.**

వ్యాఖ్యాతే తయోరేషా - "ద్యావా నః ... యచ్ఛతామ్" హే ద్యావాపృథివీ నః - అస్మాకం సిధ్రం - సాధనం యజ్ఞం అద్య - ఏతస్మిన్నహని దివిస్పృశం - ద్యాం స్పృశతీతి తథోక్తం దేవేషు యచ్ఛతామ్ - నియచ్ఛతామ్.

ద్యౌః - పృథివీశబ్దముల వ్యాఖ్యానము పూర్వమే చేయబడినది.

మంత్రార్థము :— ద్యుపృథివీలోకములు రెండును అద్య = నేడు, నః = మాయొక్క, సిద్ధమ్ యజ్ఞమ్=సర్వఫలములనొసంగు యజ్ఞమును, దివిస్పృశం = ద్యులోకమును స్పృశించుయజ్ఞమును, దేవేషు - యచ్ఛతామ్ = ఇత్తురు. దేవతలసమీపమున చేర్చుడు.

భాష్యార్థము :- ద్యావాపృథివ్యౌ = ద్యుపృథివీలోకములు, నః = మా, ఇమంసాధనమ్ = ఈసమస్తఫలములసిద్ధముచేయు, దేవాః=విద్వాంసులు, అద్య=నేడు, దివిస్పృశమ్ యజ్ఞమ్=ద్యులోకమును స్పృశించుయజ్ఞమును, యచ్ఛతామ్ - నియచ్ఛతామ్=దేవేషు=దేవతలనుచేర్చుదురుగాక !

విపాట్ఛుతుద్రీ - (౩౭)

విపాట్ ఛుతుద్ర్యౌ వ్యాఖ్యాతే.

విపాట్, శుతుద్రీఅనువాని వ్యాఖ్యానముపూర్వమే చేయబడినది.

రెండింటికి సంబంధించిన ఋక్కు.

తయోరేషా భవతి. ప్ర పర్వతానాముశతీ ఉపస్థాదశ్వే ఇవ విషితే హాసమానే. గావేవ శుభ్రే మాతరా రిహాణే విపాట్ ఛుతుద్రీ పయసా జవేతే. (ఋ. ౩-౩౩-౧)

పర్వతానాముపస్థాత్ ఉపస్థానాత్ ఉశత్యౌ కామయమానే అశ్వే ఇవ విముక్తే ఇతి వా. విషణ్ణే ఇతి వా, హాసమానే హాసతిః స్పర్ధాయాం హర్షమాణే వా, గావావివ శుభ్రే శోభనే మాతరా సంరిహాణే విపాట్ ఛుతుద్ర్యౌ పయసా ప్రజవేతే.

పూర్వం వ్యాఖ్యాతే. తయోరేషా - "ప్ర - పర్వతానామ్ ... పయసా జవేతే" విశ్వామిత్రః కథయతి - పర్వతానామ్ ఉపస్థాత్ - ఉపస్థానాత్ నిర్గరాత్ మేఘానాం వా ఉశతి - కామయమానే, విషితే - మందురాతః ఉన్ముక్తే అశ్వే ఇవ హసమానే - స్పర్ధమానె, శుభ్రే - శోభనే మాతరా -

మాతరౌ సంరిహాణే-వత్సం ప్రలేఢుమిచ్ఛన్త్యౌ విపాట్ ఛుతుద్రీ చ పయసా-జలేన ప్రజవేతే ప్రవహతః.

మంత్రార్థము :- పర్వతానామ్ = పర్వతములయొక్క, ఉపస్థాత్= సమీపమునుండి, ఉశతీ = సముద్రమునుచేరగోరుచు, విసితే = అశ్వశాలనుండి విడిపింపబడిన అడుగుఱ్ఱములవలె, (అశ్వే) హాసమానే=పరస్పరము స్పర్ధించుచు, శుభ్రే = కల్యాణకరములగు, సుందరమాతరౌ = తల్లులు దూడలను, రిహాణే = నాకగోరుచున్నవైన గావాఇవ గోవులవలె - విపాట్ సుతుద్రీ నదులు, ప్రజవేతే = మిక్కిలివేగముగా ప్రవహించుచున్నవి అవి మాకు దాటదగినవి యగుగాక!

భాష్యార్థము :- పర్వతానామ్ ఉపస్థాత్=ఉపస్థానాద్=పర్వతముల సమీపమునుండి ఉశత్యౌ = కామయమానే = కోరుచున్నవై, అశ్వే ఇవ విముక్తే = అశ్వశాలనుండి విడుపబడిన రెండు ఆడుగుఱ్ఱములవలె, విషణ్ణే ఇతి వా = లేక రథమునపోదింపబడి ప్రసన్నములైన గుఱ్ఱములభాంత, ప్రసన్నగోవులవలె, శుభ్రే శోభనే = సుందరములైన, మాతరౌ గావౌ = తల్లులైనగోవులు, రిహాణా - సంరిహాణే = దూడలను నాకగోరుచు పరువిడు చున్నట్లు, విపాట్సుతుద్రీనదులు రెండును, పయసా = జలముతోనిండి మిక్కిలివేగముతో ప్రజవేతే=ప్రవహించుచున్నవి. హాసతః=స్పర్ధార్థకహాస ధాతువు.

ఆర్త్నీ - (33)

> **ఆర్త్నీ ఆర్తన్యౌ వారణ్యౌ వారిషణ్యౌ వా. తయోరేషా భవతి.**

ఆ ధనుష్కోటుల విషయకమంత్రము.

> **"తే ఆచరన్తీ సమనేవ యోషా మాతేవ పుత్రం బిభృతా ముపస్థే. అప శత్రూన్ విధ్యతాం సంవిదానే ఆర్త్నీ ఇమే విష్ఫురన్తీ అమిత్రాన్" (ఋ. ౬-౭౫-౪)**

> **తే ఆచరన్త్యౌ సమనసావివ యోషే మాతేవ పుత్రం బిభృతా ముపస్థ ఉపస్థానేఽపవిధ్యతాం శత్రూన్ సంవిదానే ఆర్త్న్యౌ విమే విఘ్నత్యావమిత్రాన్.**

ఆర్త్నీ - ధనుష్ప్రాన్తే. యస్మాత్ తే అర్తన్యౌ. గత్యర్థాత్ ఋతేః. తే హి ఇషూన్ గమయతః. అరణ్యౌ వా అరిషణ్యౌ వా హన్త్ర్యౌ ఇత్యర్థః. తయోరేషా "తే ఆచరన్తీ ... అమిత్రాన్" సమనా - సమానమనసా యోషా - యోషితే ఇవ, హే ఆర్త్న్యౌ యువామ్ మాతేవ పుత్రమ్ ఉపస్థే రక్షణార్థమ్ అక్రష్టారమ్ బిభృతా - బిభృతామ్. సంవిదానే - సంవాదమివ కుర్వాణే విష్ఫురన్తీ - విష్ఫురన్త్యౌ యువామ్ శత్రూనపవిధ్యతామ్.

ఆర్త్నీ = ధనుష్కోటులు - వింటికొనలు ఆర్తన్యౌవా = గత్యర్థక ఋతధాతువుచే సిద్ధమగును. వింటికొనలు రెండు పరస్పరము కలియుచు విడిపోవుచునుండును. ఇట్టి గతికలవి కావున 'ఋత'ధాతువుతో నేర్పడు ఆర్త్నీ యనబడినవి. అథవా అరణ్యౌ = అరణార్థౌ గమనార్థౌ = గమన మొనర్చు కారణమున ఋతధాతువుచే నేర్పడును. బాణములకివి గతి కలిగించును. అథవా అరిషణ్యౌ = లేక శత్రువులను హింసించునవి. ఆఙ్ పూర్వక'రిష'హింసాయామ్ ధాతువుచే అరిషణ్యౌపదమేర్పడును.

మంత్రార్థము :– తే ఆర్త్నీ = ఆ ధనుష్కోటులు, సమనా యోషా ఇవ = సమానమనస్సుగల ఇరువురుపత్నులవలె (సమానమనస్సుగల ఇరువురుపత్నులు తమపతులకనుకూలురగునట్లు) ఆచరన్తీ = ధనుర్ధారికి అనుకూలముగ నాచరించుచు, మాతాపుత్రమివ=తల్లి తనపుత్రుని ఒడిలో నుంచుకొనునట్లు, ఉపస్థే బిభృతామ్ = బాణమును ధరించునుగాక !, శత్రూన్ అపవిధ్యతామ్ = శత్రువులను ఛేదించునుగాక ! సంవిదానే ఇమే = ఈరెండు ధనుష్కోటులు ఒకేమతముగలవియై అమిత్రాన్ = శత్రువులను, విష్ఫురన్తీ = నాశమొనర్చును.

భావార్థము :– తే = ఆ వింటికొనలు, ఆచరన్త్యౌ = ఆచరించుచు, సమనసాఇవయోషే = సమానమనస్సులుగల యిరువురుస్త్రీలవలె, మాతా ఇవ పుత్రం = తల్లి తనకుమారుని ఒడిలోనాప్పుండబెట్టుకొనునట్లు, బిభృతాం = బాణములను ధరించును, ఉపస్థె ఉపస్థానే = తమదగ్గర, అపవిధ్యతామ్ శత్రూన్ = శత్రువులను ఛేదించునుగాక ! నాశమొనర్చు గాక ! సంవిదానే ఆర్త్న్యౌ ఇమే = వింటికొనలు రెండునొకమతిగలవియై విష్ఫురన్త్యౌ అమిత్రాన్ = శత్రువులను నాశముచేయుగాక !, యోషే = ఇరువురు స్త్రీలు.

శునాసీరౌ - (౩౮)

**శునో వాయుః శు ఏత్యన్తరిక్షే, సీర ఆదిత్యః సరణాత్. తయోరేషా భవతి.**

శునో - వాయువు - అంతరిక్షే ఏతి - అంతరిక్షమున నడుచును. సీరః సూర్యుడు - సరణాత్ - సరణమువలన - ఏతయోరేషా - వాయుసూర్యుల విషయక ఋక్కు.

**"శునాసీరావిమాం వాచం జుషేథాం యద్దివి చక్రథుః పయః. తేనేమాముపసించతమ్" (ఋ. ౪-౫౭-౫) ఇతి సా నిగదవ్యాఖ్యాతా.**

శునః వాయుః. యస్మాదంతరిక్షే శు శీఘ్రం ఏతి, సీర ఆదిత్యః సరణాత్. తయోరేషా - "శునాసీరా...ఉపసించతాం" వామదేవస్యార్షమ్. హే శునాసీరౌ! యువాం ఇమాం స్తుతిరూపాం వాచం జుషేథాం-సేవేథాం - యద్ యువాం - దివి - ద్యులోకే పయః చక్రథుః తేనేమాం పృథివీం ఉపసించతమ్. స్పష్టమ్.

అర్థము :— శునాసీరౌ = వాయువు, ఆదిత్యుడు. శునో వాయుః = శునశబ్దము వాయువాచకము, వాయువు శు = శీఘ్రముగా, దివి = అంతరిక్షమున, ఏతి = నడచును - వీచును. సీరః = ఆదిత్యుడు - సూర్యవాచకము - ఏలయన సూర్యుడు, సరణాత్ = గతికలది - 'సృ' గత్యర్థక 'సృ' ధాతువుతో సీరశబ్దము సిద్ధమగును, శుపూర్వకగత్యర్థక 'సు' ధాతువుతే శునః శబ్దమగును.

మంత్రార్థము :— శునాసీరౌ! వాయ్వాదిత్యులార = మీరిద్దరు, ఇమాంవాచం=మా యీస్తుతివాక్కును, జుషేథాం - సేవధ్వం=సేవింతురు గాక! విందురుగాక! దివి = అంతరిక్షమున, యత్పయః=ఏజలముకలదో ఆజలమును మీరిద్దరు (చక్రథుః) నిర్మింతురు. తేన = ఆజలముతో, ఇమాం పృథ్వీం = ఈభూమిని, ఉపసించతం = తడుపుదురుగాక! ఏషా ఋక్ నిగదవ్యాఖ్యాతాఋక్కు తనశబ్దములతోనే వ్యాఖ్యానించుచున్నది. మంత్రము సుస్పష్టార్థముకలది.

దేవీజోష్ట్రీ - (౩౫)

దేవీజోష్ట్రీ - దేవ్యౌ జోషయిత్ర్యౌ ద్యావాపృథివ్యావితి వా హోరాత్రే ఇతి వా. శస్యం చ సమా చేతి కార్త్థక్యః.

తయోరేష సంప్రైషో భవతి.

ఆ రెండెంటి విషయమున నిది వాక్యమంత్రము.

"దేవీ జోష్ట్రీ వసుధితీ యయోరన్యాఘాద్వేషాంసి యూయవ దన్యా. వక్షద్వసు వార్యాణి యజమానాయ వసువనే వసు ధేయస్య వీతాం యజ" (మై. సం. ४-౧౩-౮)

దేవీ జోష్ట్రీ దేవ్యౌ జోషయిత్ర్యౌ వసుధితీ వసుధాన్యౌ యయోరన్యాఘాని ద్వేషాంస్యవయావయత్యావహత్యన్యా వసూని వననీయాని యజమానాయ వసువననాయ చ వీతాం పిబేతాం కామయేతాం వా, యజేతి సంప్రైషః.

దేవీ - దేవ్యౌ జోష్ట్రీ - జోషయిత్ర్యౌ. ద్యావాపృథివ్యౌ అహోరాత్రే వా. కార్త్థక్యః పునః శస్యం సమా చేతి ప్రాహతు. తయోరేషా - "దేవీ జోష్ట్రీ ... వీతాం యజ" - "దేవీ - దేవ్యౌ జోష్ట్రీ - జోషయిత్ర్యౌ, వసుధితీ - వసూనాం నిధానభూతే, సా ఇత్యర్థః యయో ర్ద్వయోః అన్యా ఏకా అఘా - అఘాని ద్వేషాంసి యూయవత్ - అపమిశ్రయతి నాశయతీత్యర్థః. అన్యా చ పునః వార్యాణి వరణీయాని వసువనే - వసుసంభజనాయ వసుధేయస్య - వసుధానాయ వసు-ధనం ఆవక్షత్-ఆవహతి అతః తే దేవ్యౌ అస్య వృషదాజ్యస్య స్వమంశం వీతాం - పిబేతామ్. మైత్రావరుణో బ్రవీతి హే హోతః త్వం యజ. ఇతి సంప్రైషః.

అర్థము :- దేవీజోష్ట్రీ = మనుష్యులను తృప్తిపఱచునది, సుఖము, నొసంగునదియు నగు ఇరువురుదేవతలు వారెవరన :- ద్యావాపృథివ్యౌ ఇతి = ద్యులోకము పృథివీలోకములు, అహోరాత్రే ఇతి వా = లేక అహోరాత్రములు, కాని కార్త్థక్యఆచార్యుడు మంత్రమున = శస్యం చ సమా చ వ్రీహి ఆది అన్నము సంవత్సరము అనుచున్నాడు.

మంత్రార్థము :— వసుధితీ = ధనములకు నిధానమువంటివగు, దేవీజోష్ట్రీ = మనుష్యులను తృప్తిపఱచు ద్యులోకపృథివీలోకములు లేక దినరాత్రులు, లేక, శస్య - సంవత్సరములు - అనునియిరువురు దేవతలు, యయోః = ఆరెండు దేవతలలో, అన్యా = ఒకదేవత - ద్యులోకము (దీప్తసూర్యుడు), అఘా=పాపములను రోగము మున్నగు దుఃఖములను, ద్వేషాంసి = మనుష్యులకు శత్రువులవంటి ద్వేషాదులను, యావయత్ = దూరమొనర్చును, అన్యా = రెండవదేవత భూమి, రాత్రి, సంవత్సరము, యజమానాయ = యజమానునకు, వార్యాణి = వరణీయాని = వసు ధనములను, ఆవక్షత్ = ఇచ్చును ఏలయిచ్చునన - వసువనే = వసు ధనస్య = ధనములననుభవించుటకు ధనములను సంగ్రహించుటకును, ఏతామ్ = ఈదేవతలు ఈయజ్ఞమునకుసంబంధించిన తమయంశమును గ్రహించునుగాక ! హే హోతః ! త్వమ్ యజ = నీవు యజ్ఞమొనర్పుము.

భాష్యార్థము :— దేవీ జోష్ట్రీ - దేవ్యౌ జోషయిత్ర్యౌ = మనుష్యులను తృప్తిపఱచు, సుఖమునొసంగు దేవతలు ఇరువురు, వసుధితీ వసుధాన్యౌ = ధనములకు నిధానమువంటివి, యయోః = ఆ యిరువురుదేవతలలో, అన్యా = ఏకా = ఒకటియైనదేవత, అఘాని = పాపములను - హానికారకశత్రువులను, అవయావయతి = దూరమొనర్చును - రెండవ దేవత, వసూని వననీయాని = వరణీయములగు ధనములను, యజమానాయ = యజమానునకు, వసువననాయ = ధనములననుభవించుటకొఱకు, వసుధానాయ = ధనముల సంగ్రహించుటకును, (ఆవహతి - ఇచ్చును) మాం పిబేతామ్ త్రాగుదురుగాక ! కామయేతామ్=వాంఛింతురుగాక ! యజ = హోమమొనర్పుము, సంప్రైషః - ఇది విధివచనము. దేవీ ఊర్జాహుతీ - (౩౮) (ఇతి షట్ త్రింశత్ పదాని)

> దేవీ ఊర్జాహుతీ దేవ్యా ఊర్జాహ్వాన్యౌ ద్యావాపృథివ్యావితి వాహోరాత్రే ఇతి వా, శస్యం చ సమా చేతి కాత్థక్యః, తయోరేష సంప్రైషో భవతి.

"దేవీ ఊర్జాహుతీ దేవ్యా ఇషమూర్జమన్యావక్షత్ సగ్ధిం సపీతిమన్యా నవేన పూర్వం దయమానాః స్యామ పురాణేన నవం తామూర్జమూర్జాహుతీ ఊర్జయమానే అధాతాం వసువనే వసుధేయస్య వీతాం యజ" (మై. సం. ౪-౧౩-౮)

దేవీ ఊర్జాహుతీ దేవ్యా ఊర్జాహ్వాన్యావన్నం చ రసం చావహత్యావహత్యన్యా సహజగ్ధిం చ సహపీతిం చాన్యా నవేన పూర్వం దయమానాః స్యామ పురాణేన నవం తామూర్జమూర్జాహుతీ ఊర్జయమానే అధాతాం వసువననాయ చ వసుధానాయ చ వీతాం పిబేతామ్ కామయేతాం వా. యజేతి సంప్రైషః యజేతి సంప్రైషః.

దేవీ - దేవ్యౌ ఊర్జాహుతీ - ఊర్జాహ్వాన్యౌ తే ద్వే ద్యావాపృథివీ అహోరాత్రే వా. సస్యం సమా చేతి కాత్థక్యః. తయోరేషా - "దేవీ ... వీతాం యజ" అనయో రేకస్యార్థమ్ ఊర్జమన్నం రసం చ సగ్ధిం సహ భోజనం సపీతిం సహపీతిం అవక్షత్ - ఆవహతి. యథా వయముభయముఖాః బంధుభిః సాకం అశ్నీమహి తథా కరోత్విత్యర్థః తథా చ సః ఏతావదన్నం భవతు యేన వయం పురాణేన నవం నవేన చ పురాణం దయమానాః ... రక్షమాణాః స్యామ దేవీ ఊర్జాహుతీ ఏవం లక్షణమూర్జం అధాతాం - దత్తామ్. వసువనే - వసువననాయ, వసుధేయస్య - వసుధానాయ చ వీతాం - పిబేతాం కామయేతాం వా అతః హే హోతః! త్వం యజేతి సంప్రైషః, అధ్యాయపరిసమాప్తిసూచకో ద్విరభ్యాసః.

అర్థము :— దేవీ ఊర్జాహుతీ = సుఖమునిచ్చునట్టి, అన్న-రసముల నాహ్వానించునట్టి రెండుదేవతలున్నవి - ఏవవి ? ద్యావాపృథివీలోకములు, లేక దినరాత్రులు కాత్థక్యునిమతమున సస్య - సంవత్సరములు.

మంత్రార్థము :- దేవీ ఊర్జాహుతీ = సుఖమునొసంగునదియు, అన్నరసముల నాహ్వానించునదియు, రెండుదేవతలు - అవి - యెవ్వియన- ద్యావాపృథివీలోకములు, దినరాత్రులు, సస్యసంవత్సరములును. వీనిలో నొకదేవత - ఇషం ఊర్జం అవక్షత్ = అన్నమును వ్రీహ్యాదులను ఉప

సేచక క్షీరాదిరసములను, అవక్షత్ = ఇచ్చును - ప్రాప్తింపజేయును, మఱియొకదేవత, సగ్ధిం = సమానభోజనమును, సపీతిం=సమానపానమును ఇచ్చును. నవేన పూర్వం దయమానాః స్యామ = నవీనసమానభోజనము మఱియు సమానపానముతో, పూర్వందయమానాఃస్యామ = పురాతనమగు అన్నమును,రసమును రక్షించువారలమగుదుముగాక !, పురాణేనచ నవీనం= పురాణముతో నవీనమును రక్షింతుముగాక !, ఊర్జాహుతీ = ద్యావాపృథివీ లోకములు రెండును, తాం = ఆ, ఊర్జం=అన్నరసమును, ఊర్జయమానే = బలిష్ఠమొనర్చుచు, అధాతాం = ధారణమొనర్చుగాక ! వసువనే వసు ధేయస్య = ధనోపభోగమునకును, ధనసంగ్రహముకొఱకును, వీతాం = ఈహవిస్సును త్రాగుదురుగాక ! లేక కామింతురుగాక ! హే హోతః ! యజ = నీవు యజ్ఞముచేయుము, అలసింపకుము - ఈదేవతలమూలమున మీకు అన్నరసాదులు లభించుచుండునుగాక ! మనగృహములందు క్రొత్త అన్నరసాదులు వచ్చువఱకు ప్రాతఅన్నరసాదులుండునుగాక ! మనము క్రొత్తఅన్నాదులను ప్రాత-అన్నాదులతో, ప్రాతవానిని క్రొత్తవానితో రక్షించు కొందుముగాక. ఇట్లు అన్నాదులకొఱత మనకు కలుగకుండుగాక !

భాష్యార్థము :— దేవీ ఊర్జాహుతీ దేవ్యౌ ఊర్జాహుత్యౌ = వ్రీహ్యాది అన్నములను, క్షీరాదిరసమును ఆహ్వానించు రెండుదేవతలున్నవి, అన్నం చ రసం చ ఆవహతి అన్యా=ఆరెంటిలో నొకదేవత అన్నమును రసమును తెచ్చును, సగ్ధించ సహపీతిం చ అన్యా = మఱియొక పృథివీదేవత సమాన భోజనమును సమానపానమును ప్రాప్తింపజేయును, నవేన = నూతనము లగు అన్నరసములతో మనము పూర్వం = పురాతనఅన్నరసములను, దయమానాఃస్యామ = రక్షించుచు ఉందుము, పురాణేన = ప్రాతఅన్న రసములతో, నవం = నూతన - అన్నరసములను రక్షించుకొనవలెను, ఊర్జాహుతీ = అన్నరసములనొడగూర్చు రెండుదేవతలు, తాం ఊర్జం = ఆ యన్నరసములను, ఊర్జయమానే అధాతాం = బలపఱచుచు ధారణ చేయుదురుగాక ! వసువనాయ = ధనోపయోగముకొఱకు, వసుధానాయ చ = ధనసంగ్రహముకొఱకు, యజ ఇతి సంప్రైషః = విధి - ద్వ్యుక్తి అధ్యాయసమాప్తిని సూచించును.

ఇతి సకలశాస్త్రనిష్ణాత శ్రీమత్పండిత ముక్తిరామోపాధ్యాయ శిష్య కళాప్రపూర్ణ పండిత శ్రీ గోపదేవ విరచిత ఆంధ్రవ్యాఖ్యానరూప-అనువాదము (నిరుక్తమున) - నవమాధ్యాయము సమాప్తము.

# దశమాధ్యాయము

(ద్వాత్రింశత - ౩౨ పదాని)

## ప్రథమపాదము

అథాతో మధ్యస్థానా దేవతాః. (౧) తాసాం వాయుః ప్రథమాగామీ భవతి - (౨)

వాయుః - (౧)

వాయుర్వాతేర్వేతేర్వా స్యాత్ గతికర్మణః, ఏతేరితి స్థౌలాష్ఠీవిః, అనర్థకో వకారః.

తస్యైషా భవతి-

వాయుసంబంధఋక్.

"వాయవాయాహి దర్శతే మే సోమా అరంకృతాః. తేషాం పాహి శ్రుధీ హవమ్" (ఋ. ౧-౨-౧)

వాయవాయాహి దర్శనీయే మే సోమాః అరంకృతా అలంకృతాస్తేషాం పిబ శృణు నో హ్వానమితి.

కమన్యం మధ్యమాదేవమవక్ష్యత్.

తస్యైషాఽపరా భవతి-

"ఆసస్రాణాసః శవసానమచ్ఛేంద్రం సుచక్రే రథ్యాసో అశ్వాః. అభిశ్రవ ఋజ్యన్తో వహేయుర్ నూ చిన్ను వాయోరమృతం విదస్యేత్" (ఋ. ౬-౩౭-౩)

ఆనస్పృహాంసోఽభిబలాయమానమింద్రం కల్యాణచక్రే రథే యోగాయ రథ్యా అశ్వా రథస్య వోఢారః ఋజ్యన్త ఋజుగామినోఽన్నమభివహేయుర్నవం చ పురాణం చ. శ్రవ ఇత్యన్ననామ శ్రూయత ఇతి సతః. వాయోశ్చాస్య భక్షో యథా న విదస్యేదితి.

ఇంద్రప్రధానేత్యేకే నైఘంటుకం వాయుకర్మోభయప్రధానేత్యపరమ్

అథాతో మధ్యస్థానా దేవతాః. పార్థివా దేవతాస్తావత్ వ్యాఖ్యాతాః సాంప్రతం క్రమప్రాప్తాన్ మధ్యస్థానాన్ దేవాన్ వ్యాఖ్యాతుకామ ఆరభతే అథాత ఇతి - అథ శబ్దో విశేషాధికారే. అతః శబ్దశ్చానన్తర్యార్థః. తాసాం మధ్యస్థానీయానాం దేవతానాం మధ్యే వాయుః ప్రథమాగామీ. మధ్యమస్య వర్షకర్మోపలక్షితత్వాత్ వర్షకర్మణి చ వాయోరేవ విశిష్టాధికారిత్వాత్ తస్యైవ పూర్వం వ్యాఖ్యా సత్యపి ప్రాధాన్యేసేంద్రస్య.

తథాచోక్తమ్ - "వాన్తి వర్షకుషో వాతాః తతః వర్షముపోఽపరే.

తతః వర్షయహోవాన్తి తతో దేవః ప్రవర్షతి.

వాతి ఇతి వాయుః - గతికర్మణః వేతేర్వా. స్థౌలాష్ఠీవి ఆచార్యః వకారమనర్థకముపజనం మన్యమానః ఏతేః వాయుం సాధయతి. తస్యైషా - "వాయవాయాహి ... శ్రుధీహవమ్" హే దర్శత - దర్శనీయ వాయో! అస్మాభిః ఇమే సోమాః త్వదర్థం అరంకృతాః - అలంకృతాః - పర్యాప్తాః పాతుం సంస్కృతా ఇత్యర్థః. తేషాం సోమానాం యస్తవాంశః తం పిబ. నః హవమ్ - ఆహ్వానం శ్రుధి - శృణు.

కమన్యమింద్రాదస్యాం మధ్యమాత్ దేవాత్ మంత్రదృగ్ అవక్ష్యత్ తస్మాదింద్ర ఏవ వాయుః. తమేతమర్థం ఆచార్య ఋక్ బోధయతి-"ఆసస్రాణాస! ... వాయోరమృతం విదస్యేత్" భరద్వాజస్యార్షమ్. రథ్యాసః - రథ్యాః అశ్వాః సుచక్రే - శోభనచక్రే రథే ఇంద్రం శవసానమ్ అచ్ఛ - అధికబలమాత్మానం మన్యమానం ససస్రాణాసః - నిత్యమాసర్పణశీలాః తాన్ రథే యుక్త్వా అస్మాకం యజ్ఞే సోమపానాయ ఆయాహి. అశ్వాః

ఋజ్వశ్వః - ఋజుగామినః సన్తః ద్రవః - అస్మిన్ సూదిత్ - నవం చ పురాణం చ సు-క్షిప్రమ్ వహేయుః. అథ అస్య వాయోః ఇంద్రస్య అమృతం - సోమభక్షః న పిబస్యేత్ ఇత్యేతదాశాస్మహే. ఏకే పునరాచార్యాః ఇమామృచమ్ ఇంద్రప్రధానామేవ మన్యన్తే యదిహ వాయుకర్మ తన్నై ఘంటుకమ్ = గౌణమిత్యర్థః. ఏకే పునరుభయప్రధానాం మన్యన్తే.

అర్థము :- అథ = దీనితరువాత, అతః = ఇటనుండి మధ్యస్థానా దేవతాః = మధ్యస్థానం (అంతరిక్షమ్) యాసాం తాః మధ్యస్థానా దేవతాః. వాయ్వాదయ ఇత్యర్థః మధ్యమస్థానమగు అంతరిక్షమునందుండుదేవతలు వాయ్వాదులు. వానివ్యాఖ్య చేయుదురు.

ఆ దేవతలలో వాయువు ప్రథమాగామీ = ప్రథమం పూర్వం ఆగంతుంశీలం యస్య సః = ముందువచ్చుస్వభావముగలది. వాయుః = వాయువు. వాయుః = వాయుశబ్దము - గతికర్మణః గత్యర్థక వాతేః వాగతి గంధనయోః లేక 'వీ'ధాతువువలన సిద్ధమగును. ఏతేః ఇతి స్థౌలాష్ఠీవిః స్థౌలాష్ఠీవి ఆచార్యుడు గత్యర్థక 'ఇణ్'ధాతువుతో అయుశబ్దము సిద్ధించును. అయువే వాయువు; వాయువులోని వకారము నిరర్థకము. అయుపదము నందు వకారము 'గమము' అని చెప్పెను. యాస్కుడుమాత్రము వాయు స్థానమున అయుశబ్దముకాడ ప్రయోగించెను. వాయువు గతిశీలము అనును.

మంత్రార్థము :- దర్శత ! దర్శనయోగ్య వాయో ! = వాయువా !, ఇమే యే సోమాః = ఈసోమరసములు, అరంకృతాః = మేము వీనిని అలంక రించియుంచినాము, తేషాం పిబ = వానిని త్రాగుము, నః హ్వానమ్ = మా యాహ్వానమును, శృణు = వినుము, శ్రుధి = వినుము.

మంత్రార్థము :- సుచక్రేరథే = ఉత్తమచక్రములుగలరథము నందు పోడించుటకు. రథ్యాసః = రథవాహకములైన, శవసానమ్. (శవస్ శబ్దమునకు మత్వర్థమునకానచ్ ప్రత్యయము) బలముగలిగిన, అచ్ఛ - ఇంద్రమ్ = ఇంద్రుని (అచ్ఛశబ్దమిట అభిఅర్థమున) అనస్రాణాసః = నిత్యమువచ్చునట్టి, అశ్వాః = గుఱ్ఱములు, ఋజ్వశ్వః - ఋజుగామినః = తిన్నగానడుచునవి, ను = శీఘ్రముగానే, వాయోః అమృతమ్ = ఇంద్రుని

అమృతరూప, నూచిత్ = నూతనము పురాతనమునగు, శ్రవః = సోమనామకమగు అన్నమును, అభి = మఱియు, ఇంద్రమ్ = ఇంద్రుని, వహేయుః = తీసికొనివెళ్లునుగాక ! ఈ సోమాఖ్యశ్రవః = అన్నము, న విదస్యేత్ = క్షీణింపకుండుగాక !

భాష్యార్థము :- అనస్పృవాంసః = అనస్రాసానః = అర్థము వచ్చుచున్నవి. శవసానమచ్ఛేంద్రమ్ = అభిబలాయమానమింద్రమ్=బలవంతుడగుఇంద్రుని, సుచక్రే = కల్యాణచక్రే = ఉత్తమరథమునందు, యోగాయ = యుక్తముచేయుటకు - జోడింప, రథ్యాః = అశ్వాః = అశ్వములు రథమును వహించునవి, ఋజ్రయన్తః = ఋజుగామినః=సరళముగా తిన్నగానడుచునవి, అన్నమభివహేయుః = అన్నమ్ = ఇంద్రుడు భక్షింప దగిన సోమనామకమగు అన్నమువైపునకు తీసికొనిపోవునుగాక ! ఆయన్నము, నూచిత్ - నవం చ పురాణం చ = నూతనము - పురాణము, శ్రవః ఇతి అన్ననామ = శ్రవపదము అన్నవాచకము, శ్రూయతే ఇతి శ్రవః=ఎల్లప్పుడు అంతట అన్నశబ్దము వినబడుచుండును. కావున శ్రవః = శ్రవనము అనబడును. వాయోః - ఇంద్రస్య = ఇంద్రుని, భక్షః = భక్ష్యమగు నీసోమము, న విదస్యేత్ = ఉపక్షీణము కారాదు.

ఈ ఋక్కును కొందఱాచార్యులు ఇంద్రప్రధానా = ఇంద్రదేవతాకమందురు. ఏలయన నీమంత్రము ఐంద్రసూక్తమధ్యలో వచ్చినది వాయుకర్మనైఘంటుకమ్. వాయు-వర్ణనము ఇంద్రునివిశేషణముకొఱకు వ్యంజనము మాత్రమే. అనగా గౌణము. అపరమ్ - కాని, ఈమంత్రము ఉభయప్రధానా ఇంద్ర - వాయుదేవతాకమని రెండవమతము.

వరుణః - (౨)

వరుణో వృణోతీతి సతః. తస్యైషా భవతి.

వరుణవిషయ ఋక్కు.

“నీచీనబారం వరుణః కబంధం ప్రససర్జ రోదసీ అంతరిక్షమ్.
తేన విశ్వస్య భువనస్య రాజా యవం న వృష్టిర్వ్యునత్తి భూమ” (ఋ. ౫-౮౫-౩)

నీచీనవారం వరుణః కబంధం మేఘమ్. కవనముదకం భవతి. తదస్మిన్ ధీయతే, ఉదకమపి కబంధముచ్యతే బంధిరనిభృతమే, కమనిభృతం చ ప్రసృజతి, ద్యావా పృథివ్యౌ చాంతరిక్షం చ మహత్త్వేన. తేన సర్వస్య భువనస్య రాజా యవమివ వృష్టిర్వ్యునత్తి భూమిమ్.

తస్యైషా అపరా భవతి.

ఇది రెండవఋక్కు.

"తమూ షు సమనా గిరా పితౄణాం చ మన్మభిః. నాభాకస్య ప్రశస్తిభిర్యః సింధూనాముపోదయే సప్తస్వసా స మధ్యమో నభన్తా మన్యకే సమే" (ఋ. ౮-౪౧-౨)

తం స్వభిష్టౌమి సమానయా గిరా గీత్యా స్తుత్యా పితౄణాం చ మననీయైః స్తోత్రైర్నాభాకస్య ప్రశస్తిభిః. ఋషిర్నాభాకో బభూవ యః స్యన్దమానానామాసామపాముపోదయే సప్తస్వసారమేనమాహ వాగ్భిః స మధ్యమ ఇతి నిరుచ్యతే అథైష ఏవ భవతి. "నభన్తామన్యకే సమే. మా భూవన్నన్యకే సర్వే - యే నో ద్విషన్తి దుర్ధియః పాపధియః పాపసంకల్పాః,

వరుణః కస్మాత్? ఉచ్యతే వృణోతీతి సతః. స హి మేఘజాలేన వియద్ వృణోతి. తస్యైషా - "నీచీనవారమ ... వ్యునత్తిభూమిమ్" ఇత్యార్షమ్. వరుణః - మధ్యమో దేవః రోదసీ - ద్యావాపృథివ్యౌ అంతరిక్షం చ మహత్త్వేన ఆపూరయన్నివ కబంధం - మేఘం నీచీనవారం - న్యక్ ఆవృతం ద్వారం యస్య తం, కృత్వా కవనం - ఉదకం ప్రససర్జ తతః తేనాతివిసృష్టేనోదకేన విశ్వస్య - సర్వస్య భువనస్య - భూతజాతస్య రాజా - ఈశ్వరః యవం న - యవమివ వృష్టిః - వృష్ట్యాభూమౌ - భూమిం - వ్యునత్తి - క్లేదయతి.

అథైకపదనిర్వచనం - కబంధః మేఘః కస్మాత్? ఉచ్యతే కవనం ఉదకం భవతి తదస్మిన్ ధీయతే ఇతి కబంధో మేఘః. జలమపి చ కబంధః తత్ కస్మాత్? బంధిః అనిభృతత్వే వర్తతే. నిభృతస్తావదచపలః. తద్విపరీతశ్చపలో బంధిః. కం-సుఖం చ అనవస్థాయి చ కబంధం జలమిత్యర్థః.

తస్యైషా అపరా - "తమూషు సమనా ... నభన్తామన్యకే సమే" నాభాకస్యార్షమ్. అహం తం సమనా - సమానయా గిరా-వాణ్యా పితౄణాం చ మన్మభిః-మాన్యైః స్తోమైః అభిష్టౌమి. కించ నాభాకస్య మమ ప్రశస్తిభిః వరుణం అభిష్టౌమి. యః వరుణః సింధూనాముపోదయే - స్యందమానానామ్ అపాం ఉపోద్గమే అంతరిక్షలోకే సప్తస్వసా - మధ్యమాభిః అస్య వ్యాభిః సప్తభిః వాగ్భిః స మధ్యమో వరుణః సంపద్యతే. తదనుగ్రహాత్ అస్మాకం అన్యకే - శత్రవః స భన్తామే - మాభూవన్.

అర్థము :- వరుణః = వరుణనామమేల? వరుణదేవత మేఘజాలముతో ఆకాశమునాచ్ఛాదించును. అందువలన వరుణనామమేర్పడినది.

మంత్రార్థము :- వరుణః = వరుణదేవుడు, కబంధం=మేఘమును, నీచీనబారమ్ = నీచీనం నీచం బారం ద్వారమ్ యస్య తమ్ = నీచీనం = క్రిందికి, బారమ్=ద్వారము, యస్య=దేనికి కలదో అది నీచీనబారమ్ - మేఘమ్=క్రిందికి ద్వారముగల మేఘమును, రోదసీ=ద్యావాపృథివీ లోకములవైపు, మఱియు అంతరిక్షమువైపు ప్రససర్జ = నీటినివిడుచును, తేన = అవృష్టిజలముతో, విశ్వస్య భువనస్యరాజా = సమస్తభూతజాతము నకు రాజు అయిన వరుణుడు, యవం న=యవలుమున్నగు ధాన్యములను కృషీవలుడు తడుపునట్లు వరుణుని ప్రేరణచే మేఘము, భూమ=భూమిని, వ్యునత్తి = వర్షములతో తడుపును.

భాష్యార్థము :- కబంధమ్ = మేఘమును కబంధమందురు. ఏలయన - కవనమ్ ఉదకం భవతి - కవనమ్ = ఉదకము. అజలము, అస్మిన్ ధీయతే = మేఘమునందుంచబడును, కబంధమ్ = మేఘము - జలముకలదియనియర్థము. బంధిః = బంధధాతువు అనిభృతత్వే = చంచలతా అర్థమునందున్నది, జలమపి కబంధమ్ ఉచ్యతే = జలమునకూడ చంచలము కావున నదియు కబంధమనదగును. కమ్ అనిభృతంచ = సుఖ

కారకము చంచలముకాదు, సుఖకారకత, చంచలత రెండుగుణము లుండుటచే జలము కబంధమనబడును. నిభృతమన నిశ్చలము - అని భృతము = అనిశ్చలము చంచలమని యర్థము, ప్రసృజతి = జలమును విడుచును, ద్యావా - పృథివీ, అంతరిక్షం చ = ఈమూడులోకములవైపు మహత్వేన=మహత్త్వముతో భూమిని అలంకరించును, తేన= ఆకారణము చేతనే వరుణుడు, సర్వస్య భువనస్య రాజా = సమస్తభువనమునకు రాజగుచున్నాడు. యవం న = కృషీవలుడు యవలుయున్నగువానిని జలముతో తడుపునట్లు వరుణప్రేరితమేఘము సమస్తభూమిని వ్యునత్తి = తడుపును.

మంత్రార్థము :- ఈమంత్రమున ఉ పాదపూరణార్థము. సు సంయోగముతో అభిపూర్వకస్తౌమి క్రియను అధ్యాహారముచేసినయెడల మంత్రార్థము - తమ్ = ఆప్రకృతవరుణుని, సమనాగిరా = సమానయా యోగ్యయా స్తుత్యా = సమానము యోగ్యమునగు స్తుతితో - వేదవాణితో, సు అభిష్టౌమి = బాగుగ స్తుతిచేయుచున్నాను, పితౄణాం చ మన్మభిః = మరియు పూజ్యగురుజనులయు, పితృపితామహులయు, మాననీయ స్తోమములతో, నాభాకస్య = నాభాకనామకఋషియొక్క, ప్రశస్తిభిః = ప్రకృష్టస్తుతులతో నేను వరుణుని స్తుతిచేయుచున్నాను, యః మధ్యమః = మధ్యమస్థానీయుడైన వరుణుడు, సింధూనామ్ = జలములయొక్క, ఉపోదయే = ఉద్గమస్థానమగు అంతరిక్షమున, సప్తస్వసా = భగినీస్థానీయ శక్తితాత్మకవాణులతో యుక్తుడైయున్నాడు. అన్యకే సమే = ఆ వరుణుని స్తుతికృపవలన శత్రువులెల్లరు న భన్తామ్ = ఉండకుందురుగాక! లేకుందురుగాక!

భాష్యార్థము :- తమ్ = ఆ వరుణుని, సు అభిష్టౌమి = బాగుగ స్తుతిచేయుచున్నాను, సమనా-సమనయాగిరా స్తుత్యా=తగినవాణితో, పితౄణాం చ = పూజ్యపితాపితామహాదిగురుజనులయొక్క, మనసిషైః=మనన యోగ్య, స్తోమైః = స్తోమములతో, నాభాకస్య ప్రశస్తిభిః = నాభాకఋషిచే చేయబడిన ఉత్తమస్తుతులతో, ఋషిర్నాభాకో నామ = నాభాకనామకఋషి, బభూవ - ఉండెను, యః = ఎవడు, స్యందమానానామ్ అపామ్ =

ప్రవహించుచున్న యూబలములు, ఉపోదయే = ఉద్ధమస్థానమగు నంతరిక్షమున, సప్తస్వసారమ్ = భగినీస్థానీయసప్తగర్జితలక్షణవాణులతో ఆ వరుణుని యుక్తముచేయుచున్నాడు, సః మధ్యమస్థానీయః=వరుణుడు మధ్యస్థానీయుదేవత, అథ ఏష ఏవ భవతి = ఈ వరుణుడే మాస్తుతులకు విషయమైయుండునుగాక! ఈ వరుణుని కృపాఫలస్వరూప, అన్యకే సమే= మమ్ము ద్వేషించునట్టియు పాపసంకల్పులగువారెల్లరు, న భన్తామ్-మా భూవన్ = లేకుండురుగాక!

రుద్రః - (3)

రుద్రో రౌతీతి సతః రోరూయమాణః ద్రవతీతి వా రోదయతేర్వా 'యదరుదత్తద్ రుద్రస్య రుద్రత్వమితి కాఠకమ్ 'యదరోదీత్తద్ రుద్రస్య రుద్రత్వమ్ ఇతి హారిద్రవికమ్.

తస్యైషా భవతి.

"ఇమా రుద్రాయ స్థిరధన్వనే గిరః క్షిప్రేషవే దేవాయ స్వధావ్నే. అషాళ్హాయ సహమానాయ వేధసే తిగ్మాయుధాయ భరతా శృణోతు నః" (ఋ. ౭-౪౬-౧)

ఇమా రుద్రాయ దృఢధన్వనే గిరః క్షిప్రేషవే దేవాయాన్నవతేఽషాఢాయాన్యైః సహమానాయ విధాత్రే తిగ్మాయుధాయ భరత శృణోతు నః.

తిగ్మం తేజతేరుత్సాహకర్మణః. అయుధమాయోధనాత్.

తస్యైషాఽపరా భవతి.

"యాతే దిద్యుదవసృష్టా దివస్పరిక్ష్మయా చరతి పరి సా వృణక్తు నః. సహస్రం తే స్వపివాత భేషజా మా నస్తోకేషు తనయేషు రీరిషః" (ఋ. ౭-౪౬-౩)

యాతే దిద్యుదవసృష్టా దివస్పరి దివోఽధి.దిద్యుత్ ద్యతేర్వా ద్యుతేర్వా ద్యోతతేర్వా. క్ష్మయా చరతి క్ష్మా పృథివీ

తస్యాం చరతి తయా చరతి విక్ష్మాపయన్తీ చరతీతి వా పరివృణక్తు నః, సా సహస్రం తే స్వాప్తవచనభైషజ్యాని మానస్త్వమ్ పుత్రేషు చ పౌత్రేషు చ రీరిషః తోకం తుద్యతేః. తనయం తనోతేః.

అగ్నిరపి రుద్ర ఉచ్యతే.

తస్యైషా భవతి.

అగ్నివాచక రుద్రవిషయక ఋక్కు.

"జరా బోధ తద్ వివిడ్ఢి విశే విశే యజ్ఞియాయ. స్తోమం రుద్రాయ దృశీకమ్" (ఋ. ౧-౨౭-౧౦)

జరా స్తుతిః జరతేః స్తుతికర్మణః, తాం బోధ తయా బోధయితరితి వా తద్ వివిడ్ఢి తత్ కురు మనుష్యస్య యజనాయ స్తోమం రుద్రాయ దర్శనీయమ్.

రుద్రః కస్మాత్? రౌతీతి సతః. రోరూయమాణో - శబ్దం కుర్వాణో ద్రవతీతి వా రోదయతేర్వా రుద్రః యస్మాదసౌ శత్రూన్ రోదయతి. తథా చ బ్రాహ్మణమ్ - "యదరుదత్ తద్ రుద్రస్య రుద్రత్వమ్" ఏతదేవ హారిద్రవికా అపి సమర్థయన్తి. హారిద్రవో నామ మైత్రాయణీయానాం శాఖాభేదః.

తస్యైషా - "ఇమా రుద్రాయ ... శృణోతు నః" వసిష్ఠస్యార్షమ్. హే హోతారః! యూయం స్థిరధన్వనే - దృఢచాపాయ క్షిప్రేషవే-క్షిప్రాః శీఘ్రగామినః ఇషవో బాణాః యస్య సః తస్మై దేవాయ - దానాదిగుణ సంపన్నాయ, స్వధావ్నే-స్వధావతే అన్నవతే ఇత్యర్థః, అషాఢాయ-అషాఢాయ కేనచిదనభిభూతాయ సహమానాయ - శత్రూనభిభవతే వేధసే - విధాత్రే తిగ్మాయుధాయ-తీక్ష్ణశస్త్రాయ రుద్రాయ దేవాయ గిరః-స్తుతీః భరత. స దేవః నః ఇమాః గిరః శృణోతు. తిగ్మం కస్మాత్? ఉత్సాహ కర్మణః తేజతేరితి. ఆయోధమాయోధనం భవతి. తస్యైషా-"యాతే విద్యుత్...తనయేషు రీరిషః" హే రుద్ర! యా తే విద్యుత్ ఆయుధమ్ రోగరూపం ప్రాణినాం ఘాతకమ్,

దివస్పరి - ద్యులోకాదధి త్వయా అవసృష్టా క్ష్మయా-పృథివ్యా అన్నాదిభావ మునుపగతయా చరతి సా నః - అస్మాన్ వృజతి పరివృణక్తు - పరిపర్జయతు. అపిచ హే స్వపివాత ! కస్యచిదపి అవారణీయాజ్ఞ ! తే సహస్రం భేషజః - అస్మాన్ ప్రతి సన్తు. కించ మానః తోకేషు - పుత్రేషు తనయేషు-పౌత్రేషు చ రీరిషః - హింసాం మా ప్రయుంక్ష్వ అగ్నిరపి రుద్రః. తస్యైషా - "జరాబోధ...దృశీకమ్" శునఃశేపస్యార్షమ్. హే భగవన్నగ్నే ! యోయం మయా తవ జరా-స్తుతిరుచ్యతే హేరుద్ర ! తాం బోధ-నిబోధ యజ్ఞియాయ-యజ్ఞసంపాదినే విశే విశే-జనే జనే తద్ వివిడ్ఢి - తత్కురు దృశీకమ్ - దర్శనీయమ్ స్తోమం - స్తుతిమ్ - ఉచ్చారయిష్యతీతి.

రుద్రః = మేఘగర్జనముకారణముగ వాయువునకు రుద్రుడను నామమేర్పడెను. రౌతి ఇతి సతః = ఏలయనగ నది శబ్దముచేయును. 'రు' శబ్దమునకు 'రక్'ప్రత్యయము 'తుక్'ఆగమముచేసిన రుద్రశబ్దమగును. వా రోరూయమాణః ద్రవతి = లేక శబ్దముచేయుచు పరువిడును కావున వాయువు రుద్రుడనబడును, రు ద్ర - రుద్రః. రోదయతేః వా - లేక అవాయువు శత్రువుల నేడ్పించును. అందువలన ణ్యన్త 'రుదిర్' అశ్రు విమోచనే ధాతువునకు 'రక్'ప్రత్యయముచేసిన ణిలుక్. రోదిత ఆగును. రోదితి ఇతి రుద్రః. ఏడుపుకారణముగ వాయువు రుద్రుడగును. వాయు రోదనవిషయమున యాస్కముని కఠ హారిద్రవకశాఖలను ప్రమాణములను చూపుచున్నాడు. 'యత్ అరుదత్ తద్ రుద్రస్య రుద్రత్వమ్' ఎందువలన నావాయువు అరోదీత్ - ఏడ్చెనో అదియె రుద్రుని - రుద్రత్వము. వాయు వెందులకేడ్చెను ? అన కఠశాఖయందు ఇతిహాసము చూడబడుచున్నది. 'స కిల పితరం ప్రజాపతిమిషుణా విధ్వస్తమనుశోచన్ అరుదత్ తద్ రుద్రస్య రుద్రత్వమ్' ఆ రుద్రుడు తండ్రియైన ప్రజాపతిని బాణముతో ఛేదించెను. తదుపరి అందులకు దుఃఖించుచునేడ్చెను. అదియే రుద్రుని రుద్రత్వము - ఏడుపు.

మంత్రార్థము :— ఓ స్తోతృగణమా ! స్థిరధన్వనే = దృఢమైన ధనుస్సుగల, క్షిప్రేషవే = వేగముగ బాణములనువిసురువాడు, దేవాయ= దానాదిగుణయుక్తుడు, స్వధావ్నే=అన్నముగల,అన్నవంతుడు,అషాఢాయ= పిశత్రువులచేతను పరాభూతుడుకానివాడును, కాని సహమానాయ=నిత్యము

శత్రువులను పరాభవించువాడును, వేధసే = విధాతయు, మఱియు తిగ్మాయుధాయ = తీక్ష్ణమైన ఆయుధములుకలవాడునునగు, రుద్రాయ = వాయువుకొఱకు, ఇమాం గిరః = ఈ స్తుతులను, భరత = ధారణచేయుము రుద్రునిస్తుతియింపుడు. ఆరుద్రుడు మనస్తుతులను, శృణోతు = వినునుగాక !

భావార్థము :- ఇమాః గిరః = ఈ స్తుతులను, దృఢధన్వనే = బలమైన ధనుస్సుగల, క్షిప్రేషవే = వేగముగబాణములను విడుచువాడు, దేవాయ = దానాదిగుణయుక్తుడు, అన్నపతే=అన్నవంతుడు, అషాఢాయ = శత్రువులకులొంగనివాడు, సహమానాయ = శత్రువులపై నిత్యముదండెత్తు వాడునగు, విధాత్రే = విధాతయు, తిగ్మాయుధాయ = తీక్ష్ణఆయుధములు గలవాడునగు, రుద్రాయ=రుద్రునికొఱకు, భరత=ధరింపుడు, శృణోతునః= మనస్తుతులనతడు వినునుగాక !

ఉత్సాహార్థక 'తిజ'ధాతువువలన తిగ్మశబ్దము సిద్ధించును. దేని సహాయముతో యుద్ధముచేయబడునో యది ఆయుధమనబడును.

మంత్రార్థము :- హే భగవన్ రుద్ర ! నీవిద్యుద్రూపమగు ఆయుధము, దివస్పరి = ద్యులోకమునుండి, అవసృష్టా = క్రిందికి విసరబడినదగుచు, క్ష్మయా చరతి=భూమిపైపడును - పృథివితో సంయుక్తమగును - లేక పృథివిని కంపింపచేయును, సా = ఆవిద్యుదాయుధము, నః=మమ్ములను, పరివృణక్తు = విడుచునుగాక ! స్వపివాత ! = హే స్వపివాత ! స్వాప్తవచన ! = అనతిక్రమణీయ ఆజ్ఞావంతుడవగు ఓరుద్ర ! తే = నీయొక్క, సహస్రంభేషజా = వేలకొలది ఔషధములెయ్యవికలవో అయ్యవి మాకు లభించునుగాక, నః = మా, పుత్రేషు = తనయులను, పౌత్రేషు = పౌత్రులను, మా రీరిషః = హింసింపకుందువుగాక ! యాతేదిద్యుత్=లేక నీవిద్యుద్రూపమగు ఆయుధము, దివస్పరి - దివోఽధి = అంతరిక్షమునుండి, అవసృష్టా = విడిపింపబడినది. దిద్యుత్‌శబ్దము ద్యుతేర్వా దో అవఖండనే ధాతువునకు క్విప్‌ప్రత్యయము ద్విత్వాది చేయుటవలన సిద్ధించును. లేక ద్యుతేర్వా 'ద్యుత'దీప్తౌ దీప్త్యర్థక ద్యుతధాతువువలనను దిద్యుచ్ఛబ్దము సిద్ధించును. ఈ యాయుధము దీప్తిమంతము, క్ష్మయాచరతి = అనగా -

క్ష్మా = పృథివీవాచకము, తస్యాం = భూమిపై, చరతి = విచరించును. భూమిలోచరించును. ఇట తస్యాం పదమునందలి సప్తమీవిభక్తి తృతీయార్థమున ప్రయోగింపబడినది. విక్ష్మపయన్తీ చరతీతి వా, క్ష్మాపయన్తీ విచరతి = హింసించుచు చరించును, సా పరివృణక్తు నః = ఆ విద్యుత్తు మమ్ములను విడిచిపెట్టునుగాక! స్వాప్తవచన! = బాగుగపొందబడిన లేక అంగీకరింపబడిన వచనముగల రుద్ర! తే సహస్రంభైషజ్యాని=నీయొక్క వేలాదిఓషధులు - ఔషధములు మాకు లభించుగాక! త్వం = నీవు, నః పుత్రేషు పౌత్రేషు చ = మాపుత్రపౌత్రులను, మా రీరిషః = హింసింపకుందువుగాక! తోకమ్ = 'తుద'వ్యథనె ధాతువువలన తోకమ్ పదము సిద్ధించును తుద - ధాతువునకు 'ఘఞ్'ప్రత్యయము. పుత్రుని మాటిమాటికి హెచ్చరింతురు. తనయమ్ తనోతేః 'తనువిస్తార'ధాతువుతో, తనయశబ్దమేర్పడును. తనయుడు పుత్రుడు పుత్రునిచే వంశపరంపర నడుచును విస్తరించును. దివస్పరి పదమునకు దివోఽధి అనియర్థముచెప్పబడినది. పరి, అధి రెండును సమానార్థకములు. దివః సకాశాత్ = ద్యులోకసమీపమునుండి అని యర్థము. అగ్నియు రుద్రుడనబడును.

మంత్రార్థము — హే జరాబోధ! = స్తుతించుటవలన యజమానుని అభీష్టమును సిద్ధింపజేసి దేవతలనుబోధించు అగ్నీ! రుద్రాయ = రుద్రుడవగు నీకొఱకు, దృశీకమ్ = దర్శనీయమ్ - శ్రవణయోగ్యమగు సత్తమోత్తమమునగు స్తోమమ్ = హవిస్సు ఇయ్యబడుచున్నది. విశే విశే యజ్ఞియాయ = ప్రత్యేకమనుజుని యజ్ఞముకొఱకు దానిని, వివిడ్ఢి = కృప చేయుము - యజ్ఞకర్మసంపాదింపుము.

భాష్యార్థము :— జరా స్తుతిః = స్తుతిఅనిఅర్థము. స్తుత్యర్థక 'గృ' ధాతువుతో జరాశబ్దము సిద్ధించును. తాం బోధ = హే అగ్నీ! ఆస్తుతిని తెలిసికొనుము. తయాబోధయితః = ఆస్తుతితో నీవు దేవతలకు బోధింతువు, తత్ వివిడ్ఢి - చేయుము - ఆయజ్ఞమును సంపాదింపుము, విశే విశే = ప్రతిమనుజుని. యజ్ఞియాయ = యజనముకొఱకు, స్తోమమ్=స్తోమమును, రుద్రుడవగు నీకొఱకు, దృశీకమ్ = దర్శనీయము, శ్రవణీయము, వివిడ్ఢి= 'విష్'ధాతువు కరణార్థకమున వివిడ్ఢి - అగును.

ఇంద్రః - (౬)

ఇంద్ర ఇరాం దృణాతీతి వా. ఇరాం దదాతీతి వా. ఇరాం దధాతీతివా. ఇరాం దారయత ఇతివా ఇరాం ధారయత ఇతివా. ఇన్దవే ద్రవతీతివా, ఇన్దౌ రమత ఇతివా. ఇంధే భూతా నీతి వా - "తద్ యదేనం ప్రాణైః సమైంధం స్తత్ ఇంద్రస్య ఇంద్రత్వమితి విజ్ఞాయతే".

ఇదం కరణాదిత్యాగ్రయణః. ఇదం దర్శనాదిత్యౌపమన్యవః. ఇందతేర్వైశ్వర్యకర్మణః. ఇందఞ్ఛత్రూణామ్ దారయితా వా ద్రావయితా వా. ఆదరయితా చ యజ్వనామ్.

తస్యైషా భవతి.

ఇంద్రవిషయక ఋక్కు.

"అదర్దరుత్సమసృజో విఖాని త్వమర్ణవాన్ బద్బధానా అరణ్ణాః. మహాన్తమింద్ర పర్వతం వి యద్వః సృజో విధారా అవదానవం హన్" (ఋ. ౫-౩౨-౧)

అదృణా ఉత్సం. ఉత్సఉత్సరణాద్వోత్సదనాద్వోత్స్యం దనాద్వోన త్తేర్వా, వ్యసృజోఽస్య ఖాని త్వమర్ణవానర్ణస్వత ఏతాన్ మాధ్యమికాన్ సంస్త్యాయాన్ బాధ్యమానానరణ్ణాః, రణ్ణాతిః సంయమనకర్మా, విసర్జనకర్మా వా, మహాన్త మింద్రపర్వతం మేఘం యత్ వ్యవృణోర్వ్యసృజోఽస్య ధారా అవహన్నేతం దానవం దానకర్మాణమ్.

తస్యైషా అపరా భవతి.

ఇంద్రుని విషయములో మరొక ఋక్కు.

యో జాత ఏవ ప్రథమో మనస్వాన్ దేవో దేవాన్ క్రతునా పర్యభూషత్. యస్య శుష్మాద్ రోదసీ అభ్యసేతాం నృమ్ణస్య మహ్నా స జనాస ఇంద్రః" (ఋ. ౨-౧౨-౧)

యో జాయమాన ఏవ ప్రథమో మనస్వీ దేవో దేవాన్ క్రతునా కర్మణా పర్యభవత్ పర్యగృహ్ణాత్ పర్యరక్షదత్యక్రామదితి వా. యస్య బలాత్ ద్యావాపృథివ్యావప్యభీతాం నృమ్ణస్య మహ్నా బలస్య మహత్త్వేన స జనాస ఇంద్రఇతి. ఋషేర్దృష్టార్థస్య ప్రీతిర్భవత్యాఖ్యానసంయుక్తా.

ఇరామ్ - వ్రీహ్యాది అన్నం దృణాతి-దారయతి సోఽయమిరాదారః సన్నింద్రః. ఇరాం దదాతి ఇతి వా వర్షద్వారేణ అన్నదాతేత్యర్థః. ఇరాం ధారయతీతి వా. ఇందవే-సోమాయ ద్రవతీతి వా స్యాత్. ఇందౌ. సోమే రమతే ఇతి వా. ఇంధే-దీపయతిభూతాని ఇతివా. తథా చ బ్రాహ్మణమ్ "తద్ యదేనం ప్రాణైః సమైంధంస్తదింద్రత్వమితి విజ్ఞాయతే" ఇదం కరణాదింద్రః ఇత్యేవమాగ్రయణాచార్యో బ్రవీతి. ఔపమన్యవస్తు ఇదం దర్శనాత్ బ్రవీతి. ఐశ్వర్యార్థాత్ ఇందతేర్వా ఇంద్రః. ఇందన్ శత్రూణాం దారయితా ద్రావయితా స్యాత్. యజ్వనామ్ ఆదరయితా ఇంద్రః. తస్యైషా-"అదర్ద రుత్ ...అవ దానవం హన్" ఆత్రేయస్య గాతోరియమార్షమ్. హే ఇంద్ర! త్వమ్ ఉత్సమ్ - మేఘం అదర్దః - దారితవానసి తస్య ఖాని - బిలాని అసృజః - వివృతాని అకరోః. యస్మాత్ త్వమ్ అర్ణస్వతః - జలభృతః ఏతాన్ మాధ్యమికాన్ సంస్త్యానాన్ గురూదకభారేణ బాధ్యమానాన్ - అరమ్ణాః - విసృష్టవానసి తస్మాత్ అర్ణవాన్ - బలవాన్. అపిచ హే ఇంద్ర! దానవం ఉదకస్య దాతారం మేఘం - అవహన్ - అవఘ్నన్ యత్ త్వమ్ మహాన్తమిమం మేఘం వియత్ వః - వ్యవృణోః సృజః విధారాః-ఉదకస్య ధారాః వ్యసృజాః.

తస్య ఇంద్రస్య ఏషా అపరా - "యో జాత ఏవ...జనాస ఇంద్రః" యః జాతః - జాతమాత్ర ఏవ ప్రథమః - సర్వభూతానాం ప్రముఖః మనస్వాన్ - మనస్వీ దేవః - ద్యోతనశీలః ఇతరాన్ దేవాన్ క్రతునా - కర్మణా పర్యభూషత్ - స్వామిత్వేన పరిగృహీతవాన్ ముఖ్యత్వాత్ పర్య రక్షత్ వా ప్రభావేణ అత్యక్రామద్వా. యస్య చ శుష్మాత్ - బలాత్ రోదసీ - ద్యావాపృథివ్యౌ అభ్యసేతాం - ఆకంపతాం నృమ్ణస్య - బలస్య

మహ్నా-మహిమ్నా హే జనాసః హే అసురాః. స ఇంద్రః నాహమిత్యభిప్రాయః. అహం తు బ్రాహ్మణః.

ఇంద్రవైరేణ ఐన్ద్రం రూపం ధారయంతం గృత్సమదం జిఘాంసవోఽసురాః అభిదుద్రువుః. భీతః సోఽనేన సూక్తేన ఇంద్రం తుష్టావ. తాంశ్చ ప్రతివేదయాంచకార. దృష్టార్థస్య - అనుభూతేంద్రమైత్రస్య గృత్సమదస్య ఇంద్రం ప్రతి ప్రీతిః - తుష్టిః ఆఖ్యానసంయుక్తా ఆఖ్యాన సంబంధాత్ భవతి.

అర్థము :— ఇంద్రః = ఇంద్రుని నిరుక్తియేమి? ఇరాం దృణాతి ఇతి వా - ఇరా = అన్నము, అన్నమునకు కారణము జలము. ఆ జలమున కాధారము మేఘము. ఆ మేఘమును భేదించును. భిన్న మేఘమునుండి జలము వర్షింపచేయును. అతడే ఇంద్రుడు. లేక అన్నమునకు సంబంధించిన బీజమును దానిఅర్థ్యము అంకురము. దానిని వర్షముచే భిన్నము చేయును. అందువలనను ఇంద్రుడనబడును. ఈవిధముగ - ఇరాదారః సన్ ఇరాం + దారః = ఇంద్రః అనబడెను. ఇరాం దదాతి ఇతి వా - ఇరాం = అన్నమును, దదాతి = ఇచ్చును, కావున - ఇంద్రుడు, వర్షము మూలమున అన్నమునొసంగును - కావున ఇంద్రుడనబడును. - ఇరాదధాతి ఇతివా ఇంద్రః ఇరా దధాతి = అన్నమును, దధాతి = ధారణచేయును - కావున ఇంద్రుడు. ఇరాం దారయతే = మేఘమునుచీల్చును కావున ఇంద్రుడు. ఇరాం + దారయితా = ఇంద్రః చౌరాదిక దృ - విదారణ ధాతువుతో. ఇందవే ద్రవతి - ఇందవే సోమపానముకొఱకు, ద్రవతి=గచ్ఛతి వెళ్లును, కావున ఇంద్రుడనబడును.

ఇందౌ రమతే = ఇందౌ=సోమమునందు రమతే = క్రీడించును. సోమపానముతో రమించును. కావున ఇంద్రుడు, ఇంధే భూతాని ఇతి వా = భూతములకు అన్నమొసగి వానిని దీప్తిమంతము చేయును - ఇంధః = ఇంద్రుడు.

బ్రాహ్మణగ్రంథములలో ఇంద్రపదనిరుక్తి యత్ ఏనమ్ = శరీర మధ్యమునందుండు ముఖ్యప్రాణము ఇంద్రుడు దానిని ప్రాణైః = ప్రాణాదులకంటె భిన్నమైన, వాగాది = ఇతరములకధిదేవత, సమైంధన్ = సమ

దీపయన్=ఉద్దీపింపచేసెను, తత్=ఆ యుద్దీపనమే ఇంద్రునిఇంద్రత్వము, ఇంద్రః = ఇంద్రుడు, 'ఞి ఇంధీ - దీప్తౌ' ధాతువు - కర్మఅర్థమున రక్ ప్రత్యయము - ఇంద్రః. ఆగ్రాయణఆచార్యునిమతమున ఇంద్రపదనిరుక్తి- ఇదం కరణాత్ ఇంద్రః ఇదం సర్వమకరోత్ = ఇంద్రు డీ సమస్తమును చేసెను, ఇదం పూర్వపదపూర్వక 'కృ'ధాతువు - ఇదం కరః = ఇంద్రః ఇదియంతయుచేయుటచే ఇంద్రుడనబడెను.

ఔపమన్యుఆచార్యునిమతమున ఇదం దర్శనాత్ = ఇదంపూర్వ పదము దర్శిన్ ఉత్తరపదము - ఇదందర్శినన్ = ఇంద్రః. ఇంద్రః ఇదమ్ సర్వమ్ అద్రాక్షీత్ = ఇంద్రుడు సర్వము చూచెను - తెలిసికొనెను. కావున ఇంద్రుడనబడును. ఇది పరమైశ్వర్యే ఇంద్ పూర్వపదము - ఉత్తరపదమున గత్యర్థక 'ద్రు', విదారణార్థక 'దృ'ధాతువులతో ఇంద్ర పదమేర్పడును. ఇందన్ = ఈశ్వరుడు ఇందన్సన్ = పరమైశ్వర్యవాలి యగుచు - శత్రువులనుఛేదించువాడు, పారద్రోలువాడునై ఇంద్రు డన బడును. ఇంద్ + ద్రావి = ఇంద్రుడు ఇంద్...దారి = ఇంద్ర రెండు స్థలములు 'ద్రు, దృ'ధాతువులువిజ్ఞప్తములు ఆదర యితా చ యజ్వనాం= ఆ యింద్రుడు యజనశీలురగు జనులను ఆదరించువాడు. అందుచే ఇందన్ = ఈశ్వరుడగుచు, ఆదరయితా = ఆదరించువాడు. ఇంద్ + దృఙ్ - ఆదరే + అక్.

మంత్రార్థము :— హే భగవన్ ఇంద్ర! ఉత్సం = మేఘమును అవర్దః = విదారణచేసితివి - ఖాని వ్యసృజః = మేఘజలము వర్ష రూపమున ప్రవహింపనునదగుమార్గములను తెఱచితివి, అర్ణవాన్ = జల సమూహములను, బద్బధానాన్ = మేఘములవలన బంధింపబడియుండుట చూచి, అరమ్ణాః = తగినసమయమున వానిని విడిపింపచేసితివి, ఇంద్ర = నీవు, మహాంతం పర్వతం = గొప్పమేఘమును, విపః = వ్యసృజః = వివృతద్వారములుకలదిగాచేసితివి అందువలన జలధారలు వర్షరూపమున భూమిపైబడినవి, (జలధారాః విసృజః) దానవం = జలదానమొసగ్చు మేఘమును, అవహన్ = ఛిన్నభిన్నముచేసితివి హననమొనర్చితివి కావున స్తుతింతుము.

భావార్థము :- అదర్దః అభృణాః=విదారణముచేసెను భేదించెను, ఉత్సం = మేఘములను, ఉత్సం యొక్క వ్యుత్పత్తి ఉత్సరణాద్వా = అంతరిక్షమున మేఘము పైకిపోవును. కావున ఉత్సమనబడును, ఉత పూర్వక 'సృ'ధాతువు 'అచ్'ప్రత్యయము ఉత్సరము - ఉత్సం సిద్ధమైనది, ఉత్సరణాత్=మేఘముపైకిపోయి యట ఇటునటు వ్యాపించును, ఉత్స్యంద నాద్వా = పైనుండిక్రిందికి - భూమిపైకి స్యందించును బిందువులుగా ధారలుగా ప్రవహించును. కావున ఉత్సం అనబడును, ఉనత్తేర్వా - ఉన్దీ క్లేదనే ధాతువుతో సిద్ధమగును - భూమిని తడుపును. కావున ఉత్సం - మేఘము, వ్యసృజః = నీవు తెఱచితివి, అస్య = ఈమేఘముయొక్క, ఖాని = ఆకాశములను - ఛిద్రములను - జలద్వారములను, వ్యసృజః= తెఱచితివి, అర్ణవాన్ - అర్ణస్వతః = జలముతోనిండియున్నవానిని, మాధ్య మికాన్ సంస్థానాన్=మధ్యస్థానమునసుండు మేఘసంఘములను, బాబధ్య మానాన్ = జలములనర్దగించుమేఘములను, అరమ్ణాః = తెఱచితివి, రమ్ణాతిః - రమ్ణాతి - సంయమనకర్మా = సంయమనార్థకము, విసర్జన కర్మావా = విసర్జనార్థకముకూడ, హే ఇంద్ర!=నీవు, మహాన్తం పర్వతమ్= గొప్పమేఘమును, వ్యవృణోః = తెఱచితివి, వ్యసృజః = మేఘమునందలి జలమును వర్షరూపమున ప్రవహింపచేసితివి, దానవమ్ = జలమునొసంగు స్వభావముగలమేఘమును, అవహన్ = వధించితివి - అందువలన మేఘ ములనుండి జలమువర్షించును - దానవమిట మేఘవిశేషణము - జల మును దానముచేయును కావున మేఘము దానవమైనది.

మంత్రార్థము :- యః = ఏది, జాతఏవ = ఉత్పన్నమగుచునే, సర్వభూతములందు ముఖ్యమైనది. ఇతరములు సమయమువచ్చునపుడు ముఖ్యములగును కాని ఇంద్రుడు మాత్రము జన్మించుచునే ముఖ్యు డయ్యెను, మనస్వాన్ = మేధావియునయ్యెను. దేవః = ఈయింద్రదేవత, క్రతునా = తనకర్మవలన, దేవాన్ = ఇతరదేవులను తనమహత్త్వముతో అతిక్రమించియున్నాడు - లేక స్వామియై వానికి రక్షకుడై కాపాడుచున్నాడు - లేక వానిని పరిగ్రహించియున్నాడు. యస్య = ఈయింద్రుని, శుష్మాత్ = శారీరకబలముతో, నృమ్ణస్యమహ్నా = సేనారూపబలముతో, రోదసీ-ద్యావా పృథివీ అభ్యసేతామ్ = భయభీతములయ్యెను, జనాసః = ఓ లోకులారా!

సః. ఇంద్రః=అతడు ఇంద్రుడు, అహం తు బ్రాహ్మణః = నేనుబ్రాహ్మణు డను ఇంద్రునికృపవలన నేనుకూడ ఇంద్రునివంటివాడనుగా కనిపించు చున్నాను.

భాష్యార్థము :— నృమ్ణస్య = బలముయొక్క, మహ్నా = మహత్త్వ ముతో, అభ్యసేతాపు = అబిభీతామ్ = భయపడిరి, పర్యభవత్ = పరిభ వించెను, పర్యగృహ్ణాత్ = పరిగ్రహించెను - తనస్వామిత్వముక్రిందికి తీసికొనిరాబడెను, పర్యరక్షత్ = రక్షకుడయ్యెను, అత్యక్రామత్=సర్వము నతిక్రమించెను - ఓడించికూర్చుండెను, జాతఏవ = జాయమానఏవ = పుట్టుచునే, మనస్వాన్ = మనస్వీ = మేధావీ.

తత్త్వదర్శిఋషి (ఏ విషయమునతడు సాక్షాత్కారముచేసికొనెనో) ఆ విషయమున అభ్యాసము ననుసరించి ప్రీతికలుగును.

పర్జన్యః - (౫)

పర్జన్యస్తృపే రాద్యన్తవిపరీతస్య తర్పయితా జన్యః.

తస్యైషా భవతి–

పర్జన్యవిషయక ఋక్కు-

"వివృక్షాన్ హన్త్యుత హన్తి రక్షసో విశ్వం బిభాయ భువనం మహావధాత్. ఉతానాగా ఈషతే వృష్ణావతో యత్ పర్జన్యః స్తనయన్ హన్తి దుష్కృతః" (ఋ. ౫-౮౩-౨)

విహన్తి వృక్షాన్ విహన్తి చ రక్షాంసి సర్వాణి చాస్మాద్ భూతాని బిభ్యతి మహావధాత్ మహాన్ హ్యస్య వధోఽప్య నపరాధో భీతః పలాయతే వర్షకర్మవతః యత్పర్జన్యః స్తనయన్ హన్తి దుష్కృతః పాపకృతః.

'తృపతర్పణే' ఇత్యస్య ధాతోః ఆద్యన్తవిపర్యయేణ. జన్యః సర్వజన పద-తర్పయితా. పరః-ప్రకృష్టో జేతా వా పర్జన్యః పరోఽజనయితా వా పర్జన్యః. ప్రార్జనాద్వారసానాం తస్యైషా. "వివృక్షాన్...హన్తి దుష్కృతః" అత్రేదార్షమ్. పర్జన్యః వజ్రపాతైః - వృక్షాన్ విహన్తి రక్షాంసి - క్రూరకర్మణః విహన్తి.

మహావధాత్ అస్మాత్ పర్జన్యాత్ విశ్వం భువనం - సమస్తం జగత్ బిభాయ - బిభ్యతి. అస్మాత్తు అనాగాః అపి - అనపరాధోఽపి ఈషతే - పలాయతే. వృష్ణ్యావతః - వర్షకర్మవతః అస్మాత్. యస్మాత్ స్తనయన్ పర్జన్యః దుష్కృతః - అకాలప్రభవాన్ తస్కరాదీన్ వర్షైః సుభిక్షం జనయన్ హన్తి.

అర్థము :- పర్జన్యశబ్దము 'తృపతృప్తౌ' ధాతువలన నేర్పడును. ఆద్యన్తవిపరీతస్య = ఆద్యన్తవర్ణముల విపర్యాసమువలన - మార్పువలన, తర్పయితా=అపర్జన్యుడు తృప్తికలిగించువాడు,జన్యః=సర్వజనపదములను తృప్తినిగలిగించువాడు, తృప్ - కువిపర్యయము-పర్ - జన్యపదముకలిపిన పర్జన్యశబ్దమగును. అర్థము సర్వజనపదం - తర్పయితా = జనపదముల నన్నింటిని తృప్తిపఱచువాడు. పరోజేతా వా పరోజనయితా వా ప్రార్జయితా వా రసానామ్. పర్జన్యుడు పరః = ఉత్కృష్టజేతా = అకాల - కలఅప్పను- జయించువాడు, పర + జి జయే + యక్ - పర్జన్యః. యా - లేక పర్జన్యః - పరః=అందఱికంటె - సర్వముకంటె ఉత్కృష్టుడు, జనయితా=అన్నాదుల నుత్పన్నముచేయువాడు, పర + జనీప్రాదుర్భావే + యక్ - పర్జన్యః, వా - లేక, రసానాంప్రార్జయితా = రసములను అర్జనచేయువాడు. కావున పర్జన్యుడు; ప్ర + అర్జ్ + యక్ = పర్జన్యుడు = రసోత్పాదకుడు.

మంత్రార్థము - ఈపర్జన్యుడు = మేఘుడు విద్యుత్తును భూమిపై బడవైచి వృక్షములను, విహన్తి = నాశముజేయును. ఉత = మఱియు రక్షసః = రాక్షసులను, హన్తి = చంపివేయును, మహావధాత్ = పర్జన్యుని గొప్పమారణశక్తితో, విశ్వం సంపూర్ణ భువనం = జగత్తును, బిభాయ = కంపింపచేయును, ఈపర్జన్యుడు నాపై విద్యుత్తును పడవేయకుండుగాక !, ఉత = మఱియు, అనాగాః = అపరాధముచేయనింతువ్రకూడ, వృష్ణ్యావతః=వర్షించునీపర్జన్యునివలన భయపడి, ఈషతే=పాఱిపోవుదురు,ఏలయన పర్జన్యుడు గర్జించుచు, స్తనయన్ = ఉఱుముచు, దుష్కృతః = పాపులను, హన్తి = చంపును, విద్యుత్పతనముతో దుష్టులు నశింతురు.

భాష్యార్థము :- విహన్తి వృక్షాన్ = వృక్షములనశింపజేయును, విహన్తి చ రక్షాంసి=రాక్షసులనుగూడ నశింపజేయును, సర్వాణి భూతాని =

జన్తుమాత్రము పర్జన్యునకు భయపడును, అనాగాః = అనపరాధియు, భీతః పలాయతే = భయపడిపాఱిపోవును, పర్జన్యుడు గర్జించుచు నెల్లరను భయపెట్టును.

బృహస్పతిః - (౬)

> బృహస్పతిర్బృహతః పాతా వా పాలయితా వా. తస్యైషా భవతి.
>
> “అశ్నాపినద్ధం మధు పర్యపశ్యన్మత్స్యం న దీన ఉదని క్షియన్తమ్. నిష్టజ్జభార చమసం న వృక్షాత్ బృహస్పతి ర్విరవేణా వికృత్య” (ఋ. ౧౦-౬౮-౮)
>
> అశనవతా మేఘేనాపినద్ధం మధు పర్యపశ్యన్ మత్స్యమివ దీన ఉదకే నివసంతం నిర్జహార తచ్చమసమివ వృక్షాత్, చమసః కస్మాచ్చమన్త్యస్మిన్నితి బృహస్పతిర్విరవేణ శబ్దేన వికృత్య.

బృహతః - మహతః అస్య జగతః పాతా పాలయితా వా సన్ బృహస్పతి రిత్యుచ్యతే. తస్యైషా - “అశ్నాపినద్ధం ... వికృత్య” అయాస్యస్యాంగిరసః ఇయమ్ ఆర్షమ్. అశ్నా - వ్యాపనవతా మేఘేన. పినద్ధం - బద్ధం మధు - ఉదకమ్ బృహస్పతిః పర్యపశ్యత్ - సర్వతోఽపశ్యత్. ఉదని - ఉదకే క్షియన్తమ్ నివసన్తమ్ = దీనం మత్స్యం న ఇవ. తచ్చ దీనం మధు కుశలః శిల్పీ వృక్షాత్ చమసం న - యజ్ఞపాత్రవిశేషమివ విరవేణ భీషణేన విరావేణ మేఘం సంక్షోభ్య నిర్జభార - నిర్జహార. చమన్తి - భక్షయన్తి అస్మిన్నితి చమసః. బృహస్పతిః కస్మాత్? బృహతః - మహతః ఈగొప్పజగత్తునకు, పాతా, పాలయితా = రక్షకుడు - పాలించువాడు - అందువలన బృహస్పతి యనబడును.

మంత్రార్థము :- బృహస్పతిః = మేఘరక్షకవాయువు, అశ్నా = వ్యాపనశీలమేఘముతో, అపినద్ధమ్=కప్పియున్న, తనలోపలనున్న, మధు= జలమును, పర్యపశ్యత్ = చూచెను. దీనే = స్వల్పమైన, ఉదని=జలము నందు, క్షియన్తమ్ = నివసించుచున్న, మత్స్యం న = చేపవలె, వృక్షాత్=

చెట్టునుండి, విష్ట్యా = కొమ్మను కోసితెచ్చి శిల్పి చమసమ్ = యజ్ఞ పాత్రను చేసినట్లు బృహస్పతియు, వివవేణ = అత్యంతభయంకరశబ్దముతో మేఘమును శిథిలముచేసి - ఉదకమును, నిర్ఘభార-నిర్హరహర = మేఘము నుండి బయటికిపంపుసు - వర్షింపజేసెను.

చమసః వ్యుత్పత్తి కథమ్? అన్నమ్ చమన్తి = ఈచమస - యజ్ఞ పాత్రమునందు అన్నమును భక్షింతురు. కావున చమస అనబడును. 'చము'అదనే ధాతువుతో చమసశబ్దమగును.

బ్రహ్మణస్పతిః - (౭)

బ్రహ్మణస్పతిః బ్రహ్మణః పాతా వా పాలయితా వా.

తస్యైషా భవతి-

"అశ్మాస్యమవతం బ్రహ్మణస్పతిర్మధుధారమభి యమోజసా తృణత్. తమేవ విశ్వే పపిరే స్వర్దృశో బహుసాకం సిసి చురుత్ సముద్రిణమ్" (ఋ. ౨-౨౪-౪)

అశనవంతమాస్యందనవన్తమవాతితం బ్రహ్మణస్పతి ర్మధుభారమభి యమోజసా బలేనాభ్యతృణత్ తమేవ సర్వే పిబన్తి రశ్మయః సూర్యదృశో బహ్వేనం సహా సించన్తి ఉత్సముద్రిణ ముదకవన్తమ్.

బ్రహ్మ - అన్నమ్ - ఋగాది వా తయోః వర్తేః పాతా పాలయితా వా బృహస్పతిః. తస్యైషా - "అశ్మాస్యమవతమ్ ... ఉత్సముద్రిణామ్" బ్రహ్మణస్పతిః అశ్మాస్యమ్ - ఉదకవ్యాపనేన తద్వన్తమ్. ఉదకస్యందనేన వా తద్వన్తమ్ మధుభారమ్ - ఉదకస్య ధారయితారమ్ యమ్ మేఘమ్ ఓజసా - బలేన అభిఅతృణత్ = అభ్యహనత్ తమ్ అవతమ్-అవాఙతితమ్ భూమిం బలరూపేణోత్కృష్టః తమేవ విశ్వే - సర్వే స్వర్దృశః - సూర్యస్య రశ్మయః పపిరే - పిబన్తి. పునశ్చేత్సర్గకాలం ప్రాప్య బహు - తత్ ఉదకం సాకం = సహభూతాః ఏనం అంతరిక్షే ఉద్రిణం = ఉదకవన్తమ్ మేఘం ఉత్సేచయః - సించన్తి. బ్రహ్మణస్పతిః - బ్రహ్మణః అన్నస్య పతిః

పాతా - పాలయితా - బ్రహ్మణః = అన్నముయొక్క పాతాపాలయితా రక్షకుడు - పాలకుడు. ఇది నిర్వచనము. ఈబ్రహ్మణస్పతి మేఘ జలముయొక్క రక్షకుడగువాయువు, వర్షముచేసి అన్నపాలకుడు.

మంత్రార్థము :- మేఘజలరక్షకుడగు వాయువు యమ్ = అశ్మాస్యమ్ = వ్యాపించు నట్టియు, ప్రవహించునట్టియు నతనికారణమును, అవతం = క్రిందికిపోయియున్న, మధుధారం = జలమును ధరించిన, మేఘం = మేఘమును, ఓజసా = తనబలముచే - సామర్థ్యముతో, అభ్యతృణత్ = వర్షింపజేయును, తమేవ = ఆజలమునే, విశ్వే = సమస్త, స్వర్దృశః = సూర్యకిరణములు, పపిరే = పిబన్తి - త్రాగివేయును, మరల నవి యొకేమాటు (సాకం), ఉత్రిణం = ఉదకముగల మేఘమును, బహు సిసిచుః = ఎక్కువగా వర్షించును

భాష్యార్థము :- అశ్మాస్యం = అశనవన్తం = వ్యాపించునది, ఆస్యం దనవన్తం = ప్రవహించునది, అవతం - అవాతితమ్ = అవ = క్రిందికి అతితం = పోయియున్న, బ్రహ్మణస్పతిః బ్రహ్మణస్పతి = వాయువు, మధుధారం = ఉదకముగల, యం = ఏ మేఘమును, ఓజసా = తనబలముతో, అభ్యతృణత్ = చంపివడవేసెను. వర్షింపజేయును, తమేవ= ఆ జలమునే, సర్వేరశ్మయః = సమస్తసూర్యకిరణములు (సూర్యదృశః), బహువిసం = మిక్కిలిగా, సహసించన్తి = ఒక్కసారిగా వర్షింపజేయును. ఉత్సం = మేఘమును, ఉత్రిణం = ఉదకవన్తం = జలముతోనిండిన మేఘమును.

ఇతి ప్రథమః పాదః

ప్రథమ పాదము సమాప్తము

## ద్వితీయ పాదము

క్షేత్రస్యపతిః - (౮)

క్షేత్రస్య పతిః క్షేత్రం క్షియతేర్నివాస కర్మణః తస్య పాతా వా పాలయితా వా.

తస్యైషా భవతి-

"క్షేత్రస్య పతినా వయం హితేనేవ జయామసి. గామశ్వం పోషయిత్న్వా స నో మృళాతీదృశే. (ఋ. ४-५७-१)

క్షేత్రస్య పతినా వయం సుహితేనేవ జయామో గామశ్వం పుష్టం పోషయితృ చాహరేతి. 'స నో మృళాతీదృశే. బలేన వా ధనేన వా. మృళతిర్దానకర్మా పూజాకర్మా వా. తస్యైషా అపరా భవతి-

క్షేత్రపతికి చెందిన రెండవ ఋక్కు.

"క్షేత్రస్య పతే! మధుమన్తమూర్మిం ధేనురివ పయో అస్మాసు ధుక్ష్వ. మధుశ్చుతం ఘృతమివ సుపూతమృతస్య నః పతయో మృళయన్తు" (ఋ. ४-५७-२)

క్షేత్రస్య పతే మధుమన్తమూర్మిం ధేనురివ పయోఽస్మాసు ధుక్ష్వేతి. మధుశ్చుతం ఘృతమివోదకం సుపూతమృతస్య నః పాతారో వా పాలయితారో వా మృళయన్తు, మృళయతి రుపదయాకర్మా పూజాకర్మా వా.

నివాసార్థాత్ క్షియతేః క్షేత్రం తత్ పాతి పాలయతి వేతి క్షేత్రస్య పతిః. తస్యైషా - "క్షేత్రస్య పతినా ... మృడాతీదృశే" వామదేవస్యార్షమ్. క్షేత్రస్య పతినా - సుహితేన కేనచిదాప్తేన మిత్రేణేవ సహితాః సన్తో వయం జయామసి - జయామః పోషయిత్వా - పోషణసమర్థాని గామ్ అశ్వమ్ - గవాశ్వాదీని ధనాని ఆహర. ఈదృశే - ధనలాభాయ క్షేత్రస్య పతిః మృడాతి- మృడయతు - దదాతు.

"తస్యైషాపరా-హే క్షేత్రస్యపతే! ... మృడయన్తు" హే క్షేత్రస్య పతే! మధుమన్తమ్ - మధురం ఊర్మిం - ఉదకసంఘాతం ధేనురివ పయః - దుగ్ధం అస్మాసు ధుక్ష్వ - ప్రకిర. మధుశ్చ్యుతమ్ ఘృతమివ సుపూతమ్. మధు ఇవ ముహుర్ముహుః శ్చ్యోతతి ఘృతమివ సుపూతమ్

అకలుషముదకం ఋతస్య ఉదకస్య పతయః పాతారః మాధ్యమికా దేవాః మృడయన్తు అస్మాన్ - రక్షన్తు.

క్షేత్రస్య పతిః=క్షేత్రముయొక్క, పతిః=రక్షకుడు, వాయుః=వాయువు, క్షేత్రం - నివాసకర్మణః=నివాసార్థక 'క్షియితేః క్షి'ధాతువుచే సిద్ధమగును, క్షేత్రం = అట్టి క్షేత్రమునకు పాలకుడు = రక్షకుడు క్షేత్రపతిః=వాయువు.

మంత్రార్థము :— మేమెల్లరము హితేనేవ=మిక్కిలి హితకారకుడగు ఆప్తమిత్రునివలె, క్షేత్రస్యపతినా = వాయుసహాయముతో, జయామసి = ఉత్కృష్టతను పొందుదుముగాక ! ఆ వాయువు, గామ్ = గోవులను, అశ్వం= గుఱ్ఱములను, పోషయిత్ను = పుష్టికారకధనమును లేక ఉదకమును మాకొఱకు ఆహరణమొనర్చును, సః = ఆ క్షేత్రపతివాయువు, ఈదృశే = ఇటువంటి ధనాదులచే, నః = మమ్ము, మృడాతి = సుఖులనుజేయును లేక ధన, బలాదికానుకలతో మమ్ము పూజించును, హితేనేవ - సుహితేనేవ = మిత్రునివలె, పోషయిత్ను = పోషించుధనాదుల నొడగూర్చును, మృడతిః = దానార్థకము లేక పూజార్థకము.

భాష్యార్థము :— క్షేత్రస్యపతే ! = ఓ క్షేత్రపతి ! వాయూ !, ధేనుః పయఃఇవ = గోవుపాలనిచ్చునట్లు, అస్మాసు అన్నేషు=మాయన్నములందు, మధుమంతం = మధురమైన, ఊర్మిం = జలసంఘాతము - జలధారలను మేఘములనుండి, ధుక్ష్వ = పిండుము - వర్షింపజేయుము, ఋతస్య పతయః = ఉదకస్వాములైన వాయువులు, మధుశ్చ్యుతం = మధువువలె మధురములైన, ఘృతమివ సుపూతం = ఘృతమువలె పవిత్రములైన నిర్మలములైన జలములను వర్షింపజేయునుగాక !, నః = మాయొక్క, శుష్కములైన పైరులను, మృడయన్తు = ఫలవంతములుచేయునుగాక ! ఆ విధముగ మాకు పూజచేయునుగాక !.

అథ పునరుక్తి దోషవిచారణ :

తద్ యత్ సామాన్యమృచి సమానాభివ్యాహారం భవతి. తజ్జామి భవతీత్యేకం మధుమన్తమ్ మధుశ్చ్యుతమితి యథా. యదేవ సమానే పాదే సమానాభివ్యాహారం భవతి తజ్జామి

భవతీత్యపరమ్. "హిరణ్యరూపః స హిరణ్యసందృక్" ఇతి యథా.

యథా కథా చ విశేషోఽజామి భవతీత్యపరమ్ – "మండూకా ఇవోదకాన్ మండూకా ఉదకాదివ ఇతి యథా. యోగక్షేమం వ ఆదాయాహం భూయాసముత్తమ ఆ వో మూర్ధాన మక్రమీమ్. అధస్పదాన్మ ఉద్వదత మండూకా ఇవోద కాన్మండూకా ఉదకాదివ.

అతఏవ మంత్రాత్ ప్రసక్తమతఃపరమ్ సర్వమంత్రేషు జామ్యా జామితా పదానాం చింత్యతే. నిగమత ఏవ జామితిపునరుక్తస్య సంజ్ఞా. తదేతత్ పునరుక్తం ద్వివిధమ్. సమానశబ్దార్థమ్ అసమానశబ్దార్థం చేతి. ఏకస్మిన్నేవ వాక్యాధికారే ఏకార్థమేవ యదేకమేవ పదం పునరుచ్యతే తత్ సమానార్థం భవతి. తద్యథా - "మస్త్ర రేజతి తక్షేహ మస్త్ర రేజతి".

యచ్చ పునరసమానార్థమభ్యస్యతే తదపునరుక్తమేవ. తదర్థమాహో - ద్వైత తదితి - సమానాభ్యామృచి - ఏకస్యామృచి సమానాభివ్యాహారమ్ - సమమర్థం - కథయంతి తదుక్తం అర్థాత్ పూర్వార్ధర్చే ఉక్తోఽర్థః తమేవోత్తరే అభివదతి 'జామి'భవతి యథా "మధుమత్తం మధుశ్చుతమ్" యోహి మధుశ్చుత్ అవశ్యమసౌ మధుమాన్. ఇత్యేకస్యాచార్యస్య మతమ్. అపరః ఆచార్యః పునః సమానే పాదే ద్విరుపాత్తం పదం జామీతి మన్యతే యథా - "హిరణ్యరూపః స హిరణ్యసందృక్" ఇతి.

తదేకిం పునరుక్తైః పదైః తన్మంత్రవాక్యం దూషితమ్? ఆహ నేతి. యథా కథంచిత్ తత్ర కశ్చిద్ విశేషః వాచ్యః ఛందసో దృష్టానువిధానాదితి అపరం మతమ్. అన్యే పునః కృతా వాక్యార్థస్య సమాప్తిరేవ ఏవం ఘాతమ్ అభ్యస్యమానమతిరిక్తం పదం నిపాతవత్ పాదపూర్వకత్వేన సార్థమితి సమాదధతి. ఆచార్యస్య యాస్కస్యాపి ఏతదేవాభీష్టమ్ తథా చోదాహరతి - "మండూకా ఇవోదకాన్ మండూకా ఉదకానివ".

అర్థము :– పునరుక్తిదోషవిచారము :– తత్ = కావున, యత్=ఏది, సమాన్యామ్ = ఒకేఋక్కు - మంత్రమందు, సమానాభి - వ్యాహారం

భవతి = ఒకేయర్థమును బోధించు రెండవ పదముండునో-ఒకేవిషయము - అర్థము రెండుపదములతో నెక్కడచెప్పబడునో అది, జామి = పునరుక్తి దోషమగును, అని యొకమతము. ఉదాహరణము - "మధుమన్తమ్" 'మధుశ్చుతమ్' అను నీరెండుపదములు ఒకేయర్థమును దెలుపుచున్నవి. ఏవి మధుమాన్ = మధువుకలదియో, అదియే మధుశ్చుత్ = మధువు కలది, ఏదిమధుమంతమో అదియే మధుశ్చుతము - ఇటురెండుపదములు ఒకేయర్థమును దెలుపుచున్నవనుటలో నెట్టిసందేహములేదు. దీనినే జామి = పునరుక్తిదోషమందురు. కావున వేదమునందు పునరుక్తిదోష మున్నదా ? లేదా ? యని విచారింప - ఆలోచింపవలసివచ్చినది. ఉన్నచో నెట్లు ? లేనిచో నదియెట్లు ? వేదప్రామాణ్యము నంగీకరింపనివారిట్లు ప్రశ్నించినచో ఆస్తికులు వేదమీశ్వరీయము స్వతఃప్రమాణము అని యంగీకరించువారు చెప్పుసమాధానమేమి ?

ఇతిఅపరమ్ = ఇదిమఱియొకమతము, ఏదియన :- ఏమంత్రమున నొకేపాదమున సమానాభివ్యాహరం భవతి = ఒకేయర్థమును దెలుపు రెండు పదములుండునో అది జామి = పునరుక్తియనబడును. అనగా మంత్రము లోని యొకే పాదమునందు ఏకార్థకపదములు రెండుఉన్నచో నదిజామి పునరుక్తిదోషమగును. అట్లుకాక ఒకేయర్థమును దెలుపురెండుపదములు మంత్రమున భిన్నభిన్నపాదములందు ప్రయోగింపబడినచో నది జామి - పునరుక్తికాదు - అని మఱియొకమతము - ఎట్లన :—

ఉదాహరణము - హిరణ్యరూపః - హిరణ్యసందృక్ - హిరణ్య రూపముకలది, హిరణ్యరూపమువలె కనబడుచున్నది. ఈ రెండు పదములు ఒకేయర్థమును దెలుపుచున్నవి హిరణ్యరూపముకలది హిరణ్యముగానె కనబడును. హిరణ్యముగా కనిపించునది హిరణ్యరూపము కలదియే యగును. ఇందు సందేహములేదు. కావున నీరెండుపదములు (ఒకే యర్థమును బోధించునవి) మంత్రమున నొకేపాదమున ప్రయోగింప బడినవి. కావున నీమంత్రము పునరుక్తిదోషముకలదియగును ఇట్టియెడ సిద్ధాంతరూపమున యాస్కాచార్యులిట్లనుచున్నారు.

ఇట పునరుక్తిదోషములేదు - వేదములందు పునరుక్తి (జామి) దోషము లేనేలేదు = ఏలయన? - యథా కథా చ విశేషః - ఏమంత్రములందు ఏకార్థబోధకములగు రెండుపదములనుజూచి యట పునరుక్తిదోషమున్నదని యనుచున్నారో యది సరికాదు. ఏలయన, ఆ రెండుపదములు బోధించు అర్థము యథాకథాచ - ఏదోయొకవిధమున అర్థములందు విశేషము - భేదము తప్పకయుండును - అనగా నారెండుపదములు ఏకార్థకములు కావు. భిన్నార్థములనె బోధించునని యాస్కాచార్యుని యభిప్రాయము. కావున వేదములందు పునరుక్తి(జామి) దోషములేదు. (అజామి) పునరుక్తి కాదు అనునది అపరమ్ మతమ్ = మఱొకమతము. ఇదియే సిద్ధాంతము కూడ. ఉదాహరణముకొఱకు ఇట నీమంత్రమును జూడుడు.

మంత్రార్థము:— లిప్సిత పదార్థప్రాప్తి యోగమనబడును. ఆ లభించిన పదార్థమును రక్షించుట క్షేమమనబడును. ఓశత్రువులార !, అహమ్ = నేను, వః = మీయొక్క, యోగక్షేమములను, ఆదాయ=తీసికొని ఉత్తమః భూయాసమ్ = మీయుత్కృష్టుడనై యుండును. మఱియు వః = మీయొక్క, మూర్ధానమ్ ఆక్రమిమ్ = శిరస్సులమీద అధిష్ఠుడనై యుండును. అధస్పదాత్ = నాపాదతలమునుండి నాకులోబడియుండి, ఉద్వదత = మాట్లాడగలుగుదురు అనగా మీరు నాయధీనమునుండి యిష్టము వచ్చినట్లు మాటలాడుడు నాయాజ్ఞలేక మీరేమియు మాటలాడజాలరు. ఎట్లనః- ఉదాహరణమునకు - మండూకములు ఉదకాత్ = జలమునందుండి తమ యిష్టమువచ్చినట్లు బెకబెకమని పెద్దగాఅఱచును. అట్లే మీరును నాయధీనమునుండి బాగుగ మాటలాడగలుగుదురు. కాని మండూకములు కప్పలు జలమునుండి బయటపడి బెకబెక అని పెద్దగానఱవజాలవు. అట్లే మీరును నాయాజ్ఞ లేక యేమియు మాటలాడజాలరు. ఇట్టి మంత్రమున ఏకార్థక పదములు రెండు ఉండియు ఉపమానభేదముచే ఆరెండుపదముల యర్థమునందు కొంతభేదము - విశేషము ఉన్నది. విశిష్టార్థకములగుచున్నవి - అనగా నొకయెడ మండూకములు ఉపమానము మఱియొకయెడ జలము ఉపమానము. ఈవిశిష్టత యిట తెలియనగును. ఇట పునరుక్తిలేదు. మంత్రమున మధుమాన్ - మధుమ్మత పదములయర్థమున భేదమున్నది. మధుమాన్ అన - మధుమంతము - మధుమంతమైనంతమాత్రమున నది

ఎప్పుడు - సతతము - మధువును స్రవింపదు - మధుశ్చ్యుతముకాదు. మధుశ్చ్యుతమనగా మధువును స్రవించునదియని యర్థము. ఇట్లు ఆ రెండుపదములయర్థమున కొంచెము భేదమువశ్యమున్నదని భావము. ఇష్లై-హిరణ్యరూపః హిరణ్యసందృక్ అను రెండుశబ్దములును ఏకార్థబోధకములుకావు. వానిలో సర్థభేదమున్నది. అది యెద్దియన - హిరణ్యరూపము ఎల్లప్పుడు హిరణ్యరూపమున కనబడవలయునను నియమములేదు. క్రతుప్రద్వేషించదగినవ్యక్తి ద్వేష్యుడు సురూపుడయ్యు కురూపుడుగా కనబడును. అట్లేయిట మధుమాన్ - మధుశ్చ్యుతపదములలో అర్థవిశిష్టత లేకపోలేదు. అర్థమున భేదమువకింత తప్పకయున్నది - మధుమంతము = మధువు కలది, మధుశ్చ్యుత = మధువును స్రవించునది = మధుమంతము ఎల్లప్పుడు మధుస్రావకము కాకుండవచ్చునుకదా! కావున నట పునరుక్తిదోషమునకు ప్రసక్తిలేదు.

మఱియు కొన్నియెడల ఒకేవిషయమును బలపఱచుటకు ఒకపదమును రెండుపర్యాయములు ప్రయోగించుటయుకలదు. ఒకవ్యక్తిపరువిడుచున్నపుడు అతనినిత్వరగ పరుగిడుము అనుటకు పరువిడు, పరువిడు - పరుగెత్తు - పరుగెత్తు అని యొకేపదము బాగుగపరుగెత్తుము లేక వేగముగా పరుగెత్తుము అనువిశేషమును బోధించుటకు ఒకేపదము రెండుసారులు వాడుట లోకవిదితము. అందువలననే యాస్కాచార్యులు - అభ్యాసే భూయాసమర్థమ్ మన్యన్తే యథా అహో దర్శనీయా! అహో దర్శనీయా! అని. అభ్యాసమున ద్విరుక్తపదమాధిక్యమును తెలుపునదనుచున్నారు. ఎట్లన - అహో దర్శనీయా! అహో దర్శనీయా! అన్నపుడు మిక్కిలిగ దర్శింపదగినదని అర్థమును బోధించును. అని యాచార్యులమతము. కావుననిట్లు వేదములందు పునరుక్తిదోషములేదనుట నిశ్చితసిద్ధాంతము.

వాస్తోష్పతిః - (౯)

వాస్తుర్వసతేః నివాసకర్మణః తస్య పాతా వా పాలయితా వా.

తస్యైషా భవతి-

వాస్తోష్పతి విషయక ఋక్కు.

> "అమీవహా వాస్తోష్పతే విశ్వారూపాణ్యావిశన్। సఖా సుశేవ ఏధి నః" (ఋ. ౭-౫౫-౧)
>
> అభ్యమనహా వాస్తోష్పతే! సర్వాణి రూపాణ్యావిశన్ సఖా నః సుసుఖో భవ. శేవ ఇతి సుఖనామ శిష్యతేర్వకారో నామకరణోఽన్తస్థాంతరోపలింగీ. విభాషితగుణః శివ మిత్యప్యస్య భవతి. యద్ యద్ రూపం కామయతే త త్తత్ దేవతా భవతి। "రూపం రూపం మఘవా బోభ వీతి" ఇత్యపి నిగమో భవతి.
>
> రూపం రూపం మఘవా బోభవీతి మాయాః కృణ్వాన స్తన్వం పరిస్వామ్. త్రిర్యద్ దివః పరి ముహూ ర్తమాగాత్ స్వైర్మ న్త్రైరనృతుపా ఋతావా।

నివాసార్థాత్ వసతేః వాస్తుః - గృహం తస్య పాతా పాలయితా వా వాస్తోష్పతిః. తస్యైషా - "అమీవహా ... ఏధి నః" వసిష్ఠస్యార్షమ్. హే వాస్తోష్పతే! త్వం అస్మాకం అమీవహా - అమీవా రోగః తస్య హన్తా భవ విశ్వా - సర్వాణి ఆ విశన్ - అస్మత్కష్టకారణస్య యః ప్రతిపక్షః యథా సర్పస్య నకులః తస్య తస్య రూపం స్వీకుర్వన్ త్వమస్మద్ రోగాన్ జహి త్వర్థః. కించాస్మాకం సుశేవః - సుసుఖః సఖా భవ. శేవః ఇతి సుఖనామ కథమిత్యుచ్యతే శిషః వకారే ప్రత్యయే కృతే ధాతోరన్తే వర్తమానస్య వకారస్య అంతరం - అవకాశం ఉపలింగయతీతి తదుక్తః వకారః, తతో గుణే శేవః. ఏవ చ ధాతుః విభాషయా సగుణః అగుణపక్షే చ శివమిత్యపి సిద్ధ్యతి వాస్తోష్పతిః సర్వాణి రూపాణి ఆవేష్టుం శక్నోతి యతః స దేవతా. దేవతా చ యం యం రూపం కామయతే తత్తద్ రూపం ధారయతి. "రూపం రూపం మఘవా బోభవీతి". ఇతి నిగమోఽప్యముమేవార్థం సమర్థయతి.

అర్థము :- వాస్తుశబ్దము నివాసకర్మకః నివాసార్థక వసతేః = వస ధాతువువలన నేర్పడును. గృహముఅర్థము - (వాస్తుః గృహమ్) తస్య

పాతా వా పాలయితా వా. తస్య ఆ గృహమునకు రక్షకుడు = పాలకుడు - అనగా వాస్తోష్పతిః = వాయువు బ్రాహ్మముహూర్తె వీచునదియునో మఱియు గృహమునగల రోగములనన్నింటిని ఎటకో గొంపోవునో - హరించునో ఆ వాయువు వాస్తోష్పతియనబడును. కావున గృహనిర్మాణము అబాధ గతితో వాయువు గృహములందు వచ్చిపోవుటకు వీలుగాచేయవలయును. విశేషించి ఉషఃకాలపువాయువు అడ్డులేకుండ గృహమున ఆవాగమనము చేయునట్లు గృహమునిర్మింపవలయును. గృహస్థులు ప్రాతః భ్రమణార్థము బహిఃప్రదేశములకు వెళ్లుచుండవలెను.

మంత్రార్థము :- వాస్తోష్పతే ! = వాస్తోష్పతినామముగల ఓవాయూ ! నీవు. విశ్వా = సమస్త, రూపాణి=పదార్థములందు, ఆవిశన్=ప్రవేశించుచు, అమీవహా = రోగహారకము అగుము (ఏధి). మఱియు నీవు, నః = మాకు, సుశేవా = ఉత్తమసుఖదాతవైన, సఖా = మిత్రుడవగుము.

భాష్యార్థము :- అమీవహా = రోగహన్తా, శేవ ఇతి సుఖనామ = శేవ అనునది సుఖమునకుపేరు, హింసార్థకశిషధాతువునకు వప్రత్యయము, షకారమునకు లోపము వైకల్పికగుణమగుటవలన శేవశబ్దమేర్పడును. ఇట్లు శివ, శేవశబ్దములు రెండుసిద్ధించును. ఆరెండుపదములకర్థము సుఖము. శేషతి - హినస్తి దుఃఖమ్ = శేవః - దుఃఖమును నశింపజేయు నది. శేవము సుఖము, శిష్యతేః - శిషధాతువువలన వకారః నామకరణః= వకారప్రత్యయమగును, అస్తస్థాంతలోపలింగీ వ ప్రత్యయము 'శిష'ధాతు చివరనున్న షకారస్థానమును - ఉపలింగీ = గ్రహించునది యగును. అనగా 'శిష'ధాతువునకు వప్రత్యయము 'శిష'లో అంతమున నున్న 'ష' కారస్థానముననగును. ఇట్లు 'శిష' - శివఅగును తదుపరి విభాషితగుణమైె శివ, శేవరెండుపదములుసిద్ధించును, ఈరెండుశబ్దములు సుఖార్థమున వచ్చును. యద్ యద్ రూపం = ఏయేరూపమును కామయతే = ఏయే రూపమును గోరునో దేవతా ఆయారూపమును బొందును - (దేవతాతత్ర ద్రూపం భవతి) వాయువు ఎందుప్రవేశించిన నందుకలిసి ఆరూపమును ధరించుననిభావము. "రూపం రూపం మఘవా ..." మంత్రము పూర్తి రూపము.

మంత్రార్థము — మఘవా = వాయువు, స్వాం తన్వం పరి = తన శరీరమునందే, మాయాః కృణ్వానః = మాయను రచించుచు - ఆయా పదార్థముల ననుసరించి వానియందుచేరి వానిరూపములను ధరించు చుండును (రూపం రూపం ప్రతిరూపం బోభవీతి అవాయువు త్రిః ముహూర్తమ్ = విశేషసమయము ప్రాతఃకాలమున బ్రహ్మముహూర్తమున, దివః = ద్యులోకమునుండి, పరి అగాత్ = వచ్చును, వాయువు స్వైః మంత్రైః=తనమంత్రములతో, స్తూయమానః వా హూయామానః = స్తుతింప బడుచు లేక హూయమానః = పిలువబడుచు, అనృతుపాః = వర్షర్తువు లేనప్పుడుకూడ జలమును పానముచేయువాడవు జలీయకణములను గ్రహించి చల్లబడుదువు అట్లే తథా ఋతావా = బ్రహ్మయజ్ఞముతోకూడి యుందువు.

వాచస్పతిః - (౧౦)

వాచస్పతిర్వాచః పాతా వా పాలయితా వా.

తస్యైషా భవతి.

"పునరేహి వాచస్పతే! దేవేన మనసా సహ. వసోష్పతే నిరామయ మయ్యేవ తన్వం మమ" (ఋ. ౧-౧-౨)

ఇతి సా నిగదవ్యాఖ్యాతా.

వాచః పాతా పాలయితా వా ప్రాణాత్మనా ఇంద్రః.

తస్య వాచస్పతేః ఏషా - "పునరేహి ... తన్వం మమ" హే ప్రాణ! త్వం మాం ప్రతి - పునరేహి. దేవేన - సమస్తేంద్రియ వృత్తి - ప్రకాశకేన మనసా సహ. హే వసోష్పతే! ధనస్యాన్నస్య చ పతే! మమ తన్వమ్ - శరీరం మయి ఏవ నిరామయ. ప్రాణపృథగ్భూతమివాత్మానం మన్య మానః స్తోతా బ్రవీతి.

వాచస్పతిః వాచఃపతి = ప్రాణవాయువు, ఇతి వాచః = వాణియొక్క, పతిః = రక్షకుడు లేక పాలకుడు.

వాచఃపతిః = ప్రాణవాయువు ఇది వాణిని రక్షించును.

మంత్రార్థము :- హే వాచస్పతే = ఓ ప్రాణ వాయూ దేవేన మనసాసహ = దివ్యగుణయుక్తము, సర్వేంద్రియములను ప్రవర్తింపజేయు మనస్సుతోపాటు, పునఃఏహి = మరల నాకడకు రమ్ము, వసోష్పతే! = ధనములకు అన్నమునకు రక్షక! లేక జీవనాధార! మమ తన్వం=నాశరీరము, మయ్యేవ=నాయందే రమింపజేయుము. (కొండొకపాపి పాపకర్మ నొనర్చి తనను తాను గతప్రాణునిగానెంచి యిట్లు ప్రార్థించును) హే ప్రాణ! ఓ ప్రాణమా! నన్ను విడచి వెళ్లకు - నాయందే రమించుము. లేక ఒకానొకతపస్వి, ఓ ప్రాణమా! నీవు నన్నిజీవనమున రమింపజేయుచునే యున్నావు. అగ్రిమజీవనమునందును నన్ను చేరుము. అని ప్రార్థించును.

అపాం నపాత్ - (౧౫)

అపాంనపాత్ తనూనపాత్రా వ్యాఖ్యాతః.

తస్యైషా భవతి-

"యో అనిధ్మో దీదయదప్స్వ౨న్తర్యం విప్రాస ఈళతే అధ్వరేషు. అపాంనపాత్ మధుమతీరపో దా యాభిరింద్రో వావృధే వీర్యాయ" (ఋ. ౧౦-౩౦-౪)

యో అనిధ్మో దీదయద్ దీప్యసే అభ్యంతరమప్సు యం మేధావినః స్తువన్తి యజ్ఞేషు సోఽపాంనపాత్ మధుమతీరపో దేహ్యభిషవాయ యాభిరింద్రో వర్ధతే వీర్యాయ వీరకర్మణే.

అపాంనపాత్ శబ్దమునకు తనూనపాత్ శబ్దమునకువలె వ్యాఖ్యచేసికొనవలెను. అనగా జలముతో సంఘర్షణము, ఆసంఘర్షణమువలన విద్యుత్తు ఉత్పన్నమగును. కావున నీవిద్యుత్తు అపాంనపాత్ అని యర్థము.

తనూనపాత్రా వ్యాఖ్యాతః. మధ్యమో అభిధేయః. అప్స్వ౨ ఆదిత్యః తతో మధ్యమః ఏవమపాం పాత్రః. తస్య ఏషా - "యోఽనిధ్మో ... వావృధే వీర్యాయ" కవషస్యేయమార్షమ్ హే అపాంనపాత్! త్వం యః అనిధ్మః - అనింధనః సన్నపి దీదయత్ - దీప్యసే అంతః - అభ్యంతరమ్ - అప్సు

వర్తమానం త్వాం విప్రాసః - మేధావినో బ్రాహ్మణాః అధ్వరేషు-యజ్ఞేషు ఈడతే - స్తువన్తి. సః త్వం మధుమతీః - మధురాః అపః-జలాని దాః-దేహి. యాభిః ఇంద్రః - ఈశానః వీర్యాయ - వీరకర్మణే వావృధే - వర్ధతాం. ఇత్యేవం ప్రార్థయామహే.

మంత్రార్థము :- హే అపాంనపాత్ ! = ఓ విద్యుత్తా !, యః త్వం= ఏ నీవు, అనిధ్మః = ఇంధనములేకయే, అప్సు అంతః = జలముమధ్య - లోపల, దీదయత్ = దీప్తముగుచుందువు, విప్రాః = మేధావులైన బ్రాహ్మణులు, యమ్ = ఏ నిన్ను, అధ్వరేషు = యజ్ఞములందు, ఈడతే = స్తుతింతురు, అట్టినీవు, మధుమతీః = మధురఅపః = మధురజలములను, నః = మాకు, దాః = ఇత్తువుగాక ! యాభిః = ఆ జలములతో, ఇంద్రః స్వయం = ఇంద్రుడు సోమపానముపలన, వీర్యాయ = పరాక్రమ సంబద్ధ కార్యములకొఱకు, వావృధే = వృద్ధిపొందునుగాక !

యమః - (౧౨)

యమో యచ్ఛతీతి సతః.

తస్యైషా భవతి-

"పరేయివాంసం ప్రవతో మహీరను బహుభ్యః పంథామను పస్పశానమ్. వైవస్వతం సంగమనం జనానాం యమం రాజానం హవిషా దువస్య" (ఋ. ౧౦-౧౪-౧)

పరేయివాంసం పర్యాగతవంతం ప్రవత ఉద్వతో నివత ఇతి. అవతిర్గతికర్మా, బహుభ్యః పంథానమనుపస్పాశయమానం వైవస్వతం సంగమనం జనానాం యమం రాజానం హవిషా దువస్యతి దువస్యతీ రాధ్నోతికర్మా. అగ్నిరపి యమ ఉచ్యతే. తమేతా ఋచోఽనుప్రవదన్తి.

ఆ యగ్నిని యముడని చెప్పు ఋక్కులు.

"సేనేవ సృష్టామం దధాత్యస్తుర్న దిద్యుత్త్వేషప్రతీకా.

యమో హ జాతో యమో జనిత్వం కనీనాం పతిర్జనీనామ్"
(ఋ. ౧-౬౬-౪)

"తం వశ్చరాథా వయం వసత్యా స్త్రత గావో నక్షన్త ఇద్ధమ్" (ఋ. ౧-౬౬-౫)

ఇతి ద్విపదాః సేనేవ సృష్టా భయం వా బలం వా దధాత్య స్తురివ దిద్యుత్ త్వేషప్రతీకా బలప్రతీకా యశఃప్రతీకా మహాప్రతీకా దీప్తప్రతీకా వా. యమో హ జాత ఇంద్రేణ సహ సంగతః. యమావిహేహ మాతరా. ఇత్యపి నిగమో భవతి-

యమ ఏవ జాతో యమో జనిష్యమాణో జారః కనీనాం జరయితా కన్యానాం పతి జనీనాం పాలయితా జాయానాం తత్ప్రధానా హి యజ్ఞసంయోగేన భవన్తి. తృతీయో అగ్నిష్టే పతిః" ఇత్యపి నిగమో భవతి. తం వశ్చరాథా చరన్త్యా పశ్వాహుత్యా వసత్యా చ నివసన్త్యౌషధాహుత్యాస్తం యథా గావ ఆప్నువన్తి తథాప్నుయామేద్ధం సమిద్ధం భోగైః. "వళిత్థా మహిమా వామింద్రాగ్నీ పనిష్ఠ ఆ. సమానో వాం జనితా భ్రాతరా యువం యమావిహేహ మాతరా".

"సోమః ప్రథమో వివిదే గంధర్వో వివిద ఉత్తరః. తృతీయో అగ్నిష్టే పతిస్తురీయస్తే మనుష్యజాః"

"తం వశ్చరాథా వయం వసత్యాస్తం న గావో నక్షంత ఇద్ధమ్. సింధుర్నక్షోదః ప్రనీచీరైనోన్నవన్త గావః స్వర్దృశీకే"

యస్మాద్దేవః యచ్ఛతి జీవితాత్ ఘాతసంఘమ్ ఉపరమయతి తస్మాత్ యమః. తస్యైషా - "పరేయివాంసమ్... హవిషాదపస్యా హవిర్దానస్తోత్రమ్. ప్రవతః - మనుష్యాన్ ఉద్వతః - దేవాన్ నివతః - తిర్యంచః మహీః -

మహతీః భూతజాతీః పరేయివాంసమ్ - పర్యాగతవంతమ్ - ప్రాప్తవంతమ్
బహుభ్యః - పుణ్యకృద్భ్యః పాపేభ్యః చ పంథాం - పంథానం అనుపస్ప-
శానం - అనుపస్పాశయమానం - ఏవమయం ప్రాణో జీవనముత్సృజ్యతీతి
చౌర ఇవ తం జీవం స్పాశయిత్వా - బద్ధ్వా - జీవితాత్ వియోజయంతమ్
వైవస్వతమ్ - వివస్వతః పుత్రం జనానాం సంగమనం - సమచకుష్కమ్
రాజానం యమం హే యజమాన! హవిషా - అనేన పశురూపేణ దువస్య -
పరిచరస్వేత్యర్థః అగ్నిరపి యమశబ్దేన వాచ్యః తమేతమర్థమ్ ఋచః
అనుప్రవదన్తి - సమర్థయన్తి. తథాహి-సేనేవ సృష్టామ ... పతిర్జనీనామ్"
పరాశరస్యార్షమ్ యస్య అగ్నేః అర్చిః సృష్టా - సేనాపతినా ప్రేరితా సేనా
ఇవ, అస్తుః - క్షేప్తుః త్వేషప్రతీకా, భయప్రతీకా, దీప్తప్రతీకా వా విద్యుత్ -
అయుధం ఇవ అమం - భయం బలం వా దధాతి - దదాతి సః యమః -
పార్థివః అగ్నిరేవ జాతం జనిత్వం - జనిష్యమాణం చ వర్తతే. స ఏవాగ్నిః
కనీనామ్ - కన్యానామ్ జనీనామ్ - జాయానాం చ జారః - జరయితా.
యథా చ యమః పార్థివోఽగ్నిరేవ యమః తథా నిగమాంతరేణోదాహరతి"
"యమో హ జాతః ఇంద్రేణ సంగతః" తథా చ "యమావిహేహ మాతరా"
ఇహ ఇహ పృథివ్యామంతరిక్షే చ మాతా-మాతారౌ నిర్మాతారౌ. అయం చ
అపరః స్పష్టతరః నిగమః "తృతీయోఽగ్నిష్టే పతిః" హే సౌమ్యే కుమారి!
తే తవ అగ్నిః తృతీయః పతిః.

తం వశ్చరాథావయం-తం అగ్నిం యమం వః ఇత్యనర్థకం చరాథా-
చరన్త్యా జంగమయేత్యర్థః పశ్వాహుత్యా వసత్యా - నివసన్త్యా చ ఔషధా-
హుత్యా చ అస్తం - గృహం గావః న - ఇవ ఆప్నువన్తి తథా భోగైః ఇద్ధం -
సమిద్ధం అగ్నిం వయం ఆప్నుయామ.

అర్థము :- యమః = యముడు అనేల? యచ్ఛతి - ఉపరమింప
జేయును. (ఉపరమార్థక 'యమ'ధాతువువలన యమః అగును)

మంత్రార్థము:- ప్రవతః ఉద్వతః=దేవ,మనుష్య, పశు, పక్షి మున్నగు,
మహీః = మిక్కిలి పెద్దవియైన భూతజాతులందు అనుపరేయివాంసమ్ =
ఇమిడియున్న, బహుభ్యః = వీనిలో చాలమందికి, పంథామ్ = ఇతడే
మార్గమున వెళ్లవలెను. అతడామార్గమున వెళ్లవలెను అని ఈ విధముగ

నెల్లరకు సర్పదంశజ్వరము మున్నగుమార్గములను, అనుపస్పశానమ్ = చూపుచు, వైవస్వతమ్ వివస్వాన్ = సూర్యుని అపత్య - సంతానమైన, జనానాం సంగమనం = మనుష్యులను కర్మానుసారముగ గతులనుచేర్చు, రాజానం యమం = రాజైనయముని, హవిషాదువస్య = హవిస్సుతో పరిచర్యచేయుము.

భాష్యార్థము :- పరేయువాంసం - పర్యాగవన్తం = అన్నింటిలోను వ్యాప్తమైయున్న, ప్రవతః ఉద్వతః నివతః=మనుష్యదేవ, పశు - పశులను లేక, ఉత్కృష్ట, మధ్యమ, అధమయోనులుగల భూతవర్గమును, అవ తిర్గతికర్మా = ఇట గత్యర్థక అవధాతువు - ప్రవతః = ప్రకృష్టగతిః (మనుష్యః) ఉద్వతః - ఊర్ధ్వగతి దేవః నివతః = నికృష్టగతికల, బహుభ్యః = అనేకులకు, పంథానం = మార్గమును, అనుపస్పశయమానం - దర్శయన్తం = చూపుచున్న, దువస్యతిః - దువస్యధాతుః రాధ్నోతికర్మా= పరిచర్యార్థకము. అగ్నికూడ యముడందురు. ఈఋక్కులు రెండురెండు పాదములుగలవి. కొన్ని మూడుపాదములు కలవి. రెండేసికలిపి పఠింపబడును.

మంత్రార్థము :- సృష్టాసేనాఇవ = ఈయగ్ని పంపబడినసేనవలె, అమం దధాతి = భయమును, బలమును, దధాతి=ధరించును, భయము శత్రువులకొఱకు బలము తనపక్షమునకై, అస్తుః = విసరివేయు యోధుని దిద్యుత్ న = వజ్రముతోసమానముగా, త్వేషప్రతీకా = భయానకుడు, లేక ప్రకాశించువాడునగును, జాతః=అన్నాదిపదార్థములెయ్యవి యుత్పన్నమైనవో యవియన్నియు యముడే, యముడు అగ్నియే - అగ్నిప్రతాపము వలననే యవి యుత్పన్నములైనవి, జనిత్వం యమః = ముందు జనింపబోవునవన్నియు యముడే, అగ్నివలననే యుత్పన్నములగును, కనీనాం జారః = ఈయగ్నియే కన్యలకన్యాత్వమును నశింపజేయును - అనగా కన్యలవివాహముకూడ ఈయగ్నిమూలముననే జరుగును. వివాహము తదుపరియే కన్యాత్వము నష్టమగును. జనీనాం పతిః = ఈయగ్నియే, జాయానాం = భార్యలగూడ పాలించువాడు వివాహానంతరము గృహస్థులు తమయింట్లయందు త్రివిధఅగ్నులనుంచి కాపాడవలయును.

భాష్యార్థము :— సేనాఇవసృష్టా = పంపబడినసేనవలె, అమం = భయంవా బలం వా = అమ అనుశబ్దార్థము - భయము, బలము, దధాతి= ధారణచేయును, అస్తుర్న = అస్తువలె విసిరివేయువానివలె, విద్యుత్ వ్రబత్వేషప్రతీక = అర్థము - ప్రతీకపదమునకర్థము - దర్శనము - త్వేషదీప్తౌ ధాతువువలన త్వేష సిద్ధమగును. దీప్తము—దేనివలనదర్శనము దీప్తమో అది - అగ్ని - లేక సేన, భయప్రతీకా=భయానకమైకన్పించునది, బలప్రతీకా = బలవతిగాకనిపించునది, యశఃప్రతీకా = యశస్విగా కనిపించునది, మహాప్రతీకా = మహతిగ కనిపించునది, దీప్తప్రతీకా = దీప్తగాకనబడునది యమ = అగ్ని పదార్థములనుత్పన్నముచేయును, ఈ విషయమున నిగమముకూడ - "యమోహేతి ఇంద్రేణ సహ సంగతః" - విద్యుత్తుతో సమానతకలిగియున్న యమః = యముడు అగ్నినుండియే ఉత్పన్నుడైనాడు. సమస్తపదార్థములయుత్పత్తి జరిగినది రెండవది "యమావిహేహ మాతరా" మంత్రమీవిధముగా నున్నది.

అర్థము :— ఇంద్రాగ్నీ = ఇంద్రుడు విద్యుత్తు అగ్ని విద్యుదగ్ను లార!, వామ్ = మీయిరువురియొక్క, ఇత్థా = మహిమ ఇట్టిమహిమ సత్యము = (వట్) = సత్యమునకు పేరు వట్, అవనిష్ఠః = సత్యముచే స్తుత్యము, వ్యవహారోపయోగి (వణవ్యవహారే స్తుతౌ చ ధాతువుతో వనిష్ఠ శబ్దము సిద్ధమగును) సూర్యుడు మీయిరువురికి, సమానః = సమానుడైన, జనితా = ఉత్పాదకుడు, అనగా - విద్యుదగ్నులు రెండును సూర్యుని నుండి ఉత్పన్నమైనవి, యువమ్ = మీరిరువురు, యమౌభ్రాతరౌ = కవలి సోదరులు, ఇహ ఇహ మాతరా = మఱియు సమస్తజగత్తునకు నిర్మాతలు మీరు ఇరువురే - ఇహశబ్దము రెండుపర్యాయములు ప్రయోగింపబడినది, ఇహ - ఇహ - ఉద్విరుక్తి - వీప్సా - జగత్తునందలి సమస్తముయొక్క నిర్మాణము ఈ విద్యుదగ్నులను రెంటివే కలిగినదని సూచించుచున్నది. ఇంద్రుడు - అగ్ని - పార్థివఅగ్ని, మధ్యస్థానీయవిద్యుత్తు లను నీరెండింటి వలననే సమస్తపదార్థములయుత్పత్తి జరిగినదని ఈ మంత్రము స్పష్టము చేయుచున్నది.

ఈయగ్ని కన్యలయొక్క కన్యాత్వమును నష్టపఱచునది. ఈవిషయమున ప్రమాణత్వేన ఉపన్యస్తము "తృతీయోఽగ్నిష్టే పతిః" అను మంత్రము దాని యర్థము :-

అర్థము:- హే కన్యే! తే = నిన్ను, ప్రథమఃపతిః = మొదటిపతి - పాలకుడు, రక్షకుడు, సోమః = సోముడు నిన్నె ప్రాప్తించెను. అనగా సోముడు - చంద్రుడు మొదటిపతిగా నిన్ను ప్రాప్తించెను. గంధర్వుడు విశ్వావసుడు నిన్ను రెండవపతిగాను, తృతీయపతిగా అగ్నియు నిన్ను పొందిరి. తురీయః మనుష్యజాః మానవుడు నాలుగవపతిగా నిన్నిపుడు పెండ్లిచేసికొనుచున్నాడు. ఈమంత్రము ననుసరించి అగ్ని కన్యయొక్క కన్యాత్వమును నాశముచేసినట్లు స్పష్టముచేయుచున్నది. వివాహసంస్కారమున అగ్నిని సాక్షిగానుంచి కన్య పతికప్పగింపబడును. వివాహనంతరము బాలిక కన్యయనబడక పత్నీ = భార్య యనబడును.

ఇప్పుడు యమదేవతాకమంత్రయుగ్మము - అర్థము వ్రాయబడును.

అర్థము :- గావః న = గోవులు సాయంకాలము తమనివాసము (అస్తమ్)లను చేరునట్లు, వయమపి=మేముకూడ, వః (ఇదిపూరణార్థము) ఇద్ధం తం = ఉత్తమభోగములతో ఆహుతులతో ప్రజ్వలితముచేయబడిన అగ్నివగు నిన్ను, చరాథా = జంగమములగు గోవుల ఘృతాదులరూప ఆహుతితో, వసత్యా = స్థావరములగు వ్రీహియవాదులచే చేయబడిన పురోడాశరూప ఆహుతితో, నక్షన్తామ్ = పొందుదుముగాక! సింధుఃక్షోదః న = ఈయగ్ని స్యందనశీలముగల జలమువలె, నీచీః ఐనోత్ = నిమ్నము వైపు గమనమొనర్చును, స్వర్దృశీకే = సుందర - దర్శనీయసూర్యునందు, గావః = కిరణములవలె సంయుక్తములై యుండునట్లు ఈయగ్నియు తన జ్వాలతో సంయుక్తమగునుగాక!

భాష్యార్థము :- ఇతి ద్విపదాః = రెండుచరణములుగలఋక్కులు ఇవి, సేనాఇవసృష్టా = పంపబడినసేనవలె, భయం వా బలం వా దధాతి= భయమును, బలమును - ధారణచేయును, అస్తుః = విసురువానివలె, దిద్యుత్ = వజ్రము, త్వేషప్రతీకాయొక్క అర్థము - భయప్రతీకా = భయంకరముగాగనబడు, బలప్రతీకా = బలవతిగాకనబడుచున్నదనది,

యమోహజాతః = యముడే పుట్టెను. యమః ఏవజాతః - యమ - అగ్నితో ఈజాతపదార్థములు అన్నియు అగ్నివే. జనిత్వమ్ = జనిష్యమాణపదార్థ ములు యముడే - అగ్నియే. జారఃకనీనామ్ = జరయితాకన్యానామ్ = కన్యాత్వమును నష్టముచేయునది కన్యలనుజీర్ణింపజేసి జరతనుకలిగించు నదియు అగ్నియే. జాయానాంపతిః - అగ్నియే 'ప్రత్యుర్నో యజ్ఞసంయోగే పాణినీయసూత్రమువలన పత్నిశబ్దము సిద్ధించును. కావున పత్ని తన పతితోకలిసి నిత్యము అగ్నిహోత్రముచేయుట అత్యంతఆవశ్యకము. ఈ విషయమునే యాస్కాచార్యుడు పత్ని నిత్యముపతితో యజ్ఞకార్యము నిర్వర్తింపవలయుననియు, అందువలన భార్యలు అగ్నిప్రధానముగల వారనియు చెప్పుచున్నాడు.

మిత్రః - (౧౩)

మిత్రః ప్రమీతే స్త్రాయతే.

సమ్మిన్వానో ద్రవతీతి వా. మేదయతేర్వా. తస్యైషా భవతి-
"మిత్రో జనాన్ యాతయతి బ్రువాణో మిత్రో దాధార పృథివీముత ద్యామ్.

మిత్రః కృష్టీర నిమిషాభిచష్టే మిత్రాయ హవ్యం ఘృతవ జ్జుహోత. (ఋ. 3-౫౯-౧)

మిత్రో జనానాయాతయతి ప్రబ్రువాణః శబ్దం కుర్వన్. మిత్ర ఏవ ధారయతి పృథివీం చ దివం చ. మిత్రం కృష్టీరనిమిషన్నభివిపశ్యతీతి. కృష్ట్య ఇతి మనుష్యనామ కర్మవన్తో భవన్తి, వికృష్టదేహా వా. మిత్రాయ హవ్యం ఘృతవజ్జుహోతేతి వ్యాఖ్యాతం జుహోతిర్దానకర్మా.

ప్రమీతః - ప్రమరణామ్ తతః త్రాయతే ఇతి మిత్రః. సమిన్వానః - సమంతతో మిన్వానః అంతరిక్షే ద్రవతీతి వా. స్నేహనార్థాత్ మేదయతేః వా సాధ్యః. తస్యైషా - "మిత్రోజనాన్ ... జుహోత" విశ్వామిత్రస్యేయ మార్షమ్ ప్రబ్రువాణః-శబ్దంకుర్వన్ మిత్రఏవ - జనాన్ ఆ యాతయతి -

కృష్యాదిషు ప్రవర్తయతి. మిత్ర ఏవ పృథివీం ద్యాం చ దాధార-ధారయతి. కిం చ మిత్ర - ఏకఏవ కృష్టీః - మనుష్యాన్ అనిమిషాభిచష్టే-అనిమిషన్నభి పశ్యతి. ఏవం గుణశాలినే మిత్రాయ హవ్యం ఘృతవత్ - ఘృతాక్తమ్ జుహోత - జుహుత.

మిత్రః = వాయువు అనబడును. ఎటులయన :- ప్రమీతేః - ప్రమీతి ప్రమరణామ్ అర్థాత్మృత్యోః - దానినుండి - మరణమునుండి-మృత్యువు-నుండి త్రాయతే = తప్పించును - రక్షించును. వాయువు జీవనదాత

సంమిన్వానః=సించించుచు-తడుపుచు - వర్ధింపజేయుచు - ద్రవతి= వాయువు నడచును - వీచును - కావున మిత్రమనబడును 'మివి' సేచనే, 'ద్రుగతౌ' ఈరెండుధాతువులవలన మిత్రశబ్దమేర్పడును మేదయతేర్వా-లేక- 'ఞిమిదా స్నేహనే' ధాతువుతో క్ర ప్రత్యయముచేసిన మిత్రశబ్దము సిద్ధించును. ఈవాయువు ఓషధివనస్పతులను స్నిగ్ధముచేయును - తడుపును - ఆమిత్రునికి సంబంధించిన ఋక్కు.

అర్థము:- మిత్రః=మిత్రనామకవాయువు, బ్రువాణః=శబ్దమొనర్చుచు, జనాన్=మనుష్యులను,యాతయతి=కర్మలందు లగ్నముచేయును-వాయువు మనుష్యులనుద్దేశించి-మానవులార ! నేనెట్లు నిరంతరము వీచుచుందునో అట్లే మీరును నిరంతరము ఉద్యోగపరులు - పురుషార్థపరులు కండు అని బోధించుచున్నవా యున్నట్లు - విశ్రాంతిలేకుండ వీచుచునే యుండును. ఈమిత్రుడే పృథివీమ్ = భూమిని భూమిపైనుండు భూత జాతమును అట్లే ద్యామ్=ద్యులోకమును, దాధార = ధరించుచున్నది, మిత్రః ఈవాయువే అనిమిషా = రెప్పవాల్పకయే నిరంతరము, కృష్టీః = మనుష్యులను, అభిచష్టే = చూచుచుండును, వాయువు ఎల్లపుడు కృపా దృష్టికలిగియుండును. కావున ఓమానవులార ! మిత్రాయ = ఆ వాయు ప్రాప్తికొఱకు, ఘృతవత్ = ఘృతసంయుక్త, ఆహుతి = హవ్యమును, జుహోత = ఇత్తురుగాక ! ఘృతమిశ్రితహవ్యముతో సాయంప్రాతః యజ్ఞముచేయుడు

భాష్యార్థము :- యాతయతి = ఆ యాతయతి = ప్రయత్నము చేయుటయందు లగ్నముచేయును, బ్రువాణః = ప్రబ్రువాణః = శబ్దం

కుర్వన్=శబ్దముచేయుచు, అనిమిషా=ఱెప్పవాల్పక, నిరంతరము అభిచష్టే= అభివిపశ్యతి = చూచుచుండును కృపాదృష్టియుండును, కృష్టయః ఇతి = మనుష్యనామ, కృష్టిశబ్దము మనుష్యునితెలుపును - మనుష్యవాచకము, కృష్టిఃకృషి - కర్మవంతులు మనుష్యులు వికృష్టదేహవా = వివిధం కృష్టో వికిప్తో దేహో యేషాం తే - యేషాం = ఎవరికశరీరము ఇచ్చాను సారము ఇటునటు చలింపజేయబడునో వారిదేహము వికృష్టదేహమన బడును. ధానార్థక'హు'ధాతువుచే జుహోతి సిద్ధమగును.

కః - (౧౪)

కః కమనో వా క్రమణో వా సుఖో వా.

తస్యైషా భవతి-

"హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్. స దాధార పృథివీం ద్యాముతేమాం కస్మై దేవాయ హవిషా విధేమ" (ఋ. ౧౦-౧౨౧-౧)

హిరణ్యగర్భో హిరణ్మయో గర్భోఽస్యేతి వా. గర్భో గృభేర్గృణా త్యర్థే గిరత్యనర్థానితి వా. యదాహి స్త్రీ గుణాన్ గృహ్ణాతి గుణాశ్చాస్యా గృహ్యన్తే అథ గర్భో భవతి. సమభవదగ్రే భూతస్య జాతః పతిరేకో బభూవ స ధారయతి పృథివీం చ దివం చ కస్మై దేవాయ హవిషా విధేమేతి. వ్యాఖ్యాతమ్. విధతిర్దానకర్మా.

కః కస్మాత్ ? కమనో భవతి కామినాం కామ్యేషు అర్థేషు సాధనం భవతి, క్రమణః-క్రమణసాధనం వా, కః సుఖః వా, తస్యైషా - "హిరణ్య గర్భః...విధేమ" హిరణ్యగర్భస్యైవార్షమ్. భూతస్య-ఉత్పన్నస్య సర్వస్య జగతః హిరణ్యగర్భ ఏవ అగ్రే సమవర్తత - సమభవత్. జాతః సః ఏకః ఏవ పతిః - పాతా ఆసీత్. స ఇమాం పృథివీం ద్యాం చ దాధార - ధారయతి, అస్మై కస్మై - కాయ - దేవాయ హవిషా విధేమ-హవిర్దద్మః, అథైకపద నిరుక్తిః.

హిరణ్యగర్భః కస్మాత్ ? యస్మాత్ హిరణ్మయః - విజ్ఞానమయః గర్భశ్చ సర్వభూతాన్తః ప్రకాశకః చ - హిరణ్మయో గర్భో యస్యేతి వా.

గర్భః కస్మాత్? గృణాత్యర్థే వర్తమానాత్ గృభేః ధాతోః గర్భః సర్వాస్య స్తుత్య ఇత్యర్థః. స్త్రీగర్భః కస్మాత్? యదా స్త్రీ పురుషాత్ రేతస్యవస్థితాన్ గుణాన్ గృహ్ణాతి అస్యాశ్చ గుణాః రజసి స్థితాః పురుషస్య రేతసా గృహ్యన్తే తదేవ మితరేతరకోశగ్రహణవ్యతిషంగేణ గర్భో భవతి.

అర్థము :— కః = ప్రాణవాయువు, కమనో వా = అన్నిటికంటె కమనీయము, క్రమణోవా - లేక ఆప్రాణము అపానము మున్నగు రూపముతో శరీరమున సంచరించును సుఖోవా = లేక సుఖవాచకము - సుఖప్రదము.

మంత్రార్థము — భూతస్య = ఉత్పన్నమైన ఈస్థావర జంగమాత్మక సమస్తజగత్తునకంటె, అగ్రే = పూర్వము, హిరణ్యగర్భః సమవర్తత = హిరణ్యగర్భుడు, ఉత్పన్నుడయ్యెను, జాతః = ఉత్పన్నుడైన ఆ యొక్కడే, అద్వితియః పతిః = అద్వితియ సర్వరక్షకుడు పాలకుడు ఉండెను - ఉన్నాడు, సః = అతడు, పృథివీమ్ = భూమిని, ఉత = మఱియు, ద్యామ్ ఇమామ్ = ఈద్యులోకమునుకూడ, దాధార = ధరించియున్నాడు, కస్మైదేవాయ = మేము ఆ వాయ్వాత్మకుడు సుఖస్వరూపుడు నగుప్రజాపతి కొఱకు, హవిషా విధేమ = హవినిచ్చుచున్నాము ఈహవిస్సుతో పూజించు చున్నాము.

భాష్యార్థము :- హిరణ్యగర్భః - హిరణ్యమయో గర్భో అస్యేతి వా హిరణ్యమయశ్చాసౌ గర్భశ్చ = ఇట్లు కర్మధారయమో లేక ఎవనిగర్భము హిరణ్యమయమో అని బహువ్రీహియో చెప్పవలెను.హిరణ్యమయగర్భమున కర్థము. విజ్ఞానమయగర్భము. సర్వభూతములలోపల అతనిప్రకాశమే యున్నది. "శరీరేంద్రియమనోబుద్ధిభావే నైతమపేక్ష్య పరమాత్మానం చ విజ్ఞానప్రకాశమాత్రసతత్వం సర్వవిశేషహరిత్వాత్ హిరణ్యగర్భమపేక్ష్య తత్ప్రకృతిత్వం చ క్షేత్రజ్ఞస్యాపేక్ష్య సోఽస్య హిరణ్యమయో - హిరణ్య ప్రకృతగర్భ ఇతి హిరణ్యగర్భః' (దుర్గః) గర్భో గృభేర్గృణాత్యర్థే గృణాతి= స్తుతించుచున్నాడు అనునర్థమునమన్న 'గృభ'ధాతువునకు పరమున భన్ప్రత్యయముచేసిన గర్భపదము సిద్ధమగును. గర్భము ఎల్లరకు స్తుత్యము. గిరతి అనర్థాన్ ఇతి వా = లేక అనర్థములను నశింపజేయును. ఇట 'గృ'నిగరణె ధాతువు భన్ప్రత్యయము. కాని, స్త్రీగర్భగత గర్భశబ్దము

'గ్రహ' ఉపాదానే ధాతువుతో నేర్పడును. ఏలయన:— ఎప్పుడు స్త్రీ - స్త్రీగుణా:=స్త్రీగుణములు పురుషునిగుణములను గ్రహించునో, మఱియు స్త్రీ గుణములను పురుషగుణములు గ్రహించునో అప్పుడు గర్భమేర్పడును. అనగా స్త్రీరజస్సు పురుషునివీర్యమునయున్న అస్థి మజ్జా స్నాయువులు నను గుణములను గ్రహించినపుడు పురుషవీర్యము స్త్రీరజస్సునందలి త్వక్కు మాంసము రుధిరము ననువానిని గ్రహించినప్పుడు పరస్పరము - స్త్రీపురుషుల రజోవీర్యములు కలిసినపుడు గర్భమేర్పడును. లేక స్త్రీ ప్రేమానురాగములతో పురుషునిగుణములను గ్రహించును. అట్లే పురుషుడు ప్రేమతో స్త్రీగుణములను గ్రహించును, ఇట్లు స్త్రీపురుషుల యత్యంతాను రాగము కారణముగ మిక్కిలి ప్రహర్షమిరువురిలో నేర్పడును. అట్లు ప్రముదిత స్త్రీపురుషుల సంపర్కమువలన గర్భమేర్పడును. ఈగర్భ శబ్దము గ్రహధాతుసిద్ధము. విభర్తిర్దానకర్మా విభధాతువు దానార్థకము.

సరస్వాన్ - (౧౫)

సరస్వాన్ వ్యాఖ్యాతః. తస్యైషా భవతి—

"యే తే సరస్వన్నూర్మయో మధుమన్తో ఘృతశ్చుతః.

తేభిర్నోఽవితా భవ" (ఋ. ౭-౯౬-౫)

ఇతి సా నిగదవ్యాఖ్యాతా.

వ్యాఖ్యాతః. తస్యైషా - "యే తే సరస్వన్...నో అవితా భవ" వఃస్థ స్యార్థమ్ హే భగవన్! యే తే - తవ ఊర్మయః - యైః నభః మేఘైః ఛాదయసి, మధుమంతః ఘృతశ్చుతః - ఘృతవన్తః ఉదకప్రకిరణశీలా ఇతి యావత్ తేభిః - తైః త్వమ్ అస్మాకమ్ అవితా-రక్షకః భవ.

సరస్వాన్ పదమునకు వ్యాఖ్య పూర్వమే చేయబడినది. (౧౦-౩౧-౭) ఇందు సరస్వతి కేవలము లింగభేదమే. ఋక్కు దానికిసంబంధించినదే.

మంత్రార్థము :— సరస్వన్ = హే సరస్వన్ వాయో! యే తే = ఈ నీ, మధుమన్తః ఘృతశ్చుతః = మనోహరములు ఘృతయుక్తములు జలమును కార్చు, ఊర్మయః=తరంగములున్నవో, తైః=వానిమూలమున,

నః = మాయొక్క, సవితా భవ = రక్షకుడవు అగుదువుగాక ! లేక సృష్టికర్త వగుము.

ఇతి ద్వితీయః పాదః

ద్వితీయ పాదము సమాప్తము

## తృతీయ పాదము

విశ్వకర్మా - (౧౬)

విశ్వకర్మా సర్వస్య కర్తా. తస్యైషా భవతి-

సర్వప్రాణులకర్త ప్రాణవాయువు. సృష్టికర్త - పరమాత్మ. అతనికి సంబంధించిన ఋక్కు.

> "విశ్వకర్మా విమనా ఆద్విహాయా ధాతా విధాతా పరమోత సన్దృక్. తేషామిష్టాని సమిషామదన్తి యత్రా సప్తఋషీన్ పర ఏకమాహుః" (ఋ. ౧౦-౮౨-౨)
>
> విశ్వకర్మా విభూతమనా వ్యాప్తా ధాతా చ విధాతా చ పరమశ్చ సంద్రష్టా భూతానాం తేషామిష్టాని వా, కాంతాని వా, క్రాంతాని వా, గతాని వా, మతాని వా, నతాని వా. అద్భిః సహ సమ్మోదన్తే యత్రైతాని సప్తఋషీణాని జ్యోతీంషి తేభ్యః పర ఆదిత్య స్తాన్యేతస్మిన్ ఏకం భవన్తీత్యధిదైవతమ్.
>
> అథాధ్యాత్మమ్ - విశ్వకర్మా విభూతమనా వ్యాప్తా ధాతా చ విధాతా చ పరమశ్చ సందర్శయితేంద్రియాణామేషా మిష్టాని వా, కాంతాని వా, క్రాంతాని వా, గతాని వా, మతాని వా, నతాని వా, అన్నేన సహ సంమోదన్తే యత్రేమాని సప్తఋషీణాని ఇంద్రియాణ్యేభ్యః పర ఆత్మా తాన్యేతస్మిన్నేకం భవన్తీ త్యాత్మగతిమాచష్టే.

సర్వస్య కర్తేత్యర్థః. తస్యైషా - "విశ్వకర్మా ... ఏకమాహుః" - యాగావనస్య - విశ్వకర్మణః ప్రజాపతే రార్షమ్. విశ్వకర్మా - సర్వస్యకర్తా, విమనా - విభూతప్రజ్ఞానః, ఆద్విహాయాః - ఆత్మనా మహాన్. ధాతా - సర్వభూతానామ్ ఉత్పాదయితా, విధాతా - జీవనస్యకర్తా, పరమోత సంద్రుక్ - సమ్యక్ ప్రవిభాగేన ద్రష్టా, తేషాం - భూతానామ్, ఇష్టాని సమిషా మదన్తి-ఇషా-ఉదకేన సహమోదన్తే యత్రా - యత్ర, సప్తఋషీన్ పర ఏకమాహుః - రసాకామాకర్షణాని ద్రష్టృణి వా జ్యోతీంషి ఏకత్వముప గచ్ఛన్తి ఇత్యధిదైవతోఽర్థః.

అథాధ్యాత్మమ్ - ఆత్మానమధికృత్య మంత్రస్య వ్యాఖ్యానమిత్యర్థః. విశ్వకర్మా - సర్వస్య కర్తా ఆప్నోతి శరీరమ్ క్షేత్రజ్ఞత్వేన వర్తమానః, విమనాః - సర్వప్రజ్ఞానః, ఆత్ - అపిచ విహాయాః - మహాన్ ధాతా స్రష్టాఖి లస్య చరాచరస్య విధాతా - తద్భోగ్య విషయాణామ్, పరమోత్సంద్రుక్ - పరమః ఉత్కృష్టః ఇంద్రియాణాం సందర్శయితా, తేషాం స్వశక్తివిశేషాత్ క్షేత్రజ్ఞవిభూతీనామిష్టాని ఇషా - అన్నేన సంమదన్తి సమ్మోదన్తే, యత్ర ఇమాని సప్తఋషీణాని ఇంద్రియాణి. పర ఏకమాహుః - న యతః కించిత్ పరతరమస్తి. నిత్యతృప్తేన సహ నిత్యతృప్తాః ఆత్మవిదో మోదన్త ఇత్యర్థః.

మంత్రార్థము :- విశ్వకర్మా = ప్రాణవాయువు, విమనా = అప్రతి హతజ్ఞానముగల లేక ప్రభూతజ్ఞానముకలిగినది, ఆత్పదము అప్యర్థకము- సహ = కూడ, విహాయాః = (విహాయమహద్వాచకము) అపిచ-ముఖ్యము నాప్రాణవాయువు, మహాన్ = గొప్పది. కావున వ్యాపకము, ధాతా = సర్వ భూతములనుత్పన్నముచేసి, విధాతా = వానిజీవనధారణచేయించును, పరమః = ఉత్కృష్టుడు, సంద్రుక్ = అవ్యవహితుడై సమీపస్థుడై శుభా శుభకర్మలను జూచువాడు ఇట్టిప్రాణమును ధారణచేయు యోగుల ఇష్టములను, ప్రియకాంతాని వా అభీప్సితాని = ఇష్టములను, ఉత్కృష్ట గతాని వా, ఆత్మసంగతమతాని = మున్ముగువానినన్నింటిని, ఇషాసం మదన్తి = అన్నముతో ఆనందింతురు. పరమాత్మకొఱకు శరీరముతో ప్రవిష్టభూతశరీరులై, అద్భిఃసహ = నీటితో - సూక్ష్మనీటికణములతో

ప్రసన్నులై విహరింతురు, యత్ర = ఎక్కడ, సప్తఋషీణాని = జ్యోతిస్సు లను సప్తకిరణములకు పరమునసుండు ఒక్క ఆదిత్యునిగా చెప్పుదురు - అనగా ఆదిత్యమండలమున నీకిరణములు జ్యోతిస్సులు ఒక్కటియై యుండును-అవిభక్తములైయుండును. యోగులు ముక్తులై యటచరింతురు. ఇది మంత్రమునకు అధిదైవతార్థము. పరమః = ఉత్కృష్టుడు అథ అధ్యాత్మమ్ = విశ్వకర్మా = సర్వసృష్టిరచయిత - పరమేశ్వరుడు, విభూత మనా=సర్వజ్ఞుడు-వ్యాప్తా=సర్వవ్యాపకుడు ధాతా=సర్వస్రష్ట సుఖప్రదాత= సందృక్ = సర్వేంద్రియములకు తత్త్వజ్ఞానము కలిగించువాడు, తేషాం= పరమేశ్వరోపాసకులకు - యోగులకు, ఇష్టాని - కాంతాని = ఇష్టములయిన కాంతములను, లేక అభిప్సితములను, ఉత్కృష్టగతాని = పరమాత్మ సంగతమతములను లేక పరమాత్మకు అభిమత నతములు- భక్తితో ప్రహ్వీ భూతములైన సూక్ష్మశరీరములను, ఇషా = అన్నేనసహ = అన్నముతో, సత్యానందముతో విహరింతురు. యత్రా - యత్ర = ఎక్కడ, సప్తఋషీన్ ఇమాని సప్తఋషీణాని ఇంద్రియాణి = సప్తేంద్రియములకు పరమున నున్న ఏభ్యః పర ఆత్మా - ఇంద్రియములకతీతముగ, ఏకమాహుః=ఒక్క పరమాత్మను చెప్పుదురు, తాని=ఆ మనస్సు ఇంద్రియములు, ఏతస్మిన్ = ఈ యొక్క పరమాత్మునియందు, ఏకమ్ = ఏకాకారముగలవి, భవన్తి = అగును.

అనగా నాపరతత్త్వమును ప్రాప్తించుముక్తాత్మలయొక్క సూక్ష్మ శరీరముతోను సూక్ష్మమగుఅన్నముతోను ఆ బ్రహ్మలోకమున విచరించును. అట సర్వేంద్రియములు, మనస్సు మున్నగునవన్నియు ఏకమగును. ఇతి ఆత్మగతిమాచష్టే = ఇట్లు ఆత్మగతి నిరూపింపబడినది.

> తత్రేతిహాసమాచక్షతే - విశ్వకర్మా భౌవనః సర్వమేధే సర్వాణి భూతాని జుహవాంచకార. స ఆత్మానమప్యన్తతో జుహవాంచకార. తదభివాదిన్యేషార్గ్ భవతి - “య ఇమా విశ్వా భువనాని జుహ్వత్ ఇతి. తస్యోత్తరా భూయసే నిర్వచనాయ - “య ఇమా విశ్వా భువనాని జుహ్వద్

ఋషిర్హోతా న్యసీదత్ పితా నః. స ఆశిషా ద్రవిణ
మిచ్ఛమానః ప్రథమచ్ఛదవరాఀ ఆవివేశ"

"విశ్వకర్మన్ హవిషా వావృధానః స్వయం యజస్వ పృథివీ
ముత ద్యామ్. ముహ్యన్త్వన్యే అభితో జనాస ఇహాస్మాకం
మఘవా సూరిరస్తు" (ఋ. ౧౦-౮౧-౬)

హే విశ్వకర్మన్ హవిషా వర్ధయమానః స్వయం యజస్వ
పృథివీం చ దివం చ. ముహ్యన్త్వన్యే అభితో జనాః
సపత్నాః, ఇహాస్మాకం మఘవా సూరిరస్తు ప్రజ్ఞాతా.

అత్రేతిహాసః - భువనస్య పుత్రః సర్వమేధే సర్వాణి భూతాని జుహవాంచకార అన్తతః ఆత్మానమపి.

యః విశిష్టాని సర్వాణి భూతాని సామాన్యే ఆత్మని పశ్యన్ జుహోతి, సామాన్యం చాత్మానం సర్వకర్మసు పశ్యన్ జుహోతి స ఏవ ఆత్మయాజీ త్యుచ్యతే. యథా చ అధిదైవతాదాత్మవేదీ శ్రేయాన్ తథాఽభివాదిని ఏషా వక్ష్యమాణా ఋగ్భవతి. "య ఇమా భువనాని ... జుహ్వత్" - యః హోతా ఋషిః ఇమా - ఇమాని విశ్వాని - సమస్తానిత్యర్థః భువనాని - లోకలోకాంతరాణి విశిష్టాని జుహ్వత్ - సర్వమేధే సామాన్యాత్మని అజుహోత్ సః నః - అస్మాకం పితా - పాతా పాలయితా వా ఏకల ఏవ న్యసీదత్ - అవశిష్టః ప్రళయే ఇతి శేషః. సః ఆశిషా - కామేన సర్వమిదమహం స్యామిత్యేవం రూపేణ ప్రేర్యమాణః ద్రవిణమిచ్ఛమానః - సర్వభావమిచ్ఛన్ ప్రథమచ్ఛత్ - ప్రథమోఽగ్రజత్వాత్ ప్రజాపతిభావేన ముఖ్యస్య ఛాదయితా అపరాన్ - పశ్చాజ్జాతాన్ విశేషాన్ ఆవివేశ-వ్యాప్తవాన్ సర్గాదావితి శేషః.

ఉత్తరా చ ఋక్ తం విశ్వకర్మాణం భూయస్త్వేన నిర్వక్తి - "విశ్వకర్మన్ ... సూరిరస్తు" - హే విశ్వకర్మన్! ప్రయోగావస్థిత! హవిషా - సర్వమేధదర్శనసంపదాదియుక్తేన వావృధానః - వర్ధమానః - ఫలవిపరిణతికాలే విశ్వకర్మత్వమాపద్యమానః స్వయం యజస్వ-సర్వం వ్యాప్నుహి పృథివీముత ద్యాం - పృథివీం దివం చ, అపి చ అత్ర అన్యే జనాసః -

త్వదుపాసాపేతాః జనాః అభితః - సర్వతః ముహ్యన్తి - కింకర్తవ్యవిమూఢా భవన్తి. ఇహ త్వద్దర్శనకర్మణి వర్తమానానామస్మాకం త్వం మఘవా సర్వథనేశానః మేధావీ - సర్వత్రాప్రతిహతప్రజ్ఞానః విశేషతోఽస్మాకం ప్రజ్ఞాతా భవ ఇత్యేవం వయ మాశాస్మహే.

అర్థము :- తత్ర = ఈవిషయమున (ఆధ్యాత్మపక్షమున) వైదిక ఋషిః = ఋషి, ఇతిహాసమును, ఆచక్షతే చ = వర్ణించుచున్నారు. (ఇక్కడ నీయితిహాసము కొంచెకవిషయమును వినువానిమనసున నాటు కొనునట్లు చేయుటకు కథారూపమున చెప్పబడినది. ఈకథకు వాస్తవిక విషయము ప్రతిపాద్యమేమియులేదు. ఏలయన వేదములందు ఇతిహాస ముండదు)

విశ్వకర్మా = సృష్టికర్త, భౌవనః = సకలభువనకర్త పరమాత్మ సర్వమేధే = సృష్టిసంహారరూప యజ్ఞమున, సర్వాణి భూతాని = సమస్త భూతములను, స్థావరజంగమాత్మకసమస్తజగత్తును, జుహవాం చకార = హోమముచేసెను, ఈవిషయమును ఈఋక్కు వర్ణించుచున్నది. హోతాఋషిః = హోతపరమేశ్వరుడు, ఇమా విశ్వాభువనాని = ఈ సమస్తలోకలోకాంతరములను, జుహ్వత్ = సర్వమేధయజ్ఞమునందు హోమముచేసెను, సః నః పితా=ఆ పరమాత్మ మనకు, పిత = రక్షకుడు, న్యసీదత్ = ఒక్కడేమిగిలియుండెను. సః = ఆ ప్రభువు, ప్రథమచ్ఛత్ = మొదటనుండియే యుండెను. జీవప్రకృతులను ఆచ్ఛాదించియుండెను, ఆశిషా ద్రవిణమిచ్ఛమానః = ఆ సర్వమేధయజ్ఞఫలమును ఆకాంక్షించుచు ధనరూపమగు నాసమస్తజగత్తుయొక్క ఆధిపత్యమును గోరుచు నాప్రభువు మరల సమస్తజగత్తును సృష్టించెను, అవరాన్ ఆ వివేశ = తనచే సృష్టింప బడిన సమస్తభూతములందు ప్రవేశించెను. అనగా సర్వసత్తాసంపన్న పరమేశ్వరుడు మరల సృష్టింపబడిన సమస్తభూతములపై సార్వభౌమాధి పత్యము వహించెను, విశ్వకర్మా = పరమేశ్వరుని విషయమింకను స్పష్ట పఱచుట కీ క్రిందిఋక్కును ఉదాహరించుచున్నాము.

మంత్రార్థము :- విశ్వకర్మన్ ! = సృష్టికర్తవగునో పరమేశ్వర !, హవిషా = ఈసర్వమేధయజ్ఞహవిస్సుతో, వావృధానః = వృద్ధినొందుచు

ఈజగత్తునుకూడ వర్ధింపచేయుచు ద్యావాపృథివీలోకములను, స్వయం యుజస్వ = స్వయముగ జగత్తును, సంగచ్ఛస్వ = వ్యాపుడవగుదువుగాక ! అన్యే జనాసః = నీయుపాసనను విముఖులై అందువలననే శత్రువులుగా వ్యవహరించుచున్న వారు, అభితః = అన్నివైపులనుండి, ముహ్యన్తు = మోహితులగుదురుగాక ! ఈ ఉపాసనాకర్మమునందు, మఘవా = సర్వ ధనపతిపరమేశ్వరుడు, అస్మాకం సూరిరస్తు = మా ప్రజ్ఞాతయగుగాక !

తార్క్ష్యః - (౧౨)

తార్క్ష్యస్త్వష్టా వ్యాఖ్యాతః.
తీర్ణే అంతరిక్షే క్షియతి. తూర్ణమర్థం రక్షతి అశ్నోతేర్వా.
తస్యైషా భవతి-

"త్యమూషు వాజినం దేవజూతం సహావానం తరుతారం రథానామ్. అరిష్టనేమిం పృతనాజమాశుం స్వస్తయే తార్క్ష్యమిహా హువేమ" (ఋ. ౧౦-౧౭౮-౧)

తం భృశమన్నవంతమ్. జూతిర్గతిః ప్రీతిర్వా. దేవ జూతం దేవగతం దేవప్రీతంవా. సహస్వంతం తారయితారం రథానామరిష్టనేమిం పృతనాజిత మాశుం స్వస్తయే తార్క్ష్య మిహ హ్వయేమేతి. కమన్యం మధ్యమాదేవమవక్ష్యత్.
తస్యైషాఽపరా భవతి-

"సద్యశ్చిద్యః శవసా పంచకృష్టీః సూర్య ఇవ జ్యోతిషాప స్తతాన. సహస్రసాః శతసా అస్య రంహిర్న స్మా వరంతే యువతిం న శర్యామ్" (ఋ. ౧౦-౧౭౮-౩)

సద్యోఽపి యః శవసా బలేన తనోత్యపః సూర్య ఇవ జ్యోతిషా పంచ మనుష్య జాతాని సహస్రసానీ శతసాని న్యస్య సా గతిర్న స్మైనాం వారయన్తి ప్రయువతీమివ శరమయీమిషుమ్.

తూర్ణమశ్నుతే ఇతి తార్క్ష్యః. తీర్ణే సర్వతో గతే అంతరిక్షే క్షియతి - నివసతి ఇతి వా తూర్ణమ్-ఉదకం రక్షతి ఇతి వా. తస్యైషా-"త్యమూషు ... తార్క్ష్యమిహాహువేమ" అరిష్టనేమేరార్షమ్. వాజినం - వేజనవంతమ్ పరేభ్యో భయదాతారమ్ వా దేవజూతమ్ - దేవైర్గతమ్, సహావానం - సహోబలమ్ తద్వన్తమ్ రథానాం - రంహిత్ర్యాణాం యానానాం తరుతారం - తారయితారం అరిష్టనేమిం - కేనచిదప్యప్రతిహత - కులిశ - ప్రహరణం పృతనాజం - సేనానాం జేతారం ఆశుం - శీఘ్రం త్యం మధ్యమస్థానీయం దేవం స్వస్తయే ఇహ - అస్మిన్ కర్మణి హువేమ - ఆహ్వయామహే తస్య తార్క్ష్యస్య ఏషా అపరా - "సద్యశ్చిద్యః ... యువతిం న శర్యామ్" అస్మిన్ మంత్రే సద్యః శబ్దః ఉపలక్షణార్థః అద్య శ్వః పరశ్వః పరుత్ పరారి చేత్యపి. సద్యోఽపి యః తార్క్ష్యః శవసా - బలేన అపః - జలాని తతాన - తనోతి. అత్ర 'చిత్' శబ్దః అప్యర్థే. న కదాచిదన్యః సర్వదా తార్క్ష్య ఏవేతి భావః. పంచ కృష్టీః ప్రతి పంచ మనుష్యాన్ - బ్రాహ్మణాదీన్ నిషాదపంచమాన్ ప్రతి ఇత్యర్థః జ్యోతిషా - సూర్య ఇవ. అస్య రంహః - గతిః సహస్రసాః సతసాః - బహుప్రకారాః. యువతిం న శర్యామ్ - అతిబలేన ధానుష్కేణ ముక్తామ్ శరమయీమిషుమివ అస్యతాం గతిం న ఆవరన్తే - న ప్రతిబద్ధుం శక్నువన్తీత్యర్థః ఏవం గుణసంపన్నః తార్క్ష్యః న ఇదం కరోతు.

తార్క్ష్యుని త్వష్టా వలె తెలిసికొనవలెను. (౮-౧౪-౧) ఎట్లనగా 'తూర్ణ మశ్నుతే' మొదలైనవి చెప్పితిమి.

అన్నివైపుల అంతట వ్యాపించియున్న ఆకాశమున ఈవాయువు ఉండును కావున 'తార్క్ష్య' అనిచెప్పబడుచున్నది. ఇది శీఘ్రముగ కార్యమును సిద్ధింపజేయును. లేక శీఘ్రముగ వ్యాపించును.

మంత్రార్థము :- సువాజినమ్ = ఉత్తమము, అధికమునగు అన్నముగల, దేవజూతమ్ = దేవతలవలనప్రాప్తము, లేక, దేవతలకు ప్రియమైన, సహావానం = బలముగల, రథానాం = రథములను, తరుతారం = నడుపునట్టి, అరిష్టనేమిం = అరిష్టః అహింసితః నేమిః వజ్రో యస్య తం = ఎవరిచేతను ప్రతిహతముకాని వజ్రముకల, పృతనాజమ్ = శత్రుసేనలనుజయించు, ఆశుం = శీఘ్రగామియునగు వాయువును,

ఈయజ్ఞమున, స్వస్తయే = కల్యాణముకొఱకు, ఆహువేమ = ఆహ్వానించు చున్నాము.

భాష్యార్థము :— త్యం = తం = ఆతనిని, సువాజినం = భృశమన్న వంతం = మిక్కిలిఅన్నముగల, జూతిః - గతిః - ప్రీతిః ప్రియదేవజూతం దేవగతం = దేవప్రాప్తదేవప్రీతం = దేవతలకు ప్రియమైన, సహావానం - సహస్వంతం = బలశాలి, తరుతారం తారయితారం. రథానాం=రథములను నడుపు, పృతనాజం - పృతనాజితం=శత్రుసేనలను జయించు, హువేమ = పిలుచుచున్నాము. ఈమంత్రము మధ్యమాత్ అన్యం కం = మధ్యమ స్థానియ వాయువును కాక అన్యమగునేదేవతను పిలుతుము.

మంత్రార్థము :- ఇవ సూర్యః = సూర్యుడెట్లు తనప్రకాశమును వ్యాపింపజేయునో, శవసా = తనబలముతో, పంచకృష్టీః = బ్రాహ్మణాది నాలుగువర్ణములవారు, ఐదవది - నిషాద = మనుష్యమాత్రుండు. మానవుల కందఱకు సుఖముకలిగించు వర్షమును గురియింపజాలకపోయిరి. అస్య= ఈ తార్క్ష్యుని, రంహిః = గతి, సహస్రసా - శతసా = వేలకొలది, వందల కొలది కార్యములనొనర్చునది, యువతిం శర్యాం న వర్తే = లక్ష్యమును బొందు శరవికారమగు బాణము నెవరు నడ్డగింపలేరు - అట్లే యీ వాయువేగమును - గతిని అడ్డగింపజాలరు.

భాష్యార్థము :— సద్యశ్చిత్ సద్యోఽపి = నేడుకాదు, యః = ఎవడు, శవసా = బలేన=బలముతో, అపః=జలమును, తతాన= తనోతి=జలమును వ్యాపింపజేయునో. సూర్యఇవజ్యోతిషా = సూర్యుడు తనప్రకాశము నెల్లరి కొఱకు వ్యాపింపజేయునట్లు, పంచకృష్టీః = పంచవిధజనులకొఱకు వేల కొలది వందలకొలది కార్యములను నెఱవేర్చువాయువుయొక్క రంహిః = గతిని ఎవరును నడ్డగింపజాలరు, లక్ష్యమునచేరు ధనుర్ముక్తబాణవేగము నెవ్వరు నడ్డగింపలేరు.

మన్యుః - (౧౮)

**మన్యుర్మన్యతే ర్దీప్తికర్మణః క్రోధకర్మణో వధకర్మణో వా, మన్యన్త్యస్మాదిషవః.**

**తస్యైషా భవతి-**

"త్వయా మన్యో సరథమారుజన్తో హర్షమాణాసో౽ధృషితా మరుత్వః. తిగ్మేషవ ఆయుధా సంశిశానా అభిప్రయన్తు నరో అగ్నిరూపాః" (ఋ. ౧౦-౮౪-౧)

త్వయా మన్యో సరథమారుహ్య రుజన్తో హర్షమాణాసో౽ధృషితా మరుత్వః తిగ్మేషవ ఆయుధాని సంశిశ్యమానా అభిప్రయన్తు నరో అగ్నిరూపా అగ్నికర్మాణః, సంనద్ధాః కవచిన ఇతి వా.

దీప్తికర్మణః క్రోధార్థాత్ వా మన్యతేః మన్యుః. మన్యుస్తస్మా దిషవః ఇతి. తస్యైషా "త్వయా మన్యో ... అగ్నిరూపాః" తపసః పుత్రస్య మన్యోరార్షమ్. హే మన్యో! త్వయా సరథమ్ - ఏకమేవ రథమారుహ్య రుజన్తః-పరానభిభవన్తః హర్షమాణాసః - ప్రసన్నాః అధర్షితాః - అరిభిరనభిభూతాః అపిచ హే మరుత్వః హే తిగ్మేషవః - తీక్ష్ణబాణాః, యుష్మదనుగ్రహేణ - ఏతే౽స్మాకం యోధాః ఆయుధాః - ఆయుధాని సంశిశానాః నరాః - అస్మద్యోధాః అగ్నిరూపాః అభిప్రయన్తు - శత్రుసేనామభిభవన్తో గచ్ఛన్తు.

మన్యుః = మన్యుశబ్దము. దీప్త్యర్థక క్రోధకర్మణః = క్రోధార్థక, వధకర్మణః = వధార్థకమనధాతువువలన సిద్ధించును.

ఇట మధ్యమస్థానమున మన్యుః శబ్దము పఠింపబడినది. అందువలన క్రోధము లేక దీప్తి అర్థముగల మన్యువు శరీరమునందుండు వాయువు యొక్క గతిభేదమువలన పుట్టుచున్నది. కావున మంత్రమునందు మన్యువునకు విశేషణము మరుత్వః పదము ప్రయోగింపబడినది. మన్యువు సాధారణముగ క్రోధపదపర్యాయముగ నెంచబడుచున్నది. కాని వాస్తవమున మన్యువు క్రోధము ననునీరెండింటియందు భేదమున్నది. క్రోధమువలన మనుష్యుడంధు డగును. అతనిలో వివేకముండదు. మన్యువున నట్లుకాక మన్యువుగలమనుజుడు లోపల ప్రసన్నతను కలిగియుండును. వివేకమును కోల్పోడు. అందువలననే మంత్రమున 'హర్షమాణాసః' 'అధృషితాః' అనుపదములు మన్యువుగలవారికి విశేషణములుగ ప్రయోగింపబడినవి.

మంత్రార్థము :– మరుత్వః మన్యో! వాయువంతముగు ఓమన్యో త్వయా సరథమ్ ఆ = నీతో సమానరథమున ఆరూఢులమై హర్షమాణాసః = ప్రముదితులమై, అధృషితాః = దురాధర్షులు, అగ్నిరూపాః నరః = అగ్నివలె ప్రచండకర్మలనొనర్పువారై లేక కవచములు ధరించి సిద్ధపడినవారై సైనికులు. తిగ్మేషవః = తీక్ష్ణబాణములు గ్రహించినవారై, ఆయుధాః = ఆయుధములను, సంశిశానః = తీక్ష్ణముచేయుచు, రుజన్తః = శత్రుదుర్గము లను పడగొట్టుచు శత్రువులపై అభియన్తు=అభియానము చేయుదురుగాక!

భాష్యార్థము :- త్వయా మన్యో - ఓ మన్యో! నీతోపాటు సమాన రథమున ఆరూఢులై, రుజన్తః = శత్రుదుర్గములను భేదించుచు, హర్షమాణాసః అధృషితాః మరుత్వః = ప్రసన్నులు, దురాధర్షులునగు హే వాయువంతులార! తీక్ష్ణబాణములుగలవారు, ఆయుధాః = ఆయుధాని, సంశిశానాః = ఆయుధములను పదును పెట్టుచు, అగ్నిరూపాః = ప్రచండ కర్మలనొనర్పువారు, సంనద్ధాః = కవచాదులను ధరించినవారై అగ్నివలె ప్రకాశించువారు.

దధిక్రాః - (౧౮)

దధిక్రాః వ్యాఖ్యాతః.

తస్యైషా భవతి–

"ఆ దధిక్రాః శవసా పంచ కృష్టీః సూర్య ఇవ జ్యోతిషాప స్తతాన. సహస్రసాః శతసా వాజ్యర్వా పృణక్తు మధ్వా సమిమా వచాంసి" (ఋ. ౪–౩౮–౧౦)

ఆతనోతి దధిక్రాః శవసా బలేనాపః సూర్య ఇవ జ్యోతిషా పంచ మనుష్యజాతాని సహస్రసాః శతసా వాజీ వేజనవాన్ అర్వేరణవాన్ సంపృణక్తు నో మధునోదకేన వచనానీ మానీతి.

మధు ధమతేర్విపరీతస్య.

దధత్క్రామతీతి పూర్వం వ్యాఖ్యాతః తస్యైషా - "ఆదధిక్రా ... సమిమా వచాంసి" - వామదేవస్యార్షమ్. జ్యోతిషా సూర్య ఇవ శవసా బలేన వాజీ-వేజనవాన్ అర్వా-ఈరణవాన్ దధిక్రా పంచకృష్టీః ప్రతి-పంచమనుష్య జాతాన్ ప్రతి సహస్రసాః శతసాః అపః - జలాని ఆతతాన - ఆతనోతి. స ఇమా - ఇమాని వచాంసి-స్తుతిరూపాణి మధ్వా - మధునా ఉదకేనేత్యర్థః సంపృణక్తు విపరీతాత్ ధమతేః మధుః.

మంత్రార్థము :- ఇవ = ఏవిధముగ, సూర్యః = సూర్యుడు జ్యోతిషా = తనజ్యోతిని అంతటవ్యాపింపజేయునట్లు. దధిక్రాః=వాయువు, పంచకృష్టీః = పంచవిధమనుష్యులకొఱకు, శవసా = తనబలముతో, అపః తతాన = జలమును వర్షింపజేయును, సహస్రసాః శతసాః=వందలకొలది వేలకొలది కార్యములను సిద్ధముచేయుచు, లేక మేఘములనిచ్చునట్టి, వాజీ అర్వా వేగవాన్ = వేగముగా నడచువాయువు, ఇమా వచాంసి = మాయీస్తుతులను, మధ్వా = జలముతో, సంపృణక్తు = సంయుక్తము చేయునుగాక !

భాష్యార్థము :- ఆ తతాన - ఆ తనోతి = వ్యాపింపజేయును, దధిక్రాః = వాయువు, శవసా = బలముతో, అపః = జలమును, సూర్యః జ్యోతిషా = సూర్యుడు తనప్రకాశమును, పంచకృష్టీః = పంచమనుష్య జాతాని = పంచవిధమనుష్యవర్గములను, వాజీ వేజనవాన్ - అర్వా ఈరణ వాన్ = ప్రేరితమైనట్టి లేక నడుపునట్టి, సంపృణక్తు = సంయుక్త మొనర్చుగాక !. వచాంసి - వచనాని = స్తుతులను, మధ్వా = జలముతో. మధుశబ్దము విపరీతస్య ధమతే = ధమతిని విపరీతమొనర్చిన మధు శబ్దమగును ధమధాతువు గత్యర్థకము. ధమ - మధ - ఉప్రత్యయము జేసిన మధుశబ్దమేర్పడును.

సవితా - (౨౦)

నవితా సర్వస్య ప్రసవితా. తస్యైషా భవతి.

"సవితా యంత్రైః పృథివీమరమ్ణాదస్కంభనే సవితా ద్యామ దృంహత్. అశ్వమివాధుక్షద్ధునిమంతరిక్షమతూర్తే బద్ధం స - తా సముద్రమ్" (ఋ. ౧౦-౧౪౯-౧)

సవితా యన్త్రైః పృథివీమరమ్ణాదనారమ్భణే అన్తరిక్షే సవితా ద్యామదృంహదశ్వమివాధుక్షద్ ధునిమన్తరిక్షే మేఘమ్ బద్ధమతూర్తే బద్ధమ్. తూర్త ఇతి వా త్వరమాణ ఇతి వా, సవితా సముదితారమితి. ఆదిత్యోఽపి సవితోచ్యతే, తథా చ హైరణ్యస్తూపే స్తుతః అర్చన్ హిరణ్యస్తూపఋషి రిదమ్ సూక్తం ప్రోవాచ. తదభివాదిన్యేషర్గ్ భవతి.

"హిరణ్యస్తూపః సవితర్యథా త్వాంగిరసో జుహ్వే వాజే అస్మిన్. ఏవా త్వార్చన్నవసే వన్దమానః సోమస్యేవాంశుం ప్రతి జాగరాహమ్" (ఋ. ౧౦-౧౪౯-౫)

హిరణ్యస్తూపో హిరణ్యమయస్తూపో హిరణ్యమయః స్తూపః అస్యేతి వా. స్తూపః స్త్యాయతేః, సంఘాతః. సవితర్ యథా త్వాంగిరసోజుహ్వే వాజే అన్నే అస్మిన్నేవం త్వార్చన్నవనాయ వన్దమానః సోమస్యేవాంశుం ప్రతిజాగర్మ్యహమ్.

సర్వస్య ప్రసవితా ఉత్పాదయితేత్యర్థః. తస్యైషా - "సవితా ... సముద్రమ్" హైరణ్యస్తూపే ఋషిః వక్ష్యమాణాయాః ఉత్తరాయాశ్చ ఋచః. సర్వబలేశానః మహ్యమో దేవః సవితా యన్త్రైః పృథివీమ్ అరమ్ణాత్ - స్థిరామకరోత్. అస్కమ్భనే - అమూర్తే అన్తరిక్షే ద్యామపి అదృంహత్ - స్థిరామకరోత్. అతూర్తే గమనాయోగ్యే అన్తరిక్షే బద్ధమ్ ధునిం సముద్రమ్ - ఉదకబన్ధితారమ్ మేఘమ్ అశ్వమివ అధుక్షత్ - అధూనోత్ అకమ్పయదిత్యర్థః తస్మాన్నాస్తి సవితుః పరో బలీయాన్.

మధ్యమం సవితారం విహాయ నాన్యః కశ్చిదేవముచ్యతే. ఆదిత్యోఽపి సవితేత్యుచ్యతే తథా చ హైరణ్యస్తూపే సూక్తే హిరణ్యస్తూపః ఇదం సూక్తం ప్రోవాచ. తథా చ ఋక్ - "హిరణ్యస్తూపః ... జాగరాహమ్" హే సవితః! యథా త్వామ్ అస్మత్కాలీనః హిరణ్యస్తూపః జుహ్వే-ఆజుహావ తథైవాహమపి అర్చన్నామా త్వామ్ అస్మిన్ వాజే - అన్నే అవసే-రక్షణాయ వన్దమానః - స్తువన్ సోమస్య అంశుమివ - సోమమివ క్రీత్వా ప్రతి జాగర - జాగర్మి సర్వతోభావేన త్వాముపాసే ఇత్యర్థః. స్తూపః కస్మాత్?

ఉచ్యతే సంఘాతార్థాత్ స్త్యాయతేః. సవితా=ఈసవిత, సర్వస్య=సమస్తము నకు, ప్రసవితా = ప్రేరకము - వాయువు వానిని తెలుపుమంత్రము.

మంత్రార్థము :- సవితా = ఈవాయువు, యంత్రైః = తనవృష్టి ప్రదానరూప - ఉపకారకకర్మలతో, పృథివీమ్ = పృథివిని, అరమ్ణాత్ = నియమితముచేసియున్నది. అస్కంభనే=ఆలంబనరహితమగు ఆకాశము నందు, ద్యామ్ = ద్యులోకమును, అదృంహత్=దృఢపఱచితివి. సవితా = ఈవాయువు, అతూర్తే= అచలాంతరిక్షమున. బద్ధం సముద్రమ్ = బంధింప బడిన మేఘమును, కంపయితవ్య=చలింపజేయదగిన, అశ్వమివ=అశ్వము తనశరీరమును ధునించునట్లు, అధుక్షత్ = జలమునుపిండును.

భాష్యార్థము :- యంత్రైః = వృష్టిప్రదానము మున్నగు నుప కృతులతో పృథివిని, అరమ్ణాత్ - అరమయత్ = నియమితముచేయబడి యున్నది. అస్కంభేపదమునకర్థము - అనారంభణే ఆలంబరహితే - అంతరిక్షే = ఆధారములేని అంతరిక్షమున, సవితా = వాయువు, ద్యామ్ = ద్యులోకమును, అదృంహత్ = దృఢముచేసెను, ధునిమ్ - అశ్వమ్ ఇవ = గుఱ్ఱమువలె, కంపితవ్యము, అతూర్తే పదమునకర్థము - అతూర్ణే - అత్వర మాణే ఇతివా అహింసిత - అథవా అచలి - స్థిర = చలనరహితము - స్థిరము. సముద్రమ్ - అర్థము సముదితారమ్ = ఆర్ద్రముచేయు మేఘము. ఆదిత్యో అపి సవితా ఉచ్యతే = ఆదిత్యుడుకూడ సవితయనబడును. తథాచ = ఎట్లన - హైరణ్యస్తూపేస్తుతః = హైరణ్యస్తూపసూక్తమున నట్లు స్తుతింప బడినది. హిరణ్యస్తూపనామకఋషి ఈసూక్తమును అర్చించుచు ప్రోవాచ = పలికెను - ఆఋక్కు.

అర్థము :- సవితః! హే సూర్య! యథా = ఎట్లు అంగిరసః హిరణ్యస్తూపః = ప్రాణస్వరూపుడు తేజోమయునిగా పరమేశ్వరుడు త్వా = నిన్ను, అస్మిన్ వాజే = ఈజగత్తునందు, జుహ్వే = ప్రదానము చేసెను. ఏవ = అట్లే అవసే=తమరక్షణకొఱకు, వందమానః=ప్రభువునకు వందనములుచేయుచు. అర్చన్ = పూజించుచున్నాను. సోమస్యఅంశుమ్ ఇవ = సోమరసమునువలె, త్వాప్రతి = నిన్నుగూర్చి, జాగర్మి = సతతము జాగరూకుడనైయున్నాను.

భాష్యార్థము :— హిరణ్యస్తూపః = ఈ సమస్తపదమునకు రెండు విధములైన విగ్రహములు కలవు. హిరణ్మయః స్తూపః అని కర్మధారయము, తేజోమయపుంజము, హిరణ్మయః స్తూపః అస్య - అని బహువ్రీహిః - దేనియందు తేజోమయపదార్థమున్నదో యది హిరణ్యస్తూపః, ఈస్తూపము 'స్త్యై'ధాతువుతో - నేర్పడినది - ధాత్వర్థము సంఘాతము, ఏవ-ఏవమ్ = త్వా = నిన్ను, అర్చన్ = పూజించుచు, అవనాయ = రక్షణకొఱకు, వందమానః = వందనముచేయుచు, సోమస్య ఇవ అంశుమ్ = సోమరస మునుగూర్చి సావధానుడై యుండునట్లు నిన్నుగూర్చి, జాగర్మి = జాగరూకుడను.

త్వష్టా - (౨౧)

త్వష్టా వ్యాఖ్యాతః - తస్యైషా భవతి-

"దేవస్త్వష్టా సవితా విశ్వరూపః పుపోష ప్రజాః పురుధా జజాన. ఇమా చ విశ్వా భువనాన్యస్య మహద్దేవానా మసురత్వమేకమ్" (ఋ. 3-55-19)

దేవస్త్వష్టా సవితా సర్వరూపః పోషతి ప్రజా రసాను ప్రదానేన బహుధా చేమా జనయతీమాని చ సర్వాణి భూతాన్యుదకాన్యస్య మహచ్చాస్మై దేవానామసురత్వ మేకం ప్రజ్ఞావత్త్వం వాన్నవత్త్వం వాపి వా.

అపివా అసురత్వమాది ముక్తమ్. వ్యాఖ్యాతః. తస్యైషా - దేవ స్త్వష్టా ... అసురత్వమేకమ్" వైశ్వామిత్రస్య ప్రజాపతేరార్షమ్. విశ్వ రూపః, మధ్యమోదేవః సవితా - సర్వేషాముత్పాదయితా ప్రజాః పుపోష - పోషయతి పురుధా - బహుధా చ జజాన - జనయతి యతః ఇమా విశ్వా - సర్వాణి భువనాని - ఉదకాని అస్యైవాధికారే వర్తన్తే అతోఽయం సర్వ మిదం జనయతి పుష్ణాతి వర్ధయతి చ. దేవానాం మహత్ అసురత్వమ్ - ప్రజ్ఞావత్త్వమ్, అనవత్త్వం ప్రాణవత్త్వం వా. అసురితి కథమ్ ? అస్యతి అనర్థాన్ అస్తాన్యస్యామర్థాః ఇతి వా. వసుమతో భావః వసురత్వమ్. మత్వర్థే రః' వకారలోపే అసురత్వమ్.

అర్థము :— త్వష్టాపదవ్యాఖ్య - (౮-౧౪-౧, లేక ౧౦-౩౩-౨) న
పూర్వము చేయబడినది. అక్కడ త్వష్టా అగ్నివాచకము. ఇక్కడ వాయు
వాచకము.

మంత్రార్థము :— సవితా = సమస్తమునకు ఉత్పాదకుడు, విశ్వ
రూపః = సర్వరూపుడు, త్వష్టాదేవః = ఈవాయుదేవత, ప్రజాః పుపోష =
సమస్తప్రజలను, సమస్తభూతములను రసప్రదానముతో పోషించును,
పురుధా జజాన = పోషించుటయేకాక అన్నింటిని ప్రజాః = ప్రజలనుకూడ
నుత్పన్నముచేయును, ఇమాచ విశ్వా భువనా = మఱియు నీసమస్తఉదకము,
అస్య = ఈవాయుకారణముగ ఉత్పన్నమగును. పరమేశ్వరుడు, దేవా
నామ్ = పృథివ్యాది సమస్తదేవతలలో. అస్మై = ఈవాయువుకొఱకు,
మహత్ = మిక్కిలి, ఏకమ్ = అద్వితీయ, అసురత్వమ్ = ప్రజ్ఞావత్త్వము
ప్రాణవత్తారూప - గుణమునొసంగెను, విశ్వరూపః = సర్వరూపములుగలది
పుపోష = పోషతి - పోషణముచేయును. రసానుప్రదానేన = రసమునిచ్చి
పురుధా - బహుధా = అనేకవిధముల, ఇమా - ఇమాని = ఈవిశ్వా సర్వాణి
సమస్త భువనాని = ఉదకము - రసము అస్య - అస్మై = దీనికొఱకు,
మహత్ = గొప్ప, దేవానామ్ = పృథివ్యాది దేవతలలో, అసురత్వమ్ ఏకమ్ =
ఒకే ప్రజ్ఞావత్త్వమనుగుణమును వా - లేక అనవత్త్వమ్ ప్రాణవత్త్వము
అసురితి = ప్రజ్ఞానామ అసుః = అనగా ప్రజ్ఞ - అథవా = లేక అసుః =
ప్రాణః - అసువన ప్రాణము. అసురః - అనగా ప్రాణవత్తు - మతుప్ అర్థమున
'ర' ప్రత్యయము. హే ప్రజ్ఞావత్తా! అసురితి ప్రజ్ఞానామ. అస్యత్యనర్థాన్ -
అస్తాశ్చాస్యామర్థాః. అసు - ఇతి ప్రజ్ఞానామ = అసువు అన ప్రజ్ఞ. ఏలయన
ప్రజ్ఞ - అనర్థాన్ అస్యతి = అనర్థములను దూరముచేయును లేక అస్యామ్ =
ప్రజ్ఞయందు, అర్థాః = సమస్తపదార్థములు అస్తాః - ఉంచబడినవి -
ప్రజ్ఞావంతులలో లేని వస్తువు ప్రపంచమునలేదనియే యెంచవలెను ప్రజ్ఞా
వంతుడెఱుంగనిది - అగమ్యము లేదనిభావము.

అపి వా అథవా - లేక - అసురత్వమనవసురత్వము. అపి లుప్తమ్-
మొదటివకారము లోపించినది. మొదటవసురత్వమై యుండెను. అందలి
వకారము లోపించుటచే అసురత్వమైనదని భావము. అందువలన అసు

రత్వమన - వసువత్తా - ధనము కలిగియుండుట. ౧) ప్రజ్ఞావత్త్వము, ౨) ప్రాణవత్త్వము, 3) ధనవత్త్వము.

వాతః - (౨౨)

వాతో వాతీతి సతః. తస్యైషా భవతి-

"వాత అవాతు భేషజం శంభు మయోభు నో హృదే. ప్రణ ఆయూంషి తారిషత్" (ఋ. ౧౦-౧౮౬-౧)

వాత ఆవాతు భైషజ్యాని శంభు మయోభు చ నో హృద యాయ ప్రవర్ధయతు చ న ఆయుః.

వాతః కస్మాత్? వాతీతి సతః. తస్యైషా - "వాత ఆవాతు ... తారిషత్" ఇత్యస్య వాతాయనస్య అర్థమ్. వాతః - వాయుః. సః భైషజ్యమ్ ఆవాతు. నః - అస్మాకం హృదే - హృదయాయ శంభు - కల్యాణకారకో భవతు. మయోభూః ... సుఖమస్తు. నః ఆయూంషి - ప్రతారిషత్ - వర్ధయతు.

వాతః = వాయువు - వీలయున - వాతి ఇతి సతః = గతికలిగి యున్నందున 'వా'గతిగంధనయోః ధాతువుతోవాత - సిద్ధిః.

మంత్రార్థము — వాతః = వాయువు, భేషజమ్ = ఏదిపథ్యమో మాకు హితకారకమో, దానిని తీసికొని, ఆవాతు=అన్నివైపులవీచునుగాక !, నఃహృదే = మాహృదయమునకు, శంభుమయోభు = శంభావకము, సుఖ భావకము - శాంతిని, సుఖమునిచ్చునది యగుగాక, నః ఆయూంషి = మా ఆయువులను, ప్రతారిషత్ = వర్ధిల్లజేయునుగాక !.

భాష్యార్థము :- వాతః = వాయువు, ఆవాతు = మావైపు - మాకభి ముఖముగా, భైషజ్యమ్ = భైషజ్యాని = పథ్యకారకవస్తువులను గ్రహించి, ఆవాతు = ప్రవహించుగాక, శంభు . మయోభు చ = శాంతికారకము, సుఖకారకము నగుగాక, నోహృదయాయ=మాహృదయములకొఱకు-సుఖ శాంతులనొసంగునది యగుగాక !

అగ్నిః - (౭౩)

అగ్నిః వ్యాఖ్యాతః. తస్యైషా భవతి-

"ప్రతి త్యం చారుమధ్వరం గపీథాయ ప్రహూయసే. మరుద్భిరగ్న హి ఆగహి" (ఋ. ౧-౧౯-౧)

తం ప్రతి చారుమధ్వరం సోమపానాయ ప్రహూయసే సోఽగ్నే మరుద్భిః సహాగచ్ఛేతి.

కమన్యం మధ్యమాదేవమవక్ష్యత్.

తస్యైషాఽపరా భవతి-

"అభిత్వా పూర్వపీతయే సృజామి సోమ్యం మధు. మరుద్భిరగ్న ఆగహి" (౧-౧౯-౯)

అభిసృజామి త్వా పూర్వపానాయ. సోమ్యం మధు సోమమయం, సోఽగ్నే మరుద్భిః సహాగచ్ఛేతి.

వ్యాఖ్యాతః. తస్యైషా - "ప్రతిత్యం ... అగ్నఆగహి" త్యమ్ - తమ్ చారుమ్ - సుందరమ్ అధ్వరం ప్రతి, హే భగవన్ అగ్నే! త్వం గోపీథాయ - సోమపానాయ ప్రహూయసే హే అగ్నే! మరుద్భిః సహ ఆగహి ఆగచ్ఛ. కమన్యం మధ్యమం దేవమేవం వక్తుం శక్నోతి. తస్యైషా అపరా "అభిత్వా పూర్వ ... మరుద్భిః అగ్న ఆగహి." హే అగ్నే! పూర్వపీతయే - పూర్వపానాయ త్వా - త్వాం అభిసృజామి-వదామి. సోమ్యం మధు పాతుం త్వం అస్మిన్ యజ్ఞే మరుద్భిః సహ ఆగహి - ఆగచ్ఛ. అగ్ని - వ్యాఖ్యానపూర్వముచేయబడినది. (౮-౨౪-౨-౫ తథా ౧౦-౩౫-౨).

మంత్రార్థము :- అగ్నే! = నీవు, సుందరమైన ఆయజ్ఞమునందు, గోపీథాయ (గో = సోమము) పీథమనగా పానము సోమపానముకొఱకు, ప్రహూయసే = బాగుగా పిలువబడుచున్నావు, కావున మరుద్భిః సహ = మరుత్తులతోపాటు ఆగహి = రమ్ము.

భాష్యార్థము :– త్వాం = త్వం, గోపీథాయ = సోమపానముకొఱకు, ఆగహి = ఆగచ్ఛ = రమ్ము. మధ్యమాత్ = మధ్యమస్థానీయ అగ్ని (విద్యుత్తు)ని విడిచి, అస్యామ్=మఱియొకదేవతనెవరిని, ఏవమ్ అవక్ష్యత్ = ఇట్లువర్ణనచేయగలుగుదురు. అందువలన నిట విద్యుత్తు అగ్నిశబ్దముచే గ్రహింపబడినది - అగ్నివిషయక మంత్ర - అర్థము. ఓ అగ్నీ ! మధుర మైన సోమమును త్రాగుటకు పూర్వమునుండి వచ్చుచున్న నిన్ను ఆవిష్కృణామి = ఆహ్వానించుచున్నాను భాష్యము - పూర్వపీతయే = పూర్వపానార్థము, సోమ్యం మధు = సోమమునకుసంబంధించిన మధుర రసము, ఆగహి = ఆగచ్ఛ = రమ్ము.

ఇతి తృతీయః పాదః

తృతీయ పాదము సమాప్తము

## చతుర్థపాదము

వేనః - (౨౪)

వేనో వేనతేః కాంతికర్మణః. తస్యైషా భవతి-

"అయం వేనశ్చోదయత్ పృశ్నిగర్భా జ్యోతిర్జరాయూ రజసో విమానే. ఇమమపాం సంగమే సూర్యస్య శిశుం న విప్రా మతిభీ రిహన్తి" (ఋ. ౧౦-౧౨౩-౧)

అయం వేనశ్చోదయత్ పృశ్నిగర్భాః ప్రాష్టవర్ణగర్భా అప ఇతి వా. జ్యోతిర్జరాయుర్ జ్యోతిరస్య జరాయుస్థానీయం భవతి. జరాయుర్జరాయా గర్భస్య, జరయా యూయత ఇతి వా. ఇమమపాం చ సంగమే సూర్యస్య చ శిశుమివ విప్రా మతిభీ రిహన్తి లిహన్తి స్తువన్తి వర్ధయన్తి పూజ యన్తీతి వా. శిశుః శంసనీయో భవతి, శిశీతేర్వా స్యాద్దాన కర్మణః చిరలబ్ధో గర్భో భవతి.

కాన్త్యర్థాత్ వేనతేః వేనః. యస్మాత్ మధ్యమః సర్వలోకకాన్తః సర్వేషాముపకారిత్వాత్. తస్యైషా - "అయం వేనః ... మతిభిరిహన్తి" భార్గవస్యాయమార్షమ్. ఏష వేనః పృశ్నిగర్భా - ఆదిత్యరశ్మిసన్తప్తాః పరిపక్వా ఆపః చోదయతి - వర్షభావేన ప్రేరయతి. జ్యోతిః-విద్యుదాఖ్యమ్ జరాయుస్థానీయం భవతి. ఏష దేవః రజసః - ఉదకస్య విమానే-వినిమాన స్థానే అవస్థితః అన్తరిక్షలోకే ఇత్యర్థః. తమిమం వేనం అపాం సూర్యస్య చ సంగమే సమాగమనస్థానే విప్రాః - బ్రాహ్మణాః మతిభిః స్తుతిభిః శిశుం న - శిశుమివ రిహన్తి - లిహన్తి వర్ధయన్తి. శిశుః కస్మాత్? శంసనీయో భవతి యతః. దానార్థాత్ శిశీతేర్వా అసౌ పురుషేషు స్తుత్యై ధారణాయ దీయతే.

అర్థము :- వేనః=సమానవాయువు. ఇది నాభిస్థానమున నుండును. కాన్త్యర్థక - వేనధాతువువలన నీశబ్దము సిద్ధించును. ఘ ప్రత్యయము. ఈవాయువెల్లరకు ప్రియమైనది. కాన్తి - అనగా ఇచ్ఛ. వేనపదవిషయక ఋఙ్మంత్రము.

మంత్రార్థము :- రజసో విమానే = ఉదకనిర్మాణస్థానమగు నంతరిక్షమునందు, జ్యోతిర్జరాయుః = మధ్యమస్థానీయ - విద్యుత్తే జరాయుస్థానీయము. దానికి సంబంధించిన అయంవేనః = ఈవేనవాయువు, పృశ్నిగర్భా=ఆదిత్యగర్భభూతమగు జలమును, చోదయత్=ప్రేరేపించును-వర్షింపజేయును, సూర్యస్య అపాం సంగమే = సూర్యకిరణములు జలము కలియుస్థానమున - అంతరిక్షమున, ఇమం వేనమ్ = ఈవేనవాయువును, విప్రాః = మేధావులు, మతిభిః = ప్రజ్ఞాపూర్వక - స్తుతులతో, శిశుం న = శిశువునువలె, రిహన్తి = స్తుతిచేయుదురు - పూజింతురు.

భాష్యార్థము :- అయం వేనః=మధ్యమస్థానీయమగు నీవేనవాయువు, చోదయత్ = ప్రేరితమొనర్చును, పృశ్నిగర్భాః = దనియర్థమేమన :- ప్రాష్టవర్ణగర్భాః అపః ఇతి వా = ప్ర = ప్రకృష్టః. అష్టః=ప్రాప్తః వర్ణః యేన సః = ప్రాష్టవర్ణః = బాగుగ వర్ణమునుపొందినవాడు, స ఏవ పృశ్నిః ఆదిత్యః = ప్రాష్టవర్ణుడే, పృశ్నిః = ఆదిత్యుడు - సూర్యుడు, తస్య గర్భాః ప్రాష్టవర్ణగర్భాః = అట్టి ఆదిత్యుని గర్భయాతజలమును, వేనః = వేనవాయువు, చోదయత్ = ప్రేరితమొనర్చును, అందువలన వర్షమేర్పడును.

జ్యోతిర్జరాయుః = అర్థమేమన - జ్యోతిరస్యా జరాయుస్థానీయమ్ = ఈ విద్యుత్తే జరాయుస్థానీయువేనము - వేనవాయువు, జరాయుః కస్మాత్ ? జరయా=గర్భముయొక్క వృద్ధితోపాటు జరాయువుకూడ వృద్ధిపొందును, జరాయువన గర్భవేష్టన చర్మపుటకము = గర్భము నావరించియుండు మావి - అది గర్భముతోపాటు పెద్దది యగుచుండును, జరయా యూయతే ఇతి వా = జరా = నాభినాడి (హిందీ - జేర్) యూయతే=కలిసియుండును కావున జరాయువు అనబడును, ఇమం - వేనం = ఈవేనవాయువుతో, అపాం చ సంగమనే సూర్యస్య చ = జలములయు సూర్యునియు, సంగమనే = సమాగమస్థానమున, శిశుం న=శిశువునువలె విప్రాః=ధీమంతులు - మేధావులు, మతిభిః = స్తుతులతో, రిహన్తి = లిహన్తి (ర - ల అభేదము) స్తువన్తి = స్తుతియింతురు, 'లిహ' స్తుతౌ ధాతువు.

శిశుః కస్మాత్ ? శిశువు = శంసనీయుడు = ప్రేమింపదగినవాడు - అందువలన శిశువు అందురు. లేక దానార్థక 'శో'ధాతువుతో శిశుః సిద్ధమగును. శిశువును ధారణచేయుటకు పత్నికియ్యబడును. స్త్రీలలో 'చిరకాలమునకు గర్భమైనది'అను ప్రవాదముకూడ కలదు. కేవలగర్భపరముగా మంత్రగతవేనవాయువునకిట్లు అర్థముచెప్పవచ్చును.

మంత్రార్థము :- అయంవేనః - నాభిస్థసమానవాయువు (పృశ్నిగర్భాచోదయత్) అన్నరసమును పరిణామింపజేసి పరిపక్వమును శరీరమున నంతటను చేర్చును. రజసఃవిమానే = వేనవాయువారసమును నిర్మించు కాలమున జ్యోతిర్జరాయుః = జఠరాగ్నియైనజ్యోతితో ఆవృతమగును, విప్రా ఇమః=ధీమంతులు ఈవేనవాయువును, అపాం సంగమే సూర్యస్య= అనేకరసములతోకూడిన నాడులకు, పింగలానామక - నాడికిసంగమస్థానమైన నాభికందమునయందు వేనవాయువును, శిశుః న = నవజాత - శిశువునువలె, మతిభిః రిహన్తి = హృదయముతో ప్రేమింతురు - ప్రశంసింతురు.

అసునీతిః - (౨౫)

అసునీతిరసూన్నయతి. తస్యైషా భవతి-

"అసునీతే మనో అస్మాసు ధారయ జీవాతవే సుప్రతిరా న
ఆయుః. రారంధి నః సూర్యస్య సందృశి ఘృతేన త్వం
తన్వం వర్ధయస్వ" (ఋ. ౧౦-౫౯-౬)

అసునీతే! మనః అస్మాసు ధారయ చిరం జీవనాయ ప్రవర్ధయ చ న ఆయూ రంధయ చ నః సూర్యస్య సందర్శనాయ.

రధ్యతిర్వశగమనేఽపి దృశ్యతే- "మా రధామ ద్విషతే సోమ రాజన్" ఇత్యపి నిగమో భవతి. ఘృతేన త్వమాత్మానం తన్వం వర్ధయస్వ.

ఏతద్దేవతాపదమ్. స పునరయం మధ్యమః ప్రాణః ఇంద్రః. అసునీతిః కస్మాత్? అసూన్ నయతీతి సతః. తస్యైషా - "అసునీతే ... తన్వం వర్ధయస్వ" శ్రుతబంధోరార్షమ్ హే అసునీతే! ప్రాణ! అస్మాసు మనః ధారయ - మనః ప్రభృతీన్ ఏతాన్ ప్రాణాన్ ఆత్మనోఽవస్థానేన అస్మచ్ఛరీర ఏవ ధారయ. చిరం జీవాతవే - జీవనాయ. న ఆయుః సుప్రతిరావర్ధయ. సూర్యస్య సందృశి - సందర్శనాయ నః రారంధి - రంధయ. ఘృతేన - ఉదకేన త్వం తన్వం - స్వశరీరం వర్ధయస్వ.

రధ్యతిః వశగమనేఽపి దృశ్యతే. తథా చ నిగమః - మా రధామ - రాజన్" హే రాజన్! సోమ వయం ద్విషతే మా రధామ - వశం గచ్ఛేమ.

అర్థము :- అసునీతిః = ప్రాణవాయువు, ఇది శరీరమునుండి బయటికిపోవును, అసూన్ నయతి = తక్కిన ప్రాణములనన్నింటిని తనతో తీసికొనిపోవును, యథా - "ప్రాణమనుత్ క్రామంతమ్ సర్వేప్రాణాః అనూత్క్రామన్తి? = ఈప్రాణవాయువు శరీరమునుండి బయటికిపోవు నపుడు ఇతరప్రాణములన్నియు బయటికిపోవును. ఆ విషయమునకు సంబంధించిన ఋక్కు.

మంత్రార్థము :- అసునీతే = ప్రాణమా జీవాతవే అస్మాసు మనః ధారయ = చిరకాలము జీవించుటకు నీయుపస్థితితోబాటు మనస్సు మున్నగు ప్రాణములనన్నింటిని ధారణచేసియుంచుము. నః=మాయొక్క, ఆయుః = ఆయువును, సుప్రతిర = మిక్కిలిబాగుగ వర్ధిల్లజేయుము. రారంధి చ నః=మరియు మమ్ము సాధనసంపన్నులజేయుము, సూర్యస్య

సంధృశే = సూర్యదర్శనార్థము ఇదియంతయు అన్నము బహుళముగ - ఎక్కువగా నున్నపుడే సంభవమగును. అందువలన, త్వమ్ = నీవు, ఘృతేన = ఉదకముతో, తన్వం వర్ధయ = నీశరీరమును పెంపుచేసి కొనుము. నీవు జలము నొసంగినపుడే యిదియంతయు జరుగును.

భాష్యార్థము :- అసునీతే మనః అస్మాసు ధారయ = ఓ అసునీతీ! నీవు మాశరీరములందు మనస్సుయున్నగువానిని ధరింపచేయుము, జీవాతవే = జీవనముకొఱకు, సు ప్రతిరా ప్రవర్ధయ = పెంపుచేయుము, నః ఆయుః రారంధి = మాఆయువును, రారంధి-రంధయ చ నః=మమ్ము సాధనసంపన్నులచేయుము. సూర్యస్య సందృశే సందర్శనాయ = సూర్యుని బాగుగదర్శించుచునుండుటకొఱకు

రధదాతువు వశగమనేఽపి - వశంగతమగుట అనునర్థమునున్నది. హే సోమరాజన్! ద్విషతే=(షష్ఠ్యర్థే చతుర్థీ) శత్రువులకు, మా రధామ = మేము వశముకాకుందుముగాక! త్వమ్ = నీవు, ఘృతేన = జలముతో, ఆత్మానం తన్వమ్ = నీశరీరమును, వర్ధయస్వ = పెంపుచేయుము.

ఋతః - (౨౬)

ఋతో వ్యాఖ్యాతః. తస్యైషా భవతి-

"ఋతస్య హి శురుధః సన్తి పూర్వీర్ఋతస్య ధీతిర్వృజినాని హన్తి. ఋతస్య శ్లోకో బధిరా తతర్ద కర్ణా బుధానః శుచమాన ఆయోః" (ఋ. ౪-౨౩-౮)

ఋతస్య హి శురుధా పూర్వీర్ఋతస్య ప్రజ్ఞా వర్జనీయాని హన్త్యృతస్య శ్లోకో బధిరస్యాపి కర్ణావాతృణత్తి. బధిరో బద్ధశ్రోత్రః. కర్ణౌ బోధయన్ దీప్యమానశ్చాయోరయనస్య మనుష్యస్య జ్యోతిషో వోదకస్య వా.

పూర్వం వ్యాఖ్యాతః. తస్యైషా - "ఋతస్య ... శుచమానఆయోః" వామదేవస్యార్షమ్. ఋతస్య మధ్యమస్య దేవస్య శురుధః - ఆపః సన్తి - విద్యన్తే. పూర్వీః చిరన్తనాః ఋతస్య ధీతిః - ప్రజ్ఞా సమేషాం వృజినాని -

వర్జనీయాని అయనాంసీత్యర్థః హన్తి-నాశయతి. తస్య+ఋతస్య శ్లోకః - శబ్దః బధిరా - బధిరస్య కర్ణా - కర్ణౌ - ఆతర్ద - ఆతృణత్తి. బుధానః - బోధయన్ శుచమానః - దీప్యమానః. ఆయోః - అయనస్య మనుష్యస్య జ్యోతిషః ఉదకస్య వా.

అర్థము :— ఋతః = పూర్వమే వ్యాఖ్యానింపబడినది. కాని అక్కడ ఈపదము జలవాచకముగా చెప్పబడినది. ఇక్కడ విద్యుత్తునకు లేక మేఘమునకు వాచకము - బోధకము ఈవిషయమును తెలుపుయుక్క.

మంత్రార్థము :— ఋతస్య = మేఘముయొక్క, పూర్వీః = ముందే సంపాదించిన, శురుధః = జలము ఉన్నది, ఋతస్యధీతిః = మేఘము యొక్క వృష్టిప్రజ్ఞ, వృజినాని = పాపములను, హన్తి = చంపును ఋతస్య శుచమానః = మేఘముయొక్క దీప్యమానము, బుధానః = కర్తవ్యబోధనము చేయుచున్న, శ్లోకః = ఉన్నతగర్జనము - ఉఱుము, ఆయోః = మనుజుని, బధిరా కర్ణా = చెవిటిచెవులను, ఆతర్ద = తెఱచి వేయును - లేక బధిరమనుష్యుని కర్ణములనుగూడ తెఱచివేయును. ఆయుశబ్దమిట మనుష్యవాచకము.

భాష్యార్థము :— ఋతస్య=మేఘముయొక్క, (హి) పాదపూరకము. శురుధః సన్తి=జలములున్నవి, పూర్వీః=ముందుసంపాదించిన, ఋతస్య = మేఘముయొక్క, ధీతిఃప్రజ్ఞా = వృష్టిప్రజ్ఞ, వృజినాని వర్జనీయాని = పాపములను, (పాపములు వర్జింపదగినవి) హన్తి = నశింపజేయును, బధిరా - బధిరస్యాపి = చెవిటివానియొక్కయు, కర్ణా = కర్ణౌ = చెవులను, ఆతర్ద - ఆతృణత్తి. ఆభినత్తి = తెఱచివేయును, బధిరః = చెవిటివాడు, బధిరః కస్మాత్ ? ఏలయన బద్ధశ్రోత్రః = బంధింపబడిన వినని చెవులు గలవాడు; బుధానః = బోధయన్ = బోధింపజేయుచు, శుచమానః - దీప్యమానః = దీప్తమగుచు-ప్రకాశించుచు, ఆయోః-అయనస్య=మనుష్యస్య = మనుష్యునియొక్క, జ్యోతిషో - ఉదకస్య = ఋతశబ్దము విద్యుత్తునకు, ఉదకము - మేఘమునకు వాచకము ఈమంత్రమున రెండువిషయములు గుర్తుంచుకొనవలయును. మేఘము జలమును వర్షించును. దానివలన పాపములు దూరమగును. అనగా అనావృష్టివలన కఱవేర్పడి మనుష్యుడు

వివశుడై పాపములనొనర్చును. వర్షమువలన సస్యపాపములు దూరమగునని భావము. మేఘగర్జనవలన నప్పుడప్పుడు చెవిటివానిచెవులు తెఱవబడి వినగలుగుటయునంభవము. కావున మేఘగర్జనము బధిరతకు ఔషధము.

ఇందుః - (౨౭)

ఇందురింధేరునత్తేర్వా. తస్యైషా భవతి-

"ప్రతద్వోచేయం భవ్యాయేందవే హవ్యో న య ఇషవాన్మన్మ రేజతి రక్షోహా మన్మ రేజతి. స్వయం సో అస్మదానిదో వధై రజేత దుర్మతిమ్. అవ స్రవేదఘశంసోఽవతరమవ క్షుద్రమివ స్రవేత్" (ఋ. ౧-౧౨౯-౬)

ప్రబ్రవీమి తద్భవ్యాయేన్దవే హవనార్హ ఇవ య ఇషవానన్నవాన్ కామవాన్ వా మననాని చ నో రేజయతి రక్షోహా చ బలేన రేజయతి స్వయం సో అస్మదభినిందితారమ్. "వధై రజేత దుర్మతిమ్" అవస్రవేదఘశంసః. తతశ్చావరం క్షుద్రమివావస్రవేత్.

అభ్యాసే భూయాంసమర్థం మన్యన్తే యథాహో దర్శనీయాహో దర్శనీయేతి తత్పరుచ్ఛేపస్య శీలమ్. పరుచ్ఛేప ఋషిః. పర్వవచ్ఛేపః, పరుషి పరుషి శేపో అస్యేతి వా. ఇతీమానీ సప్తవింశతిర్దేవతానామధేయాన్యనుక్రాంతాని సూక్తభాంజి హవిర్భాంజి చ.

తేషామేతాన్యహవిర్భాంజి-వేనో అసునీతిర్ఋతఇందుః.

దీప్త్యర్థాత్ ఇంధేః క్లేదనార్థాత్ ఉనత్తేర్వా సాధ్యః. తస్యైషా - ప్రతద్వోచే...స్రవేత్" అతిచ్ఛన్దా పారుచ్ఛేపీ. అహం భవ్యాయ - భావనార్థాయ ఇందవే ప్రవోచేయమ్-ప్రబ్రవీమి. యః ఇందుః హవ్యః స-హవనార్హ ఇవ, ఇషావాన్ - అన్నవాన్ స్తోతౄణామ్ కామవాన్ వా మన్మ-మననాని ప్రజ్ఞానానీత్యర్థః. రేజతి - ఆకంపయతి ఇత్యర్థః. రక్షోహా - రక్షాంసి ఘ్నన్. స్వయం

నో అస్మద్వానిదః - అస్మన్నిందితారమ్ వధైః - వజ్రప్రహారైః అజేత-జయతే. దుర్మతిమ్ అస్మాన్ ప్రతి దుష్టబుద్ధిం క్షిపేత్. అపిచాస్మాకమ్ అఘశంసః. అస్మత్పాపప్రకాశకః అవస్రవేత్ అధోయాతు. అవతరం క్షుద్రమివ స్రవేత్.

అభ్యాసబాహుల్యమస్మిన్ మంత్రే "రేజతి - రేజతి స్రవేత్ - స్రవేత్ ఇత్యాది దృష్ట్వా సమాదధాతి అభ్యాసే భూయాంసమితి. మంత్రవిదః అభ్యాసే భూయాంసమర్థం మన్యన్తే ఉదితాదర్థాదధికమిత్యర్థః వినా ప్రయోజనం కశ్చిదపి శబ్దాన్ న పునరుపాదత్తే. లోకేపి చైతత్ దృశ్యతే యథా! సుశీలః అసి. సుశీలః అసి. ఏతచ్చ అభ్యస్తైః పదైః స్తవనం పరుచ్ఛేపస్య శీలమ్-స్వభావః. పరుచ్ఛేపః కస్మాత్? ఉచ్యతే తస్య శేపః - ప్రజనేంద్రియమ్ పర్వవత్ తస్మాత్ పరుచ్ఛేపః అథవా పరుషి పరుషి శేపః అస్య ఇతి వా సర్వాంగసంధిషు శేపకృతో యోగః. ఇతిమాని సప్తవింశతిః మాధ్యమికానాం దేవానాం నామాని అనుక్రాన్తాని తేషు కానిచిత్ సూక్తం భజన్తే కానిచిచ్చ కేవలం హవిః న సూక్తం కానిచిచ్చోభయభాంజి. వేనః అసునీతిః ఋతః ఇందుశ్చ న హవిర్భజన్తే.

అర్థము :- ఇందుః - ఇందుశబ్దము వ్యుత్పత్తి 'ఞి ఇంధీ దీప్తౌ' ధాతువు, లేక ఉన్దీ క్లేదనే ధాతువులవలన ఇందుశబ్దము సిద్ధించును. ఇందుః = చంద్రుడు. చంద్రునిలో దీప్తి - క్లేదనము రెండును గలవు చంద్రుడు ప్రకాశించును. ఆతనిప్రకాశము చంద్రిక - వెన్నెల - దాని యందు క్లేదనముకలదు. చంద్రుడు ప్రకాశముద్వారమున వస్తువులను ఓషధులు మున్నగువానిని క్లిన్నమొనర్చును. శీతలముచేయును తడుపును. ఇంద్రుడు సోముడుచంద్రుడు అంతరిక్షముననుండును. కావున మధ్యస్థానీయదేవత.

ఇందునకు సంబంధించిన ఋక్కు.

మంత్రార్థము :- భవ్యాయ = అత్యుత్తమమనోహరుడైన, ఇందవే = చంద్రునికొఱకు, తత్ప్రవోచేయమ్ = ఆవిచెప్పెదను అనగా చంద్రుని మహత్త్వమునుగూర్చి కొంచెము చెప్పుచున్నాను, యః = ఆచంద్రుడు, హవ్యేన = హవ్యపదార్థములవలె, ఇషవాన్ = అన్నముకలవాడు - అన్నె

త్పాదకుడు లేక ఇషవాన్ = కామనలుకలవాడు - స్తోతలకామములను నెఱవేర్చువాడు, మన్మ రేజతి = మననీయప్రజ్ఞలనుత్పన్నముచేయువాడు, రక్షోహ = రాక్షసహన్తకుడు లేక రాక్షసిభాషణలను నివారించువాడు, మన్మ రేజతి = మననీయవృత్తులను ప్రసాదించువాడు, సః = ఆయింద్రుడు, స్వయం = స్వయముగ తనకుతాను, వధైః = అసహనీయవజ్రాఘాతములతో, అస్మత్ ఆనిదః = మననిందకుల, దుర్మతిమ్ = దుర్మతిని - దుర్బుద్ధిని, అపేత = జయించును, అఘశంసః=మనపాపములను కీర్తించువాడు, అవస్రవేత్ = అధోగతిని పొందునుగాక! అవతరమ్ క్షుద్రమివ = క్రింటికిదిగజారు నీచునివలె, అవస్రవేత్ = నీచగతిని పొందునుగాక!

భాష్యార్థము :- ప్రవోచేయమ్ - ప్రబ్రవీమి = చెప్పుచున్నాను, హవ్యః న = హవనార్హ ఇవ = హవనార్హునివలె, యః ఇషవాన్ = అన్నవంతుడు - అన్నోత్పాదకుడు, కామవాన్ = కోరికలను దీర్చువాడు మన్మః మననాని = మననీయఉత్తమాలోచనలను, రేజతి - రేజయతి = ఉత్పన్నము చేయును, రక్షోహా బలేన చ రేజయతి = రాక్షసుల బలహంతకుడు, కంపయితా = కంపింపజేయువాడు సః చంద్రః స్వయం అనిదః - అస్మదభినిందితారమ్ = మననిందకుని, అఘశంసః అవస్రవేత్=మనపాపములకథకుడు, అవస్రవేత్=అధోగతినిపొందునుగాక! అవతరమ్ క్షుద్రమివ అవస్రవేత్ = అధోగతినిపొందు తుచ్ఛపదార్థమువలె నీచగతిని పొందునుగాక!.

ఒకపదము ననేకపర్యాయములు పఠించుట బలపఱచుటకు - పుష్టికొఱకు అగును. ఒకవిషయమును రెండుమాఱులుచెప్పుట (ద్విరుక్తి - అభ్యాసము) విషయమును బలపఱచుటకొఱకు అనుట లోకసిద్ధవిషయము ఆహా! ఎంతఆహా! ఎంతసుందరము! ఎంతసుందరము - మిక్కిలి సుందరమనిభావము.

ఇతి = ఈవిధముగ ఇమాని=ఈసప్తవింశతి ౨౭ దేవతానామములు పఠింపబడినవి. ఇందుకొన్ని సూక్తభాక్కులు, మఱికొన్ని హవిర్భాక్కులు. వేన, అసునీతి, ఋత, ఇందు శబ్దవాచ్యదేవతలు హవిర్భాక్ కాదు.

ప్రజాపతిః - (౩౮)

ప్రజాపతిః ప్రజానాం పాతా వా పాలయితా వా.

తస్యైషా భవతి-

"ప్రజాపతే! న త్వదేతాన్యన్యో విశ్వా జాతాని పరితా బభూవ. యత్కామాస్తే జుహుమస్తన్నో అస్తు వయం స్యామ పతయో రయీణామ్" (ఋ ౧౦-౧౨౧-౧౦)

ప్రజాపతే న హి త్వదేతాన్యన్యః సర్వాణి జాతాని తాని పరిబభూవ. యత్కామాస్తే జుహుమస్తన్నో అస్తు వయం స్యామ పతయో రయీణామిత్యాశీః.

ప్రజానాం పాతా పాలయితా వా.

తస్యైషా - "ప్రజాపతే ... రయీణామ్" ప్రాజాపత్యస్య హిరణ్యగర్భస్యార్షమ్. హే ప్రజాపతే! త్వదన్యః కశ్చిదపి ఏతాని విశ్వా - సర్వాణి జాతాని పరిబభూవ - పరితః గృహీత్వా భవతి. యత్కామాః-యదిచ్ఛన్తః వయమ్ తే తుభ్యమ్ జుహుమః తన్నః - అస్మాకమస్తు. వయం రయీణామ్ ధనానాం పతయః స్యామ. ఇత్యాశీః.

ప్రజాపతిః = ప్రజారక్షకుడు - ప్రజాపాలకుడు అనియర్థము ప్రజా సంబంధమంత్రము.

మంత్రార్థము :- హే ప్రజాపతే! = ఓ ప్రజారక్షక! త్వత్ అన్యః = నీకంటె భిన్నుడు మఱియొక దేవుడును ఏతాని = ఈ, విశ్వాని = సమస్త, తానిజాతాని = పుట్టిన భూతములనన్నింటిని, న పరిబభూవ = రక్షించు వాడెవ్వడు లేడు లేక వీనినన్నింటిని వశమున నుంచుకొనగలవాడు లేడు, యత్కామాః = యే యే కోరికలతో మేము, తే జుహుమః = నీకొఱకు యజనముచేయుదుమో ఆయాకోరికలు, తన్నః అస్తు = నీకృపవలన నెఱవేఱునుగాక! మఱియు, వయమ్ = మేము, రయీణామ్ = ధనములకు, పతయః = స్వాములము, స్యామ = అగుదుముగాక!.

అహిః - (౨౮)

అహిర్వ్యాఖ్యాతః. తస్యైషా భవతి-

"అబ్జాముక్థై రహిం గృణీషే బుధ్నే నదీనాం రజఃసు సీదన్"

(ఋ. ౭-౩౪-౧౬)

అప్సుజముక్థైరహిం గృణీషే బుధ్నే నదీనాం రజఃసు ఉదకేషు సీదన్. బుధ్నమంతరిక్షమ్, బద్ధా అస్మిన్ ధృతా ఆప ఇతి వా. ఇదమపీతరద్ బుధ్నమేతస్మాదేవ. బద్ధా అస్మిన్ ధృతాః ప్రాణా ఇతి.

పూర్వం వ్యాఖ్యాతః. తస్యైషా - "అబ్జాముక్థైః...సుసీదన్" వసిష్ఠస్య పారాశరస్యార్షమ్. హే స్తోతః! బుధ్నే అంతరిక్షే నదీనామ్ - నదనానామపాం బంధనే అంతరిక్షే విద్యమానమ్ రజఃసు - ఉదకేషు సీదన్ - లబ్ధయే, అంగభావముపగచ్ఛన్ త్వమ్ అబ్జామ్ - అప్సుజాతమ్ అహిమ్ మేఘం గృణీషే స్తౌషి. బుధ్నమ్ శరీరమప్యేతస్మాదేవ యతః ప్రాణా అస్మిన్ బద్ధాః ధృతాః భవన్తి.

అర్థము :- అహి పద వ్యాఖ్య పూర్వమే చేయబడినది 'అహిరయనాత్' (౨-౧౭-౧) అహిః = అంతరిక్షమున గమించును - నడచును, 'ఇణ్ గతౌ' ధాతువుతో సిద్ధమగును.అర్థము మేఘస్థవిద్యుత్తు తత్సంబంధయుక్తు.

మంత్రార్థము :- హే స్తోతః! = ఓ స్తుతికర్తా! నీవు, రజఃసు సీదన్ = లబ్ధవ్యజలములందేయున్న - అనగా మనస్సున నాజలములనే ధ్యానించుచు, నదీనాం = జలములయొక్క, బుధ్నే = బంధనస్థానమగు, అంతరిక్షే = అంతరిక్షమందు, అబ్జాం = జలమునసుత్పన్నమగు, అహిం = మేఘస్థమగువిద్యుత్తును, ఉక్థైః=స్తోత్రములతో - మంత్రములతో, గృణీషే= స్తుతియింపుము.

భావార్థము :- అబ్జామ్ - అప్సుజం = జలమందుపుట్టిన, అహిం = మేఘస్థవిద్యుత్తును, బుధ్నం = అనగా అంతరిక్షము - విలయన - అంతరిక్షమున జలము బద్ధమైయుండును, ధృతాః ఆపః ఇతి వా = జలమిందు

ధరింపబడియుండును, ఇదమపి ఇతరత్=మతియొకయర్థము, బుధ్నం = శరీరవాచకము - శరీరమున ప్రాణములు బంధింపబడియుండును.

అహిర్బుధ్న్యః - (౩౦)

యో అహిః స బుధ్న్యో బుధ్నమంతరిక్షమ్ తన్నివాసాత్.
తస్యైషా భవతి-
మానోఽహిర్బుధ్న్యో రిషే ధాన్మా యజ్ఞో అస్య స్రిధత్
ఋతాయోః. మా చ నోహిర్బుధ్న్యో రేషణాయ ధాన్మాస్య
యజ్ఞోఖా చ స్రిధద్యజ్ఞకామస్య.

బుధ్న్యమంతరిక్షం తత్ర నివాసాత్ బుధ్న్యః. యః అహిః స బుధ్న్యః. తస్యైషా - "మానోఽహిర్బుధ్న్యో ... స్రిధదృతాయోః" అహిర్బుధ్న్యః అస్మాన్ రిషే - హింసనాయ మా ధాత్. ఋతాయోః యజమానస్య యజ్ఞః మా స్రిధత్ మా స్రసత్ నిత్యమవినాశతయా వర్తతామ్ ఇత్యర్థః.

అర్థము :- యః అహిః =ఏది అహియో సః = అదియే, బుధ్న్యః= బుధ్న్యము, బుధ్నమ్ = అంతరిక్షమనబడును, తన్నివాసాత్ = ఆ బుధ్నమునందుంటచే బుధ్న్యమనబడుచున్నది. బుధ్న్యసంబంధ ఋక్.

మంత్రార్థము :- అహిర్బుధ్న్యః = అంతరిక్షమునయున్న మేఘము, నః రిషే = మాహింసకొఱకు, మాధాత్ = తనను ధారణచేయకుండును గాక !, అస్య ఋతాయోః = ఈయజ్ఞకాముని యజ్ఞము, మాస్రిధత్ = ఎన్నడు ఉచ్ఛిన్నము కారాదు.

భాష్యార్థము :- రిషే = రేషణాయ = హింసార్థము, యజ్ఞః - యజ్ఞోఖా = యజ్ఞముయొక్క, ఉఖా - స్థాలీ = పాత్ర, ఋతాయోః - యజ్ఞకామస్య = యజ్ఞమునుకోరువాని యజమానునియొక్క.

సుపర్ణః - (౩౧)

సుపర్ణః వ్యాఖ్యాతః. తస్యైషా భవతి-

"ఏకః సుపర్ణః స సముద్రమావివేశ స ఇదం విశ్వం భువనం విచష్టే. తం పాకేన మనసాఽపశ్యమంతితస్తం మాతా రేళ్హి స రేళ్హి మాతరమ్" (ఋ. ౧౦-౧౧౪-౪)

ఏకః సుపర్ణః స సముద్రమావిశతి స ఇమాని సర్వాణి భూతాన్యభివిపశ్యతి తం పాకేన మనసాఽపశ్యమంతిత ఇతి ఋషేర్దృష్టార్థస్య ప్రీతిర్ భవత్యాఖ్యానసంయుక్తా తం మాతా రేఢి వాగేషా మాధ్యమికా స ఉ మాతరం రేఢి.

వ్యాఖ్యాతస్తావత్. తస్యైషా - "ఏకః సుపర్ణః ... మాతరమ్" ఏకః సుపర్ణః - సుపతనః వాయుః సముద్రమ్ - అంతరిక్షమ్ ఆవివేశ - ఆవిశతి సర్వభూతానుప్రవేశీ స విశ్వం భువనమ్ - సమస్తం భూతజాతమ్ విచష్టే అభివిపశ్యతి. తం పాకేన మనసా - విపక్వప్రజ్ఞానేన అంతితః-అంతికమివ అహమపశ్యమ్. తం మాతా మాధ్యమికా వాక్ రేళ్హి - ఉపజీవతి స చ మాతరముపజీవతి.

అర్థము :- సుపర్ణపదవ్యాఖ్యా (3-౧౨-౧) చేయబడినది. కాని ఇట నీసుపర్ణుడు మధ్యమస్థానీయువాయువు. ఆ వాయువునకు సంబంధించిన ఋక్కు.

మంత్రార్థము — ఏకః = ఒక్కడు - అద్వితీయుడు, సుపర్ణః సుపతనో వాయుః = సుపర్ణ నామకవాయువు - (గతియందద్వితీయుడు) సముద్రమ్ = అంతరిక్షమున, ఆవివేశ = ఎల్లప్పుడునుండును, సః=అతడు, ఇదం విశ్వం భువనమ్ = ఈ సమస్తజగత్తును-లేక సంపూర్ణభూతములను, విచష్టే = చూచుచుండును - అనుగ్రహదృష్టితో చూచుచున్నాడు. తమ్ = ఆ సుపర్ణవాయువును నేను, పాకేన మనసా=పక్వమైనమనస్సుతో ప్రజ్ఞతో - అంతటను వ్యాపించియున్న యతనిని, అంతితః = అంతికస్య=సమీపమున నున్నవానివలె, అపశ్యమ్ = చూచుచున్నాను, తమ్ = అతనిని, మాతా =

ఈమాధ్యమికవాక్కు-వాణి, రేఢి = గ్రహించును, స ఉ రేఢి మాతరమ్ = అతడును ఈసంపూర్ణమాధ్యమికవాయువును చూచును - గ్రహించును.

భాష్యార్థము :- ఏకః=ఒక్కడు-ఒంటరి అద్వితీయుడు, సుపర్ణః = సుపర్ణవాయువు, సః = ఆవాయువు, సముద్రమ్ = అంతరిక్షమందు, ఆవివేశ - ఆవిశతి = ప్రవేశించుచున్నాడు - నిత్యమటనే యుండును, సః= అతడు, ఇదం విశ్వమ్ - భువనమ్, ఇమాని సర్వాణి భూతాని = ఈ భూతముల నన్నిటిని, విచష్టే అభివిపశ్యతి = అనుగ్రాహ్యదృష్టితో చూచుచున్నాడు, తమ్ పాకేన మనసా = అతనిని నేను పరిపక్వప్రజ్ఞతో, అపశ్యమ్ = చూచుచున్నాను అతనిని శుద్ధాంతఃకరణముతో ప్రత్యక్షముచేసికొనుచున్నాను, అన్తితః=దగ్గఱగా చూచుచున్నాను అనునిది దృష్టార్థస్య = సమస్తతత్త్వములనెఱుంగు, ఋషేః = ఋషియొక్క అఖ్యానసంయుక్తమగు నీకథనము - వర్ణనము ననుసరించియు, ప్రీతిః భవతి = ఈ విషయమున ప్రీతికలుగును, ఋషి ఈవిషయమును హస్తామలకమువలె సాక్షాత్కారముచేసికొనియే చెప్పుచున్నాడు, తమ్ = ఆ సుపర్ణుని, మాతా ఏషా మాధ్యమికా వాక్ = వాణి, రేఢి = ఆ సుపర్ణవాయువుకూడ మాధ్యమిక వాణిని, రేఢి = చూచును.

పురూరవాః - (౩౭)

**పురూరవా బహుధా రోరూయతే. తస్యైషా భవతి-**

**"సమస్మిఞ్జాయమాన ఆసత గ్నా ఉతేమ వర్ధన్నద్యః స్వగూర్తాః. మహే యత్త్వా పురూరవో రణాయావర్ధయన్ దస్యు హత్యాయ దేవాః" (ఋ. ౧౦-౯౫-౭)**

**సమానతాస్మిఞ్జాయమానే గ్నా గమనాదాపః. దేవపత్న్యోవాపి బైనమవర్ధయన్నద్యః స్వగూర్తాః స్వయంగామిన్యో మహాతే చ యత్త్వా పురూరవో రణాయ రమణీయాయ సంగ్రామాయావర్ధయన్ దస్యుహత్యాయ చ దేవాః దేవాః**

పురూరవాః మధ్యమోదేవః పురు - బహుధా రోరూయతే - స్తనయతి ఇతి పురూరవాః తస్యైషా - "సమస్మిన్ ... దస్యుహత్యాయ దేవాః" ఉర్వశ్యాః ఆర్షమ్. అస్మిన్ పురూరవసి జాయమానే - వర్షకర్మణి ఆత్మానం లభమానే గ్నాః - ఆపః సమాసత - సమాగమ్య తిష్ఠన్తి. అపి చ స్వగూర్తాః - స్వయం గామిన్యో నద్యః ఇమం అవర్ధయన్. హే పురూరవః! యత్ త్వా - త్వాం మహే - మహతే రణాయ - సంగ్రామాయ దస్యుహత్యాయ మేఘస్య వధాయ దేవాః త్వాం అవర్ధయన్.

అర్థము :— పురూరవాః = మధ్యమస్థానీయవాయువు, పురూరవా = ఎక్కువశబ్దముచేయును-గర్జించును కావుననే పురూరవాః అనబడుచున్నది. ఆతనికి సంబంధించిన ఋక్కు.

మంత్రార్థము :— అస్మిన్ జాయమానే=ఈపురూరవసుడు జన్మించగానే, జాయమానే = వర్షాకాలమున జన్మించగానే, గ్నాః = జలములు, సమాసతే = వాయుసమీపమునచేరి ఏకత్రితములగును, ఉత = మఱియు, స్వగూర్తాః = స్వయముగా గమనశీలముగల, నద్యః = జలములు, ఇమమ్ అవర్ధయన్ = ఈపురూరవసుని, అవర్ధయన్ = వర్ధిల్లజేయును - పెంపు చేయును, మంత్రమున ఉత్తరార్ధమునందు స్తుతిచేయబడెను. ఆపురూరవసుడు ఎదుట ఉపస్థితుడయ్యెను. ఆతనిని సంబోధించి చెప్పుచున్నారు, హే పురూరవః! యత్ త్వా = నిన్ను, మహేరణాయ=గొప్పసంగ్రామము కొఱకు మేఘముతో యుద్ధమొనర్చుటకు, దస్యుహత్యాయ=మేఘహననము కొఱకు లేక దుర్భిక్షమును నశింపజేయుటకు మరుత్తుమున్నగు, దేవాః = దేవతలు, అవర్ధయన్ = పెంపుచేయుచున్నారు. కావున జలము నీకడకు వచ్చి నిన్ను వర్ధిల్లజేయును.

భాష్యార్థము :— సమాసత = దగ్గఱకువచ్చి ఏకత్రితములగును ఒకచోచేరును, అస్మిన్ జాయమానే = పురూరవసుడు ఉత్పన్నుడైనమీదట, గ్నాః = జలములు గతినొనర్చుటవలన జలము గ్నాలనబడును, ఆపివా

గ్నాః దేవపత్న్యః = గ్నాఃదేవపత్నులనబడును, ఇమం = ఇతనిని, నద్యః= జలములు, అవర్ధయన్ = పెద్దజేసెను, స్వగూర్తాః - స్వయంగామిన్యః = గమనస్వభావముగలవి, రణాయ = రమణీయాయ = సంగ్రామముకొఱకు, లేక ఐతిహాసికపక్షమున ఇలాపుత్రుడు ఐలుడు పురూరవసుడు. ఆతనితో ఉర్వశీ అనుచున్నది. హే పురూరవః! జాయమానే = నీవు ఇలాకు పుట్టి నపుడు, గ్నాః=దేవపత్న్యః స్వగూర్తాః = స్వయముగానడచి ఇలాసమీపము నకువచ్చి సమావేశమైరి. పిలయన త్వా = నిన్ను, మహేరణాయ=అసుర లతో యుద్ధముచేయుటకు, దస్యుహత్యాయ = దస్యులను చంపుటకును దేవాః = ఇంద్రాదిదేవతలు అవర్ధయన్=తమబలముతో నిన్ను వర్ధిల్లజేసిరి.

ఇతి దశమోఽధ్యాయః

దశమాధ్యాయము సమాప్తము.

శ్రీమత్సకలశాస్త్ర నిష్ణాతపండితముక్తి రామోపాధ్యాయశిష్య పండిత శ్రీగోపదేవ విరచిత ఆంధ్ర టీకాతాత్పర్య సమేత నిరుక్తశాస్త్రమున పదియవ అధ్యాయము సమాప్తము.



# ఏ కా ద శా ధ్యా య ము

## ప్ర థ మ పా ద ము

శ్యేనః - (౧)

శ్యేనో వ్యాఖ్యాతః. తస్యైషా భవతి-

"ఆదాయ శ్యేనో అభరత్సోమం సహస్రం సవాఀ అయుతం. చ సాకమ్. అత్రా పురంధిరజహాదరాతీర్మదే సోమస్య మూరా అమూరః" (ఋ. ౪-౨౬-౭)

ఆదాయ శ్యేనోఽహరత్ సోమం సహస్రం సవానయుతం చ సహ. సహస్రం సహస్రసావ్యమభిప్రేత్య తత్రాయుతం సోమభక్షాస్తత్సంబంధేనాయుతం దక్షిణా ఇతి వా. తత్ర పురంధిరజహాదమిత్రానదానానితి వా. మదే సోమస్య మూరా అమూరః' ఇతి ఐంద్రే చ సూక్తే సోమపానేన చ స్తుతస్తస్మాదింద్రం మన్యన్తే.

శంసనీయం గచ్ఛతీతి పూర్వం వ్యాఖ్యాతః. మధ్యమోఽభిధేయః. తస్యైషా - "ఆదాయ శ్యేనో ... మూరా అమూరః వామదేవస్యార్షమ్. శ్యేనః - ఇంద్రః సోమమ్ ఆదాయ అభరత్ - అపిబత్. కుత్ర? ఉచ్యతే యత్ర - సహస్రం సుత్యానాం కుర్వన్తి అయుతం చ దక్షిణాః లభన్తే. అత్ర - అస్మిన్ సహస్రసావ్యే యజ్ఞే స శ్యేనః పురంధిః బహునోధనస్య దాతా. సోమస్య మదే - తృప్తౌ మూరాః - మూఢాన్ అరాతీః - శత్రూన్ అమూరః - అమూఢః సః అజహాత్ - అజయత్. అస్య మంత్రస్య ఐంద్రే సూక్తే సమామ్నానాత్ సోమపానేన స్తుత్యా చ శ్యేనః ఇంద్రః.

అర్థము :- శ్యేనః = ఓషధులందు రసమునునింపు వాయువు, శ్యేనః శంసనీయం గచ్ఛతి = ఇట్లు శ్యేనశబ్దమునకు నిరుక్తి చెప్పబడినది. శ్యేన = అవాయువునకు సంబంధించిన ఋక్కు.

మంత్రార్థము :- సహస్రం సవాన్ = సహస్రసావ్యనామక సత్రము నందు, అయుతంచసాకం = ఎక్కడ ప్రచురమాత్రలో దక్షిణలభించునో అక్కడ, శ్యేన = ఇంద్రః, సోమం = సోమరసమును గ్రహించి, అభరత్ = త్రాగెను, అత్రా = ఈ సహస్రసావ్యనామక సత్రమునందు, పురంధిః = ప్రభూతధనదాతయగు నింద్రుడు, సోమస్యమదే = సోమరసముతో తృప్తి డైనమీదట శత్రువులను లేక దానముచేయనివారిని, మూరాః = ప్రాణము లతో మూఢులనుజేసి - విషణ్ణులనుజేసి, స్వయం అమూరః = అమూఢుడు నిర్భయుడై, అజహాత్ - జయించెను.

భాష్యార్థము :- అభరత్ = అహరత్ = హరించెను - తీసికొని వెళ్లెను, ఇంద్రుడు సోమమును తీసికొని తనముఖమున నుంచుకొనెను. త్రాగెను, సహస్రం సవాని అయుతం చ సహ = సహస్రసావ్యమభిప్రేత్య= సహస్రసావ్యయజ్ఞమున, అయుతం = అధికమాత్రలో, సోమభక్షా = సోమభక్షణజరుగును, తత్సంబంధేన = దానిసంబంధముతో, అయుతం దక్షిణా = అధికమాత్రలో దక్షిణలభించును, అరాతీః - అమిత్రాన్ = శత్రూన్ = శత్రువులను, అదానాన్ = దానమునియ్యనివారిని కృపణు లను, లోభులను, 'మదేసోమస్య'ఇతి అని ఇంద్రదసూక్తమున చెప్పబడినది. కావున శ్యేనః = ఇంద్రుడు అనియర్థము. ఈసూక్తమున సోమపానము స్తుతింపబడినది.

సోమః - (౨)

> **ఓషధిః సోమః సునోతేర్ యదేనమభిషుణ్వన్తి· బహుల మస్య నైఘంటుకం వృత్తమాశ్చర్యమివ ప్రాధాన్యేన· తస్య పావమానీషు నిదర్శనాయోదాహరిష్యామః.**
>
> **"స్వాదిష్ఠయా మదిష్ఠయా పవస్వ సోమ ధారయా· ఇంద్రాయ పాతవే సుతః" (ఋ· ౯-౧-౧)**

ఇతి సా నిగదవ్యాఖ్యాతా.

అథైషాఽపరా భవతి చంద్రమసో వైతస్యవా – "సోమం మన్యతే పపివాన్ యత్సంపింషన్త్యోషధిమ్. సోమం యం బ్రహ్మాణో విదుర్న తస్యాశ్నాతి కశ్చన" (ఋ.౧౦-౮౫-3)

సోమం మన్యతే పపివాన్ యత్ సంపింషన్త్యోషధిమితి వృథాసుతమసోమమాహ. సోమం యం బ్రహ్మాణో విదురితి న తస్యాశ్నాతి కశ్చనాయజ్వా ఇత్యధియజ్ఞమ్.

అథాఽధిదైవతమ్ – సోమం మన్యతే పపివాన్ యత్ సంపింషన్త్యోషధిమితి యజుః సుతమసోమమాహ సోమం యం బ్రహ్మాణో విదుశ్చంద్రమసం న తస్యాశ్నాతి కశ్చనా దేవ ఇతి.

అథైషాఽపరా భవతి చంద్రమసో వైతస్య వా – "యత్త్వా దేవ ప్రపిబన్తి తత ఆప్యాయసే పునః. వాయుః సోమస్య రక్షితా సమానాం మాస ఆకృతిః" (ఋ. ౧౦-౮౫-౫)

యత్త్వా దేవ ప్రపిబన్తి తత ఆప్యాయసే పునరితి నారాశంసానభిప్రేత్య పూర్వపక్షాపరపక్షావితి వా వాయుః సోమస్య రక్షితా వాయుమస్య రక్షితారమాహ సాహచర్యాద్రసహరణాద్వా. సమానాం సంవత్సరాణాం మాస ఆకృతిః సోమో రూపవిశేషైరోషధిశ్చంద్రమా వా.

సోమః సునోతేః అభిషవార్థాత్. అసౌ యజ్ఞేషు అభిషూయతే. హిమవతో మౌజవతో వా జాతా ఓషధిః.

బహులమస్య నైఘంటుకం వృత్తమ్ - అస్యార్థా స్తుతిః క్వచిచ్చ ప్రాధాన్యేనాస్య స్తుతిః ఆశ్చర్యమివ ప్రతీయతే. తచ్చ పావమానీషు ఋక్షు నిదర్శనాయ ఉభయమ్ - స్తుతేః స్వార్థత్వం చాపరార్థత్వం చ ఉదాహరిష్యామః పరార్థం తావద్ ఉదాహ్రియతే. యథా - స్వాదిష్ఠయా

మదిష్ఠయా - మాదయితృతమయా చ ధారయా త్వం పవస్వ - ప్రక్షర ఇంద్రాయ - ఇంద్రార్థమ్ పాతవే - పానాయ సుతః అభిషుతః.

అథ ఏషా అపరా ఋక్ చంద్రమసః ఏతస్య వా చంద్రత్వమాప న్నస్య ఓషధి - సోమస్య - "సోమంమన్యతే ... తస్యాశ్నాతికశ్చన" సూర్యాయా ఆర్షమ్. యత్ సంపింషన్తి - సంచూర్ణయన్తి అభిషుత్య పిబన్తి సోమం తే మన్యన్తే వయం పపివాంసః - సోమపాః పరం న తే సోమపాః వృథా సోమః సః. యం సోమం బ్రహ్మాణః విదుః - అధియజ్ఞే అంగ భూతం తస్య - తం కశ్చన - అయజ్వ న అశ్నాతి.

అథాధిదైవతమ్. యం సోమం బ్రహ్మాణో విదుః - యం చంద్ర మసం అధియజ్ఞం విదుః కశ్చన అదేవః న అశ్నాతి. "సోమో నూనమేష తద్దేవానామన్నమితి హ విజ్ఞాయతే" ఏవమస్య స్వప్రధానా స్తుతిః.

అథాపరోభయోః - "యత్త్వా దేవ ... మాస ఆకృతిః" యదా త్వాం హే దేవ! సోమ! ప్రపిబన్తి ఋత్విగ్యజమానాః పాతుం ప్రారభన్తే తతః త్వం పునః ఆప్యాయసే. వాయుః సోమస్య రక్షితా-సాహచర్యాద్ రసహర ణాద్వా. సమానాం - సంవత్సరాణామ్ - మాసః ఆకృతిః - నిర్మాతా. సోమస్య ఓషధిరూపచంద్రస్య కలోపచయమను ఏకైకశః పర్ణాన్యుపచీ యన్తే పౌర్ణమాస్యాం చ పంచదశపర్ణః సంపద్యతే. కలాహానౌ చ కృష్ణపక్షే ఏకైకం పర్ణమపచీయతే ఇత్యాయుర్వేదవిదః రసాయనతంత్రే సోమలక్షణం స్మరన్తి తదేవం సోమః ఓషధిరూపః సమానాం-సంవత్సరాణామ్ ఆకృతిః- ఆకర్తా భవతి అథాధిదైవతమ్ ఏష సోమః - చంద్రమా దివాఽపి సూర్యస్య రశ్మిభిః కృష్ణపక్షే పీయతే పునశ్చ శుక్లపక్షే సుషుమ్నయా రవిరశ్మినాప్యా ఆప్యాయతే - ఆపూర్యతే. తదేవం సోమః - చంద్రమాః - సమానాం - సంవత్సరాణామ్ మాసః - ద్వాదశకృత్వో మాసభూతమాత్మానమావర్తయన్ ఆకృతిః - కర్తా భవతి.

అర్థము :— సోమః ఓషధిః = ఓషధి. సోమశబ్దము సునోతేః అభిష వార్థక 'షుఞ్' ధాతువువలన నేర్పడును. షుఞ్ ధాతువునకు మన్ ప్రత్య యముచేయబడును. యత్ = ఏలయన, ఏనమ్ = ఈసోమమును, అభి షుణ్వన్తి = పిండిసిద్ధముచేయుదురు అందువలన నిది సోమమనబడును.

వేదములందు ఈసోమఓషధికి బహుళం నైఘంటుకం వృత్తమ్ - గౌణత్వేన = గౌణరూపమున ఎక్కువవర్ణన కనబడును. కాని ముఖ్య రూపమున అశ్చర్యమివ = మిక్కిలితక్కువగా చూడబడును. తస్య = ఆసోమముయొక్క, పావమానీషు = పావమానీయుక్కులందు అనగా 'పవమానః సోమః' = సోమదేవతాక ఋక్కులందు - వచ్చిన ప్రధాన వర్ణనమును, నిదర్శనాయ = దిగ్దర్శనార్థము ఉదాహరిష్యామః = ఇక్కడ నుదాహరించుచున్నాము.

మంత్రార్థము :- హే సోమ! స్వాదిష్ఠయా = మిక్కిలితియ్యని, మదిష్ఠయా = మదమునుకలిగించు, ధారయా=ధారతో, సుతః=పిండబడిన నీవు, ఇంద్రస్యపాతవే = ఇంద్రునిపానముకొఱకు, పవస్వ = స్రవింపుము. దీనితరువాత చంద్ర, ఓషధులకు సంబంధించిన మఱియొక ఋక్కు.

మంత్రార్థము :- యత్ ఓషధిమ్ సంపింషన్తి = కొందఱు రాసాయనికులు, ఏ సోమ = ఓషధిని పిండుదురో, మఱియు దానిని త్రాగి, సోమం పపివాన్ మన్యతే = తమను సోమపానముచేసినవారినిగ నెంచెదరో అది వ్యర్థముగా పిండుట, వ్యర్థముగా త్రాగుటయే యగును. అదివాస్తవిక సోమపానము కాదు. కాని, యం సోమం బ్రహ్మాణః విదుః=ఏసోమమును బ్రాహ్మణులు, అనగా వేది వాస్తవికసోమమో, తం = దానిని, న కశ్చన అశ్నాతి = ఎవడును తినడు - త్రాగడు - కాని, విధిపూర్వకముగ సోమమును సిద్ధముచేసి యింద్రునికాహుతినిచ్చి తదుపరి యజ్ఞశేషరూపమున త్రాగబడినదియే వాస్తవిక సోమపానము. దానివలననే శ్రేయఃప్రాప్తి కలుగును.

భావార్థము :- ఓషధిం సోమం యం సంపింషన్తి = విధిపూర్వకముగ సోమమును సిద్ధముచేసి దాని నింద్రునకాహుతిగానిచ్చి మిగిలినది యజ్ఞశేషముగా పానముచేసిన అదియే వైదికసోమపానమగును. రాసాయనికులు తమయిష్టమువచ్చినట్లు సోమరసమును సిద్ధముచేసి త్రాగిన ఫలవంతము కాదని - భావార్థము.

అథఆధిదైవతమ్ = ఇప్పుడు అధిదైవతపరకమగు విధిపూర్వకముగ సోమమును సిద్ధముచేసి త్రాగినచో నది యజ్ఞసోమపానమగునేకాని వాస్త

పమున నది అసోమపానమేయగును. బ్రాహ్మణాః చంద్రమసం విదుః = జ్ఞానులు ఏ - చాంద్రమసం సోమం = చంద్రసంబంధసోమము నెఱుగుదురో దానిని, అదేవః = దేవభిన్నమనుష్యుడు, న అశ్నాతి=త్రాగజాలడు. దానిని దేవతయేత్రాగును, సూర్యుడు కృష్ణపక్షమున చంద్రునికలను త్రాగును. చంద్రునికళను హరించును.

ఇప్పుడిక్కడ మఱియొకమంత్రము చూపబడుచున్నది. ఇందు సోమపదము చంద్రునకు ఓషధికి - రెండింటికివాచకము.

మంత్రార్థము :— దేవ ! = దివ్యగుణయుక్తసోమ !, ప్రతిసవన కర్మమునందును నిన్ను ఋత్విక్కులు ప్రపిబన్తి = త్రాగుదురు, ఐనను నీవు, ఆప్యాయసే=వృద్ధిపొందుదువు, వాయువు ఓషధిరక్షకమగువాయువు, ఓషధివగు నిన్ను సోమమును రక్షించును, కావున నీవు వర్ధిల్లుచున్నావు. వాయువు అన్నింటిని శుష్కింపచేయును. కాని సోమరసమును శుష్కింప జేయడు - 'వాయుగోపా వై వనస్పతయః' అను శ్రుతిననుసరించి సోమ రసమునుంచుపాత్రలను వాయువు శుష్కింపజేయుచు వానిని రక్షించును. కావున నందుంచబడిన సోమరసమునుగూడ రక్షించును. అందువలన వాయువు సోమరక్షకుడగుచున్నాడు. ఈయర్థము ఓషధిపక్షమున—

ఇక చంద్రునిపక్షమున మంత్రార్థము

మంత్రార్థము :- యత్ = ఎప్పుడు, దేవ ! హే దేవసోమ ! చంద్ర ! త్వా = నిన్ను, కృష్ణపక్షమున ప్రపిబన్తి = సూర్యకిరణములు త్రాగి వేయునో, తతః = తదుపరి వెంటనే, శుక్లపక్షమున నీవు మరల, ఆప్యాయసే = వృద్ధిపొందుచున్నావు, వాయువు సోముడవగునిన్ను చంద్రుని, రక్షితా = రక్షించుచున్నాడు. ఈసోముడు చంద్రుడు, సంవత్సరాణాం మాసస్య = సంవత్సరములకు, మాసమునకు, ఆకృతిః = ఆకర్తా=నిర్మాత యగుచున్నాడు.

యత్ = ఎప్పుడు, త్వా = నిన్ను, దేవ హే సోమ ! (చంద్రుడు - ఓషధి) ప్రపిబంతి=త్రాగుచున్నారో ( - ఓషధిని ఋత్విక్కులు చంద్రుని సూర్యకిరణములు) తతః = తదుపరి వెంటనే, ఆప్యాయసే పునః = మరల వృద్ధిపొందుచున్నావు - అని యీవిషయము, నారాశంసాన్ అభిప్రేత్య =

(సర్వైః ప్రశస్యాన్ ఛదాన్) సోమలతాపర్ణముల ఆకుల నుద్దేశించి చెప్ప బడినది - లేక, పూర్వపక్షము, అపరపక్షము అను రెండుపక్షములనుద్దేశించి చెప్పినట్లెంచవలెను. వాయువు సోమరక్షితా - అనుటకు వివరణము. వాయుః = వాయువు, అస్య = ఈసోమముయొక్క, (చంద్ర - ఓషధి అనువాని), రక్షితారమ్ = రక్షకునిగా, ఆహ = చెప్పబడినది, సాహచర్యాత్ - రసహరణాద్వా = సాహచర్యము, రసహరణము అను కారణములవలన వాయువు చంద్రసోమముల రక్షకుడగుచున్నాడు ఓషధితో వాయువునకు నిత్యసంబంధముండును. చంద్రునితోను వాయువునకు సంబంధమున్నది. వాయువు చంద్రునితో నుండి చంద్రునిగతికి కారణమగుచున్నది. మఱియు సుషుమ్నానామక సూక్ష్మసూర్యరశ్మి - నాడివలన క్షీణచంద్రుని మరల కళాపూర్ణునిచేయును, ఇట్లు వాయువు చంద్రుడు - సోమఓషధి - అను రెండింటిరక్షకుడు అగుచున్నది. వాయువు రెండింటితోను కలిసియుండి ఓషధిరసమును, చంద్రునికళను సూర్యరశ్మిమూలమునను హరించును. (ఆహరతి) సమానాం మాస ఆకృతిః అను విషయవివరణము - సంవత్స రాణాం మాసః ఆకృతిః సోమః రూపవిశేషైః ఓషధిః చంద్రమా వా = సోమఓషధి తన ఆకులతోను చంద్రుడు తనకళలతోను పూర్వాపరపక్షము లను నిర్మించుచు సంవత్సరమును నిర్మించును. సోమఓషధియొక్క ఆకులు, చంద్రునికళలననుసరించి కృష్ణపక్షమున నొక్కొక్కటి రాలి పోవును. శుక్లపక్షమున మరల నొక్కొక్క ఆకు ఓషధికి కలుగుచుండును. చంద్రుడు కృష్ణపక్షమున కళలనుకోల్పోవును. శుక్లపక్షమున మరల కళా పూర్ణుడగుచుండును. ఓషధియు పూర్ణిమనాడు పదునైదుపర్ణములతోను - అమావాస్యనాడు పర్ణరహితముగాను నుండును. ఇట్లు ఈపూర్వ - అపర - శుక్లకృష్ణపక్షములతో మాసము, మాసములతో సంవత్సరము నేర్పడును. అందువలన ఓషధి - చంద్రులు సంవత్సర నిర్మాతలనబడుచున్నారు. ఓషధికి సంబంధించిన ఆకులొకపక్షమున రాలిపోవుట, మఱియొకపక్షమున మరల నొక్కొక్క ఆకుపుట్టుటచే ఓషధిరూపము మారుచుండును. అవియే ఓషధిరూపవిశేషములు. చంద్రుడు తనకళలక్షయవృద్ధుల మూల మున భిన్నరూపములుకలవాడగుచున్నాడు. సోమరసము - సోమలత

విషయమున కొన్నివిశేషములను పాఠకులు గుర్తింతురుగాక. సోమఓషధి విషయము ఋషి ప్రణీతగ్రంథములం దిట్లు చూడనగును.

ఋషికృతవైద్యకగ్రంథములందీ ఓషధివిషయమున వ్రాయబడిన విషయముల నెఱుంగుట మంచిది. సుశ్రుతమను వైద్యకగ్రంథమున చికిత్సావిభాగమున ౨౯ అధ్యాయము చదువదగినది. "సోమఓషధి, స్థానము నామము ఆకృతి వీర్యము అనుభేదములతో ౨౪ విధములుగానున్నది—

౧) అంశుమాన్, ౨) ముంజవాన్, ౩) చంద్రమా, ౪) రజతప్రభ, ౫) దూర్వాసోమము, ౬) కనియాన్, ౭) శ్వేతాక్ష, ౮) కనకప్రభ, ౯) ప్రతానవాన్, ౧౦) తాలవృన్త, ౧౧) కరవీర, ౧౨) అంశవాన్, ౧౩) స్వయంప్రభ. ౧౪) మహాసోమ, ౧౫) గరుడాహృత, ౧౬) శ్యేనాహృత (వృష్ట - ౬౫౬), ౧౭) గాయత్ర్య, ౧౮) త్రైష్టుభ, ౧౯) పాఙ్క్త, ౨౦) జాగత, ౨౧) శాంకర, ౨౨) అగ్నిష్టోమ, ౨౩) రైవత, ౨౪) సోమ ఉడుపతి మున్నగుభేదములు, అష్టమశ్లోకము :— "ఏతే సోమాః సమాఖ్యాతాః వేదే క్తైః నామభిః శుభైః" ఈశ్లోకభాగమునుబట్టి ఓషధికిగల యీ నామములు వేదప్రతిపాదితములని విదితమగును.

దీర్ఘాయుష్కోఱకు సోమమును సేవించువిధి మిక్కిలిఅద్భుతముగ చూపబడినది - "అధ్వరకల్పేన హృతమభిమతమ్" అనునీవాక్యమునుబట్టి యజ్ఞవిధిననుసరించి దీని నిష్పాదనచేయవలయునని తెలియుచున్నది - "యమనియమాభ్యామాత్మానం సంయోజ్య" అనువాక్యమునుబట్టి సోమపానముచేయువ్యక్తి యమనియమములను పాలింపవలయుననియు తెలియుచున్నది. మఱియు నిట్లు మూడుమాసములు విశేషనియమములను పాలింపవలయునట. ఇట్లు సోమరసమును సేవించినవారికి 'అణిమా మహిమా, లఘిమా, గరిమా ప్రాప్తిః ప్రాకామ్యమ్ ఈశత్వమ్ - వశిత్వ మనెడి అష్టసిద్ధులు సిద్ధించునట.

మఱియు సోమలతను గుర్తించుట యిట్లు చెప్పబడినది.

సర్వేషామేవ సోమానాం పత్రాణి దశపంచకాని శుక్లేచ కృష్ణేచ జాయన్తే నిపతంతి చ - "ఏకైకం జాయతే పత్రం సోమస్యాహరహ స్తథా శుక్లస్య పౌర్ణమాస్యాం తు భవేత్ పంచదశచ్ఛదః"

"శీర్యతే పత్రమేకైకం దివసే దివసే పునః, కృష్ణపక్ష క్షయేచాపి లతా భవతి కేవలా" (ఋ. ౨౦-౨౧-౨౨)

అంశుమాన్ = సోమముయొక్క గంధము ఘృతగంధమువలె నుండును. రజతప్రభయుండు కందముండును. ముంజవాన్ = కందము అరటిగడ్డవలెనుండును. దానిఆకులు వెల్లుల్లిఆకులవలెనుండునట. 'చంద్రమా' = సోమము సువర్ణమువలె ప్రకాశించును. ఆదిజలమున నుత్పన్నమగును. గరుడాహృత శ్వేతాక్షసోమములు పాండువర్ణము కలిగి యుండునట. మఱియు నవి పాముకుబుసమువలె వృక్షకొమ్మలచివర వ్రేలాడుచుండునట. అన్నిరకముల సోమఓషధికి ఆకులుపదునైదె (౧౫) యుండునట.

ఈ సోమఓషధి లభించుస్థానములు హిమాలయము, అబూ, (అర్బుద) సహ్య, మహేంద్ర, మలయ, శ్రీపర్వతము, దేవగిరి, దేవసహ, పారిపాత్ర, వింధ్యాచలము, అను నీపర్వతములలో సోమలత లభించునట.

ఇప్పటికి 80 సం-పూర్వము ఇండియన్ సర్కారుచే నియుక్తుడైన డా - రౌక్సుబరోహ అనేవ్యక్తి హిమాలయమున నీఓషధిని కనుగొనినాడనియు దానిరసము మత్తునుగలిగించదనియు స్వాదిష్టమనియు నతడు చెప్పినట్లు వినికిడి.

చంద్రమాః - (౩)

చంద్రమాశ్చాయన్ ద్రమతి, చంద్రో మాతా, చాంద్రం మానమస్యేతి వా.

చంద్రశ్చన్దతేః కాన్తికర్మణః. చందనమిత్యప్యస్య భవతి చారు ద్రమతి, చిరం ద్రమతి, చమేర్వా పూర్వరూపమ్. చారు రుచేర్విపరీతస్య.

తస్యైషాఽపరా భవతి-

“నవో నవో భవతి జాయమానోఽహ్నాం కేతురుషసామేత్య గ్రమ్ భాగం దేవేభ్యో విదధాత్యాయన్ ప్ర చంద్రమాస్తి రతే దీర్ఘమాయుః” (ఋ. ౧౦-౮౫-౧౯)

నవో నవో భవతి జాయమానః, ఇతి పూర్వపక్షాది మభి ప్రేత్య అహ్నాం కేతురుషసామేత్యగ్రమ్, ఇత్యపరపక్షాంత మభిప్రేత్య. ఆదిత్యదైవతో ద్వితీయః పాద ఇత్యేకే. భాగం దేవేభ్యో ‘విదధాత్యాయన్’ ఇత్యర్ధమాసేజ్యామభి ప్రేత్య. ప్రవర్ధయతే చంద్రమా దీర్ఘమాయుః.

చంద్రమాః కస్మాత్? ఉచ్యతే ఉపరిస్థితః సర్వభూతాని చాయన్ - ద్రమతి - గచ్ఛతీతి చంద్రమాః అథ చాయం సర్వస్య చంద్రః - ఆహ్లాదకః మాతా - నిర్మాతా చ యతః తతః చంద్రః చాంద్రం మానమస్యేతి వా చంద్రమాః చంద్రః పునః కాన్త్యర్థాత్ చందతేః ఏష సదైవ కాంతః. చందనమపి అస్మాదేవ ధాతోః సాధ్యమ్. అథవా చారు ద్రమతీతి చంద్రమాః, చిరం ద్రమతీతి వా, చమ్యమానః - నిపీయమానో దేవైః ద్రమతీతి వా. చారు కస్మాత్? విపరీతాత్ రుచేః. తస్య చంద్రమస ఏషా - “నవోనవో ... దీర్ఘమాయుః” సూర్యాయా ఆర్షమ్. జాయమానః-అస్తమితే సూర్యే తదను ప్రతిమాసం జాయమానో నవో నవో భవతి. పూర్వపక్షమభి ప్రేత్యైతదుక్తమ్.

అపరపక్షం చాభిప్రేత్యాహ - అహ్నాం - దినానాం కేతుః - కర్తా గతివిశేషైః ఇతి. ఉషసామ్ - అగ్రమేతి - ఉషః ప్రకాశస్య ప్రాతః పురస్తాత్ ఉద్యతః సూర్యస్య దృశ్యతే. ఏవం ప్రకారేణ - ఆయన్ ఆగచ్ఛన్ దేవేభ్యో భాగం విదధాతి దర్శపౌర్ణమాసాభ్యామిత్యభిప్రాయః. ఏవంగుణ విశిష్టః చంద్రమాః దీర్ఘమ్ ఆయుః ప్రతిరతే - ప్రవర్ధయతే.

అర్థము :- చంద్రమాః ఏల? ఇతడు, చాయన్ = సర్వభూతములను చూచుచు, ద్రమతి = నడచుచున్నాడు, ఈనిరుక్తియందు ‘చాయన్’ పూర్వపదము, ద్రమ ఉత్తరపదము - లేక చంద్రోమాతా - చంద్రశ్చ మాతా చ=అతడు కాంతిమంతుడు, కాలనిర్మాతయు, వా లేక చాంద్రం =

చంద్రసంబంధికాలనిర్మాణము, చాంద్రవర్షము చంద్రునిసంబంధముతో నేర్పడును అందువలన చంద్రమా అనబడుచున్నాడు. చంద్రునితో సంబంధముండుటవలన వర్ష = సంవత్సరమునకు, చాంద్రవర్షము-చాంద్ర సంవత్సరమనబడును, చాంద్ర నిర్మాణమునకు సంబంధించిన 'మా'. 'చాంద్ర'లోని 'చాకు' హ్రస్వముఆగుటచే చంద్రమా అగును.

కాంతికర్మణః = కాంతిఅర్థక - 'చది'ధాతువుతో చంద్రశబ్దము సిద్ధమగును. చందనమ్ = చందనము అనుశబ్దముకూడ ఈ'చది'ధాతువు వలననే సిద్ధమగును. లేక చారు = అందముగా, ద్రమతి = గచ్ఛతి = నడచును కావున చంద్రుడనబడుచున్నాడు. లేక చిరమ్ = చాలకడవు ద్రమతి = గచ్ఛతి = నడచును కావున చంద్రుడు అనబడును. వా = లేక, చమేః = చంద్రపదమునందు ముందు 'చము'ధాతువుకలదు. అందు వలనను చంద్రుడగును. ఈచంద్రుడు సూర్యునిచే త్రాగబడుచు గమనము చేయును. కృష్ణపక్షమునందు చంద్రునికాంతి సూర్యునిచే పానముచేయ బడును - హరింపబడును. కావున చంద్రుడనబడును. చారు ఎట్లు? దీప్త్యర్థక రుచ ధాతువుతో ఇందలి అక్షరములను విపర్యయముచేయుట వలన 'రుచ - చారు' చారు శబ్దమునిద్ధించును.

అట్టిచంద్రునికి సంబంధించిన ఋక్కు.

మంత్రార్థము :— చంద్రమాః = చంద్రుడు, జాయమానః = శుక్ల పక్షమునఒక్కొక్కకళతో వృద్ధిబొందుచు నుదయించుచు. నవో నవో భవతి = ప్రతిదినము క్రొత్తవాడగును, అహ్నాం కేతుః = దినములజ్ఞాప కుడు, ప్రతిపదా = పాడ్యమి, విదియఅనుతిథులను లక్షింపజేయును, ఉషసామ్ అగ్రమ్ ఏతి = ఉషస్సులకు పూర్వమే వచ్చును, ఆయన్ = ఇట్లు ఉదయించు చంద్రుడు, దేవేభ్యః = దేవతలకు, భాగమ్ విదధాతి = హవిర్భాగమునిచ్చును పూర్ణిమ, అమావాస్యదినములలో దర్శపౌర్ణమాస - ఇష్టులమూలమున హవిర్దానముచేయించుచున్నాడు. దేవతలనుద్దేశించి - పక్షేష్టులందు ఆహుతులియ్యబడును. చంద్రుడు - ఆయుః = ప్రాణుల ఆయుస్సును,తిరతే=పొడిగించును-చంద్రకాంతసేవనము ఆయుర్వర్ధకము.

భాష్యార్థము :- నవో నవో భవతి జాయమానః = ప్రతిదినము కళలవృద్ధితో క్రొత్తవాడుగా ఉదయించును. ఇయ్యది పూర్వశుక్లపక్షము నుద్దేశించిచెప్పబడినది. అహ్నాం కేతుః = పాడ్యమి - విదియమున్నగు తిథులకు హేతువు, ఉషసామ్ అగ్రమ్ ఏతి = ఉషఃకాలములకుముందు చంద్రుడు వచ్చును, ఇది = అపర = కృష్ణపక్షముయొక్క అంతమును నుద్దేశించి చెప్పబడినది, అమావాస్యకుముందు కొన్నిదినములు చంద్రుడు ఉషఃకాలమునకు ముందే యుదయించును.

కొందఱు ఆచార్యులు ఈమంత్రమున ఉత్తరార్థము ఆదిత్యదేవతాక మని యెంచుచున్నారు ఏలయన' అహ్నాంకేతుః - ఉషసామేత్యగ్రమ్' = సూర్యుడు దినములకు లక్షకుడు. చంద్రుడు ఉషస్సులకు పూర్వముద యించి దేవతలకు హవిర్భాగముల నిప్పించును. ఇట్లీమంత్రము సూర్య చంద్రులకిరువురకు సంబంధించినదిగా చెప్పవచ్చును.

మృత్యుః - (౪)

మృత్యుర్మారయతీతి సతః. తస్యైషా భవతి–"పరం మృత్యో అనుపరేహి పన్థాం యస్తే స్వ ఇతరో దేవయానాత్. చక్షుష్మతే శృణ్వతే తే బ్రవీమి మా నః ప్రజాం రీరిషో మోత వీరాన్" (ఋ. ౧౦-౧౮-౧)

పరం మృత్యో ధ్రువం మృత్యో ధ్రువం పరేహి మృత్యో కథితం తేన మృత్యో మృతం చ్యావయతే భవతి మృత్యో మదేర్వా ముదేర్వా.

తేషామేషా భవతి - "త్వేషమిత్థా సమరణం శిమీవతో రింద్రావిష్ణూ సుతపా వామురుష్యతి. యా మర్త్యాయ ప్రతిధీయమాన మిత్కృశానోరస్తు రసనామురుష్యథ" (ఋ. ౧-౧౫౫-౨) ఇతి సా నిగదవ్యాఖ్యాతా.

మారయతీతి సతో మృత్యుః. శతబలాక్షః - శతబలాని - బహుబలాని అక్షాణి - ఇంద్రియాణి యస్య సః మౌద్గల్యః పునరేవం నిర్వక్తి యత్

మృతం చ్యావయతి - య ఏవ క్షీణాయుః భవతి తముపగమ్య ప్రచ్యావయతి. తస్యైషా - "పరం మృత్యో ... మోతవీరాన్" హే మృత్యో! పరం అన్యం పంథామ్ - పంథానమ్ అనుపరేహి - అనుపరాగచ్ఛ యః పంథాః తే - తవ స్వః - నిజః స దేవయానాత్ ఇతరః. వయం చ దేవయానే పథి స్థితాః అతః తే ధర్షణాత్ దూరే స్మః. త్వం చక్షుష్మానసి శ్రోత్రవాంశ్చ అతస్తేఽహం బ్రవీమి. మా త్వం నోఽస్మాకమ్ ప్రజాః - పుత్రపౌత్రాది రూపాః ఉతాన్యోఽస్మద్భ్రాతా వీరాస్తానపి రీరిషః - హింసీః.

అర్థము :- మృత్యుః = ఏల? లోకులనిడిచంపును అందువలన మృత్యువనబడును. మృతం చ్యావయతీతి వా - శతబలాక్ష మౌద్గల్యః. ముద్గలస్య అపత్యః = ముద్గలుని సంతానము - మౌద్గల్యుడు = అతని నామము శతబలాక్షుడు - మృత్యునిర్వచనము - మృతం చ్యావయతి = మృతప్రాణిని ఈలోకముయోనినుండి వేఱుచేసి మఱియొకలోకమున - యోనియందు చేర్చును. శతబలాక్షః = శతబలాని = బహుబలాని అక్షాణి ఇంద్రియాణి యస్య సః = బహుఇంద్రియములుకలవాడు

ఆ మృత్యువిషయకముఋక్కు.

మంత్రార్థము :- మృత్యో! = ఓ మృత్యువా!, పరం పంథామ్ = అన్యమార్గముకంటె భిన్నమైన మార్గమును, అనుపరేహి = వెళ్లిపొమ్ము, యః = ఏమార్గము దేవయానముకంటె, ఇతరః = అన్యమార్గముకలదో, సః = అది, తేస్వః = నీనిజమార్గము, చక్షుష్మతే, శృణ్వతే - తే=చక్షువులు శ్రోత్రములుగల - చూడ - వినగలిగిన - నీకు బ్రవీమి = చెప్పుచున్నాను. నః ప్రజామ్ = మాసంతానమును, మారీరిషః = హింసింపవద్దు.

ప్రాణులకు మూడుగతులు సర్వోత్తమగతి దేవయానము. ఈమార్గమున నడచుకొనుప్రాణులు = మానవులు మోక్షమును పొందుదురు. వారు మరల వెంటనే జన్మమరణరూపచక్రమునచిక్కుకొనరు. కావున దేవయానగతితో మృత్యువునకు సంబంధముండదు. రెండవగతి పితృయానము. మూడవది - 'జాయస్వ - మ్రియస్వ' చావు - పుట్టుక ఇవరి రెండుమార్గములలో పితృయానము శ్రేష్ఠము. ఈరెండుమార్గములందును మృత్యువునకు సంబంధముండును. ఈమంత్రమున 'ఓ మృత్యువా!

మేము దేవయానము ననుసరించువారము. కావున నీవు మావంకకు రావలదు' అని ప్రార్థింపబడునది. ("పరం మృత్యో ధ్రువం మృత్యో'అను పాఠము ప్రక్షిప్తము. కావున దుర్గాచార్యప్రభృతులెవ్వరును వీనిని వ్యాఖ్యానింపరైరి. కావున మేమునిట వీనిని వ్యాఖ్యానింపమైతిమి. అగ్నే తేషా మేషా భవతి" అనునదియు ప్రక్షిప్తము దానికిని వ్యాఖ్యచేయుటలేదు)

విశ్వానరః - (౫)

విశ్వానరో వ్యాఖ్యాతః. తస్యైషా భవతి - "ప్రవో మహే మందమానాయాంధసోఽర్చా విశ్వానరాయ విశ్వాభువే. ఇంద్రస్య యస్య సుమఖం సహో మహి శ్రవో నృమ్ణం చ రోదసీ సపర్యతః" (యజు. ౧౦-౫౭)

ప్రార్చత యూయం స్తుతిం మహతేఽన్ధసోఽన్నస్య దాత్రే మందమానాయ, మోదమానాయ, స్తూయమానాయ, శబ్దాయమానాయేతి వా విశ్వానరాయ, సర్వం విభూతాయేంద్రస్య యస్య ప్రీతౌ సుమహద్ బలం మహచ్చ శ్రవణీయం యశో నృమ్ణం చ బలం నృణాన్నతం ద్యావాపృథివ్యౌ వః పరిచరత ఇతి క మన్యం మధ్యమాదేవమవక్ష్యత్.

తస్యైషా అపరా భవతి-

"ఉదు జ్యోతిరమృతం విశ్వజన్యం విశ్వానరః సవితా దేవో అశ్రేత్. (ఋ. ౭-౭౬-౧)

ఉదశిశ్రియజ్జ్యోతిరమృతం సర్వజన్యం విశ్వానరః సవితా దేవ ఇతి.

అభిధానాభిధేయాభ్యాం పూర్వం వ్యాఖ్యాతః. తస్యైషా - "ప్రవో మహే ... రోదసీసపర్యతః" వైకుంతస్యార్షమ్. జగతి - హే స్తోతారః మహే - మహతే అంధసః - అన్నస్య దాత్రే మందమానాయ హృష్యమాణాయ విశ్వాభువే - సర్వవిభూతిమతే విశ్వానరాయ దేవాయ ప్ర - అర్చ - ప్రార్చత - ప్రపూజయత. ఇంద్రస్య - ఈశానస్య యస్య విశ్వా

నరస్య సుమఖం - సుమహత్ మహః - బలమ్ మహి - మహచ్చ శ్రవః - యశః వృష్ణం వృషన్ - మనుష్యాన్ ప్రతి నతం బలం చ వః-యుష్మాకం ప్రోచ్యమానాం స్తుతిం రోదసీ - ద్యావాపృథివ్యౌ సపర్యతః - పూజయతః.

ఏషా చ విశ్వానరస్య ద్వితీయా ఋక్ - "ఉదుజ్యోతి ... దేవో అశ్రేత్" వసిష్ఠస్యార్షమ్. సవితా విశ్వానరః - మధ్యమో వాయుః అమృతం జ్యోతిః - సూర్యసంజ్ఞమ్ విశ్వజన్యమ్ - సర్వభూతోపకారకమ్ ఉత్ అశ్రేత్- ఉచ్ఛ్రయతి ఊర్ధ్వముపనయతి.

విశ్వానరశబ్దవ్యాఖ్య (౭-౭౦-౧) చేయబడినది. ఆవిశ్వానరశబ్ద విషయక ఋక్.

మంత్రార్థము :— ఓ స్తోతలార! మీరు, మహే = మహాన్ - గొప్ప, మందమానాయ = ప్రసన్నులగుచు - అనేక స్తోతలచే శబ్దితులగు, అంధసః (దాత్రే) అన్నదాత, విశ్వాభువే = సర్వవిధములగు నైశ్వర్యయుక్త, విశ్వానరాయ=విశ్వానరవాయువునకు, ప్రార్చ=స్తుతియింపుడు, యస్య ఇంద్రస్య= ఆవిశ్వానరవాయువుయొక్క, సుమఖం సహః = గొప్పబలమును, మహి శ్రవః = గొప్పయశస్సును, వృష్ణం చ = మానవీయబలమును, రోదసీ = ద్యావాపృథివీలోకములు, సపర్యతః = సేవించుచున్నవి.

భాష్యార్థము :— ప్రార్చత యూయం స్తుతిం = మీరు స్తుతించుడు' ఇతరులచే చేయబడినస్తుతిని పూజింపుడు, మహే - మహతే - మహాన్ = గొప్ప, అంధసః = అన్నస్యదాత్రే = అన్నదాత, మందమానాయ - మోదమానాయ = ప్రసన్నులగుచు, స్తూయమానాయ = స్తుతిచేయబడుచు, శబ్దాయ - మానాయ ఇతి వా = అనేక స్తోతలచే స్తుతియింపబడిన, విశ్వాభువే - సర్వవిభూతాయ = సర్వమును వ్యాపించియున్న ఇంద్రస్య యస్య ప్రీతౌ = వీయైశ్వర్యశాలిప్రీతియందు - విశ్వానరుని ప్రీతియందు, సుమఖమ్ = మిక్కిలిగొప్పబలమును, మహాశ్రవః = గొప్పకీర్తిని వృష్ణంచ బలమ్ = బలమును, వృష్ణమేల? వృషన్నతమ్ = శత్రువులను మనుష్యులను నమ్రములనుచేయును - అణచును, రోదసీ - ద్యావాపృథివ్యౌ = ద్యుపృథివీలోకములు, వః = మీయొక్క - మీచేచేయబడినస్తుతులను, సపర్యతః పరిచరతః = సేవించుచున్నవి.

ఆవిశ్వానరునకుచెందిన మఱియొక ఋక్కు.

మంత్రార్థము — సవితా = సర్వప్రేరకుడు, దేవః = దివ్యగుణయుక్తుడునగు, విశ్వానరః = విశ్వానరవాయువు, సర్వజన్యమ్ = సమస్తమునకు హితకరమగు, అమృతం జ్యోతిః = మరణధర్మరహిత, ప్రకాశస్వరూపుడగు సూర్యుని, ఉదశ్రేత్ - ఉదశ్రయత్ = పైకెగయింపచేసెను ఆవిశ్వానరవాయువే సూర్యునికి గతికలిగించును. గతిమంతములగు సమస్తపదార్థములకు ప్రేరకవిశ్వవ్యాప్త మధ్యస్థానీయ విశ్వానరవాయువే.

ధాతా - (౬)

ధాతా సర్వస్య విధాతా తస్యైషా భవతి-

"ధాతా దదాతు దాశుషే ప్రాచీం జీవాతు మక్షితామ్। వయం దేవస్య ధీమహి సుమతిం సత్యధర్మణః" (అథ. ౭-౧౭-౨)

ధాతా దదాతు దత్తవతే ప్రవృద్ధాం జీవికామనుపక్షీణాం వయమ్. దేవస్య ధీమహి సుమతిం కళ్యాణీమ్ మతిం సత్యధర్మణః.

ధాతా - సర్వస్య ప్రష్టాకర్తా। తస్యైషా - "ధాతా... సత్యధర్మణః" వాయుదేవస్యేయమార్షమ్. యః ధాతా దాశుషే - హవిర్దానశీలాయ ప్రాచీమ్ - ప్రవృద్ధామ్ అక్షితామ్ - అనుపక్షీణాం జీవాతుం - జీవికాం దదాతు - దదాతి వయం తస్య సత్యధర్మణః దేవస్య సుమతిమ్ - కళ్యాణకారిణీమ్ బుద్ధిమ్ ధీమహి - ధారయామః.

అర్థము :- ధాతా = ఉసరసవాయువు. ధాతా ఏల? సర్వ=సమస్త ఓషధుల, విధాతా = స్రష్టా = సృష్టించువాడు, ఏలయన నీవాయువునందు బలముండును. దానితో నీవాయువు సర్వౌషధులను, సరస = రసవంతములనుచేయును. అధాతను సంబంధించినమంత్రము.

మంత్రార్థము :- ధాతా = వాయువు, దాశుషే = దానముచేయువానికొఱకు, ప్రాచీమ్ = గొప్పదియు, అక్షితామ్ = ఎన్నడుక్షీణింపని, జీవాతుమ్ = జీవికను - జీవనసాధనములగు అన్నాదులను, దదాతు =

ఇచ్చును - ఇచ్చునుగాక! వయమ్ = మేము. సత్యధర్మాణః = సత్యమును ధారణచేయు. దేవస్య = వాయుదేవుని, సుమతిమ్ = కల్యాణకారిణియగు బుద్ధిని, ధీమహే = ధ్యానింతుము - ధారణచేయుదుము.

భాష్యార్థము :- దాశుషే - దత్తవతే = దానముచేయు, ప్రాచీమ్ ప్రవృద్ధామ్ = మిక్కిలిగొప్ప, జీవాతుమ్ - జీవికామ్ = జీవనసాధనములగు నన్నాదులను, అక్షితామ్ = ఎప్పుడుక్షీణింపని అనుపక్షీణామ్, సుమతిమ్ - కల్యాణీంమతిమ్ = కల్యాణకారిణియైనబుద్ధిని.

విధాతా - (౭)

> విధాతా ధాత్రా వ్యాఖ్యాతః. తస్యైష నిపాతో భవతి బహుదేవతాయామృచి-
>
> "సోమస్య రాజ్ఞో వరుణస్య ధర్మణి బృహస్పతేరనుమత్యా ఉ శర్మణి, తవాహమద్య మఘవన్నుపస్తుతౌ ధాతర్విధాతః కలశాఁ అభక్షయమ్" (ఋ. ౧౦-౧౬౭-౩)
>
> ఇత్యేతాభిర్దేవతాభిః అభిప్రసూతః సోమకలశానభక్షయమితి. కలశః కస్మాత్? కలా అస్మిఞ్ఛేరతే మాత్రాః. కలిశ్చ కలాశ్చ కిరతేర్వికీర్ణమాత్రాః.

విధాతాపదవ్యాఖ్య ధాతృపదవ్యాఖ్యననుసరించి తెలిసికొనవలయును.

ధాత్రా వ్యాఖ్యాతః. బహుదేవతాకాయామృచి తస్య విధాతుః ఏషః నిపాతః సాధారణీ స్తుతిః - "సోమస్య ... అభక్షయమ్" విశ్వామిత్రస్యార్షమ్. సోమస్య రాజ్ఞః ధర్మణి - కర్మణి వరుణస్య బృహస్పతేశ్చ అనుమత్యా శర్మణి - ఆశ్రయే వర్తమానః. తవ అహం హే ఇంద్ర! ధాతః విధాతః? ఉపస్తుతౌ సోమకలశాన్ అభక్షయమ్. కలశాః కస్మాత్? కలాః - సోమసముద్భవాః కేచిదవయవాః అస్మిన్ శేరతే ఇతి కలశః. కలిః కలాశ్చ కృ విక్షేపే ఇత్యస్మాద్ధాతోః సాధ్యౌ. కలౌ పణాంసి అన్యోన్యం విక్షిప్యన్తే కలా అపి రాశేః విక్షిప్తా భవన్తి.

అర్థము :- తస్య = ఆవిధాతాశబ్దముయొక్క, బహుదేవతాయా మృచి = బహుదేవతాక ఋక్కునందు, ప్రాధాన్యేన = ప్రధానముగ ప్రయోగములేదు. ఇతరదేవతలతోపాటు ప్రయోగింపబడియున్నది, ఏవః నిపాతః = నిపాతరూపమున ప్రయోగింపబడినది.

మంత్రార్థము :- సోమస్య వరుణస్య రాజ్ఞః=సోముడు, వరుణుడు అనురాజుయొక్క, ధర్మణి = యజ్ఞకర్మమునందు, బృహస్పతేః అనుమత్యా ఉ = బృహస్పతి, అనుమతియొక్క, శర్మణి=ఆశ్రయమునఉన్న, ధాతః విధాతః హే మఘవన్! ధాత! విధాత! మేఘ! అహం = నేను, అద్య - నేడు, తే = నీయొక్క, ఉపస్తుతౌ = స్తుతియందు ఉన్నవాడనై అనగా నీదేవతలచే ప్రేరితుడనై, సోమకలశాన్ అభక్షయమ్ = సోమ కలశములను ఐశ్వర్యకలశములను భక్షించితిని.

భాష్యార్థము :- ఇత్యేతాభిః దేవతాభిః అభిప్రసూతః = ఈ సమస్త దేవతలచే ప్రేరితుడనై సోమకలశములను, అభక్షయమ్ = భక్షించితిని, కలశః కస్మాత్? కలశనిర్వచనమెట్టిదన - అస్మిన్ = ఈకలశమున, కలాఃజలములకళలు, మాత్రాః = మాత్రలు, శేరతే = ఉన్నవి - ఇందు కళలున్నవి కావున కలశమనబడుచున్నది, కలాః = మాత్రలు - అవయవములు కలిః కలాశ్చ = ఎట్లన వికిరాణార్థక 'కౄ' ధాతువువలననేర్పడును. కలియందు శాస్త్రములన్నియు వికీర్ణమాత్రాః = వికీర్ణమర్యాదలుకలవియై - మర్యాదారహితములై యున్నవి.

ఇతి ప్రథమః పాదః

ప్రథమ పాదము సమాప్తము

(సర్వదేవతాక మంత్రముగా నిటవర్ణింపబడిన "సోమస్యరాజ్ఞః ... అభక్షయమ్" అనుమంత్రమునకు (ప్రా. చంద్రమణి విద్యాలంకార్ - పాళీరత్న వేదోపాధ్యాయ గురుకుల విశ్వవిద్యాలయ - కాంగడీ)

ఇట్లు వ్యాఖ్యవ్రాసియున్నారు.

మంత్రార్థము :- "రాజ్ఞః సోమస్య వరుణస్య ధర్మణి = నేను, ప్రకాశమానులగు, అన్ని చంద్రుడు మేఘము సనువాని ధర్మమునందు

ఉ, బృహస్పతేః అనుమత్యాః శర్మణి = సూర్యుడు చతుర్దశయుక్త పూర్ణిమ అనువానియొక్క ఆశ్రయమునందుండి మఘవన్!, ధాతః! విధాతః! ఓ విద్యుత్తా! ఓ వాయూ! ఓ మృత్యువా! అహమ్ అద్య తవ స్తుతౌ = నేను నీస్తుతియందున్నవాడనై, సోమకలశాన్ అభక్షయమ్ = ఐశ్వర్యకళలను భక్షించితిని. అనగా నీదేవతలచే ప్రేరితుడనై వారిగుణ ముల మాత్రలను - అంశములను ధారణచేసి రాజైశ్వర్యమును అనుభ వింతునుగాక!

ఈమంత్రమున రాజిట్లుచెప్పుచున్నాడు. నేను అగ్ని, చంద్రుడు మేఘము, విద్యుత్తుసూర్యుడు, పూర్ణిమ వాయువు, మృత్యువునను ని యీనిమిదిదేవతల ధర్మములననుసరించి నన్ను నేను రాజ్యప్రబంధము నకు యోగ్యునిగాచేసికొన్నాను. కావున నారాజ్యమునందు సమస్త-ఐశ్వర్య ములున్నవి.

అని యిట్లు వేదవిదుడైన - పం. చంద్రమణి యీమంత్రమును రాజపరముగా నన్వయించియున్నాడు.

మఱియు తన యీయర్థమును బలపఱచుటకు మనుస్మృతి నుదాహరించిరి.

> "అరాజకే హి లోకేఽస్మిన్ సర్వతో విద్రుతే భయాత్
> రక్షార్థమస్య సర్వస్య రాజానమసృజత్ ప్రభుః"
>
> "ఇంద్రానిలయమార్కాణామగ్నేశ్చ వరుణస్య చ, చంద్ర
> విత్తేశయోశ్చైవ మాత్రాః నిర్హృత్య శాశ్వతీః"
>
> "సోఽగ్నిర్భవతి వాయుశ్చ సోఽర్కః సోమః స ధర్మరాట్.
> స కుబేరః స వరుణః స మహేంద్రః ప్రభావతః"

(మను. ౭ అ. 3, ౪, ౭ శ్లోకములు) మంత్రదేవతలతో సామ్యము.

౧) సోమ = చంద్రుడు, ౨) రాజా=అగ్ని, 3) వరుణః=వరుణుడు, ౪) బృహస్పతి = సూర్యుడు - అర్కః, ౫) అమరుడు - విత్తేశుడు కుబే రుడు, ౬) మఘవా = ఇంద్రుడు, ౭) ధాతా = అనిలుడు - వాయువు -

౮) విధాతా = యముడు.

ఇట్లీ ఆర్యవిద్వాంసులు చంద్రమణి - రాజపరముగా మంత్రము నన్వయించియున్నారు

## ద్వితీయ పాదము

అథాతో మధ్యస్థానా దేవగణాః - తేషాం మరుతః ప్రథమాగామినో భవన్తి.

మరుతః - (౮)

మరుతో మితరావిణో వా, మితరోచినో వా మహద్ద్రవన్తీతి వా. తేషా మేషా భవతి-

"ఆ విద్యున్మద్భిర్మరుతః స్వర్కై రథేభిర్యాత ఋష్టిమద్భి రశ్వపర్ణైః. ఆ వర్షిష్ఠయా న ఇషా వయో న పప్తతా సుమాయాః" (ఋ. ౧-౮౮-౧)

విద్యున్మద్భిర్మరుతః, స్వర్కైః స్వంచనై రితి వా, స్వర్చనై రితి వా, స్వర్చిభిరితి వా. రథై రాయాత. ఋష్టిమద్భి రశ్వపర్ణై రశ్వపతనై ర్వర్షిష్ఠేన చ నోఽన్నేన వయ ఇవా పతత సుమాయాః కల్యాణకర్మాణో వా కల్యాణప్రజ్ఞా వా.

అథాతో మధ్యస్థానా దేవగణాః - దేవానాం గణాః. తేషాం ప్రథమా మరుతః. మరుతః కస్మాత్? మితరావిణో భవన్తి మితం - సుశ్లిష్టం రువన్తి-స్తనయన్తీతి తథోక్తాః. మితం రోచంతే ఇతి వా. మహద్ద్రవన్తి ఇతి వా. తేషామ్ ఏషా - "ఆ విద్యున్మద్భిః ... పప్తతా సుమాయాః" గౌతమస్యార్షమ్. హే మరుతః! యూయమ్. విద్యున్మద్భిః - విద్యోతనైః స్వర్కైః - స్వంచనైః - సుగమనైః అథవా - అనారతతదిత్సంపాతైః స్వర్చిభిః ఋష్టిమద్భిః - రేఖావద్భిః అశ్వపర్ణైః - అశ్వపతనైః రథైః-రంహణైః ఆయాత - ఆగచ్ఛత. కిం వయమ్ కేవలమాగమనమాత్రార్థినః? న ఇత్యుచ్యతే హే

సుమాయాః ! - వర్షిష్ఠయా - భూయస్యా ఇషా - అన్నేన సంయుక్తాః వయః న - పక్షిణ ఇవ. ఆపప్తత - ఆపతత. అతిశీఘ్రమాగచ్ఛతేత్యర్థః.

అర్థము :— అథ = దీనితరువాత - ఇప్పుడు, అతః = ఇటనుండి, మధ్యస్థానా దేవగణాః = మధ్యమస్థానీయ దేవతలవ్యాఖ్యానము చేయబడును. వానిలో ప్రథమమున మరుతః = మరుద్గణములు గ్రహింపబడుచున్నవి. మరుతః = ఊహాయుష్యలు, మితరావిణః = మితశబ్దము - కొంచెముశబ్దముచేయునవి, మితరోచినః = విద్యుద్రూపముకంటె తక్కువ ప్రకాశముకలవి, మహద్ద్రవన్తి = వేగముగా, ద్రమన్తి = గమించునవి- లేక గొప్పదియగు సంతరిక్షమున, ద్రమన్తి=గమనముచేయునవి, సుదప్త ములు స్తుతియుక్తములు. ఇంతకుపూర్వము దేవతలు ఏకవచనమున వర్ణింపబడినవి. ఇప్పుడు బహువచనముతో వర్ణింపబడుచున్నవి. ఇంతకు పూర్వము ఏకవచనముచే చెప్పబడినవాయువిప్పుడు బహువచనముతో మరుతః అనిచెప్పబడుచున్నది - వానికి చెందినయుక్కు.

మంత్రార్థము :— హే మరుతః=ఓ మరుత్తులార !, విద్యున్మద్భిః= విశిష్టదీప్తితోకూడిన, స్వర్కైః = మంచిగతికలిగిన, సుదీప్తములు, స్తుతి యుక్తములు. అశ్వపర్ణైః = అశ్వయుక్తములు, ఋష్టిమద్భిః = దుర్భిక నాశకములు, అశ్వపర్ణైః = ఆకాశమునాచ్ఛాదించునవి, రథేభిః = రథైః = మేఘములతోకూడినవియై, ఆయాత = రండు - వచ్చునుగాక ! వర్షిష్ఠయా ఇషా = వృద్ధిచెందిన అన్నముతోకూడి, వయః న = పక్షులవలెవేగగమన ముతో, సుమాయాః=ఉత్తమకర్మలనొనర్చువారలారా ! ఆపప్తత = రండు.

భాష్యార్థము :— స్వర్కైః = మంచిగతికలవి స్వర్చనైః = ఉత్తమ అర్చనగలవారు, స్వర్చిభిః=విద్యుత్సంపాతయుక్తములు, స్వంచనైః=మంచి గతికలవియగు, రథైః = రథములతో మేఘములతో, ఆయాత=రండు, ఋష్టిమద్భిః=మంచి ఆయుధములుగలవి, అకాలము=కఅఫ్నాశకములు. వర్షిష్ఠయా = ప్రవృద్ధము నః = మాకొఱకు, అన్నేన =(ఇషా) మాకు అన్నమునొసంగుటకు, వయః న - ఇవ = పక్షులవలె, ఆపప్తత=ఆపతత = వత్తురుగాక !, కల్యాణకర్మాణః. శుభకర్మలనొనర్చు - సుమాయాః=ఉత్తమ కర్మలు, ప్రజ్ఞలుకలవారు.

రుద్రాః - (౯)

రుద్రా వ్యాఖ్యాతాః. తేషామేషా భవతి-

"ఆ రుద్రాస ఇంద్రవన్తః సజోషసో హిరణ్యరథాః సువితాయగన్తన. ఇయం వో అస్మత్ ప్రతిహర్యతే మతి స్తృష్ణజే న దివ ఉత్సా ఉదన్యవే" (ఋ. ౫-౫౭-౧)

ఆగచ్ఛత రుద్రా ఇంద్రేణ సహజోషణాః సువితాయ కర్మణ ఇయం వో అస్మదపి ప్రతికామయతే మతి స్తృష్ణజ ఇవ దివ ఉత్సా ఉదన్యవే ఇతి తృష్ణక్ తృష్యతే రుదన్యు రుదన్యతేః.

వ్యాఖ్యాతాః. తేషామేషా - "ఆరుద్రాస ... ఉదన్యవే" శ్యావాశ్వస్యార్షమ్. హే రుద్రాసః! రుద్రాః ఇంద్రవన్తః - పరమైశ్వర్యయుక్తాః సజోషసః - నిత్యమ్ ఆసేవితాః హిరణ్యరథాః - ఉదకహరణార్థరంహణాః సువితాయ - సుగుణాయ తస్మై కర్మణే ఆగంతన - ఆగచ్ఛత కిమర్థ మిత్యుచ్యతే వః యుష్మాన్ ఇయమ్ అస్మత్ మతిః ప్రతిహర్యతి - ప్రతి కామయతే. కథమ్? తృష్ణజే - గ్రీష్మే ఉదన్యవే-ఉదకమిచ్ఛతే లోకాయ దివ ఉత్సాః స్వర్లోకాత్ ఉత్సప్రభవాః మేఘా అప ఇవ. ఉదన్యుః = చాతకః ఇతి కేచిత్. తృష్ణక్ కస్మాత్? తృష్యతేరితి సతః. ఉదన్యుః ఉదన్యతేః సాధ్యః.

అర్థము :- రుద్రపదవ్యాఖ్య పూర్వమే చేయబడినది. రుద్ర విషయకమంత్రము.

మంత్రార్థము :- రుద్రాసః=రుద్రాః!=ఓ రుద్రులార! మీరందఱు, ఇంద్రవన్తః = ఐశ్వర్యయుక్తులు లేక ఇంద్రునితో, సజోషసః - ప్రీయమాణాః ప్రసన్నులగుచు, హిరణ్యరథాః = సువర్ణమయ - ఉత్తమరథములపై ఆరూఢులై, సువితాయ = బాగుగ, యజ్ఞసమాప్త్యర్థము, ఆగన్తన= ఆగచ్ఛత = వత్తురుగాక! అస్మత్ = మాయొక్క, ఇయం మతిః = ఈ బుద్ధి, ప్రతిహర్యతే = మిమ్ము కోరుచున్నది మా ఈ యజ్ఞము శాస్త్రవిధి

ననుసరించి చేయబడినను విగుణముకాకుండుటకు మాబుద్ధి యజ్ఞకర్మ నుపాసించుటకు మిమ్ము కోరుచున్న, తృష్ణజే = గ్రీష్మాన్తమున దివః = ద్యులోకమునుండి, ఉత్సాః = మేఘసంబంధి - జలములు, ఉదన్యవే = జలమునుగోరుజనులకొఱకు నెట్లు వచ్చునో అట్లే మామతిమిమ్ము గోరుచున్నది.

భాష్యార్థము :- ఆగన్తన = ఆగచ్ఛత = వత్తురుగాక!, రుద్రాసః = హే రుద్రాః! = ఇంద్రవన్తః = ఇంద్రేణ సహ సజోషసః - సహజోషణాః - ప్రీతియుక్తాః=ప్రసన్నులై, సువితాయ - కర్మణే - సువిగమనాయకర్మణే= యజ్ఞముబాగుగసమాప్తియగుటకు, ఇయంమతిః=ఈమతి, మీకు, అస్మత్ = మాయొక్క (షష్ఠ్యర్థమునపంచమీ) ప్రతిహర్యతే = ప్రతికామయతే = కోరుచున్నది, తృష్ణజేసతృష్ణాయజాన = గ్రీష్మాంతమువలె, ఉత్సాః = మేఘ జలము, ఉదన్యవే = చాతకమునకు, ఉదన్యుః = ఎట్లన, ఉదన్యతేః = ఉదకమిచ్ఛతి = ఉదన్యమునకు ఉప్రత్యయము.

ఋభవః - (౧౦)

ఋభవ ఉరు భాన్తీతి వా. ఋతేన భాన్తీతి వా. ఋతేన భవన్తీతి వా.

తేషామేషా భవతి-

"విష్ట్వీ శమీ తరణిత్వేన వాఘతో మర్తాసః సన్తో అమృతత్వమానశుః. సౌధన్వనా ఋభవః సూరచక్షసః సంవత్సరే సమపృచ్యన్త ధీతిభిః" (ఋ. ౧-౧౧౦-౪)

కృత్వా కర్మాణి క్షిప్రత్వేన వోఢారో మేధావినో వా మర్తాసః సన్తో అమృతత్వమానశిరే సౌధన్వనా ఋభవః సూరఖ్యానా వా సూరప్రజ్ఞా వా సంవత్సరే సమపృచ్యన్త ధీతిభిః కర్మభిః.

ఋభుర్విభ్వా వాజ ఇతి సుధన్వన ఆంగిరసస్య త్రయః పుత్రా బభూవుః తేషాం ప్రథమోత్తమాభ్యాం బహువన్నిగమా భవన్తి న మధ్యమేన.

ఆదిత్యస్య రశ్మయోఽపి ఋభవః ఉచ్యన్తే. అగోహ్యస్య యదసస్తనా గృహే తదద్యేదమృభవో నానుగచ్ఛథ." (ఋ. ౧-౧౬౧-౧౧)

అగోహ్య ఆదిత్యో అగూహనీయస్తస్య యదస్వపథ గృహే యావత్తత్ర భవథ న తావదిహ భవథేతి.

ఉరు భాన్తి ఉప్యన్తే ఇతి ఋభవః అథవా ఋతేన భాన్తి, ఋతేన భవన్తీతి వా. తేషామేషా - "విష్ట్వీ శమీ ... ధీతిభిః" ఇత్యస్యామృచ్యర్థమ్. 'విష్ట్వీ' - శమీ ఇతి ద్వే పదే కర్మణో నామనీ. వాఘతా మా భూవిత్యత ఆచార్యః ప్రాప్యమ్ విహాయ కృత్వా కర్మాణి తరణిత్వేన - అతిక్షిప్రమ్ వాఘతః మేధావినః, మర్తాసః - మనుష్యాః సన్తః అమృతత్వమ్ = దేవత్వమ్ ఆనశుః - ఆనశిరే ప్రాప్తవన్త ఇత్యర్థః. కే పునస్తే? సౌధన్వనాః - సుధన్వనః పుత్రాః సూరచక్షసః - సూర్యసమానదర్శనాః ఋభవః సంవత్సరే - సంవత్సరాదికాలే ధీతిభిః కర్మభిః సమపృచ్యన్త - సమయుజ్యన్త. అత ఏవ దేవా అభవన్.

ఋభుః, విభ్వా వాజశ్చేతి ఆంగిరసస్య సుధన్వనః త్రయః పుత్రా ఆసన్ తేషాం ప్రథమోత్తమాభ్యామ్ బహువన్నిగమాః న మధ్యమేన. తదేతత్ ఋభోర్బహువచనేన-చమసస్య సంస్తవేన చ బహూని దశతయీషు సూక్తాని

ఆదిత్యస్య సూర్యస్య రశ్మయోఽపి ఋభవః కథ్యన్తే. తథాహి - "అగోహ్యస్య ... నానుగచ్ఛథ" దీర్ఘతమస ఆర్షమ్. జగతీ. అగోహ్యస్య - కేనాపి గూహయితుమయోగ్యస్య యస్య గృహే - మండలే యత్ యావత్ కాలం ఆసస్తనా - సుప్తా ఇవ నిగూఢా భవథ. హే ఋభవః! - రశ్మయః! తదా - తావత్ - ఇహ న అనుగచ్ఛథ - న భవథేత్యర్థః.

యుష్మృతే వినా నిరాలోకో ఽయం లోకః సంజాయతే. అహమేతద్వైశ్వర్యం వః కీర్తయామి.

అర్థము :- ఋభవః ఎట్టిన? ఉరు = ఎక్కువ, భాన్తి = ప్రకాశించును. ఇట ఉరు పూర్వపదము - భాన్త్యుత్తరపదము వా లేక ఋతేన భాన్తి = యజ్ఞముతో దీప్తములగును, వా = లేక ఋతేన = యజ్ఞముతో, భవన్తి = యుక్తములగును, వానికి సంబంధించినఋభుక్.

మంత్రార్థము :- శమీ = కర్మములను, విష్ట్వీ = చేసి (ఇట - వ్యాప్త్యర్థక 'విష్'ధాతువునకు 'క్త్వా'ప్రత్యయరూపము విష్ట్వీ 'స్నాత్వ్యాదయశ్చ' సూత్రమువలన ఈకారము, తరణిత్వేన = మిక్కిలిశీఘ్రముముగా, వాఘతః = యజ్ఞానుష్ఠాతలు, మర్తాసః సంతః=మర్త్యులయ్యు, అమృతత్వం = దేవత్వమును, ఆనశుః - పొందిరి, సౌధన్వనాః = సుధన్వనః పుత్రాః = సుధన్వునిపుత్రులు, సూరచక్షసః = సూర్యసమానతేజస్సుగలవారు, ఋభవః = ఋభుప్రభృతులు, సంవత్సరే = సంవత్సరములోపలనే, లేక వర్షావయవమగు వసంతమున, ధీతిభిః = కర్మలతో, సమపృచ్యన్త = సంయుక్తులైరి.

భాష్యార్థము :- విష్ట్వీ = చేసి, శమీ = కర్మాణి = కర్మములను, తరణిత్వేన = క్షిప్రత్వేన = త్వరగా, వాఘతః - మేధావః = యజ్ఞానుష్ఠాతారః = యజ్ఞముచేయువారు, మేధావులు - ప్రజ్ఞావంతులు, మర్తాసః సన్తః = మనుష్యులగుచున్నను, ఆనశుః = ఆనశిరే = పొందిరి - (ప్రాప్తవంతః) - సౌధన్వనా ఋభవః = సుధన్వునిపుత్రులు ఋభువు మున్నగువారు, సూరచక్షసః = సూరఖ్యానాః = సూర్యునివలెఖ్యాతికలవారు లేక సూర్యతేజస్సులు, సూరప్రజ్ఞాః = సూర్యునివలె ప్రజ్ఞకలవారు, ధీతిభిః = కర్మలతో, యజ్ఞాదులతో, లేక, సౌధన్వనాః - ధన్వ = అంతరిక్షము, శోభనమ్ ధన్వ = సుధన్వ తస్మిన్ భవాః ఋభవః = అంతరిక్షమున నుత్పన్నములగు విద్యుత్తునకు సంబంధించిన జ్యోతివిశేషములు - ఈ జ్యోతివిశేషములే, సూరచక్షసః = సూర్యునితో సమానమైన తేజస్సుగల వస్తువులు, ధీతిభిః = ఉదకవర్షణకర్మలతో, సంవత్సరే = సంవత్సరము

నందు, మరల, సమపృచ్యన్త = సంయుక్తములయ్యెను = మరలవర్షింప సాగెను.

ఋభు, విభ్వా, వాజ, ఈముగ్గురు, సుధన్వా=అంగిరసుని పుత్రులు వారిలో ప్రథమ, ఉత్తమ - ఋభు, వాజ అనువీరియిరువురితో బహువచనము వచ్చును. వేదములందు ఋభు, వాజపదములు బహువచనాంతములు ప్రయోగింపబడును, విభ్వన్ = ఇది ఏకవచనాంతముగానే ప్రయోగింప బడును.

తత్ = అందువలన, ఏతత్ = ఇది ఋభోః చ = ఋభువు యొక్కయు, చమసస్య చ = చమసయొక్క అన్నముతో వర్ణనము ఋగ్వేదమునేకసూక్తములలో కనబడును.

ఆదిత్యరశ్మయః అపి = సూర్యకిరణములుకూడ, ఋభవః = ఋభువులు అనబడును. ఈమంత్రముననున్నట్లు.

మంత్రార్థము :- హే ఋభవః !=ఓ సూర్యకిరణములార! యత్ = ఎంతవఱకు, మీరు, అగోహ్యస్య=ఎన్నడు దాగని సూర్యునియొక్క, గృహే= మండలమున, అసస్తన = ఉందురో, తత్ = అంతవఱకు, అద్య =ప్రతి దినము, రాత్రియందు ఇదమ్ = ఈభూమిమీద, న అనుగచ్ఛథ = రారు.

భాష్యార్థము :- అగోహ్యస్య - అగోహ్యః = ఆదిత్యుడు, ఆదిత్యుని అగోహ్యుడందురు. ఏలయన నతడు, అగూహనీయః = ఎన్నడు దాగడు - అసంవరణీయుడు, తస్య గృహే=సూర్యమండలమున, యత్ - యావత్ = ఎంతవఱకు, అసస్తన = అస్వపథ = శయనించునో, భవథ = అక్కడ నుందురో, తావత్ = అంతవఱకు, ఇదమ్ = ఈభూభాగముపైన, న అను గచ్ఛథ - న భవథ = ఉండరు, కిరణములుండవని భావము.

అంగిరసః - (౧౧)

అంగిరసో వ్యాఖ్యాతాః తేషామేషా భవతి-

"విరూపాస ఇదృషయస్త ఇద్గంభీరవేపసః. తే అంగిరసః సూనవస్తే అగ్నేః పరిజజ్ఞిరే" (ఋ. ౧౦-౬౨-౫)

బహురూపా ఋషయస్తే గంభీరకర్మాణో వా గంభీరప్రజ్ఞా
వా తే అంగిరసః పుత్రాః తే అగ్నేరధిజజ్ఞిర ఇత్యగ్నిజన్మ.

పూర్వం వ్యాఖ్యాతాః. తేషామేషా - "విరూపాస ... పరిజజ్ఞిరే", నాభానేదిష్ఠస్యార్షమ్. అనుష్టుప్, విరూపాసః - విరూపాః - నానారూపా ఇత్యర్థః. గంభీరవేపసః - గంభీరకర్మాణః గంభీరబుద్ధయో వా ఋషయః సత్యస్య బ్రహ్మణో ద్రష్టారః. అంగిరసః సూనవః అగ్నేః - అగ్నేః అధి - సకాశాత్ పరిజజ్ఞిరే - జాతాః అగ్నిత్వమాపన్నస్య అంగిరసః సకాశాత్. ఏకపదమున అంగిరస్ పదవ్యాఖ్య. (3-17-7) చేయబడినది. తత్ సంబంధ ఋక్కు.

మంత్రార్థము :– విరూపాస ఋషయః = ఋషిః=మంత్రద్రష్టా = మంత్రదర్శి, మంత్రద్రష్టలైన ఋషులు, విరూపాః=బహువిధరూపములు గలవారు, తే = వారు, గంభీరవేపసః = గంభీరకర్మాణః = గంభీరకర్మల నొనర్చువారు, లేక గంభీరప్రజ్ఞావంతులు, గంభీరం = దురవగాహంవేపః కర్మ యేషాం తే - గంభీరవేపసః = దురవగాహమైనకర్మ లేక ప్రజ్ఞ కలవారు ఋషులని యర్థము. కావున వారు గంభీరవేపసులనబడుదురు. తే కే? వారెవరు? అన - వారు అంగిరసః సూనవః = అంగిరానామక ఋషికిపుత్రులు. వారెవరు అగ్నేః=అగ్నినుండి, పరిజజ్ఞిరే = పుట్టినవారు, అగ్నిత్వమాపన్నః అంగిరాః = అగ్నేః సకాశాత్ అంగిరాః = అగ్నిత్వమును బొందిన అంగిరసునివలన బుట్టినవారు. అగ్నిజన్ములనబడుచున్నారు.

పితరః - (12)

పితరో వ్యాఖ్యాతాః. తేషామేషా భవతి.

"ఉదీరతామవర ఉత్పరాస ఉన్మధ్యమాః పితరః సోమ్యాసః,
అసుం య ఈయురవృకా ఋతజ్ఞాస్తే నో అవన్తు పితరో
హవేషు" (ఋ. 10-15-1)

ఉదీరతామ్ అవర ఉదీరతాం పర ఉదీరతాం మధ్యమాః పితరః సోమ్యాః సోమసంపాదినస్తేఽసుం యే ప్రాణమన్వీయురవృకా అనమిత్రాః సత్యజ్ఞా వా, యజ్ఞజ్ఞావా, తే న ఆగచ్ఛన్తు పితరో హ్వానేషు.

మాధ్యమికో యమ ఇత్యాహుః. తస్మాన్మాధ్యమికాన్ పితౄన్ మన్యన్తే. అంగిరసో వ్యాఖ్యాతాః. పితరో వ్యాఖ్యాతాః. పూర్వం వ్యాఖ్యాతాః. తేషామేషా - "ఉదీరతామవర ... పితరో హవేషు" శంఖస్యార్షమ్. అవరే - భూలోకస్థాః, పరాసా - పరే ద్యులోకస్థాః ఇత్యర్థః, ఉత మధ్యమాః-మధ్యస్థానస్థాః, సోమ్యాసః - సోమసంపాదినః పితరః ఉదీరతామ్ - ఊర్ధ్వం గచ్ఛన్తు. యే పితరః అసుమ్ ఈయుః-ప్రాణమాత్రమూర్తయః, అవృకాః-అనమిత్రాః - పరం సామ్యముపయాతాః ఋతజ్ఞాః - సత్యస్య వేత్తారః సన్తి తే నః - అస్మాకం హవేషు - ఆహ్వానేషు అవన్తు - ఆగచ్ఛన్తు.

పూర్వమే పితృశబ్దము వ్యాఖ్యానింపబడినది - దానికి సంబంధించిన ౪-౨౧-౧ లో ఋక్కు.

మంత్రార్థము:- అవరేపితరః=భూమియందున్న పితరులు, తే ఉదీరతామ్ = వారు పైకిపోవుదురుగాక ! ఉత్తమలోకమును పొందుదురుగాక !, పరాసః = పైనద్యులోకమునన్నవారు, ఉదీరతామ్ = వారును పైన ఉందురుగాక !, సోమ్యాసః = సోమసంపాదకులైన, మధ్యమాః = మధ్యస్థానీయులు, ఉదీరతామ్=ఊర్ధ్వం-గచ్ఛన్తు=పైకిపోవుదురుగాక!, యే పితరః అసుం ఈయుః = ఎవరు ప్రాణమాత్రమూర్తులో, అవృకాః=అనమిత్రాః = శత్రురహితులో, సమం సామ్యముపాయాతాః = పరమసామ్యమునందిన వారును, ఋతజ్ఞాః = సత్యవేత్తలును, సన్తి = ఉన్నారో వారు, నః = అస్మాకం = మా, హవేషు = ఆహ్వానములందు, అవన్తు - ఆగచ్ఛన్తు = వత్తురుగాక !.

భాష్యార్థము :- ఉత్ ఈరతాం = భూమిపైన నున్నవారు పైకి పోవుదురుగాక ! అట్లే పరమున నున్నవారును, మధ్యమాః = మధ్యమ స్థానముననున్నవారు - పైకిపోవుదురుగాక, సోమ్యాసః = సోమసంపాదకులు, అవృకాః = అనమిత్రులు, అసుం అన్వీయుః = ప్రాణమాత్రమూర్తులు - సూక్ష్మశరీరధారులు - ఋతజ్ఞులు - సత్యవేత్తలునగు పితరులు మేధావులు, నః హవేషు = మన ఆహ్వానములందుకొని, ఆగచ్ఛన్తు=వత్తురు

గాక, యముడు మాధ్యమికుడుగా నంగీకరింపబడినవాడు. అతః = అందు వలన, పితరః = పితరులుకూడ మధ్యమస్థానీయులే.

అథర్వాణః - (౧౩) - భృగవః - (౧౪)

భృగవో వ్యాఖ్యాతాః. అథర్వాణః అథనవంతః. థర్వతి శ్చరతి కర్మా తత్ప్రతిషేధః. తేషామేషా సాధారణా భవతి- "అంగిరసో నః పితరో నవగ్వా అథర్వాణో భృగవః సోమ్యాసః. తేషాం వయం సుమతౌ యజ్ఞియానామపి భద్రే సౌమనసే స్యామ" (యజుః. ౧౯-౫౦)

అంగిరసో నః పితరో నవగతయో నవనీతగతయో వాథ ర్వాణో భృగవః సోమ్యాః సోమసంపాదినస్తేషాం వయం సుమతౌ కల్యాణ్యాం మతౌ యజ్ఞియానామపి చైషాం భద్రే భందనీయే భాజనవతి వా కల్యాణే మనసి స్యామేతి.

మాధ్యమికో దేవగణ ఇతి నైరుక్తాః. పితర ఇత్యాఖ్యానమ్. అథాపి ఋషయః స్తూయన్తే - "సూర్యస్యేవ వక్షథో జ్యోతిరేషాం సముద్రస్యేవ మహిమా గభీరః. వాతస్యేవ ప్రజవో నాన్యేన స్తోమో వసిష్ఠా అన్వేతవే వః (ఋ. ౭-౩౩-౮) ఇతి యథా.

పితౄణాం రాజా యమః స చ మాధ్యమికః తస్మాత్ పితరో మధ్యమాః ఇత్యేవం నైరుక్తా మన్యన్తే.

భృగవో వ్యాఖ్యాతాః. అథర్వాణః - అథనవన్తః కిమిదమథనమ్? ఉచ్యతే గత్యర్థాత్ థర్వతేః అథనమ్ - గమనమ్ తద్వన్తః, తే న భవన్తి ఇతి అథర్వాణః - స్థిరప్రకృతయః ఇత్యర్థః. తేషాం సాధారణా ఏషా - "అంగిరసో నః...సౌమనసే స్యామ" యమస్యార్షమ్. త్రిష్టుప్. అంగిరసః నః - అస్మాకం పితరః నవగ్వాః నవగతయః నవనీతగతయో వా అథ

ర్వాణః - స్థిరప్రకృతయః, భృగవః, సోమ్యాసః - సోమసంపాదినః యే సన్తి యజ్ఞియానాం యజ్ఞసంపాదినాం తేషాం సుమతౌ - కల్యాణ్యాం మతౌ వయం స్యామ అపి చ తేషాం భద్రే - భందనీయే - స్తుత్యే సౌమనసే - కల్యాణే మనసి భాజనవతి వా వయం స్యామ.

నైరుక్తాః పునః ఋభూన్, అంగిరసః, భృగూన్ అథర్వాణశ్చేతి మాధ్యమికాన్ ఏవ దేవగణాన్ మన్యన్తే. ఆఖ్యానవిదశ్చ పితౄన్. అథాపి ఋషయః స్తూయన్తే - తేషామేషా - సూర్యస్యేవ ఇంద్రస్యార్థమ్. సూర్యస్య జ్యోతిః యథార్థానవభాసికా తథా ఏషాం వసిష్ఠానామ్ వక్షథః. వచనస్య దీప్తిః వాచ్యేఽర్థే నిఃసందేహ ఇత్యర్థః. అపిచైషామర్థానాం మహిమా సముద్రవత్ గంభీరః - అర్థాత్ వసిష్ఠానాం వచాంసి మహార్థవన్తి దురవగాహాని చ. ఏషాం ప్రజవః - ప్రకృష్టోజవః - అప్రతిపత్తిః వాతస్య ఇవ. హే వసిష్ఠాః, వః - యుష్మాకం స్తోమః - స్తుతిః న అన్యేన అన్యేతవే నాన్యేనానుగంతుం శక్యః. ఏవం స్తుతసంజాతపరితోషః ఇంద్రః వసిష్ఠాన్ స్తౌతి. అనయర్చా ఏతదేవ సిద్ధం భవతి యత్ ఋషయోఽపి మంత్రేషు స్తూయంతే.

అంగిరస, పితృ, భృగుఅనునీపదముల వ్యాఖ్య చేయబడినది. క్రమశః (౩-౧౪-౧, ౪-౫౧-౧) వారికందఱికి సంబంధించిన సమానఋక్కు.

మంత్రార్థము :- నవగ్వాః = ప్రతిమానము పితృయజ్ఞమునందు వచ్చుచుండుటచే నవీనగతికలిగినవారు లేక నవనీతమును గోరువారు అట్టివారు, అంగిరసః = అంగిరసనామముగల, నః పితరః = మాపితరులు, మఱియు సోమ్యాసః - సోమమును సంపాదించువారు, అథర్వులు భృగువులునుగలరో వారికి, వయమ్ తేషామ్ = మేము వారియొక్క, సుమతౌ = కల్యాణకారిమతియందు, స్యామ = ఉందుముగాక ! అపి చ = మఱియు, యజ్ఞియానాం = యజ్ఞసంపాదకులగు పితరులయొక్క, సౌమనసే భద్రే = స్తుత్యర్హ సౌమనస - కల్యాణకారి మనస్సునందు, స్యామ = మేముందుముగాక !.

భాష్యార్థము :- నవగ్వా - నవగతయః = ప్రతిమానము క్రొత్తగతి కలవారు. పితృయజ్ఞమునందు ప్రతిమానమువచ్చుటచే నవీనగతికలవారు

లగుచున్నారు. వా = లేక సవనీతగతయః ఋనవనీతమునందు మనస్సు గలిగిన, అథర్వాణః = అథర్వులు మఱియు భృగువులు, సోమ్యాసః = సోమసంపాదకులునగు, తేషాం = వారి, సుమతౌ = కల్యాణకారి, మతౌ = మనస్సునందు, వయమ్ = మేము, స్యామ = ఉందుముగాక !

భృగువులు, అంగిరసులు, ఋభువులు, అథర్వాణులు అనుపేరు అందఱు దేవగణము - దేవసమూహమనబడును. ఈగణము మాధ్యమికః = మధ్యస్థానీయదేవగణము అని నైరుక్తాః = నిరుక్తకారులంగీకరింతురు, ఏమ = వీరు, పితరః = పితరులనబడుదురని, ఆఖ్యానవిదులంగీకరించు చున్నారు. కించ = మఱియు, ఋషులస్తుతియుచేయుబడును.

ఋభువులు, అంగిరసులు మున్నగువారు దేవతలని మధ్యలో దేవపదముపఠింపబడుటచే వీరిని ప్రత్యేకదేవగణముని నిరుక్తకారులంగీకరించుచున్నారు. పౌరాణికులు వీరిని పితరులందురు. కాని ఋగ్వేదపు (8-3-38) సూక్తమున పితరశబ్దము పఠింపబడినది. అయినను (8-33-8) మంత్రమున వసిష్ఠనామముతో ఋషులస్తుతి చేయుబడినది. కావున వీరిని దేవగణమనుటయే యుచితము. అని తాత్పర్యము. ఇందులకు మంత్ర ప్రమాణము.

మంత్రార్థము :— ఏషామ్=ఈవసిష్ఠుడు మున్నగుఋషులయొక్క, వక్షః = వచనముయొక్క, జ్యోతిః - సూర్యస్య ఇవ=సూర్యునిప్రకాశము వలె నున్నది. సూర్యుడు పదార్థములను ప్రకాశింపచేయునట్లు వసిష్ఠాదుల వచనములుకూడ సర్వపదార్థద్యోతకములు మహత్త్వముకలిగియున్నవి. వాయువువలె మిక్కిలిబలముకలిగియున్నవి. అనగా శ్రోతలకు వీరివచనముల అర్థప్రతీతి వెంటనేకలుగునని భావము. వసిష్ఠాః = ఓ వసిష్ఠులార ! వః = మీయొక్క, స్తోమః = ఈస్తుతి, అన్యేన మనుష్యేణ=మఱియొక మనుజునిచే, అనుగంతుం న శక్యో న అన్యేతచే - నానుగంతుం శక్యః = అనుగతముచేసికొనబడజాలదు.

ఆప్త్యాః - (౧౫)

అప్త్యా ఆప్నోతేః. తేషామేష నిపాతో భవతీ వంద్ర్యామృచి—
“స్తుషేయ్యం పురువర్పసమృభ్వమినతమ మాప్త్యమాప్త్యా

నామ్. ఆదర్షతే శవసా సప్తదానూన్ ప్రసాక్షతే ప్రతిమానాని భూరి. (ఋ. ౧౦-౧౨౦-౬)

స్తోతవ్యం బహురూపమురుభూత మీశ్వరతమమాప్తవ్య మాప్తవ్యానామ్ ఆదృణాతి యః శవసా బలేన సప్త దాతౄనితి వా సప్తదానవాన్ ఇతి వా ప్రసాక్షతే ప్రతిమానాని బహూని. సాక్షతిరాప్నోతికర్మా.

యస్మాత్ తే స్తుతిభిః స్తుత్యాన్ ఆప్నువన్తి, తస్మాదాప్త్యాః ఇంద్రసహచారిణః ఋషయః. తేషామింద్రదేవతాకాయామృచి ఏషః వక్ష్యమాణో నిపాతః - "స్తుషేయ్యమ్ ... ప్రతిమానాని భూరి" బృహద్దివస్యార్షమ్. స్తుషేయ్యమ్ - స్తోతవ్యమ్, పురువర్పసమ్ - బహురూపమ్, ఋభ్వమ్ - ఉరుభూతమ్, ఇనతమమ్ - ఈశ్వరతమమ్, ఆప్త్యమ్ - ఆప్త్యానామృషీణామ్ స్తోమైరాప్తుం యోగ్యమ్ తమ్ ఇంద్రమ్ అహమ్ స్తౌమి యః శవసా - బలేన సప్తదానూన్ - సప్తదాతౄన్ - మేఘాన్ నముచిప్రభృతీన్ దానవాన్ వా ఆదర్షతే - ఆదృణాతి. యశ్చ భూరి - బహూని ప్రతిమానాని ప్రసాక్షతే - ప్రాప్నోతి.

ఆప్త్యాః - ఆప్త్య = ఇంద్రుని సహచారులు మధ్యమస్థానీయ దేవగణము, ఆప్త్యః - 'ఆప్లృవ్యాప్తౌ' ధాతువువలన సిద్ధమగును. వారివర్ణన మీ ఇంద్రదేవతాకమంత్రమున నిపాతరూపమునమున్నది.

మంత్రార్థము :— నేను, స్తుషేయ్యమ్ = స్తుతియోగ్యుడు, పురువర్పసమ్ = అనేకరూపుడు, ఋభ్వమ్ = గొప్పవాడు, ఇనతమమ్ = ఈశ్వరులకు నీశ్వరుడు - పరమేశ్వరుడు, ఆప్త్యానామ్ ఆప్త్యమ్ = ప్రాప్తింపదగు ఋషులస్తుతులతో పొందదగిన ఇంద్రుని స్తుతియింతును. ఆయింద్రుడు శవసా = బలముతో, సప్తదానూన్ = జలప్రదానముచేయు సప్తమేఘములను, లేక నముచిప్రభృతి సప్తదానవులను, ఆవర్షతే = విదారణముచేయును, భూరిప్రతిమానాని = బహూపమానములను, ప్రసాక్షతే = పొందును, లేక పరాభవించును.

ఇతి ద్వితీయః పాదః

రెండవ పాదము సమాప్తము

## తృతీయ పాదము

అథాతో మధ్యస్థానాః స్త్రియః.

[ఇకముందు మధ్యస్థానీయ స్త్రీలు]

అదితిః .(౧౬)

తాసామదితిః ప్రథమాగామినీ భవతి. అదితిర్వ్యాఖ్యాతా, తస్యా ఏషా భవతి.

"దక్షస్య వాదితే జన్మని వ్రతే రాజానా మిత్రా వరుణా వివాససి - అతూర్తపంథాః పురురథో అర్యమా సప్త హోతా విషురూపేషు జన్మసు" (ఋ ౧౦-౬౪-౫)

దక్షస్య వాదితేర్జన్మని వ్రతే కర్మణి రాజానౌ మిత్రావరుణౌ పరిచరసి. వివాసతిః పరిచర్యాయామ్. "హవిష్మా ఆ వివా సతి" ఇత్యాశాస్తేర్వా అతూర్తపంథాః - అత్వరమాణపంథా బహురథో అర్యమాదిత్యోఽరీన్నియచ్ఛతి, సప్తహోతా సప్తాస్మై రశ్మయో రసానభిసన్నామయన్తి. సప్తైన మృషయః స్తువన్తీతివా విషయరూపేషు జన్మసు కర్మ సూదయేషు. ఆదిత్యోదక్ష ఇత్యాహురాదిత్యమధ్యే చ స్తుతః. అదితిర్దాక్షాయణీ. అదితేర్దక్షో అజాయత దక్షా ద్వాదితిః పరి. ఇతి చ. తత్కథముపపద్యేత సమాన జన్మానౌ స్యాతామితి. అపి వా దేవధర్మేణేతరేతరజన్మానౌ స్యాతామ్ ఇతరేతరప్రకృతీ.

అగ్నిరప్యదితిరుచ్యతే. తస్యైషా భవతి-

"యస్మై త్వం సుద్రవిణో దదాశోఽనాగాస్త్వమదితే సర్వ తాతా. యం భద్రేణ శవసా చోదయాసి ప్రజావతా రాధసా తే స్యామ" (ఋ. ౧-౯౪-౧౫)

యస్మై త్వం సుద్రవిణో దదాస్యనాగాస్త్వమనపరాధత్వ మదితే. సర్వాసు కర్మతతిషు అగ అజ్ పూర్వాద్ గమేః. ఏన ఏతేః కిల్బిషం కిలభిదం సుకృతకర్మణో భయం కీర్తిమస్య భినత్తీతి వా. యం భద్రేణ శవసా బలేన చోదయసి ప్రజావతా చ రాధసా ధనేన తే వయమిహ స్యామేతి.

అథాతః మధ్యస్థానాః స్త్రీదేవతాః - తాసామదితిః ప్రథమా. సా చ పునరో వ్యాఖ్యాతా. అదీనా దేవమాతేతి తస్యా ఏషా - దక్షస్య వాదితే ... జన్మని" గయస్యార్షమ్. మిత్రావరుణౌ - అహోరాత్రే. తయోః సంధివేలాయామ్ పూర్వమవస్థాయ రసానుప్రదానసంబంధాత్ తాం మధ్యమామదితి మభిప్రేత్యైతదుచ్యతే దక్షస్యేత్యాది - దక్షః ఆదిత్యః త్వత్తో జాతః త్వం వాదిత్యాత్ జాతా, అనుసంధివేలమ్ ఆదిత్యస్య ఉదయః - జన్మ తదేవాస్య వ్రతమ్. కర్మ ఉక్తంచాపి - "కర్మజన్మాన" ఇతి. తదేవం దక్షస్యజన్మని - ఉదయే చాధ్వర్తిన్యాదిత్యే యుతే వా లబ్ధాత్మికా త్వమ్ అహోరాత్రే ఉభే వివాససి - పరిచరసి - సర్వతః వ్యాప్నోషి. అర్ధేన అహః - మిత్రమ్, అర్ధేన చ రాత్రిమ్ - వరుణమ్. యౌ రాజానౌ స్తః స్వేషు స్వేషు అధికారేష్విత్యర్థః. యః దక్షః అతూర్తపంథాః - పథి అత్వరమాణః - అవిరతగతిరిత్యర్థః. పురురథః - బహురంహణః, అర్యమా - అరీణాం తమసాం నిహన్తా సప్తహోతా - సప్తాస్మై రశ్మయోఽభినన్నామయన్తి అథవా సప్త ఋషయ ఏనమాహ్వయన్తి. విషురూపేషు - విషమరూపేషు - జన్మసు అయం సప్తహోతా వర్తతే ఇతి.

అథవా అదితిః దక్షశ్చ దేవధర్మేణ - మహదాత్మనా ఇతరేతర జన్మానౌ ఇతరేతరప్రకృతీ వా స్యాతామ్.

అగ్నిరపి అదితిపదవాచ్యః. తథా చ ఋక్ - "యస్మై త్వమ్ ... రాధసా తే స్యామ" ఇత్యస్యార్థమ్. హే సుద్రవిణః! సుధన! అదితే - అగ్నే! యస్మై త్వమ్ సర్వదాతా - సమస్తేషు కర్మతతిషు అనాగాస్త్వమ్ - అనపరాధత్వమ్ దదాశః - దదాసి, యం చ భద్రేణ శవసా - బలేన ప్రజావతా రాధసా - ధనేన చోదయసి - అనుగృహ్ణాసి తే వయం స్యామ - అను

గ్రాహ్యాస్తవ భవేమ. అథైకపదనిరుక్తిః - అగః కస్మాత్? ఉచ్యతే యస్మా దేతత్ కర్తారమపశ్యమేతి తస్మాదాగః ఏనః - పాపం ఏతేః సాధ్యమ్ కిల్బిషం కస్మాత్? ఉచ్యతే యస్మాదేతత్ కిల - నిశ్చయేన సుకృతస్య భిషం - భేదకం భవతి తస్మాత్ కిల్బిషమిత్యుచ్యతే. అథవా కీర్తేః భిషం కిల్బిషమ్.

అర్థము :- అథ = ఇప్పుడు, అతః = ఇటనుండి, మధ్యమస్థానీయ స్త్రియః = స్త్రీలవర్ణనము. ఆ స్త్రీలింగదేవతలలో అదితి మొదటిదేవత. అదితి వ్యాఖ్య - అదీనా దేవమాతా అది (४-५५-० లో) చేయబడినది. ఆ అదితికి సంబంధించిన ఋక్కు - "అదితిః = ప్రాతఃకాలపుసంధివేళకు అదితి అని నామము. అది అవశ్యాయ = మంచుసూపతనము నిచ్చుటవలన ఆ సంబంధముతో మధ్యస్థానదేవత.

మంత్రార్థము — అదితే! = ఓ అదితి నీవు, దక్షస్య = ఆదిత్యుని జన్మని వ్రతే వా = ఉదయరూపకర్మసమయమున లేక అస్త (మయ) రూపకర్మసమయమున, రాజానా = రాజువైన, మిత్రావరుణా = (అహర్వై మిత్రః రాత్రిర్వరుణః ఇతి శ్రుతేః - అహోరాత్రావత్రమిత్రావరుణౌ) పగలు రాత్రి అనువానికి, వివాససి = సేవచేయుచున్నావు, సూర్యః అతూర్త పంథాః = అత్వరమాణపంథాః = నియమితగతికలవాడు, (సూర్యునియందు నియమితగతియుండదు. అతః అతూర్తపంథాః అనిచెప్పబడినది) పురు రథః = ఎక్కువగతికలవాడు, అర్యమా=అంధకారమనెడి శత్రునాశకుడు, సప్తహోతా = సప్తరశ్ములు అతనియందు రసమునింపును, లేక సప్తర్షు లచే స్తుతింపబడువాడు - సప్తహోతలు కలవాడు. అట్టి, విషురూపేషు జన్మసు = విషమరూపములుగలవాడు, (దక్షిణాయన, ఉత్తరాయణ - కారణమువలన విషమరూపములు కలవాడు)

భాష్యార్థము :- వ్రతే - కర్మణి = ఉదయాస్తరూపకర్మమునందు. రాజానా = రాజానౌ మిత్రావరుణా - మిత్రావరుణౌ = దినరాత్రులనెడి ఇరువురురాజులకు, వివాససి - పరిచరసి = సేవచేయుచున్నావు, విపూర్వక 'వాస'ధాతువు పరిచర్యార్థమున వచ్చును. ఇందుకు మంత్రప్రమాణము - "హవిష్మా ఆవివాసతి" "యో అగ్నిం దేవవీతయే హవిష్మా ఆవివాసతి తస్మై

పావక మృడయ" = హే పావక! అగ్నే! యః హవిష్మాన్ = హవిస్సు తీసికొని, దేవవీతయే = దేవ భోజనముకొఱకు, అగ్నిమ్ = అగ్నివైన నీయొక్క, వివాసతి = సేవచేయును, తస్మై = అతనికి నీవు, మృడయ = సుఖమును చేకూర్చుము.

భాష్యార్థము :- అరూత్తపంథాః = అత్వరమాణపంథాః = నియమిత గతికలవాడు, పురురథం = బహురథః = బహురంహాః=ఎక్కువగతికల వాడు, అర్యమా=ఆదిత్యుడు-సూర్యుడు, అరీన్ నియచ్ఛతి ఇతి అర్యమా = అంధకారరూపశత్రువును నాశముచేయువాడు కావున అర్యముడు = సూర్యుడు. సప్తహోతా - సప్తరశ్మయః = ఏడుకిరణములు. అస్మై = ఇతనికొఱకు, రసాన్ = రసములను, అభిసంనామయన్తి = తెచ్చును - కావున ఆదిత్యుడు సప్తహోతయనబడును. లేక ఏనమ్ = ఈయాదిత్యుని, సప్తఋషులు స్తువన్తి = స్తుతింతురు - కావున ఆదిత్యుడు సప్తహోతయన బడును విషురూపేషు=జన్మసు = దక్షిణాయనము, ఉత్తరాయణమునను విషమరూపములు కలవాడు, జన్మసు = ఉదయేషు=ఉదయములందు.

ఆదిత్యమధ్యే చ స్తుతః = ఆదిత్యులమధ్య దక్షునిస్తుతి చేయబడి నది. కావున దక్షః ఆదిత్యః = దక్షుడు ఆదిత్యుడే, ఇతి ఆహుః = ఇట్లు చెప్పెదరు.

అదితిః = అదితి దక్షునిపుత్రిక కావున దాక్షాయణి = దాక్షాయణి యనబడును. అది యెట్లన - ఈమంత్రమున జూడుడు - "అదితేః=అదితి వలన - సంధివేళవలన, దక్షః = దక్షుడు, అజాయత=కలిగెను, ఉ దక్షాత్ పరి = ఆయాదిత్యునివలన, అదితిః = సంధివేళ లేక సంధ్యా = సంధ్య కలిగెను.

అటులైన కథముపపద్యేత ? ఈవిషయమెట్లు అంగీకరింపదగును ? దక్షుడు అదితిపుత్రుడు, అతడే తండ్రి యెట్లు కాగలడు ? పుత్రత్వము పితృత్వము రెండునెక్కనిలో నెట్లుసంభవించును ? సమాధానము సమాన జన్మానౌ స్యాతామ్ ఇతి. సమానం జన్మ యయోః తౌ సమానజన్మానౌ = వీరియిరువురిజన్మ సమానమో వారిరువురు సమానజన్ములగుదురు. దక్షుడు అదితి అనువీరియిరువురు ఒకరు మఱియొకరికి కారణము కావున వీరిరువురి జన్మమొక్కటియే. ప్రాతఃసంధ్యవలన సూర్యుడు-ఆదిత్యుడుదయించును.

సాయంకాలమున సాయంసంధ్య సూర్యునివలన కలుగును. కావున అదితి, ఆదిత్యులలో జన్యజనకభావసంబంధమున్నది. కావున ఒక్కని యందే దక్షునియందే పుత్రత్వము పితృత్వము రెండును సంభవమే - ఉపపన్నమే. అపి వా=లేక దేవధర్మణా = వ్యావహారిక ధర్మమునననుసరించి ఒకటి మఱియొకదానివలన నుత్పన్నమగుచు ఒకదానికిమఱియొకటి కారణమగుచున్నవి. అనగా ప్రాతఃసంధ్యవలన సూర్యుడు ఉత్పన్నమగు చున్నాడు. ఆ సూర్యునివలననే సాయంసంధ్య యేర్పడుచున్నది.

అగ్నియు అదిత్యుడనబడుచున్నది. అగ్నికి అదితిశబ్దవాచ్యమున్న దనుటకు ఈమంత్రము ప్రమాణము.

మంత్రార్థము :- సుద్రవిణః అదితే! = ఉత్తమధనమునొసంగు ఓ అదితీ! ఓ యజ్ఞాగ్నీ! యస్మై=ఎవనికొఱకు, త్వమ్=నీవు, సర్వతాతా = సర్వయజ్ఞకర్మలవిస్తారమునందు అనాగాస్త్వమ్ = అనపరాధతను, అవైగుణ్యమును, దదాశః = దదాసి = ఇచ్చుచున్నావు, యమ్ = ఎవనిని, నీవు, భద్రేణ శవసా = కల్యాణకరమగుబలముతో, ప్రజావతా రాధసా = సంతానయుక్తధనముతో, చోదయాతి = అనుగృహీతుని చేయుచున్నావో, తే స్యామ = మేము నీవారమగుదుముకాక! అనగా! ఓ యదితీ! నీయనుగ్రహమునకు మేము పాత్రులమగుదుముగాక!.

భాష్యార్థము :- యస్మై త్వమ్ = ఎవనికొఱకునీవు, సుద్రవిణః = మంచిధనదాతవు, దదాశ = దదాసి = ఇచ్చుచున్నావు, అనాగస్త్వమ్ - అనపరాధత్వమ్ - అవైగుణ్యమ్ - సర్వతాతా = సర్వాసుకర్మతతిషు = సమస్తయజ్ఞాదికర్మములందు, వానివిస్తారములందు, ఆగః = విపత్తి, ఆఙ్పూర్వాత్ గమేః = ఆఙ్పూర్వక గమ్ధాతువువలన కర్తకు ఇవి తప్పక ప్రాప్తమగును. కర్తారమాగచ్ఛతీతి ఆగః. ఏన ఏతేః - ఇణ్‌గతౌ ధాతువు వలన సిద్ధమగును. ఏనస్ - పాపవాచకము. ప్రసంగవశమున కిల్బిష పదవ్యుత్పత్తి. కిల్బిష = కిలభిదమ్ = కిలభిద్వలన నేర్పడును సుకృత కర్మణః = ఉత్తమకర్మముచేయువానివలన కిల్బిషము భయపడును. పాపి పుణ్యాత్మునకు భయపడును. ఈ కిల్బిషము పాపిని సుకృతకర్మ వైపునుండి భయముకలిగించును. అందువలన కిలభిదమగుచు కిల్బిష

మనబడును. లేక కీర్తిమ్ అస్య భినత్తి=ఈకిల్బిషము ఈపాపకర్తయొక్క కీర్తిని నష్టపఱచును. అందువలన కీర్తిభిద్ అగుటవలన కిల్బిషమనబడును. చోదయసి = అనుగృహీతునిజేయుదువు, రాధసా = ధనేన = ధనముతో.

సరమా - (౧౭)

సరమా సరణాత్. తస్యైషా భవతి-

"కిమిచ్ఛన్తీ సరమా ప్రేదమానడ్ దూరే హ్యధ్వా జగురిః పరాచైః. కాస్మే హితిః కా పరితక్మ్యాసీత్ కథం రసాయా అతరః పయాంసి" (ఋ. ౧౦-౧౦౮-౧)

కిమిచ్ఛన్తీ సరమేదం ప్రానడ్ దూరే హ్యధ్వా జగురిర్జంగమ్యతేః పరాంచనైరవితః కా తవాస్మాస్వర్థహితిరాసీత్ కిం పరితకనమ్. పరితక్మ్య రాత్రిః పరిత ఏనామ్ తక్మ. తక్మేత్యుష్ణనామ తకత ఇతి సతః, కథం రసాయా అతరః పయాంసి ఇతి. రసా నదీ రసతేః శబ్దకర్మణః. కథం రసాని తాన్యుదకానీతి వా. దేవశునీంద్రేణ ప్రహితా పణిభిరసురైః సమూద ఇత్యాఖ్యానమ్.

యత ఇయం సర్తి గచ్ఛతి తతః సరమా. కేయం పునః? దేవశునీతి ఐతిహాసికాః నైరుక్తాః పునః సరమాం మధ్యమాం వాచమ్ మన్యన్తే. తస్యా ఏషా - "కిమిచ్ఛన్తీ ... అతరః పయాంసి" దేవపణయో నామాసురాః దేవగవీరపహృతవన్తః. శక్రస్తాసాం మార్గణాయ సరమాం న్యయుంక్త. తే సరమాం విలోక్య దేవపణయః అబ్రువన్ కిమిచ్ఛన్తీతి. ఇదమ్ - అస్మద్ గృహమ్ కిమిచ్ఛన్తీ సరమా ఆనట్ - ప్రాప్తవతి. ఏషః అధ్వా - మార్గః జగురిః - భృశం గన్తా పరాచైః - పరాఙ్ముఖైః అంచనైః - గమనైః ఆచితః గతః దూరే హి - అతివిప్రకృష్ట ఇత్యర్థః హే సరమే! కా స్మే హితిః - అస్మత్తః కోఽర్థస్తేఽభిప్రేతః? అపి చ కా పరితక్మ్యాసీత్ పరితక్మ్యా రాత్రిః తేఽనన్తరా రాత్రిః అపి నామ సుఖాసీత్? కథం రసాయాః - అతివిస్తీర్ణాయాః తవాఖ్యాయా నద్యాః పయాంసి త్వమ్ అతరః?

అర్థము :- సరమా - సరమ సృ'గతౌ ధాతువునకు 'అమచ్' ప్రత్యయముచేసిన సరమా సిద్ధమగును. సరమను నైరుక్తాః = నైరుక్తులు మాధ్యమికవాణిగా నంగీకరించుచున్నారు. ఐతిహాసికులు సరమను దేవశుని అనుచున్నారు. గమనక్రియకారణముగా సరమనామమేర్పడినది. ఆ సరమకు సంబంధించిన ఋక్కు.

మంత్రార్థము :- అసురులు దేవతలగోవులను అపహరించినపుడు ఇంద్రుడాగోవుల నన్వేషించుటకు సరమ అనుపేరుగల యొక కుక్కను అసురులగృహమునకు పంపెను. అప్పుడాయసురులు సరమతో నిట్లనిరి - సరమే! నీవేమి కోరి మాయింటికి వచ్చితివి - అస్మద్గృహంప్రానట్ - అని యడిగిరి. మార్గము నిశ్చయముగా నతిదూరము, జగురిః = ఎక్కువ దూరము నడువగలవారే యీమార్గమును తరింపగలరు, అస్మే కాహితిః? మావలన నీకు గలుగు ప్రయోజనమేమి? మేము నీకేమిచేయుగలము? నీకు మార్గమున గడచినరాత్రి సుఖముగా గడచినదా? రాత్రివేళ నెటకేల వచ్చితివి? దేవజనులు పుణ్యప్రకాశమున నెల్లపుడు నుందురుగదా! రసాయాః పయాంసి = దారిలోనున్న నదీజలముల నెట్లు దాటగలిగితివి?

భాష్యార్థము :- కిమిచ్ఛన్తీ సరమా = ఏమికోరుచు సరమ - ఇదమ్ ప్రానట్ = ఇటకువచ్చినది? అధ్వా దూరే హి=మార్గము చాలదూరము, జగురిః జంగమ్యతేః = గమ్ ధాతువునకు యఙ్లుగన్తరూపము, జగురిః= ఎక్కువనడువగలవాడు, పరాచైః = పరాపచనైః పరాఙ్ముఖైః = పరాఙ్ముఖ గమనములతో, ఆపితః - గతః - ప్రాప్తః = పొందెను, అస్మే హితిః = మా యందు నీకుగలప్రయోజనమేమి? కా పరితక్మ్యా ఆసీత్=నీయాగమనము (కిం పరితకనమ్) ఎట్లుకలిగినది? పరితక్మ్యా రాత్రిః = రాత్రినామము - ఏలయన పరితః ఏనామ్ = రాత్రికి అన్నివైపుల వేడి ఉండును, తక్మ = ఉష్ణనామము, రాత్రి స్వయముగా వేడిలేనిదై యుండును. (తకతే ఇతి సతః = తక్మ) రసా - నదీ = రసా నదీవాచకము, నదికి రసా అనిపేరు. రసతేః శబ్దకర్మణః = శబ్దకరణార్థకరసధాతువువే రసాశబ్దము సిద్ధించును, రసాని తాన్యుదకాని = (రసమనుజలము) ఆ తియ్యని నదీజలములనెట్లు ఉతరః = దాటివచ్చితివి?

తత్ కౌ అశ్వినౌ? అప్పుడు అశ్వినౌ అనబడు? ద్యావా పృథివ్యౌ= ద్యులోకపృథివీలోకములు అశ్వినౌ = అశ్వినులు - ఇతి ఏకే = అని కొందఱు ఆచార్యులనుచున్నారు. ఏలయన ద్యులోకము తనజ్యోతి - ప్రకాశముతో సన్నిటిని వ్యాపించియున్నది. పృథివీలోకము అన్నముతో సన్నింటిని వ్యాపించియున్నది. మఱియు నీరెండులోకములు వేగవంత ములు. కావున ద్యుపృథివీలోకములు అశ్వినులని కొందఱు.

మఱికొందఱు నైరుక్తులు = నిరుక్తకారులు, అశ్వినౌ - అహోరాత్ర ములు - దినరాత్రులు అనుచున్నారు. ఏలయన దినము ప్రకాశముతో సన్నిటిని వ్యాపించును. రాత్రి మంచుతో సన్నింటిని కప్పివేయును - వ్యాపించును. కావున దినరాత్రులు అశ్వినులనుచున్నారు. మఱియు నీ దిన రాత్రులు వేగముకలవియును.

ఇంకకొందఱు అశ్వినౌ = సూర్యాచంద్రమసౌ = సూర్యచంద్రులు అనుచున్నారు. ఏలయన సూర్యుడు ప్రకాశముతోను, చంద్రుడు రసము తోను సమస్తమును వ్యాపించును; కావున సూర్యచంద్రులే అశ్వినులనబడు చున్నారు. ఈ సూర్యచంద్రులు వేగవంతులుకదా.

ఐతిహాసికులు - అశ్వినౌ = పుణ్యకృతౌరాజానౌ = పుణ్యవంతులైన ఇరువురు రాజులనుచున్నారు. వీరిరువురు అశ్వవంతులును - తయోః = ఆ యశ్వినులకాలము, అర్ధరాత్రాత్ ఊర్ధ్వమ్ = అర్ధరాత్రమునకు తరువాత అనుచున్నారు. ప్రకాశీభావస్య = ప్రకాశీభావమునకు, అనువిష్టంభమ్ = తమః ప్రకాశౌ = చీకటివెలుగులు రెండును పరస్పరము వ్యాపించు కాలము అశ్వినులకాలము. అనువిష్టంభమనగా - పరస్పరవ్యాప్తి అని యర్థము. అనుత్తమః భాగః హి మధ్యమః = ఇందు అంధకారభావము మధ్యమదేవత, జ్యోతిర్భాగ ఆదిత్యః=ప్రకాశభాగము ఆదిత్యుడు-సూర్యుడు ఉత్తమస్థానీయదేవత. ఇక నీదేవతలకు సంబంధించిన ఋక్కు.

మంత్రార్థము — అశ్వినా! = ఓ యశ్వినులార! మీరు యిరువురు, అసితౌ మేఘౌ ఇవ = నల్లనిమేఘములవలె, వసాతిషుచరథః=రాత్రులందు చరింతురు, యువామ్ = మీరిరువురు, కదా = ఎప్పుడు, ఇహ = మా యీ యజ్ఞకర్మమునందు, దేవాన్ అభ్యగచ్ఛతమ్ = దేవతలను ప్రాప్తించితిరి?

పొందితిరి? తయోః=ఆ సమానకాలముగల (అర్ధరాత్రికి తదుపరికాలము) సమానస్తుతిగల అశ్వినులకు సంబంధించిన భిన్నభిన్నస్తుతిని దెలుపు ఋక్కుఋక్కు క్రింద చూడఁగును. 'వాసాత్యో అన్య' ఇత్యాదియుక్కు దాని యర్థము—

హే సూర్య! తవ = నీయొక్క, వాసాత్యః అన్యః ఉచ్యతే = ఒక పుత్రుడు - రాత్రిపుత్రుడు అనబడును. ఉషః పుత్రః అన్యః - రెండవ వాడు ఉషాపుత్రుడనబడును. అనగా - రాత్రి ప్రకాశము అను నీరెండింటి కలయిక అశ్వినీదేవతలనబడునని భావము. ఆ యశ్వినులకు సంబంధించిన మఱియొక ఋక్కు కలదు. అది అశ్వినులలో ఒకయశ్వి మధ్యముడనియు రెండవయశ్వి ఉత్తముడనియు చెప్పునది. ఈ విషయమును బలపఱచు ఋగర్థముచూడుడు.

మంత్రార్థము :— హే అశ్వినౌ! = ఓ యశ్వినులార! ఇహ ఇహ జాతా = ఇహ = మధ్యమస్థానమున నుత్తమస్థానమున నుత్పన్నులైన మీరిరువురు, అరేపసా తన్వా = పాపముతో లిప్తముకాని స్వరూపముతో, స్వైః నామభిః = మీ స్వనామములతో, సమవావశీతామ్ సంస్తూయేతే = స్తుతిచేయబడుచున్నారు, వామ్ = మీ యిరువురిలో, అన్యః = ఒకడు, జిష్ణుః=నిత్యజయశీలుడు, సుమఖస్య సుఖహర్తః=అత్యంతబలప్రేరకుడును అకడు మధ్యమస్థానీయుడు, అన్యః = రెండవవాడు, దివః = ద్యులోక స్థానీయుడు. సుభగః = ధనధాన్యపూర్ణపుత్రుడు, ఊహే = వాయువుచే నడపబడుడు లేక తన యశ్వములతోనే నడపబడును అతడు ఆదిత్యుడు.

భాష్యార్థము :- ఇహ ఇహ జాతా = ఇహ చ ఇహ చ జాతౌ = ఇట మధ్యమస్థానమున, ఇహచ = ఉత్తమస్థానమున, జాతౌ = జన్మించినవారు, సమవావశీతామ్ - సంస్తూయేతే = స్తుతిచేయబడుచున్నారు, అరేపసా = పాపేన అలిప్యమానయా = పాపముచేలిప్తముకాని పాపరహిత - తన్వా = స్వరూపముతో. సుమఖస్య = సుమహతః బలస్య = మిక్కిలిగొప్పబలము యొక్క, సూరిః = ఈరయితా = ప్రేరకుడు . మధ్యమః = మధ్యమ స్థానీయుడు, ఊహే - ఊహ్యతే = వహింపబడును. ఆదిత్యః = అతడు ఆదిత్యుడు. ఇట్లీమంత్రమున అశ్వినులు ఒకడు మధ్యమస్థానీయుడు మఱియొకడు ఉత్తమస్థానీయుడునని వర్ణింపబడినది.

ఈ విషయమునే బలపఱచు మఱియొక ఋక్కు.

మంత్రార్థము :— హే స్తోతః! ప్రాతర్యావ్ణా = ఎవరియొక్క, ప్రాతః కాలస్తుతి చేయబడునో ఆ యశ్వినులను, విబోధయ = విస్పష్టస్వరములు గల స్తుతులతో మాకొఱకు ప్రబోధితులను చేయుము. అస్య సోమస్య పీతయే = ఈ సోమమును పానముచేయునిమిత్తము, ఇహ ఆగచ్ఛతామ్ = ఈ యజ్ఞమున ఉపస్థితులగుదురుగాక!.

భాష్యార్థము :— ప్రాతర్యావ్ణా = ప్రాతర్యోగినౌ స్తుతితో లేక హవిస్సుతో ఎవరు ప్రాతఃసమయమున యుక్తులనుచేయుదురో వారు అశ్వినులని యర్థము. ఆ యిరువురికి సంబంధించిన మఱియొక ఋక్కు.

మంత్రార్థము :— ఓ స్తోతలార! అశ్వినా=అశ్వినులకొఱకు, ప్రాతర్యజధ్వమ్ = ప్రాతఃకాలముననే యజ్ఞముచేయుడు, హినోత = వారికి హవిస్సునుచేర్చుడు, దేవయాః న సాయమస్తి = వీరికి సంబంధించిన దేవపూజ సాయంకాలమున విహితము కాదు. అజుష్టమ్ = సాయంయజ్ఞము ఈ యశ్వినులచే సేవింపబడదు, ఉత అస్మః అస్మద్ యజతే = మఱియు మనలో నెవరైనా యజ్ఞముచేయుచో, వి అవ చః = మఱియు హవిస్సులతో తృప్తులను చేయుచో వారిలో, పూర్వః పూర్వః యజమానః = మొదటి యజమానుడు, వనీయాన్ = ఉత్తమభక్తికలవాడుగా నంగీకరింపబడు చున్నాడు.

భాష్యార్థము :— ప్రాతర్యజధ్వమ్ అశ్వినా - అశ్వినౌ = అశ్వినుల కొఱకు ప్రాతఃకాలముననే యజ్ఞముచేయుడు, హినోత - ప్రహిణుత = పంపుడు, దేవయాః = దేవయజ్ఞము, న సాయమ్ అస్తి=సాయంకాలమున లేదు. అజుష్టమేతత్ = సాయంయజ్ఞము అశ్వినులకు సేవ్యముకాదు, పూర్వః పూర్వః = పూర్వునికంటెను పూర్వుడు - ప్రథముడు, యజమానః = యజ్ఞకర్త వనీయాన్ వనయితృతమః = మిక్కిలిభక్తికలవాడుగా నంగీకరింపబడును.

తయోఃకాలః - సూర్యోదయపర్యన్తః - తస్మిన్నన్యా దేవతా ఓప్యన్తే, తయోః=ఆ యశ్వినులయజనకాలము సూర్యోదయపర్యంతము ఆ సమయ

మునసితరదేవతలు, ఉపస్థ్యస్తే = ఉంచబడుదురు-ఉపస్థితులగుదురు. అనగా ఉషస్సు, సూర్యా, సరణ్యూ, త్వష్టా మున్నగుదేవతలుకూడ అశ్వినిదేవతలకాలాంతర్గతులుగా నెంచబడుచున్నారు.

ఉదా: - (౨)

ఉషా వష్టేః కాంతికర్మణ ఉచ్ఛతేరితరా మాధ్యమికా. తస్యా ఏషా భవతి-

"ఉషస్తచ్చిత్రమాభరాస్మభ్యం వాజినీవతి. యేన తోకం చ తనయం చ ధామహే" (ఋ. ౧-౯౨-౧౩)

ఉషస్తచ్చిత్రం చాయనీయం మంహనీయం ధనమాహరాస్మభ్యమ్. అన్నవతి! యేన పుత్రాంశ్చ పౌత్రాంశ్చ దధీమహి. తస్యా ఏషాఽపరా భవతి-

ఏతా ఉ త్యా ఉషసః కేతుమక్రత పూర్వే అర్ధే రజసో భానుమంజతే. నిష్కృణ్వానా ఆయుధానీవ ధృష్ణవః ప్రతి గావోఽరుషీర్యన్తి మాతరః" (ఋ. ౧-౯౧-౧౦)

ఏతాస్తా ఉషసః కేతుమకృషత ప్రజ్ఞానమేకస్యా ఏవ పూజనార్థే బహువచనమ్ స్యాత్. పూర్వే అర్ధే అంతరిక్షలోకస్య సమంజతే భానునా నిష్కృణ్వానా ఆయుధానీవ ధృష్ణవః, నిరిత్యేష సమిత్యేతస్య స్థానే.

"ఏషామేషాం నిష్కృతం జారిణీవ ఇత్యపి నిగమో భవతి. ప్రతియన్తి గావో గమనాదరుషీరారోచనామాతరో భాసో నిర్మాత్ర్యః.

ఉషః కస్మాత్? ఉచ్యతే కాంత్యర్థాత్ వష్టేః - 'వశకాంతౌ' ఇత్యస్మాత్ ధాతోః, తస్యా ఏషా - "ఉషస్తచ్చిత్ర...ధామహే" గోతమస్యార్షమ్.

హే వాజినీవతి! ఉషః! తత్ చిత్రమ్. చాయనీయమ్ ధనమ్ - అస్మభ్యమ్ ఆభర. యేన వయం తోకం తనయం చ - పుత్రాన్ పౌత్రాంశ్చ ధామహే - దధీమహి.

తస్యా అపరైషా - నవ్యపరా కిమర్థమ్? ఉచ్యతే చిత్రధనాహరణముభయోరప్యుషసోః సామాన్యమ్ పరం వక్ష్యమాణాయామృచి ద్యుస్థానాయా ఉషసః ఉత్తమం లింగమత ఉదాహ్రియతే.

"ఏతా ఉ త్యాః ... యన్తి మాతరః" గోతమస్యార్షమ్. ఏతాః త్యాః ఉషసః ఏతా తాః ఉషసః యాః రజసః - అంతరిక్షలోకస్య పూర్వే అర్ధే భానుమ్ - భాసా అంజతే - సమంజతే కేతుమ్ - ప్రజ్ఞానమ్ అక్రత - కుర్వన్తి. ధృష్ణవః - ధర్షయితారః ఆయుధాని ఇవ నిష్కృణ్వన్తి-నిర్మలాని కుర్వన్తి. గావః - గమనశీలాః అరుషీః ఆరోచనాః మాతరః భాసః నిర్మాత్ర్యః ఉషసః తమేవ సూర్యం ప్రతియన్తి.

అస్మిన్ 'ని' ఇతి 'సమ్' స్థానే ప్రయుక్తః. తమేతముపసర్గవ్యత్యయముదాహరతి 'ఏమీదేషాం నిష్కృతమ్' నిష్కృతమ్ - సంస్కృతమ్.

అర్థము :— కాంతి అర్థముగల 'వస్'ధాతువుతో ఉషాః శబ్దము సిద్ధించును. ఉషస్సు సూర్యోదయమునకు పూర్వసమయమునకు పేరు. 'ఉచ్ఛీ'వివాసే ధాతువువలన సిద్ధించు ఉషస్సు ఇతరమాధ్యమిక విద్యుద్వాచకము. అది 'వశ' ధాతువుతో సిద్ధముకాదు. దానికి సంబంధించిన ఋక్కు.

మంత్రార్థము :— వాజినీవతి! ఉషః! ప్రశస్తఅన్నముగల ఉషస్సా! అస్మభ్యమ్ = మా కొఱకు, తత్ చిత్రమ్ ఆభర= ఆ శ్రేష్ఠధనమును తెమ్ము, యేన - ఏవిచిత్రధనముతో, తోకం చ = పౌత్రులను, తనయంచ = పుత్రులను, ధామహే - దధీమహి = మేము ధారణముచేయుదుముగాక !. ఆ ఉషస్సుకు సంబంధించిన మఱియొక ఋక్కు.

మంత్రార్థము :- ఉ - ఇది పదపూరణము. ఏతాః త్యాః ఉషసః (ఏకవచనమునకు బహువచనము) ఉషః = ఆ ఉషస్సు, రజసః - అంతరిక్షముయొక్క, పూర్వే అర్ధే = పూర్వప్రదేశభాగమున, భానుమ్ అంజతే = ప్రకాశముతో సమస్తమును ప్రకాశింపజేయుచున్నది, కేతుమక్రత = సర్వ

పదార్థములను జ్ఞాపనమును కలిగించుచున్నది, ఇవ = ఎట్లు, ధృష్ణవః = యోధులు, ఆయుధాని నిష్కృణ్వానా = తమ ఆయుధములను సంస్కరింతురో, అట్లే ఉషస్సు అంధకారమును తొలగించి సమస్తమును ప్రకాశింపజేయును, మఱియు, గావః = గమనస్వభావముగల ఆరుషీః = ప్రకాశించుకాంతులను, మాతరః = నిర్మించు ఉషస్సు, ప్రతియన్తి = మరలి పోవును. ఆ సూర్యునియందే లీనమగును.

భాష్యార్థము :- ఏతాః త్యాః = ఆ ఉషస్సు, కేతుమ్-ప్రజ్ఞానమ్ = జ్ఞాపనము, అక్రత - అకృషత = చేయుంచుచున్నది, ఏకస్యా ఏవ పూజనార్థే బహువచనం స్యాత్ = ఉషస్సు ఒక్కటే యనను, ఉషసః = ఉషస్సులు అనుబహువచనప్రయోగము పూజనార్థము, రజసః = అంతరిక్షము యొక్క, భానుమ్ అంజతే = భానునా = సూర్యునిచే - సూర్యుని ప్రకాశముతో సర్వమును ప్రకటింపజేయును, భానుమ్ = ఇందలిద్వితీయవచనము తృతీయార్థమున, భానునా = ప్రకాశముచే అనియర్థము, నిష్కృణ్వానా = ఈ పదమునందలి 'నిర్'ఉపసర్గ 'సమ్'ఉపసర్గస్థానమున ప్రయుక్తము మంత్రమున నిష్కృత - ఇందలి నిర్'సమ్' స్థానీయము-సంస్కృతఅగును గావః - గమనాత్ = గమనశీలమగుటవలన గోశబ్దమేర్పడును, ఆరుషీః - ఆఙ్పూర్వక 'రుచదీప్తౌ' ధాతువుతో సిద్ధమగును, ఆరుషీః = తళతళ ప్రకాశించు, మాతరః = భాసో నిర్మాత్ర్యః = కాంతిని నిర్మించు ఉషస్సు, ప్రతియన్తి = తిరిగిపోవును - మరలిపోవును-ఉషస్సు మరల ఆదిత్యునిలో కలిసిపోవును ఉషసః = బహువచనాంతము, కావున విశేషణములన్నియు బహువచనమునందే ప్రయుక్తములైయున్నవి.

సూర్యా - (3)

సూర్యా సూర్యస్య పత్నీ. ఏషైవాభిసృష్టకాలతమా. తస్యా ఏషా భవతి – ''సుకింశుకం శల్మలిం విశ్వరూపం హిరణ్యవర్ణం సువృతం సుచక్రమ్. ఆరోహ సూర్యే అమృతస్య లోకం స్యోనం పత్యేవహతుం కృణుష్వ''(ఋ ౧౦-౮౫-౨౦) సుకాశనం శన్నమలం సర్వరూపమ్. అపి వోపమార్థే స్యాత్ సుకింశుకమివ శల్మలిమితి. కింశుకం క్రంశతేః

> ప్రకాశయతికర్మణః శల్మలిః సుశరో భవతి శరవాన్ వా. ఆరోహ సూర్యే అమృతస్య లోకముదకస్య సుఖం పత్యే వహతుం కురుష్వ. సవితా సూర్యాం ప్రాయచ్ఛత్ సోమాయ రాజ్ఞే ప్రజాపతయే వా' ఇతి చ బ్రాహ్మణమ్.

సూర్యా సూర్యస్య పత్నీ భవతి. కాలాభిసృష్టా - ఉదయకాలం ప్రతి గతా ఏషా-ఉషా ఏవ సూర్యా జాయతే. తస్యా ఏషా - "సుకింశుకం ... కృణుష్వ" సూర్యాయా ఆర్షమ్. సుకింశుకం లోకానాం సుష్ఠు కాశనం దీపనమ్ శల్మలిమ్ - శస్తమలమ్-అపేత మలమ్" విశ్వరూపమ్ - సర్వ రూపమ్ హిరణ్యవర్ణమ్ - హిరణ్యమివ వరణీయమ్ సువృతమ్ - సువర్త నమ్ సుచక్రమ్ - సుచలనమ్ - సుపుష్టమ్ రథమ్ హే సూర్యే! ఆరోహ. అమృతస్య-ఉదకస్య లోకమ్-స్థానమ్ స్యోనమ్ - సుఖమ్ పత్యే మండలాధిష్ఠాత్రే వహతుం కృణుష్వ - కురు. అపి వా కింశుకశబ్దః ఉపమార్థః స్యాత్. సుకింశుకమ్-పలాశకుసుమవత్ రక్తవర్ణమ్. కింశుకం కస్మాత్? ఉచ్యతే ప్రకాశనార్థాత్ క్రంశతేః. శల్మలిః పునః కస్మాత్ సుశరః- సుకర్తః అథవా కంటకైః శరవాన్ - హింసావాన్.

అర్థము :- సూర్యా - సూర్యునిపత్ని. ఏషా ఏవ = ఈ ఉషస్సే, అభిసృష్టకాలతమా=అధికసమయము విడిచిపెట్టినప్పుడు, సూర్యా 'సూర్య' యగును. సూర్యోదయమునకు ఉషః (కాలము)నకు మధ్యనుండు సమయము సూర్యా = సూర్యయనబడును. ఆ సూర్యాసంబంధి ఋక్.

మంత్రార్థము :- హే సూర్యే=ఓ సూర్యపత్ని ! నీవు, సుకింశుకమ్= మిక్కిలి ప్రకాశించుచున్నవి శల్మలిమ్ = మలరహితమై, విశ్వరూపమ్ = సమస్తరూపమై, హిరణ్యవర్ణమ్ = సువర్ణవర్ణమై, సువృతమ్ = సుందర కిరణములతో ఆవృతమై, సుచక్రమ్ = సుచక్రాకృతివి, అమృతస్య లోకమ్ = జలస్థానమగు అంతరిక్షమును, ఆరోహ=ఆరూఢవగుము, పత్యే = ఆరూఢవై అంతరిక్షరూపపతికొఱకు, వహతుమ్ స్యోనమ్ కృణుష్వ = వివాహమును సుఖదమొనర్పుము.

భావార్థము :- సుకింశుకమ్ - సుకాశనమ్=మిక్కిలిప్రకాశించు, శల్మలిమ్ = శస్తమలమ్ - వ్యపగతమలమ్ = శుద్ధము, నిర్మలము,

విశ్వరూపమ్ = సర్వరూపమ్ = సమస్తరూపములుగల, అపివా = అథవా లేక - ఉపమార్థేస్యాత్, సుకింశుకమ్ శల్మలిమ్ - అనునవి ఉపమార్థమున ప్రయుక్తములు, కింశుకమ్ = ప్రకాశనార్థక 'క్రంశ'ధాతువునకు ఉకప్ ప్రత్యయముచేసిన కింశుక శబ్దము సిద్ధమగును. శల్మలిః పదమెట్లు? సుశరో భవతి = సులభముగా నది ఖండింపబడును. 'శౄ హింసాయామ్' ధాతుసిద్ధము. శరవాన్ వా = లేక కంటకములుకలది, హే సూర్యే! = ఓ సూర్యా! ఆరోహ = ఎక్కుము - ఆరూఢవగుము, స్యోనమ్ - సుఖదమ్ = సుఖకరము, వహతుమ్ = వివాహమును కృణుష్వ - కురు=చేయుము.

సవితా ఆది బ్రాహ్మణవచనమునకర్థము. సవితా = సూర్యుడు. సోమాయ రాజ్ఞే = నక్షత్రములకు రాజైనచంద్రునికొఱకు, లేక - ప్రజాపతయే=అంతరిక్షముకొఱకు, సూర్యామ్ ప్రాయచ్ఛత్=సూర్యను ఇచ్చెను, ఇట సూర్యాశబ్దమునకు సుషుమ్నారశ్మి యర్థము. సూర్యప్రభ = ఉషస్సు కావున సూర్యా అనబడును. సూర్యరశ్మి ఉషస్సు అంతరిక్షమును ప్రకాశింపజేయును. సూర్యరశ్మియే సోమునిచంద్రుని ప్రకాశింపజేయును.

వృషాకపాయీ - (౪)

> వృషాకపాయీ వృషాకపేః పత్న్యేషైవాభిసృష్టకాలతమా. తస్యాఏషాభవతి వృషాకపాయిరేవతి సుపుత్ర ఆదుసుస్నుషే ఘసత్త ఇన్ద్ర ఉక్షణః ప్రియం కాచిత్కరం హావిర్విశ్వస్మా దింద్ర ఉత్తరః" (ఋ. ౧౦.౮౬-౧౩)
>
> వృషాకపాయి రేవతి సుపుత్రే మధ్యమేన సుస్నుషే మాధ్య మికయా వాచా. స్నుషా సాధుసాదినీతి వా, సాధు సానినీతి వా, స్వపత్యం తత్ సనోతీతి వా.
>
> ప్రాశ్నాతు త ఇంద్ర ఉక్షణ ఏతాన్మాధ్యమికాన్ సంస్త్యా యాన్. ఉక్షణ ఉక్షతేర్వృద్ధికర్మణః, ఉక్షన్త్యుదకేనేతి వా, ప్రియం కురుష్వ సుఖాచయకరం హావిః సుఖకరం హావిః సర్వస్మాత్ య ఇంద్ర ఉత్తరస్తమేతత్ బ్రూమ ఆదిత్యమ్.

వృషాకపిః - ఆదిత్యః తస్య తద్విభూతిరిత్యర్థః. సూర్యోదయకాలం ప్రతి గతతమా ఏషా సూర్యా ఏవ అవశ్యాయకణానాం వర్షణాత్ కంపనాచ్చ వృషాయీ భవతి. తస్యా ఏషా - "వృషాకపాయి ... ఉత్తరః" ఇంద్ర స్యార్షమ్. హే రేవతి! ధనవతి! సుపుత్రే! సహస్థానసామాన్యాత్ మధ్య మేన ఇంద్రేణ పుత్రవతి! మాధ్యమికయా వాచా చ సుస్నుషే! శోభన స్నుషావతి! వృషాకపాయి! తే ఇంద్రః ఏతాన్ ఉక్షణః, అవశ్యాయ సంస్త్యాయాన్ ఘసత్-ప్రాశ్నాతు. కాచిత్కరం - సుఖాచాయనకరం హవిః - ఉపకమ్ ప్రియమ్ - ఇష్టమ్. విశ్వస్మాత్ - సర్వస్మాత్ ఇంద్ర, ఉత్తరః. అథైకపదం - ఉక్షణః కస్మాత్? వృష్ట్యర్థాత్ ఉక్షతేః. స్నుషా కస్మాత్? సాధుసీదతి - అంగభావముపైతి ఇతి స్నుషా అథవా సాధు - సనోతి, సంతానం సంఘటతి అథవా సు - అపత్యం తత్ శ్వశురస్య సంభవతీతి వా.

అర్థము :- వృషాకపాయీ = ఈమె, వృషాకపేః = సూర్యుని, పత్నీ = పత్నియైయున్నది, అభిసృష్టకాలతమా = అధికసమయముగడచిన మీదట యీ సూర్యయే, వృషాకపాయీ = వృషాకపాయి యగుచున్నది.

ఆ వృషాకపాయికి సంబంధించిన ఋక్కు.

మంత్రార్థము :- రేవతి! హే ధనవతి! సుపుత్రే! = ఉత్తమ పుత్రులుకలదానా! సుస్నుషే! = ఉత్తమ స్నుష కలదానా! వృషా కపాయి సూర్యపత్నీ! తే = నీ, ఉక్షణః ఇంద్రః అవశ్యాయకణములను, ఆదిత్యుడు ఘసత్ = భక్షించునుగాక!, హే వృషాకపాయీ! నీవు, ప్రియం = ప్రియమైన, కాచిత్కరం = సుఖకారకమగు, హవిః = సోమ రూపహవిస్సును - మంచురూపహవిస్సును నిర్మింపుము - ఏలయన - ఇంద్రః = విశ్వస్మాత్ - ఉత్తరః = సమస్తముకంటె ఉత్కృష్టుడైన ఇంద్రః = సూర్యుడు, అతని భక్షణకొఱకు - సూర్యుడు భక్షించుటకు హరించుటకొఱకు మంచును సృష్టింపుమనిభావము.

భావార్థము :- వృషాకపాయి! ఓ వృషాకపాయీ! హే రేవతి! ఓ ధనవతి! సుపుత్రే! ఉత్తమపుత్రవతీ! మధ్యమేన-(రసమునుహరించు వాడగుటవలనను, సమానస్థానముగలవాడగుటచేతను, మధ్యమః=మధ్య స్థానీయు, ఇంద్రః - సూర్యునితో పుత్రుడు) సుస్నుషే! = ఓ శోభనస్నుషా

(కోడలు) కలదానా! మాధ్యమికయా వాచా = మాధ్యమికవాణి వాక్కు స్నుషా = కోడలు - పుత్రవధువు - (ఓ మాధ్యమిక వాగ్రూపమగు పుత్రవధువు - కోడలుకలదానా!) స్నుషా = కోడలు, స్నుషా = సాధుసాదినీ - ఇతి, సాధు = బాగుగ కులమునకు అంగభూతమై యుండును. కావున పుత్రవధువు - కోడలు స్నుషా యనబడుచున్నది. సాధుసానినీ ఇతి వా = లేక యీ పుత్రవధువు - కోడలు, ఇంటియందలి వస్తువులన్నింటిని బాగుగ విభజించి యుంచుచుండును కావున స్నుషా యనబడును. స్వపత్యం తత్ సనోతీతి వా = లేక, సు + అపత్యం = స్వపత్యం=మంచిసంతానము, ఆమంచి 'సు'సంతానమును, సనోతి = ఇచ్చును - కావున స్నుషా యన బడును. సూయతే ఇతి సుః. ఘసత్ తే ఇంద్రః ప్రాహ్ణాతు తే ఇంద్రః = ఇంద్రుడు - సూర్యుడు, తే = నిన్ను, ఘసత్ = తినివేయును, ఉక్షణః - ఏతాన్ మాధ్యమికాన్ - సంస్త్యాయాన్=ఈ మంచుకణములను, ఉక్షణః - వ్యుత్పత్తి - వృద్ధ్యర్థక 'ఉక్ష'ధాతువుతో ఉక్షణః పదము సిద్ధించును. మంచుకణములు ఓషధులను వర్ధిల్లజేయును - పెంచును - ఉక్షన్తి ఉదకేన వా = లేక మంచుకణములు జలముతో ఓషధులను తడుపును - కావునను ఉక్షణః - అనబడును. ప్రియం కాచిత్ కరం - ప్రియం కురుష్వ = ప్రియమైనదాని, కాచిత్కరం = సుఖకరము సుఖాచయ కరం = సుఖయుక్తమైనదానిని, కం - ఇతి - సుఖనామ, కం పదము సుఖవాచకము, తస్య అచితం - ఆచయనం కరోతి ఇతి కాచిత్కరం = ఈ సుఖమునుకలిగించునదెవరు? హవిః = హవిస్సు = జలరూపహవిస్సు, మంచుజలము-హవిస్సు ఓషధులవృద్ధికొఱకు నీవు మంచును కురియుము అని భావము, విశ్వస్మాత్ - సర్వస్మాత్ = సమస్తము = అన్నింటికంటె, ఇంద్రః = ఇంద్రుడు - సూర్యుడు, ఉత్తరః = శ్రేష్ఠుడు, తం-ఆదిత్యం= ఆ సూర్యునిగూర్చి, ఏతద్ బ్రూమః = మేమిదిచెప్పెదుము.

సరణ్యూః - (౫)

సరణ్యూః సరణాత్. తస్యా ఏషా భవతి - "అపాగూహన్న మృతాం మర్త్యేభ్యః కృత్వీ సవర్ణామదదుర్వివస్వతే. ఉతా

శ్వినావభరత్ యత్తదాసీదజహాదు ద్వా మిథునా సరణ్యూః
(ఋ ౧౦-౧౭-౨)

అవ్యగూహన్నమృతాం మర్త్యేభ్యః కృత్వీ సవర్ణామదదుర్వివస్వత్యేప్యశ్వినావభరద్ యత్తదాసీదజహాద్ ద్వౌ మిథునౌ సరణ్యూర్మధ్యమంచ మాధ్యమికాం చ వాచమితి నైరుక్తాః. యమం చ యమీం చేత్యైతిహాసికాః

తత్రేతిహాసమాచక్షతే - త్వాష్ట్రీ సరణ్యూర్వివస్వత ఆదిత్యాద్ యమౌ మిథునౌ జనయాంచకార, సా సవర్ణామన్యాం ప్రతినిధాయ అశ్వం రూపం కృత్వా ప్రదుద్రావ, స వివస్వా నాదిత్య ఆశ్వమేవ రూపం కృత్వా తామనుసృత్య సంబభూవ. తతో ఽశ్వినౌ జజ్ఞాతే సవర్ణాయాం మనుః. తదభివాదిన్యేషర్గ్ భవతి-

సైవ యదా సూర్యం ప్రతి అవిభాగేన సృతా - ప్రసృతా భవతి తదా సరణ్యూః ఇత్యుచ్యతే తస్యా ఏషా - "అపాగూహన్ ... సరణ్యూః" దేవశ్రవస ఇయమార్షమ్. అమృతామేతాముషసం-వృషాకపాయీ రూపేణ రశ్మయః మర్త్యేభ్యః అపాగూహన్. సవర్ణాం చైనాం కృత్వీ - కృత్వా వివస్వతే - సూర్యాయ అదదుః. అపి చ సా ఉషాః అశ్వినౌ స్తుతిభిః అభరత్ యత్ తత్ రూపమ్ - ఉషసః సరణ్యూ వా ఆసీత్ అజహాత్ - అత్యజత్. ద్వా - ద్వౌ మిథునా - మిథునౌ సరణ్యూః. మధ్యమం మాధ్యమికాం వాచం చేతి నిరుక్తకారాః మన్యన్తే. యమం యమీం చేతి ఐతిహాసికాః. ఏతస్మతేన మంత్రార్థయోజనా - ప్రాణాధిదేవతా భావమాపన్నాః తే రశ్మయః తాం త్వాష్ట్రీం సరణ్యూమశ్వాం కృత్వా భవిష్యద్వ్యపేక్షస్య పశ్యన్తః అమృతాం దేవీమ్ - అపాగూహన్. అన్తర్హితామకుర్వన్. మర్త్యేభ్యః ఉత్తరాన్ కుమారాన్ నిన్యుః. అన్యాం చ ఛాయాప్రభవాం తత్సదృశీం కృత్వా సూర్యాయ అదుః అశ్వారూపేణ సా సరణ్యూః అశ్వినౌ అభరత్-అజనయత్. వివస్వాన్ యమం యమీం చ హిత్వా ననాశ. అత్రేతిహాసః - త్వాష్ట్రీ సరణ్యూః సవర్ణామన్యాం ప్రతినిధాయ అశ్వారూపం చ సమాస్థాయ

ఆదిత్యాత్ ప్రదుద్రావ. వివస్వానాదిత్యోఽపి ఆశ్వం రూపం కృత్వా తామనుసృత్య చ సహ బభూవ. తయోః యమౌ మిథునౌ అశ్వినౌ జాతౌ. సవర్ణాయాం చ వైవస్వతోమనుః। అజాయత సరణ్యూశ్చ సనాశ. యథా నిమ్నస్థయా ఋచా స్పష్టమ్.

అర్థము :- ఈ వృషాకపాయీ సరణాత్ = ఈ వృషాకపాయి సూర్యునివైపు ఎక్కువ వెళ్లునప్పుడు సరణ్యూ అనబడును. ఆసరణ్యూ సంబంధ ఋక్కు-

మంత్రార్థము :- అమృతామ్ = చావులేని వృషాకపాయిని, మర్త్యేభ్యః = మనుష్యులనుండి కిరణములు దాచెను, సవర్ణామ్ = సూర్యునికాంతికి సమానమైనకాంతిగల సరణ్యూను, కృత్వీ = చేసి, వివస్వతే = సూర్యునకు, అదదుః = ఇచ్చెను - సూర్యునకతిసమీపమున చేర్చెను, ఉత - అపిచ = మఱియు, సూర్యునికత్యంతసన్నిహితురాలైన సరణ్యూ, అశ్వినౌ అభరత్ = అశ్వినులనిరువురను - తమోభాగమును, ప్రకాశభాగమును - రెండింటిని తనలో ధారణచేసెను, యత్తదాసీత్ = వృషాకపాయికి గల్గురక్తరూపమును వదలివేసెను, సరణ్యూః = సరణ్యూ, ద్వా మిథునా = ఇరువురిని - తమోభాగము - తదంతర్గతమాధ్యమిక వాక్కును - అను నీరెండింటిని - మిథునమును, అజహాత్ = త్యజించెను-వదలివేసెను.

ఐతిహాసిక పక్షమున-

సరణ్యూ=త్వష్టునిదుహితా=(త్వాష్ట్రీ) పుత్రిక, అమరణధర్మయగు ఆ సరణ్యూని - దేవతలు, మర్త్యేభ్యః = మనుష్యులనుండి, అపాగూహన్ = దాచిరి, సవర్ణామ్ కృత్వీ = సరణ్యూని=సూర్యసమానవర్ణముకలదానినిగా చేసి యామెను, వివస్వతే = సూర్యునకు, అదదుః = ఇచ్చిరి - ఉత = తరువాత, అశ్వినౌ అభరత్ = ఆ సరణ్యూ తనకుగల అశ్వరూపముతో (యత్తదాసీత్) అశ్వినులకు జన్మనిచ్చెను, అజహాత్ ఉ - ద్వా మిథునా = సూర్యునినుండి యమ, యమీ అను నిరువురు జంటపిల్లలను కని - వారిని విడిచి సరణ్యూ వెళ్లిపోయెను.

భావార్థము :- అపాగూహన్ = అపగూహన్ = దాచెను, ఉత అశ్వినౌ అవ్యశ్వినౌ ద్వామిథునా = ద్వామిథునౌ = జనవృత్తిని - జంటను, మర్త్యమంచ మార్త్యమికాంచ వాచమ్ = మర్త్యమును, మరియు మార్త్యమికవాక్కును, ఇతి నైరుక్తాః=అని నైరుక్తులమతము, యమం చ యమీం చ = యముని, యమిని జనవ్రతను ఉత్పన్నముచేసెను అని ఐతిహాసికులు అంగీకరించుచున్నారు.

తత్ర ఇతిహాసమాచక్షతే = ఆ విషయమున నీయితిహాసమును చెప్పుదురు, త్వష్టునికూతురు సరణ్యూ, వివస్వంతుడైన ఆదిత్యునివలన యముడు, యమి, అనుజంటను-కవలలను కనెను. ఆ సరణ్యూ తనవంటి రూపముగల మఱియొక్కతెను తనకు ప్రతినిధిగాచేసి తాను అశ్వరూపము ధరించి. ప్రదుద్రావ = పాఱిపోయెను. అంతట వివస్వంతుడగు నాదిత్యుడును ఆమెను అనుసరించి తానును అశ్వరూపమును ధరించి సంబభూవ= ఉత్పన్నమయ్యెను. ఈ విషయమును వివరించునదియే పైమంత్రము.

త్వష్టా - (౬)

> **"త్వష్టా దుహిత్రే వహతుం కృణోతీతీదం విశ్వం భువనం సమేతి. యమస్య మాతా పర్యుహ్యమానా మహో జాయా వివస్వతో ననాశ" (ఋ. ౧౦-౧౭-౧)**
>
> **త్వష్టా దుహితుర్వహనం కరోతి ఇదం విశ్వం భువనం సమేతీమాని చ సర్వాణి భూతాన్యభిసమాగచ్ఛన్తి యమస్య మాతా పర్యుహ్యమానా మహతో జాయా వివస్వతో ననాశ. రాత్రిరాదిత్యస్యాదిత్యోదయేఽన్తర్ధీయతే.**

"త్వష్టా దుహిత్రే ... ననాశ" - త్వష్టా దేవః విశ్వకర్మా దుహిత్రే - దుహితుః వహతుమ్ - వివాహం కరోతి ఇతి విశ్వం - సమస్తం భువనం సమేతి. యమస్య - మర్త్యమస్య మాతా పర్యుహ్యమానా - పర్యూఢా యమం చ యమీం చ జనయిత్వా మహతః - ఆదిత్యస్య జాయా ననాశ.

మంత్రార్థము :- త్వష్టా దేవః = త్వష్ట - దేవతా దుహిత్రే = తన కుమార్తెను, వహతుం కృణోతి = వివాహమాడెను, ఇదంవిశ్వం భువనం

సమేతి = ఆ వివాహమును చూచుటకు ఈ సమస్తలోకము సమేతి = వచ్చును - ఒకచో చేరును. లోకమునను వివాహసమయమున జనులు ప్రోగగుట సహజమే, పర్యుహ్యమానా = వివాహితయైన యమీయముల తల్లి, మహవివస్వతోజాయా=గొప్పదియగు నావివస్వంతునిభార్య (జాయా) ఆ సూర్యునినుండి, యముని, యమిని కని యాసంతానద్వయమును అక్కడనే యుంచి తాను, ననాశ = స్వయముగా నంతర్హితయయ్యెను - కనబడకుండపోయెను.

ఇతి ప్రథమః పాదః

ప్రథమ పాదము సమాప్తము

## ద్వితీయ పాదము

సవితా - (౭)

సవితా వ్యాఖ్యాతః.

తస్య కాలో యదా ద్యౌరపహతతమస్కాకీర్ణరశ్మిర్ భవతి. తస్యైషా భవతి - "విశ్వా రూపాణి ప్రతిముంచతే కవిః ప్రాసావీద్భద్రం ద్విపదే చతుష్పదే. వినాకమఖ్యత్ సవితా వరేణ్యోఽను ప్రయాణముషసో విరాజతి" (ఋ. ౫-౮౧-౨) సర్వాణి ప్రజ్ఞానాని ప్రతిముంచతే. మేధావీ కవిః క్రాన్త దర్శనో భవతి కవతేర్వా. ప్రసువతి భద్రం ద్విపాద్భ్యశ్చ చతుష్పాద్భ్యశ్చ వ్యచిఖ్యపన్నాకం సవితా వరణీయః ప్రయాణమనూషసో విరాజతి. "అధోరామః సావిత్రః" ఇతి పశుసమామ్నాయే విజ్ఞాయతే. కస్మాత్ సామాన్యాదిత్య ధస్తాత్తత్ వేలాయాం తమో భవత్యేతస్మాత్ సామాన్యా దధస్తాద్రామోఽధస్తాత్. కృష్ణః కస్మాత్? సామాన్యా దిత్యగ్నిం చిత్వా న రామాముపేయాత్ రామారమణాయో

**పేయతే న ధర్మాయ కృష్ణజాతీయైతస్మాత్ సామాన్యాత్.**
**కృకవాకుః సావిత్రః ఇతి పశుసమామ్నాయే విజ్ఞాయతే,**
**కస్మాత్ సామాన్యాదితి కాలానువాదం పరీత్య. కృకవాకోః**
**పూర్వం శబ్దానుకరణం వచేరుత్తరమ్.**

పూర్వం వ్యాఖ్యాతః. ఇహ సవితా ఆదిత్యాపరపర్యాయః. యస్మిన్ కాలే కేవలం ద్యౌరేవ అపగతాంధకారా భవతి న మహీ ఆకీర్ణాశ్చ రశ్మయో యస్యాముదృశ్యో భవతి స ఏవ సవితుః కాలః. తదానీంతన ఆదిత్య ఏవ సవితా భవతి. తస్యైషా - "విశ్వారూపాణి ... విరాజతి" శ్యావాశ్వస్యార్షమ్. విశ్వా - విశ్వాని - సర్వాణీత్యర్థః రూపాణి ప్రతిముంచతే - ఆ బధ్నాతి. కవిః - క్రాన్తదర్శనః ద్విపదే - ద్విపాద్భ్యః చతుష్పదే - చతుష్పాద్భ్యః భద్రం ప్రాసావీత్ జనయతి. వి నాకమ్ అఖ్యత్ - విఖ్యాపయతి - విదర్శయతి. అయం వరేణ్యః సవితా ఉషసః అనుప్రయాణమ్ విరాజతి - ప్రకాశతే వినాకమఖ్యత్ ఇతి సవితుః కాలోపలక్షణకం మంత్రలింగం తత్పశుగుణసాజాత్యేన సమర్థయన్ కథయతి అధోరామః సావిత్ర ఇతి - కస్మాత్? యతః తద్వేలాయామ్ అధస్తాత్ తమో భవతి ఉపరిష్టాచ్చ జ్యోతిః. శుక్లం తదా దివి భవతి కీర్ణరశ్మిత్వాత్తస్యాః అధస్తాత్తు భూమ్యాం తదా తమో భవతి. ఏతస్మాత్ కాలదేవతా - గుణసామాన్యాత్ సావిత్రః పశురపి తథా రూప ఏవ భవతి. అధోరామః - అధః కృష్ణః కేన సామాన్యేన పునః రామః కృష్ణః ఇత్యుచ్యతే? కథయతి విజ్ఞాయతే హి - అగ్నిం చిత్వా న రామాముపేయాత్" రామా పునః శూద్రా సా హి రమణాయైవ ఉపేయతే న ధర్మాయ. కృష్ణజాతీయా ఇత్యేకార్థౌ శబ్దౌ అధునా ఉత్పృజ్య రామాం స్త్రియం ప్రవీణాదిశబ్దవత్ పశావయం రామాశబ్దో వృత్తః కృష్ణత్వ సామాన్యమాత్రేణ.

పశుసమామ్నాయే సావిత్రః పశుః కృకవాకుః ఇతి విజ్ఞాయతే. యతః కృకవాకుః - కుక్కుటః సవితుః కాలం పరీత్య - పరిజ్ఞాయ ఆసౌ వక్తీతి అనేన సామాన్యేన కృకవాకుః కస్మాత్? కృకః ఇతి శబ్దస్య కరణాత్మకం పూర్వం పదమ్ వచేరుత్తరం వాకురితి

అర్థము :- సవితా - పదవ్యాఖ్యాపూర్వముచేయబడినది. ఇట సవితా పదము ఉదయమునకు పూర్వపుటాదిత్యునకు నామము - వాచకము. ద్యులోకములపహతతమస్కా = అంధకారరహితమైన సమయము సవిత యొక్క సమయము. అప్పుడింకను భూమిపై అంధకారముండును, ఆకీర్ణరశ్మిః భవతి = మఱియునప్పుడు ద్యులోకమున ఆదిత్యునికిరణములు వికీర్ణములై వ్యాపించియుండును అప్పుడు ఆదిత్యుడు సవితా అనబడును. ఆ సవితకు సంబంధించిన ఋక్కు.

మంత్రార్థము :- కవిః = మేధాశక్తిని పెంచువాడు-లేక నిత్యగమన శీలుడు నగు ఈ సవిత, విశ్వారూపాణి = సమస్తప్రజ్ఞానములను, ప్రతిముంచతే = ప్రతిముక్తముచేయుచున్నాడు - అంధకారముచే అపిహిత - కావున కనబడని పదార్థస్వరూపములందు జ్ఞానమును ప్రసరింపచేయుచున్నాడు, ద్విపాత్తులు - చతుష్పాత్తులు = రెండుకాళ్లు, నాలుగుకాళ్లుగల ప్రాణులకు - ఎల్లప్రాణులకు, భద్రమ్ = తమతమ కర్తవ్యకర్మల నొనర్చుటకు, ప్రాసావీత = ఆజ్ఞలనిచ్చుచున్నాడు, వరేణ్యః = అందఱిచే వరింపదగిన, యా సవిత - సవితారూపాదిత్యుడు, నాకమ్=ద్యులోకమును, వ్యఖ్యత్ = ప్రకాశితమొనర్చుచున్నాడు, ఉషసః = ఉషస్సుయొక్క, అనుప్రయాణమ్ = అనుప్రయాణానంతరము. విరాజతి=విశేషరూపమున దీప్తిమంతుడగును.

భాష్యార్థము :- విశ్వారూపాణి సర్వాణి ప్రజ్ఞానాని=సమస్తజ్ఞానములను, ప్రతిముంచతే = ప్రతిముక్తముచేయుచున్నాడు, కవిః = మేధావీ - మేధావంతుడు బుద్ధులను పెంపుచేయువాడు, కవిః క్రాంతదర్శనః భవతి= కవియని యెలచెప్పబడునన :- ఆతనిదర్శనము సర్వపదార్థములను క్రమణామొనర్చి = ఆక్రాంతమొనర్చియుండును. అతనికి ప్రతిపదార్థస్వరూపము తెలియబడుచుండును. ఆతనికి తెలియని పదార్థస్వరూపమేదియునుండదు, కవతేర్వా = లేక యతడు నిత్యగతిశీలుడై యుండును, ప్రసావీత్ - ప్రసువతి అభ్యనుజానాతి = ప్రేరితమొనర్చును, ఎల్లరను తమతమకార్యములందు లగ్నులుకండు' అని బోధించుచున్నాడాయన్నట్లుండును. పశుసమామ్నాయే పశువిధానార్థః సమామ్నాయః పశుసమామ్నాయః తత్ర - అనగా - పశువుల ప్రకరణమున - "అథోహామం సావిత్ర

మారిషేత్" ఇట్లు బ్రాహ్మణమున చెప్పబడినవి. దీనినే గ్రహించి యాస్క
ముని చెప్పుచున్నాడు - 'అధోరామః సావిత్రః ఇతి విజ్ఞాయతే'=అధోరాముని
సావిత్రమనుచున్నారు. అధోరామమనునొకపక్షి కలదు. దానిని ఖంజనము
అందురు. (హిందీలో) కస్మాత్? సామాన్యాత్ ఇతి - ఏ సామాన్యమును
గ్రహించి ఖంజనమును అధోరామమందురు? తద్వేలాయామ్=ఆ సమయ
మున, అధస్తాత్ =క్రిందభూమిపై చీకటియుండును (తమోభవతి) ఈ
ఖంజనపక్షి క్రిందిభాగము కాళ్లు నల్లగానుండును. పైశరీరము తెల్లగా
నుండును, ఏతస్మాత్ సామాన్యాత్ = ఈ సమానత గ్రహించియే, అధస్తాత్
రామః-అధస్తాత్ కృష్ణః అధోరామః=ఈ పక్షి క్రిందిభాగము రామ-కృష్ణము-
నలుపు కలిగియుండును. రామశబ్దమునకర్థము నలుపు - కావున ఖంజన
పక్షి అధోరామమనబడును. రామః - కృష్ణః కస్మాత్ సామాన్యాత్?
ఏ సమానతకారణముగ రామశబ్దమునకు కృష్ణమనియర్థము చెప్పుచున్నారు?
అను సమాధానము అగ్నిం చిత్వా న రామాముపేయాత్' అగ్నిచయనముచేసి
రామాం = శూద్రస్త్రీతో న - సంగమముచేయరాదు. అని శాస్త్రప్రమాణ
మున్నది. శూద్రస్త్రీని రామాయని యేలయందురనగా-శూద్రస్త్రీ రమణాయ=
విషయభోగముకొఱకు సమీపమునకువచ్చును. స్త్రీ ధర్మకర్మకొఱకు రాదు.
కావున స్త్రీకి రామాయనిపేరు కలిగినది. (ఇట రామాయన శూద్రాస్త్రీ యని
భాష్యకారుడు వ్రాసియున్నాడు. కాని రామాయన స్త్రీయనియే యర్థము
స్త్రీ పురుషుని రమింపజేయును. కావున రామాయనబడును. శూద్రస్త్రీయే
రమింపజేయునా? అన్యస్త్రీ రమింపజేయదా?)

రామా యన కృష్ణా యని యర్థము. రామ, కృష్ణశబ్దములు పర్యాయ
వాచకములు. ఖంజనపక్షి క్రింద నలుపు పైశరీరము తెలుపు కలిగి
యుండును. ఈ సామ్యముతోనే సావిత్రకాలమున క్రిందభూమిపై అంధ
కారము ఉండును. పైన ద్యులోకమున ప్రకాశముండును. తెల్లవారుచున్న
సమయము సావిత్రకాలము. కావున సావిత్రకాలము సవితకు సంబం
ధించినకాలము అధోరామ మనబడినది. ఖంజన సావిత్రకాలము అను
నిరెండింటియందును క్రింద నలుపు పైనతెలుపు కలిగియుండుట
సామ్యము. కృకవాకోః పూర్వం శబ్దానుకరణమ్ = కృకవాకుశబ్దమున
మొదటి 'కృక'అనుపదము శబ్దానుకరణము. (కోడిపుంజు-కృక-కృక అని

శబ్దించును), పచేరుత్తరమ్ = ఉత్తరపదము 'వాక' వచధాతుప్రసిద్ధము. కృక, కృక ఇతి వక్తీతి కృకవాకుః ఇందు'కృక', ముందు వాకపదము తరువాతను ఉన్నవి.

భగః - (౮)

> భగో వ్యాఖ్యాతః. తస్య కాలః ప్రాగుత్సర్పణాత్. తస్యైషా భవతి – ప్రాతర్జితం భగముగ్రం హువేమ వయం పుత్ర మదితేర్యో విధర్తా. ఆధ్రశ్చిద్యం మన్యమానస్తురశ్చిద్ రాజా చిద్యం భగం భక్షీత్యాహ" (ఋ. ౭-౪౧-౨)
>
> ప్రాతర్జితం భగముగ్రం హ్వాయేమ వయం పుత్రమదితేర్యో విధారయితః సర్వస్యాధ్రశ్చిద్యం మన్యమాన ఆఢ్యాలుర్దరిద్ర స్తురశ్చిత్. తుర ఇతి యమనామ తరతేర్వా త్వరతేర్వా త్వరయా తూర్ణగతిర్ యమో రాజా చిద్యం భగం భక్షీత్యాహ. అంధో భగ ఇత్యాహురనుత్సృప్తో న దృశ్యతే. 'ప్రాశిత్రమస్యాక్షిణీ నిర్జఘానేతి" చ బ్రాహ్మణమ్. 'జనం భగో గచ్ఛతీతి' వా విజ్ఞాయతే జనం గచ్ఛత్యాదిత్య ఉదయేన.

భగో వ్యాఖ్యాతః తస్య కాలః ఉత్సర్పణాత్ తస్మాత్ సావిత్ర్యాత్ కాలాత్ పరతః ఏతదుత్తమమ్ జ్యోతిః భగాఖ్యమ్. తస్యైషా. ప్రాతర్జితమ... భక్షీత్యాహ" వసిష్ఠస్యార్షమ్. ప్రాతర్జితమ్ - ప్రాతః తమసాం జేతారమ్, ఉగ్రమ్ - ఉద్గూర్ణమ్, అదితేః పుత్రమ్ భగమ్ - ఆదిత్యమ్ వయం హువేమ - ఆహ్వయామహే. స్వేనానుగ్రహేణ సమస్తస్య సంసారస్య విధర్తా విధారయితా, ఆధ్రశ్చిద్యం మన్యమానః - ఆఢ్యానాం స్పృహయాలుః దరిద్రః యమ్ అహన్యహని పూజయతి తురః - యమః చిత్ - అపి భగం భక్షి ఇత్యాహ. భగః అంధః ఇత్యాహుః కస్మాత్? ఉచ్యతే సూర్యభావమనుత్సృప్తః సః న దృశ్యతే నాస్మిన్ ద్రష్టౄణాం ధ్యానం వర్ణనము స్థిత్యంధః. తథా చ బ్రాహ్మణమ్ - "ప్రాశిత్రమస్యాక్షిణీ నిర్జఘానేతి".

అర్థము :- భగ - భగః వ్యాఖ్య పూర్వము (౩-౧౬ లో) చేయబడినది కాని ఇట భగః అన ఆదిత్యుడు, తస్య = భగసంజ్ఞకల ఆదిత్యునికాలము - సమయము - ప్రాగుత్సర్పణాత్ = ఉదయబింబదర్శనమునకు పూర్వ సమయము. ఆ భగసంబంధ ఋఙ్మంత్రము.

అర్థము :- వయమ్ = మేము, ప్రాతర్జితమ్ = ప్రాతః అంధకారమును జయించిన, ఉగ్రమ్ = ఉదయించుటకుద్యుక్తుడైన, అదితేః పుత్రమ్ = దేవమాత, లేక ప్రాతఃకాలపుసంధ్య యొక్క - అదితియొక్క, పుత్రం = పుత్రుడైన, భగం = భగసంజ్ఞకల, ఆదిత్యమ్ = ఆదిత్యుని, హువేమ = పిలుచుచున్నాము, యః భగః = ఆ యాదిత్యుడు, విధర్తా = 'జగత్తుల' ధారయితా = ధరించువాడు, ఆధ్రశ్చిత్ = మరియు దరిద్రుడుకూడ, యమ్ = ఏ భగుని, మన్యమానః = కోరుచున్నవాడై, (సూర్యోదయమైన తదుపరి బిచ్చమెత్తుకొన దరిద్రుడు బయలుదేరును కదా) మరియు - తురశ్చిత్ = త్వరితగతికల యమరాజుకూడ ఎవనిని గోరుచు, యమ్ భగమ్ = ఏ భగుని - భగనామక ఆదిత్యుని, భక్షి = ఉదయమును సేవింపుము అని చెప్పునో, అనగా, భగనామక ఆదిత్యుని ఉదయమును, దరిద్రుడు, యముడు, రాజు, అనువారందరు ప్రార్థింతురో యా ఆదిత్యుని మేము పిలుచుచున్నాము.

భావార్థము :- విధర్తా = విధారయితా సర్వస్య = సమస్తజగత్తును ధరించువాడు, ఆధ్రః చిత్ = చిత్పదము చ = కూడ అను అర్థమున ప్రయుక్తము, యమ్ మన్యమానః = ఎవని ఉదయము నాకాంక్షించుచు, ఆధ్రః = అనగా ఆఢ్యాః దరిద్రః = అఢ్యులను - ధనవంతుల నాకాంక్షించువాడు - దరిద్రుడు, తురశ్చిత్ = తురః ఇతి యమనామ = తుర శబ్దము యమునివాచకము, తురశబ్దము తరతేర్వా త్వరతేర్వా, 'తౄ' ధాతువు, లేక 'ఞిత్వరా' ధాతువుయొక్క సంప్రసారణరూప 'తుర' ధాతువుచే సిద్ధమగును. పిలియన త్వరయా = శీఘ్రతకారణముగ, దూష్ణ గతిః యమః = త్వరితగతికల యముడు, రాజాచిద్ = రాజుకూడ, యమ్ = ఏ భగుని, భక్షి ఇతి ఆహ = ఉదయమును సేవింపుము అని యనునో.

సూర్యః - (౯)

సరతేర్వా సువతేర్వా. తస్యైషా భవతి – "ఉదు త్యం జాతవేదసం దేవం వహన్తి కేతవః. దృశే విశ్వాయ సూర్యమ్" (ఋ. ౧-౫౦-౧) ఉద్వహన్తి తం జాతవేదసం రశ్మయః కేతవః సర్వేషాం భూతానాం దర్శనాయ సూర్యమితి కమన్యమాదిత్యాదేవ మవక్ష్యత్. తస్యైషాఽపరా భవతి–

"చిత్రం దేవానాముదగాదనీకం చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః ఆప్రా ద్యావాపృథివీ అంతరిక్షం సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ" (ఋ. ౧-౧౧౫-౧, యజు. ౭-౪౨)

చాయనీయం దేవానాముదగాదనీకం ఖ్యానం మిత్రస్య వరుణస్యాగ్నేశ్చాపూపురద్ ద్యావాపృథివ్యౌ చాంతరిక్షం చ మహత్త్వేన తేన సూర్య ఆత్మా జంగమస్య స్థావరస్య చ.

భగ - కాలాత్ పృథక్ అయం సూర్యః. సర్తేః సాధ్యః. ప్రసవార్థాత్ సువతేర్వా యతః సూర్యః సర్వమిదం ప్రసువతి - జనయతి. సుపూర్వాత్ ఈరయతేర్వా. వాయునా హ్యయం సుష్ఠు ఈర్యతే - ప్రేర్యతే తస్మాత్ సూర్యః. తస్యైషా - "ఉదుత్యం ... సూర్యమ్" ప్రస్కణ్వస్యార్షమ్. కేతవః - రశ్మయః అశ్వా వా త్యం జాతవేదసం - తం సూర్యమ్ విశ్వాయ దృశే - సమస్తానాం భూతానాం దర్శనాయ ఉద్వహన్తి. కోఽన్య ఆదిత్యా దేవం వక్తుం పార్యతే.

తస్యాపరా ఏషా - "చిత్రం ... తస్థుషశ్చ" కుత్సస్యార్షమ్. చిత్రం - చాయనీయం పూజ్యమిత్యర్థః, దేవానామ్ - రశ్మీనామ్ అనీకమ్ - సమూహః అపిచ మిత్రస్య, వరుణస్య అగ్నేశ్చ చక్షుః - ఖ్యానమ్ సూర్యః ఉదగాత్ - ఉదితోఽభవత్. జంగమస్య తస్థుషః - స్థావరస్య చ ఆత్మా ఏషః సూర్యః ద్యావాపృథివీ అంతరికం చ ఆప్రాః అపూపురత్.

అర్థము :— సూర్యః = ఉదయకాలీన ఆదిత్యుని సూర్యుడందురు సర్తేర్వా = ఈ సూర్యశబ్దము గత్యర్థక 'సృ'ధాతుసిద్ధము, సువతేర్వా-లేక

ప్రేరణార్థక 'షూ' ధాతుసిద్ధము. స్వీర్యతేర్వా - లేక సుపూర్వక గత్యర్థక 'ఈర' ధాతుసిద్ధము, సరతి అంతరిక్షే ఇతి సూర్యః, సువతి కర్మాణి లోకం ప్రేరయతి ఇతి సూర్యః - స్వీర్యతే ప్రేర్యతే వాయునేతి వా సూర్యః = ఈ సూర్యుడు అంతరిక్షమున గమనించును, లోకులను తమ తమ కర్మ లందు లగ్నముచేయును, వాయుప్రభావమున నితడు భూలోకమును గూర్చి ప్రేరితుడగుచున్నాడు, అట్టి సూర్యునివిషయమునగల ఋగర్థము.

మంత్రార్థము :— త్యం జాతవేదసం దేవం సూర్యమ్ = ఆ సమస్త పదార్థముల స్వరూపప్రకాశకుడు, ప్రకాశశీలుడునగు సూర్యుని, విశ్వాయ దృశే = సర్వదర్శనార్థము, కేతవః ఉద్వహన్తి = కిరణములు పైకెత్తుకొని పోవుచున్నవి - ఉదితుని చేయుచున్నవి.

భాష్యార్థము :— త్యమ్ - తమ్ = ఆతనిని కేతవః రశ్మయః = కిరణములు, విశ్వాయ సర్వేషాం భూతానాం = సర్వప్రాణులయొక్క, దృశే = దర్శనాయ = దర్శనముకొఱకు, కం అన్యం ఆదిత్యాత్=సూర్యుని కాక మఱియెవరిని - ఏ దేవునిగూర్చి, ఏవం అవక్ష్యత్ = ఇట్లు చెప్ప బడగలదు ?

ఆ సూర్యునికి సంబంధించిన మఱియొక ఋక్కు.

మంత్రార్థము :- దేవానాం = కిరణములయొక్క, అనీకం = పుంజము సముదాయము, చిత్రం = అనేకరూపములుగలదగుటచే, దర్శ నీయము, పూజనీయము, మిత్రస్య వరుణస్య అగ్నేశ్చ = మిత్రవరుణాగ్ను లకు, పూజనీయము మిత్రాదిపదములు ఉపలక్షణార్థకములు వాస్తవమున దేవతలు, మనుష్యులు, అన్యసమస్తప్రాణులు అను నిసర్వమునకు సూర్యుడు, చక్షుః = ప్రకాశకుడు, ఉదగాత్ = ఉదయించెను, సూర్యుని ఉదయమువలననే, ద్యావాపృథివీలోకములందును, అంతరిక్షం చ = అంత రిక్షమునందును, ఆప్రా = ప్రకాశమునిండెను - అనుప్రవిష్టుడయ్యెను, ఈ సూర్యుడు, జగతః తస్థుషః చ ఆత్మా = జంగమ, స్థావరపదార్థములు కన్నింటికి ఆత్మవంటివాడు.

భాష్యార్థము :— చిత్రం-చాయనీయం పూజనీయము, దర్శనీయము, ఉదగాత్ - ఉదగమత్ = పైకివచ్చెను ఉదయించెను. చక్షుః - ఖ్యాపకమ్=

ప్రకాశకము - ఆప్రా = అపూపురత్ = నింపెను - అనుప్రవిష్టమయ్యెను. మహిత్వేన = తనమహత్త్వముతో, ద్యావాపృథివీ - ద్యావాపృథివ్యౌ = ద్యుపృథివీలోకములు, అంతరిక్షము, తేన = కావున, సూర్యః=సూర్యుడు, జగతః తస్థుషః = జంగమస్థావరములకు - చరాచరజగత్తునకు.

పూషా - (౧౦)

> అథ యద్రశ్మిపోషం పుష్యతి తత్ పూషా భవతి. తస్యైషా భవతి - శుక్రం తే అన్యద్ యజతం తే అన్యద్ విషురూపే అహనీ ద్యౌరివాసి. విశ్వా హి మాయా అవాసి స్వధావో భద్రా తే పూషన్నిహ రాతిరస్తు" (ఋ. ౬-౫౮-౧)
>
> శుక్రం తే అన్యల్లోహితం తే అన్యత్ యజతం తే అన్యత్ యజ్ఞియం తే అన్యద్ విషమరూపే తే అహనీ కర్మ ద్యౌరివ చాసి. సర్వాణి ప్రజ్ఞానాన్యవస్యన్నవన్ భాజనవతీ తే పూషన్నిహ దత్తిరస్తు. తస్యైషా అపరా భవతి-
>
> "పథస్పథః పరిపతిం వచస్యా కామేన కృతో అభ్యాన డర్కమ్. సనో రాసచ్ఛురుధశ్చం ద్రాగ్రా ధియం ధియం సీషధాతి ప్రపూషా" (ఋ. ౬-౪౯-౮)
>
> పథస్పథోఽధిపతింవచనేన కామేన కృతోఽభ్యానడర్కమభ్యాపన్నోఽర్కమితి వా స నో దదాతు చాయనీయాగ్రాణి ధనాని కర్మ కర్మ చ నః ప్రసాధయతు పూషేతి.

అథ యత్ - యదా సూర్యః రశ్మిపోషం పుష్యతి - తేజసా పూర్ణః రశ్మీన్ బిభర్తి తదా పూషేత్యుచ్యతే. తస్యైషా - "శుక్రం తమ...రాతిరస్తు" భరద్వాజస్యార్షమ్. హే పూషన్! తే - తవ శుక్రం - శుక్లం లోహితం చ అన్యత్ యజతమ్ - యజ్ఞార్హం చాన్యత్. అపి చ విషురూపే - భవతః శుక్ల కృష్ణరూపే అహనీ - అహోరాత్రే. త్వం ద్యౌరివాసి విశ్వాః మాయాః - సర్వాః ప్రజ్ఞాః అవసి. రక్షసి, స్వధావః అన్నవన్. హే పూషన్! తే - తవ రాతిః - దానమ్ భద్రా స్తుత్యర్హా.

అర్థము :- అథ = తదుపరి ఆదిత్యుని ఏ రూపము, రశ్మిపోషం పుష్యతి = కిరణములతో సమస్తమును పుష్టమొనర్చునో, తత్ పూషా = అందువలన పూషా అనబడుచున్నాడు.

ఆ పూషా సంబంధ ఋక్.

మంత్రార్థము :- హే పూషన్ = ఓ పూషా!, తే = నీయొక్క, అన్యత్ = ఒక, శుక్రమ్ = లోహితామ్ = రూపములోహితము, తే అన్యత్ యజతమ్ = నీ మఱియొకరూపము యజ్ఞార్హము, విషురూపే తే=నీయొక్క పరస్పరభిన్నములైన శుక్లకృష్ణరూపములు - విషమరూపములు, అహనీ = పగలు, రాత్రి రూపములు - ఇవి నీ కర్మలు, ద్యౌః ఇవ అసి = ద్యులోకమువలె ఉన్నావు - ద్యులోకము సమస్తమును వ్యాపించియున్నట్లు నీవు సంతతవ్యాపకుడవై యున్నావు, విశ్వాఃమాయా అవసి = హే పూషన్! నీవు ప్రజ్ఞావంతుల ప్రజ్ఞలన్నింటిని రక్షించుచున్నావు. నీవు సర్వపదార్థముల జ్ఞానము కలిగించుదువు, స్వధావః హే అన్నవన్!=ఓ యన్నవంతుడా!, తే = నీయొక్క, భద్రారాతిః = కల్యాణకారకదానము, ఇహ అస్తు = మా యీ కర్మలందు ఉండునుగాక!

భాష్యార్థము :- పరిపతిమ్ - అధిపతిమ్ = రక్షకుని, వచస్య - వచనేన = వచనముతో స్తుతితో, కామేన = అభిలాషతో, అభ్యానట్ - అభ్యాపన్నః = ప్రాప్తమైనది, రాసత్ - దదాతు = ఇచ్చునుగాక! చంద్రాగ్రాః - చాయనీయాగ్రాణి ధనాని అభిపూజితాగమాని = వేనిఆగమనము పూజితమ్మౌనో యట్టిధనములను, ధియం ధియం - కర్మ కర్మ = ప్రతి కర్మకు, ప్రసీషధాతి - ప్రసాధయతు = సిద్ధముచేయునుగాక!.

విష్ణుః - (౧౧)

అథ యద్విషితో భవతి తద్విష్ణుర్భవతి, విష్ణుర్ విశతేర్వా. వ్యశ్నోతేర్వా. తస్యైషా భవతి - "ఇదం విష్ణుర్ విచక్రమే త్రేధా నిదధే పదమ్. సమూఢమస్య పాంసురే" (ఋ. ౧-౨౨-౧౭)

> యదిదం కించ తద్విక్రమతే విష్ణుస్త్రిధా నిధత్తే పదమ్
> త్రేధా భావాయ పృథివ్యామంతరిక్షే దివీతి శాకపూణిః.
> సమారోహణే విష్ణుపదే గయశిరసీత్యౌర్ణవాభః. సమూళ్హ
> మస్య పాంసురే ప్యాయనేఽన్తరిక్షే పదం న దృశ్యతే.
> అపి వా ఉపమార్థే స్యాత్ సమూళ్హమస్య పాంసుల ఇవ
> పదం న దృశ్యత ఇతి. పాంసవః పాదైః సూయన్త ఇతి
> వా, పన్నాః శేరత ఇతి వా, పింశనీయా భవన్తీతి వా.

అయమేవ సూర్యః యదా రశ్మిభిః విషితః - వ్యాప్తః భవతి తదా విష్ణుః ఇత్యుచ్యతే. అథవా యతో అయం రశ్మిభిః సర్వతః అవిష్టో భవతి తస్మాద్ విశతేః సాధ్యః. అథవా రశ్మిభిరయం సర్వం వ్యశ్నుతే వ్యాప్నోతి తస్మాద్ విష్ణుః.

తస్యైషా - "ఇదం విష్ణుః ... పాంసురే" అయం విష్ణుః వ్యాపనః సూర్యః త్రేధా పదం నిదధే - పార్థివాగ్నిరూపేణ పృథివ్యామ్ యత్కించిద్ దృశ్యతే తద్విక్రమతే - అధితిష్ఠతి అంతరిక్షే చ విద్యుద్రూపేణ దివి సూర్యాత్మనా. పాంసురే - ప్యాయనే అన్తరిక్షే ఇతి యావత్ యత్ అస్య పదమ్ తత్ సమూఢమ్ - అంతర్హితమ్. సహి విద్యుత్ నిత్యం లోచనగోరీ భవతి. అపి వైతదుపమార్థే స్యాత్. పాంసురే-పాంసులే ప్రదేశే యథా పదం సమూఢమివ దృశ్యతే తథా అస్య విష్ణోః మధ్యమం విద్యుదాఖ్యం పదమ్ సమూఢమివ భాతి. పాంసవః కస్మాత్? యతస్తే పాదైః సూయన్తే జన్యన్తే తస్మాత్ పాంసవః. అథవా పన్నాః శేరతే అథవా పింశనీయా దూరీకరణీయా ధ్వంసనీయా ఇతి యావత్ భవన్తి.

అర్థము :- అథ = తదుపరి, యత్ = ఎప్పుడు, విషితః భవతి = కిరణములతో నీ సూర్యుడు అంతట వ్యాపించునో, తత్ = అప్పుడు ఈ సూర్యుడే, విష్ణుః భవతి = విష్ణువు అగును - విష్ణునామముగలవాడగును. విష్ణుశబ్దము - విశతేః వా = ప్రవేశనార్థక 'విశ్' ధాతువుతో సిద్ధమగును. వ్యశ్నోతేః లేక విపూర్వక 'అశూఙ్వ్యాప్తౌ' ధాతువుతో సిద్ధమగును. మధ్యాహ్నకాలపు ఆదిత్యుడు విష్ణువనబడును. ఏలయన అతడు తన

కిరణములతో నంతట బాగుగ వ్యాపించును. అతనికి సంబంధించిన ఋక్.

మంత్రార్థము :- విష్ణుః=మధ్యాహ్నకాలీన విష్ణునామక ఆదిత్యుడు, ఇదమ్ = ప్రపంచమునగల సమస్తమును, విచక్రమే = తన విక్రమముచే అధిష్ఠితుడైయుండును. ఈ విష్ణువు, త్రేధా = ముప్విధములు, పదం నిదధే = పాదమునుంచియున్నాడు, పృథివి, అంతరిక్షము, ద్యులోకము అను నీ మూడులోకములందంతటను తనప్రకాశమును వ్యాపింపచేసి యుండును. ఈ విష్ణువు పార్థివాగ్నిరూపమున భూమిపైనను విద్యుద్రూప మున నంతరిక్షమునను సూర్యరూపమున ద్యులోకమునను అధిష్ఠితుడై యుండును. అస్య = ఈ విష్ణువుయొక్క, పాంసురే = అంతరిక్షమున నెకపాదము, సమూఢమ్ = గుప్తముగానుండును, విద్యుద్రూపపదము గుప్తముగా నుండును. అది ఎల్లపుడు కనబడదు - అప్పుడప్పుడు కనబడును.

భాష్యార్థము :- ఇదమ్ = యదిదం కించ = ఈ జగత్తంతయు' విక్రమతే విష్ణుః = ఈ విష్ణువు జగత్తుపై తన విక్రమమును జూపు చున్నాడు, విచక్రమే = అన - విక్రమతే యనియర్థము, త్రేధా=త్రిధా = ముప్విధములు, నిధత్తే పదమ్=పాదమునుంచి యున్నాడు, త్రేధా భావాయ= మూడురూపములనొందుటకు - పృథివి, అంతరిక్షము, ద్యులోకము అను నీ మూడులోకములందును. (అగ్నిరూపమున పృథివిపై విద్యుద్రూపమున నంతరిక్షమున - సూర్యరూపమున ద్యులోకమునను) విష్ణువు వ్యాపించి యున్నాడు, అని శాకపూణి ఆచార్యునిమతము. సమారోహణే=ఉదయగిరిపై ఉదయించుచు, ఒకపాదము నిలుపుచును, విష్ణుపదే = అంతరిక్షమున మధ్యాహ్నకాలమున రెండవపాదమును, గయశిరసి = అస్తమించుచు అస్తగిరిపై మూడవపాదమునుంచునని ఔర్ణవాభ ఆచార్యునికథనము. సమూఢమస్య పాంసురే = ఇతని విద్యుద్రూపమగు రెండవపాదము, పాంసురే - ప్యాయనే - అంతరిక్షే=సర్వభూతములవృద్ధికి హేతుభూతమగు నంతరిక్షమున సమూఢమ్ - అంతర్హితం పదం న నిత్యం దృశ్యతే = ఎల్లప్పుడు కనిపించదు. దాగియుండును. అప్పుడప్పుడు కనిపించును.

అపివా ఉపమార్థే స్యాత్. పాంసురే - పాంసులే ఇవ = దుమ్ముగల స్థలమునందు పాదము కనిపింపనట్లు పదచిహ్నము బాగుగ కనిపింపనట్లు, పాంసవః కథమ్ ? = పాంసులమనగా ఏమి? పాదైః సూయన్తే = పాదములచే దుమ్ము - ధూళి ఉత్పన్నమగును. కావున పాంసులమనబడును. లేక పదదలితమై భూమిపై పడియుండును. పింశనీయా భవన్తి ఇతి వా = లేక ధూళినాశయోగ్యము - గుడ్డలమీద, శలమీద - దేహములపై ధూళి పడినపుడు దానిని దులిపివేయుదురు.

ద్వితీయ పాదము సమాప్తము

# తృతీయ పాదము

విశ్వానరః - (౧౨)

> విశ్వానరో వ్యాఖ్యాతః. తస్యైష నిపాతో భవతి ఐంద్ర్యామృచి - "విశ్వానరస్య వస్పతిమనానతస్య శవసః. ఏవైశ్చ చర్షణీనామూతీ హువే రథానామ్" (ఋ. ౮-౬౮-౪)
>
> విశ్వానరస్య ఆదిత్యస్యానానతస్య శవసో మహతో బలస్య ఏవైశ్చ కామైరయనైరవనైర్వా చర్షణీనాం మనుష్యాణామ్, ఊత్యా చ యథా రథానామ్ ఇంద్రమస్మిన్ యజ్ఞే హ్వయామి.

వ్యాఖ్యాతచరః. తస్యేంద్రదేవతాకాయామృచి ఏషః నిపాతః - గౌణ రూపేణ స్తుతిరిత్యర్థః. "విశ్వానరస్య...రథానామ్" విశ్వానరస్య ఆదిత్యస్య, అనానతస్య - శత్రైరనామితస్య శవసః బలస్య పతిమ్ వః - యుష్మాకమ్ హేతవే హువే - ఆహ్వయామి. చర్షణీనామ్ - మనుష్యాణామ్ ఏవైః-కామైః అయనైః ఊతీ - ఊత్యా పథా రథానాం - రంహణానాం శక్తానామ్ అహమింద్రమ్ ఆహ్వయామి.

అర్థము :- విశ్వానరశబ్దవ్యాఖ్య పూర్వమే (౭-౨౧-౧ లో) చేయబడినది. ఇట విశ్వానరశబ్దము మధ్యాహ్నోత్తరకాలీన ఆదిత్యునికి వాచకము. 'ప్రత్యృతః సర్వాణి భూతాని'=ఈ విశ్వానరుడు సర్వభూతము

అందును ప్రాప్తించియుండును, అతః = అందువలన విశ్వానరుడనబడును ఆ విశ్వానరునికి సంబంధించిన ఇంద్రదేవతాక - నిమ్నలిఖిత ఋక్కు నందు నిపాతభాక్‌రూపమున వర్ణనకలదు.

మంత్రార్థము :- అనానతస్య విశ్వానరస్య - ఇతరజ్యోతిస్సులచే అనభిభూతమైన ప్రకాశముగల విశ్వానర అదిత్యుని, శవసః పతిమ్ = బలమునకు స్వామియైన ఇంద్రుని, వః=మీయొక్క ప్రయోజనసిద్ధికొఱకు, చర్షణీనామ్ = మనుష్యులయొక్క, ఏవైః = కామనలు, గమనములు, రక్షణలు మనువానితోపాటు, రథానామ్ = రథములయొక్క, ఊతి = మార్గముతో - కిరణములు భూతలమునకుమార్గముతో ఇంద్రుని, హువే = పిలుచుచున్నాను.

అనానతస్య శవసః - మహతో బలస్య = ఇతరజ్యోతిస్సులచే అనభిభూతమగుబలము - మహాబలముయొక్క, ఏవైః = కామైః=కామనలతో, అయనైః = గమనములతో, అవనైర్వా = లేక రక్షణలతోపాటు, చర్షణీనామ్ - మనుష్యాణామ్ = మనుష్యులయొక్క, ఊతీ = ఊత్యా = పథా= మార్గముతో, రథానాం = రథములయొక్క, హ్వయే = హ్వయామి = పిలుచుచున్నాను, ఇంద్రమ్ అస్మిన్ = ఇంద్రుని ఈయజ్ఞమునందు.

వరుణః - (౧౩)

వరుణో వ్యాఖ్యాతః. తస్యైషా భవతి-

"యేనా పావక చక్షసా భురణ్యన్తం జనాఁ అను. త్వం వరుణ పశ్యసి" (ఋ. ౧-౫౦-౬)

భురణ్యురితి క్షిప్రనామ. భురణ్యుః శకునిః భూరిమధ్వానం నయతి స్వర్గస్య లోకస్యాపి వోళహా తత్సంపాతీ భురణ్యు రనేన పావకఖ్యానేన. 'భురణ్యన్తం జనాఁ అను. త్వం వరుణ పశ్యసి, తత్తే వయం స్తుమ ఇతి వాక్యశేషః.

అపి వోత్తరస్యామ్ - తద్యథా -

"యేనా పావక చక్షసా భురణ్యన్తం జనా అను, త్వం వరుణ పశ్యసి" (ఋ. ౧-౫౦-౬)

"వి ద్యామేషి రజస్పృథ్వహా మిమానో అక్తుభిః. పశ్యన్ జన్మాని సూర్య" (ఋ. ౧-౫౦-౭)

వ్యేషి ద్యాం రజశ్చ పృథు మహాన్తం లోకమహాని చ మిమానో అక్తుభీ రాత్రిభిః సహ పశ్యన్‌జన్మాని జాతాని సూర్య. అపి వా పూర్వస్యామ్-

యేనా పావక చక్షసా భురణ్యన్తం జనా అను, త్వం వరుణ పశ్యసి, ప్రత్యఙ్ దేవానాం విశః ప్రత్యఙ్ఙుదేషి మానుషాన్. ప్రత్యఙ్ విశ్వం స్వర్దృశే.

ప్రత్యఙ్‌జీవం సర్వముదేషి ప్రత్యఙ్‌ఙిదం జ్యోతిరుచ్యతే ప్రత్యఙ్‌జీవం సర్వమభివిపశ్యసీతి.

అపివై తస్యామేవ-

యేనా పావక చక్షసా భురణ్యన్తం జనాం అను. త్వం వరుణ పశ్యసి. తేన నో జనా నభివిపశ్యసి.

వ్యాఖ్యాతః తస్యైషా - "యేనాపావక ... పశ్యసి" ఏతాః చతస్రః ఋచః ప్రసఙ్గాద్వ్యాఖ్యాతమ్. హే పావక వరుణ! యేన చక్షసా - లోకహిత కారిణా దర్శనేన త్వమ్ జనాన్-పుణ్యకృతః అను భురణ్యన్తమ్ పూర్వేషాం పుణ్యకృతాం మార్గేణ దేవయానేన క్షిప్రం గచ్ఛన్తమనుపశ్యసి తత్ తే అనుగ్రాహకం దర్శనం వయం స్తుమః ఇతి శేషః.

అపి వోత్తరస్యామ్ - అపిచైవం యదోక్తమపి హి అన్యథా స్యాత్. కథమితి ఉచ్యతే యదోత్తరా ఋక్. తయాపి సహైకవాక్యతాపేక్షా. కథ మితి - పునః పఠతి - "యేనా ... పశ్యసి" "విద్యామేషి...పశ్యన్ జన్మాని సూర్య" హే పావక వరుణ యేన చక్షసా జనాన్ అను భురణ్యన్తం పశ్యసి

తేనైవ-విద్యామేషి - ద్యులోకం వివిధరూపేణ ఏషి. రజః చ పృథు - మహన్తమ్ అంతరిక్షలోకమ్, అహ - అహని - దినాని మిమానః - కుర్వాన్, అక్తుభిః - రాత్రిభిః సహ పశ్యన్ జన్మాని - జాతాని సూర్య.

అపి వా పూర్వస్యామ్-

హే వరుణ! తయైవ ఖ్యాత్యా ప్రజ్ఞయా చ యుక్తః త్వమ్ "ప్రత్యఙ్ దేవానాం ... విశ్వం స్వర్దృశే" దేవానాం విశః ప్రత్యక్కృత్వా తాసాం పురస్తా దుదేషి ఏవమేవ మానుషాన్. హే స్వః! హే ఆదిత్య! త్వం విశ్వం దృశే - సర్వమభిపశ్యసి అథవైతస్యామేవ - తేనైవ ఖ్యానేన సః జనాన్ అభివిపశ్యసి.

అర్థము :- వరుణుని వ్యాఖ్య (౧౦.3-వ లో) చేయబడినది. ఇట వరుణశబ్దము ఆదిత్యవాచకము - ఆ వరుణునకు సంబంధించిన ఋక్

మంత్రార్థము :- హే పావక వరుణ! = పవిత్రమొనర్చు నో ఆదిత్య!, త్వమ్ = నీవు, యేన చక్షసా = ఏ ప్రకాశముతో, భురణ్యంతమ్ = శీఘ్రగతిగొనర్చునట్టి, లేక సువర్ణసమానకిరణముల సమూహమును, జనాన్ అను = ప్రాణులవైపు పశ్యసి = ప్రకాశింపజేయుచున్నావొ, తత్ తే వయం స్తుమః = మేము నీ యా ప్రకాశమును స్తుతింతుము.

భాష్యార్థము :- భురణ్యుః ఇతి క్షిప్రనామ = భురణ్యుపదము శీఘ్రవాచకము, భురణ్యుః శకునిః = భురణ్యు శకునియనియు ననబడును. ఎగిరిపోయిన శకునిపక్షి - భూరిమ్ అధ్వానం నయతి = దూరముదాక మార్గమును దాటిపోవును, స్వర్గస్య లోకస్య అపి వేఘా = ఇది ద్యులోకము నను చేరును, తత్సంపాతిభురణ్యుః = అందువలన సువర్ణపక్షివలె ద్యులోకముదాక చేర్చు సూర్యరశ్మియు భురణ్యు అనబడును.

అపివా = అథవా = లేక ఉత్తరస్యామ్ = తరువాతి ఋక్కునందు

అన్వయము-

మంత్రార్థము :- పావకవరుణ! = పవిత్రముచేయు ఓ ఆదిత్య!, త్వం = నీవు, యేన చక్షసా = ఏ ప్రకాశముతో, భురణ్యన్తమ్ = శీఘ్రగామియైన, లేక సువర్ణసమానమైన రశ్మిసమూహమును, జనాన్ అను

పశ్యసి=ప్రాణులవైపు ప్రకాశతమొనర్చుచున్నావు, హే సూర్య ! అక్తుభిః = రాత్రులతో, అహామిమానః = దినములను నిర్మించుచు, జన్మాని పశ్యన్= సమస్తజాతపదార్థములను ప్రకాశింపజేయుచు, ఆ ప్రకాశముతోనే, పృథు = ఈ విశాలమైన, ద్యామేరజసః = ద్యులోకమునను, మఱియు నంతరిక్షము నందును, వ్యేషి = వివిధంగచ్ఛసి = శీఘ్రగమనమొనర్చుచున్నావు.

భాష్యార్థము :- వ్యేషి = అతిశయగతినొనర్చుచున్నావు, ద్యామ్ = ద్యులోకమున, పృథురజః - మహాన్తంలోకమ్ = విశాలమగునంతరిక్షమున, (రజః ఇది లోకవాచకపదము) అహా - అహాని = దినములను, అక్తుభిః = రాత్రిభిః = రాత్రులతో, జన్మాని - జాతాని = సమస్తములైన ఉత్పన్న పదార్థములను.

అథవా = లేక - మొదటి ఋక్కునందు దీని యన్వయము కాగలదు ఎట్లన :—

మంత్రార్థము :— పావకవరుణ ! = పవిత్రమొనర్చునో యాదిత్యా !, త్వం యేన చక్షసా = నీవేప్రకాశముతో, భురణ్యంతమ్ = శీఘ్రగామియైన, లేక సుపర్ణసమాన కిరణసమూహమును, జనాన్ అనుపశ్యసి = ప్రాణుల వైపు ప్రకాశితమొనర్చుచున్నావు, దేవానాం విశః ప్రత్యఙ్=దేవతలవైపు గతి నొనర్చుచు, ఉదేషి = ఉదయించుచున్నావు - అనగా ఆ ప్రకాశముతోనే దేవతలను, ప్రజలను ప్రకాశింపజేయుచున్నావు, మానుషాన్ప్రత్యఙ్ ఉదేషి = మనుష్యులవైపునను ఆ ప్రకాశముతో ప్రకాశింపజేయుచు, ఉదేషి = ఉదయించుచున్నావు, ప్రత్యఙ్ విశ్వమ్ = సమస్తవిశ్వమువైపు, హే స్వః ! ఓ ఆదిత్యా ! దృశే = దర్శనమొనరించుటకు నీవు ఉదయించు చుందువు, దృశే = ఈ పదము సర్వత్ర అనుషక్తమై యున్నది. ప్రత్యఙ్ ఉదేషి - మానుషాన్ దృశే - ప్రత్యఙ్ - విశ్వం - దృశే - ద్రష్టుమిత్యర్థః. స్వః = ఆదిత్యునికూడ అందురు ద్యులోకమునుగూడ స్వః - అందురు. స్వర్దృశేదివం ద్రష్టుమ్ = ద్యులోకమును జూచుటకనియు నర్థమగును.

అథవా ఈ ఋక్కునందే దీని అన్వయము మఱియొక విధమునను కాగలదు.

మంత్రార్థము :— పావకవరుణ! = ఓ పావక ఆదిత్య!. యేన చక్షసా = ఏ ప్రకాశముతో నీవు, భురణ్యన్తమ్ = శీఘ్రగామియైన వేక. సుపర్ణపక్షితో సమానముగ కిరణసమూహమును, జనాన్ అను = జనుల వైపు, పశ్యసి = ప్రకాశతమొనర్చుచున్నావు, తేన = ఆ ప్రకాశముతోనె నః జనాన్ = మనుష్యులను, అభివిపశ్యసి = ప్రకాశతమొనర్చుచున్నావు.

కేశీ - (౧౪)

> కేశీ కేశా రశ్మయస్తైస్తద్వాన్ భవతి, కాశనాద్వా, ప్రకాశనాద్వా. తస్యైషా భవతి—
>
> “కేశ్యగ్నిం కేశీ విషం కేశీ బిభర్తి రోదసీ. కేశీ విశ్వం స్వర్దృశే కేశీదం జ్యోతిరుచ్యతే” (ఋ.౧౦-౧౩౬-౧)
>
> కేశ్యగ్నిం చ విషం చ. విషమిత్యుదకనామ - విష్ణాతేర్వి పూర్వస్య స్నాతేః శుద్ధ్యర్థస్య విపూర్వస్య వా సచతేః. ద్యావాపృథివ్యౌ చ ధారయతి కేశీదం సర్వమిదమభివిపశ్యతి; కేశీదం జ్యోతిరుచ్యతే ఇత్యాదిత్యమాహ.
>
> అథాప్యేతే ఇతరే జ్యోతిషీ కేశినీ ఉచ్యేతే. ధూమేనాగ్నీ రజసా చ మధ్యమః.

కేశాః రశ్మయః తైస్తద్వానాదిత్య ఇత్యర్థః మధ్యందినీయః. అథవా కాశనాత్ ప్రకాశనాత్ కేశీ. తస్యైషా - “కేశ్యగ్నిం ... జ్యోతిరుచ్యతే” జాతేదార్థమ్. కేశీ ఆదిత్యః అగ్నిం బిభర్తి. కేశీ విషం ఉదకం బిభర్తి కేశీ ఏవ చ రోదసీ - ద్యావాపృథివీ బిభర్తి - తద్వాసీని భూతాని అను గృహ్ణాతి అపిచాయం స్వః - ఆదిత్యః విశ్వం దృశే - సర్వమేతదభిపశ్యతి. కోఽయం కేశీ? ఉచ్యతే ఇదం జ్యోతిః-ఆదిత్యః కేశీ ఉచ్యతే.

అథాపి ఇతరే ప్రథమ మాధ్యమికే జ్యోతిషి కేశినీ ఉచ్యేతే తత్రాగ్నిః ధూమేన కేశీ రజసా చ మధ్యమః - ఉద్ధూతేన పాంసునా వాయుః. ఉదకేన చ వైద్యుతః కేశీ విషం కస్మాత్ - ఉచ్యతే విష్ణాత్ శౌచార్థాత్ స్నాతేః విపూర్వాత్ సచతేర్వా విషమ్.

అర్థము :- కేశీ కేశిన్ = ఆదిత్యుడు, కేశాః రశ్మయః = కేశము రశ్మివాచకము తైః = ఆ రశ్ములతో, తద్వాన్ = కేశములుకలవాడు ఆగును, కాశనాద్ వా = లేక, 'కాశ్' దీప్తౌ ప్రకాశనాద్వా - ప్రకాశమానః = ప్రకాశవంతుడగుటచే (ఆదిత్యుడు) కేశి అనబడుచున్నాడు. తత్సంబంధి యుక్కు—

మంత్రార్థము :- కేశీ = ఆదిత్య, అగ్నిం బిభర్తి = ఆదిత్యుడు అగ్నిని ధరించుచున్నాడు, కేశీ = ఆదిత్యుడు, విషమ్ = ఉదకమును, బిభర్తి = ధారణచేయుచున్నాడు, కేశీ = ఆదిత్యుడు, రోదసీ = ద్యావాపృథివీ లోకములను, బిభర్తి = ధారణచేయుచున్నాడు. ద్యావాపృథివీలోకము లందుండు భూతములనన్నింటిని ధరించుచున్నాడు. కేశీ = ఆదిత్యుడు, విశ్వంస్వః = సంపూర్ణజగత్తును, దృశే = చూడసమర్థుడు. ఈ కేశీ ఎవరు ? ఇదం జ్యోతిః కేశి ఉచ్యతే=అందఱియెదుట కనబడు నీజ్యోతియే కేశీ అనబడును.

భాష్యార్థము :- కేశీ అగ్నిం చ విషం చ = ఆదిత్యుడు అగ్నిని ఉదకమును - విషమ్ - విషము జలమునకుపేరు. విష్ణాతేః - శుద్ధ్యర్థిక, విపూర్వక, 'ష్ణా' ధాతువుతో విషశబ్దముసిద్ధమగును, విపూర్వకసచతేర్వా = విపూర్వక 'షచ' ధాతువువలనను విషశబ్దము సిద్ధించును. విషము=జలము స్నానపానాదులకు మిక్కిలిగా ఉపయోగింపబడును, రోదసీ ద్యావా పృథివ్యౌ = ద్యావాపృథివీలోకములు వానియందుండు సమస్తభూతములను కేశీ = ఆదిత్యుడు ధరించుచున్నాడు. (బిభర్తి) కేశీ విశ్వం స్వః దృశే = ఆదిత్యుడు ఈ సమస్తమును అభివిపశ్యతి = చూచుచున్నాడు, కేశీ ఇదం జ్యోతిః = ఈ యెదుటకనిపించు జ్యోతియే కేశీ=ఆదిత్యుడనబడుచున్నాడు.

అథాపి కించ = మఱియు, ఏతే ఇతరే జ్యోతిషీ = రెండు ఇతర జ్యోతిస్సులు అగ్ని, వాయువు, కూడ కేశీ అని చెప్పబడుచున్నవి, ధూమేన అగ్నిః = పొగతో అగ్ని - నిప్పు, కేశవంతమగుటచే కేశీ అనబడుచున్నది, రజసా చ మధ్యమః = ధూళితో వాయువు 'కేశీ' అనబడుచున్నది, కేశీ అన కేశములుకలది, అగ్నికికేశములు ధూమము, వాయువునకు ధూళి కేశములని భావము.

కేశినః - (౧౫)

తేషామేషా సాధారణా భవతి-

"త్రయః కేశిన ఋతుథా విచక్షతే సంవత్సరే వపత ఏక ఏషామ్. విశ్వమేకో అభిచష్టే శచీభిర్ధ్రాజిరేకస్య దదృశే న రూపమ్" (ఋ. ౧-౧౬౪-౪౪)

త్రయః కేశిన ఋతుథా విచక్షతే కాలేకాలే అభివిపశ్యన్తి. సంవత్సరే వపత ఏక ఏషామిత్యగ్నిః పృథివీం దహతి. సర్వమేకోఽభివిపశ్యతి కర్మభిరాదిత్యః. గతిరేకస్య దృశ్యతే న రూపమ్ మధ్యమస్య.

తేషాం త్రయాణాం పృథివ్యన్తరిక్షద్యుస్థానీయానాం కేశినాం నిర్దేశికా ఏషా ఋగ్ భవతి - "త్రయః ... న రూపమ్" దీర్ఘతమసః ఆర్షమ్. య ఏతే త్రయః కేశినః - అగ్నిః వాయుః సూర్యశ్చ ఋతుథా - యథాకాలమ్ విచక్షతే - అభివిపశ్యన్తి లోకమనుగృహ్ణన్తి ఇతి యావత్ ఏషాం - త్రయాణామ్ మధ్యే ఏకః - అగ్నిః సంవత్సరే పృథివీం వపతే . దహతి. ఏకశ్చ విశ్వం శచీభిః కర్మభిః అభిచష్టే - అభివిపశ్యతి - అనుగృహ్ణాతి ఏకస్య పునః మధ్యమస్య వాయోః ధ్రాజిః - గతిః రూపం చ న దదృశే - నావలోక్యతే. ఆ కేశులకు సంబంధించిన ఒక్క ఋక్కు-

మంత్రార్థము :- త్రయః కేశినః=మూడుకేశవంతములు-(సూర్యుడు, వాయువు, అగ్ని) ఋతుథా = సమయసమయమున సంపూర్ణజగత్తుపై కృపాదృష్టినుంచుచుందురు, ఏషామేకః = వీనిలోనొకటియగు అగ్ని, సంవత్సరే వపత = సంవత్సరమంతయు పృథివిని వానియందలి సమస్త ఓషధులను వనస్పతులను అన్నింటిని దహించుచుండును - కాల్చుచుండును, ఏకః = రెండవదేని = సూర్యుడు ప్రకాశము వర్షము మున్నగు కర్మలతో సంవత్సరముపొడవున కృపాదృష్టితో చూచుచుండును, ఏకస్య= మూడవవాని = వాయువు, దాని, ధ్రాజిః = గతి, దదృశే = కనిపించును, న రూపమ్ = రూపము కనిపించదు.

భాషార్థము :- త్రయః కేశినః = మూడుకేశులు, ఋతుథా విచక్షతే = సమయసమయమున, అభివిపశ్యన్తి = అనుగ్రహదృష్టికలిగి యుండును, సంవత్సరే వపతే ఏకఏషామ్ = వీనిలో నొకటియగు అగ్ని సంవత్సరమంతయు భూమిని దహించుచుండును, విశ్వమ్ ఏకః అభిచష్టే శచీభిః - సర్వమేకః అభివిపశ్యతి కర్మభిః = రెండవకేశి = సూర్యుడు - సమస్తజగత్తును ప్రకాశము, వృష్టి మున్నగుకర్మలతో అనుగ్రహించు చున్నాడు. ధ్రాజిః ఏకస్య దృశ్యతే న రూపమ్ = మూడవకేశియగు వాయువుయొక్క గతి = గమనము తెలియును. రూపముమాత్రము కనిపింపదు. ఇది మధ్యమకేశి = వాయువు.

వృషాకపిః - (౧౬)

అథ యద్ రశ్మిభిరభిప్రకంపయన్నేతి తద్ వృషాకపిర్భవతి వృషాకంపనః.

తస్యైషా భవతి ఋక్-

"పునరేహి వృషాకపే సువితా కల్పయావహై. య ఏష స్వప్ననంశనో ఽస్తమేషి పథా పునర్విశ్వస్మాదింద్ర ఉత్తరః" (ఋ. ౧౦-౮౬-౨౧)

పునరేహి వృషాకపే సుప్రసూతాని యః కర్మాణి కల్ప యావహై య ఏష స్వప్ననంశనః స్వప్నాన్నాశయత్యాదిత్య ఉదయేన సోఽస్తమేషి యథా పునః సర్వస్మాద్ య ఇంద్ర ఉత్తరస్తమేతత్ బ్రూమ ఆదిత్యమ్.

అథ యదాయమాదిత్యో రశ్మిభిరభిప్రకంపయన్ ఏతి తదాయం వృషాకపిరిత్యుచ్యతే వృషా అవశ్యాయానాం వర్షితా కంపనః చ భూతానాం యతః తతః వృషాకపిః. తస్యైషా - "పునరేహి ... ఉత్తరః" వృషాకపే ప్రార్థనమ్ హే భగవన్ వృషాకపే! యస్త్వం స్వప్ననంశనః - ఉదయేన స్వప్నాన్ నాశయసి పునస్చ పథా సోఽస్తమేషి యశ్చ త్వం విశ్వస్మాత్ - సర్వస్మాత్ జగతః ఉత్తరః - ఉద్గతతరః ఇంద్రః - ఈశ్వరః అసి స త్వమ్

ఏహి ఆయాహి ఉదయం ప్రాప్నుహి ఇతి యావత్. యేన సవితా - సుప్ర వృత్తాని కర్మాణి కల్పయావహై - సుగుణానికుర్వః

అర్థము :- అథ = తరువాత, యద్ = ఎప్పుడు, రశ్మిభిః=కిరణము లతో, అభిప్రకంపయన్నేతి = భూతములను, కంపింపచేయుచు ఆదిత్యు డస్తమించునో, తద్ = అప్పుడు, వృషాకపిర్భవతి=వృషాకపి యనబడును. వృషాకంపనః = అస్తసమయమున భూతములను కంపింపచేయువాడు.

ఆ వృషాకపికి సంబంధించిన ఋక్-

మంత్రార్థము :- హే వృషాకపే! = ఓ యాదిత్య!, యః ఏషః స్వప్నసంశనః=ఏ నీవు ఉదయమువలన నిద్రను నశింపచేయుచున్నావు. సూర్యోదయకాలమున ప్రాణులు నిద్రవదలి మేలుకొనును, పునః పథా అస్తమ్ ఏషి=మరల నీవు నీ నిర్ధారితమార్గమున అస్తమింతువు, పునరేహి = అట్టినీవు మరల రమ్ము, సవితా కల్పయావహై=మనము కలిసి యాగాది విహితకార్యముల మనుష్యులచే చేయించుదము, ఇంద్రః విశ్వస్మాద్ ఉత్తరః = ఆదిత్యుడు సమస్తజగత్తున నందరికంటె నుత్కృష్టుడు.

భాష్యార్థము :- పునరేహి వృషాకపే! = మరలరమ్ము, యః త్వమ్ అహం చ = ఆ నీవు, నేను ఇరువురము, సవితా సుప్రసూతాని కర్మాణి = యాగాది విహిత - ఉత్తమకర్మలను, కల్పయావహై = నిర్వహింపచేయు దము, యః ఏష స్వప్నసంశనః = నీవు, స్వప్న - నిద్రానాశకుడవు, సః అస్తమ్ ఏషి పథాపునః = మరల నీమార్గమున అస్తంగతుడవగుచున్నావు. మరల నామార్గముననే ఉదయించి నిద్రను పోనాడుచున్నావు, విశ్వస్మాత్- సర్వస్మాత్ జగతః ఇంద్రఉత్తరః=ఆదిత్యుడు సమస్తజగత్తునగలయన్నింటి కంటెను, ఉత్తరః = శ్రేష్ఠుడు, తమేతమ్ బ్రూమః ఆదిత్యమ్ = మేము ఆదిత్యున కిది చెప్పుచున్నాము.

యమః - (౧౭)

యమో వ్యాఖ్యాతః. తస్యైషా భవతి-

"యస్మిన్ వృక్షే సుపలాశే దేవైః సంపిబతే యమః.
అత్రానో విశ్పతిః పితా పురాణా అనువేనతి (ఋ.
౧౦-౧౩౫-౧)

యస్మిన్ వృక్షే సుపలాశే స్థానే వృతక్షయే వాపివోపమార్థే స్యాత్ వృక్ష ఇవ సుపలాశే ఇతి వృక్షో వ్రశ్చనాత్ పలాశం పలాశదనాద్ దేవైః సంగచ్ఛతే యమో రశ్మిభి రాదిత్యస్తత్ర నః సర్వస్య పాతా వా, పాలయితా వా, పురాణాననుకామయేత.

పూర్వం వ్యాఖ్యాతః. తస్యైషా భవతి-"యస్మిన్ వృక్షే... అనువేనతి" కుమారస్య యామాయనస్యార్షమ్ యస్మిన్ వృక్షే - ఆదిత్యే (ఆదిత్యో హి స్వగత్యా కాలమతిక్రామయన్ సర్వేషామాయూంషి క్షపయతి) తతః వృశ్చతి - జీవానామాయూంషి ఇతి వృక్షః ఆదిత్యః అథవా వృక్షైః జనైః వృతః క్షయః నివాసో యస్యేతి వృక్షః తస్మిన్ సుపలాశే - సమ్యక్ పలాశ్వమతే దీప్తియుక్తే, దేవైః-రశ్మిభిః సహ సంపిబతే-సంగచ్ఛతే అస్తం గచ్ఛన్ యమః-ఆదిత్యః. తత్ర నః పురాణాన్ స విశ్పతిః - సర్వేషాం పాతా పాలయితా వా యమః అనువేనతి - అనుకామయేత సంప్రీణయతు ఇత్యర్థః. ఐతిహాసికపక్షే చ సుపలాశవృక్షప్రఖ్యే సుఖనివాసే పితృరాజః యమః పురాణాన్ ఇవ తల్లోకవాసినః పితౄన్ అనుకామయతు. దేవాః యమానుచారిణః. వృక్షః కస్మాత్? ఉచ్యతే వ్రశ్చనాత్. పలస్య - మాంసస్య అశనాచ్చ పలాశమ్.

యమపదవ్యాఖ్య (౧౦-౧౯) పూర్వమే చేయబడినది. యమపదమిట ఆదిత్యవాచకము. ఆ యమునికిచెందిన ఋక్కు.

మంత్రార్థము :- సుపలాశే వృక్షే ఇవ=ఉత్తమము మంచిఆకులతో నిండియున్న వృక్షమునందు పక్షులు పరస్పరము కలిసియుండునట్లు, యా ఇ లేక, సుపలాశే వృక్షే = పరిశోభమగతో=సర్వవిధమనోహరవృక్షము నందు పుణ్యాత్ములచే వరింపబడినస్థానమునందు - మోక్షధామమున, యస్మిన్ సుపలాశే = ఏ దీప్తిమంతమగు, వృక్షే = ఆదిత్యమండలమున,

హేమ, చంద్రమ్, రుక్మమ్, అయః, హిరణ్యమ్, పేశః, కృశనమ్, లోహమ్, కనకమ్, కాంచనమ్, భర్మ, అమృతమ్, మరుత్, దత్రమ్, జాత రూపమితి పంచదశ హిరణ్యనామాని. (౨)

అంబరమ్, వియత్, వ్యోమ, బర్హిః, ధన్వ, అంతరిక్షమ్, ఆకాశమ్, ఆపః, పృథివీ, భూః, స్వయంభూః, అధ్వా, పుష్కరమ్, సగరః, సముద్రః, అధ్వరమిత్యన్తరిక్షస్య అధ్వరమితి షోడశ అంతరిక్ష నామాని. (3)

(4. సగరమ్, ఇది పాఠాంతరము)

స్వః, పృశ్నిః, నాకః, గౌః, విష్టప్, నభః ఇతి సాధారణాని, నభ ఇతి షట్ సాధారణాని. (౪)

5. ఖేదయః, కిరణాః, గావః, రశ్మయః, అభీశవః, దీధితయః, గభస్తయః, వనమ్, ఉస్రాః, వసవః, మరీచిపాః, మయూఖాః, సప్తఋషయః, సాధ్యాః, సుపర్ణాః, రశ్మినామ్. సుపర్ణా ఇతి పంచదశ రశ్మినామాని. ౫

'ఖేదా' శబ్దము రశ్మివాచకము, 'ఖేదయః' శబ్దముకాదు. వేదము నందు 'ఖేదాః' అనుశబ్దము కనబడుచున్నది. 'ఖేదయా' అని తృతీయైకవచనము కనబడుచున్నది. 'ఖేదయః' అని లేదు. దేవరాజ యజ్వాకూడ నిర్వచనము మూలమున 'ఖేదా' శబ్దము తృతీయైకవచనమని చెప్పుచు 'ఖేదా' మంత్రము నుదాహరించియున్నాడు. 'ఖేదయా' అను నీ తృతీయాంతపదము ఋగ్వేదమున రెండుచోట్ల.(ఋ. ౮-౭౨-౮ ఋ. ౮-౭౭-3) 'ఖేదామ్' అను ద్వితీయాంతము ఋగ్వేదమున - (ఋ. ౧౦-౧౧౬-౪) ఒక్కచోటను ప్రయోగములు చూడబడుచున్నవి - అన్యవేదములందు రశ్మయః. ఇది ఙీప్ ప్రత్యయాంతము)

ఆతాః, ఆశాః, ఉపరాః, ఆష్ఠాః, కాష్ఠాః, వ్యోమ, కకుభః, హరితః, ఇతి దిశామ్ హరిత ఇతి అష్టౌ దిక్ నామాని. (౬)

శ్యావీ, క్షపా, శర్వరీ, అక్తుః, ఊర్మ్యా, రామ్యా, యమ్యా, నమ్యా, దోషా, నక్తా, తమః, రజః, అసిక్నీ, పయస్వతీ, తమస్వతీ, ఘృతాచీ, శిరిణా, మోకీ, శోకీ, ఊధః, పయః, హిమా, వస్వీ, ఇతి త్రయోవింశతి రాత్రినామాని. (౭)

(1. శ్రీణా, 2. హిమ, 3. వసు, వస్వా - వస్వీ)

విభావరీ, సూనరీ, భాస్వతీ, ఓదతీ, చిత్రామఘా, అర్జునీ, వాజినీ, వాజినీవతీ, సుమ్నావరీ, అహనా, ద్యోతనా, శ్వేత్యా, అరుషీ, సూనృతా, సూనృతావతీ, సూనృతావరీ, ఇతి షోడశ ఉషో నామాని. (౮)

వస్తోః, ద్యుః, భానుః, వాసరమ్, స్వసరాణి, ఘ్రంసః, ఘర్మః, ఘృణః, దినమ్, దివా, దివేదివే, ద్యవిద్యవీత్యహ్నః ద్యవిద్యవీతి ద్వాదశ, అహర్నామాని. (౯)

(4. ద్యోః, 5. ఘృణిః, పాఠాంతరములు)

అద్రిః, గ్రావా, గోత్రః, వలః, అశ్నః, పురుభోజాః, వలిశానః, అశ్మా, పర్వతః, గిరిః, వ్రజః, చరుః, వరాహః, శంబరః, రౌహిణః, రైవతః, ఫలిగః, ఉపరః, ఉపలః, చమసః, అహిః, అభ్రమ్, బలాహకః, మేఘః, దృతిః, ఓదనః, వృషంధిః, వృత్రః, అసురః, కోశః, ఇతి మేఘనామ, కోశ ఇతి త్రింశన్మేఘ నామాని. (౧౦)

(6. పర్వానః, పర్జానః, ఈ పాఠములు అక్కడక్కడ కనిపించు చున్నవి. 7. అభ్రమ్, 8. దత్రిః, 9. ఓదనమ్, 10. విషింధిః)

శ్లోకః, ధారా, ఇళా, గౌః, గౌరీ, గాంధర్వీ, గభీరా, గంభీరా, మంద్రా, మంద్రాజనీ, వాశీ, వాణీ, వాణీచీ, వాణః, పవిః, భారతీ, ధమనిః, నాళీః, మేళిః, మేనా, సూర్యా, సరస్వతీ, నివిత్, స్వాహా, వగ్నుః, ఉపబ్దిః, మాయుః, కాకుత్, జిహ్వా, ఘోషః, స్వరః, శబ్దః, స్వనః, ఋక్, హోత్రా, గీః, గాథా, గణః, ధేనా, గ్నాః, విపా, నవా, కశా, ధిషణా, నౌః, అక్షరమ్, మహీ, అదితిః, శచీవాక్, అనుష్టుప్, ధేనుః, వల్గుః, గల్దా, సరః, సుపర్ణీ, జేకురేతివాచః, (జేకు, రేతి సప్తపంచాశత్, వాఙ్నామాని) (౧౧)

(11. బ్రహ్మ, బహ్మ, 12. బుధ్బురమ్, బుర్బురః, 13. సుక్షేమా, సుక్షేమ, 14. సుశా, సూశా, 15. అరరివాని, 16. జామిః, 17. అక్షరః, అక్షరా, 18. పయః, 19. యాదః, 20. స్వర్ణీకమ్, 21. సతీకమ్, స్మృతీకమ్ 22. సతిసమ్, 23 గంభీరమ్, 24. గహ్వరమ్, 25. కమ్, 1. హేమా, 2. అంబుః, 3. తృపీటమ్, సృపీటమ్, ఇయ్యవి అధికపాఠములు)

అర్ణః, క్షోదః, క్షద్మ, నభః, అంభః, కబంధమ్, సలిలమ్, వాః, వనమ్, ఘృతమ్, మధు, పురీషమ్, పిప్పలమ్, క్షీరమ్, విషమ్, రేతః, కశః, జన్మ, బృబూకమ్, బుసమ్, తుగ్ర్యా, బుర్బురమ్, సుక్షేమ, ధరుణమ్, సురా, అరవిందాని, ధ్వస్మన్వత్, జామి, ఆయుధాని, క్షపః, అహిః, అక్షరమ్, స్రోతః, తృప్తిః, రసః, ఉదకమ్, పయః, సరః, భేషజమ్, సహః, శవః, యహః, ఓజః, సుఖమ్, క్షత్రమ్, ఆవయాః, శుభమ్ యాదుః, భూతమ్, భువనమ్, భవిష్యత్, ఆపః, మహత్, వ్యోమ, యశః, మహః, సర్ణీకమ్, స్వృతీకమ్, సతీనమ్, గహనమ్, గభీరమ్, గంభరమ్, ఈమ్ అన్నమ్, హవిః, సద్మ, సదనమ్, ఋతమ్, యోనిః, ఋతస్యయోనిః-సత్యమ్, నీరమ్, రయిః, సత్, పూర్ణమ్, సర్వమ్, అక్షితమ్, బర్హిః, నామ, సర్పిః, అపః, పవిత్రమ్, అమృతమ్, ఇందుః, హేమ, స్వః, సర్గాః, శంబరమ్, అభ్వమ్, వపుః, అమ్బు, తోయమ్, తూయమ్, కృపీటమ్, శుక్రమ్, తేజః, స్వధా, వారి, జలమ్, జలాషమ్, ఇదమిత్యుదకస్య (ఇదమ్ ఇతి ఏకశతమ్ ఉదకనామాని) (౧౨)

అవనయః, యహ్వ్యః, ఖాః, సీరాః, స్రోత్యాః, ఏన్యః, ధునయః, రుజానాః, వక్షణాః, ఖాదో అర్ణాః, రోధచక్రాః, హరితః, సరితః, అగ్రువః, నభన్వః, వధ్వః, హిరణ్యవర్ణాః, రోహితః, సస్రుతః, అర్ణాః, సింధవః, కుల్యాః, వర్యః, ఉర్వ్యః, ఇరావత్యః, పార్వత్యః, స్రవన్త్యః, ఊర్జస్వత్యః, పయస్వత్యః, సరస్వత్యః, తరస్వత్యః, హరస్వత్యః, రోధస్వత్యః, భాస్వత్యః, అజిరాః, మాతరః, నద్యః, ఇతి సప్తత్రింశ న్నదీనామాని. (౧౩)

అత్యః, హయః, అర్వా, వాజీ, సప్తిః, వహ్నిః, దధిక్రాః, దధిక్రావా, ఏతగ్వః, ఏతశః, పైద్వః, దౌర్గహః, ఔచ్చైఃశ్రవసః, తార్క్ష్యః, ఆశుః, బ్రధ్నః, అరుషః, మాంశ్చత్వః, అవ్యథయః, శ్యేనాసః, సుపర్ణాః, పతంగాః, నరః, హ్వార్యాణామ్, హంసాసః, అశ్వాః, ఇతి షడ్వింశతి రశ్వనామాని. (౧౪)

హరీ ఇంద్రస్య, రోహితోఽగ్నేః, హరిత ఆదిత్యస్య, రాసభావశ్వినోః, అజాఃపూష్ణః, పృషత్యోమరుతామ్, అరుణ్యోగావ ఉషసామ్, శ్యావాః సవితుః విశ్వరూపా బృహస్పతేః, నియుతోవాయోః ఇతి దశాఽఽదిష్టోపయోజనాని. (౧౫)

భ్రాజతే, భ్రాశతే, భ్రాశ్యతి, దీదయతి, శోచతి, మన్దతే, భందతే, రోచతే జ్యోతతే, ద్యోతతే, ద్యుమత్ ఇతి ఏకాదశ జ్వలతి కర్మాణః. (౧౬)

జమత్, కల్మలీకినమ్, జంజణాభవన్, మల్మలాభవన్ అర్చిః, శోచిః, తపః తేజః, హరః, హృణిః, శృంగాణి, శృంగాణి, ఇతి జ్వలతః, ఇతి ఏకాదశజ్వలతో నామధేయాని. (౧౭)

(1 అధ్యాయ సమాప్తిని తెలుపుటకు శృంగాణి పదము రెండు మారులు పఠింపబడినది)

[గౌర్హేమాంబరం స్వః ఖేదయ అతాః శ్యావీ విభావరీ వస్తోరద్రిః శ్లోకోఽర్ణో వసయోఽత్యో హరీ ఇంద్రస్య భ్రాజతే జమదితి సప్తదశ)

ఇతి ప్రథమోఽధ్యాయః

## ద్వితీయోఽధ్యాయః

అపః, అప్నః. దంసః. వేషః. వేపః. విష్ట్వీ. వ్రతమ్. కర్వరమ్. శక్మ. క్రతుః కరణమ్. కరణాని. కరాంసి. కరంతీ కరిక్రత్. చక్రత్. కర్త్వమ్. కర్తోః. కర్తవై కృత్వీ. ధీః. శచీ. శమీ. శిమీ శక్తిః. శిల్పమ్. ఇతి షడ్వింశతి కర్మనామాని. (౧)

తుక్, తోకమ్. తనయః. తోక్మ. తక్మ. శేషః. అప్నః. గయః. జాః. అపత్యం. యహుః. సూనుః. నపాత్. ప్రజా. బీజం. ఇతి పంచదశ అపత్యనామాని. (౨)

మనుష్యాః. నరః. ధవాః. జంతవః. విశః, క్షితయః. కృష్టయః. చర్షణయః. నహుషః. హరయః. మర్యాః. మర్త్యాః. మర్తాః. వ్రాతాః తుర్వశాః. ద్రుహ్యవః. ఆయవః. యదవః. అనవః. పూరవః. జగతః, తస్థుషః. పంచజనాః. వివస్వన్తః. పృతనాః. ఇతి పంచవింశతిః మనుష్యనామాని. (౩)

ఆయతీ. చ్యవానా. అభీశూ. అప్నవానా. వినంగృసా. గభస్తీ. కరస్నా. బాహూ. భురిజౌ. క్షిపస్తీ. శక్వరీ. భరిత్రే. ఇతి ద్వాదశ బాహునామాని.(౪)

అగ్రువః. అణ్వ్యః. క్షిపః. వ్రిశః. శర్యాః. రశనాః. ధీతయః. అథర్యః. విపః. కక్ష్యాః. అవనయః. హరితః. స్వసారః. జామయః. సనాభయః. యోక్త్రాణి. యోజనాని. ధురః. శాఖాః. అభీశవః. దీధితయః. గభస్తయః. ఇతి ద్వావింశతిః అంగుళినామాని. (౫)

వశ్మి. ఉశ్మసి. వేతి. వేనతి. వేసతి. వాఞ్ఛతి. వష్టి. వనోతి. జుషతే. హర్యతి. ఆచకే. ఉశిక్. మన్యతే. ఛంత్సత్. చాకనత్. చకమానః. కనతి. కానిషత్. ఇతి అష్టాదశ కాంతికర్మాణః. (౬)

అంధః. వాజః. పయః. ప్రయః. పృక్షః. పితుః. సుతః. సినమ్. అవః. క్షు. ధాసిః. ఇరా. ఇళా. ఇషమ్. ఊర్క్. రసః. స్వధా. అర్కః. ఛద్మ. నేమః. ససమ్. నమః. ఆయుః. సూనృతా. బ్రహ్మ. వర్చః. కీలాలమ్. యశః. ఇతి అష్టావింశతిః అన్ననామాని. (౭)

ఆవయతి. భర్వతి. బభస్తి. వేతి. వేవేష్టి. అవిష్యన్. వప్సతి. భసథః. బబ్ధామ్. హ్వరతి. ఇతి దశ అత్తికర్మాణః. (౮)

ఓజః. పాజః. శవః. తవః. సరః. త్వక్షః. శర్ధః. బాధః. నృమ్ణమ్. తవిషీ. శుష్మమ్. శుష్ణమ్. దక్షః. వీళుః. చ్యౌత్నమ్. శూషమ్. సహః. యహః. వధః. వర్గః. వృజనమ్. వృక్. మజ్మనా. పౌంస్యాని. ధర్ణసిః. ద్రవిణమ్. స్యంద్రాసః. శంబరమ్. ఇతి అష్టావింశతిః బలనామాని. (౯)

మఘమ్. రేక్ణః. రిక్థమ్. వేదః. వరివః. శ్వాత్రం. రత్నం. రయిః క్షత్రం. భగః. మీళహుం గయః. నృమ్ణం. ద్యుమ్నం. తనా. బంధుః. ఇంద్రియం. వసు. రాయః. రాధః. భోజనం. మేధా. యశః. బ్రహ్మ. ద్రవిణం, శ్రవః. వృత్రం. ఋతం. ఇతి అష్టావింశతిరేవ ధననామాని. (౧౦)

అఘ్న్యా. ఉస్రా. ఉస్రియా. అహీ. మహీ. అదితిః. ఇళా. జగతీ. శక్వరీ. ఇతి నవ గోనామాని. (౧౧)

రేళతే - హేళతే. భామతే. భృణీయతే. భ్రీణాతి. భ్రేషతి. దోధతి. వనుష్యతి. కంపతే. భోజతే. ఇతి దశ క్రుధ్యతి కర్మాణః. (౧౨)

హేళః. హరః. హృణిః. త్యజః. భామః. ఏహః. హ్వరః. తపుషీ. జూర్ణిః మన్యుః. వ్యథిః. ఇతి ఏకాదశ క్రోధనామాని. (౧౩)

వర్తతే. అయతే. లోటతే. లోఠతే. స్యందతే. కసతి. సర్పతి. స్యమతి. స్రవతి. స్రంసతే. అవతి. శ్చోతతి. ధ్వంసతి. వేనతి. మార్ష్టి. భురణ్యతి. శవతి. కాలయతి. పేలయతి. కంటతి, పిస్యతి. విస్యతి. మిస్యతి. ప్రవతే. ప్లవతే. చ్యవతే, కవతే, గవతే, నవతే, క్షోదతి. నక్షతి. సక్షతి. మ్యక్షతి. సచతి. ఋచ్ఛతి. తురీయతి. చతతి. అతతి. గాతి. ఇయక్షతి. సస్తి. త్సరతి. రంహతి. యతతే. భ్రమతి. ధ్రజతి. రజతి. లజతి. క్షియతి. ధమతి. మినాతి. ఋణ్వతి. ఋణోతి. స్వరతి. సిసతి. విషిష్టి. యాషిష్టి. రిణాతి. రీయతే. రేజతి. దధ్యతి. దఘ్నోతి. యుధ్యతి. ధన్వతి. అరుషతి. ఆర్యతి. డీయతే. తకతి. దీయతి. ఈషతి. ఫణతి. హనతి. అర్దతి. మర్దతి. సర్స్రతే. నసతే. హర్యతి. ఇయర్తి. ఈర్తే. ఈంఖతే. జ్రయతి. శ్వాత్రతి. గన్తి. అగనిగన్తి. జంగంతి. జిన్వతి. జసతి. గమతి. ధ్రతి. ధ్రాతి. ద్రయతి. వహతే. రథర్యతి. జేహతే. ష్వఃకతి. స్కంపతి. ప్సాతి. వాతి. యాతి. ఇషతి. ద్రాతి. ద్రాకతి. ఏజతి. జమతి. జవతి. వంచతి. అనితి. పవతే. హన్తి. మేధతి. అగన్. అజగన్. జిగాతి. పతతి. ఇన్వతి. ద్రమతి. ద్రవతి. వేతి. హన్తాత్. ఏతి. జగాయాత్. అయుధుః. ఇతి ద్వావింశశతం గతికర్మాణః.—౧౪

ను. మంక్షు. ద్రవత్. ఓషమ్. జీరాః. జూర్ణిః శూర్తాః. శూఘ నాసః. శీభం. తృపు. తూయం. తూర్ణిః. అజిరం. భురణ్యుః. శు. ఆశు ప్రాశుః. తూతుజిః. తూతుజానః. తుజ్యమానాసః. అజ్రాః. సాచీవిత్. ద్యుగత్. తాజత్. తరణిః. వాతరంహాః. ఇతి. షడ్వింశతిః క్షిప్రనామాని. (౧౫)

తళిత్. ఆసాత్. అంబరం. తుర్వశే. అస్తమీకే. ఆకే. ఉపాకే. ఆర్వాకే. అంతమానాం. అవమే. ఉపమే. ఇతి ఏకాదశ అన్తికనామాని (౧౬)

రణః. వివాక్. విఖాదః. నదనుః. భరే. ఆక్రన్దే. ఆహవే ఆజౌ. పృతనాజ్యం. అభీకే. సమీకే. మమసత్యం. నేమధితా. సంకాః. సమితిః. సననం. మీళ్హే. పృతనాః. స్పృధః. మృధః. పృత్సు. సమత్సు. సమర్యే. సమరణే. సమోహే. సమిథే సంఖ్యే. సంగే. సంయుగే. సంగథే. సంగమే. వృత్రతూర్యే. పృక్షే. ఆణౌ. శూరసాతౌ. వాజసాతౌ. సమనీకే.

ఖలే. ఖజే. పౌంస్యే. మహాధనే. వాజే. అజ్మ. సద్మ. సంయత్. సంవత. ఇతి షట్ చత్వారింశత్ సంగ్రామనామాని. (౧౭)

ఇన్వతి. నక్షతి. ఆక్షాణః ఆనట్. అష్ట ఆపానః. అశత్. నశత్. ఆనశే. అశ్నుతే. ఇతి దశ వ్యాప్తికర్మాణః. (౧౮)

దభ్నోతి. శ్నథతి. ధ్వరతి. ధూర్వతి. వృణక్తి. వృశ్చతి. కృణత్తి. కృన్తతి. శ్వసితి. నథతే. అర్దయతి స్తృణాతి. స్నేహయతి. యాతయతి. స్ఫురతి. స్ఫులతి. నివపన్తు. ఆవనిరతి. వియాతః. ఆతిరత్. తళిత్. ఆఖండల. ద్రూణాతి. రష్ణాతి. శృణాతి. శప్నాతి. తృవేళిహ. తాళిహ. నితోశతే. నిబర్హతి. మినాతి. మినోతి. ధమతి. ఇతి త్రయస్త్రింశత్ వధకర్మాణః. (౧౯)

దిద్యుత్. నేమిః. హేతిః. నమః. పవిః. సృకః. వధః. వజ్రః అర్కః. కుత్సః. కులిశః. తుంజః. తిగ్మః. మేనిః. స్వధితిః. సాయకః పరశుః. ఇతి అష్టాదశ వజ్రనామాని. (౨౦)

ఇరజ్యతి.పత్యతే.క్షయతి. రాజతి .ఇతి చత్వారి ఐశ్వర్యకర్మాణః. ౨౧

రాష్ట్రీ. అర్యః. నియుత్వాన్. ఇనః. ఇనః. ఇతి చత్వారి ఈశ్వర నామాని. (౨౨)

ఇతి ద్వితీయోఽధ్యాయః

## తృతీయోఽధ్యాయః

ఉరు, తువి, పురు, భూరి, శశ్వత్, విశ్వమ్, పరీణసా, వ్యానశిః, శతమ్, సహస్రమ్, సలిలమ్, కువిత్. ఇతి ద్వాదశ బహునామాని. (౧)

ఋహన్, హ్రస్వః, నిధృష్వః, మాయుకః, ప్రతిష్ఠా, కృధు, వమ్రకః, దభ్రమ్, అర్భకః, క్షుల్లకః, అల్పమ్ ఇతి ఏకాదశ హ్రస్వ నామాని. (౨)

మహత్, బ్రధ్నః, ఋష్వః, బృహత్, ఉక్షితః, తవసః, తవిషః, మహిషః, అభ్వః, ఋభుక్షాః, ఉక్షా, విహాయాః, యహ్వః, వవక్షిథ,

వివక్షసే, అంభృణః, మాహినః, గభీరః, కకుహః, రభసః, వ్రాధన్, విరప్శీ, అద్భుతమ్, బంహిష్ఠః, బర్హిషత్, ఇతి పంచవింశతిర్ మహన్నామాని. (3)

గయః, కృదరః, గర్తః, హర్మ్యమ్, అస్తమ్, పస్త్యమ్, దురోణే నీళమ్, దుర్యాః, స్వసరాణి, అమా, దమే, కృత్తిః, యోనిః, సద్మ, శరణమ్, వరూథమ్, ఛర్దిః, ఛదిః, ఛాయా, శర్మ, అజ్మ, ఇతి ద్వావింశతిః గృహనామాని. (౪)

ఇరజ్యతి, విధేమ, సపర్యతి, నమస్యతి, దువస్యతి, ఋధ్నోతి, ఋణద్ధి, ఋచ్ఛతి, సపతి, వివాసతి, ఇతి దశ పరిచరణకర్మాణః. (౫)

శిమ్బాతా, శతరా, శాతపన్తా, శర్మ, స్యూమకమ్, శేవృధమ్, మయః, సుగ్మ్యమ్, సుదినమ్, శూషమ్, శునమ్, శగ్మమ్, భేషజమ్, జలాషమ్, స్యోనమ్, సుమ్నమ్, శేవమ్, శివమ్, శమ్, కమ్, ఇతి వింశతిః సుఖనామాని (౬)

నిర్ణిక్, వవ్రిః, వర్పః, వపుః, అమతిః, అప్సః, ప్సః, అప్నః పిష్టమ్, పేశః, కృశనమ్, మరుత్, అర్జునమ్, తామ్రమ్, అరుషమ్, శస్యమ్, ఇతి షోడశ రూపనామాని. (౭)

అస్రేమా, అనేహా అనేద్యః, అనవద్యః, అనభిశస్త్యః, ఉక్థ్యః, సునీథః, పాకః, వామః, వయునమ్, ఇతి దశ ప్రశస్యనామాని. (౮)

కేతః, కేతుః, చేతః, చిత్తమ్, క్రతుః, అసుః, ధీః, శచీ, మాయా, వయునమ్, అభిఖ్యా, ఇతి ఏకాదశ ప్రజ్ఞానామాని. (౯)

బట్, శ్రత్, సత్రా, అద్ధా, ఇత్థా, ఋతమ్, ఇతి షట్ సత్యనామాని (౧౦)

చిక్యత్, చాకనత్, అచక్ష్మ, చష్టే విచష్టే, విచర్షణిః, విశ్వచర్షణిః, అవచాకశత్, ఇతి అష్టౌ పశ్యతికర్మాణః. (౧౧)

హికమ్, నుకమ్, సుకమ్, ఆహికమ్, ఆకీమ్, నకిః, మాకిః, నకీమ్, ఆకృతమ్, ఇతి నవోత్తరాణి పదాని సర్వపదసమామ్నానాయ. (౧౨)

ఇదమివ, ఇదం యథా, అగ్నిర్న యే, చతురశ్చిద్దదమానాత్, బ్రాహ్మణా వ్రతచారిణః, వృక్షస్య ను తే పురుహూత వయాః, జార

ఆ భగమ్. మేషో, భూతోఽభి యన్నయః, తద్రూపః, తద్వర్ణః, తద్వత్, తథా, ఇత్యుపమాః. (౧౩)

అర్చతి, గాయతి, రేభతి, స్తోభతి, గూర్ధయతి, గృణాతి, జరతే, హ్వయతే, నదతి, పృచ్ఛతి, రిహతి, ధమతి, కృపాయతి, కృపణ్యతి, పనస్యతి, పనాయతే, వల్గూయతి, మందతే, భన్దతే, ఛన్దతి, ఛదయతే, శశమానః, రంజయతి, రజయతి, శంసతి, స్తౌతి, యౌతి, రౌతి, నౌతి, భనతి, పణాయతి, పణతే, సపతి, పపృక్షాః, మహయతి, వాజయతి, పూజయతి, మన్యతే, మదతి, రసతి, స్వరతి, వేనతి, మంద్రయతే, జల్పతి, ఇతి చతుశ్చత్వారింశత్ అర్చతికర్మాణః. (౧౪)

విప్రః, విగ్రః, గృత్సః, ధీరః, వేనః, మేధాః, కణ్వః, ఋభుః, నవేదాః, కవిః, మనీషి, మంధాతా, విధాతా, విపః మనశ్చిత్, విపశ్చిత్, విపన్యవః, ఆకేనిపః, ఉశిజః, కీస్తాసః, అద్ధాతయః. మతయః, మతుథాః వాఘతః, ఇతి చతుర్వింశతిః మేధావి నామాని. (౧౫)

రేభః, జరితా, కారుః, నదః, స్తాముః, కీరిః, గౌః, సూరిః, నాదః, ఛందః, స్తుప్, రుద్రః, కృపణ్యుః, ఇతి త్రయోదశ స్తోతృనామాని. (౧౬)

యజ్ఞః, వేనః, అధ్వరః, మేధః, విదథః, నార్యః, సవనమ్, హోత్రా, ఇష్టిః, దేవతాతా, మఖః, విష్ణుః, ఇందుః, ప్రజాపతిః, ఘర్మః, ఇతి పంచదశ యజ్ఞనామాని. (౧౭)

భరతాః, కురవః, వాఘతః, వృక్తబర్హిషః, యతస్రుచః, మరుతః, సబాధః, దేవయవః, ఇతి అష్టౌ ఋత్విఙ్నామాని. (౧౮)

ఈమహే, యామి, మన్మహే, దద్ధి, శగ్ధి, పూర్ధి, మిమిడ్ఢి, మిమీహి, రిరిడ్ఢి, రిరీహి, పీపరత్, యంతారః, యంధి, ఇషుధ్యతి, మదేమహి, మనామహే, మాయతే, ఇతి సప్తదశ యాచ్ఞా కర్మాణః. (౧౯)

దాతి, దాశతి, దాసతి, రాతి, రాసతి, పృణక్తి, పృణాతి, శిక్షతి, తుంజతి, మంహతే, ఇతి దశ దానకర్మాణః. (౨౦)

పరిస్రవ, పవస్వ, అభ్యర్ష, ఆశిషః ఇతి చత్వారః అధ్యేషణా కర్మాణః. (౨౧)

స్వపితి, సస్తి, ఇతి ద్వౌ స్వపితికర్మాణౌ. (౨౨)

కూపః, కాతుః, కర్తః, వవ్రః, కాటః, ఖాతః, అవతః, క్రివిః, సూదః, ఉత్సః, ఋశ్యదాత్, కారోతరాత్, కుశయః, కేవటః, ఇతి చతుర్దశ కూపనామాని. (౨౩)

తృప్తుః, తక్వా, రిభ్వా, రిపుః, రిక్వా, రిహాయాః, తాయుః, తస్కరః, వనర్గుః, హూరశ్చిత్, ముషీవాన్, మలిమ్లుచః, అఘశంసః, వృకః, ఇతి చతుర్దశ స్తేననామాని. (౨౪)

నిణ్యమ్, సస్వః, సనుతః, హిరుక్, ప్రతీచ్యమ్, అపీచ్యమ్, ఇతి షట్ నిర్ణీతాంతర్హిత నామధేయాని. (౨౫)

ఆకే, పరాకే, పరాచైః, ఆరే, పరావతః, ఇతి పంచ దూరనామాని.(౨౬)

ప్రత్నమ్, ప్రదివః, ప్రవయాః, సనేమి, పూర్వ్యమ్, అహ్నాయ, ఇతి షట్ పురాణనామాని. (౨౭)

నవమ్, నూత్నమ్, నూతనమ్, నవ్యమ్, ఇదా, ఇదానీమ్, ఇతి షడేవ నవనామాని. (౨౮)

ప్రపిత్వే, అభీకే, దభ్రమ్, అర్భకమ్, తిరః, సతః, త్వః, నేమః ఋక్షాః, స్తృభిః, వమ్రీభిః, ఉపజిహ్వికా, ఊర్దరమ్, కృదరమ్, రంభః, పినాకమ్, మేనా, గ్నాః, శేపః, వైతసః, అయా, ఏనా, సిషక్తు, సచతే, భ్యసతే, రేజతే, ఇతి షడ్ వింశతిః ద్విశఉత్తరాణి నామాని. (౨౯)

స్వాధే, పురంధీ. ధిషణే, రోదసీ, క్షోణీ, అంభసీ, నభసీ, రజసీ, సదసీ. సద్మనీ, ఘృతవతీ, బహులే, గభీరే, గంభీరే, ఓణ్యౌ, చమ్వౌ, పార్థ్వే, మహీ, ఉర్వీ. పృథ్వీ, అదితీ, అహీ, దూరేఅన్తే, అపారే అపారే, ఇతి చతుర్వింశతిః ద్యావాపృథివీ నామధేయాని. (౩౦)

ఉర్వ్యత్రి, హన్, మహాన్, గయ, ఇరజ్యతి, శిమ్యాతా, నిర్త్గిగ్, ఆస్రేమా, కేతుర్వాన్, చక్షోద్దకమ్, ఇదమివాశ్చతి విప్రా, దేఘో, యక్షో,

భరతా, ఈమహే. దాతి, పరిస్రవ, స్వాపిః, కాప, స్పృశ్, నిర్ఋతిమ్, ఆకే, ప్రత్న, స్నవమ్, ప్రపిత్వే స్వధే. (త్రింశత్)

## చతుర్థోఽధ్యాయః

జహా. నిధా. శితామ. మేహనా. దమూనాః. మూషః. ఇషిరేణ. కురుతన. జఠరే. తితఉ. శిప్రే. మధ్యా. మందూ ఈర్మాన్తాసః. కాయమానః, లోధమ్. శీరమ్. విద్రధే. ద్రుపదే తుగ్వని నంసన్తే. నసన్త. ఆహనసః. అధ్మసత్. ఇష్మిణః. వాహః. పరితక్మ్యా. సువితే. దయతే. నూచిత్, నూచ. దావనే. అకూపారస్య. శిశీతే. సుతుకః. సుప్రాయణాః. అప్రాయువః. చ్యవనః. రజః. హరః. జుహురే వ్యన్త. క్రాణాః. వాశీ. విషుణః. జామి. పితా. శంయోః. అదితిః. ఏరిరే. జసురిః. జరతే. మందినే. గౌః. గాతుః దంసయః. తూతావ. చయసే. వియుతే. ఋధక్ అస్యాః అస్య. ఇతి ద్విషష్టిః పదాని. (౧)

సస్నిమ్. వాహిష్ఠః, దూతః. వావశానః. వార్యమ్. అన్ధః. అసశ్చన్తీ వనుష్యతి. తరుష్యతి. భందనాః. ఆహనః. నదః. సోమో అక్షాః. శ్వాత్రమ్. ఊతిః. హాసమానే. పడ్భిః, ససమ్. ద్వితా. వ్రాః. వరాహః. స్వసరాణి. శర్యాః. అర్కాః. పవిః. వక్షః ధన్వ. సినమ్. ఇత్థా. సచా. చిత్. ఆ. ద్యుమ్నమ్. పవిత్రమ్. తోదః. స్వఞ్చాః. శిపివిష్టః. విష్ణుః. ఆఘృణిః. పృథుజ్రయాః. అథర్యుమ్. కాణుకా. అధ్రిగుః. ఆఙ్గూషః ఆపాన్తమన్యుః. శ్మశా. ఉర్వశీ. వయునమ్. వాజపస్త్యమ్. వాజగంధ్యమ్. గధ్యమ్. గధితా. కౌరయాణః. తౌరయాణః. అహ్రయాణః. హరయాణః. ఆరితః. వ్రన్దీ. నిష్షపీ. తూర్ణాశమ్. క్షుంపమ్. నిచుంపుణః. పదిమ్. పాదుః. వృకః. జోషవాకమ్. కృత్తిః. శ్వఘ్నీ. సమస్య. కుటస్య చర్షణిః. శంబః. కేపయః. తూతుమాకృషే అంసత్రమ్. కాకుదమ్. వీరిటమ్. అచ్ఛ. పరి. ఈమ్. సీమ్. ఏనమ్. ఏనామ్. సృణిః. ఇతి చతురుత్తరమ్ అశీతిః పదాని. (౨)

ఆశుశుక్షణిః - ఆశాభ్యః - కాశిః - కుణారుమ్ - అలాతృణః - సలిలూకమ్ - కత్పయమ్ - విస్రుహః - వీరుధః - నక్షద్దాభమ్ - అస్క్ర

ధేయుః - నిశృంభాః - బృవదుక్థమ్ - ఋదూదరః - ఋదూపే - పులు
కామః - అసిన్వతి - కపనా - భాఋజీకః - రుజానాః - జూర్ణిః - ఓమనా -
ఉపలప్రక్షిణీ - ఉపసి - ప్రకలవిత్ - అభ్యర్ధయజ్వా - ఈక్షే -
క్షోణస్య - అస్మే — పాథః — సవీమని - సప్రథాః - విదథాని-శ్రాయన్తః -
ఆశీః - అజీగః - అమూరః — శశమానః - దేవోదేవాచ్యాకృపా - విజా
మాతుః - ఓమాసః - సోమానమ్ — అనవాయమ్ - కిమీదినే - అమవాన్-
అమీవా - దురితమ్ - అప్వా - అమతిః - శ్రుష్టీ - పురంధిః - రుశత్ —
రిశాదసః - సుదత్రః - సువిదత్రః - ఆనుషక్ - తుర్వణిః - గిర్వణాః -
అసూర్తెసూర్తె - అమ్యక్ - యాదృశ్మిన్ - జారయాయి - అగ్రియా -
చనః - పచతా - శురుధః - అమినః - జజ్ఝతీః - అప్రతిష్కుతః - శాశ
దానః - సృప్రః - సుశిప్రః - రంసు - ద్విబర్హాః - అక్రః - ఉరాణః -
స్తియానామ్ - స్తిపాః - జబారు - జరూథమ్ - కులిశః - తుంజః -
బర్హణా - తతనుష్టిమ్ - ఇలీబిశః - కియేధాః - భృమిః - విష్పితః -
తురీపమ్ - రాస్పినః - ఋంజతిః - ఋజునీతీ - ప్రతద్వసూ - హినోత -
చోష్కూయమాణః - చోష్కూయతే - సుమత్ - దివిష్టిషు - దూతః -
జిన్వతి - అమత్రః - ఋచీషమః - అనర్శరాతిమ్ - అనర్వా - అసామి -
గల్దయా - బల్హవః - బకురః - బేకనాటాన్ - అభిధేతన - అంహురః - బతః -
వాతాప్యమ్ - చాకన్ - రథర్యతి - అసక్రామ్ - ఆధవః-అనవబ్రవః-సదాన్వే -
శిరింబిఠః - పరాశరః - క్రివిర్దతీ - కరూళతీ - దనః - శరారుః - ఇదంయుః -
కీకటేషు - బుందః - వృందమ్ - కిః - ఉల్బమ్ - ఋబీసమ్ - ఋబీసమ్ -
ఇతి ద్వాత్రింశచ్ఛతమ్ పదాని.

(జహా - వస్నిమ్ అగుగుకిణః-త్రీణి)

## పంచమోఽధ్యాయః

అగ్నిః - జాతవేదాః - వైశ్వానరః - ఇతి త్రీణి పదాని (౧)

ద్రవిణోదాః - ఇధ్మః - తనూనపాత్ - నరాశంసః - ఇళః - బర్హిః
ద్వారః - ఉషాసానక్తా - దైవ్యాహోతారా - తిస్రోదేవీః - త్వష్టా - వనస్పతిః -
స్వాహాకృతయః - ఇతి త్రయోదశ పదాని. (౨)

అశ్వః - శకునిః - మండూకాః - అక్షాః - గ్రావాణః - నారాశంసః - రథః - దుందుభిః - ఇషుధిః - హస్తఘ్నః - అభీశవః - ధనుః - జ్యా - ఇషుః - అశ్వాజనీ - ఉలూఖలమ్ - వృషభః - ద్రుఘణః - పితుః - నద్యః - ఆపః - ఓషధయః - రాత్రిః - అరణ్యానీ - శ్రద్ధా - పృథివీ - అప్వా - అగ్నాయీ - ఉలూఖలముసలే - హవిర్ధానే - ద్యావాపృథివీ - విపాట్ఛు - తుద్రీ - ఆర్త్నీ- శునాసీరౌ - దేవీజోష్ట్రీ - దేవీఊర్జాహుతీ - ఇతి షట్ త్రింశత్ పదాని. (3)

వాయుః - వరుణః రుద్రః - ఇంద్రః - పర్జన్యః - బృహస్పతిః - బ్రహ్మణస్పతిః - క్షేత్రస్యపతిః - వాస్తోష్పతిః - వాచస్పతిః - అపాంనపాత్ - యమః - మిత్రః - కః - సరస్వాన్ - విశ్వకర్మా - తార్క్ష్యః - మన్యుః - దధిక్రాః - సవితా - త్వష్టా - వాతః - అగ్నిః - వేనః - అసునీతిః - ఋతః - ఇందుః - ప్రజాపతిః - అహిః - అహిర్బుధ్న్యః - సుపర్ణః - పురూరవాః - ఇతి ద్వాత్రింశత్ పదాని. (౪)

శ్యేనః - సోమః - చంద్రమాః - మృత్యుః - విశ్వానరః - ధాతా - విధాతా - మరుతః - రుద్రాః - ఋభవః - అంగిరసః - పితరః-అథర్వాణః- భృగవః - ఆప్త్యాః - అదితిః - సరమా - సరస్వతీ - వాక్ - అనుమతిః - రాకా - సినీవాలీ - కుహూః - యమీ - ఉర్వశీ - పృథివీ - ఇంద్రాణీ-గౌరీ - గౌః - ధేనుః - అఘ్న్యా - పథ్యా - స్వస్తిః - ఉషాః - ఇళా - రోదసీ - ఇతి షట్త్రింశత్ పదాని. (౫)

అశ్వినౌ - ఉషాః - సూర్యా - వృషాకపాయీ - సరణ్యూః - త్వష్టా - సవితా - భగః - సూర్యః - పూషా - విష్ణుః - విశ్వానరః - వరుణః - కేశీ - కేశినః - వృషాకపిః - యమః - అజఏకపాత్ - పృథివీ-సముద్రః-దధ్యఙ్- అథర్వా - మనుః - ఆదిత్యాః - సప్తఋషయః - దేవాః - విశ్వేదేవాః - సాధ్యాః - వసవః - వాజినః - దేవపత్న్యః - దేవపత్న్యః ఇత్యేకత్రింశత్ పదాని. (౬)

(అగ్నిర్ద్రవిణోదా అశ్వో వాయుః శ్యేనోఽశ్వినౌ షట్. (౬)

సమాప్తము

# యమ - యమీ - సూక్తము

యమ - యమీ - సూక్తము - ఋగ్వేదము దశమమండలమున దశమసూక్తము. ఈ ప్రకరణము అథర్వవేదమున (౧౮-౧-౧-౧౬) రెండు మంత్రముల యాధిక్యముతోను, కొన్నిభేదములతోను చూడబడుచున్నది. ఈ సూక్తమునకు సంబంధించిన నాలుగుమంత్రములు యాస్కాచార్యులు నిరుక్తమునందును గ్రహించియున్నారు.

సూక్తమంత్రములవ్యాఖ్య వ్రాయుటకుపూర్వము యమ-యమీలను గూర్చి కొంచెము వివేచించుట యనుచితముకాదనియెంచి ఈ వాక్యములు వ్రాయుచున్నాము. ఈ సూక్తమున యమ-యమీల సంవాదము కలదు. ఎవరీ యమ యమీలు? వీరి సంవాదమున పాఠకులకు కలుగు లాభ మేమి? ఈ విషయముల నిర్ణయానంతరమున మంత్రార్థములు తెలిసికొనుట పాఠకులకు సులభమగును.

౧) ఈ సూక్తమున యముడు - యమీ అన్న - చెల్లెలుగా బోధపడుదురు. ౨) ఈ సూక్తమునందలి పదునొకండవ ౧౧) మంత్రమున యమ యమీలకు భ్రాతా-స్వసా (సోదరుడు-సోదరి) పదములు ప్రయుక్తములైయున్నవి. ౧౨) మంత్రమున "పాపమాహుర్ యః స్వసారము నిగచ్ఛాత్" అని యమీ కొఱకు మరల 'స్వసా' పదము వాడబడినది. ఇట్లు భ్రాత-స్వసాపదములు అన్న-చెల్లెలు అను అర్థమునకక్క అన్యార్థమున ప్రయోగింపబడవు. ౩) వేదమునందలి యంతః సాక్ష్యమువలన యమ - యమీలు అన్నచెల్లెలని బోధపడుటయేకాక లౌకికసాహిత్యమునందు ఈ విషయమును బలపఱచుట చూడనగును. శబ్దకల్పద్రుమము మున్నగు కోశములందు యమునానదినిగూర్చి యమభగినీ, యమీ అనుపదము లుల్లేఖింపబడుట చూడనగును. అట్లే యముడు అనుపదమునకు పర్యాయ

వాచకముగా 'యమునాభ్రాతా' చెప్పబడుట చూడనగును. యముడు యమునాభ్రాత యెట్లయ్యెనను విషయమిట విచారణీయము కాదు. యమ-పదము యమునాభ్రాతగాను, యమీ-యమునా-రెండుపదములు యమునిభగినిగా వాడబడుట చూడబడుచున్నది.

కొందఱు స్వతంత్రవిచారకులు యమ-యమీలను పతిపత్నులుగా నెంచుచున్నారు. కాని వారి యీ యాలోచన ప్రమాణశూన్యము. సంస్కృతవాఙ్మయమున యమీ యమునిభగినిగా వర్ణించుట చూడనగును యముని పత్నిగా చూడము.

ఇట్లు సంస్కృతవాఙ్మయమున యమీ-యన యమునిభగిని యని స్పష్టముగా బోధపడుచున్నప్పటికిని ఈ నూత్నసమాలోచకులు 'యమీ' యమ-భగినికాదు యమునిపత్నియే యని చెప్పుచు - "పుంయోగాదాఖ్యాయామ్" (పా. ౪-౧-౪౮) అను పాణినీయ - వ్యాకరణసూత్రమును ఘోషించుచు, 'యమీ' యమునిభగిని యెన్నడును కాదు. యముని పత్నియే యగుననుచున్నారు. భగినీ అర్థమున 'యమా' అగునుగాని 'యమీ'కాదనియు వారివాదన. కాని యీ వాదన యెంతమాత్రము సరి కాదు. ఏలయన - ౧) ఏ భాషకు సంబంధించిన వ్యాకరణసూత్రమును తమవాదనను బలపఱచుటకు ప్రమాణముగా నుదాహరించుచున్నారో యా భాషాభిజ్ఞులైన కోశకారులెల్లరు 'యమీ' యమునిభగినియేయని కోశము లందు అర్థములు వ్రాసియున్నారు. కావున పై సూత్రమునకు వీరు చెప్పినట్టి యర్థము కాదు. దాని యభిప్రాయమేమన? - "పుంయోగాదాఖ్యాయామ్" సూత్రార్థము - పుంలింగనామ పురుషయోగమువలన నే స్త్రీలింగపదము ప్రయుక్తమగునో దానికి 'ఙీష్' ప్రత్యయమగును. ఇట స్త్రీ పురుష సంబంధముతో అన్న-చెల్లెలు, తండ్రి-కూతురు, అను వాని నేల గ్రహింపకూడదు? వానినెట్లు విడువగలము? అందువలననే - కౌముదీ కారుడు, "న ప్రాచ్యభర్గాది యౌధేయాదిభ్యః" (పా. ౪-౧-౭౮) సూత్ర వ్యాఖ్యానమునందు కైకేయీ - ఇత్యత్ర జన్యజనక భావలక్షణే. పుంయోగే 'ఙీష్' అనియు, మఱియు తత్త్వబోధినీకారుడు 'పుంయోగాదాఖ్యాయామ్' అను సూత్రముపై "యోగః సంబంధః స చేహ దంపతీభావ ఏవేతి నాగ్రహః సంకోచే మానా భావాదితి" అనియు వ్రాసియున్నారు. కావున

వేదముయొక్క అంతఃసాక్ష్యమువలన లోకప్రసిద్ధివలనను 'యమ-యమీ' అన్న-చెల్లెలు అనియే తెలుపునుకాని యముడు-యముని పత్నియనియుని యెన్నడు బోధింపవు.

౨) మఱియు - యమశబ్దము సహజాత జంట (కవలలు) అసహ జాతి జంటకు అను అర్థములందు ప్రయోగింపబడుట జూచుచున్నాము - ఇట్లు యముడు, యమీ అను పేరుపడ్డవారు సగోత్రభ్రాతృ-భగినులు స్వయముగా అన్న-చెల్లెలు కారు. సంపూర్ణసూక్తమున నెక్కడను 'యమ-యమీ'లు స్వయముగా అన్న-చెల్లెలు అని చెప్పుటకు తగిన శబ్దమొండును కానరాదు. పంచమమంత్రమున "గర్భే ను నౌ జనితా దంపతీ కః" అను వచనమును జూచి పలువురు పొరపడుచున్నారు. ఇట 'నౌ' పదము ద్వితీయాంత మనుకొనుచున్నారు. అది ద్వితీయాంతముగాదు. షష్ఠ్యంత పదము. కావున దీనియర్థము - "ఉత్పాదకుడగు పరమేశ్వరుడు భ్రాతృ భగినులను గర్భమునందె దంపతులనుగా చేసినాడు" అని యగును.

3) "గృభ్ణామి తే సౌభగత్వాయ హస్తమ్ మయా పత్యా జరదష్టి ర్యథా సః" (ఋ. ౧౦-౮౫-౩౬), "విధవేవ దేవరం మర్యం న యోషా" (ఋ. ౧౦-౪౦-౨), "ఉదీర్ష్వ నార్యభిజీవలోకమ్" (ఋ. ౧౦-౧౮-౮) అను మంత్రములందు, వివాహము, నియోగము ననురెండింటి సామాన్య విధానము కనబడుచున్నది. కాని యమ-యమీ సూక్తమున సగోత్ర వివాహము సగోత్రనియోగము నిషేధింపబడినది. "అసపిండా చ యా మాతుః అసపిండా చ యా పితుః - సా ప్రశస్తా ద్విజాతీనాం దారకర్మణి మైథునే" (మను - 3-౫)

అనుతరములవలన తల్లిదండ్రుల గోత్రములతో సంబంధములేని స్త్రీ ద్విజన్ములకు వివాహమునకు నియోగమునకు తగినదని మనువు చెప్పుచున్నాడు.

ఈ మనువచనమునకు మూలము యమ - యమీ - సూక్తమే. ఈ వేదాజ్ఞను పురస్కరించుకొనియే శ్రీ దయానందమహర్షి ఋగ్వేదాది భాష్యభూమికయందు, పరస్తు మాత, గురుపత్ని, భగిని, కన్య, పుత్రవధు-కోడలు మున్నగువారితో నియోగమువిధముగను తగదు' అని వ్రాసి యున్నారు. అందువలననే పుత్రీనామము 'దుహితా' - విలయున - 'దూరే

హితా' దూరమున గోత్రముకలియుని వారిని వివాహమాడి హితము కలిగించు నదియగునని చెప్పబడినది.

'సపిండ, సగోత్ర, సనాభి, సజ్ఞాతి' అను శబ్దములన్నియు కల్పద్రుమ కోశమునందు సమానార్థకములుగా చెప్పబడినవి.

చతుర్థమంత్రమున ప్రయుక్త 'గంధర్వో అప్స్వ ఆప్యా చ యోషా' 'సా నౌ నాభిః' 'పరమం జామి తన్నౌ' దశమమంత్రమున 'జామయః' శబ్దములు ఈ సగోత్రతకే బోధకములు.

౪) ఈ యమ-యమీలు ఇరువురు పూర్ణసంయమమును పాటించిన వారు. మంత్రవ్యాఖ్యను చూచినవారికి 'యమి' యొక్క సంయమము నందు సందేహమునకు తావులేదని స్పష్టమగును. 'పితుర్నపాత మా ద ధీత వేధా' 'ఏకస్య చిత్యజసంమర్త్యస్య' 'విశ్వ హేవ రథ్యేవ చక్రా' మున్నగు వానియందు యమి ఉచ్చఉద్దేశమునే నిర్దేశించుచున్నది.

'కామమంతా' యందు ఆమె 'నేనును ప్రవృద్ధచేతనై ఈ సంబంధము కొఱకు చెప్పుచున్నాను' అని స్పష్టముగానే చెప్పినది. యమియొక్క ప్రస్తావము అభీష్టమైనను భావము పాపపూర్ణము కాకపోగా పవిత్రమైనది.

సగోత్రీకుల వివాహముకొఱకు ఏదో యొకవిధమున బుద్ధిని, హృద యమును ఒప్పింపజేయవచ్చును. చేయబడినదికూడ. మరల దానికి సరియైన సమాధానముకూడచెప్పి నిషేధాత్మకపరిణామము తేల్చబడినది. దానితో ప్రస్తావకర్త్రియైన యమికూడ సహమతయైనది. ఇదియే యీ యమ-యమీ సంవాదరహస్యము.

౫) యమ - యమీ సూక్తముయొక్క నియోగపక్షమున నొక విషయము స్పష్టమగుచున్నది. అది యెద్దియన యమి యొక్కపతి జీవితుడే-కాని యతనివలన సంతానము కలుగలేదు. ప్రథమమంత్రముననే యమి చెప్పుచున్నది. పితుర్నపాత మాధత్త వేధా అధిక్షమి ప్రతరం దీధ్యానః" పితృవంశమునుగూర్చి చింతించుచు, నా విధాతా-పతి-పృథివిపై తన తండ్రియొక్క వంశమును నడంపజేయుని ప్రకృష్టపాత్రుని ధారణ చేయుగాక !" మఱియు నేడవమంత్రమున నిట్లనుచున్నది.

"పిప్పృహేవ రథ్యేవ చక్రా" పత్నిపతులమగు మేమిరువురము రథముయొక్క రెండుచక్రములవలె కలిసి ప్రయత్నింతుముగాక !

తొమ్మిదవ మంత్రమున 'యముడు' యమితోను ఆమెయొక్క పూర్వపతితోను ఇరువురి కల్యాణముకొఱకు పరమేశ్వరుని ప్రార్థించును.

నియోగపక్షమున, ౧౩, ౧౪ మంత్రములను జూచినమీదట విదిత మగుచున్నది ఏమన :— యమునికిని పత్నివలన సంతానముకలుగలేదు. అందువలన యముడును సంతానార్థము నియోగము చేయగోరును. కాని యతనిపత్ని జీవించియున్నదో లేదో తెలియదు. కాని యమియొక్క పతి మాత్రమింకను జీవితుడై యున్నాడనుట స్పష్టము.

భ్రాతయైన యముడు తన భగినియైన యమునికొఱకు "అన్య మిచ్ఛస్వ సుభగే పతిం మత్" అని ప్రయోగించి యున్నాడు. అట్లే అసమర్థు డైన పతి పత్నిని, అసమర్థయగుపత్ని, తనభర్తనుగూర్చి యిట్లు చెప్ప వచ్చును. అందువలననే శ్రీమద్దయానందమహర్షి తన సత్యార్థప్రకాశమున నాల్గవసముల్లాసమున ఉపర్యుక్తమంత్రవచనమునకు "హే సౌభాగ్యకి ఇచ్ఛాకరనేహారి స్త్రీ" ఓ సౌభాగ్యము నాశించు స్త్రీ అను నిట్టియర్థమును వ్రాసియున్నారు.

ఇకముందు సూక్తమంత్రముల వ్యాఖ్య—

యమియొక్క ఉక్తి

"ఓ చిత్ సఖాయం సఖ్యా వవృత్యాం తిరః పురూచిదర్ణవం జగన్వాన్
పితుర్నపాత మాదధీత వేధా అధిక్షమి ప్రతరం దీధ్యానః" (౧)

ఓచిత్ ! = ఓ జ్ఞానవంతుడగు యమ ! సఖాయం చిత్ సఖ్యా వవృతామ్ = శ్రేష్ఠమిత్రుడవగు నిన్ను, నేను గృహస్థధర్మముకొఱకు గ్రహింతును వర్తింతును. తిరః అర్ణవం చిత్ పురుజగన్వాన్ = ఎందువలన నీవు ఈ విద్యమాన భవసాగరమున సంపూర్ణతను-పూర్ణయౌవనమును పొందియున్నావో - దీధ్యానః వేధా = ప్రకాశమాన - లేక - మా ధ్యానము చేయుచు-అనగా మమ్ము అనుగ్రహించు విధాతా ప్రభువు, అధిక్షమి =

పృథివీస్థానీయునగు-స్త్రీయైన నాయందు, పితుః ప్రతరం న పాతం = పితృ వంశమును నశింపజేయని ప్రకృష్టసంతానమును, ఆదధీత = ధారణ చేయుదువుగాక !

నియోగపక్షమున - దీధ్యానః వేధా=పితృవంశమునుగూర్చి యాలోచించు నా విధాతయగుపతి, అధిక్షమి = భూమిపై, పితుః ప్రతరం న పాతం ఆదధీత = తన పితృవంశమును నశింపజేయనివాడగు ప్రకృష్ట పౌత్రుని ధారణచేయుగాక !

విశేషము :— రెండవ చిత్పదము పూజార్థకము. సఖ్యా సఖ్యాయ (సుపాంసులుక్ పా ౭-౧-౩౯) జే-స్థానము 'ఆ' తరప్ ప్రాప్తమ్ వృషు = సంపూర్ణతా, సుశ్రుత మేమనుచున్నది చూడుడు - "చతస్రో అవస్థా శరీరస్య వృద్ధిర్ యౌవనం సంపూర్ణతా తతః కించిత్ పరిహాణిశ్చ" పూర్ణ యౌవనము తదుపరి, వృద్ధావస్థయందు వివాహము లేక నియోగము జరుగ రాలదు. ఇందులకు పూర్ణయౌవనమే సర్వోత్కృష్టముగా నెంచబడును. అతః = అందువలన నిట యదియే నిర్దేశింపబడినది. 'దీధ్యానః' రూపము, దీప్త్యర్థక 'దీధీఙ్' ధాతువుచేతగాని, ధ్యై-చింతాయామ్-చేగాని, ఈరెండింటిలో నేదో యొకదానిచే నిష్పన్నమగును. క్షమి-క్షమాయాం-ఇట ఆతో ధాతోః (పా. ౬ ४-౧४०) ఆతః యోగవిభాగము వలన 'అ'కులోపము క్త్వో ల్యప్ (పా. ౭-౧-౩౭) 'హలః శ్నః శానజ్ఝౌ' (పా. ౩-౧ ౮౩) ఈ సూత్రములవలన క్త్వాయాః స్థానమున 'క్త్వః' శాన్యయాః స్థానమున 'శ్నః' అకారలోపమువైనది నపాత్ = పుత్రః-పౌత్రః-పుత్రుడు-పౌత్రుడు-న పాతయతీతి నపాత్.

మంత్రమువలన వివాహ లేక నియోగసంబంధములు-సుఖభోగము కొఱకుకాదని స్పష్టమగుచున్నది. ఉత్కృష్టసంతానముకొఱకు, వివాహ, నియోగసంబంధమని సుస్పష్టము.

యముని - ఉక్తి

"న తే సఖా సఖ్యం వష్ట్యేతత్ సలక్ష్మా యద్ విషురూపా భవాతి।
మహస్పుత్రాసో అసురస్య వీరా దివో ధర్తార ఉర్వియా పరిఖ్యన్"

అర్థము :- తే సఖా ఏతత్ సఖ్యం న వష్టి = హే యమీ భగినీ! నీమిత్రుడు ఇట్టి గృహస్థము నంగీకరింపడు, యత్ సలక్ష్మా విషురూపా భవతి = ఎందువలన సమానచిహ్నములుగల భగిని విషమరూపయగును. వివాహమునకుగాని, నియోగమునకుగాని అయోగ్యయగుచున్నది. మహః అసురస్య = పూజ్యుడును, ప్రాణాధారుడునగు పరమేశ్వరుని యొక్క వీరాః = వీరులు - పాపనాశకులు దివః ధర్తారః = మఱియు సత్యప్రకాశము నొసంగు వేదవాణిని ధరించువారు పుత్రాసః ఉర్వియా పరిఖ్యన్ పుత్రులు పెద్దబలముతో ఇట్టి సంబంధమును తిరస్కరింతురు.

విశేషము :- సగోత్ర స్త్రీ పురుషులు తమచు సలక్షణులుగా నుందురు, అన్నచెల్లెళ్లు, మేనమామ, మేనల్లుడు మున్నగువారి రూపురేఖ లెట్లు సమానములుగా నుండునదియు ప్రతిరూపదర్శియు గ్రహింపగలడు. వైజ్ఞానికదృష్టితో ఇట్టి సలక్ష్మసంబంధము దోషపూర్ణమగుటవలన అన్నివిధముల త్యాజ్యమే యగుచున్నది. వేదమిట్టి సగోత్రవివాహము లేక నియోగము ననురెంటిని విషమరూపమని చెప్పచు నిషేధించుచున్నది.

"య ఇందోః పవమానస్యాను ధామాన్యక్రమీత్
తమాహుః సుప్రజా ఇతి యస్తే సోమావిధన్మనః (౯-౧౧౪-౧)

యః ఇందోః పవమానస్య=పవిత్రుడు ఐశ్వర్యధాముడు పావకుడు నగు పరమేశ్వరునియొక్క ధామాని అనుఅక్రమీత్ = సర్వవిద్యలకు నిలయములైన వేదముల ననుసరించునో సోమ యః తే మనః అవిధత్ = మఱియు నో శాంతిధామ! నీ మనోనుకూలము నీ యాజ్ఞలకనుకూలముగ నాచరించునో తం సుప్రజాః ఇతి ఆహుః=విద్వాంసులతనిని సుసంతానము సుపుత్రుడందురు ఇది పరమేశ్వరుని సుపుత్రునిలక్షణము. ఇట్టి సుపుత్రులు వేద-ఆజ్ఞలచే ప్రభావితులై సలక్ష్మ-సగోత్రసంబంధమును పూర్తముగా నిషేధింతురు. అందువలన నట్టిసంబంధము అనిష్టము. యముడు నిట్టి సంబంధమును కోరడు అంగీకరింపడు.

యమి - కథనము

"ఉశంతిఘా అమృతాస ఏతదేకస్య చిత్ త్యజసం మర్త్యస్య
ని తే మనో మనసి ధాయ్యస్మే జన్యుః పతిస్తన్వమావివిశ్యాః" (౩)

అర్థము :— తే అమృతాసః ఘ = హే యమ! భ్రాత! ఆ యమృత పుత్రులుకూడ, ఏకస్యచిత్ మర్త్యస్య = ఒక మనుష్యునియొక్క, ఏతత్ త్యజసమ్ = ఈ స్త్రీరత్నమును, ఉశన్తి = కోరుదురు, తే మనః అస్మే మనసి నిధాయి = అందువలన నీ మనస్సు నామనస్సునందు నిరంతరము ఉండుగాక, జన్యుః పతిః తన్వం ఆవివిశ్యాః = సంతానము నుత్పన్నము చేయుపతివై నాయొక్క శరీరమును నన్ను పొందుదువుగాక!

నియోగపక్షమున యమి యనుచున్నది :—

హే యమ! అన్నా! ఆ యమృత పుత్రులుకూడ ప్రతిమనుష్యునకు పుత్రరత్నమును కోరుదురు. అందువలన నీ మనస్సు నామనస్సున నియోగపూర్వకముగ స్థితమగుగాక! - నాయందు గర్భధారణచేయుము.

విశేషము:— త్యజస ధనము, త్యజ్యతే మ్రియమాణస్య పురుషస్యైవైవేతి త్యజసమ్ = మృతనొందు మనుష్యుని ధనమిటనే విడువబడును. ధనము మనుష్యునివెంటపోదు, యాస్కాచార్యుడు - 'పరిషద్యం హ్యరణస్య రేక్ణః నిత్యస్య రాయః పతయః స్యామ. న శేషో అగ్నే!' ఇత్యాది మంత్రములను వ్యాఖ్యానించుచు వ్రాయుచున్నారు - "రేక్ణః ఇతి ధన నామ, రిచ్యతే ప్రయతః. శేష ఇత్యపత్యనామ శిష్యతే ప్రయతః" - రేక్ణస్= ధనవాచకము :- ఏలయన స్వామిచనిపోయినమీదట ధనము రిక్తమగును. ఇటనే పడియుండునని యర్థము. అందుకని ధనమునకు 'రేక్ణస్' అని నామము. మఱియు శేషమనగా సంతానము-తండ్రి మరణించిన తరువాత శేషము మిగిలియుండును కావున శేషము సంతానమనబడుచున్నది. 'పరిషద్యం'మంత్రమున ధనవాచకము-రేక్ణః-రాయః-శబ్దములు యాస్కుడు పుత్రుడు అనునర్థమున ప్రయుక్తముచేసియున్నారు. ఇట్లే'స్త్రీ'కూడ వేదమునందు పలుతావులలో ధనముగా చెప్పబడినది. అందువలన ప్రస్తుత మంత్రమునందు 'త్యజస' శబ్దమునకు స్త్రీ-రత్నము, పుత్రరత్నము అని యర్థము వ్రాయబడినది.

వివాహపక్షమున యమి యిట్లనుచున్నది - ఈ యమృతపుత్రులుకూడ ఒక పురుషు డొక పత్నిని కలిగియుండవలయును. యమ! ఇంతవఱకు నీకు పత్నిలేదు. నాకును ఇంతవఱకొకపతి లేడు. కావున సంతానోత్పత్తికొఱకు మనమిరువురము వివాహముచేసికొందుము'.

నియోగపక్షమున - "ప్రతిపురుషునకొక పుత్రరత్నముండవలెను. ఈ సిద్ధాంతము శిష్టసమ్మతము. నా భర్త రోగాదులవలన జన్యువు - సంతానోత్పత్తికి సమర్థుడు కాడు. కావున నీవు నాకు సంతానము కలిగించు - జన్యువు-పతివియుగుము అని యమికథనము.

ఇక్కడకూడ వివాహము, నియోగము సంతానోత్పత్తి ప్రయోజనము కలదిగా చెప్పబడినవి. కాని భోగోపలబ్ధి ప్రయోజనముగా చెప్పబడలేదనుట గమనార్హము.

యముడు :-

"న యత్పురా చకృమ కద్ధ నూనమృతా వదన్తో అనృతం రపేమ - గంధర్వో అప్స్వప్యా చ యోషా సా నౌ నాభిః పరమం జామి తన్నౌ" (౪)

అర్థము :- యత్ పురా న చకృమ = పూర్వము ఇట్టి సగోత్ర సంబంధము అమృతపుత్రులమగు మేమెందువలన చేసికొనలేదో, కత్ హనూనమ్=భలా! ఇప్పుడెట్లు? ఋతావదన్తః = సత్యనియమములను = అమృతనియమములను తెలుపుచు, అసత్యనియమములను ప్రచారము చేయగలము? గంధర్వః అప్సు = నా తండ్రి వేదజ్ఞుడు - ప్రాప్తసంబంధములుగలవారిలో నొకడు. నీ నికట సంబంధముకలవారిలో నొకడు, యోషా చ అప్యా = నా తల్లియు నికటసంబంధములో నొకతెయై యున్నది. సా నః నాభిః = నా తల్లి, తండ్రి, నేను సగోత్రులము - సనాభులము. తత్ నౌ = అందువలన మనమిరువురము, పరమంజామి = పరమసజాతిత్వము కలవారము. అందువలన మనయిరువురి వివాహముకాని, నియోగముకాని, సర్వవిధముల నియమవిరుద్ధము.

విశేషము :- ఓ భగిని! చెల్లెలా! ఒక పురుషున కొక పత్నియుండవలెనని నీవు చెప్పినది సత్యమే. ప్రతి పురుషున కొక పుత్రుడుండవలెనను నదియు నిజమే; కాని, అందులకు సగోత్ర - అన్నచెల్లెండ్ర - వివాహము కాని, నియోగముకాని సత్యనియమమునకు అన్నివిధముల విరుద్ధము. ఇట్టి సత్యధర్మమెన్నడు విలోపముకాలేదు. కావున నీ కోరికను నేను తీర్చజాలను - అని యముని సమాధానము.

యమి :-

"గర్భే ను నౌ జనితా దంపతీ కర్దేవస్త్వష్టా సవితా విశ్వరూపః
న కిరస్య ప్రమినన్తి వ్రతాని వేద నావస్య పృథివీ ఉత ద్యౌః. (౫)

అర్థము :- దేవః సవితా విశ్వరూపః త్వష్టా జనితా = ఓ భ్రాత! అన్నా! సర్వప్రకాశకుడు, సర్వద్రష్ట, జగత్కర్త సర్వోత్పాదకుడునగు పరమేశ్వరుడు, నౌ గర్భే ను దంపతీ కః = పరమేశ్వరుడు మన అన్న చెల్లెండ్రను గర్భమునందే దంపతులనుగా చేసియున్నాడు. అస్య వ్రతాని నకిః ప్రమినన్తి = ప్రభువుయొక్క నియమముల నెవ్వడును భంగము చేయజాలడు, అస్య నౌ పృథివీ ఉత ద్యౌః వేద = ఈ విషయమును స్త్రీ పురుషులెల్లరు నెఱుగుదురు.

విశేషము :- యమి చెప్పుచున్నది - అన్నా! సగోత్రవివాహము - అన్నచెల్లెండ్ర సంబంధము - ముందెన్నడు జరుగలేదని అట్టిసంబంధము ఈశ్వరీయ సత్యనియమమునకు విరుద్ధమనియు నెట్లుచెప్పగలుగు చున్నావు? పరమేశ్వరుడు స్త్రీ-పురుషుల నొకే గర్భమునందు సంబద్ధులుగా నుంచి జన్మింపజేయలేదా? అన్నాచెల్లెలు దంపతులవలె నొకే స్థానమున గర్భమున కలిసి నివసింపలేదా? ఇది నీకు తెలియదా? మనలో నెందఱో అన్నాచెల్లెండ్రు గర్భమునకలిసియుండి కవలపిల్లలుగా జన్మింపలేదా? కావున ఈశ్వరీయ నియమము అన్నాచెల్లెండ్రలో సంబంధము కలుగవచ్చు నని తెలుపుటలేదా? ఈశ్వరీయనియమము నెవ్వడు భంగముచేయరాదను విషయము నీకు తెలియనిదికాదు. కావున అన్నా! నీవు నాతో వివాహమో నియోగమో చేయుము. ఇందే ఈశ్వరీయనియమపాలన జరుగును - భంగముకలుగదు-అని యమి-వాదము. యముడు-సమాధానము.

"కో అస్య వేద ప్రథమస్యాహ్నః కఈం దదర్శ క ఇహ ప్రవోచత్.
బృహన్మిత్రస్య వరుణస్య ధామ కదు బ్రవ ఆహనో వీచ్యా నౄన్" (౬)

అర్థము :- అస్య ప్రథమస్య అహ్నః కః వేద? = ఓ యమీ! చెల్లీ! ఈ గర్భవాస తత్త్వము నెవ్వడెఱుంగును? కఈమ్ దదర్శ = ఈపూర్వ కాలపు తత్త్వము నెవ్వడు సాక్షాత్కారముచేసికొనగలిగెను? క ఇహ ప్రవోచత్ = ఎవడిగర్భవాస తత్త్వమునుగూర్చి ప్రవచనముచేయగలడు? గర్భవాసరహస్యము నెవ్వడు నెఱుగజాలడు - మిత్రస్య వరుణస్య ధామ

బృహత్ = ఎల్లరకు మిత్రుడు - సర్వశ్రేష్ఠుడునగు పరమేశ్వరుని సామర్థ్యము తెలుపు మిక్కిలిగొప్పది. ఆహనః = అసభ్యముగా భాషించునో చెల్లెలా! కత్ ఉ వీచ్యా=ఇట్టి స్థితిలో నీవు విశేషజ్ఞానముతో నిశ్చయముగా నెట్లు, నౄన్ప్రవఘః? = సగోత్ర - అన్నాచెల్లెండ్ర సంబంధము ఈశ్వరీయ నియమముల కనుకూలమని యెట్లుచెప్పగలవు? నీ యీ కథనము సత్యబద్ధముకాదు.

విశేషము :- యము డిట్లనుచున్నాడు - గర్భవాస సమయమున కవలలు - అన్నచెల్లెలు దంపతులని యెవరెఱుగుదురు? ఎవరుచూచిరి? ఎవరుచెప్పిరి? అనన్తసామర్థ్యముగల పరమేశ్వరుని మహిమనెఱుగుట అత్యంతదుష్కరము-గాఢనిద్రలో-సుషుప్తిలో - స్త్రీపురుషులు నగ్నావస్థలో నొకచో పడియున్నంతమాత్రమున వారిరువురు దంపతులనుట యెన్నడు పొసగదు దాంపత్యభావము కొంతెక విశిష్టధర్మమును పురస్కరించుకొని స్థాపితమగును - ఒకచోట కలిసియుండుటయే - కేవలసహవాసమువలన స్త్రీ-పురుషులు దంపతులనబడరు. స్త్రీ-పురుషులలో సగోత్రసంబంధమును స్థాపించు సత్యనియమమొండేమియులేదు.

వీచ్యా = విజ్ఞానముతో - నిశ్చయముతో = వీచీపదము తృతీయా ఏకవచనమున వీచ్యాఅగును. వి + అంచూ = ఇట్లే ప్రాచీ, ప్రతీచ్యాదులు సిద్ధించును.

యమి :-

"యమస్య మా యమ్యం కామ ఆగన్ సమానే యోనౌ సహశేయ్యాయ, జాయేవ పత్యే తన్వం రిరిచ్యాం వి చిద్ వృహేవ రథ్యేవ చక్రా"

అర్థము :- సమానే యోనౌ సహశేయ్యాయ = సమానగృహస్థాశ్రమమున సహవాసము కలిసియుండుట - కొఱకు, పరస్పరము వివాహితులగుటకు, మా యమ్యం = యమినగునన్ను, యమస్య కామః ఆగన్ = యముని కామన చేరినది. కావున స్వయంవర వివాహముననుసరించి పత్యే జాయా ఇవ తన్వం రిరిచ్యామ్ = పతికొఱకు పత్నివలె జాయాభావముతో నాశరీరమును నీకర్పింతును. చిత్ రథ్యా చక్రా ఇవ వివృ

హేవ = తదుపరి మనమిరువురము, రథచక్రములవలె కలిసి ఉద్యోగము చేయుదము - అనగా ధర్మార్థకామమోక్షములను సాధింతము.

నియోగపక్షమున - సమానస్థానమున సహవాసముకొఱకు గర్భ ధారణచేయుటకొఱకు, నీకు సంబంధించిన కామన నాకుగలిగినది. కావున స్వయంవరనియోగమునను సరించి నాపతియగు నీకు నా శరీరమును జాయాభావముతో నర్పింతును. అందువలన సంతానోత్పత్తికలుగును. అనంతరము రథచక్రములవలె కలిసి పురుషార్థములను సాధింతము.

ఇది యమి తన కామనను స్వయంవరయుక్తితో ప్రస్తుతించుచున్నది. స్వయంవరవివాహము - నియోగము ఆప్తసిద్ధాంతమే కదా! నేను యమ! నిన్ను స్వయంవరపద్ధతితో నెన్నుకొనుచున్నాను. కావున నాతో సంబంధము చేసికొనుము.

సంతానములేని స్త్రీ పురుషులు గృహస్థులయ్యు పురుషార్థములను సాధింపనసమర్థులగుదురు. కావున పుత్రవిహీనయైన యమి తనపతికొఱకు, తనశరీరమునెట్లు వివృతమొనర్చునో యట్లే యమునకు సంతానార్థము తన శరీరము నప్పగింతుననుచున్నది. దీనింబట్టి యమికి పతియున్నాడనియు అతనివలన సంతానముకలుగకపోవుటచే యమునితో నియోగము మూల మున బడయయత్నించుచున్నదనియు బోధపడును.

యముడు :-

న తిష్ఠన్తి న నిమిషన్త్యేతే దేవానాం స్పశ ఇహ యే చరన్తి,
అన్యేన మదాహనో యాహి తూయం తేన వివృహ రథ్యేవ చక్రా" (౮)

అర్థము :- ఏతే దేవానాం స్పశః = ఎవరు ఈశ్వరీయగుప్తచరులో, యే ఇహ చరన్తి = ఎవర్ప్రపంచమున విహరించుచున్నారో, న తిష్ఠన్తి న నిమిషన్తి = వారు నిలువరు కన్నులఱెప్పలు వాల్చరు. అహనాః = కావున నోయసభ్యభాషిణీ!, మత్ అన్యేన తూయం యాహి = నాకంటె భిన్నుడైన మఱియొక వ్యక్తితో శీఘ్రము జాయాత్వమును బొందుము - తేన రథ్యా చక్రా ఇవ వివృహ - అతనితోకలిసి రథచక్రములవలె ఉద్యోగింపుము.

నియోగపక్షమున :-

మదన్యేన త్వాయం యాహి = నాకంటె భిన్నుడైన మఱియొక పురుషుని మూలమున శీఘ్రముగా సంతానమును బొందుము. తేన రథ్యా చక్ర ఇవవివృహ = మఱియు ఆ సంతానము ప్రాప్తితోపాటు నీభర్తతోకలిసి రథచక్రములవలె వర్తింపుము.

యముడనుచున్నాడు - సగోత్రులతో వివాహసంబంధము కాని నియోగముకాని పాపము. పరమేశ్వరుని గుప్తచరు లీ ప్రపంచమున నిరంతరము విహరించుచున్నారు. వారొక్క క్షణముకూడ నొకచో నిలువరు, కన్నుమూయరు, నిరంతరము మనమాచరించుకర్మలను నిరీక్షించు చుందురు. ఈశ్వరీయ నియమరూపగుప్తచరులు మనకు కనిపింపరు. కాని వారు నిరంతరము తమకర్తవ్యముల నాచరించుచుందురు. తదను సారముగ రాజులకు మహారాజైన పరమేశ్వరుని పక్షమున వారినుండి దుష్కర్మలకు దండములభించును. కావున ఓ చెల్లీ ! యమీ ఈ యశుభ కామనను విడిచి వెంటనే యితరపురుషునితో సంబంధము పెట్టుకొనుము.

'స్పశ' శబ్దము లౌకికసాహిత్యమునందును గుప్తచరఅర్థమున ప్రయో గింపబడుచున్నది. ఋగ్వేదమునందు ౪-౪-3 లో 'స్పశ్'అని ప్రయుక్తము దర్శనార్థకపశ్ తో 'క్విప్' ప్రత్యయము సుడాగమము.

"రాత్రీభిరస్మా అహాభిర్ దశస్యేత్సూర్యస్య చక్షుర్ముహురున్మిమీ యాత్. దివాపృథివ్యా మిథునా సబంధూ యమీర్యమస్య బిభృయాద జామి" (౯)

అస్మై రాత్రిభిః అహాభిః దశస్యేత్ = ఈ వివాహమాడు దంపతీ యుగళముకొఱకు లేక నియోగముమూలమున పుత్రప్రాప్తికలిగినమీదట పూర్వదంపతీయుగళముకొఱకు పరమేశ్వరుడహస్సులు సుఖప్రదానము చేయునుగాక ! సూర్యస్య చక్షుః ముహుః ఉన్మిమీయాత్ = సూర్యుని ప్రకాశమును చాలసమయముపఱకు ఉత్తమతతో నిర్మించుగాక ! మిథునా దివ్యా పృథివ్యా సబంధూ = ఈ స్త్రీ పురుషులిరువురు సమానభావముతో పరస్పరము బంధితులై యుందురుగాక ! యమీః యమస్య అజామి బిభృయాత్ = యమి యముడనగు నాతో దోషరహితబంధుత్వము కలిగి

యుండుగాక! ఉపర్యుక్తరెండుమంత్రములలోను యమి తననువిడిచి యన్యపురుషునితో సంబంధమేర్పఱచుకొనినమీదట ఆ దంపతిని ఉద్దేశించి యముడు పరమేశ్వరుని ప్రార్థించును. హే ప్రభూ! జగదీశ్వర! ఈ వివాహితులగుదంపతీయుగమునకు లేక నియోగమువలన పుత్రలాభమును బొందిన పూర్వోపుదంపతీయుగళమునకును నిరంతరము సుఖములను ప్రసాదింపుము. వీరిచక్షురాదీంద్రియములు అవికలములై యుండును గాక! వీరు చిరంజీవులగుదురుగాక! ఈ జంట పరస్పరము సమానరూపముతో బద్ధమైయుండుకుగాక! - అన్నాచెల్లెంద్రసంబంధము అట్లే నిష్కళంకము, పవిత్రమునై యుండునుగాక!

"ఆ ఘా తా గచ్ఛానుత్తరా యుగాని యత్ర జామయః కృణవన్న జామి. ఉపబర్బృహి వృషభాయ బాహుమన్యమిచ్ఛస్వ సుభగే పతిం మత్" (౧౦)

అర్థము :- తా ఉత్తరా యుగాని ఘ ఆగచ్ఛాన్ = వారు ఉత్తర కాలమునను ఇట్లే వచ్చెదరు, యత్ర జామయః అజామి కృణవన్ = ఎక్కడ సగోత్ర స్త్రీ పురుషులు హితకరము లేక మూర్ఖతారహితకార్యములు చేయుదురో - అనగా సగోత్రవివాహముకాని నియోగముకాని పూర్వము జరుగలేదు. ముందుకూడ జరుగరాదు. ఈ యీశ్వరీయనియమము త్రికాలములందును స్థిరముగానుండుగాక! అందువలన సుభగే! సౌభాగ్యము నాశించు యమి! మత్ - అన్యేన = నాకంటె భిన్నుడైన వానిని ఇచ్ఛస్వ = కోరుకొనుము, వృషభాయ బాహుం ఉపబర్బృహి = ఆ వీర్యవంతుని కొఱకు నీ బాహువు ప్రసారమొనర్పుము. అతనికి నీచేతినందించుము.

యమి - కథనము :-

"కిం భ్రాతాసద్ యదనాథం భవాతి కిము స్వసా యన్నిర్‌ఋతిర్నిగచ్ఛాత్, కామమూతా బహ్వేతద్ రపామి తన్వా మే తన్వం సంపిపృగ్ధి"-౧౧

కిం భ్రాతా అసత్=అన్నా ఇది యేమి? - యత్ అనాథం భవాతి= అన్నచెల్లెలికోరికను పూర్ణముచేయుడా? ఉ కిం స్వసా యత్ నిర్‌ఋతి

నిగచ్ఛాత్ ? = మఱియు అన్న ఉండగా దుఃఖమునుపొందు చెల్లెలు
చెల్లెలేనా ? కామం ఊతా = అన్నా నేను ప్రవృద్ధచేతస్సుగలదాననై
ఏతత్బహురపామి = ఈ వివాహము నియోగమునుగూర్చి ఎక్కువ చెప్పు
చున్నాను, మే తన్వా తన్వం సంపిపృగ్ధి = కావున అన్నా ! నాతనువుతో
నీ తనువును కలుపుము. నాతో వివాహముతోకాని, నియోగముతోగాని
సంబంధమును స్థాపింపుము.

యమి తనతో నిట్లనుచున్నది - చెల్లియొక్క కోర్కెను - ప్రార్థనను
మన్నింపని అన్నకూడ ఒక అన్నయేనా ? అన్నయుండగా దుఃఖముపాలగు
చెల్లి చెల్లియేనా ? తన యన్న సహాయమును పొందజాలని చెల్లిజన్మమేల ?
కావున అన్నా ! నీవు నాకోర్కెను తీర్పవలసినవాడవు. చెల్లినైన నేనుకూడ
నీ సహాయముతో నాకష్టమును దుఃఖమును తొలగించుకొనవలసిన కర్తవ్య
మున్నది. భ్రాతః ! నా కీ కోరిక పాపవాసనతో నేర్పడినదికాదు. పవిత్ర
భావముతోకూడినదేకాని మఱియొకటికాదు. కావున నీవు నన్ను వివాహ
మాడుము - లేదా నియోగముతో పుత్రలాభమును కలిగించుము.

'నాథ్'ధాతువు యాచన, ఇచ్ఛ అను రెండర్థములుగలదిగా ధాతు
పాఠమున పఠింపబడియున్నది. 'కామమ్' అవ్యయము యథేష్టమ్ =
ఇష్టము వచ్చినట్లు . అని యర్థము. ఇది ప్రసిద్ధమే - ధాతుపాఠమున
'అవ' గతి, రక్షణకాంతిమున్నగు ౧౯ అర్థములు కలదిగా పఠింపబడి
యున్నది. ఊతాయందు 'అవ' వృద్ధ్యర్థకముగా ప్రయుక్తమైయున్నది.
'కామమూతా' ఈ పదములందు భగిని - చెల్లి - యొక్క కథనము పవిత్ర
భావముతో నిండియున్నదనియు కొంచెక పాపవిషయకభావనచే ప్రేరితయై
యమునితో వివాహము లేక నియోగముకొఱకు చెప్పుటలేదనియు స్పష్ట
మగుచున్నది.

యముని కథనము :-

"న వా ఉ తే తన్వా తన్వం సంపపృచ్యాం పాపమాహుర్యః
స్వసారం నిగచ్ఛాత్. అన్యేన మత్ప్రముదః కల్పయస్వ న తే భ్రాతా
సుభగే వష్ట్యేతత్" (౧౨)

అర్థము :— తే తన్వా తన్వం న సం పపృచ్యామ్ = నేను నా శరీరమును నీ శరీరముతో న్యాయముగా కలుపజాలను, యః స్వసారం నిగచ్ఛాత్ = ఏలయన లోకమున నెటనేని చెల్లెలితో వివాహముతోగాని, నియోగముతోగాని సంబంధముపెట్టుకొను అన్న ఉండునా? అట్టివానిని విద్వాంసులు (పాపమ్ ఆహుః) = పాపియందురు, కావున (మత్ అన్యేన) నాకంటె భిన్నుడైన పురుషునితో సంబంధము కల్పించుకొని, ప్రముదః కల్పయస్వ = వివాహజన్యసుఖముల ననుభవింపుము. సుభగే! తే భ్రాతా ఏతత్ న వష్టి = సౌభాగ్యమునుగోరు ఓ చెల్లీ నీ యన్న నీతో వివాహాది సంబంధమును చేయుటు - చేయగోరడు.

యముడు - యమితో చెల్లీ నేను నీకోరికను నెఱవేర్పవలసినవాడ ననుట సరియే. అట్లే నీవు నాసహాయము నపేక్షించుటయు నుచితమే - మఱియు నీవు ప్రవృద్ధచేతస్కవై పవిత్రభావముచే ప్రేరితవై నాతో మాట లాడుచున్నావు. ఇదియంతయు బాగుగనేయున్నది. కాని, చెల్లీ! మనమీ పాపకార్యము చేయతగదు. దీని పరిణామము మంచిదికాదు - అది యనర్థ దాయకము. కావున చెల్లీ! ఎట్టిస్థితిలోను నీతో వివాహాదిసంబంధము నెఱపజాలనని నిశ్చయముగా నెఱుంగుము. అందువలన నీవు మఱియొక పురుషునితో నిష్టసంబంధము చేసికొనుము - నేనుమాత్రమీపాపకార్యము చేయను - అని యముడు యమికి తన నిశ్చయమును స్పష్టపఱచెను.

అంతట - యమి :—

"బతో బతాసి యమ! నైవ తే మనో హృదయంచావిదామ. అన్యా కిల త్వాం కక్ష్యేవ యుక్తం పరిష్వజాతే లిబుజేవ వృక్షమ్" (౧౩)

అర్థము — యమ బతః అసి = ఓ యమ! అన్నా! నీవు ధర్మమునెదుట దుర్బలుడవు. ధర్మమునతిక్రమింపజాలవు. బత తే మనః హృదయం చ న ఏవ అవిదామ = కాని, హాయ్! నాకు దుఃఖము కలుగుచున్నది - నావంటి అవివేకుల విషయమున దయకలుగుచున్నది. మేము నీ మనస్సును హృదయమును కొంచెమైనను తెలిసికొనజాలమైతిమి? వృకం లిబుజా ఇవ = వృక్షమును లతతీగవలె, యుక్తం కక్ష్యా ఇవ = బ్రహ్మచర్యముతోకూడిన బ్రహ్మచారిని మొలత్రాడువలెను (మేఖలా ఇవ) వేర

పురుషార్థముతోకూడిన పురుషార్థిని. ఉద్యోగమువలెను, అన్యా కిల త్వాం పరిష్వజాతే = అన్య మఱియొక స్త్రీయే నిన్ను వివాహమాడి నీకు పత్ని యగును, నిన్నాలింగనము చేసికొనునుగాక !

విశేషము :- యముని ఉత్తర - ప్రత్యుత్తరములను విని, యమి తన యన్నతో తానుచేసిన యవివేకపూర్ణప్రస్తావము విషయము మిక్కిలి దుఃఖముకలిగెను. మఱియు నామె తనవంటి యవివేకులయెడ తన ఖేదమును వెల్లడించుచు వారి దయనీయస్థితిని ప్రకటించుచు ననుచున్నది - హాయ్! మనలో నిట్టి మనస్సు, హృదయము లేదు నే నింతవఱకు ప్రభావోత్పాదక తర్కబుద్ధితో నీతో సంవాదమొనర్చుచు నిన్ను వశపఱచ నెన యత్నించితిని నిన్ను సమాధానపఱపజూచితిని. కాని అన్నా ! నాతర్కములకు నీ సమాధానములు విని నేను నోరుమూయక తప్పినదికాదు. నేను "భ్రాతా సద్ కిమ్" ఇత్యాదిమంత్రములతో నీ హృదయము సంగీకరింపజేయ ప్రార్థించి నీ యనుకూలతను పొందజాలక విఫలనైతిని - హాయ్! నీ మనోభావమును, నీ హృదయము నెల తెలిసికొనజాలకపోయితిని ! అస్తు = అన్నా అది యట్లుండనిమ్ము.

ఇక నీవుమాత్రము లతచే వృక్షమావరింపబడునట్లు బ్రహ్మచారిని మేఖల చుట్టుకొనియుండునట్లు పురుషార్థియైనవ్యక్తికి క్రియాశీలత సహజమైనట్లు కొండొక యోగ్యయైన స్త్రీని వివాహమాడి యామెతో ధర్మయుక్త సంబంధముతో సంబద్ధుడవై సుఖపడుదువుగాక !

కక్ష్య గృహప్రకోష్ఠే స్యాత్ సాదృశ్యోద్యోగకాంచిషు. బృహతికేభనాడ్యోశ్చ" అను నీ వాక్యమునందు హేమచంద్రుడు కక్ష్యాపదమునకు గృహము ప్రకోష్ఠము సాదృశ్యము ఉద్యోగము, కాంచి=మేఖలబృహతికా= పైపంచె (ఉత్తరీయము) హస్తినీ - ఆడ ఏనుగు, నాడి అని యర్థములు గ్రహించియున్నాడు. యాస్కముని వ్యాఖ్యననుసరించి యీ మంత్రమున గల పదములకర్థములు వ్రాయబడినది. అవిదామ - విజానీమః లిజ్ - శ్లేషణే భజసేవాయామ్ - ఘఞ్ ప్రత్యయః - లిబుజా - ప్రతతి=లత - వృక్షాదులసేవించుచు వానిని చుట్టుకొనును. ప్రతతి = వరించునది - వృక్షమునుచుట్టుకొని దానిని బంధించును - అందువలన ప్రతతి అందుడు.

132)

యమ కథనము :—

"అన్యం ము త్వం యమ్యన్య ఉ త్వాం పరిష్వజాతే లిబుజేవ వృక్షమ్. తస్య వా త్వం మన ఇచ్ఛా స వా తవాధా కృణుష్వ సంవిదం సుభద్రామ్" (౧౪)

అర్థము :— యమి ఉ త్వం అన్యం సు = ఓ యమి! ఇట్లే నీవును అన్యపురుషునితో సంబంధముచేసికొనుము. ఉ వృక్షం లిబుజా ఇవ అన్యః త్వాం పరిష్వజాతే = మఱియు వృక్షమును లతవలె నీ వన్యపురుషుని అన్యపురుషుడు నిన్నును, కౌగలించుకొనుగాక! వా తస్య మనః త్వం ఇచ్ఛ= లేక అతనిమనస్సును నీవు గోరుము. వా సః తవ=లేక అతడు నీమనస్సును గోరుగాక! అథ = ఇట్లు పరస్పరమేకచిత్తులై, సుభద్రాం సంవిదం కృణుష్వ = కల్యాణమయ సంయమమును లేక ఆచారమును నెఱపుడు.

ఈ యమ - యమీ సంవాదమున యమి సగోత్రవివాహము నపేక్షించుట, యముడు దానిని పాపము-అవైదికమునని చెప్పి స్పష్టముగా నిరాకరించుట చూడనగును

"స్తుతా మయా వరదా వేదమాతా ప్రచోదయంతామ్ పావమానీ ద్విజానామ్. ఆయుః ప్రాణం ప్రజాం పశుం కీర్తిం ద్రవిణం బ్రహ్మవర్చసం మహ్యం దత్వా వ్రజత బ్రహ్మలోకమ్. (అథర్వ. ౧౯-౭౧.౧)

ప్రా. చంద్రమణి విద్యాలంకారకృత వ్యాఖ్యకు - క. ప్ర. పండిత శ్రీ గోపదేవ దార్శనిక - కృత - స్వతంత్ర - ఆంధ్రానుకరణము.

సమాప్తము